మమ్మట విరచిత

# కావ్య ప్రకాశము

'బాలానందిని' అను తెలుగు వ్యాఖ్యానముతో

వ్యాఖ్యారచయిత

ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు



ప్రచురణ

సంస్కృత భాషా ప్రచార సమితి

(డి. పుల్లారెడ్డి చారిటీస్ ట్రస్టు అనుబంధ సంస్థ)

హైదరాబాదు

1995

మమ్మట విరచిత

**కావ్యప్రకాశము**

'బాలానందిని' అను తెలుగు వ్యాఖ్యానముతో



వ్యాఖ్యారచయిత

**ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు**

ప్రథమ ముద్రణము : 1995

ప్రతులు : 1000

**వెల రూ. 150/-**

ప్రాప్తిస్థానము
కార్యదర్శి,
సంస్కృత భాషా ప్రచార సమితి
5-4-743, 2వ అంతస్తు,
హరేకృష్ణ దేవాలయం ప్రక్కన,
నాంపల్లి స్టేషనురోడ్డు,
హైదరాబాదు-500 001.
ఫోను నం : 515481

ముద్రణ :

**శివాజీ ప్రెస్,**
**4-4-53, గంజ్ బజార్,**
**సికింద్రాబాద్.**

Acc No 20974

శ్రీః

# కృతిసమర్పణమ్

పావితా జనుషా యేషాం కోనసీమా కృతాఽసమా,
ఆచాన్తశబ్దశాస్త్రామ్బునిధయః ప్రధియశ్చ యే, 1

నిత్యం భాగవతీయార్థమననైః శాస్త్రచిన్తనైః,
గరీయసా చ తపసా యే విఖ్యాతాస్తపోధనాః, 2

యద్బోధామృతసంసేకైః స్థాణవోఽపి సుమాఞ్చితాః,
యదాశీఃకఞ్చుకచ్ఛన్నా నిర్భయాః శాస్త్రవర్త్మసు, 3

యత్ప్రసాదాదధిగతా శబ్దశాస్త్రే మయా రుచిః,
యత్ప్రేరణైవ హేతుర్మే వేదాన్తాధ్యయనేఽభవత్, 4

శ్రీసుబ్బరాయశాస్త్రిభ్యస్తేభ్యః సాదరమర్ప్యతే,
కావ్యప్రకాశవ్యాఖ్యేయం తదాశీర్బలనిర్మితా. 5

వినీతః

24-5-1995

పుల్లెల శ్రీరామచన్ద్రః

# విషయసూచి


| విషయం | పేజి |
| --- | --- |
| మంగళాచరణం | 1 |
| కావ్యప్రయోజనం | 2 |
| కావ్యహేతువులు | 6 |
| కావ్యలక్షణం | 8 |
| కావ్యభేదాలు | 9 |
| ఉత్తమకావ్యలక్షణం | 9 |
| మధ్యమకావ్యలక్షణం | 13 |
| అధమకావ్యలక్షణం | 14 |
| శబ్దార్థాల స్వరూపం | 17 |
| అర్థాల విభాగాలు | 17 |
| తాత్పర్యార్థం విషయంలో మతభేదాలు | 17 |
| అర్థాల వ్యంజకత్వం | 21 |
| వాచకశబ్దాల స్వరూపం | 24 |
| సంకేతితమైన అర్థం | 25 |
| అభిధ | 34 |
| లక్షణ | 35 |
| లక్షణ ఆరు విధాలు | 42 |
| సారోపలక్షణ | 42 |
| సాధ్యవసానలక్షణ | 44 |
| గౌణ లక్షణా శుద్ధలక్షణల లక్షణాలు | 44 |
| లక్షణ ఆరు విధాలు అనే విషయం ముగింపు | 50 |
| సవ్యంగ్య అవ్యంగ్య అని రెండు లక్షణాభేదాలు | 50 |
| వ్యంగ్యభేదం | 50 |
| వ్యంగ్యాన్నిపట్టి ఏర్పడిన భేదాల ముగింపు | 53 |

విషయం | పేజీ
---|---

లాక్షణిక శబ్ద లక్షణం 53
వ్యంజనాస్వరూపం 53
వ్యంజన విషయంలో అరాపత్తి ప్రమాణం 54
వ్యంజన అభిధచేత గతార్థం కాదు 55
వ్యంజన లక్షణచేత గతార్థం కాదు 56
అక్కడ లక్షణాహేతువులు లేవు 56
ప్రయోజనం లక్ష్యం అని అంటే దోషం 58
సప్రయోజనమైనది లక్ష్యం అంటే దోషం 59
అభిధా మూలక వ్యంగ్యం 61
అభిధానియామకాలు 62
వ్యంజక శబ్ద లక్షణం 69
వ్యంజకార్థ స్వరూపం 69
అర్థవ్యంజనను ప్రతిపాదించడం 71
అర్థవ్యంజనా స్వరూపం 71
శబ్దం వ్యంజనంలో సహకారి 82
కావ్యభేద నిరూపణం 84
అభిధామూలక ధ్వని నిరూపణం 87
దానిలో రెండు భేదాలు 87
అలక్ష్యక్రమవ్యంగ్య భేదాలు 88
రస స్వరూపం 89
రసభేదాలు 111
స్థాయిభావాలు 125
వ్యభిచారిభావాలు 126
శాంతరస నిరూపణం 133
భావస్వరూపం 135
భావాభాసలు 138
భావశాంత్యాదులు 141
శాంత్యాదులుకూడా రసాంగులు అవుతాయి 145

విషయం | పేజీ

ధ్వనిభేదాలు 146
శబ్దశక్త్యుత్థ ధ్వనిభేదాలు 146
అర్థశక్త్యుద్భవధ్వని భేదాలు 154
ఉభయ శక్త్యుద్భవధ్వనిభేదాలు 167
ఆ భేదాల పరిగణనం 168
రసాదులు ఒకే భేదంగా పరిగణించబడతాయి 169
వాక్యంలో ఉభయశక్త్యుద్భవధ్వని 170
పదంలోకూడా ఇతర భేదాలు 170
ప్రబంధంలోకూడా అర్థశక్త్యుద్భవధ్వని 189
పదైకదేశాదులలోకూడా రసాదులు 192
ధ్వనిశుద్ధభేదాల ముగింపు 210
సంకీర్ణ ధ్వని భేదాలు 210
గుణీభూతవ్యంగ్యభేదాలు 222
వీటి అవాంతర భేదాలు 245
ధ్వని గుణీభూతధ్వనుల మిశ్రణం 247
ధ్వని స్థాపనం 249
అధమకావ్య నిరూపణం 298
దోషాల సామాన్యలక్షణం 301
దోషాల విశేషలక్షణం 302
పదదోషాలకు వాక్య పదైక దేశాలలో అతిదేశం 328
వాక్యమాత్ర గత దోషాలు 361
అర్థగతదోషాలు 417
నిర్హేతువు అదుష్టం (కొన్నిచోట్ల) 449
అనుకరణంలో శ్రుతికట్వాదులు దోషాలు కావు 450
కొన్నిచోట్ల వక్త్రాదులను పట్టి దోషం కూడా గుణమే 451
సాక్షాత్తు రసవిరోధులైన దోషాలు 473
దోషాల అదోషత్వాన్ని నిరూపించడం 486
దోషాలు కొన్నిచోట్ల గుణాలు 487

| విషయం | పేజీ |
|---|---|
| రసవిరోధిదోషాలు ఎట్లు పరిహరించాలి | 491 |
| విరోధం లేకపోవడంలో మరొక కారణం | 494 |
| గుణలక్షణం | 502 |
| గుణాలంకారాల భేదం | 502 |
| గుణభేదాలు | 511 |
| మాధుర్యం | 512 |
| కరుణాదులలో మాధుర్య ప్రదర్శనం | 513 |
| ఓజస్సు | 514 |
| బీభత్స రౌద్రాలలో ఓజస్సు అతిశయించి ఉంటుంది | 514 |
| ప్రసాదం | 514 |
| కావ్యలక్షణంలో శబ్దార్థాలకు సగుణత్వం చెప్పడానికి కారణం | 515 |
| వామనుడు చెప్పిన పది గుణాలలో కొన్ని మూడు గుణాలలోనే అంతర్గతం అవుతాయి | 515 |
| గుణాలు పది కాదనే విషయం ముగింపు | 521 |
| ఏ వర్ణాదులు ఏ గుణాన్ని వ్యంజింపచేస్తాయి | 521 |
| శబ్దగుణాలని చెప్పే మాధుర్యాదులను ఏవి అభివ్యంజింపచేస్తాయి | 522 |
| ఓజోగుణవ్యంజక వర్ణాలు | 523 |
| ప్రసాదవ్యంజక వర్ణాలు | 524 |
| వక్త మొదలైనవాళ్ళ ఔచిత్యాన్నిపట్టి కొన్నిచోట్ల రచన వేరు విధంగా ఉండవచ్చు | 525 |
| వక్రోక్తి లక్షణం | 530 |
| అనుప్రాస లక్షణం | 533 |
| అనుప్రాస భేదాలు | 533 |
| ఛేకానుప్రాస | 533 |
| వృత్త్యనుప్రాస | 534 |
| ఉపనాగరిక వృత్తి | 535 |
| పరుషవృత్తి | 535 |
| కోమలవృత్తి | 535 |

విషయం పేజీ

ఈ వృత్తులకు ఇతరులు పెట్టిన పేర్లు 536
లాటానుప్రాస 536
పదాలకు సంబంధించిన లాటానుప్రాస 537
ఏకపదగతలాటానుప్రాస 537
నామగత లాటానుప్రాస మూడు విధాలు 538
యమకం 539
యమకభేదాలు 541
శ్లేష 550
అభంగశ్లేష 552
చిత్రాలంకారలక్షణం 572
పునరుక్తవదాభాస 575
దానిభేదాలు 576
అది శబ్దార్థగతం 577
ఉపమాలంకారం 579
ఉపమా భేదాలు 579
పూర్ణోపమాభేదాలు 580
ధర్మలుప్తోపమాభేదాలు 590
ఉపమానలుప్తాభేదాలు 592
వాదిలుప్తోపమాభేదాలు 593
ధర్మవాదిలుప్తా భేదాలు 597
వృత్తిలోను వాక్యంలోను ధర్మోపమానలోపంలో భేదాలు 599
వాద్యుపమేయలోపభేదం 599
త్రిలోపభేదం 600
అనన్వయాలంకారం 606
ఉపమేయోపమ 607
ఉత్ప్రేక్ష 608
ససన్దేహం 610
రూపకం 613

| విషయం | పేజి |
|---|---|
| సమస్త వస్తు విషయ రూపకం | 613 |
| ఏకదేశవివర్తి రూపకం | 617 |
| నిరంగరూపకం | 618 |
| మాలారూపనిరంగరూపకం | 619 |
| పరంపరితరూపకం | 620 |
| అపహ్నుత్యలంకారం | 625 |
| అర్థశ్లేష | 628 |
| సమాసోక్తి | 629 |
| నిదర్శన | 631 |
| మరొక నిదర్శన | 633 |
| అప్రస్తుతప్రశంస | 635 |
| అప్రస్తుతప్రశంసా భేదాలు | 635 |
| అతిశయోక్తి | 646 |
| ప్రతివస్తూపమ | 649 |
| దృష్టాంతం | 651 |
| దీపకం | 654 |
| మాలాదీపకం | 656 |
| తుల్యయోగిత | 657 |
| వ్యతిరేకం | 658 |
| వ్యతిరేక భేదాలు | 659 |
| ఆక్షేపం | 667 |
| విభావన | 669 |
| విశేషోక్తి | 670 |
| యథాసంఖ్యం | 672 |
| అర్థాంతరన్యాసం | 673 |
| విరోధాభాసం | 676 |
| స్వభావోక్తి | 681 |
| వ్యాజస్తుతి | 682 |

విషయం | పేజి
--- | ---

| ఈ వృత్తులకు ఇతరులు పెట్టిన పేర్లు | 586 |
| లాటానుప్రాస | 586 |
| పదాలకు సంబంధించిన లాటానుప్రాస | 587 |
| ఏకపదగతలాటానుప్రాస | 587 |
| నామగత లాటానుప్రాస మూడు విధాలు | 588 |
| యమకం | 539 |
| యమక భేదాలు | 541 |
| శ్లేష | 550 |
| అభంగశ్లేష | 552 |
| చిత్రాలంకారలక్షణం | 572 |
| పునరుక్తవదాభాస | 575 |
| దానిభేదాలు | 576 |
| అది శబ్దార్థగతం | 577 |
| ఉపమాలంకారం | 579 |
| ఉపమా భేదాలు | 579 |
| పూర్ణోపమాభేదాలు | 580 |
| ధర్మలుప్తోపమాభేదాలు | 590 |
| ఉపమానలుప్తాభేదాలు | 592 |
| వాదిలుప్తోపమాభేదాలు | 593 |
| ధర్మవాదిలుప్తా భేదాలు | 597 |
| వృత్తిలోను వాక్యంలోను ధర్మోపమానలోపంలో భేదాలు | 599 |
| వాద్యుపమేయలోపభేదం | 599 |
| త్రిలోపభేదం | 600 |
| అనన్వయాలంకారం | 606 |
| ఉపమేయోపమ | 607 |
| ఉత్ప్రేక్ష | 608 |
| ససన్దేహం | 610 |
| రూపకం | 613 |

విషయం .. పేజి

| | |
|---|---|
| సమస్త వస్తు విషయ రూపకం | 613 |
| ఏకదేశవివర్తి రూపకం | 617 |
| నిరంగరూపకం | 618 |
| మాలారూపనిరంగరూపకం | 619 |
| పరంపరితరూపకం | 620 |
| అపహ్నుత్యలంకారం | 625 |
| అర్థశ్లేష | 628 |
| సమాసోక్తి | 629 |
| నిదర్శన | 631 |
| మరొక నిదర్శన | 633 |
| అప్రస్తుతప్రశంస | 635 |
| అప్రస్తుతప్రశంసా భేదాలు | 635 |
| అతిశయోక్తి | 646 |
| ప్రతివస్తూపమ | 649 |
| దృష్టాంతం | 651 |
| దీపకం | 654 |
| మాలాదీపకం | 656 |
| తుల్యయోగిత | 657 |
| వ్యతిరేకం | 658 |
| వ్యతిరేక భేదాలు | 659 |
| ఆక్షేపం | 667 |
| విభావన | 669 |
| విశేషోక్తి | 670 |
| యథాసంఖ్యం | 672 |
| అర్థాంతరన్యాసం | 673 |
| విరోధాభాసం | 676 |
| స్వభావోక్తి | 681 |
| వ్యాజస్తుతి | 682 |

| విషయం | పేజీ |
|---|---|
| సహోక్తి | 684 |
| వినోక్తి | 686 |
| పరివృత్తి | 687 |
| భావికం | 689 |
| కావ్యలింగం | 690 |
| పర్యాయోక్తం | 693 |
| ఉదాత్తం | 695 |
| ద్వితీయోదాత్తం | 696 |
| సముచ్చయం | 697 |
| మరొక సముచ్చయం | 702 |
| పర్యాయం | 705 |
| మరొక విధమైన పర్యాయం | 708 |
| అనుమానం | 710 |
| పరికరం | 712 |
| వ్యాజోక్తి | 714 |
| పరిసంఖ్య | 715 |
| కారణమాల | 720 |
| అన్యోన్యం | 722 |
| ఉత్తరం | 723 |
| సూక్ష్మాలంకారం | 726 |
| సారాలంకారం | 728 |
| అసంగతి | 729 |
| సమాధి | 731 |
| సమాలంకారం | 732 |
| విషమాలంకారం | 734 |
| అధికాలంకారం | 738 |
| ప్రత్యనీకం | 739 |
| మీలితం | 741 |

| విషయం | పేజీ |
|---|---|
| ఏకావలి | 744 |
| స్మరణాలంకారం | 746 |
| భ్రాంతిమాన్ | 748 |
| ప్రతీపాలంకారం | 749 |
| సామాన్యాలంకారం | 753 |
| విశేషాలంకారం | 755 |
| తద్గుణాలంకారం | 759 |
| అతద్గుణం | 760 |
| వ్యాఘాతం | 762 |
| సంసృష్టి | 763 |
| సంకరం | 766 |
| సందేహసంకరం | 772 |
| మూడవసంకరం | 778 |
| అలంకారదోషాలు చెప్పిన దోషాలలోనే అంతర్గతాలు అవుతాయి | 782 |
| గ్రంథోపసంహారం | 802 |

శ్రీః

# ప్రస్తావన

1. ప్రకృతి సౌందర్యానికి నిలయమైన కాశ్మీరదేశంలో సౌందర్యశాస్త్రం (అలంకారశాస్త్రం) విభిన్నరూపాలు సంతరించుకొని కవి-సహృదయలోకాన్ని రస పరిప్లుతం చేసిన దంటే ఆశ్చర్యపడవలసిన పని లేదు. మమ్మటుడు కాశ్మీర దేశంలో జన్మించి విశ్వవిఖ్యాతి సంపాదించిన భామహ-ఉద్భట-వామన-ఆనంద వర్ధన-భట్టనాయక-కుంతక-అభినవగుప్త-మహిమభట్టాది అలంకారికుల కోవకు చెందినవాడు. మమ్మటునికి సంబంధించిన వైయక్తికవిషయాలేవీ నిశ్చితంగా తెలియవు. ఇతడు జైయటుని కుమారు డనీ, కైయటుడు, ఉవ్వటుడూ ఇతని సోదరు లనీ భీమసేను డనే ఒక కావ్యప్రకాశవ్యాఖ్యాత వ్రాశాడు. కైయటుడు మహాభాష్యానికి వ్యాఖ్యానం వ్రాశాడు. ఉవ్వటుడు శుక్లయజుర్వేదసంహితకీ, ఋక్ప్రాతిశాఖ్యకూ వ్యాఖ్యానం వ్రాశాడు. మమ్మటుని విద్యాభ్యాసం అంతా కాశీలో జరిగిందనీ, అతడే తన సోదరులకు గురు వనీ ప్రసిద్ధి. అయితే ఉవ్వటుని గ్రంథాల కొన్ని వ్రాతప్రతులలోని పుష్పికలలో అతడు తనను వజ్రటుని కుమారునిగాను, తాను తన గ్రంథాలు భోజరాజు రాజ్యం పాలిస్తూన్న కాలంలో ఉజ్జయినిలో ఉండి వ్రాసినట్లుగాను చెప్పుకున్నట్లు కనబడుతున్నది. అందుచేత భీమసేనుడు వ్రాసినది ఎంతవరకు సత్యమో తెలియదు. జైయటునికే వజ్రటు డనే నామాంతరం ఉండేదేమో?

2. నైషధీయచరితమహాకావ్యరచయిత అయిన శ్రీహర్షునికి మమ్మటుడు మేనమామ అనే ప్రసిద్ధి కూడ ఒకటి ఉంది. శ్రీహర్షుడు తన నైషధీయచరితం మేనమామకు చూపించాడట. అప్పుడు అది చదివి మమ్మటుడు-"నువ్వు ఈ కావ్యం కొంచెం ముందుగా నాకు చూపిస్తే బాగుండేది; నా కావ్యప్రకాశలోని దోషప్రకరణంలో వివిధదోషాలకు ఉదాహరణలు చూపడానికి ఆ కావ్యంలోను ఆ కావ్యంలోనూ వెదకి చాలా శ్రమపడ్డాను. నీ కావ్యం అప్పుడే లభించి ఉంటే అన్ని దోషాలకీ ఉదాహరణలు దీనిలోనే లభిస్తున్నాయి కాబట్టి నా కా శ్రమ అంతా తప్పి ఉండేది"

అని అన్నాడట. ఇది పండితు లందరూ ప్రసిద్ధంగా చెప్పుకొనే కథ. అందుచేతనే కాబోలు శ్రీహర్షుడొక సర్గాంతపద్యంలో "నా కావ్యాన్ని కాశ్మీరపండితు లందరూ మెచ్చారు." అని వ్రాసుకున్నాడు. నైషధీయచరితం ఆనాటి కాశ్మీరదేశపండితుల మన్ననలు పొందిందంటే బహుశా శ్రీహర్షుడు మేనమామగారి సలహాల ప్రకారం ఎన్నో మార్పులు చేసి ఉండాలి. ముందుగా ఆయనకు చూపిన కావ్యానికీ చివరికి రూపొందించినదానికీ చాలా భేదం ఉండి ఉండాలి.

**3. మమ్మటుని కాలం:-** మమ్మటుని కాలాన్ని యాభైసంవత్సరాల ఇటూ అటూలో నిర్ణయించవచ్చు. మమ్మటుడు అభినవగుప్తుణ్ణి సగౌరవంగా పేర్కొన్నాడు. బహుగ్రంథనిర్మాత అయిన అభినవగుప్తుడు ఒక గ్రంథాన్ని 980 లోను, మరొక గ్రంథాన్ని 1020 లోను రచించినట్లు ఆధారాలున్నాయి. అందుచేత ఆతని గ్రంథరచనాకాలం క్రీ శ. 980-1020 సంవత్సరాల మధ్య అని నిర్ణయించబడింది. అభినవగుప్తునికీ మమ్మటునికీ మధ్య కనీసం ముప్పై నలభై సంవత్సరాల వ్యవధానమైనా ఉండాలి. భోజుని దాతృత్వాన్ని వర్ణించే ఒక శ్లోకం మమ్మటుడు కావ్యప్రకాశలో ఉదాహరించాడు (చూ. శ్లో. 505). భోజుడు 1054వ సంవత్సరం దాకా రాజ్యం చేసినట్లు చెప్పడానికి ప్రమాణాలు ఉన్నాయి. అందుచేత మమ్మటుడు 1050 ప్రాంతంలో గంథ్రరచన చేసినట్లు నిర్ణయించవచ్చు. మమ్మటుని కావ్యప్రకాశకు అతిప్రాచీనవ్యాఖ్యానమైన 'సంకేతం' రచించిన మాణిక్య చంద్రు డనే జైనపండితుడు ఆ వ్యాఖ్యానాన్ని 1159లో పూర్తిచేసి నట్లుగా చెప్పుకున్నాడు. ఈ ఆధారాలను పట్టి మమ్మటుడు పదకొండవశతాబ్దం ఉత్తరార్ధానికి సంబంధించి నట్లు నిశ్చితంగా చెప్పవచ్చు. భోజమమ్మటులు సమకాలికులే అయినా భోజుడు రచించిన సరస్వతీకంఠాభరణ-శృంగారప్రకాశాదిగ్రంథాలను మమ్మటుడు కాని, మమ్మటుని కావ్యప్రకాశను భోజుడు కాని చూచినట్లు కనబడదు. వారిద్దరు ఒకరి కొకరు సుదూరప్రాంతాలలో ఉండడమే దీనికి కారణం. భోజుని కీర్తి ఆతనిని వర్ణించే పద్యాలూ మాత్రం కాశ్మీరంపరకూ వ్యాపించి ఉండవచ్చును.

**4 మమ్మటుని పాండిత్యం:-** మమ్మటునికి అనేక శాస్త్రాలలో మంచి పాండిత్యం ఉన్నట్లు కావ్యప్రకాశను పట్టి స్పష్టం అవుతుంది. వ్యాకరణ-పూర్వమీమాంసా-న్యాయ-సాంఖ్య బౌద్ధ - శైవసిద్ధాంతాలలో సమానమైన ప్రావీణ్యం ఉన్నా వ్యాకరణశాస్త్రం ఇతనికి అభిమానశాస్త్రంగా కనబడుతుంది. అయితే

ఈనాడు ఈతని రచనలు 'కావ్యప్రకాశ' 'శబ్దవ్యాపారపరిచయం' అనే అతిలఘువైన గ్రంథం ఈ రెండే లభిస్తున్నాయి.

5. కావ్యప్రకాశ:- యావద్భారతదేశంలో కావ్యప్రకాశకు ఉన్నంత ప్రచారం మరే అలంకారశాస్త్రగ్రంథానికి లేదు. ఇది రచించబడిననాటినుండి నేటి వరకూ దీనికి ఇంత ప్రసిద్ధి ఉంది. అందుచేతనే దీనికి ఎంతోమంది మహాపండితులు సంస్కృతభాషలో శాస్త్రీయపద్ధతిలో వ్రాసిన వ్యాఖ్యానాలు నలభైఎనిమిదిదాకా (48) ఉన్నాయి. హిందీ-గుజరాతీమొదలైన తత్తత్ప్రాంతీయభాషలలోను, ఆంగ్లభాషలోనూ విస్తృతములైన వ్యాఖ్యానా లున్నాయి. దీనిని పట్టి ఈ గ్రంథానికి పఠనపాఠనాదిప్రచారం ఎంతగా ఉందో ఊహించుకొనవచ్చును. మమ్మటుడు నూతనంగా ఆవిష్కరించిన సిద్ధాంతా లేవీ లేవు. అయితే అలంకారశాస్త్రానికి సంబంధించిన విషయా లన్నీ నియమబద్ధమైన రీతిలో ఒకచోట కూర్చి ప్రప్రథమంగా ఒక సమగ్రమైన అలంకారశాస్త్రగ్రంథం అందించిన ఘనత మమ్మటునికే తక్కింది. మమ్మటుని తరవాత సుమారు వంద అలంకారశాస్త్రగ్రంథాలు (వీటిలో కొన్ని ప్రచురితము లయ్యాయి, కొన్ని కాలేదు) బయలుదేరాయి. వీటిలో నూటికి తొంభై కావ్యప్రకాశానుకరణాలే. వాటిలో కొన్నింటికి ఆ యా ప్రాంతాలలో ప్రచారం లభించినా సకలభారతప్రసిద్ధి లభించలేదు. ఈ విధంగా అలంకారశాస్త్రగ్రంథనిర్మాణంలో నూతనపథప్రదర్శకుడుగా మమ్మటునికి ఉన్న విఖ్యాతి అసాధారణ మైనది. అందుచేతనే కొందరు వ్యాఖ్యాతలు ఇతడు సాక్షాత్తు వాగ్దేవి అవతారం అని స్తుతించారు.

6. కావ్యప్రకాశలో కారికలు, వృత్తి, ఉదాహరణలు అని మూడు అంశాలు ఉన్నాయి. కారికలు, వృత్తి మమ్మటుడు రచించినవే. ఉదాహరణలు మాత్రం ఆ యా ప్రాచీనకావ్యాలనుంచి, అలంకారశాస్త్రగ్రంథాలనుంచి సేకరించినవి. కారికలు కూడ మమ్మటునివి కావు, ఎవరో ప్రాచీనపండితుడు రచించినవి అయి ఉంటా యని ఒక వాదం ఉంది కాని అది "వాదో వాదాయ కేవలమ్". మొత్తం గ్రంథం పది ఉల్లాసాలుగా విభజింపబడి ఉన్నది. స్థూలంగా ఈ ఉల్లాసాలలోని విషయాలు ఇవి:-

7. ప్రథమోల్లాసం-: ప్రథమోల్లాసం ఒక విధంగా ఉపోద్ఘాతం వంటిది. భారతీవందనానంతరం కావ్యప్రయోజనం, తరవాత కావ్యలక్షణం, పిమ్మట కావ్య

హేతువు చెప్పబడ్డాయి. చివర త్రివిధకావ్యవిభాగం సోదాహరణంగా నిరూపింప బడింది

8 **కావ్యప్రయోజనం:-** కావ్యంవల్ల ప్రయోజనం ఏమిటి? కేవలం ఆనందం కలిగించడమేనా మరొకటి కూడ ఏదైనా ఉందా అనేది ప్రశ్న. ఆనందం కలిగించడం ప్రధానప్రయోజనమే అయినా అదొక్కటే ప్రయోజనం కాదు; సన్మార్గోపదేశం కూడా కావ్యానికి ప్రయోజనమే అని భారతీయులైన ఆలంకారికుల అభిప్రాయం. "కళ కళకోసమే" అనేది వీరికి అంగీకార్యం కాదు. ఒక్క కావ్యమే కాదు; వాఙ్మయం అంతా, అది ఏ ప్రక్రియ అయినా, సన్మార్గోపదేశంకోసమే అని వీరి సిద్ధాంతం. మమ్మటుడు కూడా ఈ విషయమే ప్రతిపాదించాడు. అయితే ఉపదేశించవలసినది ఏమిటి అనే ప్రశ్న కలుగుతుంది. ఆ యా దేశకాలాదులను పట్టి, తన అభిరుచిని పట్టి, కవియే ఆ విషయం నిర్ణయించుకోవాలి. ఉదాహరణకి కొందరు ప్రాచీనకవుల కావ్యాలలో వైదికమతానికి సంబంధించిన అంశాల ఉపదేశం కనబడుతుంది. బౌద్ధుల కావ్యాలలో బౌద్ధమతానికి సంబంధించిన విషయాల ఉపదేశం, జైనుల కావ్యాలలో వారి మతానికి సంబంధించిన విషయాల ఉపదేశం కనబడతాయి. స్పెన్సర్, మిల్టన్ మొదలైనవాళ్ళ కావ్యాలలో క్రీస్తుమతానికి సంబంధించిన అంశాల ఉపదేశం కనబడుతుంది. ఈ నాటి కవుల రచనలలో సమసమాజం, మానవతావాదం, విప్లవం మొదలైన అంశాల ఉపదేశం కనబడుతున్నది. ఒక రచనను 'కావ్యం' అనాలంటే, ఉపదేశించబడే విషయం ఏదైనా, శబ్దగుంఫన, భావావిష్కారం, అలంకారప్రయోగం మొదలైనవాటిచేత అది ఆనందజనకంగా కూడా ఉండాలి. కేవలం ఉపదేశం మాత్రమే ఉన్న స్మృతులు మొదలైనవి ఉన్నాయి. అవి ఛందోబద్ధంగా కూడా ఉంటాయి. అయినా వాటిని కావ్యం అనరు. అదే విధంగా రచన ఎంత అందంగా ఉన్నా ఏదో ఒక ఉపదేశం లేకపోతే అది కూడా కావ్యం కాజాలదు. రెండూ ఉంటేనే కావ్యం. ఇది ఆలంకారికుల మార్గం.

9. **కావ్యలక్షణం:-** కావ్యం అంటే ఏమిటి అనే ప్రశ్నకు సమాధానంగా అతిప్రాచీనకాలంనుంచీ ఆలంకారికులు కావ్యలక్షణం చెపుతూనే ఉన్నారు. వీటిలో కొన్ని లక్షణాలు స్వరూపసూచనమాత్రపరాలుగానే ఉంటాయి. పరిపూర్ణలక్షణాలు కావు. లేని పదాలు కొన్ని అధ్యాహారంగా తెచ్చుకొని పూర్తిచేసుకోవాలి. కొన్ని

లక్షణం చెప్పాలి అని చెప్పిన లక్షణాలు, అవి కొందరికి అంగీకారయోగ్యాలు అయినా కాకపోయినా రచయితలు వాటిని పరిపూర్ణలక్షణాలు అనే ఉద్దేశంతో చెప్పి ఉంటారు.

**10.** ఆలంకారికులలో కావ్యాలంకారకర్త అయిన భామహుడు అతి ప్రాచీను డని చాలామంది పండితుల అభిప్రాయం. దండియే ప్రాచీను డని పి.వి. కాణేగారి అభిప్రాయం. భామహుడు దండికి తరవాతివాడే అయి ఉంటా డని, బహుశా అతడు బౌద్ధపండితుడై ఉంటా డనీ నా అభిప్రాయం. (చూ-ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ ప్రచురించిన కావ్యాదర్శం ప్రస్తావన).

**11.** కావ్యాలంకారంలో భామహుడు (క్రీ.శ. 725-750) ఒక చోట "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" అని అంటాడు. ఇదే భామహునికి ఇష్టమైన కావ్య లక్షణం అని చాలామంది అభిప్రాయం. "ఒక దానితో ఒకటి కలిసి ఉన్న శబ్దార్థాలు కావ్యం"అని దీని అర్థం. ఇలాంటి కలయిక ప్రతివాక్యంలోనూ ఉంటుంది. "అన్యూనానతిరిక్తంగా ఈ రెండూ ఉండాలి; అప్పుడే అది కావ్యం అవుతుంది" అంటూ ఏవేవో సర్దుబాట్లు చేసి చెపుతూ ఉంటారు. ప్రతీ శాస్త్రగ్రంథంలోను, స్మృత్యాదులలోను శబ్దార్థాలను తూచి వాడతారు. అందుచేత ఈ సహితత్వం వాటిలోనూ ఉంటుంది. కాబట్టి ఇది సరియైన లక్షణం అవడానికి వీలు లేదు. ఈ వాక్యానికి ముందు భామహుడు శబ్దాలంకారలను గూర్చి అర్థాలంకారాలను గూర్చి చర్చిస్తాడు. "కొందరు శబ్దాలంకారాలు ప్రధానమైనవి అంటారు. మరికొందరు అర్థాలంకారాలు ప్రధాన మైనవి అంటారు. నా అభిప్రాయం ప్రకారం రెండూ సమప్రాధాన్యం కలవే" అని చెప్పి (1-13-15) ఈ వాక్యం వ్రాస్తాడు. అందుచేత పైన చెప్పిన శబ్దార్థాలంకారాలను అన్వయించుకొని 'సహితౌ' అనే పదానికి "శబ్దాలంకారార్థాలంకారసహితౌ"అని అర్థం చెప్పుకొని "శబ్దార్థాలంకారాలు ఉన్న శబ్దార్థాలు కావ్యం"అని లక్షణం చెప్పుకుంటే అది సమంజసంగా ఉంటుంది. లేదా ఇది స్థూలంగా చెప్పిన లక్షణం అనుకొని ఈ పరిచ్ఛేదంలోనే రాబోయే "అలఙ్కారవదగ్రామ్యమర్థ్యం న్యాయ్యమనాకులమ్" (1.35) అనే వాక్యం లక్షణం అని చెప్పుకోవాలి.

**12** ఇదే విధంగా దండి (క్రీ. శ. 660-680) కావ్యాదర్శంలో చెప్పిన "ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ" అనేది కావ్యలక్షణం అని చాలామంది అంటూం

టారు. వాస్తవానికి దండి ఈ వాక్యాన్ని కావ్యలక్షణంగా ఉద్దేశించలేదు. ఈ ఘట్టంలోని పూర్వాపరాలు పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది. ప్రథమపరిచ్ఛేదం ఎనిమిదవ శ్లోకంలో "శాస్త్రజ్ఞానం లేనివాడు గుణదోషాలు ఎట్లా గ్రహించకలుగుతాడు?" అని చెప్పి దండి-

"అతః ప్రజానాం వ్యుత్పత్తిమభిసంధాయ సూరయః,
వాచాం విచిత్రమార్గాణాం నిబబన్ధుః క్రియావిధిమ్.
తైః శరీరం చ కావ్యానామలఙ్కారాశ్చ దర్శితాః,
శరీరం తావదిష్టార్థవ్యచ్ఛిన్నా పదావళీ" (కావ్యాదర్శ 1. 9. 10)

అని అంటాడు. "అందుచేతనే పండితులు ప్రజలకు వ్యుత్పత్తి కలగడంకోసం విచిత్రమార్గములు గల వాక్కుల నిర్మాణవిధానాన్ని చెప్పారు. కావ్యశరీరాన్ని అలంకారాలను కూడా చూపించారు. ఇష్టంగా ఉండే అర్థాన్ని ప్రతిపాదించే పద సముదాయమే కావ్యానికి శరీరం" అని ఈ శ్లోకాల అర్థం. దీనిని పట్టి దండి కేవలం "ఇష్టార్థకపదసముదాయం కావ్యానికి శరీరం"అని మాత్రమే చెపుతున్నాడు గాని దీన్ని కావ్యలక్షణంగా చెప్పడం లేదు. రెండవ శ్లోకంలో "యథాసామర్థ్య మస్మాభిః క్రియతే కావ్యలక్షణమ్" అని చెప్పి తరవాత కొన్ని శ్లోకాలలో వాఙ్మయానికి ఉన్న ప్రాశస్త్యాన్ని వర్ణించి ఈ వాక్యం చెప్పడంచేత ఇదే దండ్యభిమతమైన కావ్యలక్షణం అని చాలామంది భ్రాంతిపడడానికి అవకాశం ఏర్పడింది. రెండవ శ్లోకంలోని "కావ్యలక్షణం"అనేది ఈ గ్రంథానికి పేరు. ఎవరైనా రచయిత యథాశక్తిగా ఫలానా గ్రంథం రచిస్తున్నాను అని చెప్పుకుంటాడు గాని ఫలానా దానికి లక్షణం యథాశక్తిగా చెపుతున్నాను అని అనడు. దండి రచించిన గ్రంథానికి 'కావ్యలక్షణం'అనే పేరు. 'కావ్యాదర్శం'అనే పేరు అత డెక్కడా చెప్పలేదు పైన చెప్పినట్లుగా 'కావ్యలక్షణం' అనగా కావ్యానికి లక్షణం అని అర్థం చేసుకొని ఎవరో వ్యాఖ్యాత మరొక పేరు ఏదీ గ్రంథంలో కనబడకపోవడంచేత-

"ఆదిరాజయశోబిమ్బమాదర్శం ప్రాప్య వాఙ్మయమ్,
తేషామసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి" (కా.ఆ.1.5)

అనే శ్లోకం చూచి దీనికి కావ్యాదర్శం అనే పేరు పెట్టి ఉంటాడు. "కావ్యలక్ష

రత్నశ్రీ"అనే వ్యాఖ్యానం రచించిన ఒక సింహళదేశీయుడైన రత్నశ్రీ అనే పండితుడు ఈ గ్రంథం పేరు "కావ్యలక్షణం"అని స్పష్టీకరించి ఉన్నాడు.

**13** ఈ విధంగా దండి పరిపూర్ణమైన లక్షణం ఏదీ చెప్పలేదు. పైన ఉదాహరించిన శ్లోకాలలోని విషయా లన్నీ చేర్చితే ఏర్పడిన"సాలఙ్కారా ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా విచిత్రమార్గా పదావలిః కావ్యమ్"అనే వాక్యం దండికి అభిమతమైన, అతడు సూచించిన కావ్యలక్షణం అని చెప్పవచ్చును

**14.** కావ్యాలంకారసూత్రరచయిత అయిన వామనుడు(ఎనిమిదవ శతాబ్దం) కూడా స్పష్టమైన లక్షణం ఇవ్వకుండా సూచించి ఉన్నాడు-"కావ్యశబ్దోఽయం గుణాలఙ్కారసంస్కృతయోః శబ్దార్థయోర్వర్తతే, భక్త్యా తు శబ్దార్థమాత్రవచనః అత్ర గృహ్యతే", (కా. అ. సూ. పే.1) దీనిని పట్టి "గుణాలంకారసహితౌ శబ్దార్థౌ కావ్యమ్"అని వామనునికి అభిమతమైన కావ్యలక్షణం అని స్పష్టం అవుతుంది.

**15.** 'కావ్యాలంకార' కర్త అయిన రుద్రటుడు కూడా (క్రీ. శ. 900 ప్రాంతం) కావ్యలక్షణం చెప్పకుండా "నను శబ్దార్థౌ కావ్యమ్" (పే. 8) అని మాత్రమే ప్రసంగవశంచేత అన్నాడు. దీనికి వ్యాఖ్యానం చేస్తూ నమిసాధువు "ఈ రెండింటికీ సమప్రాధాన్యం కాబట్టి ఈ రెండూ కలిస్తేనే కావ్యం అవుతుంది" అన్నాడు.

**16.** ఈ విధంగా ధ్వనిసిద్ధాంతస్థాపనకు ముందు ఏ ఆలంకారికుడూ కూడా కావ్యానికి అవ్యాప్త్యతివ్యాప్త్యసంభవదోషగ్రస్తం కాని లక్షణం చెప్పడానికి ప్రయత్నించలేదు. ఎంతసేపూ శబ్దార్థాలూ వాటికి సంబంధించిన గుణాలంకారాదులూ-వీటి చుట్టూ మాత్రమే తిరిగారు. కావ్యాత్మను గూర్చి వీళ్లు ముచ్చటించలేదు. "ధ్వని కావ్యానికి ఆత్మ" అని ఆనందవర్ధనుడు స్థాపించడంతో తరువాతివాళ్ళందరూ, వాళ్లు ధ్వనిని అంగీకరించినవాళ్లైనా, అంగీకరించనివాళ్లైనా, కావ్యలక్షణంలో కావ్యాత్మను గూర్చి మాటలాడడం ప్రారంభించారు. అయితే ధ్వన్యాలోకరచయిత అయిన ఆనందవర్ధనుడూ (తొమ్మిదవ శతాబ్దం), తద్వ్యాఖ్యాత అయిన అభినవగుప్తుడూ(పదవ శతాబ్దం ఉత్తరార్ధం)కూడా కావ్యలక్షణం ఏదీ ఇవ్వకపోవడం గమనార్హం. "శబ్దార్థశరీరం తావత్కావ్యమ్" (ధ్వన్యా. పే. 16). "కావ్యవిశేషో హి విశిష్టార్థప్రతిపత్తిహేతుః శబ్దసన్దర్భవిశేషః" (ధ్వన్యా. పే. 300) అని మాత్రమే ప్రసంగవంశంచేత ఆనందవర్ధనుడు అన్నాడు.

**17.** "వక్రోక్తిజీవితం" రచించిన కుంతకుడు (పదకొండవ శతాబ్దం ప్రారంభం.)

"శబ్దార్థౌ సహితౌ యత్ర కవివ్యాపారశాలిని,
బన్ధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి". 1-7

అని కావ్యలక్షణం చెప్పి సాహిత్యం అంటే ఏమో విశదీకరించాడు.

భోజుడు (పదకొండవ శతాబ్దం ప్రారంభం) "సరస్వతీకంఠాభరణం"లో ఒక కావ్యలక్షణాన్ని సూచించాడు-

"నిర్దోషం గుణవత్ కావ్యమలఙ్కారైరలఙ్కృతమ్,
రసాన్వితం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతిం చ విన్దతి (పే.2).

దీనిలోని "నిర్దోషం గుణవత్, అలంకారైః అలంకృతమ్, రసాన్వితం కావ్యమ్"అనే దానిని భోజునికి సంమతమైన కావ్యలక్షణంగా గ్రహించవచ్చును.

**18.** అగ్నిపురాణంలో దండి - భోజులు ఇచ్చిన కావ్యలక్షణాలని కలిపి "ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ; కావ్యం స్ఫురదలంకారంగుణవద్దోషవర్జితమ్" (1.6.7) అనే లక్షణం ఇవ్వబడింది. అగ్నిపురాణంలో ఉన్న అలంకారశాస్త్రానికి సంబంధించిన విషయా లన్నీ భోజుని సరస్వతీకంఠాభరణంనుండి గ్రహించ బడిన వని పండితుల అభిప్రాయం. (చూ.పి.వి.కాణే, "సాన్‌స్క్రిట్ పొయటిక్స్" ii సంపుటం. పేజి 201)

**19.** మమ్మటుడు ఇచ్చిన "తదదోషౌ శబ్దార్థౌ" ఇత్యాదికావ్యలక్షణం ధ్వని వాదులకు ఇరరులకు కూడా అంగీకారయోగ్యంగానే ఉన్నది. ఆ లక్షణంలో ధ్వనిని కాని, రసాన్ని కాని ప్రత్యక్షంగా (Directly) చేర్చకపోవడమే ఇందుకు కారణం. తరవాత అతడు చేసిన ప్రతిపాదనను పట్టి గుణాలు రసధర్మాలు గాన గుణాలు ఉండా లని చెప్పగానే రసం ఉండా లనికూడా సూచితం అవుతున్నా, గుణాదులు శబ్దార్థాశ్రితాలు అనే వాళ్ళకు కూడా అంగీకారయోగ్యం అయే టట్లు, అతడు రసం మాట లక్షణంలో ఎత్తలేదు. తరవాత వచ్చిన అలంకారికులు చాలావరకు మమ్మటుని లక్షణాన్నే అనుసరించారు.

**20.** "అదోషౌ సగుణౌ సాలఙ్కారౌ శబ్దార్థౌ కావ్యమ్".
- హేమచంద్రుని కావ్యానుశాసనం. పే. 19

"గుణాలంకారసహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ,
గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదో విదుః."

-ప్రతాపరుద్రీయం, II. 1.

"శబ్దార్థౌ నిర్దోషౌ సగుణౌ ప్రాయః సాలఙ్కారౌ కావ్యమ్"

కావ్యానుశాసనం. పే. 14

"నిర్దోషా లక్షణవతీ సరీతిర్గుణభూషణా,
సాలంకారరసానేకవృత్తిర్వాక్కావ్యనామభాక్".

-చంద్రాలోకం. I. 7.

"కావ్యం రసాదిమద్వాక్యం శ్రుతం సుఖవిశేషకృత్"

-అలంకారశేఖరం-పే. 2.

"ఆస్వాదజీవాతుః పదసందర్భః కావ్యమ్"

-చండీదాసుడు.

"వాక్యం రసాత్మకం కావ్యమ్" (సాహిత్యదర్పణం. పే. 5).
"రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్"(రసగంగాధరం. పే. 4).

ఈ విధంగా ఆలంకారికులు కావ్యానికి లక్షణం చెప్పి ఉన్నారు. వీటిని పరిశీలిస్తే (1) "గుణాదులున్న శబ్దార్థాలు రెండూ కావ్యం" అని కొందరూ (2) "రసం ఉన్న శబ్దార్థాలే కావ్యం" అని కొందరూ; 'మనోహరమైన అర్థాన్ని బోధించే శబ్దం కావ్యం' అని కొందరూ, "రసం ఉన్న శబ్దమే కావ్యం" అని కొందరూ లక్షణం చెప్పినట్లు కనబడుతుంది. శబ్దార్థాలు రెండూ కలిసి కావ్యమా, అందమైన అర్థం బోధించే, లేదా రసం ఉన్న శబ్దం కావ్యమా అనే విషయంలో, "కావ్యలక్షణంలో శబ్దానికే ప్రాధాన్యం ఇవ్వాలి" అని పండితరాయలు సయుక్తికంగా స్థాపించాడు. కావ్యంలో బోధించబడే అర్థం మనోహరంగా ఉంటే చాలు; ఆ మనోహరత్వం దేనిని పట్టి వచ్చినా రావచ్చు. కొన్ని చోట్ల రసంచేత, కొన్ని చోట్ల వస్తుధ్వని చేత, కొన్ని చోట్ల అలంకారంచేతా కూడా రావచ్చు అని పండితరాయల అభిప్రాయం. కావ్యలక్షణాలను గూర్చిన విస్తృతచర్చను తెలుసుకొనగోరేవారు మా

"The contribution of Panditaraja Jagannatha to Sanskrit Poetics" అనే గ్రంథంలో (మొదటి సంపుటం 32-56 పేజీలలో) చూడవచ్చును.

**21**. కావ్యహేతువు:- కావ్యానికి హేతువు ఏది అనే విషయంలో అలంకారికులలో అభిప్రాయభేదం ఉంది. (1) ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం- ఈ మూడింటిలో ఒక్కొక్కటి స్వతంత్రంగా కావ్యనిర్మాణహేతువు అవుతుం దని కొందరి అభిప్రాయం. (2) ఈ మూడూ కలిస్తేనే కావ్యహేతువులు అవుతా యని కొందరి అభిప్రాయం. (3) ప్రతిభ ఒక్కటే హేతు వని కొందరి అభిప్రాయం. అయితే ప్రతిభకే ప్రాధాన్యం ఇచ్చేవారే అధికంగా ఉన్నారు. ప్రతిభ లేని వ్యుత్పత్త్యభ్యాసాలు ఉత్తమకావ్యసృష్టికి ఉపకరించ వనీ అసలు ప్రతిభ అంటూ ఉంటే దానికి ఇవి తోడ్పడతా యనీ వీరి అభిప్రాయం. ఈ మూడూ కలిసి కావ్యహేతువు అని చెప్పినా కూడ మమ్మటుడు చివరికి ప్రతిభకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. ఈ విషయంలో కొందరు ప్రాచీనాచార్యుల వాక్యాలు పరిశీలిద్దాం.

**22.** "స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా,
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాలికీ మతా.
ప్రజ్ఞాం నవనవోన్మేషశాలినీం ప్రతిభాం విదుః,
ద్వే వర్త్మనీ గిరాం దేవ్యాః శాస్త్రఞ్చ కవికర్మ చ,
ప్రజ్ఞోపజ్ఞం తయోరాద్యం ప్రతిభోద్భవమన్తిమమ్".
-కా.ప్ర సంప్రదాయప్రకాశినీవ్యాఖ్య. పే. 8

"గడిచిపోయినవాటికి సంబంధించినది "స్మృతి". రాబోయే విషయాలకి సంబంధించినది "మతి". వర్తమానవిషయాలకి సంబంధించినది "బుద్ధి". మూడు కాలాలకు సంబంధించిన విషయాలు గ్రహించేది ప్రజ్ఞ. క్రొత్త క్రొత్త రీతులలో వికసించే (మెరిసిపోయే) ప్రజ్ఞయే "ప్రతిభ" శాస్త్రమూ, కావ్యమూ అని సరస్వతీదేవి మార్గాలు రెండు. వీటిలో మొదటిది (శాస్త్రం) ప్రజ్ఞవల్ల పుడుతుంది. రెండవది (కావ్యం) ప్రతిభవల్ల పుడుతుంది"అని వీటికి అర్థం. "శక్తి"అనే నామాంతరం గల ఈ ప్రతిభను చాలామంది ఆలంకారికులు ఈ విధంగానే నిర్వచించారు-

భట్టతౌతుడు:-

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా,

తదను ప్రాణనాజీవవర్ణనానిపుణః కవిః.
తస్య కర్మ స్మృతం కావ్యమ్".

అభినవగుప్తుడు:-

"ప్రతిభా అపూర్వవస్తునిర్మాణక్షమా ప్రజ్ఞా.తస్య విశేషో రసావేశ వైశద్యసౌన్దర్యకావ్యనిర్మాణక్షమత్వమ్" (లోచనం. పే. 92)
"శక్తిః ప్రతిభానమ్; వర్ణనీయవస్తువిషయనూతనోల్లేఖశాలిత్వమ్"
(లోచనం. పే. 317).

మమ్మటుడు:-

"శక్తిః కవిత్వబీజరూపః సంస్కారవిశేషః" (కావ్యప్రకాశ. పే. 8)

వాగ్భటుడు:-

"ప్రసన్నపదనవ్యార్థయుక్త్యుద్బోధవిధాయినీ,
స్ఫురన్తీ సత్కవేర్బుద్ధిః ప్రతిభా సర్వతోముఖీ,
(వాగ్భటాలంకారం. పే. 4).

రాజశేఖరుడు:-

"యా శబ్దగ్రామమ్,అర్థసార్థమ్,అలఙ్కారతన్త్రమ్, ఉక్తిమార్గమ్,
అన్యదపి తథావిధమ్ అధిహృదయమ్ ప్రతిభాసయతి సా ప్రతిభా.
(కావ్యమీమాంస. 26-27).

రుద్రటుడు:-

"మనసి యదా సుసమాధిని విస్ఫురణమనేకధాభిధయా,
అక్లిష్టాని చ పదాని విభాన్తి యస్యామసౌ శక్తిః.
ప్రతిభేత్యపరైరుక్తా" (కావ్యాలంకారం. పే. 6)

"సహజ శక్తిరూపమైన ఈ ప్రతిభ మానవులలోనే కాదు, పశుపక్ష్యాదులలో కూడా ఉంటుంది. అందుచేతనే అవి గూళ్ళు కట్టుకోవడం మొదలైన పనులు చేయకలుగుతున్నాయి" అని భర్తృహరి వాక్యపదీయంలో (II. 143-151) ప్రతిపాదించాడు.

**మహిమభట్టు:-** కవి రసానికి అనుగుణమైన శబ్దార్థాలనుగూర్చి ఆలోచిస్తూ చిత్తాన్ని స్థిరంగా నిలిపినప్పుడు ఒక్క క్షణంపాటు ఆత్మ చైతన్య స్పర్శ కలుగుతుంది. అదే ప్రజ్ఞ దానినే భగవంతుని మూడవ నేత్రం అంటారు. అప్పుడా కవి మూడు లోకాలలోనూ ఉన్న పదార్థాలను చూడ గలుగుతాడు" అని మహిమభట్టు "ప్రజ్ఞ"కు ఒక విధమైన నూతనవ్యాఖ్య చేశాడు-

"రసానుగుణశబ్దార్థచిన్తాస్తిమితచేతసః,
క్షణం స్వరూపస్పర్శోత్థా ప్రజ్ఞైవ ప్రతిభా కవేః,
సా హి చక్షుర్భగవతః తృతీయమితి గీయతే,
యేన సాక్షాత్కరోత్యేష భావాంస్త్రైకాల్యవర్తినః"
(వ్యక్తివివేకం. పే. 452-53)

"ప్రాక్తనాద్యతనసంస్కారప్రౌఢా ప్రతిభా కాచిదేవ కవిశక్తిః"
-వక్రోక్తిజీవితం. పే. 107

ప్రతిభ, శక్తి ఒకటే అని చాలామంది అభిప్రాయం అయితే రాజశేఖరుడు మాత్రం ఈ రెండూ వేరనీ, శక్తి ప్రతిభకు మూలం అనీ, ప్రతిభకే కాదు వ్యుత్పత్తికి కూడా ఇది మూలం అనీ అన్నాడు-

"విప్రసృతిశ్చ సా(శక్తిః) ప్రతిభావ్యుత్పత్తిభ్యామ్,
శక్తికర్తృకే హి ప్రతిభావ్యుత్పత్తికర్మణీ"
(కావ్యమీమాంస. పే. 26)

**23.** వ్యుత్పత్తి :- ఛందోవ్యాకరణాదులలో మంచి పాండిత్యం, కళలలో ప్రవేశం, లోకవ్యవహారజ్ఞానం, యుక్తాయుక్తవివేకం ఇవన్నీ వ్యుత్పత్తి అని ఆలంకారికు లందరూ ప్రతిపాదించారు.

**24.** అభ్యాసం :- కావ్యనిర్మాణచాతుర్యం ఉన్నవానివద్దకు వెళ్ళి,స్వయంగానూ కూడ నిరంతరకావ్యనిర్మాణసాధన చేయడం అభ్యాసం.

**25.** కావ్యనిర్మాణానికి ఈ మూడూ అవసరమే, కాని ఈ మూడింటిలో ప్రతిభ చాలా ప్రధానమైనది అని చాలమంది ఆలంకారికులు ప్రతిపాదించారు.

సహజమైన ప్రతిభ లేకపోయినా నిరంతరాభ్యాసంచేతా వ్యుత్పత్తిచేతా సరస్వత్య నుగ్రహం పొందవచ్చును అని దండి, మంగళుడు మొదలైన ఇద్దరు ముగ్గురు మాత్రమే అంగీకరించారు. వ్యుత్పత్త్యభ్యాసాలవల్ల కూడా ప్రతిభ జనిస్తుంది; అందుచేత చివరికి ప్రాధాన్యం అంతా ప్రతిభకేఅని పండితరాజాదుల అభిప్రాయం. మూడూ కలిసి కావ్యహేతువు అన్న మమ్మటుడు కూడా ప్రతిభకే ప్రాధాన్యం అని అంగీకరించాడు. ఈ విషయాన్ని గూర్చిన విస్తృతవిమర్శ మా **"The Contribution of Panditaraja Jagannatha to Sanskirt Poetics"** అనే గ్రంథంలో చూడవచ్చును.

**26.** కావ్యభేదాలు :- ఆనందవర్ధనునికి ముందు ఉన్న ఆలంకారికు లందరూ కావ్యబాహ్యస్వరూపాన్ని పట్టి కావ్యవిభేదాలు ఏర్పరచారు. ఉదాహరణకి భామహుడు-

(అ) ముందుగా కావ్యాన్ని రచనా (శబ్దసంగ్రథన) భేదాన్ని పట్టి 1) గద్యకావ్యం 2) పద్యకావ్యం అని రెండు విధాలుగా విభజించాడు

(ఆ) భాషాభేదాన్ని పట్టి 1) సంస్కృతం 2) ప్రాకృతం 3) అపభ్రంశం అని మూడు విధాలుగా విభజించాడు.

(ఇ) వస్తుభేదాన్ని పట్టి 1) వృత్తదేవాదిచరితశంసి 2) ఉత్పాద్యవస్తువు 3) కలాశ్రయం 4) శాస్త్రాశ్రయం అని నాలుగు విధాలుగా విభజించాడు.

(ఈ) నిర్మాణభేదాన్ని పట్టి 1) సర్గబంధం (మహాకావ్యం), 2) అభినేయార్థం 3) ఆఖ్యాయిక 4) కథ 5) అనిబద్ధం (ముక్తకం) అని ఐదు విధాలుగా విభజించాడు. భామహుని తరవాత వచ్చినవాళ్ళందరూ చాలా వరకు ఇదే పద్ధతి అనుసరించారు. ఆనందవర్ధనుడు "ధ్వని కావ్యాత్మ" అని సిద్ధాంతీకరించిన తరవాత పైన చెప్పిన విభజనంతో పాటు మరొక విధమైన కావ్యభేదవిభజనం కూడా ప్రారంభం అయింది. ఆనందవర్ధనుడు, కావ్యాలు మూడు విధాలు అని స్పష్టంగా చెప్పకపోయినా ధ్వని ప్రధానంగా ఉన్న కావ్యం "ధ్వనికావ్యం" అనీ, అప్రధానంగా ఉన్నది "గుణీభూతవ్యంగ్యం" అనీ, వ్యంగ్యస్పర్శ లేక శబ్దార్థాల అందం మాత్రమే ఉన్నది "చిత్రకావ్యం" అనీ ప్రతిపాదించి కావ్యత్రైవిధ్యాన్ని సూచించాడు. "వ్యఙ్గ్యార్థస్య ప్రాధాన్యే ధ్వనిసంజ్ఞితః కావ్యప్రకారః, గుణభావే తు

గుణీభూతవ్యఙ్గ్యమ్ .... .... కేవల వాచ్యవాచకవైచిత్ర్యమాత్రాశ్రయేణోపనిబద్ధ మాలేఖ్యప్రఖ్యం యదాభాసతే తచ్చిత్రం కావ్యమ్. న తన్ముఖ్యం కావ్యమ్, కావ్యానుకారో హి సః" (ధ్వన్యాలోకం. పే. 494).

**27** తరవాత వచ్చిన ధ్వనిసిద్ధాంతసమర్థకు లందరూ ఈ విభాగాన్ని అంగీకరించారు మమ్మటుడు ఆనందవర్ధనుడు చెప్పిన పేర్లతో పాటు వాటికి వరసగా "ఉత్తమం" "మధ్యమమ్" "అధమం" అనే పేర్లు కూడా పెట్టాడు

**28** ద్వితీయోల్లాసం :- మమ్మటుడు ద్వితీయోల్లాసంలో శబ్దార్థాల స్వరూపాన్నీ, వాటి భేదాలనూ వివరించాడు. ఒక శబ్దం ఒక అర్థాన్ని బోధిస్తుంది. ఒకప్పుడు అదే శబ్దం దాని అసలు అర్థానికి దగ్గరగా ఉన్న మరొక అర్థాన్నీ, మరొకప్పుడు కొంచెం దూరంగా ఉన్న అర్థాన్నీ బోధిస్తూ ఉంటుంది. ఇది అన్ని భాషలలోనూ ఉన్న విషయమే. అయితే శబ్దానికీ, అర్థానికీ, ఉన్న సంబంధం ఏమిటి? ఒక శబ్దం ఎన్ని రకాల అర్థాలు బోధిస్తుంది? బోధించబడే అర్థాలను పట్టి శబ్దాలలో ఎన్ని భేదాలు ఉంటాయి? శబ్దంలో ఉన్న ఆ యా అర్థాలని బోధించడం అనే వ్యాపారానికి (పనికి) ఏమి పేరు? ఇత్యాదివిషయాలన్నింటినీ గూర్చిన చర్చ కొన్ని వేల సంవత్సరాలనుంచి భారతదేశంలో మాత్రమే కనబడు తుంది. మరి ఎక్కడా ఇంత విస్తృతమైన చర్చ లేదు. ఈనాడు కొన్ని పాశ్చాత్య భాషలలో కనబడే ఇలాంటి చర్చ ఆధునికం. కేవలం ఒకటి ఒకటిన్నర శతాబ్దాలకు పూర్వం మాత్రమే ప్రారంభం అయింది.

**29**. "ఈ శబ్దానికి ఇది అర్థం" అని చేసికొన్న ఒక నిర్ణయాన్ని (సంకేతాన్ని)పట్టి ఒక శబ్దం ఒక అర్థాన్ని బోధిస్తుంది అలా బోధించే శబ్దం "వాచకం". బోధించబడే అర్థం "వాచ్యం". శబ్దంలో ఉన్న ఆ అర్థాన్ని బోధించడం అనే పని "అభిధ". ఈ పనికి "వృత్తి" లేదా "వ్యాపారం" అని పేర్లు. ఒక్కొకప్పుడు ఒక పదం తన వాచ్యార్థంతో పాటు, లేదా వాచ్యార్థాన్ని పూర్తిగా విడిచిపెట్టి, మరొక అర్థాన్ని బోధిస్తుంది. ఆ అర్థానికి 'లక్ష్యార్థం' అనీ ఆ అర్థాన్ని బోధించడం అనే వ్యాపారానికి "లక్షణ" అనీ, అక్కడ ఆ పదానికి "లాక్షణికపదం" అనీ పేర్లు. అదే పదంవల్ల ఇంకా దూరమైన అర్థం ఒక్కొకప్పుడు బోధించబడుతుంది. ఆ బోధించబడే అర్థానికి "వ్యంగ్యార్థం అనీ, పదానికి "వ్యంజకం"అనీ, వ్యాపారానికి "వ్యంజన" అనీ పేర్లు.

**30.** శాస్త్రకారులలో కొందరు అభిధను మాత్రమే అంగీకరించినా, చాలా మంది లక్షణను కూడా అంగీకరించారు. అవే కాకుండా మరొక వ్యాపారం "తాత్పర్యం" అనేది ఉందని మరి కొందరు అంగీకరించారు. వీటికి అన్నింటికంటె భిన్నంగా మరొక "వ్యంజనా" వ్యాపారం అనే వ్యాపారం ఉందని స్థాపించినవారు ఆనందవర్ధనాది ఆలంకారికులు. ఈ విధంగా ఆలంకారికులు ప్రధానంగా అభిధ, లక్షణ, వ్యంజన అనే మూడు వ్యాపారాలు(వృత్తులు), వాచ్యం, లక్ష్యం, వ్యంగ్యం అనే మూడు విధాలైన అర్థాలు, వాచకం, లాక్షణికం, వ్యంజకం అనే మూడు శబ్ద భేదాలు అంగీకరించారు. తాత్పర్యాదులు కూడా ఈ మూడింటిలో ఏదో ఒకదానిలో అంతర్గతా లని నిరూపించారు. ఈ త్రివిధశబ్దభేదాలూ, త్రివిధఅర్థభేదాలు, వృత్తి త్రయమూ ద్వితీయోల్లాసంలో ప్రతిపాదించబడ్డాయి.

**31.** లక్షణాదుల విషయంలో ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఒక పదాన్ని స్వతంత్రంగా ప్రయోగించినప్పుడు అది తన వాచ్యార్థాన్ని మాత్రమే బోధిస్తుంది. "గఙ్గా" అనే పదానికి "గంగానది"అని మాత్రమే అర్థం. "గౌః" అనే పదానికి "ఎద్దు" అని మాత్రమే అర్థం ఈ పదాం పక్కన మరొక పదమో, మరి కొన్ని పదాలో చేర్చినప్పుడే ఈ పదాలు మరొక అర్థాన్ని బోధిస్తాయి "గఙ్గాయాం ఘోషః" అనే వాక్యంలో 'గగా'శబ్దం దగ్గర 'ఘోష'శబ్దం ఉంది కాబట్టే ఇక్కడ "గంగా" శబ్దం "గంగాతీరం" అనే అర్థాన్ని బోధిస్తూన్నది "గౌః వాహీకః" అన్నప్పుడు "వాహీక"శబ్దం పక్కన ఉండడంచేతనే "గో"శబ్దం "గోసదృశుడు"అనే అర్థాన్ని బోధిస్తూన్నది. అందుచేత లక్షణ అనేది (మరొక అర్థాన్ని గుర్తించడం అనేది) "గంగా"ది శబ్దార్థాలైన "గంగానది" మొదలైన వాటిలోనే ఉన్నది కాని, శబ్దంలో లేదు. అర్థంలో ఉన్న లాక్షణికత్వాన్ని శబ్దానికి ఆరోపించారు. అందుచేతనే లక్షణను "అభిధాపుచ్ఛం" (అభిధకు తోక) అని అంటారు. అందుచేత ఒక శబ్దం తన వాచ్యార్థం ఏది ఉందో దాన్నే బోధిస్తుంది; మరొక అర్థం బోధించాలి అంటే నూటికి 90 ప్రదేశాలలో (అనగా నిరూఢలక్షణంలో తప్ప) మరొక శబ్దం పక్కన ఉండాలి. అందుచేతనే కొందరు శాస్త్రకారులు లక్షణను స్వతంత్ర వృత్తిగా అంగీకరించలేదు.

**32.** లక్షణవిషయమే ఇలా ఉన్నప్పుడు ఇంక వ్యంజన మాట చెప్పనే అక్కర్లేదు. ఒక శబ్దం ఒక వాక్యంలో ఉన్నప్పుడే, కొన్ని పరిస్థితులలోనే, వ్యంజనావ్యాపారంచేత మరొక అర్థాన్ని బోధిస్తుంది. అందుచేతనే వ్యంజనావృత్తిని

ఒక వృత్తిగా అంగీకరించాలా అంగీకరించ నవసరం లేదా అని ధ్వనివాదులకూ ధ్వన్యభావవాదులకూ మధ్య వివాదం. ఒక వాక్యం విన్న వెంటనే దాని వాచ్యార్థం తెలిసిన తరవాత దానికంటె భిన్నమైన మరొక అర్థమో, లేదా కొన్ని అర్థాలో శ్రోతకు స్ఫురిస్తాయి అనే విషయం అందరూ అంగీకరిస్తారు. అయితే ఆ విధంగా ఆ అర్థం స్ఫురించడానికి కారణం శబ్దంలో ఉన్న వ్యంజనావృత్తి అని ఆనంద వర్ధనాదులు అంటారు; అనుమానాదులచేత పని జరిగిపోతూండగా మళ్ళీ ఈ క్రొత్త వృత్తి ఎందు కని ధ్వన్యభావవాదు లంటారు. ఈ విషయం మున్ముందు మళ్ళీ పరిశీలిద్దాం.

**33**. తృతీయోల్లాసం :- వ్యంజకత్వం అనేది కేవలం శబ్దంలోనే కాదు; వాచ్యార్థ–లక్ష్యార్థ–వ్యంగ్యార్థాలలో కూడా ఉంటుంది అని ద్వితీయోల్లాసంలో ప్రతిపాదించిన విషయాన్నే మమ్మటుడు తృతీయోల్లాసంలో మళ్ళీ మరికొన్ని అంశాలు కూడా చేర్చి సోదాహరణంగా విశదీకరించాడు.

**34**. చతుర్థోల్లాసం :- ఈ ఉల్లాసంలో ధ్వనిభేదాలు, రసభావాదిస్వరూపం ప్రతిపాదించబడ్డాయి. భట్టలోల్లట-భట్టశంకుక-భట్టనాయకుల మతాలు విశదీకరించిన పిమ్మట అభినవగుప్తుని మతం సిద్ధాంతంగా ప్రతిపాదించబడింది.

**35**. పంచమోల్లాసం :- ఈ ఉల్లాసంలో ఎనిమిది గుణీభూతధ్వనిభేదాలు సోదాహరణంగా ప్రతిపాదించబడ్డాయి. ధ్వని-గుణీభూతధ్వనిభేదాల పరస్పర సంసృష్టిసంకరాలచేత ఏర్పడే అనేకభేదాలు పరిగణించిన పిమ్మట "ధ్వనిని అంగీకరించవలసిన పని లేదు" (వ్యంజనావృత్తిని స్వతంత్రవృత్తిగా అంగీకరించ వలసిన అవశ్యకత లేదు) అనే మీమాంసకనైయాయికాదుల మతం ఖండించ బడింది.

**36**. షష్ఠోల్లాసం :- అత్యల్పప్రమాణం గల ఈ ఉల్లాసంలో శబ్దార్థ చిత్రాలు సోదాహరణంగా నిరూపించబడ్డాయి.

**37**. సప్తమోల్లాసం :- కావ్యప్రకాశలోని దశమోల్లాసం అన్ని ఉల్లాసా లకన్నా చాలా పెద్దది. ప్రమాణంవిషయంలో దాని తరవాత చెప్పదగినది సప్త మోల్లాసం. ఈ ఉల్లాసంలో పద-వాక్య-అర్థ దోషాదులు విస్తృతంగా, సోదాహర ణంగా చెప్పబడ్డాయి. ప్రసక్తానుప్రసక్తంగా యచ్ఛబ్దతచ్ఛబ్దాల ప్రయోగం మొద

లైన విషయాలు కూడా ప్రతిపాదించబడ్డాయి. ఈ దోషప్రకరణం చదివినవారికి ఎవరికైనా కవిత్వం వ్రాయాలంటే భయం కలుగుతుంది. ఎలా వ్రాసినా ఏదో ఒక దోషం కనబడుతూనే ఉంటుంది.

**38.** అష్టమోల్లాసం :- ఈ ఉల్లాసంలో కావ్యగుణాల నిరూపణం చేయబడింది. కావ్యగుణాల ఇతిహాసం చాలా ప్రాచీనమైనది. భరతుడు నాట్యశాస్త్రంలో (xvi-96) పది గుణాలు పేర్కొన్నాడు. గుణాలకి అలంకారాలకి ఉన్న భేదాన్ని గూర్చి భరతుడు ఏమీ చెప్పలేదు. అర్థగుణాలు, శబ్దగుణాలు అనే భేదం కూడా చెప్పలేదు. అయితే ఆత డిచ్చిన లక్షణాలను పట్టి కొన్ని శబ్దగుణా లనీ, కొన్ని అర్థగుణా లనీ, కొన్ని ఉభయగుణా లనీ కనబడుతుంది. వీటికి సాధారణలక్షణం చెపుతూ భరతుడు గుణాలు దోషాభావరూపా లని అంటాడు.

**39.** భరతుని తరవాత భామహుడు కావ్యాలంకారంలో (II. 1-3) మాధుర్యం, ప్రసాదం, ఓజస్సు అని మూడు గుణాలు మాత్రమే పేర్కొన్నాడు. కాని లక్షణలక్ష్యాలద్వారా వాటి విస్తృతవివేచనం ఏదీ చేయకపోవడంచేత గుణాల సంఖ్యాస్వరూపాదుల విషయంలో భామహుని అభిప్రాయం ఏమో ఇదమిత్థంగా చెప్పడం కష్టం.

**40.** భరతుడు చెప్పిన పది గుణాలనే దండి కావ్యాదర్శంలో (1-41) చెప్పి ఉన్నాడు. ఈ గుణాలను పట్టి వైదర్భ-గౌడమార్గాల (రీతుల) భేదం ఏర్పడుతుం దని దండి ప్రతిపాదించాడు. ఈ పది గుణాలలో శ్లేష, సమత, సుకుమారత, ఓజస్సు అనే నాలుగూ శబ్దగుణాలు, ప్రసాదం, అర్థవ్యక్తి, ఉదారత, కాంతి, సమాధి అనేవి అర్థగుణాలు, మాధుర్యం ఉభయగుణం అన్నట్లు దండి ఇచ్చిన లక్షణోదాహరణలను పట్టి ఊహించవలసి ఉంటుంది. దండి కూడా గుణాలకీ, అలంకారాలకీ ఉన్న భేదాన్ని విశదీకరించలేదు.

**41.** కావ్యంలో గుణాలకి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చిన అలంకారికుడు వామనుడు. ఇతడు గుణాల సంఖ్యను పదినుండి ఇరవైకి పెంచాడు. శ్లేష మొదలైన పది శబ్దగుణాలు, అవే పేర్లతో పది అర్థగుణాలు అంగీకరించాడు. ప్రప్రథమంగా గుణాలకీ అలంకారాలకీ మధ్య ఉన్న భేదాన్ని విశదీకరించిన అలంకారికుడు వామనుడే అన్నట్లు కనబడుతుంది. గుణాలు కావ్యంలో సౌందర్యాన్ని

పుట్టిస్తాయనీ, ఆ సౌందర్యాన్ని అలంకారాలు పెంపొందిస్తాయనీ ఇతడు ప్రతిపాదించాడు.

**42.** దోషాలు గుణాభావరూపా లని వామనుడు అంటాడు, (II.1.1) గుణాలు దోషాభావరూపా లని మమ్మటాదులు ప్రతిపాదించారు. ఒక్క విషయం గమనించవలసి ఉంది. ఒక వస్తువు ఇతర వస్త్వభావరూపం, అనగా ఇతర వస్తు భిన్నం, కావచ్చు, ఉదాహరణకి అశ్వం గజాభావరూపం అనీ, గజం అశ్వాభావ రూపం అనీ చెప్పవచ్చు. అయినా అశ్వంలో కొన్ని విశేషలక్షణాలు ఉంటాయి. గజంలో కూడా కొన్ని విశేషలక్షణాలు ఉంటాయి. అందుచేత అశ్వం అనగా ఏమిటి అని ప్రశ్నించినప్పుడు గజభిన్నం అశ్వం అనీ, గజం అనగా అశ్వభిన్నం అనీ చెప్పినంతమాత్రంచేత సరిపోదు. వాటి వాటి విశేష లక్షణాలు చెప్పాలి. అందుచేతనే పండితరాయలు ఒక చోట (ర.గం. పే.521) "మూర్ఖత్వం దోషం: విద్వన్మూర్ఖత్వాభావరూపం కావచ్చును; అయినా దానికి కొన్ని విశిష్టలక్షణాలు ఉన్నాయి. వాటిని చెప్పవలసి ఉంటుంది." అని ప్రసంగా తరంలో అంటాడు. అదే విధంగా గుణాభావరూపాలు దోషాలని చెప్పి దోషాలనూ, దోషాభావరూపాలు గుణాలు అని చెప్పి గుణాలను కొట్టి పారవేయడానికి వీలులేదు. అందుచేతనే "దోషాలు గుణాభావరూపాలైనా వాటికి కొన్ని లక్షణాలు ఉన్నాయి కాబట్టి అవి చెప్పాలి" అని దోషప్రకరణ ప్రారంభంలో వామనుడు అన్నాడు. (కా.అ సూ. పే 14).

**43.** వామనుని తరవాత కూడా భోజుడు మొదలైనవాళ్ళు గుణాల సంఖ్యను బాగా పెంచారు. భోజుడు ఇరవైనాలుగు శబ్దగుణాలు, ఇరవైనాలుగు అర్థగుణాలు అంగీకరించాడు. (వి. రాఘవన్ గారి శృంగార ప్రకాశ. పే. 304). ఇవి కాక వైశేషికగుణా లనే పేరుతో మరి కొన్ని గుణాలు కూడా ప్రతిపాదించాడు. (పే. 302).

**44.** విద్యానాథుడు భోజమతానుయాయి అని కుమారస్వామి చెప్పినా (రత్నాపణం. 274) అతడు ఇరవైనాలుగు శబ్దగుణాలు మాత్రమే అంగీకరించాడు. "గుణాలు ప్రధానంగా పదసంఘటనాధర్మాలు. అందుచేత శబ్దగుణాలు మాత్రమే అంగీకరించాలి కాని అర్థగుణాలు కూడా అంగీకరించడం అయుక్తం" అని గుణప్రకరణాంతంలో విద్యానాథుడు తన అభిప్రాయం వ్యక్తీకరించాడు (ప్ర. రు. పే. 285).

**45**. గుణాల విషయంలో వామనుని మాటలలో కొంత పూర్వాపరవిరోధం కనబడుతుంది. "రీతి కావ్యానికి ఆత్మ" అని చెప్పి "రీతి అనగా విశిష్టమైన పద రచన" అని రీతికి లక్షణం చెప్పాడు. పదరచనలోని విశేషం ఏమిటి అనగా గుణాలు ఉండడమే, "విశేషో గుణాత్మా" (1-1-8) అని వివరించాడు. దీనిని పట్టి గుణాలు పదరచనకు సంబంధించినవి అని చెప్పినట్లయింది. తరవాత అర్థ గుణాలను కూడా అంగీకరిస్తున్నా డంటే వాటికి గుణత్వం గౌణ మని ఏదో విధంగా సమర్థించుకోవాలి.

**46**. గుణాలకీ అలంకారాలకీ ఉన్న భేదాన్ని వామనుడు అంగీకరించిన పద్ధతిలో విద్యానాథుడు అంగీకరించలేదు. గుణాలు శబ్దాల కూర్పును (సంఘటనను) ఆశ్రయించి ఉంటాయి. అలంకారాలు (శబ్దాలంకారాలు) శబ్దాలను ఆశ్రయించి ఉంటాయి అని విద్యానాథుడు ప్రాచీనుల మతాన్ని అనుసరించి గుణాలంకారాల పరస్పరభేదాన్ని ప్రతిపాదించాడు. అతడు అర్థగుణాలను అంగీకరించలేదు గాన అర్థగుణాలు అర్థసంఘటనాశ్రితాలు అని చెప్పలేదు. అయితే లోచనంలో అభినవగుప్తుడు ప్రాచీనుల అభిప్రాయం ప్రకారం శబ్దగుణాలకి ఆశ్రయం శబ్దసంఘటన, అర్థగుణాలకి ఆశ్రయం అర్థసంఘటన అని చెప్పి ఉన్నాడు. ఈ విధంగా "రసానికి శ్రవ్యకావ్యాలలో కూడా ప్రాధాన్యం ఉన్నది" అని అంగీకరించడానికి పూర్వమే ప్రాచీనాలంకారికులు గుణాలను అంగీకరించి అవి శబ్దార్థాలను లేదా వాటి సంఘటనను ఆశ్రయించి ఉంటా యని ప్రతిపాదించారు.

**47**. అయితే కావ్యంలో ధ్వనికి, అందులోను రసధ్వనికి, ప్రాధాన్యం అంగీకరించిన ధ్వనికారాదులు గుణాలు రసధర్మాలని ప్రతిపాదిస్తూ వాటిసంఖ్యను తగ్గించి మాధుర్యం, ఓజస్సు, ప్రసాదం అనే మూడు గుణాలను మాత్రమే స్వీకరించారు. ఆనందవర్ధన-అభినవగుప్తులు గుణాలు రసాదుల ధర్మాలు ('ఆది' శబ్దం చేత భావరసాభాసాదులకు కూడా గ్రహణం) అని అంగీకరిస్తే మమ్మటుడు ఇవి రసధర్మాలు మాత్రమే, (భావాదుల ధర్మాలు కావు) అని అంటాడు. మాధుర్య-ఓజః ప్రసాదాలు సహృదయుని చిత్తంలో వరసగా ద్రుతి, విస్తృతి, వ్యాప్తులను కలిగిస్తాయని వీరి అభిప్రాయం.

**48**. ఆ యా రసాలు సహృదయుని మనస్సులో వికాస-విస్తార-క్షోభ-

విశేషాలను కలిగిస్తాయి అని ధనంజయుడు దశరూపకంలో ప్రతిపాదించాడు. ఇతడు ఇలా చెప్పడానికి నాట్యశాస్త్రంలో ఏదైనా ఆధారం ఉండి ఉండాలి. భరతుడు శృంగార-వీర-బీభత్స-రౌద్రరసాలను ప్రకృతిరసాలనీ మిగిలిన హాస్యాదులైన రసాలు వాటినుండి జనించాయనీ ప్రతిపాదించాడు. బహుశా ప్రకృతిరసాలని చెప్పిన ఆ నాల్గింటివల్లా మనస్సులో కలిగే వికారాలను ఊహించుకొని కూడా ధనంజయుడు వికాసాదులను చెప్పి ఉండవచ్చు, గుణరసధర్మత్వవాదులుకూడా తమ వక్కాకలో రసాలలో మూడు గుణాలు ఉంటా యనీ, అవి ద్రుత్యాదుల్ని కలిగిస్తాయనీ ప్రతిపాదించి ఉంటారు.

**49**. ఆ యా రసాలవల్ల చిత్తంలో కలిగే వికారాలను పట్టి పీరు ఏవో కొన్ని గుణాలనో, ధర్మాలనో కల్పించుకోవడంలో ఎవరికీ అభ్యంతరం ఉండదు. కాని ప్రాచీనాలంకారికులు శబ్దాశ్రితాలుగానో అర్థాశ్రితాలుగానో ఉభయాశ్రితాలుగానో అంగీకరించి సయుక్తికంగా సోదాహరణంగా ప్రతిపాదించిన గుణాలను పూర్తిగా నిరాకరించి, వాటి స్థానంలో తను సిద్ధాంతం ప్రకారం మూడు గుణాలు కల్పించడం ఎంతవరకు సమంజసం అనేది ఆలోచించవలసిన విషయం. అందుచేతనే పండితరాయలు ఈ మూడు గుణాలూ రసధర్మాలనే వీరి వాదాన్ని అంగీకరించలేదు. ఈ గుణత్రయాన్ని అతడు పూర్తిగా నిరాకరించలేదు గాని ఇవి కొన్ని చోట్ల శబ్ద-తత్సంఘటనాద్యాశ్రితాలు కూడా అని అంగీకరించాలి అని సయుక్తికంగా ప్రతిపాదించాడు. ఈ మూడు గుణాల మాట ఎలా ఉన్నా వామనాదులు శబ్దార్థగతాలుగా అంగీకరించిన గుణాలన్నీ కూడా అందరూ అంగీకరించాలి అని సూచిస్తూ వాటిని సవిస్తరంగా ప్రతిపాదించాడు. (చూ. **The Contribution of Panditaraja to Sanskrit Poetics, III Chapter,**)

**50**. నవమోల్లాసం : ఈ ఉల్లాసంలో వక్రోక్తి, అనుప్రాస, యమకం, శ్లేష, చిత్రం, పునరుక్తవదాభాస అనే ఆరు శబ్దాలంకారాలు వాటి అవాంతర భేదాలు సోదాహరణంగా ప్రతిపాదింపబడ్డాయి.

**51**. దశమోల్లాసం : ఈ ఉల్లాసంలో ౬౧ అర్థాలంకారాలు, సంసృష్టి సంకరాలు అనేకములైన అవాంతరభేదాలతో సోదాహరణంగా ప్రతిపాదించబడ్డాయి. ఆ యా అలంకారాలలోని దోషాలు దోషప్రకరణంలో చెప్పిన దోషాల

లోనే అంతర్గతాలవుతాయి అనే విషయం సయుక్తికంగా ఈ ఉల్లాసం వివర ప్రతిపాదించబడింది.

**52.** ఈ విధంగా మమ్మటుడు అలంకారశాస్త్రంలో ధ్వని ప్రస్థానానికి సంబంధించిన అన్ని విషయాలూ ఒక్క చోట చేర్చి తత్ప్రథమంగా ఒక ప్రామాణికమైన గ్రంథాన్ని మనకు అందజేశాడు. ఆనందవర్ధన-అభినవగుప్తుల నుంచే కాకుండ ఎందరో ఇతర ప్రాచీనాలంకారికులనుంచి కూడా ఎన్నో విషయాలు గ్రహించాడు. ధ్వనిసిద్ధాంతాన్ని ఖండిస్తూ మహిమభట్టు వ్యక్తివివేకం అనే గ్రంథం రచించాడు. అతడు దానిలో ప్రసంగవశంచేత దోషాలను ఉదాహరణ పూర్వకంగా ప్రతిపాదించాడు. మమ్మటుడు ఆ దోష ప్రకరణం నుంచి ఎన్నో విషయాలు, యత్తచ్ఛబ్దాల ప్రయోగానికి సంబంధించిన చర్చతో సహా, గ్రహించాడు. శబ్దాలంకారాల నిరూపణంలో రుద్రటుని కావ్యాలంకారం నుంచి ఎన్నో ఉదాహరణలు తీసికొన్నాడు. ఉద్భటుని కావ్యాలంకారసంగ్రహంనుంచీ, ఇందు రాజు రచించిన దాని వ్యాఖ్యానంనుంచీ ఉపమావిభేదాదుల నిరూపణంలో కొన్ని విషయాలు గ్రహించాడు. మమ్మటుని వైశిష్ట్యం అంతా విషయాలను ఒక నియమితమైన పద్ధతిలో సమకూర్చడంలో ఉంది. అయితే విషయప్రతిపాదనలో, మమ్మటుని రచనలో స్పష్టత తక్కువ. ఈయనకు మాటలు చాలా తక్కువ వాడడం అలవాటు. విషయప్రతిపాదనపద్ధతి ఆనందవర్ధనాదుల పద్ధతి వల ఉండదు. వృత్తి కూడా సూత్రాల లాగ ఉంటుంది. దీనిమీద ఇన్ని వ్యాఖ్యానాలు బయలుదేరడానికి ఈ అస్పష్టత కూడా ఒక కారణం. ఇంత సర్వాంగసంపూర్ణమైన గ్రంథం ఏదీ అంతకు ముందు రాలేదు; అందుచేత దీనిని వదలడానికి వీలు లేదు; అయితే అంత సులభంగా అర్థంకాదు. ఆకారణంచేతనే చాలామంది వ్యాఖ్యానాలు వ్రాశారు. ఈ వ్యాఖ్యాత లందరూ భారతదేశంలోని వివిధ ప్రాంతాలకి చెందినవారు. ఇది దీని సార్వత్రికప్రచారానికి తార్కాణం.

**53** మమ్మటుడు పరికరాలంకారం వరకే కావ్యప్రకాశ రచించాడనీ మిగిలిన భాగం అల్లటసూరి పూరించాడనీ చాలమంది వ్యాఖ్యాతలు చెప్పి ఉన్నారు.

"కృతః శ్రీమమ్మటాచార్యవర్యైః పరికరావధిః,
ప్రబన్ధః పూరితః శేషో విధాయాల్లటసూరిణా".

అని 'నిదర్శన' అనే వ్యాఖ్యానం రచించిన ఆనందకవి పరికరాలంకారఘట్టంలో వ్రాశాడు.

**54.** **ధ్వనిసిద్ధాంతం:-** అలంకారశాస్త్రానికి సంబంధించిన సిద్ధాంతాలలో ధ్వనిసిద్ధాంతం చాలా ప్రధానమైన దని ఈనాడు అందరూ అంగీకరిస్తూన్న విషయం. దీనిని గూర్చి కొంత పరిశీలించవలసి ఉంది. మనం వెనుక 30,31,32 అనుచ్ఛేదాలలో (పేరాలలో) చూచినట్లు చాలామంది శాస్త్రవేత్తలు వ్యంజనను ఒక స్వతంత్రవృత్తిగా అంగీకరించరు. ఒక శబ్దం ఒక అర్థాన్ని మాత్రమే బోధిస్తుంది. అది రెండు అర్థాలను బోధిస్తున్నట్లయితే అది ఒక శబ్దంవలె కనబడినా ఒక శబ్దం కాదు. మొదటి అర్థాన్ని బోధించే శబ్దం వేరు రెండవ అర్థాన్ని బోధించే శబ్దం వేరు. ఉదాహరణకి 'భవ' "భవాని" అనే పదాలు ఉన్నాయి. 'భవ' శబ్ద సంబోధన ప్రథమైకవచనంగా ప్రయోగించినప్పుడు 'భవ' అనగా "ఓ! శివుడా!" అని అర్థం. దానినే భూధాతులో మధ్యమపురుషైకవచనంగా ప్రయోగిస్తే దానికి 'అవుము' అని అర్థం. అట్లే 'భవాని' అనేదాన్ని సుబంతంగా గ్రహిస్తే "ఓ! పార్వతీ!" అనీ, తిఙంతంగా (భూధాతులోదుత్తమపురుషైకవచనం) గ్రహిస్తే "అగుదునుగాక" అని అర్థం. అందుచేత అర్థభేదాన్ని పట్టి శబ్దభేదం అంగీకరించాలి.

**55.** "గఙ్గాయాం ఘోషః" ఇత్యాదులలో కూడా 'గఙ్గా' శబ్దానికి నది అని మాత్రమే అర్థం. గంగాతీరం అనే అర్థం చెప్పుకున్నాం అంటే 'గంగానది' అనే అర్థంలోనే మార్పుచేశా మన్నమాట. అందుచేత లక్షణావృత్తి అనేది గంగానదీ రూపార్థంలోనే ఉన్నది గాని 'గఙ్గా' శబ్దంలో లేదు. అర్థంలో ఉన్నదానినే శబ్దంలో ఉన్నట్లు ఆరోపించి 'గఙ్గా' శబ్దంలో లక్షణావృత్తి ఉన్నది అని అంటున్నాం. ఈ విషయం మమ్మటుడు స్పష్టీకరించి ఉన్నాడు. (చూ. 'ముఖ్యార్థబాధే' ఇత్యాది, 9వ కారిక). రెండవ కక్ష్యకు చెందిన లక్షణావృత్తియే అర్థగతం అయినప్పుడు తృతీయకక్ష్యకు, కొన్ని చోట్ల చతుర్థకక్ష్యకూ చేరిన వ్యంజనావృత్తి శబ్దగతం అనడం ఎంతవరకూ సమంజసమో ఆలోచించాలి. కొన్ని నిరూఢలక్షణాస్థలాలలో ("అనులోమ", "ప్రతిలోమ", "అనుకూల", "ప్రతికూల" "కుశల" ఇత్యాదులలో) వాచ్యార్థజ్ఞానతద్బాధాదులు లేకపోయినా లాక్షణికార్థప్రతీతి కలగవచ్చు. నిజానికి అలాంటివి రూఢపదాలవంటివే. కాని వ్యంజనాస్థలా లన్నింటిలోనూ ముందుగా వాచ్యార్థజ్ఞానం అత్యావశ్యకం. అందుచేతనే "అర్థోఽపి వ్యఞ్జకస్తత్ర సహకారితయా మతః" (కా. ప్ర 20వ కారిక) అని మమ్మటు డన్నాడు. అదే విధంగా "సర్వేషాం ప్రాయశోఽర్థానామర్థవ్యఞ్జకతోచ్యతే" (కా.ప్ర.7వ కారిక) అని వాచ్య-లక్ష్య-వ్యంగ్యా లనే మూడు విధాలైన అర్థాలూ కూడా అర్థాంతరవ్యంజకాలు అవు

తాయి అని ప్రతిపాదించబడింది. ఈ విషయా లన్నీ పరిశీలించగా - 'వ్యంజనా వృత్తి' అనే ఒక వృత్తిని అంగీకరించడం అనేది అవసరమైతే దానిని అర్థవృత్తి గానే అంగీకరించాలి గాని శబ్దవృత్తిగా అంగీకరించడానికి వీలులేదు అని తేలుతుంది. ఒక పదంలో లక్షణను కాని వ్యంజనను కాని అంగీకరించాలి అంటే అనివార్యం పక్క ఒకటి రెండు ఇతర పదాలు ఉన్నప్పుడు మాత్రమే కుదురుతుంది అని వెనుక చూచి ఉన్నాం. (చూ.30,31,32 అనుచ్ఛేదాలు). దీనినిబట్టి వాచ్యార్థజ్ఞానం కలిగిన తరవాతనే వ్యంగ్యార్థప్రతీతి కలుగుతున్నదని నిశ్చితంగా చెప్పవలసి ఉంది. అందుచేత వ్యంజన అర్థవృత్తిమాత్రమే అవుతుంది కాని శబ్దవృత్తి ఎలా అవుతుంది?

**56**. మరొక విషయం ఏమనగా-ఒక వృత్తిని శబ్దవృత్తిగా అంగీకరించా లంటే అది ప్రత్యక్షంగానో, ఔపచారికంగానో కేవలం శబ్దంలో మాత్రమే ఉండాలి గాని మరెక్కడా ఉండగూడదు. ఇతరత్రా కూడా ఉన్నట్లయితే దానిని శబ్దవృత్తిగా పరిగణించడం యుక్తం కాదు. 'అభిధ' 'లక్షణ' అనే వృత్తులలో అభిధ శబ్దంలో మాత్రమే ఉంది. లక్షణ వాస్తవంలో అర్థగతమే అయినా ఔప చారికంగా శబ్దగతం అని "అభ్యుపగమ్యవాదం"గా అంగీకరించాం. కాని 'వ్యంజన' అనేది శబ్దార్థభిన్నమైనవాటిలో కూడ ఉన్న దని ధ్వనివాదు లందరూ అంగీకరిస్తు న్నారు. "న చ (ధ్వననమ్) ఉభయానుసార్యేవ, అవాచకవర్ణానుసారేణాపి తస్య దృష్టేః. న చ శబ్దానుసార్యేవ; అశబ్దాత్మకనేత్రత్రిభాగావలోకనాదిగతత్వేనాపి తస్య ప్రసిద్ధేః" (కావ్యప్రకాశ. పంచమోల్లాసాంతం) అని మమ్మటుడు చెప్పి నాడు కదా. భరతుని రససిద్ధాంతం ప్రధానంగా రూపకాలను దృష్టిలో ఉంచుకొని ప్రతిపాదించిన దనే విషయం నిర్వివాదం. విభావానుభావవ్యభిచారులు రసవ్యం జకా లని కదా ధ్వనిసిద్ధాంతం. అనగా నాయికా-నాయక-ఉద్యానాదులైన విభావాల లోను, వాళ్ళ చేష్టాదులలోను కూడా 'వ్యంజన'ఉన్న దని అర్థం. అప్పు డది శబ్ద వృత్తి ఎలా అవుతుంది ?

**57**. ఒక వాక్యం విన్న వెంటనే దాని వాచ్యార్థం తెలిసినతరవాత ఆ వాచ్యా ర్థానికి సంబంధించినవీ, సంబంధించనివీ, ఎన్నో విషయాలు శ్రోత మనస్సులో స్ఫురించవచ్చు. ఒక అత్యున్నతాధికారి ఒక గంట తరవాత తనను కలుసుకొన వలసినదిగా తన క్రింది అధికారికి కబురు పంపుతాడు. లేదా కొత్తగా ముఖ్యమంత్రి

సిన, వక్త చెప్పదలచిన అర్థం పూర్తి అవడానికి మరొక అర్థాన్ని కూడా బోధి స్తాయి అని వారి అభిప్రాయం. వ్యాజస్తుత్యలంకారఘట్టంలో ఉద్భటుడు-

> "శబ్దశక్తిస్వభావేన యత్ర నిన్దేవ గమ్యతే,
> వస్తుతస్తు స్తుతిః శ్రేష్ఠా వ్యాజస్తుతిరసౌ మతా"

అని వ్యాజస్తుతికి లక్షణం చెప్పినాడు. దీని వ్యాఖ్యలో ఇందురాజు- "యత్ర శబ్దానామభిధాయకానాం యా శక్తిః అర్థప్రత్యాయనౌన్ముఖ్యం తస్యాః యః స్వభావః నియతార్థనిష్ఠత్వాత్మకః తేన నిన్దా గమ్యతే ఇవ, స త్వసౌ నిన్దైవ పదార్థపర్యాలోచనసామర్థ్యోత్థాయాం స్తుతౌ వాక్యార్థీభూతాయామవాన్తరవాక్యార్థత్వాత్" అని దీని భావం విశదీకరించాడు. అనగా వాక్యం వినగానే స్ఫురించేది నిందయే. అయితే పదార్థపర్యాలోచన చేయగా నింద కుదరక పోవడంచేత స్తుతి గమ్యం అవుతుంది అని దీని భావం. "పదార్థపర్యాలోచనసామర్థ్యం" అనగా తాత్పర్యం అని అర్థం. స్థూలంగా నిందారూపార్థం బోధించబడినా వక్తతాత్పర్యం తెలుసుకొని స్తుతిరూపార్థమే చెప్పుకుంటాం అని భావం. శబ్దాల అర్థప్రత్యాయనౌన్ముఖత్వం అంతవరకు ఉంటుంది. దీనినిపట్టి వాక్యార్థనిర్ణయంలో తాత్పర్యానికి ఉన్న ప్రాధాన్యం స్పష్టం అవుతుంది. "సోఽయమిషోరివ దీర్ఘదీర్ఘతరో వ్యాపారః" అన్న అభిప్రాయం వంటిది ఈ రచయితల అభిప్రాయం అని తెలుస్తుంది. అందుచేత తాత్పర్యాదిసహకృతమైన అభిధయే అర్థాంతరాన్ని బోధిస్తుం దని చెప్పవచ్చు. లక్షణాస్థలంలో కూడా తాత్పర్యానికి ఉన్న ప్రాధాన్యం ప్రసిద్ధమే. అందుచేతనే లక్షణ తాత్పర్యానుపపత్తిమూలకం అంటారు. "గంగాయాం ఘోషః" అన్నప్పుడు వక్తయొక్క వివక్షను పట్టి 'గంగా' శబ్దానికి లక్షణచేత గంగాతీరం అని అర్థం చెప్పుకున్నాం. అతని వివక్ష మరొక విధంగా ఉంటే 'ఘోష' శబ్దానికి లక్షణచేత 'తిమింగిలం'అని లేదా 'తొట్టిపడవ'అని అర్థం చెప్పుకుంటే గంగా శబ్దంలో లక్షణ ఉండదు.

**60.** "తృణాన్యఙ్కురయామాస విపక్షనృపసద్మసు" ఇత్యాది స్థలాలలో అన్యార్థప్రతీతికి ఒక విధమైన హేతుహేతుమద్భావజ్ఞానం ఉపకరిస్తుంది. కొన్ని చోట్ల అనుమానం ఉపకరిస్తుంది. ఈ అనుమానం అనుమానప్రమాణంవలె నిర్దుష్ట హేతుజన్యమైనది కావలసిన పని లేదు. అనుమానాలంకారంలో ఎలాంటి అనుమానత్వం ఉంటుందో అలాంటిది ఉంటే చాలు ఈ అనుమానంలో. అనగా వాచ్యార్థం

శ్రోత మనస్సులో అనేక భావాలను రేకెత్తిస్తుంది. ఎవరి మనస్సులో ఎలాంటి భావాలు పుడతాయో ఊహించడానికి శక్యం కాదు. "వక్తృబోద్ధవ్య కాకూనామ్" (కావ్యప్రకాశ III 21) అని ధ్వనివాదులు చెప్పిన విషయమే కదా. ఈ భావాలను కార్యకారణభావాలు చూపి సమర్థించడం కష్టం. వాటిలో కొన్నింటికి వ్యంగ్యార్థాలని పేరు పెట్టి వాటిని 'వ్యంజన' అనే శబ్దవ్యాపారం బోధిస్తుంది అని చెప్పినంతమాత్రాన ఉపపత్తి చూపినట్లు అవదు. అందుచేత శబ్దానికి అభిధ అనేది ఒక్కటే ప్రధానమైన వృత్తి అనీ, లక్షణావృత్తి లాక్షణిక వృత్తిమాత్రమే అనీ, వాచ్యార్థమే వ్యంగ్యార్థాలుగా చెప్పబడే అర్థాలన్నింటికీ మూలమనీ అంగీకరించడం యుక్తం అని తోస్తుంది. అయితే ఈ విషయం విషయనిగ్రహయుక్తప్రవణ దృష్టిగల (open-minded) విమర్శకులు అందరూ పరిశీలించవలసి ఉంది.

61. ఒక్కొక్క కాలంలో కొన్ని అభిప్రాయాలు ప్రచురప్రచారంలోనికి వచ్చేస్తాయి. ఉదాహరణకి వ్యాకరణం అంటే పాణినీయవ్యాకరణమే; అదే వేదాంగం అని ఈనాడు అందరూ అంటూంటారు. పాణినికి పూర్వం ఎందరో వైయాకరణు లుండేవా రనీ ప్రాతిశాఖ్యాదులు ఉన్నాయనీ వీరికి తెలియని విషయం కాదు. పాణినీయులకీ ఇతర వైయాకరణులకీ మధ్య కోలాహలం జరుగుతూండే దని మూడవశతాబ్దికి చెందిన ఒక భాణంవల్ల తెలుస్తున్నది. అయినా పాణినియందున్న గౌరవాతిశయంచేత ఈ విధమైన అభిప్రాయం ప్రబలింది. అదే విధంగా వేదాంతం అనగా శాంకరవేదాంతమే అని చాలామంది అభిప్రాయం. వైదేశికులలో ఈ భావం మొన్న మొన్నటివరకూ అత్యధికంగా ఉండేది. వివేకానందాదుల ద్వారా అది ఇతరదేశాలలో కూడా అత్యధిక ప్రచారం పొందడం దీనికి కారణం. తావన్మాత్రంచేత ద్వైత-విశిష్టాద్వైతాదుల వేదాంతత్వం ప్రతిహతం కాదు కదా? ఆనందవర్ధనుడు సహృదయ శిరోమణి. ఆయన విషయప్రతిపాదనచాతుర్యం చాలా గొప్పది. దానికి తగినట్లు ఆయనకు అభినవగుప్తుని వంటి అత్యుత్తమసమర్థకుడు లభించాడు. అందుచేత ఆయన 'వ్యంజన' అనే శబ్దవృత్తి ఉన్న దనీ, అన్యార్థప్రతీతికి అదే కారణం అనీ స్థాపించిన సిద్ధాంతానికి బహుపండితామోదం లభించింది. ఒక్క మహిమభట్టుని తప్ప పూర్వాపరపర్యాలోచన చేసి ఈ సిద్ధాంతాన్ని గూర్చి ఆలోచించడానికి వీలులేకుండా ముమ్మట జగన్నాథాదులు పతితలను తమ గ్రంథాలచేత ఉక్కిరిబిక్కిరి చేసివేశారు. మిగిలిన వాళ్లందరూ గడ్డలికాప్రవాహన్యాయపతితులే.

**62.** అయితే ధ్వనికి ప్రాధాన్యం ఏమీ లేదా అని ప్రశ్నించవచ్చు. కావ్యంలో ప్రతీయమానార్థంలో ఉండే వైశిష్ట్యాన్ని ఎవరూ కాదనలేరు. కావ్యం లోనేకాదు, దైనందిన వాగ్వ్యవహారంలోకూడా వాచ్యార్థప్రధానవాక్యాల ప్రయోగం కంటె లాక్షణిక–వ్యంజక పదాలప్రయోగం, అనగా పదాలను స్థూలమైన అర్థంతో పాటు మరొక అర్థం కూడా బోధించేటట్లు ప్రయోగించడం, ఎంత మనోహరంగా ఉంటుందో సహృదయవిదితమే. మా కున్న విప్రతిపత్తి అల్లా 'వ్యంజన' అనే శబ్దవృత్తిని అంగీకరించడం విషయంలోనే. ఆనందవర్ధనుడు చూపిన ధ్వని భేదాలు వాటి ఉదాహరణాదులు ఆయనకున్న సహృదయశిరోమణిత్వానికి నిదర్శనాలు. ఇతరసహృదయులకు మార్గదర్శకాలు. ఇవన్నీ కూడా వాచ్యార్థసంనివేశ విశేషాలైన అర్థాలంకారభేదాల వలె వ్యంగ్యార్థసంనివేశ విశేషాలుగా మనోహరంగా ఉంటాయి అని అందరూ అంగీకరించవలసిందే. అలవాటు అయిపోవడంచేత వ్యంగ్యార్థం అని అంటున్నా ఇవన్నీ వాచ్యార్థజ్ఞానానంతరం కలిగే వివిధభావాల విచిత్రరూపాలే. అనగా ఈ ప్రతీయమానార్థా లన్నీ శ్రోతృభావనావిశేషాన్నిపట్టి వాచ్యార్థజ్ఞానజన్యాలే. వ్యంజన అనే స్వతంత్రవృత్తిని అంగీకరించవలసిన పని లేదు. ఈ వ్యంజకత్వం అర్థంలోనే ఉంది కాని శబ్దంలో లేదు. ఎక్కడేనా ఉంటే అని "ధిక్" "ఛీ" "అయ్యో" ఇత్యాది పదాలలో ఉన్న వ్యంజకత్వం వంటిదే. శ్లేషాలంకారఘట్టంలో (నవమోల్లాసంలో) "శబ్దశ్లేష ఇతి చోచ్యతే అర్థాలంకార మధ్యే చ లక్ష్యతే ఇతి కోఽయం నయః" అని మమ్మటుడు ప్రశ్నించినట్లు "వ్యఞ్జకతా వాచ్య - లక్ష్య - వ్యంగ్యార్థగతా ఇతి చోచ్యతే, వ్యఞ్జనాయాశ్చ శబ్ద వృత్తితా అఙ్గీక్రియతే ఇతి కోఽయం నయః" అని మనం ఆయనను ప్రశ్నించ వచ్చును.

**63.** ఆనందవర్ధనుడే అనేక ధ్వనిభేదాలను కల్పించాడు. అవి చాలక తరవాతివాళ్ళు ఇంకా ఎన్నో అవాంతరభేదాలు, వాటి సంయోగాదులవల్ల వందల కొలది, వేలకొలది భేదాలు కల్పించారు. ఇవన్నీ గణకమస్తిష్కసముత్తేజకాలు మాత్రమే. ప్రాయోగికప్రయోజనశూన్యాలవడంచేత సహృదయహృదయోద్వేజకాలుగానే ఉంటాయి. అందుచేతనే పండితరాయలు ఆ భేదాల అన్నింటి జోలికీ వెళ్ళక కేవలం 26 భేదాలు మాత్రమే పేర్కొన్నాడు.

**64.** ఏదైనా ఒక సిద్ధాంతానికి లోకాదరం కలిగేటప్పటికి విపరీతమైన

పట్టుదలతో దాని దురపయోగం చేసేవాళ్ళు కూడా బయలుదేరుతారు. ఆ యా కావ్యనాటకాదుల వ్యాఖ్యాతల చేతులలో పడి ధ్వని సిద్ధాంతానికి ఆ అవస్థయే పట్టింది. కొందరు వ్యాఖ్యాతలు "ఇక్కడ ఈ పదం ఉపయోగించాడు కాబట్టి ఈ ధ్వని, అక్కడ ఆ పదం ఉపయోగించాడు కాబట్టి ఆ ధ్వని" అని అంటూ తమ మనస్సులలో ఉన్న భావా లన్నీ ఆ యా శ్లోకాలలో చొప్పిస్తూ వ్రాసిన వ్యాఖ్యానాలు చూస్తే ఏమనాలో తెలియదు. అయితే ఎంతవరకూ అవసరమో అంతవరకే దీనిని ఉపయోగించే మల్లినాథ - కుమారసోమపీథ్యాదులవంటి వ్యాఖ్యాతలు లేకపోలేదు. వ్యాఖ్యాతల ఈ విజృంభణం సాధారణంగా కావ్యప్రారంభిక శ్లోకాదులలో చూడవచ్చును. ఇలాంటి ఆకాశముష్టిప్రహరణం మన ఆలంకారికులలోనే కాదు; పాశ్చాత్యసాహిత్యవిమర్శకులలోను, వాళ్ళ పద్ధతిని అనుసరించి మన భారతీయ సాహిత్యాలను విమర్శించే కొందరు విమర్శకులలోనూ కూడా కనబడుతుంది. అందుచేతనే షేక్‌స్పియర్ తన నాటకాలు పాఠ్యగ్రంథాలుగా ఉన్న పరీక్షకు కూర్చొని పరీక్షలలో ఉత్తీర్ణుడు కాలేకపోయా డనీ, ఇందుకు తన నాటకాలమీద బ్రాడ్లే వ్రాసిన విమర్శగ్రంథాలు చదవకపోవడమే కారణమనీ చమత్కారంగా అంటూంటారు. వ్యాఖ్యాతలు ఆరోపించే ఈ ధ్వన్యమానార్థాలను కవి స్వప్నంలో కూడా ఊహించి ఉండడు. అయితే ఒక్క విషయం మాత్రం ఒప్పుకోవాలి. తప్పైనా, ఒప్పైనా భారతీయశాస్త్రానుసారం చేసే కావ్యవిమర్శలలో అస్పష్టత్వం ఉండదు.

**65.** ఇంతకూ సంపిండితార్థం ఏమనగా- ప్రతీయమానార్థం అనేది ఉన్నది అనే విషయంలో ఎవరికీ విప్రతిపత్తి లేదు. దానిలో వాచ్యార్థం కంటె అధికమైన సౌందర్యం ఉండడంచేత సౌందర్యప్రధానాలైన కావ్యాలలో దానికి ప్రాధాన్యం ఉంది. అయితే ఈ ప్రతీయమానార్థజ్ఞానం వాచ్యార్థజ్ఞానానంతరమే కలుగుతుంది కాబట్టి వ్యంజన అనే శబ్దవృత్తిని వేరుగా అంగీకరించడం అనావశ్యకం. అయితే ఏదో ఒక "అస్తమేతి గభస్తిమాన్" వంటి వాక్యాన్ని తీసికొని, దీనిలో పదగుంఫనాసౌందర్యం మొదలైనవి ఉన్నాయా లేదా అని చూడకుండగానే "ఈ ధ్వని ఉంది, ఆ ధ్వని ఉంది" అని చెప్పి దానికి కావ్యత్వాన్ని ఆపాదించడంకోసం ప్రయత్నించడం ధ్వనిసిద్ధాంతాన్ని దురుపయోగం చేసినట్లే అవుతుంది. అక్కడ ప్రయోగించిన శబ్దాదుల ఔచిత్యాదుల్ని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. అనగా గుణ-అలంకార-శయ్యా-పాకాదులను కూడా పరిశీలించాలి ఉదా

హరణకి "ఇతడు రాత్రి మోకాళ్ళు కౌగలించుకొని, పగలు ఎండలోను, సంధ్య లలో నిప్పు వేడిలోను కాలక్షేపం చేస్తూ చలికాలం గడుపుతున్నాడు" అనే వాక్యంలో చమత్కారం ఏమీ లేదు. "ఇతడు గృహవస్త్రాసనులు లేని దరిద్రుడు" అనే వస్తుధ్వనో లేదా దైన్య-విషాదరూపభావాల ధ్వనో ఉన్నదని చెప్పినంత మాత్రంచేత దానికి కావ్యత్వం సిద్ధించదు. ఈ భావాన్నే-

"రాత్రౌ జానుర్దివా భానుః కృశానుః సంధ్యయోర్ద్వయోః,
ఏవం శీతం మయా నీతం జానుభానుకృశానుభిః"

అని చెప్పినట్లయితే పదగుంఫనచేత, అనుప్రాసచేత, పై విషయాన్నే వృత్తంలో చెప్పడంచేత (వృత్తంకూడా ఒక శబ్దాలంకారమే అని మహిమభట్టు అభిప్రాయం) దీనిలో ఒక విధమైన కావ్యసౌందర్యం వచ్చింది. అందుచేత కావ్యంలో ఉండవల సిన ఇతర విషయా లన్నీ మరచి "ధ్వని, ధ్వని" అంటూ ధ్వనికే ప్రాధాన్యం ఇవ్వడం యుక్తం కాదని చెప్పడంలోనే మా తాత్పర్యం.

**66**. 'రసధ్వని' 'ప్రకృతిరసం' అనే విషయాలనుగూర్చి కూడా ఇక్కడ రెండు మాటలు చెప్పవలసి ఉంది. 'రసం' అనగానే భరతుని రససూత్రాన్ని ఉదాహరించడం, దానికి భట్టలోల్లట-భట్టశంకుక-భట్టనాయకులు చేసిన వ్యాఖ్యలు పూర్వపక్షాలుగా చూపడం, అభినవగుప్తుని వ్యాఖ్యానాన్ని సిద్ధాంతంగా ప్రతి పాదించడం ఇవి ఈనాడు ప్రచారంలో ఉన్న అలాంకారశాస్త్రగ్రంథా లన్నింటి లోనూ మామూలుగా కనబడే విషయాలే. అయితే ఆనందవర్ధనుడు అంగీకరించిన రసధ్వనీ, అభినవగుప్తుడు సిద్ధాంతీకరించిన రసధ్వనీ ఒకటేనా అనే విషయం పరిశీలించవలసి ఉంది

**67**. ఆనందవర్ధనుడు ప్రధానంగా వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని అని మూడు విధాల ధ్వనులు అంగీకరించినాడు. ఈయన ప్రతిపాదించిన పద్ధతి చూస్తే వ్యంజింపచేయబడే ఈ రసాదికం రామాదిగత మన్నట్లుగానే కనబడు తుంది. రూపకాలలో అయితే నటాదిగతంగా కూడ భాసిస్తుం దని చెప్పడానికి అవకాశం లేకపోలేదు. "భ్రమ ధార్మిక విస్రబ్ధమ్" ఇత్యాది శ్లోకం వస్తుధ్వనికి ఉదాహరణంగా చూపబడింది. (ధ్వన్యాలోకం 1.4.1 కా. ప్ర. 138) ఈ శ్లోకం వినిన వ్యక్తి వాచ్యార్థం తెలిసిన తరవాత రెండవ భావాన్ని (వస్తువును) కూడా

గ్రహిస్తాడు. అందుచేత దీనికి 'వస్తుధ్వని' అని పేరు. అనగా "ఈ శ్లోకం రచించిన కవి లేదా కవి సృష్టించిన వ్యక్తి, వాచ్యార్థాన్ని మాత్రమే కాకుండా మరొక అర్థాన్ని కూడా ఈ వాక్యం ద్వారా తెలుపుతున్నాడు" అని పఠిత గ్రహిస్తా డని అర్థం.

"వీరాణాం రమతే ఘుసృణారుణే న తథా ప్రియాస్తనోత్సఙ్గే,
దృష్టి రిపుగజకుమ్భస్థలే యథా బహలసిన్దూరే"

అనే శ్లోకం అలంకారధ్వనికి ఉదాహరణంగా ఇవ్వబడింది. (ధ్వ.ఆ. 2.27 4) వాచ్యార్థం తెలుసుకొన్న తరవాత పఠిత దీనిలో స్త్రీకుచకుంభ-గజకుంభస్థలాల మధ్య ఉపమానోపమేయభావం గమ్యం అవుతున్నది కాబట్టి ఉపమాధ్వని అని గ్రహిస్తాడు. అనగా "కవి ఉపమను వాచ్యం కాకుండా ధ్వనింపచేస్తున్నాడు" అని పఠిత గ్రహిస్తా డని అర్థం. అదే విధంగా రసధ్వనిస్థలంలో కూడా పఠిత వాచ్యార్థాన్ని, లేదా విభావాదిప్రతిపాదకాలైన అర్థాలను గ్రహించిన పిమ్మట, దానిని పట్టి "దుష్యంతునికి శకుంతలయందు రతి ఉన్నది" అని లేదా "భీమునికి దుర్యోధనాదుల విషయంలో క్రోధం ఉన్నది" అని గ్రహిస్తాడు. వాచ్యార్థంచేత వ్యంజింపచేయబడుతున్నవి అవే కాబట్టి అవే శృంగారరౌద్రాదులు అని ఆనందవర్ధనుని అభిప్రాయం ఉన్నట్లు తెలుస్తుంది. అయితే రసం రామాదులలో ఉంటే పఠితకు, లేదా సామాజికునికి, ఆనందం ఎలా కలుగుతుంది అని ప్రశ్నించవచ్చు. ఒక వస్తుధ్వనిని, అలంకారధ్వనిని గుర్తించగానే "ఆహా కవి ఎంత అందంగా ఈ విషయం చెప్పాడు!" అని పఠిత మనస్సులో చమత్కారం కలుగుతుంది. అదే విధంగా దుష్యంతాదుల భావాలు తెలియగానే పఠితలో లేదా సామాజికునిలో సహజంగా ఉన్న సహృదయత్వాన్ని పట్టి, అనగా ఇతడు (పఠిత లేదా సామాజికుడు) కావ్యనాటకాదులలో వర్ణించిన సంనివేశాలలో అక్కడ ఉన్న నాయకాదుల మనస్సులో ఎలాంటి వికారాలు కలుగుతాయో అలాంటి వికారాలు తనలో కూడా కలిగే అవకాశం ఉన్న వ్యక్తి (a man of sympathy) అవడంచేత ఇతర ధ్వన్యమానార్థాల (వస్తు-అలంకారాల) జ్ఞానంవల్ల కలిగే చమత్కారం కంటె, ఆనందంకంటె, అధికమైన చమత్కారం ఆనందం కలుగుతుంది. ఆనందవర్ధనుడు వ్రాసిన దానిని జాగర్తగా పరిశీలిస్తే అతనికి అంగీకార్యమైన రసధ్వని అంటే ఇదే. రసం నాయకాద్యాశ్రితమే. ఈ దృష్టితో చూస్తే భట్టలోల్లట భట్టశంకుకుల అభిప్రాయంలో కూడా అనౌచిత్యం ఏమీ లేదు.

**68** ఆనందవర్ధనుడు ప్రతిపాదించిన ఈ రసధ్వని స్వరూపాన్ని అభి. నవగుప్తుడు తన సిద్ధాంతానికి అనుగుణంగా మారుస్తున్నట్లు చెప్పకుండా మార్చి వేశాడు. 'ధ్వన్యాలోకలోచన'- 'అభినవభారతి'లలో అభినవగుప్తుడు ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని పండితరాయలు సుస్పష్టంగా విశదీకరించాడు. ఒక సుందరమైన కావ్యం సమర్పించిన విభావానుభావవ్యభిచారిభావాలను సహృదయుడు ఒక వ్యక్తికి సంబంధించినవాటినిగా చూడక, అనగా రామాదులకు సంబంధించిన వని గాని, తనకు సంబంధించిన వని గాని, ఎవరో మూడవ వ్యక్తికి సంబంధించిన వని గాని గ్రహించకుండగా, సామాన్యరూపంలో గ్రహిస్తాడు. ఇందుకు ఇతని సహృదయత్వమూ, భావనాబలమూ కారణం. దీనికే 'సాధారణీకరణం' అని పేరు. ఆ విధంగా కలిసిన విభావానుభావవ్యభిచార్యాదులలో ఒక విధమైన, అలౌకికమైన వ్యాపారం ఉంటుంది. అదే వ్యంజనా వ్యాపారం. ఈ వ్యాపారం సహృదయునిలో సహజంగా ఉన్న ఆనందదాంశాన్ని కప్పివేసిన అజ్ఞానాన్ని తొలగిస్తుంది. అప్పుడు ఈ సహృదయునిలో ఉన్న వైయక్తికభేదం, జ్ఞానపరిచ్ఛిన్నత్వమూ కూడా తొలగిపోతాయి. అనగా ఆ సమయంలో తాను పరిమితజ్ఞానంగల ఒకవ్యక్తి అనే భావాన్ని పూర్తిగా సహృదయుడు మరచిపోతాడు. అప్పుడు తనలో అణగి ఉన్న రత్యాది భావాలతో కలసిన స్వరూపానందాన్ని అనుభవిస్తాడు. ఆ అనుభవమే రసం. ఈ సందర్భంలో పండితరాయలు ఒక ఉదాహరణం చూపాడు. ఒక దీపాన్ని మూకుడుతో కప్పివేసినప్పుడు ఆ దీపం ప్రకాశించకుండా మరుగుబడి ఉంటుంది. ఆ మూకుడు తీసివేయగానే ఆ దీపం తనంతట తానే ప్రకాశిస్తూ చుట్టు ప్రక్కల ఉన్న వస్తువులను కూడా ప్రకాశింపచేస్తుంది. అదే విధంగా విభావాదులలో వ్యంజన వ్యాపారం అజ్ఞానావరణాన్ని తొలగించగానే ఆనందస్వరూపమైన చైతన్యం ప్రకాశిస్తూ తన ప్రక్కని ఉన్న విభావాదిసహితరత్యాదుల్ని కూడా ప్రకాశింపచేస్తుంది ఇక్కడ వ్యంజనావ్యాపారం వల్ల జరిగే 'వ్యక్తి' అనగా అజ్ఞానం తొలగి ఆత్మ చైతన్యం భాసించడమే. ఇది సంక్షిప్తరూపంలో అభినవగుప్తుని సిద్ధాంతం.

**69.** దీనికీ, రసధ్వని విషయంలో మనం పైన చూచిన ఆనందవర్ధనుని అభిప్రాయానికీ చాలా భేదం ఉంది.

> "కారణాన్యథ కార్యాణి సహకారీణి యాని చ,
> రత్యాదేః స్థాయినో లోకే తాని చేన్నాట్యకావ్యయోః,

విభావాశ్చానుభావాశ్చ కథ్యన్తే వ్యభిచారిణః".

(కా.ప్ర. 27,28 కారికలు)

అని చెప్పినట్లు లోకంలో కారణ-కార్య-సహకారు లనే వాటినే సదా కావ్యంలో విభావానుభావవ్యభిచారు లంటున్నాం? లోకంలో ఇద్దరు స్త్రీ పురుషులు కొన్ని పరిస్థితులలో, ఏ వేవో చేష్టలు చేస్తూ, అదొక విధంగా ప్రవర్తిస్తూండగా అది చూచిన వాడు "వీళ్ళిద్దరకీ పరస్పరం ప్రేమ ఉన్నది" అని ఊహిస్తాడు. ఇద్దరు వ్యక్తులు గట్టిగా ఒకరిపై ఒకరు అరుచుకుంటూ ఉంటే వీళ్ళిద్దరూ క్రోధంతో ఉన్నారు అని ఊహిస్తాడు. అదే విధంగా కావ్యనాటకాదులలోని విభావాదుల జ్ఞానం కలిగినవాడు అక్కడ చిత్రించిన వ్యక్తుల మధ్య ప్రేమ ఉన్నదనో, క్రోధం ఉన్నదనో, లేదా వీళ్లు శోకంతో బాధపడుతున్నా రనో గ్రహిస్తాడు. ఇదే ప్రేక్షకుడికి లేదా పఠితకు ముందుగా కలిగే జ్ఞానం. అందుచేత ఇక్కడ విభావాదులచేత వ్యంగ్యము లయేవి ఆ ప్రేమ - క్రోధ - శోకాదులే. అవి ఎవరియందున్నట్లు ఊహించబడుతున్నాయి? అక్కడ వర్ణించబడుతున్న వ్యక్తులయందు ఉన్నట్లు. అదే ఆనందవర్ధనుడు చెప్పిన రసధ్వని. వస్తుధ్వని-అలంకారధ్వనిస్థలాలలో ఆ ధ్వన్యమానవిషయాల జ్ఞానం కలగగానే ఒక విధమైన చమత్కారం సహృదయుని మనస్సులో కలిగినట్లు తత్తత్పాత్రగతభావాల జ్ఞానం కలిగినప్పుడు కూడా ఇతని మనస్సులో ఒక విధమైన చమత్కారం, వెనుకటి చమత్కారం కంటె అది అధికం కావచ్చు, కలుగుతుం దని ఆనందవర్ధనుని అభిప్రాయం. దానిని అతడు వివరించలేదు.

70. ఆ రత్యాదిప్రతీతి కలిగిన వెంటనే సహృదయుని మనస్సులో లేదా సహృదయునిలో కలిగే వికారాన్ని గూర్చి చర్చించాడు అభినవగుప్తుడు. భట్టనాయకుడు ప్రప్రథమంగా చెప్పిన సాధారణీకరణప్రక్రియను తానుకూడా స్వీకరించి తద్వారా సహృదయునికి కలిగే అనుభూతికి రసం అని పేరు పెట్టాడు. ఈయన మతం ప్రకారం చూస్తే వస్తుధ్వని - అలంకారధ్వనులలో పనిచేసే వ్యంజనా వ్యాపారానికీ, ఇక్కడ వ్యంజనావ్యాపారానికీ పోలికే లేదు. ఇక్కడ వ్యంజనా వ్యాపారంవల్ల కలిగే వ్యక్తి (వ్యంజన), అనగా అజ్ఞానావరణచ్ఛేదంచేత చైతన్య స్వరూపం ప్రకాశించడం అని అర్థం. ఆనందవర్ధనుని ప్రకారం వ్యంజనావ్యాపారం రామాదినిష్ఠరసవ్యంజనంతో ఆగిపోతుంది. అభినవగుప్తుని ప్రకారం సహృదయునిలో కలిగే అనుభూతివరకూ కొనసాగుతుంది. ఇక్కడ వ్యంజనావ్యాపారం

అనడం ఎంతవరకు సమంజసం అనేది ప్రశ్న. భట్టనాయకుడు అంగీకరించిన భావనా-భోజకత్వాలను కాదని వాటికే అభినవగుప్తుడు ఈ పేర్లుపెట్టినట్లయింది. నిజానికి వ్యంజనావృత్తిని రామాదినిష్ఠరత్యాదివ్యంజనతో ఆపివేసి తరవాత సహృదయానుభూతిపర్యంతప్రక్రియకు భావననే మూలకారణంగా అంగీకరించి ఉండవలసింది. సాధారణీకరణానికి ప్రధానకారణం సహృదయగతమైన భావనయే (లేదా భావుకత్వమే) కదా? వ్యంజనావ్యాపారంచేత ఆనందస్వరూపాన్ని ఆవరించి ఉన్న అజ్ఞానం తొలగించబడుతుంది అని చెప్పడంచేత రసాలన్నీ ఆనంద (సుఖ) రూపాలే అన్నట్లు సూచింపబడుతున్నది. ఇది కూడ ఎంతవరకు మన అనుభవానికి దగ్గరగా ఉన్నది అనే విషయాన్ని తరవాత పరిశీలిద్దాం. ఈ విధంగా వ్యజ్యమాన రసస్వరూపం విషయంలో ఆనందవర్ధన-అభినవగుప్తుల మతాలలో భేదం ఉంది.

**71.** ఈ భేదాన్ని గుర్తించిన విద్యానాథుడు, కుమారస్వామి కూడా లౌకిక రసం, అలౌకికరసం అని రెండు రకాల రసం అంగీకరించారు. ఆనందవర్ధనుడు అంగీకరించిన, వ్యంజనావృత్తిగమ్యమైన, రామాదినిష్ఠమైన రసం లౌకికరసం అనీ, అభినవగుప్తుడు ప్రతిపాదించిన సామాజికనిష్ఠమైన రసం అలౌకికరసం అనీ వీరు విశదీకరించారు.

**72.** ఆనందవర్ధనుని కాలం వరకూ రసం అనగా నాయకాదినిష్ఠమైన వ్యజ్యమానరసమే. భట్టనాయకుడు అభినవగుప్తుడు వచ్చి సామాజికనిష్ఠమైన రసాన్ని ప్రతిపాదించడంచేత ఈ రెండు రసాల విషయంలోనూ భ్రాంతి (Confusion) లేకుండా ఉండడంకోసం పండితరాయలు వ్యజ్యమానరసాన్ని 'స్థాయిభావం' అని మాత్రమే అంటాడు. రస్యమానరసాన్ని (అనుభూతిరూప రసాన్ని) మాత్రమే రసం అంటాడు. ఉదాహరణకి-"వాచో మాఙ్గలికీః ప్రయాణ సమయే"అనే శ్లోకాన్ని వ్యాఖ్యానించే సందర్భంలో-"అత్రాప్యాలమ్బనస్య నాయకస్య........సంయోగా ద్రతిరభివ్యజ్యమానా........విప్రలమ్భరసవ్యపదేశహేతుః" అని అన్నాడు. రసాన్ని గూర్చి, రసప్రధానకావ్యాదుల్ని గూర్చి మాటలాడేటప్పుడు ప్రతిచోటా కూడ ఇతడు ఇదే విధంగా వ్రాశాడు.

**73.** అయితే ఈ భేదాన్ని గూర్చి అభినవగుప్తునికి తెలియకపోలేదు. ధ్వన్యాలోకమంగళశ్లోకానికి వ్యాఖ్య వ్రాసే సందర్భంలో-"నిత్యోద్యోగినశ్చ భగవతః అసంమోహాధ్యవసాయయోగిత్వేనోత్సాహప్రతీతేః వీరరసో ధ్వన్యతే" అని

అన్నాడు. భగవంతుని ఉత్సాహాన్ని వ్యంజింపచేయడం ద్వారా వీరరసం ధ్వనింపచేయబడుతున్నది"అని దీని భావం. ఈ విషయాన్నే బాలప్రియావ్యాఖ్య- "స్వేచ్ఛా కేసరిణః, మధురిపోః, ప్రపన్నార్తిచ్ఛిదః, ఇతి పదైః హిరణ్యకశిపుప్రభృతి నిబర్హణాదివిషయకోత్సాహస్య వ్యంజనయా సహృదయానాం ప్రతీతేరిత్యర్థః"అని విశదీకరించింది. ఈ విధంగా ఇక్కడ "ప్రతీతేః" అనే పదానికి "వ్యంజనాత్" (వ్యంజనావృత్తిచేత బోధింపబడడంవల్ల) అనీ 'ధ్వన్యతే'అనే పదానికి"ఆస్వాద్యతే" (ఆస్వాదించబడుతుంది) అని అర్థం. అందుచేత ఈ వీరరసధ్వని వస్తుధ్వనివంటిది కాని, అలంకారధ్వని వంటిది కాని, ఈ శ్లోకంలోనే ఉన్న ఉత్సాహధ్వనివంటిది కాని కాదు అని స్పష్టంఅవుతున్నది అందుచేత దీనిని 'వీరరసధ్వని' అనడం ఎంత వరకూ యుక్తమో సందేహాస్పదమే. వ్యంజనావృత్తిని, ధ్వనినీ అంగీకరించని ధనంజయ-భోజ-కుంతక మహిమభట్టాదులు కూడా రసానికి ప్రాధాన్యం స్వీకరించడం గమనార్హం.

**74.** ప్రకృతిరసవాదం :- ఒక రసం అన్ని రసాలకీ కారణం అనీ, అందుచేత అది ప్రకృతిరస మనీ, ఇతరరసా లన్నీ దీని వికృతులే అనీ ఒక వాదం ఉంది. ప్రాచీనాలంకారికులలో ఒక్కొక్కరు ఒక్కొక్క రసాన్ని ప్రకృతిరసంగా అంగీకరించారు. ఈ ప్రకృతిరసవాదాన్ని ప్రారంభించినవాడు అభినవగుప్తుడే అన్నట్లు కనబడుతుంది.

**75** శాంత ప్రకృతిరసత్వవాదం :- అత్యుత్తమమైన మోక్షరూపపురుషార్థంతో సంబంధించినది అవడంచేత శాంతరసం ప్రకృతిరసం అని అభినవగుప్తుడు ప్రతిపాదించాడు మానసికవృత్తు లన్నింటికీ ఆధారమైన ఆత్మయే శాంతరసానికి స్థాయి. ఆత్మచేత ప్రకాశింపచేయబడిన చిత్తమే శృంగారాదివృత్తులుగా మారుతుంది. అందుచేత శాంతమే ప్రకృతిరసం, ఇతరరసా లన్నీ దీని వికృతులే అని ఆయన అభిప్రాయం.

**76.** శృంగార ప్రకృతిరసత్వవాదం :- శృంగారమే ప్రకృతిరస మని భోజుడు ప్రతిపాదించాడు. ఇది ప్రసిద్ధమైన శృంగారంకంటె భిన్నమయినది. అన్ని భావాలకీ మూలం అహంకారం. ఇది ఆత్మయొక్క గుణం, దీనికే 'శృంగారం' అనీ, 'అభిమానం'అనీ పేర్లు 'నేను' అనే భావమే అహంకారం. మానవునిలో ఉన్న ప్రేమకు మూలం ఈ అహంకారమే. అందుచేత ఇదే ప్రధానరసం. మిగిలిన వన్నీ దీని వికృతులు.

**77** ప్రేమప్రకృతిరసత్వవాదం :- ప్రేమ ప్రకృతిరసం అని కూడా భోజుడు ప్రతిపాదించాడు. ఇది అహంకారానికి చాలా దగ్గరగా ఉంటుంది. మానవుని అన్ని పనులూ నడిపించేది ప్రేమయే. అతడు యుద్ధం చేస్తున్నా డంటే యుద్ధం అంటే ప్రేమ ఉంది కాబట్టి అలా చేస్తున్నాడు. ఈ రసంలో మూడు అవస్థలు ఉంటాయి. మొదటి అవస్థలో ఇది ఒకే విధమైన అహంకారరూపంలో ఉంటుంది. దీనికి "పూర్వకోటి" అని పేరు. "మధ్యమావస్థ" అని చెప్పబడే రెండవ అవస్థలో ఈ అహంకారమే ముప్పైమూడు భావాలుగా పరిణమిస్తుంది. ఒక్కొక్క భావం విభావానుభావాదుల ద్వారా అత్యున్నతస్థితికి పరిపుష్టం అవుతుంది. "ఉత్తర కోటి" అని చెప్పబడే మూడవ అవస్థలో ఇవన్నీ ప్రేమరూపంలో పరిణమిస్తాయి. ఈ అవస్థనుంచి సహృదయుని అనుభవం అహంకారరూపమైన మూలస్థితిని చేరుకుంటుంది.

**78.** అద్భుతరసానికి ప్రకృతిరసత్వం :- ఏ రసమైనా అత్యున్నత స్థితికి పరిపుష్టం అయినప్పుడు ఒక విధమైన ఆశ్చర్యభావం కలుగుతుంది. అద్భుతంతో సంబంధం లేని రచన గాని, అలంకారం గాని, వస్తువు గాని, రసం గాని ఉండదు. అందుచేత సాహిత్యదర్పణకర్త అయిన విశ్వనాథుని పూర్వపురుషుడైన నారాయణు డనే పండితుడు అద్భుతరసం ప్రకృతిరసం అని ప్రతిపాదించాడు. రసంలో ప్రధానమైనది చమత్కారమే కదా ? ఆస్వాదనమే కదా ? చమత్కారం ఉండాలంటే అద్భుతం ఉండి తీరాలి. అందుచేత అద్భుతమే ప్రకృతిరస మని ఈయన అభిప్రాయం.

> "రసే సారశ్చమత్కారః సర్వత్రాప్యనుభూయతే,
> తచ్చమత్కారసారత్వే సర్వత్రాప్యద్భుతో రసః,
> తస్మాదద్భుతమేవాహ కృతీ నారాయణో రసమ్''

**79.** భక్త్యాదుల ప్రకృతిరసత్వం :- భక్తిరసం ఒకటే నిజమైన రసం అని మధుసూదనసరస్వతి 'భవద్భక్తిరసాయనం' అనే చిన్న గ్రంథంలో ప్రతిపాదించడు. రూపగోస్వామి మొదలైనవారు కూడా భక్తిరసమే ప్రధానరసం అని ప్రతిపాదిస్తూ దీనిలో మధుర (దీనికే శృంగార మనీ, ఉజ్జ్వల మనీ నామాంతరాలు) సఖ్య-వాత్సల్య-దాస్యా లనే నాలుగు భేదాలు అంగీకరించారు. మరి కొందరు వైష్ణవాలంకారికులు ఈ నాల్గువిధాల భక్తితో పాటు శాంతభక్తిని కూడా అంగీకరించి,

ఈ ఐదూ ముఖ్యభక్తిరసా లనీ, హాస్య-అద్భుత-వీర-కరుణ-బీభత్స-భయానక-రౌద్రరసాలు గౌణరసా లనీ, వీటికి కూడా రసత్వం కృష్ణరతిసంబంధం ఉన్నప్పుడే సంభవిస్తుందనీ ప్రతిపాదించారు. ఈ విధంగా ఏదో ఒక రసం ప్రకృతిరసం అనీ దాని వికృతులే ఇతరరసాలనీ వాదాలు అభినవగుప్తుని కాలంనుంచీ వస్తూనే ఉన్నాయి

**80.** కరుణరసానికి ప్రకృతిరసత్వం :- అభినవగుప్తునికి చాలా కాలం పూర్వమే భవభూతి "ఉత్తరరామచరితం"లో తన నాటకవస్తుసంవిధానాన్ని ప్రశంసించుకొంటూ—

"అహో ! సవిధానకమ్ ।

శ్లో॥ ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదా-
ద్భిన్నః పృథక్ పృథగివాశ్రయతే వివర్తాన్,
ఆవర్తబుద్బుదతరఙ్గమయాన్వికారా-
నమ్భో యథా సలిలమేవ హి తత్సమస్తమ్".

"ఆహా ! ఏమి కథాసంవిధానం! ఒకే నీరు సుళ్లు, బుడగలు, తరంగాలు మొదలైన రూపాలు ధరించినా ఆ నీరంతా ఒకటే అయినట్లు ఒకే కరుణం నిమిత్తభేదంవల్ల వేరు వేరు రూపాలు ధరిస్తూన్నట్లు కనబడుతున్నది !" అని దీని అర్థం.

**81.** ఈ శ్లోకాన్ని ఆధారంగా చేసుకొని, కొంతమంది ప్రాచీనవ్యాఖ్యాతలతో సహా, చాలమంది "కరుణరసం ప్రకృతిరసం; మిగిలిన రసా లన్నీ దాని వికృతులు" అని భవభూతి అభిప్రాయ మని నిరూపిస్తూ ఉంటారు. "కరుణరసం చిత్తద్రుతికి హేతువు; ఆ చిత్తద్రుతి రసాస్వాదానికి సర్వథా అనుగుణ మైనది. అందుచేతనే భవభూతి కరుణరసం ప్రకృతిరసం అన్నాడు" అని వీరి సమర్థన. ఇదంతా ఈ శ్లోకాన్ని సరిగా అర్థంచేసికొనలేకపోవడంవల్ల వచ్చిన వాదం. "కరుణరసమే ప్రకృతిరసం; ఇది అన్ని రసాలలోను అనుస్యూతంగా ఉంటుంది" అని నిజంగానే భవభూతి చెప్పినా సర్వానుభవవిరుద్ధమైన ఈ విషయాన్ని ఎలా అంగీకరించగలం ? కరుణ చిత్తద్రుతిహేతువు అయితే కావచ్చు. ఇది చిత్తవికాసహేతువు లైన వీరాదిరసాలకీ, చిత్తవిస్తారహేతువులైన రౌద్రాదులకీ, చిత్తవిక్షోభానికి హేతువులైన బీభత్సాదులకీ ప్రకృతి ఎలా అవుతుంది. వీటిలో ఏ మాత్రమూ

చిత్రద్రుతి లేదు కదా ? శాంతశృంగారాలను ప్రకృతిరసాలుగా అంగీకరించిన అభినవ-భోజుల మతాన్ని కొంతవరకు సమర్థించవచ్చునేమో? ఎందుచేత ననగా వీరు చెప్పే శాంత-శృంగారాలు (శాంత-అహంకారాలు) సకలభావాలకీ మూలాధారం అయిన చైతన్యస్వరూపమే. చివరికి "సర్వం దుఃఖమ్"అని చెప్పే బౌద్ధులు కూడా ప్రకృతిరసం ప్రశ్న వచ్చే సరికి శాంతమే ప్రకృతిరసం అన్నారు కాని కరుణయో లేదా బీభత్సమో ప్రకృతిరసం అని అంగీకరించలేదు.

**82.** భట్టనాయక-అభినవగుప్తులు రసం సామాజికనిష్ఠం అని స్థాపించడానికి చాలా కాలం ముందు ఉన్నవాడు భవభూతి.

> "రసవద్దర్శితస్పష్టశృఙ్గారాదిరసోదయమ్,
> స్వశబ్దస్థాయిసంచారివిభావాభినయాస్పదమ్"
> (కావ్యాలంకారసారసంగ్రహం. 4-3)

అని ఉద్భటుడు చెప్పినట్లుగా కవి ఆ యా రసాలను ఆ యా పేర్లతో నిర్దేశించవచ్చును అని అంగీకరించిన కాలం అది (రసాదులను స్వశబ్దాలతో నిర్దేశిస్తే అది వమనదోషం అనే దోషం అని తరువాతి ఆలంకారికుల అభిప్రాయం). లోల్లటాదుల మతాలను పరిశీలించగా భవభూతి, తత్సమకాలికులూ కూడా రసానికి రాముడులే ఆశ్రయం అని అంగీకరించినట్లు స్పష్టం అవుతుంది.

**83.** మరొక విషయం ఏమనగా రసాలు అన్నీ ఆనందాన్నే కలుగజేస్తాయని భట్టనాయక-అభినవగుప్తులు ప్రతిపాదించారు. అయితే "నాట్యదర్పణ" రచయితలైన రామచంద్ర-గుణచంద్రులు, కొన్నిరసాలు సుఖాత్మకా లనీ కొన్ని దుఃఖాత్మకా లనీ ప్రతిపాదించారు. చాలామంది ప్రాచీనాలంకారికులు కూడా ఇదే అంగీకరించినట్లు కనబడుతుంది. ఇది మన అనుభవానికి సరిపడేటట్లుగా ఉంది. దూరదర్శన్ ద్వారా ప్రసారం చేసిన రామాయణ మహాభారతాలలోని రామలక్ష్మణుల నాగపాశబంధదృశ్యాన్నీ, ద్రౌపదీవస్త్రాపహరణదృశ్యాన్నీ చూడగానే కొందరు ప్రాణాలు విడిచినట్లు పత్రికల ద్వారా అందరికీ తెలిసిన విషయమే. "ఎక్కడినుండో ద్వీపాంతరంనుంచి వచ్చిన ఒక నాట్యప్రదర్శకుడు అత్యధికంగా రౌద్ర-బీభత్స-భయానకరసాలు ఉన్న ప్రబంధాలను ప్రదర్శించి జనానికి చాలా విసుగు, బాధ పుట్టించాడు"అని మురారి అనర్ఘరాఘవంలో సూత్రధారునిచేత చెప్పిస్తాడు.

"కుతశ్చిద్ద్వీపాన్తరాదాగతేన కలహకన్దలనామ్నా కుశీలవాపసదేన రౌద్ర-బీభత్స-భయానకభూయిష్ఠం కిమపి ప్రబన్ధమభినయతా నిత్యం కిలాయముద్వేజితో లోకః" (అనర్ఘరాఘవం. ప్రస్తావన)

**84.** మనం వెనక చూచినట్లుగా విభావానుభావవ్యభిచారులు అన్నీ కలిసినప్పుడు వాటిలో ఒక 'వ్యంజన'అనే వ్యాపారం ఉంటుందనీ, దానివల్ల ఆత్మను ఆవరించుకొని ఉన్న అజ్ఞానం తొలగిపోతుందనీ, అప్పుడు ఆనందానుభూతి కలుగుతుందనీ అంగీకరించడంవల్ల అన్ని రసాలు ఆనందమయాలే అని చెప్పవలసి వచ్చింది. నిజానికి "తత్త్వమసి" ఇత్యాదిమహావాక్యాలకీ, భగవద్భక్తిపరములైన స్తోత్రాదులకీ, ఇతరసాధనసంపత్తి అలా ఉన్నా ఆత్మలోని అజ్ఞానావరణాన్ని తొలగించడానికి సామర్థ్యం ఉండవచ్చును. ఇందుకు ఉపనిషదాదులే ప్రమాణం. ఈ విభావాదులకు ఇలాంటి శక్తి ఉంటుందని చెప్పడానికి ప్రమాణం ఏమీ లేదు. అనుభవానుసారం ఆయా రసాల సుఖదుఃఖాత్మకత్వాన్ని అంగీకరించడం మంచిది. ఆనందం కలిగించకపోతే కరుణరసప్రధానాలైన నాటకాలు, సినిమాలు, మొదలైనవి ఎందుకు చూస్తారు అని కొందరు ప్రశ్నిస్తూ అక్కడ ఎవరికైనా కన్నీళ్ళు వస్తే అవి ఆనందబాష్పాలే; సుఖక్షతదంతక్షతాదులవల్ల సుఖం కలిగినట్లే కరుణవల్ల సుఖం కలుగుతుంది అని సమర్థిస్తూ ఉంటారు. అయితే బీభత్సభయానకరసాల మాట ఏమిటి? అతిజుగుప్సాకరములైన విభావాదుల జ్ఞానం ద్వారా కూడా ఆనందమే కలుగుతుందా? ఐతే ఇలాంటి దృశ్యాలు చూడడానికి మానవులు అభిలాష ఎందుకు చూపిస్తారు అనేది ప్రశ్న. నాటకాదులలో తరవాత వచ్చే దృశ్యాలలో శృంగారాదులుండవచ్చునని ప్రేక్షకులు వీటిని ఎలాగో సహించుకొని కూర్చుంటారు అని రామచంద్ర-గుణచంద్రుల సమాధానం. లోకవృత్తాన్ని చిత్రించడమే నాట్యంయొక్క ప్రధానోద్దేశ్యం అని భరతుడు చెప్పి ఉన్నాడు కదా? లోకంలో సుఖమూ ఉంది దుఃఖమూ ఉంది. జుగుప్సాకరమైన వస్తువులూ ఉన్నాయి; ఆనందకరములైన వస్తువులూ ఉన్నాయి. కథాగమనానుసారం అన్నింటినీ వర్ణించడం జరుగుతుంది. సుఖకరాలైనా, ఏవగింపు కలిగించేవైనా అన్నింటినీ చూడాలని కుతూహలం మానవునికి సహజంగా ఉంటుంది. ఎక్కడైనా భయంకరమైన హత్య జరుగుతే అది చూడడానికి పరుగెత్తుతాడు. సర్కస్సు చూస్తాడు. అతని కుతుహలానికి అంతం అనేది లేదు. కుతూహలోపశాంతి ఒకటే తప్ప అన్నింటివల్లా ఆనందమే పొందుతాడనేది లేదు.

**85.** ఐతే వీటికి (బీభత్సాదులకి) రసం అని పేరు ఎందుకు పెట్టారు? అని ప్రశ్నించవచ్చును. ఇవి ఆనందకరాలు కాబట్టి రససంజ్ఞ రాలేదు. మానవునిలో సహజంగా, అంతర్లీనంగా ఉన్న ఏ భావాలను ఉత్తేజితము లయేటట్లు చేసి కొన్ని నిమిషాల పాటు ఆతనిని ప్రపంచకం మరచిపోయే స్థితిలో ఉంచడానికి వీలు ఉంటుందో వాటికి రసం అని పేరు. ఈ క్షణంలో పుట్టి మరు క్షణంలో నశించే వాటిని, రసస్థితికి చేరేటట్లు పోషించడానికి శక్యం కానివాటిని, భావాలన్నారు. అందుచేత రససంజ్ఞ పెట్టినంతమాత్రాన అన్ని రసాలూ సుఖరూపాలే అని చెప్ప వలసిన పని లేదు.

**86**. అన్ని రసాలలోను తనను తాను మరచిపోయి, చుట్టుప్రక్కల ఉన్న ప్రపంచకం కూడా మరచిపోయే స్థితి ఉంటుంది కదా? అప్పుడే కదా అది రసం అవుతుంది. అట్టి స్థితిలో అన్ని రసాలూ ఆనందరూపా లనడంలో అభ్యం తరం ఏమిటి? అని మరొక ప్రశ్న. ఆ అవస్థలో కూడా ఆ యా స్థాయిభావాలు అనుస్యూతంగా ఉంటూనే ఉంటాయి. అలా కాకపోతే ఒకే రసం అవాలి. రత్యా దులుకూడా అనుస్యూతంగా ఉండని స్థితి సుషుప్తిలోకాని, అసంప్రజ్ఞాతసమాధిలో కాని మాత్రమే సాధ్యం అవుతుంది. ఈ విషయాన్ని (స్థాయిభావాలు అనుస్యూ తంగా ఉంటా యనే విషయాన్ని)అభినవగుప్తుడు కూడా అంగీకరించాడు-"ఇత్యా నన్దరూపతా సర్వరసానామ్; కిన్తు ఉపరఞ్జక విషయవశాత్ తేషామపి కటుకిమా స్పర్శోఽస్తి వీరస్యేవ; స హి క్లేశసహిష్ణుతాదిప్రాణ ఏవ" (హిందీ- అభినవభారతి. 478 పేజి). అందుచేతనే పండితరాయలు తన నిశ్చితాభిప్రాయం ఏమీ చెప్ప కుండా కరుణాదులలో దుఃఖం కూడా ఉందా లేదా అనే విషయాన్ని సహృద యులు తమ అనుభవాన్ని పట్టి తేల్చుకోవాలి అని అన్నాడు.

**87.** దీనిని పట్టి అన్ని రసాలూ ఆనందరూపాలే అనే వాదం అనుభవ విరుద్ధం అనీ అందరికీ అంగీకారయోగ్యం కాదనీ స్పష్టం అవుతుంది. (దీనిని గూర్చిన విస్తృత విమర్శకు చూ. **"Panditaraja's Contribution to Sanskrit poetics"** రెండవ ప్రకరణం.)

ఇంక ప్రస్తుత విషయానికి వద్దాం.

**88.** "బంగారం మొదలైన లోహాలను పుటం వేసే, అన్ని వైపులా గట్టిగా మూసివేసిన మూసలో కరిగిన లోహం కుతకుతా ఉడుకుతున్నట్లు రాముని

హృదయంలో కరుణరసం ఉడుకుతూన్నది. అయితే అతని హృదయం గంభీరం అవడంచేత అది బ్రద్దలైపోవడంలేదు గాని ఆ కరుణ అతని హృదయం లోలోపల చెప్పరానంత దుఃఖాన్ని కలగజేస్తూన్నది"అని అంటాడు భవభూతి:-

"అనిర్భిన్నో గభీరత్వాదన్తర్గూఢఘనవ్యథః,
పుటపాకప్రతీకాశః రామస్య కరుణో రసః".

(ఉత్తరరామచరితం)

దీనివల్ల రెండు విషయాలు స్పష్టం అవుతున్నాయి. ఒకటి-కరుణరసం రాముని లోనే ఉంది. రెండు-ఇది చాలా దుఃఖం కలిగిస్తూన్నది. సహృదయునిలో రసాను భూతికలగడానికి హృదయసంవాదమే ప్రధానమైనకారణం అయినపక్షాన రామాది పాత్రలలో ఉన్న దుఃఖ సహృదయునిలో కూడా దుఃఖాన్నే కలిగించాలి గాని సుఖం ఎలా కలిగిస్తుంది?

**89.** ఈ దృష్టితో పరిశీలించినట్లయితే "ఏకో రసః" ఇత్యాది శ్లోకానికి భావం "ఆహా! ఈ కథావస్తునిర్వహణం ఎంత అద్భుతంగా ఉంది! ఎందుచేత ననగా ఒకే కరుణరసం రాముడు, సీత, వాసంతి, కౌసల్య మొదలైన వేరు వేరు పాత్రలలో దాంపత్యం, మైత్రి, వాత్సల్యంమొదలైన వేరు వేరు సంబంధాలను పట్టి వేరు వేరు విధాలుగా ఉండేటట్లు చిత్రించబడింది!" అని భావం చెప్పాలి. వేరు వేరు పాత్రలే ఆ రసానికి ఆశ్రయం అని భవభూతి అభిప్రాయం అవడంచేతనే ఇలా వర్ణించాడు.

**90.** భవభూతి "మహావీరచరితం" అనే మరొక నాటకంలో కూడా ఇలాంటి అభిప్రాయాన్నే అవిష్కరించాడు. "ఒకే వీరరసం, చిన్న చిన్న మార్పులతో, రాముడు, పరశురాముడు, వాలి, రావణుడు, హనుమంతుడు మొదలైన మహాపురుషులలో విభక్తమై ఉంది" అని భవభూతి సూత్రధారునిచేత అనిపిస్తాడు-

"అప్రాకృతేషు పాత్రేషు యత్ర వీరః స్థితో రసః,
భేదైః సూక్ష్మైరభివ్యక్తైః ప్రత్యాధారం విభజ్యతే"

(మహావీరచరితం, ప్రస్తావన)

అందుచేత కరుణరసం అన్ని రసాలకీ ప్రకృతిరసం అని భవభూతి ప్రతిపాదించాడు అని చెప్పడం క్షోదక్షమం కాదు.

**91.** నిజానికి ఒక రసం ప్రకృతిరసం అనీ మిగిలినవి వికృతిరసా లనీ చెప్పే వాదం నిరర్థకం. మనం వివిధరసాలు (షడ్రసాలు) ఉన్న పదార్థాలు భుజిస్తున్నాం. అన్ని రకాల ఆహారమూ కూడా భూమినుంచి పుట్టినదే. భూపరిణామమే. అందుచేత మనం అన్ని రసాలకీ మూలభూతమైన రసం ఒకటి ఉన్నదని అంటూ దానికి ఏ "పృథ్వీరసమో" అని పేరు పెట్టి మిగిలిన వన్నీ దాని వికారాలే అని ఒక నూతన సిద్ధాంతంగా చెప్పవలసిన పని లేదు. అరిషడ్వర్గం అని చెప్పబడే కామక్రోధాదులు ఆరు ఉన్నాయి. కామమే అన్నింటికీ మూలకారణం అని భగవద్గీతాదులలో చెప్పినా కామం ఒక్కటే ప్రధానమైన పాపం అని చెప్పడం యుక్తం కాదు. ఏ భావానికి సంబంధించిన లక్షణాలు ఆ భావానికి వేరు వేరుగా ఉండనే ఉన్నాయి. కావ్యమీమాంసలో రాజశేఖరుడు ఉదాహరించిన ఒక శ్లోకంలో చెప్పినట్లు ఒక్క భూమాతయే యాగం చేసిన సోమయాజులు గాను, కీర్తిమంతులైన మహారాజులుగాను, మృగాక్షులుగాను, పుష్పఫలాలతో నిండిన వృక్షాలు గాను, అనేకరూపాలలో పరిణామం చెందుతున్నా వేరు వేరు పదార్థాలను చూస్తూనే ఉన్నాం కదా.

> "య ఏతే యజ్వానః ప్రథితమహసో యేఽప్యవనిపా
> మృగాక్ష్యో యాశ్చైతాః కృతమపరసంసారకథయా,
> అమీ తే దృశ్యన్తే ఫలకుసుమనమ్రాశ్చ తరవో
> జగత్యేవం రూపా విలసతి మృదేషా భగవతీ" (కా.మీ. 8-14)

అదే విధంగా మనం వేటిని రసాలుగా అంగీకరిస్తే మన అనుభవానికి సరిపడుతుందో వాటిని వేరువేరుగా అంగీకరించడం మంచిది. అంతా శాంతమే అని కాని, అహంకారమే అని కాని, అద్భుతమే అని కాని చెప్పడం అనుభవసంవాది కాదు. ప్రతిరసానికీ దాని వైయక్తికవిశేషం ఉండనే ఉంది కదా? కేవలం వాదదృష్టితో మాత్రమే చెప్పడం ప్రారంభిస్తే ఒకరసాన్ని మరొకరసంలో అంతర్గతం చేసి దానిని హుళక్కి చేయవచ్చును. విప్రలంభశృంగారాన్ని కరుణరసంలోను, సంయోగశృంగారాన్ని వీరరసంలోనూ కలిపివేయవచ్చు వీరానికి స్థాయి ఉత్సాహం కదా? అది లేని సంయోగశృంగారం ఏమి ఉంటుంది? అందుచేత 'ఆలింగనవీరం', 'చుంబనవీరం' ఇత్యాదిభేదాలతో ఈ శృంగారాన్ని వీరం చేసివేయవచ్చు. అందుచేతనే ఒక ఘట్టంలో నాగేశభట్టు (ప్రదీపవ్యాఖ్యలో) వీరరసం అంటే

యుద్ధవీరం ఒక్కటే అని ప్రతిపాదిస్తూ "అన్యథా బలాద్రసవీరాదిభేదేన అనన్త్యం స్యాత్" అని అంటాడు.

**92.** ప్రాచీనసంస్కృతాలంకారికులు చెప్పిన ఈ రససిద్ధాంతాదు లన్నీ ప్రాచీనవాఙ్మయానికి ఉపయోగిస్తాయేమో కాని ఆధునిక సాహిత్యాలకి ఏమి ఉపయోగిస్తాయి అని అంటూ కొందరు పెదవి విరుస్తూంటారు. ఈ అలంకారశాస్త్రం కేవలం సంస్కృతసాహిత్యాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని ప్రవర్తింపచేసినది అని అనుకోవడం అజ్ఞానవిలసితం. ప్రాచీనాలంకారికులు సంస్కృతకావ్యాలతో పాటు తమకు తెలిసిన ప్రాకృతకావ్యాలూ, అపభ్రంశకావ్యాలు మొదలైనవి కూడా దృష్టిలో ఉంచుకొని ఈ శాస్త్రాన్ని రూపొందించారు. తరువాతి కాలంవాళ్ళు దేశభాషాకావ్యాలు ఉపేక్షించి కేవలసంస్కృతకావ్యాలే పట్టుకొని పొరబడ్డారంటే అది వాళ్ళ దోషం కాని శాస్త్రదోషం కాదు. సాహిత్యం ఎంత ఆధునికమైనా, ఏ భాషలో ఉన్నా ఉపయోగించినది అర్థవంతమైన భాషే అయితే, అది భావావిష్కరణకోసమే ఉద్దిష్టమైతే అలంకారశాస్త్రంలో చర్చించిన అన్ని అంశాలు ఆ సాహిత్యానికి కూడా తప్పకుండా అన్వయిస్తాయి. కొంచెం ఓపికతో శాస్త్రం చదవాలి.

**93.** అలంకారశాస్త్రంలో అత్యుత్తమగ్రంథంగా ప్రసిద్ధి పొందిన కావ్యప్రకాశకు తెలుగులో, సులభమైన భాషలో వ్యాఖ్య వ్రాయవలసిందిగా చాలా మంది మిత్రులు కోరడంచేత యథాశక్తిగా వ్యాఖ్య వ్రాశాను. కావ్యప్రకాశకున్న ప్రసిద్ధవ్యాఖ్యానాలలోని విషయాలన్నీ సంగ్రహించి శ్రీవామనాచార్య రామభట్టఝల్కీకర్ సంస్కృతంలో ఒక విస్తృతవ్యాఖ్య వ్రాశారు. ఇది ప్రామాణికమైన, అత్యుత్తమమైన వ్యాఖ్య. దీని ఆరవ సంస్కరణం 1950లో ప్రకటింపబడింది. ఈ "బాలానందిని" వ్యాఖ్య వ్రాయడానికి ప్రధానంగా ఝల్కీకర్ గారి "బాలబోధిని" వ్యాఖ్య సహాయం తీసికొనడం జరిగింది. విస్తృతమైన వాదాలు మాత్రం తీసికొనలేదు.

**94.** దీని ప్రచురణకార్యక్రమాన్ని సంస్కృతభాషా ప్రచారసమితి చేపట్టింది. అందుకు ఆ సమితి స్థాపకులు, అధ్యక్షులూ, భారతీయసంస్కృతిప్రియులు అనేకవిద్యాలయస్థాపకనిర్వాహకులూ అయిన బి. పుల్లారెడ్డిగారికి నా పక్షాన, అలంకారశాస్త్రప్రియుల పక్షాన కూడ కృతజ్ఞత తెలుపుతున్నాను.

**95.** సుప్రసిద్ధవ్యాకరణవిద్వాంసులు వేదమూర్తులు బ్రహ్మశ్రీ శ్రీ కొంపెల్ల సుబ్బరాయశాస్త్రిగారు మా వ్యాకరణాచార్యులు, తపోధనులు, శిష్యవా

త్సల్యం విషయంలో వారికి వారే సాటి. వారి దగ్గర పుస్తకం పట్టినవారిలో ఏదో విధంగా సంస్కృత విద్యారంగంలో రాణించనివారు లేరు. వారు గవర్నమెంటు ఎంట్రన్స్ పరీక్షలో పాఠ్యగ్రంథంగా నిర్ధారితమైన ప్రతాపరుద్రీయం పాఠం చెప్పి నాలో అలంకారశాస్త్రబీజావాపం చేసినవారు. నేను మద్రాసుసంస్కృతకళాశాలలో వేదాంతకక్ష్యలో చేరి వేదాంతశాస్త్రాధ్యయనం చేయడానికి వారి ఆశీఃపూర్వకప్రోత్సాహనమే ఏకైకకారణం. వారి పుణ్యస్మృతికి ఈ గ్రంథాన్ని సవినయంగా పరఃశతప్రణామపూర్వకంగా అంకితం చేస్తున్నాను.

**96.** ఈ వ్యాఖ్యానం అలంకారశాస్త్రస్వరూపం తెలుసుకోవడానికి ఏ కొద్దిమందికి ఉపయోగించినా నా ప్రయత్నం సఫలమైనదని భావిస్తాను.

హైదరాబాదు,
24-5-1995.

పుల్లెల శ్రీరామచంద్రుడు

★★

## 1. ఖడ్గ బన్ధః



మారారి శక్రరామేభముఖైరాసారరంహసా,
సారారబ్ధస్తవా నిత్యం తదార్తిహరణక్షమా. (384 శ్లో)
మాతా సతానాం సంఘట్టః శ్రియాం బాధితసంభ్రమా,
మాన్యాథ సీమా రామాణాం శంమేదిశ్యాదుమాది మా. (385 శ్లో)

## 2. పద్మ బన్ధః

భాసతే ప్రతిభాసార రసాభాతాహతా విభా,

## 3. మురజ బన్ధః




సరలా బహులారమ్భతరలాలిబలారవా,
వారలా బహులామన్దకరలా బహులా మలా. (386 శ్లో)

### సర్వతోభద్రః

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ర | సా | సా | ర | ర | సా | సా | ర |
| సా | య | తా | క్ష | క్ష | తా | య | సా |
| సా | తా | వా | త | త | వా | తా | సా |
| ర | క్ష | త | స్త్వ | స్త్వ | త | క్ష | ర |
| ర | క్ష | త | స్త్వ | స్త్వ | త | క్ష | ర |
| సా | తా | వా | త | త | వా | తా | సా |
| సా | య | తా | క్ష | క్ష | తా | య | సా |
| ర | సా | సా | ర | ర | సా | సా | ర |

ర సా సా ర ర సా సా ర సా య తా క్ష క్ష తా య సా

సా తా వా త త వా తా సా ర్క్ష త-స్త్వ స్త్వ త క్ష ర 388

శ్రీః

శ్రీ మహాగణాధిపతయే నమః

# కావ్యప్రకాశః

## బాలానందినీ వ్యాఖ్యాసహితః

## ప్రథమ ఉల్లాసః

వృత్తి. గ్రన్థారమ్భే విఘ్నవిఘాతాయ సముచితేష్టదేవతాం గ్రన్థకృత్ పరామృశతి-

కారిక :

నియతికృతనియమరహితాం హ్లాదైకమయీమనన్యపరతన్త్రామ్.
నవరసరుచిరాం నిర్మితిమాదధతీ భారతీ కవేర్జయతి. 1

వృ. నియతిశక్త్యా నియతరూపా, సుఖదుఃఖమోహస్వభావా, పరమాణ్వాద్యుపాదానకర్మాదిసహకారికారణపరతన్త్రా, షడ్రసా, న చ హృద్యైవ తైః, తాదృశీ బ్రహ్మణో నిర్మితిః నిర్మాణమ్. ఏతద్విలక్షణా తు కవివాఙ్నిర్మితిః. అత ఏవ జయతి. జయత్యర్థేన చ నమస్కార ఆక్షిప్యత ఇతి తాం ప్రత్యస్మి ప్రణత ఇతి లభ్యతే.

### అథ బాలానన్దినీవ్యాఖ్యాప్రారమ్భః

వ్యాఖ్యానం. నత్వా శ్రీతాతపాదాదీన్ శాస్త్రముఖ్యాదిసద్గురూన్,
వ్యాఖ్యాం కావ్యప్రకాశస్య కరోమ్యాస్పష్టార్థాం యథామతి.

మహాపండితుడైన మమ్మటుడు 'కావ్యప్రకాశ' అనే అలంకారశాస్త్ర గ్రంథాన్ని రచించడానికి ప్రారంభించి, తాను ప్రారంభించిన గ్రంథరచనాకార్య క్రమం నిర్విఘ్నంగా కొనసాగడంకోసం తగిన, అనగా ఇలాంటి కార్యాన్ని

నిర్విఘ్నంగా సమాప్తి పొందించగలిగిన, ఇష్టదేవత యైన భారతిని, సరస్వతీ దేవిని, స్మరిస్తున్నాడు.

నియతీతి- నియతికృతనియమరహితామ్ = దైవంచేత లేదా అదృష్టంచేత కల్పించబడిన నియమాలు లేనిదీ, హ్లాదైకమయీమ్ = కేవలం ఆనందస్వరూప మైనదీ, అనన్యపరతన్త్రామ్ = ఇతర కారణాలమీద వేటిమీదా ఆధారపడనిదీ, నవరసరుచిరామ్ = తొమ్మిది రసాలతో మనోహరంగా ఉన్నదీ అయిన, నిర్మితిమ్ = నిర్మాణాన్ని, ఆదధతీ = చేస్తూన్న, కవేః భారతీ = కవియొక్క భారతి, జయతి = సర్వోత్కర్షతో ఉన్నది.

వివరణం. ఈ ప్రార్థనాశ్లోకంతో కావ్యప్రకాశకారుడు, బ్రహ్మదేవుడు చేసే సృష్టికంటె కవి చేసే (కావ్య) సృష్టి విశిష్టమైనది అని చెపుతూ ఆ కవి భారతిని స్మరిస్తున్నాడు. సరస్వతి విద్యాధిదేవత. అందుచేత కవిభారతియే భారతి (సరస్వతి); భారతియే కవిభారతి. ఈ విధంగా కవిభారతీస్తుతి భారతీస్తుతియే అవుతుంది గాన ఈ శ్లోకం కవిభారతిని ప్రశంసిస్తూ భారతీదేవిని కూడా స్తుతిస్తూ న్నది. అందుచేత మంగళశ్లోకంగా పరిగణింపబడుతుంది. ఈ విషయాన్నే రచ యిత వృత్తిలో విశదీకరిస్తున్నాడు :-

నియతిశక్త్యా ఇతి :- నియతిశక్తి అనగా అసాధారణమైన ధర్మం. పద్మంలో పద్మత్వం ఉంది. ఈ పద్మత్వం అనే అసాధారణధర్మం, (ఇతర పుష్పాలలో లేని ధర్మం) దేనిలో ఉంటుందో దానిలో విశిష్టమైన పరిమళం మొద లైనవి ఉంటాయి. ఆ ధర్మం లేని పుష్పాదులలో అలాంటి సౌరభాదులు ఉండవు. అందుచేత బ్రహ్మ చేసే సృష్టి ఇలాంటి అసాధారణధర్మాలమీద ఆధారపడి ఉంటుంది. అనగా అలాంటి ధర్మం ఉన్నదానికే పరిమళాదులను ఇవ్వగలుగు తుంది. లేదా 'నియతిశక్తి' అనగా అదృష్టం; దైవశక్తి. బ్రహ్మదేవుని సృష్టి ఆ యా ప్రాణుల అదృష్టంచేత కట్టబడి ఉంటుంది. దానికి లోబడి ఉండే బ్రహ్మ సుఖదుఃఖాదులను ఇస్తాడు. తానుగా స్వతంత్రించి ఏమీ ఇవ్వజాలడు. అయితే కవి చేసే నిర్మాణం ఈ విధంగా అసాధారణధర్మాలమీద కాని, దైవాదులమీదకాని ఆధారపడదు. కవి ఎలా తలుచుకుంటే అలాగే వర్ణించగలడు. అదే విధంగా బ్రహ్మ చేసే సృష్టి సత్త్వరజస్తమోగుణాలతో సంబంధించి ఉంటుంది. అందు చేత ఈ జగత్తులో సత్త్వగుణధర్మమైన సుఖం, రజోగుణధర్మమైన దుఃఖం,

తమోగుణధర్మమైన మోహం ఈ మూడూ కూడా ఉంటాయి. కవిరచనలో కేవలం సుఖం (ఆనందం) మాత్రమే ఉంటుంది. బ్రహ్మసృష్టికి పూర్తి స్వాతంత్ర్యం లేదు. పరమాణువులు మొదలైన ఉపాదానకారణాలు, కర్మ మొదలైన సహకారి కారణాలు-వీటిమీద ఆధారపడి ఉంటుంది. కవిసృష్టికి ఇలాంటి పారతంత్ర్యం లేదు. (కుండకు మట్టి ఉపాదానకారణం. కఱ్ఱ, చక్రం మొదలైనవి సహకారి కారణాలు). బ్రహ్మసృష్టిలో ఆరు రసాలు మాత్రమే(మధురామ్లాదులు)ఉన్నాయి. అవి అన్నీ ఆనందాన్నే కలిగిస్తాయనే మాట లేదు. కవిసృష్టిలో తొమ్మిది రసాలు ఉంటాయి. అన్నీ ఆనందం కలిగించేవే. ఈ విధంగా కవివాఙ్నిర్మాణం బ్రహ్మదేవుని నిర్మాణంకంటె విలక్షణమైనది. అందుచేతనే అది, జయతి = సర్వోత్కృష్టతో ఉన్నది. సర్వోత్కృష్టమై ఉన్నది అని చెప్పడంచేత 'నమస్కరిస్తున్నాను' అని సూచితం అవుతున్నది. అందుచేత ఇలాంటి కవిభారతికి నమస్కరిస్తున్నాను అని భావం.

వృ. ఇహాభిధేయం సప్రయోజనమిత్యాహ-

కా. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తాసంమితతయోపదేశయుజే. 2

వ్యా. ఇహేతి- ఈ గ్రంథంలో ప్రతిపాదించనున్నదానికి ప్రయోజనం ఉన్నదని చెప్పుచున్నాడు. అనగా ఈ కావ్యప్రకాశ అనే గ్రంథం కావ్యలక్షణాలను గూర్చి చెప్పడంకోసం, ఎలా వ్రాస్తే కావ్యం అవుతుందో తెలపడంకోసం. నిర్మించబడింది. అందుచేత ఏ కావ్యాన్ని గూర్చి విశదీకరించడంకోసం ఈ గ్రంథం వ్రాయబడిందో ఆ కావ్యానికి ఏది ప్రయోజనమో అదే దీనికి కూడా ప్రయోజనం అని భావం.

కావ్యమితి- కావ్యమ్ = కావ్యం, యశసే = యశస్సుకొరకు, అర్థకృతే = ధనంకొరకు, వ్యవహారవిదే = వ్యవహారజ్ఞానంకొరకు, శివేతరక్షతయే = అమంగళాలను నశింపచేయడంకొరకు, సద్యఃపరనిర్వృతయే = చదివినవెంటనే గొప్ప ఆనందంకొరకు, కాన్తాసంమితతయా = ప్రియురాలితో సమానమైనదవడంచేత, ఉపదేశయుజే = ఉపదేశంకొరకు, అవుతుంది. అనగా కావ్యంవల్ల యశస్సు లభిస్తుంది; ధనం లభిస్తుంది. లోకవ్యవహారజ్ఞానం కలుగుతుంది. అమంగళాలు

తొలిగిపోతాయి. చదువుతూన్నప్పుడే పరమానందం కలుగుతుంది. ప్రియురాలు మనస్సు నొప్పించకుండా హితబోధ చేసి సన్మార్గంలో ప్రవర్తింపచేసి నట్లు కావ్యం కూడా మంచి ఉపదేశం ఇస్తుంది.

వృ. కాలిదాసాదీనామివ యశః, శ్రీహర్షాదేర్ధావకాదీనా మివ ధనం, రాజాదిగతోచితాచారపరిజ్ఞానమ్, ఆదిత్యాదేర్మయూరాదీ నామివానర్థనివారణం, సకలప్రయోజనమౌలిభూతం సమనన్తరమేవ రసా స్వాదనసముద్భూతం విగలితవేద్యాన్తరమానన్దం ప్రభుసంమితశబ్ద ప్రధానవేదాదిశాస్త్రేభ్యః, సుహృత్సంమితార్థవత్పురాణాదీతిహాసేభ్యశ్చ శబ్దార్థయోర్గుణభావేన రసాఙ్గభూతవ్యాపారప్రవణతయా విలక్షణం యత్కావ్యం లోకోత్తరవర్ణనానిపుణకవికర్మ, తత్కాన్తేవ సరసతాపాద నేనాభిముఖీకృత్య "రామాదివద్వర్తితవ్యం న రావణాదివత్"ఇత్యుపదేశం చ యథాయోగం కవేః సహృదయస్య చ కరోతీతి సర్వథా తత్ర యత నీయమ్.

వ్యా. కాలిదాసాదీనామితి- కాలిదాసాదులకు వలె కీర్తిని, ధావకుడు మొద లైనవారికి శ్రీహర్షాదులనుండి వలె ధనాన్ని, రాజాదులకు సంబంధించిన తగిన నడవడికను తెలపడం ద్వారా లోకవ్యవహారజ్ఞానాన్ని, సూర్యాదులనుండి మయూ రాదికవులకు వలె అనర్థనివారణాన్ని- శబ్దార్థాలను అప్రధానంగా చేసి రసానికి అంగమైన (వ్యంజనా) వ్యాపారానికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడంచేత, ప్రభు సంమితాలైన శబ్దప్రధానవేదాదిశాస్త్రాలకంటె, మిత్రసంమితాలైన, అర్థమునందే తాత్పర్యం గల పురాణాదీతిహాసాలకంటె విలక్షణమై లోకోత్తరవర్ణనానిపుణు డైన కవి కర్మయైన కావ్యం- అన్ని ప్రయోజనాలకంటె ఉత్తమమైనదీ, వెంటనే రసాస్వాదంచేత కలిగేదీ, విగలితవేద్యాంతరమూ అయిన ఆనందాన్ని, కాంతవలె సరసత్వాన్ని కలిగించి, అభిముఖుణ్ణిగా చేసికొని "రామాదుల వలె ఉండాలి కాని రావణాదుల వలె ఉండకూడదు" అనే ఉపదేశాన్ని వీలును బట్టి కవికీ, సహృద యుడికీ కూడ ఇస్తుంది; అందుచేత దానివిషయంలో అన్ని విధాలా ప్రయత్నం చెయ్యాలి.

వి. 'కావ్యం' అనగా లోకంలో కనిపించే మామూలు విషయాలతో

లేని, (లోకాతీతమైన) చమత్కారాన్ని కలిగించే వర్ణనలు చేయగలిగిన కవి యొక్క కర్మ; కవి చేసినది; కవిచేత నిర్మించబడినది అని అర్థం. ఇది వేదాదులకంటె పురాణాదులకంటె విలక్షణమైనది. వేదం మొదలైన శాస్త్రాలు ప్రభువు ప్రజలను ఆజ్ఞాపించినట్లు "నువ్వు అలా చెయ్యాలి; ఇలా చేయకూడదు; అలా చేస్తే పుణ్యం వస్తుంది; ఇలా చేస్తే పాపం వచ్చి కష్టాలు అనుభవిస్తావు" అని ఆజ్ఞాపిస్తాయి. అందుచేత ఇవి ప్రభుసంమితాలు, ప్రభువు వంటివి. వీటిలో శబ్దాలకి ప్రాధాన్యం ఎక్కువ. ఎందుచేతనంటే ఇవి ఆజ్ఞాపిస్తున్నట్టుగానే కనబడతాయి. ఇంక పురాణేతిహాసాదులు మిత్రుడువలె ఆ యా కథలు చెప్పి మానవుణ్ణి మంచి మార్గంలో నడిపిస్తాయి. అందుచేత అవి మిత్రసంమితాలు. వీటిలో అర్థానికి ప్రాధాన్యం. ఎందుచేత ననగా వేదాదులవలె ఇవి చేయవలసిన, లేదా చేయకూడని పనులను గూర్చి కాకుండా జరిగిన విషయాలు చెపుతాయి. అయితే కావ్యం కూడా ఉపదేశం చేస్తుంది. కాని దీని విధానం సుకుమారంగా ఉంటుంది. కాంత తన ప్రియుణ్ణి మంచి మాటల చేత, హావభావాదులచేత వశంచేసికొని ఆతని మనస్సును నొప్పి కలగకుండా తాను ఏ విషయం ఉపదేశించా లని అనుకొంటుందో దాన్ని చమత్కారంగా, ఆనందకరంగా ఉండేటట్లు "రామాదుల వలె ఉండాలి కాని రావణాదుల వలె ఉండకూడదు"అని బోధిస్తుంది. అందుచేత కావ్యం కాంతాసంమితం. దీనిలో శబ్దానికి గాని వాచ్యార్థానికి గాని ప్రాధాన్యం లేదు. ఈ రెండూ అప్రధానంగానే ఉంటూ వ్యంజనావ్యాపారం ద్వారా రసానుభూతిని కలిగిస్తాయి. ఈ విధంగా వేదాదిశాస్త్రాలకంటె, పురాణేతిహాసాదులకంటె విలక్షణమైన కావ్యంవల్ల అనేక ప్రయోజనా లున్నాయి. సత్కావ్యాలవల్ల కాళిదాసాదులకు లభించినట్లు కీర్తి లభిస్తుంది. ధావకు డనే కవికి శ్రీహర్షుడు చాలా ధనం ఇచ్చినాడట. రత్నావళి అనే నాటిక వ్రాసి శ్రీహర్షుని పేరు పెట్టడంచేత అలా ఇచ్చినా డని కొందరు వ్యాఖ్యాతలు వ్రాశారు. ఇందులో ఎంత సత్యం ఉందో చెప్పడం కష్టం. ఆస్థాన కవులకు కూడా రాజులు అధికంగా ధనం ఇచ్చి పోషించడం భారతదేశసంప్రదాయమే కదా. ఈ విధంగా కావ్యంవల్ల ధనం లభిస్తుంది. కావ్యాలలో మహాపురుషుల చరిత్ర వర్ణింపబడుతుంది. వాటిని చదివిన వారికి రాజులు మొదలైన పెద్దలతో ఎలా మసలుకోవాలో, లోకవ్యవహారం ఎలా ఉంటుందో తెలుస్తుంది. కావ్యానికి ఈ లోకవ్యవహారజ్ఞానం ఒక ఫలం. మయూరు డనే కవి సూర్యశతకం రచించి కుష్ఠరోగం పోగొట్టుకున్నా డని ప్రసిద్ధి. ఈ విధంగా కావ్యంవల్ల అమం

గళాలు తొలగించుకొనవచ్చు. ఇంక చివరి ఫలం ఒకటి ఉంది; అది వెంటనే కలిగే ఆనందం. మిగిలిన ఫలా లన్నీ ఒక ఎత్తు! ఇది ఒకటీ ఒక ఎత్తు. వాటి అన్నింటికి తలమానిక మైనది. కావ్యం చదువుతూండగానే రసాస్వాదనం చేత ఇతర విషయా లేవీ తెలియని ఒక ఆనందమయమైన స్థితి ఏర్పడుతుంది. ఇది కావ్యం వల్ల కలిగే అత్యుత్తమప్రయోజనం.

వీటిలో కొన్ని కవికి చెందుతాయి. కొన్ని సహృదయుడికి చెందుతాయి. యశస్సు, ధనం, అనర్థనివారణం అనేవి కవికి, ఆనందం, వ్యవహారజ్ఞానం, ఉపదేశలాభం అనేవి సహృదయుడికి లభిస్తాయి. మొదటి మూడు ప్రయోజనాలు కవికే కాకుండా కావ్యాలు బాగా చదుకున్నవారికి కూడా కలగవచ్చు. కావ్యజ్ఞానం కలవా డనే కీర్తి, దానివలన ధనం, స్తోత్రపాఠాదులవలన అనర్థనివృత్తి కలగవచ్చును కదా. ఐతే కవికి మాత్రం ఈ మూడు ప్రయోజనాలే కాని ఇతర ప్రయోజనాలు ఉండవు. కావ్యం రచించి పూర్తిచేసిన కవి కూడా కాలాంతరంలో ఆ కావ్యం చదువుకొని రసాస్వాదం పొందవచ్చు. అయితే ఆ సమయంలో అతడు కూడా సహృదయుడే, కవి కాడు అని ఆలంకారికసంప్రదాయం.

సహృదయులనగా ఎవరో 'యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాద్విశదీభూతే మనోముకురే వర్ణనీయతన్మయీభవనయోగ్యతా తే స్వహృదయసంవాదభాజః సహృదయాః' అని అభినవగుప్తుడు లక్షణనిర్వచనాలు చెప్పినాడు. (ధ్వన్యాలోకలోచనం. పుట. 38.) ఉత్తమకావ్యాలను పరిశీలించగా పరిశీలించగా ఎవరి మనస్సు అనే అద్దం నిర్మలమై కవి సమర్పించిన విభావాదులతో తాదాత్మ్యాన్ని చెందడానికి యోగ్యం అయి ఉంటుందో వాళ్ళు సహృదయులు ఇది లక్షణం. "స్వహృదయసంవాదం ఉన్నవాళ్ళు" అనేది వ్యుత్పత్త్యర్థం. 'స్వ' అనగా ఇక్కడ కవి అని అర్థం. కవి హృదయంతో సమానమైన హృదయం ఉండి అతని హృదయంతో సమంగా స్పందించగలిగిన హృదయం కలవాళ్ళు అని అర్థం. అనగా "సమానం హృదయం యేషాం తే సహృదయాః" అని వ్యుత్పత్త్యర్థం చెప్పినట్లయింది. 'సహృదయ' శబ్దం ప్రప్రథమంగా ధ్వన్యాలోకంలోనే కనబడుతుంది.

వృ. ఏవమస్య ప్రయోజనముక్త్వా కారణమాహ-

కా. శక్తిర్నిపుణతా లోక శాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే. 3

వ్యా. ఈ విధంగా కావ్యప్రయోజనం చెప్పిన తరువాత ఇప్పుడు కావ్యానికి కారణాన్ని చెపుతున్నాడు.

శక్తిః = శక్తి, లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్ = లోకాన్ని, శాస్త్రాలను, కావ్యాలను పరిశీలించడంవలన కలిగిన, నిపుణతా = నేర్పు (దీనికే వ్యుత్పత్తి అని పేరు). కావ్యజ్ఞశిక్షయా = కావ్యాలు తెలిసిన వాళ్ళదగ్గర నేర్చుకొనడం చేత, అభ్యాసః = కావ్యరచనాభ్యాసం చేయడం, ఇతి = ఇట్లు, తదుద్భవే = కావ్యం పుట్టడానికి (కావ్యనిర్మాణానికి), హేతుః = కారణం.

వృ. శక్తిః కవిత్వబీజరూపః సంస్కారవిశేషః కశ్చిత్; యాం వినా కావ్యం న ప్రసరేత్; ప్రసృతం వా ఉపహసనీయం స్యాత్. లోకస్య స్థావరజఙ్గమాత్మకలోకవృత్తస్య, శాస్త్రాణాం ఛన్దో-వ్యాకరణాభిధానకోశ-చతుర్వర్గ - గజ - తురగ-ఖడ్గాది లక్షణగ్రన్థానాం, కావ్యానాం చ మహాకవిసంబన్ధినామ్, ఆదిగ్రహణాదితిహాసాదీనాం చ విమర్శనాద్వ్యుత్పత్తిః, కావ్యం కర్తుం విచారయితుం చ యే జానన్తి తదుపదేశేన కరణే యోజనే చ పౌనఃపున్యేన ప్రవృత్తిరితి త్రయః సముదితాః, న తు వ్యస్తాః, తస్య కావ్యస్య ఉద్భవే నిర్మాణే, సముల్లాసే చ హేతుః; న తు హేతవః

వ్యా. కవిత్వానికి బీజం వంటి, రచయితలో ఉండే సహజమైన ఒకానొక విధమైన సంస్కారానికి శక్తి అని పేరు. దీనికి 'ప్రతిభ' అని నామాంతరం. ఆ శక్తి లేకపోతే మిగిలినవి ఏవి ఉన్నా కావ్యం నడవదు. ఏదో విధంగా రచించినా అది ఉపహాసాస్పదంగా ఉంటుంది. అందుచేత ఇది చాలా ప్రధానమైనది. లోకం అనగా స్థావరజంగమాత్మకమైన లోకానికి సంబంధించిన వ్యవహారం; దాన్ని పరిశీలించాలి. ఛందఃశాస్త్రం, వ్యాకరణం, నిఘంటువులు, ధర్మార్థకామమోక్షలనూ గజ - తురగ - ఖడ్గాదుల లక్షణాలనూ ప్రతిపాదించే గ్రంథాలూ-ఇవి శాస్త్రాలు. ఈ శాస్త్రాలలో మంచి ప్రవేశం సంపాదించాలి. ఇతరులు రచించిన ఉత్తమకావ్యాలు చదవాలి. ఈ విధంగా లోకవ్యవహారజ్ఞాన శాస్త్రజ్ఞాన-కావ్యపఠనాదులవలన వ్యుత్పత్తి కలుగుతుంది. ఇది రెండవది. కావ్యాన్ని రచించే నైపుణ్యం గలవారు, కావ్యాలను విమర్శించగలవారు కావ్యజ్ఞులు. వాళ్ళను

ఆశ్రయించి వాళ్ళ దగ్గర కావ్యం ఎట్లు రచించాలో, ఏ పదాలు కూర్చి ఏ పదాలు కూర్చాలో (యోజనే) మాటిమాటికీ నేర్చుకోవాలి. ఇది అభ్యాసం- మూడవది. ఈ మూడు కలిసి, అంతే కాని వేరువేరుగా కాదు- కావ్యనిర్మాణానికి, నిర్మించిన కావ్యం సర్వోత్కృష్టంగా ఉండడానికి, కారణం అవుతాయి. అందుచేతనే 'హేతుః' అని ఏకవచనం ప్రయోగించబడింది కాని 'హేతవః' అని బహు వచనం ప్రయోగించబడలేదు. అనగా ఈ మూడూ ఏక సముదాయంగా కలిసి ఉన్నప్పుడే కావ్యనిర్మాణం జరుగుతుంది అని భావం.

వృ. ఏవమస్య కారణముక్త్వా స్వరూపమాహ-

కా. తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి.

వృ. దోషగుణాలంకారా వక్ష్యన్తే. క్వాపీత్యనేనైతదాహ-యత్స ర్వత్ర సాలంకారౌ; క్వచిత్తు స్ఫుటాలంకారవిరహేఽపి న కావ్యత్వ హానిః. యథా-

శ్లో॥ యః కౌమారహరః స ఏవ హి వరస్తా ఏవ చైత్రక్షపా
స్తే చోన్మీలితమాలతీసురభయః ప్రౌఢాః కదంబానిలాః,
సా చైవాస్మి తథాపి తత్ర సురతవ్యాపారలీలావిధౌ
రేవారోధసి వేతసీతరుతలే చేతః సముత్కంఠతే. 1

వృ. అత్ర స్ఫుటో న కశ్చిదలంకారః రసస్య చ ప్రాధాన్యా న్నాలంకారతా.

వ్యా. ఈ విధంగా కావ్యానికి ఏవి కారణమో చెప్పి ఆ కావ్యస్వరూపాన్ని విశదీకరిస్తున్నాడు- తదదోషౌ ఇతి. అదోషౌ=దోషాలు లేనివి, సగుణౌ=గుణాలు ఉన్నవీ, క్వాపి=కొన్ని చోట్ల, అనలంకృతీ పునః = అలంకారాలు లేనివి అయిన, శబ్దార్థౌ=శబ్దార్థాలే (శబ్దమూ అర్థమూ కలిసి), తత్ = ఆ కావ్యం. దోషేతి =దోష-గుణ-అలంకారాలను గూర్చి ముందు ముందు విశదీకరిస్తాం. 'క్వాపి' (కొన్నిచోట్ల) అని అనడంచేత సాధారణంగా అంతటా కూడ అలంకారాలు ఉండాలి. (అలంకారాలు లేకపోతే కావ్యం కానే కాదు); అయితే కొన్ని చోట్ల స్పష్ట

మైన అలంకారాలు కనబడకపోయినా దోషాలు ఏవీ లేకుండా, గుణాదులు ఉన్న శబ్దార్థాలు కావ్యం అని చెప్పవచ్చును అని భావం. ఉదాహరణకి "యః కౌమార" ఇత్యాదిశ్లోకంలో స్పష్టంగా అలంకారా లేవీ కనబడడంలేదు. అయినా దోషాలేవీ లేవు. మాధుర్యాదిగుణా లున్నాయి. అందుచేత ఇది కావ్యమే. "ఇందులో శృంగారరసం ఉన్నదిరదా; అది అలంకారమే కదా; అందుచేత దీనిలో స్ఫుటాలంకారాలు ఏమీ లేవు అని చెప్పడం అయుక్తం కదా?" అన్న ప్రశ్నకు అవకాశం లేదు. ఎందుచేత ననగా, రసం అప్రధానంగా ఉన్నప్పుడే దానిని అలంకారం (రసవదలంకారం) అంటారు కాని రసం ప్రధానంగా ఉంటే అది అలంకారం కాదు. అది అలంకార్యం. అయితే ఉత్కంఠ చెందడానికి తగిన కారణం లేక పోయినా ఉత్కంఠ అనే కార్యం కలిగినట్లు వర్ణించడంచేత విభావనాలంకారం అనీ లేదా ఉత్కంఠ లేకపోవడం అనే కార్యానికి అనుగుణమైన కారణాలు ఉన్నా ఆ కార్యం లేదు అని వర్ణించడం చేత విశేషోక్త్యలంకారమనీ చెప్పవచ్చును. కాని ఆ అలంకారాలు అస్పష్టంగా ఉన్నాయి కాబట్టి ఇది అనలంకారమే, అనగా స్ఫుటమైన అలంకారాలు లేనిదే అని భావం.

యః కౌమారహరః ఇత్యాది- "ఏ వరుడు నా కౌమారవయస్సును దోచుకున్నాడో అతడే ప్రక్కన ఉన్నాడు; అవే చైత్రమాస (వసంత) రాత్రులు; వికసించిన మాలతీ లతల మీదుగా రావడంచేత బాగా పరిమళిస్తూన్న అవే కదంబ వృక్షవాయువులు ఇప్పుడూ వీచుతున్నాయి. నేను కూడా అప్పటి మనిషినే; ఏమీ తేడా లేదు. అయినా మనస్సు రేవానదీతీరంలో నీటిప్రబ్బలి తీగలు మండపంగా ఏర్పడిన వృక్షములలో సురతవ్యాపారంకోసం ఉవ్విళ్ళూరుతున్నది".

ఈ శ్లోకం కాశ్మీరదేశీయురాలైన శీలాభట్టారిక (శిలా అనే రాణి) రచించిన శ్లోకం అని ప్రసిద్ధి.

వృ. తద్భేదాన్ క్రమేణాహ-

కా. ఇదముత్తమమతిశయిని వ్యఙ్గ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథితః. 4

ఇదమితి కావ్యం; బుధైర్వైయాకరణైః ప్రధానభూతస్ఫోటరూప వ్యఙ్గ్యవ్యఞ్జకస్య శబ్దస్య ధ్వనిరితి వ్యవహారః కృతః. తతస్తన్మతాను

సారిభిరన్యైరపి న్యగ్భావితవాచ్యవ్యఙ్గ్యవ్యఞ్జనక్షమస్య శబ్దార్థయుగలస్య. యథా-

శ్లో. నిఃశేషచ్యుతచన్దనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రే దూరమనఞ్జనే పులకితా తన్వీ తవేయం తనుః.
మిథ్యావాదిని దూతి బాన్ధవజనస్యాజ్ఞాతపీడాగమే
వాపీం స్నాతుమితో గతాసి న పునస్తస్యాధమస్యాన్తికమ్.

వృ. "అత్ర తదన్తికమేవ రన్తుం గతాసి" ఇతి ప్రాధాన్యేన అధమపదేన వ్యజ్యతే.

వ్యా. ఆ కావ్యాల భేదాలను క్రమంగా చెపుతున్నాడు. ఇదమితి- వాచ్యాత్-=వాచ్యం కంటే, వ్యఙ్గ్యే=వ్యంగ్యార్థం, అతిశయిని=ప్రధానంగా (ఎక్కువ చమత్కారజనకంగా) ఉంటే, ఇదమ్=ఈ కావ్యం, ఉత్తమమ్=ఉత్తమకావ్యం. ఈ విధమైన కావ్యమే, బుధైః=పండితులచేత, ధ్వనిః='ధ్వని' అని, కథితః=చెప్పబడినది.

ఇదమితి- కారికలో "ఇదమ్" అనగా 'కావ్యం' అని అర్థం. బుధులైన వైయాకరణులు ప్రధానమైన స్ఫోటరూపమైన వ్యంగ్యాన్ని వ్యక్తింపచేసే శబ్దాన్ని 'ధ్వని' అనేపేరుతో వ్యవహరిస్తున్నారు. ఆ మతాన్నే అనుసరించి ఇతర పండితులు కూడా వాచ్యార్థాన్ని అణగద్రొక్కి, అనగా వాచ్యార్థానికి అంతగా ప్రాధాన్యం లేకుండా, ప్రధానంగా కనబడే వ్యంగ్యార్థాన్ని వ్యంజింపచేయడానికి (స్ఫురింపచేయడానికి) సమర్థమైన శబ్దార్థద్వయానికి అనగా శబ్దార్థరూపమైన కావ్యానికి 'ధ్వని' అని పేరు పెట్టారు.

వి. అలంకారశాస్త్రప్రవర్తకులైన ఆనందవర్ధనాదులకు వైయాకరణులు అంటే చాలా గౌరవం. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో "ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః; వ్యాకరణమూలత్వాత్ సర్వశాస్త్రాణామ్" (ప్రథమోద్యోతం 13వ కారికకు వృత్తి). "సకలశాస్త్రాలకి వ్యాకరణమే మూలం. అందుచేత వైయాకరణులు విద్వాంసులలో ప్రధానులు" అని అంటాడు. వైయాకరణులు "స్ఫోట" అనే ఒక విశిష్టమైన శబ్దస్వరూపాన్ని అంగీకరించారు. దీనిని గూర్చి అతి విస్తృతమైన చర్చ వ్యాకరణశాస్త్రగ్రంథాలలో ఉంది. సంగ్రహంగా చెప్పాలంటే- "శః

పదంవల్ల ఈ అర్థం తెలుస్తూన్నది" అనే వ్యవహారం లోకంలో ఉంది. దీనిని పట్టి ఆ అర్థాన్ని బోధించే పదం ఒకటి అనీ, అది అఖండమనీ (విడదీయరాని ఒక ఘన మనీ) స్పష్టం అవుతున్నది. మన చెవికి వినిపించే వర్ణాలు కాని, వాటి సముదాయం కాని అర్థాన్ని బోధించజాలవు. ప్రతివర్ణమూ కూడ ఉచ్చరించిన మరు క్షణంలోనే నశిస్తుంది. రెండవ వర్ణం ఉచ్చరించేసరికి మొదటి వర్ణం ఉండదు. అట్టి స్థితిలో అన్ని వర్ణాల సముదాయం ఒక్క ఘనంగా (ఒక్క ముద్దగా) స్ఫురించడం అసంభవం. అనగా 'ఘట' 'పట' ఇత్యాదిపదాల జ్ఞానం కలగదు. ఈ పదాలలోని నాలుగో వర్ణమైన 'అ' దగ్గరికి వచ్చేసరికి అది ఒక్కటే వినబడు తుంది. దానికి ముందు ఉన్న 'ఘ్, అ, ట్', 'ప్, అ, ట్' అనే అక్షరాలు నశించిపోయినాయి కదా? కాని 'ఘట' 'పట' అనే ఒక్కొక్క పదంవల్ల ఆ యా అర్థాల ప్రతీతి కలుగుతున్నది అని మనం అనుకుంటున్నాం. పదాల సమూహం అని చెప్పే వాక్యం విషయం కూడా ఇంతే. అందుచేత ఒక పదం, ఒక వాక్యం అని మనం అనుకునేవి మన చెవులకు వినబడేవి కాదు, చెవులకు వినబడే వాటి ద్వారా వ్యజింపబడేవి. వాటికే పదస్ఫోట, వాక్యస్ఫోట ఇత్యాది నామధేయాలు.

దీని ప్రక్రియ ఇది. వాక్కు పరా, పశ్యన్తి, మధ్యమా, వైఖరీ అని నాలుగు విధాలు అని వైయాకరణులు ప్రతిపాదించారు. వీటిలో 'పరా' అనేది వాస్తవంలో వాక్కు కాదు; చైతన్యమే. సర్వవ్యవహారాలూ చైతన్యమూలకాలే కాబట్టి వాగ్వ్యవహారం కూడా చైతన్యమూలకమే. అందుచేత వాక్కును గూర్చి చర్చించే ఘట్టంలో దాని (వాక్కుకు సంబంధించిన) వ్యవహారానికి మూలమైన చైతన్యాన్ని కూడా వాక్కు అని ప్రాచీనులు నిర్దేశించి ఉంటా రని ఊహించాలి. పరా వాగ్రూపమైన బ్రహ్మ (చైతన్యం) నాభిస్థానంలో ఒక విధమైన మార్పును (దీనికే వివర్తం అని పేరు) పొందుతుంది. నాభిస్థానంలో జరిగిన ఈ చైతన్యవివర్తమే 'పశ్యన్తి' వాక్కు. అది నాభిస్థానంనుండి హృదయస్థానం చేరి మరొక వివర్తం పొందుతుంది; దానికి 'మధ్యమా' వాక్కు అని పేరు. అది ముఖందగ్గరికి చేరి మరొక వివర్తాన్ని చెందుతుంది. అప్పుడు తాలువు (చెలివి) దంతాలు మొదలైన స్థానాలలో వాయువు ఆఘాతంవల్ల వర్ణాలు పుడతాయి. పుట్టిన వెంటనే నశిస్తాయి. దీనికి వైఖరీ వాక్కు అని పేరు. ధ్వనిరూపంలో ఉన్న ఈ వర్ణాలు మధ్యమా రూపంలో ఉన్న శబ్దాన్ని స్ఫురింపచేస్తాయి. అనగా ఆ శబ్దముయొక్క జ్ఞానాన్ని కలుగజేస్తాయి. వాక్కుకు ఉన్న పశ్యన్తి అవస్థలో కాని, మధ్యమావ

స్థలో కాని వర్ణ-పదాది ప్రవిభాగం లేదు. ఈ విభాగం అంతా ధ్వనిరూపమైన వైఖరీవాక్కులోనే. ఈ వైఖరీవాక్కు వ్యంజింపజేసే '[illegible]' వాక్కుకే స్ఫోట అని పేరు. దానివల్లనే అర్థజ్ఞానం కలుగుతుంది.

కావ్యంలో శబ్దమూ, దాని వాచ్యార్థమూ కూడా ప్రధానమైన వ్యంగ్యార్థాన్ని వ్యంజింపచేస్తాయి. ప్రధానమైన స్ఫోటను వ్యంజింపజేసే (ప్రకటించే) శబ్దానికి వైయాకరణులు "ధ్వని" అని పేరు పెట్టినట్లుగా (వాళ్లు దానికి ఆ పేరు పెట్టడానికి కారణం ఆ శబ్దం, చప్పుడు (ధ్వని) చెవికి వినబడటం) ఆలంకారికులు వ్యంగ్యార్థ వ్యంజకమైన శబ్దార్థద్వయానికి "ధ్వని" అని పేరు పెట్టారు అని భావం. అందు చేత "ధ్వని" అనగా వ్యంగ్యార్థాన్ని ప్రధానంగా బోధించే శబ్దార్థరూపమైన కావ్యము అని అర్థం. ఇది కావ్యవిభాగాన్ని గురించిన ఘట్టం అవడంచేత "ధ్వని" శబ్దానికి ఇక్కడ ఈ అర్థం చెప్పడం జరిగింది. "ధ్వని" శబ్దానికి ధ్వనింపబడిన అర్థం, ధ్వనించడం, ధ్వనింపచేయడం అనే వ్యాపారం అని మరి మూడు అర్థాలలో కూడా ప్రయోగం ఉంది. ఈ విషయం ముస్ముందు స్పష్టం అవుతుంది.

వ్యా. ఎట్లనగా— (ఒక నాయిక తన ప్రియుణ్ణి తీసికొనిరావడం కోసం తన సఖురాలిని దూతికగా పంపుతుంది. ఆమె అతనిదగ్గరికి వెళ్లి అతనితో రతి కేళి చేసి తిరిగి వచ్చి— "నేను నీ ప్రియుని దగ్గరకి వెళ్లడం కుదరలేదు (లేదా నీ ప్రియుడు అక్కడ లేడు); ఎలాగా అటు వెళ్లాం కదా అని అక్కడ ఉన్న దిగుడు బావిలో స్నానం చేసి వచ్చాను" అని నాయికకు చెపుతుంది. అప్పుడు ఉత్తమ స్వభావం కల ఆ నాయిక ఆమె శరీరంమీద కనబడుతున్న సంభోగచిహ్నాలన్నీ చూచి ఆమె చేసి వచ్చిన పని తెలుసుకుంటుంది. "ఔనులే; నీవు అతనిదగ్గరికి వెళ్లలేదు; నీ శరీరంమీద కనబడే ఈ చిహ్నాలన్నీ స్నానంవల్ల ఏర్పడ్డవే" అని అంటూ ఆక్షేపిస్తుంది.)

నిఃశేషేతి :- "నీ స్తనాల పైభాగంలో పూసికొన్న మంచిగంధం పూర్తిగా తొలగిపోయింది. క్రింది పెదవికి వేసుకొన్న రంగు తుడుచుకొనిపోయింది. నేత్రాల చివర కాటుక చెరిగిపోయింది. నీ సన్నని శరీరంలో పులకాంకురాలు కనిపిస్తున్నాయి. కావలసిన వాళ్ల బాధను గుర్తించని, అసత్యం పలికే ఓ! దూతీ! నువ్వు ఇక్కడినుండి, స్నానంచేయడంకోసం దిగుడుబావికే వెళ్లావు, ఆ అధముడి దగ్గరకి వెళ్లలేదు! నిజమే!"

ఈ శ్లోకంలో ప్రధానంగా ప్రయోగించిన "అధమస్య" (ఆ అధముడి దగ్గరికి) అనే పదాన్ని బట్టి "నువ్వు రమించడం కోసం అతనిదగ్గరికే వెళ్లావు" అన్న అర్థం స్ఫురిస్తూన్నది. అందుచేత ఇది "ధ్వని" అనే నామాంతరం గల ఉత్తమ కావ్యానికి ఉదాహరణం. దీనిలో వాచ్యార్థం కంటె వ్యంగ్యార్థం ప్రధానంగా ఉంది.

కా. అతాదృశి గుణీభూతవ్యఙ్గ్యం వ్యఙ్గ్యే తు మధ్యమమ్.

వృ. అతాదృశి వాచ్యాదనతిశాయిని. యథా:-

శ్లో. గ్రామతరుణం తరుణ్యా నవవఞ్జులమఞ్జరీసనాథకరమ్,
పశ్యన్త్యా భవతి ముహుర్నితరాం మలినా ముఖచ్ఛాయా. 3

వృ. అత్ర వఞ్జులలతాగృహే దత్తసంకేతా నాగతేతి వ్యఙ్గ్యం గుణీభూతమ్. తదపేక్షయా వాచ్యస్యైవ చమత్కారిత్వాత్.

వ్యా. అతాదృశీతి :- వ్యఙ్గ్యే = వ్యంగ్యము, అతాదృశి తు = అలా లేకపోతే, అనగా వెనుక చెప్పినట్లు ప్రధానంగా లేకపోతే, గుణీభూతవ్యఙ్గ్యమ్ = అది గుణీభూతవ్యంగ్యము. మధ్యమమ్ = మధ్యమకావ్యము. అతాదృశీతి. అతాదృశి = వాచ్యముకంటె ప్రధానంగా లేనప్పుడు.

వి. వాచ్యార్థమే ప్రధానంగా ఉండి వ్యంగ్యార్థం ప్రధానంగా లేని కావ్యానికి గుణీభూతవ్యంగ్యం అనీ, మధ్యమకావ్యం అనీ పేర్లు. ఉదా :- గ్రామేతి. "క్రొత్త అశోకపుష్పగుచ్ఛాన్ని చేతిలో పట్టుకొని వస్తూన్న గ్రామంలోని యువకుణ్ణి చూడగానే ఆమె ముఖం రంగు మలినం అయిపోయింది."

అత్రేతి : "వంజులలతాగృహంలో వచ్చి కలుసుకొంటా నని అన్నావు; రాలేదు" అని సూచించడానికి ఆ యువకుడు ఆ పుష్పగుచ్ఛాన్ని చేతిలో పెట్టుకొని వచ్చాడు. అది చూడగానే ఏ కారణంచేతనో సంకేతస్థానానికి వెళ్లజాలకపోయిన ఆ యువతి ముఖం నల్లబడిపోయింది అని భావం ఇక్కడ వ్యంగ్యార్థంకంటె వాచ్యార్థమే ఎక్కువ చమత్కారజనకంగా ఉంది అందుచేత ఇది "గుణీభూత వ్యంగ్యం" అనే కావ్యం. దీనికే మధ్యమకావ్యం అని కూడా పేరు.

వి. "గుణీభూతం" అనగా అప్రధానము అని అర్థం. వ్యంగ్యార్థం ప్రధా

నంగా ఉందా, వాచ్యార్థం ప్రధానంగా ఉందా అని నిర్ణయించడానికి వాటివల్ల కలిగే చమత్కారమే ఆధారం. దేనివల్ల ఎక్కువ చమత్కారం కలుగుతే అది ప్రధానం.

కా. శబ్దచిత్రం వాచ్యచిత్రమవ్యఙ్గ్యం త్వవరం స్మృతమ్. 5

వృ చిత్రమితి గుణాలంకారయుక్తమ్. అవ్యఙ్గ్యమితి స్ఫుట ప్రతీయమానార్థరహితమ్. అవరమ్ అధమమ్. యథా:-

శ్లో. స్వచ్ఛన్దోచ్ఛలదచ్ఛకచ్ఛకుహరచ్ఛాతేతరామ్బుచ్ఛటా
మూర్ఛన్మోహమహర్షిహర్షవిహితస్నానాహ్నికాహ్నాయ వః,
భిద్యాదుద్యదుదారదర్దురదరీదీర్ఘాదరిద్రద్రుమ
ద్రోహోద్రేకమహోర్మిమేదురమదా మన్దాకినీ మన్దతామ్.

వృ. వాచ్యచిత్రం యథా-

శ్లో. వినిర్గతం మానదమాత్మమన్దిరా
ద్భవత్యుపశ్రుత్య యదృచ్ఛయాపి యమ్,
ససంభ్రమేన్ద్రద్రుతపాతితార్గలా
నిమీలితాక్షీవ భియామరావతీ. 5

ఇతి కావ్యప్రకాశే కావ్యస్య ప్రయోజనకారణస్వరూపవిశేషనిర్ణయో నామ ప్రథమః ఉల్లాసః

వ్యా. శబ్దేతి - అవ్యఙ్గ్యమ్ = అవ్యంగ్యము, చిత్రమ్ (అధ్యాహారము) = చిత్రకావ్యము, అవరమ్ = అవరము అని, స్మృతమ్ = చెప్పబడినది. శబ్దచిత్రమ్ = శబ్దచిత్రము; అర్థచిత్రమ్ = అర్థచిత్రము. అవ్యంగ్యమైన కావ్యానికి చిత్రకావ్యం అని పేరు. దీనికే అవరకావ్యమని నామాంతరం.

చిత్రమితి: 'చిత్రమ్' అనగా గుణములూ, అలంకారములూ ఉన్నది. 'అవ్య

జ్యమ్' అనగా ఏ మాత్రము వ్యంగ్యం లేని దని అర్థం కాదు; వ్యంగ్యార్థం ఏమైనా ఉన్నా అది స్ఫుటంగా స్ఫురించదు అని అర్థం. అవరం అనగా అధమము. శబ్ద చిత్రానికి ఉదాహరణం.

స్వచ్ఛన్దేతి - "స్వచ్ఛన్దోచ్ఛల........అహ్నాకా" స్వచ్ఛన్ద = స్వేచ్ఛగా, ఉచ్ఛలత్ = ఎగిరిపడుచున్నదీ, అచ్ఛ = స్వచ్ఛమైనదీ, కచ్ఛ = జలప్రాయమైన (అధికంగా నీళ్ళు ఉండే) ప్రదేశము యొక్క, కుహర = బిలముల యందు, ఛాతేతర = అత్యధికముగా ఉన్నదీ అయిన, అమ్బు = జలము యొక్క, ఛటా = పరంపరచేత (అవిచ్ఛిన్నప్రవాహముచేత), మూర్ఛన్మోహ = తొలగి పోయిన అజ్ఞానము గల, మహర్షి = మహర్షులచేత, హర్ష = సంతోషముతో, విహితస్నానాహ్నికా = చేయబడిన స్నానములు, ఆహ్నికకృత్యములూ కలదీ, ఉద్యద్దు దారదర్దురదరీ = ఎగురుచున్న అత్యధికమైన కప్పలు గల గుహలు కలదీ, "దీర్ఘా దరిద్ర... ....మదా"-దీర్ఘ = పొడవైన (ఎత్తైన), అదరిద్ర = శాఖాదులతో నిండిన, ద్రుమ = వృక్షముల యొక్క, ద్రోహ = ద్రోహముకొరకై, ఉద్రేక = పైకి లేచుటగల (లేచుచున్న), మహోర్మి = పెద్ద తరంగముల యొక్క, మేదుర మదా = దట్టమైన అహంకారము గల, మన్దాకినీ = మందాకినీనది, వః = మీ యొక్క, మన్దతామ్ = మాంద్యమును, అహ్నాయ = శీఘ్రముగా, భిద్యాత్ = భేదించుగాక (తొలగించుగాక).

వి. ఇక్కడ ఒక వర్ణాన్ని అనేకపర్యాయాలు ఆవృత్తిచేయడం ద్వారా "వృత్త్యనుప్రాసం" అనే శబ్దాలంకారం ఉన్నది. ఈ విధంగా శబ్దచమత్కారమే కాని అర్థచమత్కారం ఏమీ లేదు. అందుచేత ఇది శబ్దచిత్రానికి ఉదాహరణం. మందాకినీనది విషయంలో ఉన్న భక్తిభావం ఇక్కడ వ్యంగ్యంగా ఉన్నా అది అంత ప్రధానంగా లేదు. శబ్దాలంకారగుంఫనంలోనే కవికి ఆదరం అధికంగా కన బడుతున్నది. అందుచేత అస్ఫుటమైన వ్యంగ్యం ఉన్నా ఇది చిత్రకావ్యభేదమే.

వాచ్యచిత్రానికి ఉదాహరణం :

'వినిర్గతం' ఇతి :- (ఇది కాశ్మీరదేశీయుడైన మేంఠకవి రచించిన 'హయ గ్రీవవధ' అనే నాటకంలోని శ్లోకం) "శత్రువుల గర్వాన్ని అణచే ఏహయగ్రీవుడు మరొక పనిమీద తన నగరంనుంచి బైలుదేరినా కూడ, అతడు బయలుదేరినాడనే వార్త తెలియగానే ఇంద్రుడు కంగారు పడుతూ ప్రాకారం ద్వారాల తలుపుల

గడియలు బిగింపచేయడంచేత అమరావతీనగరం భయంతో కళ్ళుమూసుకొన్నదా అన్నట్లు అయిపోతుందో."

వి. హయగ్రీవు డనే అసురునికి భయపడి అమరావతి ద్వారాలన్నీ మూసి వేయడాన్ని భయంతో నగరం కళ్లుమూసుకోవడంగా ఉత్ప్రేక్షించడంచేత ఉత్ప్రేక్షాలంకారం. ఇక్కడ ఈ ఉత్ప్రేక్షాలంకారరూపమైన అర్థాలంకారానికే ప్రాధాన్యం ఉండడంచేత ఇది వాచ్య (అర్థ) చిత్రానికి ఉదాహరణం.

అయితే- "ఇక్కడ వాచ్యార్థం ద్వారా హయగ్రీవుని ప్రతాపాతిశయం వ్యంగ్యం అవుతూన్నది; అది స్ఫుటంగానే కూడా ఉంది; అందుచేత ఇది గుణీభూతవ్యంగ్యానికి ఉదాహరణంగా చెప్పవచ్చును. కేవలం అర్థచిత్రకావ్యం అనడం యుక్తం కాదు" అని అంటూ కావ్యప్రకాశవ్యాఖ్యాత గోవిందఠక్కురు అర్థచిత్రానికి ఉదాహరణగా మరొక శ్లోకం చూపించాడు.

ఆనందవర్ధనుడు ధ్వని ప్రాధాన్యాప్రాధాన్యాలను పట్టి కావ్యాలను 'ధ్వని', 'గుణీభూత వ్యంగ్యం' 'చిత్రకావ్యం' అని మూడు విధాలుగా విభజించాడు. మమ్మటుడు వాటికే 'ఉత్తమం', 'మధ్యమం', 'అధమం' అనే పేర్లు కూడా పెట్టాడు.

"బాలానందిని" అను కావ్యప్రకాశాంధ్రవ్యాఖ్యానంలో కావ్య ప్రయోజన-కావ్యకారణ-కావ్యలక్షణాదులను నిరూపించు ప్రథమోల్లాసం సమాప్తం.

# అథ ద్వితీయ ఉల్లాసః

వృ. క్రమేణ శబ్దార్థయోః స్వరూపమాహ

కా. స్యాద్వాచకో లాక్షణికః శబ్దోఽత్ర వ్యఞ్జకస్త్రిధా.

వృ. అత్రేతి కావ్యే. ఏషాం స్వరూపం వక్ష్యతే.

కా. వాచ్యాదయస్తదర్థాః స్యుః

వృ. వాచ్యలక్ష్యవ్యఙ్గ్యాః

వ్యా. "శబ్దార్థౌ కావ్యమ్" అని చెప్పిన కావ్యలక్షణంలో విశేష్యం అయిన 'శబార్థౌ' అనేది ప్రధానమైనదిగాన ముందు ఆ శబ్దార్థాల స్వరూపం చెపుతున్నాడు- స్యాదితి-"కావ్యంలో వాచకమూ, లాక్షణికమూ, వ్యంజకమూ అని శబ్దం మూడు విధాలు."

అత్రేతి- అత్ర అనగా కావ్యంలో అని అర్థం. వైశేషికశాస్త్రాదులలో వ్యంజక శబ్దం అనేది అప్రసిద్ధం. అందుచేత ఈ త్రివిధవిభాగం కావ్యంలోనే అని భావం. ఈ శబ్దాల స్వరూపం ముస్ముందు విశదీకరిస్తాం.

వాచ్యేతి- "వాటి అర్థాలు వాచ్యాదులు అవుతాయి."

వి. వాచకశబ్దంచేత బోధింపబడే అర్థానికి 'వాచ్యార్థం' అనీ, లక్షకశబ్దం చేత బోధింపబడే అర్థానికి 'లక్ష్యార్థం' అనీ, వ్యంజకశబ్దంచేత బోధింపబడే అర్థానికి 'వ్యంగ్యార్థం' అనీ పేర్లు.

కా. తాత్పర్యార్థోఽపి కేషు చిత్. 6

వృ. ఆకాఙ్క్షాసంనిధియోగ్యతావశాద్వక్ష్యమాణస్వరూపాణాం పదార్థానాం పరస్పరసమన్వయే తాత్పర్యార్థో విశేషవపుర పదార్థోఽపి వాక్యార్థః

సముల్లసతీత్యభిహితాన్వయవాదినాం మతమ్. వాచ్య ఏవ వాక్యార్థ ఇత్యన్వితాభిధానవాదినః.

వ్యా. తాత్పర్యేతి- కేషు చిత్ = భాట్టమీమాంసకాదుల మతంలో, తాత్పర్యార్థః అపి = తాత్పర్యార్థం కూడా అంగీకరించబడుతుంది.

ఆకాఙ్క్షేతి- పదార్థాల స్వరూపం ముస్ముందు వివరీకరింపబడుతుంది. ఆ పదార్థాలు, ఆకాంక్ష, సంనిధి, యోగ్యత అనే మూడు అంశాల సాహాయ్యంచేత ఒకదానితో ఒకటి అన్వయించిన పిదప ఆ పదార్థాలకంటె భిన్నంగా ఒక విశిష్టరూపం ఉన్న 'తాత్పర్యార్థం' అనేది భాసిస్తుంది అని అభిహితాన్వయవాదుల మతం. వాక్యార్థం కూడా వాచ్యమే అని అన్వితాభిధానవాది అభిప్రాయం.

వి. పైన చెప్పిన వాచ్యార్థం, లక్ష్యార్థం, వ్యంగ్యార్థం అనే మూడు విధాలైన అర్థాలే కాకుండా తాత్పర్యార్థం అనేది కూడా ఒకటి (నాల్గవది) ఉన్నదని కొందరు శాస్త్రకారులు అంగీకరించారు. అయితే ఈ తాత్పర్యార్థం పదార్థం (ఒక పదంచేత బోధించబడే అర్థం) కాదు. మొత్తం వాక్యంచేత బోధించబడే అర్థం. కొన్ని పదాల సముదాయం వాక్యం. అందుచేత వాక్యార్థమైన ఈ తాత్పర్యార్థం పదార్థం(ర్థాల) కంటె భిన్నమైనది. ఒక వాక్యంలో ఉన్న పదాలు బోధించే అర్థాలకి ఒకదానితో ఒకదానికి సంబంధం ఏర్పడాలంటే ఆకాంక్ష, సంనిధి, యోగ్యత అనే మూడు అంశాలు ఉండాలి.

ఆకాంక్ష :- "రామః ఫలం అత్తి"అనే వాక్యం ఉంది. దీనిలో 'అత్తి' అన్న పదం వినగానే "ఏమి తినుచున్నాడు ?" అనే ఆకాంక్ష (ఒక విషయాన్ని తెలుసుకోవాలనే కోరికకు ఆకాంక్ష అని పేరు) కలుగుతుంది. "ఫలమ్" అనే పదాన్ని వినగానే ఆ ఆకాంక్ష తీరుతుంది. అలాగే "ఎవడు తినుచున్నాడు ?" అనే ఆకాంక్ష 'రామః' అనే పదంచేత తీరుతుంది. అదే విధంగా 'రామః' అనగానే "రాముడు; ఏమిటి ?" అని ఆకాంక్ష కలుగుతే దానిని మిగిలిన రెండు పదాలూ తీరుస్తాయి. ఇట్లే అన్ని పదాల విషయంలోనూ కూడా. ఈ విధంగా పదార్థాలు ఒకదానితో ఒకటి అన్వయించడానికి ఆకాంక్ష అనేది ఉండాలి.

సంనిధి :- ఒక వాక్యంలో ఉన్న పదాలను దగ్గర దగ్గరగా ఉచ్చరిస్తేనే వాటి అర్థాల అన్వయం కుదురుతుంది. 'రామః' అని ఉచ్చరించి పదినిమిషాల

తరవాత 'ఫలమ్'అనీ, ఇంకో పది నిమిషాల తరవాత 'అత్తి'అనీ ఉచ్చరిస్తే అవి బోధించే అర్థాలకు అన్వయం ఉండదు. అందుచేత సంనిధి కూడా ఉండాలి.

యోగ్యత :- "వహ్నినా సిఞ్చతి" ఇత్యాదివాక్యాలలో పదార్థాలకి పరస్పరాన్వయయోగ్యత లేదు. 'సిఞ్చతి' అనగా తడుపుచున్నాడు అని అర్థం. తడవడం అనేది నీళ్ళతోనే కుదురుతుంది కాని నిప్పుతో సాధ్యం కాదు. అందుచేత ఇక్కడ యోగ్యత లేకపోవడంచేత అన్వయం కుదరదు.

పై వాక్యంలో మూడూ కూడా ఉన్నాయి. అందుచేత దీని పదార్థాలన్నీ పరస్పరమూ అన్వయించడం (ఒకదానితో ఒకటి కలవడం)చేత "రామకర్తృక ఫలకర్మకాదనక్రియా" (రాముడు కర్తగాను, ఫలం కర్మగానూ ఉన్న తినడం అనే పని)అని కాని, "ఫలకర్మకాదనక్రియాశ్రయః (కర్తా) రామః" (ఫలము కర్మగా ఉన్న తినుట అనే పనిని చేస్తూన్న రాముడు)అని కాని వాక్యార్థం ఏర్పడుతూన్నది. 'రామః' అనేపదానికి 'కర్తయైన రాముడు'అని మాత్రమే అర్థం. ఈ పదం 'అత్తి' అన్న పదంతో అన్వయించడంచేత "తినుట అనే పనికి కర్తయైన రాముడు"అనే అర్థం వచ్చింది. అదే విధంగా "ఫలమ్"అనే పదానికి 'కర్మ అయిన ఫలము' అనిమాత్రమే అర్థం. అది 'అత్తి' అనుదానితో అన్వయించడంచేత "తినుట అనే పనిలో కర్మ అయిన ఫలము" అనే అర్థం వచ్చింది. 'అత్తి' అనే దానికి 'తినుచున్నాడు' అని మాత్రమే అర్థం. కాని దీనికి మిగిలిన రెండు పదాలతో సంబంధంచేత విశిష్టమైన అర్థం బోధించబడుతున్నది. ఈ విధంగా ఒక వాక్యంలో ఉన్న ఆ యా పదాలు స్వతంత్రంగా బోధించే అర్థాలు (పదార్థాలు) ఒకదానితో ఒకటి కలపడంతో విశిష్టమైన వాక్యార్థం (మొత్తం వాక్యంవల్ల లభించే అర్థం) ఏర్పడుతూన్నది.

అభిహితాన్వయవాదం :- పదాలు బోధించే అర్థాలకంటె భిన్నంగా వాక్యార్థంలో కనబడే ఈ పదార్థపరస్పరాన్వయం అనేదాన్ని కూడా ఆ పదాలే తమ శక్తిచేత (అభిధచేత) బోధిస్తాయా లేక దానిని మరొక వృత్తి (వ్యాపారం)ఏదైనా బోధిస్తుందా అని ప్రశ్న. ఈ విషయంలో శాస్త్రకారులలో, ముఖ్యంగా మీమాంసకులలో, రెండు మతాలు ఉన్నాయి. పూర్వమీమాంసాశాస్త్రంలో భాట్టసంప్రదాయమూ, ప్రాభాకరసంప్రదాయమూ అనే రెండు ప్రధానమైన సంప్రదాయాలు ఉన్నాయి. వీటికి వరుసగా కుమారిలభట్టు, ప్రభాకరుడు ప్రవర్తకులు. "ఒక

వాక్యంలో ఉన్న ఆ యా పదాలు వాటికి ఉన్న అర్థాలని మాత్రమే బోధిస్తాయి. అవి వాటి పని ముగించిన తరవాత 'తాత్పర్యం' అనే ఒక వృత్తి ఆ పదార్థాల పరస్పరసమన్వయాన్ని బోధిస్తుంది. ఈ అన్వయం పదాలు బోధించేది కాదు" అని భాట్టులు ప్రతిపాదించారు. దీనికి "అభిహితాన్వయవాదము" అని పేరు. "అభిహితానామ్ = ఆ యా పదములచేత బోధింపబడిన అర్థములయొక్క, అన్వయః = (తరువాత తాత్పర్యవృత్తిచేత ఏర్పడిన) అన్వయము"అని దీని అర్థం.

అన్వితాభిధానవాదం :- "ఒక వాక్యంలో ఉన్న ప్రతీ పదమూ ఇతర పదార్థాలతో అన్వయించిన, సంబంధించిన అర్థాన్నే బోధిస్తుంది. పదపదార్థాల జ్ఞానం వ్యవహారంవల్లనే కలుగుతుంది. 'గామ్ ఆనయ' అని ఒక వ్యక్తి అన్నప్పుడు రెండవ వ్యక్తి గోవును తీసికొని వస్తాడు. "గామ్ నయ" అనగానే దానిని తీసికొని వెళ్ళిపోతాడు. 'గామ్' అనేదాని బదులు "అశ్వమ్" అన్నప్పుడు గుర్రాన్ని తీసికొని రావడం తీసికొనిపోవడం మొదలైన పనులు చేస్తాడు. ఇదంతా చూస్తున్న మూడవ వాడు 'గామ్'అంటే 'గోవును', 'ఆనయ' అంటే 'తీసికొనిరా'; 'నయ'అంటే 'తీసికొనిపో' అని అర్థాలు అని గ్రహిస్తాడు. 'గామ్'తీసివేసి ఆ వాక్యంలో 'అశ్వమ్' అని ప్రయోగించగానే దాని అర్థం ఇది కదా అని గ్రహిస్తాడు. ఈ విధంగా ఆవాపోద్వాపాలచేత ఆ యా పదాల అర్థాన్ని తెలుసుకుంటాడు. (ఒక పదాన్ని ప్రయోగించడం 'ఆవాపం', ఉన్నదాన్ని తీసివేయడం 'ఉద్వాపం') ఈ అర్థాలన్నీ ఇతరపదార్థాలతో అన్వయించినట్లుగానే అతనికి కనబడుతున్నాయి. అందుచేత పదాలు ఇతరపదాల అర్థాలతో సంబంధించిన (అన్వయించిన) అర్థాన్నే బోధిస్తాయి. అన్ని వాక్యాలలోనూ ప్రక్రియ పైనచూపిన విధంగానే ఉంటుంది కదా?" ఇది అన్వితాభిధానవాదం. "అన్వితానామ్ = ఇతరపదార్థాలతో అన్వయించిన అర్థములయొక్క, అభిధానమ్ = బోధించుట"అని దీని అర్థం. ఈ మతం ప్రకారం పదార్థాలతో పాటు వాటి పరస్పరాన్వయాన్ని కూడా బోధించే శక్తి పదాలకే ఉన్నది గాన దానికోసం వేరే తాత్పర్యం అనే వృత్తిని అంగీకరించవలసిన పని లేదు.

పదాలు ఒకదానితో ఒకటి అన్వయిస్తాయి అని సామాన్యరూపంలో తెలిసినా ఆ అన్వయం ఒక్కొక్క వాక్యంలో ఒక్కొక్క విధంగా ఉండడంచేత ఆ అన్వయవిశేషాన్ని తెలుసుకోవాలంటే 'తాత్పర్యం' అనే శక్తిని అంగీకరించాలి కదా?

అందుచేత పదాలకు ఉన్న శక్తికి భిన్నంగా తాత్పర్యం అనే శక్తి వేరుగా ఉన్నది అనే అభిహితాన్వయవాదమే యుక్తమని చాలామంది శాస్త్రకారుల అభిప్రాయం. మమ్మటుడు కూడా "ఇతి అభిహితాన్వయవాదినాం మతమ్" అని గౌరవపూర్వకంగా బహువచనం ఉపయోగించాడు. "ఇతి అన్వితాభిధానవాదినః" అని ద్వితీయ పక్షంవిషయంలో (షష్ఠి) ఏకవచనం ఉపయోగించాడు. అందుచేత రతనికికూడా అభిహితాన్వయవాదమే సంమతమని వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇది తమ అభిప్రాయానికి అనుగుణంగా వ్యాఖ్యానించడమే కాని దీనిలో అంత స్వారస్యం లేదు. శాస్త్రగ్రంథాల శైలిలో ఒక పద్ధతి ఉంటుంది. ఆ పద్ధతి ప్రకారం మామూలుగా అర్థంచేసుకుంటే— "ఇది అభిహితాన్వయవాదుల మతం;........ఇలాగ అని అన్వితాభివాదులు అంటారు" అనే ఇక్కడ అర్థం చెప్పుకోవడం న్యాయం. అలంకార శాస్త్రానికి సంబంధించినంతవరకు అభిహితాన్వయవాదమైనా అన్వితాభిధానవాదమైనా ప్రధానసిద్ధాంతాలలో భేదం ఏమీ కనబడదు.

కా. సర్వేషాం ప్రాయశోఽర్థానాం వ్యఞ్జకత్వమపీష్యతే.

వృ. తత్ర వాచ్యస్య యథా-

గాథ- మాఏ ఘరోవఅరణం అజ్జహు ణత్థిత్తి సాహిఅం తుమఏ,
తా భణ కిం కరణిజ్జం ఏమేఅ ణ వాసరో ఠాఇ. 6

"మాతర్గృహోపకరణమద్య ఖలు నాస్తీతి సాధితం త్వయా,
తద్భణ కిం కరణీయమేవమేవ న వాసరః స్థాయీ".

వృ. అత్ర స్వైరవిహారార్థినీతి వ్యజ్యతే.

వ్యా. కేవలం శబ్దమే కాదు, "అన్ని విధాలైన అర్థాలూ కూడా, అనగా వాచ్యార్థమూ, లక్ష్యార్థమూ, వ్యంగ్యార్థమూ కూడా, సాధారణంగా వ్యంజకములు (పైకి కనబడే అర్థమే కాకుండా మరొక అర్థాన్ని సూచించేవి) అని అంగీకరింపబడింది".

వాటిలో వాచ్యార్థం వ్యంజకం అవడానికి ఉదాహరణం-

వ్యా. ప్రియుణ్ణి కలవడంకోసం బైటకు వెళ్ళవలెననే అభిలాషగల ఒక యువతి తల్లితో అంటూన్న మాటలు-

"అమ్మా! ఇంట్లోకి సామానులు లేవు. (అచ్చుకోవాలి) అని అన్నావు కదా! మరి ఏమి చెయ్యాలో (ఏమి తేవాలో చెప్పు); పగలు ఇలాగే ఉండదు కదా? (చీకటి పడితే తెచ్చుకోవడం కష్టం కదా ?"

వి. ఈ గాథ వినగానే తెలిసిన అర్థాన్ని (వాచ్యార్థాన్ని) బట్టి ఈ యువతి స్వేచ్ఛావిహారాన్ని కోరుచున్నది అనే భావం గమ్యం అవుతున్నది. అందుచేత వాచ్యార్థం వ్యంజకము అనేదానికి ఉదాహరణం.

వృ. లక్ష్యస్య యథా-

గాథ- సాహేన్తీ సహీ సుహఅం ఖణేఖణే దూమ్మిఆసి మజ్ఝకఏ
సబ్భావణేహకరణిజ్జసరిసఅం దావ విరఇఅం తుమఏ. 7

"సాధయన్తీ సఖి సుభగం క్షణే క్షణే దూనాసి మత్కృతే,
సద్భావస్నేహకరణీయసదృశం తావద్విరచితం త్వయా"

వృ. అత్ర మత్ప్రియం రమయన్త్యా త్వయా శత్రుత్వమాచరిత మితి లక్ష్యమ్; తేన చ కాముకవిషయం సాపరాధత్వప్రకాశనం వ్యఙ్గ్యమ్.

వ్యా. లక్ష్యార్థం వ్యంజకం అనడానికి ఉదాహరణం-

సాహేన్తీ ఇత్యాది- "ఓ! సఖీ! సుందరుడైన ఆ నాయకుణ్ణి నా కోసం మాటిమాటికి బ్రతిమాలి చాలా శ్రమపడ్డావు. మంచితనానికి, స్నేహానికి తగినట్లుగా ఎంత చెయ్యాలో అంత చేశావు".

వి. తనకోసమై నాయకుణ్ణి తీసికొనివస్తా నని వెళ్ళి అతనితో రమించి వచ్చిన సఖితో చాతుర్యం గల నాయిక అంటున్న మాటలు ఇవి.

వ్యా. అత్రేతి- "నా ప్రియుణ్ణి రమింపచేసిన నీవు చేసినది మిత్రత్వం కాదు, శత్రుత్వం అని లక్ష్యార్థం. ఈ లక్ష్యార్థంచేత ఆ కాముకులిద్దరూ చేసిన అపరాధాన్ని ప్రకాశింపచేయడం వ్యంగ్యం.

వృ. వ్యజ్గ్యస్య యథా-

గా. ఉఅ ణిచ్చలణిప్పందా భిసిణీపత్తమ్మి రేహఇ బలాఆ,
ణిమ్మలమరగలభాఅణపరిట్ఠిఆ సంఖసుత్తివ్వ. 8

"పశ్య నిశ్చలనిష్పన్దా బిసినీపత్రే రాజతే బలాకా,
నిర్మలమరకతభాజనపరిస్థితా శఙ్ఖశుక్తిరివ".

వృ. అత్ర నిష్పన్దత్వేనాశ్వస్తత్వమ్; తేన చ జనరాహిత్యమ్; అతః సంకేతస్థానమేతదితి కయా చిత్ కం చిత్ ప్రత్యుచ్యతే.

అథవా మిథ్యా వదసి, న త్వమత్రాగతో౽భూరితి వ్యజ్యతే.

వ్యా. ఒక వ్యంగ్యార్థం మరొకవ్యంగ్యార్థాన్ని వ్యంజింపచేయడానికి ఉదాహరణం.

ఉఅ ఇతి- "ఆ తామరాకు మీద ఆ కొంగ శరీరచలనం లేకుండా, అవయవస్పందనం లేకుండగా, ఎలా కూర్చున్నదో చూడు; నిర్మలమైన మరకత మాణిక్యాల పళ్లెంలో శంఖం వలె ప్రకాశిస్తూన్నది."

అత్రేతి- కొంగ నిశ్చలంగా కదలకుండా కూర్చున్న దని చెప్పడంచేత ఆ కొంగ నిర్భయంగా ఉన్న దని వ్యంగ్యం అవుతూన్నది. ఈ వ్యంగ్యాన్ని పట్టి ఇక్కడ జనం ఎవరూ లేరు అనే అర్థం వ్యంగ్యం అవుతూన్నది. దీనిని పట్టి "ఇది మనిద్దరం కలుసుకోవడానికి తగిన సంకేతస్థానం" అని నాయకునితో ఈ మాటలు అంటూన్న నాయిక మనస్సులోని అభిప్రాయ మని మరొక వ్యంగ్యార్థం వ్యంగ్యం అవుతున్నది.

లేదా- కొంగ నిర్భయంగా ఉన్నది; ఈ ప్రదేశం జనరహితము అనే వ్యంగ్యార్థాలు- "నీవు ఆ ప్రదేశానికి వచ్చానని అంటున్నావు. అది అబద్ధం; నీవు వచ్చి ఉన్నట్లయితే ఆ కొంగ అక్కడ ఇంత నిర్భయంగా కూర్చొని ఉండేది కాదు" అనే మరొకవ్యంగ్యార్థాన్ని వ్యంజింపచేస్తున్నాయి.

వృ. వాచకాదీనాం క్రమేణ స్వరూపమాహ-

కా. సాక్షాత్సంకేతితం యోఽర్థమభిధత్తే స వాచకః. 7

వృ. ఇహాగృహీతసంకేతస్య శబ్దస్యార్థప్రతీతేరభావాత్సంకేత సహాయ ఏవ శబ్దోఽర్థవిశేషం ప్రతిపాదయతీతి యస్య యత్రావ్యవధా నేన సంకేతో గృహ్యతే స తస్య వాచకః.

వ్యా. వాచకాదీనామితి- ఇప్పుడు వాచక-లక్షక-వ్యంజకశబ్దాల స్వరూపం విశదీకరిస్తున్నాడు.

సాక్షాదితి- యః=ఏ శబ్దము, సాక్షాత్=ప్రత్యక్షంగా, వ్యవధానం లేకుండా (Directly), సంకేతితమ్=సంకేతితమైన, అర్థమ్=అర్థమును, అభిధత్తే= బోధించునో, సః=అది, వాచకః=వాచకము, లేదా "ఏది సంకేతితమైన అర్థాన్ని సాక్షాత్తూ (Directly) బోధిస్తుందో అది వాచకము"

ఇహేతి- ఇక్కడ అనగా లోకవ్యవహారంలో, గ్రహింపబడని సంకేతం గల, దేని సంకేతం గ్రహింపబడలేదో అట్టి, శబ్దానికి సంబంధించిన అర్థంయొక్క ప్రతీతి కలగదుగాన సంకేతసహాయం ఉన్న శబ్దమే అర్థవిశేషాన్ని బోధిస్తుంది. అందుచేత ఏ శబ్దమునకు ఏ అర్థమునందు అవ్యవధానమైన సంకేతం ఉంటుందో ఆ శబ్దం ఆ అర్థానికి వాచకం.

ఉ. 'వృక్షః' అంటే 'చెట్టు' అని అర్థం; 'ఫలమ్' అంటే 'పండు' అని అర్థం. ఇత్యాది రీతిలో 'ఈ శబ్దానికి ఇది అర్థం' అని ఏర్పరచుకొన్న కట్టుబాటుకు 'సంకేతం' అని పేరు. ఈ సంకేతం తెలియనివానికి ఒక శబ్దానికి ఏమి అర్థమో తెలియదు. ఆ శబ్దానికి ఆ అర్థం విషయంలో ఉన్న సంకేతం తెలిస్తేనే ఆ శబ్దం ఆ అర్థాన్ని బోధిస్తుంది. ఈ విధంగా ఏ శబ్దానికి ఏ అర్థం విషయంలో ప్రత్యక్షంగా, అతిసన్నిహితంగా సంకేతం ఉంటుందో ఆ శబ్దం ఆ అర్థాన్ని బోధిస్తుంది. అందుచేత ఆ శబ్దం ఆ అరానికి వాచకం.

'అగృహీతసంకేతస్య శబ్దస్య' అన్న పాఠానికి బదులు "అగృహీతసంకేతాత్ శబ్దాత్" అనే పాఠం ఉంటే బాగుంటుంది. "అట్టి శబ్దంవల్ల అర్థజ్ఞానం కలగదు కాబట్టి"అని అర్థం. కాని చాలా పుస్తకాలలో మొదటి పాఠమే ఉంది. 'శబ్దస్య' అనేదానికి 'అర్థప్రతీతేః' అనే దానిలోని 'అర్థ'శబ్దంలో అన్వయం చెప్పుకొనవలసి

ఉన్నది గాన అసమర్థసమాసం అవుతుంది. అయితే ప్రదీపోద్ద్యోతాలతో ఉన్న ఆనందాశ్రమప్రతిలో పాదికలో (Foot note) "శబ్దార్థవిశేషప్రతిపత్తేరభావాత్" అనే పాఠాంతరం చూపబడింది. అప్పుడు "సంకేతం గ్రహించటానికి శబ్దానికి సంబంధించిన అర్థవిశేషం తెలియదు కాబట్టి" అని అర్థం చెప్పుకోవచ్చు.

కా. సంకేతితశ్చతుర్భేదో జాత్యాదిర్జాతిరేవ వా.

వృ. యద్యప్యర్థక్రియాకారితయా ప్రవృత్తినివృత్తియోగ్యా వ్యక్తిరేవ తథాప్యానన్త్యాద్వ్యభిచారాచ్చ తత్ర సంకేతః కర్తుం న యుజ్యతే ఇతి, "గౌః శుక్లశ్చలో డిత్థ" ఇత్యాదీనాం శబ్దానాం విషయవిభాగో న ప్రాప్నోతీతి చ తదుపాధావేవ సంకేతః.

వ్యా. సంకేతితఇతి- చతుర్భేదః = నాలుగు భేదములు గల, జాత్యాదిః = జాతి మొదలైనది, సంకేతితః = సంకేతితమైన అర్థము, వా = లేదా, జాతిః = ఏవ = జాతిమాత్రమే సంకేతితార్థము.

వి. జాతికాని, గుణంకాని, క్రియకాని, నామంకాని, సంకేతితార్థం కావచ్చును. లేదా జాతి ఒక్కటే సంకేతితార్థం. అనగా కొన్ని శబ్దాలు జాతి వాచకాలు, కొన్ని గుణవాచకాలు, కొన్ని క్రియావాచకాలు, కొన్ని నామవాచకాలు. ఈ విధంగా సంకేతితార్థం నాలుగు విధాలుగా ఉండవచ్చు నని కొందరి అభిప్రాయం. కొందరి (మీమాంసకాదుల) అభిప్రాయం ప్రకారం అన్ని శబ్దాలూ జాతివాచకాలే.

వ్యా. యద్యపీతి: అర్థక్రియాకారి అవడంచేత ప్రవృత్తినివృత్తి యోగ్యత్వం వ్యక్తికే ఉన్న మాట నిజమే; అయినా వ్యక్తులు అనంతములు అవడంచేత, వ్యభిచారదోషంచేతా వ్యక్తియందు సంకేతం గ్రహించడం కుదరదు. వ్యక్తియందే సంకేతం అని చెప్పేపక్షంలో 'ఎద్దు' "తెల్లనిది" 'నడుస్తూన్నది' 'డిత్థము' (దాని పేరు) అనే ఈ పదాలన్నీ ఒక్క వ్యక్తినే చెపుతున్నాయి కాన విషయవిభాగం కుదరదు; అందుచేత సంకేతం వ్యక్తియందు కాదు, దాని ఉపాధియందే.

వి. 'గోవు' (ఎద్దు) ఒక వ్యక్తి. 'మనుష్యుడు' ఒక వ్యక్తి. 'ఘటం' (కుండ) ఒక వ్యక్తి. వ్యక్తి అనగా ఒక వస్తువు. అది సచేతనం కావచ్చు, అచేతనం

కావచ్చు. గోవులో 'గోత్వం' అనే ధర్మం ఉంది. మనుష్యునిలో 'మనుష్యత్వం' అనే ధర్మం ఉంది. ఘటంలో 'ఘటత్వం' అనే ధర్మం ఉంది. ఈ 'గోత్వం' మొదలైన ధర్మాలకి 'జాతి' అని పేరు. ప్రతివ్యక్తిలోను అది ఏ దేశానికి సంబంధించినా, ఏ కాలానికి సంబంధించినా, ఈ జాతి ఉంటుంది. ఒక వ్యక్తి నశించవచ్చు; కాని జాతి నశించదు. ఒక గోవు అనే వ్యక్తి నశించినా గోత్వం జాతి ఇతర గోవులలో ఉన్నది కదా. వ్యక్తులు అనంతసంఖ్యలో ఉండవచ్చు కాని జాతి మాత్రం ఒకటే. ఈ విధంగా తాను ఒక్కటే అయి ఉండి అనేకవస్తువులతో సంబంధించిన, నిత్యమైన ధర్మానికి 'జాతి' అని పేరు. "నిత్యమేకమనేకానుగతం సామాన్యమ్" ఇది జాతికి నైయాయికులు అంగీకరించిన లక్షణం. 'సామాన్యం' అనగా జాతి. 'గౌః' అంటే అర్థం తెలియనివానికి ఒక ఎద్దును చూపించి "అయం గౌః" (ఇది గోవు) అని చెప్పినప్పుడు 'గౌః' అనేదానికి ఇది కదా అర్థం అని అతడు తెలుసుకుంటాడు. అనగా అతనికి 'గో' శబ్దానికి 'ఎద్దు' అనే అర్థంలో సంకేతం అన్న జ్ఞానం కలిగినదన్నమాట. అయితే ఇక్కడ 'గో' శబ్దానికి 'ఎద్దు' అనే ఒక వ్యక్తి విషయంలో సంకేతమా, లేదా గోత్వ జాతియందు గాని, మరి దేనియందేనా కాని సంకేతమా అనేది ప్రశ్న. పైకి చూడడానికి వ్యక్తియందే సంకేతం అని చెప్పడమే యుక్తం అన్నట్లు కనబడుతుంది. ఎందుచేతననగా- 'గో' శబ్దానికి అర్థం ఏమిటి? అని ప్రశ్నించినప్పుడు ఒక ఎద్దును (వ్యక్తిని) చూపి 'ఇది' అని చెప్పడం జరిగింది. బరువు మోయడం, దున్నడం వంటి ప్రయోజనాలను సాధించే పనులు ఒక గోవ్యక్తియే (ఎద్దే) చేయగలుగుతుంది. దీనికే 'అర్థక్రియాకారిత్వం' అని పేరు. కావాలంటే సంపాదించడానికి, అవసరంలేకపోతే విడచివేయడానికి ఒక వ్యక్తివిషయంలోనే కుదురుతుంది. దీనికి "ప్రవృత్తి నివృత్తి యోగ్యత" అని పేరు. ఈ కారణాలచేత వ్యక్తియందే సంకేతగ్రహం అని చెప్పవలసి ఉన్నా ఇలా చెప్పడంలో కొన్ని అనుపపత్తులు ఉన్నాయి. ఒక గోవ్యక్తియందు సంకేతగ్రహం ఏర్పడినతరవాత మరొక వ్యక్తి కనబడినప్పుడు మళ్ళీ కొత్తగా ఆ గోవ్యక్తివిషయంలో కొత్తగా సంకేతగ్రహం పొందవలసి ఉంటుంది. ఈ విధంగా అనంతగోవ్యక్తుల విషయంలో అనంతసంకేతగ్రహాలను అంగీకరించవలసి ఉంటుంది. ఇది శక్యం కాని విషయం. ఒక మాటు వ్యక్తిశక్తిగ్రహం కలుగుతే చాలు. మరొక వ్యక్తి జ్ఞానం కూడా దాని వల్లనే కలుగుతుంది అని అంగీకరిస్తే వ్యభిచారదోషం కలుగుతుంది. "ఒక శబ్దం

సంకేతితమైన అర్థాన్నే బోధిస్తుంది" అని కదా నియమం. మర్నాడు కనబడిన గోవ్యక్తి విషయంలో సంకేతం లేకుండానే అది గోపదార్థం అనే జ్ఞానం కలుగుతే ఆ నియమానికి భంగం ఏర్పడింది కదా? ఇదొక వ్యభిచారం. సంకేతగ్రహం లేక పోయినా ఆ అర్థం తెలిసే పక్షంలో సంకేతగ్రహం లేని అశ్వం విషయంలో కూడా "అయం గౌః" అనే జ్ఞానం కలగవలసి ఉంటుంది. ఇదొక వ్యభిచారదోషం. ఈ విధంగా ఆనంత్యము, వ్యభిచారమూ అనే దోషాలు ఉండడంచేత వ్యక్తియందు సంకేతాన్ని అంగీకరించడం కుదరదు.

అవి బోధించే అర్థాల భేదాలను పట్టి శబ్దాలను నాలుగు విధాలుగా విభజించవచ్చు అని ప్రతిపాదిస్తూ మహాభాష్యంలో పతంజలి "చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః జాతి శబ్దాః, గుణశబ్దాః, క్రియాశబ్దాః,యదృచ్ఛా శబ్దాశ్చతుర్థాః" (ఋలౄక్ సూత్రభాష్యం) అని అన్నారు. ఒక శబ్దాన్ని ప్రయోగించడానికి నిమిత్తం అర్థం. అర్థాన్ని బోధించడంకోసమే కదా శబ్దప్రవృత్తి (శబ్దప్రయోగం). అందుచేత అర్థాన్ని "ప్రవృత్తినిమిత్తం" అని కూడా అంటారు. "శబ్దాల ప్రవృత్తి నాలుగు విధాలుగా ఉంటుంది; కొన్ని జాతిశబ్దాలు, కొన్ని గుణశబ్దాలు, కొన్ని క్రియాశబ్దాలు, కొన్ని యదృచ్ఛాశబ్దాలు, ఇవి నాల్గవరకం" అని పై వాక్యానికి అర్థం. ఒకే ఎద్దును ఉద్దేశించి చెపుతూ గౌః (ఇది ఎద్దు), శుక్లః (ఇది తెల్లనిది), చలః (ఇది నడుస్తూన్నది), డిత్థః (ఇది డిత్థ- దీని పేరు డిత్థం) అని చెప్పినపుడు ఈ పదాలన్నింటికీ సంకేతం ఒక ఎద్దు అనే వ్యక్తియందే అనే పక్షంలో ఈ నాలుగు పదాలూ కూడా ఒకే ఎద్దును బోధిస్తూండడంచేత "హస్తః, పాణిః, కరః" ఇత్యాది శబ్దాల వలె పర్యాయపదాలు అని చెప్పవలసివస్తుంది. ఒక పదం ప్రయోగిస్తే మిగిలిన పదాలప్రయోగం అనుచితం అవుతుంది. అందుచేత ఇక్కడ ఉన్న నాలుగు పదాలకీ నాలుగు వేరు వేరు అర్థాల విషయంలో సంకేతం అనీ, ఆ అర్థాలనే అవి బోధిస్తున్నా యనీ చెప్పాలి. అప్పుడే ఈ పదాల విషయవిభాగం కుదురుతుంది. 'గో' శబ్దానికి గోత్వజాతియందు సంకేతం; 'శుక్లః' అనేదానికి శుక్లగుణంలో సంకేతం; 'చలః' అనేదానికి చలనక్రియలో సంకేతం; 'డిత్థః' అనేదానికి సంజ్ఞలో సంకేతం. గోత్వం, గుణం, క్రియ, సంజ్ఞ- ఈ నాలుగూ వ్యక్తికి సంబంధించిన ఉపాధులు, (ధర్మాలు). అప్పుడు ఈ పదాలకి వేరు వేరు అర్థాలు ఉన్నాయి. అందుచేత పర్యాయపదాలు కావు. అందుచేత 'గౌః శుక్లః చలః డిత్థః' ఇత్యాదివాక్యం "హస్తః పాణిః కరః" వంటిది కాదు గాన నిర్దుష్టమే.

అవతారిక: ఈ విధంగా సంకేతం వ్యక్తియందు కాదు; వ్యక్తికి సంబంధించిన ఆ యా ఉపాధులయందు అని తేలింది. ఇప్పుడు ఉపాధి అంటే ఏమో విశదీకరిస్తున్నాడు :-

వృ. ఉపాధిశ్చ ద్వివిధః- వస్తుధర్మో వక్తృయదృచ్ఛాసంనివేశితశ్చ. వస్తుధర్మోఽపి ద్వివిధః- సిద్ధః సాధ్యశ్చ. సిద్ధోఽపి ద్వివిధః- పదార్థస్య ప్రాణప్రదో విశేషాధానహేతుశ్చ. తత్రాద్యో జాతిః; ఉక్తం హి వాక్యపదీయే "న హి గౌః స్వరూపేణ గౌః, నాప్యగౌః, గోత్వాభిసంబన్ధాత్తు గౌః" ఇతి. ద్వితీయో గుణః. శుక్లాదినా హి లబ్ధసత్తాకం వస్తు విశిష్యతే. సాధ్యః పూర్వాపరీభూతావయవః క్రియారూపః. డిత్థాదిశబ్దానామన్త్యబుద్ధినిర్గ్రాహ్యం సంహృతక్రమం స్వరూపం వక్త్రా యదృచ్ఛయా డిత్థాదిష్వర్థేషూపాధిత్వేన సంనివేశ్యత ఇతి సోఽయం సంజ్ఞారూపో యదృచ్ఛాత్మకః ఇతి "గౌః శుక్లః చలః డిత్థః" ఇత్యాదౌ "చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః" ఇతి మహాభాష్యకారః. పరమాణ్వాదీనాం తు గుణమధ్యపాఠాత్ పారిభాషికం గుణత్వమ్. గుణక్రియాయదృచ్ఛానాం వస్తుత ఏకరూపాణామప్యాశ్రయభేదాద్భేద ఇవ లక్ష్యతే, యథైకస్య ముఖస్య ఖడ్గముకురతైలాద్యాలమ్బనభేదాత్.

వ్యా. ఉపాధిః ఇతి- వస్తువులో ఉండే ధర్మము, వక్త తన ఇచ్ఛను పట్టి ఏర్పరచినది అని ఉపాధి రెండు విధాలు- వస్తువులో ఉండే ధర్మమైన ఉపాధి సిద్ధము. సాధ్యము అని రెండు విధాలు. సిద్ధం కూడా పదార్థానికి ప్రాణం ఇచ్చేది పదార్థంలో ఒక విధమైన విశేషాన్ని సమకూర్చేదీ అని రెండు విధాలు.



వాటిలో మొదటిది, అనగా పదార్థప్రాణప్రదమైన సిద్ధోపాధియే, జాతి ప్రాణప్రదం అనగా ఆ వస్తువు ఉన్నంతవరకూ దానితో సంబంధించి ఉండేది; ఆ వస్తువును ఆ పేరుతో వ్యవహరించడానికి హేతువు అయినది అని అర్థం. అందుచేతనే భర్తృహరి వాక్యపదీయంలో జాతిని గూర్చి మాట్లాడుతూ-"ఒక వ్యక్తిని 'గౌః'అని అంటున్నా మనగా దాని స్వరూపాన్ని పట్టి కాదు; అదే విధంగా దాని స్వరూపాన్ని పట్టి 'అగౌః' (గోవుకానిది)అని కూడా అనడానికి వీలులేదు. దానిలో 'గోత్వం' అనేది ఉండడంచేతనే దానిని "గౌః"అని అంటున్నాం. (ఆ గోత్వం లేనిదానిని 'అగౌః'అని అంటున్నాం)" అని అన్నాడు. ఈ విధంగా గోత్వం, మనుష్యత్వం, ఘటత్వం మొదలైనవి, ఒకవ్యక్తిలో ఉన్న సిద్ధములైన (సహజములైన)ఉపాధులు, (ధర్మాలు). 'గౌః' 'మనుష్యః' 'ఘటః' ఇత్యాది వ్యవహారానికి హేతువులు గాన అవి ప్రాణప్రదములు. అవే జాతులు.

ద్వితీయఇతి- సిద్ధోపాధులలో రెండవదైన 'విశేషాధానహేతువు' గుణం. పొందబడిన సత్త (ఉనికి)గల, అనగా పుట్టి ఉన్న వస్తువే శుక్లం (తెలుపు) మొదలైనవాటిచేత విశేషించబడుతుంది కదా.

వి. 'గోత్వం' అనే జాతి ఉన్న వన్నీ గోవులే. అందుచేత ఒక గోవుకు మిగిలిన గోవులన్నీ సజాతీయాలే, సమానజాతికి చెందినవే. అందుచేత గోవు అనగా ఏ గోవైనా కావచ్చును. కాని 'తెల్లని గోవు' అన్నప్పుడు తెలుపు అనే గుణం, ఆ గుణం లేని ఇతరగోవులనుంచి ఈ గోవును వేరు చేస్తున్నది. దీనికే 'సజాతీయవ్యావర్తనం'అని పేరు. 'విశేషాధానహేతుః' అనే పదానికి ఇదే అర్థం. అలాంటి విశేషాధానహేతువై ఒకవ్యక్తితో కలిసి ఉన్నదానికి గుణం అని పేరు. జాతి- క్రియా- ద్రవ్యములకంటె భిన్నమైన ధర్మమాత్రము గుణము అని చెప్ప వచ్చును.

వ్యా. సాధ్యః-ఇతి- వస్తుధర్మమైన సాధ్యమైన ఉపాధి ముందువెనుకలలో ఉండే, అనగా ఒక క్రమంలో ఉండే, అవయాలు గలది; క్రియారూపమైనది.

వి. "ఓదనం పచతి" "గ్రామం గచ్ఛతి" ఇత్యాదివాక్యాలలో ఉన్న క్రియా పదాలు వండుట, వెళ్ళుట మొదలైన క్రియలను బోధిస్తున్నాయి. "వండుట" "వెళ్ళుట" అనేవి ఒక్కొక్క క్రియ అన్నట్లు మనం వ్యవహరిస్తున్నాం. నిజానికి

అవి ఒక్కొక్క క్రియలు కావు. అనేకక్రియల సముదాయం. అన్నం వండడం అనే క్రియలో బియ్యం గిన్నెలో పోయడం, దానిని పొయ్యిమీద పెట్టడం, నిప్పు అంటించడం, బియ్యం ఉడికి పెద్దవిగా ఉబ్బడం, మధ్య మధ్య అగ్ని జ్వాలను హెచ్చించడం, తగ్గించడం, గిన్నె క్రిందికి దింపడం మొదలైన అనేకక్రియలు ఒక క్రమంలో ఉంటాయి. ఇవన్నీ వండడం అనే క్రియ అవయవాలు. వీటి సముదాయమే వండడం అనే ఒక క్రియ. గమనాదిక్రియల్లో కూడ ఒక పాదం ఎత్తి నేలమీద వేయడం, తరవాత రెండవ పాదం ఎత్తడం, చేతులు ఊపడం, ఎదుట ఏముందో చూస్తూ ఉండడం ఇత్యాదిక్రియలు ఉంటాయి. ఈ క్రియ అనేది ఒక వస్తువులో సాధించవలసిన ధర్మం.

వ్యా. డిత్థాదీతి:- "ఒక వక్త తన ఇచ్ఛను అనుసరించి 'డిత్థను' మొదలైన అర్థాలు బోధించడం కోసం చివరివర్ణము జ్ఞానంచేత గ్రహింపదగినటి, క్రమం లేనిదీ అయిన 'డిత్థ' మొదలైన శబ్దాల స్వరూపాన్ని ఆ అర్థాల ఉపాధిగా ఏర్ప రచుకుంటాడు. సంజ్ఞారూపమైన ఈ శబ్దమే "యదృచ్ఛాత్మకము."

వి. "యదృచ్ఛ" అనగా "ఇచ్ఛ"అని అర్థం. ఒకడు తన ఎద్దుకు, తన ఇష్టం ప్రకారం 'డిత్థ'అనే పేరుపెట్టుకొన్నాడు. మరొకడు "డవిత్థ"అని పేరు పెట్టుకొన్నాడు. ఇవన్నీ స్వేచ్ఛాకల్పితాలైన పేర్లు. అందుచేత వీటిని యదృచ్ఛా శబ్దాలనీ, సంజ్ఞాశబ్దా లనీ అంటారు. ఇవి ఆ 'ఎద్దు'అనే వస్తువుకు ఉపాధిగా కల్పించబడ్డాయి. ఉపాధులుగా ఉన్న ఈ 'డిత్థ'మొదలైన శబ్దాలు స్ఫోటరూప మైనవి. స్ఫోటరూపమైన శబ్దం మొదటి వర్ణం వినగానే కొంచం బుద్ధిగోచరమై చివరి అక్షరంవినేటప్పటికి పూర్తిగా గ్రహించబడుతుంది. ఆ విధంగా పూర్తిగా బుద్ధిగోచరమైన స్ఫోటరూపశబ్దంలో ఈ అక్షరాలక్రమం భాసించదు. అది ఒక అఖండపదంగానే భాసిస్తుంది. ఉదాహరణకి- ఒక వస్త్రంలో ఉన్న ఒక దారం కనబడి దాని జ్ఞానంతో ప్రారంభమైన వస్త్రజ్ఞానం అన్ని దారాలూ కనబడేటప్పటికి పూర్ణం అవుతుంది. ఈ పూర్ణవస్త్రజ్ఞానంలో వేరు వేరు దారాల జ్ఞానం ఉండదు. అది అఖండవస్త్రజ్ఞానం. ఈ విధంగా ఆ యా వస్తువులకు సంజ్ఞలుగా కల్పించు కున్న డిత్థ-డవిత్థ-చైత్ర-మైత్ర-దేవదత్త-యజ్ఞదత్త మొదలైన సంజ్ఞాశబ్దాలు వాటి ఉపాధులు. వీటికి 'ద్రవ్యశబ్దాలు'అని కూడా వ్యవహారం ఉంది.

వ్యా. గౌః ఇతి:- "గౌః(ఎద్దు-జాతివాచకం), శుక్లః (తెల్లగాఉన్న-గుణవాచ

కం), చలః (నడచుచున్న-క్రియావాచకం), డిత్థః(డిత్థం అనేపేరుగల-యదృచ్ఛా శబ్దం) ఇత్యాదులలో శబ్దాల ప్రవృత్తి నాలుగు విధాలుగా ఉంటుంది అని భాష్య కారులు అన్నారు, (ఇక్కడ "చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః"అనేదే భాష్యకార వచనం. "గౌః శుక్లః చలో డిత్థః ఇత్యాది" అనేది మమ్మటుడు ఉదాహరణార్థం చూపినవాక్యం. చాలా పుస్తకాలలో ఈ రెండు వాక్యాంశాలూ కలిపి ఉద్ధరణ చిహ్నాల (Quotation marks) మధ్య చూపించడంచేత అంతా భాష్యవాక్యమే అనే భ్రాంతికి అవకాశం ఉంది).

వ్యా. పరమాణ్వితి :- "పరమాణ్వాదులను గుణాల మధ్య పఠించడంచేత వాటికి ఉన్న గుణత్వం పారిభాషికమే."

వి. వైశేషికసిద్ధాంతం ప్రకారం దేనికంటె ఇంక చిన్నది ఉండదో దానికి 'పరమాణువు'అని పేరు. దాని పరిమాణానికి కూడా 'పరమాణువు'అనే పేరు. ఈ 'పరమాణువు' 'పరమమహత్తు' మొదలైనవాటిని వైశేషికులు గుణా లని అంగీ కరించారు. "వీటిలో కూడా 'పరమాణుత్వం' మొదలైన ప్రాణప్రదాలైన జాతులు ఉన్నాయి కదా ? అందుచేత వీటిని జాతివాచకా లనే చెప్పాలి; ఇవి గుణాలు ఎట్ల యినవి ?"అని సందేహం. దానికిసమాధానంగా పై వాక్యం చెప్పబడింది. వైశేషి కులు వాళ్ళ శాస్త్రంలో వాటికి 'గుణం' అని పేరు పెట్టుకొన్నారనగా అది వాళ్ళు కల్పించుకొన్న పరిభాష. మహాభాష్యంలో చెప్పిన విధంగా అవి కూడా జాతి వాచకశబ్దాలే; గుణవాచకాలు కావు అని భావం.

శంక :- శంఖంలో ఉన్న తెలుపు వేరు, పాలల్లో ఉన్న తెలుపు వేరు; బట్ట తెలుపు వేరు. ఈ విధంగా శుక్లాదిగుణాలు వేరు వేరుగా అనంతసంఖ్యలో కన బడుతున్నాయి. అదే విధంగా బెల్లానికి సంబంధించిన పాకక్రియ వేరు; తండు లాదులకు సంబంధించిన పాకక్రియ వేరు. ఈ విధంగా క్రియలు కూడా వేరు వేరుగా, అనంతసంఖ్యలో కనబడుతున్నాయి. కొన్ని శబ్దాలకి గుణక్రియాదులందు శక్తి (వాచకత్వము)అనే పైన చెప్పిన సిద్ధాంతంలో కూడా వ్యక్తిశక్తివాదంలో చూపించిన ఆనంత్యవ్యభిచారదోషాలు ఉన్నాయి కదా అని శంక. దానికి సమా ధానం చెపుతున్నాడు.

వ్యా. గుణేతి:-"గుణము, క్రియ, యదృచ్ఛ-ఇవి వాస్తవంలో ఏకరూపాలే అయినా వాటి ఆశ్రయాల భేదాన్ని పట్టి, ఒకే ముఖం(ముఖప్రతిబింబం) ఖడ్గమూ,

అద్దమూ, తైలమూ మొదలైన ఆధారాల భేదాన్ని పట్టి వేరు వేరుగా కనబడినట్లు, వేరువేరుగా కనబడుతున్నాయి.

వి. తెలుపు మొదలైన గుణాలు, పాకం మొదలైన క్రియలూ, యదృచ్ఛలు కూడా వాస్తవానికి ఒకటే. శంఖంలో ఉన్నా, పాలలో ఉన్నా తెలుపు అనేది ఒకటే. అట్లే క్రియాయాదృచ్ఛికాలవిషయంలో కూడా. ఒకే ముఖం ఖడ్గంలో ప్రతిబింబించినప్పుడు ఒక విధంగాను, తైలంలో ప్రతిబింబించినప్పుడు మరొక విధంగానూ, ఇది వేరు అది వేరు అన్నట్లుగా కనబడుతుంది. అదే విధంగా తనకు ఆశ్రయమైన శంఖం, పాలు మొదలైనవాటి భేదాన్ని పట్టి తెలుపు కూడా భిన్నంగా కనబడుతున్నది. వాస్తవంలో ఎక్కడున్నా తెలుపు ఒకటే. అందుచేత గుణ-క్రియా-యదృచ్ఛలయందు శక్తిని అంగీకరించడంలో దోషం లేదు అని భావం.

అవతారిక— "జాత్యాదిర్జాతిరేవ వా" అన్న కారికాభాగంలో చెప్పిన "జాత్యాదికం- అనగా జాతి-గుణ-క్రియా-యదృచ్ఛలు, శబ్దవాచ్యములు" అనే మహాభాష్యకారమతాన్ని నిరూపించి ఇప్పుడు "అన్ని శబ్దాలూ జాతివాచకాలే" అనే మీమాంసక మతాన్ని ప్రతిపాదిస్తున్నాడు-

వృ. హిమపయఃశఙ్ఖాద్యాశ్రయేషు పరమార్థతో భిన్నేషు శుక్లాదిషు యద్వశేన 'శుక్లః శుక్లః' ఇత్యాద్యభిన్నాభిధానప్రత్యయోత్పత్తిః తత్ శుక్లత్వాది సామాన్యమ్. గుడతణ్డులాదిపాకాదిష్వేవమేవ పాకత్వాది. బాలవృద్ధశుకాద్యుదీరితేషు డిత్థాదిశబ్దేషు చ ప్రతిక్షణం భిద్యమానేషు డిత్థాద్యర్థేషు వా డిత్థత్వాద్యస్తీతి సర్వేషాం శబ్దానాం జాతిరేవ ప్రవృత్తినిమిత్తమిత్యన్యే.

వ్యా. హిమేతి:- "వాస్తవంలో మంచుగడ్డ, పాలు, శంఖమూ మొదలైన ఆశ్రయాలలో-ఆధారాలలో-ఉన్న శుక్లాదిగుణాలు వేరు వేరే అయినా కూడ ఏది (ఏ శుక్లత్వం మొదలైనది) ఉండడంచేత "ఇదీ శుక్లమే అదీ శుక్లమే" అని భేదం లేనట్లుగా శబ్దం ద్వారా ఏ జ్ఞానం కలుగుతున్నదో (లేదా శబ్దప్రయోగం జరిగి జ్ఞానం కలుగుతూన్నదో) ఆ శుక్లత్వాదికం జాతి. అదే విధంగా బెల్లము, తండులాలు మొదలైనవాటిలో ఉన్న వేరు వేరు పాకాలలో ఉన్న పాకత్వాదులు, బాలులు,

వృద్ధులు, చిలకలు మొదలైనవి ఉచ్చరించే వేరు వేరు "డిత్థ"మొదలైన శబ్దాలలో లేదా ప్రతిక్షణమూ మార్పు చెందుతూన్న డిత్థం మొదలైన అర్థాలలో, ఉన్న డిత్థత్వం మొదలైనవి కూడా జాతులే అందుచేత అన్ని శబ్దాల ప్రవృత్తి నిమిత్తం (అర్థం) జాతి యే అని కొందరు అంటున్నారు."

వి. మంచుగడ్డ, పాలు మొదలైన వాటిలో ఉన్న తెలుపు ఒకటి కాదు. ఆ తెలుపు వేరు, ఈ తెలుపు వేరు. అయినా ఈ రెండింటినీ తెలుపే అనడానికి కారణం ఆ తెలుపులు (శుక్లాలు) అన్నింటిలోనూ ఉన్న శుక్లత్వం అనే జాతియే. అదే విధంగా గుడంలో ఉన్న పాకం వేరు, తండూలాలలో ఉన్నది వేరు. రెండింటినీ పాకం అనడానికి కారణం వాటిలో 'పాకత్వం' అనే జాతి ఉండటమే ఇంక యదృచ్ఛాశబ్దాలు ఉన్నాయి. ఒక ఎద్దుకు 'డిత్థం' అనే పేరు ఉంది. ఆ పేరును బాలులు, వృద్ధులు, చిలకలు ఉచ్చరించినపుడు ఉచ్చారణ భేదాన్ని పట్టి ఆ శబ్దాలు వేరే అయినా ఆ శబ్దాలు అన్నింటిలోనూ 'డిత్థత్వం' అనే జాతి ఉంది. లేదా ఆ డిత్థ శబ్దానికి అర్థమైన ఎద్దును తీసికొన్నా కూడ ఆ ఎద్దు క్షణ క్షణానికి మారిపోతూ ఉంటుంది కనుక ఈ క్షణంలో ఉన్న డిత్థం వేరు, వెనుకటి క్షణాలలోనిది వేరు, రాబోయే క్షణాలలోనిది వేరు. అయినా వీటి అన్నింటిలోనూ డిత్థత్వం అనే జాతి ఉండడంచేత ఏకత్వప్రతీతి కలుగుతూన్నది. ఈ విధంగా గుణశబ్దాలూ, క్రియాశబ్దాలు, యదృచ్ఛాశబ్దాలు అన్నవి కూడా జాతిశబ్దాలే. అందుచేత అన్ని శబ్దాల వాచ్యార్థం జాతియే అని పూర్వమీమాంసకుల మతం.

అయితే "గామ్ ఆనయ" "శుక్లం పశ్య" ఇత్యాది వాక్యాలలో గోత్వాన్ని తీసికొనిరావడం గాని, శుక్లత్వాన్ని చూడడంగాని కుదరదు గనక 'గామ్' అనే దానికి "గోత్వమును' అని, "శుక్లమ్" అనేదానికి 'శుక్లత్వమును' అనే అర్థాలే అయినా ఆక్షేపంచేత 'గోత్వానికి ఆశ్రయమైన ఈ గోవ్యక్తి' 'శుక్లత్వానికి ఆశ్రయమైన ఈ వ్యక్తి' అనే అర్థం గ్రహించవలసి ఉంటుంది- అని జాతిశక్తివాదుల అభిప్రాయం. (ఉన్నది ఉన్నట్లుగా గ్రహిస్తే కుదరనప్పుడు మరొక విధమైన అర్థాన్ని ఊహించుకొనడం ఆక్షేపం).

వృ. తద్వాన్, అపోహో వా శబ్దార్థః కైశ్చిదుక్త ఇతి గ్రన్థగౌరవభయాత్, ప్రకృతానుపయోగాచ్చ న దర్శితమ్.

3)

వ్యా. తద్వాన్ ఇతి :- జాతి కలది లేదా అపోహ శబ్దార్థము అని కొందరు చెప్పినారు. ఆ విషయం గ్రంథం పెరిగిపోతుందనే భయంవల్లా, ప్రకృతానికి అంతగా ఉపయోగించకపోవడంవల్లా చర్చించడంలేదు.

ii. జాతివిశిష్టమైన వ్యక్తియందు శబ్దానికి శక్తి అని నైయాయికులమతం. కేవలం వ్యక్తియందు మాత్రమే శక్తి అన్నట్లయితే అనేక వ్యక్తులు ఉండడంగా ఆనంత్యవ్యభిచారదోషాలు వస్తాయి. కేవలం జాతియందే శక్తి అని అంగీకరిస్తే వ్యక్తి జ్ఞానం కలగదు. ఆక్షేపంవల్ల తెలియబడే అర్థానికి శాబ్దబోధలో ప్రవేశం కుదరదు. అందుచేత శక్తి జాతియందే అయినా ఆక్షేపంవల్ల వ్యక్తిజ్ఞానం కలుగుతుంది అనడం సరి కాదు. అందుచేత 'గో' శబ్దానికి 'గోత్వజాతి గల గోవు అనే వ్యక్తి' అని అర్థం అని నైయాయికులు ప్రతిపాదించారు.

బౌద్ధమతం ప్రకారం సర్వం క్షణికం, ఏ వస్తువూ ఒక క్షణం దాటి ఉండదు. ప్రతి వస్తువూ కూడా క్షణక్షణానికి మారిపోతూ ఉంటుంది. ఏ వస్తువీ స్థిరంగా ఉండనప్పుడు నిత్యమైన ఒక జాతి అనేది ఉన్నది అని అంగీకరించడం సర్వథా అసంగతం. అందుచేత శబ్దానికి నిత్యమని చెప్పే జాతియందు గాని, క్షణికమైన వ్యక్తియందు గాని శక్తి కుదరదు. అపోహయే శబ్దార్థం, అపోహ అనగా, అతద్వ్యావృత్తి. అతద్వ్యావృత్తి అనగా అది కాని దానినుండి వేరుచేయడం. 'గౌః' అనగా గోవుకాని అశ్వాదులకంటె వేరైనది అని అర్థం. ఇలా చెప్పడం చేత నిత్యమైనజాతిని అంగీకరించవలసిన పనిలేదు. చిరకాలంగా స్థిరంగా ఉండే (క్షణికం కాని) వ్యక్తిని అంగీకరించవలసిన పని కూడా లేదు అని క్షణికవాదులైన బౌద్ధుల అభిప్రాయం అయితే ఈ వాదాలన్నీ ప్రకృతానికి అంతగా ఉపకరించవు గాన వాటిని గూర్చి దీర్ఘచర్చ చేయడం లేదని భావం.

మమ్మటునికి మహాభాష్యకారులు చెప్పిన 'చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః' అన్న మతమే సంమతమైన దని ఊహించవచ్చు. విరోధాలంకారంలో ఈ జాత్యాదిచతుర్విధభేదాలను ఆధారంగా చేసికొని పది విభాగాలు చేయడమే కాకుండా మమ్మటుడు 'శబ్దవ్యాపారవిచారం' అనే గ్రంథంలో జాతివాదాన్ని ఖండించి వైయాకరణపక్షాన్నే స్థాపించాడు.

కా. స ముఖ్యోఽర్థస్తత్ర ముఖ్యో వ్యాపారోఽస్యాభిధోచ్యతే

వృ. స ఇతి సాక్షాత్సఙ్కేతితః. అస్యేతి శబ్దస్య.

వ్యా. స ఇతి- సః = సాక్షాత్సంకేతితమైన అర్థము, ముఖ్యః అర్థః =

ముఖ్యార్థము. తత్ర = ఆ అర్థమునందు, ఆ అర్థం బోధించడానికి ఉపయోగించే, అస్య = శబ్దంయొక్క, ముఖ్యః = ముఖ్యమైన, వ్యాపారః = వ్యాపారం, అభిధా = అభిధ అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

వి. సాక్షాత్తు అనగా అవ్యవధానంగా సంకేతితమైన జాత్యాదిరూపమైన వాచ్యార్థానికే ముఖ్యార్థం అని కూడ పేరు. "ముఖ్యం" అనగా ముఖమువంటిది అని అర్థం. ఎదుట నిలచిన వ్యక్తికి సంబంధించిన ఇతరావయవాల అన్నింటి కంటె ముందు ముఖమే కనబడుతుంది. అట్లే శబ్దం వినగానే ముందుగా స్ఫురించే అర్థం అవడంచేత దీనికి ముఖ్యార్థం అని పేరు. ఆ అర్థాన్ని బోధించే శబ్ద వ్యాపారానికి "అభిధ" అని పేరు. ఇతరవ్యాపారా లన్నింటి కంటె ఈ వ్యాపారం ముఖ్యమైనది.

అవతారిక : ఇప్పుడు లక్షణా లక్షణం చెప్పుతున్నాడు.

కా. ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్,
అన్యోఽర్థో లక్ష్యతే యత్సా లక్షణారోపితా క్రియా. 9

వ్యా. ముఖ్యార్థేతి- ముఖ్యార్థబాధే = ముఖ్యార్థమునకు బాధ కలిగినప్పుడు, తద్యోగే = ఆ ముఖ్యార్థంతో సంబంధం ఉన్నప్పుడు, రూఢితః = రూఢివలన గాని, అథ = లేదా, ప్రయోజనాత్ = ప్రయోజనంవలనగాని, యత్ = దేనిచేత, అన్యః అర్థః = మరియొక అర్థము, లక్ష్యతే = ప్రతిపాదింపబడుతుందో, సా = ఆ వృత్తి, లక్షణా = లక్షణ. ఆరోపితా = శబ్దమునందు ఆరోపించబడిన, క్రియా = వ్యాపారము.

వి. లక్షణకు మూడు హేతువులు- ముఖ్యార్థబాధ, ముఖ్యార్థ సంబంధం, కొన్ని చోట్ల రూఢి, కొన్ని చోట్ల ప్రయోజనం. 'గఙ్గాయాం ఘోషః' (గంగలో గొల్లపల్లె) ఇత్యాదులు ఉదాహరణం. 'గంగా' శబ్దానికి ముఖ్యార్థం ఒక దేశంలో ప్రవహిస్తున్న జలప్రవాహం. జలప్రవాహంలో గొల్లపల్లె ఉండడం అసంభవం. అందుచేత ఇక్కడ ఆ ముఖ్యార్థాన్ని గ్రహించడానికి వీలులేదు. ఇది ముఖ్యార్థ బాధ. అందుచేత "గఙ్గాయామ్" అనేదానికి 'గంగాతీరమునందు' అని అర్థం చెప్పుకున్నాం. తీరం గంగాశబ్దముఖ్యార్థం అయిన ప్రవాహానికిప్రక్కనే ఉన్నది గాన లక్ష్యార్థం అయిన తీరానికి ముఖ్యార్థంతో సంబంధం ఉంది. 'గఙ్గాతీరే' అనకుండా "గఙ్గాయామ్" అని చెప్పడంతో గంగాప్రవాహం ఎంత పవిత్రమైనదో ఈ ఘోషం కూడా అంత పవిత్రమైనది, దీనిలో కూడా చల్లదనం ఉంది ఇత్యాది విషయాలను సూచించడం ప్రయోజనం. రూఢికి ఉదాహరణలు ముష్కుందు

స్పష్టం అవుతాయి. ఈ విధంగా ఇక్కడ ముఖ్యార్థబాధ, ముఖ్యార్థసంబంధం, ప్రయోజనం అనే మూడు హేతువులు ఉండడంవల్ల 'గంగాతటం' అనే మరొక అర్థాన్ని చెప్పుకుంటున్నాం. ఈ రెండవ అర్థాన్ని బోధించే వ్యాపారమే "లక్షణ". ఈ లక్షణ అనే వ్యాపారం వాస్తవానికి ముఖ్యార్థంలో ఉంటుంది. ముఖ్యార్థం ఏదైతే, అదే రెండవ అర్థాన్ని బోధిస్తున్నది కదా ? ఆ ముఖ్యార్థానికి శబ్దంతో సాక్షాత్సంబంధం ఉంది కాబట్టి ఈ లక్షణా వ్యాపారం శబ్దంలో ఉన్నట్లు ఆరోపించడం జరుగుతుంది.

సూ. 'కర్మణి కుశలః' ఇత్యాదౌ దర్భగ్రహణాద్యయోగాత్, "గఙ్గాయాం ఘోషః" ఇత్యాదౌ చ గఙ్గాదీనాం ఘోషాద్యాధారత్వాసంభవాత్ ముఖ్యార్థస్య బాధే వివేచకత్వాదౌ చ సంబన్ధే రూఢితః ప్రసిద్ధేః, తథా 'గఙ్గాతటే ఘోషః' ఇత్యాదేః ప్రయోగాత్ యేషాం న తథా ప్రతిపత్తిః తేషాం పావనత్వాదీనాం ధర్మాణాం ప్రతిపాదనాత్మనః ప్రయోజనాచ్చ ముఖ్యేన అముఖ్యోऽర్థః లక్ష్యతే యత్ స ఆరోపితః శబ్దవ్యాపారః సాన్తరార్థనిష్ఠః లక్షణా.

వ్యా. కర్మణీతి-"కర్మణి కుశలః" (కర్మయందు కుశలుడు) ఇత్యాదులందు "దర్భలను గ్రహించడం" మొదలైన అర్థాలు కుదరవు; అలాగే, "గఙ్గాయాం ఘోషః"(గంగలో గొల్లపల్లె)ఇత్యాదులలో గంగాదులు ఘోషాదులకు ఆధారం కావడం కుదరదు; అందువల్లా ముఖ్యార్థం బాధించబడుతున్నది. వివేచకత్వమూ, సామీప్యమూ మొదలైన సంబంధాలు ఉన్నాయి. రూఢివల్ల, అనగా ప్రసిద్ధివల్లనూ, "గంగాతటమునందు గొల్లపల్లె ఉన్నది" ఇత్యాది ప్రయోగాలవల్ల బోధింపబడని పావనత్వాదిధర్మాలను ప్రతిపాదించడం అనే ప్రయోజనంవల్లనూ, ముఖ్యార్థం అముఖ్యార్థాన్ని బోధించడం అనేది ఏది ఉందో అలా ప్రతిపాదించే శబ్దవ్యాపారం "లక్షణ". అది సాంతరమైన, అనగా వ్యవహితమైన, లక్ష్యరూపార్థాన్ని బోధిస్తుంది (సాన్తరార్థనిష్ఠం). ఈ లక్షణ వాస్తవానికి అర్థంలోనే ఉన్నా, అనగా అర్థం వ్యాపారమే అయినా, శబ్దంమీద ఆరోపించడంవల్ల శబ్ద వ్యాపారం అని చెప్పబడుతున్నది (ఆరోపితః శబ్దవ్యాపారః).

వి. "కుశాన్ లాతి ఇతి కుశలః" అనే వ్యుత్పత్తిని అనుసరించి 'కుశల' శబ్దానికి 'దర్భలను తుంపేవాడు' అని అర్థం దర్భలు గరుకుగా ఉంటాయి. వాటి అగ్రాలు వాడిగా ఉంటాయి. వ్రేళ్ళతో వాటిని తుంపేటప్పుడు నేర్పుగా, వ్రేళ్ళకు బాధకలగకుండా చూచుకోవాలి. ప్రక్కనే ఉన్న మరొక జాతి గడ్డితో కలిసిపో

కుండా దర్భలను వేరుగా గుర్తించి త్రుంచాలి. ఈ అభిప్రాయంతో 'కుశల' శబ్దానికి 'దర్భలు తుంచేవాడు' అనే అర్థం విస్మృతమై 'నేర్పు కలవాడు', 'వివేచన కలవాడు' అనే అర్థం ప్రసిద్ధిలోనికి వచ్చింది. దీనికి రూఢియే కారణం. 'కర్మణి కుశలః' అనే వాక్యంలో ఉన్న కుశలశబ్దానికి ముఖ్యార్థం కుదరదు గాన ఈ 'నేర్పరి' అనే అర్థమే చెప్పాలి. దర్భలు త్రుంచువాడు అనే ముఖ్యార్థానికి, 'నేర్పరి' అనే లక్ష్యార్థానికి వివేచనసామ్యం (వివేచనాశక్తి ఉండడం) అనేది సంబంధం. 'గఙ్గాయాం ఘోషః' అనే వాక్యంలో ఇదివరకు వివరించినట్లు గంగాజలప్రవాహం ఘోషానికి ఆధారం కావడం కుదరదు గాన 'గఙ్గా' శబ్దానికి 'గంగాతీరం' అని అర్థం. జలప్రవాహరూపమైన ముఖ్యార్థానికి, తీరరూపలక్ష్యార్థానికి 'సామీప్యం' (తీరం జలం దగ్గర ఉన్నది గాన) సంబంధం. 'గఙ్గాతీరే' అని చెప్పడానికి బదులు "గఙ్గాయామ్" అని చెప్పడంవల్ల పావనత్వం మొదలైన ధర్మాలు ప్రతిపాదించబడతాయి. ఇదే ఈ లాక్షణికశబ్దప్రయోగానికి ప్రయోజనం. ఈ విధంగా 'కర్మణి కుశలః' ఇత్యాదులు 'రూఢితః లక్షణా' అనేదానికి, 'గఙ్గాయాం ఘోషః' ఇత్యాదులు 'ప్రయోజనాత్ లక్షణా' అనేదానికి ఉదాహరణలు. ఇక్కడ అముఖ్యమైన (లాక్షణికమైన) అర్థాన్ని బోధిస్తున్నది ముఖ్యార్థమే. అందువల్ల లక్షణావ్యాపారం ముఖ్యార్థంలోనే ఉంది; ఆ ముఖ్యార్థం ద్వారా దీనికి శబ్దంతో కూడా సంబంధం ఉంటుంది గాన 'శబ్దవృత్తి' అని అన్నారు.

కా. స్వసిద్ధయే పరాక్షేపః పరార్థం స్వసమర్పణమ్,
ఉపాదానం లక్షణం చేత్యుక్తా శుద్ధైవ సా ద్విధా. 10

వృ. "కున్తాః ప్రవిశన్తి" "యష్టయః ప్రవిశన్తి" ఇత్యాదౌ కున్తాదిభిః ఆత్మనః ప్రవేశసిద్ధ్యర్థం స్వసంయోగినః పురుషా ఆక్షిప్యన్తే. తత ఉపాదానేనేయం లక్షణా.

వ్యా. స్వసిద్ధయే ఇతి. స్వసిద్ధయే = శక్యమైన (అభిధచేత బోధించబడే) అర్థం అన్వయించడంకొరకు, పరాక్షేపః = శక్యము కాని మరొక అర్థాన్ని ఆక్షేపించడం, ఉపాదానమ్ = ఉపాదానలక్షణ, పరార్థమ్ = అశక్యమైన అర్థంకోసం, స్వసమర్పణమ్ = తనను (శక్యార్థాన్ని) త్యజించడం, లక్షణం చ ఇతి = లక్షణ

లక్షణ అని, శుద్ధైవ = శుద్ధయే అయిన. సా = ఆ లక్షణ, ద్విధా = రెండు విధాలుగా, ఉక్తా = చెప్పబడినది.

వ్యా. కున్తాః ఇతి-'కున్తాః ప్రవిశన్తి' (కుంతములు-ఒక సన్నని ఆయుధానికి కుంతం అని పేరు- ప్రవేశిస్తున్నాయి) "యష్టయః ప్రవిశన్తి" (కర్రలు ప్రవేశిస్తున్నాయి) మొదలైన వాక్యాలలో కుంతాదులు తమకు ప్రవేశం సిద్ధించడంకోసం తమతో సంయోగం ఉన్న పురుషుల్ని ఆక్షేపిస్తున్నాయి- తెలుపుతున్నాయి. ఇది ఉపాదానంచేత లక్షణ.

వి. లక్షణలో ఆరు భేదాలు నిరూపించడానికై ముందుగా ఇక్కడ 'ఉపాదానలక్షణ' 'లక్షణ లక్షణ'అనే రెండు భేదాలను ప్రతిపాదించాడు. 'కున్తాః ప్రవిశన్తి' ఇత్యాదివాక్యాలలో, అచేతనాలైన కుంతాలు, కర్రలు తమంతటతాముగా ప్రాకారాదులలోకి ప్రవేశించజాలవు గాన తమను మోస్తున్న పురుషుల్ని లక్షణచేత బోధిస్తున్నాయి. 'కుంతములు ధరించిన మనుష్యులు, కర్రలు ధరించిన మనుష్యులు ప్రవేశిస్తున్నారు' అని అర్థం. ఈ విధంగా ఇక్కడ కుంతాదిశబ్దాలు తమ వాచ్యార్థాలను విడవకుండానే 'పురుషులు' అనే మరొక అర్థాన్ని కూడా గ్రహించి బోధిస్తున్నాయి. అందుచేత ఇక్కడ 'ఉపాదానలక్షణ'. లక్షణలక్షణకి 'గఙ్గాయాం ఘోషః' ఇత్యాదులు 'ఉదాహరణాలు'. ఇక్కడ గఙ్గాశబ్దం తన వాచ్యార్థం అయిన ప్రవాహం అనే అర్థాన్ని విడిచిపెట్టి తీరం అనే అర్థాన్ని బోధిస్తూన్నది. శాస్త్రాంతరాలలో ఈ లక్షణాభేదాలకే 'అజహత్స్వార్థలక్షణ' (ఉపాదాన లక్షణ) 'జహత్స్వార్థలక్షణ' (లక్షణ లక్షణ)అని పేర్లు. 'జహాతి స్వార్థః యాం సా జహత్స్వార్థా' "అజహత్ స్వార్థః యాం సా అజహత్స్వార్థా" అని విగ్రహాలు. 'ఉపాదానలక్షణ' 'లక్షణ లక్షణ'అనే భేదాలు శుద్ధలక్షణలోనే ఉంటాయి. గౌణ లక్షణలో ఉండవు

'శుద్ధా లక్షణా' 'గౌణీ లక్షణా'అని స్థూలంగా లక్షణ రెండువిధాలు. మొదటిది 'ఉపాదానలక్షణ' 'లక్షణలక్షణ' అని రెండు విధాలు. 'సారోపోపాదానలక్షణ; 'సాధ్యవసానోపాదానలక్షణ' అని ఉపాదానలక్షణ రెండు విధాలు. 'సారోప లక్షణలక్షణ' "సాధ్యవసానలక్షణలక్షణ"అని లక్షణలక్షణ కూడా రెండు విధాలు, ఈ విధంగా శుద్ధలక్షణలో నాలుగు బేదాలు. 'గౌణీలక్షణా' అనేది కూడా 'సారోపా' 'సాధ్యవసానా'అని రెండు విధాలు. ఈ విధంగా లక్షణాబేదాలు ఆరు.

ప్ర. "గౌరనుబన్ధ్యః" ఇత్యాదౌ శ్రుతిచోదితమనుబన్ధనం కథం మే స్యాదితి జాత్యా వ్యక్తిరాక్షిప్యతే, న తు శబ్దేనోచ్యతే: "విశేష్యం నాభిధా గచ్ఛేత్ క్షీణశక్తిర్విశేషణే" ఇతి న్యాయాత్ ఇత్యుపాదానలక్షణా తు నోదాహర్తవ్యా. న హ్యత్ర ప్రయోజనమస్తి; న వా రూఢిరియమ్. వ్యక్త్యవినాభావిత్వాత్తు జాత్యా వ్యక్తిరాక్షిప్యతే. యథా- 'క్రియతామ్' ఇత్యత్ర కర్తా. 'కురు' ఇత్యత్ర కర్మ. 'ప్రవిశ' 'పిణ్డీమ్' ఇత్యాదౌ 'గృహం' 'భక్షయ' ఇత్యాది చ.

వ్యా. మంచనమిశ్రుడు 'గౌరనుబన్ధ్యః' ఇత్యాదివాక్యాలలో లక్షణను అంగీకరించాడు. అది యుక్తం కాదని చెప్తున్నాడు- గౌరితి:-

"'గౌః అనుబన్ధ్యః' అను శ్రుతివాక్యం విధించిన అనుబంధనం నా విషయంలో ఎట్లు కుదురుతుంది" అనే ఉద్దేశ్యంతో జాతిచేత వ్యక్తి లక్షణద్వారా బోధింపబడుతుంది. (ఆక్షిప్యతే). అంతే కాని వ్యక్తి శబ్దంచేత బోధించబడదు, అనగా అభిధాశక్తిచేత బోధించబడదు. "విశేషణాన్ని బోధించడంలోనే శక్తి ఉడిగిపోయిన అభిధ విశేష్యం దాకా వెళ్ళదు" అని న్యాయం ఉన్నది కదా? ఈ విధంగా దీనిని ఉపాదానలక్షణకు ఉదాహరణంగా చూపకూడదు. లక్షణాస్థలంలో ఉండవలసిన ప్రయోజనం కాని, రూఢి కాని ఇక్కడ లేవు కదా? అందుచేత వ్యక్తితో జాతికి అవినాభావసంబంధం ఉండటంవల్ల, అనగా వ్యక్తి లేకుండా జాతి అనేది ఉండదు గాన, జాతిచేత వ్యక్తి అనుమానప్రమాణం ద్వారా బోధించబడుతుంది. (ఆక్షిప్యతే). ఎలా అనగా 'క్రియతామ్' (చేయబడుగాక) అనగానే కర్త (చేసేవాడు), 'కురు' (చేయుము) అనగానే కర్మ, 'ప్రవిశ' అనగానే 'గృహమును' అని, 'పిణ్డీమ్' (ఒక భక్ష్యం) అనగానే 'తినుము' అనీ అనుమానప్రమాణం ద్వారా ఊహించబడినట్లు.

వి. "గౌః అనుబన్ధ్యః" అని వేదవాక్యం ఉంది. వెనుక మనం చూచినట్లు 'గౌః' అనేది జాతివాచకం. అనగా అభిధావృత్తిచేత గోత్వం అనే అర్థాన్ని బోధిస్తుంది. 'గోత్వం' వాచ్యార్థం. అందుచేత "గోత్వము (ఈ యాగంలో పశువుగా) చంపదగినది" అని ఈ వేదవాక్యానికి అర్థం. అయితే 'గోత్వం' అనే జాతిని చంపడం అనేది కుదరదు. అందుచేత ఇక్కడ గోశబ్దవాచ్యమైన జాతి లక్షణా

వృత్తి ద్వారా 'ఎద్దు'అనే వ్యక్తిని బోధిస్తుంది. అభిధచేతనే వ్యక్తిని బోధించవచ్చును కదా; లక్షణ ఎందుకు అనడానికి వీలులేదు. "విశేషణాన్ని బోధించడానికే తన శక్తిని అంతా వ్యయం చేసికొన్న అభిధ విశేష్యందాకా పోలేదు" అని శాస్త్రన్యాయం. ఇక్కడ గోత్వరూపమైన జాతి విశేషణం; దాని ఆశ్రయమైన గోవ్యక్తి (ఎద్దు)విశేష్యం. 'గో'శబ్దం అభిధచేత 'గోత్వం'అనే విశేషణాన్ని బోధించగలుగుతుంది. కాని విశేష్యమైన గోవ్యక్తిని బోధించలేదు. దాన్ని బోధించాలంటే లక్షణ కావాలి. ఈ విధంగా గోత్వమనే వాచ్యార్థం లక్షణద్వారా గోవ్యక్తిరూపమైన మరొక అర్థాన్ని గ్రహిస్తున్నది ([illegible]) ఉపాదానలక్షణకి ఉదాహరణం అని మండనమిశ్రులు [illegible]. ఇక్కడ లక్షణ అవసరం లేకుండానే వ్యక్తిబోధ కలుగవచ్చు. వ్యక్తి లేకుండా జాతి ఉండదు. అగ్ని లేకుండా ఉండడానికి వీలులేని ధూమాన్ని చూస్తే అగ్నిని అనుమానప్రమాణంచేత గ్రహించినట్లు, జాతిచేత వ్యక్తిని గ్రహించడానికి అనుమానమే చాలు. 'చేయబడుగాక' "చేయుము" అన్నప్పుడు కర్త కర్మలు లేకుండా క్రియ ఉండదు కాబట్టి ఆ రెండింటినీ ఊహించినట్లు వాక్యంలోని భాగాలైన 'ప్రవిశ' 'పిండీమ్' ఇత్యాదిపదాలు వినగానే 'గృహమ్' 'భక్షయ' మొదలైన [illegible] భాగాలను ఊహించినట్లు, ఇక్కడ కూడా వ్యక్తిని ఊహించుకోవచ్చు. లక్షణ అంగీకరించే పక్షంలో ప్రయోజనమైనా ఉండాలి. రూఢి అయినా ఉండాలి, 'గో' శబ్దానికి గో వ్యక్తియందు లక్షణ చెప్పడానికి ఈ రెండూ కూడా లేవు.

వృ. "పీనో దేవదత్తో దివా న భుంక్తే"ఇత్యత్ర చ రాత్రిభోజనం న లక్ష్యతే, శ్రుతార్థాపత్తేరర్థాపత్తేర్వా తస్య విషయత్వాత్.

వ్యా. పీన ఇతి- "బలిసి ఉన్న ఈ దేవదత్తుడు పగలు భోజనం చేయడు" అనే చోట రాత్రిభోజనం లక్షణచేత బోధించబడదు. ఎందుకంటే అది శ్రుతార్థాపత్తికి కాని అర్థాపత్తికి కాని విషయం అవుతుంది."

వి. "పీనో దేవదత్తః" ఇత్యాదివాక్యాలలో 'లక్షణ' అని కొందరి అభిప్రాయం. దేవదత్తుడు పగలు భోజనం చేయడం లేదు; కాని బలిసి ఉన్నాడు. అందుచేత మొత్తం ఈ వాక్యం వాచ్యార్థాన్ని విడవకుండగానే లక్షణచేత 'రాత్రిభోజనం చేస్తున్నాడు' అనే అర్థాన్ని బోధిస్తున్నది అని వీరు అంటారు. మీమాంసకుల మతాన్ని అనుసరిస్తూ మమ్మటుడు ఇక్కడ లక్షణ అనావశ్యకం అని ప్రతిపాది

స్తున్నాడు. ఇక్కడ 'అర్థాపత్తి' ప్రమాణంచేత రాత్రిభోజనం తెలుస్తుంది. చెప్పిన విషయం అనుపపన్నంగా ఉన్నప్పుడు దాని ఉపపత్తికోసం మరొక అర్థాన్ని కల్పించడం అర్థాపత్తి. "పీనః దేవదత్తః దివా న భుంక్తే" ఇత్యాదిస్థలాలలో అసలే భోజనం చేయనివానికి పీనత్వం కుదరదు కాబట్టి "రాత్రౌ భుంక్తే" అనే వాక్యాన్ని కల్పించుకోవాలి అని కొందరు మతం. వాక్యం కల్పించుకునే అవసరం లేదు, రాత్రి తినడం అనే అర్థాన్ని కల్పిస్తే చాలు అని ప్రాభాకరమీమాంసకుల మతం. వాక్యం కల్పిస్తే దానిని "శ్రుతార్థాపత్తి" అంటారు. "శ్రుతాత్ = శబ్దమునుండి, అర్థస్య = అర్థముయొక్క, ఆపత్తిః = లాభం అని" అర్థం. అర్థాన్ని మాత్రమే కల్పిస్తే అది అర్థాపత్తి. అర్థాన్ని కల్పించుకోవటం ఈ విధంగా అర్థాపత్తి ప్రమాణంచేతనే ఆ అర్థం లభ్యం అవుతున్నప్పుడు ఉపాదానలక్షణను అంగీకరించవలసిన పని లేదని అభిప్రాయం.

అవతారిక :- ఇప్పుడు లక్షణలక్షణను నిరూపిస్తున్నాడు-

సూ. "గఙ్గాయాం ఘోషః" ఇత్యత్ర తటస్య ఘోషాధికరణత్వసిద్ధయే గఙ్గాశబ్దః స్వార్థమర్పయతి ఇత్యేవమాదౌ లక్షణేనైషా లక్షణా. ఉభయరూపా చేయం శుద్ధా, ఉపచారేణామిశ్రితత్వాత్.

వ్యా. గఙ్గాయామితి- 'గఙ్గాయాం ఘోషః' ఇత్యాదులలో తటం ఘోషానికి ఆధారం అని దానికి సిద్ధంగా 'గఙ్గా' శబ్దం తన అర్థాన్ని సమర్పిస్తుంది; అనగా తన అర్థాన్ని విడిచి తీరం అనే అర్థాన్ని బోధిస్తుంది. కనుక ఇలాంటి చోట్ల ఇది లక్షణచేత అనగా స్వార్థత్యాగంచేత లక్షణ. ఈ ఉపాదానలక్షణ, లక్షణలక్షణ అనే రెండు విధాల లక్షణా కూడా 'శుద్ధలక్షణ'; ఎందుచేతననగా దీనిలో ఉపచారం లేదు.

వి. 'ఉపచారం' అనగా సాదృశ్యం అనే సంబంధంచేత శబ్దప్రవృత్తి. 'అగ్నిర్మాణవకః' (ఈ పిల్లవాడు అగ్ని) ఇత్యాదులలో మంచి ప్రకాశ ఉండడం అనే సాదృశ్యాన్ని పట్టి పిల్లవాణ్ణి అగ్ని అనడం జరిగింది. ఇది ఉపచారం. 'అత్యన్తం విశకలితయోః సాదృశ్యాతిశయమహిమ్నా భేదప్రతీతిస్థగనముపచారః" (చాల అధికంగా ఉన్న సాదృశ్యం మహిమచేత పూర్తిగా వేరైన పదార్థాలలో ఉండే భేదాన్ని కప్పిపుచ్చడం ఉపచారం) అని దీని లక్షణం. ఇలాంటి ఉపచారం ఉన్న లక్షణ గౌణలక్షణ; అది లేనిది శుద్ధలక్షణ. ఇంతవరకూ చెప్పిన రెండు లక్షణలలో ఉపచారం లేదు గాన శుద్ధలక్షణలు అని భావం.

అవతారిక- "గౌణ-శుద్ధలక్షణల కున్న భేదం ఉపచారం ఉండడాన్ని పట్టీ లేకపోవడాన్ని పట్టీ కాదు; "అగ్నిర్మాణవకః" ఇత్యాదిగౌణలక్షణాస్థలాలలో శక్యార్థానికి లక్ష్యార్థానికీ అభేదం కనబడుతుంది. శుద్ధలక్షణలో ఆ అభేదం కనబడదు; ఇదే ఈ రెండికీ భేదం" అని ముకులభట్టు ప్రతిపాదించాడు. అది సరి కాదు అని చెపుతున్నాడు—

వృ. అనయోర్లక్ష్యస్య లక్షకస్య చ న భేదరూపం తాటస్థ్యమ్; తటాదీనాం గఙ్గాదిశబ్దైః ప్రతిపాదనే తత్త్వప్రతిపత్తౌ హి ప్రతిపిపాదయిషితప్రయోజనసంప్రత్యయః. గఙ్గాసంబన్ధమాత్రప్రతీతౌ తు 'గఙ్గాతటే ఘోషః' ఇతి ముఖ్యశబ్దాభిధానాల్లక్షణాయాః కో భేదః?

వ్యా. అనయోః ఇతి:- ఈ రెండింటిలో అసగా ఉపాదానలక్షణ, లక్షణలక్షణ అనే రెండు లక్షణాభేదాలలో లక్ష్యమైన అర్థానికి, లక్షకమైన శబ్దార్థానికి భేద రూపమైన తాటస్థ్యం, అసగా ఔదాసీన్యం లేదు. తటాదుల్ని గంగాది శబ్దాలచేత బోధించినప్పుడు తత్త్వం, అసగా గంగాత్వాదికం, అసగా వాచ్యార్థాలైన ప్రవాహా దులకూ, లక్ష్యార్థాలైన తటాదులకూ అభేదం, గోచరిస్తేనే ప్రతిపాదించదలచిన ప్రయోజనాల జ్ఞానం కలుగుతుంది. కేవలం సంబంధం మాత్రమే తెలిసే పక్షంలో 'గఙ్గాతటే ఘోషః' అని ముఖ్యశబ్దాన్ని ప్రయోగించి బోధించిన అర్థానికీ, లక్షణకీ భేదం ఏమి ఉంటుంది?

వి. 'గఙ్గాతటే ఘోషః' అని అనడానికి బదులుగా "గఙ్గాయాం ఘోషః" అని అన్నాడనగా, ఆ వక్త అభిప్రాయం గంగ ఎంత పవిత్రమో ఘోషం కూడా అంత పవిత్రం అని చెప్పడం గంగా, తటమూ రెండూ ఒకటే అన్న భావం (తాత్కాలికంగా) ఆ వాక్యంవల్ల కలిగినప్పుడే ఆ అర్థం గోచరిస్తుంది. "తటానికీ గంగకూ సామీప్యసంబంధం ఉన్నది; ఆ రెండూ వేరే" అని అతని అభిప్రాయం అయితే 'గఙ్గాతటే ఘోషః' అనే ప్రయోగించి ఉండేవాడు. షష్ఠీవిభక్తిని పట్టి సామీప్యసంబంధం అప్పుడూ తెలుస్తుంది కదా? అందుచేత ఉపచారం ఉన్నా లేక పోయినా అన్నివిధాలైన లక్షణాస్థలాలలోను వాచ్యార్థ (శక్యార్థ) లక్ష్యార్థాలకి అభేదం గమ్యమానం అవుతుంది అని భావం.

కా. సారోపాన్యా తు యత్రోక్తౌ విషయీ విషయస్తథా

వృ. ఆరోప్యమాణః ఆరోపవిషయశ్చ యత్రానపహ్నుతభేదౌ సామానాధికరణ్యేన నిర్దిశ్యేతే సా లక్షణా సారోపా.

వ్యా. సారోపా ఇతి- విషయి విషయమూ కూడ ఎక్కడ చెప్పబడతాయో ఆ లక్షణ సారోపలక్షణ.

ఆరోప్యమాణః ఇతి- ఆరోప్యమాణము ఆరోపవిషయమూ కూడ వాటి భేదాన్ని కప్పిపెట్టకుండా, ఎక్కడైతే సామానాధికరణ్యంతో నిర్దేశించబడతాయో అది "సారోపలక్షణ".

వి. ఒక వస్తువును నిర్దేశించి (దాని పేరు చెపుతూ) దానిని మరొక వస్తువుగా చెప్పడం ఆరోపం. "గౌః వాహీకః" ఇత్యాదులు ఉదాహరణం. "వాహీక దేశీయుడు ఎద్దు" అని దీనికి అర్థం. నేటి పంజాబును వాహీకదేశం అని ప్రాచీన నామధేయం. ఎద్దులో ఉన్న జడత్వం, మాంద్యం మొదలైన గుణాలు లేదా శాబరభాష్యవ్యాఖ్యానంలో కుమారిలభట్టు చెప్పినట్లు (మీమాంసాదర్శనం 11.3.48) నిలబడి మూత్రించడం, నిలబడి భక్షించడం వంటి లక్షణాలు, వాహీకునిలో కూడా ఉండడంచేత వాహీకునియందు గోత్వం ఆరోపించబడుతున్నది. ఇక్కడ ఆరోపానికి విషయం అనగా ఆశ్రయం, వాహీకుడు, ఆరోపించబడేది (ఆరోప్యమాణం) ఎద్దు ఇది 'విషయి'. ఈ రెండింటికీ ఉన్న భేదాన్ని కప్పివేయకుండానే వాహీకుణ్ణి వాహీకునిగాను, ఎద్దును ఎద్దును గాను చెపుతూ ఇవి సామానాధికరణ్యంతో, ఒకే ప్రథమావిభక్తిలో నిర్దేశించబడుతున్నాయి. అందుచేత ఇది సారోపలక్షణకు ఉదాహరణం.

సాధారణంగా ఒక విశేషణపదాన్ని విశేష్యాన్ని వాక్యంలో ప్రయోగించినప్పుడు ఆ పదాలు రెండింటినీ ఒకే విభక్తిలో ప్రయోగిస్తారు. 'నీలమ్ ఉత్పలమ్', 'శూరః నరః' ఇత్యాదులలో 'నీల' 'ఉత్పల' పదాలు ఒకే వస్తువును నిర్దేశిస్తున్నాయి. 'శూర' 'నర' పదాలు కూడా ఒకే వ్యక్తిని నిర్దేశిస్తున్నాయి. అందుచేత వాటి అధికరణం అనగా ఆధారం, అనగా వాటిచేత బోధింపబడే వస్తువు, సమానం; అనగా ఒక్కటే. అందుచేత ఆ పదాలు సమానాధికరణాలు. సమానాధికరణాలై ఉండడం "సామానాధికరణ్యం". ఈ విధంగా సమానవిభక్తిలో నిర్దేశించినవాటికి తాదాత్మ్యం, ఒక విధమైన అభేదం ఉంటుంది. 'గౌః వాహీకః' అనే

వాక్యంలో గోవును, వాహీకుణ్ణి వేరు వేరు పదాలతో నిర్దేశించినా, ఒకే విభక్తి ఉప యోగించడంచేత ఈ రెండూ ఒకటే అన్నట్లు కనబడతాయి. ఇది ఆరోపం. విష యాన్ని (వాహీకుడు మొదలైన దానిని) పూర్తిగా కప్పిపుచ్చి, దాని పేరైనా చెప్ప కుండా విషయిని మాత్రమే (ఎద్దును మాత్రమే) పేర్కొన్నట్లయితే అది 'అధ్య వసాయం' ఉదా: "అయం గౌః" (ఇటు వాహీకుణ్ణి చూస్తూ అన్న వాక్యం).

కా. విషయ్యన్తఃకృతేఽన్యస్మిన్ సా స్యాత్ సాధ్యవసానికా.

వృ. విషయిణారోప్యమాణేనాన్తఃకృతే నిగీర్ణే అన్యస్మిన్ ఆరోప విషయే సతి సాధ్యవసానా స్యాత్.

వ్యా. విషయీతి- అన్యస్మిన్ = వేరైన అనగా విషయమైన, విషయిణా అన్తః కృతే = విషయిచేత కప్పివేయబడినది కాగా, సా = అది (లక్షణ) సాధ్యవసానికా = సాధ్యవసానలక్షణ, స్యాత్ = అగును.

"ఆరోపవిషయమైన వాహీకుడు మొదలైనది విషయిచేత అనగా ఆరోపింప బడే గోవుచేత మ్రింగివేయబడగా (పూర్తిగా కప్పివేయబడగా) అది సాధ్య వసానలక్షణ".

కా. భేదావిమౌ చ సాదృశ్యాత్సమ్బన్ధాన్తరతస్తథా,
గౌణౌ శుద్ధౌ చ విజ్ఞేయౌ.

వృ. ఇమావారోపాధ్యవసానరూపౌ సాదృశ్యహేతూ భేదౌ 'గౌ ర్వాహీకః' ఇత్యత్ర 'గౌరయమ్' ఇత్యత్ర చ.

వ్యా. భేదావితి— ఇమౌ = ఈ, భేదౌ = రెండు భేదములు, సాదృశ్యాత్ = సాదృశ్యంవలన, తథా = మరియు, సమ్బన్ధాన్తరతః = సాదృశ్యభిన్నమైన ఇతర సంబంధాలవలన, గౌణౌ = గౌణములు అని, శుద్ధౌ చ = శుద్ధములు అని, విజ్ఞేయౌ = తెలియదగినవి. సాదృశ్య మూలకములైతే గౌణాలు; సాదృశ్యం కాక మరి ఏ సంబంధాన్ని పట్టియైనా ఏర్పడితే శుద్ధాలు అని అర్థం.

ఇమౌ ఇతి: ఆరోప—అధ్యవసానరూపములైన ఈ రెండు భేదాలూ కూడ

సాదృశ్య హేతువులైనట్లయితే, కొన్ని గుణాల సాదృశ్యంమీద ఆధారపడినవైతే, గౌణాలు. 'గౌః వాహీకః' అనేది గౌణసారోపలక్షణకి 'అయం గౌః' అనేది గౌణ సాధ్యవసానలక్షణకి ఉదాహరణలు.

వృ. అత్ర పిం స్వార్థసహచారిణో గుణా జాడ్యమాన్ద్యాదయో లక్ష్యమాణా అపి గోశబ్దస్య పరార్థాభిధానే ప్రవృత్తినిమిత్తత్వమ్ ఉపయాన్తి ఇతి కేచిత్. స్వార్థసహచారిగుణాభేదేన పరార్థగతా ఏవ లక్ష్యన్తే న పరార్థోఽభిధీయతే ఇత్యన్యే. సాధారణగుణాశ్రయత్వేన పరార్థ ఏవ లక్ష్యతే ఇత్యపరే. ఉక్తం చాన్యత్ర:-

"అభిధేయావినాభూతప్రతీతిర్లక్షణోచ్యతే
లక్ష్యమాణగుణైర్యోగాద్వృత్తేరిష్టా తు గౌణతా" ఇతి.

అవినాభావోఽత్ర సంబన్ధమాత్రం న తు నాన్తరీయకత్వమ్. తత్త్వే హి 'మఞ్చాః క్రోశన్తి' ఇత్యాదౌ న లక్షణా స్యాత్. అవినాభావే చాక్షేపే ణైవ సిద్ధేర్లక్షణాయా నోపయోగ ఇత్యుక్తమ్.

వ్యా. గౌణలక్షణలో లక్ష్యార్థం ఏది అనే విషయంలో అభిప్రాయభేదాలు ఉన్నాయి. ఆ భేదాలను చెపుతున్నాడు- అత్ర హి ఇతి- "ఇక్కడ స్వార్థంతో సంబంధించి ఉన్న జాడ్యమాన్ద్యాది గుణాలు లక్షణచేత బోధింపబడుతున్న 'గౌః' శబ్దం పరార్థాన్ని బోధించడంలో ప్రవృత్తినిమిత్తత్వాన్ని పొందుతాయి. అని కొందరు".

వి. 'గౌః' శబ్దానికి ప్రవృత్తినిమిత్తం గోత్వం. అనగా గో శబ్దానికి శక్యార్థం గోత్వం. ఆ 'గౌః' శబ్దం లక్షణచేత గోవుని సంబంధించిన జాడ్యమాంద్యాది గుణాలని బోధిస్తుంది. ఈ గుణాల ద్వారా 'గౌః' శబ్దం వాహీకుడు అనే అర్థాన్ని అభిధచేత బోధిస్తుంది. ఈ శక్తి లక్షణా రెండూ కలసి "జాడ్యమాంద్యాదు లున్న వాహీకుడు" (జాడ్యమాన్ద్యాదివదభిన్నో వాహీకః) అనే శాబ్దబోధ కలుగుతుంది అని వీరి అభిప్రాయం.

అవ. అయితే 'గౌః' శబ్దానికి "గోత్వం" లోనే సంకేతగ్రహణం ఉంది కాని వాహీకుడు అనే అర్థంలో లేదు. గుణాలు లక్షణచేత బోధింపబడుతున్నాయి కాని

శక్తిచేత కాదు. అందుచేత "గో" శబ్దం అభిధచేత వాహీకుణ్ణి బోధిస్తుంది అని చెప్పడం యుక్తం కాదని అభిప్రాయంతో మరికొందరు మరొక విధంగా వివరించారు.

స్వార్థేతిః- "స్వార్థంతో సంబంధించిన గుణాలతో అభేదం చేత పరార్థంలో ఉన్న గుణాలు లక్షణయా బోధింపబడతాయి. కాని పరార్థం అభిధచేత బోధింపబడడం అనేది లేదు అని మరికొందరు".

వి. 'గో'శబ్దార్థం అయిన గోవుతో సంబంధించి ఉన్న జాడ్యమాంద్యాది గుణాలే వాహీకపదానికి అర్థమైన వాహీకుడిలో కూడా ఉన్నాయి అనే భావంతో ఇక్కడ లక్షణ వాహీకుడిలో ఉన్న జాడ్యమాంద్యాదిగుణాలను బోధిస్తుంది. 'వాహీక' శబ్దం కూడా ఇక్కడ ఉన్నది కాబట్టి చెనుక పక్షంలో చెప్పినట్లు అభిధచేత (గోశబ్దం) వాహీకుణ్ణి బోధించే ప్రసక్తి లేదు అని వీరి అభిప్రాయం. ఈ విధంగా ఈ వాక్యంచేత "గోవులో ఉన్న జాడ్యాదులతో సజాతీయాలైన (జాడ్యాదుల జాతికే చెందిన) జాడ్యాదులున్నవాడు వాహీకుడు" అనే శాబ్దబోధ కలుగుతుంది.

అవ. జాడ్యాది ధర్మాలు సజాతీయాలు అవడంచేత అవి ఒక విధంగా అభిన్నాలే అయినా, 'గోవు', 'వాహీకుడు' అనే ధర్ములు (వ్యక్తులు) వేరు వేరుగానే ఉండడంచేత 'గౌః వాహీకః' అనే సామానాధికరణ్యప్రయోగం కుదరదు. అందుచేత ఈ పక్షం కూడా సరిగా లేదని మరొక మతం చెపుతున్నారు.

వ్యా. సాధారణేతి:- "సాధారణమైన, అనగా సజాతీయాలైన జాడ్యమాంద్యాది గుణాలకి ఆశ్రయం అవడంచేత పరార్థమే లక్షణయా బోధింపబడుతుంది అని మరికొందరు".

వి. గోవుకీ వాహీకుడికీ ఒక సంబంధం ఉంది. గోవులో ఉన్న జాడ్యమాద్యాదిగుణాలతో సమానమైన జాడ్యమాంద్యాదిగుణాలకి వాహీకుడు ఆశ్రయం అవడమే ఈ సంబంధం. ఈ సంబంధాన్ని పురస్కరించుకొని 'గో' శబ్దం లక్షణచేత 'జాడ్యాదిగుణవిశిష్టుడు' అనే అర్థాన్ని బోధిస్తుంది. అందుచేత 'గౌః వాహీకః' అనే వాక్యానికి జాడ్యాది గుణములు గల వాహీకుడు (జాడ్యాది

గుణవదభిన్నః వాహీకః) అనే శాబ్దబోధ కలుగుతుంది. ఈ మూడవ మతమే మమ్మటునికి అభిమతం అని వ్యాఖ్యాతలు వ్రాసినారు.

అవ. ఈ మూడవ మతానికి అనుగుణంగా ఉన్న కుమారిలభట్టు కారికను ఉపహరిస్తున్నాడు- ఉక్తమ ఇతి. ఈ విషయం మరొక గ్రంథంలో (శ్లోక వార్తికంలో) చెప్పబడినది. ఈ కారికకు సంబంధించిన శ్లోకార్థం దీనికి ముందు ఈ విధంగా ఉంది-

"మానాంతరవిరోధే తు ముఖ్యార్థస్యాపరిగ్రహే".

వ్యా. "ప్రత్యక్షాది ప్రమాణాంతరంతో విరోధం ఏర్పడడంచేత ముఖ్యార్థాన్ని గ్రహించడానికి వీలు లేనప్పుడు అభిధేయంతో అవినాభూతమైన అర్థం బోధించబడడం లక్షణ. లక్షణచేత బోధింపబడిన అర్థానికి సంబంధించిన గుణాలతో సంబంధం ఉన్నట్లయితే ఆ లక్షణకే గౌణత్వం అంగీకరింపబడుతుంది".

వి. 'గఙ్గాయాం ఘోషః' ఇత్యాది వాక్యాలలో 'ఘోషం గంగాప్రవాహంలో ఉండడం ప్రత్యక్షవిరుద్ధం' అవడంచేత ఆ ముఖ్యార్థాన్ని విడిచివేసి ఆ అర్థానికి సంబంధించిన గంగాప్రవాహం ప్రక్కనున్న తీరం అనే అర్థం గ్రహించడం 'లక్షణ' అని చెప్పబడుతుంది. గౌర్వాహీకః ఇత్యాదిస్థలాలలో లక్షణచేత బోధింపబడుచున్నదానికి (జాడ్యాదిగుణములు కలవానికి) సంబంధించిన గుణాలతో సంబంధం ఉండడంచేత ఈ లక్షణకు 'గౌణి' అని పేరు అని ఈ కారికల భావం.

వ్యా. అవినాభావేతి- "ఇక్కడ 'అవినాభావం' అనగా కేవలం సంబంధం అని మాత్రమే అర్థం. నాంతరీయకత్వం అని అర్థం కాదు. నాంతరీయకం అని అర్థం చెప్పుకుంటే 'మఞ్చాః క్రోశన్తి' ఇత్యాదులలో లక్షణ కుదరదు. ఇంకొక విషయం ఏమనగా అవినాభావం ఉన్న పక్షంలో ఆక్షేపంచేతనే మరొక అర్థం లభ్యం అవుతున్నప్పుడు లక్షణ ఉపయోగం లేదు అని వెనుక చెప్పబడింది".

వి. 'అవినాభావం' అనే పదానికి నాంతరీయకం అని అర్థం. వేరు చేయడానికి వీలుకాకుండా కలిసి ఉండేది, తప్పని సరి అయినది అని అర్థం. కాని పై కారికలో 'అభిధేయంతో అవినాభూతంగా ఉండేది' అనగా నాంతరీయకం అని అర్థం కాదు, 'సంబంధం ఉన్నది' అని అంత మాత్రమే అర్థం. అలా కాక నాంతరీయకం అని అర్థం చెపితే 'మఞ్చాః క్రోశన్తి' అన్నప్పుడు లక్షణ కుదరదు.

'మఞ్చాః క్రోశన్తి' అన్న వాక్యానికి 'మంచాలు ఏడుస్తున్నాయి' అని వాచ్యార్థం. మంచాలు ఏడవడం కుదరదు. అందుచేత లక్షణచేత 'మంచాల మీద ఉన్న మనుష్యులు' అని అర్థం చెప్పుకుంటాం. వాచ్యార్థానికి, లక్ష్యార్థానికి అవినాభావ సంబంధం ఉండాలి అని అంటే మంచాలకీ మనుష్యులకీ ఆ సంబంధం లేకపోవడంచేత లక్షణ చెప్పడానికి అవకాశం ఉండదు. '[illegible] విధంగా సంబంధం' అంటే లక్షణ చెప్పవచ్చును. అవినాభావం [illegible] ఉన్నట్లయితే లక్షణయే అవసరంలేదు; '[illegible]' అనే వాక్యంలోను '[illegible]', 'పీనః దేవదత్తః' ఇత్యాదులలో ప్రతిపాదింపబడిన ఉదాహరణల్లో [illegible] రెండవ అర్థం ప్రతీతం అవుతుంది అని వెనుక చూచి ఉన్నాం అని భావం.

వృ. 'ఆయుః ఘృతమ్' 'ఆయురేవేదమ్' ఇత్యాదౌ చ సాదృశ్యాదన్యత్ కార్యకారణభావాది సంబన్ధాన్తరమ్. ఏవమాదౌ చ కార్యకారణభావాదిలక్షణపూర్వే ఆరోపాధ్యవసానే.

వ్యా. 'ఆయుః ఘృతమ్' (నెయ్యి ఆయుర్దాయము) 'ఆయురేవేదమ్' (ఇది ఆయుర్దాయము) ఇత్యాదులలో సాదృశ్యం కంటె భిన్నమైన కార్యకారణభావం మొదలైన మరొక సంబంధం ఉంటుంది. ఇలాంటి వాక్యాలలో కార్యకారణభావం మొదలైన లక్షణం గల సంబంధం పూర్వముగా గల ఆరోపాధ్యవసానాలు.

వి. నెయ్యి ఆయుర్దాయాన్ని పెంచుతుంది. అందుచేత "నెయ్యి ఆయుర్దాయము" అని 'ఇదే ఆయుర్దాయము' అని అన్నప్పుడు "ఆయుర్దాయానికి కారణమైన నెయ్యి" అని లక్షణావృత్తిచేత అర్థం చెప్పుకోవాలి. ఆయుర్దాయం కార్యం, నెయ్యి కారణం ఈ రెండింటి మధ్య ఉన్న ఈ కార్యకారణభావాన్ని పురస్కరించుకొని 'ఆయుః ఘృతమ్' అన్నప్పుడు ఘృతంమీద ఆయుర్దాయత్వం ఆరోపించబడింది. 'ఆయురేవేదం' అన్నప్పుడు ఘృతంమీద ఆయుర్దాయత్వాధ్యవసానం చేయబడింది. ఈ లక్షణాలు గుణసామ్యంచేత ఏర్పడినవి కావు కాబట్టి శుద్ధలక్షణభేదాలు.

వృ. అత్ర గౌణభేదయోర్భేదేఽపి తాద్రూప్యప్రతీతిః, సర్వథైవాభేదావగమశ్చ ప్రయోజనమ్. శుద్ధభేదయోస్త్వన్యవైలక్షణ్యేనావ్యభిచారేణ చ కార్యకారిత్వాది.

వ్యా. అత్రేతి:- "ఇక్కడ గౌణభేదాలలో భేదం ఉన్నాకూడ తాద్రూప్యం ప్రతీయమానం కావడం, పూర్తిగా అభేదం ప్రతీయమానం కావడం ప్రయోజనం. శుద్ధభేదాలలో ఇతరమైనవాటికంటె వైలక్షణ్యంతోను, అవ్యభిచారంతోను కార్యం చేయడం మొదలైనది ప్రయోజనం".

వి. 'గౌః వాహీకః' అనేది గౌణసారోపలక్షణకి ఉదాహరణం. 'గౌః అయమ్' అనేది గౌణసాధ్యవసాయలక్షణకు ఉదాహరణం. ఎద్దుకీ, వాహీకుడికీ భేదం ఉన్నా అ రెండింటికీ ఒకే రూపం ఉన్నట్లు గోచరించడం మొదటిదానిలో ప్రయోజనం. రెండూ పూర్తిగా ఒకటే అన్నట్లు కనబడడం రెండవదానిలో ప్రయోజనం. 'ఆయుః ఘృతమ్' అనేది శుద్ధసారోపకు, 'ఆయురేవేదమ్' అనేది శుద్ధ సాధ్యవసానకు ఉదాహరణం. ఆయుఃకారకాలైన ఇతరవస్తువులకంటె దీనిలో ఒక విలక్షణమైన కార్యం పుట్టించే సామర్థ్యం ఉంది అని చెప్పడం మొదటిదానిలో ప్రయోజనం. ఇది ఆ పని చేసి తీరుతుంది, వ్యభిచారం (చేయకపోవడం) లేదు అని చెప్పడం రెండవదానిలో ప్రయోజనం.

వృ. క్వచిత్ తాదర్థ్యాదుపచారః-యథా ఇన్ద్రార్థా స్థూణా ఇన్ద్రః. క్వచిత్ స్వస్వామిభావాత్-యథా రాజకీయః పురుషో రాజా. క్వచిత్ అవయవావయవిభావాత్-యథా 'అగ్రహస్తః' ఇత్యత్ర అగ్రమాత్రే అవయవే హస్తః. క్వచిత్ తాత్కర్మ్యాత్-యథా అతక్షా తక్షా.

వ్యా. కార్యకారణభావసంబంధమూలకమైన లక్షణకి 'ఆయుర్ఘృతమ్' ఇత్యాద్యుదాహరణద్వయం ఇచ్చి ఇప్పుడు ఇతరసంబంధాలను పట్టి కూడ లక్షణకి ఉదాహరణలు చూపుతున్నాడు - క్వచిదితి - ఒకదానికొరకై ఉద్దేశింపబడడం అనే సంబంధంచేత కొన్ని చోట్ల లక్షణ. ఎట్లనగా-ఇంద్రుని పూజకోసం నిలిపిన స్తంభాన్ని 'ఇంద్రః' అనడం. కొన్ని చోట్ల స్వస్వామిభావసంబంధంవల్ల (సేవకుడు యజమాని అనే సంబంధంవల్ల) లక్షణ. ఎట్లనగా రాజుకు సంబంధించిన పురుషుడు రాజు. (రాజసేవకుణ్ణి రాజు అనడం). కొన్ని చోట్ల అవయవావయవిభావసంబంధం వల్ల లక్షణ. ఎట్లనగా - హస్తానికి అగ్రభాగమైన, దాని అవయవమైన, అరచేతి విషయంలో 'అగ్రహస్తః'అని ప్రయోగించడం. ఐదు వేళ్ళున్న పట్టుకొనడానికి ఉపకరించే భాగం మొత్తం హస్తంలో ఒక అవయవమే అయినా

దానిని కూడా హస్తం, అని అంటూ 'అగ్రహస్తః' అని చెప్పడం ఉంది. "అగ్రం చాసౌ హస్తశ్చ" అని దీని విగ్రహవాక్యం. అగ్రరూపమైన హస్తము అని అర్థం. ఈ లాక్షణికప్రయోగానికి కారణం అవయవావయవి భావసంబంధం. కొన్ని చోట్ల ఆ పని చేయడంవల్ల లాక్షణికప్రయోగం ఏర్పడుతుంటుంది. ఉదాహరణకు పుట్టుకగా తక్షుడు కానివాడు తక్ష అని చెప్పబడతాడు. 'తక్షా' అనగా వడ్రంగి అని అర్థం. ఇతడు పుట్టుక చేత వడ్రంగి కాకపోయినా ఆతడు ఆ పని చేయడం చేత వడ్రంగి అని చెప్పబడతాడు. ఇది లాక్షణికప్రయోగం. ఇవన్నీ శుద్ధలక్షణలే.

కా. లక్షణా తేన షడ్విధా. 12

వృ. ఆద్యభేదాభ్యాం సహ.

వ్యా. లక్షణాఇతి-తేన = ఆ ప్రకారముచేత, లక్షణా = లక్షణ, షడ్విధా = ఆరు విధములు. మొదట చెప్పిన ఉపాదానలక్షణాలక్షణలక్షణలతో ఈ నాలుగు భేదాలు కలపగా ఆరు భేదా లని అర్థం.

వృ. సా చ.

కా. వ్యఙ్గ్యేన రహితా రూఢౌ సహితా తు ప్రయోజనే

వృ. ప్రయోజనం హి వ్యఞ్జనవ్యాపారగమ్యమేవ.

కా. తచ్చ గూఢమగూఢం వా.

వృ. తచ్చేతి వ్యఙ్గ్యమ్ గూఢం యథా.

వ్యా. ఆ లక్షణ - వ్యఙ్గ్యేనేతి - "రూఢౌ = ప్రసిద్ధి ఉన్నప్పుడు, వ్యఙ్గ్యేన = వ్యంగ్యముతో, రహితా = శూన్యము, ప్రయోజనే తు = ప్రయోజనం ఉన్నట్లయితే, సహితా = వ్యంగ్యంతో కూడినది." ప్రయోజనమితి — "ప్రయోజనం వ్యంజన వ్యాపారంచేతనే గమ్యం అవుతుంది" "గంగాయాం ఘోషః" ఇత్యాదులలో రెండవదైన తటరూపార్థాన్ని లక్షణ బోధించిన తరవాత, శీతత్వపావనత్వాది రూపమైన మూడవ అంశాన్ని వ్యంజనవ్యాపారం బోధిస్తుంది.

తచ్చేతి-"తత్ చ = ఆ ప్రయోజనరూపమైన వ్యంగ్యం, గూఢమ్ = గూఢంగా

ఉండవచ్చు, అగూఢం వా = స్పష్టంగా ఉండవచ్చు" గచ్చ అనగా వ్యంగ్యం అని అర్థం.

వి. ప్రయోజనవల్లక్షణలో ఉన్న ఆరు భేదాలలో ఒక్కొక్కటి గూఢ వ్యంగ్యం అగూఢవ్యంగ్యం అని రెండు విధాలు. ఈ విధంగా ప్రయోజనవతి పన్నెండు విధాలు. రూఢిలక్షణ ఒకటి కలుపుతే మొత్తం లక్షణాభేదాలు పద మూడు. గూఢవ్యంగ్యం ఎట్లనగా -

శ్లో. ముఖం వికసితస్మితం వశితవక్రిమప్రేక్షితం
సముచ్ఛలితవిభ్రమా గతిరపాస్తసంస్థా మతిః,
ఉరో ముకులితస్తనం జఘనమంసబన్ధోద్ధురం
బతేన్దువదనాతనౌ తరుణిమోద్గమో మోదతే. 9

వ్యా. "మోములో చిరునవ్వు వికసించింది, చూపు వక్రత్వాన్ని వశం చేసుకుంది. నడకలో విలాసలు ఎగిసి ఎగిసి పడుతున్నాయి. బుద్ధి స్థైర్యాన్ని వదిలిపెట్టింది. వక్షస్థలం కుచాల మొగ్గలు తొడిగింది. జఘనప్రదేశం (ఊరు మూలం) కండ పెరిగి బలిష్ఠంగా ఉంది. అహా! చంద్రవదన అయిన ఈమె శరీరంలో యౌవనప్రారంభం (ఆవిర్భావం) ఆనందిస్తూన్నది".

వి. పుష్పధర్మమైన వికాసం చిరునవ్వులో బాధితం; అనగా వికసించడం అనేది పుష్పంలో ఉండే ధర్మం, చిరునవ్వులో ఉండేది కాదు. అందుచేత ఇక్కడ 'వికాస' శబ్దం లక్షణచేత 'బాగా అతిశయించి ఉండడం' అనే అర్థం బోధిస్తూన్నది. సౌరభం మొదలైన వాటిని వ్యంజింపచేయడం ప్రయోజనం. వాచ్యార్థానికీ లక్ష్యార్థానికీ సంకోచించకపోవడం సంబంధం. చేతనధర్మమైన 'వశంచేసుకోవడం' అనేది 'చూపులో' బాధితమై 'ఇష్టం వచ్చిన చోట ప్రవర్తించడం' అనే సంబంధం చేత స్వాధీనత్వం అనే అర్థాన్ని లక్షణచేత బోధిస్తూన్నది. అనురాగం కలిగి ఉండడం వ్యంగ్యం. మూర్తద్రవ్యంలో మాత్రమే ఉండే సముచ్ఛలనం అనేది విభ్రమంలో బాధితమై ప్రయోజ్యప్రయోజక భావసంబంధంచేత (కలిగేదీ కలగ చేసేదీ అనే సంబంధంచేత) బహులత్వాన్ని లక్షణయా బోధిస్తూన్నది. ఎక్కువగా ఉండేనే కదా ఎగిసి ఎగిసి పడడం? సకలమనోహరత్వం వ్యంగ్యం. స్థైర్యాన్ని

విడిచిపెట్టడం అనేది చేతన ధర్మం; మతియందు బాధితమై 'హేతుహేతుమద్భావ సంబంధంచేత కట్టుబాట్లను విడచివేయడం అనే అధీరత్వాన్ని లక్షణయా బోధిస్తున్నది. పూర్వం గురుజనసంనిధిలో ఉన్నప్పుడు ప్రియునితోను విషయంలో కొంత సంకోచం ఉండేది, ఇప్పుడు అది తగ్గింది అని వ్యంగ్యం. ముకుళితత్వం పుష్పధర్మం. అది స్తనాలలో బాధితమై నిబిడావయవత్వం (బిగువు) అనే సంబంధంచేత కాఠిన్యాన్ని లక్షణయా బోధిస్తున్నది. ఆలింగనయోగ్యత్వం లక్ష్యం. 'ఉద్ధురః' అనే పదానికి ఎత్తబడిన కాడి గల (బండి బరువు మోసే, లాగే) ఎద్దు మొదలైనది అని అర్థం. ఇది చేతనధర్మం, ఇది జఘనంలో బాధితమై భారసహనక్షమత్వసంబంధంచేత లక్షణయా విలక్షణగరిమయోగ్యత్వాన్ని బోధిస్తున్నది. రమణీయత్వం వ్యంగ్యం. చేతనధర్మమైన ఉపదేశం యౌవనోద్గమంలో బాధితమై జన్యజనకభావసంబంధంచేత ఉత్పాదనను లక్షణయా బోధిస్తున్నది. స్పృహణీయత్వం (ఆశించ తగి ఉండడం) వ్యంగ్యం.

ఈ విధంగా ఇక్కడ ఉన్న లక్షణలు లక్ష్యార్థాల ద్వారా ప్రయోజనరూపాలైన వ్యంగ్యార్థాలను వ్యంజింపచేస్తున్నాయి. అయితే ఈ వ్యంగ్యార్థాలు కావ్యవాసనాపరిపక్వబుద్ధుల హృదయాలకి మాత్రమే గోచరిస్తాయి కాని స్థూలబుద్ధుల మనస్సులకు గోచరించవు. అందుచేత ఇది గూఢవ్యంగ్యసహితలక్షణకు ఉదాహరణం. ఈ శ్లోకంలో పృథ్వీఛందస్సు. "జసౌజసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురుః" అని దీని లక్షణం.

వృ. అగూఢం యథా.

శ్లో. శ్రీపరిచయాజ్జడా అపి భవన్త్యభిజ్ఞా విదగ్ధచరితానామ్.
ఉపదిశతి కామినీనాం యౌవనమద ఏవ లలితాని. 10

వృ. అత్రోపదిశతీతి.

వ్యా. అగూఢవ్యంగ్యానికి, అనగా వ్యంగ్యార్థం స్పష్టంగా గోచరించే లక్షణకి, ఉదాహరణం ఎట్లనగా-

శ్రీతి-"లక్ష్మితో కొంచెం పరిచయం ఏర్పడేటప్పటికి (నాలుగు పైసలు చేరేటప్పటికి) మూర్ఖశిఖామణులు కూడా మంచి చాతుర్యం గల పెద్దమనుషులలాగ

ప్రవర్తిస్తారు. కామినులను యౌవనమదమే లలితాలను ఉపదేశిస్తుంది".
అత్రేతి - ఇక్కడ 'ఉపదిశతి' అనేది అగూఢవ్యంగ్యం.

వి. 'లలితం' అనగా సుకుమారమైన విన్యాసం, సున్నితమైన చేష్టలు. ఉపదేశించడం అనగా జ్ఞానాన్ని కలిగించే శబ్దప్రయోగం. అది చేతనధర్మం. అందుచేత ఇది అచేతనమైన యౌవనమదంలో బాధితమై సామాన్యవిశేషభావసంబంధంచేత ఆవిష్కరించడం అనే అర్థాన్ని లక్షిస్తూ బోధిస్తూన్నది. లలితాలను శ్రమ లేకుండా గ్రహించడం అనేది వ్యంగ్యార్థం. ఇది సహృదయులకే కాకుండా సామాన్యులకు కూడా వాచ్యార్థంవలె తెలుస్తూన్నది కాబట్టి అగూఢం. ఏదైనా ఒక విషయాన్ని తెలపడం (ఆవిష్కరించడం) సామాన్యం. ఆ ఆవిష్కరణం శబ్ద ప్రయోగం ద్వారా జరగవచ్చు, చేష్టలవల్ల జరగవచ్చు, మరొకవిధంగా జరగవచ్చు. అవన్నీ ఆవిష్కరణంలోని విశేషాలు. ఇక్కడ 'ఉపదిశతి' అనే శబ్దానికి 'ఆవిష్కరించుచున్నది' అని సామాన్యరూపమైన అర్థం చెప్పబడింది. ఈ ఉపదేశానికి ఆవిష్కరణకీ సామాన్యవిశేషభావసంబంధం.

కా. తదేషా కథితా త్రిధా. 13

వృ. అవ్యఙ్గ్యా, గూఢవ్యఙ్గ్యా అగూఢవ్యఙ్గ్యా చ.

వ్యా. తత్ = అందువలన, కథితా = పైన చెప్పబడిన లక్షణ, త్రిధా = మూడు విధములు - అవ్యంగ్య, గూఢవ్యంగ్య, అగూఢవ్యంగ్య.

కా. తద్భూర్లాక్షణికః.

వృ. శబ్ద ఇతి సంబధ్యతే. తద్భూః తదాశ్రయః.

వ్యా. తదితి - తద్భూః = ఆ లక్షణకు ఆశ్రయమైనది, లాక్షణికః = లాక్షణికము. ఆరవకారికలోని 'శబ్దః' అనేపదం ఇక్కడ అన్వయించుకొని "లాక్షణికః" అనగా లాక్షణికశబ్దము అని అర్థం చెప్పుకోవాలి.

కా. తత్ర వ్యాపారో వ్యఞ్జనాత్మకః

వృ. కుత ఇత్యాహ.

కా. యస్య ప్రతీతిమాధాతుం లక్షణా సముపాస్యతే, 14
ఫలే శబ్దైకగమ్యేఽత్ర వ్యఞ్జనాన్నాపరా క్రియా.

వృ. ప్రయోజనప్రతిపిపాదయిషయా యత్ర లక్షణయా శబ్ద ప్రయోగ స్తత్ర నాన్యత స్తత్ప్రతీతిః, అపి తు తస్మాదేవ శబ్దాత్ ; న చాత్ర వ్యఞ్జనాదృతేఽన్యో వ్యాపారః. తథాహి -

వ్యా. వాచకము, లాక్షణికము, వ్యంజకము అని శబ్దం మూడు విధాలు అని ఆరవకారికలో చెప్పి వాచక-లాక్షణికశబ్దస్వరూపాలు నిరూపించిన తరవాత ఇప్పుడు ఇంక వ్యంజకశబ్దాన్ని గూర్చి వివరించవలసి ఉంది. 'వ్యంజన' అనే వ్యాపారం (వృత్తి) ఉన్నశబ్దం వ్యంజకం. శబ్దనిష్ఠవ్యంజన, అర్థనిష్ఠవ్యంజన అని వ్యంజన రెండు విధాలు. రెండవదాన్నిగూర్చి తృతీయోద్ద్యోతంలో చప్పనున్నాడు. అభిధామూలవ్యంజన, లక్షణామూలవ్యంజన అని శబ్దనిష్ఠవ్యంజన రెండు విధాలు. వాటిలో లక్షణామూలవ్యంజనను గూర్చి ముందుగా చెపుతున్నాడు- తత్రేతి తత్ర = లాక్షణిక శబ్దంలో, వ్యాపారః = వ్యంగ్యార్థాన్ని ప్రకాశింపచేయ డానికి అనుకూలమైన వ్యాపారం, వ్యఞ్జనాత్మకః = వ్యంజనారూపమైనది.

అవ.ప్రయోజనవల్లక్షణాస్థలాలలో ప్రయోజనం వ్యంగ్యం అని వెనుక చూచి ఉన్నాం. ప్రయోజనరూపవ్యంగ్యార్థాన్ని ప్రకాశింపచేసే వ్యాపారం కూడా లక్షణ యేనా అనే ఆశంకను తొలగించడానికి ఆ వ్యాపారం లక్షణ కాదు, వ్యంజన అనే మూడవ వ్యాపారం అని ఇక్కడ ప్రతిపాదిస్తున్నాడు. ఎందుచేత ననగా -

యస్యేతి :- యస్య = శైత్యపావనత్వాదిరూపమైన ఏ ఫలముయొక్క, ప్రతీతిమ్ = జ్ఞానమును, ఆధాతుమ్ = కలిగించుటకు. లక్షణా = లాక్షణికశబ్దము, సముపాస్యతే = ఆశ్రయించబడుచున్నదో, శబ్దైకగమ్యే = లాక్షణిక శబ్దముమాత్రం చేతనే తెలియదగిన, అత్ర = ఈ, ఫలే = శైత్యపావనత్వాదిప్రయోజనాల విషయంలో (వాటిని బోధించడం విషయంలో), వ్యఞ్జనాత్ = వ్యంజనతప్పితే, అపరా = మరియొక, క్రియా = వ్యాపారము, న = లేదు.

ప్రయోజనేతి - ప్రయోజనాన్ని ప్రతిపాదించాలనే ఇచ్ఛతో లాక్షణికశబ్దం ఎక్కడ ప్రయోగించబడుతూన్నదో అక్కడ దాని ప్రతీతి శబ్దంవల్లనే కలుగు

తున్నది గాని మరొకదానివల్ల దేనివల్లా కాదు. ఈ ప్రయోజనం విషయంలో వ్యంజన తప్ప మరొక వ్యాపారం లేదు.

వి. 'గఙ్గాతటే ఘోషః'అని వాచకశబ్దాన్నే ప్రయోగించడానికి వీలు ఉన్నా 'గఙ్గాయాం ఘోషః'అని లాక్షణికశబ్దాన్ని ప్రయోగిస్తున్నాడనగా శైత్య పావనత్వాదిరూపమైన ప్రయోజనాన్ని (ఫలాన్ని) కూడా ఆ 'గఙ్గా' శబ్దంచేతనే బోధించాలని వక్త అభీష్టం. అనగా ఇక్కడ కలుగుతూన్న ప్రయోజనజ్ఞానానికి 'గఙ్గా'శబ్దమే కారణం కాని మరొకటి ఏదీ కారణం కాదు. అయితే ఈ అర్థాన్ని గఙ్గాశబ్దం 'వ్యంజన' అనే వ్యాపారం ద్వారా బోధిస్తూన్నది. అది తప్ప మరొక వ్యాపారం ఏదీ లేదు.

అవ. ఈ శబ్దం ప్రయోజనరూపమైన ఆ అర్థాన్ని కూడా అభిధచేతనో, లక్షణ చేతనో చెప్పవచ్చును కదా ? ఈ మూడవ వ్యాపారం వ్యంజనను అంగీకరించడం ఎందుకు అనడానికి వీలులేదు అని చెపుతున్నాడు:- తథాహి=అదియుక్తమే కదా ? (ఎందుచేతననగా) -

కా. నాభిధా సమయాభావాత్.

వృ. 'గఙ్గాయాం ఘోషః' ఇత్యాదౌ యే పావనత్వాదయో ధర్మా స్తటాదౌ ప్రతీయన్తే న తత్ర గఙ్గాదిశబ్దాః సంకేతితాః.

వ్యా. నేతి-సమయాభావాత్ = సంకేతం లేకపోవడంవల్ల, అభిధా=అభిధ, న = కాదు.

గఙ్గాయామితి - 'గఙ్గాయాం ఘోషః' ఇత్యాదులలో ఏ పావనత్వాది ధర్మాలు తటాదులలో ఉన్నట్లు తెలియబడుతున్నాయో, వాటి విషయంలో గఙ్గాది శబ్దాలు సంకేతితాలు కావు.

వి. అభిధావ్యాపారంచేతనే 'గఙ్గా'శబ్దం శైత్యపావనత్వాదులను బోధిస్తుంది అనడం కుదరదు. 'ఈ శబ్దానికి ఇది అర్థం'అని సంకేతితమైన అర్థాన్ని మాత్రమే అభిధ చెప్పకలుగుతుంది. 'గంగా' శబ్దానికి ప్రవాహరూపార్థంలోనే సంకేతం కాని శైత్యపావనత్వాదిరూపార్థాలలో సంకేతం లేదు కదా ?

అవ. గఙ్గాశబ్దం అభిధచేత కాకపోయినా లక్షణచేత ఆ అర్థాలను బోధించ

వచ్చును కదా అంటే ప్రయోజనరూపార్థంలో లక్షణ కూడా కుదరదు అని చెప్తున్నాడు -

కా. హేత్వభావాన్న లక్షణా. 15

వృ. ముఖ్యార్థబాధాదిత్రయం హేతుః.

వ్యా. హేత్వితి-హేత్వభావాత్ = హేతువులు లేకపోవడంవల్ల, లక్షణా= లక్షణ, న = లేదు.

ముఖ్యేతి - ముఖ్యార్థబాధాదిత్రయం హేతువు.

వి. ఏ అర్థం బోధించడానికైనా లక్షణను అంగీకరించాలంటే మూడు హేతువు లుండాలి. వెనుక చెప్పిన ముఖ్యార్థబాధ, ముఖ్యార్థసంబంధం, ప్రయోజనం లేదా రూఢి అనేవి మూడు హేతువులు. ఈ హేతువులు లేకపోవడంచేత ఇక్కడ లక్షణ అంగీకరించడం కుదరదు అని చెప్తున్నాడు -

వృ. తథా చ -

కా. లక్ష్యం న ముఖ్యం నాప్యత్ర బాధో యోగః ఫలేన నో,
న ప్రయోజనమేతస్మిన్ న చ శబ్దః స్ఖలద్గతిః.

వృ. యథా గఙ్గాశబ్దః స్రోతసి సబాధ ఇతి తటం లక్షయతి తద్వత్ యది తటేఽపి సబాధః స్యాత్ తత్ ప్రయోజనం లక్షయేత్; న చ తటం ముఖ్యోర్థః. నాప్యత్ర బాధః, న చ గఙ్గాశబ్దార్థస్య తటస్య పావనత్వాద్యైః లక్షణీయైః సమ్బన్ధః, నాపి ప్రయోజనే లక్ష్యే కించిత్ ప్రయోజనమ్, నాపి గఙ్గాశబ్దస్తటమివ ప్రయోజనం ప్రతిపాదయితుమ సమర్థః.

వ్యా. తథేతి - "అది యుక్తమే కదా ?" లక్ష్యమితి - లక్ష్యార్థం ముఖ్యం (ముఖ్యార్థం) కాదు. దానియందు బాధ కూడా లేదు. దానికి ఫలంతో (ప్రయోజనంతో) సంబంధమూ లేదు. ప్రయోజనాన్ని లక్షణయా బోధిస్తే మరొక ప్రయోజనం లేదు. శబ్దానికి ప్రవృత్తివిషయంలో తొట్రుపాటు లేదు.

యథా ఇత్యాది :- గఙ్గాశబ్దానికి స్రోతస్సు అనే అర్థం చెపితే బాధ ఉండడంచేత లక్షణయా తటాన్ని బోధించినట్లు తటం అనే అర్థంలో కూడా బాధ ఉంటే (ఆ తటం) ప్రయోజనాన్ని లక్షణయా బోధించకలుగుతుంది. కాని తటం ముఖ్యార్థమూ కాదు, బాధా లేదు. గఙ్గాశబ్దానికి అర్థం అయిన (లక్ష్యార్థమైన) తటానికి లక్షణయా బోధించవలసిన పావనత్వాదులతో సంబంధం లేదు. ప్రయోజనాన్ని లక్షణయా బోధించడంలో మరే ప్రయోజనమూ లేదు. గఙ్గాశబ్దం తటాన్ని బోధించినట్లు ప్రయోజనాన్ని బోధించడంలో అసమర్థమూ కాదు.

వి. 'గఙ్గా' శబ్దానికి 'ప్రవాహం'ముఖ్యార్థం కాని తటం ముఖ్యార్థం కాదు. అది లక్ష్యార్థం కదా ? తటంమీద ఘోషం ఉండడంలో బాధ (అనుపపత్తి) కూడా ఏమీ లేదు. అందుచేత లక్షణ అంగీకరించడానికి అవసరమైన మూడు హేతువులలో ఒకటైన 'ముఖ్యార్థబాధ' అనేది లేదు. 'గఙ్గా'శబ్దార్థానికి లక్ష్యార్థమైన తటానికి, దీనిచేత ఏ పావనత్వాదిప్రయోజనాలు లక్షణచేత బోధింపబడుతాయి (లక్షణీయములు) అని అంటున్నావో వాటితో సంబంధం లేదు. వాటితో సాక్షాత్సంబంధం గంగాప్రవాహానికే కదా ? 'గఙ్గా' శబ్దానికి ముఖ్యార్థమైన ప్రవాహం అనే అర్థం కుదరక తటం అనే అర్థం చెప్పి అలా లాక్షణికార్థం చెప్పడంవల్ల శైత్యపావనత్వాదులు ప్రయోజనంగా ప్రతీయమానములు అవుతున్నాయి అని చెప్పినట్లు 'గంగాతీరం' అనే అర్థం చేత శైత్యపావనత్వాదిప్రయోజనాలు లక్షణయా బోధించబడతాయి అన్నట్లయితే, లక్ష్యార్థమైన ప్రయోజనానికి మరొక ప్రయోజనం చూపవలసి ఉంటుంది. అలాంటి ప్రయోజన మేమీ కనబడడంలేదు. ఈ విధంగా ముఖ్యార్థబాధా లేదు, లక్షణయా బోధింపబడుతుంది అని చెప్పే ద్వితీయలక్ష్యార్థం అయిన ప్రయోజనంతో ప్రథమలక్ష్యార్థం అయిన తటానికి సంబంధమూ లేదు, తటరూపలక్ష్యార్థం సహాయంతో లక్షణయా చెప్పిన రెండవ లక్ష్యార్థమైన శైత్యపావనత్వాదిప్రయోజనానికి సంబంధించిన మరొక ప్రయోజనం లేదు. ఈ విధంగా మూడు హేతువులూ కూడా లేకపోవడంచేత లక్షణద్వారానే ప్రయోజనం (రెండవ) లక్ష్యార్థంగా బోధింపబడుతుంది అనేది యుక్తం కాదు. మరొక విషయం ఏమనగా 'గఙ్గా' శబ్దానికి తటరూపమైన ముఖ్యార్థాన్నీ, తీరరూపమైన లక్ష్యార్థాన్నీ బోధించే సామర్థ్యం ఏ విధంగా ఉందో ప్రయోజనరూపమైన అర్థాన్ని బోధించే సామర్థ్యం కూడా ఉంది. 'గఙ్గా'శబ్దం ప్రయోజనరూపార్థాన్ని బోధించడానికి కుంటుపడదు; ఇంక ఏమిటనగా - ప్రవాహరూపార్థాన్ని అభిధావ్యాపారంచేత, తటరూపార్థాన్ని

లక్షణావ్యాపారంచేత బోధిస్తే ప్రయోజనరూపార్థాన్ని మరొక వ్యాపారంచేత బోధిస్తుంది. అదే వ్యంజనావ్యాపారం. వ్యాపారాలు వేరైనా బోధించే శబ్దం మాత్రం ఒక్కటే.

అవతారిక - ప్రయోజనాన్ని లక్షణయా బోధించవచ్చు అని చెప్పినట్లయితే దానికి మరొక ప్రయోజనం చెప్పవలసి వస్తుంది; అందుచేత ప్రయోజనం విషయంలో లక్షణావృత్తిని అంగీకరించడం కుదరదు అని చెప్పబడింది. దీనికి సమాధానంగా ఎవరైనా వైతండికుడు - "తప్పేముంది ? తీరగతశైత్యపావనత్వాదుల వల్ల ఘోషగతశైత్యపావనత్వాదులు బోధించబడతాయి" అని వాదించవచ్చును. దానికి సమాధానం చెపుతున్నాడు -

కా. ఏవమప్యనవస్థా స్యాద్యా మూలక్షయకారిణీ.

వృ. ఏవమపి ప్రయోజనం చేల్లక్ష్యతే తత్ప్రయోజనాన్తరేణేతి, తదపి ప్రయోజనాన్తరేణేతి ప్రకృతాప్రతీతికృత్ అనవస్థా భవేత్.

వ్యా. ఏవమితి - ఏవమపి = ప్రయోజనం లక్షణచేత బోధింపబడినట్లయితే, యా = ఏది, మూలక్షయకారిణీ = మూలమునకే క్షయమును కలిగించునో అట్టి, అనవస్థా = అనవస్థ, స్యాత్ = వచ్చును.

ఏవమితి. "ఈ విధంగా ప్రయోజనాన్ని లక్షణయే బోధిస్తుంది అని అంగీకరిస్తే అది మరి యొక ప్రయోజనంచేత, అది కూడా మరొక ప్రయోజనం చేత అని ప్రకృతవిషయం, గంగాశబ్దానికి తటలక్షణ, తెలియకుండా పోయే అనవస్థాదోషం ఏర్పడుతుంది."

వి. ప్రయోజనం కూడ లక్షణచేతనే బోధించబడుతుంది అని అంగీకరిస్తే రెండవదైన ఆ ప్రయోజనలక్షణకు ప్రయోజనం వెదకాలి. అదీ (మూడో ప్రయోజనం) లక్ష్యమే కాబట్టి దానికి మరొక ప్రయోజనం చెప్పాలి. ఈ విధంగా ప్రయోజనాన్వేషణకు అంతం లేకపోవడంచేత మూలభూతమైన లక్షణకే మోసం వచ్చి ప్రస్తుతపావనత్వాదికం గాని తీరాదికం కాని తెలియకుండా పోతుంది.

అవతారిక. ప్రయోజనం లక్షణచేత బోధించబడుతుంది అని కాకుండా

ప్రయోజనసహితమైన (శైత్యపావనత్వాదిసహితమైన) తటాన్నే లక్షణ బోధిస్తుంది అని చెప్పవచ్చును కదా అనే ఆశంకకు సమాధానం చెపుతున్నాడు.

వృ. నను పావనత్వాదిధర్మయుక్తమేవ తటం లక్ష్యతే. 'గఙ్గాయాస్తటే ఘోషః' ఇత్యతోఽధికస్యార్థస్య ప్రతీతిశ్చ ప్రయోజనమితి విశిష్టే లక్షణా; తత్ కిం వ్యఞ్జనయా ఇత్యాహ -

కా. ప్రయోజనేన సహితం లక్షణీయం న యుజ్యతే 17

వృ. కుత ఇత్యాహ -

కా. జ్ఞానస్య విషయోహ్యన్యః ఫలమన్యదుదాహృతమ్.

వృ. ప్రత్యక్షాదేర్నీలాదిర్విషయః. ఫలం తు ప్రకటతా సంవిత్తిర్వా.

వ్యా. నన్విత్యాది :- పావనత్వాది ధర్మములతో కూడిన తటమే లక్షణ చేత బోధింపబడుతుంది. అలా చేయడంవల్ల 'గఙ్గాయాః తటే ఘోషః' అని చెప్పినదానికంటె అధికమైన అర్థం గోచరించడమే ప్రయోజనం. ఈ విధంగా ప్రయోజనవిశిష్టమైనదానియందే లక్షణ చెప్పవచ్చును కదా ? వ్యంజన ఎందుకు ? అనే ఆశంకకు సమాధానం చెపుతున్నాడు -

ప్రయోజనేన ఇతి - ప్రయోజనేన = ప్రయోజనముతో, సహితమ్ = కూడిన అర్థము, లక్షణీయమ్ = లక్షణచేత బోధింపదగినదిగా, న యుజ్యతే = యుక్తము కాదు.

"ఎందుచేతననగా చెప్పుచున్నాడు."

జ్ఞానస్య ఇతి - జ్ఞానస్య = జ్ఞానముయొక్క, విషయః = విషయము, అన్యః = వేరైనది; ఫలమ్ = ఫలము. అన్యత్ = వేరైనది అని. ఉదాహృతమ్ = చెప్పబడినది.

ప్రత్యక్షేతి - "ప్రత్యక్షాదులకు నీలాదికం విషయం, ప్రకటత, లేదా సంవిత్తి దాని ఫలం కదా ?"

వి. శీతత్వపావనత్వాదిధర్మాలతో కూడిన తటాద్యర్థాలనే లక్షణచేత

బోధించడం కుదరదు. ఎందుచేత ననగా - ప్రత్యక్షానుమానాదిజ్ఞానాలలో జ్ఞానం వేరు, దాని విషయం వేరు, దాని ఫలం వేరు అని అందరూ అంగీకరించిన విషయం. ఉదాహరణకి - నీలఘటంతో చక్షురింద్రియం కలవగానే దాని జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానంలో విషయం నీలఘటం. ఆ జ్ఞానం కలగగానే 'ఘటం తెలియబడింది' (జ్ఞాతో ఘటః) అన్న ప్రతీతి కలుగుతూన్నది గాన 'తెలియబడుట' అనేది ఘటంలో కలుగుతూన్నది. 'తెలియబడుట' అనేదానికే 'ప్రకటిత'అని మరొక పేరు. ఈ ప్రకటత అనే ఫలం ఘటంలో ఉంటుంది. ఇది పూర్వమీమాంసకుల మతం. ఘటజ్ఞానం కలిగిన తరవాత 'నాకు ఘటం తెలిసింది, (ఘటమహం జానామి) అనే జ్ఞానం (సంవిత్తి) జ్ఞాతకు కలుగుతుంది. ఈ జ్ఞానానికే (సంవిత్తికే) అనువ్యవసాయజ్ఞానం అని పేరు. ఈ విధంగా ఘటజ్ఞానఫలం అయిన ఈ సంవిత్తి జ్ఞాతలో ఉంటుంది అని నైయాయికుల మతం. ఎవరి మతం ఎలా ఉన్నా జ్ఞానం వేరు, దానిలో విషయమైన ఘటం వేరు, ఆ జ్ఞానంవలన కలిగిన ప్రకాశత లేదా సంవిత్తి అనే ఫలం వేరు అనేది సర్వసంమతం.

శబ్దప్రమాణానికి సంబంధించిన లక్షణాస్థలంలో కూడా ముఖ్యార్థం కుదరకపోవడంచేత అది కుదరడానికి తగిన విధంగా 'తట' జ్ఞానం మాత్రమే కలుగుతుంది. ప్రయోజనం దాకా వెళ్ళే అవసరం లేదు. ఈ విధంగా లక్షణాజన్యమైన తటజ్ఞానంలో తటం విషయం. శైత్యాదికం ఫలం. ఆ ఫలజ్ఞానం ఎలా కలిగింది అని విమర్శిస్తే అది లక్షణాభిన్నమైన వ్యంజనద్వారానే కలిగింది అని చెప్పాలి అని భావం.

కా. విశిష్టే లక్షణా నైవమ్.

వృ. వ్యాఖ్యాతమ్.

కా. విశేషాః స్యుస్తు లక్షితే. 18

వృ. తటాదౌ యే విశేషాః పావనత్వాదయస్తే చాభిధాతాత్పర్యలక్షణాభ్యో వ్యాపారాన్తరేణ గమ్యాః. తచ్చ వ్యఞ్జన - ధ్వనన-ద్యోతనాది శబ్దవాచ్యమవశ్యమేషితవ్యమ్.

వ్యా. విశిష్టే ఇతి - ఏవమ్ = ఈ విధంగా, విశేష్టే = ప్రయోజన విశిష్ట మైన తీరాదికమునందు, లక్షణా = లక్షణ, న = లేదు.

వ్యాఖ్యాతవ్ = పైె కారికాభాగం స్పష్టార్థం కాబట్టి వ్యాఖ్యానించినట్లే. విశేషాః తు = విశేషాలైతే, లక్షితే = లక్షణచేత బోధించబడినదానియందు, స్యుః = ఉండును.

తటాదౌ ఇతి - "తటాదులలో భాసించే పావనత్వాదివిశేషాలు అభిధా తాత్పర్యలక్షణావృత్తులకంటె భిన్నమైన మరొక వ్యాపారం ద్వారానే తెలుస్తాయి. 'వ్యంజనం' 'ధ్వననం' 'ద్యోతనం' ఇత్యాది శబ్దాలచేత చెప్పబడే ఆ వ్యాపారాన్ని తప్పక అంగీకరించవలసి ఉంటుంది."

వృ. ఏవం లక్షణామూలం వ్యఞ్జకత్వముక్తమ్. అభిధామూలం త్వాహ -

కా. అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే
సంయోగాద్యైరవాచ్యార్థధీకృద్వ్యాపృతిరఞ్జనమ్. 19

వ్యా. ఏవమితి - ఈ విధంగా లక్షణామూలకమైన వ్యంజకత్వం (వ్యంజన) నిరూపించబడింది. ఇప్పుడు అభిధామూలకమైన వ్యంజనను గూర్చి చెపుతున్నాడు.

అనేకేతి - అనేకార్థస్య = అనేకములైన అర్థాలు గల, శబ్దస్య = శబ్దము యొక్క, వాచకత్వే = వాచకత్వము, సంయోగాద్యైః = సంయోగం మొదలైన వాటిచేత, నియన్త్రితే = నియంత్రితమైన దగుచుండగా, అవాచ్యార్థధీకృత్ = వాచ్యం కాని అర్థంయొక్క జ్ఞానాన్ని కలిగించే, వ్యాపృతిః = వ్యాపారము, అఞ్జనమ్ = వ్యంజన.

వి. ఒక శబ్దానికి ఒకటికంటె మించి అనేకమైన అర్థాలు ఉండవచ్చును. అయితే ఆ శబ్దాన్ని ఒక వాక్యంలో ప్రయోగించినప్పుడు శ్రోతకు ఆ శబ్దానికున్న అన్ని అర్థాలూ స్ఫురించవు. వాక్యపదీయంలో భర్తృహరి చెప్పినట్లుగా సంయోగం మొదలైనవి ఆ వాక్యంలోని ఆ శబ్దం ఆ సందర్భానికి తగిన ఒక్క అర్థం మాత్రమే బోధించేటట్లు చేస్తాయి. అందుచేత ఆ వాక్యంలో ఉన్న ఆ శబ్దానికి ఆ ఒక్క అర్థమే వాచ్యార్థం. ఆ అర్థం తెలిసిన తరవాత శ్రోతకి ఆ శబ్దంవల్ల

మరొక అర్థం ఏదైనా గోచరిస్తే గోచరించవచ్చు. ఆ రెండవ అర్థాన్ని ఆ శబ్దం వ్యంజనవ్యాపారంచేతనే బోధిస్తుంది కాని అభిధావ్యాపారంచేత కాదు. దానికున్న అభిధావ్యాపారం మొదటి అర్థాన్ని మాత్రమే బోధించడానికి సంయోగాదులచేత నియమితం అవడంచేత ఆ అర్థాన్ని (మొదటి అర్థాన్ని) బోధించి శాంతించింది. ఇంక అది పని చేయదు. అందుచేత రెండవ అర్థాన్ని బోధించడానికి మరొక వ్యాపారం కావాలి. ఆ వ్యాపారమే 'వ్యంజన'.

అవ. అభిధను నియంత్రించే సంయోగాదులను భర్తృహరి ప్రతిపాదించి ఉన్నాడు. ఆ కారికలను ఉద్ధరిస్తున్నాడు -

శ్లో. "సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా,
అర్థః ప్రకరణం లిఙ్గం శబ్దస్యాన్యస్య సంనిధిః,
సామర్థ్యమౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః."

వృ. ఇత్యుక్తదిశా 'సశఙ్ఖచక్రః హరిః' 'అశఙ్ఖచక్రః హరిః' ఇత్యుచ్యతే, 'రామ లక్ష్మణౌ'ఇతి దాశరథౌ, 'రామార్జునగతిస్తయోః' ఇతి భార్గవ కార్తవీర్యయోః, 'స్థాణుం భజ భవచ్ఛిదే' ఇతి హరే, 'సర్వం జానాతి దేవః' ఇతి యుష్మదర్థే, 'కుపితో మకరధ్వజః' ఇతి కామే, "దేవస్య పురారాతేః" ఇతి శమ్భౌ, 'మధునా మత్తః కోకిలః'ఇతి వసన్తే, 'పాతు వో దయితాముఖమ్"ఇతి సాంముఖ్యే, 'భాత్యత్ర పరమేశ్వరః' ఇతి రాజధానీరూపాద్దేశాత్ రాజని, 'చిత్రభానుర్విభాతి' ఇతి దినే రవౌ, రాత్రౌ వహ్నౌ, 'మిత్రం భాతి'ఇతి సుహృది, 'మిత్రో భాతి'ఇతి రవౌ. 'ఇన్ద్రశత్రుః' ఇత్యాదౌ వేదే ఏవ న కావ్యే స్వరో విశేషప్రతీతికృత్.

వ్యా. సంయోగఇతి :- "సంయోగం, విప్రయోగం, సాహచర్యం, విరోధం, ప్రయోజనం, లింగం, ఇతరశబ్దసంనిధి, సామర్థ్యం, ఔచిత్యం, దేశం, కాలం, పుంనపుంసకలింగాదికం, స్వరాదులు - ఇది ఒక శబ్దానికి ఉన్న అనేకార్థాలలో ఏ అర్థం చెప్పాలో నిర్ణయం కుదరనప్పుడు, అర్థవిశేషాన్ని స్మరించడానికి హేతువులుగా ఉపయోగిస్తాయి"అని చెప్పిన విధంగా 'సంశఙ్ఖచక్రః హరిః, 'అశఙ్ఖచక్రః హరిః' అన్నప్పుడు అచ్యుతునియందూ, 'రామలక్ష్మణౌ' అన్నప్పుడు దశరథకుమారుడైన రామునియందు, 'తయోః రామార్జునగతిః' అన్నప్పుడు

రామార్జునశబ్దాలకి పరశురామకార్తవీర్యార్జునులయందు, 'స్థాణుం భజ భవచ్ఛిదే' అన్నప్పుడు ఈశ్వరునియందు, 'సర్వం జానాతి దేవః' అన్నప్పుడు మీరు అనే అర్థమునందు, 'కుపితః మకరధ్వజః' అన్నప్పుడు మన్మథునియందు, 'దేవస్య పురారాతేః' అన్నప్పుడు శివునియందు, 'మధునా మత్తః కోకిలః' అన్నప్పుడు వసంతఋతువునందు; "పాతు వో దయితాముఖమ్" అన్నప్పుడు సాంముఖ్యమునందు, భాత్యత్ర పరమేశ్వరః' అన్నప్పుడు రాజధానీరూపమైన దేశమువలన రాజునందు, 'చిత్రభానుః విభాతి' అన్నప్పుడు పగలైతే సూర్యునియందు, రాత్రి అయితే అగ్ని యందు, 'మిత్రం భాతి' అన్నప్పుడు స్నేహితునియందు, 'మిత్రో భాతి' అన్నప్పుడు సూర్యునియందు, సంయోగాదులవల్ల అర్థనిర్ణయం కలుగుతుంది. స్వరం 'ఇన్ద్రశత్రుః' ఇత్యాది వేదవాక్యాలలోమాత్రమే విశేషార్థప్రతీతిని కలగజేస్తుంది కాని కావ్యంలో కలిగించదు."

వి. ఒక వాక్యంలో అనేకమైన అర్థాలున్న ఒక శబ్దం వచ్చినప్పుడు దానికి ఏ అర్థం చెప్పాలో సంయోగాదులు నిర్ణయిస్తాయి. వాటిని పట్టి అక్కడ కావల సిన అర్థం గ్రహించబడుతుంది.

1. సంయోగం : రెండు వస్తువుల మధ్య లేదా ఇద్దరు వ్యక్తుల మధ్య, లేదా వస్తువుకూ వ్యక్తికీ మధ్య లోకప్రసిద్ధమైన సంబంధం. ఉదాహరణం - "సశఙ్ఖచక్రః హరిః" (శంఖచక్రాలతో కూడిన హరి). 'హరి'శబ్దానికి యముడు, వాయువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, విష్ణువు, సింహం, కిరణం, గుఱ్ఱం, చిలక, సర్పం, వానరం, కప్ప మొదలైన అనేకమైన అర్థాలు ఉన్నాయి. అయితే శంఖచక్రాల సంయోగం విష్ణువుకే ప్రసిద్ధం గాన ఈ సంయోగం హరిశబ్దాన్ని విష్ణువు అనే అర్థంలో నియంత్రించింది. అందుచేత ఈ వాక్యంలో విష్ణువు అనే అర్థాన్నిమాత్రమే గ్రహించాలి. అదొక్కటే ఇక్కడ ఈ శబ్దానికి వాచ్యార్థం. ఇతరోదాహరణలలో కూడా ఇదే పద్ధతి.

2. విప్రయోగం - కలిసి ఉండేవిగా ప్రసిద్ధమైనవాటిని విడిపోయినట్లు చెప్పినప్పుడు ఆ విడిపోవడం విప్రయోగం. ఉదా. "అశఙ్ఖచక్రో హరిః". ఇక్కడ కూడా ఎప్పుడూ కలిసి ఉండే శంఖచక్రాలు హరినుండి దూరమైనట్లు చెప్ప బడింది. అందుచేత ఈ విప్రయోగం విష్ణువు అనే అర్థంలో 'హరి' శబ్దాన్ని నియంత్రిస్తూన్నది.

3. సాహచర్యం - కలిసి తిరుగుతూ ఉండడం సాహచర్యం. 'రామ' శబ్దానికి దశరథరాముడు, పరశురాముడు, బలరాముడు అని మూడర్థాలు ఉన్నా "రామలక్ష్మణౌ" అన్నప్పుడు లక్ష్మణునితో సాహచర్యం దశరథరాముడికే ఉంది కాబట్టి ఈ శబ్దం ఈ అర్థంలో నియంత్రితం అయింది.

4. విరోధిత :- ప్రసిద్ధమైన విరోధం 'విరోధిత'. 'రామ' అనగా ఏ రాముడైనా కావచ్చు. 'అర్జున' అనగా కార్తవీర్యార్జునుడు కాని పాండవార్జునుడు కాని కావచ్చు. 'రామార్జునగతిః తయోః' (వాళ్ళ పద్ధతి రామార్జునులపద్ధతి వంటిది) అన్నప్పుడు పరశురామ కార్తవీర్యార్జునుల విరోధం ప్రసిద్ధం అవడంచేత దానిని పట్టి రామశబ్దానికి పరశురాము డనే అర్థంలోను, అర్జునశబ్దానికి కార్తవీర్యార్జును డనే అర్థంలోను నియంత్రణం.

5. అర్థం - అర్థం అనగా ప్రయోజనం. ఉదా. 'స్థాణుం భజ భవచ్ఛిదే' (సంసారబంధచ్ఛేదనం కొరకు స్థాణువును సేవించుము). 'స్థాణు' శబ్దానికి కొమ్మలు నరికివేసిన చెట్టు మాను, శివుడు, బండరాయి మొదలైన అర్థాలున్నాయి. కాని సంసారబంధచ్ఛేదనం అనే ప్రయోజనాన్ని శివుడు మాత్రమే సాధించగలడు గాన ఇక్కడ 'స్థాణు' శబ్దానికి శివరూపార్థంలో నియంత్రణం.

6. ప్రకరణం - ప్రకరణం అనగా సందర్భం. ఉదా- "సర్వం జానాతి దేవః" (దేవుడే అన్నీ ఎరుగును). దేవశబ్దానికి దేవత, రాజు అనే అర్థాలు ఉన్నాయి. ఒకడు రాజుతో మాట్లాడుతున్న సందర్భంలో పలికిన ఈ వాక్యం లోని 'దేవ' శబ్దానికి 'ప్రభువులు' 'తమరు' అని అర్థం.

7. లింగం - ఒక వస్తువులో కాని వ్యక్తిలో కాని సంయోగసంబంధ భిన్నసంబంధంతో ఉండే ధర్మం లింగం. అది ఇతరవస్తువులనుండి దీన్ని వేరు చేస్తుంది (వ్యావర్తకం). ఉదా. 'కుపితో మకరధ్వజః' (మకరధ్వజుడు కోపించినాడు). మకరధ్వజశబ్దానికి మకరచిహ్నం ధ్వజంగా గల మన్మథు డనీ, మకరములే ధ్వజాలుగా గల సముద్రం అనీ రెండర్థాలు. 'కోపం' అనేధర్మం మన్మథునియందే ఉంటుంది కాబట్టి ఈ కోపరూపలింగం మకరధ్వజశబ్దాన్ని మన్మథార్థంలో నియంత్రిస్తున్నది.

8. అన్యశబ్దసంనిధి - ప్రక్కన మరొక శబ్దం ఉండడం 'అన్యశబ్దసంనిధి'.

ఉదా- 'దేవస్య పురారాతేః' (పురారాతియైన దేవుడు); 'దేవ'శబ్దానికి దేవత, రాజు ఇత్యాద్యర్థాలు ఉన్నా ఇక్కడ 'పురారాతి'శబ్దం ప్రక్కనే ఉండడంచేత ఈ(దేవ) శబ్దానికి శివుడు అని అర్థం.

9. సామర్థ్యం- ఒక కార్యాన్ని పుట్టించగలిగిన శక్తి "సామర్థ్యం". ఉదా. 'మధునా మత్తః కోకిలః' (కోకిల మధువుచేత మదించినది). 'మధు' శబ్దానికి తేనె వసంతర్తువు మొదలైన అర్థాలు ఉన్నాయి. కాని కోకిలకు మత్తు కలిగించే సామర్థ్యం వసంతర్తువుకే ఉంది. కాబట్టి ఇక్కడ మధుశబ్దానికి 'వసంతం'అని అర్థం.

10. ఔచితి:- ఔచితి అనగా యోగ్యత్వం; తగి ఉండడం ఉదా- 'పాతు వో దయితాముఖమ్' (మిమ్ములను ప్రియరాలి ముఖము పాలించుగాక). 'ముఖ' శబ్దానికి బయలుదేరడం, ముఖం(మొగం), ప్రారంభం, ఉపాయం ఇత్యాద్యర్థాలు ఉన్నాయి. అయినా ఇక్కడ రక్షణం అనేది (అనగా బెంగపెట్టుకొనిన నాయకునకు ఆనందం కలిగించడం అనేది) ఉపాయాదులకు కుదరదు గాన ముఖ శబ్దానికి సాంముఖ్యం(సుముఖంగా ఉండడం) అని అర్థం. లేదా ముఖం విషయంలో పాలించుట (రక్షించుట)అనే అర్థం కుదరదుగాన 'పాతు'అనే పదానికి 'సుముఖ మగుగాక'అని అర్థం.

11. దేశం- దేశం అనగా అక్కడ ప్రకృతమైన ప్రదేశం. ఉదా"భాత్యత్ర పరమేశ్వరః" (ఇక్కడ, అనగా ఈ రాజధానిలో, పరమేశ్వరుడు విరాజిల్లుచున్నాడు). పరమేశ్వరశబ్దానికి శివవిష్ణ్వాద్యర్థాలు చాలా ఉన్నాయి. కాని ఇక్కడ రాజధానిని నిర్దేశిస్తూ 'ఇక్కడ పరమేశ్వరుడు భాసిస్తున్నాడు'అనడంచేత రాజధానీ రూపప్రదేశాన్ని పట్టి పరమేశ్వర శబ్దానికి 'రాజు'అని అర్థం.

12. కాలం- ఉదా. 'చిత్రభానుః విభాతి' (చిత్రభానువు ప్రకాశించుచున్నాడు లేదా ప్రకాశించుచున్నది). 'చిత్రభాను'శబ్దానికి 'సూర్యుడు,' 'అగ్ని' అని రెండర్థాలు ఉన్నాయి. ఈ వాక్యాన్ని పగలు ప్రయోగిస్తే 'చిత్రభానుః'అనగా 'సూర్యుడు' అనీ, రాత్రి ప్రయోగిస్తే 'అగ్ని'అనీ అర్థం.

13. వ్యక్తి- శబ్దానికి ఉన్న పుంలింగ - స్త్రీలింగ - నపుంసకలింగాలు. 'మిత్ర'శబ్దం నపుంసకలింగంలో ఉంటే స్నేహితుడు లేదా 'సఖురాలు' అని అర్థం. పుంలింగం అయితే సూర్యుడు అని అర్థం. అందుచేత 'మిత్రం భాతి'అనే

నపుంసక లింగప్రయోగంలో 'స్నేహితుడు ప్రకాశించుచున్నాడు'అనీ, 'మిత్రః భాతి'అనే పుంలింగప్రయోగంలో 'సూర్యుడు ప్రకాశించుచున్నాడు'అనీ అర్థం.

14. స్వరం- వేదంలో ఉదాత్తం, అనుదాత్తం, స్వరితం అనే మూడు స్వరాలు ఉన్నాయి. ఆ స్వరాలను సరిగా పాటిస్తూ వేదాధ్యయనం చెయ్యాలి. స్వరం మారితే పదానికి ఉన్న అర్థం మారుతుంది. ఉదాహరణకి 'ఇన్ద్రశత్రుః' అనే పదాన్ని షష్ఠీతత్పురుషసమాసంగా చెప్పవచ్చు, బహువ్రీహిగా కూడ చెప్ప వచ్చు. 'శత్రుః'అనగా 'చంపేవాడు'అని అర్థం. బహువ్రీహిసమాసంలో 'ఇన్ద్రః శత్రుః యస్య సః'అని విగ్రహం. ఇంద్రుడు ఎవనికి మారకుడో అతడు, అనగా ఇంద్రునిచేత చంపబడేవాడు, అని అర్థం. బహువ్రీహిసమాసంలో మొదటి పదం ఉదాత్తంగా ఉంటుంది, రెండవపదం అనుదాత్తం. షష్ఠీతత్పురుషఅయితే "ఇన్ద్రస్య శత్రుః" అని విగ్రహవాక్యం; "ఇంద్రునకు మారకుడు"అని అర్థం. అర్థం పూర్తిగా మారిపోయింది. ఈ సమాసంలో రెండవపదం ఉదాత్తం అవుతుంది. ఈ విధంగా స్వరబేదాన్ని పట్టి అర్థం మారడం వేదంలోనే ఉంది, కావ్యాలలో లేదు.

వృ. ఆదిగ్రహణాత్-

గాథ. ఏద్దహమేత్తత్థణిఆ ఏద్దహమేత్తేహిం అచ్ఛివత్తేహిం,
ఏద్దహిమేత్తావత్థా ఏద్దహమేత్తేహిం దిఅఏహిం. 11

"ఏతావన్మాత్రస్తనికా ఏతావన్మాత్రాభ్యామక్షిపత్రాభ్యామ్,
ఏతావన్మాత్రావస్థా ఏతావన్మాత్రైర్దివసైః"

వృ. ఇత్యాదావభినయాదయః-

వ్యా. పై భర్తృహరికారికలో "స్వరాదయః" అని 'ఆది' పదం ప్రయోగించడంచేత అభినయం మొదలైనవాటిని గ్రహించాలి. ఉదాహరణకి- ఒక దూతి నాయకునకు నాయిక విరహావస్థను గూర్చి చెపుతూన్న గాథ - "ఇంతింత స్తనాలు కలదీ, ఇంతింత నేత్రదళాలతో కూడినదీ, అయిన ఆమె ఇన్ని రోజులలో ఇలాంటి అవస్థ కలది అయింది."

వి. ఇక్కడ "ఇంతింత"అని అంటూ చేతులతో స్తనాదుల పరిమాణాదుల్ని

చూపుతూ మాటలాడడంలో అభినయాన్ని పట్టి ఇక్కడ ప్రయోగించిన "ఏతావత్" శబ్దానికి అర్థం తెలుసుకోవాలి.

"అభినయాదయః"అని "ఆది" పదం ప్రయోగించడంచేత అపదేశాన్ని గ్రహించాలి. వక్షస్థలంమీద (గుండెమీద)చేయి వేసి చూపడం ద్వారా మనోగతాభిప్రాయాన్ని సూచించడం అపదేశం.

"ఇతః స దైత్యః ప్రాప్తశ్రీర్నేత ఏవార్హతి క్షయమ్,
విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తుమసాంప్రతమ్."

అనే కుమారసంభవంలో బ్రహ్మదేవుడు అంటూన్న మాటలలో "ఇతః" (ఇక్కడినుండి)అని అంటూ గుండెమీద చేయి వేసి చెప్పడంచేత "నానుండి"అనే అర్థం వస్తుంది."నానుండి ఐశ్వర్యం పొందిన ఆ తారకాసురుణ్ణి నేనే నశింపచేయడం యుక్తం కాదు. విషవృక్షమే అయినా తనచేతులతో నాటినదానిని తానే నరికివేయడం యుక్తంకాదు"అని దీని అర్థం.

వృ. ఇత్థం సంయోగాదిభిరర్థాన్తరాభిధాయకత్వే నివారితేఽప్యనేకార్థస్య శబ్దస్య యత్ క్వచిదర్థాన్తరప్రతిపాదనం తత్ర నాభిధా; నియమనాత్తస్యాః. న చ లక్షణా, ముఖ్యార్థబాధాద్యభావాత్. అపి త్వఞ్జనం వ్యంజనమేవ వ్యాపారః. యథా-

శ్లో. భద్రాత్మనో దురధిరోహతనోర్విశాల
వంశోన్నతేః కృతశిలీముఖసంగ్రహస్య,
యస్యానుపప్లుతగతేః పరవారణస్య
దానామ్బుసేకసుభగః సతతం కరోఽభూత్. 12

వ్యా. ఇత్థమితి- ఈవిధంగా సంయోగాదులు అనేకార్థశబ్దానికి ఉన్న అనేకార్థాలను బోధించే శక్తిని నివారించినా కూడ కొన్ని చోట్ల మరొక అర్థం కూడా ప్రతిపాదించబడుతున్నది అంటే దానికి కారణం అభిధ కాదు. ఎందుచేత ననగా ఆ అభిధ ఒక్క అర్థాన్ని మాత్రమే బోధించడానికి నియమితం అయిపోయింది. లక్షణ కూడా కాదు; ఎందుచేత ననగా ముఖ్యార్థబాధాదులు లేవు. ఇంక వ్యంజన వ్యాపారమే ఆ పదం ఆ రెండవ అర్థాన్ని ప్రతిపాదించే టట్లు చేస్తున్నది.

వ్యా. ఎట్లనగా—

భద్రాత్మనః ఇతి- ఇక్కడ రాజవర్ణనం ప్రకృతం. ప్రకృతమైన ఈ రాజ వర్ణనం విన్న పిమ్మట ఇక్కడ ఉపయోగించిన శబ్దాలు నానార్థాలు అవడంచేత రాజరూపార్థంతో పాటు గజరూపార్థం కూడా బుద్ధిగోచరం అవుతున్నది. రాజ పక్షంలో అర్థం- భద్రాత్మనః = శోభనమైన స్వరూపం లేదా అంతఃకరణం కల వాడు, దురధిరోహతనోః = ఆక్రమించడానికి శక్యం కాని శరీరం కలవాడు, విశాలవంశోన్నతేః = గొప్ప వంశోన్నతి కలవాడు, కృతశిలీముఖసంగ్రహస్య = చేయబడిన బాణసంగ్రహము కలవాడు (బాణాద్యాయుధాలను సమకూర్చుకొన్న వాడు లేదా బాణప్రయోగకౌశలం సంపాదించుకొన్నవాడు), అనుపప్లుతగతేః = చెడగొట్టబడని మర్యాద కలవాడు, పరవారణస్య = శత్రువులను నివారించేవాడు అయిన, యస్య = ఏ రాజుయొక్క, కరః = హస్తము, సతతమ్ = ఎల్లప్పుడూ, దానామ్బుసేకసుభగః = దానోదకంతో తడవడంచేత సుందరముగా, అభూత్ = ఆయెనో (ఉండెనో).

గజపక్షంలో అర్థం- భద్రాత్మనః = గజజాతులలో ఒకటైన భద్రజాతికి చెందినది, దురధిరోహతనోః = ఎక్కడానికి శక్యం కాని దేహం కలదీ, విశాల వంశోన్నతేః = విశాలమైన వెన్నెముక యొక్క ఉన్నతి గలదీ, కృతశిలీముఖ సంగ్రహస్య = చేయబడిన తుమ్మెదల సంగ్రహణము గలది, అనుపప్లుతగతేః = తొందరా తొట్రుపాటూ లేని నడక గలదీ అయిన, యస్య = ఏ, పరవారణస్య = శ్రేష్ఠమైన ఏనుగుయొక్క, కరః = తొండము సతతమ్=ఎల్లప్పుడూ, దానామ్బు సేకసుభగః = దానోదకముతో తడవడంచేత అందముగా, అభూత్ = ఉండెనో.

వి. ఈ శ్లోకంలో వాచ్యార్థం రాజు. వ్యంగ్యార్థం గజం. అనేకార్థాలు ఉన్న 'భద్రాత్మనః' ఇత్యాదిశబ్దాల అభిధ రాజరూపార్థాన్ని చెప్పడానికి నియంత్రితం అయిపోయినా సహృదయులకు వాళ్ళ ప్రతిభాసామర్థ్యంచేత రెండవ అర్థం కూడా స్ఫురిస్తూన్నది. ఆ ద్వితీయార్థజ్ఞానం వ్యంజనావ్యాపారంచేతనే కలుగుతుంది అని భావం.

రెండవ అర్థం స్ఫురించాలనే అభిప్రాయం (తాత్పర్యం) రచయితకి ఉంది. అందుచేతనే రెండర్థాలకీ సరిపడే పదాలను ఏరికొని ప్రయోగించాడు. అయినా

అతని తాత్పర్యం ఇది అని గ్రహించడానికి ఏ ప్రమాణమూ లేకపోవడంచేత ద్వితీయార్థం వ్యంజనచేతనే బోధింపబడుతున్నది అని అంగీకరించాలి.

ఈ శ్లోకంలో వాచ్యమైన రాజుకీ వ్యంగ్యం అయిన గజానికీ ఉపమానోప మేయభావం (ఈ రాజు ఏనుగువంటివాడు అని) గమ్యమానం అవుతూన్నది. ఇది కూడా వ్యంజనచేతనే గమ్యం అవుతున్నది.

అయితే ఇక్కడ ద్వితీయార్థం కూడా అభిధచేతనే బోధించబడుతుంది; రాజగజాల ఉపమేయోపమానభావం మాత్రమే వ్యంజనాగమ్యం అని రసగంగాధరంలో పండితరాయలు సయుక్తికంగా ప్రతిపాదించాడు. ఉపమానోపమేయభావం వ్యంగ్యం అనడంలో మాత్రం ఆయనకు విప్రతిపత్తి లేదు. అతివిస్తృతం అయిన ఆ చర్చ ఆ గ్రంథంలోనే జిజ్ఞాసువులు చూడవచ్చు.

కా. తద్యుక్తో వ్యఞ్జకః శబ్దః.

వృ. తద్యుక్తః వ్యఞ్జనయుక్తః.

కా. యత్సోఽర్థాన్తరయుక్ తథా,
అర్థోఽపి వ్యఞ్జకస్తత్ర సహకారితయా మతః. 20

వృ. తథేతి వ్యఞ్జకః.

ఇతి కావ్యప్రకాశే శబ్దార్థస్వరూపనిర్ణయో నామ
ద్వితీయ ఉల్లాసః

వ్యా. తద్యుక్త ఇతి- తద్యుక్తః = ఆ వ్యంజనతో కూడిన, శబ్దః = శబ్దము, వ్యఞ్జకః = వ్యంజకము.

"తద్యుక్తః అనగా వ్యంజనవ్యాపారముతో కూడినది అని అర్థం"

యదితి- యత్ = ఏకారణమువలన, సః = ఆ శబ్దము, అర్థాన్తరయుక్ = ప్రకృతమైన తన శక్యార్థంయొక్క వ్యవధానంతో కూడినదై, తథా = వ్యంజకముగా ఉన్నదో, అందువలన, తత్ర = కావ్యంలో, సహకారితయా = సహకారిగా ఉండడంచేత, అర్థః అపి = అర్థం కూడ, వ్యఞ్జకః = వ్యంజకం అని, మతః = అంగీకరించబడినది.

"తథేతి వ్యఞ్జకః"అనే కారికాంశంలో ఉన్న 'తథా'శబ్దానికి వ్యంజకం అని అర్థం.

vi. ఒక శబ్దం ముందుగా తన శక్యార్థాన్ని బోధించి తరవాత వ్యంగ్యార్థాన్ని బోధిస్తుంది. అందుచేత శబ్దానికీ వ్యంగ్యార్థానికీ మధ్య వాచ్యార్థం ఉంటుంది. వ్యంగ్యార్థం తెలియడానికి ముందు వాచ్యార్థం తెలియాలి. అందుచేత వ్యంగ్యార్థజ్ఞానానికి వాచ్యార్థజ్ఞానం సహకారికారణం. (ప్రధానకారణం శబ్దం). ఈ విధంగా శబ్దవ్యంగ్యార్థాల మధ్య ఉండి వ్యంగ్యార్థానికి సహకారి అయిన వాచ్యార్థం కూడా వ్యంజకం అని అంటారు అని భావం. 'శద్రాత్మనః' ఇత్యాదిశ్లోకంలో ఉన్న కొన్ని పదాలు మార్చి వాటి పర్యాయపదాలు వాడినట్లయితే ఆ రెండవ అర్థం వ్యంగ్యం కాదు. మార్చడానికి వీలులేకపోవడానికి 'పరివృత్త్యసహత్వం'అని పేరు. శబ్దాలు పరివృత్త్యసహాలైనప్పుడు ఆ ధ్వనిని (వ్యంగ్యాన్ని) శబ్దమూలకం అంటారు.

'బాలానందిని' అను కావ్యప్రకాశాంధ్రవ్యాఖ్యానంలో ద్వితీయోల్లాసం సమాప్తం.

# అథ తృతీయ ఉల్లాసః

కా. అర్థాః ప్రోక్తాః పురా తేషామ్.

వృ. అర్థాః వాచ్యలక్ష్యవ్యఙ్గ్యాః, తేషాం వాచకలాక్షణికవ్యఞ్జకానామ్.

కా. అర్థవ్యఞ్జకతోచ్యతే.

వృ. కీదృశీత్యాహ.

వ్యా. అర్థా ఇతి- పురా = వెనుక, తేషామ్ = వాచక-లాక్షణిక-వ్యంజక శబ్దాలయొక్క, అర్థాః = వాచ్యలక్ష్యవ్యంగ్యరూపాలైన అర్థాలు, ప్రోక్తాః = చెప్పబడినవి.

కారికాంశంలో ఉన్న 'అర్థాః' అనేదానికి వాచ్యలక్ష్యవ్యంగ్యార్థాలు అనీ, 'తేషామ్' అనేదానికి 'వాచకలాక్షణికవ్యంజక పదాలయొక్క' అనీ అర్థాలు.

అర్థవ్యఞ్జకతా = ఆ వాచ్యలక్ష్యవ్యంగ్యార్థాల అర్థవ్యంజకత్వం, ఉచ్యతే = చెప్పబడుతున్నది.

"అది ఏ విధంగా ఉంటుంది ? అనేదానికి సమాధానం చెపుతున్నాడు"-

కా. వక్తృబోద్ధవ్యకాకూనాం వాక్యవాచ్యాన్యసంనిధేః,21
ప్రస్తావదేశకాలాదేర్వైశిష్ట్యాత్ ప్రతిభాజుషామ్,
యోఽర్థస్యాన్యార్థధీహేతుర్వ్యాపారో వ్యక్తిరేవ సా.

వృ. బోద్ధవ్యః ప్రతిపాద్యః. కాకుర్ధ్వనేర్వికారః. ప్రస్తావః ప్రకరణమ్. అర్థస్య వాచ్యలక్ష్యవ్యఙ్గ్యాత్మనః. క్రమేణోదాహరణాని—

వ్యా. వక్త్రితి:- వక్తృబోద్ధవ్యకాకూనామ్ = మాటలాడేవానియొక్క, ఎవ

వి. తన ప్రియుడితో రమించి వచ్చిన సఖురాలితో చతురనాయిక అంటూన్న మాట లివి. ఆ మాటలు వినే దూతి స్వభావం తెలియడం చేత ఈ మాటల అంతరార్థం "నీ శరీరరంలో కనబడే ఈ శ్రమాదులకన్నింటికీ కారణం నాప్రియునితో రమించడమే" అని తెలుస్తుంది. ఇది బోద్ధవ్యవైశిష్ట్యంచేత వాచ్యార్థ గతవ్యంజకత్వానికి ఉదాహరణం.

శ్లో॥ తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాఞ్చాలతనయాం
వనే వ్యాధైః సార్ధం సుచిరముషితం వల్కలధరైః,
విరాటస్యావాసే స్థితమనుచితారమ్భనిభృతం
గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు. 15

వృ. అత్ర మయి న యోగ్యః ఖేదః కురుషు తు యోగ్యః ఇతి కాక్వా ప్రకాశ్యతే. న చ వాచ్యసిద్ధ్యఙ్గమత్ర కాకురితి గుణీభూతవ్యఙ్గ్యత్వం శఙ్క్యమ్: ప్రశ్నమాత్రేణాపి కాకోర్విశ్రాన్తేః.

వ్యా. కాకువైశిష్ట్యంవల్ల వాచ్యానికి ఉన్న వ్యంజకత్వానికి (వాచ్యం వ్యంజకం అవడానికి) ఉదాహరణం చూపుతున్నాడు. వేణీసంహారం ప్రథమాంకంలో కౌరవులతో యుద్ధం చేయడానికి యుధిష్ఠిరుడు తగు ప్రయత్నం చేయడంలేదని అతని విషయంలో భీముడు నిందావాక్యాలు పలికినప్పుడు సహదేవుడు- "ఇట్లు అనవద్దు; తెలిస్తే అన్నగారికి ఖేదం కలుగుతుంది" అని అంటాడు. అప్పుడు భీముడు సాధిక్షేపంగా అన్న మాటలివి.

తథా ఇతి:- "రాజసభలో అట్టి పరిస్థితిలో ఉన్న ద్రౌపదిని చూచి, నారబట్టలు కట్టుకొని చాలకాలం ఆటవికులతో కలిసి అరణ్యంలో మనం నివసించడం చూచీ, చేయకూడని పనులు చేస్తూ రహస్యంగా విరాటుని కొలువులో ఉండడాన్ని చూచీ ఖిన్నుడైన నా విషయంలో అన్న ఖేదం పొందుతాడా! ఇప్పటికీ కౌరవుల విషయంలో ఖేదం (కోపం) పొందడూ!"

అత్రేతి- ఇక్కడ కాకుస్వరం నా విషయంలో బాధపడడం యుక్తం కాదు; బాధపడితే (కోపం వస్తే) కౌరవులవిషయంలో బాధపడడం యుక్తం అన్న

అర్థాన్ని వ్యంజింపచేస్తూన్నది. ఇక్కడ కాకువు వాచ్యసిద్ధ్యంగం కాబట్టి గుణీభూతవ్యంగ్యం కదా అని శంకించకూడదు. కాకువుకు ప్రశ్నమాత్రమే అర్థం చెప్పుకొన్నా సరిపోతుంది కదా!"

వి. పై శ్లోకంలో 'కురుషు స' అన్నప్పుడు 'స' మీద కాకు స్వరం. మొత్తం వాల్గపపాదంమీదనే కాకుస్వరం అని కూడా చెప్పవచ్చును. దీనివల్ల పైన చెప్పినట్లు వ్యంగ్యార్థం గమ్యం అవుతున్నది.

ఒక శంకకు సమాధానం చెపుతున్నాడు. వ్యంగ్యార్థం ప్రధానంగా ఉన్నప్పుడే అది వ్యంగ్యం లేదా ధ్వని అని అనాలి; అది అప్రధానం అయితే గుణీభూతవ్యంగ్యం అవుతుంది. ఒక వాక్యంవల్ల తెలిసే వాచ్యార్థం అసంపూర్ణంగా ఉంటుంది. వ్యంగ్యార్థం కూడా తెలిసిన తర్వాతనే దాని అర్థం పూర్ణం అవుతుంది. అలాంటి వ్యంగ్యానికి 'వాచ్యసిద్ధ్యఙ్గవ్యంగ్యం' అని పేరు. వాచ్యార్థం పూర్తి కావడానికి ఉపయోగించేది అపడంచేత దానికి అంగమైన వ్యంగ్యం అని అర్థం. ఇది గౌణవ్యంగ్యాలలో ఒకటి అని పంచమోల్లాసంలో చెప్పబోతాడు. ఇక్కడ "నా విషయంలో ఖేదం పొందుతున్నాడు; కౌరవుల విషయంలో పొందడంలేదు" అన్న వాచ్యార్థం తాపన్మాత్రంగానే గ్రహిస్తే సహదేవుడు అన్నదానికి సమాధానంగా సరిపోదు. అందుచేత ఆ అర్థం సరిపోవడానికి కాకువువల్ల వచ్చిన వ్యంగ్యార్థం అవసర మౌతూన్నది. అందుచేత ఇది వాచ్యసిద్ధ్యంగవ్యంగ్యమే అవుతుంది కాని 'ధ్వని'కాదు కదా అని ప్రశ్న. సమాధానం ఏమనగా- పైన చూపిన వ్యంగ్యార్థం వరకూ వెళ్ళకుండా కాకువుకు కేవలం ప్రశ్నార్థం చెపితే కూడా వాచ్యార్థం పూర్ణం అవుతుంది. అందుచేత వ్యంగ్యార్థం వాచ్యాంగం కాదు కాబట్టి ఇది గుణీభూతవ్యంగ్యం కాదు; ధ్వనియే.

గాథ. తఇఆ మహ గండత్థలణిమిఅం దిట్ఠిం ణ ణేసి అణ్ణత్తో.
ఏణ్హిం సచ్చేఅ అహం తేఅ కవాలా ణ సా దిట్ఠీ.

"తదా మమ గణ్డస్థలనిమగ్నాం దృష్టిం నానైషీరన్యత్ర
ఇదానీం సైవాహం తౌ చ కపోలౌ న చ సా దృష్టిః"

వృ. అత్ర మత్సఖీం కపోలప్రతిబిమ్బితాం పశ్యతస్తే దృష్టిరన్యైవ

వాభూత్, చలితాయాం తు తస్యామన్యైవ జాతేత్యహో ప్రచ్ఛన్నకాముకత్వం తే ఇతి వ్యజ్యతే.

వ్యా. వాక్యవైశిష్ట్యంవల్ల (పలికిన మాటలలోని విశేషాన్ని పట్టి) వాచ్యం వ్యంజకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు- తఇఅ ఇతి- నాయిక ప్రక్కనే కూర్చుని ఉన్న ఒక ప్రియతమురాల్ని చూడాలని ఉన్నా నాయికకు భయపడి అలా చేయలేక ఆ నాయిక చెక్కిళ్ళమీద ప్రతిబింబించిన ఆ ప్రియతమురాలిని చూడడడంకోసం వాటివైపు కొంతసేపు తదేకదృష్టితో చూచి ప్రియతమురాలు అక్కడినుంచి వెళ్ళిపోగానే ఆ దృష్టిని మార్చిన నాయకుడితో నాయిక అంటూన్న సోపాలంభవాక్యం ఇది.

తఇఅ ఇతి:- "అప్పుడు నా చెక్కిళ్ళమీద మునిగిపోయిన చూపును మరొకవైపుకు త్రిప్పలేదు. ఇప్పుడు కూడ నేను అదే మనిషిని, అవే చెక్కిళ్ళు, అయితే నీ చూపు మాత్రం అదే విధంగా లేదు".

అత్రేతి- "ఇక్కడ "నా చెక్కిళ్ళమీద ప్రతిబింబించిన నా సఖురాలిని చూస్తూ ఉన్నంతసేపూ నీ చూపు మరోవిధంగానే ఉండినది. ఆమె వదిలి వెళ్ళిపోగానే నీ చూపు మారిపోయింది. ఆహా! నీ వెంతటి ప్రచ్ఛన్న కాముకుడవు!" అనే అర్థం వ్యంగ్యం అవుతున్నది".

వి. వ్యంగ్యార్థవ్యంజకాలైన వాక్యాలన్నింటిలోనూ వైశిష్ట్యం ఉండే ఉంటుంది. అందుచేత ఇక్కడ 'వాక్యవైశిష్ట్యం' అనగా వాక్యాంశాలైన కొన్ని పదాల వైశిష్ట్యం అని అర్థం చెప్పుకోవాలి. పై శ్లోకంలో తదా (తఇఅ) 'ఇదానీమ్' (ఏణ్హిం) అనే పదాలవల్ల ఈ వ్యంగ్యార్థస్ఫూర్తి కలుగుతున్నది.

శ్లో॥ ఉద్దేశోఽయం సరసకదళీశ్రేణిశోభాతిశాయీ
కుఞ్జోత్కర్షాఙ్కురితరమణీవిభ్రమో నర్మదాయాః.
కిం చైతస్మిన్ సురతసుహృదస్తన్వి తే వాన్తి వాతాః
యేషామగ్రే సరతి కలితాకాణ్డకోపో మనోభూః. 17

వృ. అత్ర రతార్థం ప్రవిశేతి వ్యజ్యమ్.

వ్యా. వాచ్యవైశిష్ట్యంవల్ల వాచ్యార్థం వ్యంజకం అవడానికి ఉదాహరణం

చూపుతున్నాడు. అనేక విశేషణాలు ఉపయోగించడంచేత వాచ్యార్థానికి ఒక విధమైన విశిష్టత లభిస్తుంది. అట్టి విశిష్టతచేత ఆ వాచ్యార్థం వ్యంగ్యార్థవ్యంజకం అవుతుంది. దానికి ఉదాహరణం-

ఉద్దేశ ఇతి:- "ఎత్తైన ఈ నర్మదానదీతీరప్రదేశం పచ్చగా నవనవలాడుతూన్న అరటిచెట్ల పంక్తులచేత చాలా శోభిస్తూన్నది. లతాగృహాల సౌందర్యాతిశయంచేత యువతులకు విభ్రమాన్ని (చిత్తవృత్తి స్థిరంగా లేకపోవడాన్ని) అంకురింపచేస్తూన్నది. ఓ! తన్వీ! ఇంకొక విశేషం ఏమిటనగా— ఈ ప్రదేశంలో సురతానికి స్నేహితులైన వాయువులు వీచుతున్నాయి. ఆ వాయువుల ముందు సమయం కాని సమయంలో కోపం వహించిన మన్మథుడు నడచి వస్తున్నాడు".

అత్రేతి:- "ఇక్కడ సురతంకోసం లతాకుంజంలో ప్రవేశించు అని వ్యంగ్యం".

వి. ఇక్కడ 'తన్వి' అనడంచేత మన్మథవేదన కలది' అని, ఉద్దేశః (ఎత్తైన ప్రదేశం) అనడంచేత 'క్రిందనడిచిపోయేవాళ్ళకు కనబడ'దనీ, 'సరస కదలీ' అనడంచేత 'చుట్టూఉన్న ఆకులచేత కప్పబడిన ఈ ప్రదేశం రహస్య ప్రదేశం' అనీ, 'కుఞ్జోత్కర్ష' ఇత్యాదికంచేత 'రతివైముఖ్యం తగ'దనీ 'మనోభూః అగ్రే సరతి' అనడంచేత 'కోపించిన మన్మథుడు ఏమి చేస్తాడో చెప్పజాలం' అనీ గమ్యం అవుతూ మొత్తం వాచ్యార్థంచేత రతార్థమై ఈ నికుంజంలో ప్రవేశించుము అన్న అర్థం వ్యంగ్యం అవుతున్నది.

గా. ణోల్లేఇ అణోల్లమణా అత్తామం ఘరభరమ్మి సఅలమ్మి
ఖణమేత్తం జఇ సంఝాఇ హోఇ ణ వ హోఇ వీసామో 18.

"నుదత్యనార్ద్రమనాః శ్వశ్రూర్మాం గృహభరే సకలే,
క్షణమాత్రం యది సంధ్యాయాం భవతి న వా భవతి విశ్రామః"

వృ. అత్ర సంధ్యా సంకేతకాల ఇతి తటస్థం ప్రతి కయా చిద్ద్యోత్యతే.

వ్యా. అన్యసంనిధివైశిష్ట్యంవల్ల వాచ్యార్థం వ్యంజకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు. ఒక యువతి తటస్థుడు వలె (ఏమీ తెలియనివాడు

వలె) ప్రక్కనే ఉన్న ఉపనాయకునికి, పెద్దవాళ్ళు దగ్గరగా ఉండడంచేత స్పష్టంగా చెప్పజాలక ఇరుగు పొరుగింటి ఆమెతో అత్తగారిని గూర్చి దూషిస్తు న్నట్లు మాటలాడుతూ సంకేతకాలాన్ని (కలుసుకోవడానికి తగిన సమయాన్ని) సూచిస్తున్నది.

జో్లే ఇఇతి:- "మనస్సులో ఏ మాత్రము తడి లేని (జాలిలేని) అత్తగారు ఇంటి చాకిరి అంతా నా నెత్తిమీద పెట్టింది. సంధ్యాకాలానికైనా క్షణం తీరిక కలుగుతుందో కలుగదో"

అత్రేతి:- ఇక్కడ ఒక్క స్త్రీ 'మనం కలవడానికి సంధ్యాసమయం అను కూలం' అని తటస్థుడైన (ఆమె ఏ వ్యక్తితో మాటలాడుతున్నదో ఆ వ్యక్తి కంటె భిన్నుడైన) ఉపనాయకుడికి సూచిస్తున్నది. ఇదే వ్యంగ్యార్థం.

గా. సుచ్చిఇ సమాగమిస్సది తజ్ఝ పిజీ అజ్జ పహారమేత్తేణ
ఏమేఅ కిత్తి చిట్ఠసి తా సహి సజ్జసు కరణిజ్జం. 19

"శ్రూయతే సమాగమిష్యతి తవ ప్రియోఽద్య ప్రహరమాత్రేణ
ఏవమేవ కిమితి తిష్ఠసి తత్ సఖి సజ్జయ కరణీయమ్"

వృ. అత్రోపపతిం ప్రతి అభిసర్తుం ప్రస్తుతా న యుక్తమితి కయాచిన్నివార్యతే.

వ్యా. ప్రకరణవైశిష్ట్యం (సందర్భం)వల్ల వాచ్యార్థం వ్యంజకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు. ఉపపతిదగ్గరికి వెళ్ళడంకోసం ప్రయాణం అవు తూన్న ఒక స్త్రీతో ఆమె భర్త కొద్దిసేపట్లో గ్రామాంతరంనుంచి రానున్నాడని విన్న ఆమె సఖురాలు, ప్రక్కనున్న వాళ్ళకి తెలియకుండా "ఉపపతివద్దకు వెళ్ల వద్దు" అని సూచిస్తూ పలికిన మాటలు.

"జాముసేపట్లో (మూడు గంటల కాలంలో) నీ భర్త రానున్నా డని విన్నాను. సఖురాలా! ఇలాగే కూర్చున్నా వేమి? వంట మొదలైన పను లన్నీ చేసుకో".

అత్రేతి:- ఇక్కడ ఉపపతి దగ్గరికి వెడదాం అని ప్రయాణమైన ఒక స్త్రీని ఆమె సఖురాలు "ఇప్పుడు యుక్తం కాదు" అని సూచించి నివారిస్తూన్నది.

అవ. దేశవైశిష్ట్యంవల్ల వాచ్యార్థం వ్యంజకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అన్యత్ర యూయం కుసుమావచాయం
కురుధ్వమత్రాస్మి కరోమి సఖ్యః,
నాహం హి దూరం భ్రమితుం సమర్థా
ప్రసీదతాయం రచితోఽఞ్జలిర్వః. 20

వృ. అత్ర వివిక్తోఽయం దేశ ఇతి ప్రచ్ఛన్నకాముక స్త్వయాభిసార్యతామ్ ఇతి ఆశ్వస్తాం ప్రతి కయాచిన్నివేద్యతే.

వి. సఖీవేషం ధరించిన తన ఉపనాయకుణ్ణి తీసికొని వచ్చిన తన విశ్వాసపాత్రురాలైన సఖురాలిని చూచిన పిమ్మట నాయిక అంతవరకు తనతో కూడి పుష్పచయనం చేస్తూన్న సఖురాళ్ళతో అంటూన్న మాట లివి.

అన్యత్రేతి - "సఖులారా ! మీరందరూ పుష్పావచయనం మరొక చోట చెయ్యండి. నేను ఇక్కడనే ఉంటాను. నేను దూరం తిరగలేను. మీకు నమస్కారం చేస్తున్నాను."

అత్రేతి- "ఈ ప్రదేశం వివిక్తంగా ఉంది. ప్రచ్ఛన్నకాముకుణ్ణి ఇక్కడ ప్రవేశపెట్టు" అని ఒక నాయిక తన విశ్వాస పాత్రురాలైన సఖితో అంటూన్నది."

వి. "మీరందరూ దూరంగా వెళ్ళి పువ్వులు కొయ్యండి" అనే వాచ్యార్థం మిగిలిన సఖురాళ్ళని ఉద్దేశించి చెప్పబడింది. ఈ వాచ్యార్థంచేత వ్యంగ్యం అయిన (పైన చూపిన) అర్థం విశ్వాసపాత్రురాలైన సఖిని ఉద్దేశించినది. ఇక్కడ జనరహితమైన దేశవిశేషాన్ని నిర్దేశించడంచేత ఈ వ్యంగ్యార్థం వ్యంజితం అవుతున్నది.

అవ. కాలవైశిష్ట్యంవల్ల వాచ్యం వ్యంజకం అవడానికి ఉదాహరణం చూపుచున్నాడు.

గాథ. గురుఅణపరవస పిఅ కిం
భణామి తుఇ మందభాఇణీ అహకమ్,
అజ్జ పవాసం వచ్చసి
వచ్చ సఅం జేవ్వ సుణసి కరణిజ్జమ్.

"గురుజనపరవశ ప్రియ కిం భణామి తవ మన్దభాగినీ అహమ్,
అద్య ప్రవాసం వ్రజసి వ్రజ స్వయమేవ శ్రోష్యసి కరణీయమ్.

వృ. అత్రాద్య మధుసమయే యది వ్రజసి తదాహం తావత్ న భవామి; తవ తు న జానామి గతిమ్ ఇతి వ్యజ్యతే.

వ్యా. ప్రవాసానికి వెళ్ళడం కోసం ప్రయాణమైన నాయకునితో నాయిక అంటూన్న మాటలు.

గురు అణ ఇతి - "పెద్దవాళ్ళ మాటలు కాదనలేనివాడా! ప్రియుడా! మంద భాగ్యవంతురాలనైన నేను ఏమి చెప్పను! ఇప్పుడే ప్రవాసానికి వెళ్ళాలని ఉంటే వెళ్ళు. నేను ఏమి చేయనున్నానో నీవే వింటావు."

అత్రేతి - "ఈ వసంతకాలంలో నీవు ప్రవాసానికి వెళ్ళినట్లయితే నేను జీవించేది లేదు. నీకు ఏమౌతుందో తెలియదు"అని వ్యంగ్యం.

వి. మధుమాసం అనే కాలాన్ని (అద్య అని) నిర్దేశించడంచేత ఇది కాల వైశిష్ట్యంవల్ల కలిగిన వ్యంజకత్వం.

వృ. ఆదిగ్రహణాత్ చేష్టాదేః. తత్ర చేష్టాయా యథా-

శ్లో. ద్వారోపాన్తనిరన్తరే మయి తయా సౌన్దర్యసారశ్రియా
ప్రోల్లాస్యోరుయుగం పరస్పరసమాసక్తం సమాసాదితమ్.
ఆనీతం పురతః శిరోంశుకమధఃక్షిప్తే చలే లోచనే
వాచస్తత్ర నివారితం ప్రసరణం సంకోచితే దోర్లతే. 22

వృ. అత్ర చేష్టయా ప్రచ్ఛన్నకాన్తవిషయ ఆకూతవిశేషో ధ్వన్యతే.

వ్యా. 'ప్రస్తావదేశకాలాదేః'అని (22వ కారికలో) 'ఆది'పదం ప్రయోగించడం చేత చేష్టాదులను కూడా గ్రహించాలి. అనగా చేష్టాదుల వర్ణనంచేత కూడా వాచ్యార్థం వ్యంజకం అవుతుంది. చేష్ట వ్యంజకం అవడానికి ఉదాహరణం ఎట్లనగా - ఇవి ఒక నాయకుడు తన మిత్రునితో అంటూన్న మాటలు-

ద్వారేతి :- "నేను ద్వారం దగ్గర చాలా సమీపంలో ఉన్నప్పుడు సౌందర్యం చేత శ్రేష్ఠమైన శోభ గల ఆమె ఊరుద్వయాన్ని విస్తరింపచేసి ఒకదానితో ఒకటి దగ్గరగా కలిపింది. తల ముసుగు ముందుకు లాగింది. కళ్ళు క్రిందికి ప్రసరింప చేసింది, మాటలాడవద్దన్నట్లు సైగ చేసింది బాహువులను దగ్గరగా చేర్చింది".

అత్రేతి-"ఇక్కడ చేష్టచేత, ప్రచ్ఛన్నరూపంలో ఉన్న ప్రియుని విషయంలో నాయిక మనస్సులో ఉన్న భావవిశేషం ధ్వనింప (వ్యంజింప) చేయబడుతున్నది."

వి. ఊరుయుగంతో చేసిన చేష్ట ఉపరతిసూచకం. శిరోవస్త్రాన్ని ముందుకు లాగడంచేత రహస్యంగా రమ్మని సూచన. నేత్రాల కదలికచేత సూర్యాస్తమయం సంకేతకాలం అని సూచన. నోరు మూయడంచేత కోలాహలం లేని సమయంలో కోలాహలం చేయకుండా రమ్మని సూచన. బాహుసంయోజనంచేత నీకు ఆలింగ నం పారితోషికంగా ఇస్తా నని సూచన.

వృ. నిరాకాఙ్క్షప్రతిపత్తయే ప్రాప్తావసరతయా చ పునః పున రుదాహ్రియతే. వక్త్రాదీనాం మిథః సంయోగే ద్వికాదిభేదేన, అనేన క్రమేణ లక్ష్యవ్యఙ్గ్యయోశ్చ వ్యఞ్జకత్వముదాహార్యమ్.

వ్యా. వక్తృవైశిష్ట్యం మొదలైన తొమ్మిది వ్యంజకత్వనిమిత్తాలు, ఆదిశబ్దం చేత గ్రహించబడిన చేష్ట అనే నిమిత్తం మొత్తం పది నిమిత్తాలకు పది ఉదాహర ణలు చూపబడ్డాయి. అయితే ఒకే శ్లోకంలో వక్తృ-బోద్ధవ్య - కాక్వాదివైశిష్ట్యాలు రెండుమూడు కలిసి ఉండడానికి అవకాశం ఉన్నది. ఉదాహరణకి - "అఇపి హులం" ఇత్యాది శ్లోకంలో 'పిహుల' రూపవాచ్యవైశిష్ట్యం, వక్తృవైశిష్ట్యం, బోద్ధవ్య వైశిష్ట్యం మూడూ ఉన్నాయి. అదే విధంగా 'గురుఅణపరవస' ఇత్యాదిశ్లోకంలో 'అద్య' అన్నప్పుడు కాకువైశిష్ట్యం, 'గురుఅణ పరవస' అన్నప్పుడు వాచ్యవైశిష్ట్యం, వక్తృ - బోద్ధవ్య - కాలవైశిష్ట్యాలూ కూడా ఉన్నాయి. ఈ విధంగా రెండు మూడు శ్లోకాలలోనే ఈ పది అంశాలకీ ఉదాహరణలు చూపవచ్చును కదా; పదింటికీ పది శ్లోకాలు చూపడం ఎందుకు అని ప్రశ్నించుకొని సమాధానం చెపు తున్నాడు -

నిరాకాఙ్క్షేతి - చదువుకునేవారికి నిఃసంశయంగా ఈ విషయం మనస్సులో హత్తుకోవడానికి, తగిన సమయం వచ్చినప్పుడు చెప్పడం యుక్తం కదా (ప్రాప్తా

వసరం) అనీ మాటిమాటికి ఉదాహరించబడుచున్నది". "వక్తృవైశిష్ట్యాదులు రెండేసిగాని అంతకంటె అధికసంఖ్యలో కాని ఒక ఉదాహరణలో కలిస్తే ఆ భేదాలను పురస్కరించుకొని ఉదాహరణలు చెప్పుకోవాలి. ఇదే పద్ధతిలో (వాచ్యార్థం విషయంలో చెప్పిన పద్ధతిలో) లక్ష్యార్థవ్యంగ్యార్థాల వ్యంజకత్వానికి ఉదాహరణలు చూచుకోవాలి.

వృ. ద్వికభేదే వక్తృబోద్ధవ్యయోగే యథా -

గాథ. అత్తా ఏత్థ ణిమజ్జఇ ఏత్థ అహం దిఅహఏ పలోఏహి
మా పహిఅ రత్తిఅంధఅ సేజ్జాఏ మహ ణిమజ్జిహిసి. 23

శ్వశ్రూరత్ర నిమజ్జతి అత్రాహం దివసకం ప్రలోకయ
మా పథిక రాత్ర్యన్ధ శయ్యాయామావయోర్నిమఙ్క్ష్యసి.

వ్యా. ద్వికేతి :- ద్వికభేదంలో (రెండు కలిసిన భేదంలో) వక్తృ-బోద్ధవ్యయోగంలో ఉదాహరణం ఎట్లనగా -

అత్తా ఇతి :- "రేచీకటితో బాధపడుతూన్న పాంథుడా! నా అత్త ఇక్కడ మునిగిపోతుంది (కదలకుండా పడి ఉంటుంది). నేను ఇక్కడ ఉంటాను. పగలే చూచుకో; మా పక్కలలో పడ్డావు కనక!."

వి. రాత్రి తమ ఇంట ఆగడానికి వచ్చిన బాటసారితో ఒక కులట అంటున్న మాటలు ఇవి. "నా అత్తా నేనూ మాత్రమే ఉన్నాం. ఆమె అతివృద్ధురాలు. మంచంమీదనుంచి లేవదు. ఇక్కడ నా మంచం; ఇక్కడికే రా" అనేది వ్యంగ్యార్థం. ఇక్కడ కులట వక్త్రి. యువకుడైన పాంథుడు బోద్ధవ్యుడు. ఈ ఇద్దరి వైశిష్ట్యం కలిసి ఉండడంచేత వాచ్యార్థం వ్యంజకం అయింది.

అవ. 'అర్థవ్యఞ్జకతోచ్యతే' (21వ కారిక) అని అర్థానికే వ్యంజకత్వం ఉన్నట్లు చెప్పబడింది. శబ్దానికి కూడా వ్యంజకత్వం లేని పక్షంలో కావ్యాన్ని 'ధ్వనికావ్యం'అని చెప్పడం ఎలా కుదురుతుంది ? శబ్దార్థాలు రెండూ కలిస్తేనే కదా కావ్యం ? అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు-

కా. శబ్దప్రమాణవేద్యోఽర్థో వ్యనక్త్యర్థాన్తరం యతః,
అర్థస్య వ్యఞ్జకత్వే తత్ శబ్దస్య సహకారితా. 23

వృ. శబ్దేతి- స హి ప్రమాణాన్తరవేద్యోఽర్థో వ్యఞ్జకః.

ఇతి కావ్యప్రకాశే అర్థవ్యఞ్జకతానిర్ణయో నామ తృతీయ ఉల్లాసః.

వ్యా. శబ్దేతి :- యతః = ఏకారణంవల్ల, శబ్దప్రమాణవేద్యః = శబ్దరూపమైన ప్రమాణంచేత తెలియదగిన, అర్థః = అర్థము, అర్థాన్తరమ్ = మరియొక అర్థమును, వ్యనక్తి = వ్యంజింపచేయుచున్నదో, తత్ = ఆకారణమువలన, అర్థస్య = అర్థముయొక్క, వ్యఞ్జకత్వే = వ్యంజకత్వమునందు, శబ్దస్య = శబ్దముయొక్క, సహకారితా = సహకారిత్వము.

సహీతి :- శబ్దం తప్ప మరొక ప్రమాణంచేత తెలియబడే అర్థం వ్యంజకం కాదు కదా ?"

వి. ప్రధానములైన ప్రత్యక్ష-అనుమాన- ఉపమాన-శబ్దా లనే ప్రమాణాలలో శబ్దం ఒకటి. ఈ శబ్దప్రమాణంచేత గ్రహించబడిన అర్థమే మరొక అర్థాన్ని వ్యంజింపచేయగలుగుతుంది గాని మరొక ప్రత్యక్షాదిప్రమాణంచేత గ్రహించబడిన అర్థం వ్యంజింపచేయజాలదు. అందుచేత అర్థం వ్యంజకం అని అన్నామంటే దాని వెనక శబ్దం ఉన్నదని చెప్పినట్లే. ఈ విధంగా అర్థవ్యంజకత్వస్థలాలలో శబ్దం సహకారిగా ఉంటుంది. అందుచేత వ్యంజకత్వం శబ్దార్థోభయనిష్ఠమే కాబట్టి శబ్దార్థరూపకావ్యాన్ని 'ధ్వని'అనడం యుక్తమే. అయితే ఈ స్థలాలలో ఒకశబ్దం మార్చి అదే అర్థం గల మరొక శబ్దం ప్రయోగించినా అర్థం వ్యంజకం అవుతుంది కాబట్టి ఇక్కడ వ్యంజకత్వం అర్థగతం అని చెప్పడం జరిగింది. 'ప్రాధాన్యేన వ్యపదేశాః భవన్తి' అనే న్యాయంచేత ప్రధానమైన అర్థాన్ని పట్టి ఆ పేరు.

'బాలానందిని'అనే కావ్యప్రకాశాంధ్రవ్యాఖ్యానంలో అర్థవ్యంజకత్వ నిర్ణయప్రతిపాదకం అయిన తృతీయోల్లాసం సమాప్తం.

## అథ చతుర్థః ఉల్లాసః

వృ. యద్యపి శబ్దార్థయోర్నిర్ణయే కృతే దోషగుణాలఙ్కారాణాం స్వరూపమభిధానీయం తథాపి ధర్మిణి ప్రదర్శితే ధర్మాణాం హేయోపాదేయతా జ్ఞాయతే ఇతి ప్రథమం కావ్యభేదానాహ -

కా. అవివక్షితవాచ్యో యస్తత్ర వాచ్యం భవేద్ధ్వనౌ,
అర్థాన్తరే సంక్రమితమత్యన్తం వా తిరస్కృతమ్. 24

వృ. లక్షణామూలగూఢవ్యఙ్గ్యప్రాధాన్యే సత్యేవ అవివక్షితం వాచ్యం యత్ర సః 'ధ్వనౌ' ఇత్యనువాదాత్ ధ్వనిరితి జ్ఞేయః.

వ్యా. యద్యపీత్యాది :- శబ్దార్థాల నిర్ణయం చేయబడిన పిమ్మట దోష గుణాలంకారాల స్వరూపమే చెప్పదగినది అనే మాట యుక్తమే అయినా ధర్మి ప్రదర్శించబడిన తరవాతనే ధర్మాల హేయత్వము, ఉపాదేయత్వమూ తెలియ బడుతుంది గాన ముందుగా కావ్యభేదాలను చెప్పుచున్నాడు.

వి. 'శబ్దార్థౌ కావ్యమ్'అని కావ్యలక్షణం చెప్పిన తరవాత ఆ శబ్దార్థాల స్వరూపం నిర్ణయించబడింది. ఇంక లక్షణంలో చెప్పిన దోషాలు, గుణాలు, అలంకారాలు-వీటి స్వరూపం చెప్పడం న్యాయం అనే మాట నిజమే అయినా ధర్మి (ధర్మాలు కలది) అయిన కావ్యంయొక్క స్వరూపం పూర్తిగా చెప్పిన తరవాతనే దానికి సంబంధించిన వని చెప్పే ధర్మాలలో వేటిని పరిత్యజించాలి, వేటిని స్వీకరించాలి అనే విషయం స్పష్టం అవుతుంది కాబట్టి ముందుగా కావ్యభేదాలను చెపుతున్నాడు అని భావం.

అవ. లక్షణామూలకం అభిధామూలకం అని ధ్వనికావ్యం రెండు విధాలు. వీటిలో మొదటిదైన లక్షణామూలకానికి 'అవివక్షితవాచ్యం' అనీ అభిధామూలకానికి వివక్షితాన్యపరవాచ్యం అనీ పేర్లు ముందుగా లక్షణామూలకధ్వనికావ్యానికి లక్షణం చెప్పి దాని విభేదాలు చూపుతున్నాడు. అవివక్షితేతి - అవివక్షితవాచ్యః

=చెప్పుటకు ఉద్దేశింపబడని, అనగా అనుపయుక్తమైన లేదా అన్వయమునకు యోగ్యం కాని వాచ్యార్థం గల, యః = ఏ ధ్వని ఉన్నదో, తత్ర = ఆ, ధ్వనౌ = ధ్వనియందు (ఉత్తమకావ్యమునందు), వాచ్యమ్ = వాచ్యార్థము, అర్థాన్తరే = వాచ్య లక్ష్యార్థాలకి సాధారణమైన అర్థమునందు, సంక్రమితమ్ = సంక్రమింపచేయబడిన దిగా గాని, అత్యన్తమ్ = మిక్కిలి, తిరస్కృతం వా = తిరస్కరించబడినది గాని, (విడవబడినది గాని) భవేత్ = అగును.

లక్షణేతి:- "లక్షణామూలమైన గూఢవ్యంగ్యానికి ప్రాధాన్యం ఉన్నప్పుడే దేనియందు వాచ్యం వివక్షితం కాదో అది, 'ధ్వనౌ' అని అనువదించడంచేత 'అది' అనగా ఆ ధ్వని అని అర్థం".

వి. 'తత్ర ధ్వనౌ' (ఆ ధ్వనియందు) అని అనువదిస్తున్నాడు గాన 'యః' అనేదానికి 'ఏ ధ్వని' అని అర్థం అని భావం. లక్షణామూలకమైన గూఢవ్యంగ్యం ప్రధానంగా ఉన్న కావ్యానికి 'అవివక్షితవాచ్యధ్వని' అని పేరు. ఈ ధ్వనిలోని వాచ్యార్థం అనుపయుక్తం లేదా అన్వయాయోగ్యం. అందుచేతనే దీనికి ఆ పేరు. ఈ వాచ్యం మరొక అర్థంగానైనా మారిపోతుంది లేదా పూర్తిగా విడవబడుతుంది. అని కారిక భావం.

వృ. తత్ర చ వాచ్యం క్వచిదనుపయుజ్యమానత్వాత్ అర్థాన్తరే పరిణమితమ్. యథా-

శ్లో॥ త్వామస్మి వచ్మి విదుషాం సమవాయోఽత్ర తిష్ఠతి
ఆత్మీయాం మతిమాస్థాయ స్థితిమత్ర విధేహి తత్, 23

వృ. అత్ర వచనాది ఉపదేశాదిరూపతయా పరిణమతి.

వ్యా. తత్రేతి- ఆ అవివక్షితవాచ్యధ్వనిలో, కొన్ని చోట్ల వాచ్యం ఉప యోగించకపోవడంచేత మరొక అర్థంగా పరిణమిస్తుంది (మార్పు చెందుతుంది). ఎట్లనగా- త్వామస్మీతి: విద్వత్సభకు వెడుతూన్న ఒకనితో ఆప్తుడు చెపుతూన్న మాట లివి. "నేను నీకు చెబుతున్నాను- ఇక్కడ విద్వాంసుల సముదాయం ఉంది. అందుచేత నీ బుద్ధిని అవలంబించి సావధానంగా మసలుకో".

అత్రేతి- "ఇక్కడ వచనాదికం ఉపదేశాదిరూపంలో పరిణమించింది".

వి. 'అస్మి' అనగా నేను అని అర్థం. విభక్తిప్రతిరూపకావ్యయం. (విభక్త్యంతం వలె కనబడే అవ్యయం). వాక్యం చెప్పబోతూ మళ్ళీ 'వచ్మి' అని చెప్పడం అనవసరం. అందుచేత 'వచ్మి' అనగా 'ఉపదేశిస్తున్నాను' అని అర్థం. హితసాధనత్వం వ్యంగ్యం. 'విదుషామ్' అనేదానికి 'సర్వశాస్త్రవిశారదులు' అనీ 'అస్మి యామ్' అనేదానికి 'శాస్త్రదృష్టిగల నీబుద్ధిని' అనీ అర్థాలు. మరొకవిధంగా ప్రవర్తిస్తే పరిహాసాస్పదుడవు అవుతావు అని వ్యంగ్యం. ఈ విధంగా ఇక్కడ వాచ్యార్థం మరొక రూపంలో మారినది కాబట్టి అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వనికి ఉదాహరణం.

వృ. క్వచిదనుపపద్యమానతయా అత్యన్తం తిరస్కృతమ్. యథా-

శ్లో॥ ఉపకృతం బహు తత్ర కిముచ్యతే
సుజనతా ప్రథితా భవతా పరమ్,
విదధదీదృశమేవ సదా సఖే
సుఖితమాస్స్వ తతః శరదాం శతమ్. 24

వృ. ఏతదపకారిణం ప్రతి విపరీతలక్షణయా కశ్చిద్వక్తి.

వ్యా. క్వచిదితి- కొన్ని చోట్ల వాచ్యార్థం ఉపపన్నం (యుక్తం) కాక పోవడంచేత అత్యంతం(పూర్తిగా) కప్పబడిపోతుంది (విడపబడుతుంది). ఎట్లనగా-

"నువ్వు ఎంతో ఉపకారం చేశావు, చెప్పవలసినదేముంది? నువ్వు సర్వ విధాలా నీ మంచితనాన్ని చూపుకొన్నావు. స్నేహితుడా! ఇలాగే చేస్తూ నువ్వు వందలకొలది సంవత్సరాలు హాయిగా ఉండు".

ఏతదితి- ఒకడు ఈ మాటలు అపకారంచేసినవానితో విపరీతలక్షణతో అంటున్నాడు.

వి. అపకారాలుచేసిన, మిత్రుడ నని చెప్పుకొనే ఒకనితో అన్న మాట లవడంచేత ఇక్కడ, విపరీతలక్షణచేత, 'ఉపకృతమ్' అన్నదానికి 'అపకృతమ్' అనీ, 'సుజనతా' అన్నదానికి 'దుర్జనతా' అనీ, 'సఖే' అన్నదానికి 'శత్రో' అనీ

'సుఖితమ్' అన్నదానికి 'దుఃఖితమ్' అనీ అర్థాలు. అపకారాదుల ఆధిక్యం వ్యంగ్యం. ఈ విధంగా 'ఉపకృతం' ఇత్యాదులు వాచ్యార్థాలను పూర్తిగా విడిచి వేయడంచేత ఇది అత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వనికి ఉదాహరణం.

అవ. అభిధామూలధ్వనికి లక్షణం చెపుతున్నాడు-

కా. వివక్షితం చాన్యపరం వాచ్యం యత్రాపరస్తు సః.

వృ. అన్యపరమ్, వ్యఙ్గ్యనిష్ఠమ్.

వ్యా. వివక్షితమితి- యత్ర = ఎక్కడ, వాచ్యమ్ = వాచ్యార్థము, వివక్షితమ్ = వివక్షితమో, చెప్పడానికి ఇష్టమైనదో, అన్యపరం చ = వ్యంగ్యార్థపరమో, అనగా ప్రధానంగా వ్యంగ్యార్థాన్ని బోధించడానికే ఉద్దేశించబడి తాను అప్రధానంగా ఉంటుందో, సః = అది. అపరః = వివక్షితాన్యపరవాచ్యధ్వనిగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

అన్యేతి:- అన్యపరమ్ వ్యంగ్యనిష్ఠమైనది; ప్రధానంగా వ్యంగ్యార్థం బోధించడానికే ఈ వాచ్యార్థం ఉద్దిష్టం అవడడంచేత వ్యంగ్యార్థంలోనే విశ్రాంతమైనది అని అర్థం.

అవ. ఈ వివక్షితాన్యపరవాచ్యధ్వనిని విభజిస్తున్నాడు.

వృ. ఏష చ.

కా. కోఽప్యలక్ష్యక్రమవ్యఙ్గ్యో లక్ష్యవ్యఙ్గ్యక్రమః పరః 25

వృ. అలక్ష్యేతి- న ఖలు విభావానుభావవ్యభిచారిణ ఏవ రసః; అపి తు రసస్తైః ఇతి అస్తి క్రమః. స తు లాఘవాన్న లక్ష్యతే.

వ్యా. ఏష ఇతి:- ఏషః చ = ఈ వివక్షితాన్యపరవాచ్యధ్వని కూడ.

కోఽపీతి- కః అపి = నిర్వచింపశక్యం కాని చమత్కారం కలిగించే ఒకటి, అలక్ష్యక్రమః = గుర్తించ శక్యం కాని క్రమం గల వ్యంగ్యము కలది. పరః = రెండవది, లక్ష్యక్రమవ్యఙ్గ్యః = లక్ష్యక్రమవ్యంగ్యము.

న ఖల్వితి:- "విభావానుభావవ్యభిచారులే రసం కాదు; మరేమనగా రసం

వాటిచేత (కలుగుతుంది) కాబట్టి క్రమం ఉంది. అయినా అది లాఘవంచేత గుర్తించబడదు."

వి. అలక్ష్యక్రమవ్యంగ్యం, లక్ష్యక్రమవ్యంగ్యం అని వివక్షితాన్యపరవాచ్య ధ్వని రెండు విధాలు. రసాదులు అలక్ష్యక్రమవ్యంగ్యం. విభావానుభావాదులు వాచ్యార్థాలు. ఆ వాచ్యార్థాలచేత రసాదులు వ్యంజింపచేయబడతాయి. అనగా విభా వాదివాచ్యార్థాలు వ్యంజకాలు, రసాదులు వ్యంగ్యాలు, ముందు అభిధాశక్తిచేత విభావాదివాచ్యార్థాల జ్ఞానం కలిగిన పిమ్మటనే వ్యంగ్యాలైన రసాదుల ప్రతీతి కలుగుతుంది. ఈ విధంగా ముందు వాచ్యార్థం తరవాత వ్యంగ్యార్థం అని ఆ రెండింటికీ క్రమం ఉంది. కాని వాచ్యార్థం తెలిసిన వెంటనే వ్యంగ్యార్థం స్ఫురించ డంచేత క్రమం లేకుండా రెండర్థాలూ ఒకే సమయంలో స్ఫురిస్తున్నాయా అన్నట్లు ఉంటుంది. శతపత్రపత్రశతభేదనన్యాయంచేత ఆ క్రమం గుర్తించ బడదు. అందుచేత ఇవి (రసాదులు) అసంలక్ష్యక్రమాలు. నూరు తామరపూవు రేకులు ఒకదానిమీద ఒకటి చొప్పున దొంతరగా పేర్చి ఆ దొంతరను వాడియైన సూదితో గుచ్చినప్పుడు ఆ సూది ఒక్కమారుగా అన్ని రేకులనూ గుచ్చినట్లు కనబడుతుంది. వాస్తవంలో ఆ సూది మొదట మొదటిరేకునూ, తరవాత రెండవ రేకునూ, తరవాత మూడవ రేకునూ- ఈ విధంగా నూరు రేకులను చీలుస్తుంది. శీఘ్రతచేత క్రమం తెలియదు. ఇదే "శతపత్రపత్రశతభేదన్యాయం".

వృ. తత్ర-

కా. రసభావతదాభాసభావశాన్త్యాదిరక్రమః,
భిన్నో రసాద్యలఙ్కారాదలఙ్కార్యతయా స్థితః. ౩౬

వృ. ఆదిగ్రహణాద్భావోదయభావసంధిభావశబలత్వాని. ప్రధాన తయా యత్ర స్థితో రసాదిస్తత్రాలంకార్యః; యథోదాహరిష్యతే. అన్యత్ర ప్రధానే వాక్యార్థే యత్రాఙ్గభూతో రసాదిస్తత్ర గుణీభూతవ్యఙ్గ్యే రసవ త్ప్రేయఊర్జస్విసమాహితాదయోఽలంకారాః. తే చ గుణీభూతవ్యఙ్గ్యాభి ధానే ఉదాహరిష్యన్తే.

వ్యా. తత్ర = ఆ అలక్ష్యక్రమవ్యంగ్య- లక్ష్యక్రమవ్యంగ్యాలలో.

రసేతి:- రసాద్యలంకారాత్ = రసాద్యలంకారముకంటె, భిన్నః = వేరైన, రసభావతదాభాసభావశాన్త్యాదిః = రసం, భావం, రసాభాస, భావాభాస, భావశాంతి మొదలైనది, అలంకార్యతయా = అలంకరించదగినదిగా, (యత్ర = ఏ ధ్వని యందు), స్థితః = ఉన్నదో ఆ ధ్వని, అక్రమః = అలక్ష్యక్రమవ్యంగ్యము.

ఆదీతి:- "'ఆది' అనడంచేత భావోదయ-భావసంధి-భావశబలత్వాలు గ్రహించబడతాయి. ఎక్కడ రసాదికం ప్రధానంగా ఉంటుందో అక్కడ అది ఉదాహరించబడనున్నట్లు, అలంకార్యం. వాక్యార్థం ప్రధానంగా ఉన్న ఏ ఇతర స్థలాలలో రసాదికం అంగం అవుతుందో అట్టి గుణీభూతవ్యంగ్యంలో రసవత్ ప్రేయస్-ఊర్జస్వి-సమాహితాద్యలంకారాలు. అవి గుణీభూతధ్వనిని గూర్చి వివరించేటప్పుడు ఉదాహరించబడగలవు".

కారికలో 'శాన్త్యాది' అని 'ఆది' పదంచేత భావోదయాదుల్ని గ్రహించాలి. రసాదులు ఎక్కడ ప్రధానంగా ఉంటాయో అక్కడ ఆ రసాదులు అలంకార్యాలు. అనగా అలంకారాలు ఆ రసాదుల్నే అలంకరిస్తాయి. అలాంటి ప్రధానరసాలు అలంకారాలు కావు. ఎక్కడైతే వాక్యార్థం ప్రధానం అయి రసాదులు అంగంగా ఉంటాయో అలాంటి గుణీభూతవ్యంగ్యకావ్యంలో రసాదులు అలంకారాలు అవుతాయి. రసం అంగం అవుతే రసవదలంకారం. భావం అంగం అవుతే ప్రేయోలంకారం. రసాభాసం కాని, భావాభాసం కాని అంగం అవుతే ఊర్జస్వి అలంకారం. భావశాంతి అంగం అవుతే సమాహితాలంకారం.

వృ. తత్ర రసస్వరూపమాహ—

కా. కారణాన్యథ కార్యాణి సహకారీణి యాని చ,
రత్యాదేః స్థాయినో లోకే తాని చేన్నాట్యకావ్యయోః 27.
విభావా అనుభావాశ్చ కథ్యన్తే వ్యభిచారిణః
వ్యక్తః స తైర్విభావాద్యైః స్థాయీ భావో రసః స్మృతః 27

వ్యా. తత్రేతి :- ఆ రసభావాదులలో రసం లక్షణం చెపుతున్నాడు—

కారణానీతి - లోకే = లోకంలో, రత్యాదేః = రతిమొదలైన, స్థాయినః =

స్థాయిభావంయొక్క, యాని = ఏ, కారణాని = కారణములు, అథ = మరియు, కార్యాణి = కార్యాలూ, సహకారీణి = సహకారులు ఉన్నవో, తాని = అవియే, నాట్యకావ్యయోః చేత్ = నాట్య - (రూపక) - కావ్యములయందైతే, విభావాః = విభావాలు అనీ, అనుభావాః చ = అనుభావాలు అనీ, వ్యభిచారిణః = వ్యభిచారి భావా లని, కథ్యన్తే = చెప్పబడుచున్నవి. తైః = ఆ, విభావాద్యైః = విభావాదుల చేత, వ్యక్తః = వ్యంజింపచేయబడిన, స్థాయీ = స్థాయి అయిన, భావః = భావం, రసః = రసం అని, స్మృతః = చెప్పబడింది.

లోకవ్యవహారంలో, ఒక నాయకుని మనస్సులో నాయికను చూడగానే 'రతి'(ప్రేమ)అనే భావం పుట్టింది. లేదా నాయకుణ్ణి చూడగానే నాయిక మనస్సులో రతి పుట్టింది. నాయకుని మనస్సులో పుట్టిన రతికి నాయిక, నాయిక మనస్సులో పుట్టిన రతికి నాయకుడు కారణం. చంద్రోదయం, వివిక్తప్రదేశం మొదలైన వాటివల్ల ఆ రతి పుష్టి చెందుతుంది. అందుకు కారణం చంద్రోదయాదులు. ఈ విధంగా రతి పుట్టడానికి, అది పుష్టి చెందడానికి ఇవి కారణాలు. లోకంలో కారణాలు అన్నవాటికే దృశ్యకావ్యాలలోను, శ్రవ్యకావ్యాలలోనూ విభావాలు అని పేరు. ఆలంబనవిభావం, ఉద్దీపనవిభావం అని విభావం రెండు విధాలు. కావ్యాదుల్లో వర్ణించిన నాయకుని మనస్సులో పుట్టిన రతికి కారణం నాయిక. ఆమె ఆ రతికి ఆలంబనవిభావం. నాయిక మనస్సులో పుట్టినదానికి నాయకుడు ఆలంబనవిభావం, రతి పుష్టి చెందడానికి కారణాలైన చంద్రోదయాదులు ఉద్దీపనవిభావం. ఉద్దీపనం అనగా పుట్టినదానిని పుష్టం చేయడం అని అర్థం. హృదయంలో అణగి ఉన్న రత్యాదిస్థాయిభావాలను మేల్కొలిపి ఆస్వాదించ డానికి యోగ్యం అయినవాటినిగా చేసేవి కాబట్టి కారణాలకు విభావాలు అని పేరు. "విభావయన్తి = రత్యాదీః ఆస్వాదయోగ్యతాం, నయన్తి ఇతి విభావాః" అని విగ్రహం.

మనస్సులో రతి జనించి కొంచెం పుష్టం కాగానే లోకంలో క్రీకంటిచూపులు, ఆయా అవయవాల కదలిక, ఒకరకమైన సంభాషణ మొదలైనవి ప్రారంభం అవుతాయి. అవి మనస్సులో పుట్టిన రతివల్ల జనించాయి గాన దాని కార్యాలు. వాటినే కావ్యాదులలో అనుభావాలు అంటారు. రత్యాదులు అనుభవంలోనికి వచ్చేటట్లు చేస్తాయి కాబట్టి వీటి కా పేరు. ఈ చేష్టాదులను చూడగానే ఆ వ్యక్తి

మనస్సులోని రతిని గూర్చి తెలుస్తుంది కదా ? "అనుభావయన్తి ఇతి అనుభావాః" అని విగ్రహవాక్యం.

మనస్సులో పుట్టి ఆ యా చేష్టలకు కూడా కారణం అయిన రతి కొంత సేపు పూర్తిగా శరీరంలో వ్యాపించడానికి లేదా ఆ యా కార్యాలను పుట్టించడానికి సహకారించే నిర్వేదం మొదలైన భావాలని లోకంలో సహకారులు అంటాం. వీటికే కావ్యాలలో వ్యభిచారులు అని పేరు. మనస్సులో పుట్టిన రతి అంతటా వ్యాపించేటట్లు; శరీరం అంతా దాని ప్రభావం కనబడేటట్లు చేయడానికి, దానివలన మరికొన్ని కార్యాలు పుట్టడానికి ఇవి ఉపకరిస్తాయి. రత్యాదుల్ని మాటిమాటికి వ్యంజింప చేస్తాయి. ఈ విధంగా "(రత్యాదీన్ స్థాయిభావాన్) విశేషేణ అభితః (కాయే) చారయన్తి ఇతి వ్యభిచారిణః," "విశేషేణ అభితః చారయన్తి = ముహుర్ముహుః అభివ్యఞ్జయన్తి ఇతి వ్యభిచారిణః"; "విశేషేణ అభితః (ఆభిముఖ్యేన, కార్యజననే ఆనుకూల్యేన చరన్తీతి వ్యభిచారిణః" అని దీనికి విగ్రహం చెప్పవచ్చును.

ఈ విభావానుభావానుభావవ్యభిచారభావాలచేత వ్యంజింపచేయబడిన స్థాయిభావమే రసము. స్థాయిభావం అనగా కొంత సేపు అవిచ్ఛిన్నంగా ఉండే భావం. ఇతరభావాలు ఒకదాని తరవాత ఒకటి పుట్టి అంతరిస్తున్నా ఇది మాత్రం అనుస్యూతంగా కొంతసేపు స్థిరంగా ఉంటుంది.

వృ. ఉక్తం హి భరతేన "విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" ఇతి. ఏతద్వివ్రియతే - "విభావైర్లలనోద్యానాదిభిరాలమ్బనోద్దీపనకారణైః రత్యాదికో భావో జనితః, అనుభావైః కటాక్షభుజాక్షేప ప్రభృతిభిః కార్యైః ప్రతీతియోగ్యః కృతః, వ్యభిచారిభిర్నిర్వేదాదిభిః సహకారిభిః ఉపచితో ముఖ్యయా వృత్త్యా రామాదావనుకార్యే తద్రూపతానుసంధానాన్నర్తకేఽపి ప్రతీయమానో రసః" ఇతి భట్టలోల్లట ప్రభృతయః.

వ్యా. ఉక్తం హీతి:- "విభావానుభావవ్యభిచారిభావాల సంయోగంవల్ల రసం నిష్పన్నం అవుతుంది." అని భరతుడు చెప్పినాడు కదా ? దానిని వివరించుచున్నారు.- "విభావైః = లలనలు ఉద్యానాదులు అయిన ఆలంబనోద్దీపనకారణాల చేత పుట్టించబడిన రత్యాది స్థాయిభావం, అనుభావైః = కటాక్షాలు, కరప్రసారాలు మొదలైన కార్యాలచేత ప్రతీతికి (తెలియడానికి) యోగ్యమైనదిగా చేయబడి,

వ్యభిచారిభిః = నిర్వేదం మొదలైన సహకారులచేత వృద్ధి పొందింపబడి (పోషింప
బడి), అనుకరించదగిన రామాదులయందు ముఖ్యవృత్తిచేత (ప్రధానంగా) ఉన్నా
కూడ ఆ రామాదిరూపంలో ఉన్నట్లు భావనచేయడంవల్ల నర్తకునిలో ఆరోపించ
బడి రస మని చెప్పబడుతుంది" అని భట్టలోల్లటుడు మొదలైనవారు

వి. భట్టలోల్లటాదుల మతం ప్రకారం రసం ప్రధానంగా రామాదులలోనే
ఉంటుంది. నాట్యంలో (రూపకాలలో) నటుడు రామాదుల వేషభూషాదులు ధరించి
ఆ విధంగానే మాటలాడుతూ రామాదుల్ని అనుకరించడంచేత నటుడిలో కూడా
రసం ఉన్నట్లు కనబడుతుంది. రతి మొదలైనవాటికే విభావాదులతో సంబంధం
ఏర్పడినప్పుడు అవి 'రసం' అవుతాయి. (శృంగారాన్ని గూర్చి చర్చించేటప్పుడు)
ఆలంబనం ఉద్దీపనం అనే ద్వివిధవిభావాలవల్ల రతి పుడుతుంది. వాస్తవానికి
రతి పుట్టేది ఆలంబనవిభావం చేతనే. పుట్టిన రతికి కొంత పుష్టి కలిగిస్తాయి
కాబట్టి ఉద్దీపనవిభావాలను కూడా రతికి కారణంగా చెప్పడం జరుగుతూన్నది
ఒక్కొకప్పుడు ఆలంబనవిభావం ఉన్నా సుందరమైన పరిసరాలు వివిక్తస్థానం
మొదలైన ఉద్దీపనవిభావాలు లేకపోతే రతి పుట్టక పోవచ్చు కూడ. ఈ విభా
వాలకి రతికీ ఉన్న సంబంధం జన్యజనకభావసంబంధం. రతి జన్యం, పుట్టేది;
విభావాలు జనకాలు, పుట్టించేవి. కటాక్షవీక్షణం మొదలైన అనుభావాలు రతివల్ల,
పుట్టిన (రతి) కార్యాలు. వాటిని పట్టి రతి ఉన్నట్లు తెలుస్తుంది. ఈ అనుభావాలకీ
రతికీ గమ్య - గమకభావసంబంధం. తెలువబడేది రతి, తెలిపేవి అనుభావాలు.
లజ్జమొదలైన విభావాలు రతిని బాగా పరిపుష్టం చేసి శరీరం అంతా వ్యాపించేటట్లు
చేస్తాయి. కాబట్టి వీటికీ రతికీ మధ్య ఉన్న సంబంధం పోష్యపోషకభావసంబంధం.
రతి పోషించదగినది, విభావాలు పోషించేవి. ఈ విధంగా రతికి విభావానుభావ
వ్యభిచారిభావాల సంయోగంచేత, కలయికచేత, రామాదులైన అనుకార్య
వ్యక్తులలో శృంగారరసం పుడుతుంది. బాగా అభినయాదులు చేయడంచేత
నటుడిలో కూడ ఉన్నట్లు కనబడుతుంది.

ఈ విధంగా భట్టలోల్లటాదుల మతం ప్రకారం (స్థాయినాం = స్థాయి
భావములకు) విభావానుభావవ్యభిచారిసంయోగాత్ - (విభావ) లలనాది రూపాలైన
ఆలంబనవిభావాలతోను, ఉద్యానాదులైన ఉద్దీపనవిభావాలతోను ఉత్పాద్యోత్పాదక
రూపసంబంధంవల్లా, (అనుభావ = ) కటాక్షములు, హస్తచాలనాలు మొదలైన
కార్యాలైన అనుభావాలతో గమ్యగమకభావరూపసంబంధంవల్లా, (వ్యభిచారి = )

నిర్వేదం మొదలైన వ్యభిచారిభావాలతో పోష్యపోషకభావసంబంధంవల్లా, రస నిష్పత్తిః = పరసగా రసంయొక్క ఉత్పత్తి, అభివ్యక్తి, పుష్టి కలుగుతుంది. అని రస సూత్రానికి అర్థం. సూత్రంలో లేకపోయినా నాట్యశాస్త్రంలో తరవాత ప్రతిపాదించబోయే రీతిని పట్టి 'స్థాయినామ్' అనే పదాన్ని అధ్యాహారం తెచ్చుకొని అర్థం చప్పుకోవాలి.

ఈ మతం ప్రకారం రసం అనుకరింపబడే రామాదులలోనే నిష్పన్నం అయేటట్లయితే ఆ రసనిష్పత్తి లేని సామాజికులకు రసాస్వాదం ఎలా కలుగుతుంది? అందుచేత శ్రీశంకుకాదులు దానిని మరొక విధంగా వ్యాఖ్యానించారు. వాళ్ళ మతాన్ని ప్రతిపాదిస్తున్నాడు.

వృ. 'రామః ఏవాయమ్' 'అయమేవ రామః' ఇతి, 'న రామోఽయమ్' ఇత్యౌత్తరకాలికే బాధే 'రామోఽయమ్' ఇతి, 'రామః స్యాద్వా న వాయమ్' ఇతి, 'రామసదృశః అయమ్' ఇతి చ సమ్యఙ్మిథ్యాసంశయసాదృశ్యప్రతీతిభ్యః విలక్షణయా చిత్రతురగాదిన్యాయేన 'రామోఽయమ్' ఇతి ప్రతిపత్త్యా గ్రాహ్యే నటే-

శ్లో॥ "సేయం మమాఙ్గేషు సుధారసచ్ఛటా
సుపూరకర్పూర శలాకికా దృశోః,
మనోరథశ్రీర్మనసః శరీరిణీ
ప్రాణేశ్వరీ లోచనగోచరం గతా. 25

శ్లో॥ "దైవాదహమద్య తయా చపలాయతనేత్రయా వియుక్తశ్చ
అవిరలవిలోలజలదః కాలః సముపాగతశ్చాయమ్" 26

ఇత్యాదికావ్యానుసంధానబలాచ్ఛిక్షాభ్యాసనిర్వర్తితస్వకార్యప్రకటనేన చ నటేనైవ ప్రకాశితైః కారణకార్యసహకారిభిః కృత్రిమైరపి తథానభిమన్యమానైర్విభావాదిశబ్దవ్యపదేశ్యైః సంయోగాత్ గమ్యగమకభావరూపాత్ అనుమీయమానోఽపి వస్తుసౌన్దర్యబలాత్ రసనీయత్వేన

అన్యానుమీయమానవిలక్షణః, స్థాయిత్వేన సంభావ్యమానో రత్యాదిర్వా వస్తుత్రానసన్నపి సామాజికానాం వాసనయా చర్వ్యమాణో రస ఇతి శ్రీశఙ్కుకః.

వ్యా. రామ ఇతి-'ఇతడు రాముడే', 'ఇతడే రాముడు' అని, 'ఇతడు రాముడు కాడు' అని తరవాత బాధాజ్ఞానం కలగబోయే స్థితిలో 'ఇతడు రాముడు' అని, 'ఇతడు రాముడేనా కాదా' అని, 'ఇతడు రాముడు వలె ఉన్నాడు'. అని సమ్యగ్జ్ఞాన-మిథ్యాజ్ఞాన - సంశయజ్ఞాన-సాదృశ్యజ్ఞానాలకంటె విలక్షణమైన, చిత్రతురగాదిన్యాయంతో కలిగే 'ఇతడు రాముడు' అనే జ్ఞానంచేత గ్రహింపబడే నటుని యందు, (దీనికి 'అనుమీయమానః' 'అనుమితం అవుతున్న' అన్నదానితో అన్వయం)- "ఈమె నా అవయవాల మీద వర్షించే అమృతరసవర్గం; నా కళ్ళకు కర్పూరంతో తయారుచేసిన అంజనశలాక (కాటుక కడ్డీ); నా మనస్సులోని మనోరథాల మూర్తీభవించిన లక్ష్మి; అట్టి ఈ నా ప్రాణేశ్వరి నా ఇంట బడినది" (ఇది సంయోగశృంగారానికి ఉదాహరణం)- "దైవవశంచేత నేను ఈనాడు చంచల విశాలనేత్రయైన నా ప్రియురాలికి దూరమైనాను, దట్టమైన మేఘాలు ఎగురుతూన్న ఈ కాలం వచ్చిపడింది" (విప్రలంభశృంగారానికి ఉదాహరణం) ఇత్యాది కావ్యాల భావాలను మాటి మాటికీ భావనచేయడంవల్ల, శిక్షణ (ఉపదేశం)చేత, అభ్యసించడం చేత స్వకార్యప్రకటనం, అనగా తాను చేయవలసిన అభినయంయొక్క ప్రకటనం నిర్వర్తిస్తున్న నటుడే ప్రకాశింపచేస్తున్న, కృత్రిమాలే అయినా అలా గ్రహింపబడని, విభావాదిశబ్దాల చేత చెప్పబడే కార్య కారణ-సహకారులతో సంయోగంవలన, అనగా గమ్య గమకభావరూపసంబంధం వల్ల, అనుమీయమానమైనా వస్తువులో ఉండే సౌందర్యం యొక్క బలంచేత అనుమీయమానములైన ఇతరవస్తువులకంటె విలక్షణమైన స్థాయిగా తెలియబడుతున్న రత్యాదిభావం ఆ నటునిలో లేకపోయినా సామాజికుల వాసనచేత ఆస్వాదించబడుచు రసం అవుతుంది అని శ్రీ శంకుకుడు.

వి. భరతుడు నాట్యశాస్త్రంలో రూపకాలనే దృష్టిలో ఉంచుకొని రసాన్ని ప్రతిపాదించాడు. అందుచేత నాట్యశాస్త్రప్రాచీనవ్యాఖ్యాతలు కూడ ఈ రస సూత్రాన్ని నాట్యప్రయోగానికి అన్వయించేటట్లుగానే వ్యాఖ్యానించారు. రసాన్ని అతిప్రధానవిషయంగా శ్రవ్యకావ్యాలలో కూడ ప్రవేశపెట్టినవాడు (శబ్దవ్యాపారాలనుగూర్చి మాట్లాడడంచేత)బహుశా భట్టనాయకుడు అని చెప్పవచ్చునేమో. అతని

గ్రంథం లభించడం లేదు గాన నిశ్చితంగా చెప్పడం కష్టం. మనకు తెలిసినంత వరకు శ్రవ్యకావ్యాలలో కూడా రసానికి ప్రాధాన్యం ఇచ్చిన అతిప్రాచీనులలో ఆనందవర్ధనుడు మొదటివాడని చెప్పడానికి సందేహంలేదు. మనం వెనుక చూచిన భట్టలోల్లటమతం రఁ శ్రీ శంకుకుని మతం కూడ రూపకాలను దృష్టిలో పెట్టుకొని ప్రతిపాదించినవే.

ఒక వస్తువును గూర్చిన యథార్థజ్ఞానాన్ని కలిగించేది ప్రమాణం. ప్రమాణ సంఖ్య విషయంలో అభిప్రాయభేదం ఉన్నా ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అనే మూడు ప్రమాణాలు ప్రధానమైనవి. చక్షురాదీంద్రియాలు ప్రత్యక్షప్రమాణం. వాటివల్ల కలిగిన జ్ఞానం కూడా ప్రత్యక్షమే. ఒక వస్తువు కనబడగానే దానిని పట్టి మరొకదానిని ఊహించడం అనుమానప్రయోజనం. 'యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః" (ధూమం ఉన్నచోటల్లా నిప్పు ఉంటుంది) అనే వ్యాప్తి జ్ఞానం ఉన్నవానికి దూరంగా ఉన్న కొండమీద ధూమం చూడగానే- 'పర్వతో వహ్ని మాన్, ధూమాత్' (పర్వతంమీద నిప్పు ఉంటుంది; ధూమం కనబడుతున్నది గాన) అనే జ్ఞానం కలుగుతుంది. ఇక్కడ ధూమం అనే హేతువు చేత అగ్ని అనుమితం అవుతుంది. ధూమం 'హేతువు', అగ్ని 'సాధ్యం' లేదా 'అనుమేయం'. 'పర్వతో వహ్నిమాన్' అనేదానికి 'అనుమితి' అని పేరు. 'యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః' అనే దానికి వ్యాప్తి అని పేరు.

శ్రీశంకుకుని అభిప్రాయం ప్రకారం ఆ యా హేతువులచేత సామాజికుడు నటుడిలో ఉన్నట్లు ఊహించే (అనుమేయమైన) స్థాయిభావమే రసం. నటుడు గురువువద్ద సరియైన శిక్షణ పొంది చాలా కాలం స్వయంగా కూడ అభ్యాసంచేసి, రామునివేషం ధరించి మాటలలోను, చేష్టలలోను ఆ రాముణ్ణే అనుకరిస్తున్నాడు. విభావానుభావవ్యభిచారు లనే నామాంతరం గల కార్యకారణసహకారులను ప్రద ర్శిస్తున్నాడు. అవి కృత్రిమాలే అయినా కృత్రిమా లని అనిపించకుండా, సహ జాలే అన్నట్లు కనబరుస్తున్నాడు. "సేయం మమాఙ్గేషు" "దైవాదహమద్య" ఇత్యాది శ్లోకాలను పఠిస్తూ ఆత డా విధంగా అభినయించేటప్పుడు సామాజికులు మనస్సులలో ఆ శ్లోకాల భావాన్ని మననం చేస్తూ ఆ నటుణ్ణి చూస్తూ ఉంటే వాళ్ళకి ఇతడు రాముడు అనే జ్ఞానం కలుగుతుంది. ఈ జ్ఞానం లోకంలో ప్రసి ద్ధంగా ఉన్న ఏ జ్ఞానాల కోవకీ చెందదు. 'ఇతడు రాముడే' "ఇతడే రాముడు"

అనే జ్ఞానం వలె ఇది సమ్యక్‌జ్ఞానం (యథార్థజ్ఞానం)కాదు. ముత్యపుచిప్పను చూడ గానే 'ఇది వెండి' అనే జ్ఞానం కలిగి మరుక్షణంలో "ఇది వెండి కాదు" అని బాధ జ్ఞానం కలుగుతుంది. ఈ బాధజ్ఞానాన్ని పట్టి మొదట కలిగిన జ్ఞానం మిథ్యా జ్ఞానం (భ్రమ) అని తెలుస్తుంది. ఇక్కడ "ఇతడు రాముడు కాడు" అనే బాధ జ్ఞానం కలగకపోవడంచేత ఇది ('రామోఽయమ్' అనే జ్ఞానం) భ్రమకాదు "ఇది స్థాణువా (బండరాయా) లేక మనిషా" అన్నప్పుడు ఈ జ్ఞానంలో రెండు కోట్లు (పక్షాలు) ఉండడంచేత దీనిని సంశయం అంటాం. ఆ విధంగా ఇక్కడ 'ఇతడు రాముడు అవునా కాదా' అని రెండు పక్షాలు లేకపోవడంచేత సంశయజ్ఞానం కాదు. 'ఇతడు రాముడిలా ఉన్నాడు' అనే జ్ఞానం కాదు కాబట్టి ఇది సాదృశ్య జ్ఞానమూ కాదు. ఈ విధంగా నటుణ్ణి చూస్తున్నప్పుడు కలిగే 'ఇతడు రాముడు' అనే జ్ఞానం లోకప్రసిద్ధాలైన అన్ని విధాల జ్ఞానాలకంటె విలక్షణమైనది. చిత్రించిన గుఱ్ఱాన్ని చూచినప్పుడు కలిగే "ఇది గుఱ్ఱం" అనే జ్ఞానంవంటిది. ఎందు చేత ననగా అది కూడా సమ్యగ్జ్ఞానమూ కాదు, సంశయమూ కాదు, సాదృశ్య జ్ఞానమూ కాదు. "ఇది గుఱ్ఱం కాదు" అనే బాధజ్ఞానం కలగకపోవడంచేత భ్రాంతీ కాదు. ధూమాన్ని చూచి పర్వతంమీద అగ్నిని ఊహించినట్లు నటుని అభినయం అంతా చూచి సామాజికులు అతడు రాముడు అని అనుకొని అతనిలో స్థాయి భావం ఉందని అనుకొంటున్నారు. ఆ స్థాయిభావానికీ నటుడు ప్రదర్శించే విభా వాదులకీ సంబంధం గమ్యగమకభావసంబంధం. స్థాయిభావం గమ్యం, తెలియ దగినది, విభావాదులు గమకాలు, తెలిపేవి, ఊహింపచేసేవి. ఈ స్థాయిభావంలో సహజంగా ఒకవిధమైన రమణీయత్వం ఉంది. అందుచేత ఇది లోకంలో అను మీయమానాలైన ఇతరవస్తువులవంటిది కాదు. అందువలన దీనిని అనుమాన ప్రమాణంచేత గ్రహించినా ఇది ఆస్వాదయోగ్యంగా ఉంటుంది. ఈ విధంగా నటునిలో వాస్తవంగా లేని రతిని ఉన్నట్లుగా భావించి సామాజికులు ఆస్వాదిస్తారు; అదే రసం. "స్థాయికి విభావానుభావవ్యభిచారులతో సంయోగంవల్ల అనగా అను మాప్యానుమాపకభావసంబంధంవల్ల (స్థాయి అనుమాప్యం, ఊహింపదగినది, విభా వాదులు అనుమాపకాలు, అనుమితిని కలిగించేవి) రసనిష్పత్తి, అనగా 'రసాను మితి" అని సూత్రానికి అర్థం.

'కావ్యానుసంధానబలాత్' అన్నదానికి ఉద్ద్యోతంలో నాగేశుడు నటుడే కావ్యార్థాన్ని అనుసంధానం చేస్తూ ఉంటాడు. దాని బలంవల్ల అని అర్థం చెప్పి

దీన్ని పట్టి నటునిలో కూడా రసాస్వాదం ఉంటుం దని భావం' అని వ్యాఖ్యానించాడు. అందరు వ్యాఖ్యాతలూ ఆ విధంగానే వ్రాశారు. కాని ఈ కావ్యార్థానుసంధానం చేసేవాళ్ళు సామాజికు లని చెప్పడం యుక్తం. వారు చెప్పిన అర్థం చెప్పిన పక్షంలో 'బలాత్' అని కాక 'అనుసంధానశిక్షాభ్యాస' ఇత్యాదివిధంగా వ్రాసి ఉండేవాడు.

అవ. చమత్కారం ప్రత్యక్షంవల్లనే కలగాలి కాని అనుమిత్యాదులవల్ల కలగదు అనే విషయం లోకప్రసిద్ధం. అందుచేత ఈ రసానుమితివాదం అయుక్తం అనే ఉద్దేశ్యంతో భట్టనాయకుడు నిరూపించిన మతాన్ని విశదీకరిస్తున్నాడు.

వృ. న తాటస్థ్యేన, నాత్మగతత్వేన రసః ప్రతీయతే, నోత్పద్యతే, నాభివ్యజ్యతే, అపి తు కావ్యే నాట్యే చాభిధాతో ద్వితీయేన విభావాదిసాధారణీకరణాత్మనా భావకత్వవ్యాపారేణ భావ్యమానః స్థాయీ సత్త్వోద్రేకప్రకాశానన్దమయసంవిద్విశ్రాన్తిసతత్త్వేన భోగేన భుజ్యతే ఇతి భట్టనాయకః.

వ్యా. న ఇత్యాది:- 'రసం తాటస్థ్యంతో గాని, తనకు సంబంధించినదిగా గాని తెలియబడదు; పుట్టదు; వ్యంజింపచేయబడదు. మరేమనగా, శ్రవ్యకావ్యంలోను, నాట్యంలోను అభిధకంటె భిన్నమైన, విభావాదులను సాధారణం చేయడమనే స్వరూపం గల రెండవదైన భావకత్వవ్యాపారంచేత భావింపచేయ బడినస్థాయిభావం సత్త్వోద్రేకంచేత కలిగిన ప్రకాశం అనే ఆనందాత్మకజ్ఞానంయొక్క విశ్రాంతిరూపమైన భోగంచేత భుజింపబడుతుంది' అని భట్టనాయకుడు.

వి. 'కావ్యనాట్యాలలో ప్రయోగించే శబ్దానికి అభిధ అనే వ్యాపారం ఒక్కటే కాకుండా 'భావకత్వం', 'భోజకత్వం' అనే మరి రెండు వ్యాపారాలు కూడా ఉంటాయి. రసానుభూతివిషయంలో ఈ రెండు వ్యాపారాలకీ చాలా ప్రాధాన్యం ఉంది. నాట్యం సందర్భంలో నటుడు, రామాదినాయకులు, సామాజికుడు అనే ముగ్గురు ఉంటారు. నటుడు, నాయకుడూ కూడా తటస్థులే, అనగా రసానుభూతికి సంబంధించినంతవరకు ఉదాసీనులే. అందుచేత రసం తటస్థులైన నట-రామాదులకు సంబంధించినదిగా గాని, తనకు, అనగా సామాజికునికి సంబంధించినదిగా కాని ప్రతీతి(జ్ఞాన) గోచరం కాదు. వారిలో పుట్టదు; వారిలో ఉన్నట్లు వ్యంజింప

చేయబడదు. శబ్దంలో ఉన్న రెండవ వ్యాపారం అయిన భావకత్వం, సామాజికుణ్ణి, అభిధ ద్వారా తెలిసిన కావ్యార్థాన్ని మాటిమాటికీ భావనచేసేటట్లు చేస్తుంది. ఆ భావన ఉన్నంతవరకూ సామాజికుడు ఎదుట ఉన్న విభావాదుల్ని ఆ యా వ్యక్తుల నుగా గాని, ఆ యా వ్యక్తులకు, దేశకాలాలకు సంబంధించినవాటినిగా గాని చూడడు; సామాన్యరూపంలో (సర్వసాధారణరూపంలో) చూస్తాడు. అనగా రత్యాదుల్ని సీతారామాదులకు సంబంధించిన వాటినిగా కాక కేవలం రత్యాదిరూపంలో చూస్తాడు. అటుపైన భోజకత్వవ్యాపారం పని చేయడం ప్రారంభిస్తుంది. అప్పుడు సాధారణీకృతాలైన విభావాదులతో సహకృతమైన ఈ భోజకత్వవ్యాపారంచేత సామాజికునికి రత్యాదుల ఆస్వాదం కలుగుతుంది. ఈ రత్యాద్యాస్వాదమే రసనిష్పత్తి'అని భట్టనాయకుని అభిప్రాయం. "స్థాయికి విభావాదులతో, భోజ్యభోజక భావసంబంధంచేత (స్థాయి భోజ్యం-అనుభవింపతగినది, విభావాదులు భోజకాలు-అనుభవింపచేసేవి) రసనిష్పత్తి, అనగా రసభుక్తి(భోగం)"అని సూత్రానికి అర్థం.

సాధారణీకరణం రససిద్ధాంతానికి సంబంధించిన అతిప్రధానమైన అంశం. దీనిని ప్రప్రథమంగా ప్రతిపాదించిన గౌరవం భట్టనాయకునికి చెందుతుంది. 'వ్యంజనావ్యాపారం ఒక్కటే అంగీకరిస్తే చాలు, భావకత్వ-భోజకత్వవ్యాపారాలు అంగీకరించవలసిన అవసరం లేదు' అనే ఉద్దేశ్యంతో భట్టనాయకుని మతాన్ని ఖండించిన అభినవగుప్తాదులు కూడా ఈ సాధారణీకరణాన్ని అంగీకరించారు.

'సత్త్వోద్రేకప్రకాశానన్దమయసంవిద్విశ్రాన్తిసతత్త్వేన భోగేన భుజ్యతే'అనే వాక్యం భట్టనాయకాభిమతరసస్వరూపాన్ని ప్రతిపాదిస్తున్నది. ప్రపంచకం అంతా సత్త్వ-రజస్-తమోగుణాత్మకం అని సాంఖ్యుల సిద్ధాంతం. ఇది దార్శనికులకి అందరికీ అంగీకారయోగ్యమైన సిద్ధాంతం. మానవుడు కూడా సత్త్వరజస్తమోగుణాత్మకుడే. సత్త్వగుణం జ్ఞానాన్ని ప్రకాశనీ కలిగిస్తుంది. రజోగుణం కార్యశీలత్వానికి కారణం. తమోగుణం నిద్రా-ఆలస్యాదులకు (ఆలస్యం అనగా మందగొండితనం) కారణం. ఈ మూడు గుణాలు విషమంగా అనగా హెచ్చుతగ్గులతో ఉంటూ ఉంటాయి. ఒక గుణం హెచ్చుగా ఉన్నప్పుడు మిగిలిన రెండూ అణగి ఉంటాయి. సత్త్వగుణం రజస్తమోగుణాలను అణచి ఉద్రిక్తంగా ఉన్నప్పుడు జ్ఞానం, ప్రకాశం, ఆనందం అధికంగా ఉంటాయి. వాస్తవానికి జ్ఞాన-ప్రకాశానందాలు మూడూ ఒకటే అని తాత్త్వికులు చెపుతారు. భావకత్వవ్యాపారంచేత భావ్య

మానమై, సాధారణీకృతమైన స్థాయిభావం, సత్త్వోద్రేక = సత్త్వగుణం రజస్తమో గుణాలను అణచి ఉద్రేకం చెందడంచేత కలిగిన, ప్రకాశ = ప్రకాశఅనే, ఆనన్ద మయసంవిత్ = ఆనందరూపమైన జ్ఞానమునందు, విశ్రాంతి = విశ్రమించడం, అనగా ఇతరజ్ఞానా లేవీ లేకుండ ఉండడం అనే, సతత్త్వేన=సమానమైన స్వరూపం గల, భోగంచేత అనగా సాక్షాత్కారంచేత అనుభవించబడును అని అర్థం. భోగం అనగా సత్త్వోద్రేకంచేత కలిగిన ప్రకాశ అనే ఆనందమయస్థితిలో ఇతరవిషయ జ్ఞానా లేవీ లేకుండా ఉండడం అని భావం. ఆ భోగమే రసాస్వాదం లేదా రసం. ఇది భట్టనాయకుని మతంలోని సారం.

అవ. భట్టనాయకుడు అంగీకరించిన భావకత్వ-భోజకత్వ వ్యాపారాలతో పని లేకుండా అభినవగుప్తుడు ప్రతిపాదించిన మతాన్ని విశదీకరిస్తున్నాడు-

వృ. లోకే ప్రమదాదిభిః స్థాయ్యనుమానేఽభ్యాసపాటవవతాం కావ్యే నాట్యే చ తైరేవ కారణత్వాదిపరిహారేణ విభావనాదివ్యాపారవత్త్వాద లౌకికవిభావాదిశబ్దవ్యవహార్యైః మమైవైతే,శత్రోరేవైతే, తటస్థస్యైవైతే,న మమైవైతే, న శత్రోరేవైతే, న తటస్థస్యైవైతే ఇతి సమ్బన్ధవిశేషస్వీకార పరిహారనియమానధ్యవసాయాత్ సాధారణ్యేన ప్రతీతైరభివ్యక్తః సామా జికానాం వాసనాత్మతయా స్థితః స్థాయీ రత్యాదికో నియతప్రమాతృ గతత్వేన స్థితోఽపి సాధారణోపాయబలాత్ తత్కాలవిగలితపరిమిత ప్రమాతృభావవశోన్మిషిత వేద్యాన్తరసంపర్కశూన్యాపరిమితభావేన ప్రమాత్రా సకలసహృదయసంవాదభాజా సాధారణ్యేన స్వాకార ఇవా భిన్నోఽపి గోచరీకృతశ్చర్వ్యమాణైకతాప్రాణో విభావాదిజీవితావధిః, పానకరసన్యాయేన చర్వ్యమాణః పుర ఇవ పరిస్ఫురన్, హృదయమివ ప్రవిశన్, సర్వాఙ్గీణమివాలిఙ్గన్, అన్యత్ సర్వమివ తిరోదధత్, బ్రహ్మా స్వాదమివానుభావయన్ అలౌకికచమత్కారకారీ శృఙ్గారాదికో రసః. స చ న కార్యః, విభావాదివినాశేఽపి తస్య సంభవప్రసంగాత్. నాపి జ్ఞాప్యః; సిద్ధస్య తస్యాసంభవాత్. అపి తు విభావాదిభిర్వ్యఞ్జితశ్చర్వణీయః. కారకజ్ఞాపకాభ్యామన్యత్ క్వ దృష్టమితి చేత్, న క్వచిద్దృష్టమిత్యలౌకిక

సిద్ధేర్భూషణమేతన్న దూషణమ్. చర్వణానిష్పత్త్యా తస్య నిష్పత్తిరుప చరితేతి కార్యోఽప్యుచ్యతామ్. లౌకికప్రత్యక్షాదిప్రమాణతాటస్థ్యావబోధ శాలిమితయోగిజ్ఞానవేద్యాన్తరసంస్పర్శ రహితస్వాత్మమాత్రపర్యవసిత పరిమితేతరయోగిసంవేదనవిలక్షణలోకోత్తరస్వసంవేదనగోచర ఇతి ప్రత్యేయోఽప్యభిధీయతామ్. తద్గ్రాహకం చ న నిర్వికల్పకమ్, విభావాది పరామర్శప్రధానత్వాత్ నాపి సవికల్పకమ్, చర్వ్యమాణస్యాలౌకికానన్దమ యస్య స్వసంవేదనసిద్ధత్వాత్. ఉభయాభావస్వరూపస్య చోభయాత్మ కత్వమపి పూర్వవల్లోకోత్తరతామేవ గమయతి న తు విరోధమితి శ్రీమ దాచార్యాభినవగుప్తపాదాః.

వ్యా. లోకే ఇత్యాది :- లోకంలో, ప్రమదాదిభిః = యువతి-ఉద్యాన-కటాక్ష-నిర్వేదాదులచేత, రత్యాదిస్థాయియొక్క అనుమానం చేయడంలో, అభ్యాసం వల్ల, అనగా మాటిమాటికి పరిశీలనంవల్ల, నేర్పు గల, సామాజికానామ్ = సామాజికులయొక్క, వాసనాత్మనా = సంస్కారరూపంతో, స్థితః = ఉన్న, రత్యాదికః స్థాయీ = రత్యాదిస్థాయిభావం, కావ్యే నాట్యే చ = కావ్యంలోను, నాట్యంలోను, విభావనాదివ్యాపారవత్త్వాత్ = విభావనం మొదలైన వ్యాపారం కలవి అవడంచేత, కారణత్వాదిపరిహారేణ = కారణత్వాదుల పరిహారంచేత, అలౌకికవిభావాదిశబ్దవ్యవ హార్యైః = అలౌకికాలైన 'విభావం' మొదలైన పేర్లతో చెప్పదగినవి, ఏతే మమైవ = ఇవి నాకు సంబంధించినవే, ఏతే శత్రోరేవ = ఇవి శత్రువుకు సంబంధించినవే, ఏతే తటస్థస్యైవ = ఇవి తటస్థునికి (నాకూ శత్రువుకూ కాని మూడవవానికి) సంబం ధించినవే, ఏతే న మమైవ = ఇవి నావి కాదు, ఏతే న శత్రోః ఏవ = ఇవి నా శత్రువునకు సంబంధించినవి కావు, ఏతే న తటస్థస్య ఏవ = ఇవి తటస్థునికి సంబం ధించినవి కావు. ఇతి = అని, సంబన్ధవిశేషస్వీకారపరిహారనియమానధ్యవసాయాత్ = సంబంధవిశేషాన్ని స్వీకరించడానికి గాని, పరిహరించడానికి గాని తగిన నియమాన్ని నిశ్చయించకపోవడంవల్ల, సాధారణ్యేన = సాధారణ్యంతో, ప్రతీతైః = తెలియబడిన, తైః ఏవ = ఆ కారణాదులచేతనే, అభివ్యక్తః = అభివ్యక్తమై (అణగి ఉన్నది పైకి వచ్చినదై), నియతప్రమాతృగతత్వేన = నిశ్చితుడైన ఒకా నొక జ్ఞాతకు చెందినట్లు, స్థితః అపి = ఉన్నదైనా కూడ సాధారణోపాయబలాత్ = సాధారణాలైన విభావాద్యుపాయాల బలంవల్ల, తత్కాల......శూన్యాపరిమిత

భావేన—తత్కాల=ఆ కాలంలో, రసాస్వాదన సమయంలో, విగలిత=జారిపోయిన, తొలగిపోయిన, పరిమిత = పరిమితమైన, సంకుచితమైన, ప్రమాతృభావవశ = ప్రమాతృత్వవశంచేత, అనగా జ్ఞాతృత్వహేతువుచేత, ఉన్మిషిత = ఆవిర్భవించిన, వేద్యాన్తరసంపర్కశూన్య = ఇతరజ్ఞేయవస్తువుల సంబంధంతో శూన్యమైన, అపరిమితభావేన=అపరిమితత్వంగల, ప్రమాత్రా=ప్రమాతచేత, అనగా రసం ఆస్వాదించేవానిచేత, సకలసహృదయసంవాదభాజా = సమస్తమైన సహృదయుల సంవాదాన్ని పొందిన (సంవాదం అనగా ఒకచోట ఉన్నది మరొకచోట కూడ ఉండడం, ఒకవ్యక్తిలో ఏ భావం కలిగిందో అదే భావం మరొక వ్యక్తికి కూడా కలిగితే వారిద్దరిమధ్యా సంవాదం ఉన్నదని అర్థం),సాధారణ్యేన=సాధారణ్యంచేత, అనగా 'ఫలానా నాయికవిషయంలో రతి' అని కాకుండా 'నాయికవిషయంలో రతి' అనే విధమైన సామాన్యరూపంచేత, స్వాకారః ఇవ=జ్ఞానాకారము వలె, అభిన్నః అపి = భిన్నము కాకపోయినా కూడ, గోచరీకృతః = గోచరం చేసికొనబడుచు, చర్వ్యమాణతైకప్రాణః = చర్వణచేయబడుట, అనగా ఆస్వాదమే, ప్రాణముగా కలదై, విభావాదిజీవితావధిః=విభావాదుల జీవితమే అవధిగా గలదై, పానకరసన్యాయేన = పానకరసన్యాయంచేత, చర్వ్యమాణః=ఆస్వాదించబడుచు, పురః = ఎదట, పరిస్ఫురన్ ఇవ = ప్రకాశించుచున్నదా అన్నట్లు, హృదయమ్= హృదయమును, ప్రవిశన్ ఇవ = ప్రవేశించుచున్నదా అన్నట్లు, సర్వాఙ్గీణమ్= సమస్తఅవయవములలో వ్యాపించే విధంగా, అలిఙ్గన్ ఇవ=ఆలింగనం చేస్తున్నట్లు, అన్యత్ = ఇతరమైన, సర్వమ్ = సమస్తమునూ, తిరోదధత్ ఇవ = కప్పివేయుచున్నదా అన్నట్లు, బ్రహ్మాస్వాదమ్ = బ్రహ్మాస్వాదాన్ని, అనుభావయన్ ఇవ = అనుభవింపచేస్తున్నదా అన్నట్లు, అలౌకికచమత్కారకారీ=అలౌకికమైన చమత్కారాన్ని కలిగించే. శృఙ్గారాదికః రసః = శృంగారాదికం రసము అని చెప్పబడుచున్నది.

వి. లోకంలో, దైనందినజీవితంలో, యువతి, ఉద్యానం మొదలైన (రతి) కారణాలనీ, కటాక్షవిక్షేపాదికార్యాలనీ, నిర్వేదం మొదలైన సహకారుల్ని బాగా పరిశీలించి వాటి సహాయంచేత రత్యాదిభావాల్ని అనుమానించకలిగిన (అనగా ఊహించగలిగిన) వ్యక్తి హృదయంలో రత్యాదిస్థాయిభావాలు వాసనారూపంలో అనగా సంస్కారరూపంలో, ఉండిపోతాయి. అలాంటివాడే సహృదయుడైన సామాజికుడు. వానికే రసాస్వాదయోగ్యత ఉంటుంది. కేవలం వ్యాకరణ-భాషాశాస్త్ర-

మీమాంసాశాస్త్రాదుల పఠనపాఠనాదులతో కాలం గడిపే శుష్క హృదయులకీ,వేదాభ్యాసజడులకీ ఈ వాసన ఉండదు; రసాస్వాదం అసంభావ్యం. అందుచేతనే.

"వాసనా చేన్న హేతుః స్యాత్ న స్యాన్మీమాంసకాదిషు",

"సవాసనానాం నాట్యాదౌ రసస్యానుభవో భవేత్,
నిర్వాసనాస్తు రఙ్గాన్తః కాష్ఠకుడ్యాశ్మసంనిభాః"

అని అంటారు. "రసాస్వాదానికి వాసన హేతువు కాకపోతే, అలాంటి వాసన లేని మీమాంసకాదులకు కూడా రసాస్వాదం ఉండాలి. (లేదు కదా?)" "వాసన ఉన్నవాళ్ళకే నాట్యాదుల్లో రసానుభవం కలుగుతుంది. వాసన లేనివాళ్లు నాట్యశాలలో కూర్చుండి చూస్తున్నా, అక్కడ ఉన్న స్తంభాలూ, గోడలూ, రాళ్లు ఎంతో వీళ్లు కూడా అంతే"అని వీటి అర్థం. అలాంటి సామాజికులు ధ్వనికావ్యంలోను,

"కాయికో వాచికశ్చైవ ఆహార్యః సాత్త్వికస్తథా,
చత్వారోఽభినయాః ప్రోక్తా నాట్యశాస్త్రవిశారదైః"

అని చెప్పిన చతుర్విధాభినయాలు ఉన్న నాట్యంలోను (రూపకంలోను) కవి నటాదులు ప్రదర్శించిన వనితాది కారణ-కార్య-సహకారుల్ని చూస్తారు. అయితే అవి లోకానికి (ప్రత్యక్షజీవితానికి) సంబంధించినవి కావు. విభావనం, అనుభావనం, వ్యభిచారణం అనే అలౌకికాలైన వ్యాపారాలు చేస్తూ ఉంటాయి. అతిసూక్ష్మంగా వాసనారూపంలో ఉన్న రత్యాదుల్ని ఆస్వాదయోగ్యాలు అయేటట్లు చేయడం విభావనం; వాటిని అనుభవయోగ్యం చేయడం అనుభావనం. అవి శరీరంలో అంతటా వ్యాపించేటట్లు చేయడం వ్యభిచరణం. అందుచేత వీటికి కారణ-కార్య-సహకారు లనే పేర్లకు బదులు విభావ-అనుభావ-వ్యభిచారులు అనే పేర్లు పెట్టి వ్యవహరిస్తారు. నిజానికి ఈ విభావాదులు ఒకానొక కాలంలో, ఒకానొక దేశంలో జరిగిన లేదా జరిగినట్లు చిత్రించిన కథలోని వ్యక్తులకు సంబంధించినవి. అయితే సామాజికుడు సహృదయుడు అవడంచేత, భావనాబలంచేత, వ్యక్తివిశేష-దేశ-కాలాదుల్ని పూర్తిగా విస్మరించి ఆ వ్యక్తుల్ని నాయికానాయకాదిరూపంలోనే చూస్తాడు కాని శకుంతలాదుష్యంతాదిరూపాలలో చూడడు. తన సంకుచిత వ్యక్తిత్వాన్ని కూడా మరచిపోతాడు. "ఈ విభావాదులు నాకు సంబంధించినవి"అని కాని,శత్రువుకు సంబంధించినవి'అని'కాని,'ఉదాసీనుడికి సంబంధించినవి'అని కాని,

'వీళ్ళెవరికి సంబంధించనివి'అని కాని ఆతనికి ఆ సమయంలో జ్ఞానం ఉండదు. వాటినన్నింటినీ సాధారణరూపంలో చూస్తాడు. (ఇదే సాధారణీకరణం అనగా) ఆ విభావాదులచేత వ్యంగ్యాలైన రత్యాదుల్ని కూడా సాధారణరూపంలోనే చూస్తాడు. ఆ సమయంలో విభావాదుల జ్ఞానం తప్ప ఇతరవిషయాల జ్ఞానం ఏదీ ఉండదు. ఆతని హృదయంలో అణగి ఉన్న రత్యాదులు ఉద్బుద్ధాలు అవుతాయి. ఆ రత్యాదుల్నే ఆస్వాదిస్తాడు. ఆ విధంగా రత్యాదుల ఆస్వాదనమే రసం. లేదా ఆస్వాదించబడే రత్యాదులే రసం. అదే రసాస్వాదం. అయితే ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. పటికబెల్లం వేరు. దాని ఆస్వాదనం వేరు. అదే విధంగా రసాస్వాదనం అన్నప్పుడు రసం వేరు, దాని ఆస్వాదనం వేరు అని చెప్పాలి కదా? ఆస్వాదనమే రసం ఎలా అవుతుంది? దానికి సమాధానం "స్వాకార ఇవ అభిన్నోఽపి" అనేది. బౌద్ధమతానికి సంబంధించిన ప్రధానమైన నాలుగు శాఖలలో యోగాచారశాఖ ఒకటి. యోగాచారుల సిద్ధాంతం ప్రకారం జ్ఞానంకంటె భిన్నంగా బాహ్యవస్తువు అనేది లేదు. అయినా ఘటం వేరు, దాని జ్ఞానం వేరు అన్నట్లు 'ఘటజ్ఞానం'అని వ్యవహరిస్తున్నాం. అదే విధంగా రసం వేరు, దాని ఆస్వాదం వేరు కాకపోయినా 'రసాన్ని ఆస్వాదించడం'అని వ్యవహరించడం సౌకర్యంకోసం చెప్పే మాట మాత్రమే. ఔపచారికప్రయోగం అన్నమాట. ("ఈ కావ్యంలో ఈ రసం ఉంది"అని చెప్పే మాటలు పూర్తిగా ఔపచారికాలని వేరే చెప్ప నక్కరలేదు). 'స్వాకార ఇవాభిన్నోఽపి'అనే దానికి సంకేతం అనే వ్యాఖ్యానంలో యోగాచారమతంప్రకారం కాకుండా మరొక విధంగా అర్థం చెప్పబడింది. లోకంలో "నన్ను నేను తెలుసుకొనుచున్నాను"అనే వ్యవహారం ఉంది. ఇక్కడ తెలుసుకొనేవాడు, తెలుసుకొనబడేదీ కూడా తానే (ఆత్మయే). అదే విధంగా ఆస్వాదించబడేదీ, ఆస్వాదనమూ కూడా రసమే. రసంలోని ప్రధానమైన అంశం ఏది? ఆస్వాదమే. రసం ఎంతసేపు ఉంటుంది? విభావాదుల జీవితమే దీనికి అవధి. అనగా విభావాదులు ఎంతసేపు ఉంటే ఇది అంత సేపు ఉంటుంది. విభావాదుల జ్ఞానం ఆగిపోతే రసాస్వాదం ఆగిపోతుంది. అంతే కాదు; ఆ తన్మయత్వస్థితి సడలి 'ఈమె శకుంతల, ఇతడు దుష్యంతుడు' ఇత్యాదివిధంగా గాని "ఎదర ఉన్నది ఫలానా నటుడు, లేదా నటి"అని గాని అనుకొనగానే విభావాదుల సాధారణీకరణానికి ఆఘాతం కలిగినప్పుడు కూడా విభావాదుల జీవితం అయిపోయినట్లే. ఈ రసాస్వాదం పానకరసాస్వాదంవంటిది. బెల్లం, ఏలకులు, మిరియాలు, పచ్చకర్పూరం

మొదలైన వస్తువు లన్నీ వేసి తయారుచేసిన పానకం ఆస్వాదిస్తూన్నప్పుడు దాని రుచి ఆ వస్తువుల రుచుల సంమేళనం రూపంలో ఉంటుంది ఆ వస్తువుల్ని వేరు వేరుగా తిన్నప్పుడు ఉండే రుచి వేరు; అన్నీ కలపగా వచ్చే రుచి వేరు. అదే విధంగా రసాస్వాదనంలో విభావానుభావవ్యభిచారులు స్థాయితో కలపడంచేత ఆ సంమిశ్రితానుభూతి విశిష్టంగా ఉంటుంది. ఆ సమయంలో రసం మన ఎదటనే ఉన్నట్లు, హృదయంలో ప్రవేశించినట్లు, శరీరం అంతా వ్యాపించినట్లు అనిపిస్తుంది. బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్నామా అనిపించేటట్లు చేస్తుంది. బ్రహ్మానందంలో ఆత్మ ఒక్కటే భాసిస్తుంది; దీనిలో విభావాదులుకూడా భాసిస్తాయి కాబట్టి ఇది బ్రహ్మానందం కాదు; తత్సదృశం మాత్రమే. దైనందినజీవితంలో చూచిన దృశ్యాల వల్ల కలిగే అనుభూతి వేరు, ఈ కావ్యనాట్యాద్యనుభూతి వేరు. దానిలో చమత్కారం ఉండవచ్చు, లేకపోవచ్చు. కాని దీనిలో మాత్రం వర్ణించడానికి శక్యం కాని చమత్కారం, ఆనందానుభూతి, కలుగుతుంది. అందుచేతనే ఇది అలౌకికం. ఈ విధంగా సామాజికుడు ఆస్వాదించే, తనలోనే అణగిఉండి విభావాదులచేత ఉద్బుద్ధాలైన రత్యాదులే రసం. "విభావానుభావవ్యభిచారిసంయోగాత్ = స్థాయి భావాలకు విభావాదులతో వ్యంగ్యవ్యంజకభావసంబంధంవల్ల, లేదా విభావ-అను భావ-వ్యభిచారిభావాలు పరస్పరం కలపడంవల్ల. రసనిష్పత్తిః = రసాభివ్యక్తి కలుగుతుంది"అని ఈ పక్షంలో సూత్రానికి అర్థం.

వ్యా. స చ న కార్యః ఇత్యాది. ఆ రసం కార్యం కాదు; కార్యం అయితే విభావాదులు నశించిన పిమ్మట కూడా అది ఉండవలసిఉంటుంది. జ్ఞాప్యం కూడా కాదు; జ్ఞాప్యం అవడానికి అది సిద్ధంగా లేదు కదా? మరేమనగా ఈ రసం విభా వాదులచేత వ్యంజితం అయి చర్వణచేయదగి (ఆస్వాదింపదగి) ఉంటుంది. కారక జ్ఞాపకాలకంటె భిన్నమైనది ఎక్కడ చూడబడింది అని ప్రశ్నిస్తే మరెక్కడా కనబడకపోవడం అనేది అలౌకికత్వం సిద్ధించడానికి హేతువుగాన ఇది భూషణమే కాని దూషణం కాదు. చర్వణానిష్పత్తిచేత రసానికి కూడా నిష్పత్తి ఉపచరితం అవడంచేత ఒక విధంగా అది కార్యం అని చెప్పినా చెప్పవచ్చును "లౌకిక .... గోచరః"—లౌకిక=లౌకికమైన, ప్రత్యక్షాది=ప్రత్యక్షాదిజ్ఞానంకంటె, ప్రమాణతాట స్థ్యావబోధశాలి=చక్షురాదిప్రమాణముల ఔదాసీన్యంచేత, (చక్షురాది ప్రమాణాల సహాయం లేకపోయినా) (అవబోధ=)కలిగినజ్ఞానంతో, (శాలి=) ప్రకాశిస్తూన్న, మితయోగి = అపక్వయోగులయొక్క, జ్ఞాన = జ్ఞానంకంటె, వేద్యాంతర = మరి

యొక తెలియదగిన విషయంయొక్క, సంస్పర్శ = స్పర్శతో, రహిత = శూన్య మైన, స్వాత్మమాత్రపర్యవసిత = తన ఆత్మయందు మాత్రమే పర్యవసన్నమైన, పరిమితేతర = పరిమితులు కాని యోగులయొక్క, వక్త్రయోగులయొక్క. సంవేదన = జ్ఞానంకంటెనూ కూడ, విలక్షణ = విలక్షణమైన, లోకోత్తర = లోకోత్తరమైన, స్వసంవేదన = స్వస్వరూపమైన జ్ఞానానికి, గోచరః = గోచరమైనది, ఇతి = అనే కారణంచేత, ప్రత్యేయం అని, అనగా జ్ఞాప్యం అని కూడ చెప్పవచ్చును.

వి. రససూత్రంలో "విభావానుభావవ్యభిచారిసంయోగాత్" అని పంచమీ విభక్తి ప్రయోగించడంచేత విభావాదులు రసానికి హేతువులు అని చెప్పినట్లయింది. వాటికి రసం కార్యమా, అనగా విభావాదులు రసాన్ని పుట్టిస్తాయా, లేక జ్ఞాప్యమా, అనగా అవి రసాన్ని తెలుపుతాయా? ఎందుచేత ననగా ఒక దానికి ఒకటి హేతువు అన్నప్పుడు అది, ఆ హేతువుకు కార్యం అయినా కావాలి, జ్ఞాప్యం అయినా కావాలి. కుమ్మరి, చక్రం, చక్రం తిప్పడానికి ఉపయోగించే దండం ఇవన్నీ కుండకి హేతువులు; కారణాలు; కుండ కార్యం. అనగా ఇక్కడ కులాలాదులు కారకహేతువు లని అర్థం. దీపం చీకట్లో ఉన్న ఘటాన్ని కనబడేటట్లు, మనకు ఘటజ్ఞానం కలిగేటట్లు, చేస్తుంది. ఇక్కడ ఘటం జ్ఞాప్యం; తెలుపదగినది దీపం జ్ఞాపకహేతువు. రసం విభావాదులకి కార్యం అనడానికి వీలులేదు. కార్యం అయితే, కులాల చక్రదండాదులు నశించినా ఘటం నశించ నట్లు విభావాదులు నశించినా రసం నశించకూడదు. కాని మనం పైన చూచినట్లు విభావాదులు ఉన్నంతవరకే రసం ఉంటుంది. పోనీ జ్ఞాప్యం అందామా అంటే అది కూడా కుదరదు. ముందునుంచీ చీకట్లో ఉన్న ఘటాన్ని దీపం కనబడేటట్లు చేస్తుంది. ఇక్కడ ముందుగానే ఉన్న రసాన్ని విభావాదులు తెలిసేటట్లు చేయడం లేదు కదా? అందుచేత రసం జ్ఞాప్యం కూడా కాదు. ఇంక నేమనగా రసం విభావాదులచేత వ్యంజితం అయి, అనగా వ్యంజనావ్యాపారంచేత గ్రహింపబడి, ఆస్వాదింపబడుతుంది. హేతువు అని చెప్పబడేది కారకమైనా కావాలి, జ్ఞాపకమైనా కావాలి; ఈ రెండు విధాలూ కాకుండా ఈ మూడవది (వ్యంజకత్వం అనేది) ఎక్కడినుంచి వచ్చింది అనే ప్రశ్నకి తావు లేదు. మరెక్కడా కనబడనిది కావ్యనాట్యాదులలో కనబడడమే ఒక విశేషం. అందుచేతనే కదా దీన్ని అలౌకికం అంటున్నాం. కాబట్టి మరెక్కడా కనబడకపోవడం అనేది భూషణమే కాని దూషణం కాదు. లౌకికాలైన ఘటాదుల్ని వలె రసాన్ని కార్యం అని కాని, జ్ఞాప్యం అని కాని చెప్ప

డానికి అవకాశం లేకపోయినా మరొక విధంగా కార్యం అనీ, జ్ఞాప్యం అనీ చెపితే చెప్పవచ్చు. రసం కొత్తగా పుట్టకపోయినా దాని చర్వణం (ఆస్వాదనం) పుట్టుతున్నది. (నిష్పన్నం అవుతున్నది). చర్వణంలో ఉన్న పుట్టడాన్ని (కార్యత్వాన్ని) రసానికి ఆరోపించి "రసం పుట్టుతున్నది" అన్న వ్యవహారం లోకంలో ఉంది. ఈ విధంగా రసానికి కూడా ఔపచారికమైన కార్యత్వం చెప్పవచ్చు. దీనిని జ్ఞాప్యం అని కూడా చెప్పవచ్చు. లోకంలో ఒక వస్తువు మూడు విధాలుగా జ్ఞాన విషయం కావచ్చు. లౌకికాలైన చక్షురాదీంద్రియాల సంపర్కంచేత కలిగిన జ్ఞానంలో ఘటాదులు విషయం అవుతాయి. అది మొదటిది. యోగులలో యుంజానులు, యుక్తులు అని రెండు రకాల యోగులు ఉంటారు. పూర్తిగా పరిపక్వం కాని వారు యుంజానులు. వాళ్ళకి ఇంద్రియాల సహాయం అపేక్ష లేకుండా ధ్యానం చేస్తే అన్ని విషయాలూ ప్రత్యక్షంగా తెలుస్తాయి. వాళ్ళ జ్ఞానం ఒక విధంగా ఉంటుంది. పూర్తిగా పక్వం అయిన యోగులు యుక్తయోగులు. వాళ్లు ఇతర వస్తువుల జ్ఞానం లేశమాత్రం కూడా లేకుండా ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతూ ఉంటారు. ఈ రసానుభవం ఘటాదిప్రత్యక్షజ్ఞానం వంటిది కాని, యుంజాన యోగుల జ్ఞానం వంటిది కాని, యుక్తయోగుల జ్ఞానం వంటిది కాని కాదు. ఆ మూడింటికంటె విలక్షణమైనది. అలాంటి లోకాతీతమైన స్వస్వరూపజ్ఞానానికి విషయమైనది రసం. అనగా విభావాదులచేత ఆనందాంశం అభివ్యక్తం అయి అది స్వయంగానే ప్రకాశిస్తుంది. దీపం ప్రకాశించడానికి (తెలియడానికి) మరొక దీపం అపేక్ష లేనట్లు ఆనందాంశం ప్రకాశించడానికి మరొక జ్ఞానం అపేక్ష లేదు. అది (ఆనందాంశం) స్వప్రకాశం, తనను తానే గ్రహించేది. ఇలా స్వయంప్రకాశంగా ఉన్న దానినే ఔపచారికంగా జ్ఞాప్యం అని వ్యవహరించవచ్చును.

వ్యా. తద్గ్రాహకమ్ ఇతి- ఈ రసాన్ని గ్రహించే జ్ఞానం నిర్వికల్పకం కాదు; ఎందుచేత ననగా దీనిలో విభావాదుల సంబంధం ప్రధానంగా ఉంటుంది. సవికల్పక జ్ఞానమూ కాదు; ఎందుచేత ననగా ఆస్వాదించబడుతున్న అలౌకికానందమయమైన ఆ రసం స్వస్వరూపమైన జ్ఞానంచేతనే సిద్ధం అవుతున్నది (తెలియబడుతున్నది). ఉభయాభావరూపమైన ఆ జ్ఞానం ఉభయాత్మకం అవడం కూడా వెనుక చెప్పినట్లు లోకోత్తరత్వాన్నే సూచిస్తూన్నది కాబట్టి విరోధం లేదు అని శ్రీమదాచార్యాభినవ గుప్తపాదులు ప్రతిపాదించారు.

వి. రసం స్వసంవేదనానికి, స్వస్వరూపమైన జ్ఞానానికి, విషయం అని

పైన చెప్పబడింది. జ్ఞానం సవికల్పకం అని, నిర్వికల్పకం అనీ రెండువిధాలు ఒక వస్తువును చూడగానే మొట్టమొదట ఇది ఒక వస్తువు అనే జ్ఞానం మాత్రమే కలుగుతుంది. దాని పేరు, రూపం, జాతీ మొదలైనవి ఏవీ తెలియవు. ఆ జ్ఞానానికి నిర్వికల్పకజ్ఞానం అని పేరు. పేరు, రూపం జాతీ మొదలైనవాటికి వికల్పాలని పేరు. అవి లేనిది కాబట్టి ఇది నిర్వికల్పకం.మరుక్షణంలో దాని పేరు మొదలైనవి కూడా తెలుస్తాయి. ఆ జ్ఞానానికి సవికల్పకజ్ఞానం అని పేరు. ఈ రసజ్ఞానం నిర్వికల్పకం అనడానికి వీలు లేదు. ఆ జ్ఞానంలో విభావాదుల సంబంధం కూడా ఉంటుంది కదా. అలా అని సవికల్పకం అనడానికి వీలు లేదు. స్వప్రకాశం అయిన ఆ జ్ఞానంలో చివరికి ఆత్మస్వరూపమైన ఆనందాంశం ఒక్కటే భాసిస్తున్నది కదా? ఇంక నిర్వికల్పము కాక సవికల్పకమూ కాక ఉండే జ్ఞానం ఉభయాత్మకం అనాలి. ఇలాంటి ఉభయాత్మకజ్ఞానం లోకంలో ఎక్కడా లేదు కదా అని అడగవచ్చు. వెనక (రసం కార్యమా జ్ఞాప్యమా అనే మీమాంసలో) చెప్పినట్లు ఇలాంటి ఉభయాత్మకజ్ఞానం లోకంలో లేకపోవడం మేము రసం విషయంలో చెప్పిన అలౌకికత్వాన్నే సమర్థిస్తూన్నది కాబట్టి విరోధం ఏమీ లేదు అని భావం.

వృ. వ్యాఘ్రాదయో విభావా భయానకస్యేవ వీరాద్భుతరౌద్రాణామ్, అశ్రుపాతాదయోऽనుభావాః శృఙ్గారస్యేవ కరుణభయానకయోః, చిన్తాదయో వ్యభిచారిణః శృఙ్గారస్యేవ వీరకరుణభయానకానామ్ ఇతి పృథగనైకాన్తికత్వాత్ సూత్రే మిలితా నిర్దిష్టాః.

వ్యా. వ్యాఘ్రాదులు భయానకరసానికి ఎట్లో అట్లే వీర-అద్భుత-రౌద్ర రసాలకి కూడా విభావాలు కావచ్చును. అశ్రుపాతం మొదలైనవి శృంగారానికి ఎట్లో అట్లే కరుణభయానకాలకి కూడా అనుభావాలు కావచ్చును. చింత మొదలైనవి శృంగారానికి ఎట్లో వీరకరుణభయానకరసాలకి కూడా వ్యభిచారులు కావచ్చును. అందుచేత వేరు వేరుగా అవి,వ్యభిచారం కలవి అవడంచేత,సూత్రంలో అన్నీ కలిపి నిర్దేశించబడ్డాయి

వి. రససూత్రంలో విభావానుభావవ్యభిచారులు మూడు కలిసి రసాభివ్యక్తిని కలిగిస్తాయి అని చెప్పబడింది. అలా చెప్పకుండా ఆ మూడింటిలో ఏ ఒక్కటైనా స్వతంత్రంగా, మిగిలిన రెండింటి అపేక్ష లేకుండా, రసాభివ్యక్తిని కలిగిస్తుంది.

అని చెప్పే పక్షంలో వ్యభిచారదోషం వస్తుంది. పెద్దపులి మొదలైనవాటిని చూడగానే పిరికివాళ్ళకి భయం కలిగినట్లు, వీరులకు ఉత్సాహమూ, కొత్తగా చూసే వాళ్ళకి విస్మయమూ, వాటివల్ల బంధువులను కోల్పోయినవాళ్ళకి క్రోధమూ కలగ వచ్చు. అందుచేత వ్యాఘ్రాదులు భయానకరసానికే కాకుండా వీర-అద్భుత-రౌద్రాలకి కూడా ఆలంబనవిభావాలే. అందుచేత అనుభావ - వ్యభిచారిభావాల ప్రసక్తి లేకుండా వ్యాఘ్రాదివిభావాలు భయానకరసాన్ని అభివ్యక్తం చేస్తాయి అని చెప్పడానికి వీలు లేదు. అవి వీరరసానికీ విభావాలే కాబట్టి వీరరసాన్ని కూడా అభివ్యక్తీకరిస్తాయి కదా ? కాబట్టి వ్యభిచారదోషం వస్తుంది. (ఒకదానికి సంబంధించినట్లుగా చెప్పిన విషయం దానికే కాకుండా మరొకదానికి కూడా సంబంధిస్తే అది వ్యభిచారదోషం. ఇది అనుమానప్రమాణంలో హేతువుకు సంబంధించిన దోషం. "యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః"-'ధూమం ఉన్నచోటల్లా అగ్ని ఉంటుంది' అని చెప్పడంలో తప్పులేదు. అగ్ని లేనిచోట ధూమం ఉండదు కదా. కాని "యత్ర యత్ర అగ్నిః తత్ర తత్ర ధూమః" "అగ్ని ఉన్నచోటల్లా ధూమం ఉంటుంది" అని చెప్పడం తప్పు. ఎఱ్ఱగా కాల్చిన ఇనప గుండులో నిప్పు ఉంది కాని ధూమం లేదు కదా? అందు చేత పైన చెప్పిన వ్యాప్తివాక్యానికి తప్పాయా గోలంలో వ్యభిచారం). అదే విధంగా "అశ్రుపాతం అనే అనుభావం శృంగారాన్ని అభివ్యక్తం చేస్తుంది" అనడానికి వీలులేదు. అది కరుణభయానకాలకి కూడా అనుభావమే కాబట్టి వాటిని కూడా అభివ్యక్తం చేయవచ్చును కదా? చింత అనే వ్యభిచారిభావం శృంగారాన్ని అభివ్యక్తం చేస్తుంది అని చెప్పినా ఈ విధమైన వ్యభిచారదోషమే. అందుచేత విభావానుభావవ్యభిచారులు మూడు కలిసి రసాన్ని అభివ్యక్తం చేస్తాయి అని చెప్పినట్లయితే ఈ దోషం ఉండదు.

శ్లో॥ వియదలిమలినామ్బుగర్భమేఘం
మధుకరకోకిలకూజితైర్దిశాం శ్రీః,
ధరణిరభినవాఙ్కురాఙ్కటఙ్కా
ప్రణతిపరే దయితే ప్రసీద ముగ్ధే. 27

ఇత్యాదౌ

శ్లో॥ పరిమృదితమృణాలీమ్లానమఙ్గం ప్రవృత్తిః
కథమపి పరివారప్రార్థనాభిః క్రియాసు,

కలయతి చ హిమాంశోర్నిష్కలఙ్కస్య లక్ష్మీ
మభినవకరిదన్తచ్ఛేదకాన్తః కపోలః. 28

ఇత్యాదౌ

శ్లో॥ దూరాదుత్సుకమాగతే వివలితం సంభాషిణి స్ఫారితం
సంశ్లిష్యత్యరుణం గృహీతవసనే కిం చాఞ్చితభ్రూలతమ్,
మానిన్యాశ్చరణానతివ్యతికరే బాష్పామ్బుపూర్ణేక్షణమ్
చక్షుర్జాజమహో ప్రపఞ్చచతురం జాతాగసి ప్రేయసి. 29

ఇత్యాదౌ చ యద్యపి విభావానామ్, అనుభావానామ్, ఔత్సుక్య వ్రీడాహర్షకోపాసూయాప్రసాదానాం చ వ్యభిచారిణాం కేవలానామత్ర స్థితిః తథాప్యేతేషామసాధారణత్వమిత్యన్యతమద్వయాక్షేపకత్వే సతి నానైకాన్తికత్వమితి.

వ్యా. విభావాదులు మూడు కలిస్తేనే రసనిష్పత్తి అని చెప్పినావు కదా ? కాని కొన్ని చోట్ల కేవలం విభావమో, అనుభావాలో, వ్యభిచారిభావాలో చెప్పినా కూడా రసనిష్పత్తి జరుగుతున్నది. దీనిని పట్టి పై నియమం అయుక్తం కదా అని ఆశంకించుకొని ఒక రసానికి మాత్రమే చెందడానికి వీలున్న విభావాదుల్ని మాత్రమే వర్ణించిన స్థలాలలో మిగిలిన రెండింటిని ఊహించుకోవాలి. అందుచేత పై నియమానికి భంగం లేదు అని చెపుతున్నాడు-నియదితి:- "ఓ ! తెలివితక్కువదానా ! నీటితో నిండి తుమ్మెద వలె నల్లగా ఉన్న మేఘాలు ఆకాశాన్ని ఆవరించి ఉన్నాయి. తుమ్మెదల రొదలతోను, కోకిలల ధ్వనులతోను దిక్కుల శోభ అధికంగా ఉంది. నేల నూతనంగా బయలు దేరిన అంకురా లనే టంకాలతో చిహ్నితమై ఉంది. కాళ్ళమీద పడుతూన్న ప్రియుణ్ణి రనికరించు" ఇత్యాదులలోనూ—

వి. ప్రియునిమీద కోపించిన ఒక మానవతితో సఖురాలు చపుతూన్న మాటలు. ఇక్కడ ముగ్ధ, ప్రియుడు అనే ఆలంబనవిభావం, మేఘపూర్ణమైన ఆకాశం మొదలైన ఉద్దీపనవిభావాలు చెప్పబడ్డాయి. అనుభావవ్యభిచారులు చప్పబడలేదు. అయినా ఇవి శృంగారానికి మాత్రమే సంబంధించినవి కాబట్టి చెప్పని అనుభావవ్యభిచారిభావాలను ఊహించుకొనవచ్చును. అందుచేత విప్రలంభశృంగారాభివ్యక్తికి ఆటంకం లేదు.

వ్యా. పరిమృదితేతి-"శరీరం నలిగిపోయిన తామరతూడులా వాడిపోయింది. ప్రక్కనున్న పరివారజనం ప్రార్థించగా ప్రార్థించగా అతికష్టంమీద కొన్ని పనులు చేసుకుంటున్నది. కొత్తగా మొలచిన ఏనుగదంతం ముక్క కాంతి వంటి కాంతి గల చెక్కిలి కళంకం లేని చంద్రునివంటి శోభతో ఉంది" ఇత్యాదులలోను-

వి. ఇక్కడ శరీరం వాడిపోవడం, దేనిమీదా ఇష్టం లేకపోవడం, చక్కిళ్లు తెల్లబడ్డం మొదలైన కార్యాలు (అనుభావాలు) మాత్రమే వర్ణించినా విభావవ్యభిచారి భావాలను ఊహించుకోవడానికి అవకాశం ఉండడంచేత విప్రలంభశృంగారాభి వ్యక్తి కలుగుతుంది. ఈ శ్లోకం మాలతీమాధవంలోనిది.

వ్యా. దూరాదితి-ఎంత బ్రతిమాలినా వినకపోవడంచేత వెళ్ళిపోయిన ప్రియుడు మళ్ళీ వచ్చినప్పుడు నాయిక చూపులను వర్ణిస్తున్న శ్లోకం; అమరు శతకంలోనిది. "నాయిక చూపు అపరాధంచేసిన ప్రియుణ్ణి దూరంనుంచి చూడ గానే ఔత్సుక్యం కలది అయింది. (ఔత్సుక్యం). అతడు దగ్గరికి రాగానే ఆ మానిని చూపు ప్రక్కకి తిప్పబడింది. (వ్రీడ). అతడు మాటలాడుతుండగా విక సించింది. (హర్షం) దగ్గరికి ఆలింగనం కోసం వస్తూండగా ఎఱ్ఱబడింది (కోపం). వెళ్ళిపోతున్న తన వస్త్రాన్ని పట్టుకొన్నప్పుడు కొంచెం కనుబొమ్మలు ముడుచు కొన్నది. (అసూయ). అతడు పాదాలకు నమస్కరించబోతుంటే కన్నీళ్ళతో నిండింది. (ప్రసాదం). ఈ విధంగా అనేకవిచిత్రవ్యాపారాలు చేయడంలో నేర్పును చూపింది". ఇత్యాదులలోనూ-

వి. ఈ శ్లోకంలో విభావానుభావాలు వర్ణించకుండగా కేవలం ఔత్సుక్యం మొద లైన వ్యభిచారిభావాలను మాత్రమే చెప్పినా మిగిలిన రెండింటినీ ఊహించుకోవడం చేత శృంగారరసనిష్పత్తి కలుగుతున్నది.

వ్యా. యద్యపీతి- (పైన చెప్పిన శ్లోకాలవంటి స్థానాలలో) కేవలం విభా వాలు, అనుభావాలు, ఔత్సుక్య-వ్రీడా-హర్ష-కోప-అసూయా-ప్రసాదాలు అనే వ్యభి చారిభావాలు మాత్రమే చెప్పబడ్డాయి. అయినా ఇవి శృంగారానికి మాత్రమే చెంది నవి అవడంచేత మిగిలిన రెండింటిని ఆక్షేపిస్తాయి. (ఊహింపచేస్తాయి). అందుచేత "విభావాదు లన్నీ కలిసి రసప్రతీతి కలిగిస్తాయి" అని సూత్రంలో చెప్పినదానికి వ్యభిచారం లేదు.

వృ. తద్విశేషానాహ-

కా. శృఙ్గారహాస్యకరుణరౌద్రవీరభయానకాః,
బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః. 29

వ్యా. దాని (రసంయొక్క) విశేషాలను చెపుతున్నాడు. "నాట్యంలో (నాటకాదులలో) శృంగారం, హాస్యం, కరుణ, రౌద్రం, వీరం, భయానకం, బీభత్సం, అద్భుతం అనే ఎనిమిది రసాలు చెప్పబడ్డాయి.

వి. 1. శృంగార రసానికి స్థాయిభావం రతి. కాంతాదులు ఆలంబనవిభావం. స్రక్చందనాదులు ఉద్దీపనవిభావాలు. కటాక్షాదులు అనుభావాలు. వ్రీడాదులు వ్యభిచారిభావాలు. 2. హాస్యరసానికి స్థాయిభావం హాసం. వికారచేష్టలు చేసేవాడు ఆలంబనవిభావం. వికారచేష్టాదులు ఉద్దీపనవిభావాలు. బుగ్గలు ఉబ్బడం మొదలైనవి అనుభావాలు. శ్రమాదులు వ్యభిచారిభావాలు. 3. కరుణరసానికి శోకం స్థాయిభావం మృతాదులు ఆలంబనవిభావాలు. వాళ్ళ సద్గుణాదులు ఉద్దీపనవిభావాలు. రోదనాదులు అనుభావాలు. దైన్యాదులు వ్యభిచారిభావాలు. 4. రౌద్రరసానికి క్రోధం స్థాయిభావం. శత్రువు ఆలంబనవిభావం. వాడు చేసిన అపకారాదులు ఉద్దీపనవిభావాలు. బడాయి చెప్పుకోవడం మొదలైనవి అనుభావాలు. గర్వాదులు వ్యభిచారిభావాలు. 5. వీరరసానికి ఉత్సాహం స్థాయిభావం. యుద్ధవీరానికి శత్రువు ఆలంబనవిభావం, అతడు చేసిన అపకారం ఉద్దీపనవిభావం. దానదయావీరాలకి దీనుడు ఆలంబనవిభావం. అతడు ఆపదలలో ఉండడం ఉద్దీపనవిభావం. యుద్ధవీరానికి పగదీర్చుకోవడం, మిగిలిన రెండింటికీ దానాదులు అనుభావాలు. హర్ష—ఆవేగ—చింతాదులు వ్యభిచారిభావాలు. (మమ్మటుడు యుద్ధవీరం మాత్రమే అంగీకరించాడు) 6. భయానకరసానికి భయం స్థాయిభావం. భయంకరమృగాదులు ఆలంబనవిభావం; వాటి కర్మలు ఉద్దీపనవిభావం. పలాయనాదులు అనుభావం. జడత్వం మొదలైనవి వ్యభిచారిభావాలు. 7. బీభత్సరసానికి జుగుప్స (ఏవగింపు) స్థాయిభావం. మలమూత్రాదులు ఆలంబనవిభావం. దుర్గంధాదులు ఉద్దీపనవిభావం. ఉమ్మివేయడం మొదలైనవి అనుభావాలు. గ్లాని మొదలైనవి వ్యభిచారిభావాలు. 8. అద్భుతరసానికి విస్మయం స్థాయిభావం. ఆశ్చర్యకరమైన పనులు చేసేవాళ్ళు మొదలైనవారు ఆలంబనవిభావం. అలాంటి పనులు ఉద్దీపనవిభావం. ఉలిక్కిపడడం మొదలైనవి అనుభావాలు. హర్షాదులు వ్యభిచారిభావాలు.

వృ. తత్ర శృఙ్గారస్య ద్వౌ భేదౌ: సంభోగో విప్రలమ్భశ్చ. తత్రాద్యః పరస్పరావలోకనాలిఙ్గనాధరపానపరిచుమ్బనాద్యనన్తత్వాదపరిచ్ఛేద్య ఏక ఏవ గణ్యతే. యథా-

శ్లో॥ శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనై
ర్నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్,
విస్రబ్ధం పరిచుమ్బ్య జాతపులకామాలోక్య గణ్డస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుమ్బితా. 30

వ్యా. తత్రేతి- వాటిలో శృంగారరసానికి సంభోగం, విప్రలంభం అని రెండు భేదాలు. ఆ రెండింటిలో మొదటిదైన సంభోగశృంగారంలో ఒకరినొకరు చూసుకోవడం, ఆలింగనం చేసికోవడం, అధరపానం, చుంబనం మొదలైన అనంతభేదాలు ఉండడంచేత ఇన్ని రకాలు అని చెప్పడం కష్టం. అందుచేత అవాంతరభేదాలు ఎన్ని ఉన్నా ఒకటిగానే పరిగణించబడుతుంది.

వి. రసాలన్నింటిలోకీ సర్వజనప్రియం అవడంచేత శృంగారం బాలా ప్రధానమైనదిగా పరిగణింపబడుతుంది. శృఙ్గమ్ = ప్రాధాన్యాన్ని, ఋచ్ఛతి = పొందుతుంది కాబట్టి 'శృఙ్గారః' అని దీని వ్యుత్పత్త్యర్థం. దీని అర్థం మరొక విధంగా కూడ చెపుతారు శృఙ్గం అనగా మన్మథుడు అంకురించడం ఆ మన్మథోద్భేదాన్ని కారణంగా చేసుకొని స్త్రీపురుషులలో ఆవిర్భవించినది శృంగారం.

"శృఙ్గం హి మన్మథోద్భేదస్తదాగమనహేతుకః,
పురుషప్రమదాభూమిః శృఙ్గార ఇతి గీయతే."

అది నాయిక ప్రారంభించినది. నాయకుడు ప్రారంభించినది అని సంభోగం రెండు విధాలు. మొదటిదానికి ఉదాహరణం ఎట్లనగా.

వ్యా. శూన్యమ్ ఇతి:— ఇది అమరుకంలోని ముగ్ధనాయికావర్ణనం. "ముగ్ధ నాయిక శయనగృహంలో ఇతరులెవ్వరూ లేరని చూచింది పరుపుమీదనుంచి కొంచెం మెల్లగా లేచింది భర్త నిద్రపోతున్నట్లు అభినయిస్తున్నాడు ఆతని ముఖం తదేకదీక్షగా కొంతసేపు చూచింది. నిర్భయంగా చుంబనం చేసింది.

అప్పుడు అతని చెక్కిళ్ళమీద గగుర్పాటు కలగడం చూచి సిగ్గుతో తల వంచు కుంది. అలాంటి స్థితిలో ఉన్న ఆమెను ప్రియుడు నవ్వుతూ చాలా సేపు ముద్దు పెట్టుకొన్నాడు"

వి. ఇక్కడ నాయకుడు ఆలంబన విభావం. శూన్యగృహాదికం ఉద్దీపన విభావం. ముఖనిర్వర్ణన-చుంబనాదికాలు అనుభావాలు. లజ్జాహాసాదులచేత సూచింప బడిన హర్షాదులు వ్యభిచారిభావాలు. రతి (ప్రేమ) స్థాయిభావం. వీటిని అన్నిం టినీ గుర్తించగలిగిన సామాజికునిలో ఈ సంభోగశృంగారరసనిష్పత్తి కలుగు తుంది.

వృ. తథా-

శ్లో॥ త్వం ముగ్ధాక్షి వినైవ కఞ్చులికయా ధత్సే మనోహారిణీం
లక్ష్మీమిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికాసంస్పృశి,
శయ్యోపాన్తనివిష్టసస్మితసఖీనేత్రోత్సవానన్దితో
నిర్యాతః శనకైరలీకవచనోపన్యాసమాలీజనః. 31

వ్యా. నాయకుడు ప్రారంభించిన సంభోగానికి ఉదాహరణం చూపుతు న్నాడు. మరియు- "ఓ! సుందరనయనా! రవిక లేకపోతేనే నీ శోభ మనోహ రంగా ఉంటుంది" అని అంటూ ప్రియుడు ఆమె రవికె ముడిని స్పృశిస్తూండగా, చిరునవ్వు నవ్వుతూ శయ్యాప్రాంతాన్ని అంటి పెట్టుకొని ఉన్న సఖురాలి (నాయిక యొక్క) నేత్రవికాసంచేత ఆనందింపచేయబడిన సఖురాళ్ళందరూ ఏవేవో వంకలు చెపుతూ మెల్లగా బైటకు వెళ్ళిపోయారు".

వి. ఈ శ్లోకం అమరుకంలోనిది. ఇక్కడ ముగ్ధాక్షి ఆలంబనం. నయన సౌందర్యశరీరశోభాదులు ఉద్దీపనాలు. అలా మాటలాడడం, వీటికను స్పృశిం చడం అనుభావాలు. ఉత్కంఠ మొదలైనవి విభావాలు. వీటిని గుర్తించగలిగిన సామాజికునిలో సంభోగశృంగారనిష్పత్తి జరుగుతుంది.

వృ. అపరస్తు అభిలాషవిరహేర్ష్యాప్రవాసశాపహేతుక ఇతి పఞ్చ విధః. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ ప్రేమార్ద్రాః ప్రణయస్పృశః పరిచయాదుద్గాఢరాగోదయా
స్తాస్తా ముగ్ధదృశో నిసర్గమధురాశ్చేష్టా భవేయుర్మయి,
యాస్వన్తఃకరణస్య బాహ్యకరణవ్యాపారరోధీ క్షణా
దాశంసాపరికల్పితాస్వపి భవత్యానన్దసాన్ద్రో లయః. 32

వ్యా. అపర ఇతి:— అభిలాష హేతుకము; విరహ హేతుకము, ఈర్ష్యా హేతుకము, ప్రవాస హేతుకము, శాప హేతుకము అని రెండవది (విప్రలంభశృంగారం) ఐదు విధాలు.

వి. అభిలాష అనగా మొట్టమొదట కలిగిన అనురాగం. లేదా సమాగమం లభించనివాళ్ళ పరస్పరసమాగమేచ్ఛ అభిలాష. అది హేతువుగా గల విప్రలంభం మొదటిది. ఇద్దరూ ఒకేచోట ఉన్నా వారిలో ఒకరికి అనురాగం లేకపోవడంచేతగాని, అనురాగం ఉన్నా దైవప్రతిబంధంవల్ల గాని, పెద్దలనుండి సంకోచం మొదలైన కారణాలచేత గాని సంయోగం లేకపోవడం విరహం. ఈర్ష్య అనగా తాత్కాలికమైన మానం, పట్టుదల. అనురాగవంతులు కార్యాంతరవశం చేత వేరు వేరు ప్రదేశాలలో ఉండడం ప్రవాసం. "ఇంతకాలం మీరు కలవ కూడదు" "మీరు అసలు కలవకూడదు" ఇత్యాదిరూపమైన కట్టడి శాపం.

వ్యా. క్రమంగా ఉదాహరణాలు. ప్రేమార్ద్రాః ఇత్యాది మాలతీమాధవంలో మాలతిని పొందుటకై మాధవుని అభిలాషను చిత్రించే శ్లోకం. అభిలాష హేతుక విప్రలంభానికి ఉదాహరణం. యాసు=ఏ చేష్టలు, ఆశంసాపరికల్పితాసు అపి= మనోరథముచేత కల్పింపబడినవే అయినా, క్షణాత్ = క్షణకాలంలో, బాహ్యకరణవ్యాపారరోధీ=బాహ్యేంద్రియాల వ్యాపారాన్ని (ప్రవృత్తిని) అరికట్టే, ఆనన్దసాన్ద్రః = ఆనందంచేత దట్టమైన, అన్తః కరణస్య లయః = అంతఃకరణం యొక్క విలయం, అనగా తన్మయత్వం, భవతి = కలుగునో అట్టి, ప్రేమార్ద్రాః = ప్రేమచేత అర్ద్రమైనవి (ఇతడు లేదా ఈమె నావాడు లేదా నాది, నేను అతని దానను లేదా ఆమెకు చెందినవాడను అను ఒక విధమైన పక్షపాతం ప్రేమ), ప్రణయస్పృశః = ప్రణయాన్ని స్పృశించేవి (ప్రకర్షను పొంది ఎన్ని అపరాధాలు చేసినా తొలగని ప్రేమ ప్రణయం), పరిచయాత్ = అధికాసక్తివల్ల, ఉద్గాఢరాగోదయాః = పాతుకొని పోయిన రాగంయొక్క అవిర్భావం కలవి (ఎక్కువ

పరిచయంచేత రంజింపచేయగలిగిన ప్రణయమే రాగం), నిసర్గమధురాః = స్వభావంచేతనే మధురములూ అయిన, ముగ్ధదృశః = సుందరములైన నేత్రాలు గల ఆ మాలతియొక్క, తాః తాః = ఆ యా, చేష్టాః = చూడడం, నవ్వడం మొదలైన చేష్టలు, మయి = నా విషయంలో, భవేయుః = అగుగాక.

వి. ఇక్కడ మాలతి ఆలంబనం. ఆమె విలాసల స్మరణం ఉద్దీపన విభావం. కోరికను ఆవిష్కరించడం అనుభావం. ఉత్కంఠ వ్యభిచారి భావం. రతి స్థాయిభావం.

అవ. విరహహేతుకవిప్రలంభానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అన్యత్ర వ్రజతీతి కా ఖలు కథా నాప్యస్య తాదృక్ సుహృద్
యో మాం నేచ్ఛతి నాగతశ్చ హహహా కోఽయం విధేః ప్రక్రమః
ఇత్యల్పేతరకల్పనాకబలితస్వాన్తా నిశాన్తాన్తరే
బాలా వృత్తవివర్తనవ్యతికరా నాప్నోతి నిద్రాం నిశి. 33

వృ. ఏషా విరహోత్కణ్ఠితా.

వ్యా. అన్యత్రేతి. రాత్రికి వస్తానని చెప్పి ఏ కారణంచేతనో నాయకుడు రాక పోవడంచేత పరిపరి విధాల ఆలోచనలలో పడిన విరహోత్కంఠితయైన నాయిక వర్ణన. అన్యత్ర=మరియొక ప్రియురాలిదగ్గరకు, వ్రజతీతి=వెడతాడు అని, కథా మాట, కా ఖలు = ఏమి ఉంటుంది? మదేకపత్నీవ్రతస్థుడైన అతడు మరియొక ప్రియురాలి దగ్గరకు వెళ్ళినాడేమో అనే ప్రశ్నయే లేదు. యః = ఎవడు, మామ్ = నన్ను, న ఇచ్ఛతి = ఇచ్ఛయించడో అనగా నేను సుఖంగా ఉండాలని కోరడో, తాదృక్ = అలాంటి, సుహృత్ = మిత్రుడు, అస్య = ఇతనికి, న = లేడు. ఏ మిత్రుని దగ్గరికైనా వెడితే అతడు ఇక్కడికి రాకుండా చేసినా దనడా నికి కూడా అవకాశం లేదు. న ఆగతః చ = మరి రానూ లేదు, హహహా = అయ్యో! అయమ్ = ఈ, విధేః = దైవముయొక్క, ప్రక్రమః=కార్యారంభం, కః = ఏమి? ఇతి=ఇట్లు, అల్పేతరకల్పనాకవలితస్వాన్తా=అత్యధికములైన ఊహల చేత మ్రింగివేయబడిన(ఊహలతో నిండిన)మనస్సు గల, బాలా=ఆ ముద్దరాలు, నిశాన్తాన్తరే=శయనగృహం మధ్య, వృత్తవివర్తనవ్యతికరా=జరుగుతూన్న ఇటూ

అటూ దొరలడంతో సంబంధం కలదై (ఇటూ అటూ దొర్లుతూ), నిశి = రాత్రియందు, నిద్రామ్ = నిద్రను, నాప్నోతి = పొందడంలేదు. "ఈమె విరహంతో ఉత్కంఠ చెందినది".

వి. ఇక్కడ వస్తానని రాని భర్త ఆలంబనవిభావం. రాక పోవడం మొదలైనవి ఉద్దీపనవిభావం. పక్కమీద దొర్లడం మొదలైనవి అనుభావాలు. 'హ హ హా, అనడంచేత సూచితమైన విస్మయం లేదా దైన్యం వ్యభిచారిభావం.

అవ. ఈర్ష్యాహేతుకవిప్రలంభశృంగారానికి ఉదాహరణం చూపుతున్నాడు:-

శ్లో॥ సా పత్యుః ప్రథమేఽపరాధసమయే సఖ్యోపదేశం వినా
నో జానాతి సవిభ్రమాఙ్గవలనావక్రోక్తిసంసూచనమ్,
స్వచ్ఛైరచ్ఛకపోలమూలగలితైః పర్యస్తనేత్రోత్పలా
బాలా కేవలమేవ రోదితి లుఠల్లోలాలకైరశ్రుభిః 34

వ్యా. నవోఢయైన (కొత్తగా వివాహం అయిన) తన సఖురాలు భర్త చేసిన అపరాధానికి పడుతూన్న బాధను మరొక సఖురాలికి ఒక యువతి చెపుతూన్న మాటలు. అమరుశతకంలోని పద్యం ఇది. సా బాలా = ఆ బాల, పత్యుః = భర్తయొక్క, ప్రథమాపరాధసమయే = తొలిసారిగా అపరాధం చేసిన సమయమునందు, సఖ్యా = సఖురాలిచేత, ఉపదేశం వినా = ఉపదేశం లేకుండగా, సవిభ్రమాఙ్గవలనావక్రోక్తిసంసూచనమ్ = విలాసపూర్వకంగా అవయవాలు కదల్చడం చేత, వక్రోక్తులచేత (కోపాన్ని) సూచించడాన్ని, నో జానాతి = ఎరుగదు. అచ్ఛకపోలమూలగలితైః = స్వచ్ఛములైన చెక్కిళ్ళ మొదళ్ళలో జారిన, స్వచ్ఛైః = స్వచ్ఛములైన, లుఠల్లోలాలకైః = దొరలుతూన్న చంచలములైన ముంగురులతో కూడిన, అశ్రుభిః = కన్నీళ్ళతో, పర్యస్తనేత్రోత్పలా = ఇటు అటూ ప్రసరింపచేయబడుచున్న ఉత్పలములవంటి నేత్రాలు కలదై, కేవలమ్ ఏవ = కేవలమూ, రోదితి = ఏడ్చుచున్నది. ఇక్కడ పతి ఆలంబనం అపరాధం ఉద్దీపనం. రోదనాదికం అనుభావం. దానిచేత వ్యంగ్యం అయిన అసూయ వ్యభిచారిభావం. రతి స్థాయిభావం. పతి అన్యనాయికాసక్తుడవడంచేత ముగ్ధకు ఈర్ష్య కలిగింది

అవ. ప్రవాసహేతుకవిప్రలంభానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ప్రస్థానం వలయైః కృతం ప్రియసఖై రస్రైరజస్రం గతం
ధృత్యా న క్షణమాసితం వ్యవసితం చిత్తేన గన్తుం పురః,
యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వే సమం ప్రస్థితాః
గన్తవ్యే సతి జీవిత ప్రియసుహృత్సార్థః కిము త్యజ్యతే.

వ్యా. ప్రవత్స్యత్పతిక (భర్త ప్రవాసానికి వెళ్ళనున్న నాయిక) తన జీవితాన్ని గూర్చి నిందాపూర్వకంగా అంటూన్న మాటలు. అమరుశతకంలోని శ్లోకం. జీవిత = ఓ జీవితమా! ప్రియతమే = ప్రియతముడు, యాతుమ్ = వెళ్ళుటకు, నిశ్చితచేతసి = నిశ్చయించబడిన చిత్తం కలవాడగుచుండగా, ప్రియసఖైః = నీ ప్రియమిత్రులైన, వలయైః = కంకణములచేత, ప్రస్థానమ్ = ప్రయాణము, కృతమ్ = చేయబడింది కృశత్వం చేత కంకణాలు జారిపోయాయి. అస్రైః = కన్నీళ్ళ చేత, అజస్రమ్ = నిరంతరంగా, గతమ్ = వెళ్ళుట. కన్నీళ్ళు ధారలుగా ప్రవహించి వెళ్ళిపోతున్నాయి. ధృత్యా = ధైర్యముచేత, క్షణమ్ = క్షణకాలం కూడ, న ఆసితమ్ = ఉడడం జరగలేదు. చిత్తేన = మనస్సుచేత. పురః = ముందుగానే, గన్తుమ్ = వెళ్ళుటకు, వ్యవసితమ్ = నిర్ణయము చేయబడింది. సర్వే = ఇవన్నీ, సమమ్ = ఒక్కమారుగా, ప్రస్థితాః = ప్రయాణమైనవి. గన్తవ్యే సతి = (నువ్వు కూడా) వెళ్ళవలసే ఉన్నప్పుడు, ప్రియసుహృత్సార్థః = ప్రియమిత్రుల సముదాయం, కిము త్యజ్యతే = ఎందుకు త్యజింపబడుతున్నది? 'ప్రియసఖైః' అనేది వలయ-అస్ర-ధృతి-చిత్తాదులకు అన్నింటికి అన్వయిస్తుంది. ఓ! జీవితమా! నువ్వు కూడా వెళ్ళవలసినదాననే కదా? అలాంటప్పుడు నీ ప్రియమిత్రులతో కలిసే ఎందుకు వెళ్ళవు అని భావం.

వి. ఇక్కడ ప్రియతముడు ఆలంబనం. ఆతని ప్రయాణాదులు ఉదీపనం. కృశించిపోవడం మొదలైనవి అనుభావాలు. అవి వ్యంజింపచేసే చింత వ్యభిచారిభావం. రతి స్థాయిభావం.

అవ. శాపహేతుకవిప్రలంభానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ త్వామాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైః శిలాయా
మాత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుమ్,

అస్రైస్తావన్ముహురుపచితైర్దృష్టిరాలుప్యతే మే
క్రూరస్తస్మిన్నపి న సహతే సంగమం నౌ కృతాన్తః. 36

వ్యా. మేఘదూతంలో మేఘం ద్వారా భార్యకు సందేశం పంపుతూన్న కుబే రుని శాపంచేత భార్యావియుక్తుడైన యక్షుని మాటలు. ధాతురాగైః = ధాతువుల రంగులచేత, శిలాయామ్ = శిలాఫలకంమీద, ప్రణయకుపితామ్ = ప్రణయ కోపము పొందిన, త్వామ్ = నిన్ను, ఆలిఖ్య = వ్రాసి, ఆత్మానమ్ = నన్ను, తే = నీయొక్క, చరణపతితమ్ = పాదాలమీద పడినవానినిగా, కర్తుమ్ = చేయుటకు, యావత్ = ఎంతలో, ఇచ్ఛామి = కోరుచున్నానో, తావత్ = అంతలో, మే = నా యొక్క, దృష్టిః = దృష్టి, ఉపచితైః = ఉబికి వస్తూన్న, అస్రైః = కన్నీళ్ళచేత, ముహుః = మాటిమాటికి, ఆలుప్యతే = అవరించబడుతూన్నది, క్రూరః = క్రూర మైన, కృతాన్తః = దైవం, తస్మిన్నపి = ఆ చిత్రరూపులో కూడ. నౌ = మన ఇద్దరియొక్క, సంగమమ్ = సంగమమును, న సహతే = సహించడంలేదు.

వి. ఇక్కడ నాయిక ఆలంబనం. ఆమె ప్రణయకోపం ఉద్దీపనం. చరణ పాతేచ్ఛాదికం అనుభావం దైవంమీద అసూయ వ్యభిచారిభావం. రతి స్థాయి భావం.

వృ. హాస్యాదీనాం క్రమేణోదాహరణమ్-

శ్లో॥ ఆకుఞ్చ్య పాణిమశుచిం మమ మూర్ధ్ని వేశ్యా
మన్త్రామ్భసాం ప్రతిపదం పృషతైః పవిత్రే,
తారస్వరం ప్రథితథూత్కమదాత్ప్రహారం
హాహా హతోఽహమితి రోదితి విష్ణుశర్మా. 37

వ్యా. హాస్యాదిరసాలకు వరుసగా ఉదాహరణలు-

ఆకుఞ్చ్యే ఇతి:- వేశ్యా = వేశ్య, ప్రతిపదమ్ = ప్రతిచోటా, మన్త్రామ్భసామ్ = మంత్రోదకముల యొక్క, పృషతైః = బిందువులచేత, పవిత్రే = పవిత్రమైన, మమ మూర్ధ్ని = నా తలమీద, అశుచిమ్ = అపవిత్రమైన, పాణిమ్ = హస్తమును, ఆకుఞ్చ్య = వంచి, అనగా పిడికిలి బిగించి, తారస్వరమ్ = అధికమైన ధ్వని

కలుగునట్లుగా, ప్రథితథూత్కృమ్ = విస్తృతమైన థూత్కారము కలుగునట్లుగా ('ఛీ' అంటూ), ప్రహారమ్ = దెబ్బను, అదాత్ = ఇచ్చెను. హాహా = అయ్యో! అయ్యో! అహమ్ = నేను, హతః = హతుడను అయినాను, ఇతి = అని. విష్ణుశర్మా విష్ణుశర్మ, రోదితి = ఏడ్చుచున్నాడు.

వి వేశ్యావంచితుడైన విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడు ఏడ్చినట్లు ఒకరు మరొకనితో చెప్పి నవ్వుకున్నట్లు వర్ణించే శ్లోకం ఇది. విష్ణుశర్మ ఆలంబనం. వాని రోదనం ఉద్దీపనం. స్మితం మొదలైనవి అనుభావాలు. చూచేవానిలో కలిగే ఆవేగం చాపలం మొదలైనవి వ్యభిచారిభావాలు. హాసం స్థాయిభావం. హాసం కలిగినవానిని ఇక్కడ వర్ణించకపోయినా ఈ వర్ణనా సామర్థ్యం చేత ఆతనిని ఊహించుకోవాలి.

అవ. కరుణరసానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ హా మాత స్త్వరితాసి కుత్ర కిమిదం హా దేవతాః క్వాశిషః
ధిక్ ప్రాణాన్ పతితోఽశనిర్హుతవహస్తేఽఙ్గేషు దగ్ధే దృశౌ.
ఇత్థం ఘర్ఘరమధ్యరుద్ధకరుణాః పౌరాఙ్గనానాం గిర
శ్చిత్రస్థానపి రోదయన్తి శతధా కుర్వన్తి భిత్తీరపి 38

వ్యా. హా మాతః ఇతి:- సకలపౌరుల ఆదరానికి పాత్రురాలైన ఒక రాజ మాతగాని, రాజభార్య గాని మరణించగా పౌరస్త్రీల శోకాన్ని వర్ణించే శ్లోకం. హా! మాతః = అయ్యో! తల్లీ! కుత్ర = ఎక్కడికి, త్వరితా అసి = వెళ్ళడానికి తొందరపడుచున్నావు. ఇదమ్ = ఇది, కిమ్ = ఏమిటి! హా = అయ్యో! దేవతాః = దేవతలారా! ఆశిషః = పెద్దల ఆశీర్వాదాలు, క్వ = ఎక్కడికి పోయినాయి? ప్రాణాన్ = మా ప్రాణాలను గూర్చి, ధిక్ = నింద అగుగాక. తే అఙ్గేషు = నీ అవయవాలమీద, హుతవహః = అగ్ని అనే, అశనిః = పిడుగు, పతితః = పడినది. దృశౌ = సుందరములైన నీ నేత్రాలు, లేదా ఇట్టి విషయాన్ని చూచినందుకు మా నేత్రాలు, దగ్ధే = కాల్చబడినాయి. ఇత్థమ్ = ఈ విధంగా ఘర్ఘరమధ్యరుద్ధ కరుణాః =(శ్లేష్మం అడ్డుకోవడంచేత) ఘర్ఘరధ్వని మధ్యలో కలిగినవై అడ్డుకోనబడినవీ, దీనములూ అయిన, పౌరాఙ్గనానామ్ = పౌరస్త్రీలయొక్క, గిరః = మాటలు, చిత్ర స్థానపి = చిత్రపులలో ఉన్నవాళ్ళని కూడ, రోదయన్తి = ఏడిపిస్తున్నాయి. భిత్తీః అపి = గోడలను కూడ, శతధా = నూరు ముక్కలుగా, కుర్వన్తి = చేస్తున్నాయి.

వి. ఇక్కడ మృతురాలైన నాయిక ఆలంబనం. ఆమెను దహించడం

మొదలైనవి ఉద్దీపనాలు. రోదనం అనుభావం. వైవర్ణ్యం, గ్లాని, మూర్ఛ మొదలైనవి వ్యభిచారిభావాలు. శోకం స్థాయిభావం, వీటిని అన్నింటినీ గుర్తించగలిగిన సహృదయుడిలో కరుణరసం వ్యక్తం అవుతుంది.

అవ. రౌద్రరసానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ కృతమనుమతం దృష్టం వా యైరిదం గురుపాతకం
మనుజపశుభిర్నిర్మర్యాదైర్భవద్భిరుదాయుధైః,
నరకరిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినా
మయమహమసృఙ్మేదోమాంసైః కరోమి దిశాం బలిమ్ 39

వ్యా. వేణీసంహారంలో ద్రోణవధను గూర్చి విన్న అశ్వత్థామ అర్జునాదుల మీద కోపంతో పలికిన మాటలు ఇవి. ఉదాయుధైః = ఎత్తబడిన ఆయుధాలు గల (ఆయుధాలు ధరించిన), నిర్మర్యాదైః = కట్టుబాట్లను అతిక్రమించిన, మనుజపశుభిః = మనుష్యపశువులైన, యైః = ఏ, భవద్భిః = మీచేత, ఇదమ్ = ఈ, గురుపాతకమ్ = గురువు విషయంలో చేయబడిన మహాపాపము, కృతమ్ = చేయబడిందో, అనుమతమ్ = అంగీకరించబడిందో, వా = లేక, దృష్టమ్ = చూడబడిందో, నరకరిపుణా సార్ధమ్ = కృష్ణునితో కూడ, సభీమకిరీటినామ్ = భీమార్జునులతో కూడిన, తేషామ్ = అట్టి మీయొక్క, అసృఙ్మేదోమాంసైః = రక్తంచేత, క్రొవ్వుచేత, మాంసంచేత. అయమ్ అహమ్ = ఈ నేను, దిశామ్ = దిక్కులకు, బలిమ్ = బలిని, కరోమి = చేస్తున్నాను (చేస్తాను.)

వి. ఇక్కడ అపకారం చేసిన అర్జునాదులు ఆలంబనం. తండ్రిని చంపడం, అస్త్రాదులు ధరించడం ఉద్దీపనం. ప్రతిజ్ఞ అనుభావం. తానొక్కడే చేస్తానని చెప్పడంచేత గమ్యం అయిన గర్వం వ్యభిచారిభావం. క్రోధం స్థాయిభావం. వీటిని గుర్తించగలిగిన సహృదయుడిలో రౌద్రరసం వ్యక్తం అవుతుంది.

అవ. వీరరసానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ క్షుద్రాః సంత్రాసమేతే విజహత హరయః క్షుణ్ణశక్రేభకుమ్భా
యుష్మద్దేహేషు లజ్జాం దధతి పరమమీ సాయకా నిష్పతన్తః,

సౌమిత్రే తిష్ఠ పాత్రం త్వమసి న హి రుషాం నన్వహం మేఘనాదః
కించిద్భ్రూభఙ్గలీలానియమితజలధిం రామమన్వేషయామి. 40

వ్యా. హనుమన్నాటకంలో ఇంద్రజిత్తు మాట లివి.

క్షుద్రాః ఇతి- క్షుద్రాః = నీచులైన, హరయః = వానరులారా ! ఏతే = ఈ మీరు, సంత్రాసమ్ = భయమును, విజహత = విడవండి. క్షుణ్ణశక్రేభకుమ్భాః = నలగగొట్టబడిన ఐరావతకుంభస్థలము గల, నిష్పతన్తః = పడుచున్న, లేదా నా ధనస్సునుండి బయలువెడలుచున్న, అమీ = ఈ, సాయకాః = బాణాలు, యుష్మద్దేహేషు = మీదేహములమీద (పడుటకు), పరమ్ = అధికముగా, లజ్జామ్ = సిగ్గును, దధతి = ధరించుచున్నవి. సౌమిత్రే = లక్ష్మణా! తిష్ఠ = నిలుపుము. త్వమ్ = నీవు, రుషామ్ = నా కోపములకు, పాత్రమ్ = తగినవాడవు, న అసి = కావు. అహమ్ = నేను, మేఘనాదః నను = మేఘనాదుడను కదా ? కించిద్భ్రూభఙ్గలీలానియమిత జలధిమ్ = కొంచెము కనుబొమ్మలవిరుపు అనే విలాసచేత నియమించబడిన సముద్రము గల, రామమ్ = రాముణ్ణి, అన్వేషయామి = వెదకుచున్నాను.

వి. ఇక్కడ రాముడు ఆలంబనవిభావం. అతడు చేసిన సముద్రబంధనం ఉద్దీపనవిభావం. క్షుద్రుల ఉపేక్ష, పరాక్రమశాలియైన రామునితో స్పర్ధ అను-భావాలు. ఐరావతకుంభస్థలస్మృతి, నా బాణాలు సిగ్గుపడుతున్నాయి అనడంచేత గమ్యమైన గర్వమూ వ్యభిచారిభావాలు. ఉత్సాహం స్థాయిభావం. వీటిని గుర్తించిన సామాజికునిలో వీరరసం వ్యక్తం అవుతుంది.

వి. దానవీరం, దయావీరం, ధర్మవీరం అని మరి మూడు భేదాలు కూడా కొందరు ప్రతిపాదించారు. దానవీరులు బలికర్ణాదులు. దయావీరుడు జీమూతవాహనుడు. ధర్మవీరుడు యుధిష్ఠిరుడు. అయితే వీరరసం అనగానే యుద్ధవీరమే స్ఫురిస్తుంది కాని మిగిలినవి స్ఫురించవు. అందుచేత యుద్ధవీరం ఒకటే వీరరసం. అలా కాకపోతే ఇంకా 'పలాయనవీరం' మొదలైన భేదాలు కూడా అంగీకరించవలసి ఉంటుంది అని చాలమంది అభిప్రాయం. మమ్మటుని అభిప్రాయం అదే. అందుచేతనే అతడు సప్తమోల్లాసంలో 'శీర్ణఘ్రాణ' ఇత్యాది శ్లోకంలో కరుణవీరం ఉన్నదని చెప్పకుండా నీరసం అన్నాడు. దానాద్యుత్సాహాలు భావకోటిలోనికే చేరుతాయి.

వీరరౌద్రాలకి విభావాదులు సమములే కదా ? భేదం ఏముంది అని ప్రశ్న కలగవచ్చు. స్థాయిభావాల భేదాన్ని పట్టి వీటికి భేదం ఉంది. అంతే కాకుండా వీరరసంలో ఉత్సాహాశ్రయుడికి వివేకం ఉంటుంది. రౌద్రంలో క్రోధా

శ్రయుడికి అది ఉండదు. అందుచేతనే ఈ ఉదాహరణంలో అన్యుల్ని కాదని రాముణ్ణి మాత్రమే వెదుకుచూ వెళ్ళడంలో మేఘనాదుని విపర్యాసం కనబడుతుంది. రౌద్రోదాహరణశ్లోకంలో చంపినవాణ్ణి, చంపవద్దని అననివాణ్ణి, అనుమతించినవాణ్ణి అందర్నీ చంపేస్తాననడంలో విపరీతస్వభావం స్పష్టంగా గోచరిస్తుంది.

అవ. భయానకరసానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ గ్రీవాభఙ్గాభిరామం ముహురనుపతతి స్యన్దనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతనభయాద్భూయసా పూర్వకాయమ్,
దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వాద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి.

వ్యా. అభిజ్ఞానశాకుంతలంలో వేటకు వచ్చిన దుష్యంతుడు రథం ఎక్కి ఒక లేడిని తరుముకొని వెడుతూ అది పారిపోతున్న పద్ధతిని సారథితో చెప్పిన మాటలు. గ్రీవా ఇతి:- (ఈ లేడి), అనుపతతి = వెనుకనే వచ్చిపడుతున్న, స్యన్దనే = రథముమీద. గ్రీవాభఙ్గాభిరామమ్ = కంఠం వంచుటచేత మనోహరముగా, బద్ధ దృష్టిః = కట్టబడిన దృష్టిగలదై, శరపతనభయాత్ = బాణము పడుతుందనే భయమువలన. భూయసా = అధికమైన, పశ్చార్ధేన = (శరీరంయొక్క) వెనుక భాగంచేత, పూర్వకాయమ్ = శరీరంయొక్క ముందు భాగాన్ని, ప్రవిష్టః = ప్రవేశించినదై, అర్ధావలీఢైః = సగం నములబడిన, శ్రమవివృతముఖభ్రంశిభిః = శ్రమచేత తెరవబడిన ముఖమునుండి జారుచున్న, దర్భైః = దర్భలచేత, కీర్ణవర్త్మా = చిమ్మబడిన మార్గం కలదై, ఉదగ్రప్లుతత్వాత్ = పెద్ద పెద్ద గంతులు కలదగుటవలన, వియతి = ఆకాశంమీద, బహుతరమ్ = చాల అధికంగాను, ఉర్వ్యామ్ = నేలమీద, స్తోకమ్ = కొంచెముగాను, ప్రయాతి = వెళ్ళుచున్నది. పశ్య = చూడు.

వి. ఇక్కడ రథం లేదా రాజు ఆలంబనవిభావం. శరం కనబడడం మొదలైనవి ఉద్దీపనవిభావాలు. గ్రీవాభంగపలాయనాదులు అనుభావాలు. శంక, త్రాసం, శ్రమ మొదలైనవి వ్యభిచారులు. భయం స్థాయిభావం, దీనిని గుర్తించిన సామాజికునిలో భయానకరసం అభివ్యక్తం అవుతుంది.

అవ. బీభత్సరసానికి ఉదాహరణం చూపుతున్నాడు:-

ఉత్కృత్యోత్కృత్యకృత్తిం ప్రథమమథపృథూత్సేధభూయాంసిమాంసా
న్యంసస్ఫిక్పృష్ఠపిణ్డ్యాద్యవయవసులభాన్యుగ్రపూతీని జగ్ధ్వా,
ఆర్తః పర్యస్తనేత్రః ప్రకటితదశనః ప్రేతరఙ్కః కరఙ్కా-
దఙ్కస్థాదస్థిసంస్థం స్థపుటగతమపి క్రవ్యమవ్యగ్రమత్తి. 42

వ్యా. మాలతీమాధవంలో, శ్మశానంలో శవాన్ని పీక్కొని తింటూన్న ఒక దరిద్రపిశాచాన్ని వర్ణిస్తూన్న శ్లోకం. ఉత్కృత్య ఇతి. ఆర్తః = ఆకలిచేత పీడించ బడిన, ప్రేతరఙ్కః = ఈ దరిద్రమైన పిశాచము, పర్యస్తనేత్రః = ఇటూ అటూ త్రిప్పబడుతున్న నేత్రాలు గలదై, ప్రకటితదశనః = ప్రకటించబడిన దంతాలు కలదై, ప్రథమమ్ = ముందుగా. కృత్తిమ్ = చర్మను, ఉత్కృత్య ఉత్కృత్య= పైకి పీకి పీకి, అథ = పిమ్మట, అంసస్ఫిక్పృష్ఠపిణ్డ్యాద్యవయవసులభాని = బుజాలు, ఊరు మూలములు, కటిసంధిభాగము, పిక్కల పైభాగాలు మొదలైన అవయవాలలో సులభములైన, ఉత్సేధభూయాంసి = బలిసి ఉండడంచేత అధికంగా ఉన్న, ఉగ్రపూతీని=ఉగ్రమైన దుర్గంధం గల, మాంసాని=మాంసాలను, జగ్ధ్వా=తిని, అఙ్కస్థాత్ = ఒడిలో ఉన్న, కరఙ్కాత్ = శవంనుంచి లేదా పుఱ్ఱె నుంచి, అస్థిసంస్థమ్ = ఎముకలలో ఉన్నదీ, స్థపుటగతమపి = నిమ్నోన్నతభాగాలలో ఉన్నదీ అయిన, క్రవ్యమ్ = మాంసాన్ని, అవ్యగ్రమ్ = మెల్లమెల్లగా, అత్తి = తింటూన్నది.

వి. ఇక్కడ శవం లేదా ప్రేతరంకం ఆలంబనవిభావం. శవాన్ని చీల్చి మాంసం తినడం ఉద్దీపనవిభావం. చూచేవాడు చేసే ముక్కు మూసుకోవడం, తల త్రిప్పడం, ఉమ్మివేయడం మొదలైనవి అనుభావాలు. ఉద్వేగం మొదలైనవి వ్యభిచారిభావాలు, జుగుప్స (ఏవగింపు) స్థాయిభావం. వీటిని గుర్తించగలిగిన సామాజికునిలో బీభత్సరసం వ్యక్తం అవుతుంది.

హాస-జుగుప్సలకీ ఇతరస్థాయిభావాలకీ ఉన్న భేదాన్ని పండితరాయలు ఈ విధంగా విశదీకరించాడు. శకుంతలాదుల్ని చూడగానే దుష్యంతాదులకు కలిగే రతికి ఆలంబనం శకుంతలాదులు. ఆశ్రయం దుష్యంతాదులు. క్రోధ-ఉత్సాహ-

భయ-శోక-విస్మయ-నిర్వేదాలలో కూడా ఆలంబనం వేరుగాను, ఆశ్రయం వేరుగాను స్పష్టంగా కనబడతాయి. కాని హాసంలోను, బీభత్సంలోను విష్ణుశర్మ, ప్రేతరంకం మొదలైన ఆలంబనాలు మాత్రమే కనబడుతున్నాయి. ఆశ్రయం కనబడడం లేదు. సామాజికుడు రసానికి ఆశ్రయం కాని స్థాయిభావానికి కాదు. అందుచేత ఈ రెండు స్థలాలలో ఒక ప్రేక్షకుణ్ణి కల్పించుకొని అతడు వాటికి ఆశ్రయం అని చెప్పుకోవాలి. లేదా స్వకాంతాపర్ణసం విననందుచేత రసానుభూతి కలిగినట్లు స్థాయ్యాశ్రయం మరొకరు ఎవరూ లేకపోయినా సామాజికునికి ప్రత్యక్షంగా రసానుభూతి కలుగుతుంది అని చెప్పాలి.

అవ. అద్భుతరసానికి ఉదాహరణం చూపుతున్నాడు:-

శ్లో. చిత్రం మహానేష బతావతారః
క్వ కాన్తిరేషాభినవైవ భఙ్గీః,
లోకోత్తరం ధైర్యమహో ప్రభావః
కాప్యాకృతిర్నూతన ఏష సర్గః. 43

వ్యా. చిత్రమ్ ఇతి- వామనుణ్ణి చూచి బలిచక్రవర్తి అంటూన్న మాటలు- మహాన్ = మహాత్ముడైన, ఏషః = ఇతడు, చిత్రమ్ = లోకోత్తరమైన వస్తువు. బత = ఎంత సంతోషము ! అవతారః = అవతారమూర్తి. ఏషా = ఈ, కాన్తిః = కాంతి, క్వ = ఎక్కడ ఉన్నది ? అభినవైవ = నూతనమైన, భఙ్గీః = పద్ధతి. ధైర్యమ్ = ధైర్యము, లోకోత్తరమ్ = లోకములో శ్రేష్ఠమైనది ప్రభావః = ప్రభావము, అహో = లోకోత్తరమైనది. ఆకృతిః = ఆకారము, కాపి = చెప్పశక్యము కానిది ఏషః = ఇది, నూతనః = నూతనమైన, సర్గః = సృష్టి.

వి. 'చిత్రమ్', 'బత', 'అహో' అన్న పదాలకి "ఏమి ఆశ్చర్యము"అనే అర్థం ప్రసిద్ధం. కాని ఆ అర్థం చెప్పిన పక్షంలో స్థాయిభావమైన విస్మయం వాచ్యం అయిపోతుంది. అది దోషం. అందుచేత పై విధంగా అర్థాలు చెప్పబడ్డాయి.

ఇక్కడ వామనుడు ఆలంబనం. కాంతి, గుణాతిశయాదులు ఉద్దీపనవిభావాలు. స్తవం మొదలైనవి అనుభావాలు. మతి-ధృతి-హర్షాదులు వ్యభిచారిభావాలు. విస్మయం స్థాయిభావం. వీటిని అన్నింటినీ గుర్తించిన సామాజికునిలో అద్భుతరసం వ్యక్తం అవుతుంది.

వృ. ఏషాం స్థాయిభావానాహ-

కా. రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా,
జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః.

వృ. స్పష్టమ్-

వ్యా. ఏషామితి- వీటికి స్థాయిభావాలను చెపుతున్నాడు- "రతి, హాసం, శోకం, క్రోధం, ఉత్సాహం, భయం, జుగుప్స, విస్మయం శృంగారాదులకు క్రమంగా స్థాయిభావాలుగా చెప్పబడినవి". "కారికార్థం స్పష్టం"

వి. వీటికి రసగంగాధరంలో ఇచ్చిన లక్షణాలు క్రింద చూపబడుతున్నాయి.

1) "స్త్రీపుంసయోరన్యోన్యాలమ్బనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషః రతిః స్థాయిభావః." "స్త్రీపురుషులలో ఉండే, పరస్పరం ఆలంబనంగా గల ప్రేమ అనే ఒక విధమైన చిత్తవృత్తి రతి అనే స్థాయిభావం". స్త్రీచిత్తంలో కలిగిన ప్రేమకి (రతికి) పురుషుడు, పురుషుని చిత్తంలో కలిగిన రతికి స్త్రీ ఆలంబనం.

2) "వాగఙ్గాదివికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః". "మాటలు, అవయవాలు మొదలైనవాటిలో ఉన్న వికారాన్ని చూడడంవలన పుట్టిన వికాసం అనే చిత్తవృత్తివిశేషం హాసం"

3) "పుత్రాదివియోగమరణాదిజన్మా వైక్లబ్యాఖ్యశ్చిత్తవృత్తివిశేషః శోకః". "పుత్రాదుల వియోగం, మరణం మొదలైనవాటివల్ల కలిగిన వ్యాకులత్వం అనే ఒకానొక చిత్తవృత్తి శోకం."

4. "గురుబన్ధువధాదిపరమాపరాధజన్మా ప్రజ్వలనాఖ్యః క్రోధః". "గురువులు బంధువులు మొదలైనవాళ్ళ వధాదులైన పెద్ద అపరాధాలవలన పుట్టిన, మండిపడుట అనే చిత్తవృత్తివిశేషం క్రోధం".

5) "పరపరాక్రమదానాదిస్మృతిజన్మా ఔన్నత్యాఖ్య ఉత్సాహః". "పరుల పరాక్రమం, దానం మొదలైనవాటిని స్మరించడంచేత కలిగిన ఔన్నత్యం అనే చిత్తవృత్తివిశేషం ఉత్సాహం".

6) "వ్యాఘ్రదర్శనాదిజన్మా పరమానర్థవిషయక వైక్లబ్యాఖ్యః సః భయమ్." "పెద్దపులి కనబడడం మొదలైనవాటివలన కలిగిన, గొప్ప అనర్థం కలగబోతుంది అని అనుకొనడంచేత వైక్లబ్యం(మనస్సుకు నిలకడ లేకపోవడం) అనే పేరు గల చిత్తవృత్తివిశేషం భయం".

7) "కదర్యవస్తువిలోకనజన్మా విచికిత్సాఖ్యః చిత్తవృత్తివిశేషో జుగుప్సా". "చెడ్డ వస్తువులను చూడడంచేత పుట్టిన విచికిత్స అనే చిత్తవృత్తి జుగుప్స."

8) "అలౌకికవస్తుదర్శనాదిజన్మా ఆశ్చర్యాఖ్యో విస్మయః"."సామాన్యంగా లోకంలో కనబడని వస్తువులు చూడడం మొదలైన దానివల్ల పుట్టిన, ఆశ్చర్యం అనే పేరుగల చిత్తవృత్తివిశేషం విస్మయం".

వృ. వ్యభిచారిణో బ్రూతే-

కా. నిర్వేదగ్లానిశఙ్కాఖ్యాస్తథాసూయామదశ్రమాః,
ఆలస్యం చైవ దైన్యం చ చిన్తా మోహః స్మృతిర్ధృతిః 31
వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా,
గర్వో విషాద ఔత్సుక్యం నిద్రాపస్మార ఏవ చ. 32
సుప్తం ప్రబోధోఽమర్షశ్చాప్యవహిత్థముథోగ్రతా,
మతిర్వ్యాధిస్తథోన్మాదస్తథా మరణమేవ చ. 33
త్రాసశ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః,
త్రయస్త్రింశదమీ భావాః సమాఖ్యాతాస్తు నామతః. 34

వ్యా. వ్యభిచారులను చెప్పుచున్నాడు-నిర్వేదం మొదలు వితర్కం వరకు ఉన్న ఈ భావాలు వ్యభిచారిభావాలు. ఈ ముప్పైమూడు భావాల పేర్లు మాత్రం (ఇక్కడ) చెప్పబడినవి.

వి. వీటి అన్నింటికీ లక్షణోదాహరణాలు సాహిత్య దర్పణరసగంగాధరాదులలో చెప్పబడి ఉన్నాయి. బాలబోధినీవ్యాఖ్యలో ఉద్ధృతాలైన లక్షణాలు మాత్రం ఈ క్రింద చూపబడుతున్నాయి. ఉదాహరణలు ఇతరగ్రంథాలలో చూచుకొనవలెను.

1. "తత్త్వజ్ఞానాపదీర్ష్యాదేర్నిర్వేదః స్వావమాననమ్,
దైన్యచిన్తాశ్రునిఃశ్వాసవైవర్ణ్యోచ్ఛ్వసితాదికృత్."

తత్త్వజ్ఞానం, ఆపదలు, ఈర్ష్య మొదలైన వాటివల్ల తనను తానే నిందించుకోవడం 'నిర్వేదం'. దీనివల్ల దైన్యం, చింత, కన్నీళ్ళు, నిట్టూర్పులు, ముఖం రంగు మారిపోవడం. గట్టిగా ఊపిరిపీల్చడం మొదలైనవి కలుగుతాయి.

2. "రత్యాయాసమనస్తాపక్షుత్పిపాసాదిసంభవా,
గ్లానిర్నిష్ప్రాణతా కమ్పకార్యానుత్సాహితాదికృత్".

రతి, ఆయాసం లేదా రతివల్ల కలిగిన ఆయాసం, మనస్తాపం, ఆకలి, దప్పిక మొదలైనవాటివల్ల పుట్టిన నిష్ప్రాణత్వం(ప్రాణశక్తి తగ్గిపోవడం)'గ్లాని'.ఈ గ్లాని శరీరకంపాన్ని, ఏ పనులు చేయడానికి ఉత్సాహం లేకపోవడాన్ని కలగచేస్తుంది

3. "పరక్రౌర్యాత్మదోషాద్యైః శఙ్కానర్థస్య చిన్తనమ్,
వైవర్ణ్యకమ్పవైస్వర్యపార్శ్వాలోకాస్యశోషకృత్".

పరుల క్రౌర్యము తన దోషాలు మొదలైనవాటిచేత, ఏమి అనర్థం రానున్నదో అనే ఆలోచన 'శంక'. దీనివల్ల రంగు మారిపోవడం. వణకు, స్వరంలో మార్పు, ప్రక్కలకి చూడడం, నోరు ఎండిపోవడం మొదలైనవి కలుగుతాయి.

4. "అసూయాన్యగుణర్ద్ధీనామౌద్ధత్యాదసహిష్ణుతా,
దోషేక్షణభ్రూవిభేదావజ్ఞోపహసితాదికృత్".

ఔద్ధత్యంవల్ల ఇతరుల గుణాలను, సమృద్ధిని సహించలేకపోవడం 'అసూయ'. దీనివల్ల ఇతరుల దోషాలు ఎంచడం, కనుబొమ్మలు విరవడం, అనాదరం, పరిహాసం మొదలైనవి చేస్తారు.

5. "సంమోహానన్దసంభేదః స్ఖలదఙ్గవచోగతిః,
మధుపానాదిజో జ్ఞేయో మదో వివిధభావకృత్".

మద్యపానాదులవలన కలిగిన మోహ-ఆనందాల కలయిక 'మదం'. దీనివల్ల అవయవాలు, మాటలు తొట్రుపడతాయి. అనేకవిధాలైన వికారాలు కలుగుతాయి.

6. "ఖేదో రత్యధ్వగత్యాదేః శ్వాసనిద్రాదికృచ్ఛ్రమః,
శ్రమగ్లాన్యోర్విభేదం తు చక్రే కారణకార్యతా."

రతి, దూరం నడవడం మొదలైనవాటివల్ల కలిగిన ఖేదం 'శ్రమ'. దీనివల్ల శ్వాస, నిద్ర మొదలైనవి కలుగుతాయి. శ్రమకీ గ్లానికీ భేదం ఏమిటనగా-శ్రమ కారణం; గ్లాని కార్యం. అనగా శ్రమవల్ల గ్లాని కలుగుతుంది.

"శ్రమస్యాతిశయావస్థామథవా గ్లానిమూచిరే
బలస్యాపచయో గ్లానిరాధివ్యాధిప్రకర్షభూః".

శ్రమయే అత్యధికం అవుతే అది గ్లాని అని కొందరు అన్నారు. మనోవ్యథ గాని, వ్యాధి గాని ఎక్కువ అయితే కలిగిన దుర్బలత్వం 'గ్లాని',

7. "ఆలస్యం శ్రమగర్భాద్యైః పురుషార్థేష్వనాదరః",

శ్రమ,గర్భభారం మొదలైనవాటిచేత భోగ్యవస్తువులయందు, లేదా మనిషి చేయవలసిన పనులయందు అనాదరం 'ఆలస్యం',

8. "దౌర్గత్యాదేరనౌజస్యం దైన్యం మలినతాదికృత్".

దారిద్ర్యం మొదలైనవాటివల్ల కలిగిన తేజోవిహీనత్వం దైన్యం. (దానివల్ల (శరీరవేషాదులలో) మాలిన్యం మొదలైనవి కలుగుతాయి.

9. "ధ్యానం చిన్తా హితానాప్తేః శూన్యతాశ్వాసతాపకృత్",
"ప్రయత్నపూర్వికాన్వేష్యస్మృతిశ్చిన్తేతి కేచన".

కోరిన హితం లభించకపోవడంచేత ఆలోచనలో పడి ఉండడం 'చింత'. దీనివల్ల అంతా శూన్యంగా కనబడుతుంది. శ్వాస, తాపం కలుగుతాయి. వెదరతగిన ఏదో ఒకదానిని గూర్చి ప్రయత్నపూర్వకంగా స్మరించడం అనగా జ్ఞాపకం చేసుకోవడానికి ఆలోచించడం 'చింత', అని మరికొందరన్నారు.

10. "మోహో విచిత్తతా భీతిదుఃఖావేగానుచిన్తనైః
ఘూర్ణనాజ్ఞానపతనభ్రమణాదర్శనాదికృత్."

భయం, దుఃఖం, తీవ్రమైన ఆందోళన, దీర్ఘాలోచన మొదలైనవాటిచేత

చిత్తం పనిచేయకుండా అయిపోవడం 'మోహం'. దీనివల్ల కళ్లు తిరగడం, అజ్ఞానం, పడిపోవడం, ఒళ్ళు తిరగడం, కళ్ళు కనబడకపోవడం మొదలైనవి కలుగుతాయి.

11. "సదృశజ్ఞానచిన్తాద్యైర్భ్రూసమున్నమనాదికృత్,
స్మృతిః పూర్వానుభూతార్థవిషయం జ్ఞానముచ్యతే."

పోలికలు ఉన్నదాని జ్ఞానం, ఆలోచన మొదలైనవాటిచేత కలిగే, పూర్వం ఎప్పుడో తాను అనుభవించిన (తెలుసుకొని ఉన్న) విషయాన్ని గూర్చిన జ్ఞానం 'స్మృతి'. దీనివలన కనుబొమ్మలు ఎత్తడం మొదలైనవి కలుగుతాయి.

12. "అభీష్టార్థస్య సంప్రాప్తౌ స్పృహాపర్యాప్తతాధృతిః,
సౌహిత్యవదనోల్లాస సహాసవచనాదికృత్".

కోరిన విషయం లభించడంతో కోరిక లేకపోవడం ధృతి. దీనివల్ల స్వస్థత, ముఖంలో మెరుపు, నవ్వుతూ మాటలాడడం మొదలైనవి కలుగుతాయి.

13. "దురాచారాదిభిర్వ్రీడా ధార్ష్ట్యాభావోఽభిధీయతే,
వస్త్రాఙ్గులీయకస్పర్శభూలేఖాధోముఖాదికృత్".

చెడ్డ పనులు చేయడం వంటి వాటివల్ల మనస్సులో సంకోచం 'వ్రీడ'. దీనివల్ల కట్టుకొన్న బట్ట కొస నలపడం, ఉంగరం తిప్పడం, నేలమీద కాలి బొటనవేలితో గీయడం, తల వంచడం మొదలైనవి కలుగుతాయి.

14. "మాత్సర్యద్వేషరాగాదేశ్చాపల్యం త్వనవస్థితిః
తత్ర భర్త్సనపారుష్యస్వచ్ఛన్దాచరణాదయః",

మాత్సర్యం, ద్వేషం, అనురాగం మొదలైనవాటివల్ల ఆలోచించకుండా పనులుచేయడం 'చాపల్యం'. దీనివల్ల జడిపించడం, పరుషత్వం, ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించడం మొదలైనవి జరుగుతాయి.

15. "మనఃప్రసాదో లాభాదేర్హర్షోఽశ్రుస్వేదగద్గదాః".

కోరినది లభించడం, స్తుతి మొదలైనవాటివల్ల మనస్సు ప్రసన్నం అవడం 'హర్షం'. దీనివల్ల కన్నీళ్ళు, చెమట, గద్గదస్వరం మొదలైనవి కలుగుతాయి.

16. "ఆవేగో రాజవిద్రావరత్యాదేః సంభ్రమో మతః,
తత్ర విస్మరణం స్తమ్భః స్వేదః కమ్పః స్ఖలద్గతిః".

రాజాద్యాగమనం, దేశవిప్లవం, రతి మొదలైనవాటివల్ల కలిగిన తొందర పాటు 'ఆవేగం'. దీనివల్ల మరుపు, కొయ్యబారిపోవడం, చెమట, వణకు, నడకలో తొట్రుబాటు కలుగుతాయి.

17. "అప్రతిపత్తిర్జడతా స్యాదిష్టానిష్టదర్శనశ్రుతిభిః,
అనిమిషనయననిరీక్షణతూష్ణీంభావాదయస్తత్ర".

ఇష్టమైనదానిని లేదా అనిష్టమైనదానిని చూడడంచేత గాని, వాటిని గూర్చి వినడంచేత గాని కలిగిన ఏమి చెయ్యాలో తెలియని స్థితి 'జడత'. దీనివల్ల రెప్ప పాటు వేయకుండా చూడటం, మాటలాడకుండా ఉండిపోవడం మొదలయినవి కలుగుతాయి.

18. "గర్వోఽభిజనలావణ్యధనైశ్వర్యాదిభిర్మదః.
సవిలాసాఙ్గవీక్షావినయావజ్ఞాదికృత్తు సః".

ఉత్తమబంధువర్గం, సౌందర్యం, ధనం, ఐశ్వర్యం (అధికారం) మొదలైన వాటి వల్ల కలిగిన మదం 'గర్వం'. దీనివల్ల విలాసపూర్వకంగా తన అవయవాలు చూసుకోవడం, లేదా విలాసపూర్వకాలైన శరీరచేష్టలు, చూపులు, పొగరుబోతు తనం ఇతరుల విషయంలో అనాదరం కలుగుతాయి.

19. "ప్రారబ్ధకార్యాసిద్ధ్యాదేర్విషాదః సత్త్వసంక్షయః
నిఃశ్వాసోచ్ఛ్వాసహృత్తాపసహాయాన్వేషణాదికృత్"

ప్రారంభించిన పని సిద్ధించకపోవడంవంటి కారణాలవల్ల ఉత్సాహం క్షీణించడం 'విషాదం'. దీనివల్ల నిట్టూర్పులు, ఎగుఊర్పులు, మనస్తాపం కలుగుతాయి. ఇది సాహాయ్యం చేసే వారికోసం అన్వేషణం చేయిస్తుంది.

20. "ఔత్సుక్యం వాఞ్ఛితప్రాప్తౌ కాలక్షేపాసహిష్ణుతా
చిత్తతాపత్వరాస్వేదదీర్ఘనిఃశ్వసితాదికృత్".

కోరినది లభించడంలో ఏమాత్రమూ ఆలస్యాన్ని సహించకపోవడం

'ఔత్సుక్యం'. దీనివలన మనస్తాపం, తొందర, చెమట, దీర్ఘనిఃశ్వాసాదులు కలుగుతాయి.

21. "నిద్రా వ్యాపారవైముఖ్యమిన్ద్రియాణాం శ్రమాదిభిః
తత్ర జృమ్భాఙ్గభఙ్గాక్షిమీలనోచ్ఛ్వసితాదయః".

శ్రమాదులచేత ఇంద్రియాలు తమ పనులు చేయడానికి విముఖంగా ఉండడం 'నిద్ర'. దీనివల్ల ఆవలింతలు, ఒళ్ళు విరుపులు, కళ్ళు మూతపడడం, దీర్ఘంగా శ్వాస పీల్చడం మొదలైనవి కలుగుతాయి.

22. "మనఃక్షేపస్త్వపస్మారో గ్రహావేశాదిసంభవః"

గ్రహావేశాదులవల్ల మనస్సు విక్షిప్తమై సరిగా పని చేయకపోవడం 'అపస్మారం'.

23. "సుప్తం నిద్రాముపేతస్య విషయానుభవస్తు యః
కోపావేగభయగ్లానిసుఖదుఃఖాదికారకమ్".

నిద్ర వచ్చినవాడు విషయాలు చూడడం, అనగా స్వప్నం, 'సుప్తం'. ఇది కోపం, ఆవేగం, భయం, గ్లాని, సుఖం, దుఃఖం మొదలైనవాటిని కలగజేస్తుంది.

24. "నిద్రాపగమహేతుభ్యః ప్రబోధశ్చేతనాగమః
జృమ్భాఙ్గభఙ్గనయనమీలనాఙ్గావలోకకృత్".

నిద్రపోవడానికి హేతువులైన శబ్దాదులవల్ల మళ్ళీచైతన్యం (మెలకువ) రావడం 'ప్రబోధం'. ఇది ఆవలింతలు, ఒళ్ళు విరుపులు, కళ్ళు మూసుకోవడం, అవయవాలు చూసుకోవడం మొదలైనవాటిని కలగచేస్తుంది.

25. "అధిక్షేపాపమానాదేరమర్షోఽభినివిష్టతా
తత్ర స్వేదశిరఃకమ్పనేత్రరాగాఙ్గవిక్రియాః".

ఎవరైనా ఆక్షేపించడంచేత, అవమానించడంచేత, అలాంటి ఇతరకారణాల చేత పట్టుదలతో కూడిన స్థిరమైన కోపం 'అమర్షం'. దీనివల్ల చెమట, శిరస్సు కదల్చడం, కళ్ళు ఎఱ్ఱబడడం, అవయవవికారాలు కలుగుతాయి.

26. "అవహిత్థం తు లజ్జాద్యైర్హర్షాద్యాకారగోపనమ్
వ్యాపారాన్తరసక్త్యవదనానమనాదికృత్".

లజ్జ మొదలైన వాటిచేత, మనస్సులో ఉన్న హర్షం మొదలైనవాటిని కప్పిపుచ్చడం 'అవహిత్థం'. దీనివల్ల ఏదో మరొక పనిలో ఉన్నట్లు ఉండడం, తల వంచుకోవడం మొదలైనవి కలుగుతాయి.

27. "ద్విష్టేఽపరాధదౌర్ముఖ్యచౌర్యైశ్చణ్డత్వముగ్రతా,
అత్ర స్వేదశిరఃకమ్పతాడనాతర్జనాదయః".

అపరాధం, ప్రతికూలంగా ఉండడం, దొంగతనం చేయడం మొదలైన కారణాలచేత ద్వేషపాత్రుడైనవాని విషయంలో తీవ్రంగా ఉండడం 'ఉగ్రత్వం'. దీనివల్ల చెమట, తల కంపింపచేయడం, కొట్టడం, జళిపించడం మొదలైనవి కలుగుతాయి.

28. "శాస్త్రోపదేశమన్త్రాద్యైరర్థనిర్ధారణం మతిః
స్మేరతా ధృతిసంతోషౌ బహుమానశ్చ తద్భవాః".

శాస్త్రజ్ఞానం, పెద్దల ఉపదేశం, ఇతరులతో ఆలోచించడం మొదలైనవాటి చేత విషయాన్ని నిర్ధారణచేయడం 'మతి'. దీనివల్ల చిరునవ్వు, ధృతి (ధైర్యం), సంతోషం, బహుమానము కలుగుతాయి.

29. "విరహాదేర్మనస్తాపో వ్యాధిర్దుస్స్వాస్థ్యతాదికృత్"

విరహాదులవల్ల కలిగిన మనస్తాపం 'వ్యాధి'. దానివల్ల శరీరంలో అస్వాస్థ్యం కలుగుతుంది.

30. "ఉత్కణ్ఠాహర్షశోకాదేరున్మాదశ్చిత్తవిప్లవః,
తస్మిన్నస్థానరుదితగీతహాసాసితాదాదయః"

ఉత్కంఠ, హర్షం, శోకం మొదలైనవాటివలన కలిగిన చిత్తవైకల్యం 'ఉన్మాదం'. దీనివల్ల అనవసరంగా ఏడవడం, పాడడం, నవ్వడం, కూర్చుండి పోవడం మొదలైనవి కలుగుతాయి.

31\. జీవస్యోద్గమనారమ్భో మరణం పరికీర్తితమ్,
స మోహేన్ద్రియసంగ్లానిగాత్రవిక్షేపణాదికృత్".

జీవుడు (ప్రాణాలు) దేహాన్ని విడచి వెళ్ళడానికి ప్రారంభం మరణం. ఇది మోహం, ఇంద్రియగ్లాని, కాళ్ళు చేతులు కొట్టుకోవడం మొదలైనవాటిని కలిగిస్తుంది.

32\. "ఔత్పాతికైర్మనఃక్షోభస్త్రాసః కమ్పాదికారకః"

ఉత్పాతానికి (ప్రకృతివికారానికి) సంబంధించిన ఉరుములు మొదలైన వాటిచేత మనస్సుకు క్షోభ 'త్రాసం'. ఇది వణకు మొదలైన వాటిని కలిగిస్తుంది.

33\. "ఊహో వితర్కః సన్దేహే భ్రూశిరోఙ్గులినర్తకః"

సందేహం కలిగినప్పుడు ఇట్లా అట్లా అని ఊహ 'వితర్కం'. దీనివల్ల కనుబొమ్మలు ఎగరవేయడం, శిరస్సు కంపింపచేయడం, వ్రేళ్ళు కదపడం మొదలైనవి కలుగుతాయి.

వృ. నిర్వేదస్యామఙ్గలప్రాయస్య ప్రథమమనుపాదేయత్వేఽప్యుపాదానం వ్యభిచారిత్వేఽపి స్థాయితాభిధానార్థమ్. తేన -

కా. నిర్వేదస్థాయిభావోఽస్తి శాన్తోఽపి నవమో రసః.
యథా-

శ్లో॥ అహౌ వా హారే వా కుసుమశయనే వా దృషది వా
మణౌ వా లోష్ఠే వా బలవతి రిపౌ వా సుహృది వా,
తృణే వా స్త్రైణే వా మమ సమదృశో యాన్తి దివసాః
క్వచిత్పుణ్యేఽరణ్యే శివ శివ శివేతి ప్రలపతః. 44

వ్యా. నిర్వేదం అనగా ప్రతీదీ హేయమే అనే బుద్ధిచేత కలిగిన వైరాగ్యం. అందుచేత అది అమంగలం వంటిది. ముప్పైమూడు వ్యభిచారిభావాలను చెప్పేటప్పుడు అమంగళకరమైన నిర్వేదంతో ప్రారంభించడం అయుక్తమే అయినా, అది వ్యభిచారిభావం అవడమే కాకుండా స్థాయిభావం కూడా అవుతుంది అని సూచించడం కోసం అందుచేత-నిర్వేదేతి:- నిర్వేదస్థాయిభావః=నిర్వేదం స్థాయి

భావంగా గల, నవమః రసః = తొమ్మిదవ రసమైన, శాన్తః అపి = శాంతం కూడా, అస్తి = ఉన్నది.

వి. నిర్వేదం తత్త్వజ్ఞాన - ఆపదీర్ష్యాదులవల్ల కలుగుతుంది అని వెనుక చూచి ఉన్నాము. తత్త్వజ్ఞానంవల్ల కలిగే నిర్వేదం శాంతరసానికి స్థాయిభావం అని అర్థం.

భరతుడు రసాన్ని దృశ్యకావ్యాలను దృష్టిలో ఉంచుకొని ప్రతిపాదించాడు. దృశ్యకావ్యప్రయోగం సంగీతవాద్యాదులతో కూడిన చతుర్విధాభినయం ద్వారా చేయబడుతుంది. శాంతం సకలవ్యాపారోపశమరూపమైనది. అందుచేత దృశ్య కావ్యాలలో శాంతానికి అవకాశం లేదు అనే ఉద్దేశ్యంతో 29వ కారికలో 'నాట్యంలో రసాలు ఎనిమిదిమాత్రమే ఉంటాయి' అని చెప్పబడింది. నాట్యంలో (దృశ్య కావ్యాలలో) శాంతరసానికి అవకాశం లేకపోయినా శ్రవ్యకావ్యంలో ఉండవచ్చు ననే ఉద్దేశ్యంతో మమ్మటుడు ఇక్కడ దీనిని నవమరసంగా ప్రదిపాదించాడు. నాట్యశాస్త్రంలో శాంతరసంతో తొమ్మిది రసాలు చెప్పే పాఠం ఒకటి, ఎనిమిది రసాలు మాత్రమే చెప్పే పాఠం ఒకటీ ఉన్నాయి. రెండవ పాఠమే భరతునికి సంమతమైనది అన్నట్లు కనబడుతుంది. కాని నాట్యశాస్త్రవ్యాఖ్యానమైన అభినవ భారతిలో అభినవగుప్తుడు మొదటి పాఠాన్నే సమర్థిస్తూ అన్ని రసాలకీ శాంత రసమే ప్రకృతిరసం అనీ, అది చాలా ప్రధానమైన దనీ ప్రతిపాదించాడు. అదొక పెద్ద చర్చ. అదంతా ఇక్కడ అనావశ్యకం. మమ్మటుని అభిప్రాయం ప్రకారం మాత్రం నాట్యంలో ఎనిమిది రసాలకే స్థానం ఉంది; శ్రవ్యకావ్యాలలో శాంతరసం ఉంటే ఉండవచ్చు అనే విషయం స్పష్టం.

వ్యా. ఎట్లనగా-అహౌ ఇతి:- అహౌ వా = సర్పమునందైనా, హారే వా = ముత్యాలహారమునందైనా, కుసుమశయనే వా = పుష్పశయనమునందైనా, దృషది వా = శిలయందైనా, మణౌ వా = మణియందైనా, లోష్టే వా = మట్టిబెడ్డయందైనా, బలవతి = బలవంతుడైన, రిపౌ వా = శత్రువునందైనా, సుహృది వా = మిత్రుని యందైనా, తృణే వా = గడ్డిపరకయందైనా, స్త్రైణే వా = స్త్రీ సముదాయమునందైనా, సమదృశః = సమానమైన దృష్టి గల శివశివశివేతి = 'శివా శివా శివా' అని, ప్రలపతః = ఉచ్చరిస్తూన్న, మమ = నాకు, పుణ్యే = పుణ్యమైన, అరణ్యే = అరణ్యము

నందుగాని, క్వచిత్ = అపవిత్రమైన మరెక్కడనైనా గాని, దివసాః = రోజులు, యాన్తి = గడచుచున్నవి.

వి. ఇక్కడ మిథ్యగా భావించబడుతూన్న జగత్తు ఆలంబనం. తపోవనాదికం ఉద్దీపనం. సర్పహారాదులను సమంగా చూడడం అనుభావం. మతి-ధృతి-హర్షాలు వ్యభిచారిభావాలు, నిర్వేదం స్థాయిభావం. వీటిని గుర్తించిన వానియందు శాంతరసం నిష్పన్నం అవుతుంది.

కా. రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాఞ్జితః,
భావః ప్రోక్తః 35

వృ. ఆదిశబ్దాన్మునిగురునృపపుత్రాదివిషయా,
కాన్తావిషయా తు వ్యక్తా శృఙ్గారః.
ఉదాహరణమ్-

శ్లో. కణ్ఠకోణవినివిష్టమీశ తే కాలకూటమపి మే మహామృతమ్,
అప్యుపాత్తమమృతం భవద్వపుర్భేదవృత్తి యది మే న రోచతే.

శ్లో. హరత్యఘం సంప్రతి హేతురేష్యతః
శుభస్య పూర్వాచరితైః కృతం శుభైః,
శరీరభాజాం భవదీయదర్శనం
వ్యనక్తి కాలత్రితయేఽపి యోగ్యతామ్. 46

వృ. ఏవమన్యదప్యుదాహార్యమ్.

వ్యా. రతిరితి :- దేవాదివిషయా = దేవతాదులు విషయముగా (ఆలంబనముగా) గల, రతిః = రతి, తథా = మరియు, అఞ్జితః = వ్యంజించబడిన, వ్యభిచారీ = వ్యభిచారిభావమూ, భావః = భావముగా, ప్రోక్తః = చెప్పబడినది

'ఆది' శబ్దంవల్ల మునులు, గురువు, రాజుపుత్రుడు మొదలగువారు విషయముగా గలది కూడ గ్రహించబడుతుంది. కాన్తావిషయకమైన రతి మాత్రమే వ్యంజింపబడినట్లయితే శృంగారరసం అవుతుంది.

వి. రతి అనగా ప్రేమ. దేవతాదులవిషయంలో కూడ ప్రేమ ఉండవచ్చు. దేవతలు, మునులు, పెద్దవాళ్ళు మొదలైనవాళ్ళమీద ఉన్న రతి 'భక్తి'. పుత్రాదుల

మీద రతి 'వాత్సల్యం'. మిత్రునిమీద రతి 'స్నేహం'. ఈ విధంగా ఆలంబన భేదాన్ని పట్టి రతికే వేరు వేరు పేర్లు. స్త్రీ - పురుష విషయకరతికే రసత్వస్థితిని పొందగలిగిన సామర్థ్యం ఉంది గాని దేవాదివిషయకరతికి లేదు. అందుచేత అది కేవలం భావంగానే పరిగణింపబడుతుంది అని అభిప్రాయం. స్త్రీపురుష విషయకరతి కూడా విభావానుభావవ్యభిచారుల ద్వారా చక్కగా పోషించినప్పుడే రసం అవుతుంది. సరిగా పోషించకపోతే భావంగానే ఉండిపోతుంది. ఇదే కాదు; మిగిలిన ఎనిమిది స్థాయిభావాలు కూడా సరిగా పోషించనిచో రసస్థితిని పొందవు, భావాలుగానే పరిగణింపబడతాయి

దేవవిషయకరతికి ఉదాహరణం—

వ్యా. కణ్ఠ ఇతి:- ఈశ = పరమేశ్వరా ! తే = నీయొక్క, కణ్ఠకోణవిని విష్టమ్ = కంఠం మూలలో ఉంచబడిన, కాలకూటమపి = కాలకూటం కూడ, మే = నాకు, మహామృతమ్ = గొప్ప అమృతము. ఉపాత్తమపి = గ్రహించబడిన దైనా, అమృతమ్ = అమృతం, భవద్వపుర్భేదవృత్తి యది = నీ శరీరంకంటె వేరుగా ఉన్నట్లయితే, మే = నాకు, న రోచతే = ఇష్టం కాదు.

వి. ఇది కాశ్మీరదేశీయుడైన శ్రీమదుత్పలాచార్యుడు రచించిన పరమేశ్వర స్తోత్రావళిలోని పదమూడవస్తోత్రంలోని శ్లోకం ఇక్కడ మహాదేవుడు ఆలంబనం. అతని అవ్యాహతమైన ఐశ్వర్యం ఉద్దీపనం. స్తుతి అనుభావం. ధృతి మాహాత్మ్య స్మరణాదులు వ్యభిచారిభావాలు. వీటిని పట్టి స్తుతి చేస్తున్నవానిలో రతి ఉన్నట్లుగా తెలుసుకొన్న పాఠకులలో రతిభావాభివ్యక్తి కలుగుతుంది.

వ్యా. మునివిషయకమైన రతికి ఉదాహరణం-హరతీతి:- శిశుపాలవధంలో శ్రీకృష్ణుడు నారదునితో అంటూన్న మాట ఇది. పూర్వాచరితైః = పూర్వం ఆచరించబడిన, శుభైః = పుణ్యాలచేత, కృతమ్ = చేయబడిన, భవదీయదర్శనమ్ = నీ దర్శనం, సంప్రతి = ఇప్పుడు (వర్తమానకాలంలో), అఘమ్ = పాపాన్ని, హరతి = హరిస్తుంది. ఏష్యతః = రాబోయే, శుభస్య = శుభానికి, హేతుః = హేతువు. శరీరభాజామ్ = ప్రాణులకు. కాలత్రితయేఽపి = మూడు కాలాలలోనూ కూడ, యోగ్యతామ్ = యోగ్యత్వాన్ని, వ్యనక్తి = సూచిస్తున్నది.

వి. ఇక్కడ ముని ఆలంబనం. దర్శనయోగ్యతావ్యంజనం ఉద్దీపనం.

ఈ విధమైన మాటలే అనుభావం. వాటివల్ల వ్యంజింపబడే హర్షం వ్యభిచారిభావం. మునివిషయకమైన ఈ శ్రీకృష్ణరతిని గుర్తించిన పాఠకునిలో భావనిష్పత్తి కలుగుతుంది.

వ్యా. ఇతరమైనదానిని కూడ, అనగా గురు-నృప-పుత్రాది విషయకరతిని కూడా, ఈ విధంగానే ఉదాహరణల ద్వారా తెలుసుకొనవచ్చు.

వృ. అజ్ఞాతవ్యభిచారీ యథా-

శ్లో. జానే కోపపరాఙ్ముఖీ ప్రియతమా స్వప్నే౽ద్య దృష్టా మయా
మా మాం సంస్పృశ పాణినేతి రుదతీ గన్తుం ప్రవృత్తా పురః,
నో యావత్పరిరభ్య చాటుశతకైరాశ్వాసయామి ప్రియాం
భ్రాతస్తావదహం శఠేన విధినా నిద్రాదరిద్రీకృతః, 47

వృ. అత్ర విధిం ప్రత్యసూయా.

వ్యా. జానే ఇతి:- వియోగంతో బాధపడుతున్నవా డొకడు తన మిత్రునితో పలుకుతున్న మాటలు. భ్రాతః = ఓ! సోదరుడా! అద్య = ఈనాడు, మయా = నాచేత, కోపపరాఙ్ముఖీ = కోపంచేత పరాఙ్ముఖురాలైన (ముఖం అటువైపు తిప్పుకొన్న), ప్రియతమా = ప్రియతమ, స్వప్నే = స్వప్నమునందు, దృష్టా = చూడబడినది. మామ్ = నన్ను, పాణినా = హస్తముచేత, మా సంస్పృశ = స్పృశించకుము, ఇతి = అని, రుదతీ = ఏడ్చుచున్నదై, పురః = ముందు, గన్తుమ్ = వెళ్ళుటకు, ప్రవృత్తా = ప్రవర్తించింది. ప్రియామ్ = ఆ ప్రియురాలిని, పరిరభ్య = కౌగలించుకొని, యావత్ = ఎంతలో, చాటుశతకైః = వందల కొలది చాటు వాక్యాలచేత (మంచిమాటలచేత), నో ఆశ్వాసయామి = ఓదార్చలేదో, తావత్ = అంతలో, అహమ్ = నేను, శఠేన = దుష్టమైన, విధినా = దైవంచేత, నిద్రాదరిద్రీకృతః = నిద్రలేనివాడనుగా చేయబడితిని అని, జానే = ఎరుగుదును.

వి. ఇక్కడ విధివిషయంలో అసూయ ప్రధానంగా వ్యజింపచేయబడుచున్నది. విధి ఆలంబనం; విధిదౌర్జన్యం ఉద్దీపనం; శఠత్వాన్ని చెప్పడం అనుభావం. ప్రధానంగా వ్యంజింపబడిన అసూయ అనే వ్యభిచారిభావం భావ మని చెప్పబడుతుంది.

కా. తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః.

వృ. తదాభాసా రసాభాసా భావాభాసాశ్చ.

వ్యా. తదాభాసా ఇతి:- అనౌచిత్యప్రవర్తితాః = అనౌచిత్యంతో ప్రవర్తింప చేయబడినవి, తదాభాసాః = వాటి ఆభాసలు.

తదాభాసాః = రసాభాసలు, బావాభాసలు.

వి. శాస్త్రీయ సంప్రదాయాలను, లౌకికమర్యాదలను అతిక్రమించి ఆ యా రసభావాదులకు ఆలంబనంగా చిత్రించకూడనివారిని, ఆశ్రయంగా చిత్రించకూడని వారిని అలా చిత్రిస్తే అవి రసాభాసభావాభాసలు. సామాజికులకు, పఠితలకూ కూడ "ఇలా చిత్రించడం బాగులేదు"అని మనస్సులో ఉన్నంతవరకు వాళ్ళకు ఆ సంనివేశంతో తాదాత్మ్యం కలగదు. అందుచేత వాళ్ళకు పూర్ణమైన రసానుభూతి కాని భావానుభూతి కాని కలగదు. అందుచేత అవి రసభావాల వలె కనబడినా నిజమైన రసభావాలు కావు. రసాభాసభావాభాసాలు మాత్రమే.

న్యాయశాస్త్రంలో దుష్టహేతువులకి హేత్వాభాసలు అని పేరు. 'పర్వతో ధూమవాన్, వహ్నేః' (పర్వతంమీద ధూమం ఉంది, అగ్ని కనబడుతూన్నది కాబట్టి) అన్న ప్రయోగంలో 'వహ్ని' హేతువు. కాని వహ్ని ఉన్నచోటల్లా ధూమం ఉంతదు. ఎఱ్ఱగా కాల్చిన ఇనప గోలంమీద నిప్పు ఉన్నా ధూమం లేదు కదా? అందుచేత ఇక్కడ 'వహ్నేః' అనే హేతువు దుష్టహేతువు, అనగా హేత్వాభాసం. హేత్వాభాసాన్ని ఎన్నడూ ఉపయోగించకూడదు. అయితే రసాభాసభావాభాసాలు నిజమైన రసభావాలు కాకపోయినా అవి సర్వథా కావ్యాలలో ఉండకూడదు అని ఆలంకారికు లెవరూ నిషేధించలేదు. కథను పట్టి కొన్నిచోట్ల వాటిని ఉపయోగించినా దోషం లేదు.

శృంగారంలో నాయికాశ్రయమైన రతికి చాలామంది నాయకులు ఆలంబనంగా ఉండడం, లేదా ఉపనాయకుడు ఆలంబనంగా ఉండడం, ఒక వ్యక్తిలో మాత్రమే రతి ఉండి మరొకరిలో లేకపోవడం, గురుజనులవిషయంలో ఉండడం, పశుపక్ష్యాదితిర్యగ్జంతువులో ఉండడం మొదలైనవి అనౌచిత్యాలు. అదే విధంగా హాసానికి పెద్దలను ఆలంబనంగా వర్ణించినా, కరుణకు వైరాగ్యవంతుణ్ణి ఆశ్రయంగా చిత్రించినా, రౌద్రవీరరసాలకు తండ్రిమొదలైన పూజ్యుల్ని ఆలంబనంగా

వర్ణించినా, భయానికి వీరుణ్ణి ఆశ్రయంగా వర్ణించినా, జుగుప్సకు యజ్ఞీయపశు వసాదుల్ని ఆలంబనంగా వర్ణించినా, విస్మయానికి ఐంద్రజాలికాదుల్ని ఆలంబనంగా వర్ణించినా, శమానికి లేదా నిర్వేదానికి మహాక్రూరుణ్ణి ఆశ్రయంగా వర్ణించినా అనౌచిత్యం ఉండదంచేత అవన్నీ హాస్యాద్యాభాసాలు మాత్రంగానే ఉంటాయి.

వృ. తత్ర రసాభాసో యథా–

శ్లో॥ స్తుమః కం కామాక్షి క్షణమపి వినా యం న రమసే
విలేభే కః ప్రాణాన్ రణమఖముఖే యం మృగయసే,
సులగ్నే కో జాతః శశిముఖి యమాలిఙ్గసి బలాత్
తపశ్శ్రీః కస్యైషా మదననగరి ధ్యాయసి తు యమ్. 48

వృ. అత్రానేకకాముకవిషయమభిలాషం తస్యాః స్తుమః ఇత్యాద్యనుగతం బహువ్యాపారోపాదానం వ్యనక్తి.

వ్యా. అందు రసాభాసం ఎట్లనగా–

స్తుమః ఇతి- వామాక్షి=సుందరములైన నేత్రాలు కలదానా! యం వినా= ఎవడు లేకుండగా, క్షణమపి=క్షణకాలం కూడా, న రమసే=రమించవో (సంతోషంగా ఉండజాలవో)అట్టి, కమ్=ఎవణ్ణి, స్తుమః=స్తుతించెదము? యమ్=ఎవణ్ణి, మృగయసే= వెదకుచున్నావో అట్టి, కః= ఎవడు, రణమఖముఖే= యుద్ధ మనే యజ్ఞంయొక్క ముఖమునందు, ప్రాణాన్= ప్రాణాలను, విలేభే= ఇచ్చినాడు? నీసంగమం అనే స్వర్గాన్ని పొందడానికి పూర్వజన్మలో యుద్ధభూమిలో ప్రాణత్యాగం చేసినవాడు ఎవడు అని భావం. శశిముఖి= ఓ చంద్రముఖీ! యమ్= ఎవణ్ణి, బలాత్= బలాత్కారముగా, ఆలిఙ్గసి= కౌగిలించుకొనుచున్నావో అట్టి, సులగ్నే= మంచిలగ్నమునందు, జాతః= పుట్టినవాడు, కః= ఎవడు? మదననగరి= ఓ మన్మథరాజధానీ! ఏషా= ఇది. యమ్= ఎవణ్ణి గూర్చి, ధ్యాయసి= ఆలోచించుచున్నావో అట్టి, కస్య= ఎవనియొక్క, తపఃశ్రీ= తపోలక్ష్మి?

ఒక సుందరిని చూచి ఒక కాముకుని మాటలివి. అత్రేతి:- ఇక్కడ 'స్తుమః' ఇత్యాదులతో సంబంధించిన ఆమెయొక్క రమణ-అన్వేషణ-ఆలింగన-ధ్యానరూపా

లైన అనేకవ్యాపారాలను చెప్పడం ఆమెకు అనేకులైన కాముకులపై ఉన్న అభిలాషను వ్యంజింపచేస్తూన్నది. ఈ విధంగా ఒక నాయికలో ఉన్న రతికి అనేక నాయకులు ఆలంబనంగా ఉన్నట్లు వర్ణించడంచేత ఇది శృంగారాభాసానికి ఉదాహరణం.

వృ. భావాభాసో యథా-

శ్లో॥ రాకాసుధాకరముఖీ తరలాయతాక్షీ
సా స్మేరయౌవనతరఙ్గితవిభ్రమాఙ్గీ,
తత్ కిం కరోమి విదధే కథమత్రమైత్రీం
తత్స్వీకృతివ్యతికరే క ఇవాభ్యుపాయః. 49

వృ. అత్ర చిన్తా అనౌచిత్యప్రవర్తితా. ఏవమన్యేఽప్యుదాహార్యాః.

వ్యా. రాకేతి:- సీతను గూర్చి రావణుడు అనుకుంటూన్న మాటలు: రాకాసుధాకరముఖీ = పూర్ణిమనాటి చంద్రునివంటి ముఖంకలది, తరలాయతాక్షీ = చంచలములైన విశాలములైన నేత్రాలు గలది అయిన, సా = ఆమె, స్మేరయౌవనతరఙ్గితవిభ్రమాఙ్గీ = చిరునవ్వు నవ్వుచున్న (కొంచెము ప్రకాశిస్తూన్న) యౌవనంచేత తరంగాలు వలె వెడలుచున్న విలాసలతో కూడిన శరీరము కలది. తత్ = ఆ కారణమువలన, కిమ్ = ఏమి, కరోమి = చేయుదును? అత్ర = ఈమెయందు, మైత్రీమ్ = స్నేహమును (పరిచయమును), కథమ్ = ఎట్లు, విదధే = చేయుదును? తత్స్వీకృతివ్యతికరే = ఆమెయొక్క స్వీకారముయొక్క, అనగా ఇతడు నావాడు అనే అభిప్రాయంయొక్క సంబంధమునందు, ఉపాయః = ఉపాయం, కః ఇవ = ఏమి?

ఇక్కడ చింత అనౌచిత్యముతో ప్రవర్తితమైనది. ఇట్లే ఇతరములైన రసభావాభాసలకు ఉదాహరణాలు చూచుకోవలెను.

వి. "ఆదౌ వాచ్యః స్త్రియో రాగః పశ్చాత్పుంసస్తదిఙ్గితైః" (ముందుగా స్త్రీకి అనురాగము కలిగినట్లు, తరవాత ఆమె మనోభావాన్ని గుర్తించడంచేత పురుషుడిలో రాగం కలిగినట్లూ వర్ణించాలి) అని చెప్పిన రీతిగా స్త్రీగతరాగాన్ని ముందుగా వర్ణించడం ఉచితం. అలా కాకపోవడంచేత ఇక్కడ అనౌచిత్యం అని

కొందరు వ్యాఖ్యాతలు వ్రాసినారు. నాయికలో లేకుండా పురుషునిలో మాత్రమే అనురాగం ఉన్నట్లు, జగన్మాతయైన సీత విషయంలో కలిగినట్లు వర్ణించడంచేత అనౌచిత్యం అని చెప్పవచ్చును.

అవ. ఇప్పుడు భావశాంత్యాదులను నిరూపిస్తూన్నాడు–

కా. భావస్య శాన్తిరుదయః సన్ధిః శబలతా తథా. 36

వృ. క్రమేణోదాహరణమ్–

శ్లో॥ తస్యాః సాన్ద్రవిలేపనస్తనతటప్రశ్లేషముద్రాఙ్కితం
కిం వక్షశ్చరణానతివ్యతికరవ్యాజేన గోపాయ్యతే,
ఇత్యుక్తే క్వతదిత్యుదీర్య సహసా తత్సంప్రమార్ష్టుం మయా
సాశ్లిష్టా రభసేన తత్సుఖవశాత్తన్వ్యా చ తద్విస్మృతమ్. 50

వృ. అత్ర కోపస్య-

వ్యా. భావస్య = భావముయొక్క, శాన్తిః = శమనము, ఉదయః = పుట్టడం, సంధిః = రెండు భావాల సంధి, అనగా ఒకే సమయంలో సమానబలంతో ఉన్న రెండు భావాల ఆస్వాదనం లేదా ఒకే సమయంలో సమానరూపంలో ఉన్న రెండు విరుద్ధభావాల ఆస్వాదనం, తథా = మరియు, శబలతా = చాలా భావాలు కలిసిపోవడం, అనగా వెనక ఉన్న భావాన్ని మర్దించి తరువాతి భావం ఆవిర్భవిస్తూ ఒకచోట అనేక భావాల కలయిక వరసగా భావశాంతి-భావోదయ, భావసంధి-భావశబలతలు అని చెప్పబడును. వీటికి క్రమంగా ఉదాహరణలు.

తస్యాః ఇతి- తన ప్రియురాలికి కోపం వచ్చి శాంతించింది అని ఒక ధృష్టనాయకుడు మిత్రునితో చెపుతూన్న మాటలు. ఇది అమరుకంలోని పద్యం. తస్యాః = ఆమెయొక్క, సాన్ద్రవిలేపనస్తనతటప్రశ్లేషముద్రాఙ్కితమ్ = దట్టమైన చందనాదిలేపనం గల స్తనముల పైభాగమును కౌగలించుకొనడంచేత ఏర్పడిన ముద్రలచేత చిహ్నితమైన, వక్షః = వక్షఃస్థలము, చరణానతివ్యతికరవ్యాజేన = పాదములపై పడి నమస్కరించుటతో సంబంధ మనే (పాదాలమీద పడడం అనే) వంకచేత, కిమ్ = ఎందుకు, గోపాయ్యతే = దాచబడుతున్నది? ఇతి = అని,

ఉక్తే = (ఆమెచేత) పలకబడగా, (ఆమె పలకగా), తత్ = అది, క్వ = ఎక్కడ, ఇతి = అని, ఉదీర్య = పలికి, మయా = నాచేత, తత్ = దానిని, సంప్రమార్ష్టుమ్ = తుడిచివేయుటకు. సా = ఆమె, సహసా = వెంటనే ఆశ్లిష్టా = కౌగలించుకొన బడింది. తత్సుఖవశాత్ = ఆ సుఖంవల్ల, తన్వ్యా = ఆ తన్విచేత (తన్వి అనగా నాజూకైన స్త్రీ), తత్ = అది, విస్మృతమ్ = మరవబడినది. ఇది కోపం అనే భావంయొక్క శాంతికి ఉదాహరణం.

అవ భావోదయానికి ఉదాహరణం చూపుతున్నాడు—

శ్లో॥ ఏకస్మిన్ శయనే విపక్షరమణీనామగ్రహే ముగ్ధయా
సద్యో మానపరిగ్రహగ్లపితయా చాటూని కుర్వన్నపి,
ఆవేగాదవధీరితః ప్రియతమస్తూష్ణీం స్థితస్తత్క్షణం
మా భూత్సుప్త ఇవేత్యమన్దవలితగ్రీవం పునర్వీక్షితః. 51

వృ అత్రౌత్సుక్యస్య-

వ్యా. ఏకస్మిన్ ఇతి- అమరుశతకంలోని శ్లోకం. ఏకస్మిన్ = ఒక, శయనే = శయ్యయందు, విపక్షరమణీనామగ్రహే = సవతి పేరుయొక్క గ్రహణము చేయ బడినదగుచుండగా, సద్యః = వెంటనే, మానపరిగ్రహగ్లపితయా = కోపమును అంగీకరించుటచేత (కోపించుటచేత) ఖిన్నురాలైన, ముగ్ధయా = ముగ్ధయైన నాయికచేత, చాటూని కుర్వన్నపి = మంచి మాటలు చెప్పుచున్నా కూడ (బ్రతి మాలుచున్నా కూడ), ఆవేగాత్ = కోపావేశంవల్ల, అవధీరితః = తిరస్కరించబడిన, తత్క్షణమ్ = ఆ క్షణమునందు, తూష్ణీం స్థితః = మౌనంగా ఉన్న, ప్రియతమః = ప్రియతముడు, సుప్తః ఇవ = నిద్రపోయినవాడు, మా భూత్ = కాకుండు గాక (నిద్రపోలేదు కద), ఇతి = అని, అమన్దవలితగ్రీవమ్ = బాగా త్రిప్పబడిన కంఠం కలుగునట్లుగా, పునః = మాటిమాటికి, వీక్షితః = చూడబడినాడు.

వి. ఇక్కడ సురతంనిమిత్తం ఔత్సుక్యం ఉదయించి నట్లు వ్యంజితమైనది గాన ఇది భావోదయానికి ఉదాహరణం.

అవ. భావసంధికి ఉదాహరణం చూపుతున్నాడు—

శ్లో॥ ఉత్సిక్తస్య తపఃపరాక్రమనిధేరభ్యాగమాదేకతః
సత్సంగప్రియతా చ వీరరభసోత్ఫాలశ్చ మాం కర్షతః,
వైదేహీపరిరమ్భ ఏష చ ముహుశ్చైతన్యమామీలయన్
ఆనన్దీ హరిచన్దనేన్దుశిశిరస్నిగ్ధో రుణద్ధ్యన్యతః.

వృ. అత్రావేగహర్షయోః-

వ్యా. ఉత్సిక్తస్యేతి:- మహావీరచరితంలో పరశురాముని రాకను విని రాముడు అనుకొంటూన్న మాటలు. ఉత్సిక్తస్య = అహంకారం కలవాడు, తపః పరాక్రమనిధేః = తపస్సుకూ పరాక్రమానికీ నిధీ అయిన పరశురాముని యొక్క, అభ్యాగమాత్ = రాకవలన, సత్సంగప్రియతా చ = సత్పురుషసంగమునందు, ఆసక్తి, వీరరభసోత్పాలః చ = వీరుని ఉత్సాహముయొక్క ఉద్రేకము, ఏకతః = ఒకవైపు, మామ్ = నన్ను, కర్షతః = లాగుతున్నాయి. ముహుః = మాటి మాటికి, చైతన్యమ్ = చైతన్యాన్ని, ఆమీలయన్ = కప్పివేయుచున్నదీ అనగా మరొక వైపు ప్రసరించకుండా చేస్తున్నదీ, హరిచన్దనేన్దుశిశిరస్నిగ్ధః = చందనం వలె, చంద్రుడు వలె, చల్లనిదీ, స్నేహపూర్ణమూ, ఆనన్దీ = ఆనందంకలిగించేదీ అయిన ఏషః = ఈ, వైదేహీపరిరమ్భః = సీతాసమాలింగనం కూడ, అన్యతః = మరొక వైపు, రుణద్ధి = అడ్డుకొంటూన్నది.

వి. ఇక్కడ పూర్వార్ధంలో, ముని చాలా ఆదరించతగినవా డనే భావం చేత కలిగిన ఆయనను వెంటనే కలవాలి అనే ఆవేగం, ఉత్తరార్ధంలో హర్షం వ్యక్తం అవుతున్నాయి. ఆ రెండింటికీ సంధి.

అవ. భావశబలతకు ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ క్వాకార్యం శశలక్ష్మణః క్వ చ కులం భూయోఽపిదృశ్యేత సా
దోషాణాం ప్రశమాయ నః శ్రుతమహో కోపేఽపి కాన్తం ముఖమ్
కిం వక్ష్యన్త్యపకల్మషాః కృతధియః స్వప్నేఽపి సా దుర్లభా
చేతః స్వాస్థ్యముపైహి కః ఖలు యువా ధన్యోఽధరం ధాస్యతి.

వృ. అత్ర వితర్కౌత్సుక్యమతిస్మరణశఙ్కాదైన్యధృతిచిన్తానాం శబలతా.

వ్యా. క్వేతి :- విక్రమోర్వశీయంలో ఊర్వశిని చూచి పురూరవుడు అను కొంటూన్న మాటలు ఇవి అని కొందరు వ్రాశారు. కాని ఈ శ్లోకం దానిలో లేదు. కథను పట్టిచూస్తే ఉండడానికి అవకాశం లేదు. దేవయానిని చూచి యయాతి అనుకొంటూన్న మాటలని కొందరు వ్రాశారు. అకార్యమ్ = మునికన్యాభిలాష రూపమైన అకార్యం, క్వ = ఎక్కడ? శశలక్ష్మణః = చంద్రునియొక్క, కులమ్ = కులము, క్వ చ = ఎక్కడ. (వితర్కం). సా = ఆమె, భూయః = మరల, అపి దృశ్యతే = చూడబడుతుందా (ఔత్సుక్యం). నః = మనయొక్క, శ్రుతమ్ = శాస్త్రశ్రవణం, దోషాణామ్ = దోషాలయొక్క, ప్రశమాయ = వినాశంకొరకే కదా. (మతి). అహో = ఏమి ఆశ్చర్యం, కోపేఽపి = కోపంలో కూడ, ముఖమ్ = ఆమె ముఖము. కాన్తమ్ = మనోహరమైనది, (స్మరణం). అపకల్మషాః = తొల గిన పాపాలుగల (పాపాలులేని), కృతధియః = పండితులు, కిమ్ = ఏమి, వక్ష్యన్తి = పలికెదరో! (శంక). సా = ఆమె, స్వప్నే ఽపి = స్వప్నంలో కూడ, దుర్లభా = దుర్లభ అయినది (దైన్యం) చేతః = చిత్తమా! స్వాస్థ్యమ్ = స్వస్థతను, ఉపైహి = పొందుము (ధృతి). ధన్యః = ధన్యుడైన, కః యువా = ఏ యువకుడు, అధరమ్ = అధరోష్ఠమును, ధాస్యతి = పానంచెయునో! (చింత)

ఇక్కడ వితర్క-ఔత్సుక్య-మతి-స్మరణ-శంకా-దైన్య-ధృతి-చింతల కల యిక ఉన్నది.

వి. ముందు వితర్కం, దాన్ని బాధించి ఔత్సుక్యం, దాన్ని బాధించి మతి, దాన్ని బాధించి స్మరణం, దాన్ని బాధించి శంక, దాన్ని బాధించి దైన్యం, దాన్ని బాధించి ధృతి, దాన్ని బాధించి చింత వరసగా కలగడంచేత ఇది భావశబలతకు ఉదాహరణం.

వృ. భావస్థితిస్తూక్తా ఉదాహృతా చ.

వి. భావానికి శాంతి మొదలైన అవస్థలు ఉన్నట్లే స్థితి రూపమైన అవస్థ కూడా ఉంటుంది కదా. దానికి ఉదాహరణం చెప్పవలసిఉంది కదా అనే ఆశంకకు ఇది సమాధానం 'వ్యభిచారీ తథాఞ్జితః' అని భావస్థితి, "జానేకోపపరాఙ్ముఖీ" ఇత్యాది పద్యంలో దాని ఉదాహరణం చెప్పడం జరిగింది. అనగా శాంతి-ఉదయ-సంధి-శబలతలు అనే నాలుగు అవస్థలు లేని భావాన్ని చెప్పిన చోట భావస్థితి అని అభిప్రాయం.

కా. ముఖ్యే రసేఽపి తేఽఙ్గిత్వం ప్రాప్నువన్తి కదాచన.

వృ. తే భావశాన్త్యాదయః, అఙ్గిత్వం రాజానుగతవివాహప్రవృత్త భృత్యవత్.

వ్యా. ముఖ్యే ఇతి:- రసే = రసం, ముఖ్యే అపి = ముఖ్యమైనను, తే = అవి, కదాచన = అప్పుడప్పుడు, అఙ్గిత్వమ్ = అంగిత్వాన్ని, ప్రాప్నువన్తి = పొందుచున్నవి.

వి ఏవైన వ్యభిచారిభావాలను వ్యంజింపచేసినప్పుడు అవి అభివ్యక్తం కాగానే రసాభివ్యక్తి కలుగుతుంది కదా. రసాభివ్యక్తి కలిగిందనగా దానికే ప్రాధాన్యం చెప్పాలి; అలాంటప్పుడు భావాలకి, భావశాంత్యాదులకీ ప్రాధాన్యం ఎక్కడ ఉంటుంది అని ప్రశ్న కలగవచ్చు. దానికి సమాధానంగా ఈ వాక్యం చెప్పబడింది. రసం ముఖ్య మనే మాట నిజమే. అయినా వ్యభిచారిభావ-తచ్ఛాం త్యాదుల్ని బాగా పోషించడంతో ముందుగా అవి ప్రధానం అయినట్లు, పార్యంతి కంకా (చివరికి) రసస్ఫూర్తి కలిగినా రసమే భావాదులకి అంగం అయినట్లు కనబడుతుంది. దానిని పట్టి భావధ్వని, భావశాంతిధ్వని ఇత్యాదివ్యవహారం ఏర్ప డింది అని భావం.

ఏనాటికీ రాజు తన సేవకుడికంటె గొప్పవాడే అయినా కూడ రాజసేవ కుడు వివాహం చేసికొంటూ ఊరేగేటప్పుడు గాని, మరొకప్పుడుగాని రాజు అతని వెంట ఉండవచ్చును. అప్పుడు రాజసేవకుడే ప్రధానుడుగా కనిపిస్తాడు కదా ? తావన్మాత్రంచేత రాజుకిఉన్న ప్రాధాన్యం తగ్గదు. నిజానికి పెరుగుతుంది."ఆహా! ఈ రాజు ఎంత మంచివాడు; తన భృత్యుని వెంట మామూలు మనిషి వలె వస్తు న్నాడు"అని అందరూ ఆ రాజును మెచ్చుకుంటారు కదా?

వృత్తిలో 'భావశాన్త్యాదయః' అనేదానికి భావాలు, వాటి శాంతి-ఉదయ - సంధి-శబలతలు అని అర్థం. రసం అంగంగాను, భావాలు అంగిగాను కనబడడానికి 'రాజానుగతవివాహప్రవృత్తభృత్యవత్' అనేది దృష్టాంతం. అందుచేత భావ శాంత్యాదుల కిచ్చిన ఉదాహరణలలో పార్యంతికంగా శృంగారాదిధ్వని ఉన్నా కూడ వాటిని భావశాంత్యాది నామధేయాలతోనే పేర్కొనడం జరిగిందని అర్థం.

అవ:- ఇంతవరకు అసంలక్ష్యక్రమధ్వనిని దాని అవాంతరభేదాలను సోదాహరణంగా నిరూపించి ఇప్పుడు సంలక్ష్యక్రమధ్వనిభేదాలను చెప్పుచున్నాడు-

కా. అనుస్వానాభసంలక్ష్యక్రమవ్యఙ్గ్యస్థితిస్తు యః, 37
శబ్దార్థోభయశక్త్యుత్థస్త్రిధా స కథితో ధ్వనిః.

వృ. శబ్దశక్తిమూలానురణనరూపవ్యఙ్గ్యః అర్థశక్తిమూలానురణనరూపవ్యఙ్గ్యః ఉభయశక్తిమూలానురణనరూపవ్యఙ్గ్యశ్చేతి త్రివిధః.

వ్యా. అనుఇత్యాది:- "అనుస్వానాభ....స్థితిః"-అనుస్వానాభ = అనురణనం వంటి, సంలక్ష్యక్రమ = గుర్తించదానికి శక్యమైన క్రమం గల, వ్యఙ్గ్య=వ్యంగ్యం యొక్క, స్థితిః = స్థితి గల, యః = ఏ, ధ్వనిః=ధ్వని (ధ్వనికావ్యం) కలదో, సః = అది, శబ్దార్థోభయశక్త్యుత్థః = శబ్దోత్థం, అర్థోత్థమ్, ఉభయోత్థం అని, త్రిధా = మూడు విధాలుగా, కథితః = చెప్పబడినది.

శబ్దశక్తిమూలానురణనవ్యంగ్యం, అర్థశక్తిమూలానురణనవ్యంగ్యం, ఉభయశక్తిమూలానురణనరూపవ్యంగ్యం అని మూడు విధాలు.

వి. ఒక పెద్ద గంటను కఱ్ఱతో కొట్టగాకే పెద్ద చప్పుడు వచ్చిన తరవాత 'గుంయ్, గుంయ్, గుంయ్' అంటూ కొంత సేపటివరకు వినబడే ధ్వనికి అనుస్వానం అని పేరు. వాచ్యార్థాదులు తెలిసిన పిమ్మట క్రమాన్ని గుర్తించే విధంగా స్ఫురిస్తూ ఉండే వస్తు-అలంకారధ్వనులు ఈ అనుస్వానం వంటివి. ఈ వ్యంగ్యార్థాలు కేవలం శబ్దశక్తిని పట్టి స్ఫురిస్తే అవి శబ్దశక్తిమూలాలు. అర్థశక్తిని పట్టి స్ఫురిస్తే అర్థశక్తిమూలాలు. రెండింటి శక్తిని పట్టి స్ఫురిస్తే ఉభయశక్తిమూలా లని అర్థం.

వృ. తత్ర-

కా. అలంకారోఽథ వస్త్వేవ శబ్దాద్యత్రావభాసతే, 38
ప్రధానత్వేన స జ్ఞేయః శబ్దశక్త్యుద్భవో ద్విధా.

వృ. వస్త్వేవేతి అనలంకారం వస్తుమాత్రమ్.

వ్యా. 'వాటిలో' :- అలంకారః ఇతి- యత్ర = ఎక్కడ. అలంకారః =

అలంకారం గాని, అథ = లేక, వస్త్వేవ = వస్తువు మాత్రమే కాని, శబ్దాత్ = శబ్దంవలన, ప్రధానత్వేన = ప్రధానంగా, అవభాసతే = భాసిస్తుందో (తెలుస్తుందో), సః = అట్టి, శబ్దశక్త్యుద్భవః = శబ్దశక్త్యుద్భవమైన ధ్వని, ద్విధా = రెండు విధములుగా, జ్ఞేయః = తెలియదగినది.

"వస్త్వేవ అనగా అలంకారాలు ఏవీ లేని ఒక వస్తువు మాత్రం అని అర్థం."

వి. ఒక పదంలో ప్రయోగించిన శబ్దాలను పట్టి వాచ్యార్థంకంటె భిన్నమైన మరొక వ్యంగ్యార్థం స్ఫురిస్తుంది. అయితే ఆ శబ్దాలు మార్చి వాటి పర్యాయాలైన శబ్దాలు ప్రయోగిస్తే వ్యంగ్యార్థం రాదు. అలా మార్చడానికి వీలు లేని శబ్దాలకి 'పరివృత్త్యసహాలు' అని పేరు. పదాలు మార్చినా కూడ, వ్యంగ్యార్థం స్ఫురిస్తే అక్కడున్న శబ్దాలు 'పరివృత్తిసహాలు'. అప్పుడా వ్యంగ్యార్థం అర్థశక్తి మూలం అవుతుంది. ఒకే శ్లోకంలో కొన్ని పరివృత్త్యసహాలైన శబ్దాలు, కొన్ని పరివృత్తిసహాలైన శబ్దాలూ ఉన్నట్లయితే అక్కడ స్ఫురించే వ్యంగ్యార్థం ఉభయ శక్తిమూలం. ఈ విధంగా పరివృత్త్యసహాలైన శబ్దాలు అలంకారాన్ని గాని, కేవలం వస్తువును (ఒక విషయాన్ని) గాని వ్యంజింపజేయవచ్చు. ఇలా వ్యంజింపచేయబడిన అలంకారం, వస్తువూ కూడా ప్రధానంగా ఉండాలి; గుణీభూతాలు కాకూడదు. అప్పుడు అది శబ్దశక్త్యుద్భవవ్యంగ్యం అవుతుంది. అది అలంకారమైతే "శబ్దశక్త్యుద్భవాలంకారధ్వని", వస్తువైతే 'శబ్దశక్త్యుద్భవవస్తు ధ్వని'.

వృ. ఆద్యో యథా-

శ్లో॥ ఉల్లాస్య కాలకరవాలమహాంబువాహం
దేవేన యేన జరఠోర్జితగర్జితేన,
నిర్వాపితః సకల ఏవ రణే రిపూణాం
ధారాజలైస్త్రిజగతి జ్వలితః ప్రతాపః. 3

వృ. అత్ర వాక్యస్య అసంబద్ధార్థాభిధాయకత్వం మా ప్రసాంక్షీదితి ప్రాకరణికాప్రాకరణికయోరుపమానోపమేయభావః కల్పనీయ ఇత్యత్రోపమాలఙ్కారో వ్యఙ్గ్యః.

వా. మొదటిది (శబ్దశక్త్యుద్భవాలంకారధ్వని) ఎట్లనగా-

ఉల్లాస్య ఇతి:- ఇక్కడ రాజవర్ణనం ప్రకృతం. ఆ పక్షంలో దీని అర్థం ఇది-జరఠోర్జితగర్జితేన = కఠోరమైన బలవత్తరమైన సింహనాదం గల, యేన = ఏ, దేవేన = ప్రభువుచేత, కాలకరవాలమహాంబువాహమ్ = శత్రుసంహారకం అయిన ఖడ్గమునందలి గొప్ప ధారాజల ప్రసారమును, అనగా పదునైన భాగం యొక్క ప్రసారమును, ఉల్లాస్య = తీక్ష్ణం చేయడంచేత అధికం చేసి, ధారాజలైః = ఖడ్గ ధారాకాంతులచేత, రణే = యుద్ధమునందు, రిపూణామ్ = శత్రువులయొక్క, త్రిజగతి = మూడు లోకాలలోను, జ్వలితః = ప్రజ్వలించుచున్న, ప్రతాపః = ప్రతాపము సకలః ఏవ = అంతా కూడ. నిర్వాపితః = శాంతింపచేయబడినదో,

వ్యంగ్యపక్షంలో, అనగా అప్రాకరణికుడైన ఇంద్రుని పక్షంలో అర్థం ఇది. జరఠోర్జితగర్జితేన = గంభీరమైన అధికమైన గర్జనం గల అనగా మేఘాల ద్వారా అట్టి గర్జనాన్ని కలిగించు, యేన దేవేన = ఏ ఇంద్రునిచేత, కాలకరవాలమహాంబువాహమ్ = నల్లని కిరణాలు గల, లేదా వర్షాకాలాన్ని చేయు నూతనమైన గొప్ప మేఘాన్ని, ఉల్లాస్య = ప్రకాశింపచేసి, రణే = జలకోలాహలము కలుగుచుండగా, ధారాజలైః = ధారారూపమైన జలములచేత త్రిభువనే = మూడు లోకాలలో, రిపూణామ్ = జలశత్రువులైన తేజస్సులయొక్క, జ్వలితః = ప్రజ్వలిస్తూన, సకలః సమస్తమైన, ప్రతాపః = ప్రతాపం(వేడి), నిర్వాపితః = శాంతింపచేయబడినదో.

వి. 'అమ్బు' అనగా నీరు అని ప్రసిద్ధార్థం. దీనికి ఖడ్గం మొదలైనవాటి కాంతి అని కూడా అర్థం. 'జల'శబ్దానికి కూడా ఈ రెండర్థాలు ఉన్నాయి .అందు చేత మొదటి పక్షంలో 'అమ్బువాహ' శబ్దానికి 'కత్తి అంచు కాంతి ప్రవాహం' అనీ, 'ధారాజలైః' అనేదానికి 'కత్తి అంచు కాంతులచేత' అనీ అర్థం చెప్పబడింది. 'ధారాశబ్దానికి జలధార, కత్తియొక్క పదునైన అంచు అని రెండర్థాలు. 'రణ' శబ్దానికి యుద్ధం, శబ్దం (కోలాహలం) అని రెండర్థాలు.

ఇది రాజవర్ణన ప్రకరణం అవడంచేత ప్రకరణం అభిధను రాజరూపార్థాన్ని మాత్రమే చెప్పేటట్లు నియమించివేసింది. అయినా ఇంద్రరూపమైన మరొక అప్రాకరణికార్థం స్ఫురిస్తూన్నది. ఇది అభిధచేత వాచ్యం కాదు గాన వ్యంజన చేతనే వ్యంజింపబడుతున్నది. అందుచేత వస్తురూపమైన రెండవ అర్థం వ్యంగ్యమే. అయితే రాజును వర్ణించే సందర్భంలో ఈ దేవేంద్రరూపమైన రెండవ అర్థానికి వాచ్యార్థంతో ఏమీ సంబంధం లేదు. ఇలాంటి సంబంధం లేని అర్థాన్ని బోధించ

డం దోషమే అవుతుంది. అలాంటి దోషం కలగకుండడానికై ప్రాకరణికమైన రాజరూపార్థానికీ అప్రాకరణికమైన ఇంద్రరూపార్థానికీ మధ్య ఉపమానోపమేయభావం కల్పించుకోవాలి. అనగా రాజుకూ ఇంద్రునికీ, ఖడ్గానికీ మేఘానికీ, ఖడ్గధారకీ జలధారకీ, శత్రువులకు అగ్న్యాదితేజస్సులకు, శత్రుప్రతాపానికి అగ్న్యాదితాపానికీ ఉపమానోపమేయభావం కల్పించాలి అని అర్థం. ఇది వాచ్యం కాదు, వ్యంగ్యం. అందుచేత ఈ శ్లోకంలో శబ్దశక్తిమూలాలంకారవ్యంగ్యం ఉంది గాన ఇది శబ్దశక్తిమూలాలంకారరూపానురణధ్వని. 'కరవాల' అని మాత్రమే కాకుండా 'కాలకవాల' అనీ, 'మేఘ' అనకుండా 'అమ్బువాహ', అనీ,'రాజ్ఞా' అనకుండా 'దేవేన', అని,'యుద్ధే' అనకుండాగా 'రణే' అని ప్రయోగించడంచేతనే వ్యంగ్యార్థం లభిస్తూన్నది. వీటికి బదులు మేఘరాజాది శబ్దాలు ప్రయోగిస్తే వ్యంగ్యార్థం గమ్యం కాదు. అందుచేత ఇక్కడ ఉన్న శబ్దాలు పరివృత్త్యసహాలు, మార్చడానికి వీలుకానివి. ఈ విధంగా ఈ వ్యంగ్యం శబ్దశక్తి మూలం. ఇక్కడ ఉపమాలంకారమే కాదు,ఇంద్రరూపవస్తువు కూడా వ్యంగ్యమే. అయినా కూడ అలంకారకృతమైన చమత్కారం అధికంగా ఉండడంచేత దీనికి అలంకారధ్వనిత్వం అంగీకరించబడింది.

'అత్ర' ఇత్యాదివాక్యానికి అర్థం :- అత్ర = ఈ శ్లోకంలో, వాక్యానికి, అసంబద్ధార్థాభిధాయకత్వమ్ = ఇంద్రరూప వ్యంగ్యార్థంతో సంబంధం లేని (రాజరూప) అర్థాన్ని బోధించడం అనేది, మా ప్రసాంక్షీత్ = ప్రసక్తము కాకూడదు, ఇతి = అని, ప్రాకరణికాప్రాకరణికార్థాలకి ఉపమానోపమేయభావం కల్పించాలి గాన ఇక్కడ ఉపమాలంకారం వ్యంగ్యం.

అవ. ఉపమాలంకారధ్వనిని ఉదాహరించి ఉపమాలంకారం వలె ఇతరాలంకారాలు కూడ వ్యంగ్యాలు కావచ్చును అని సూచించడానికై విరోధాభాసాలంకారధ్వనిని ఉదాహరిస్తున్నాడు,

శ్లో॥ తిగ్మరుచిరప్రతాపో విధురనిశాకృద్విభో మధురలీలః
మతిమానతత్త్వవృత్తిః ప్రతిపదపక్షాగ్రణీర్విభాతి భవాన్.

వృ. అత్రైకైకస్య పదస్య ద్విపదత్వే విరోధాభాసః.

వ్యా. తిగ్మరుచీతి-విభో = ఓ! ప్రభూ ! తిగ్మరుచిరప్రతాపః=(శత్రువుల

విషయంలో) తీక్ష్ణమూ, (మిత్రులవిషయంలో) సుందరమూ అయిన ప్రతాపం కలవాడవు, విధురనిశాకృత్=శత్రువులకు రాత్రిని (నాశమును) కలిగించేవాడవు, మధురలీలః = మనోహరాలైన చేష్టలు కలవాడవు, మతిమానతత్త్వవృత్తిః=బుద్ధి యొక్క, చిత్తసమున్నతియొక్క యథార్థత్వంతో కూడిన ప్రవృత్తి కలవాడవు, ప్రతిపదపక్షాగ్రణీః = ప్రతిస్థానమునందూ తమవారిలో అగ్రేసరుడవూ అయిన, భవాన్ = నీవు, భాతి=ప్రకాశించుచున్నావు. ఇది ప్రస్తుతరాజుకు సంబంధించిన అర్థం.

వ్యా. "ఈ శ్లోకంలో ఒక్కొక్కపదాన్ని రెండుపదాలుగా గ్రహిస్తే విరోధాభాసాలంకారం".

వి. ఈ శ్లోకంలోని పదాలను రెండేసిక్రింద విడగొట్టినట్లయితే విరుద్ధార్థం స్ఫురిస్తుంది. తిగ్మరుచి=సూర్యుడు; అప్రతాపః = వేడిలేనివాడు. విధుః = చంద్రుడు, అనిశాకృత్ = నిశాకరుడు (రాత్రిని చేసేవాడు) కాడు. విభః=కాంతి లేనివాడు, విభః = విశేషంగా ప్రకాశించుచున్నవాడు. మధుః = వసంతము, అలీలః = క్రీడలులేనిది. మతిమాన్ = ప్రశస్తమైన బుద్ధికలవాడు, అతత్త్వవృత్తిః = యథార్థాలు కాని విషయాలను గూర్చిన ప్రవృత్తి కలవాడు. ప్రతిపత్ = ప్రతిపత్తిథి, అపక్షాగ్రణీః = పక్షం ప్రారంభంలో ఉండనిది.

ఇక్కడ "తిగ్మరుచిరపి అప్రతాపః" ఇత్యాదివిధంగా 'అపి' శబ్దాన్ని ప్రయోగించి ఉన్నట్లయితే విరోధాభాసాలంకారం వాచ్యం అయి ఉండేది. కాని 'అపి'శబ్దాన్ని ప్రయోగించలేదు; అందుచేత విరోధాభాసాలంకారం వ్యంగ్యం అని కొందరి అభిప్రాయం. సహృదయుడికి వాసనాబలంచేత ఇక్కడ రెండేసి పదాలు గ్రహించవచ్చును అని తెలిసినా కూడ ప్రకరణాదులచేత అభిధ ప్రకృత రాజరూపార్థంలో నియమితం అయిపోవడంచేత, వాచ్యార్థంకంటె వేరుగా భాసిస్తూన్న విరోధాభాసం వ్యంగ్యం అని చెప్పబడుతున్నది అని మరికొందరి అభిప్రాయం.

అ. సభంగపదాలలో (రెండుగా విడగొట్టడానికి వీలైన పదాలలో) విరోధాభాసధ్వనిని ఉదాహరించి ఇప్పుడు అభంగపదాల ద్వారా కూడ విరోధాభాసధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అమితః సమితః ప్రాప్తైరుత్కర్షైర్హర్షద ప్రభో
అహితః సహితః సాధు యశోభిరసతామసి. 56

వృ. అత్రాపి విరోధాభాసః

వ్యా. హర్షద = హర్షమును కలిగించు, ప్రభో = ఓ! ప్రభూ! సమితః = యుద్ధంనుండి, ప్రాప్తైః = పొందబడిన, ఉత్కర్షైః = ఉత్కర్షలచేత, అమితః = అపరిచ్ఛిన్నుడవు గాను, అసతామ్ = అసత్పురుషులకు, అహితః = అహితుడవు గాను, సాధుయశోభిః = మంచి కీర్తులతో, సహితః = కూడినవాడవుగాను, అసి = అయిఉన్నావు. ఇది ప్రాకరణికార్థం.

అమితః = మితి లేనివాడవు, సమితః = మితి ఉన్నవాడవు. హర్షద = శత్రువుల హర్షాన్ని ఖండించేవాడా! అహిత: = హితులు లేనివాడవు, సహితః = హితులతో కూడినవాడవు.

వి. ప్రకారణాదులచేత అభిధ ప్రాకరణికార్థాన్ని బోధించడానికి నియమితం అయిపోయిన పిమ్మట కూడా 'అమితః-సమితః' అని వినగానే విరుద్ధార్థం స్ఫురిస్తూన్నది గాన విరోధాభాసాలంకారధ్వని. పదాలు ఛేదించకుండగా (అభంగ పదాల ద్వారా) గమ్యమైనది.

అవ. వ్యతిరేకాలంకారధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ నిరుపాదానసంభారమభిత్తావేవ తన్వతే,
జగచ్చిత్రం నామస్తస్మై కలాశ్లాఘ్యాయ శూలినే. 57

వృ. అత్ర వ్యతిరేకః. అలంకార్యస్యాపి బ్రాహ్మణశ్రమణన్యాయే నాలంకారతా.

వ్యా. నిరుపాదానేతి :- కాశ్మీరదేశీయుడైన నారాయణభట్టు రచించిన స్తవచింతామణిలోని పద్యం. నిరుపాదానసంభారమ్ = తూలిక మొదలైన ఉపకరణాల సంభారం లేకుండగానే, అభిత్తావేవ = గోడ లేని శూన్యమునందే, చిత్రమ్ = చిత్రమైన, జగత్ = జగత్తును, తన్వతే = విస్తరింపచేయుచున్న, కలాశ్లాఘ్యాయ

= చంద్రకళచేత శ్లాఘింపదగిన, తస్మై = ఆ, శూలినే = ఈశ్వరునకు, నమః = నమస్కారము.

"ఇక్కడ వ్యతిరేకాలంకారధ్వని. బ్రాహ్మణశ్రమణన్యాయం చేత అలంకార్యానికి కూడా అలంకారత్వం."

వి. ఇక్కడ 'చిత్ర' కలా, శబ్దాలకు 'చిత్తరువు' 'చిత్రలేఖన కళ' అని వ్యంగ్యార్థాలు. దీనిని పట్టి రంగులు, తూలికలు (కుంచెలు) మొదలైనవాటితో గోడమీద చిత్తరువులు వేసే కలానిపుణులకంటె శూలికి గొప్పతనం గమ్యం అవుతున్నది గాన వ్యతిరేకాలంకారధ్వని. 'చిత్ర' 'కలా' శబ్దాలు పరివృత్త్యసహాలు గాన శబ్దశక్తిమూలధ్వని.

శ్లోకాదిరూపవాక్యాలలో ప్రధానంగా ప్రతిపాద్యమైన రసాదికం ఉంది దాన్ని అలంకరించడంకోసం ఉపమాదులను ప్రయోగించినప్పుడు ప్రధానరసాదికం అలంకార్యం, ఉపమాదులు అలంకారాలు అవుతాయి. కాని పైన చూపిన ఉదాహరణలలో ఉపమా-విరోధాభాస-వ్యతిరేకాలంకారాలే ప్రధానవ్యంగ్యాలు అవడం చేత అవి అలంకార్యాలే కాని అలంకారాలు ఎట్లు అవుతాయి? వీటిచేత అలంకరింపదగిన మరొక ప్రధానవిషయం (రసాదికం) ఏదీ లేదు కదా అని ఆశంక కలుగవచ్చును. నిజానికి వీటిని అలంకారాలు అనకూడదు. అయినా సాధారణంగా అనేకస్థలాలలో ఇవి అలంకారాలుగా ఉండడంచేత ఇక్కడ కూడా వీటిని బ్రాహ్మణ శ్రమణ న్యాయంచేత అలంకారాలు అని అనడం జరుగుతుంది. బ్రాహ్మణుడు శాస్త్రోక్తవిధానం ప్రకారం శిఖాయజ్ఞోపవీతాలు తీసివేసి, సర్వకర్మలు పరిత్యజించి సంన్యాసి కావచ్చును. కాని ఒకడు శాస్త్రోక్తవిధానంచేత కాకుండా, బౌద్ధమతాన్ని స్వీకరించడం ద్వారా శ్రమణుడు (బౌద్ధ సన్యాసి) అయినాడు. వానికి పూర్వం ఉన్న బ్రాహ్మణత్వం పోయింది. అయినా కూడా అతనిని 'బ్రాహ్మణశ్రమణుడు' ('హరిజన్‌క్రిష్టయన్ అన్నట్లు) అని వ్యవహరించడం ఉంది అట్లే ఇక్కడ కూడా అని భావం.

వృ. వస్తుమాత్రం యథా-

వ్యా వస్తుమాత్రానికి ఉదాహరణం ఎట్లనగా :-

గాథ. పంథిఅ ణ ఏత్థ సత్థరమత్థి మణం పత్థరత్థలే గామే
ఉణ్ణఅపఓహరం పేక్ఖిఊణ జఇ వససి తా వసను. 58

"పథిక నాత్ర స్రస్తరమస్తి మనాక్ ప్రస్తరస్థలే గ్రామే
ఉన్నతపయోధరం ప్రేక్ష్య యది వససి తదా వస"

వృ. అత్ర "యద్యుపభోగక్షమోఽసి తదా ఆస్స్వ" ఇతి వ్యజ్యతే.

వ్యా. పంథిఅ ఇత్యాది :- పాంథునితో ఒక స్వయందూతి రహస్యార్థ సూచన చేస్తూ పలికినమాట. పథిక = ఓ! బాటసారీ! ప్రస్తరస్థలే = జాతి నేల పైన, అత్ర గ్రామే = ఈ గ్రామంలో, మనాక్ = కొంచెం కూడ, స్రస్తరణం = ఆస్తరణం, న = లేదు. జాతినేలమీద గడ్డి కూడ మొలవదు గాన చాపవంటివి దొరకవు, ఉన్నతపయోధరమ్ = ఉన్నతమైన (బాగావ్యాపించిన) మేఘాన్ని, ప్రేక్ష్య = చూచి, వససి యది = నివసిస్తే, తదా = అప్పుడు, వస = నివసించుము (ఆగుము), ఇది వాచ్యార్థం. ఇంక వ్యంగ్యార్థం- ఓ! పాంథుడా! ప్రస్తరస్థలే = రాళ్ళవంటి మొద్దు మనుషులతో నిండిన ఈ గ్రామంలో, స్రస్తరమ్ = కామశాస్త్రం, (కామ శాస్త్రజ్ఞానం) కొంచెం కూడా లేదు. ఉన్నతపయోధరమ్ = ఉన్నతమైన కుచమండలాన్ని, చూచి ఈ రోజుకి ఇక్కడ ఆగాలని ఉంటే ఆగు.

అత్రేతి :- ఇక్కడ "అనుభవించే సామర్థ్యం ఉంటే ఆగి పొమ్ము" అనే వస్తువు (విషయం) వ్యంజింపబడుతూన్నది.

వి. ఇక్కడ ప్రయోగించిన 'పటహర' 'సత్థర' శబ్దాలు పరివృత్త్యసహాలు గాన ఇది శబ్దశక్తిమూలవస్తుధ్వని. 'సత్థర' అనే ప్రాకృత శబ్దాన్ని 'స్రస్తర' అని కాని, 'శాస్త్ర' అని కాని చెప్పవచ్చును. దానిని పట్టి శాస్త్రరూపమైన రెండవ అర్థం స్ఫురిస్తుంది. 'ప్రస్తర' శబ్దానికి శాస్త్రం అనే అర్థం లేదు.

అవ శబ్దశక్తిమూలవస్తుధ్వనికి సంస్కృతంలో ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ శనిరశనిశ్చ తముచ్చైర్నిహన్తి కుప్యసి నరేన్ద్ర యస్మై త్వమ్
యత్ర ప్రసీదసి పునః స భాత్యుదారోఽనుదారశ్చ. 59

వృ. అత్ర విరుద్ధావపి త్వదనువర్తనార్థమేకం కార్యం కురుత ఇతి ధ్వన్యతే.

వ్యా. నరేన్ద్ర = రాజా! త్వమ్ = నీవు, యస్మై = ఎవని కొరకు (ఎవని మీద), కుప్యసి = కోపిస్తావో, తమ్ = వానిని, శనిః = శనిగ్రహమూ, అశనిః = వజ్రాయుధమూ కూడ, ఉచ్చైః = అధికముగా, నిహన్తి = కొట్టును. పునః = కాని, యత్ర = ఎవనివిషయమునందు, ప్రసీదసి = ప్రసన్నుడవు అవుతావో, సః = అతడు, ఉదారః = గొప్ప దాతగాను, అనుదారః చ = అనుసరించే భార్య కలవాడు గాను, భాతి = ప్రకాశిస్తాడు.

ఇక్కడ "విరుద్ధమైనవికూడా నిన్ను అనుసరించి ఉండడానికై ఒకే కార్యాన్ని చెస్తున్నాయి" అని ధ్వనింపబడుతున్నది.

వి. పూర్వార్ధంలో 'శని'కానిది 'అశని' గాన "నీకు కోపం వచ్చినవానిని పరస్పరవిరుద్ధాలైన శనీ, శనివిరుద్ధమైన అశనీ కూడ పీడిస్తాయి" అనే వస్తువు గమ్యం అవుతూంది. ఉత్తరార్ధంలో విరోధాభాసధ్వని. ఈ వస్తుధ్వని పరివృత్త్య సహాలైన 'శనిః' 'అశనిః' అనే శబ్దాలమీద ఆధారపడింది. అందుచేత ఇది శబ్ద మూలకవస్తుధ్వని.

అవ. శబ్దశక్తిమూలకమైన ద్వివిధధ్వనిని నిరూపించి ఇప్పుడు పన్నెండు విధాలైన అర్థశక్తిమూలఅనురణధ్వనిని విశదీకరిస్తున్నాడు-

కా. అర్థశక్త్యుద్భవోఽప్యర్థో వ్యఞ్జకః సంభవీ స్వతః 39
ప్రౌఢోక్తిమాత్రాత్సిద్ధో వా కవేః తేనోమ్భితస్య వా,
వస్తు వాలంకృతిర్వేతి షడ్భేదోఽసౌ వ్యనక్తి యత్ 40
వస్త్వలంకారమథవా తేనాయం ద్వాదశాత్మకః.

వృ. స్వతఃసంభవీ న కేవలం భణితిమాత్రనిష్పన్నో యావద్బహిరప్యౌచిత్యేన సంభావ్యమానః. కవినా ప్రతిభామాత్రేణ బహిరసన్నపి నిర్మితః కవినిబద్ధేన వక్త్రేతి వా ద్వివిధోఽపర ఇతి త్రివిధః. వస్తువాలంకారో వాసావితి షోఢా వ్యఞ్జకః. తస్య వస్తువాలంకారో వా వ్యఙ్గ్య ఇతి ద్వాదశవిధోఽర్థశక్త్యుద్భవో ధ్వనిః. క్రమేణోదాహరణమ్.

వ్యా. అర్థ ఇత్యాది:- 'అర్థశక్త్యుద్భవః ద్వాదశాత్మకః' అని అన్వయం.

వ్యఞ్జకః = వ్యంజకమైన, అర్థః అపి = అర్థం కూడ, స్వతఃసంభవీ = స్వయం గానే లోకంలో సంభవించేదీ (కనబడేదీ), కవేః=కవియొక్క, ప్రౌఢోక్తిమాత్రాత్ = ప్రౌఢోక్తిమాత్రంవల్ల (ప్రతిభాకల్పనవల్ల), సిద్ధః వా = సిద్ధమైనదిగా గాని, తేన = కవిచేత, ఉమ్భితస్య వా = కల్పించబడినవాని ప్రౌఢోక్తివల్ల సిద్ధం అయి నదిగా గాని, వస్తు వా=వస్తువు గాని, అలంకృతిః వా=అలంకారంగా కాని కావ చ్చును. ఇతి = ఈకారణంచేత, షడ్భేదః = ఆరు భేదాలు కలది. అసౌ = ఆరు భేదాలు గల ఈ అర్థం, యత్ = ఎందువలన, వస్తు = వస్తువును గాని, అథవా= లేక, అలంకారమ్ = అలంకారాన్ని గాని, వ్యనక్తి =వ్యంజింపచేయునో, తేన =ఆ కారణంచేత, అయమ్= ఈ, అర్థశక్త్యుద్భవః=అర్థశక్తివల్ల ఉద్భవించే వ్యంగ్యం, ద్వాదశాత్మకః = పన్నెండు విధాలైనది.

స్వతఃసంభవీ ఇత్యాది :- 'స్వతఃసంభవి' అనగా కేవలం కవి చెప్పడం చేత మాత్రంచేతనే సిద్ధించినది కాక వెలుపల లోకంలో కూడ ఉచితమైనదిగా ఊహించడానికి వీలైనది. బయట ప్రపంచకంలో లేకపోయినా కవిచేత తన ప్రతిభామాత్రంచేత కల్పించబడిది (కీర్తి తెల్లగా ఉండడం) మొదలైనది, కవి కావ్యంలో సృజించిన వ్యక్తి చేత నిర్మించబడినది అని రెండవది రెండు విధాలు. మొత్తం మూడు విధాలు. అది వస్తువు కాని అలంకారం కాని కావచ్చును గాన ఇది (వ్యంజకమైన అర్థం) ఆరు విధాలు. అట్టి ఆరు విధాలైన అర్థంచేత వ్యంగ్యం ఆయినది వస్తువు కాని అలంకారం కాని కావచ్చును అందుచేత అర్థశక్త్యుద్భవ ధ్వని పన్నెండు విధాలు.

వి. అర్థశక్తిమూలానురణరూపవ్యంగ్యం అనగా అర్థంచేత వ్యంజింపచేయ బడే అనురణనరూపమైన వ్యంగ్యం. వ్యంజింపచేసే అర్థం వస్తువుగాని అలంకారం గాని కావచ్చును. ఈ విధంగా ఇది రెండు విధాలు. ఈ రెంటింటిలో ఒక్కొక్కటి లోకంలో మనకు అనుభవసిద్ధం కావచ్చు. లేదా లోకంలో లేకపోయినా కవి తన ప్రతిభచేత కల్పించినది (కీర్తి తెల్లగా ఉంటుంది, పద్మాలు రాత్రి దగ్గరగా ముణు చుకొనిపోతాయి ఇత్యాదికం) కావచ్చు. కావ్యంలో కవి వర్ణించే వ్యక్తిచేత కల్పితం కావచ్చును. ఈ విధంగా వ్యంజకార్థం ఆరు విధాలు. వ్యంజింపబడేది కూడా వస్తువు కావచ్చు. అలంకారం కావచ్చు. ఈ ప్రకారం అర్థశక్తి మూలానురణన రూప (అర్థశక్తిమూలసంలక్ష్యక్రమ) వ్యంగ్యం పన్నెండు విధాలు.

1. స్వతఃసంభవివస్తురూపార్థంచేత వస్తుధ్వని.
2. స్వతఃసంభవివస్తురూపార్థంచేత అలంకారధ్వని.
3. స్వతఃసంభవ్యలంకారరూపార్థంచేత వస్తుధ్వని.
4. స్వతఃసంభవ్యలంకారరూపార్థంచేత అలంకారధ్వని.
5. కవిప్రౌఢోక్తిసిద్ధవస్తురూపార్థంచేత వస్తుధ్వని.
6. కవిప్రౌఢోక్తిసిద్ధవస్తురూపార్థంచేత అలంకారధ్వని.
7. కవిప్రౌఢోక్తిసిద్ధాలంకారరూపార్థంచేత వస్తుధ్వని.
8. కవిప్రౌఢోక్తిసిద్ధాలంకారరూపార్థంచేత అలంకారధ్వని.
9. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధవస్తురూపార్థంచేత వస్తుధ్వని.
10. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధవస్తురూపార్థంచేత అలంకారధ్వని.
11. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధాలంకారరూపార్థంచేత వస్తుధ్వని.
12. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధాలంకారరూపార్థంచేత అలంకారధ్వని

క్రమంగా ఉదాహరణలు:-

గాథ. అలసశిరోమణి ధుత్తాణం అగ్గిమో పుత్తి ధణసమిద్ధిమఓ
ఇఅ భణిఏణ ణఅఙ్గీ పప్ఫుల్లవిలోఅణా జాఆ. 60

"అలసశిరోమణిర్ధూర్తానామగ్రిమః పుత్రి ధనసమృద్ధిమయః,
ఇతి భణితేన నతాఙ్గీ ప్రఫుల్లవిలోచనా జాతా"

వ్యా. స్వతఃసంభవివస్తురూపార్థంచేత వస్తువు వ్యంజింపచేయబడడానికి ఉదాహరణం- అలసేతి:- స్వయంగా పతిని వరిస్తూన్న ఒక యువతితో పెంపుడు తల్లి మాటలు పూర్వార్ధం. ఉత్తరార్ధం కవివచనం. పుత్రి = ఓ పుత్రీ! (ఇతడు), అలసశిరోమణిః = సోమరిపోతులలో, శిరోమణి. ధూర్తానామ్ = ధూర్తులలో, అగ్రిమః = మొదటివాడు. ధనసమృద్ధిమయః = అత్యధికమైన ధనసమృద్ధి ఉన్నవాడు. ఇతి = ఇట్లు, భణితేన = చెప్పడంచేత, నతాఙ్గీ = వంగిన శరీరం గల ఆ యువతి, ప్రఫుల్లవిలోచనా = వికసించిన నేత్రాలు కలదిగా, జాతా = అయినది.

వ్య. ఏష మమైవోపభోగయోగ్య ఇతి వస్తునా వస్తు వ్యజ్యతే.

వ్యా. "వస్తువుచేత 'ఇతడు నాకే అనుభవించడానికి యోగ్యుడు" అనే వస్తువు వ్యంజింపబడుచున్నది".

వి. 'అలసశిరోమణి' అనడంచేత ఏ పనులు చేయక ఇంటిపట్టునే ఉంటాడనీ, 'ధూర్తాగ్రణి' అనడంచేత సంభోగంలో తృప్తి చెందనివాడనీ, ఐశ్వర్యవంతుడు అవడం చేత భోగి అనీ గ్రహించిన ఆ యువతి నేత్రాలు హర్షం చేత వికసించాయి; "ఆమె నేత్రాలు వికసించాయి" అనే వస్తువుచేత "ఇతడు నాకు మాత్రమే ఉపభోగయోగ్యుడు" అనే వస్తువు వ్యంగ్యం అవుతున్నది అని భావం.

అవ. స్వతఃసంభవివస్తురూపార్థంచేత అలంకారం వ్యజింపబడడానికి ఉదాహరణం చూపుతున్నాడు—

శ్లో॥ ధన్యాసి యా కథయసి ప్రియసంగమేఽపి
విస్రబ్ధచాటుశతకాని రతాన్తరేషు,
నీవీం ప్రతి ప్రణిహితే తు కరే ప్రియేణ
సఖ్యః శపామి యది కించిదపి స్మరామి. 61

వృ. అత్ర త్వమధన్యా, అహం తు ధన్యా ఇతి వ్యతిరేకకాలంకారః.

వ్యా. ధన్యాతి ఇతి :- ఒక యువతి రతిసమయంలో తన ప్రియుడు పలికిన చాటు వాక్యాలను కూర్చి చెప్పి నీ రతివిషయం కూడా చెప్పు అని అడగగా రెండవ యువతి పరిహాసగర్భంగా అన్న మాటలు ఇవి. సఖి = సఖురాలా! ప్రియసంగమే అపి = ప్రియసంగమంలో కూడా, రతాన్తరేషు అపి = రతిమధ్యలో కూడ, యా = ఏ నీవు, విస్రబ్ధచాటుశతకాని = విశ్వాసపూర్వకములైన అనేక చాటువాక్యములను గూర్చి, కథయసి = చెప్పుచున్నావో అట్టి నీవు, ధన్యా అసి = ధన్యురాలవు. సఖ్యః = సఖులారా! ప్రియేణ = ప్రియునిచేత, కరే = హస్తం, నీవీం ప్రతి = కోకముడి వైపు, ప్రణిహితే = పంపబడగా, కించిదపి = ఏ కొంచెమైన, స్మరామి యది = స్మరించినట్లయితే, శపామి = ఒట్టు పెట్టుచున్నాను. ఇతరవిషయా లేవీ తెలియని మహానందంలో మునిగిపోయాను అని భావం.

నీవు ధన్యురాలవు అని చెప్పడం అనే వస్తువుచేత "అలాంటి సమయంలో కూడా ఇతరవిషయా లన్నీ గుర్తు ఉంచుకోగలిగిన నీవు అధన్యురాలవు; నీకంటె నేను చాలా ధన్యురాలను" అని వ్యతిరేకాలంకారం వ్యంగ్యం అవుతున్నది. ఉప మానంకంటె ఉపమేయం గొప్పదని వర్ణిస్తే వ్యతిరేకాలంకారం. ఇక్కడ సఖు రాలు ఉపమానం అని ఈ మాటలు చెప్పుతున్న యువతి ఉపమేయం అనీ ఊహించుకోవాలి.

అవ. స్వతఃసంభవ్యలంకారరూపార్థంచేత వస్తువు వ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ దర్పాన్ధగన్ధగజకుమ్భకపాటకూట
సంక్రాన్తినిఘ్నఘనశోణితశోణశోచిః,
వీరైర్వ్యలోకి యుధి కోపకషాయకాన్తిః
కాలీకాటాక్ష ఇవ యస్య కరే కృపాణః. 62

వృ. అత్రోపమాలంకారేణ సకలరిపుక్షయః క్షణాత్ కరిష్యతే ఇతి వస్తు.

వ్యా. దర్పేతి:— "దర్పాన్ధ........శోచిః" దర్ప = దర్పంచేత, అన్ధ = ఉద్రిక్తమైన, గన్ధగజ = మదగజంయొక్క, కుమ్భ = గండస్థలములయొక్క, కపాట = తలుపువలె విశాలమైన మధ్యప్రదేశముయొక్క, కూట = అగ్రభాగము నందు, సంక్రాన్తి = పడడంచేత, నిఘ్న = దృఢంగా ఉన్న, ఘన = దట్టమైన, శోణిత = రక్తంచేత, శోణశోచిః = ఎఱ్ఱని కాంతి గల, యస్య కరే = ఎవని హస్తము నందున్న, కృపాణః = ఖడ్గం, యుధి = యుద్ధరంగమునందు, వీరైః = వీరులచేత, కోపకషాయకాన్తిః = కోపంచేత ఎఱ్ఱనైన కాంతి గల, కాలీకటాక్షః ఇవ = కాలి కాదేవి కటాక్షము వలె, వ్యలోకి = చూడబడినదో. దేని గంధం వాసనచూడగానే ఇతరములైన ఏనుగు లన్నీ భయంతో పారిపోతాయో అది 'గంధగజం'.

ఇక్కడ రాజు చేతిలోని ఖడ్గం కోపముతో ఎఱ్ఱనైన కాలికాకటాక్షంవలె ఉన్నది అనే ఉపమాలంకారంచేత "సకలశత్రువినాశనం క్షణకాలంలో జరిగి పోతుంది" అనే వస్తువు వ్యంగ్యం.

అవ. స్వతఃసంభవ్యలంకారరూపార్థంచేత అలంకారం వ్యంగ్యం అవ డానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ గాఢకాన్తదశనక్షతవ్యథా
సంకటాదరివధూజనస్య యః,
ఓష్ఠవిద్రుమదలాన్యమోచయ
న్నిర్దశన్ యుధి రుషా నిజాధరమ్. 63

వృ. అత్ర విరోధాలంకారేణాధరనిర్దశనసమనన్తరమేవ శత్రవో వ్యాపాదితా ఇతి తుల్యయోగితా, మమ క్షత్యాప్యన్యస్య క్షతిర్నివర్తతామితి తద్బుద్ధిరుత్ప్రేక్ష్యతే ఇత్యుత్ప్రేక్షా చ. ఏషూదాహరణేషు స్వతః సంభవీ వ్యఞ్జకః.

వ్యా. గాఢేతి :- యుధి = యుద్ధంలో, రుషా = కోపంతో, నిజాధరమ్ = తన క్రింది పెదవిని, నిర్దశన్ = కొరుకుచున్న, యః = ఏ రాజు, అరివధూజనస్య = శత్రువుల స్త్రీలయొక్క, ఓష్ఠవిద్రుమదలాని = పగడముల దలములవంటి పెదవులను, గాఢకాన్తదశనక్షతవ్యథాసంకటాత్ = అధికమైన భర్తల దంతక్షతాలవలన కలిగిన వ్యథనుండి, అమోచయత్ = విడిపించెనో. కోపంతో ఇతడు శత్రువులను చంపివేయడంచేత వాళ్ళ స్త్రీలకు రతిక్రీడ లేకపోవడంతో దంతక్షతాభావం ఏర్పడింది అని భావం.

గాఢేతి :- ఓష్ఠం కరచుచున్నవాడు ఓష్ఠదశనవ్యథను తొలగించాడు అని చెప్పడంలో ఉన్న విరోధాభాసాలంకారంచేత ప్రకృతాలైన తన అధరం కొరకడం శత్రుసంహారం ఈ రెండింటికీ ఒకేకాలం అనే ఒక ధర్మంతో సంబంధం చెప్పడం వల్ల (అధరాన్ని కొరికిన వెంటనే శత్రువులు చంపబడినా రని సూచించడంవల్ల) తుల్యయోగితాలంకారం వ్యంగ్యం. ప్రకృతాలైన లేదా అప్రకృతాలైన రెండు వస్తువులకు ఒకేధర్మంతో సంబంధం వర్ణిస్తే తుల్యయోగితాలంకారం. అట్లే "నీకు గాయం అయినా ఇతరులకు గాయం కలగకూడదు" అని ఆ రాజు అభిప్రాయం కాబోలు అని ఊహించడంచేత ఉత్ప్రేక్షాలంకారం కూడా వ్యంగ్యం. ఈ ఉదాహరణా లన్నింటిలోనూ వ్యంజకార్థం స్వతఃసంభవి. అనగా లోకంలో జరగనిది కాదు.

అవ. కవిప్రౌఢోక్తిసిద్ధవస్తురూపార్థం వస్తువును వ్యంజింపచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ కైలాసస్య ప్రథమశిఖరే వేణుసంమూర్ఛనాభిః
శ్రుత్వా కీర్తిం విబుధరమణీగీయమానాం యదీయామ్,
స్రస్తాపాఙ్గాః సరసబిసినీకాణ్డసంజాతశఙ్కా-
దిఙ్మాతఙ్గాః శ్రవణపులినే హస్తమావర్తయన్తి, 64

వృ. అత్ర వస్తునా యేషామప్యర్థావగమో నాస్తి తేషామప్యేవమాదిబుద్ధిజననేన చమత్కారం కరోతి త్వత్కీర్తిరితి వస్తు వ్యజ్యతే.

వ్యా. కైలాసస్య = కైలాసపర్వతముయొక్క, ప్రథమశిఖరే = ప్రధానమైన శిఖరంమీద, వేణుసంమూర్ఛనాభిః = పిల్లనగ్రోవియొక్క మూర్ఛనలతో (రాగాలతో), విబుధరమణీగీయమానామ్ = దేవతాస్త్రీలచేత గానంచేయబడుచున్న, యదీయామ్ = ఎవని సంబంధమైన, కీర్తిమ్ = కీర్తిని, శ్రుత్వా = విని, సరసబిసినీకాణ్డసంజాతశఙ్కాః = సరసమైన (పచ్చిగా ఉన్న) తామరతూడులు అని కలిగిన శంక గల, దిఙ్మాతఙ్గాః = దిగ్గజాలు. స్రస్తాపాఙ్గాః = అడ్డముగా ఉంచబడిన నేత్రాంతాలు కలవై, శ్రవణపులినే = చెవుల దగ్గర, హస్తమ్ = తొండమును, ఆవర్తయన్తి = వంచుచున్నవో,

అత్రేతి:- ఇక్కడ వస్తువుచేత 'నీ కీర్తి అర్థజ్ఞానం లేనివాటికి కూడా ఇలాంటి బుద్ధిని జనింపచేయడం చేత చమత్కారాన్ని కలిగిస్తూన్నది' అనే వస్తువు వ్యంగ్యం అవుతున్నది.

వి. యశస్సు చెవిలో ప్రవేశించగా తామరతూడు అనే భ్రాంతిచేత దాన్ని పట్టుకోవడంకోసం తొండం చెవుల వైపు త్రిప్పడం అనేది కవిప్రతిభచేత కల్పించిన వస్తువు (విషయం) అర్థజ్ఞానం అనగా గీతాల అర్థజ్ఞానం. యశస్సు తెల్లగా ఉండడం మొదలైన విషయాలు కవికల్పితాలు.

అవ. కవిప్రౌఢోక్తిమాత్రసిద్ధవస్తురూపార్థం అలంకారాన్ని వ్యంజింపచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

గాథ. కేసేసు బలామోడిఅ తేణ అ సమరమ్మి జఅసిరీ గహిఆ,
జహ కన్దరాహిం విహురా తస్స దఢం కంఠఅమ్మి సంఠవిఆ. 65

"కేశేషు బలాత్కారేణ తేన చ సమరే జయశ్రీర్గృహీతా,
యథా కన్దరాభిర్విధురా స్తస్య దృఢం కణ్ఠే సంస్థాపితాః."

వృ. అత్ర కేశగ్రహణోద్దీపితమదనా ఇవ కన్దరా స్తద్విధురాన్ కణ్ఠే గృహ్ణన్తి ఇత్యుత్ప్రేక్షా. ఏకత్ర సంగ్రామే విజయదర్శనాత్తస్యారయః పలాయ్య గుహాసు తిష్ఠన్తీతి కావ్యహేతురలఙ్కారః. న పలాయ్య గతా స్తద్వైరిణః; అపి తు తతః పరాభవం సంభావ్య తాన్ కన్దరా న త్యజ న్తీ త్యపహ్నుతిశ్చ.

వ్యా. తేన = వానిచేత, సమరే = యుద్ధమునందు (మదనసమరమునందు అని గమ్యమానార్థం), జయశ్రీః = జయలక్ష్మి, కేశేషు = కేశములయందు, బలాత్కారేణ = బలాత్కారంతో, (తథా = అట్లు), గృహీతా = గ్రహించబడింది, యథా = ఎట్లనగా, కన్దరాభిః = గుహలచేత (నాయికలచేత అని గమ్యమానార్థం), తస్య = వానియొక్క, విధురాః = శత్రువులు, కణ్ఠే = సమీపమునందు (కంఠమునందు), దృఢమ్ = దృఢంగా, సంస్థాపితాః = ఉంచబడినారు. అతనిచేత పరాజితులై శత్రువులు గుహలలోనే ఉంటున్నారు అని భావం.

'గుహలు కంఠందగ్గర నిలబెట్టినవి' అనేది కవి కల్పించిన వస్తువు దీనివల్ల మూడు అలంకారాలు వ్యంజింపబడుతున్నాయి అని చెపుతున్నాడు-అత్రేతి-రాజు జయశ్రీకేశగ్రహణం చేయడం చూడగానే కామోద్రేకం చెందాయా అన్నట్లు కందరలు (గుహలు) విధురుల కంఠాలను పట్టుకొంటున్నాయి అని ఉత్ప్రేక్ష వ్యంజింపబడుతున్నది. ఒక యుద్ధంలో అతడు విజయం పొందడం చూడగానే వాని శత్రువులు పారిపోయి గుహలలో నివసిస్తున్నారు అని కావ్యలింగాలంకారం వ్యంగ్యం అవుతూన్నది. అతని శత్రువులు పారిపోయి వెళ్ళలేదు; ఇంక నేమనగా అతనివలన పరాభవం కలుగుతుంది అని ఊహించి గుహలే వాళ్ళను వదలడం లేదు అని అపహ్నుత్యలంకారం కూడా వ్యంగ్యం అవుతూన్నది.

అవ:- కవిప్రౌఢోక్తిమాత్రసిద్ధాలంకారరూపార్థం వస్తువును వ్యంజింప చేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

గాథ. గాఢాలింగణరహసుజ్జుఅమ్మి దఇఏ లహుం సమోసరఇ,
మాణంసిణీఁణ మాణో పీలణభీఅ వ్వ హిఅఆహిం. 66

"గాఢాలిఙ్గనరభసోద్యతే దయితే లఘు సమపసరతి,
మనస్విన్యా మానః పీడనభీత ఇవ హృదయాత్".

వృ. అత్రోత్ప్రేక్షయా ప్రత్యాలిఙ్గనాదితత్ర విజృమ్భతే ఇతి వస్తు.

వ్యా. దయితే = ప్రియుడు, గాఢాలిఙ్గనరభసోద్యతే = గాఢాలింగనం కొరకై వేగంగా ఉద్యుక్తుడు అవగానే, మనస్విన్యాః = మానవతియొక్క, మానః = కోపం. పీడనభీత ఇవ = నలిగిపోవుటవలన భయపడినదా అన్నట్లు, హృదయాత్ = హృదయంనుండి, లఘు = శీఘ్రంగా, అపసరతి = తొలగిపోతూన్నది.

అత్రేతి:- ఇక్కడ ఉత్ప్రేక్షచేత "ప్రత్యాలింగనాదికం విజృంభించినది" అనే వస్తువు వ్యంగ్యం.

వి. "ఆమె హృదయంలో ఉన్న కోపం ఎక్కడ నలిగిపోతామో అని భయపడింది" అనే ఉత్ప్రేక్ష కవిప్రతిభామాత్రకల్పితం.

అవ:- కవిప్రతిభామాత్ర సిద్ధాలంకారరూపార్థంచేత అలంకారం వ్యంజింప బడడానికి ఉదాహరణం చూపుతున్నాడు—

గాథ. జా ఠేరం వ హసన్తా కఇవఅణంబురుహబద్ధవిణివేసా
దావేఇ భుఅణమండలమణ్ణం విఅ జఅఇ సా వాణీ. 67

"యా స్థవిరమివ హసన్తీ కవివదనామ్బురుహబద్ధవినివేశా,
దర్శయతి భువనమణ్డలమన్యదివ జయతి సా వాణీ".

వృ. అత్ర ఉత్ప్రేక్షయా చమత్కారైకకారణం నవం నవం జగత్ అజడాసనస్థా నిర్మిమీతే ఇతి వ్యతిరేకః. ఏష కవిప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నో వ్యఞ్జకః.

వ్యా. యా ఇతి:- యా = ఏ వాణి, కవివదనామ్బురుహబద్ధవినివేశా = కవి ముఖపద్మమునందు కట్టబడిన స్థానముకలదై (స్థానము ఏర్పరచుకొన్నదై), స్థవిరమ్ = వృద్ధుడైన బ్రహ్మదేవుణ్ణి, హసన్తీవ = పరిహసిస్తూన్నదా అన్నట్లు, భువనమణ్డలమ్ = లోకముల సముదాయమును, అన్యదివ = మరియొకదానిని వలె, దర్శయతి = చూపుచున్నదో, సా వాణీ = అట్టి వాణి, జయతి = సర్వోత్కర్షగా ఉన్నది.

వి. బ్రహ్మ చేసిన సృష్టికంటె విచిత్రమైన సృష్టిని కవిముఖపద్మమునందు కూర్చున్న సరస్వతి చేస్తూన్నది అని భావం. ఇలా చేస్తూ జడంలో (డ ల లకు అభేదంగాన జలంలో) పుట్టిన పద్మంమీద కూర్చుని సృష్టిచేస్తూన్న ముసలివాడైన బ్రహ్మదేవుణ్ణి పరిహసిస్తూన్నదా అని ఉత్ప్రేక్ష.

అత్రేతి:- ఇక్కడ ఉత్ప్రేక్షచేత జడం కాని ఆసనంమీద కూర్చుండి ఈమె క్రొత్త క్రొత్త చమత్కారాలకు కారణమైన జగత్తును నిర్మిస్తూన్నది అని వ్యతిరేకాలంకారం వ్యంజింపబడుతున్నది.

ఉపమానమైన బ్రహ్మదేవునికంటె ఉపమేయమైన వాక్కుకు (సరస్వతికి) వైశిష్ట్యం చెప్పడంచేత వ్యతిరేకాలంకారం.

అవ. ఇప్పుడు కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధవస్తురూపార్థంచేత వస్తువ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ జే లంకాగిరిమేహలాసు ఖలిఅ సంభోగఖిణ్ణోరఈ
ఫారుప్ఫుల్ల ఫణావలీకవలణే పత్తా దరిద్దత్తణమ్
తే ఏణ్హిం మలఆనిలా విరహిణీణీసాససంపక్కిణో
జాదా ఝత్తి సిసుత్తణేవి బహలా తారుణ్ణపుణ్ణా విఅ. 68

"యే లఙ్కాగిరిమేఖలాసు స్ఖలితాః సంభోగఖిన్నోరగీ
స్ఫారోత్ఫుల్లఫణావలీకవలనే ప్రాప్తా దరిద్రత్వమ్,
త ఇదానీం మలయానిలా విరహిణీనిఃశ్వాససంపర్కిణో
జాతా ఝటితి శిశుత్వేఽపి బహలాస్తారుణ్యపూర్ణా ఇవ".

వృ. అత్ర నిఃశ్వాసైః ప్రాప్తైశ్వర్యా వాయవః కిం కిం న కుర్వ-న్తీతి వస్తునా వస్తు వ్యజ్యతే.

వ్యా. యే ఇత్యాది:- కర్పూరమంజరి అనే సట్టకంలో (ప్రాకృతనాటికలో) రాణియైన విభ్రమలేఖ సఖురాలు చేసిన వసంతవర్ణనం. యే = ఏ వాయువులు, లఙ్కాగిరిమేఖలాసు = లంకలోని పర్వతాల నితంబములందు, స్ఖలితాః = తొట్రు పడినవో, "సంభోగ....కవలనే"-సంభోగ = సంభోగంచేత, ఖిన్న = అలసిన, ఉరగీ = ఆడసర్పముల. స్ఫార = విశాలములైన, ఉత్ఫుల్ల = వికసించిన, ఫణావలీ = పడగలపంక్తులచేత. కవలనే=కబలించడం జరగగా, దరిద్రత్వమ్= క్షీణత్వాన్ని, ప్రాప్తాః = పొందినవో, తే = అట్టి, మలయానిలాః = మలయవాయు వులు, ఇదానీమ్ = ఇప్పుడు, విరహిణీనిఃశ్వాససంపర్కిణః = విరహిణులైన స్త్రీల నిట్టూర్పులతో సంపర్కము కలవై, ఝటితి = హటాత్తుగా, శిశుత్వేఽపి = శిశుత్వ సమయంలో కూడ, తారుణ్యపూర్ణాః ఇవ = యౌవనంతో నిండినవి వలె, జాతాః= అయినవి.

అత్రేతి:- ఇక్కడ "నిఃశ్వాసాలచేత పొందబడిన ఐశ్వర్యం గల వాయు వులు ఏమేమి చేయవు?" అనే వస్తువు వస్తువుచేత (కవినిబద్ధవక్త్రి అయిన సఖురాలి ప్రౌఢోక్తిచేత సిద్ధించిన 'మలయవాయువులు తారుణ్యపూర్ణములవలె అయినవి' అనే వస్తువుచేత) వ్యంగ్యం అవుతున్నది.

అవ:- కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధవస్తురూపార్థంచేత అలంకారం వ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

గాథ: సహి విరహఊణమాణస్స మజ్ఝ ధీరత్తణేణ ఆసాసమ్,
పిఅదంసణవిహలంఖలఖణమ్మి సహస త్తి తేణ ఓసరిఅమ్.

"సఖి విరచయ్య మానస్య మమ ధీరత్వేనాశ్వాసమ్,
ప్రియదర్శనవిశృఙ్ఖలక్షణే సహసేతి తేనాపసృతమ్".

వృ. అత్ర వస్తునా అకృతేఽపి ప్రార్థనే ప్రసన్నేతి విభావనా; ప్రియదర్శనస్య సౌభాగ్యబలం ధైర్యేణ సోఢుం న శక్యతే ఇత్యుత్ప్రేక్షా వా.

వ్యా. సహి ఇతి:- "నీ మానసాహాయ్యంకోసం ధైర్యం ఉంచి (చెప్పి)

వెళ్లానుకదా, మానాన్ని (ప్రణయకోపాన్ని) విడచివేశావేమి?"అని సఖరాలు ప్రశ్నించగా నీ విచ్చిన ధైర్యం ఎందుకూ పనికిరాకుండా పారిపోయింది అని నాయిక చెపుతున్న మాట లివి. సఖి = సఖురాలా! ధీరత్వేన = ధైర్యంచేత మమ = నాయొక్క, మానస్య = మానానికి (కోపానికి), ఆశ్వాసమ్ = నేను ఉన్నాను, నీకేమీ భయం లేదు అని ఆశ్వాసాన్ని, విరచయ్య = చేసి, ప్రియదర్శనవిశృఙ్ఖలక్షణే = ప్రియునిదర్శనంచేత కౌతుకంచేత చాంచల్యంకలిగిన క్షణంలో, సహసా ఇతి = నేను తొందరపడ్డాను అని అంటూ, తేన = ఆ ధైర్యముచేత, అపసరితమ్ = తప్పుకొనుట, (ధైర్యం తప్పుకొన్నది).

అత్రేతి:- ఇక్కడ (ధైర్యం తప్పుకొన్నది అనే) వస్తువుచేత ప్రార్థించకుండగానే ప్రసన్నురా లైనది అని విభావనాలంకారం గాని, ప్రియదర్శన సౌభాగ్య బలాన్ని ధైర్యం సహించజాలదు (దానిముందు ధైర్యం నిలవజాలదు) అని ఉత్ప్రేక్ష గాని వ్యంగ్యం.

వి. ఇక్కడ వక్త్రి కవినిబద్ధురాలు. ధైర్యం పారిపోవడం అనేది లోక ప్రసిద్ధం కాదు; వక్తృకల్పితం.

అవ:- కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధాలంకారరూపార్థంచేత వస్తువు వ్యంజింపబడుటకు ఉదాహరణం చూపుతున్నాడు-

గాథ: ఓల్లోల్లకరఅరఅక్ఖఏహిం తుహ లోణేసు మహ దిణ్ణమ్,
రత్తంసుఅం పఆఓ కోవేణ పుణో ఇమేణ అక్కవిఆ.

"ఆర్ద్రార్ద్రకరజరదనక్షతైస్తవ లోచనయోర్మమ దత్తమ్,
రక్తాంశుకం ప్రసాదః కోపేన పునరిమే నాక్రాన్తే".

వృ. అత్ర కిమితి లోచనే కుపితే వహసి ఇతి ఉత్తరాలంకారేణ న కేవలమార్ద్రనఖక్షతాని గోపాయసి యావత్తేషామహం ప్రసాదనపాత్రం జాతేతి వస్తు.

వ్యా. ఆర్ద్రార్ద్రేతి:- భర్త శరీరంమీద ప్రతినాయికాసంగంవల్ల ఏర్పడిన నఖక్షతదంతక్షతాదులు చూచి కోపించిన నాయిక—"నీ కళ్ళు కోపంతో ఎఱ్ఱగా

ఉన్నావేమి"అని ప్రశ్నించిన భర్తతో పలికిన మాటలు. తవ = నీయొక్క, (నీ శరీరంమీద కనబడుతూన్న), ఆర్ద్రార్ద్రకరజరదనక్షతైః = పచ్చిపచ్చిగా ఉన్న నఖదంతక్షతాలచేత, మమ = నాయొక్క, నయనయోః = నేత్రములమీద, ప్రసాదః = ప్రసాదముగా, రక్తాంశుకమ్ = ఎఱ్ఱని వస్త్రం, దత్తమ్ = ఇవ్వబడినది. ఇమే = ఇవి, కోపేన పునః = కోపంచేతనైతే, నాక్రాన్తే = ఆక్రమించబడలేదు.

వి. ఇక్కడ నాయిక పలికిన మాటలను పట్టి "నీ నేత్రాలు ఎఱ్ఱగా ఉన్నా యేమి?"అని అతడు ప్రశ్నించి నట్లు ఊహించుటచేత ఇది ఉత్తరాలంకారం.

అత్రేతి:- ఇక్కడ "కోపించిన నేత్రాలను వహించి ఉన్నా వేమి ?" అను ఉత్తరాలంకారంచేత_"కేవలం ఆర్ద్రనఖక్షతాలను నీవు కప్పిపుచ్చడమే కాదు; నేను వాటి అనుగ్రహానికి పాత్రురాలను కూడా అయ్యాను" అను వస్తువు గమ్యం ఆవుతున్నది.

వి. ఇక్కడ వక్త్రి కవినిబద్ధ, నఖక్షతాదులు రక్తపటాన్ని ప్రసాదంగా ఇవ్వడం తత్కల్పితం; లోకప్రసిద్ధం కాదు.

అవ:- కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధాలంకారరూపార్థంచేత అలంకారం వ్యంజింపబడడానికి ఉదాహరణం చూపుతున్నాడు_

గాథ. మహిలాసహస్సభరిఏ తుహ హిఅఏ సుహఅ సా అమాఅన్తీ.
 అణుదిణమణణ్ణకమ్మా అఙ్గం తణుఅం వి తణోఏఇ. 71

"మహిళాసహస్రభరితే తవ హృదయే సుభగ సా అమాన్తీ.
అనుదినమనన్యకర్మా అఙ్గం తనుకమపి తనయతి"

వృ. అత్ర హేత్వలంకారేణ 'తనో స్తనూకరణేఽపి తవ హృదయే న వర్తతే' ఇతి విశేషోక్తిః. ఏషు కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రనిష్పన్న శరీరో వ్యఞ్జకః. ఏవం ద్వాదశ భేదాః.

వ్యా. విరహంచేత కృశించిన నాయికను గూర్చి ఆమె సఖురాలు నాయకునకు తెలుపుచున్నది. సుభగ = సుందరుడా ! సా = ఆమె, మహిలాసహస్రభరితే = స్త్రీల సహస్రంతో నిండిన, తవ = నీయొక్క, హృదయే = హృదయమునందు, అమాన్తీ = ఇమడనిదై, అనుదినమ్ = ప్రతిరోజూ, అనన్యకర్మా = మఱొక పని ఏదీ లేనిదై, తనుకమపి = సన్నగా ఉన్నా, అఙ్గమ్ = శరీరాన్ని, తనయతి = సన్నం అయేటట్లు చేస్తున్నది.

వి. ఆమె హృదయంలో ఇమడకపోవడానికి కారణం అది అనేక స్త్రీలతో కిక్కిరిసి ఉండడం. ఆమె ఇంకా శరీరాన్ని సన్నంగా ఉండేటట్లు చేయడానికి కారణం ఇమడకపోవడం. ఇవి రెండు హేత్వలంకారాలు.

అత్రేతి - ఇక్కడ హేత్వలంకారంచేత (రెండు హేత్వలంకారాలచేత), "శరీరాన్ని ఇంత సన్నంగా చేసినా కూడ నీ హృదయంలో ఈమె లేదు"అని విశేషోక్త్యలంకారం గమ్యం అవుతున్నది. (కారణం ఉన్నా కార్యం కలగక పోవడం విశేషోక్త్యలంకారం). ఈ ఉదాహరణలలో వ్యంజకమైన అర్థం కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తి సిద్ధం. ఇట్లు పన్నెండు భేదాలు.

కా. శబ్దార్థోభయభూరేకః

వృ. యథా

శ్లో॥ అతన్ద్రిచన్ద్రాభరణా సముద్దీపితమన్మథా
తారకాతరలా శ్యామా సానన్దం న కరోతి కమ్. 72

వృ. అత్రోపమా వ్యఙ్గ్యా.

వ్యా. శబ్దేతి-శబ్దార్థములు రెండింటియొక్క శక్తివలన ఉద్భవించే ధ్వని ఒకే విధమైనది. ఎట్లనగా

అతన్ద్రేతి - అతన్ద్రిచన్ద్రాభరణా = ప్రకాశించుచున్న చంద్రుడు ఆభరణంగా గలది, సముద్దీపితమన్మథా = ఉద్దీపింపచేయబడిన మన్మథుడు కలది (మన్మథోద్దీపకము), తారకాతరలా = అల్పమైన నక్షత్రాలు కలదీ అయిన, శ్యామా = రాత్రి, కమ్ = ఎవనిని, సానన్దమ్ = ఆనందంతో కూడినవానినిగా, న కరోతి = చెయ్యదు ? (మరొకఅర్థం) - అతన్ద్రి చన్ద్రాభరణా = అలసత్వం లేనిదీ, కర్పూరం లేదా ఒకవిధమైన సువర్ణమయశిరోభూషణం అలంకారంగా గలది, సముత్ = సంతోషంతో కూడినది, దీపిత మన్మథా=ఉద్దీపింపచేయబడిన మన్మథుడు కలదీ, తారకాతరలా = చంచలమైన కనుగ్రుడ్లు కలదీ అయిన, శ్యామా = పదారు సంవత్సరాల నాయిక, కం సానన్దం న కరోతి = ఎవనిని ఆనందం కలవానినిగా చేయదు ?

ఇక్కడ స్త్రీ రాత్రి వలె ఉన్న దని కాని, రాత్రి స్త్రీ వలె ఉన్నది అని కాని ఉపమాలంకారం వ్యంగ్యం.

వి. ఈ శ్లోకంలో చన్ద్రి-తారకా-తరల-శ్యామాశబ్దాలు పరివృత్త్యసహాలు. ఆ శబ్దాలు మార్చి వాటి పర్యాయాలు ప్రయోగిస్తే కుదరదు. అతన్ద్రి-అభరణ-సముద్దీపితమన్మథ శబ్దాలు పరివృత్తిసహాలు. పరివృత్త్యసహశబ్దాలను పట్టి ఇక్కడ శబ్దశక్తిమూలకత్వం, పరివృత్తిసహశబ్దాలనుపట్టి అర్థశక్తిమూలత్వం ఉన్నాయి. అందుచేత ఇది శబ్దార్థోభయశక్తిమూలకవస్తువుచేత ఉపమాధ్వని. ఇది సంలక్ష్యక్రమం. వస్తువుచేత అలంకారధ్వని మాత్రమే శబ్దార్థోభయమూలకం.

కా. భేదా అష్టాదశాస్య తత్. 41

వృ. అస్యేతి ధ్వనేః

వ్యా. తత్ = ఆ కారణంవలన, అస్య = ఈ ధ్వనియొక్క భేదాః = భేదాలు, అష్టాదశ = పద్దెనిమిది. అస్య అనగా, ధ్వనియొక్క అని అర్థం.

వి. లక్షణామూలకమైన అవివక్షితవాచ్యధ్వని — 'అర్థాంతరసంక్రమిత వాచ్యధ్వని'అనీ, 'అత్యంతతిరస్కృతవాచ్యధ్వని'అనీ రెండు విధాలు. అభిధా మూలకమైన వివక్షితాన్యపరవాచ్యధ్వని—'సంలక్ష్యక్రమధ్వని'అనీ, 'అసంలక్ష్య క్రమధ్వని' అనీ రెండు విధాలు. రసభావాదిధ్వను లన్నీ అసంలక్ష్యక్రమాలు. వీటిలో అనేకభేదా లున్నా అసంలక్ష్యక్రమత్వాన్ని పట్టి ఒకే భేదంగా పరిగణింప బడతాయి. ఇంక సంలక్ష్యక్రమధ్వని 'శబ్దశక్తిమూలకధ్వని' అనీ, 'అర్థశక్తి మూలకధ్వని' అనీ రెండు విధాలు. వీటిలో శబ్దశక్తిమూలకం 'వస్తుధ్వని' అనీ, 'అలంకారధ్వని'అనీ రెండు రకాలు. అర్థశక్త్యుద్భవధ్వని పైనచూపినట్లు పన్నెండు రకాలు. ఉభయశక్త్యుద్భవధ్వని ఒకరకరం. ఈ విధంగా ధ్వని పద్దెనిమిది విధాలు- (1) అర్థాంతరసంక్రమితవాచ్యధ్వని, (2) అత్యన్తతిరస్కృతవాచ్యధ్వని (3) రసాద్యలక్ష్యక్రమధ్వని, (4) శబ్దశక్తిమూలకవస్తురూపసంలక్ష్యక్రమధ్వని, (5) శబ్దశక్తిమూలకాలంకారరూపసంలక్ష్యక్రమధ్వని (6-17) పన్నెండు అర్థ శక్త్యుద్భవ సంలక్ష్యక్రమధ్వనిభేదాలు (18) ఉభయశక్త్యుద్భవసంలక్ష్యక్రమధ్వని.

వృ. నను రసాదీనాం బహుభేదత్వేన కథమష్టాదశేత్యత ఆహ-

కా. రసాదీనామనన్తత్వాద్భేద ఏకో హి గణ్యతే.

వృ. అనన్తత్వాదితి:- తథాహి - నవ రసాః. తత్ర శృఙ్గారస్య ద్వౌ భేదౌ, సంభోగో విప్రలమ్భశ్చ. సంభోగస్యాపి పరస్పరావలోకనాలిఙ్గనపరిచుమ్బనాదికుసుమోచ్చయజలకేలి సూర్యాస్తమయచన్ద్రోదయ షడృతువర్ణనాదయో బహవో భేదాః. విప్రలమ్భస్యాభిలాషాదయ ఉక్తాః. తయోరపి విభావానుభావవ్యభిచారివైచిత్ర్యమ్. తత్రాపి నాయకయోరుత్తమమధ్యమాధమప్రకృతిత్వమ్. తత్రాపి దేశకాలావస్థాదిభేదా ఇత్యేకస్యైవ రసస్యానన్త్యమ్? కా గణనా త్వన్యేషామ్? అసంలక్ష్యక్రమత్వం తు సామాన్యమాశ్రిత్య రసాదిధ్వనిభేద ఏక ఏవ గణ్యతే.

వ్యా. నను ఇతి:- రసాదిధ్వనుల భేదాలు చాలా ఉన్నాయి కదా; వద్దెనిమిది భేదాలే ఏమిటి అని ఆశంకించుకొని చెపుతున్నాడు-రసాదీనామ్ ఇతి:- రసాదీనామ్ = రసభావతదాభాసాదులు, అనన్తత్వాత్ = అనంతమైనవి అవడంవల్ల, (అన్నిటినీ కలిపి) ఏకః = ఒక్క, భేదః = భేదమే, గణ్యతే = లెక్కింపబడుచున్నది.

తథాహి ఇతి:- అది యుక్తమే కదా (ఎందుచేత అనగా) రసాలు తొమ్మిది; ఆ రసాలలో శృంగారరసానికి సంభోగశృంగారం,విప్రలంభశృంగారం అని రెండు భేదాలుఉన్నాయి. సంభోగశృంగారంలోనే ఒకరినొకరు చూడడం, ఆలింగనం, చుంబనం మొదలైన, పుష్పాలు కోయడం, జలక్రీడ, సూర్యాస్తమయం, చంద్రోదయం,ఆరు ఋతువుల వర్ణనం మొదలైన అనేకభేదా లున్నాయి. విప్రలంభశృంగారానికి సంబంధించిన అభిలాషాదులనుగూర్చి వెనక చెప్పి ఉన్నాం. ఈ ద్వివిధ శృంగారాలలో కూడా ఆ యా విభావానుభావవ్యభిచారులకు (వాటి వైవిధ్యాన్ని పట్టి) వైచిత్ర్యం ఉంటుంది. నాయికానాయకులు ఉత్తమప్రకృతులుగా ఉండడం, మధ్యమప్రకృతులుగా ఉండడం, అధమప్రకృతులుగా ఉండడం వీటిని పట్టి కూడా భేదాలు ఏర్పడతాయి. అందులోను దేశ (లతాకుంజాదికం) కాల (వసంతాదికం) అవస్థా (నవోఢా-నవయౌవనాదికం) దుల భేదాలు అనేకం. ఈ విధంగా ఒక్క రసమే (శృంగారరసమే) అనంతభేదాలలో ఉంటుంది. మిగిలిన రసాల భేదాలు కలిస్తే ఇంక లెక్కపెట్టేది ఎట్లు? అందుచేత రసాదులు

అన్నీ అసంలక్ష్యక్రమాలు అవడంచేత ఈ అసంలక్ష్యత్వం అనే సామాన్య ధర్మాన్ని పట్టి రసాదిధ్వనిభేదం ఒకటిగా మాత్రమే పరిగణించబడుతుంది.

కా. వాక్యే ద్వ్యుత్థః,

వృ. ద్వ్యుత్థ ఇతి శబ్దార్థోభయశక్తిమూలః.

వ్యా. వాక్యే ఇతి:- ద్వ్యుత్థః = రెండింటివల బయలుదేరినది, వాక్యే = వాక్యమునందు మాత్రమే ఉండును.

"ద్వ్యుత్థః అనగా శబ్దార్థోభయశక్తిమూలకధ్వని అని అర్థం."

వి. అట్టి ఉభయమూలకధ్వని వాక్యంలో మాత్రమే ఉంటుంది కాని పదంలో ఉండదు; ప్రబంధంలో కూడ ఉండదు. ఇక్కడ వాక్యం అనగా పద సముదాయం.

కా. పదేఽప్యన్యే.

వృ. అపిశబ్దాద్వాక్యేఽపి. ఏకావయవస్థితేన భూషణేన కామినీవ పదద్యోత్యేన వ్యఙ్గ్యేన వాక్యవ్యఙ్గ్యాపి భారతీ భాసతే. తత్ర పదప్రకాశ్యత్వే క్రమేణోదాహరణాని.

వ్యా. పదే ఇతి :- అన్యే = మిగిలిన పదిహేను భేదాలు, పదేఽపి = పదంలో కూడా ఉంటాయి. అపీతి:- 'అపి' అనడంచేత ఇవి వాక్యంలో కూడా ఉంటాయి అని అర్థం. ఒక్క అవయవం మీద ఉన్న భూషణంచేత పూర్తిగా కామిని అలంకృత అయినట్లు పదద్యోత్యమైన వ్యంగ్యార్థంచేత వాక్యంచేత వ్యంజింపచేయబడే స్ఫోటరూపమైన భారతి (వాక్కు లేదా కావ్యం) అంతా ప్రకాశిస్తుంది. ఆనందవర్ధనుడు ఇదే భావంగల శ్లోకాన్ని ధ్వన్యాలోకంలో వ్రాశాడు-

"ఏకావయవసంస్థేన భూషణేనేవ కామినీ
పదవ్యఙ్గ్యేన సుకవేర్ధ్వనినా భాతి భారతీ"

పదప్రకాశ్యవాక్య ప్రకాశ్యాలలో పదప్రకాశ్యత్వానికి క్రమంగా ఉదాహరణలు చూపబడును.

అవ. అవివక్షితవాచ్యధ్వనిభేదాలలో పదవాచ్యార్థాంతరసంక్రమిత వాచ్యధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ యస్య మిత్రాణి మిత్రాణి శత్రవః శత్రవస్తథా
అనుకమ్ప్యోఽనుకమ్ప్యశ్చ స జాతః స చ జీవతి. 73

వృ. అత్ర ద్వితీయమిత్రాదిశబ్దా ఆశ్వస్తత్వనియన్త్రణీయత్వ స్నేహపాత్రత్వాదిసంక్రమితవాచ్యాః.

వ్యా. యస్య = ఎవనియొక్క, మిత్రాణి = స్నేహితులు, మిత్రాణి = ఆశ్వస్తులో అనగా విశ్వాసపాత్రులో, తథా = మరియు, శత్రవః = శత్రువులు, శత్రవః = నిగ్రహించదగినవారో, అనుకమ్ప్యః = దయచూపవలసినవాడు, అనుకమ్ప్యః చ = స్నేహపాత్రుడో, జాతః = పుట్టిన, సః = అతడే, జీవతి = జీవించి ఉన్నాడు.

వి. ఇక్కడ ఉన్న రెండవ మిత్రాదిశబ్దాల వాచ్యార్థాలు ఉపయోగం లేనివి గాన అవివక్షితవాచ్యాలై ఆశ్వస్తత్వాద్యర్థాలను లక్షణయా బోధిస్తాయి. (అర్థాంతరసంక్రమితవాచ్యాలు అవుతాయి). దీనిచేత "నాయకుడు అందరి విషయంలోను తగువిధంగా ప్రవర్తిస్తాడు" అనేది వ్యంగ్యార్థం. ఇదే ఈ ఉపాదానలక్షణకు ఫలం. ఈ శ్లోకంలో ఉన్న "యస్య మిత్రాణి" ఇత్యాదులు మూడు మూడు వాక్యాలు. వాటిలో ఉన్న 'మిత్రాణి' మొదలైన పదాలు వ్యంగ్యార్థప్రకాశకాలు.

అత్రేతి :- 'ఇక్కడ రెండవ మిత్రాదిశబ్దాలు అశ్వస్తత్వ- నియంత్రణీయత్వ- స్నేహపాత్రత్వాద్యర్థాలు బోధించడానికై సంక్రమితవాచ్యాలైనవి.

అవ. అత్యంతతిరస్కృతవాచ్యపదప్రకాశ్యధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు-

గాథ. ఖలవవహారా దీసన్తి దారుణా జహవి తహవి ధీరాణామ్,
హిఅఅవఅస్సబహుమఆ ణహు వవసాఆ విముజ్ఝన్తి.

"ఖలవ్యవహారా దృశ్యన్తే దారుణా యద్యపి తథాపి ధీరాణామ్,
హృదయవయస్యబహుమతా న ఖలు వ్యవసాయా విముహ్యన్తి."

అత్ర విముహ్యన్తీతి.

వ్యా. ఖలేతి :- ఖలవ్యవసాయాః = దుష్టుల వ్యవహారాలు. దారుణాః = దారుణాలైనవిగా, యద్యపి దృశ్యన్తే = కనబడుచున్నా, తథాపి = అట్లయినా, ధీరాణామ్ = ధీరులయొక్క, హృదయవయస్యబహుమతాః = హృదయాలనే మిత్రులచేత అనుమోదించబడిన, వ్యవసాయాః = వ్యవహారాలు, న విముహ్యన్తి = మోహముచెందవు (అడ్డుకొనబడవు. ఆగవు)

"ఇక్కడ 'విముహ్యన్తి' అనే పదం ధ్వనిప్రకాశకం"

వి. అచేతనాలైన వ్యవహారాలు మోహం చెందడం అనేది కుదరదు. అందుచేత 'అడ్డుకొనబడడం' 'ఆగిపోవడం' అనే అర్థాన్ని లక్షణచేత బోధిస్తుంది. ఎట్టి పరిస్థితులలోనైనా ఇష్టకార్యం చేయడం అనే ఫలం వ్యంగ్యం. ఇది అత్యంత తిరస్కృతవాచ్యం.

అవ. పదప్రకాశ్యమైన అలక్ష్యక్రమవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ లావణ్యం యదసౌ కాన్తిస్తద్రూపం స వచఃక్రమః,
తదా సుధాస్పదమభూదధునా తు జ్వరో మహాన్. 75

వృ. అత్ర తదాదిపదైరనుభవైకగోచరా అర్థాః ప్రకాశ్యన్తే.

వ్యా. లావణ్యమితి :- ఒక వియోగి అనుకుంటున్న మాటలు. తత్ = ఆ అనగా అనుభవానికి మాత్రమే గోచరమైన, వర్ణింప శక్యం కాని అని అర్థం. అసౌ = ఆ, కాన్తిః = కాంతి, తత్ = ఆ, రూపమ్ = రూపము, సః = ఆ, వచఃక్రమః = మాటల క్రమం, తదా = అప్పుడు, (ఆమె దగ్గర ఉన్నపుడు) సుధాస్పదమ్ = అమృతస్థానంగా, అభూత్ = ఆయెను. అధునా తు = ఇప్పుడైతే, మహాన్ = గొప్ప, జ్వరః = జ్వరము.

అత్రేతి :- ఇక్కడ తత్, అసౌ ఇత్యాది పదాలచేత "అవి అనుభవైకగోచరాలైన విషయాలు" అని సూచించబడుతున్నది.

వి. మాటలలో వర్ణించడానికి శక్యం కావు అని సూచించడం ద్వారా లావణ్యాదులు లోకోత్తరములైనవి అని ప్రతిపాదించడంచేత విప్రలంభశృంగా

రాభివ్యక్తి జరుగుతూన్నది. దీని అభివ్యక్తికి 'తత్' మొదలైన పదాలు అధికంగా తోడ్పడుతున్నాయి గాన ఈ వ్యంగ్యం పదప్రకాశ్యం.

అవ. రసాదివ్యంజకత్వం కేవలం సర్వనామపదాలకే కాదు; ఇతరపదాలు కూడా వ్యంజకాలు కావచ్చును అని సూచిస్తూ మరొక ఉదాహరణం చూపు తున్నాడు-

వృ. యథా వా-

శ్లో॥ ముగ్ధే ముగ్ధతయైవ నేతుమఖిలః కాలః కిమారభ్యతే
మానం ధత్స్వ ధృతిం బధాన ఋజుతాం దూరే కురు ప్రేయసి,
సఖ్యైవం ప్రతిబోధితా ప్రతివచస్తామాహ భీతాననా
నీచైః శంస హృది స్థితో హి నను మే ప్రాణేశ్వరః శ్రోష్యతి.

వృ. అత్ర భీతాననేతి. ఏతేన హి నీచైః శంసనవిధానస్య యుక్తతా గమ్యతే. భావాదీనాం పదప్రకాశ్యత్వేఽధికం న వైచిత్ర్యమితి న తదుదాహ్రియతే.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

ముగ్ధే ఇతి :- ఇది అమరుశతకంలోని శ్లోకం. ప్రియుని విషయంలో ప్రణయకోపాలు వహించవలసిందిగా బోధిస్తూన్న సఖురాలితో భర్తపై అత్యధిక మైన ప్రేమ, వినయం ఉన్న నాయిక అన్న మాటలు :- ముగ్ధే = ఓ ముగ్ధా! (అమాయకురాలా), అఖిలః = సమస్తమైన, కాలః = కాలం, ముగ్ధతయైవ = ముగ్ధత్వంతోనే, నేతుమ్ = గడపడానికి, కిమ్ = ఎందుకు, ఆరభ్యతే = ఆరంభించ బడుతున్నది? మానమ్ = మానమును (కోపమును), ధత్స్వ = ధరించుము, ధృతిమ్ = ధైర్యమును, బధాన = బంధించుము (గట్టిగా పట్టుకొనుము). ప్రేయసి = ప్రియునివిషయంలో, ఋజుతామ్ = ఋజుత్వాన్ని, దూరే కురు = దూరం చేయుము. సఖ్యా = సఖురాలిచేత. ఏవమ్ = ఇట్లు, ప్రతిబోధితా = బోధించబడిన ఆ నాయిక, భీతాననా = భయపడిన ముఖం కలదై, తామ్ = ఆ సఖిని గూర్చి, ఆహ = పలికెను. నీచైః = మెల్లగా, శంస = పలుకుము; మే హృది స్థితః = నా

హృదయంలో ఉన్న, ప్రాణేశ్వరః = ప్రాణేశ్వరుడు, శ్రోష్యతి నను = విన గలడు.

అత్రేతి :- ఇక్కడ 'భీతాననా' అని చెప్పడంచేత "మెల్లగా మాటలాడు" అని చెప్పడం యుక్తం అని గమ్యం అవుతున్నది భయం సూచిస్తున్న అకృత్రిమానురాగం శృంగారాన్ని వ్యంజింప చేస్తూన్నది. ఈ వ్యంజనావ్యాపారంలో 'భీతా ననా' అనే పదం ప్రముఖస్థానాన్ని వహిస్తూన్నది కాబట్టి ఇది పదప్రకాశ్యరస ధ్వనికి ఉదాహరణం.

భావేతి :- పదప్రకాశ్యత్వం భావాదులకు కూడా ఉండవచ్చును. అయినా దానిలో అంతగా వైచిత్ర్యం ఉండదు. అందుచేత వాటికి ఉదాహరణలు చూపడం లేదు.

అవ. ఇటుపైన పదిహేను సంలక్ష్యక్రమ భేదాలలో పదప్రకాశ్యత్వానికి ఉదాహరణలు చూపబడుతున్నాయి. వాటిలో శబ్దశక్తిమూలధ్వనిలో వస్తువుచేత అలంకారవ్యంజనకు ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ రుధిరవిసరప్రసాధితకరవాలకరాలరుచిరభుజపరిఘః,
ఝటితి భృకుటివిటఙ్కితలలాటపట్టో విభాసి నృప భీమః.

వృ. అత్ర భీషణీయస్య భీమసేన ఉపమానమ్.

వ్యా. రుధిరేతి :- భీమ = భయంకరుడవైన, నృప = రాజా! "రుధిర... పరిఘః"- రుధిర = రక్తముయొక్క, విసర = ప్రవాహంచేత, ప్రసాధిత = అలంకరించబడిన, కరవాల = ఖడ్గంచేత, కరాల = భయంకరము, రుచిర = సుందరమూ అయిన, భుజపరిఘ = పరిఘ (కోటద్వారం గడియ) వంటి భుజం గల నీవు, ఝటితి = హఠాత్తుగా, భ్రుకుటివిటఙ్కితలలాటపట్టః = కనుబొమ్మల విరుపు చేత తరంగితమైన లలాటపట్టం కలవాడవై, విభాసి = ప్రకాశించుచున్నావు.

అత్రేతి :- ఇక్కడ భీషణీయునకు భీమసేనుడు ఉపమానం.

వి. భీషణీయుడు అనగా భయంకరుడైన ప్రకృతం వర్ణించబడుతున్న రాజు. 'భీమ' అని సంబోధించడంచేత ఈ రాజుకు భీముణ్ణి ఉపమానంగా చెప్పి

నట్లు సూచించబడుతున్నది. అందుచేత ఇక్కడ ఉపమాలంకారం ప్రధానంగా 'భీమ' పదంచేత వ్యంగ్యం అవుతున్నది.

అవ. శబ్దశక్తిమూలధ్వనిలో వస్తువుచేత వస్తువు వ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ భుక్తిముక్తికృదేకాన్తసమాదేశనతత్పరః.
కస్య నానన్దనిస్యన్దం విదధాతి సదాగమః. 78

వృ. కాచిత్ సంకేతదాయినమేవం ముఖ్యయా వృత్త్యా శంసతి.

వ్యా. భుక్తీతి :- ఇతరజను లెవరో ఉన్న సమయంలో ఉపనాయకుడు వచ్చినప్పుడు అప్రస్తుతమైన వేదాన్ని ప్రశంసించే వ్యాజంతో అతని రాకవలన కలిగిన హర్షాన్ని వ్యక్తీకరిస్తున్న స్త్రీ పలికిన మాట లివి- "భుక్తి... ...పరః". భుక్తి = స్వర్గాదిభోగాలను, ముక్తి = మోక్షాన్ని, కృత్ = చేసే, ఏకాన్త = నిశ్చితమైన, సమాదేశన = ఉపదేశమునందు, తత్పరః = తత్పరమైన (చాల ఆసక్తి గల), సదాగమః = ఉత్తమమైన వేదం, కస్య = ఎవనికి, ఆనన్దనిస్యన్దమ్ = ఆనందప్రవాహాన్ని, న విదధాతి = చేయదు? మరొక అర్థం. భుక్తి = సురతాది భోగాలను, ముక్తి = విరహాదిబాధా విముక్తిని, కృత్ = చేసే, ఏకాన్త = రహస్య ప్రదేశము యొక్క (సంకేత స్థానాదికముయొక్క), సమాదేశన = చెప్పడంతో, తత్పరః = ఆసక్తిగల, సదాగమః = సుందరుని రాక, కస్య = ఎవనికి, ఆనన్ద నిస్యన్దమ్ = ఆనందప్రవాహాన్ని, న కరోతి = చేయదు?

కాచిత్ ఇతి :- ఒక యువతి సంకేతదాయినమ్ = ఉపనాయకుణ్ణి ఈ విధంగా ముఖ్యవృత్తిచేత అనగా ప్రధానమైన అభిధావృత్తిచేత స్తుతిస్తూన్నది.

వి. వాస్తవంలో ఉపనాయకుణ్ణి గూర్చిన అర్థమే ప్రకృతం అయినా ఆ యువతి మాటలాడే తీరును పట్టి వేదానికి సంబంధించిన అర్థం ప్రకృతం అయి నట్లు పై అర్థం వ్యంగ్యం అన్నట్లు కనబడుతున్నాయి. ఈ వ్యంగ్యార్థం బోధించ డంలో 'సదాగమః' అనే పదం ప్రధానపాత్ర వహిస్తూన్నది. గాన ఇది పద ప్రకాశ్యం. 'సదాగమ' పదం పరివృత్త్యసహం.

అక్కడ ఉన్న శ్రోతల దృష్ట్యా పతితల దృష్ట్యా ఇది (ఉపనాయకునికి

సంబంధించిన అర్థం) వ్యంగ్యం అయినా ఆ నాయికానాయకుల దృష్ట్యా ముఖ్యార్థమే. అందుచేతనే 'ముఖ్యయా వృత్త్యా' అన్నాడు.

అవ. అర్థశక్తిమూలధ్వనిలో స్వతఃసంభవ్యర్థం వ్యంజకం అయినప్పుడు వస్తువుచేత వస్తుధ్వనిని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ సాయం స్నానముపాసితం మలయజేనాఙ్గం సమాలేపితం
యాతోఽస్తాచలమౌలిమమ్బరమణిర్విస్రబ్ధమత్రాగతిః,
ఆశ్చర్యం తవ సౌకుమార్యమభితః క్లాన్తాసి యేనాధునా
నేత్రద్వన్ద్వమమీలనవ్యతికరం శక్నోతి తే నాసితుమ్. 79

వృ. అత్ర వస్తునా కృతపరపురుషపరిచయా క్లాన్తాసీతి వస్తు అధునాపదద్యోత్యం వ్యజ్యతే.

వ్యా సాయమితి :- ఉపపతిసంభోగం చేసి దానివలన కలిగిన శ్రమను తొలగించుకొనడంకోసం స్నానాదులు చేసిన ఒక యువతితో ఆ రహస్యం తెలిసిన మరొక యువతి వైదగ్ధ్యంతో అంటూన్న మాట లివి. సాయమ్ = సాయంకాలమునందు, స్నానమ్ = స్నానము, ఉపాసితమ్ = చేయబడింది. మలయజేన = మంచి గంధంచేత, అఙ్గమ్ = శరీరం, సమాలేపితమ్ = బాగా పూయబడింది. అమ్బరమణిః = సూర్యుడు, అస్తాచలమౌలిమ్ = అస్తాద్రిశిఖరాన్ని గూర్చి, యాతః = వెళ్ళినాడు. విస్రబ్ధమ్=విశ్వాసపూర్వకంగా అనగా కంగారేమీ లేకుండా, మందంగా, అత్ర = ఇక్కడికి, ఆగతిః = రాక జరిగింది. తవ = నీయొక్క. సౌకుమార్యమ్ = సౌకుమార్యం, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యకరంగా ఉంది. యేన = దేనిచేత, అధునా = ఇప్పుడు, క్లాన్తా = అలసినదానవు, అసి = అయినావో. తే = నీయొక్క, నేత్రద్వయమ్ = నేత్రముల ద్వయం, అమీలనవ్యతికరమ్=మూసికొనిపోవడంతో సంబంధం లేనిదిగా, ఆసితుమ్ = ఉండడానికి, న శక్నోతి = సమర్థం అవడం లేదు.

అత్రేతి :- ఇక్కడ వస్తువుచేత "నువ్వు చేయబడిన పరపురుషసంబంధం కలదానివై అలసిపోయావు" అనే వస్తువు 'అధునా' అనే పదంచేత ద్యోత్యమై వ్యంగ్యం అవుతున్నది.

వి. "స్నానం చేశావు; చందనం పూసుకొన్నావు; ఎండ లేదు; తొందరగా నడిచి రాలేదు, అయినా కళ్ళుమూసికొనిపోయే టంతగా ఇప్పుడు నువ్వు ఇంతగా అలసిపోయినా వంటే నీ సౌకుమార్యం ఆశ్చర్యకరంగా ఉంది" అనే వస్తువుచేత "నువ్వు పరపురుషునితో నిర్దయరతిక్రీడ సలిపావు" అనే వస్తువు వ్యంగ్యంఅవుతూన్నది. ఈ వ్యంగ్యానికి 'అధునా'(ఇప్పుడు) అన్న పదం ప్రధాన ద్యోతకంగా ఉంది.

అవ. స్వతఃసంభవివస్తువుచేత అలంకారం వ్యంగం ఆవడానికి ఉదాహరణ చూపుతున్నాడు-

శ్లో॥ తదప్రాప్తిమహాదుఃఖవిలీనాశేష పాతకా
తచ్చిన్తావిపులాహ్లాదక్షీణపుణ్యాచయా తథా, 80
చిన్తయన్తీ జగత్సూతిం పరబ్రహ్మస్వరూపిణమ్
నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గతాన్యా గోపకన్యకా. 81

వృ. అత్ర జన్మసహస్రైరుపభోక్తవ్యాని దుష్కృతసుకృతఫలాని వియోగదుఃఖచిన్తాహ్లాదాభ్యామనుభూతానీత్యుక్తమ్. ఏవం చాశేషపద ద్యోత్యే అతిశయోక్తిః.

వ్యా. తదప్రాప్తి ఇత్యాది:— ఇవి విష్ణుపురాణంలోని శ్లోకాలు: కృష్ణాసక్తచిత్తురాలైన ఒక గోపకాంత స్థితిని వర్ణిస్తున్నాయి. తదప్రాప్తి మహాదుఃఖ విలీనాశేష పాతకా = ఆతడు లభించకపోవడంచేత కలిగిన మహాదుఃఖంచేత నశించిన సమస్తపాపాలు కలదీ, తథా = మరియు, తచ్చిన్తావిపులాహ్లాదక్షీణపుణ్యాచయా = ఆతనిని చింతించుటవలన కలిగిన గొప్ప ఆనందంచేత క్షీణించిన పుణ్యసముదాయం కలదీ అయిన, అన్యా = మరొక, గోపకన్యకా = గోపకన్యక. జగత్సూతిమ్ = జగత్తుకు కారణభూతుడైన, పరబ్రహ్మస్వరూపిణమ్ = పరబ్రహ్మస్వరూపుడైన ఆ శ్రీకృష్ణుణ్ణి, నిరుచ్ఛ్వాసా = ఉచ్ఛ్వాసములు లేనిదై ఉండి, చిన్తయన్తీ = చింతిస్తూన్నదై, ముక్తిమ్ = మోక్షమును, గతా = పొందినది.

వి. మోక్షం లభించాలంటే పుణ్యపాపాలు రెండూ పూర్తిగా నశించాలి. అవి నశించాలంటే వాటి ఫలితాన్ని అనుభవించి తీరాలి. శ్రీకృష్ణవియోగంవల్ల

కలిగిన మహాదుఃఖం అనుభవించడంచేత ఆ గోపిక పాపాలన్నీ నశించాయి. ఆతన్ని ధ్యానించడంవల్ల కలిగిన మహానందంవల్ల పుణ్యాలన్నీ నశించాయి. అప్పుడు పుణ్యపాపాలు రెండూ తొలగి శుద్ధురాలుగా ఉన్న ఆమె పరబ్రహ్మ స్వరూపుడైన కృష్ణుణ్ణే ధ్యానిస్తూ మోక్షం పొందింది అని భావం.

అత్రేతి:- ఇక్కడ వేలకొలది జన్మలలో అనుభవించవలసిన పాపపుణ్య ఫలాలు వియోగదుఃఖ-చింతనాహ్లాదాలచేత అనుభవించబడ్డాయి అని చెప్పబడింది. ఇక్కడ ఉన్న 'అశేష' పదమూ, 'చయ' పదమూ అతిశయోక్త్యలంకారాన్ని ద్యోతింపచేస్తున్నాయి.

వి. ప్రారబ్ధకర్మ పాపపుణ్యాత్మకం అయి ఉంటుంది. ఆ పాపం, పుణ్యం నశించాలంటే అది ఇచ్చే ఫలితాలను వేలకొలది జన్మలలో అనుభవించాలి. అలా ఉండగా ఇక్కడ వియోగ-చింతలచేతనే ఆ పాపపుణ్యాలు నశించాయని చెప్పడం వల్ల రెండు అతిశయోక్త్యలంకారాలు. వీటిని 'అశేష' (సమస్తమైన) 'చయ' (సముదాయం) పదాలు ప్రధానంగా వ్యంజింపచేస్తున్నాయి.

అవ:- స్వతఃసంభవి అయిన అలంకారంచేత వస్తువు వ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ క్షణదాసావక్షణదా వనమవనం వ్యసనమవ్యసనమ్,
బత వీర తవ ద్విషతాం పరాఙ్ముఖే త్వయి పరాఙ్ముఖం సర్వమ్.

వృ. అత్ర శబ్దశక్తిమూలవిరోధాఙ్గేనార్థాన్తరన్యాసేన 'విధిరపి త్వామనువర్తతే' ఇతి 'సర్వ'పదద్యోత్యం వస్తు.

వ్యా. క్షణేతి:- వీర = వీరుడా! తవ = నీయొక్క, ద్విషతామ్ = శత్రువులకు, అసౌ = ఈ, క్షణదా = రాత్రి, అక్షణదా = క్షణద కానిది, అనగా సుఖమును ఇవ్వనిది; వనమ్ = వనము, అవనమ్ = అవనము. వనము కానిది, రక్షించేది అని రెండర్థాలు, వ్యసనమ్ = ద్యూతాదివ్యసనం, అవ్యసనమ్ = వ్యసనము కానిది: కాలక్షేపం చేయనిది అని రెండవ అర్థం. ఈ విధంగా, త్వయి = నీవు, పరాఙ్ముఖే = పరాఙ్ముఖుడవు అవగా, సర్వమ్ = అంతా కూడ, పరాఙ్ముఖమ్ = పరాఙ్ముఖమైపోయినది; తలక్రిందులైనది. బత = ఏమిఆశ్చర్యము! లేదా ఏమి కష్టము.

అత్రేతి - ఇక్కడ శబ్దశక్తిమూలవిరోధానికి అంగమైన అర్థాంతర న్యాసాలంకారంచేత "దైవం కూడా నిన్నే అనుసరిస్తూన్నది"అని 'సర్వ' పదద్యోత్యమైన వస్తువు వ్యంగ్యం అవుతున్నది.

వి. "త్వయి పరాఙ్ముఖే సర్వం పరాఙ్ముఖమ్"అనే వాక్యం క్షణద అక్షణద అయింది, వనం అవనం అయింది, వ్యసనం అవ్యసనం అయింది అనే మాటలలో ఉన్న విరోధాన్ని సమర్థిస్తూన్నది. అందుచేత ఇది అర్థాంతరన్యాసాలంకారం. పై విరోధానికి అంగం. దీనిచేత "దైవం కూడా నువ్వు చెప్పినట్లే వింటూన్నది" అన్న వస్తువు గమ్యం అవుతున్నది. దీనిలో 'సర్వ' పదం ప్రధానపాత్ర వహిస్తూన్నది అని అర్థం.

అవ:- స్వతఃసంభవియైన అలంకారం అలంకారాన్ని వ్యంజింపచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

గాథ. తుహ వల్లహస్స గోసమ్మి ఆసి అహరో మిలాణకమలదలో
ఇఅ ణవవహూవా సోఊణ కుణఇ వఅణం మహీసంముహమ్.

"తవ వల్లభస్య ప్రభాతే ఆసీదధరో మ్లానకమలదలమ్
ఇతి నవవధూః శ్రుత్వా కరోతి వదనం మహీసంముఖమ్"

వృ. అత్ర రూపకేణ త్వయాస్య ముహుర్ముహుః పరిచుమ్బనం తథా కృతం యేన మ్లానత్వమితి మిలాణాదిపదద్యోత్యం కావ్యలిఙ్గమ్. ఏషు స్వతఃసంభవీ వ్యఞ్జకః.

వ్యా. తవేతి:- ప్రభాతే = ప్రాతఃకాలమునందు, తవ వల్లభస్య = నీ ప్రియునియొక్క, అధరః = అధరోష్ఠం, మ్లానకమలదలమ్ = వాడిపోయిన పద్మదలంగా, ఆసీత్ = అయింది, ఇతి = ఇట్లు (ఈ మాటలు), శ్రుత్వా = విని, నవవధూః = నూతనవధువు, వదనమ్ = ముఖమును, మహీసంముఖమ్ = భూమికి అభిముఖమైనదానినిగా, కరోతి = చేయుచున్నది; సిగ్గుచేత తల వంచుతున్నది.

అత్రేతి:- ఇక్కడ (అధరమే కమలదలం) అనే రూపకాలంకారంచేత "నువ్వు మాటిమాటికి చుంబనం ఎలా చేసేవనగా ఆతని అధరం వాడిపోయింది",

(అది వాడిపోవడానికి నీ చుంబనమే కారణం) అన్న కావ్యలింగాలంకారం ప్రధానంగా "మిలాణకమలదలం"అనే పదం ద్వారా వ్యంజింపబడుతున్నది. పై ఉదాహరణలలో స్వతఃసంభవి అయిన అర్థం వ్యంజకం.

అవ:— వ్యంజకమైన అర్థం (వస్తువు) కవిప్రౌఢోక్తిమాత్ర సిద్ధం కాగా వస్తువు చేత వస్తువు వ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

గాథ. రాఈసు చందధవలాసు లలిఅమప్ఫాలిఊణ జో చావమ్,
ఏకచ్ఛత్తం విఅ కుణఇ భుఅణరజ్జం విజంభంతో. 84
"రాత్రీషు చన్ద్రధవలాసు లలితమాస్ఫాల్య యశ్చాపమ్,
ఏకచ్ఛత్రమివ కరోతి భువనరాజ్యం విజృమ్భమాణః".

వృ. అత్ర వస్తునా యేషాం కామినామసౌ రాజా స్మరస్తేభ్యో న కశ్చిదపి తదాదేశపరాఙ్ముఖ ఇతి జాగ్రద్భిరుపభోగపరైరేవ తైర్నిశాతి వాహ్యతే ఇతి భుఅణరజ్జ' పదద్యోతం వస్తు ప్రకాశ్యతే.

వ్యా రాఈసు ఇతి:- 'మానాన్ని నిర్వహించడం చాలా కష్టమైన పని'అని ఒక మానినితో సఖురాలు చెపుతున్న మాటలు. చన్ద్రధవలాసు = చంద్రునిచేత తెల్లనైన, రాత్రీషు = రాత్రులందు, యః = ఏ మన్మథుడు, లలితమ్ = సుందరమైన, చాపమ్ = ధనస్సును, ఆస్ఫాల్య = చరచి, విజృమ్భమాణః = విజృంభిస్తూన్నవాడై, ఏకచ్ఛత్రమ్ = ఏకచ్ఛత్రము కలదానిని వలె, భువనరాజ్యమ్ = లోకరాజ్యమును, కరోతి = చేయుచున్నాడో.

అత్రేతి:- ఇక్కడ వస్తువుచేత (అనగా మన్మథుడు ధనస్సు చరుస్తూ త్రిభువనరాజ్యం చేస్తున్నాడు అనే కవిప్రౌఢోక్తిసిద్ధవస్తువుచేత) "ఏ కాముకులకు ఈ మన్మథుడు రాజో వాళ్ళలో ఏ ఒక్కడూ కూడ అతని ఆజ్ఞను కాదనజాలడు గాన అందరూ మెలుకువగా ఉండి, భోగపరులై రాత్రి గడుపుతున్నారు" అనే వస్తువు, 'భుఅణరజ్జ' పదద్యోత్యమై వ్యంజితం అవుతున్నది. ఈ వస్తువును వ్యంజింపచేయడంలో 'భుఅణరజ్జ' పదానికి ప్రాధాన్యం ఉన్న దని భావం.

అవ:- కవిప్రౌఢోక్తి మాత్రసిద్ధవస్తువుచేత అలంకారం వ్యంజింపబడడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ నిశితశరధియార్పయత్యనఙ్గో
దృశి సుదృశః స్వబలం వయస్యరాలే,
దిశి నిపతతి యత్ర సా చ తత్ర
వ్యతికరమేత్య సమున్మిషన్త్యవస్థాః. 85

వృ. అత్ర వస్తునా యుగపదవస్థాః పరస్పరవిరుద్ధా అపి ప్రభవన్తీతి 'వ్యతికర' పదద్యోత్యో విరోధః.

వ్యా. నిశితేతి:- అరాలే = వక్రమైన, వయసి = వయస్సునందు (యౌవన ప్రారంభమునందు), అనఙ్గః = మన్మథుడు, నిశితశరధియా = వాడియైన బాణా లనే బుద్ధిచేత, సుదృశః = స్త్రీయొక్క, దృశి = నేత్రమునందు (చూపునందు), స్వబలమ్ = తన బలమును, అర్పయతి = అర్పించును. సా చ = ఆ దృష్టి, యత్ర = ఏ; దిశి = దిక్కునందు, అనగా ఏ దిక్కునందున్న యువజనమునందు, నిపతతి = పడునో, తత్ర = అక్కడ, అవస్థాః = నవ్వు, ఏడ్పు, పేలాపన, మూర్ఛ మొదలైన అవస్థలు, లేదా-

"దృఙ్మనఃసంగసంకల్పా జాగరః కృశతారతిః
హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తాః ఇత్యనఙ్గదశా దశ".

(చూపులు కలవడం, మనస్సు లగ్నం అవడం, సంకల్పం, జాగరం, చిక్కి పోవడం, దేనిమీదా ఇష్టం లేకపోవడం, సిగ్గు విడిచిపెట్టడం, ఉన్మాదం, మూర్ఛ, మరణప్రయత్నం అని మన్మథదశలు పది) అని చెప్పిన పది మన్మథదశలు, వ్యతికరమ్ = కలిసిపోవుటను, ఏత్య = పొంది, (ఆ అవస్థలన్నీ కలిసిపోయి), సమున్మిషన్తి = విజృంభించును.

అత్రేతి:- ఇక్కడ పరస్పరవిరుద్ధాలైన వివిధావస్థలు ఒక్క మాటు కలిసి ఏర్పడతాయి అనే వస్తువుచేత విరోధాలంకారం వ్యంగ్యం అవుతున్నది. ఇది ప్రధానంగా 'వ్యతికర' పదంచేత ద్యోత్యమై (సూచితమై) ఉన్నది. (ఇక్కడ వస్తువు కవికల్పితం).

అవ:- కవిప్రౌఢోక్తిమాత్రసిద్ధమైన అలంకారంచేత వస్తువు వ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

గాథ. వారిజ్జంతో వి పుణో సందావకత్థిఏణ హిఅఏణ,
థణహరవఅస్సఏణ విసుద్ధజాఈః ణ చలఇ సే హారో. 86

"వార్యమాణోఽపి పునః సంతాపకదర్థితేన హృదయేన,
స్తనభరవయస్యేన విశుద్ధజాతిర్న చలత్యస్యా హారః".

వృ. అత్ర విశుద్ధజాతిత్వలక్షణహేత్వలంకారేణ హారోఽనవరతం కమ్ప్యమాన ఏవాస్తే ఇతి 'ణ చలఇ' పదద్యోత్యం వస్తు.

వ్యా. వార్యమాణ ఇతి:- సంతాపకదర్థితేన = గాఢాలింగనానికి అంతరాయంగా ఉండడంచేత పీడితమైన, హృదయేన = హృదయంచేత, పునః = మాటిమాటికి, వార్యమాణోఽపి = నివారింపబడుచున్నను, అస్యాః = ఈమెయొక్క, విశుద్ధజాతిః = విశుద్ధమైన జాతి గల, జాతిశబ్దానికి ముత్యాలజాతి, జన్మ అని రెండర్థాలు, హారః = ముత్యాలహారం, స్తనభరవయస్యేన = స్తనభార మనే మిత్రునితో (నుండి), న చలతి = తొలగుట లేదు.

వి. గాఢాలింగనానికి అంతరాయంగా ఉన్న దని హృదయం ఎంత వాదించినా ముత్యాలహారం తన మిత్రమైన స్తనభారానికి గాఢాశ్లేషణం వల్ల బాధ కలుగుతుందేమో అన్న భయంచేత తొలగడంలేదు. శుద్ధజాతియందు పుట్టినవాళ్లు ఆపత్సమయంలో మిత్రుల్ని విడవరు కదా అని శ్లోకభావం. ఇది విపరీతరతిని వర్ణించే శ్లోకం అని వ్యాఖ్యాతలు.

అత్రేతి:- ఇక్కడ విశుద్ధజాతి అయి ఉండడం లక్షణంగా గల కావ్యలింగాలంకారంచేత (ఇది కవికల్పితం) హారం మాటిమాటికీ కదులుతూన్నదే కాని తొలగిపోవడం లేదు అనే వస్తువు వ్యంగ్యం అవుతూన్నది. ఇది వ్యంగ్యం అవడానికి 'న చలతి'అనే పదం ప్రధానపాత్ర వహిస్తూంది.

అవ. కవిప్రౌఢోక్తిమాత్రసిద్ధమైన అలంకారంచేత అలంకారం వ్యంగ్యం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు—

గాథ. సో ముద్ధసామలంగో ధమ్మిల్లో కలిఅలవిఅణిఅదేహో,
తీఏ ఖంధాహి బలం గహిఅ సరో సురసం అరే జఅఇ.

"స ముగ్ధశ్యామలాఙ్గో ధమ్మిల్లః కలితలలితనిజదేహః,
తస్యాః స్కన్ధాద్బలం గృహీత్వా స్మరః సురతసంగరే జయతి."

వృ. అత్ర రూపకేణ ముహుర్ముహురాకర్షణేన తథా కేశపాశః స్కన్ధయోః ప్రాప్తః యథా రతివిరతావప్యనివృత్తాభిలాషః కాముకోఽభూదితి "ఖంధ"పదద్యోత్యా విభావనా. ఏష కవిప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నశరీరః.

వ్యా. స ఇత్యాది :- సః = ఆ, ముగ్ధశ్యామలాఙ్గః = సుందరమైన నల్లని శరీరం గల, ధమ్మిల్లః = కేశపాశం అనే, స్మరః = మన్మథుడు, కలితలలితనిజదేహః = పొందబడిన అందమైన తన దేహం కలవాడై, తస్యాః = ఆమెయొక్క, స్కన్ధాత్ = స్కంధంనుంచి, స్కంధం అనే సేనానివేశంనుంచి, బలమ్ = బలమును, సైన్యమును అని రెండవ అర్థం, గృహీత్వా = గ్రహించి, సురతసంగరే = సురత యుద్ధమునందు, జయతి = జయించుచున్నాడు.

వి. కేశపాశమే మన్మథుడు అని రూపకాలంకారం. అట్లే స్కంధశబ్దానికి భుజము, సేనానివేశము అని, బలశబ్దానికి బలము, సైన్యమూ అని రెండేసి అర్థాలు. అందుచేత "భుజభాగ మనే సేనానివేశం' 'బలం అనే సైన్యం' అని శ్లిష్టరూపకాలు. ఈ రూపకాలచేత బుజాలమీదకు జారిన కేశపాశం చూడగానే, సురతాంతంలో కూడ కాముకుని అభిలాష తీరలేదు అని విభావన వ్యంగ్యం అవుతున్నది. కారణం లేకపోయినా కార్యం పుట్టడం విభావనాలంకారం. అభిలాషకు హేతువు రతి పూర్తి కాకపోవడం. ఆ హేతువు లేకపోయినా అభిలాష కలిగిం దని వ్యంజింపబడు తూన్నది. అభిలాష తగ్గి రతి నివర్తించిన పక్షాన కేశపాశం బంధించబడే ఉంటుంది; ఆకర్షించబడి స్కంధంమీద పడదు కదా?

అత్ర ఇతి :- ఇక్కడ రూపకంచేత- "మాటిమాటికి లాగడంచేత కేశపాశం స్కంధంమీదికి ఎలా పడినదనగా రతివిరతి అయిన పిమ్మట కూడ కాముకుని అభిలాష తీరలేదు" అని విభావన వ్యంగ్యం అవుతున్నది ఇది వ్యంగ్యం అవడానికి 'ఖంధ' పదం ప్రధానపాత్ర వహిస్తూన్నది.

అవ. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధవస్తువుచేత వస్తుధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు-

ణవపుణ్ణిమామిఅంకస్స సుహఅ కోత్తంసి భణసు మహ సచ్చమ్,
కా సోహగ్గసమగ్గా పఓసరఅణివ్వ తుహ అజ్జ. 88

"నవపూర్ణిమామృగాఙ్కస్య సుభగ కస్త్వమసి భణ మమ సత్యమ్,
కా సౌభాగ్యసమగ్రా ప్రదోషరజనీవ తవాద్య".

వృ. అత్ర వస్తునా మయీవాన్యస్యామపి ప్రథమమనురక్తస్త్వం న తత ఇతి ణవేత్యాది- పఓసేత్యాదిపదద్యోత్యం వస్తు వ్యజ్యతే.

వ్యా. ణవ ఇత్యాది :- ఒక ఖండితనాయిక (రహస్యమైన అపరాధం చేసిన భర్త చేత వంచింపబడిన నాయిక) తనను కాదని ఒక వృద్ధమహిళపై అను రక్తుడైన భర్తతో అంటూన్న మాటలు). సుభగ = ఓ! సుందరుడా! త్వమ్ = నీవు, నవపూర్ణిమామృగాఙ్కస్య = పూర్ణిమనాటి క్రొత్త చంద్రునకు, కిమ్ అసి = ఏమి అవుతావు? అద్య = ఇప్పుడు, ప్రదోషరజనీవ = సాయంకాలపు రాత్రి వలె, కా = ఎవతె, తవ = నీయొక్క, సౌభాగ్యసమగ్రా = అనురాగాదులచేత, సమ గ్రంగా ఉన్నది?

వి. పూర్ణిమనాడు పూర్ణచంద్రునిలో రాగం (ఎరుపు, అనురాగం అని రెండర్థాలు) క్షణకాలమే ఉంటుంది. నీ రాగం కూడా క్షణికమే. అందుచేత నీకూ ఆ చంద్రునికీ ఏదో చుట్టరికం ఉండిఉండాలి. 'ప్రదోష' శబ్దానికి 'సాయంకాలం' 'చాలా దోషాలు కలది' అని అర్థాలు.

అత్రేతి :- ఇక్కడ (కవినిబద్ధయైన నాయిక మాటలలోని విషయంచేత, వస్తువుచేత "నువ్వు నాయందు వలెనే మరొక స్త్రీయందు కూడా ముందుగా అను రక్తుడవు అయి ఉంటావు; తరవాత ఉండవు (అనురక్తుడవుగా ఉండవు) అనే వస్తువు వ్యంగ్యం అవుతూన్నది. దీనిని ప్రధానంగా వ్యంజింపచేసేవి 'నవ' 'ప్రదోష' ఇత్యాదిపదాలు కాబట్టి పదప్రకాశ్యత్వం.

అవ. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధవస్తువుచేత అలంకారధ్వనికి ఉదా హరణం చూపుతున్నాడు.

గాథ. సహి నవణిహువణసమరమ్మి అంకవాలీసహీఏ ణిబిడాఏ,
హారో ణివారిఓ విఅ ఉచ్ఛేరన్తో తదో కహం రమిఅమ్.

"సఖి నవనిధువనసమరేఽఙ్కపాలీసఖ్యా నిబిడయా
హారో నివారిత ఏవోచ్ఛ్రియమాణస్తతః కథం రమితమ్"

వృ. అత్ర వస్తునా హారచ్ఛేదానన్తరమన్యదేవ రతమవశ్యమభూత్; తత్కథయ కీదృగితి వ్యతిరేకః 'కథం' పదగమ్యః.

వ్యా. సహి ఇతి :- నవోఢనాయికను (క్రొత్తగా వివాహం అయిన నాయికను) ఒక రసజ్ఞయైన సఖురాలు ప్రశ్నిస్తూన్నది. సఖి = సఖురాలా! నవనిధువనసమరే = నూతనసురతసమరంలో, నిబిడయా = దృఢమైన, అఙ్కపాలీసఖ్యా = ఆలింగనం అనే సఖురాలిచేత, ఉచ్ఛ్రియమాణః = అధికంగా ఉన్న (పని లేని మూడవదిగా అక్కడఉన్న), హారః = హారం. నివారితః = తొలగించబడింది. తతః = అటుపిమ్మట, కథమ్ = ఎట్లు, రమితమ్ = క్రీడ చేయబడినది? తరవాత సురతక్రీడ ఏ విధంగా జరిగింది?

అత్రేతి:- ఇక్కడ వస్తువుచేత (కలినిబద్ధవక్త్రియైన సఖురాలు పలికిన మాటలలోని విషయంచేత) "హారం ఛిన్నం అయిపోయిన పిమ్మట మరొక విధమైన రతం, అనగా నీవు నవోఢవే అయినా ప్రౌఢాంగనారతంకంటె విలక్షణమైన రతం, జరిగి ఉండాలి; అది ఎలా జరిగిందో చెప్పు" అని వ్యతిరేకాలంకారం 'కథం' అనే పదంచేత గమ్యం అవుతున్నది. (ఉపమానమైన ప్రౌఢాంగనారతం కంటె ఉపమేయమైన నవోఢారతం విశిష్టంగా ఉంది అనడంచేత వ్యతిరేకాలంకారం).

అవ. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధమైన అలంకారంచేత వస్తుధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు-

గాథ. పవిసంతీ ఘరవారం వివలిఅవఅణా విలోఇఊణ పహమ్,
ఖంధే ఘేత్తూణ ఘడం హాహా ణట్ఠోత్తి రుఅసి సహి కిం తి.

"ప్రవిశన్తీ గృహద్వారం వివలితవదనా విలోక్య పన్థానమ్,
స్కన్ధే గృహీత్వా ఘటం హా హా నష్ట ఇతి రోదిషి సఖి కిమ్"

వృ. అత్ర హేత్వలంకారేణ సంకేతనికేతనం గచ్ఛన్తం దృష్ట్వా

యది తత్ర గన్తుమిచ్ఛసి తదా అపరం ఘటం గృహీత్వా గచ్ఛేతి వస్తు కింతి పదద్యోత్యమ్.

వ్యా. పవిసంతీ ఇతి :- ఒక నాయిక నీళ్ళు తీసుకొనిరావడం అనే వంక పెట్టుకొని సంకేతస్థానానికి వెళ్ళి, అది శూన్యంగా ఉండడం చూసి ఘటంలో నీళ్ళు నింపుకొని ఇంటికి వచ్చి ద్వారంలో ప్రవేశిస్తూండగా ప్రియుడు సంకేత స్థానంవైపు వెళ్ళడం చూసింది. మళ్ళీ నీళ్ళకోసం వెళ్ళాలనే ఉద్దేశంతో కాలుజారి నట్లు అభినయించి ఆ కుండ క్రింద జారవిడచి బద్దలుకొట్టి "అయ్యో బ్రద్దలై పోయింది" అని లోకాన్ని వంచించడంకోసం ఏడవడం ప్రారంభించింది. ఈ విషయం అంతా ఎరిగిన ఆమె సఖురాలు "మరొక కుండ తీసికొనివెళ్ళు, ఉన్న వాళ్ళతో నేను ఏదో సర్ది చెపుతానులే" అని సూచిస్తూ అన్న మాటలు:- సఖి = సఖురాలా! గృహద్వారమ్=గృహద్వారమును, ప్రవిశన్తీ = ప్రవేశిస్తూన్నదానవై, ఘటమ్ = ఘటాన్ని, స్కన్ధే = భుజంమీద, గృహీత్వా=గ్రహించి, వివలితవదనా = త్రిప్పబడినముఖం కలదానవై, పన్థానమ్ = మార్గాన్ని, విలోక్య = చూచి, హా హా నష్టః ఇతి = అయ్యో! అయ్యో! బ్రద్దలైపోయినది అని, కిమితి రోదిషి = ఎందుకు ఏడుస్తున్నావు?

అత్రేతి :- ఇక్కడ హేత్వలంకారం (కావ్యలింగాలంకారం)చేత "సంకేత స్థానానికి వెడుతూన్న నీ ప్రియుణ్ణి చూచిన నీవు అక్కడికి వెళ్ళాలని అనుకుంటే మరొక కుండ తీసికొని వెళ్ళు" అనే వస్తువు 'కిమితి' అనే పదాలచేత ద్యోత్యం అయినది.

వి. ఏడవడానికి కుండ బ్రద్దలైపోవడం హేతువు; కుండ బ్రద్దలైపోవ డానికి తల త్రిప్పి చూడడం హేతువు; ఈ మాటలు కవి నిబంధించిన సఖురాలు పలికినవి; కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధాలు.

వృ. యథా వా-

గాథ. విహలంఖలం తుమం సహి దట్ఠూణ కుడేణ తరలతరదిట్ఠిమ్.
వారప్ఫంసమిసేణ అ అప్పా గురుఓత్తి పాడిఅ విహిణ్ణో.

"విశృఙ్ఖలాం త్వాం సఖి దృష్ట్వా కుటేన తరలతరదృష్టిమ్,
ద్వారస్పర్శమిషేణ చాత్మా గురుక ఇతి పాతయిత్వా విభిన్నః"

వృ. అత్ర నదీకూలే లతాగహనే కృతసంకేతమప్రాప్తం గృహప్రవేశావసరే పశ్చాదాగతం దృష్ట్వా పునర్నదీగమనాయ ద్వారోపఘాతవ్యాజేన బుద్ధిపూర్వం వ్యాకులతయా త్వయా ఘటః స్ఫోటిత ఇతి మయా చిన్తితమ్, తత్కిమితి నాశ్వసిషి? తత్సమీహితసిద్ధయే వ్రజ; అహం తే శ్వశ్రూనికటే సర్వం సమర్థయిష్యే ఇతి ద్వారస్పర్శవ్యాజేనేత్యపహ్నుత్యా వస్తు.

వ్యా. విహలంఖలం ఇతి:- సంకేతస్థానంలో ప్రియుడు కనబడకపోవడంచేత నీళ్ళకుండ బుజంమీద పెట్టుకొని తిరిగి వచ్చిన ఒక స్త్రీ అతడు ఆ వైపు వెళ్ళడం చూచి, మళ్ళీ నది వైపు వెళ్ళడం కోసం ద్వారం తగిలిన దనే వంకచేత ఆ కుండని పగలగొట్టింది. ఆ విషయం అంతా తెలిసిన ఒక చెలికత్తె "నీ శ్రమచూడలేక ఆ కుండ క్రింద పడి తనను తాను పగులగొట్టుకొందిలే" అని అంటూ "నువ్వు అనుకొన్నట్లు వెళ్ళు; నీ అత్తతో నేను సర్ది చెపుతాను" అని సూచిస్తూ పలికిన మాటలు:- సఖి = సఖురాలా! విశృఙ్ఖలామ్ = బరువుకు తొట్రుపాటు చెందిన, తరలతరదృష్టిమ్ = చాలా వ్యాకులమైన దృష్టి గల, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, కుటేన = ఘటంచేత, గురుకః ఇతి = చాలా బరువుగా ఉన్నాను అని, ఆత్మా = తాను, ద్వారస్పర్శమిషేణ = ద్వారస్పర్శ అనే మిషచేత, పాతయిత్వా = క్రిందపడగొట్టి (పడిపోయి), విభిన్నః = బ్రద్దలుకొట్టబడినది.

అత్రేతి:- "నదీతీరంలో లతాగృహంలో ఏర్పరచుకొనబడిన సంకేతం కలవాడై అక్కడికి రానివానిని తరవాత (నీవు) ఇంటిలో ప్రవేశించేముందు వస్తున్నట్లు చూచి మళ్ళీ నదికి వెళ్ళాలనే అభిప్రాయంతో నీవు వ్యాకులురాలవై, ద్వారం తగిలిందనే వంకచేత కావాలని కుండ బ్రద్దలుకొట్టావు; ఇది నాకు తెలుసు. అందుచేత ఎందుకు ఓదార్పుచెందవు? నీ కోరిక తీర్చుకొనడం కోసం వెళ్ళు; నేను నీ అత్త దగ్గర అంతా సమర్థించి చెపుతానులే" అనే వస్తువు 'ద్వారస్పర్శవ్యాజేన' అనే అపహ్నుత్యలంకారంచేత వ్యంగ్యం అవుతున్నది.

ఘటం బ్రద్దలుకొట్టినది నువ్వు కాదు; ఘటమే తనను తాను బ్రద్దలుకొట్టుకొంది అనేది అపహ్నుత్యలంకారం. అచేతనమైన ఘటం ద్వారస్పర్శవ్యాజంచేత అలా చేసింది అని చెప్పడంచేత ఇది ప్రౌఢోక్తిసిద్ధం. ఈ వ్యంజనలో 'ద్వారస్పర్శవ్యాజేన' అనే పదానికి ప్రాధాన్యం

అవ. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధాలంకారంచేత అలంకారధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు-

జోణ్హాఇ మహురసేణ అ విఇణ్ణతారుణ్ణఉత్సుఅమణా ఆ,
బుడ్ఢావి ణవోఢవ్విఅ పరవహూఅ అహహ హరఇ తుహ హిఅఅమ్.

"జ్యోత్స్నయా మధురసేన చ వితీర్ణతారుణ్యోత్సుకమనాః సా
వృద్ధాపి నవోఢేవ పరవధూరహహ హరతి తవ హృదయమ్".

వృ. అత్ర కావ్యలిఙ్గేన వృద్ధాం పరవధూం త్వమస్మానుజ్ఝిత్వాభిలాషసీతి త్వదీయమాచరితం వక్తుం న శక్యమిత్యాక్షేపః 'పరవహూ' పదప్రకాశ్యః.

వ్యా. జోణ్హాఇ ఇతి:- జ్యోత్స్నయా = వెన్నెలచేతను, మధురసేన చ = మద్యంచేతను, వితీర్ణతారుణ్యోత్సుకమనాః = ఇవ్వబడిన ;తారుణ్యంచేత ఔత్సుక్యంతో కూడిన మనస్సు గల, సా = ఆమె, వృద్ధాపి = వృద్ధురాలైనా కూడ, నవోఢేవ = నూతనంగా వివాహం చేసికొనబడిన స్త్రీ వలె, తవ హృదయమ్ = నీ హృదయాన్ని, హరతి = హరిస్తూన్నది. అహహ = అయ్యో !

అత్రేతి :- ఇక్కడ కావ్యలింగాలంకారంచేత నువ్వు మమ్మలను విడచి వృద్ధయైన పరస్త్రీని కోరుతున్నావు; ఈ విధంగా నీ చరిత్ర చెప్పడానికి శక్యం కానిది అని ఆక్షేపాలంకారం 'పరవహూ' పదంచేత ప్రకాశ్యమైనది.

వి. ఆమె నీ హృదయాన్ని ఆకర్షించడానికి కారణం ఆమె పరస్త్రీ అవడమే అని కావ్యలింగాలంకారం. ఏదైన ఒక విషయాన్ని చెప్పబోయి "ఎందుకులే చెప్పడం అనవసరం" అన్నట్లయితే, అది చెప్పదగనిది అని కాని, చెప్పడానికి శక్యం కానిది అని కాని సూచించబడినట్లయితే ఆక్షేపాలంకారం. 'నీ చరితం చెప్పడానికి శక్యం కాదు' అని ఇక్కడ అనడం చేత ఆక్షేపాలంకారధ్వని అని భావం. ఈ అలంకారధ్వనిలో 'పరవహూ' పదానికి ప్రధానపాత్ర.

వృ. ఏషు కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరః. వాక్య

ప్రకాశ్యే తు పూర్వముదాహృతమ్. శబ్దార్థోభయశక్త్యుద్భవస్తు పద ప్రకాశ్యో న భవతీతి పఞ్చత్రింశద్భేదాః.

వ్యా. ఈ నాలుగు ఉదాహరణలలో కవినిబద్ధవక్తృప్రౌఢో క్తిమాత్రనిష్పన్న శరీరమైన అర్థం వ్యంజకం. వాక్యప్రకాశ్యవ్యంగ్యభేదాలకి వెనక ("త్వామస్మి వచ్మి" ఇత్యాది శ్లోకాలు) ఉదాహరణలుగా చూపబడ్డాయి. పదప్రకాశ్యభేదాలలో శబ్దార్థోభయశక్త్యుద్భవం అనే భేదం ఉండదు. (ఫలానా పదం పరివృత్త్యసహం అనీ, పరివృత్తిసహం అనీ చెప్పడం కష్టం కదా? ఈ విధంగా ముప్పైయైదు భేదాలు ఉంటాయి.

వి. అర్థాంతరసంక్రమితవాచ్య-అత్యంతతిరస్కృతవాచ్య-అసంలక్ష్యక్రమాలు మూడు. సంలక్ష్యక్రమంలో శబ్దశక్తిమూలం వస్తువు అనీ, అలంకారం అనీ రెండు విధాలు $(3+2=5)$. అర్థశక్తిమూలసంలక్ష్యక్రమధ్వని పన్నెండు విధాలు $(12+5=17)$. ఈ పదిహేడింటిలోనూ కూడ ఒక్కొక్కటి వాక్యమూలం, పద మూలం అవడంచేత మొత్తం ముప్పైనాలుగు విధాలు. ఉభయశక్తిమూలం ఒకటి. ఈ విధంగా మొత్తం ముప్పైఐదు విధా లని అర్థం.

కా. ప్రబన్ధేఽప్యర్థశక్తిభూః. 42

వృ. యథా గృధ్రగోమాయుసంవాదాదౌ.

శ్లో॥ "అలం స్థిత్వా శ్మశానేఽస్మిన్ గృధ్రగోమాయుసంకులే,
కఙ్కాలబహులే ఘోరే సర్వప్రాణిభయంకరే. 93
న చేహ జీవితః కశ్చిత్కాలధర్మముపాగతః,
ప్రియో వా యది వా ద్వేష్యః ప్రాణినాం గతిరీదృశీ." 94

ఇతి దివా ప్రభవతో గృధ్రస్య పురుషవిసర్జనపరమిదం వచనమ్,

శ్లో॥ "ఆదిత్యోఽయం స్థితో మూఢాః స్నేహం కురుత సాంప్రతమ్,
బహువిఘ్నో ముహూర్తోఽయం జీవేదపి కదాచన. 95
అముం కనకవర్ణాభం బాలమప్రాప్తయౌవనమ్,
గృధ్రవాక్యాత్కథం మూఢాస్త్యజధ్వమవిశఙ్కితాః". 96

ఇతి నిశి విజృమ్భమాణస్య గోమాయోర్జనవ్యావర్తననిష్ఠం చ వచనమితి ప్రబన్ధ ఏవ ప్రథతే. అన్యే త్వేకాదశభేదా గ్రన్థవిస్తరభయా నోదాహృతాః; స్వయం తు లక్షణతోఽనుసర్తవ్యాః. 'అపి'శబ్దాత్పద వాక్యయోః.

వ్యా. అర్థశక్తిభూః = అర్థశక్తిమూలధ్వని, ప్రబన్ధేఽపి = ప్రబంధంలో కూడ ఉంటుంది.

"ఎట్లనగా- గృధ్రగోమాయుసంవాదాదులలో".

వి. కూర్చబడిన అనేకవాక్యాల సముదాయం ప్రబంధం. అది గ్రంథరూపం కావచ్చును లేదా అవాంతరప్రకరణం కావచ్చును. ఒక సంఘటనను వర్ణించేది ప్రబంధం అని మరొక లక్షణం. అర్థశక్తిమూలకధ్వని గృధ్రసంవాదం, గోమాయుసంవాదం మొదలైన ప్రబంధాలలో కూడ ఉండవచ్చును.

అవ. పద్యద్వయాత్మకప్రబంధమైన గృధ్రసంవాదాన్ని స్వతః సంభవి వస్తువుచేత వస్తుధ్వనికి ఉదాహరణంగా చూపుతున్నాడు- అలమ్ ఇత్యాదిః- మహాభారతంలో శాంతిపర్వంలోని అపద్ధర్మపర్వంలో నూటయాభైమూడవ అధ్యాయంలోని ఘట్టం ఇది. మృతుడైన బాలుని శవం తీసికొని సంధ్యాసమయంలో శ్మశానానికి వచ్చినవాళ్ళతో పగలు మాత్రమే తన శక్తిని చూపగల (రాత్రి కళ్ళ కనబడని) గ్రద్ద అంటూన్న మాటలివి. ఆ శవాన్ని విడిచి వాళ్ళు తొందరగా వెళ్ళిపోవా లనీ అప్పుడు నక్కను తరిమి తానే తినవచ్చు ననీ దాని అభిప్రాయం.

వ్యా. గృధ్రగోమాయుసంకులే = గ్రద్దలతోను నక్కలతోను వ్యాకులంగా ఉన్న, కఙ్కాలబహులే = అస్థిపంజరాలు అధికంగా ఉన్న, ఘోరే= ఘోరమైన, సర్వప్రాణిభయంకరే = సకలప్రాణులకూ భయంకరమైన, అస్మిన్ = ఈ, శ్మశానే = శ్మశానంలో, స్థిత్వా = ఉండి, అలమ్ = చాలును (వెనుకకు) వెళ్ళి పొండి). కాలధర్మమ్ = మరణాన్ని, ఉపాగతః = పొందినవాడు, కశ్చిత్ = ఎవడూ కూడ, ప్రియో వా = ఇష్టుడైనా, ద్వేష్యః వా = శత్రువైనా, ఇహ = ఈ లోకంలో, న జీవితః = జీవించలేదు. ప్రాణినామ్ = ప్రాణులయొక్క, గతిః = ఈదృశీ = ఇట్టిదే.

ఇతీతి:- ఇది పగలు సామర్థ్యం చూపగల గ్రద్ద (బాలుని శవంతో వచ్చిన) మనుష్యులను పంపివేయడానికి ఉద్దేశించిన వాక్యం.

అవ. గృధ్రసంవాదానికి సంబంధించిన ప్రబంధాన్ని ఉదాహరించి గోమాయు సంవాదానికి సంబంధించిన ప్రబంధాన్ని ఉదాహరిస్తున్నాడు –

ఆదిత్య ఇతి:- మూఢాః=మూఢులారా, అయమ్ ఆదిత్యః= ఈ సూర్యుడు, స్థితః = ఇంకా ఉన్నాడు. సాంప్రతమ్ = ఇప్పుడు, స్నేహమ్ = స్నేహమును, కురుత = చెయ్యండి. అయం ముహూర్తః = ఈ ముహూర్తం, అనగా ఈ సంధ్యా కాలం, బహువిఘ్నః = అనేకవిఘ్నాలు కలది. ఇది రాక్షసవేళ అవడంచేత ఈ బాలునికి ఏ భూతావేశమైనా ఉన్నట్లయితే ఈ సమయం దాటగానే ఆ భూతావేశాదులు తొలగి ఇతడు లేవవచ్చును అని భావం. కదాచన= ఒక వేళ, జీవేదపి = జీవించవచ్చు కూడ. మూఢాః = మూఢులారా! కనకవర్ణాభమ్=బంగారము వంటి వర్ణం గల, అప్రాప్తయౌవనమ్ = పొందబడని యౌవనం గల, అముమ్ = ఈ, బాలమ్ = బాలుణ్ణి, అవిశఙ్కితాః = సందేహం లేనివారై, గృధ్రవాక్యాత్ = గ్రద్ద మాటలవలన, కథమ్ = ఎట్లు, త్యజధ్వమ్ = విడచెదరు?

ఇతీతి :- ఇవి రాత్రియందు విజృంభించడానికి సమర్థమైన నక్క ఆ జనాన్ని పంపివేయాలనే ఉద్దేశ్యంతో పలికిన మాటలు. ఈ విధంగా ప్రబంధమే అన్యార్థాన్ని వ్యంజింపచేయడానికి సమర్థం అవుతుంది.

వి. ఈ గృధ్రసంవాద-గోమాయుసంవాదాలు రెండు ప్రబంధాలు. వీటిలో వాచ్యార్థరూపమైన వస్తువు బాలుని శవంతో కూడా వచ్చిన వాళ్ళను వెనక్కి పంపి వేయడం, వెళ్ళకుండా చేయడం అనే వస్తువులను వ్యంజింపచేస్తూన్నవి అని అర్థం.

అవ:- ప్రబంధగతార్థశక్త్యుద్భవధ్వనిలో ఉన్న పన్నెండు భేదాలలో వస్తువుచేత వస్తుధ్వనికి మాత్రమే ఉదాహరణం ఇప్పుడు చూపబడింది కదా; మిగిలిన భేదాలకు ఉదాహరణలు చూపలేదేమి అని ఆశంకించుకొని చెపుతున్నాడు.

వ్యా. అన్యే త్వితి:- మిగిలిన పదకొండు భేదాలు గ్రంథవిస్తరభయంచేత ఉదాహరించలేదు. లక్షణానుసారంగా స్వయంగా (పాఠకులు) ఊహించుకోవాలి. పై కారికాభాగంలో 'ప్రబన్ధేఽపి'అని 'అపి' శబ్దం ప్రయోగించడంచేత పద –

వాక్యగతధ్వనులు గ్రహించబడతాయి. వాటికి ఉదాహరణలు వెనుక చూప బడ్డాయి.

వి. ఈ విధంగా అర్థశక్తి మూలకధ్వనులలో వాక్యగతాలు పన్నెండు, పదగతాలు పన్నెండు, ప్రబంధగతాలు పన్నెండు, మొత్తం ముప్పైఆరు భేదాలు ఉన్నాయని చెప్పినట్లయింది.

కా. పదైకదేశరచనావర్ణేష్వపి రసాదయః.

వ్యా. రసాదయః=రసం మొదలైనవి, పదైకదేశరచనావర్ణేష్వపి=పదైక దేశాలయందు, రచనలయందు, వర్ణాలయందూ కూడా ఉంటాయి.

వి. 'యాచతి' 'యాచతే' మొదలైన తిఙంతాలు (క్రియావాచకాలు), 'బాలః', 'బాలా' మొదలైన సుబంతాలు (నామవాచకాలు) పదాలు. ఆ పదాల అంశాలు అనగా ప్రకృతి, ప్రత్యయం, ఉపసర్గ మొదలైనవి. వైదర్భిగౌడి మొద లైనవి రచనలు. లేదా దీర్ఘసమాసాదిరూపపదవిన్యాసాలు రచనలు. పరుషాక్షరాలు, మృదువైన అక్షరాలు మొదలైనవి వర్ణాలు. రసాదులు, అనగా రస - భావ - రసాభాస - భావాభాస-భావశాంతి-భావోదయ-భావసంధి - భావశబలతారూపాలైన అసంలక్ష్యక్రమాలు ఈ పదైకదేశాదులలో కూడా ఉంటాయి; అనగా వాటిచేత వ్యంజింపచేయబడతాయి అని అర్థం. 'రామస్య' అనే పదంలో 'రామ' అనేది ప్రకృతి, 'స్య' అనేది ప్రత్యయం. 'యాచతి' అనే క్రియాపదంలో 'యాచ్' అనేది ప్రకృతి, 'తి' అనేది ప్రత్యయం. 'ప్రభవతి' ఇత్యాదులలోని 'ప్ర' మొదలైనవి ఉపసర్గలు.

వృ. తత్ర ప్రకృత్యా యథా-

గాథ. రఇకేళిహిఅణిఅసణకరకిసలఅరుద్ధణఅణజుఅలస్స,
రుద్దస్స తఇఅణఅణం పబ్బఈపరిచుంబిఅం జఅఇ. 97
"రతికేళిహృతనివసనకరకిసలయరుద్ధనయనయుగలస్య
రుద్రస్య తృతీయనయనం పార్వతీపరిచుమ్బితం జయతి"

వృ అత్ర జయతీతి న తు శోభతే ఇత్యాది. సమానేఽపి హి స్థగనవ్యాపారే లోకోత్తరేణైవ వ్యాపారేణాస్య పిధానమితి తదేవోత్కృష్టమ్.

వ్యా:- "ప్రకృతికి రసవ్యంజకత్వం ఎట్లనగా"-

అవ:- పదంలో ఒక భాగం అయిన ధాతురూపప్రకృతిచేత సంభోగ శృంగారధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు-"రతి... వసనస్య"- రతికేళి = రతి క్రీడయందు, హృత = హరించబడిన, వసన = వస్త్రముగలవాడు (వస్త్రమును అపహరించినవాడు), కరకిసలయ = కిసలయముల (చిగుళ్ళ) వంటి హస్తముల చేత, రుద్ధ = కప్పబడిన, నయనయుగలస్య = నేత్రద్వయం కలవాడు అయిన, రుద్రస్య = రుద్రునియొక్క, పార్వతీపరిచుమ్బితమ్ = పార్వతిచేత చుంబించ బడిన, తృతీయనయనమ్=మూడవ నేత్రం, జయతి=సర్వోత్కృష్టంగా ఉంది.

అత్రేతి:- ఇక్కడ 'జయతి' అని చెప్పబడింది; 'శోభతే' ఇత్యాదికం కాదు. కప్పడం అనే వ్యాపారం సమానమే అయినా (మూడవ కన్ను) కప్పడం లో కోత్తరమైన వ్యాపారంచేత చేయబడింది గాన అదే ఉత్కృష్టమైనది.

వి. రెండు కళ్ళు కప్పడానికి రెండు చేతులు ఉపయోగించిన తరవాత మూడవ కన్ను కప్పడానికి పార్వతి చుంబనం అనే ఉపాయం అవలంబించింది. దీనివల్ల ఆ రెండు కళ్ళకంటె ఈ మూడవకంటికి గౌరవం పెరిగింది. అందుచేత ఇక్కడ 'శోభతే'ఇత్యాదులను ప్రయోగించకుండా, కవి, 'జయతి'అని అన్నాడు. 'జయతి'లోని 'జయ్'అనేది ధాతురూప ప్రకృతి; 'అన్నింటికంటె ఉత్కర్ష కలిగి ఉండడం'అని దీని అర్థం ఇది రాగాతిశయం, హర్షం. లజ్జ మొదలైనవాటిని సూచిం చడం దీని ద్వారా, శృంగారరసాతిశయాన్ని పరిపుష్టం చేస్తూన్నది. 'జయతి'కి బదులు 'శోభతే' ఇత్యాదులు ప్రయోగిస్తే ఈ అందం ఉండదు అని భావం.

అవ:- నామరూప ప్రకృత్యాత్మకపదైకదేశంచేత సంభోగశృంగారధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు:-

వృ. యథా వా-

శ్లో॥ ప్రేయాన్ సోఽయమపాకృతః సశపథం పాదానతః కాన్తయా
ద్విత్రాణ్యేవ పదాని వాసభవనాద్యావన్న యాత్యున్మనాః,
తావత్ప్రత్యుత పాణిసంపుటగలన్నీవీనిబన్ధం ధృతో
ధావిత్వేవ కృతప్రణామకమహో ప్రేమ్ణో విచిత్రా గతిః. 98

వృ. అత్ర పదానీతి, న తు ద్వారాణీతి.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా - ప్రేయానితి:- సశపథమ్ = ఒట్టు పెట్టడం పూర్వమునందు కలుగునట్లుగా (ఒట్టుపెడుతూ), పాదానతః = పాదాల మీద వ్రాలిన, సః అయమ్ = అట్టి ఈ, ప్రేయాన్ = ప్రియుడు. కాన్తయా = కాంతచేత, సశపథమ్ = శపథపూర్వకముగా, అపాకృతః = నిరాకరించబడిన వాడై, ఉన్మనాః = ఔత్సుక్యంతో కూడినమనస్సుకలవాడై లేదా వికలమైన మనస్సు కలవాడై, వాసభవనాత్ = క్రీడాగృహంనుంచి, పడకగదినుంచి, ద్విత్రాణి = రెండు మూడు, పదాన్యేవ = అడుగులు మాత్రమే, యావత్ = ఎంతలో, న యాతః = వెళ్ళలేదో, తావత్ = అంతలో, ధావిత్వా ఇవ = పరుగెత్తి వెళ్ళినట్లు వెళ్ళి, కృతప్రణామకమ్ = చేయబడిన నమస్కారం కలుగునట్లుగా, పాణి సంపుటగలన్నీవీనిబన్ధమ్ = నమస్కరించడానికై ఎత్తిన హస్తసంపుటముచేత, జారిపోతూన్న కోకముడిని పట్టుకొనునట్లుగా, (పట్టుకుంటూ), ప్రత్యుత = విపరీతంగా, ధృతః = పట్టుకొనబడినాడు, వెళ్ళకుండా నిలపబడినాడు. ప్రేమ్ణః = ప్రేమయొక్క, గతిః = గతి, విచిత్రా = విచిత్రమైనది. అహో = ఏమి ఆశ్చర్యము!

అత్రేతి - ఇక్కడ 'పదాని' అన్నాడు; 'ద్వారాణి'అని కాదు.

వి. ఇక్కడ - ఏం చేయాలో తోచని ప్రియుడు వెనక్కి తిరిగి వెళ్ళి పోతున్నాడు. రెండు మూడు ద్వారాలు దాటి వెళ్ళలేదు; రెండు మూడు అడుగులు మాత్రమే వేశాడు. ఈ విధంగా 'పదాని'లో పదైకదేశమైన 'పద'అనే ప్రకృతి నాయిక మనస్సులోని ఉత్కంఠాతిశయాన్ని వ్యంజింపచేస్తూ సంభోగ శృంగారాన్ని పరిపుష్టం చేస్తూన్నది గాన శృంగారం పదైకదేశగతం అని అర్థం.

అవ. ఇప్పుడు పదైకదేశాలైన 'తిఙ్'ప్రత్యయ 'సుప్' ప్రత్యయాలు సంభోగశృంగారాన్ని వ్యక్తీకరించడానికి ఉదాహరణం చూపుతున్నాడు -

వృ. తిఙ్ సుపోర్యథా -

శ్లో॥ పథి పథి శుకచఞ్చూచారురాభాఙ్కురాణాం
దిశి దిశి పవమానో వీరుధాం లాసకశ్చ,
నరి నరి కిరతి ద్రాక్ సాయకాన్ పుష్పధన్వా
పురి పురి వినివృత్తా మానినీమానచర్చా. 99

వృ. అత్ర కిరతీతి కిరణస్య సాధ్యమానత్వం, నివృత్తేతి నివర్తనస్య సిద్ధత్వం తిఙా, సుపా చ; తత్రాపి క్తప్రత్యయేనాతీతత్వం ద్యోత్యతే.

వ్యా. 'తిఙ్' 'సుప్' ప్రత్యయాలద్వారా రసవ్యంజనానికి ఉదాహరణం ఎట్లనగా -

పథి ఇతి :- పథి పథి = ప్రతి మార్గంలోనూ, అఙ్కురాణామ్=అంకురాల యొక్క, శుకచఞ్చుచారుః = చిలకల ముట్టె వలె అందమైన, ఆభా = కాంతి ఉన్నది. దిశి దిశి = ప్రతిదిక్కునందూ, వీరుధామ్=లతలకు, లాసకః=కదలేచ్చే, పవమానః = మందవాయు వున్నది. పుష్పధన్వా = మన్మథుడు, ద్రాక్ = శీఘ్రంగా, నరి నరి = ప్రతిమనిషిమీదా, సాయకాన్ = బాణాలను, కిరతి=చిమ్ము చున్నాడు (ప్రయోగిస్తున్నాడు). పురి పురి = ప్రతీ పట్టణంలోనూ, మానినీమాన చర్చా=మానవతుల మానాన్ని (ప్రణయకోపాన్ని) గూర్చిన చర్చ, వినివృత్తా= నివర్తించినది.

అత్రేతి :- ఇక్కడ 'కిరతి' అని 'తిఙ్' ప్రత్యయంచేత చిమ్మడం ఆనేది ఇంకా సాధింపబడడం, 'నివృత్తా' అని 'సుప్' ప్రత్యయంచేత నివర్తనం సిద్ధం అవడం, అందులోనూ క్తప్రత్యయంచేత అది జరిగిపోవడం ద్యోతింపబడు తున్నాయి.

వి. 'కిరతి'లోని 'తి' ప్రత్యయం వర్తమానకాలార్థకమైన లట్ ప్రథమ పురుషైకవచనప్రత్యయం. అందుచేత కిరణం, అనగా విసరడం, అనే క్రియ ఇంకా జరుగుతూన్నది అని అర్థం. 'వినివృత్తా' అనేది సుబంతం. ప్రథమైక వచనం. 'ఆగిపోయినది' అని అర్థం. ఇక్కడ భూతార్థకమైన 'క్త' ప్రత్యయం కూడా ఉండడం చేత ఆగిపోవడం అనేది ఇప్పుడు జరగలేదు; ఇంతకుముందే జరిగిపోయింది అని అర్థం. మన్మథబాణప్రహారం పూర్తికాకముందే మానం తొలగిపోయింది అని భావం. ఈ విధంగా ఇక్కడ 'తిఙ్', 'సుప్' ప్రత్యయాలు సంభోగశృంగారవ్యంజకాలుగా ఉన్నాయి.

అవ. ప్రత్యయరూపాలైన పదైకదేశాలలో కొన్ని 'సుప్' తిఙ్ ప్రత్యయాల ద్వారా రసవ్యంజనకు మరి కొన్ని ఉదాహరణలు చూపుతున్నాడు.

వృ. యథా వా -

శ్లో॥ లిఖన్నాస్తే భూమిం బహిరవనతః ప్రాణదయితః
నిరాహారాః సఖ్యః సతతరుదితోచ్ఛూననయనాః,
పరిత్యక్తం సర్వం హసితపఠితం పఞ్జరశుకై
స్తవావస్థా చేయం విసృజ కఠినే మానమధునా. 100

వృ. అత్ర 'లిఖన్'ఇతి న తు 'లిఖతి' ఇతి. తథా'ఆస్తే' ఇతి, న తు 'ఆసితః' ఇతి, అపి తు ప్రసాదపర్యన్తమాస్తే ఇతి, 'భూమిః' ఇతి న తు'భూమౌ' ఇతి. న హి బుద్ధిపూర్వకం కించిల్లిఖతీతి తిఙ్ సుబ్విభక్తీనాం వ్యఙ్గ్యమ్.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా -

లిఖన్నితి :- చాలా రోజులు మానం వహించి ఉన్న నాయికతో సఖి అంటూన్న మాటలు. అమరుశతకంలోని శ్లోకం. కఠినే = కఠినహృదయంకల దానా, ప్రాణదయితః = నీ ప్రాణప్రియుడు, అవనతః=వంగినవాడై (తలవంచుకొని), భూమిమ్ = నేలను, లిఖన్ = వ్రాస్తూ, బహిః=వెలపల, ఆస్తే=కూర్చొని ఉన్నాడు. నిరాహారాః = ఆహారం లేని, సఖ్యః = నీ సఖురాళ్ళు, సతతరుదితోచ్ఛూననయనాః = నిరంతరమూ ఏడ్వడంచేత ఉబ్బిన నేత్రాలు కలిగి ఉన్నారు. పఞ్జరశుకైః = పంజరాలలోని చిలుకలచేత, సర్వమ్ = సమస్తమైన, హసితపఠితమ్ = నవ్వూ, చదవడమూ, పరిత్యక్తమ్=విడవబడినది. తవ=నీయొక్క, అవస్థా చ = అవస్థ కూడ, ఇయమ్ = ఇది (ఇలా ఉన్నది) అధునా=ఇప్పుడు, మానమ్ = మానమును, విసృజ = విడువుము.

అత్ర ఇతి :- "ఇక్కడ 'లిఖన్' అని ప్రయోగించబడింది; 'లిఖతి' అని కాదు". 'లిఖన్' అని శతృప్రత్యయాంతసుబన్తం ప్రయోగించడంచేత కూర్చున్నంతసేపూ రాస్తూనే ఉన్నాడు అని అర్థం. 'లిఖతి'అని అంటే 'రాస్తున్నాడు అనే అర్థం మాత్రమే వస్తుంది పై అర్థం రాదు. 'ఆసితః' (కూర్చున్నాడు) అని కాకుండా 'ఆస్తే'అని ప్రయోగించబడింది. అనగా నీకు కోపం తగ్గే వరకూ అలాగే కూర్చోవాలనే ఉద్దేశ్యముతో కూర్చున్నాడు అని అర్థం. అదే

విధంగా 'భూమౌ' (నేలమీద) అని కాకుండా 'భూమిమ్'అని ప్రయోగించాడు. 'నేలమీద' అని అన్నట్లయితే బుద్ధిపూర్వకంగా నేలమీద వ్రాస్తున్నాడు అని అర్థం వస్తుంది. 'నేలను' రాస్తున్నాడు అనడంలో ఏమేమో ఆలోచించుకుంటూ అప్రయత్నంగా నేలను కాలి బొటనవ్రేలితోనో, చేతుల వ్రేళ్ళతోనో వ్రాస్తున్నా డని భావం వస్తుంది. ఈ విధంగా 'లిఖన్' 'భూమిమ్' అనే సుబంతాలలోను, 'ఆస్తే' అనే తిఙంతంలోను ఉన్న 'సుప్' 'తిఙ్' ప్రత్యయాలు విప్రలంభశృంగారపోషకాలుగా ఉన్నాయి.

వి. నామవాచకవిశేషణాదుల చివర చేర్చే 'సు, ఔ, జస్' మొదలైన ప్రత్యాయాలు 'సుప్' ప్రత్యయాలు. క్రియాపదాల చివర చేర్చే 'తిప్, తస్, ఝి' మొదలైన ప్రత్యయాలు 'తిఙ్' ప్రత్యయాలు. వ్యాకరణ నియమాలని పట్టి ఈ ప్రత్యయాలు గుర్తించలేని విధంగా మారిపోతూ ఉంటాయి. అయినా అవి ముందు చేరుస్తాం కాబట్టి అవి అక్కడ ఉన్నట్లే.

అవ. పదైకదేశం అయిన షష్ఠీవిభక్తిప్రత్యయం శృంగారవ్యంజకం ఎట్లు అవుతుందో ఉదాహరిస్తున్నాడు -

వృ. సంబన్ధస్య యథా -

గాథ - గామారుహమ్మి గామే వసామి ణఅరట్ఠిఇం ణ జాణామి
ణాఅరిఆణం పఇణో హరేమి జా హోమి సా హోమి..

"గ్రామరుహాస్మి గ్రామే వసామి నగరస్థితిం న జానామి
నాగరికాణాం పతీన్ హరామి యా భవామి సా భవామి."

వృ. అత్ర నాగరికాణామితి షష్ఠ్యాః.

వ్యా. గామా ఇతి. 'పల్లెటూరి పడుచు' అని నాగరికస్త్రీలు పరిహసించగా ఒక గ్రామీణస్త్రీ అంటూన్న మాటలు. గ్రామరుహా = గ్రామంలో పుట్టినదానను, అస్మి = అయి ఉన్నాను. గ్రామే = గ్రామంలో, వసామి = నివసిస్తున్నాను. నగరస్థితిమ్ = పట్టణాల మర్యాదను, న జానామి = ఎరుగను. నాగరికాణామ్ = నాగరికస్త్రీలయొక్క, పతీన్ = భర్తలను, హరామి = వశం చేసుకుంటున్నాను. యా భవామి = ఎవతెగా ఉన్నానో, సా భవామి = ఆమెగానే ఉన్నాను.

అత్రేతి :- ఇక్కడ 'నాగరికాణామ్'అని షష్ఠి శృంగార వ్యంజకం. "నాగరికాన్ (నాగరికుల్ని) హరామి"అనకుండగా"నాగరికాణాం పతీన్ హరామి" అనడం చేత "నాగరికస్త్రీలు మంచి నేర్పుగలవారు కదా; వాళ్ళ భర్తలకు కూడ చాలా చాతుర్యం ఉంటుంది. అలాంటివాళ్ళను కూడా నేను వశంచేసుకోగలను" అని వ్యంగ్యం. ఇక్కడ షష్ఠి సంబంధాన్ని బోధిస్తుంది. 'నాగరికస్త్రీలకు సంబంధించిన' అని అర్థం.

అవ. పదైకదేశమైన 'లఙ్' అనే 'తిఙ్' ప్రత్యయంవల్ల రౌద్రరసవ్యంజనకు ఉదాహరణం చూపుతున్నాడు -

వృ. "రమణీయః క్షత్రియకుమార ఆసీత్" ఇతి కాలస్య. ఏషా హి భగ్నమహేశ్వరకార్ముకం దాశరథిం ప్రతి కుపితస్య భార్గవస్యోక్తిః.

వ్యా. రమణీయః ఇతి :- "సుందరుడైన క్షత్రియకుమారుడు ఉండెను" ఇది కాలం, అనగా భూతకాలార్థకమైన 'లఙ్' లకారం ('ఆసీత్') రసవ్యంజకం అవడానికి ఉదాహరణం. ఇది మహేశ్వరుని ధనస్సును విరచిన రాముని మీద కోపించిన పరశురాముని వాక్యం.

వి. 'ఆసీత్'అని లఙ్ప్రయోగం. "నాకు కోపం కలిగించిన ఆ క్షత్రియ కుమారుని రమణీయత్వం భూతకాలానికి చెందినదే; వర్తమానకాలానికి సంబంధించినది కాదు; భవిష్యత్తులో ఉండబోదు" అనే అర్థాన్ని సూచిస్తూ రౌద్రరసాభి వ్యంజకంగా ఉంది.

అవ. పదైకదేశం అయిన ప్రత్యయరూపవచనవిశేషంవల్ల విప్రలంభ శృంగారధ్వనికి ఉదాహరణం చూపుతున్నాడు -

గాథ :- తాణం గుణగ్గహణాణం తాణుక్కంఠాణం తస్స పేమ్మస్స
తాణం భణిఆణం సుందర ఏరిసిఅం జాఅమవసాణమ్.

"తేషాం గుణగ్రహణానాం తాసాముత్కణ్ఠానాం తస్య ప్రేమ్ణః
తాసాం భణితీనాం సున్దర ఈదృశం జాతమవసానమ్".

వృ. అత్ర గుణగ్రహణాదీనాం బహుత్వం ప్రేమ్ణశ్చైకత్వం ద్యోత్యతే.

వ్యా. తేషామ్ ఇతి :- గుణగ్రహణాదులచేత అత్యంతాసక్తుడైన నాయకుడే కాలాంతరంలో అన్యవనితాసక్తుడు అవగా ఒక నాయిక అంటూన్న మాటలు. సున్దర = సుందరుడా ! తేషామ్ = ఆ, గుణగ్రహణానామ్ = నాలో ఉన్న గుణాల గ్రహణాలయొక్క, తాసామ్ = ఆ, ఉత్కణ్ఠానామ్ = ఉత్కంఠలయొక్క, తాసామ్ = ఆ, భణితానామ్ = సంభాషణలయొక్క, తస్య = ఆ, ప్రేమ్ణః = ప్రేమయొక్క, అవసానమ్ = చివరి ఫలితం, ఈదృశమ్ = ఇట్టిది, జాతమ్ = అయినది.

అత్రేతి :- ఇక్కడ గుణగ్రహణాదుల బహుత్వమూ, ప్రేమయొక్క ఏకత్వమూ సూచింపబడుతున్నాయి

వి. 'గుణగ్రహణానామ్' 'ఉత్కణ్ఠానామ్' 'భణితీనామ్' అని బహువచనం (బహువచనప్రత్యయం) ప్రయోగించడంచేత ఆ గుణగ్రహణాదులు బహువిధాలుగా ఉండే వనీ, ప్రేమ్ణః అని ఏకవచనం ప్రయోగించడంచేత ప్రేమమాత్రం ఒకే విధంగా, అవిచ్ఛిన్నంగా ఉండేదనీ సూచించబడుతున్నది. దీనివల్ల విప్రలంభ శృంగారం పరిపుష్టం అవుతున్నది.

అవ. పురుషవ్యత్యయం (పురుషముల మార్పు) శాంతరసాన్ని ధ్వనింపచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ రే రే చఞ్చలలోచనాఞ్చితరుచే చేతః ప్రముచ్య స్థిర
ప్రేమాణం మహిమానమేణనయనామాలోక్య కిం నృత్యసి,
కిం మన్యే విహరిష్యసే బత హతాం ముఞ్చాన్తరాశామిమామ్
ఏషా కణ్ఠతలే కృతా ఖలు శిలా సంసారవారాంనిధౌ. 103

వృ. అత్ర ప్రహాసః.

వ్యా. రేరే ఇతి :- ఒక సుందరిని చూడగానే చలించిన మనుస్సును పరిహాసపూర్వకంగా సంబోధిస్తూన్న ఒక శాంతుని మాటలు. చఞ్చలలోచనాఞ్చితరుచే = చంచలములైన నేత్రాలచేత ప్రకటించబడిన అభిలాషగల; లేదా చంచలలోచనయైన స్త్రీయందు పొందబడిన ఆసక్తి గల, రే రే చేతః = ఓ చిత్తమా! స్థిరప్రేమాణమ్ = స్థిరమైన ప్రేమగల (ప్రేమకు స్థానమైన), మహిమానమ్ =

విషయాసక్త్యాదులు లేకపోవడంచేత కలిగిన ఉత్కర్షను, ప్రముచ్య = విడచి, ఏణనయనామ్ = స్త్రీని, ఆలోక్య = చూచి, కిమ్ = ఎందుకు, నృత్యసి = నాట్యం చేయుచున్నావు? విహరిష్యసే = విహరించెదను అని, కిం మన్యే = తలచుచున్నావా? బత = అయ్యో! ఇమామ్ = ఈ, హతామ్ = చెడ్డదైన, అన్తరాశామ్ = లోపల ఉన్న ఆశను, ముఞ్చ = విడిచిపెట్టుము. ఏషా = ఇది (ఈ ఆశ లేదా ఈ స్త్రీ), సంసార వారాంనిధౌ = సంసారసముద్రమునందు, కణ్ఠతలే = కంఠప్రదేశమునందు, కృతా = చేయబడిన (కట్టబడిన), శిలా ఖలు = శిల కదా?

ఇక్కడ ప్రహాసం (వేళాకోళం చేయడం) సూచింపబడుతున్నది.

వి. (అహం) విహరిష్యే ఇతి (త్వం) మన్యసే- అనగా "నేను విహరించెదను అని నువ్వు అనుకొనుచున్నావు" అని చెప్పినప్పుడు 'విహరిష్యే' అను పదం ఉత్తమపురుషలోను 'మన్యసే' అనేది మధ్యమపురుషలోను ఉండాలి. అయితే ఉపహాసం చేస్తూ మాటలాడినప్పుడు మన్యధాతువునూ మరొకధాతువునూ ప్రయోగించిన వాక్యంలో ఉత్తమపురుషకు బదులు మధ్యమపురుష, మధ్యమపురుషకు బదులు ఉత్తమపురుష వస్తాయని "ప్రహాసే చ మన్యోపపదే మన్యతేరుత్తమ ఏకవచ్చ" (పా సూ 1.4.106) అనే పాణినిసూత్రంలో విధించబడింది. ఆ విధంగా ఇక్కడ 'విహరిష్యసే' 'మన్యే' అని పురుషపరివృత్తి పరిహాసాన్ని సూచిస్తూన్నది. దీని చేత శాంతరసపరిపుష్టి కలుగుతున్నది.

అను. పూర్వనిపాత (తరవాత రావలసిన పదాన్ని ముందు ప్రయోగించడం) భావాన్ని వ్యంజింపచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. పూర్వనిపాతస్య యథా-

శ్లో॥ యేషాం దోర్బలమేవ దుర్బలతయా తే సంమతాస్తైరపి
ప్రాయః కేవలనీతిరీతిశరణైః కార్యం కిముర్వీశ్వరైః,
యే క్ష్మాశక్ర పునః పరాక్రమనయస్వీకారకాన్తక్రమా
స్తే స్యుర్నైవ భవాదృశాస్త్రిజగతి ద్విత్రాః పవిత్రాః పరమ్.

వృ. అత్ర పరాక్రమస్య ప్రాధాన్యం గమ్యతే.

వ్యా. పూర్వనిపాతకు వ్యంజకత్వం ఎట్లనగా-

యేషామ్ ఇతి:— యేషామ్=ఎవరికి, దోర్బలమేవ=బాహుబలం మాత్రమే ఉన్నదో, తే= అట్టి రాజులు, దుర్బలతయా = దుర్బలులుగా, సంమతాః= ఇష్టులు (చెప్పబడినారు). ప్రాయః=సాధారణంగా, కేవలరీతినీతిశరణైః=కేవలం రీతిమార్గమే శరణగా కల, తైః = ఆ, ఉర్వీశ్వరైః అపి = భూపతులచేత కూడ, కిమ్ = ఏమి, కార్యమ్ = ప్రయోజనము? క్ష్మాశక్ర = ఓ! భూలోకమహేంద్రా! యే = ఎవరు, పరాక్రమనయస్వీకారకాన్తక్రమాః= పరాక్రమముయొక్క, నీతి యొక్క స్వీకారంచేత మనోహరమైన ప్రవర్తనాక్రమం కలవారో, తే = అట్టి, పవిత్రాః = పవిత్రులైన, భవాదృశాః పరమ్=నీవంటి వారైతే, త్రిజగతి=మూడు లోకాలలో, ద్విత్రాః = ఇద్దరు ముగ్గురు కూడా, నైవ స్యుః = ఉండరు.

"ఇక్కడ పరాక్రమానికి ప్రాధాన్యం గమ్యం అవుతున్నది".

వి. 'పరాక్రమనయ' అనే ద్వంద్వసమాసంలో "అల్పాచ్‌తరమ్" (పా. సూ. 2.2.34) అనే పాణినిసూత్రం ప్రకారం తక్కువ అచ్చులున్న 'నయ' శబ్దాన్ని ముందు ప్రయోగించాలి. అప్పుడు 'నయపరాక్రమ' అని ఉండాలి. కాని "అభ్యర్హితం చ" అనే వార్తికాన్ని అనుసరించి, చెప్పిన రెండింటిలో ఏది పూజ్యమో దానిని ముందు ప్రయోగించాలి. ఇక్కడ 'పరాక్రమ' శబ్దాన్ని ముందు ప్రయోగించడంచేత అది అభ్యర్హితం అని సూచించబడుతున్నది. పూర్వనిపాత సమాన రూపమైన పదంలో ఒక భాగానికి సంబంధించినది అవడం చేత ఇది పదైకదేశ సూచకత్వానికి ఉదాహరణంగా చూపబడింది. దీనివల్ల రాజు విషయంలో కవికి ఉన్న రతి పుష్టం అవుతున్నది అని భావం.

అవ. విభక్తివిశేషం భావవ్యంజకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. విభక్తివిశేషస్య యథా-

శ్లో॥ ప్రధనాధ్వని ధీరధనుర్ధ్వనిభృతి
విధురైరయోధి తవ దివసమ్,
దివసేన తు నరప భవానయుద్ధ
విధిసిద్ధసాధువాదపదమ్. 105

వృ. అత్ర దివసేనేత్యపవర్గతృతీయయా ఫలప్రాప్తిం ద్యోత యతి.

వ్యా. విభక్తివిశేషం భావవ్యంజకం అవడానికి ఉదాహరణం ఎట్లనగా-

ప్రధనాధ్వనీతి:- నరప = రాజా! ధీరధనుర్ధ్వనిభృతి = ధీరులయొక్క-ధనస్సుల ధ్వనులతో నిండిన, ప్రధనాధ్వని = యుద్ధరంగంలో, విధురైః = నీ శత్రువులచేత, దివసమ్ = దివసమును (రోజంతా), అయోధి = యుద్ధం చేయ బడింది. భవాన్ తు = నీవైతే. విధిసిద్ధసాధువాదపదమ్ = యథావిధిగా అనగా జయం లభించడం నిజమే అవడంచేత యుక్తరీతిలో సిద్ధించిన "బాగు బాగు" అనే మాటలకు స్థానం అయేటట్లు, దివసేన = రోజుచేత, అయుద్ధ = యుద్ధంచేసి నావు.

అత్రేతి :- ఇక్కడ 'దివసేన' అనే అపవర్గతృతీయ ఫలప్రాప్తిని సూచి స్తున్నది.

వి. ప్రారంభించిన పని సఫలం అయినది అని సూచించడానికి తృతీయా విభక్తి ప్రయోగించబడుతుంది. "అపవర్గే తృతీయా" (పా. సూ. 2.3.6) అని పాణినిసూత్రం. అపవర్గం అనగా ఫలప్రాప్తి; దాని తరవాత ఆ పనిని విడిచిపెట్టి వేయడం అని అర్థం. "అపవర్గాన్ని సూచించడానికి కాల-మార్గవాచకపదాలను తృతీయా విభక్తిలో ప్రయోగించాలి" అని ఆ సూత్రానికి అర్థం. "అహ్నా అనువాకః అధీతః" "క్రోశేన అనువాకః అధీతః" ఇత్యాదులు ఉదాహరణం. "ఒక రోజుచేత అనువాకం (వేదంలో ఒక భాగం) చదవబడింది" "క్రోసుదూరంచేత (నడుస్తూ నడుస్తూ క్రోసుదూరం వెళ్ళేటప్పటికి) అనువాకం చదవబడింది" అని అర్థం. అనగా ఆ అనువాకం చదవడం పూర్తి అయిపోయింది అని భావం. అదే విధంగా ఇక్కడ "దివసేన భవాన్ అయుద్ధ" అని తృతీయావిభక్తిచేత నీవు యుద్ధఫల మైన విజయాన్ని పొందావు అని సూచించబడుతున్నది. "కాలాధ్వనోరత్యన్తసం యోగే" (పా. సూ. 2.3.5) అని మరొక పాణినిసూత్రం ఉంది. "అత్యంత సంయోగంలో అనగా అవిచ్ఛిన్నంగా జరిగింది అనే అర్థంలో, కాలవాచకాన్నీ మార్గవాచకాన్నీ ద్వితీయావిభక్తిలో ప్రయోగించాలి" అని దీని అర్థం. "మాసమ్ అధీతః" "క్రోశం కుటిలా నదీ" మొదలైనవి ఉదాహరణలు. "మాసం అంతా, అవిచ్ఛిన్నంగా చదవబడింది". "క్రోసు దూరమూ నది వంకరగానే ఉంది" అని

అర్థాలు. అయితే ఇక్కడ మాసం అంతా చదివినా ఆ అనువాకం నోటికి రాలేదు అని భావం. అనగా ఫలప్రాప్తి లేదు. 'విధురైః దివసమ్ అయోధి' అని దివస శబ్దాన్ని ద్వితీయావిభక్తిలో ప్రయోగించడంచేత "రోజంతా యుద్ధం చేసినా వాళ్ళు ఫలం సాధించలేకపోయారు" అని భావం. ఈ విధంగా ఇక్కడ విభక్తివిశేషాలైన ద్వితీయా-తృతీయా విభక్తులు శత్రువుకు ఫలం లభించలేదనీ, రాజుకు ఫలం లభించిం దనీ సూచిస్తున్నాయి. దీనివల్ల రాజు విషయంలో కవికి ఉన్న రతి పరిపుష్టం అవుతున్నది.

అవ. ప్రకృతిలో ఏకదేశమైన 'క' తద్ధితప్రత్యయం విప్రలంభశృంగారాన్ని వ్యంజింపచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు—

శ్లో॥ భూయో భూయః సవిధనగరీరథ్యయా పర్యటన్తం
దృష్ట్వా దృష్ట్వా భవనవలభీతుఙ్గవాతాయనస్థా,
సాక్షాత్కామం నవమివ రతిర్మాలతీ మాధవం యత్
గాఢోత్కణ్ఠాలులితలులితైరఙ్గకైస్తామ్యతీతి. 206

వృ. అత్ర అనుకమ్పావృత్తేః 'క'రూపతద్ధితస్య.

వ్యా. భూయోభూయః ఇతి :- మాలతీ = మాలతి, భవనవలభీతుఙ్గవాతాయనస్థా = ఇంటి డాబామీద ఉన్న ఎత్తైన కిటికీ దగ్గర ఉన్నదై, సవిధనగరీరథ్యయా = సమీపమునందున్న నగరవీథిచేత (లో), పర్యటన్తమ్ = తిరుగుచున్న, సాక్షాత్ = సాక్షాత్తు, నవమ్ = నూతనుడైన, కామమ్ ఇవ = మన్మథుడు వలె ఉన్న, మాధవమ్ = మాధవుణ్ణి, భూయః భూయః = మాటిమాటికి, దృష్ట్వా = చూచి, గాఢోత్కణ్ఠాలులితలులితైః = గాఢమైన ఉత్కంఠ (బెంగ) చేత మిక్కిలి నలిగిపోయిన, అఙ్గకైః = (సన్నబడిపోయిన జాలిపడదగిన) అవయవములతో, తామ్యతి = బాధపడుచున్నది, ఇతి యత్ = అను ఏ విషయం ఉన్నదో (అది లవంగిక ద్వారా నాకు తెలిసినది. అని వెనక ఉన్న వాక్యంతో అన్వయం.)

అత్రేతి :- ఇక్కడ అనుకంప అనే అర్థాన్ని సూచించే 'క' రూపతద్ధితకు వ్యంజకత్వం.

వి. 'అఙ్గకైః' అన్నప్పుడు "అనుకమ్పాయామ్" (5.3.76) అనే పాణిని సూత్రం ప్రకారం జాలిపడదగినది అనే అర్థంలో 'అఙ్గ' శబ్దానికి 'క' అనే

ప్రత్యయం చేర్చబడింది. అందుచేత ఇక్కడ ప్రకృతిలో ఒక భాగం అయిన 'క' ప్రత్యయం విప్రలంభశృంగారాన్ని వ్యంజింపచేస్తూన్నది అని భావం.

అవ. ఉపసర్గరూపమైన ప్రకృత్యేకదేశం విప్రలంభశృంగారాన్ని వ్యంజింప చేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ పరిచ్ఛేదాతీతః సకలవచనానామవిషయః
పునర్జన్యస్మిన్ననుభవపథం యో న గతవాన్,
వివేకప్రధ్వంసాదుపచితమహామోహగహనో
వికారః కోఽప్యన్తర్జడయతి చ తాపం చ కురుతే. 107

వృ. అత్ర ప్రశబ్దస్యోపసర్గస్య.

వ్యా. పరిచ్ఛేదేతి :— మాలతీమాధవంలో మాధవుడు మిత్రుడైన మకరందునితో తన అవస్థను గూర్చి వర్ణించి చెపుతూన్న శ్లోకం. పరిచ్ఛేదాతీతః = పరిచ్ఛేదాన్ని ('ఇంత' అనే పరిమాణాన్ని) దాటిపోయినది, సకలవచనానామ్ = సమస్త వచనములకు, అవిషయః = విషయం కానిది, యః = ఏది, అస్మిన్ = ఈ, జన్మని = జన్మయందు, పునః = మరల, అనుభవపథమ్ = అనుభవమార్గాన్ని, న గతవాన్ = పొందనిదో అట్టిదీ, వివేకప్రధ్వంసాత్ = వివేకం నశించడంవల్ల, ఉపచితమహామోహగహనః = వృద్ధిపొందిన మహామోహంతో దట్టమైనదీ అయిన, కోఽపి = ఒకానొక, వికారః = వికారం, అన్తః = లోపల, జడయతి = జడుణ్ణిగా చేస్తూన్నది, తాపం చ = తాపాన్ని కూడ, కురుతే = చేస్తూన్నది.

అత్రేతి :- ఇక్కడ ఉపసర్గయైన 'ప్ర' అనే శబ్దం విప్రలంభశృంగార వ్యంజకంగా ఉన్నది.

వి. "వివేకప్రధ్వంసాత్" అనే పదంలో ఏకదేశమైన 'ప్ర' అనే ఉపసర్గ 'అత్యధికంగా' అనే అర్థాన్ని సూచిస్తుంది. అందుచేత 'వివేకం పూర్తిగా నశించి పోవడంవల్ల' అనే అర్థం లభిస్తుంది. ఈ విధంగా 'ప్ర' అనే ఉపసర్గ విప్రలంభ శృంగారవ్యంజకంగా ఉన్నది అని భావం.

అవ. నిపాతరూపమైన పదైకదేశం వీరరసవ్యంజకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ కృతం చ గర్వాభిముఖం మనస్త్వయా
కిమన్యదేవం నిహతాశ్చ నో ద్విషః,
తమాంసి తిష్ఠన్తి హి తావదంశుమాన్
న యావదాయాత్యుదయాద్రిమౌలిమ్. 108

వృ. అత్ర తుల్యయోగితాద్యోతకస్య 'చ' ఇతి నిపాతస్య.

వ్యా. కృతమితి :- రాజుతో మంత్రులు అంటూన్న మాటలు. త్వయా = నీచేత, మనః = మనస్సు, గర్వాభిముఖమ్ = గర్వమునకు అభిముఖమైనదిగా, కృతం చ = చేయబడింది. అన్యత్ కిమ్ = ఇంక ఏమున్నది? నః = మనయొక్క ద్విషః = శత్రువులు. ఏవమ్ = ఈ విధంగా. నిహతాః చ = చంపబడినారు. అంశుమాన్ = సూర్యుడు, యావత్ = ఎంతవరకు, ఉదయాద్రిమౌలితామ్ = ఉదయ పర్వతానికి శిరోభూషణత్వాన్ని, న యాతి = పొందడో, తావత్ = అంతవరకు మాత్రమే, తమాంసి = చీకట్లు, తిష్ఠన్తి హి = ఉండును కదా?

అత్రేతి :- ఇక్కడ తుల్యయోగితను ద్యోతింపచేసే 'చ' అనే నిపాత వీరరసప్రకర్షను సూచిస్తూన్నది.

వి. ఇక్కడ మనస్సును గర్వానికి అభిముఖంగా చేయడం, శత్రుసంహారం అనేవి రెండూ ఒకే కాలానికి చెందడం (ఏకకాలత్వం) అనే ఒక ధర్మంతో సంబంధించినట్లుగా 'చ' కారం ద్యోతింపచేస్తూన్నది. అందుచేత తుల్యయోగితాలంకారం. ఈ విధంగా తుల్యయోగితాలంకారద్యోతకమైన'చ'అనే నిపాత వీరరస ప్రకర్షను సూచిస్తూన్నది అని అర్థం. అన్నీ ప్రకృతాలు, లేదా అన్నీ అప్రకృతాలు అయిన అనేక వస్తువులు (ఒకటికి మించిన వస్తువులు) ఒకేధర్మంతో సంబంధించినట్లు వర్ణిస్తే తుల్యయోగితాలంకారం. అందుచేత ఇక్కడ తుల్యయోగితాలంకారం అని మమ్మటుని అభిప్రాయం అని తోస్తుంది కాని వ్యాఖ్యాతలు ఇక్కడ ఉన్న తుల్యయోగితా అనే పదానికి "తుల్యకాలం యోగః సంబన్ధః యయోః తౌ తుల్యయోగినౌ. తయోః భావః తుల్యయోగితా" అనే విగ్రహంచేత ఒకే కాలంలో సంబంధం కలిగిఉండడం అని అర్థం చెప్పి 'తుల్యయోగితాద్యోతకస్య' అనే పదానికి 'సముచ్చయాలంకారద్యోతకమైన' అని అర్థం చెప్పినారు రెండు క్రియలు ఒకే కాలంలో జరిగినట్లు వర్ణిస్తే సముచ్చయాలంకారం. ఇక్కడ మనోగర్వాభి

ముఖీకరణ—శత్రుహననక్రియలు రెండూ ఒకే సమయంలో జరిగినాయి గాన ఇది సముచ్చయాలంకారం అని వీరి అభిప్రాయం.

'చ' 'వా' 'తు' మొదలైనవాటికి నిపాత లని పేరు. ఇవి సముచ్చయం (కలవడం) మొదలైన అర్థాలను ద్యోతింపచేస్తాయి. అనగా "రామః లక్ష్మణః" అని ప్రయోగించినప్పుడు "రాముడూ లక్ష్మణుడూ కలిసి" అని అర్థం ఆ పదాలే బోధిస్తాయి. కాని 'చ' అనేదానిని చేర్చి "రామ లక్ష్మణః చ" అని అన్నట్లయితే ఆ ఉన్న అర్థాన్నే 'చ' అనేది స్పష్టీకరిస్తుంది. సముచ్చయం అనే అర్థాన్ని ఇది బోధించదు. ద్యోతకత్వం అంటే ఇదే.

'చ' మొదలైన నిపాతలు అవ్యయాలు. వ్యాకరణశాస్త్రం ప్రకారం అవ్యయాలు కూడా స్వతంత్రపదాలే. అలాంటప్పుడు 'చ' అనేది పదైకదేశం కాదు కదా? ఇక్కడ దీనిని పదైకదేశంగా గ్రహించి పదైకదేశద్యోతకత్వానికి ఉదాహరణంగా చూపడం అయుక్తం కదా అనే ఆశంక కలగవచ్చు. "'చ' మొదలైన నిపాతలను స్వతంత్రంగా కాక ఇతరపదాలతో కలిపి మాత్రమే ప్రయోగిస్తారు. అందుచేత వీటికి పదైకదేశత్వాన్ని ఆరోపించి ఆ విధంగా చెప్పడం జరిగింది" అని కొందరు వ్యాఖ్యాతలు సమాధానం చెప్పారు. "'చ' మొదలైనవాటికి చేర్చిన 'సుప్' ప్రత్యయాలు లోపించి ప్రకృతిమాత్రమే మిగులుతుంది గాన పదైకదేశం అని చెప్పబడింది" అని మరికొందరి వ్యాఖ్యాతల సమాధానం.

అవ. సర్వనామ-ప్రాతిపదికాదులు చాలా కలిసి వీరరసవ్యంజనచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ రామోఽసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరా
మస్మద్భాగ్యవిపర్యయాద్యది పరం దేవో న జానాతి తమ్,
వన్దీవైష యశాంసి గాయతి మరుద్యస్యైకబాణాహతి
శ్రేణీభూతవిశాలతాలవివరోద్గీర్ణైః స్వరైః సప్తభిః. 109

వృ. అత్రాసావితి, భువనేష్వితి, గుణైరితి సర్వనామప్రాతిపదికవచనానాం న త్వదితి న మదితి అపి తు అస్మదిత్యస్య సర్వాక్షేపిణః భాగ్యవిపర్యయాదిత్యన్యథాసంపత్తిముఖేన న త్వభావముఖేనాభిదానస్య.

వ్యా. రామః ఇతి:— రాఘవానందం అనే నాటకంలో విభీషణుడు రావణు నితో అంటూన్న మాట లివి. అసౌ = ఖరాదుల్ని చంపిన ఆ, రామః = రాముడు, విక్రమగుణైః=పరాక్రమమువలన కలిగిన గుణములచేత, లేదా పరాక్రమముచేతా, సద్గుణములచేతా, భువనేషు = అన్ని లోకములలోను, పరామ్ = గొప్ప, ప్రసిద్ధిమ్ = ప్రసిద్ధిని, ప్రాప్తః = పొందినాడు. తమ్ = అట్టి రాముణ్ణి గూర్చి, దేవః = ప్రభువు అయిన నీవు, న జానాతి యది = ఎరుగకపోయినట్లయితే అది, అస్మ ద్భాగ్యవిపర్యయాత్ పరమ్ = మా భాగ్యము వైపరీత్యమువలననే, ఏషః = ఈ, మరుత్ = వాయువు, వన్దీవ = స్తోత్రపాఠకుడు వలె, ఏకబాణాహతిశ్రేణీభూత విశాలతాలవివరోద్గీర్ణైః = ఒక్క బాణముదెబ్బచేత వరసగా ఏర్పడిన పెద్ద తాల వృక్షముల రంధ్రముల నుండి విడవబడిన, సప్తభిః = ఏడు, స్వరైః = స్వరముల చేత, యస్య = ఏ రామునియొక్క, యశాంసి = కీర్తులను, గాయతి = గానము చేయుచున్నదో.

అత్రేతి:— ఇక్కడ 'అసౌ' అనీ, భువనేషు అనీ, 'గుణైః' అనీ సర్వనామ ప్రాతిపదికవచనములకు, 'త్వత్' అని కాకుండా 'మత్' అని కాకుండా, అందరినీ గ్రహించే 'అస్మత్' అనే దానికీ, అభావముఖంచేత కాకుండా. మరొకవిధంగా అయి పోవడం అని చెప్పడానికై ప్రయోగించిన 'భాగ్యవిపర్యయాత్' అనేదానికీ వీరరస వ్యంజకత్వం.

వి. 'అసౌ' అని సర్వనామశబ్దం ప్రయోగించబడింది. దీనిచేత "ఖరదూష ణాదుల సంహారకుడుగా ప్రసిద్ధుడైన 'ఆ' రాముడు" అనే అర్థం గమ్యం అవు తున్నది. 'భువనేషు' అనడంచేత "ఈ నగరంలోనో, గ్రామాదులలోనో కాదు; అన్ని లోకాలలోను" అనే అర్థం గమ్యం అవుతూన్నది. 'భువన' అనే ప్రాతిపదిక బహువచనమూ కూడా ఇందుకు సహకరిస్తున్నాయి. 'గుణైః' అనే బహువచనం చేత అసంఖ్యాకములైన సద్గుణాలు గమ్యం అవుతున్నాయి. ఈ విధంగా మూడు పదాలలో సర్వనామ-ప్రాతిపదిక-వచనాలు అర్థవిశేషసూచకంగా ఉన్నాయి. అదే విధంగా "త్వద్భాగ్యవిపర్యయాత్" (నీ భాగ్యవైపరీత్యంవల్ల) అని కాని "మద్ భాగ్యవిపర్యయాత్" (నా భాగ్యవైపరీత్యంవల్ల) అని కాని కాక "అస్మద్భాగ్య విపర్యయాత్" అనడంచేత "మనఅందరి, అనగా రాక్షసు లందరి, భాగ్యవైపరీత్యం

వల్ల" అనే అర్థం వస్తుంది. అదే విధంగా "మన దౌర్భాగ్యంవల్ల అని అనకుండా 'భాగ్యం విపరీతం అవడం వల్ల' అని చెప్పడంలో "మనం నిజానికి మంచి భాగ్యం ఉన్నవాళ్ళమే, ఇప్పుడు ఆ రాముణ్ణి గూర్చి నీవు తెలుసుకోకపోవడం మన భాగ్యం చెడిపోవడంవల్లనే" అనే అర్థం గమ్యం అవుతున్నది. ఈ విధంగా ఇవన్నీ కలసి వీరరసవ్యంజకాలుగా ఉన్నాయి అని భావం.

అవ:- అనేకములైన అంశాలు కలిసి శృంగారరసాన్ని వ్యంజింపచేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు—

శ్లో॥ తరుణిమని కలయతి కలా
మనుమదనధనుర్భ్రువోః పఠత్యగ్రే,
అధివసతి సకలలలనా
మౌలిమియం చకితహరిణచలనయనా. 101

వృ. అత్ర ఇమనిజవ్యయీభావకర్మభూతాధారాణాం స్వరూపస్య, 'తరుణత్వే' ఇతి, 'ధనుషః సమీపే' ఇతి, 'మౌలావసతి' ఇతి త్వాదిభిస్తుల్యే ఏషాం వాచకత్వే అస్తి కశ్చిత్ స్వరూపస్య విశేషో యశ్చమత్కారకారీ; స ఏవ వ్యఞ్జకత్వం ప్రాప్నోతి.

వ్యా. చకితహరిణచలనయనా = భయపడిన లేడియొక్క చంచలములైన నేత్రాల వంటి నేత్రాలు గల, ఇయమ్ = ఈమె, తరుణిమని = తారుణ్యము, కలామ్=కటాక్షవిక్షేపాదిరూపమైన కళను, కలయతి=నేర్పుచుండగా, భ్రువోః =కనుబొమ్మలయొక్క, అగ్రే = అగ్రభాగము, అనుమదనధనుః = మన్మథుని ధనస్సు దగ్గర, పఠతి = కళలను పఠించుచుండగా, సకలలలనామౌలిమ్ = సమస్తమైన స్త్రీల శిరస్సును, అధివసతి = అధిష్ఠించుచున్నది.

అత్రేతి:- ఇక్కడ 'ఇమనిచ్'-అవ్యయీభావ- కర్మభూతాధారాల స్వరూపం శృంగారవ్యంజకంగా ఉన్నది. ఇవి 'తరుణత్వే' 'ధనుషః సమీపే' 'మౌలావసతి' అనే వాటికి ఏ అర్థాలో ఆ అర్థాలనే బోధిస్తున్నా కూడ వీటి స్వరూపంలో చమత్కారజనకమైన ఒకానొక విశేషం ఉంది అదే వ్యంజకం అవుతూన్నది.

వి. 'తరుణత్వే' అంటే ఏ అర్థమో 'తరుణిమని' అంటే కూడా అదే అర్థం. అయితే ఇక్కడ 'తరుణత్వే'కి బదులు 'తరుణిమని'అని 'ఇమనిచ్' ప్రత్యయం చేర్చగా ఏర్పడిన సుకుమారమైన రూపం ప్రయోగించడంలో సౌకుమార్యం ద్యోతితం అవుతున్నది. "మదనధనుషః సమీపే"అని ప్రయోగించకుండా 'అను మదనధనుః'అని అవ్యయీభావసమాసం ప్రయోగించడంలో కూడా ఒక అందం ఉంది. 'వస్' ధాతువును 'అధి' అనే ఉపసర్గ చేర్చి ప్రయోగించినపుడు దేనిమీద నివసిస్తూన్నట్లు చెప్పబడుతుందో ఆ ఆధారం 'కర్మ' అవుతుంది అని 'ఉపాన్వ ధ్యాఙ్వసః'అనే పాణిని సూత్రం (1-4-48) చెపుచున్నది. దానిప్రకారం 'సకల లలనామౌలిమ్ అధివసతి' అన్నప్పుడు'మౌలి'శబ్దం కర్మఅయి ద్వితీయావిభక్తిలో ప్రయోగించబడింది. 'అధి'లేనిపక్షంలో"సకలలలనామౌలౌ'అని సప్తమీవిభక్తిలో ప్రయోగించబడి ఉండేది. ఈ విధంగా ద్వితీయావిభక్తిలో ప్రయోగించడంలో ఒక అందం ఉంది. ఇది సహృదయైకవేద్యమే కాని స్పష్టంగా చెప్పడానికి శక్యం కాని చమత్కారం. ఈ అందమైన ప్రయోగాలచేత శృంగారరసం వ్యంజింపబడుతూన్న దని భావం.

అవ్యయీభావసమాసంలో పూర్వపదార్థానికి ప్రాధాన్యం ఉంటుంది అందు చేత 'అనుమదనధనుః' అని అనడంలో ఉత్తర పదార్థమైన ధనస్సుకు ప్రాధాన్యం లేదని తెలుస్తూన్నది గాన మన్మథుని ధనస్సుతో పని లేకుండగానే ఈమె భ్రూల తాగ్రం కామిజనమనోవిజయం చేస్తుంది అని భావం. 'మౌలౌ వసతి' అని ఆధా రార్థకమైన సప్తమీవిభక్తిని ఉపయోగించిన పక్షంలో "మౌలిలో ఎక్కడో ఒక చోట నివసిస్తుంది" అనే అర్థం కూడా రావచ్చు. 'మౌలిమ్' అని ద్వితీయా విభక్తిని ప్రయోగించడంతేత 'మౌలిని అంతనీ వ్యాపించి నివసిస్తుంది' అని అర్థం గోచరిస్తుంది అని వ్యాఖ్యాతలు వ్రాసినారు. ఇదేదో వ్రాయాలి కదా అని వ్రాసినట్లు కనబడుతుంది. 'ధనుషః సమీపే' లేదా 'ధనుఃసమీపే' అని ప్రయోగించినా ధనస్సుకు అప్రాధాన్యమే. 'తిలేషు తైలమ్' ఇత్యాదుల్లో కూడా అభివ్యాపకత్వం ఉంది కదా? కర్మ అయినంతమాత్రాన అభివ్యాపకత్వంఅని చెప్పడానికి ప్రమాణం ఏముంది. ఇక్కడ ప్రయోగించినపదాలలో అర్థభేదం లేకపోయినా శృంగార రసానుగుణమైన ఒక విధమైన సొగసు ఉంది అని చెప్పడమే మమ్మటుని అభిప్రాయం.

14)

వృ. ఏవమన్యేషామపి బోధ్యమ్. వర్ణరచనానాం వ్యఞ్జకత్వం గుణస్వరూపనిరూపణే ఉదాహరిష్యతే. అపిశబ్దాత్ ప్రబన్ధేషు. నాటకాదిషు. ఏవం రసాదీనాం పూర్వగణితభేదాభ్యాం సహ షడ్భేదాః.

కా. భేదా స్తదేకపఞ్చాశత్.

వృ. వ్యాఖ్యాతాః.

కా. తేషాం చాన్యోన్యయోజనే. 43

సంకరేణ త్రిరూపేణ సంసృష్ట్యా చైకరూపయా.

వృ. న కేవలం శుద్ధా ఏవైకపఞ్చాశద్భేదా భవన్తి, యావత్తేషాం స్వప్రభేదై రేకపఞ్చాశతా సంశయాస్పదత్వేన, అనుగ్రాహ్యానుగ్రాహకతయా, ఏకవ్యఞ్జకానుప్రవేశేన చేతి త్రివిధేన సంకరేణ పరస్పర నిరపేక్షరూపయా ఏకప్రకారయా సంసృష్ట్యా చేతి చతుర్భిర్గుణనే-

కా. వేదఖాబ్ధివియచ్చన్ద్రాః (10404)

వృ. శుద్ధభేదైః సహ

కా. శరేషుయుగఖేన్దవః (10455) 44

వృ. తత్ర దిఙ్మాత్రముదాహ్రియతే.

వ్యా. ఈ విధంగానే ఇతరములైన పదైకదేశాదులకు ఉన్న వ్యంజకత్వాన్ని తెలుసుకొనవలెను. వర్ణాలకీ, రచనలకీ (కూర్పులకి) ఉన్న వ్యంజకత్వానికి ఉదాహరణలు గుణాల స్వరూపాన్ని నిరూపించేటప్పుడు (అష్టమోల్లాసంలో) చూపబడగలవు. "పదైకదేశరచనావర్ణేష్వపి రసాదయః"అనే కారికార్థంలో 'అపి' అనడంచేత నాటకాదిప్రబంధాలలో కూడా రసాదులు వ్యంజింపబడతా యని గ్రహించవలెను.

ఏవమితి:- ఈ విధంగా రసాదులకు వెనక చెప్పిన రెండు భేదాలతో ఆరు భేదాలు ఏర్పడతాయి.

వి. ముందు వాక్యప్రకాశ్యం, పదప్రకాశ్యం అని రెండు భేదాలు చెప్ప బడ్డాయి. ఆ రెండూ, పదైకదేశ–రచనా-వర్ణ-ప్రబంధ ప్రకాశ్యాలనే నాలుగూ కలపగా అలక్ష్యక్రమాలైన రసాదులకు ఆరు భేదాలు ఏర్పడతాయి అని అర్థం.

భేదా ఇతి : తత్ = ఆ కారణంవలన, ఏకపఞ్చాశత్ = యభైఒక్క, భేదాః = భేదాలు.

వ్యాఖ్యాతాః = వివరించబడినట్లే.

వి. వెనుక చెప్పినట్లు అర్థాంతరసంక్రమితవాచ్యం, అత్యంతతిరస్కృత వాచ్యం అని అవివక్షితవాచ్యం మొదట రెండు విధాలు. వాటిలో ఒక్కొక్కటి పదగతం, వాక్యగతం అని రెండేసి విధాలు. ఈ విధంగా అవివక్షితవాచ్యానికి మొత్తం నాలుగు భేదాలు. వివక్షితాన్యపరవాచ్యధ్వనులలో అసంలక్ష్యక్రమధ్వని పైన చూపినట్లు ఆరు విధాలు. సంలక్ష్యక్రమధ్వనికి నలభైఒక్క భేదాలు. ఎట్ల నగా- శబ్దశక్తిమూలధ్వని అలంకారధ్వని అనీ, వస్తుధ్వని అనీ రెండు విధాలు. అవి ఒక్కొక్కటి పదగతం, వాక్యగతం అని రెండు విధాలు. ఈ విధంగా శబ్ద శక్తిమూలానికి నాలుగు భేదాలు. అలంకారం, వస్తువు అని అర్థశక్తిమూలక ధ్వని ముందుగా రెండు విధాలు. అర్థం స్వతఃసంభవి కావచ్చు, కవిప్రౌఢోక్తిసిద్ధం కావచ్చు, లేదా కవినిబద్ధప్రౌఢోక్తిసిద్ధం కావచ్చు. అందుచేత పైన చెప్పిన రెండు భేదాలూ ఒక్కొక్కటి మూడు విధాలు అవడంచేత మొత్తం $(2 \times 3)$ ఆరు భేదాలు. అర్థాలలో ఒక్కొక్కటి వస్తువు, అలంకారమూ అని రెండేసి భేదాలు. మొత్తం $(6 \times 2)$ పన్నెండు భేదాలు. వీటిలో ఒక్కొక్కటి పదగతము, వాక్య గతమూ, ప్రబంధగతమూ అని మూడేసి విధాలు. ఈ విధంగా అర్థశక్తిమూలక ధ్వనిలో మొత్తం ముప్పైఆరు భేదాలు. శబ్దార్థోభయశక్తిమూలానికి ఒకటే భేదం. ఈ విధంగా అసంలక్ష్యక్రమధ్వనిభేదాలు ఆరు (6), అవివక్షిత వాచ్యధ్వని భేదాలు నాలుగు (4), సంలక్ష్యక్రమధ్వనిలో శబ్దాశక్తిమూలధ్వనిభేదాలు నాలుగు (4), అర్థశక్తిమూలధ్వనిభేదాలు ముప్పైఆరు (36), ఉభయశక్తిమూలధ్వని ఒకటి (1). ఇవి అన్నీ కలపగా $(6+4+4+36+1=51)$ శుద్ధధ్వనికి యాభైఒక్క భేదాలు ఉంటాయి. మరొక విధమైన ధ్వనితో కలవనిదానిని 'శుద్ధ ధ్వని' అనీ కలిసినదానిని 'మిశ్రధ్వని' అనీ అంటారు.

ఈ యాభైఒక్క శుద్ధధ్వని భేదాల పేర్లు విద్యానాథుడు ప్రతాపరుద్రీయంలో

స్పష్టంగా వ్రాశాడు. తెలుగులో అనువదిస్తే పేర్లు పెద్దవి అయిపోతాయి; సంస్కృతంలో కూడా పాఠకులకు స్పష్టంగానే అర్థం అవుతాయి అనే ఉద్దేశ్యంతో వాటిని యథాతథంగా చూపుతున్నాం-

1. పదగతార్థాన్తరసంక్రమితావివక్షితవాచ్యధ్వని,
2. వాక్యగతార్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని,
3. పదగతాత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని,
4. వాక్యగతాత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని,
5. పదగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమవస్తుధ్వని,
6. పదగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమాలంకారధ్వని,
7. వాక్యగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమవస్తుధ్వని,
8. వాక్యగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమాలంకారధ్వని,
9. పదగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః,
10. పదగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః,
11. పదగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకార ధ్వనిః,
12. పదగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః,
13. వాక్యగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః,
14. వాక్యగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః,
15. వాక్యగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః,
16. వాక్యగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః,
17. ప్రబన్ధగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః,
18. ప్రబన్ధగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః,
19. ప్రబన్ధగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః,

20. ప్రబన్ధగతస్వతఃసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః,
21. పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః,
22. పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః,
23. పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః,
24. పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః,
25. వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః.
26. వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః.
27. వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః.
28. వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః.
29. ప్రబన్ధగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః,
30. ప్రబన్ధగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః.
31. ప్రబన్ధగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః,
32. ప్రబన్ధగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః,
33. పదగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలో వస్తునా వస్తుధ్వనిః,
34. పదగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలో వస్తునా అలంకారధ్వనిః,
35. పదగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః,
36. పదగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః,
37. వాక్యగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః,
38. వాక్యగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః,
39. వాక్యగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః.
40. వాక్యగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూః అలంకారేణ వస్తుధ్వనిః,

41. ప్రబన్ధగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా వస్తుధ్వనిః,

42. ప్రబన్ధగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః వస్తునా అలంకారధ్వనిః,

43. ప్రబన్ధగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ అలంకారధ్వనిః,

44. ప్రబన్ధగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలః అలంకారేణ వస్తుధ్వనిః.

45. ప్రబన్ధగతాసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః రసాదిధ్వనిః,

46. వాక్యగతాసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః రసాదిధ్వనిః,

47. పదగతాసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః రసాదిధ్వనిః,

48. పదైకదేశగతాసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః రసాదిధ్వనిః,

49. రచనాగతాసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః రసాదిధ్వనిః,

50. వర్ణగతాసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః రసాదిధ్వనిః,

51. వాక్యగతోభయశక్తిమూలః రసాదిధ్వనిః.

ఇవి యాభై ఒక్క శుద్ధధ్వనిభేదాల పేర్లు.

తేషామ్ ఇతి :- తేషామ్ = ఆ యాభైఒక్క భేదాలయొక్క, అన్యోన్య యోజనే = పరస్పరం గుణనం చేయగా, త్రిరూపేణ = మూడువిధాలైన, సంకరేణ = సంకరంచేత, ఏకరూపయా = ఒకవిధమైన, సంసృష్ట్యా = సంసృష్టిచేతా, వేదఖాబ్ధివియచ్చన్ద్రైః = పదివేల నాలుగువందల నాలుగు భేదాలు ఏర్పడుతాయి.

న కేవలమ్ ఇత్యాది- కేవలం యాభైఒక్క శుద్ధధ్వనిభేదాలే కాదు; ఆ యాభై ఒక్క భేదాలను తమ యాభైఒక్క భేదాలతోను గుణించి, తరవాత ఆ మొత్తాన్ని సంశయాస్పదత్వము, అనుగ్రాహ్యానుగ్రాహకభావమూ, ఏకవ్యంజకాను ప్రవేశమూ అనే మూడు విధాలైన సంకరం, పరస్పరనిరపేక్షరూపమై ఒకే విధమైన సంసృష్టి అనే నాలిగింటితోను గుణించగా మొత్తం పదివేల నాలుగు వందల నాలుగు (10404) సంకీర్ణధ్వనిభేదాలు ఏర్పడతాయి.

వి. రెండూ లేదా అంతకి మించిన శుద్ధభేదాలు కలిపితే మొత్తం 10404 సంకీర్ణధ్వనిభేదాలు ఏర్పడతాయి. యాభై ఒక్క శుద్ధభేదాలను యాభై ఒక్క శుద్ధ

భేదాలతో గుణిస్తే రెండు వేల ఆరు వందల ఒక భేదాలు ($51 \times 51 = 2601$) లభిస్తాయి. ఇవి ఒకదానితో ఒకటి కలిసినప్పుడు వాటికి సంకరం కాని, సంసృష్టి కాని కలుగుతుంది. సంకరం మూడు విధాలు; సంసృష్టి ఒక విధం. మొత్తం నాలుగు విధాలు. ఈ నాలుగుతో పై సంఖ్యను గుణించగా పదివేలనాలుగువందల నాలుగు భేదాలు ($2601 \times 4 = 10404$) ఏర్పడతాయి అని భావం.

'వేదఖాబ్ధివియచ్చన్ద్రైః' అనేది 10404 అనేసంఖ్యకు సంకేతం. పెద్ద సంఖ్యల్ని శ్లోకాలలో ఇమడ్చి చెప్పేటప్పుడు సంస్కృతభాషలో ఉపయోగించే సంకేత పద్ధతులలో ఇది ఒకటి. వేదాలు నాలుగు కాబట్టి 'వేద' అనగా నాలుగు (4). 'ఖ' అనగా ఆకాశం. అనగా శూన్యం. సున్న (0). సముద్రాలు నాలుగు కాబట్టి 'అబ్ధి' అనగా నాలుగు (4). వియత్ అనగా ఆకాశం. అనగా సున్న (0). చంద్రుడు ఒక్కడే కాబట్టి 'చంద్ర' అనగా ఒకటి(1). ఈ అయిదు అంకెల్ని వరసగా వ్రాయగా 40401 అవుతుంది. అయితే "అఙ్కానాం వామతో గతిః" (అంకెలు కుడినుంచి ఎడమకు చదవాలి) అని నియమం. అందుచేత పై అంకెలు కుడినుంచి ఎడమకు చదవగా '10404' వచ్చింది.

సంకరం, సంసృష్టి అనేవి అలంకారాల విషయంలో చెప్పేవి. ఒకే శ్లోకంలో లేదా వాక్యంలో రెండు లేదా అంతకు మించిన అలంకారాలు ఉన్నట్లయితే అవి పాలు నీళ్లూ లాగ కలిసిపోతే అది సంకరం. బియ్యం నువ్వులు లాగ కలిసినట్లయితే అది సంసృష్టి. సంకరం మూడువిధాలు. ఇక్కడ ఉన్నది ఈ అలంకారమా, ఆ అలంకారమా అని సంశయం కలిగితే అదొక భేదం. దీనికి సంశయసంకరం అని పేరు. రెండు అలంకారాలలో ఒకటి రెండవదానిమీద ఆధారపడి ఉన్నట్లయితే అది రెండవభేదం. దేనిమీద ఆధారపడిందో అది అనుగ్రాహకం (అనుగ్రహించేది) ఏది ఆధారపడిందో అది అనుగ్రాహ్యం (అనుగ్రహించతగినది). ఈ విధంగా ఆ రెండు అలంకారాలకి మధ్య సంబంధం అనుగ్రాహ్యానుగ్రాహక భావసంబంధం. అందుచేత దీనికి అనుగ్రాహ్యానుగ్రాహకభావసంకరం అనిపేరు. ఒకే వ్యంజకం రెండు అలంకారాలు వ్యంజింపచేస్తే అది మూడవ రకమైన సంకరం. ఇంక రెండు అలంకారాలు ఒకదానితో ఒకదానికి సంబంధం లేకుండా స్వతంత్రంగా వివిక్తంగా ఉంటే అది సంసృష్టి. ఈ విషయం అలంకారప్రకరణంలో స్పష్టం అవుతుంది. ప్రస్తుతంలో ఆ యా ధ్వనులు కలిసినప్పుడుకూడా త్రివిధసంకరం కాని, ఒకే విధమైన సంసృష్టి కాని ఉండవచ్చును అని భావం.

ఈ భేదాల సంఖ్య విషయంలో ప్రతాపరుద్రీయకర్త విద్యానాథుడు, వ్యాఖ్యాత కుమారస్వామి చెప్పినది యుక్తిసంగతంగా ఉంది. పైన చెప్పిన యాభై ఒక్క భేదాలలో మొదటిదానికి ఒక్కొక్కదానితో సంబంధం ఏర్పడగా యాభై ఒక్క మిశ్రభేదాలు. రెండవదానికి యాభై భేదాలు. మూడవదానికి నలభై తొమ్మిది భేదాలు. ఈ విధంగా ఒక్కొక్కటి తగ్గుతూపోగా మొత్తం మిశ్రభేదాలు ఒక వెయ్యి మూడు వందల ఇరవై ఆరు మాత్రమే (1326) అవుతాయి. ఉదాహరణకి- అవివక్షితవాచ్యధ్వని వివక్షితాన్యపరవాచ్యధ్వనితో కలిసినప్పుడు అదొక భేదం. వివక్షితాన్యపరవాచ్యధ్వని అవివక్షితవాచ్యధ్వనితో కలసినప్పుడు ఇది పై భేదంలోనే అంతర్గతం అయిపోతుంది కదా? అందుచేత దీన్ని మరొక భేదంగా పరిగణించకూడదు. ఇదేవిధంగా వస్తుధ్వనికి అలంకారధ్వనితో సంబంధం కలిగినా, అలంకారధ్వనికి వస్తుధ్వనితో సంబంధం అని చెప్పినా ఒకటే కదా? ఆ రెండూ వేరు వేరు మిశ్రాలు అవడానికి వీలు లేదు. ఈ విధంగా ఒక్కొక్క భేదాన్ని తగ్గించుకుంటూ పోగా వచ్చిన మొత్తం ఒక వెయ్యి మూడువందల ఇరవై ఆరు (1326)ని సంకర-సంసృష్టిభేదసంఖ్య అయిన నాలుగు (4)తో గుణిస్తే మొత్తం అయిదువేల మూడువందల నాలుగు (5304) భేదాలే వస్తాయి కాని మమ్మటుడు చెప్పినట్లు పదివేల నాలుగువందల భేదాలు రాకూడదు.

"తేషాం ప్రత్యేకమేకైకస్యైకైకేన సంబన్ధే ప్రథమభేదస్య ఏకపఞ్చాశద్భేదాః, ద్వితీయస్య పఞ్చాశద్భేదాః, తృతీయస్యైకోనపఞ్చాశద్భేదాః. అనేన క్రమేణ ఉత్తరోత్తరస్య ఏకైకభేదపరిత్యాగే షడ్వింశత్యుత్తరశతత్రయాధికసహస్రసంఖ్యాకాః (1326) మిశ్రభేదాః. అవివక్షితవాచ్యస్య వివక్షితాన్యపరవాచ్యసంబన్ధే యో భేదస్తస్మిన్నేవాన్తర్భూతో వివక్షితాన్యపరవాచ్యస్యావివక్షితవాచ్యసంబన్ధే భేదో న పృథగ్భూతః. అనేనైవ క్రమేణ వస్తుధ్వనేరలఙ్కారధ్వనిసంబన్ధభేదోఽప్యలంకారధ్వనేర్వస్తుధ్వనిసంబన్ధాత్ స పృథగ్భూత ఇతి పూర్వపూర్వస్యోత్తరోత్తరసంబన్ధే ఏకైకభేదన్యూనతా జ్ఞేయా. తస్యాపి మిశ్రణస్య త్రిరూపేణ సంకరేణ ఏకరూపయా సంసృష్ట్యా చ పునశ్చతుర్ధా యోజనే చతురుత్తరశతత్రయాధికపఞ్చసహస్రాణి (5304) భేదాః".

—ప్రతాపరుద్రీయం కావ్యప్రకరణం 53వ పేజి.

ఈ ఘట్టంలో వ్యాఖ్యానిస్తూ కుమారస్వామి రత్నాపణవ్యాఖ్యానంలో- "అయితే అంతర్భావం చెందడంచేత పస లేని కొన్ని భేదాలను కూడా కలిపి

మమ్మటుడు పదివేల నాలుగువందల నాలుగు(10404) భేదాలు ఎందుకు అంగీక రించాడు? అని ఆశంకించుకొని- "ఏమో! అలా ఎందుకు చేశాడో ఆయనకే తెలి యాలి. మనం మాత్రం- "ఏ విషయమైనా యుక్తియుక్తమైతేనే గ్రహించాలి కాని ఒక మనిషిమీద ఉన్న గౌరవం చేత గ్రహించకూడదు" అన్న సామెత ప్రకారం న్యాయమైన సరణినే అనుసరించాలి అనేది విద్యానాథుని అభిప్రాయం" అని సమా ధానం చెప్పాడు-

"తర్హి కింనిమిత్తం కావ్యప్రకాశకారః అన్తర్భావయాతయామానపికతిచన భేదాన్ సంగృహ్య చతురుత్తరచతుఃశతీయుతాయుత (10404) సంఖ్యాకాన్ సంసృష్టిసంకరాయత్తభేదానజీగణత్? కో వేద కిం వా తత్ర నిమిత్తమ్? తత్ పునస్త ఏవ తత్రభవన్తో విదాంకుర్వన్తు. అస్మాభిస్తు "యుక్తియుక్తం వచో గ్రాహ్యం న తు పూరుషగౌరవాత్" ఇతి న్యాయసరణిరనుసరణీయేతి విద్యానాథ హృదయమ్". రత్నాపణమ్, కావ్యప్రకరణం 55-56 పేజీలు.

అయితే కొందరు వ్యాఖ్యాతలు 'మొదటి భేదంలో రెండవభేదం కలిసి ఉంది' అన్నప్పుడు మొదటిదానికి ప్రాధాన్యం, రెండవదానికి అప్రాధాన్యం సూచితం అవుతుంది. అదే విధంగా రెండవదానిలో మొదటిది కలిసి ఉంది అన్నప్పుడు రెండవదానికి ప్రాధాన్యం మొదటిదానికి అప్రాధాన్యం గమ్యం అవు తుంది. ఉదాహరణకి వస్తుధ్వనికీ అలంకారధ్వనికీ సంబధం అన్నప్పుడు వస్తు ధ్వనికి ప్రాధాన్యం అలంకారధ్వనికి అప్రాధాన్యం. అలంకారధ్వనికీ వస్తుధ్వనికీ సంబంధం అన్నప్పుడు అలంకారధ్వనికి ప్రాధాన్యం, వస్తుధ్వనికి అప్రాధాస్యం గమ్యం అవుతాయి. ఈ అభిప్రాయంతోనే మమ్మటుడు ఇలా చెప్పాడు. అని సమర్థించడం కోసం ప్రయత్నించారు. ఇలాంటి సమర్థన లన్నీ కుమారస్వామి చెప్పిన 'పురుషగౌరవాత్' కోవలోనికి చేరుతాయి. "పాలల్లో నీళ్ల పోశారా, నీళ్ళల్లో పాలు పోశారా" వంటి మాటలలో అలాంటి భేదా లేవైనా చూపవచ్చునేమో కాని ఇలాంటి స్థలాలలో సమర్థనప్రయత్నం నిరర్థకం.

శుద్ధేతి :- (యాభై ఒక్క) శుద్ధ భేదాలతో కలపగా-

శరేషుయుగఖేన్దవః = పదివేల నాలుగు వందల యాభై అయిదు (భేదాలు

అవుతాయి) శర-5 ఇషు-5 యుగ-4 ఖ-సున్న- ఇందు-1=55401. "అంకానాం వామతోగతిః"-10455.

తత్రేతి :- వాటిలో దారిచూపడానికి మాత్రం ఉదాహరణ చూపబడు తున్నది.

గాథ. ఖణపాహుణిఆ దేఅర జాఆఏ సుహఇ కింపి దే భణిఆ,
రుఅఇ పడోహరవలహీఘరమ్మి అణుణిజ్జఉ వరాఈ. 111

"క్షణప్రాఘుణికా దేవర జాయయా సుభగ కిమపి తే భణితా,
రోదితి గృహపశ్చాద్భాగవలభీగృహేఽనునీయతాం వరాకీ".

వృ. అత్రానునయః కిముపభోగలక్షణే అర్థాన్తరే సంక్రమితః, కిమనురణనన్యాయేన ఉపభోగే ఏవ వ్యఙ్గ్యే వ్యఞ్జకః ఇతి సందేహః.

వ్యా సుభగ = సుందరుడా! దేవర = ఓ! మరిదీ! తే జాయయా = నీ భార్యచేత, కిమపి = ఏమో, భణితా = పలకబడిన, క్షణప్రాఘుణికా=ఉత్సవంలో అతిథిగా వచ్చిన, వరాకీ = ఆ దీనురాలు, గృహపశ్చాద్భాగవలభీగృహే=ఇంటి వెనుక డాబా ఇంట్లో, రోదితి = ఏడుస్తూన్నది. అనునీయతామ్ = అనునయించ బడుగాక.

అవ. ఏదో ఉత్సవం సందర్భంగా ఇంటికి వచ్చిన తన మరది ప్రియు రాలిని (ఉపనాయికను) ఆతని భార్య నిందించగా ఆమె ఏడుస్తూన్నట్లు వదిన మరదితో చెపుతూన్న మాటలివి. అనునయం అనగా రోదనాన్ని నివర్తింపచేసే వ్యాపారం. ఇక్కడ ఈ శబ్దానికి తాత్పర్యానుపపత్తి చేత అనగా కేవలం బతి మాలుకొనడం అనే అర్థం చెపితే వ్యక్తియొక్క అభిప్రాయానికి కుదరదు గాన, లక్షణ గ్రహించి ఉపభోగం అని అర్థం అని చెప్పవచ్చు. అప్పుడు ఆ ఉపభో గంలో అతిశయం వ్యంగ్యం అవడం ప్రయోజనం. అప్పుడు అది అవివక్షిత వాచ్య ధ్వని భేదం అయిన అర్థాంతరసంక్రమితవాచ్యం అవుతుంది. లేదా- దీనికి రోదన నివర్తకమైన అనునయమే (బతిమాలుకోవడమే) అర్థం; ఉపభోగం వ్యంగ్యార్థం అని చెప్పవచ్చును. అప్పుడు అది అనురణనరూపధ్వనిభేదాలలో ఒకటైన వివక్షి తాన్యపరవాచ్యధ్వని అవుతుంది. ఈ విధంగా ఏ ధ్వని చెప్పాలి అనేదానికి నిర్ణా

యకమైన ప్రమాణం ఏదీ లేకపోవడంచేత ఇక్కడ సందేహరూపసంకరంతో రెండు ధ్వనుల కలయిక ఉన్నది అని చెబుతున్నాడు.

వ్యా. అత్రేతి:- "ఇక్కడ అనునయం ఉపభోగరూపమైన అర్థాంతరంలో (మరొక అర్థంలో) సంక్రమించిందా, లేదా అనురణనన్యాయంచేత ఉపభోగమే వ్యంగ్యం అవడంచేత దానికి వ్యంజకమా అని సందేహం".

అవ. అనుగ్రాహ్యానుగ్రాహకరూపమూ, ఏకవ్యంజకానుప్రవేశరూపమూ ఆయిన రెండు సంకరభేదాలకూ, సంసృష్టికీ ఒక ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ స్నిగ్ధశ్యామలకాన్తిలిప్తవియతో వేల్లద్బలాకా ఘనాః
వాతాః శీకరిణః పయోదసుహృదామానన్దకేకాః కలాః,
కామం సన్తు దృఢం కఠోరహృదయో రామోఽస్మి సర్వంసహే
వైదేహీ తు కథం భవిష్యతి హహా హా దేవి ధీరా భవ 112

వృ. అత్ర 'లిప్త' ఇతి 'పయోదసుహృదామ్' ఇతి చ అత్యన్తతిరస్కృతవాచ్యయోః సంసృష్టిః తాభ్యాం సహ 'రామోఽస్మి' ఇతి అర్థాన్తరసంక్రమితవాచ్యస్యానుగ్రాహ్యానుగ్రాహకభావేన, 'రామ'పదలక్షణైకవ్యఞ్జకానుప్రవేశేన చార్థాన్తరసంక్రమితవాచ్యరసధ్వన్యోః సంకరః. ఏకమన్యదప్యుదాహార్యమ్.

ఇతి కావ్యప్రకాశే ధ్వనినిర్ణయో నామ చతుర్థోల్లాసః.

వ్యా. స్నిగ్ధేతి :- ఇవి సీతావిరహంతో బాధపడుతున్న రాముని మాటలు-

స్నిగ్ధశ్యామలకాన్తిలిప్తవియతః = నిగనిగలాడుతున్న నల్లని కాంతిచేత పూయబడిన ఆకాశం గల, వేల్లద్వలాకాః = (దగ్గర ఎగురుచూ) క్రీడిస్తూన్న కొంగల పంక్తులు గల, ఘనాః = మేఘాలు, శీకరిణః = తుంపర్లతో కూడిన, వాతాః = వాయువులు, పయోదసుహృదామ్ = మేఘాల మిత్రులైన నెమళ్ళయొక్క, కలాః = మధురములైన, ఆనన్దకేకాః = ఆనందంతో కూడిన కేకాధ్వనులు, సన్తు కామమ్ = ఉంటే ఉండుగాక. ధృఢమ్ = అధికముగా, కఠోరహృదయః = కఠినమైన హృదయం గల నేను, రామః = సకలదుఃఖాలకీ పాత్రుడైన రాముడను, అస్మి = అయి

ఉన్నాను. సర్వమ్ = అంతనూకూడ, స హే = సహిస్తాను. తు = కాని, వైదేహీ = సీత. కథమ్ = ఎట్లు, భవిష్యతి = ఉండునో కదా! హహాహా = అయ్యో! దేవి = ఓ! దేవీ! ధీరా = ధీరురాలవుగా, భవ = ఉండుము.

అత్రేతి:- ఇక్కడ 'లిప్త' 'పయోదసుహృదామ్' అనే పదాలలో ఉన్న అత్యంత తిరస్కృతవాచ్యధ్వనులకు సంసృష్టి. ఆ రెండింటికీ 'రామ అస్మి' అనేచోట ఉన్న అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనితో అనుగ్రాహ్యానుగ్రాహకభావసంబంధం చేత సంకరం. 'రామ' పదరూపమైన ఒకే వ్యంజకంలో చేరి ఉండడంచేత అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికీ, (విప్రలంభశృంగార) రసానికీ సంకరం. ఈ విధంగానే ఇతరమిశ్రభేదాలకి కూడా ఉదాహరణం చూచుకోవాలి.

వి. లేపనం అనగా ఏదైన ద్రవపదార్థాన్ని మూర్తవస్తువుమీద పూయడం అని అర్థం. కాంతిని అమూర్తమైన ఆకాశంమీద పూయడం అనేది కుదరదు. అందుచేత 'లిప్త' పదానికి ఇక్కడ 'వ్యాపించబడిన' అని అర్థం. అదే విధంగా స్నేహం అనేది చైతన్యం కలవాటితోనే కుదురుతుంది కాని అచేతనాలతో కుదరదు. ఆకాశం అచేతనం. అందుచేత నెమళ్ళు ఆకాశానికి మిత్రులు అన్నా, ఆకాశం నెమళ్ళకు మిత్రం అన్నా యుక్తం కాదు గాన అక్కడ 'సుహృదః' అనగా కేకాదులద్వారా సంబంధించినవి అని అర్థం. ఈ రెండు అర్థాలూ కూడ వాచ్యార్థాన్ని పూర్తిగా కప్పివేసి చెప్పిన లాక్షణికార్థాలు. ఇక్కడ లక్షణ అంగీకరించడానికి అతిశయించి లేదా అత్యధికంగా ఉండడాన్ని చెప్పడం ప్రయోజనం. ఈప్రయోజనం వ్యంగ్యం. అనగా 'లిప్త' 'సుహృదః' అనేచోట అత్యంతతిరస్కృతవాచ్యాలైన వ్యంగ్యాలు. ఇవి ఒకదాని అపేక్ష మరొకదానికి లేకుండా ఈ శ్లోకంలో ఉన్నాయి; అందుచేత వాటికి సంసృష్టి. 'రామః అస్మి' అనే వాక్యంలోని 'రామః' అనేదానికి కేవలం 'రాముడు' అని మాత్రమే అర్థం కాదు, "ఎన్నో కష్టాలు అనుభవించడానికి పుట్టిన వ్యక్తిగా ప్రసిద్ధుడైన రాముడు" అని అర్థం. అనగా 'రాముడు' అనే వాచ్యార్థం లక్షణచేత పైనచెప్పిన అర్థానికి సంక్రమింపచేయబడింది (అర్థాంతరసంక్రమితం). ఈ లక్షణకు ప్రయోజనం రాముడు చేసుకుంటూన్న స్వనింద; ఇది వ్యంగ్యం. కాంతివ్యాప్తి, కేకాదిసంబంధము అత్యతిశయంతో ఉండడంచేతనే అవి చూచి రాముడు ఈ విధంగా తనను నిందించుకొంటున్నాడు. అందుచేత 'లిప్త' 'సుహృత్' శబ్దాలలోని అత్యంతతిరస్కృతవాచ్యధ్వనులు రెండూ రామనిందారూపమైన అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికి కారణాలు-అనుగ్రాహకాలు.

రామస్వనింద కార్యం-అనుగ్రాహ్యం. అందుచేత ఆ అత్యంతతిరస్కృతవాచ్య ధ్వనులకీ, ఈఅర్థాన్తరసంక్రమితవాచ్యధ్వనికి అనుగ్రాహ్యానుగ్రాహకత్వరూపమైన సంకరం. 'రామోఽస్మి' అని చెప్పడంలో రాముని స్వనింద మాత్రమే కాకుండా విప్రలంభశృంగారం కూడా వ్యంగ్యం అవుతున్నది. సీతావియోగంతో బాధ పడు తూండడం మూలాననే కదా రాముడు తనను తాను నిందించుకొంటున్నాడు. అందుచేత 'రామ' అనే ఒక పదం స్వనిందనూ (అర్థాంతరసంక్రమితవాచ్య ధ్వనినీ), విప్రలంభశృంగారరసాన్నీ వ్యంజింపచేయడంచేత ఆ రెండింటికీ ఏక వ్యంజకానుప్రవేశరూపమైన (ఒకే పదంచేత వ్యంజింపచేయబడడం) అనే సంకరం కూడా ఉన్నది అని భావం.

'బాలానందిని' అనే కావ్యప్రకాశవ్యాఖ్యానంలో నాల్గవ ఉల్లాసం సమాప్తం.



## అథ పఞ్చమ ఉల్లాసః

వృ. ఏవం ధ్వనౌ నిర్ణీతే గుణీభూతవ్యఙ్గ్యప్రభేదానాహ-

కా. అగూఢమపరస్యాఙ్గం వాచ్యసిద్ధ్యఙ్గమస్ఫుటమ్,
సన్దిగ్ధతుల్యప్రాధాన్యే కాక్వాక్షిప్తమసున్దరమ్, 45
వ్యఙ్గ్యమేవం గుణీభూతవ్యఙ్గ్యస్యాష్టౌ భిదాః స్మృతాః.

వృ. కామినీకుచకలశవత్ గూఢం చమత్కరోతి; అగూఢం తు స్ఫుటతయా వాచ్యాయమానమితి గుణీభూతమేవ. అగూఢం యథా-

వ్యా. ఏవమ్ ఇతి:- ఈ విధంగా ధ్వని నిర్ణయించబడిన పిమ్మట గుణీభూతవ్యంగ్యభేదాలను చెపుతున్నాడు.

వి. కావ్యాన్ని ఉత్తమం, మధ్యమం, అధమం అని మూడు విధాలుగా విభజించి ఉత్తమకావ్యం ధ్వనికావ్యం అని ప్రతిపాదించి, చతుర్థోల్లాసంలో ధ్వని రూపాన్ని నిరూపించాడు. గుణీభూతవ్యంగ్యం, అనగా ధ్వని అప్రధానంగా ఉన్న కావ్యం, మధ్యమం. ఈ ఉల్లాసంలో గుణీభూతవ్యంగ్యానికి చెందిన భేదాలను వివరిస్తున్నాడు. వ్యంగ్యం ఉన్నా కూడ దానికంటె వాచ్యార్థమే ఎక్కువ చమత్కారకారిగా ఉంటే దానికి గుణీభూతవ్యంగ్యం అనిపేరు. గుణీభూతం అనగా అప్రధానం అని అర్థం.

అగూఢమ్ ఇతి:- వ్యఙ్గ్యమ్ = గుణీభూతవ్యంగ్యంలోని వ్యంగ్యార్థం, అగూఢమ్ = అతిస్పష్టంగా గాని, అపరస్య = మరొకదానికి (అది వాచ్యార్థమైనా కావచ్చు మరొక వ్యంగ్యార్థమైనా కావచ్చు-దానికి), అఙ్గమ్ = అంగంగా గాని, వాచ్యసిద్ధ్యఙ్గమ్=వాచ్యార్థసిద్ధికి, అనగా వాచ్యార్థం కుదరడానికి, అంగంగా గాని, అస్ఫుటమ్ = చాల అస్పష్టంగాగాని, సందిగ్ధతుల్యప్రాధాన్యే = సందిగ్ధమైన ప్రాధాన్యం కలదిగా గాని, వాచ్యార్థంతో సమానమైన ప్రాధాన్యంకలదిగా గాని, కాక్వా = కాకు స్వరంచేత, ఆక్షిప్తమ్ = ఆక్షేపించబడినది (ఊహించబడినది)గా

గాని, అసున్దరమ్ = సౌందర్యం లేనిదిగా గాని ఉంటుంది. ఏవమ్ = ఈ విధంగా, గుణీభూతవ్యఙ్గ్యస్య = గుణీభూతవ్యంగ్యంయొక్క, అష్టౌ = ఎనిమిది, భిదాః = భేదాలు, స్మృతాః = చెప్పబడినవి.

వి. ఈ ఎనిమిది విధాలైన వ్యంగ్యాలలో ఏ ఒక్కటైనా ఉన్నది గుణీభూత వ్యంగ్యం అని అర్థం. గుణీభూతవ్యంగ్యం మధ్యమకావ్యం గాన ఇది అగూఢవ్యంగ్యమధ్యమకావ్యం, అపరాంగవ్యంగ్యమధ్యమకావ్యం, వాచ్యసిద్ధ్యంగవ్యంగ్య మధ్యమకావ్యం, అస్ఫుటవ్యంగ్యమధ్యమకావ్యం, సందిగ్ధప్రాధాన్యవ్యంగ్యమధ్యమ కావ్యం, తుల్యప్రాధాన్యవ్యంగ్యమధ్యమకావ్యం, కాక్వాక్షిప్తవ్యంగ్యమధ్యమకావ్యం, అసుందరవ్యంగ్యమధమకావ్యం అని ఎనిమిది విధాలు.

కామినీతి:- కామినీకుచకలశం వలె గూఢంగా ఉన్నది, అనగా కొంచెం గూఢంగా ఉన్నది, చమత్కారం కలిగిస్తుంది. గూఢం కాకుండా ఉన్నది వాచ్యార్థం వంటిదే అయిపోతుంది గాన అది గుణీభూతమే.

వి. ఇక్కడ గూఢం అనగా కొంచెం గూఢంగా ఉన్నది అని అర్థం. చాలా గూఢంగా ఉంటే అది కూడా దోషమే. దానికే 'అస్ఫుటవ్యంగ్య' అని పేరు పెట్టి గుణీభూతవ్యంగ్యం (నాల్గవభేదం)గా పరిగణించారు. అందుచేత వ్యంగ్యార్థం అతి గూఢంగానూ ఉండకూడదు, అతిస్పష్టంగానూ ఉండకూడదు. మధ్యరకంగా ఉండాలి అప్పుడే అది చమత్కారకారి. అది ధ్వని. మొదటిరెండు పక్షాలలోనూ అది గుణీభూతవ్యంగ్యం. ఈ విషయాన్నే ఒక ప్రసిద్ధమైన శ్లోకంలో చెపుతారు.

'నాన్ధ్రీపయోధర ఇవాతితరాం ప్రకాశో
నో గూర్జరీస్తన ఇవాతితరాం నిగూఢః,
అర్థో గిరామపిహితః పిహితశ్చ కశ్చిత్
సౌభాగ్యమేతి మరహట్టవధూకుచాభః'.

—బాలబోధిని పేజి. 194

ఈ పేజీలోనే పాదికలో మరొక శ్లోకం కూడా ఇవ్వబడింది—

"అనుద్ఘుష్టః శబ్దైరథ చ రచనాతః స్ఫుటరసః
పదానామర్థాత్మా జనయతి కవీనాం బహుముదమ్,

యథా కిఞ్చిత్కిఞ్చిత్పవనచలచేలాఞ్చలతయా
కుచద్వన్ద్వం కాన్తిం కిరతి న తథోద్ఘాటితమురః".

వ్యా:- అగూఢవ్యంగ్యమధ్యమకావ్యానికి ఉదాహరణం ఎట్లనగా-

శ్లో॥ యస్యాసుహృత్కృతతిరస్కృతిరేత్య తప్త
సూచీవ్యధవ్యతికరేణ యునక్తి కర్ణౌ,
కాఞ్చీగుణగ్రథనభాజనమేష సోఽస్మి
జీవన్న సంప్రతి భవామి కిమావహామి. 113

వృ. అత్ర జీవన్నిత్యర్థాన్తరసంక్రమితవాచ్యస్య.

వ్యా. యస్య ఇతి:- బృహన్నలావేషంలో ఉన్న అర్జునుడు, తనకు కీచకుని వలన జరిగిన పరాభవాన్ని గూర్చి చెపుతూన్న ద్రౌపదితో అంటూన్న మాటలు: కృతతిరస్కృతిః = చేయబడిన తిరస్కారం గల, యస్య = ఏ నాయొక్క, అసుహృత్ = శత్రువు అనగా నాచేత ఓడింపబడిన శత్రువు, ఏత్య= వచ్చి, కర్ణౌ = చెవులను, తప్తసూచీవ్యధవ్యతికరేణ = కాల్చబడిన సూదితో గ్రుచ్చుటయొక్క పౌనఃపున్యంలో (మాటిమాటికి గ్రుచ్చుకొనడంతో), యునక్తి = చేర్చునో, సః = అట్టి, ఏషః = ఈ నేను, కాఞ్చీగుణగ్రథనభాజనమ్ = వడ్డాణం గుచ్చడానికి పాత్రనుగా, పూర్వం బంగారం పూసలూ, గాజు పూసలూ, మాణిక్యాలూ కలిపి గుచ్చి వడ్డాణంగా ధరించేవారట. లేదా వడ్డాణం ధరించడానికి పాత్రనుగా, అనగా వడ్డాణం ధరించేవాడనుగా, అస్మి = అయి ఉన్నాను. సంప్రతి = ఇపుడు, జీవన్ = జీవించినవాడను, న భవామి = కాను. కిమ్ = ఏమి, ఆవహామి = చేయగలను? పూర్వం పరాజితులై శరణుజొచ్చేవాళ్లు విజేతదగ్గరకు వెళ్ళి శరణాగతిసూచకంగా కాల్చిన సూదులతో చెవులు పొడుచుకొనేవారట,

అత్రేతి:- ఇక్కడ 'జీవన్' అనేచోట అర్థాంతరసంక్రమితవాచ్యవ్యంగ్యం అగూఢంగా ఉంది.

వి. నేను "జీవించి లేను" అనగా శ్లాఘ్యమైన జీవితంతో లేను అని అర్థం. అందుచేత 'జీవన్'అనే పదానికి ఉన్న వాచ్యార్థం 'ఇష్టమైన పని చేయడానికి సమర్థుడై ఉండడం'అనే అర్థాంతరంలో సంక్రమించింది. ఈ అర్థం ఉపాదాన

లక్షణచేత బోధింపబడుతున్నది. "ఇలా జీవించడంకంటె మరణమే మేలు"అని వ్యంగ్యార్థం. మామూలు పాఠకుడికి కూడా ఈ వ్యంగ్యార్థం స్పష్టంగా తెలుస్తూన్నది గాన ఇది అగూఢం.

అవ:- అత్యంతతిరస్కృతవాచ్యస్థలంలో అగూఢవ్యంగ్యానికి ఉదాహరణ చూపుతున్నాడు-

శ్లో॥ ఉన్నిద్రకోకనదరేణుపిశఙ్గితాఙ్గా
గాయన్తి మఞ్జు మధుపా గృహదీర్ఘికాసు,
ఏతచ్చకాస్తి చ రవేర్నవబన్ధుజీవ
పుష్పచ్ఛదాభముదయాచలచుమ్బి బిమ్బమ్. 114

వృ. అత్ర చుమ్బనస్య అత్యన్తతిరస్కృతవాచస్య.

వ్యా. ఉన్నిద్రకోకనదరేణుపిశఙ్గితాఙ్గాః = వికసించిన ఎఱ్ఱని పద్మాల పుప్పొడిచేత పిశంగవర్ణం (ఎరుపు నలుపు కలిసిన రంగు) కలవిగా చేయబడిన శరీరములు గల, మధుపాః = తుమ్మెదలు, గృహదీర్ఘికాసు = గృహముల దగ్గర ఉన్న దిగుడుబావులయందు, మఞ్జు = మధురంగా, గాయన్తి = గానం చేయుచున్నవి. రవేః = సూర్యునియొక్క, ఏతత్ బిమ్బం చ = ఈ బింబం కూడ, నవబన్ధుజీవపుష్పచ్ఛదాభమ్=కొత్త బంధుజీవపుష్పపు ఱేకు వంటి కాంతి గలదై, ఉదయాచలచుమ్బి = ఉదయపర్వతాన్ని చుంబించుచు, చకాస్తి = ప్రకాశించుచున్నది.

అత్రేతి :- ఇక్కడ 'చుమ్బి' అనునప్పుడు అత్యంతతిరస్కృతవాచ్య ధ్వని అగూఢము.

'చుమ్బ' ధాతువుకు రెండు ముఖాల సంయోగం అని అర్థం. ఆ అర్థం ఇక్కడ కుదరదుగాన లక్షణచేత సంయోగం అని మాత్రమే దీనికి అర్థం. అందుచేత ఇది అత్యంతతిరస్కృతవాచ్యం. ఇలా లాక్షణికప్రయోగం చేయడానికి ఉషః కాలారంభమైనది అని చెప్పడం ప్రయోజనం. అదే వ్యంగ్యం. ఈ వ్యంగ్యార్థం వాచ్యార్థం వలె అతిస్పష్టంగా ఉంది. అందుచేత ఇది అగూఢవ్యంగ్యం అయిన మధ్యమకావ్యం.

15)

అవ. అర్థశక్తిమూలకమైన అగూఢవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అత్రాసీత్ ఫణిపాశబన్ధనవిధిః శక్త్యా భవద్దేవరే
గాఢం వక్షసి తాడితే హనుమతా ద్రోణాద్రిరత్రాహృతః,
దివ్యైరిన్ద్రజిదత్ర లక్ష్మణశరై ర్లోకాన్తరం ప్రాపితః
కేనాప్యత్ర మృగాక్షి రాక్షసపతేః కృత్తా చ కణ్ఠాటవీ. 115

వృ. అత్ర కేనాప్యత్రేతి అర్థశక్తిమూలానురణనరూపస్య. 'తస్యాప్యత్ర' ఇతి యుక్తః పాఠః.

వ్యా. రాజశేఖరుడు రచించిన బాలరామాయణనాటకంలో రావణసంహారానంతరం విమానంమీద అయోధ్యకు తిరిగి వస్తూన్న రాముడు సీతకు రణభూమిని చూపుతూ అంటూన్న మాటలు. మృగాక్షి = లేడి కళ్ళవంటి కళ్ళు కలదానా! అత్ర = ఇక్కడ, ఫణిపాశబన్ధనవిధిః = నాగపాశాలచేత బంధనం, ఆసీత్ = జరిగింది. భవద్దేవరే = నీ మరది, శక్త్యా = శక్తిచేత, గాఢమ్ = గట్టిగా, వక్షసి = వక్షఃస్థలంమీద, తాడితే = కొట్టబడినవాడగుచుండగా, హనుమతా = హనుమంతునిచేత, ద్రోణాద్రిః = ద్రోణపర్వతం, అత్ర = ఇక్కడ, ఆహృతః = తీసికొనిరాబడినది. అత్ర = ఇక్కడ, ఇన్ద్రజిత్ = ఇంద్రజిత్తు, దివ్యైః = దివ్యములైన, లక్ష్మణశరైః = లక్ష్మణుని బాణాలచేత, లోకాన్తరమ్ = పరలోకమును, ప్రాపితః = పొందించబడ్డాడు. అత్ర = ఇక్కడ, కేనాపి = ఎవనిచేతనో, రాక్షసపతేః = రావణునియొక్క, కణ్ఠాటవీ=కంఠరూపమైన అడవి, కృత్తా చ=ఛేదించబడినది. రాముడు ధీరోదాత్తుడవడంచేత తన గొప్పతనాన్ని ప్రకటించుకొనడానికి ఇష్టపడక 'మయా' అని అనక 'కేనాపి' అన్నాడు.

అత్రేతి :- ఇక్కడ 'కేనాపి అత్ర' అర్థశక్తిమూలానురణనరూపవ్యంగ్యం అగూఢంగా ఉంది.

వి. ఇక్కడ 'కేనాపి' అనేదానికి 'ఎవనిచేతనో' అని అర్థం. ఈ అర్థం ద్వారా 'రామునిచేత' (నాచేత) అనే వ్యంగ్యం సంలక్ష్యక్రమంగా స్ఫురిస్తూన్నది. అయితే అర్థశక్తిమూలమైన ఈ అనురణనరూప (సంలక్ష్యక్రమ) వ్యంగ్యం స్పష్టంగా తెలుస్తూన్నది. గాన ఇది అగూఢవ్యంగ్యమధ్యమకావ్యం.

వ్యా. 'కేన్యాపృత్ర'కు బదులు 'తస్యాపృత్ర' (తస్య రాక్షసపతేః అని అన్వయం) అనే పాఠం ఉంటే బాగుంటుంది. అప్పుడు ఇది అగూఢవ్యంగ్యం అయిన గుణీభూతవ్యంగ్యం కాక 'ధ్వనియే' అవుతుంది అని భావం.

అవ. 'అపరస్య అఙ్గమ్' అనే రెండవ విధమైన గుణీభూతవ్యంగ్యాన్ని నిరూపిస్తున్నాడు.

వృ. అపరస్య రసాదేర్వాచ్యస్య వా (వాక్యార్థభూతస్య) అఙ్గం రసాది అనురణనరూపం వా యథా-

శ్లో॥ అయం స రశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః,
నాభ్యూరుజఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః. 116

వృ. అత్ర శృఙ్గారః కరుణస్య.

వ్యా. అపరస్యేతి :- అపరస్య = రసాదికానికి గాని, వాచ్యార్థానికి గాని, వాక్యార్థం అయిన దానికి, అనగా వాక్యంచేత ప్రధానంగా ప్రతిపాదించబడేదానికి, అంగమైన రసాదికం గాని, అనురణనరూపవ్యంగ్యం గాని అపరాంగవ్యంగ్యం.

వి. ఒక వాక్యం ప్రధానంగా రసం మొదలైన అసంలక్ష్యక్రమవ్యంగ్యార్థాలను గాని, వస్తువు మొదలైన ప్రతిధ్వని వంటి సంలక్ష్యక్రమవ్యంగ్యాలను కాని బోధిస్తూండగా ఆ వ్యంగ్యానికి మరొక వ్యంగ్యం అంగం కావచ్చు. 'అది ఒక అపరాంగవ్యంగ్యభేదం. వాక్యంలో వాచ్యార్థమే అధికచమత్కారజనకం అవడంచేత ప్రధానంగా ఉన్నప్పుడు దానికి అంగంగా ఉన్న వ్యంగ్యం రెండవ విధమైన అపరాంగవ్యంగ్యం.

ఒక రసం మరొక రసానికి అంగంగా ఉన్న అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణం ఎట్లనగా- అయమ్ ఇత్యాది :- మహాభారతంలో భూరిశ్రవస్సుని హస్తం తెగి రణభూమిలో పడి ఉండగా దాన్ని పట్టుకొని విలపిస్తూన్న అతని భార్యలు అంటూన్న మాటలు. రశనోత్కర్షీ = వడ్డాణాలను లాగినదీ, పీనస్తనవిమర్దనః= పీనస్తనములను మర్దించినదీ, నాభ్యూరుజఘనస్పర్శీ = నాభి-ఊరు-జఘనభాగములను స్పృశించినదీ, నీవీవిస్రంసనః = పోకముడిని శిథిలం చేసినదీ అయిన, కరః = చెయ్యి, అయమ్ = ఇదే.

అత్రేతి :— ఇక్కడ శృంగారరసం కరుణరసానికి అంగం.

వి. ఇక్కడ శృంగారరసం కరుణరసానికి పోషకంగా ఉంది. నాయకునిలో ఉన్న శృంగారాన్ని (రతిని) స్మరించడంచేత నాయికాగత శోకం ఉల్బణమై కరుణరసం పుష్టం అవుతున్నది కదా? అందుచేత శృంగారం కరుణరసానికి అంగం. కరుణరసం ప్రధానంగానే ఉన్నది. అందుచేత దీనిని పట్టి ఇది ధ్వని కావ్యం. శృంగారరసాన్ని పట్టి గుణీభూతవ్యంగ్యం. ఈ విధంగా ఒక వ్యంగ్యానికి మరొక వ్యంగ్యం అంగం అయిన అన్ని స్థలాలలోనూ ప్రధానవ్యంగ్యాన్ని పట్టి ధ్వనికావ్యత్వము. అంగమైన వ్యంగ్యాన్ని పట్టి గుణీభూతధ్వనిత్వము ఉంటాయి. అయితే ఇలాంటి కావ్యాన్ని ఉత్తమకావ్యం అనాలా మధ్యమకావ్యం అనాలా అనే ప్రశ్న వస్తుంది. ఉత్తమకావ్యం అనే అనాలి. మధ్యమకావ్యం అని వ్రాసిన కొందరి వ్యాఖ్యాతల అభిప్రాయం సరికాదు. ఒకే కావ్యంలో (శ్లోకంలో) ఉత్తమకావ్యత్వ—మధ్యమకావ్యత్వాలు అంగీకరించడం అసంగతం.

అవ. రసం భావానికి అంగంగా ఉన్న అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ కైలాసాలయభాలలోచనరుచా నిర్వర్తితాలక్తక
వ్యక్తిః పాదనఖద్యుతిర్గిరిభువః సా వః సదా త్రాయతామ్,
స్పర్ధాబన్ధసమృద్ధయేవ సుదృఢం రూఢా యయా నేత్రయోః
కాన్తిః కోకనదానుకారసరసా సద్యః సముత్సార్యతే. 117

వృ. అత్ర భావస్య రసః.

వ్యా. కైలాసేతి :- పరమేశ్వరుడు పాదాలకు నమస్కరించగానే పార్వతి కోపం శాంతించడంచేత ఆమె నేత్రాలు ఎరుపు శాంతించడాన్ని వర్ణించే శ్లోకం ఇది. కైలాసాలయభాలలోచనరుచా = శివుని ఫాలమునందలి నేత్రకాంతిచేత, నిర్వర్తితాలక్తకవ్యక్తిః = జరపబడిన (ఏర్పరుపబడిన) (పాదాలకు వ్రాసుకునే) లత్తుకయొక్క అభివ్యక్తి గల, నఖద్యుతికి విశేషణం. దీనినిపట్టి శివుడు పార్వతి పాదాలపై పడినాడని వ్యంగ్యం. గిరిభువః = పార్వతియొక్క, సా = ఆ, పాదనఖద్యుతిః = పాదాల గోళ్ళ కాంతి, వః = మిమ్ములను, సదా = ఎల్లప్పుడు,

త్రాయతామ్ = రక్షించుగాక. స్పర్ధాబన్ధసమృద్ధయా ఇవ = పోటీ పడుటచే అత్య ధికమైన దా అన్నట్లున్న, యయా = ఏ నఖకాంతిచేత, కోకనదానుకారసరసా = ఎఱ్ఱతామరపూవులను అనుకరించడంచేత సరసమైన, సుదృఢమ్ = అత్యధికంగా, రూఢా = స్థిరంగా ఉన్న (పెరిగిన), నేత్రయోః కాన్తిః = నేత్రాల కాంతి, సద్యః = వెంటనే, సముత్సార్యతే = తొలగించబడుచున్నదో. పాలలోచనకాంతిసంపర్కం చేత సహజంగానే ఎఱ్ఱగా ఉన్న నఖాల కాంతి ఇంకా పెరిగింది. ఈ పెరగడాన్ని పోటీచేత పెరగడము అని కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు.

అత్రేతి :- ఇక్కడ రసం భావానికి అంగం.

వి. 'త్రాయతామ్' అని చెప్పడంచేత కవికి పార్వతి విషయంలో ఉన్న రతి (భక్తి) వ్యంగ్యం అవుతున్నది. దానికి మహాదేవునిలో ఉన్న పార్వతీవిషయక మైన శృంగారం (రతిరూపస్థాయిభావం) అంగం.

అవ. ఒక భావం మరొక భావానికి అంగంగా ఉన్న అపరాంగవ్యంగ్యా నికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అత్యుచ్చాః పరితః స్ఫురన్తి గిరయః స్ఫారాస్తథామ్భోధయ
స్తానేతానపి బిభ్రతీ కిమపి న క్లాన్తాసి తుభ్యం నమః,
ఆశ్చర్యేణ ముహుర్ముహుః స్తుతిమితి ప్రస్తౌమి యావద్భువ
స్తావద్బిభ్రదిమాం స్మృతస్తవ భుజో వాచస్తతో ముద్రితాః.

వృ. అత్ర భూవిషయో రత్యాఖ్యః భావః రాజవిషయస్య రతి భావస్య.

వ్యా. అతీతి :- పంచాక్షరి అనే కవి ఈ శ్లోకంతో భోజమహారాజును స్తుతించినట్లు వ్యాఖ్యాతలు. (ఓ! భూమీ!) అత్యుచ్చాః = చాలా ఉన్నతములైన, గిరయః = పర్వతాలు, పరితః = చుట్టూ, స్ఫురన్తి = ప్రకాశిస్తున్నవి. తథా = మరియు, స్ఫారాః = విశాలములైన, అమ్భోధయః = సముద్రములు, చుట్టూ ప్రకా శిస్తున్నవి. తాన్ = ఆ పర్వతాలను, ఏతానపి = ఈ సముద్రాలను, బిభ్రతీ అపి = ధరించుచున్నదానవైనను, కిమపి = ఏ మాత్రమూ, క్లాన్తా = అలసిదానవు, నాసి = కాలేదు. తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారము, ఇతి = ఇట్లు, ఆశ్చ

ర్యేణ = ఆశ్చర్యముతో, ముహుర్ముహుః = మాటిమాటికి, భువః = భూమియొక్క, స్తుతిమ్ = స్తోత్రమును, యావత్ ప్రస్తౌమి = ఎంతలో ప్రస్తావింతునో తావత్ = అంతలో, ఇమామ్ = ఈ భూమిని, బిభ్రత్ = ధరించుచున్న, తవ భుజః = నీ భుజము, స్మృతః = స్మరించబడినది. తతః = అటుపిమ్మట, వాచః = మాటలు, ముద్రితాః = మూతబడినవి.

అత్రేతి :- ఇక్కడ (కవియందు) భూవిషయమునం దున్న రతి అనే భావం (ఆ కవికే) రాజువిషయంలో ఉన్న రతికి అంగం అయినది.

అవ. రసాభాసభావాభాసలు భావాంగములు అయిన అపరాంగవంగ్యాన్ని ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ బన్దీకృత్య నృపద్విషాం మృగదృశస్తాః పశ్యతాం ప్రేయసాం
శ్లిష్యన్తి ప్రణమన్తి లాన్తి పరితశ్చుమ్బన్తి తే సైనికాః,
అస్మాకం సుకృతైర్దృశోర్నిపతితోఽస్యౌచిత్యవారాంనిధే
విధ్వస్తా విపదోఽఖిలాస్తదితి తైః ప్రత్యర్థిభిః స్తూయసే.

వృ. అత్ర భావస్య రసాభాసభావాభాసౌ ప్రథమార్ధద్వితీయార్ధ ద్యోత్యౌ.

వ్యా. బన్దీతి :- ఒక కవి రాజును స్తుతిస్తున్నాడు. నృప = రాజా! తే సైనికాః = నీ సైనికులు, ద్విషామ్ = శత్రువులయొక్క, మృగదృశః = స్త్రీలను, బన్దీకృత్య = బందీలనుగాచేసి, ప్రేయసామ్ = ప్రియులు, పశ్యతామ్ = చూచుచుండగా, తాః = ఆ స్త్రీలను, శ్లిష్యన్తి = కౌగలించుకొనుచున్నారు, ప్రణమన్తి = నమస్కరించుచున్నారు, లాన్తి = గ్రహించుచున్నారు, పరితః = అంతటా, చుమ్బన్తి = చుంబించుచున్నారు. ఔచిత్యవారాంనిధే = ఔచిత్యానికి సముద్రం వంటి వాడా! అస్మాకమ్ = మాయొక్క, సుకృతైః = పుణ్యాలచేత, దృశోః = నేత్రాలలో, నిపతితః అసి = పడితివి తత్ = ఆ కారణంవల్ల, అఖిలాః = సమస్తమైన, విపదః = ఆపదలు, విధ్వస్తాః = తొలగిపోయినవి, ఇతి = అని, ప్రత్యర్థిభిః = శత్రువులచేత, స్తూయసే = స్తుతించబడుచున్నావు.

అత్రేతి :- ఇక్కడ శ్లోకంలోని పూర్వార్ధఉత్తరార్ధాలచేత వ్యంజింపబడుతున్న రసాభాసభావాభాసలు భావానికి అంగాలు.

వి. మొదటి రెండు పాదాలలో వర్ణించిన సైనికులలోని శృంగారం తమయందు అనురాగంలేని స్త్రీల విషయంలో ప్రవర్తించడంచేత, పరస్త్రీల విషయంలో ప్రవర్తించడంచేత రసాభాసం. మూడు నాలుగు పాదాలలో శత్రువులు ఆ రాజు విషయంలో చూపుతున్న రతి (గౌరవభావం) వాస్తవం కాదు; ఆహార్యం (తెచ్చిపెట్టుకొన్నది). అందుచేత అది భావాభాసం. ఈ రెండూ కవిలోఉన్న రాజ విషయకరతికి అంగాలు.

అవ. భావశాంతి భావానికి అంగంగా ఉన్న అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అవిరలకరవాలకమ్పనై
భ్రుకుటీతర్జనగర్జనై ర్ముహుః.
దదృశే తవ వైరిణాం మదః
స గతః క్వాపి తవేక్షణే క్షణాత్. 120

వృ. అత్ర భావస్య ప్రశమః.

వ్యా. (ఓ! రాజా!) అవిరలకరవాలకమ్పనైః = అవిచ్ఛిన్నంగా ఖడ్గాలను కంపింపచేయడాలచేత, ముహుః = మాటిమాటికి, భ్రుకుటీతర్జనగర్జనైః = కనుబొమ్మలవిరుపులచేత, జళిపించుటచేత, గర్జించడంచేత, తవ వైరిణామ్ = నీ శత్రువుల, మదః = గర్వము, దదృశే = చూడబడినది. తవ = నీయొక్క, ఈక్షణే = చూచుటయందు (నిన్ను చూడగానే), సః = ఆ మదం, క్షణాత్ = క్షణకాలంలో, క్వాపి = ఎక్కడికో, గతః = వెళ్ళిపోయినది.

అత్రేతి :- ఇక్కడ భావప్రశమం భావానికి అంగం.

వి. శత్రువులలో కనబడిన మదం అనే భావం శాంతించినది అని వర్ణించడంచేత అది భావశాంతి. ఆ భావశాంతి కవిలో ఉన్న రాజవిషయకరతికి అంగం.

అవ. భావోదయం భావానికి అంగం అయిన అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణ చూపుతున్నాడు-

శ్లో॥ సాకం కురఙ్గకదృశా మధుపానలీలాం
కర్తుం సుహృద్భిరపి వైరిణి తే ప్రవృత్తే,
అన్యాభిధాయి తవ నామ విభో గృహీతం
కేనాపి తత్ర విషమామకరోదవస్థామ్. 121

వృ. అత్ర త్రాసోదయః.

వ్యా. విభో = ఓ! రాజా! తే వైరిణి = నీ శత్రువు, కురఙ్గకదృశా = లేడికన్నుల లేమతోను, సుహృద్భిః అపి = స్నేహితులతోను కలిసి, మదుపానలీలామ్ = మద్యపానలీలను, కర్తుమ్ = చేయుటకు, ప్రవృత్తే = ఉద్యుక్తుడు కాగా, తత్ర = అక్కడ, కేనాపి = ఎవనిచేతనో, గృహీతమ్ = గ్రహించబడిన, అన్యాభిధాయి = మరొకరిని ఎవరినో చెప్పే, తవ నామ = నీ పేరు, విషమామ్ = విషమమైన, అవస్థామ్ = అవస్థను, అకరోత్ = చేసెను

ఇక్కడ త్రాసోదయం (భావానికి అంగం).

వి. ప్రసంగవశంచేత మరొకరి పేరు చెప్పగానే అదే నీ పేరు కూడా అవడంచేత అది వినగానే నీ శత్రువు గుండెలలో త్రాసం (భయం) పుట్టి మూడ్ (**mood**) చెడిపోయిం దని చెప్పడంచేత త్రాసోదయం (అనే భావోదయం) కవిగతమైన రాజవిషయకమైన రతికి అంగం అని అర్థం,

అవ. భావసంధి భావానికి అంగం అయిన అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అసోఢా తత్కాలోల్లసదసహభావస్య తపసః
కథానాం విశ్రమ్భేష్వథ చ రసికః శైలదుహితుః,
ప్రమోదం వో దిశ్యాత్ కపటవటువేషాపనయనే
త్వరాశైథిల్యాభ్యాం యుగపదభియుక్తః స్మరహరః. 122

వృ. అత్రావేగధైర్యయోః సంధిః.

వ్యా. అసోఢా ఇతి :- పార్వతి తపస్సు చేసికొనుచుండగా ఆమెను పరీక్షించడానికై బ్రహ్మచారి వేషంతో వచ్చిన శివుని వర్ణనం ఇది. తత్కాలోల్లసదసహభావస్య = ఆ కాలంలో (బాల్యావస్థలో) కనబడుచున్న దుఃసహత్వం (సహింప శక్యంకాకుండడం) గల, తపసః = పార్వతి తపస్సుకు (ను), అసోఢా = సహించనివాడు, అంత చిన్న వయస్సులో పార్వతి చేస్తూన్న ఘోరతపస్సు చూడజాలని స్థితిలో ఉన్నవాడు అని అర్థం. అథ చ = మరియు, శైలదుహితుః = పార్వతియొక్క, కథానామ్ = కథలయొక్క, విశ్రమ్భేషు = విశ్వాసముల యందు, అనగా విశ్వాసభరితాలైన సంభాషణములందు, రసికః = ఆసక్తికలవాడు, కపటవటువేషాపనయనే = కపటబ్రహ్మచారివేషాన్ని విడవడంలో, త్వరాశైథిల్యాభ్యామ్ = తొందరచేతను, శైథిల్యంచేతనూ (తొందరపడడం, నిదానం చూపడం ఈ రెంటింటిచేత), యుగపత్ = ఒక్కమారుగా, అభియుక్తః = ఆక్రమించబడిన, స్మరహరః = శివుడు, వః = మీకు, ప్రమోదమ్ = ఆనందమును, దిశ్యాత్ = ఇచ్చుగాక. స్మరహరః అనగా మన్మథుణ్ణి సంహరించినవాడు అని అర్థం. అయితే ఇక్కడ 'స్మరసహితః హరః' మన్మథునితో కూడిన హరుడు అని అర్థం అని సంకేతవ్యాఖ్య. ఇదొక చమత్కారం.

అత్రేతి:- ఇక్కడ ఆవేగం, ధైర్యం అనే భావాల సంధి కవిగతశివవిషయకరతిభావానికి అంగం.

అవ. భావశబలత భావానికి అంగం అయిన అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ పశ్యేత్కశ్చిచ్చల చపల రే కా త్వరాహం కుమారీ
హస్తాలమ్బం వితర హహహా వ్యుత్క్రమః క్వాసి యాసి,
ఇత్థం పృథ్వీపరివృఢ భవద్విద్విషోఽరణ్యవృత్తేః
కన్యా కంచిత్ ఫలకిసలయాన్యాదదానాభిధత్తే. 123

వృ. అత్ర శఙ్కాసూయాధృతిస్మృతిశ్రమదైన్యవిబోధౌత్సుక్యానాం శబలతా.

వ్యా. పశ్యేదితి:- రాజుచేత పరాజితుడై అరణ్యంలో నివసిస్తున్నాడు శత్రు రాజు. అతని నవోదయద్యౌవనయైన కన్యక ఫలకిసలయాదులు తీసికొని రావడా నికై వనంలోకి వెళ్ళగా అక్కడ తారసిల్లిన, తన కిష్టుడైన కాముకినితో ఆమె అంటూన్న మాటలు. కశ్చిత్ = ఎవడైనా, పశ్యేత్ = చూస్తాడేమో! (శంక), రే చపల = ఓ చపలస్వభావం కలవాడా! చల = దూరంగా వెళ్ళు. (రాగంతో కూడిన అసూయ), త్వరా = తొందర, కా = ఏమి? (తొందరగా వెళ్ళిపోకూడదు అని చెప్పడంచేత ధృతి వ్యంగ్యం), అహమ్ = నేను, కుమారీ = కన్యకను (కుమారి నైన నేను ఈ విధంగా స్వతంత్రంగా ప్రవర్తించకూడదు అని స్మరణం). హస్తా లమ్బమ్ = చేయూతను, దేహి = ఇమ్ము (శ్రమ). హహహా = అయ్యయ్యో (దైన్యం). వ్యత్క్రమః = కన్యాగమనరూపమైన కూడని పని జరుగుతున్నది (విబోధం). అసి = నువ్వు (ఇది 'త్వం' సమానార్థకమైన అవ్యయం), క్వ = ఎక్కడికి, యాసి = వెళ్ళుచున్నావు? (ఔత్సుక్యం) పృథ్వీపరివృఢ = ఓ! భూపతి వైన రాజా! అరణ్యవృత్తేః = అరణ్యంలో ఉన్న, భవద్విద్విషః = నీ శత్రువు యొక్క, ఫలకిసలయాని = ఫలాలను చిగుళ్ళను, ఆదదానా = గ్రహిస్తూన్న, కన్యా = కన్య, కంచిత్ = ఒకానొకనిని గూర్చి, ఇత్థమ్ = ఇట్లు, అభిధత్తే = పలుకు చున్నది.

అత్రేతి :- ఇక్కడ శంకా-అసూయా-ధృతి-స్మృతి-శ్రమ-దైన్య-విబోధ-ఔత్సుక్యా లనే భావాల శబలత కవిగతరాజవిషయకరతికి అంగం.

వృ. ఏతే చ రసవదాద్యలంకారాః. యద్యపి భావోదయ భావ సంధి భావశబలత్వాని నాలంకారతయా ఉక్తాని తథాపి కశ్చిద్ బ్రూయా దిత్యేవముక్తమ్.

అవ. "రసాదులు గుణీభావం పొందినప్పుడు వాటికి రసవదాద్యలంకారాలు అని పేరు. వీటికి గుణీభూతవ్యంగ్యాన్ని గూర్చి చెప్పేటప్పుడు ఉదాహరణలు చూప బడును" అని వెనుక (నాల్గవ ఉల్లాసం 26 వ కారిక వృత్తిలో) చెప్పి ఉన్నాడు. ఆ విషయమే జ్ఞాపకం చేస్తున్నాడు.

వ్యా. ఏతే ఇతి :- ఈ రసాదులే అనగా గుణీభూతములైన రస-భావ-రసాభాస-భావాభాస-భావశాంతి-భావోదయ-భావసంధి-భావశబలత్వాలే, అలంకా

రాలు అవుతాయి. గుణీభావం చెందిన రసం రసవదలంకారం; భావం ప్రేయోలం కారం;రసాభాస భావా భాసలు ఊర్జస్వి అలంకారం; భావశాంతి సమాహితాలంకారం.

అవ. గుణీభూతరసాదులకు అలంకారత్వం అంగీకరించి రసవదలంకారాది నామధేయాలు ప్రాచీనులు ఇచ్చి ఉన్నారు- కాని భావోదయాదులు అలంకారా లని చెప్పలేదు కదా అని ఆశంకించి చెపుతున్నాడు-

వ్యా. యద్యపి ఇతి. భావోదయ-భావసంధి- భావశబలత్వాలు అలంకారా లని ఎవరూ చెప్పకపోయినా ముమ్ముందు ఎవరైనా చెప్పవచ్చు కదా ! అందుచేత వాటిని కూడా అలంకారా లని చెప్పడం జరిగింది.

వృ. యద్యపి స నాస్తి కశ్చిద్విషయః యత్ర ధ్వనిగుణీభూతవ్యఙ్గ్యయోః స్వభేదాదిభిః సహ సంకరః సంసృష్టిర్వా నాస్తి తథాపి ప్రాధాన్యేన వ్యపదేశా భవన్తీతి క్వచిత్కేన చిద్వ్యవహారః.

వ్యా. ధ్వని-గుణీభూతవ్యంగ్యాలకు తమ అవాంతరభేదాలతో సంకరం కాని, సంసృష్టి కాని లేని ప్రదేశం ఏదీ ఉండకపోయినా "ప్రాధాన్యాన్ని అనుసరించి పేర్లు పెట్టడం జరుగుతుంది" అనే న్యాయంచేత ఎక్కడ ఏది ప్రధానంగా ఉన్నట్లు కనబడుతుందో దానిని పట్టి వ్యవహరించడం జరుగుతుంది.

వి. ఒకే ఉదాహరణంలో రెండు మూడు ధ్వనులు ఉండవచ్చు; లేదా రెండు మూడు గుణీభూతధ్వనులు ఉండవచ్చు. ఉదాహరణకి ఒకే శ్లోకంలో రస ధ్వని, భావధ్వని, అలంకారధ్వనీ ఉండవచ్చు. అదే విధంగా ఒకే శ్లోకంలో ఒక ధ్వని, ఒక గుణీభూతధ్వని ఉండవచ్చు. ఒకే శ్లోకంలో అగూఢవ్యంగ్య-అస్ఫుట వ్యంగ్య-అపరాంగాదిగుణీభూతధ్వనులు ఉండవచ్చు. అప్పుడు ఆ శ్లోకాన్ని ఏ ధ్వనికి, లేదా ఏ గుణీభూతధ్వనికి ఉదాహరణంగా గ్రహించాలి అనే ప్రశ్న వచ్చి నప్పుడు ఏది ప్రధానంగా ఉంటుందో, అనగా ఏది అధికచమత్కారకారిగా ఉంటుందో దానిని పట్టి ఆ శ్లోకానికి రసధ్వన్యుదాహరణం, భావధ్వన్యుదాహరణం, అగూఢవ్యంగ్యోదాహరణం ఇత్యాది నామధేయాలు పెట్టాలి అని అర్థం.

ఇక్కడ ఒక విషయం గమనించవలసి ఉంది. మమ్మటుడు "అతాదృశి గుణీభూతవ్యఙ్గ్యం వ్యఙ్గ్యే తు మధ్యమమ్" (5 వ కారిక) అని మధ్యమకావ్యలక్షణం చెప్పి ఉన్నాడు. పంచమోల్లాసంలో గుణీభూతవ్యంగ్యానికి సంబంధించిన ఎనిమిది

భేదాలను ప్రతిపాదించాడు. రెండవ భేదం అయిన అపరాంగవ్యంగ్యాన్ని గూర్చి చెపుతూ ప్రధానవాక్యార్థమైన వాచ్యార్థానికి గాని, రసాదులకి గాని అంగమైన వ్యంగ్యం అపరాంగవ్యంగ్యం అని సోదాహరణంగా నిరూపించాడు. రస-భావ-రసాభాస-భావాభాస-భావశాంతి-భావోదయ-భావసంధి-భావశబలతలు ఇతరరస భావాదులకు అంగాలు అవడంచేత అవి ఎట్లు గుణీభూతవ్యంగ్యా లయినాయో ఉదాహరణలు చూపించాడు. పైన చెప్పిన మధ్యమకావ్యలక్షణాన్ని పట్టి గుణీభూతవ్యంగ్యాలన్నీ మధ్యమకావ్యాలనే అభిప్రాయంతో కొందరు వ్యాఖ్యాతలు (బాలబోధినీకారాదులు) ఈ ఉదాహరణ లన్నీ మధ్యమకావ్యా లని వ్రాశారు. "రసస్య రసాఙ్గతాయామపరాఙ్గవ్యఙ్గ్యం మధ్యమకావ్యముదాహరతి" (బాలబోధిని పేజి. 195 మొ). కాని ఇది అయుక్తంగా కనబడుతుంది. పైన చూపిన మధ్యమ కావ్యలక్షణం "ఇదముత్తమమతిశయిని వ్యఙ్గ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథితః" అన్న కారికార్థం తరవాత చెప్పబడింది. దాన్ని పట్టి వాచ్యార్థం కంటె వ్యంగ్యార్థం అనతిశాయిగా ఉంటేనే, అలాంటి గుణీభూతవ్యంగ్యం మధ్యమకావ్యం అని స్పష్టం అవుతుంది. అందుచేత ఈ ఘట్టంలో ఇచ్చిన ఉదాహరణలలో రసాదులు వ్యంగ్యాలే అయిన ఇతరరసభావాదులకు అంగా లయినాయి కాని వాచ్యార్థానికి అంగాలు కాలేదు. అందుచేత ఇవన్నీ గుణీభూతవ్యంగ్యాలే అయినా మమ్మటోక్తలక్షణం ప్రకారం ఉత్తమకావ్యకోటికే చెందుతాయి కాని మధ్యమకావ్యాలు కావు. అందుచేతనే మూడు కావ్యభేదాలను కాక ఉత్తమోత్తమ- ఉత్తమ- మధ్యమ- అధమాలనే నాలుగు భేదాలను అంగీకరించిన పండితరాయలు ద్వితీయభేదానికి "యత్ర వ్యఙ్గ్యమప్రధానమేవ సచ్చమత్కారకారణం తత్ ద్వితీయమ్" అని లక్షణం ఇచ్చి "వాచ్యాపేక్షయా ప్రధానీభూతం వ్యఙ్గ్యాన్తరమాదాయ గుణీభూతం వ్యఙ్గ్యమాదాయాతివ్యాప్తివారణాయ అవధారణమ్. తేన తస్య ధ్వనిత్వమేవ" (ర.గం. పేజి. 20) అని వ్రాశాడు.

అవ. శబ్దశక్తిమూలానురణనరూప (సంలక్ష్యక్రమ) ఉపమాలంకారం వాచ్యార్థానికి అంగంఅయిన అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ జనస్థానే భ్రాన్తం కనకమృగతృష్ణాన్వితధియా
వచో వైదేహీతి ప్రతిపదముదశ్రు ప్రలపితమ్,
కృతాలంకాభర్తుర్వదనపరిపాటీషు ఘటనా
మయాప్తం రామత్వం కుశలవసుతా న త్వధిగతా. 124

వృ. అత్ర శబ్దశక్తిమూలానురణనరూపో రామేణ సహ ఉపమానోపమేయభావః వాచ్యాఙ్గతాం నీతః.

వ్యా. జనేతి— రాజసేవ చేసి చేసి నిర్వేదం చెందిన కవి మాటలు ఇవి. ఇది భట్టవాచస్పతి రచించిన శ్లోకం అని క్షేమేంద్రుడు కవికంఠాభరణంలో చెప్పినాడు. రాముడికి ఉన్న లక్షణాలు అన్నీ నాకు ఉన్నాయి కాని ఒక్క 'కుశలవసుత' అనేది మాత్రం లభించలేదు అని దీని భావం. ఇక్కడ ప్రయోగించిన పదాలకు రామునిపక్షంలో ఒక అర్థం- కవిపక్షంలో మరొక అర్థం. (రాముని పక్షంలో)- కనకమృగతృష్ణాన్ధితధియా = బంగారులేడిపై ఆశచేత అంధంగా (ఆలోచనారహితంగా) చేయబడిన బుద్ధితో, జనస్థానే = జనస్థానం అనే అటవీ ప్రాంతంలో, భ్రాన్తమ్ = భ్రమణం చేయబడింది. ప్రతిపదమ్ = అడుగడుగునా, ఉదశ్రు = ఉబికి వస్తున్న కన్నీళ్లు కలుగునట్లుగా, వైదేహి ఇతి = వైదేహీ ! అని, వచః = వచనం, ప్రలపితమ్ = ప్రలాపము చేయబడింది. లఙ్కాభర్తుః = రావణునియొక్క, వదనపరిపాటీషుఘటనా = ముఖపంక్తియందు బాణాల యోజనము, కృతా = చేయబడింది. (కవిపక్షంలో)- కనకమృగతృష్ణాన్ధితధియా = బంగారము యొక్క అన్వేషణ (మృగ)మునందు ఆశచేత అంధంగా చేయబడిన బుద్ధితో, లేదా బంగారం అనే ఎండమావులచేత గ్రుడ్డిదిగా చేయబడిన బుద్ధితో, జనస్థానే = జనుల నివాసమునందు, పట్టణాలలోను, పల్లెలలోను, భ్రమణం చేయబడింది. వై+దేహి+ఇతి అని పదచ్ఛేదం, (ప్రతిపదమ్ ఉదశ్రు) దేహి ఇతి = ఇమ్ము అని, ప్రలపితం వై = దైన్యముతో పలకబడింది. "కృతా+అలమ్+కాభర్తుః+వదనపరిపాటీషు" అని పదచ్ఛేదం. కాభర్తుః = కుత్సితుడైన ప్రభువుయొక్క, వదనపరిపాటీషు = అసత్యములైన మాటల ప్రకారములయందు, ఘటనా = ఉపపత్తి, లేదా వదనపరిపాటీషు = ముఖవక్రీకరణాదులయందు, ఘటనా = ఉపాయము (అతని అభిప్రాయాన్ని తెలుసుకొనడానికి ఉపాయం) లేదా నేత్రాల ఘటన (ప్రసారం), అలమ్ = అత్యధికంగా, కృతా = చేయబడింది మయా = నాచేత, రామత్వమ్ = రామత్వము, ఆప్తమ్ = పొందబడింది. కుశలవసుతా తు = 'కుశలవసుత' అయితే, న అధిగతా = పొందబడలేదు. రామునిపక్షంలో 'కుశలవసుతా' అనగా "కుశలవౌ సుతౌ యస్యాః సా" అనే విగ్రహంచేత 'కుశలవులు కుమారులుగా గలది' అనగా 'సీత'అని అర్థం. కవిపక్షంలో "కుశలం వసు యస్య సః కుశలవసుః. కుశలవసోః భావః కుశలవసుతా" 'క్షేమకరమైన ధనం కలిగి

యుండుట' అనగా 'సుఖప్రదమైన ధనం'అని అర్థం. రాముడు చేసిన పను లన్నీ చేసినా నాకు మాత్రం ఆయనకు లభించిన 'కుశలవసుత'లభించలేదు అని అర్థం.

అత్రేతి– ఇక్కడ శబ్దశక్తిమూలానురణనరూపమైన రామునితో ఉపమానోపమేయభావం వాచ్యార్థానికి అంగంగా చేయబడింది.

వి. ఈ శ్లోకంలో మొదటి మూడు పాదాలలోను ప్రయోగించిన శ్లిష్టపదాల శక్తిచేత కవికి రామునితో ఉపమానోపమేయభావం (ఉపమాలంకారం) వ్యంజితం అవుతున్నది. ఇది 'మయా రామత్వం ఆప్తమ్' అని వాచ్యమైన రామత్వప్రాప్తికి ఉపకారకంగా, అనగా 'నీకు రామత్వం ఎలా వచ్చింది ?' అని ప్రశ్నిస్తే సమర్థకంగా ఉంది. అందుచేత ఈ వ్యంగ్యోపమ వాచ్యానికి అంగం కాబట్టి ఇది అపరాంగవ్యంగ్యం. ఇక్కడ ప్రయోగించిన శబ్దాలు పరివృత్త్యసహాలు. అందుచేత ఉపమాలంకారం శబ్దశక్తిమూలం.

అవ. అర్థశక్తిమూలానురణన (సంలక్ష్యక్రమ) రూపవస్తుధ్వని వాచ్యార్థానికి అంగం అయిన అపరాంగవ్యంగ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు–

శ్లో. ఆగత్య సంప్రతి వియోగవిసంష్ఠులాఙ్గీ
మమ్భోజినీం క్వచిదపి క్షపితత్రియామః,
ఏతాం ప్రసాదయతి పశ్య శనైః ప్రభాతే
తన్వఙ్గి పాదపతనేన సహస్రరశ్మిః. 125

వృ. అత్ర నాయకవృత్తాన్తః అర్థశక్తిమూలః వస్తురూపః నిరపేక్షరవికమలినీవృత్తాన్తాధ్యారోపేణైవ స్థితః.

వాచ్యసిద్ధ్యఙ్గం యథా-

వ్యా. ఆగత్యేతి- ప్రియుడు బ్రతిమాలుకొనకుండగానే మానాన్ని(కోపాన్ని) విడిచిపెట్టిన ముగ్ధనాయికతో సఖురాలు అంటూన్న మాట లివి. తన్వఙ్గి = సన్నని శరీరం కలదానా! క్వచిదపి = ఎక్కడనో, క్షపితత్రియామః = గడపబడిన రాత్రి గల, సహస్రరశ్మిః = సూర్యుడు, సంప్రతి = ఇప్పుడు, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, ఆగత్య = వచ్చి, వియోగవిసంష్ఠులాఙ్గీమ్ = వియోగంచేత శిథిలమైన

శరీరం గల, ఏతామ్ = ఈ, అమ్భోజినీమ్ = పద్మలతను, పాదపతనేన = పాద పతనంచేత (పాదాలమీద పడడంచేత, పాదాల, అనగా కిరణాల, ప్రసారంచేత అని రెండర్థాలు) శనైః = మెల్లగా, ప్రసాదయతి = ప్రసాదింపచేసుకొంటున్నాడు (అనుగ్రహింపచేసుకొంటున్నాడు, అందంగా వికసించేటట్లు చేస్తున్నాడు అని రెండర్థాలు).

అత్రేతి :- ఇక్కడ అర్థశక్తిమూలము, వస్తురూపము అయిన నాయక వృత్తాంతం దాని అపేక్షలేని సూర్యపద్మినీవృత్తాంతంయొక్క ఆరోపంతోనే ఉన్నది.

వి. సూర్యపద్మినీవృత్తాంతాన్ని వర్ణిస్తూన్నప్పుడు అర్థశక్తిచేత (పదాలు పరివృత్తిసహాలు గాన అర్థశక్తిమూలత్వం) నాయికానాయక వృత్తాంతం అనగా ఒక నాయకుడు కుపిత అయిన నాయికను బ్రతిమాలుతున్నాడు అనే వృత్తాంతం గమ్యమానం అవుతున్నది. అది వస్తురూపం. సూర్యపద్మినీవృత్తాంతం వాచ్యం. వ్యంగ్యం అయిన నాయికానాయకవృత్తాంతం లేకపోయినా వాచ్యార్థానికి భంగం లేదు. అందుచేత అది నిరపేక్షం. ఈ వాచ్యార్థంమీద వ్యంగ్యార్థం ఆరోపించబడు తున్నది. ఈ వ్యంగ్యార్థాన్ని ఆరోపించడంచేత అనగా రవికమలినీవృత్తాంతం నాయికానాయకవృత్తాంతమే అని సూచించడంచేత వాచ్యార్థానికి ఒక అందం వచ్చింది. ఈ వ్యంగ్యార్థప్రతీతి లేకపోతే వాచ్యార్థంలో చమత్కారం ఏమీ లేదు. ఈ విధంగా వ్యంగ్యార్థం వాచ్యార్థశోభాధాయకం అవడం ద్వారా దానికి అంగం అయింది. అందుచేత ఇది అపరాంగవ్యంగ్యం.

వాచ్యసిద్ధ్యంగమైన అపరాంగవ్యంగ్యం ఎట్లనగా-

**భ్రమిమరతిమలసహృదయతాం ప్రలయంమూర్ఛాంతమఃశరీరసాదమ్**
**మరణం చ జలదభుజగజం ప్రసహ్య కురుతే విషం వియోగినీనామ్.**

వృ. అత్ర హాలాహలం వ్యఙ్గ్యం భుజగరూపస్య వాచ్యస్య సిద్ధి కృత్. యథా వా.

**శ్లో॥ గచ్ఛామ్యచ్యుత దర్శనేన భవతః కిం తృప్తిరుత్పద్యతే**
**కింత్వేవం విజనస్థయోర్హ్రతజనః సంభావయత్యన్యథా,**

ఇత్యామన్త్రిణభఙ్గిసూచితవృథావస్థానఖేదాలసామ్
ఆశ్లిష్యన్ పులకోత్కరాఞ్చితతనుర్గోపీం హరిః పాతు వః.

వృ. అత్ర అచ్యుతాదిపదవ్యఙ్గ్యమామన్త్రిణేత్యాదివాచ్యస్య. ఏత చ్చైకత్ర ఏకవక్తృగతత్వేన అన్యత్రభిన్నవక్తృగతత్వేనేత్యనయోః భేదః.

వ్యా. భ్రమిమితి :- జలదభుజగమ్ = మేఘ మనే సర్పంవల్ల పుట్టిన విషమ్=జలంఅనే విషం, విషశబ్దానికి జలం, గరలం అని రెండర్థాలు ఉన్నాయి. వియోగినీనామ్ = వియోగవతులకు, భ్రమిమ్ = త్రిప్పును, అరతిమ్ = దేనిమీదా ఇష్టం లేకపోవడాన్ని, అలసహృదయతామ్ = మందమైన హృదయం కలిగి ఉండడాన్ని, హృదయదౌర్బల్యాన్ని, ప్రలయమ్ = బాహేంద్రియాలు పనిచేయ కపోవడాన్ని, మూర్ఛామ్ = మూర్ఛను, తమః = చీకటినీ, అంధత్వాన్ని, శరీర సాదమ్ = శరీరం క్షీణించిపోవడాన్ని, మరణం చ = మరణాన్ని, ప్రసహ్య = బలాత్కారంగా, కురుతే = చేయును.

అత్రేతి :- ఇక్కడ వ్యంగ్యమైన హాలాహలం భుజగరూపమైన వాచ్యం యొక్క సిద్ధిని చేస్తూన్నది.

వి. భ్రమి, అరతి మొదలైనవి కలుగుతాయి, అని చెప్పడంచేత వాటికి కారణంగా ప్రసిద్ధమైన విషం వ్యంగ్యం అవుతున్నది. విషం అనేది వ్యంగ్యం అవడం చేతనే 'మేఘమే సర్పం' అని మేఘంమీద సర్పత్వారోపం కుదిరింది. ఈ విధంగా వ్యంగ్యం వాచ్యసిద్ధ్యంగం అయింది అని భావం.

మరొక ఉదాహరణం ఎట్లనగా-

గచ్ఛామీతి:- అచ్యుత = శ్రీకృష్ణా, గచ్ఛామి = వెడతాను, భవతః = నీ యొక్క, దర్శనేన = దర్శనంచేత, తృప్తిః = తృప్తి, ఉత్పద్యతే కిమ్ = పుడు తుందా? కిం తు = మరొకటేమంటే, ఏవమ్=ఇట్లు, విజనస్థయోః=(మనం) నిర్జన ప్రదేశంలో ఉండగా, హతజనః= ఈ పాడుజనం, అన్యథా=మరొకవిధంగా, సంభావ యతి = ఊహిస్తుంది. (ఇది వాచ్యార్థం). ఇంక వ్యంగ్యార్థం. అచ్యుత = నావంటి సుందరి ప్రక్కన ఉన్నా చలించనివాడా! భవతః దర్శనేన = నిన్ను చూస్తూ ఉండడంచేత, తృప్తిః ఉత్పద్యతే కిమ్=తృప్తి కలుగుతుందా? ఎంత సేపు చూస్తూ

ఉంటేమాత్రం ఏం తృప్తి కలుగుతుంది? సంభోగంచేతనే కలుగుతుంది అని భావం. ఆ ఫలం దక్కితే ఈ పాడులోకం ఏమి అనుకొన్నా పరవాలేదు అని అభిప్రాయం. ఇతి = ఇట్లు, ఆమన్త్రిణభఙ్గీసూచితవృథావస్థానఖేదాలసామ్ = = ఆమంత్రణభంగిచేత ('అచ్యుతా' అని అదొకవిధంగా కాకుస్వరం పెట్టి పిలిచే రీతిచేత) సూచించబడిన వ్యర్థంగా నిలచినందుకు కలిగిన ఖేదంచేత అలసురాలైన, గోపీమ్ = గోపికను, ఆశ్లిష్యన్ = ఆశ్లేషిస్తూన్న, పులకోత్కరాఞ్చితతనుః = పులకముల సముదాయముతో ప్రకాశిస్తూన్న శరీరం గల, హరిః = శ్రీకృష్ణుడు, వః = మిమ్ములను, పాతు = రక్షించుగాక.

అత్రేతి :— ఇక్కడ 'అచ్యుత' మొదలైన పదాలచేత వ్యంగ్యమైన అర్థం 'ఆమన్త్రిణభఙ్గీసూచిత' మొదలైన వాక్యంయొక్క వాచ్యార్థం సిద్ధించేటట్లు (కుదిరేటట్లు) చేస్తున్నది.

వి. పైన చెప్పిన వ్యంగ్యార్థం లేకపోతే 'ఆమంత్రణభంగిచేత వృథావస్థానఖేదాన్ని సూచిస్తూన్న' అనే వాచ్యార్థం పూర్ణం కాదు. అందుచేత అది దీనికి అంగం.

వ్యా. ఏతచ్చేతి :- మొదటి ఉదాహరణంలో (భ్రమిమ్ ఇత్యాదిలో) ఏకవక్తృగతత్వంచేత, రెండవదానిలో భిన్నవక్తృగతత్వంచేత వీటికి భేదం.

వి. పై రెండు శ్లోకాలు వాచ్యసిద్ధ్యంగవ్యంగ్యానికి ఉదాహరణలు. అయితే 'భ్రమిమ్' ఇత్యాది శ్లోకంలో వక్త ఒకడే-కవి రెండవ శ్లోకంలోని పూర్వార్థంలో వక్త్రి గోపి, ఉత్తరార్ధంలో వక్త కవి. ఇదే వీటి భేదం.

అవ. గుణీభూతవ్యంగ్యభేదాలలో నాల్గవది అయిన అస్ఫుటవ్యంగ్యాన్ని నిరూపిస్తున్నాడు.

వృ. అస్ఫుటం యథా-

శ్లో॥ అదృష్టే దర్శనోత్కణ్ఠా దృష్టే విచ్ఛేదభీరుతా,
నాదృష్టేన న దృష్టేన భవతా లభ్యతే సుఖమ్. 128

వృ. అత్రాదృష్టో యథా న భవసి వియోగభయం చ యథా నోత్పద్యతే తథా కుర్యా ఇతి క్లిష్టమ్.

వ్యా. అస్ఫుటవ్యంగ్యం ఎట్లనగా-

అదృష్టే ఇతి :- ఒకతే ప్రియునితో అంటూన్న మాటలు. అదృష్టే = చూడబడనివాడవగుచుండగా, దర్శనోత్కణ్ఠా = చూడడంలో ఉత్కంఠ, చూడాలని బెంగ, దృష్టే = చూడబడినవాడవగుచుండగా, విచ్ఛేదభీరుతా = వియోగంవల్ల భయం. అదృష్టేన = చూడబడని, భవతా = నీచేత, సుఖమ్ = సుఖము, న లభ్యతే = లభించదు. దృష్టేన = చూడబడిన నీచేత, న = లభించదు. నువ్వు కనబడకున్నా సుఖం లేదు, కనిపించినా సుఖం లేదు అని అర్థం.

అత్రేతి :- ఇక్కడ "నువ్వు కనబడకుండగా ఉండ నట్లు, వియోగభయం కలగకుండా ఉండేటట్లు చెయ్యాలి" అనే వ్యంగ్యం క్లిష్టం, అనగా సహృదయులకు కూడా ఈ మాట విన్న వెంటనే స్ఫురించదు. అందుచేత ఇది అస్ఫుటవ్యంగ్యం.

అవ. అయిదవ భేదమైన సందిగ్ధప్రాధాన్యాన్ని నిరూపిస్తున్నాడు-

వృ. సందిగ్ధప్రాధాన్యం యథా-

శ్లో॥ హరస్తు కించిత్పరివృత్తధైర్యశ్చన్ద్రోదయారమ్భ ఇవామ్బురాశిః
ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని.

వృ. అత్ర పరిచుమ్బితుమైచ్ఛదితి కిం ప్రతీయమానం, కిం వా విలోచనవ్యాపారణం వాచ్యం ప్రధానమ్ ఇతి సందేహః.

వ్యా. సందిగ్ధప్రాధాన్యవ్యంగ్యం ఎట్లనగా-

హర ఇతి :- కుమారసంభవతృతీయసర్గలో తపఃసమాధినుండి బైటకు వచ్చిన శివునికి పార్వతి పుష్పాలు సమర్పిస్తూన్న సమయంలో శివుని ప్రవృత్తిని వర్ణించే శ్లోకం. హరః తు = శివుడైతే, చన్ద్రోదయారమ్భే = చంద్రోదయ ప్రారంభంలో, అమ్బురాశిః ఇవ = సముద్రం వలె, కించిత్ = కొంచెము, పరివృత్తధైర్యః = చలించిన ధైర్యంకలవాడై, బిమ్బఫలాధరోష్ఠే = దొండపండు వంటి అధరోష్ఠం గల, ఉమాముఖే = పార్వతి ముఖంమీద, విలోచనాని = (మూడు) నేత్రాలను, వ్యాపారయామాస = ప్రసరింపచేసెను.

అత్రేతి:- ఇక్కడ "చుంబించ వలెనని ఇచ్ఛయించాడు" అనే వ్యంగ్యార్థం

ప్రధానమా, లేదా నేత్రాలు ప్రసరింపచేయడం అనే వాచ్యం ప్రధానమా అని సందేహం. అందుచేత ఇక్కడ వ్యంగ్యం సందిగ్ధప్రాధాన్యవ్యంగ్యం అని అర్థం.

అవ. ఆరవ భేదమైన తుల్యప్రాధాన్యవ్యంగ్యాన్ని నిరూపిస్తున్నాడు-

వృ. తుల్యప్రాధాన్యం యథా-

శ్లో॥ బ్రాహ్మణాతిక్రమత్యాగో భవతామేవ భూతయే,
జామదగ్న్యస్తథా మిత్రమన్యథా దుర్మనాయతే. 130

వృ. అత్ర జామదగ్న్యః సర్వేషాం క్షత్రియాణామివ రక్షసాం క్షయం క్షణాత్ కరిష్యతీతి వ్యఙ్గ్యస్య వాచ్యస్య చ సమం ప్రాధాన్యమ్.

వ్యా. తుల్యప్రాధాన్య వ్యంగ్యం ఎట్లనగా-

బ్రాహ్మణేతి:- మహావీరచరితంలో మాల్యవంతుడికి పరశురాముడు వ్రాసి పంపిన లేఖలోని పద్యం ఇది. బ్రాహ్మణాతిక్రమత్యాగః = బ్రాహ్మణాతిక్రమం యొక్క త్యాగం (బ్రాహ్మణుడనైన నేను చెప్పేమాటను కాదనుకుండా ఉండడం), భవతామ్ ఏవ = మీయొక్కయే, భూతయే = అభివృద్ధికొరకు. అన్యథా = అట్లు కాకపోతే, తథా = ఆ విధంగా, మిత్రమ్ = మిత్రుడైన, జామదగ్న్యః = పరశురాముడు, దుర్మనాయతే = క్షోభించిన మనస్సు కలవాడు అవుతాడు (మనస్సులో బాధపడతాడు).

అత్రేతి :- ఇక్కడ వాచ్యార్థం, "క్షత్రియులను అందరినీ నశింపచేసినట్లే పరశురాముడు రాక్షసుల్ని అందరినీ క్షణంలో నశింపచేస్తాడు" అనే వ్యంగ్యార్థం ఈ రెండూ అందంగానే ఉన్నాయి. ఈ రెండింటి ప్రాధాన్యమూ కూడా సమానమే. అందుచేత ఇక్కడ తుల్యప్రాధాన్యవ్యంగ్యం.

అవ. ఏడవ భేదం అయిన కాక్వాక్షిప్తవ్యంగ్యాన్ని నిరూపిస్తున్నాడు-

వృ. కాక్వాక్షిప్తం యథా-

శ్లో॥ మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్
దుఃశాసనస్య రుధిరం న పిబామ్యురస్తః,

సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ
సంధిం కరోతు భవతాం నృపతిః పణేన. 131

వృ. అత్ర మథ్నామ్యేవేత్యాది వ్యఙ్గ్యం వాచ్యనిషేధసహభావేన స్థితమ్.

వ్యా. కాక్వాక్షిప్తం ఎట్లనగా-

మథ్నామీతి :- వేణీసంహారం ప్రథమాంకంలో సంధిమాటలు జరుగుతున్నట్లు విని కోపావిష్టుడైన భీమసేనుడు సహదేవునితో అన్న మాటలు. సమరే= యుద్ధంలో, కోపాత్=కోపంవలన, కౌరవశతమ్=కౌరవుల శతాన్ని, న మథ్నామి = మథించనూ! దుఃశాసనస్య= దుఃశాసనునియొక్క, ఉరస్తః=వక్షఃస్థలంనుండి, రుధిరమ్= రక్తాన్ని, న పిబామి= తాగనూ! గదయా= గదచేత, సుయోధనోరూ= సుయోధనుని తొడలను, న సంచూర్ణయామి= చూర్ణం చెయ్యనూ! భవతామ్= మీయొక్క, నృపతిః= రాజు, పణేన= పణంతో (షరతులతో), సంధిమ్ =సంధిని, కరోతు= చేసికొనుగాక.

అత్రేతి:- తప్పక మథిస్తాను ఇత్యాది వ్యంగ్యం వాచ్యమైన నిషేధంతో కలిసియే ఉన్నది.

వి. 'న మథ్నామి' ఇత్యాదులకు 'మథించను' మొదలైనవి వాచ్యార్థాలు. అయితే కాకుస్వరం చేర్చి ఉచ్చరించగా "ఏమిటీ! నేను మథించనూ!" ఇత్యర్థాలు వస్తాయి. అనగా "న మథ్నామి ఇతి న" మథించను అనే మాట లేదు అని మథనాభావాభావం 'అనగా తప్పక మథిస్తాను' అనే అర్థం వ్యంగ్యం అవుతుంది. "నూర్గురు కౌరవులనూ సంహరిస్తాను" ఇత్యాదివిధంగా ప్రతిజ్ఞ చేసిన భీమసేనుడు 'మథించను' అని అనడం కుదరదు. అందుచేత 'న మథ్నామి' అనే దానికి వాచ్యం అయిన మథననిషేధంతో పాటు వెంటనే కాకుస్వరంచేత 'తప్పక మథిస్తాను' అనే వ్యంగ్యార్థం బోధింపబడడంచేత ఇది వాచ్యార్థంవంటిదే అయిపోయింది. అందుచేత ఇది గుణీభూతవ్యంగ్యం అని అర్థం.

అవ. ఎనిమిదవ భేదమైన అసుందరవ్యంగ్యాన్ని నిరూపిస్తున్నాడు-

వృ. అసున్దరం యథా-

గాథ. వాణీరకుడంగుడ్డీణసఉణికోలాహలం సుణంతీఏ,
ఘరకమ్మవావడాఏ బహూఏ సీఅన్తి అంగాఇం. 132

"వానీరకుఞ్జోడ్డీనశకునికోలాహలం శృణ్వన్త్యాః
గృహకర్మవ్యాపృతాయా వధ్వాః సీదన్త్యఙ్గాని."

వృ. అత్ర దత్తసంకేతః కచ్చిల్లతాగహనం ప్రవిష్ట ఇతి వ్యఙ్గ్యాత్ 'సీదన్త్యఙ్గాని' ఇతి వాచ్యం సచమత్కారమ్.

వ్యా. అసుందరవ్యంగ్యం ఎట్లనగా—

వాణీర ఇతి- వానీరకుఞ్జోడ్డీనశకునికోలాహలమ్ = పేపడొంకనుండి ఎగిరిన పక్షుల కోలాహలాన్ని, శృణ్వన్త్యాః = వినుచున్న (విన్న), గృహకర్మవ్యాపృతాయాః = ఇంటి పనులలో వ్యాపృతురాలై ఉన్న, వధ్వాః = కోడలియొక్క, అఙ్గాని = అవయవాలు, సీదన్తి = పట్లు తప్పిపోవుచున్నవి.

వి. ఇంటిదగ్గరగానే ఉన్న వేతసనికుంజంలో కలుద్దాం అని ఒకతె ప్రియునితో సంకేతం చేసుకుంది. ఆ నికుంజంలో ఉండే పక్షులు హటాత్తుగా ఎగిరిపోతూన్నప్పుడు వినగానే ప్రియుడు అక్కడికి వచ్చినట్లు ఊహించినా ఆమె గురుభయంచేత, కార్యభారంచేతా వెళ్ళజాలకపోయింది. అప్పుడు ఆమె స్థితిని వర్ణించే గాథ ఇది-

అత్రేతి- ఇక్కడ- "ఇవ్వబడిన సంకేతంగల (సంకేతం ఏర్పరచుకొన్న) ఒకడు లతాగృహంలో ప్రవేశించినాడు" అనే వ్యంగ్యార్థంకంటె "సీదన్తి అఙ్గాని" (అవయవాలు సడలిపోతున్నాయి) అనే వాచ్యార్థమే ఎక్కువ చమత్కారజనకంగా ఉంది. అందుచేత ఇది 'అసుందరవ్యంగ్యం'.

అవ. ఇంతవరకు చెప్పిన గుణీభూతవ్యంగ్యాల అవాంతరభేదాలు చెపుతున్నాడు-

కా. ఏషాం భేదా యథాయోగం వేదితవ్యాశ్చ పూర్వవత్. 46

వృ. యథాయోగమితి-

"వ్యజ్యన్తే వస్తుమాత్రేణ యదాలంకృతయస్తదా
ధ్రువం ధ్వన్యఙ్గతా తాసాం కావ్యవృత్తేస్తదాశ్రయాత్" (ధ్వ.అ.2.29)

ఇతి ధ్వనికారోక్తదిశా వస్తుమాత్రేణ యత్రాలఙ్కారో వ్యజ్యతే న తత్ర గుణీభూతవ్యఙ్గ్యత్వమ్.

వ్యా. ఏషామ్ = ఈ గుణీభూతవ్యంగ్యాలయొక్క, భేదాః = భేదాలు, పూర్వవత్ = పూర్వమునందు చెప్పిన ధ్వనిభేదముల వలె, యథాయోగమ్ = యథా సంభవంగా, వేదితవ్యాః = తెలియదగినవి.

వి. గుణీభూతవ్యంగ్యభేదాలు పైన చెప్పిన ఎనిమిది మాత్రమే కాదు. అర్థాంతరసంక్రమితత్వం మొదలైన ఉపాధులను పట్టి ధ్వనికి ఏ విధంగా అనేక భేదాలు ఏర్పడినాయో, అదే విధంగా ఆ ఉపాధులను పట్టి గుణీభూతవ్యంగ్యానికి కూడా శుద్ధభేదాలు, సంకరసంసృష్ట్యాదులచేత ఇంకా ఎన్నో సంకీర్ణభేదాలు ఉంటాయి. అయితే ధ్వనిలో ఉన్న కొన్ని భేదాలు దీనిలో కుదరకపోవచ్చు. అందుచేతనే యథాసంభవంగా అని చెప్పబడింది. ఈ విషయాన్నే విశదీకరిస్తున్నాడు-

యథాయోగమితి ఇతి:- "కేవలవస్తువుచేత అనగా వాచ్యాలంకారరహితమైన వస్తుమాత్రంచేత, అలంకారాలు వ్యంజింపచేయబడినప్పుడు ఆ అలంకారాలు తప్పకుండా ధ్వనిభేదాలే అని గ్రహించాలి. ఎందుచేత ననగా కావ్యప్రవృత్తి అలంకారాలని ఆశ్రయించి ఉంటుంది; అనగా అలంకారాలు ఉన్నప్పుడే అది కావ్యం అనిపించుకుంటుంది"అని ధ్వనికారుడు చెప్పినట్లు వస్తుమాత్రంచేత అలంకారం వ్యంజింపచేయబడిన చోట గుణీభూతవ్యంగ్యం అనడానికి వీలులేదు. అది ధ్వనియే.

వి. వస్తువుకంటె అలంకారం అధికచమత్కారి గాన వస్తువు దృష్ట్యా దానికి ప్రాధాన్యం ఎప్పుడూ ఉంటుంది. అందుచేత వస్తువుచేత అలంకారం ధ్వనింపబడే స్థలంలో ఆ ధ్వన్యమానాలంకారంలో గూఢత్వాదు లేవైనా ఉన్నా ఆ అలంకారం సహజంగా వస్తువుకంటె ప్రాధాన్యం ఉన్నది కాబట్టి దానికి గౌణత్వం లేదు. అలంకారత్వేన అది ప్రధానమే. దీనికంటె వస్తువుకు ప్రాధాన్య ప్రసక్తి లేదు. వ్యజ్యమానం అయిన అలంకారంకంటె వస్తువు ప్రధానంగా ఉంటేనే కదా ఆ వ్యంగ్యానికి గుణీభూతత్వం కలిగేది. అందుచేత 'వస్తునా అలంకార ధ్వనిః' అనే ధ్వనికి సంబంధించిన తొమ్మిది భేదాలు తీసివేయగా శుద్ధగుణీభూత వ్యంగ్యానికి ధ్వనికి వలె యాభైఒక్క (51) భేదాలుకాక, (51–9) నలభై రెండు

(42) భేదాలు మాత్రమే ఉంటాయి. అందుచేతనే 'యథాయోగం' (యథాసంభవంగా)అని చెప్పబడింది. సంకరసంసృష్టులవల్ల ఏర్పడిన సంకీర్ణభేదాలూ ఇవీ కలిపితే మొత్తం నాలుగు లక్షల యాభై ఒక్కవేల తొమ్మిదివందల ఇరవై (451920) గుణీభూతధ్వనిభేదాలు అవుతాయి. ఏవేవో గుణకారాలు చేసి ఈ భేదాలన్నీ చెప్పడం తప్ప ఇవేవీ ప్రయోగయోగ్యాలూ, అనుభవగమ్యాలూ కావు. వ్యర్థప్రయాస.

పైన ఉదాహరించిన ధ్వనికారకారికలో "వస్తుమాత్రంచేత అలంకారం వ్యంగ్యం అయినప్పుడు"అని చెప్పబడింది. వస్తుమాత్రం అనగా 'వాచ్యాలంకారం ఏదీ లేని వస్తువు'అని అర్థం. వాచ్యాలంకారం ఏదైనా ఉన్న వస్తువు అలంకారాన్ని వ్యంజింపచేసినప్పుడు ఆ వ్యజ్యమానాలంకారం వస్తుదృష్ట్యా కాకపోయినా, వాచ్యాలంకారదృష్ట్యా గౌణం అవడానికి అవకాశం ఉందిగాన ఆ అలంకారధ్వని ధ్వనిగానే ఉంటుంది అనడానికి వీలులేదు అని భావం. ఉదాహరణకి-ప్రతివస్తూపమాది స్థలాలలో ఉపమ వ్యంగ్యంగా ఉంటుంది. అయినా ఆ ఉపమ అగూఢం అవడం చేత (వస్తువు దృష్ట్యా ప్రధానమే అయినా) ప్రతివస్తూపమాదృష్ట్యా అప్రధానమే గాన అది గుణీభూతవ్యంగ్యం.

అవ. ధ్వని- గుణీభూతవ్యంగ్యాల మిశ్రణంచేత ఏర్పడే అనేక భేదాలను గూర్చి చెపుతున్నాడు-

కా. సాలంకారైర్ధ్వనేస్తైశ్చ యోగః సంసృష్టిసంకరైః.

వృ. సాలంకారైరితి :- తైరేవాలంకారైః, అలంకారయుక్తైశ్చ తైః. తదుక్తం ధ్వనికృతా:-

"సగుణీభూతవ్యఙ్గ్యైః సాలంకారైః సహప్రభేదైః స్వైః
సంకరసంసృష్టిభ్యాం పునరప్యుద్యోతతే బహుధా" (ధ్వ.ఆ. 3.43)ఇతి.

వ్యా. సాలంకారైః = అలంకారాలతో కూడిన, తైః = వాటితో (గుణీభూతవ్యంగ్యాలతో), సంసృష్టిసంకరైః = సంసృష్టిసంకరాలచేత, ధ్వనేః = ధ్వనికి, యోగః = సంబంధము.

తైరేవేతి-అలంకారరూపాలైన ఆ గుణీభూతధ్వములతోను, అలంకారయుక్తాలైన వాటితోను.

వి. పర్యాయోక్త సమాసోక్త్యాదులలో వ్యంగ్యం ఉంటుంది. కాని అది అప్రధానంగా ఉంటుంది. అందుచేత అలంకారాలైన పర్యాయోక్తసమాసోక్త్యాదులు కూడ గుణీభూతవ్యంగ్యాలే. అందుచేత ఇక్కడ 'సాలంకారైః'అనే పదానికి రెండ ర్థాలు వచ్చేటట్లు విగ్రహం చెప్పుకోవాలి. "అలంకారాశ్చ అలంకారాశ్చ అలంకారాః." దీనిలో ఒక 'అలంకారాః' అనేది భావప్రధాననిర్దేశం. అలంకారత్వము అని అర్థం. రెండవ 'అలంకారాః' అన్నదానికి అలంకారములు అని అర్థం. "అలంకారైః సహితాః సాలంకారాః."ఏకశేషవృత్త్యనుసారం లోపించిన అలంకారపదానికి అలంకారత్వం అని అర్థం గాన "సాలంకారాః" 'అలంకారత్వంతో కూడినవి' అని అర్థం. రెండవ అలంకారశబ్దార్థాన్ని పట్టి 'అలంకారాలతో కూడినవి' అని అర్థం. అలంకారత్వంతో కూడినవి సమాసోక్త్యాద్యలంకారా లని చెప్పబడే గుణీభూత వ్యంగ్యాలు. ఈ విధంగా ఈ కారికార్థానికి అలంకారరూపాలైన గుణీభూతధ్వనుల తోను ఉపమాదివాచ్యాలంకారాలతో కూడిన గుణీభూతధ్వనులతోను ధ్వనికి యోగం అనగా కలయిక, సంసృష్టిచేత గాని, త్రివిధసంకరంచేత గాని కలగగా అనంత భేదాలు ఏర్పడతాయి అని అర్థం.

తదితి– ఈ విషయాన్నే ధ్వనికారుడు చెప్పి ఉన్నాడు. "ఆ ధ్వని అలంకారాలతో కూడిన గుణీభూతవ్యంగ్యాలతోను, అలంకారాలతోకూడిన తన (ధ్వనికి సంబంధించిన) భేదాలతోను సంకరం కాని సంసృష్టిని గాని పొందడంచేత అనేక విధాలుగా ప్రకాశిస్తుంది."

కా. అన్యోన్యయోగాదేవం స్యాద్భేదసంఖ్యాతిభూయసీ. 47

వృ. ఏవమ్ అనేన ప్రకారేణ అవాన్తరభేదగణనేఽతిప్రభూత తరా గణనా. తథాహి శృఙ్గారస్యైవ భేదప్రభేదగణనాయామానన్త్యమ్. కా గణనా తు సర్వేషామ్.

వ్యా. ఏవమ్ = ఈ విధంగా, అన్యోన్యయోగాత్ = ధ్వనిభేదాలు, గుణీభూతధ్వనిభేదాలు పరస్పరం కలవడం వల్ల, అతిభూయసీ = చాల విస్తృతమైన, సంఖ్యా = సంఖ్య, స్యాత్ = అగును.

ఏవమ్ ఇతి- ఈ విధంగా అవాంతరభేదాలను లెక్కించిన ట్లయితే చాల పెద్ద సంఖ్య ఏర్పడుతుంది. ఎందుచేత ననగా- ఒక్క శృంగారరసాన్నే తీసి

కొని దాని భేదాలు, అవాంతరభేదాలు లెక్కపెడితే ఆ సంఖ్య అనంతంగా ఉంటుంది. ఇంక అన్నింటినీ తీసికొంటే ఇంక లెక్క ఏముంటుంది?

వి. ధ్వనిభేదాలు మొత్తం పదివేలనాలుగువందలయాభై అయిదు (10455) అని వెనకచెప్పబడింది. గుణీభూతవ్యంగ్యభేదాలు పై ధ్వనిభేదాలు కలిపితే మొత్తం ముప్పైనాలుగు కోట్ల ఆరు లక్షల ఇరవైమూడువేల తొమ్మిది వందల (340623900) భేదాలు అవుతాయని వ్యాఖ్యాతలు వ్రాసినారు. ఈ భేదగణన నిరుపయుక్తం అని వెనుక చూచి ఉన్నాం. అందుచేతనే పండితరాయలు ఈ లాంటివాటి జోలికి పోకుండా మొత్తం ధ్వనిభేదాలు ఇరవై ఆరు అని ప్రతిపాదించాడు. ఈ విషయం మమ్మటాదులకు తెలియ దని కాదు. కేవలం విషయప్రతిపాదనకుతూహలంచేతనే ఈ గణన చేశారు. అందుచేతనే "ధ్వనిని గూర్చి సంక్షిప్తంగా చెప్పాలంటే అది మూడు విధాలు" అని మమ్మటుడు అనుపదమే చెప్పనున్నాడు.

అవ. ఇంతవరకు ధ్వనింగుణీభూతధ్వనులను సోదాహరణంగా నిరూపించి "అసలు ధ్వని అనేదే లేదు; వ్యంజనావృత్తిని ఒక స్వతంత్రవృత్తిగా అంగీకరించవలసిన పని లేదు" అని వాదించేవాళ్ళ వాదనలు ఖండించడానికి ఉపక్రమిస్తున్నాడు—

వృ. సంకలనేన పునరస్య ధ్వనేః త్రయో భేదాః, వ్యఙ్గ్యస్య త్రిరూపత్వాత్. తథాహి—కించిద్వాచ్యతాం సహతే, కించిత్త్వన్యథా. తత్ర వాచ్యతాసహమవిచిత్రం విచిత్రం చేతి. అవిచిత్రం వస్తుమాత్రమ్; విచిత్రం త్వలంకారరూపమ్. యద్యపి ప్రాధాన్యేన తదలంకార్యం తథాపి బ్రాహ్మణశ్రమణన్యాయేన తథోచ్యతే. రసాదిలక్షణస్త్వర్థః స్వప్నేఽపి న వాచ్యః. స హి రసాదిశబ్దేన శృఙ్గారాదిశబ్దేన వాభిధీయేత; న చాభిధీయతే. తత్ప్రయోగేఽపి విభావాద్యప్రయోగే తస్యాప్రతిపత్తేః, తదప్రయోగేఽపి విభావాదిప్రయోగే తస్య ప్రతిపత్తేశ్చేత్యన్వయవ్యతిరేకాభ్యాం విభావాద్యభిధానద్వారేణైవ ప్రతీయతే ఇతి నిశ్చీయతే. తేనాసౌ వ్యఙ్గ్య ఏవ. ముఖ్యార్థబాధాద్యభావాన్న పునర్లక్షణీయః.

వ్యా. సంకలనేన ఇత్యాది :- సంగ్రహంచేత (సంకలనేన), అనగా సంక్షి

ష్టంగా చెప్పాలంటే,-వ్యంగ్యం మూడురకాలుగా ఉంటుంది. కాబట్టి ధ్వనికి మూడు భేదాలు. అది ఎట్లనగా (తథాహి) ఒక రకమైన వ్యంగ్యార్థం వాచ్యత్వాన్ని సహిస్తుంది. ఒక రకమైనది మరొకవిధంగా ఉంటుంది. అనగా ఒకరకమైనవ్యంగ్యార్థం (వస్త్వలంకారాదికం) వేరు మాటలలో వాచ్యంగా చెప్పడానికి శక్యం అవుతుంది; మరొక రకమైనది (రసాదికం) అలా శక్యం కాదు. వాచ్యత్వాన్ని సహించేది అవిచిత్రం, విచిత్రం అని రెండు విధాలు. కేవలవస్తురూపమైన అర్థం అవిచిత్రం; అలంకారరూపమైనది విచిత్రం. అలంకారం వ్యంగ్యం అయినప్పుడు దానికే ప్రాధాన్యం ఉండడంచేత నిజానికి అది అలంకార్యం (అలంకరించదగినది) అనే చెప్పాలి కాని అలంకారం అని చెప్పకూడదు; అయినా బ్రాహ్మణశ్రమణన్యాయం చేత దానిని ఆ విధంగా చెప్పడం జరుగుతుంది.

ఒక బ్రాహ్మణుడు బౌద్ధమతాన్ని స్వీకరించి శ్రమణుడు (బౌద్ధసంన్యాసి) అయ్యాడు. శ్రమణుడైన తరవాత అతడు బ్రాహ్మణుడు కాడు. అయినా అతనిని 'బ్రాహ్మణశ్రమణుడు' అంటారు. అదే విధంగా ఒకానొకప్పుడు అలంకారంగా ఉండడంచేత దానిని ఇప్పుడు కూడ, అనగా అలంకార్యమైన ధ్వని అయినా కూడ అలంకారం అని అనడం పరిపాటి అయినది అని అర్థం. ఈ విధంగా వస్త్వలంకారాలు వ్యంగ్యాలయినపుడు చమత్కారజనకంగా ఉన్నట్లే వాచ్యాలయినప్పుడు కూడ చమత్కారజనకాలే అని భావం.

రసాదిః ఇతి :- రసభావాదిరూపమైన అర్థం మాత్రం స్వప్నంలో కూడా వాచ్యం అవడానికి వీలులేదు. అది వాచ్యం కావాలంటే సాధారణమైన 'రసం' 'భావం' మొదలైన శబ్దాలచేతకాని,'శృంగారరసం' మొదలైన శబ్దాలచేత కాని చెప్పబడాలి, అలా చెప్పబడడంలేదు. ఆ శబ్దాలు ('రసం', 'శృంగారం' మొదలైన శబ్దాలు) ప్రయోగించినా విభావాదుల ప్రయోగం లేకపోతే రసాదిప్రతీతి కలగడం లేదు. ఆ శబ్దాలను ప్రయోగించకపోయినా విభావాదులను ప్రయోగిస్తే రసాది ప్రతీతి కలుగుతూన్నది. అందుచేత అన్వయవ్యతిరేకాలచేత విభావాదుల ప్రయోగం ద్వారా మాత్రమే రసాద్యర్థం ప్రతీయమానం అవుతుంది అని నిశ్చయం చేయవలసి ఉంది. అందుచేత ఇది వ్యంగ్యమే కాని వాచ్యం కాదు. ముఖ్యార్థబాధాదులు లేకపోవడంచేత లక్ష్యం కూడా కాదు.

౧. "తత్సత్త్వే తత్సత్త్వమ్ అన్వయః, తదభావే తదభావః వ్యతిరేకః"

"అది ఉన్నప్పుడు ఇది ఉంటుంది" అనేది అన్వయం. "అది లేకపోతే ఇది ఉండదు" అని వ్యతిరేకం. "విభావాదిప్రయోగం ఉంటే రసాదిప్రతీతి కలుగుతుంది" అనేది అన్వయం. "విభావాది ప్రయోగంలేకపోతే రసాదిప్రతీతి కలగదు" అనేది వ్యతిరేకం. ఈ అన్వయవ్యతిరేకాలచేత విభావాదిప్రయోగం రసాదిప్రతీతికి కారణం అని నిర్ణయించబడుతుంది. రెండువస్తువుల మధ్య కార్యకారణభావాన్ని నిర్ణయించడానికి ఈ అన్వయవ్యతిరేకాలను ఉపయోగిస్తారు. ముఖ్యార్థబాధాదులు లేకపోవడంచేత ఇక్కడ ప్రతీయమానమైన అర్థం లక్ష్యార్థం కాదు అనే విషయం ద్వితీయోల్లాసంలో పదిహేను, పదహారు కారికలలో ప్రతిపాదించబడింది.

వృ. అర్థాన్తరసంక్రమితాత్యన్తతిరస్కృతవాచ్యయోర్వస్తుమాత్రరూపం వ్యఙ్గ్యం వినా లక్షణైవ న భవతీతి ప్రాక్ ప్రతిపాదితమ్. శబ్దశక్తిమూలే తు అభిధాయా నియన్త్రితేన అనభిధేయస్య అర్థాన్తరస్య తేన సహోపమాదేరలంకారస్య చ నిర్వివాదం వ్యఙ్గ్యత్వమ్.

వ్యా. అర్థాన్తరేతి :- అర్థాంతరసంక్రమితవాచ్య-అత్యంతతిరస్కృతవాచ్య స్థలాలలో వస్తుమాత్రరూపమైన వ్యంగ్యం లేకపోతే లక్షణయే కుదరదు అని వెనక ప్రతిపాదించబడింది.

వి. 'త్వామస్మివచ్మి' ఇత్యాది అర్థాంతరసంక్రమితవాచ్యస్థలాలలోను, "ఉపకృతం బహు తత్ర" ఇత్యాది అత్యంతతిరస్కృతవాచ్యాలలోను ప్రయోజనరూపమైన వస్తువు వ్యంగ్యంగా ఉన్నది అని అంగీకరించకపోతే అక్కడ లక్షణయే కుదరదు. ఎందుచేత ననగా లక్షణాస్థలాలలో ప్రయోజనమేనా ఉండాలి, రూఢియేనా ఉండాలి. పై ఉదాహరణలలో రూఢి ప్రసక్తి లేదు. ఇంక ప్రయోజనం అంగీకరించాలి. ఆ ప్రయోజనమే వ్యంగ్యం. అందుచేత లక్షణామూలకధ్వని స్థలాలలో ధ్వనిని అంగీకరించి తీరాలని భావం.

శబ్దశక్తిమూలే ఇతి :- శబ్దశక్తి (అభిధామూలధ్వనిలో కూడా) అభిధ నియంత్రితం అయిపోవడంచేత వాచ్యం కాకపోయినా మరొక అర్థం స్ఫురిస్తున్నది. స్ఫురిస్తున్న ఆ అర్థంతో ఉపమాద్యలంకారం కూడా స్ఫురిస్తున్నది. అందుచేత ఆ అర్థాంతరమూ, ఉపమాద్యలంకారాలు వ్యంగ్యాలే అని చెప్పడంలో వివాదం లేదు.

వి. ఈ విషయం 'భద్రాత్మనః' (12వ శ్లోకం) 'ఉల్లాస్య' (54వ శ్లోకం) ఇత్యాద్యుదాహరణలు ద్వారా వెనక విశదీకరించబడింది. ఈ విధంగా రసాది ధ్వనులనే కాకుండా లక్షణామూలకాలైన అర్థాంతరసంక్రమిత-అత్యంతతిరస్కృత వాచ్యవస్తుధ్వనులనూ అభిధామూలకాలైన వస్త్వలంకారధ్వనులనుకూడ అంగీకరించవలసిఉన్నది అని భావం.

అవ. అభిహితాన్వయవాదుల మతంలో కూడా (అర్థశక్తిమూలధ్వనిస్థలాలలో) అర్థశక్తిమూలవస్త్వలంకారప్రతీతి వ్యంజనవల్లనే కలుగుతుంది కాని అభిధ చేత కాదు అని ప్రతిపాదిస్తున్నాడు—

వృ. అర్థశక్తిమూలేఽపి విశేషే సంకేతః కర్తుం న యుజ్యతే ఇతి సామాన్యరూపాణాం పదార్థానామాకాఙ్క్షాసంనిధియోగ్యతావశాత్పరస్పరసంసర్గో యత్రాపదార్థోఽపి విశేషరూపో వాక్యార్థః తత్రాభిహితాన్వయవాదే కా వార్తా వ్యఙ్గ్యస్యాభిధేయతాయామ్.

వ్యా. అర్థేతి :- అర్థశక్తిములధ్వనివిషయంలో కూడా (వ్యంగ్యార్థం వాచ్యం అవడానికి అవకాశం లేదు) వ్యక్తివిశేషంలో సంకేతం కుదరదు కాబట్టి జాతిరూపంలోనే గ్రహించబడిన పదార్థాల పరస్పరసంబంధం, పదార్థం (పదాల చేతబోధించబడే అర్థం) కాకపోయినా ఆకాంక్షా-సంనిధి-యోగ్యతల సహాయం చేత ఒక విశేషరూపమైన వాక్యార్థంగా (తాత్పర్యవృత్తి చేత) గ్రహించబడుతుంది అని చెప్పే అభిహితాన్వయవాదంలో వ్యంగ్యం అభిధేయం (వాచ్యం) అని చెప్పడానికి అవకాశం ఏమున్నది?

వి. అభిహితాన్వయవాదం ప్రకారం ఒక వాక్యంలోని పదాలు వినగానే (పదాలకు జాతియందే సంకేతం కాన) వాటి జాతిరూపాలైన అర్థాల స్మరణం కలుగుంది దీనితో అభిధాశక్తి పని పూర్తి అయిపోతుంది. ఆటుపిమ్మట ఆకాంక్షాదుల సహాయంచేత తాత్పర్యవృత్తి అనే వృత్తి ద్వారా పదార్థాల పరస్పర సంబంధం అవగతం అవుతుంది. అదే వాక్యార్థం. ఈ విధంగా వాక్యార్థమే వాళ్ళ మతం ప్రకారం వాచ్యం కాదు. అలాంటప్పుడు వాక్యార్థజ్ఞానానంతరం (తృతీయ కక్ష్యలో) తెలియబడే వ్యంగ్యార్థం వాచ్యం కాదు అని వేరే చెప్పాలా? అని భావం. అభిహితాన్వయవాద-అన్వితాభిధానవాదాల స్వరూపం తాత్పర్యార్థోఽపి

కేష చిత్"అనే ద్వితీయోల్లాసంలోని కారికాభాగం వ్యాఖ్యానంలో (6వ కారిక)విశ దీకరించబడింది.

అవ. అభిహితాన్వయవాదంలో వ్యంగ్యార్థం వాచ్యం అవడానికి వీలులేదు అని ప్రతిపాదించి ఇప్పుడు అన్వితాభిధానవాదంలో కూడా అంతే అని చెప్పబోతూ ముందు అన్వితాభిధాన వాదస్వరూపం విశదీకరిస్తున్నాడు_

వృ. యేఽప్యాహుః-

"శబ్దవృద్ధాభిధేయాంశ్చ ప్రత్యక్షేణాత్ర పశ్యతి
శ్రోతుశ్చ ప్రతిపన్నత్వమనుమానేన చేష్టయా 1
అన్యథానుపపత్త్యా తు బోధేశ్చక్తిం ద్వయాత్మికామ్
అర్థాపత్త్యావబోధేత సంబన్ధం త్రిప్రమాణకమ్" 2

ఇతి ప్రతిపాదితదిశా "దేవదత్తగామానయ" ఇత్యాద్యుత్తమవృద్ధవాక్య ప్రయోగాత్ దేశాద్దేశాన్తరం సాస్నాదిమన్తమర్థం మధ్యమవృద్ధే నయతి సతి "అనేన అస్మాద్వాక్యాత్ ఏవంవిధః అర్థః ప్రతిపన్న" ఇతి తచ్చే ష్టయా అనుమాయ తయోరఖణ్డవాక్యవాక్యార్థయోరర్థాపత్త్యా వాచ్య వాచకభావలక్షణం సంబన్ధమవధార్య బాలస్త్రత వ్యుత్పద్యతే. పరతః "చైత్ర! గామానయ, దేవదత్త! అశ్వమానయ, దేవదత్త! గాం నయ" ఇత్యాదివాక్యప్రయోగే తస్య తస్య శబ్దస్య తం తమర్థమవధారయతీతి అన్వ యవ్యతిరేకాభ్యాం ప్రవృత్తి నివృత్తికారి వాక్యమేవ ప్రయోగయోగ్యమితి వాక్యస్థితానామేవ పదానామ్ అన్వితైః పదార్థైః అన్వితానామేవ సంకేతో గృహ్యతే ఇతి విశిష్టాఏవ పదార్థాః వాక్యార్థః న తు పదార్థానాం వైశిష్ట్యమ్.

యద్యపి వాక్యాన్తరప్రయుజ్యమానాన్యపి ప్రత్యభిజ్ఞాప్రత్యయేన తాన్యేవైతాని పదాని నిశ్చీయన్తే ఇతి పదార్థాన్తరమాత్రేణ అన్వితః పదార్థః సంకేతగోచరః తథాపి సామాన్యావచ్ఛాదితో విశేషరూప ఏవాసౌ ప్రతిపద్యతే, వ్యతిషక్తానాం పదార్థానాం తథాభూతత్వాత్; ఇత్యన్వితాభి ధాయినః. తేషామపి మతే సామాన్యవిశేషరూపః పదార్థః సంకేతవిషయ.

ఇత్యతివిశేషభూతో వాక్యార్థాన్తర్గతః అసంకేతితత్వాదవాచ్య ఏవ యత్ర పదార్థః ప్రతిపద్యతే తత్ర దూరే అర్థాన్తరభూతస్య నిఃశేషచ్యుతేత్యాదౌ విద్యాదేశ్చరాచ్చ.

వ్యా. యే ఇతి :- 'యేఽపి' అనేదానికి 'అన్వితాభిధానవాదినః" అనే దూరంగా ఉన్న పదంతో సంబంధం. "యేఽపి అన్వితాభిధానవాదినః అహుః తేషామపి మతే దూరే అర్థాన్తరభూతస్య నిఃశేషచ్యుతేత్యాదౌ విద్యాదేశ్చరాచ్చ" అని అన్వయం. సాధారణంగా బాలుడు ఇతరుల వ్యవహారం చూచి భాష నేర్చుకుంటాడు. ముందు కొన్ని వాక్యాల అర్థం తెలుసుకొని తరవాత ఆ వాక్యంలో ఉన్న పదాల అర్థాలు తెలుసుకుంటాడు. ఏదైన ఒక పని చేయడానికి ప్రేరేపించేవాడు ఉత్తమవృద్ధుడు. అతడు చెప్పిన విధంగా చేసేవాడు మధ్యమవృద్ధుడు. ఉత్తమవృద్ధుడు పలికే మాట లన్నీ వింటూ, మధ్యమవృద్ధుడు చేసే పనులు చూస్తూ ఉండేవాడు బాలుడు. అన్వితాభిధానవాదులు ప్రాభాకరమీమాంసకులు. వాళ్ళ మతం సంక్షిప్తంగా ఈ ప్రాచీన కారికలలో చెప్పబడింది. బాలః అని అధ్యాహారం. బాలః = బాలుడు, అత్ర = వ్యుత్పత్తిసమయంలో, శబ్దవృద్ధాభిధేయాన్= ఉత్తమవృద్ధుడు ఉచ్చరిస్తూన్న 'గామ్ ఆనయ' ఇత్యాదిశబ్దాలను, ఉత్తమవృద్ధ-మధ్యమవృద్ధులను, గోవును తీసుకొని రావడం మొదలైన అర్థాలనూ, ప్రత్యక్షేణ = ప్రత్యక్షంచేత, పశ్యతి = గ్రహిస్తాడు. శబ్దం చెవులతో వింటాడు. మిగిలినవి కంటితో చూస్తాడు. అనుమానేన = అనుమానానికి సాధనమైన, చేష్టయా = చేష్టచేత, లేదా చేష్టయా అనుమానేన=చేష్టారూపమైన అనుమానసాధనంచెత, శ్రోతుః = శ్రోత అయిన మధ్యమవృద్ధునియొక్క, ప్రతిపన్నత్వమ్ = వాక్యార్థాన్ని తెలిసికొనడాన్ని, పశ్యతి = గ్రహిస్తాడు. ఉత్తమవృద్ధుని మాటలు వినగానే మధ్యమవృద్ధుడు ఆవును తీసికొనిరావడం మొదలైన పనులు చేయడాన్ని పట్టి "ఇతడు ఈ పనులు చేస్తున్నాడు కాబట్టి ఇతనికి ఆ వాక్యం అర్థం తెలిసింది" అని గ్రహిస్తాడు అని అర్థం. "అయమ్ ఏతచ్ఛబ్దజన్యైతదర్థగోచరజ్ఞానవాన్; ఏతచ్ఛబ్దశ్రవణానన్తరమ్ ఏతదర్థగోచరచేష్టావత్త్వాత్" అని అనుమానాకారం. అన్యథానుపపత్త్యా అర్థాపత్త్యా = అన్యథానుపపత్తిరూపమైన అర్థాపత్తిచేత, అర్థాపత్తిప్రమాణస్వరూపం ద్వితీయోల్లాసం పదవ కారిక వృత్తిలోను, తద్వ్యాఖ్యానంలోను వివరించబడింది. ద్వయాత్మికామ్, వాచకత్వం, వాచ్యత్వం అని రెండువిధాలైన, శక్తిమ్=సంకేతం

అని చెప్పబడే వాక్య-వాక్యార్థాల సంబంధాన్ని, బోధేత్ = తెలుసుకుంటాడు. త్రి ప్రమాణకమ్=ప్రత్యక్ష-అనుమాన-అర్థాపత్తు లనే మూడుప్రమాణాలు గల, సంబన్ధమ్ = సంకేతాన్ని, అవబోధేత = తెలుసుకుంటాడు.

వి. "'గామ్ ఆనయ' ఇత్యాది వాక్యాలకూ గోవును తీసికొనిరావడం అనే అర్థానికీ సంబంధం లేకపోతే ఆ వాక్యాన్ని వినగానే ఆ అర్థాన్ని గ్రహించడం ఉపపన్నం కాదు" అనేది అనుపపత్తిరూపమైన అర్థాపత్తి.

వ్యా. 'ఇతి ప్రతిపాదితదిశా' అనేదానికి 'అవధారయతి' అనే పదంతో అన్వయం. ఇట్లు ఈ కారికలలో చెప్పబడినరీతిచేత- "దేవదత్త గామ్ ఆనయ" (దేవదత్తా! ఆవును తీసికొనిరా) ఇత్యాదికమైన ఉత్తమవృద్ధుడు ప్రయోగించిన వాక్యాలవల్ల (వాక్యాలు విని) గంగడోలు మొదలైన అవయవాలున్న ఒక పదార్థాన్ని (ఆవును) మధ్యమవృద్ధుడు ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశం చేర్చడం చూచిన బాలుడు ఆతని చేష్టనుపట్టి "ఇతనికి ఈ వాక్యంవల్ల ఈ అర్థం తెలిసినది" అని ఊహించుకుంటాడు. అర్థాపత్తిప్రమాణంచేత అఖండంగా అనగా పదాలుగా విడగొట్టకుండగా, ఉన్న ఆ వాక్యానికీ, అఖండమైన వాక్యార్థానికీ సంబంధం ఉన్నదని నిశ్చయించుకుంటాడు. ఈవిధంగా బాలుడికి వ్యుత్పత్తి, వాక్యవాక్యార్థజ్ఞానం, కలుగుతుంది. తరవాత "చైత్ర గామానయ" (చైత్రుడా గోవును తీసికొనిరా) "దేవదత్త అశ్వమానయ"(దేవదత్తుడా గుఱ్ఱాన్ని తీసికొనిరా)"దేవదత్త గాం నయ" (దేవదత్తా గోవును తీసికొనివెళ్ళు) ఇత్యాదివాక్యాలను ప్రయోగించినప్పుడు (వాక్యాలలో ఉన్న) ఆ యా శబ్దాలకి ఆ యా అర్థాలను నిర్ణయించుకుంటాడు. (అనగా మొట్టమొదట వాక్యం అంతనీ ఒక్క సంఘాతంగా(unit) తీసికొని దాని మొత్తం అర్థం గ్రహిస్తాడు. తరవాత ఆవాపోద్వాపాలచేత కొత్త పదం చేర్చి ఉన్న పదం తీసేసి మరికొన్ని వాక్యాలు ప్రయోగించినప్పుడు వాక్యావయవాలైన పదాల అర్థం కూడా తెలిసికొంటాడు అని అర్థం). ఈ విధంగా అన్వయవ్యతిరేకాలచేత ప్రవృత్తిని కలిగించే (ఒకణ్ణి ఒక పనిచేయడానికి ప్రేరేపించే) వాక్యమే ప్రయోగానికి తగినది, (పదాలు కావు) అని తేలింది. అందుచేత వాక్యంలో ఉన్న పరస్పర సాకాంక్షాలైన (అన్వితానామేవ) పదాలకు పరస్పరం సంబంధించిన పదార్థాలతో సంకేతం గ్రహించబడుతుంది. ఈ విధంగా పరస్పరం (ఒకదానితో ఒకటి) కలిసిన పదార్థాలే వాక్యార్థం; అంతేనే కాని ముందు ఏ పదానికి ఆ పదం చొప్పున స్వతంత్రంగా గ్రహించబడిన పదార్థాలకు తరవాత పరస్పరం కలయిక కాదు.

vi. అన్వితాభిధానవాదసారాంశం ఏమిటనగా-

"శక్తిగ్రహం వ్యాకరణోపమానకోశాప్తవాక్యాద్వ్యవహారతశ్చ,
వాక్యస్య శేషాద్వివృతేర్వదన్తి సాంనిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః"

అని శక్తి (సంకేత) గ్రహణానికి వ్యాకరణాదులు ఉపయోగిస్తాయి అని చెప్పినా అన్నిటికంటె ప్రధానమైనది వ్యవహారం. మధ్యమవృద్ధుడు గోవును తీసికొని రావడం మొదలైన వ్యవహారం ఉత్తమవృద్ధుడు పలికిన 'గామానయ' ఇత్యాది వాక్యాలు విన్న తరవాతనే జరుగుతుంది, కేవలం 'గో' పదాన్ని వినడంవల్ల జరగదు. వాక్యంలో ఉన్న పదాల అర్థాలు తప్పనిసరిగా ఇతరపదాల అర్థాలతో సంబంధించే ఉంటాయి. ఉదాహరణకు "గామ్ ఆనయ" అన్నప్పుడు 'గో' పదార్థం ఆనయనంతో కలిసి గోచరిస్తూన్నది. "గామ్ రక్ష" అన్నప్పుడు రక్షణంతో కలిసి గోచరిస్తూన్నది. ఈ విధంగా వ్యవహారంవల్ల ఇతరపదార్థాన్విత పదార్థం విషయంలోనే సంకేతగ్రహణం కలుగుతున్నది. అందుచేత ఏతత్సాదృశ్యంచేత వ్యాకరణాదులద్వారా కూడా ఇతరపదార్థాన్వితమైన అర్థంలోనే శక్తిని చెప్పవలసి ఉంటుంది. వ్యవహారం కంటె ముందుగానే వ్యాకరణాదుల ద్వారా పదాలకి తమ తమ స్వతంత్రార్థంలో శక్తిగ్రహణం కలగవచ్చును అన డానికి వీలులేదు. అన్నిటికంటె ముందు వ్యవహారపరిశీలనవల్ల శబ్దాల జ్ఞానం కలిగినతరవాతనే కదా వ్యాకరణాదుల సాహాయ్యం కోసం వెళ్ళేది? ఈ విధంగా శక్తిగ్రహణం అన్వితమైన అర్థం విషయంలోనే జరుగుతుంది. అనగా పదార్థాల అన్వయం కూడా శక్తివల్లనే (అభిధావృత్తివల్లనే) జరుగుతుంది గాన అన్వయ జ్ఞానం కోసం తాత్పర్యవృత్తిని అంగీకరించవలసిన పని లేదు.

అవ. ఇక్కడ ఒక శంకకు అవకాశం ఉంది. 'గామ్ ఆనయ' అనే వాక్యంలో ఉన్న 'ఆనయ' అనే పదమే 'అశ్వమ్ ఆనయ' అనే వాక్యంలో ఉంది. అందుచేత రెండింటిలోనూ ఉన్న 'ఆనయ' పదం ఒక్కటే అని గ్రహించబడు తుంది ఈ విధంగా 'ఆనయ' అనేదానికి 'గవాన్వితానయనం' అని కాని 'అశ్వాన్వితానయనం' అని కాని అర్థం చెప్పకుండా సామాన్యరూపంలో 'ఇతరపదార్థాన్వితానయనం' అని మాత్రమే అర్థం చెప్పవలసి ఉంటుంది అందుచేత 'గామ్ ఆనయ' ఇత్యాదులలో 'గోవుతో అన్వయించిన' అనే విశేషరూపజ్ఞానం కలగడానికి తాత్పర్యవృత్తి అంగీకరించాలి కదా అని ప్రశ్న. గో శబ్దానికి గోత్వరూపజాతి

యందు శక్తి అంగీకరించడంచేత 'గౌః' అనగా 'గోత్వం' అని అర్థం చెప్పవలసి ఉన్నా 'గౌః ఆగచ్ఛతి' ఇత్యాదులలో 'గో'శబ్దం ఆక్షేపంచేత గోవ్యక్తిని బోధించినట్లు సామాన్యరూపేణ అన్వితార్థంలో శక్తిని అంగీకరించినా వాక్యాలలో పరస్పరం అన్వయించే పదార్థాలు విశేషరూపంలో ఉండడంచేత విశిష్టపదార్థాన్వయప్రతీతి కలుగుతుంది. దానికోసం తాత్పర్యవృత్తిని అంగీకరించవలసిన పనిలేదు అని సమాధానం. ఆ విషయమే చెపుతున్నాడు-

వ్యా. యద్యపీతి :- వాక్యాంతరాలలో ప్రయోగించబడినా ఈ పదాలు అవే అని ప్రత్యభిజ్ఞ ద్వారా (మునం వెనుక చూచినదే ఇది అనే జ్ఞానం ప్రత్యభిజ్ఞ) నిశ్చయించడం చేత (విశేషరూపంతో కాక)సామాన్యరూపంలో ఇతర పదార్థంతో అన్వయించిన పదార్థం సంకేతగోచరం అవుతుంది అనే మాట నిజమే; అయినా ఒక వాక్యంలో పరస్పరం అన్వితములై ఉన్న పదార్థాలు విశేషరూపంలోనే ఉంటాయి కాబట్టి ఈ సంకేతం విశేషగోచరంగానే ఉంటుంది అని అన్వితాభిధాన వాదులు అంటారు.

అవ. ఇప్పుడు పైన చెప్పిన అన్వితాభిధానవాదంలో కూడా వ్యంగ్యం వాచ్యం కాదు అని ప్రతిపాదిస్తున్నాడు-

వ్యా. తేషామపి ఇతి :- ఈ విధంగా చెప్పే అన్వితాభిధానవాదుల మతంలో కూడా సామాన్యవిశేషరూపః = అన్యపదార్థాన్వితానయనత్వాదిసాధారణ ధర్మంతో కూడిన గవానయనాదివిశేషరూపమైన పదార్థం సంకేతవిషయం. అందుచేత వాక్యార్థంలో, 'గామ్ ఆనయ' ఇత్యాదివాక్యార్థంలో, అతివిశేషరూపమైన గవాన్వితానయనాదికార్థంలో సంకేతం లేదు గాన అది వాచ్యం కాదు కదా; అలాంటప్పుడు "నిఃశ్శేషచ్యుతచన్దనమ్" ఇత్యాది శ్లోకాలలో వాచ్యార్థం కంటె భిన్నమైన అర్థాంతరం అయిన "అతని దగ్గఱకే వెళ్ళావు" ఇత్యాది విధిరూప వ్యంగ్యార్థం వాచ్యం అవుతుందనే చర్చ దూరాపాస్తం.

వి. మీమాంసకమతంలో పదానికి జాతియందు సంకేతం. 'గౌః' అనే పదానికి 'గోత్వం' అని అర్థం. అందుచేత 'గౌః ఆగచ్ఛతి, ఇత్యాదులలో 'గోత్వం వస్తున్నది' అని అర్థం చెప్పాలి. అది కుదరదు. గోత్వానికి ఆగమనం కుదరదు గాన 'గోవు' అనే వ్యక్తి ఆక్షేపలభ్యం అని వాళ్ళు అంగీకరించారు. అనగా ఇక్కడ 'గోత్వంతో కూడిన గోవు వస్తున్నది' అని చెప్పినా 'గోవు' అనే వ్యక్తి యందు పదానికి సంకేతం లేదు అదే విధంగా అన్వితాభిధానవాదుల ప్రకారం 'గవాన్వితానయనం, అశ్వాన్వితానయనం అని కాకుండా 'ఇతరపదార్థాన్వితా

నయనం' అని సంకేతగ్రహం ఉంటుంది అని చెప్పడంచేత విశేషరూపమైన గవా న్వితానయన-అశ్వాన్వితానయనాదులలో సంకేతం లేదని చెప్పినట్లయింది. విశేష రూపంలోనే సంకేతం లేనప్పుడు దానికంటె దూరమైన వ్యంగ్యార్థం విషయంలో సంకేతం ఎలా ఉంటుంది? సంకేతం లేనప్పుడు దీన్ని వాచ్యార్థం అని ఎలా అంటారు అని భావం. అందుచేత అన్వితాభిధానవాదుల మతం ప్రకారం కూడా వ్యంగ్యార్థం వాచ్యాంతర్గతం కాదు.

అవ. వాదిద్వయమతాలను ఒకే వాక్యంలో ఉపసంహరిస్తున్నాడు-

వృ. అనన్వితోఽర్థోభిహితాన్వయే పదార్థాన్తరమాత్రేణ అన్వితస్తు అన్వితాభిధానే; అన్వితవిశేషస్తు అవాచ్య ఏవ ఇత్యుభయనయేఽప్య పదార్థ ఏవ వాక్యార్థః.

వ్యా. అభిహితాన్వయవాదంలో (పదాలచేత) ఇతరపదార్థాలతో అన్వయిం చని అర్థమే బోధించబడుతుంది. అభిహితాన్వయవాదంలో అన్యపదార్థమాత్రా న్వితమైన అర్థం బోధింపడుతుంది. అన్వితవిశేషం మాత్రం (గవాన్వితానయ నాది రూప మైనది.) వాచ్యం కాదు. అందుచేత ఈ రెండు వాదాలను అనుసరించి కూడ వాక్యార్థం పదావాచ్యమే.

అవ. వ్యంగ్యప్రతీతి నైమిత్తకం; అనగా ఏదో నిమిత్తాన్ని పట్టి కలిగేది. ఇక్కడ మరొకనిమిత్తం ఏదీ కనబడడంలేదు గాన శబ్దమే నిమిత్తం అని అంగీక రించాలి. ఈ నిమిత్తత్వం బోధ్యబోధకభావరూపమైనది. అర్థం బోధ్యం శబ్దం బోధకం. అయితే ఈ విధమైన నిమిత్తత్వం వృత్తి లేకుండ కుదరదు. అందుచేత ఆ వృత్తి అభిధయే అని చెప్పాలి. అనగా అభిధావృత్తిచేతనే శబ్దం వ్యంగ్యార్థాన్ని బోధిస్తూన్న దని చెప్పాలి అని వాదించే కొందరు మీమాంసకుల మతాన్ని ఖండి స్తున్నాడు-

వృ. యదప్యుచ్యతే "నైమిత్తికానుసారేణ నిమిత్తాని కల్ప్యన్తే" ఇతి- తత్ర నిమిత్తత్వం కారకత్వం జ్ఞాపకత్వం వా? శబ్దస్య ప్రకాశ కత్వాన్న కారకత్వమ్. జ్ఞాపకత్వం తు అజ్ఞాతస్య కథం? జ్ఞాతత్వం చ సంకేతేనైవ; స చాన్వితమాత్రే. ఏవం చ నిమిత్తస్య నియతనిమిత్త

త్వం యావన్న నిశ్చితం తావన్నైమిత్తికస్య ప్రతీతిరేవ కథమ్? ఇతి "నైమిత్తికానుసారేణ నిమిత్తాని కల్ప్యన్తే" ఇతి అవిచారితాభిధానమ్.

వ్యా. "నైమిత్తికాన్ని పట్టి నిమిత్తాలు కల్పింపబడతాయి" అని కొందరు అంటున్నారు. అయితే నిమిత్తత్వం కారకత్వమా (లేనిదాన్ని పుట్టించడమా) లేక జ్ఞాపకత్వమా? ఉన్నదాన్ని తెలిసేటట్లు చేయడమా (గుర్తుచేయడమా)? శబ్దం ప్రకాశకమే (ఉన్నదాన్ని ప్రకాశింపచేసేదే) కాబట్టి దానికి కారకత్వం కుదరదు. అజ్ఞాతమైన దానిని, అసలే తెలియని దానిని, గుర్తుచేయడం ఎలా కుదురుతుంది. జ్ఞాతత్వం (అసలంటూ ముందు తెలియడం) సంకేతంచేతనే. ఆ సంకేతం (మీ మతం ప్రకారం) అన్వితమాత్రం విషయంలోనే (విశేషరూపేణ కాక సామాన్య రూపేణ అన్వితమైనదాని విషయంలోనే). అందుచేత నిమిత్తానికి (శబ్దానికి) నియతనిమిత్తత్వం అనగా విశేషసంకేతం లేనంతవరకు వ్యంగ్యప్రతీతి ఆ శబ్దం వల్ల ఎలా కలుగుతుంది; అందుచేత "నైమిత్తికానుసారేణ నిమిత్తాని కల్ప్యన్తే" అనే మాట ఆలోచించకుండా చెప్పిన మాట.

వి. "వాక్యం వినగానే వాచ్యార్థాదులతో పాటు వ్యంగ్యార్థం కూడా స్ఫురిస్తున్నది. ఆ వ్యంగ్యార్థప్రతీతికి కారణం ఇక్కడ శబ్దం తప్ప మరేదీ కనబడడం లేదు. అందుచేత నైమిత్తికమైన వ్యంగ్యార్థాన్ని బోధించడానికి కూడా శబ్దమే నిమిత్తం అని కల్పించుకోవాలి. శబ్దానికి అభిధావృత్తి అనేది ఒకటి ప్రసిద్ధంగా ఉండనే ఉంది. అందుచేత ఆ అభిధావృత్తిచేతనే శబ్దం నీవు వ్యంగ్యం అనే అర్థాన్ని కూడా బోధిస్తుంది అని అంగీకరించవచ్చు కదా?" అనేది పూర్వపక్షం. నిజమే ఇక్కడ శబ్దం తప్ప మరేమీ లేదు. కారకత్వం కుదరదు కాబట్టి శబ్దం జ్ఞాపకం అని చెప్పాలి. ఈ శబ్దానికీ ఆ అర్థానికీ సంబంధం ఉన్నట్లు ముందు తెలిసి ఉంటేనే కదా ఈ శబ్దం ఆ అర్థాన్ని తెలపాలి(జ్ఞాపకం కావాలి)? ఈనిమిత్తానికి (శబ్దానికి) ఆ అర్థంతో విశేషసంకేతం ఉన్నది అని తెలిసిన వాచ్యార్థాదుల విషయంలో బాధ ఏమీలేదు. దేన్ని మనం వ్యంగ్యార్థం అంటున్నామో అది పూర్వం ఉన్నది కాదు. ఆ అర్థాన్ని బోధించడానికి శబ్దానికి సంకేతం గ్రహించబడలేదు. సంకేతం లేదు కూడా. అందుచేత వ్యంగ్యార్థం కూడా శబ్దంచేతనే (అభిధ ద్వారా) బోధించబడుతుంది; అందుచేత అది కూడా వాచ్యమే అనడం సరి కాదు.

అయితే వ్యంగ్యార్థప్రతీతికి శబ్దం కారణం కాదా అనే ప్రశ్న ఉదయిస్తుంది. శబ్దం కారణమే; అనగా జ్ఞాపకమే. అయితే ఏదో ఒక వ్యాపారం ద్వారా మాత్రమే అది జ్ఞాపకం అవుతుంది. అభిధావ్యాపారం ద్వారా అది ఏ విధంగా వాచ్యార్థజ్ఞాపకమో, లక్షణ ద్వారా ఏ విధంగా లక్ష్యార్థజ్ఞాపకమో అదే విధంగా మరొక వ్యాపారం ద్వారా వ్యంగ్యార్థజ్ఞాపకం కావాలి. అందుకు అభిధా-లక్షణా వ్యాపారాలు సరిపోవు. వ్యంజన అనే వ్యాపారం అంగీకరించాలి. వ్యాపారాపేక్ష లేకుండానే అది జ్ఞాపకం అవుతుంది అని అంటే అప్పుడు అభిధాలక్షణలు కూడా విడిచివేయవలసివస్తుంది. ఇది ఈ ప్రఘట్టకానికి తాత్పర్యం.

అవ. భట్టమతానుయాయులైన భట్టలోల్లటాదుల పక్షాన్ని ఆశంకిస్తున్నాడు-

వృ. యే త్వభిదధతి- "సోయమిషోరివ దీర్ఘ దీర్ఘతరో వ్యాపారః" ఇతి, "యత్పరః శబ్దః స శబ్దార్థః" ఇతి చ విధిరేవాత్ర వాచ్య ఇతి తేఽప్యతాత్పర్యజ్ఞాః తాత్పర్యవాచోయుక్తేః దేవానాంప్రియాః. తథా హి- "భూతభవ్యసముచ్చారణే భూతం భవ్యాయోపదిశ్యతే" ఇతి కారక పదార్థాః క్రియాపదార్థేనాన్వీయమానాః ప్రధానక్రియానిర్వర్తకస్వక్రియాభిసంబన్ధాత్ సాధ్యాయమానతాం ప్రాప్నువన్తి;తతశ్చాదగ్ధదహనన్యాయేన యావదప్రాప్తం తావద్విధీయతే. యథా ఋత్విక్ప్రచరణే ప్రమాణాన్తరాత్ సిద్ధే "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరన్తి" ఇత్యత్ర లోహితోష్ణీషత్వమాత్రం విధేయమ్. హవనస్యాన్యతః సిద్ధేః. "దధ్నా జుహోతి" ఇత్యాదౌ దధ్యాదేః కరణత్వమాత్రం విధేయమ్. క్వచిదుభయవిధిః క్వచిత్త్రివిధిరపి. యథా- 'రక్తం పటం వయ' ఇత్యాదౌ ఏకవిధిః ద్వివిధిః, త్రివిధిర్వా. తతశ్చ 'యదేవ విధేయం తత్రైవ తాత్పర్యమ్" ఇత్యుపాత్తస్యైవ శబ్దస్యార్థే తాత్పర్యం న తు ప్రతీతమాత్రే, ఏవం హి 'పూర్వో ధావతి' ఇత్యాదౌ అపరాద్యర్థేఽపి క్వచిత్తాత్పర్యం స్యాత్.

వ్యా. కొందరు "ఈ వ్యాపారం, అనగా అభిధారూపమైన వ్యాపారం బాణం యొక్క వ్యాపారం వలె చాల దీర్ఘమైనది" అనీ "శబ్దం యత్పరమో (దేనికై ఉద్దేశింపబడినదో) అదే ఆ శబ్దానికి అర్థం" అనీ అంటూ 'నిశ్శేషచ్యుతచన్దనమ్'

ఇత్యాది శ్లోకాలలో విధి వాచ్యమే అని అంటున్నారు. ఈ దేవానాంప్రియులకు (తెలివితక్కువవాళ్ళకు) తాత్పర్యం అంటే ఏమో తెలియదు.

వి. 'నిఃశేషచ్యుతచన్దనమ్' ఇత్యాదులలో నువ్వు చెప్పినట్లు విధిరూపార్థం (నాయకుడి దగ్గరికి వెళ్ళడం అనే అర్థం) వ్యంగ్యం కావలసిన పని లేదు. ఎందు చేత ననగా శబ్దానికి ఉన్న అభిధావ్యాపారానికే చాల లోతు అర్థాలలోకి వెళ్ళగల శక్తి ఉంది. ఉదాహరణకి ఒక యోధుడు శత్రువుమీదికి ప్రయోగించిన బాణం ఆతని కవచాన్ని, లోపలఉన్నవస్త్రాన్ని, చర్మను, మాంసాన్ని అన్నింటినీ కూడా ఒకే ప్రయత్నంలో చీల్చుకుంటూ ఏ విధంగా లోపలికి పోతుందో అదే విధంగా అభిధావ్యాపారమే లోలోని అర్థాలలోకి చొచ్చుకొని వెళ్ళి వాటినన్నింటినీ వరసగా బోధిస్తుంది. మరొక విషయం ఏమిటనగా- "ఒక శబ్దాన్ని ఏ అర్థం బోధించడానికై ఉచ్చరించారో అనగా ఏ తాత్పర్యంతో ఉచ్చరించారో అది ఆ పదానికి అర్థం" అని శాస్త్రకారులు అంటారు. 'న గతా' అన్న శబ్దాన్ని 'గతా'అనే అర్థంతో ప్రయోగించడం జరిగింది. అందుచేత ఆ అర్థం ఈ శబ్దానికి వాచ్యార్థమే అని చెప్పాలి అని పూర్వపక్షుల అభిప్రాయం. అది ఖండిస్తూ మమ్మటుడు "పాపం! వీళ్ళకు తాత్పర్యం అనే మాటకు అర్థం తెలియక అలా వాదిస్తున్నారు" అంటాడు.

ఒక వాక్యంలో రెండు అంశాలు ఉంటాయి. ఒకటి ఉద్దేశ్యం, రెండవది విధేయం. ఇతర ప్రమాణాదుల ద్వారా ఈ వాక్యం చెప్పకముందే తెలిసిన అంశం ఉద్దేశ్యం. ఆ అంశాన్ని ఉద్దేశించి ఈ వాక్యంలో కొత్తగా చెప్పబడేది విధేయం. అంతకుముందు తెలియని కొత్త విషయం అయిన విధేయాన్ని చెప్పడంకోసమే ఈ వాక్యం ప్రవర్తిస్తుంది. అందుచేత ఆ విధేయాంశప్రతిపాదనలోనే వాక్యానికి తాత్పర్యం అంటాం. "యత్పర" ఇత్యాదిశాస్త్రీయవాక్యంలో తాత్పర్యం అంటే అర్థం ఇది. అంతే కాని ఒక వక్త దేనిని చెపుదాం అనుకున్నాడో అది తాత్పర్యం అని కాదు. ఈ విషయాన్నే పూర్వమీమాంసకు సంబంధించిన కొన్ని ఉదాహరణలు చూపి విశదీకరిస్తున్నాడు-

వ్యా. తథాహి :- అది యుక్తమే కదా! (ఎందుచేత ననగా)- "భూతాన్ని భవ్యాన్ని కలిపి ఉచ్చరించినప్పుడు భూతం భవ్యంకోసం ఉపదేశించబడుతుంది" అని ఒక శాస్త్రీయ న్యాయం. భూతం అనగా సిద్ధంగా ఉన్నది. భవ్యం అనగా

సాధించతగినది. ఈ రెంటింటినీ కలిపి చెప్పినప్పుడు సిద్ధం సాధ్యానికి ఉపకరించడంకోసం చెప్పబడింది అని గ్రహించాలి. ఉదాహరణకి 'దణ్డేన గామ్ ఆనయ' అనే వాక్యం ఉంది. "కఱ్ఱతో (తోలుతూ) ఎద్దును తీసికొని రమ్ము" అని దీని అర్థం. ఇక్కడ కరణకారకం అయిన దండం, కర్మకారకం అయిన ఎద్దు ఈ రెండూ కూడా సిద్ధపదార్థాలు. ఈ వాక్యం చెప్పడానికి ముందే ఉన్నాయి; శ్రోతకు కూడా తెలిసినవే. ఆనయనం మాత్రం సాధ్యం. ఇప్పుడు సాధించవలసిన (చేయవలసిన) పని. ఇక్కడ సిద్ధపదార్థాలైన దండాన్ని గోవునీ కూడా ఆనయనక్రియలో ఉపకరించడంకోసమే చెప్పడం జరిగింది అయితే సిద్ధమైనవి సాధ్యానికోసం ఉపకరిస్తూ తమ తమ క్రియలలో సంబంధిస్తూంటాయి. పైన చెప్పిన దండం, ఎద్దూ ఈ రెండూ ఆనయనక్రియకి ఉపకరిస్తూ ఎద్దు కాలు తీసి కాలు వేయడం అనే క్రియతోనూ, కఱ్ఱ పైకి లేవడం ఎద్దు వీపుమీద పడడం అనే క్రియతోనూ సంబంధిస్తూ ఉంటాయి. ఆ విధంగా తమ తమ క్రియలతో సంబంధించడంచేత అవి కూడా సాధ్యాలవలె కనబడతాయి. ఈ విషయాన్నే "భూతభవ్యసముచ్చారణే" మొదలు "ప్రాప్నువన్తి" అనే వాక్యం ప్రతిపాదిస్తూన్నది. "భూతభవ్యసముచ్చారణే" ఇత్యాది న్యాయంచేత కారకపదార్థాలు క్రియాపదార్థంతో అన్వయిస్తూ ప్రధానక్రియను (ఇక్కడ ఆనయనక్రియను) సంపాదించే తమ తమ క్రియలతో సంబంధంవల్ల సాధ్యాల వలె అవుతాయి" అని ఈ వాక్యానికి అర్థం.

తతశ్చ ఇతి :- పైన చెప్పిన న్యాయాన్ని అనుసరించి ఏది అప్రాప్తమో, అనగా అంతవరకు తెలియనిదో, అదే, అదగ్ధదహనన్యాయం చేత విధింపబడుతుంది.

వి. అదగ్ధదహనన్యాయం అనగా అంతకు పూర్వమే కాలిపోయి బూడిద అయిపోయిన గడ్డి మొదలైనవీ, కాలని గడ్డిమొదలైనవీ ఉన్నప్పుడు నిప్పు అంతకు ముందు కాలిపోయినవాటిని కాల్చదు; కాలనివాటినే కాలుస్తుంది. అదే విధంగా వాక్యంలో తెలిసిన అంశాలు తెలియని అంశాలు ఉన్నప్పుడు ఆ వాక్యం తెలియని అంశాలనే విధిస్తుంది అని అర్థం. దీనికి పూర్వమీమాంసకు సంబంధించిన రెండు ఉదాహరణలు చూపుతున్నాడు.

వ్యా. యథా ఇతి :- ఋత్విక్ప్రచరణం ప్రమాణాంతరంచేత సిద్ధించి ఉండగా "లోహితోష్ణీషాః ఋత్విజః ప్రచరన్తి" అనే వాక్యం చేత లోహితోష్ణీ

షత్వమాత్రమే విధేయం. హవనం మరొక ప్రమాణంవల్ల సిద్ధించి ఉండగా "దధ్నా జుహోతి" ఇత్యాదులలో దధ్యాదులకు కరణత్వం మాత్రం విధించబడు తున్నది.

vi. జ్యోతిష్టోమయాగం అనే యాగం ఉంది. దానికి సంబంధించిన విధానా లన్నీ చెప్పబడ్డాయి. మరొక యాగం శ్యేనయాగం ఉంది. "శ్యేనయాగం జ్యోతిష్టోమయాగం వలెనే చెయ్యాలి"అని చెప్పడంచేత జ్యోతిష్టోమయాగానికి సంబంధించిన విధానమే చాలా వరకు దీనిలో కూడా ఉంటుంది. కొన్ని మార్పులు ఉంటే వాటిని మాత్రం చెప్పడం జరుగుతుంది. ఈ విధంగా సాంగోపాంగంగా చెప్పబడిన యాగానికి 'ప్రకృతియాగం' అనీ, కొన్ని అంగాలు చెప్పి మిగిలనవి ఆ యాగంలో లాగ చూచుకోవాలి అని చెప్పిన యాగానికి 'వికృతియాగం' అనీ పేర్లు. ప్రస్తుతంలో జ్యోతిష్టోమం ప్రకృతియాగం, శ్యేనయాగం వికృతియాగం. "ప్రకృతివద్వికృతిః కర్తవ్యా"(వికృతి యాగాన్ని ప్రకృతియాగంవలెనే చెయ్యాలి) అనే నియమంచేత ప్రకృతియాగానికి సంబంధించిన అంగాలన్నీ వికృతియాగం లోనికి వచ్చేస్తాయి. జ్యోతిష్టోమయాగంలో "సోష్ణీషాః వినీతవసనాః ఋత్విజః ప్రచరన్తి' (ఋత్విక్కులు తలపాగాలు ధరించి, వస్త్రాలు బాగా బిగించి కట్టు కొని తమ పనులు చెయ్యాలి) అనే వాక్యంచేత ఋత్విక్కులు ఉష్ణీషాలు (తల పాగాలు) ధరించాలి అని విధించబడింది. ప్రకృతియాగంలో ఉన్న ఈ ఋత్వి గుష్ణీషధారణం పైన చెప్పిన 'ప్రకృతివద్వికృతిః కర్తవ్యా'అనే వాక్యాన్ని పట్టి వికృతియాగం అయిన శ్యేనయాగంలోకి కూడా వచ్చేస్తుంది. మళ్ళీ విధించ వలసిన పని లేదు. శ్యేనయాగంలో "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరన్తి"అనే వాక్యం ఉంది. "ఋత్విక్కులు ఎఱ్ఱని ఉష్ణీషాలు ధరించి తమ విధులు చెయ్యాలి" అని దీని అర్థం. అయితే ఈ యాగంలో ఉష్ణీషాలను విధించవలసిన పని లేదు. ప్రకృతియాగంలోనుండే అవి లభిస్తున్నాయి. అందుచేత ఇక్కడ ఉష్ణీషాల లోహితత్వం మాత్రమే విధింపబడుతున్నది. అందుచేత ఈ వాక్యానికి లోహి తత్వవిధిలోనే తాత్పర్యం. అనగా ఋత్విక్కులు, వాళ్ళకి ఉష్ణీషాలూ, ముందు గానే ఉన్నవే. అందుచేత అవి ఉద్దేశ్యాలు. లేనిది లోహితత్వం; అది విధేయం.

అదే విధంగా 'అగ్నిహోత్రం జుహోతి' (అగ్నిహోత్రం హోమం చెయ్యాలి) అనే వాక్యంచేత అగ్నిహోత్రం అనే హోమం విధించబడింది. దాని తరవాత

"దధ్నా జుహోతి" (పెరుగుతో హోమం చెయ్యాలి) అనే వాక్యం హోమంలో కరణంగా (సాధనంగా) దధిని మాత్రమే విధిస్తూన్నది. హోమం పైన ఉదాహరించిన వాక్యంచేతనే లభిస్తూన్నది కాబట్టి అది అనువాద్యం మాత్రమే. విధేయం కాదు. విధేయం కరణమైన దధియే. అందుచేత ఈ వాక్యానికి దధికరణత్వ విధానంలోనే తాత్పర్యం కాని హోమవిధానంలో కాదు.

మూలంలో "దధ్యాదేః కరణత్వమాత్రం విధీయతే"అని ఉండడంచేత కొందరు వ్యాఖ్యాతలు దధి కూడా ఆక్షేపంచేతనే లభిస్తూన్నది, అందుచేత కేవలం కరణత్వం మాత్రమే విధేయం అని (బాలబోధిని పేజి 227) వ్రాశారు. కాని దధి ఆక్షేపలభ్యం అని మీమాంసకు లెవరూ వ్రాసినట్లు కనబడదు. అది ఆక్షేపలభ్యం అయితే హోమకరణంగానే ఆక్షేపలభ్యం అవుతుంది గాని కారకత్వ రహితంగా కాదు. అందుచేత ఈ వ్యాఖ్యానం చింత్యమే. అందుచేత దధ్యాదేః కరణత్వమాత్రం' అనగా దధికరణత్వం మాత్రం, అనగా కరణమైన దధిమాత్రం అని అర్థం చెప్పుకొని సరిపెట్టుకోవాలి. నిజానికి మమ్మటుడు వ్రాసిన 'లోహితోష్ణీషత్వమాత్రం' అనేది కూడా సరికాదు. ఉష్ణీషం ప్రకృతియాగప్రాప్తమే కదా ? అందుచేత 'ఉష్ణీషలోహితత్వం'అని అర్థం చెప్పుకున్నాం.

వ్యా. క్వచిదితి :- కొన్ని చోట్ల రెండింటి విధి, కొన్ని చోట్ల మూడింటి విధి కూడా ఉండవచ్చు, ఎట్లనగా - 'రక్తం పటం వయ' (ఎఱ్ఱని బట్ట నేయుము) ఇత్యాదివాక్యాలలో ఏకవిధి కావచ్చు, ద్వివిధి కావచ్చు, త్రివిధి కావచ్చు

వి. 'ఎఱ్ఱని బట్ట నేయుము' ('రక్తం పటం వయ') అన్నచోట వస్త్రం నేయాలి అని ముందుగానే తెలిసి ఉన్న పక్షంలో "నీవు నేయవలసిన ఏ వస్త్రం ఉందో దానిని ఎఱ్ఱగా ఉన్నదానిని నెయ్యి"అని అర్థం. అప్పుడు రక్తత్వం ఒక్కటే విధేయం. ఏదో నేయాలని ముందుగానే తెలిసి ఉంటే 'ఎఱ్ఱని వస్త్రం నెయ్యాలి' అని చెప్పినప్పుడు వస్త్రానికీ, రక్తత్వానికి విధేయత్వం. ముందు ఏమీ అనుకోకుండా ఒకని దగ్గరకు వెళ్ళి "రక్తం పటం వయ" అన్నట్లయితే వయనమూ, వస్త్రమూ, దానిరక్తత్వమూ మూడు కూడా విధేయాలే.

తతశ్చేతి :- అందువల్ల ఏది విధేయమో దానియందే తాత్పర్యం అని తేలింది అందుచేత ఉచ్చరించబడిన శబ్దానికి (విధేయమైన) వాచ్యార్థమునందే తాత్పర్యం అని చెప్పాలి కాని ఆ శబ్దం వినడంవల్ల ప్రతీతిగోచరాలైన అన్ని

అర్థాలలోనూ తాత్పర్యం అని చెప్పకూడదు. అలా చెప్పే పక్షంలో "పూర్వః ధావతి" (ముందువాడు లేదా తూర్పున ఉన్నవాడు పరుగెత్తుచున్నాడు) అన్నప్పుడు అపరాద్యర్థంలో కూడా ఒకప్పుడు తాత్పర్యం అని చెప్పవలసివస్తుంది.

వి 'పూర్వ, శబ్దం సాపేక్షశబ్దం. ఎవరికంటె పూర్వుడు ? అపరునికంటె పూర్వుడు. అందుచేత "పూర్వః"అనే మాట విన్నప్పుడు అపర అనే అర్థం కూడా స్ఫురించవచ్చు. స్ఫురించిన దల్లా తాత్పర్యవిషయం అంటే 'పూర్వః ధావతి' అనేదాని తాత్పర్యం 'అపరః ధావతి' (తరువాతివాడు, లేదా పశ్చిమాన ఉన్నవాడు పరుగెత్తుచున్నాడు) అని చెప్పడానికి కూడా అవకాశం వస్తుంది.

అందుచేత తాత్పర్యం అనేది ఏ శబ్దాలు ఉచ్చరించబడ్డాయో వాటి వాచ్యార్థం విషయంలోనే; అందులోనూ ఏది విధేయమో ఆ అర్థం విషయంలోనే. వ్యంగ్యార్థం తాత్పర్యవిషయం అనడానికి వీలు లేదు అని భావం.

అవ. తాత్పర్యం అనేది ప్రయోగించిన శబ్దం యొక్క అర్థం విషయంలోనే అని పైన చెప్పిన నియమానికి వ్యభిచారం శంకిస్తున్నాడు -

వృ. యత్తు "విషం భక్షయ, మా చాస్య గృహే భుఙ్థాః ? ఇత్యత్ర 'ఏతద్గృహే న భోక్తవ్యమ్' ఇత్యత్ర తాత్పర్యమితి స ఏవ వాక్యార్థః ఇతి; ఉచ్యతే. తత్ర చకార ఏకవాక్యతాసూచనార్థః; న చాఖ్యాతవాక్యయోర్ద్వయోరఙ్గాఙ్గిభావ ఇతి విషభక్షణవాక్యస్య సుహృద్వాక్యత్వేనాఙ్గతా కల్పనీయా ఇతి 'విషభక్షణాదపి దుష్టమేతద్గృహే భోజనమితి సర్వథా మాస్య గృహే భుఙ్థాః' ఇతి ఉపాత్తశబ్దార్థే ఏవ తాత్పర్యమ్.

వ్యా. 'విషం తిను; ఇతని ఇంట్లో భుజించవద్దు' అనే వాక్యంలో 'విషం భక్షయ' అనే వాక్యానికి 'వీని ఇంట్లో భోజనం చేయవద్దు' అనే అర్థంలో తాత్పర్యం. అందుచేత అదే 'విషం భక్షయ' అనే వాక్యానికి అర్థం. అనగా ప్రయోగించిన శబ్దంయొక్క అర్థంకంటె భిన్నమైనదానియందు తాత్పర్యం. అందుచేత పైన నువ్వు చెప్పిన నియమానికి ఇక్కడ వ్యభిచారం కదా అని పూర్వపక్షి అభిప్రాయం. 'ఉచ్యతే' ఇత్యాది వాక్యతో సమాధానం చెపుతున్నాడు.

దీనికి సమాధానం ఏమనగా - ఇక్కడ ఉన్న 'చ' కారం 'విషం భక్షయ' 'అస్య గృహే మా భుఙ్థాః' అనే రెండు వాక్యాలకు ఏకవాక్యత్వాన్ని సూచించడం కోసం ప్రయోగించబడింది. రెండు క్రియాపదా లున్న రెండు స్వతంత్ర వాక్యాలకి అంగాంగిభావం కుదరదు. అనగా రెండు వాక్యాలూ సమప్రాధాన్యం కలవే గాన ఒకటి రెండవదానికి అంగం అవడం ఉండదు. కాని 'విషం తినుము' అనే మాట స్నేహితుడు పలికినది. అందుచేత స్నేహితుడైనవాడు ఎవడూ విషం తిన మని చెప్పడు. అందుచేత 'అస్య గృహే మా భుఙ్థాః' అనే వాక్యానికి అంగం అయేటట్లుగా ఈ వాక్యానికి అర్థం కల్పించాలి. ఈ వాక్యార్థం ఆ వాక్యార్థంలో కర్మగా గాని, కరణంగా గాని మరొక కారకంగా గాని అంగం అయే ప్రసక్తిలేదు. అందుచేత, 'విషం తిను' అనే ముఖ్యార్థం బాధితం అయింది గాన దీనికి "వీని ఇంట్లో భోజనం చెయ్యడం విషభక్షణంకంటె కూడా దుష్టమైనది" అని లక్షణచేత అర్థం చెప్పుకోవాలి. ఈ వాక్యార్థానికి అందువలన 'ఎట్టి పరిస్థితులలోను వీని ఇంట్లో భోజనం చేయకుము' అనే వాక్యార్థంతో హేతువుగా అన్వయం కుదురుతుంది. ఈ విధంగా 'తాత్పర్యం అనేది వాక్యంలో ఉన్న శబ్దాలచేత బోధింపబడే అర్థమునందే' అనే నియమానికి భంగం లేదు. అందుచేత 'యత్పరః శబ్దః స శబ్దార్థః' అనేది అజ్ఞానంచేత చెప్పినదే అని భావం.

అవ. 'సోఽయమిషోరివ దీర్ఘదీర్ఘతరో వ్యాపారః' అని చెప్పినదానిని ఖండిస్తున్నాడు :

వృ. యది శబ్దశ్రుతేరనన్తరం యావానర్థో లభ్యతే తావతి శబ్దస్యాభిధైవ వ్యాపారః తతః కథం 'బ్రాహ్మణ పుత్రస్తే జాతః;' 'బ్రాహ్మణ కన్యా తే గర్భిణీ' ఇత్యాదౌ హర్షశోకాదీనామపి న వాచ్యత్వమ్ ? కస్మాచ్చ లక్షణా ? లక్షణీయేఽప్యర్థే దీర్ఘదీర్ఘతరాభిధా వ్యాపారేణైవ ప్రతీతిసిద్ధేః. కిమితి చ శ్రుతిలిఙ్గవాక్యప్రకరణ స్థాన సమాఖ్యానాం పూర్వపూర్వబలీయస్త్వమ్ ? ఇతి అన్వితాభిధానవాదేఽపి విధేరపి సిద్ధం వ్యంగ్యత్వమ్.

వ్యా. శబ్దం విన్న పిమ్మట లభించే అర్థం అంతా బోధించడానికి అభిధ అనే వ్యాపారం ఒక్కటే చాలే పక్షంలో "ఓ! బ్రహ్మణుడా! నీకు కుమారుడు

కలిగాడు"; 'ఓ! బ్రాహ్మణుడా! నీ కన్య కర్భవతి అయింది' ఇత్యాదివాక్యాలు వినగానే కలిగే (పుత్రుడు పుట్టినందుకు) సంతోషం,(అవివాహిత అయిన కూతురు గర్భవతి అయినందుకు) శోకం మొదలైనవి కూడా వాచ్యాలని చెప్పవలసి వస్తుంది.

అదే విధంగా అభిధకు ఉన్న దీర్ఘ దీర్ఘతర వ్యాపారంచేతనే తీరం మొదలైన లక్ష్యార్థాలు కూడా తెలియవచ్చును గాన ఇంక లక్షణ ఎందుకు? శ్రుతిలింగ వాక్యప్రకరణ స్థానసమాఖ్యలలో పూర్వపూర్వం బలీయం అయిందని జైమిని చెప్పిన మాట ఎట్లు కుదురుతుంది ? అందుచేత అన్వితాభిధాన వాదంలో కూడ "నిఃశేషచ్యుతచందనమ్" ఇత్యాదులలో విధి వ్యంగ్యం అని అంగీకరించాలి.

వి. శ్రుతిలింగాదుల పూర్వపూర్వబలీయస్త్వం అనేది కూడా మీమాంసా శాస్త్రానికి సంబంధించిన విషయం. మీమాంసక మతానుయాయులైన దీర్ఘ దీర్ఘ వ్యాపారవాదులకు సమాధానం చెపుతున్నాడు గాన మమ్మటుడు మీమాంసాశాస్త్ర విషయాన్ని ఇక్కడ ఉట్టంకిస్తున్నాడు. దేనిని అంగంగా ఉపయోగించాలో దేనిని అంగిగా నిర్ధారణ చెయ్యాలో నిర్ణయించడానికి శ్రుతి, లింగం, వాక్యం, ప్రకరణం, స్థానం, సమాఖ్య అనే ఆరింటిని అంగీకరించారు.

(1) శ్రుతి :- ఇతరాపేక్ష లేకుండా విన్నంత మాత్రం చేతనే అంగత్వాన్ని (ఇది దీనికి అంగం అనే విషయాన్ని) బోధించేది శ్రుతి. ఉదా. 'వ్రీహిభిర్యజేత' (వ్రీహులచేత, వరిధాన్యంచేత యాగం చెయ్యాలి) అన్నప్పుడు 'వ్రీహిభిః' అనే పదంలో ఉన్న తృతీయావిభక్తి వినగానే వ్రీహులు కరణం అనీ, అందుచేత యాగానికి అవి అంగం అనీ తెలుస్తున్నది.

(2) లింగం :- శబ్దానికి ఉన్న సామర్థ్యం అనగా రూఢిచేత ఒక అర్థాన్ని బోధించకలిగి ఉండడం లింగం. "బర్హిర్దేవసదనం దామి" (పురోడాశం ఉంచే స్థానంగా నేను బర్హిస్సు (దర్భలు) కోస్తున్నాను) అనే వాక్యం అర్థాన్ని పట్టి, ఇక్కడ ఉన్న 'బర్హిః' మొదలైన శబ్దాల రూఢ్యర్థాన్ని పట్టి, ఈ మంత్రాన్ని బర్హిస్సు కోసేటప్పుడే వినియోగించాలి (ఈ మంత్రం చదువుతూ బర్హిస్సు కొయ్యాలి), ఉలపం మొదలైన తృణాలు కోసేటప్పుడు కాదు అని నిర్ణయించబడుతుంది.

(3) వా. కొన్ని పదాల కలయిక వాక్యం. అనగా అంగవాచక అంగి

వాచక పదాలను కలిపి ఉచ్చరించడం వాక్యం. "యస్య పర్ణమయీ జుహూర్భవతి నస పాపం శ్లోకం శృణోతి" అని ఉంది." పలాశదారువుతో తయారుచేసిన జుహువు (హోమం చేసే గరిటె) ఉన్నవాడు పాపకీర్తిని (అపకీర్తిని) వినడు" అని అర్థం. ఇక్కడ పర్ణజుహువులను కలిపి ఉచ్చరించడంచేత (ఈ వాక్యంలో చెప్పడం చేత) పర్ణం జుహ్వాంగం అని తెలుస్తున్నది. అనగా జుహువును మోదుగకఱ్ఱతో చేస్తేనే అపూర్వం (యాగఫలాన్ని కలిగించే అదృష్టం)కలుగుతుంది అని తెలుస్తూ న్నది. అనగా పర్ణత జుహ్వాంగం.

(4) ప్రకరణం :- రెండింటిలో ఒకదానితో ఒకదానికి అవసరం పడడం ప్రకరణం. ప్రయాజాదిహోమాలలో 'సమిధో యజతి' అనే వాక్యం ఉంది. 'సమిధలు హోమం చెయ్యాలి' అని అర్థం, దీనికి ఫలం చెప్పలేదు, దర్శపూర్ణ మాసయాగాలనే యాగాలకి స్వర్గం అనే ఫలం చెప్పబడింది. కాని ఆ యాగాలలో చేయవలసిన హోమాలు చెప్పలేదు. ఈ విధంగా ఇక్కడ "సమిధో యజతి" అనే వాక్యానికి ఫలాకాంక్ష ఉంది. దర్శపూర్ణమాసయాగాలకి కరణాకాంక్ష (సాధనం ఏమిటి అనే ఆకాంక్ష) ఉంది. అందుచేత ఇక్కడ ప్రకరణాన్ని పట్టి ప్రయాజలు దర్శపూర్ణమాసాలకి అంగం అని నిర్ణయించబడింది.

(5) స్థానం :- స్థానం అంటే క్రమం. "ఐన్ద్రాగ్నమేకాదశకపాలం నిర్వపేత్" అని మొదటిదిగా ఐంద్రాగ్నఇష్టి విధించబడింది. "వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్" అని వైశ్వానరేష్టి రెండవదిగా విధించబడింది. "ఇన్ద్రాగ్నీరోచనా దివః" ఇత్యాదిమంత్రాలు ముందుగాను, తరవాత 'వైశ్వానరో జీజనత్' ఇత్యాది మంత్రాలూ పఠించబడ్డాయి. అందుచేత మొదటి మంత్రాలు మొదటి ఇష్టికి తరవాత చదివినవి రెండవ ఇష్టికి అంగాలని క్రమాన్ని పట్టి (మొదటిది మొదటిదానికి, రెండవది రెండవదానికి అనే రీతిలో) నిర్ణయించ బడింది.

(6) సమాఖ్య :- సమాఖ్య అనగా యౌగికశబ్దం అని అర్థం. యౌగికం, రూఢం, యోగరూఢం, యౌగికరూఢం అని శబ్దాలు నాలుగు విధాలు. అవయ వార్థం చెప్పడానికి వీలైన కృత్తద్ధితాన్తసమస్తపదాదులు యౌగికాలు, 'పాచకః', 'దాశరథిః', 'జనకసుతా' ఇత్యాదులు ఉదాహరణలు, అవయవశక్తి అపేక్ష లేకుండా అర్థాన్ని బోధించే 'గౌః' ఇత్యాది పదాలు రూఢపదాలు. అవయవశక్తి

ఉంటూ సముదాయరూపంలో ఒక అర్థాన్ని బోధించే 'పంకజమ్' ఇత్యాదిపదాలు యోగరూఢాలు. పంకంనుంచి పుట్టినది అనే అర్థం ఉన్నా పంకంలో పుట్టినవాటిని అన్నింటినీ పంకజం అనకూడదు. పద్మానికి మాత్రమే ఆ పేరు. అందుచేత ఇవి కొంతవరకు రూఢపదాల వంటివి. అవయవశక్తిచేత ఒక అర్థాన్ని, రూఢిచేత మరొక అర్థాన్నీ బోధించేవి యౌగికరూఢాలు, 'ఉద్భిత్' మొదలైనవి ఉదాహరణలు. ఉద్భిత్ అనగా యోగంచేత భూమిని బ్రద్దలుకొట్టుకొని పైకివచ్చే మొక్క, చెట్టు అని అర్థం. రూఢిచేత ఒక యాగం అని అర్థం. వీటిలో యౌగిక శబ్దానికి సమాఖ్య అని పేరు. 'హోతృచమసః' అనే పేరును పట్టి చమసభక్షణానికి హోత అంగం అని తెలుస్తుంది.

ఒక స్థలంలో శ్రుతి మొదలైనవి రెండు మూడు సమావిష్టాలు అయినప్పుడు అంగత్వాదినిర్ణయం శ్రుతిని పట్టి చెయ్యాలా, లింగాన్ని పట్టి చెయ్యాలా, వాక్యాన్ని పట్టి చెయ్యాలా అనే సందేహం వచ్చినప్పుడు (తరవాతివాటికంటె ముందువి బలవత్తరమైనవి) తరవాతవి దుర్బలములైనవి అని, పూర్వపూర్వాలకంటె ఉత్తరోత్తరాల అర్థం దూరంగా ఉండడం ఇందుకు కారణం" అని "శ్రుతిలిఙ్గ వాక్యప్రకరణ స్థానసమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్యమర్థవిప్రకర్షాత్" అనే జైమినిసూత్రం చెపుతున్నది. ఉదాహరణకి— "కదాచన స్తరీరసి నేన్ద్ర సశ్చసి దాశుషే" అనే మంత్రం ఉంది. ఇది ఇంద్రుణ్ణి స్తుతిస్తూన్న ఋక్కు కాబట్టి దీనికి 'ఐంద్రీ ఋక్' అని పేరు. అనగా దీని అర్థాన్ని (లింగాన్ని) పట్టి ఇంద్రుణ్ణి స్తుతించడానికి ఉపయోగించాలి. కాని 'ఐన్ద్ర్యా గార్హపత్యముపతిష్ఠతే' అని ఒక విధివాక్యం ఉంది. దీనిని పట్టి దీనిని గార్హపత్యాగ్నిని స్తుతించడానికి ఉపయోగించాలి. అందుచేత శ్రుతిని పట్టి (ఈ వాక్యం 'గార్హపత్యాగ్నిని స్తుతించాలి' అని ప్రత్యక్షంగా చెపుతున్నది కాబట్టి) గార్హపత్యాగ్నిని స్తుతించడానికి వినియోగించాలా, లింగాన్ని పట్టి ఇంద్రుణ్ణి స్తుతించడానికి వినియోగించాలా, అని సందేహం కలుగుతున్నది శ్రుతి ప్రత్యక్షంగా 'ఇది చెయ్యాలి' అని బోధిస్తుంది. లింగస్థలంలో ముందు వాక్యార్థం అంతా తెలుసుకొని ఈ అర్థాన్ని పట్టి "ఈ పని చెయ్యాలి" అని శ్రుతి(వాక్యం)కల్పించుకొని దాని ప్రకారం చెయ్యవలసి ఉంటుంది. ఈ విధంగా శ్రుతికంటె లింగం ఒక కక్ష్య దూరం. అందుచేత ఇక్కడ శ్రుతిని పట్టి ఈ మంత్రాన్ని గార్హపత్యాగ్నిస్తుతికే వినియోగించాలి అని నిర్ణయం. మిగిలిన వాటివిషయంలో కూడా, అనగా శ్రుతీ వాక్యమూ కలిసినా, లింగమూ వాక్యమూ కలిసినా, శ్రుతీ సమాఖ్యా కలిసినా—ఇలా మిగిలిన ఐదింటి విషయం లోనూ కూడ పరం దుర్బలంగా గ్రహించి పూర్వానికి ప్రాధాన్యం ఇవ్వాలి.

ఇలా పారదౌర్బల్యానికి కారణం అర్థంలో దూరం ఉండడమే అని జైమిని చెప్పినాడు. అందుచేత ఇషువ్యాపారం వలె శబ్దవ్యాపారం చాలా దూరదూరంగా వెడుతుంది; ఎంతదూరమైనా అన్ని అర్థాలు సమానాలే అని అనడం సరికాదు.

అవ. వ్యంగ్యార్థాన్ని అంగీకరించకపోతే మరొక దూషణాన్ని చెపు తున్నాడు-

వృ. కించ 'కురు రుచిమ్' ఇతిపదయోర్వైపరీత్యే కావ్యాన్తర్వ ర్తిని కథం దుష్టత్వమ్ ? న హ్యత్రాసభ్యోర్థః పదార్థాన్తరైరన్వితః ఇతి అనభిధేయ ఏవ ఇతి ఏవమాది అపరిత్యాజ్యం స్యాత్.

వ్యా. కించేతి- మరొక విషయం ఏమనగా 'కురు రుచిమ్' అనే పదాలను వాటి క్రమం మార్చి "రుచింకురు" అని కావ్యమధ్యంలో ప్రయోగించి నపుడు దానికి దుష్టత్వం ఎట్లు? ఇక్కడ అసభ్యార్థం అన్యపదార్థాలతో అన్వ యించడంలేదు కాబట్టి వాచ్యం కాదుకదా? అందుచేత ఇలాంటి ప్రయోగం పరిత్యా జ్యం కాకుండా పోతుంది.

వి. 'రుచిం కురు' అని కావ్యమధ్యలో రాకూడదు; ఆ మాటల్లోని 'చింకు' అనేది చెవిని పడగానే అశ్లీలార్థం స్ఫురిస్తుంది; అందుచేత ఇలాంటి ప్రయోగాలు దుష్టములు అని అంటారు. (కాశ్మీరభాషలో 'చింకు' అనగా యోన్యంతర్గతాంకు రమట) అభిహితాన్వయవాదం ప్రకారం 'చింకు' పదం ఇతరపదార్థాలతో అన్వ యించలేదు కాబట్టి వాచ్యం కానే కాదు. అలాంటప్పుడు ఆ పదం త్యాజ్యం ఏలా అవుతుంది? అందుచేత ఇది దోషం అని చెప్పడానికి వీలుండదు. వ్యంగ్యాన్ని అంగీకరించిన పక్షంలో వాచ్యం కాక పోయినా 'రుచింకురు' అనగానే ఆ అశ్లీలా ర్థం వ్యంజనయా స్ఫురిస్తున్నది గాన దీన్ని దోషంగా పరిగణించడానికి వీలవు తుంది అని భావం. అందుచేత కూడా వ్యంజనను, వ్యంగ్యార్థాన్ని అంగీకరించాలి.

అవ. వ్యంగ్యార్థాన్ని అంగీకరించకపోతే మరొక దూషణాన్ని చూపు తున్నాడు-

వృ. యది చ వాచ్యవాచకత్వవ్యతిరేకేణ వ్యఙ్గ్యవ్యఞ్జకభావో నాభ్యుపేయతే తదా అసాధుత్వాదీనాం నిత్యదోషత్వం, కష్టత్వాదీనామ్

అనిత్యదోషత్వమ్ ఇతి విభాగకరణమనుపపన్నం. స్యాత్ న చానుప పన్నమ్; సర్వస్యైవ విభక్తతయా ప్రతిభాసాత్. వాచ్యవాచకభావవ్యతి రేకేణ వ్యఙ్గ్య వ్యఞ్జకతాశ్రయణే తు వ్యఙ్గ్యస్య బహువిధత్వాత్ క్వచి దేవ కస్య చిదేవ ఔచిత్యేన ఉపపద్యత ఏవ విభాగవ్యవస్థా.

వ్యా. యది చేతి - వాచ్యత్వవాచకత్వాలకంటె భిన్నంగా వ్యంగ్యత్వ వ్యంజకత్వాలు అంగీకరించని పక్షంలో అసాధుత్వాదులు నిత్యదోషాలనీ కష్టత్వా దులు అనిత్యదోషాలనీ విభాగం చేయడం అనుపపన్నం అయిపోతుంది. "ఔను; అది అనుపపన్నమే" అని అనడానికి వీలులేదు. ఎందుచేతననగా ప్రతీవాడికీ వేరు వేరుగా కనబడుతున్నాయి. వాచ్యత్వ వాచకత్వాలకంటె వేరుగా వ్యంగ్యత్వ వ్యంజకత్వాదులు అంగీకరించిన పక్షంలో వ్యంగ్యం అనేక విధాలుగా ఉంటుంది కాబట్టి ఒక్కొక్కటి ఒక్కొక్కచోట ఉచితంగా ఉంటుంది. అందుచేత విభాగ వ్యవస్థ ఉచితం అని చెప్పడానికి వీలవుతుంది.

వి. కావ్యదోషాలలో వ్యాకరణశాస్త్రవిరుద్ధత్వంచేత ఏర్పడిన 'అసాధుత్వం' మొదలైనవి, చెవులకు ఇంపుగా లేకపోవడంవల్ల ఏర్పడే 'కష్టత్వం' మొదలైనవి ఉన్నాయి. వీటిలో అసాధుత్వాదులు నిత్యదోషాలు. అవి ఏన్నటికీ దోషాలే. కష్ట త్వాదులు అక్కడ ఉన్న రసాదుల్ని: వక్త్రాదుల్నీ పట్టి ఒకప్పుడు దోషాలు కావచ్చు, కాకపోవచ్చు, గుణాలు కూడా కావచ్చు. ఈ విషయం సప్తమోల్లాసంలో విశదం అవుతుంది. అభిధ తప్ప వ్యంజన అనే వ్యాపారం గాని, వ్యంగ్యార్థం అనేది కాని లేదు అనే పక్షంలో ఈ విభాగం కుదరదు. అసలు ఈ విభాగమే తప్పు అనడానికి వీలులేదు. ఎందుచేత ననగా- శృంగారాది రసాలలో ఈ శ్రుతి కటుత్వాదులు దోషాలు అన్నట్లు, వీరరౌద్రాదులలో దోషాలుకావన్నట్లూ, సహృ దయుల హృదయాలే సాక్ష్యం చెపుతున్నాయి. వాచ్యార్థం ఒక్కటే ఉంటుంది అనే వారి మతంలో వాచ్యార్థం అన్ని చోట్లా సమానంగానే ఉంటుంది కాబట్టి ఈ భేదానికి అవకాశం ఉండదు. వ్యంజనను అంగీకరించిన పక్షంలో వ్యంగ్యమైన అర్థాన్ని పట్టి ఇవి కొన్ని చోట్ల దోషాలు అవడం, కొన్ని చోట్ల కాకపోవడం కుదురుతుంది.

అవ. వ్యంజనను అంగీకరించని పక్షంలో మరొక దోషం చూపుతున్నాడు-

వృ. "ద్వయం గతం సంప్రతి శోచనీయతాం సమాగమప్రార్థనయా కపాలినః" ఇత్యాదౌ పినాక్యాదిపదవైలక్షణ్యేన కిమితి కపాల్యాదిపదానాం కావ్యానుగుణత్వమ్.

వ్యా. ద్వయమ్ ఇతి :- "ద్వయం గతం" ఇత్యాదులలో పినాకి మొదలైన పదాలకంటె విలక్షణంగా 'కపాలి' మొదలైన పదాలు కావ్యానికి అనుగుణంగా ఉంటాయి అనడం దేనిని పట్టి?

వి. ఒక్క అర్థాన్ని బోధించడానికి అనేకపర్యాయపదాలు ఉండవచ్చు. అయినా కొన్ని సందర్భాలలో కొన్ని పదాలు ఉపయోగిస్తేనే అవి కావ్యానికి అనుగుణంగా ఉంటా యని అలంకారశాస్త్రసంప్రదాయం. కుమారసంభవంలో శివుడు బ్రహ్మచారి వేషంలో పార్వతి దగ్గరికి వెళ్ళి శివుణ్ణి (తననే) నిందిస్తూన్న ఘట్టంలో ఉన్న శ్లోకం ఇది-

"ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా కపాలినః,
కలా చ సా కాన్తిమతీ కలావత
స్త్వ మస్య లోకస్య చ నేత్రకౌముదీ". 132 A

"ఈ లోకంలో ఆ కపాలితో సంబంధం కోరి ఆ చంద్రకళ, నువ్వు మీరిద్దరూ జాలిపడవలసిన స్థితిలో ఉన్నారు" అని దీని భావం. శివుని విషయంలో అనాదరం, జుగుప్సా కలిగేటట్లుచేసి పార్వతినిపరీక్షించడం శివునిలక్ష్యం. శివుడు అనే అర్థంలో 'కపాలీ' 'పినాకీ' 'మహేశితా' మొదలైన ఎన్నో పదాలు ఉన్నా 'కపాలి' పదాన్ని ప్రయోగించడంలో ఒక ఔచిత్యం ఉంది. శివుడు అనే వాచ్యార్థం తెలిసిన వెంటనే 'కపాలం ధరించినవాడు' అనే అర్థం కూడా స్ఫురించడంతో అది జుగుప్సాపోషకమై ప్రకృతకావ్యానుగుణంగా ఉంటుంది. అభిధయే కాని వ్యంజన లేదు, వాచ్యార్థమే కాని వ్యంగ్యార్థం లేదు అనే పక్షంలో ఇలాంటి వైలక్షణ్యం సంపాదించడం శక్యం కాదు.

అవ. వ్యంజనను అంగీకరించకపోయినచో మరొక దోషాన్ని చూపుతున్నాడు.

వృ. అపి చ వాచ్యోఽర్థః సర్వాన్ ప్రతిపత్త్రూన్ ప్రతి ఏక రూప ఏవేతి నియతోఽసౌ. స హి 'గతోఽస్తమర్కః' ఇత్యాదౌ వాచ్యోఽర్థః క్వచిదన్యథా భవతి. ప్రతీయమానస్తు తత్ర ప్రకరణవక్తృప్రతిపత్త్రాదివిశేషసహాయతయా నానాత్వం భజతే. తథా చ గతోఽస్తమర్కః ఇత్యతః సపత్నం ప్రత్యవస్కన్దనావసర ఇతి, అభిసరణముపక్రమ్యతామితి, ప్రాప్తప్రాయస్తే ప్రేయానితి, కర్మకరణాన్నివర్తామహే ఇతి, సాంధ్యో విధిరుపక్రమ్యతామితి; దూరం మా గా ఇతి, సురభయో గృహం ప్రవేశ్యన్తామితి, సంతాపోఽధునా న భవతీతి, విక్రేయవస్తూని సంగృహ్యన్తామితి,నాగతోఽద్యాపి ప్రేయానిత్యాదిరనవధిర్వ్యఙ్గ్యోఽర్థః తత్రతత్ర ప్రతిభాతి.

వ్యా. అపి చ ఇతి :- మరొక విషయం ఏమనగా- వాచ్యార్థం గ్రహించే వాళ్ళందరికీ ఒకే విధంగా ఉంటుంది కాబట్టి నియతంగా (మార్పు లేకుండా) ఉంటుంది. "గతోఽస్తమర్కః" (సూర్యుడు అస్తమించినాడు) ఇత్యాది వాక్యాలలో వాచ్యార్థం ఎన్నటికీ మార్పు చెందదు కదా? వ్యంగ్యార్థం మాత్రం ప్రకరణవిశేషం సహాయంచేత అనగా వేరు వేరు ప్రకరణాల్ని పట్టి, ఆ మాట అన్న వ్యక్తి విశేషాన్ని పట్టి, అర్థం చేసుకొనేవాని విశేషాన్ని పట్టి అనేకవిధాలుగా మారుతుంది. అందుచేతనే 'గతోఽస్తమర్కః' అన్న మాట రాజునుంచి వినగానే 'ఇది శత్రువులను ఆక్రమించడానికి తగిన సమయం' అని సేనానాయకాదులకు, సఖినుంచి వినగానే "అభిసరణానికి ప్రారంభం చెయ్యి" అని నాయికకూ, సఖినుంచి వినగానే 'నీ ప్రియుడు వచ్చేసినట్లే' అని ప్రియురాలికీ, మేస్త్రినుంచి వినగానే 'పని కట్టిబెడదాం' అని పనివాళ్ళకు, గురువునుండి వినగానే "ఇంక సంధ్యావందనాదులు ప్రారంభించండి" అని శిష్యులకూ, తల్లినుండి వినగా 'దూరం వెళ్ళవద్దు' అని కూమారుడికి, రైతునుండి వినగానే "ఆవులను కొట్టాలలోకి ప్రవేశపెట్టండి" అని పశువుల కాపరులకీ పగలంతా ఎండవేడిమికి బాధపడుతూన్న ఒక వ్యక్తినుంచి వినగానే "ఇంక ఇప్పుడు వేడి ఉండదు" అనీ, దుకాణదారుడినుంచి వినగానే "అమ్మజూపిన సామాన్లు సర్దివేయండి" అని దుకాణంలో పనిచేసేవాళ్ళకి, నాయిక నుండి వినగానే 'ఇంకా నా ప్రియుడు రాలేదు" అని ప్రక్క నున్న సఖురాలికి

అక్కడక్కడ అనంతవిధాలైన వ్యంగ్యార్థం స్ఫురిస్తుంది. ఒక్క వాచ్యార్థాన్ని పట్టుకొని కూర్చుంటే ఇదంతా కుదరదు.

అవ. వాచ్యవ్యంగ్యార్థాలు వేరు వేరు అని నిరూపించే కొన్ని ఉపపత్తులను "వాచ్యవ్యఙ్గ్యయోః" మొదలు "భేదో న స్యాత్" అనేవరకు ఉన్న గ్రంథభాగంచేత చూపుతున్నాడు. నిషేధత్వవిధిత్వాదిరూపాలచేతా వాచ్యవ్యంగ్యార్థాల స్వరూప-కాల ఆశ్రయ-నిమిత్త-కార్య-సంఖ్యా-విషయాలలోనూ భేదం ఉన్నా కూడ ఆ రెండూ ఒకటే అంటే నలుపు పసుపు మొదలైన భేదాలు కూడ ఉండవు అని ఈ గ్రంథానికి భావం.

వృ. వాచ్యవ్యఙ్గ్యయోః నిఃశేషేత్యాదౌ నిషేధవిధ్యాత్మనా,

శ్లో॥ "మాత్సర్య ముత్సార్య విచార్య కార్య
మార్యాః సమర్యాదముదాహరన్తు,
సేవ్యా నితమ్బాః కిము భూధరాణా
ముత స్మరస్మేరవిలాసినీనామ్". 133

ఇత్యాదౌ సంశయశాన్తశృఙ్గార్యన్యతరగతనిశ్చయరూపేణ,

వ్యా. వాచ్యవ్యఙ్గ్యయోః ఇతి :- నిఃశేషేత్యాదిశ్లోకంలో "తస్య అధమస్య అన్తికం న గతా అసి" అని నిషేధం వాచ్యం. 'తత్సమీపమేవ గతా అసి' అని విధి వ్యంగ్యం.

మాత్సర్యమితి:- భర్తృహరిశృంగారశతకంలోని పద్యం ఇది. ఆర్యాః = ఆర్యులారా! మాత్సర్యమ్ = మాత్సర్యాన్ని, ఉత్సార్య = విడచి, విచార్య = బాగా ఆలోచించి, సమర్యాదమ్ = సప్రమాణంగా, కార్యమ్ = చేయవలసిన పనిని, ఉదాహరన్తు = చెప్పెదరుగాక. భూధరాణామ్ = పర్వతాలయొక్క, నితమ్బాః = చరియలు, కిము సేవ్యాః = సేవించదగినవా? ఉత = లేక స్మరస్మేరవిలాసినీనామ్ = మన్మథునిచేత చిరునవ్వుతో కూడిన స్త్రీల నితంబములు సేవించదగినవా?

ఈ శ్లోకంలో 'కిము' 'ఉత' అనే పదాలు ప్రయోగించడంచేత సంశయం వాచ్యం. వక్త శాంతుడైతే పర్వతనితంబాలనే సేవించాలి అనీ, శృంగారి అయితే విలాసినీ నితంబాలే సేవించాలి అనీ నిశ్చయం వ్యంగ్యం.

శ్లో॥ కథమవనిప దర్పో యన్నిశాతాసిధారా
దలనగలితమూర్ధ్నాం విద్విషాం స్వీకృతా శ్రీః,
నను తవ నిహతారేరప్యసౌ కిం న నీతా
త్రిదివమపగతాఙ్గైర్వల్లభా కీర్తిరేభిః, 134

వృ. ఇత్యాదౌ నిన్దాస్తుతివపుషా స్వరూపస్య,

వ్యా. అవనిప = రాజా! నిశాతాసిధారాదలనగలితమూర్ధ్నామ్ = వాడియైన ఖడ్గము అంచుచేత బ్రద్దలుకొట్టడంచేత పడిన శిరస్సులు గల, విద్విషామ్ = శత్రువులయొక్క, శ్రీః = లక్ష్మి, యత్ = ఎందువలన, స్వీకృతా = గ్రహించ బడినదో అందువలన, దర్పః = గర్వం, కథమివ = ఎట్లు? (ఎందుకు)? నను = ఎందువలన అనగా, నిహతారేః అపి = చంపబడిన శత్రువులు కలవాడవైనా, తవ = నీయొక్క, వల్లభా = ప్రియురాలైన, కీర్తిః = కీర్తి, అపగతాఙ్గైః = పోయిన శరీ రాలు గల, ఏభిః = వీళ్ళచేత, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, కిం న నీతా = తీసికొనవెళ్ళబడలేదా!

ఇత్యాదులలో నింద వాచ్యం. స్తుతి వ్యంగ్యం. ఈ విధంగా పై మూడు ఉదాహరణలలో వాచ్యవ్యంగ్యార్థాల స్వరూపం వేరువేరుగా ఉంది.

వృ. పూర్వపశ్చాద్భావేన ప్రతీతేః కాలస్య, శబ్దాశ్రయత్వేన, శబ్దతదేకదేశతదర్థవర్ణసంఘటనాశ్రయత్వేన చ ఆశ్రయస్య, శబ్దాను శాసనజ్ఞానేన, ప్రకరణాదిసహాయప్రతిభానైర్మల్యసహితేన చ అవగమః ఇతి నిమిత్తస్య, బోద్ధృమాత్రవిదగ్ధవ్యపదేశయోః ప్రతీతిమాత్రచమత్కృతో్యశ్చ కరణాత్ కార్యస్య, గతోఽస్తమర్కః ఇత్యాదౌ ప్రదర్శితన యేన సంఖ్యాయాః,

"కస్స వా ణ హోఈ రోసో దట్ఠూణ పిఆఇ సవ్వణం అహరం,
సభమరపడమగ్ఘాయిణి వారిఅవామే సహాసు ఏణ్హిం" 135

"కస్య వా న భవతి రోషో దృష్ట్వా ప్రియాయాః సవ్రణమధరమ్,
సభ్రమరపద్మాఘ్రాయిణి వారితవామే సహస్వేదానీమ్".

ఇత్యాదౌ సఖీతత్కాన్తాదిగతత్వేన విషయస్య చ భేదేఽపి యద్యేకత్వం తత్ క్వచిదపి నీలపీతాదౌ భేదో న స్యాత్. ఉక్తం హి- "అయమేవ హి భేదో భేదహేతుర్వా యద్విరుద్ధధర్మాధ్యాసః కారణభేదశ్చ" ఇతి.

వ్యా. పూర్వేతి :– వాచ్యార్థజ్ఞానం ముందు కలుగుతుంది. వ్యంగ్యార్థ జ్ఞానం తరవాత కలుగుతుంది. అందుచేత రెండింటికీ కాలభేదం ఉంది. వాచ్యార్థం శబ్దాన్ని మాత్రమే ఆశ్రయించుకొని ఉంటుంది. వ్యంగ్యం శబ్దాన్ని, శబ్దైకదేశాన్ని, దాని అర్థాన్ని, వర్ణాలను, వర్ణాదుల కూర్పునూకూడా ఆశ్రయించుకొని ఉంటుంది. అందుచేత వీటికి ఆశ్రయభేదం ఉంది. వాచ్యార్థం తెలుసుకొనడానికి శబ్దానుశాసన (వ్యాకరణ) జ్ఞానం ఉంటే చాలు. వ్యంగ్యార్థం తెలుసుకోవడానికి శబ్దానుశాసన జ్ఞానంతో పాటు ప్రకరణాదిసహాయం గల ప్రతిభానైర్మల్యం (నిర్మలమైన ప్రతిభ) కూడా ఉండాలి. ఈ విధంగా ఈ రెండింటికీ అనగా వాచ్యార్థవ్యంగ్యార్థ జ్ఞానాలకి నిమిత్తభేదం ఉంది. వాచ్యార్థం తెలుసుకొన్నవానిని కేవలం అర్థం చేసుకున్నవాడు అని అంటారు. వ్యంగ్యాన్ని తెలుసుకొన్నవాణ్ణి మంచి చాతుర్యం ఉన్నవాడు అంటారు. వాచ్యార్థం తెలుసుకున్నవానికి ఆ అర్థం మాత్రమే తెలుస్తుంది. వ్యంగ్యార్థం దాకా వెళ్ళగలిగినవాడికి చమత్కారం (ఆస్వాదనవల్ల కలిగే ఆనందం) కలుగుతుంది. ఈ విధంగా ఈ రెండింటివల్లా జనించే కార్యాలు వేరు వేరుగా ఉంటాయి. వెనుక చూపించినట్లుగా 'గతోఽస్తమర్కః' ఇత్యాదులలో వాచ్యార్థం ఒక్కటే అయితే వ్యంగ్యార్థాలు అనేకం ఉంటాయి. అందుచేత రెండింటికీ భేదం ఉంది.

కస్య ఇతి :- ప్రవాసంనుంచి వచ్చిన భర్త తన భార్య అధరోష్ఠం మీద దంతక్షతం చూచి కోపించగా ఆమె నిరవరాధ అని ఆమె భర్తకూ, ఇతరులకూ చెప్పడంకోసం ఆమె సఖి అంటూన్న మాటలు. సవ్రణమ్ = వ్రణంతో కూడిన, ప్రియాయాః అధరమ్ = ప్రియురాలి అధరోష్ఠాన్ని, దృష్ట్వా=చూచి, కస్య వా= ఎవనికి, రోషః = కోపం, న భవతి = కలగదు? సభ్రమరపద్మాఘ్రాయిణి = తుమ్మెదతో కూడిన పద్మాన్ని ఆఘ్రాణించినదానా! వారితవామే = నివారించినా ప్రతికూలంగా ప్రవర్తించినదానా! (విననిదానా!), ఇదానీమ్=ఇప్పుడు, సహస్వ= సహించుము.

ఇత్యాదౌ ఇతి :- ఇత్యాదులలో సఖీగతము, తత్కాంతాదిగతమూ అవడం చేత భేదం ఉన్నా కూడ రెండూ ఒకటే అంటే నీలవర్ణపీతవర్ణాదులలో కూడ భేదం ఉండదు.

వి. పై శ్లోకంలో ఈ మాటలు అంటూన్నది సఖి. ఆమె సఖి అనగా నాయిక. వాచ్యార్థం నాయికను ఉద్దేశించి చెప్పబడింది. అందుచేత వాచ్యార్థానికి నాయిక విషయం. "ఈమె అధరంమీద భ్రమరం కుట్టినది; ఇది ఉపపతిదంతక్షతం కాదు" అనే వ్యంగ్యార్థానికి పతి విషయం. "నేను ఏదో సర్దిచెప్పాను. మళ్ళీ ఎప్పుడూ ఇలా చేయవద్దు" అనే వ్యంగ్యానికి ఉపపతి విషయం. ఈ విధంగా వాచ్యార్థానికి విషయమైన వ్యక్తి వేరు, వ్యంగ్యార్థానికి విషయమైన వ్యక్తులు వేరు.

వాచ్యార్థవ్యంగ్యార్థాలకి ఇన్ని విధాల భేదం ఉన్నా కూడ రెండూ ఒకటే అంటే అది నలుపురంగూ పసుపురంగూ ఒకటే అనడం వంటిది అని భావం

వ్యా. ఉక్తమ్ ఇతి :- అయమేవ=ఇదే, భేదః= భేదము, వా=లేదా, భేదహేతుః= భేదానికి హేతువు, యత్ = ఏమనగా. విరుద్ధధర్మాధ్యాసః=విరుద్ధమైన ధర్మాల జ్ఞానము, కారణభేదః చ = కారణముల భేదము అని పెద్దలచే చెప్పబడినది కదా!

వి. ఇక్కడ అధ్యాసః అనగా జ్ఞానం అని అర్థం చెప్పబడింది. విరుద్ధధర్మజ్ఞానంవల్ల భేదజ్ఞానం కలుగుతుంది కాని ఆ జ్ఞానం భేదం కాదు. అందుచేత అధ్యాసః అనగా స్థితి అని అర్థం చెప్పడం బాగుంటుంది. విరుద్ధమైన ధర్మాలు ఉండడమే భేదం. కారణభేదం కార్యభేదానికి కారణం అని ఈ వాక్యం అభిప్రాయం. ప్రస్తుతం ఈ వాచ్యవ్యంగ్యాలలో విరుద్ధధర్మాలు ఉన్నాయి. వీటి కారణాలు కూడా వేరు వేరు. అందుచేత ఈ రెండూ భిన్నములైనవి అని అభిప్రాయం.

అవ. వాచ్యవ్యంగ్యాల ధర్మాలే కాదు, వాచకవ్యంజకాల ధర్మాలు కూడా వేరు వేరుగానే ఉంటాయి అని ప్రతిపాదిస్తున్నాడు.

వృ. వాచకానామర్థాపేక్షా, వ్యఞ్జకానాం తు న తదపేక్షత్వమితి న వాచకత్వమేవ వ్యఞ్జకత్వమ్.

వ్యా. వాచకపదాలకు అర్థాపేక్ష ఉన్నది. వ్యంజకపదాలకు అర్థాపేక్ష లేదు. అందుచేత వాచకత్వమే వ్యంజకత్వం అని అనడానికి వీలులేదు.

వి. వాచకపదాలు తమ అర్థం విషయంలో ఎవడు సంకేతం గ్రహించి ఉన్నాడో అతనికి మాత్రమే ఆ అర్థాన్ని బోధిస్తాయి. వ్యంజకాలైతే అలాంటి సంకేతాదులతో పని లేకుండా తటంలో పావనత్వం మొదలైన అర్థాన్ని బోధిస్తాయి. నిరర్థకాలైన వర్ణాలు కూడా వ్యంజకాలు గాన వాటికి అర్థాపేక్ష అసలే లేదు. ఈ విధంగా వాచకపదాలకీ వ్యంజకపదాలకీ భేదం ఉన్నది.

అవ. "సోఽయమిషోరివ" "యత్పరః స శబ్దార్థః" అంటూ చెప్పిన మతద్వయాన్ని మళ్ళీ ఆక్షేపిస్తున్నాడు.

వృ. కించ వాణీరకుడంగ్విత్యాదౌ ప్రతీయమానమర్థమభివ్యజ్య వాచ్యం స్వరూపే ఏవ యత్ర విశ్రామ్యతి తత్ర గుణీభూతవ్యఙ్గ్యే అతాత్పర్యభూతోఽప్యర్థః స్వశబ్దానభిధేయః ప్రతీతిపథమవతరన్ కస్య వ్యాపారస్య విషయతామవలమ్బతామితి.

వ్యా. కించ ఇత్యాది :- మరొక విషయం ఏమనగా "వాణీరకుడంగ" మొదలైన (అసుందర) గుణీభూతవ్యంగ్యస్థలంలో (చూ. 132వ శ్లో) వాచ్యార్థం "దత్తసంకేతః కశ్చిత్ లతాగహనం ప్రవిష్టః" అనే ప్రతీయమానార్థాన్ని వ్యంజింపచేసి స్వరూపంలోనే విశ్రమిస్తూన్నది. అనగా ఆ వ్యంగ్యార్థం కంటె ఎక్కువ చమత్కారకారిగా ఉండడంచేత ప్రాధాన్యంతో ఉంది. అందుచేత అక్కడ వ్యంగ్యార్థాన్ని చెప్పడంలో వాచ్యార్థానికి తాత్పర్యం అని చెప్పడానికి వీలులేదు. ఈ విధంగా అక్కడున్న శబ్దాలచేత అభిధ ద్వారా చెప్పబడకపోయినా ప్రతీయమానంగా ఉన్న ఈ వ్యంగ్యార్థం ఏ వ్యాపారానికి విషయం కావాలి? అనగా ఏ వ్యాపారంచేత చెప్పబడుతున్నట్లు గ్రహించాలి? అందుచేత వ్యాపారం ఏదీ లేకుండా శబ్దంవల్ల అర్థప్రతీతి కలగదు కాబట్టి, అభిధ వాచ్యార్థాన్ని చెప్పి ఊరుకున్నది కాబట్టి, తాత్పర్యం కూడా లేదు కాబట్టి వ్యంజనావ్యాపారాన్ని అంగీకరించాలి అని భావం.

అవ. వ్యంగ్యాలు అనేక విధాలుగా ఉంటాయి. అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనిత్యాది నామధేయవిశేషాలతో ఉంటాయి. శబ్దార్థాలకి అధీనాలై ఉంటాయి.

ప్రకరణాదుల అపేక్షతోఉంటాయి. ఈధర్మాలన్నీ లక్ష్యార్థాలలో కూడా ఉంటాయి కాబట్టి వ్యంగ్యం లక్షణాగమ్యమే అని చెప్పవచ్చు కదా అని ఆశంకించుకొని చెబుతున్నాడు-

వృ. నను "రామోఽస్మి సర్వం సహే" ఇతి, "రామేణ ప్రియ జీవితేన తు కృతం ప్రేమ్ణః ప్రియే నోచితమ్" ఇతి, "రామోఽసౌ భువ నేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరామ్" ఇత్యాదౌ లక్షణీయోఽ ప్యర్థః నానాత్వం భజతే, విశేషవ్యపదేశహేతుశ్చ భవతి. తదవగమశ్చ శబ్దార్థాయత్తః, సవ్యపేక్షశ్చేతి కోఽయం నూతనః ప్రతీయమానో నామ?

వ్యా. నను ఇతి :— "రామోఽస్మి సర్వం సహే" (చూ. 112వ శ్లోకం) అన్నప్పుడు "సకలదుఃఖాలకీ పాత్రుడు" అని, 'రామేణ ప్రియజీవితేన' ఇత్యాది శ్లోకంలో 'రామేణ' అనుదానికి 'జాలిలేనివాడు' అనీ, 'రామోఽసౌ' అన్నప్పుడు (చూ. 109వ శ్లోకం) ఖరదూషణాదులను చంపినవాడనీ వేడువేరు విధాలుగా లక్ష్యార్థం ఉంది. 'అర్థాంతరసంక్రమితలక్షణ మొదలైన నామధేయవిశేషాలు దీనికీ ఉన్నాయి. ఇది కూడా శబ్దం మీదా, అర్థం మీదా ఆధారపడి ఉన్నది; అనగా లక్షణచేత లక్ష్యార్థాన్ని శబ్దమే బోధిస్తుంది. అందుచేత లక్ష్యార్థం శబ్దాధీనం. ముఖ్యార్థబాధజ్ఞానం కావాలంటే ముఖ్యార్థజ్ఞానం ఉండాలి. అందుచేత అర్థాధీనం. ప్రకరణం, వక్త మొదలైనవాటి అపేక్ష దీనికి కూడా ఉంది. ప్రకరణాదులను పట్టి, వక్తయొక్క తాత్పర్యాన్ని పట్టి లక్ష్యార్థం బోధించబడుతుంది కదా? ఈ విధంగా నువ్వు వ్యంగార్థవిషయంలో చెప్పే విశేషాలన్నీ లక్ష్యార్థంలో కూడా ఉన్నాయి. అందుచేత వ్యంగ్యార్థం కూడా లక్షణచేతనే బోధింపబడుతుంది అని చెప్పవచ్చును కదా అని ఆశంక.

వి. 'రామేణ ప్రియజీవితేన' ఇత్యాదికం ఒక శ్లోకానికి చతుర్థపాదం. పూర్తి శ్లోకం ఇది-

"ప్రత్యాఖ్యానరుచేః కృతం సముచితం క్రూరేణ తే రక్షసా
సోఢం తచ్చ తథా త్వయా కులజనో ధత్తే యథోచ్చైః శిరః,

వ్యర్థం సంప్రతి బిభ్రతా ధనురిదం త్వద్వ్యాపదాం సాక్షిణా
రామేణ ప్రియజీవితేన తు కృతం ప్రేమ్ణః ప్రియే నోచితమ్".

రాముడు సీతను స్మరిస్తూ తనలో అనుకుంటూన్న మాటలు—

"నన్ను అపహరించవద్దు" అని నువ్వు ప్రత్యాఖ్యానం చేస్తూన్నా క్రూరుడైన రావణుడు వాని స్వభావానికి తగినట్లుచేశాడు. నిన్ను అపహరించాడు. నువ్వు ఆ దుఃఖాన్ని సహించి కులంలోనివాళ్లు తలఎత్తుకునేటట్లుగా చేశావు. ఓః ప్రేయసీ జీవితంమీద ఇంత మక్కువ గల రాముడు నిన్ను రక్షించలేకపోవడంచేత వ్యర్థమైన ధనస్సు ధరించి నీ ఆపద అన్నింటికీ సాక్షిగా ఉండి ప్రేమకు తగినట్లు ప్రవర్తించలేదు" అని దీని భావం

అవ. సమాధానం చెబుతున్నాడు-

వృ. ఉచ్యతే; లక్షణీయస్యార్థస్య నానాత్వేపి అనేకార్థశబ్దాభిధేయవన్నియతత్వమేవ; న ఖలు ముఖ్యేనార్థేన అనియతసంబన్ధో లక్షయితుం శక్యతే. ప్రతీయమానస్తు ప్రకరణాదివిశేషవశేన నియతసంబన్ధః, అనియతసంబన్ధః, సంబద్ధసంబన్ధః చ ద్యోత్యతే.

వ్యా. ఉచ్యతే ఇతి :- దీనికి సమాధానం చెప్పబడుచున్నది. లక్ష్యార్థం అనేక విధాలుగా ఉండవచ్చు. అయినా 'భద్రాత్మనః' ఇత్యాది శ్లోకంలో (చూ. 12వ శ్లోకం) వలె ఒక వాక్యంలో ఉన్న అనేకార్థాలైన శబ్దాల అర్థం ఏ విధంగా నియతసంబంధంతో ఉంటుందో ఆదే విధంగా లక్ష్యార్థం కూడా నియమితసంబంధంగా (తప్పక మరొకదానితో సంబంధించి) ఉంటుంది. ముఖ్యార్థంతో సంబంధం లేని అర్థాన్ని లక్ష్యార్థంగా చెప్పడానికి వీలు లేదు కదా? వ్యంగ్యార్థం అయితే ప్రకరణాదులను పట్టి నియతసంబంధం గాను, అనియతసంబంధంగానూ కూడా ఉండవచ్చు.

ఏ ఒక వాక్యంలో ప్రయోగించిన శబ్దానికి అనేక అర్థా లున్నా ఆ పదం అక్కడ ఉన్న ప్రకరణాదులతో సంబంధించిన ఒక్క అర్థాన్ని మాత్రమే (వాచ్యార్థాన్ని మాత్రమే) బోధిస్తుంది. మిగిలిన అర్థాలను అక్కడ బోధించదు. ఆదే విధంగా లక్షణాస్థలంలో కూడా ఒక శబ్దం ముఖ్యార్థమైన గంగాప్రవాహాదికంతో నియతమైన సంబంధం ఉన్న తీరాన్ని మాత్రమే బోధించకలుగు

తుంది. ఎప్పుడో ఒకమారు ఆ గంగలో దిగిన ఆవు మొదలైనవాటిని బోధించదు. ఇంక వ్యంగ్యార్థానికి ఈ నియమం లేదు. ప్రకరణాదుల్ని పట్టి అది ఒకప్పుడు నియతసంబంధమైన (తప్పకుండా ముఖ్యార్థంతో సంబంధించిన) అర్థాన్ని బోధించవచ్చు. లేదా అనియతసంబంధం అయిన అర్థాన్ని బోధించవచ్చు. లేదా సంబంధించినదానితో సంబంధించిన అర్థాన్ని బోధించవచ్చు. (వీటి ఉదాహరణలు మూలంలోనే స్పష్టం అవుతాయి). అందుచేత లక్ష్యార్థమే వ్యంగ్యార్థం అవడానికి వీలులేదు.

అవ. వ్యంగ్యార్థస్థలంలో ముఖ్యార్థబాధ ఉండదు. అందుచేత వ్యంగ్యార్థం లక్ష్యార్థం కాదు అని చెబుతున్నాడు.

వృ. న చ-

"అత్తా ఏత్థ ణిమజ్జిఅ ఏత్థ అహం దిఅహఏ పలోఏహి
మా వహిఅ రత్తి అన్ధఅ సేజ్జాఏ మహ ణిమజ్జిహిసి"

ఇత్యాదౌ వివక్షితాన్యపరవాచ్యే ధ్వనౌ ముఖ్యార్థబాధః. తత్కథమత్ర లక్షణా? లక్షణాయామపి వ్యఞ్జనమవశ్యమాశ్రయితవ్యమితి ప్రతిపాదితమ్ యథా చ సమయసవ్యపేక్షా అభిధా తథా ముఖ్యార్థబాధాదిత్రయ సమయవిశేషసవ్యపేక్షా లక్షణా; అత ఏవ అభిధాపుచ్ఛభూతా సేత్యాహుః.

వ్యా. న చేతి :- వివక్షితాన్యపరవాచ్యధ్వన్యుదాహరణాలైన 'అత్తా' ఇత్యాది శ్లోకాలలో (ఈ గాథ తృతీయోల్లాసం చివర ఇవ్వబడింది) ముఖ్యార్థబాధ ఏమీ లేదు కదా? ఇక్కడ లక్షణ ఎలా కుదురుతుంది. లక్షణాస్థలాలలో కూడా (ప్రయోజనాంశంలో) తప్పక వ్యంజనను అంగీకరించాలి అని వెనుక ప్రతిపాదించబడింది.

అభిధకు సంకేతజ్ఞానాపేక్ష ఉన్నట్లే లక్షణకు ముఖ్యార్థబాధాదిత్రయాపేక్ష, ముఖ్యార్థం ఏదో తెలియాలంటే సంకేతాపేక్షా కూడా ఉంటాయి. అందుచేతనే "లక్షణ అభిధకు తోక" అంటారు.

అవ. లక్షణావ్యంజనల భిన్నత్వానికి మరి కొన్ని కారణాలు కూడ చెపుతున్నాడు.

వృ. న చ లక్షణాత్మకమేవ ధ్వననమ్, తదనుగమేన తస్య దర్శనాత్. న చ తదనుగతమేవ; అభిధావలమ్బేనాపి తస్య భావాత్. న చోభయానుసార్యేవ. అవాచకవర్ణానుసారేణాపి తస్య దృష్టేః. న చ శబ్దానుసార్యేవ, అశబ్దాత్మకనేత్రత్రిభాగావలోకనాదిగతత్వేనాపి తస్య ప్రసిద్ధేః ఇతి అభిధాతాత్పర్యలక్షణాత్మకవ్యాపారత్రయాతివర్తీ ధ్వననాదిపర్యాయో వ్యాపారః అనపహ్నవనీయ ఏవ.

వ్యా. న చేతి :- వ్యంజన లక్షణారూపం కాదు; ఎందుచేత ననగా అది లక్షణను అనుసరించి ఉన్నట్లు కనబడుతున్నది.

వి. లక్షణామూలవ్యంజనాస్థలాలలో వ్యంజన లక్షణ మీద ఆధారపడి ఉంటుంది. లక్షణ తాను బోధించవలసిన లక్ష్యార్థాన్ని బోధించి తప్పుకున్న తరవాత వ్యంజన తన పని ప్రారంభిస్తుంది. అందుచేత ఉపజీవ్యం (దేనిమీద మరొకటి ఆధారపడుతుందో అది దానికి ఉపజీవ్యం; ఆధారపడేది ఉపజీవకం) అయిన లక్షణా, ఉపజీవకమైన వ్యంజనా ఒకటే అని చెప్పకూడదు.

వ్యా. "అయితే వ్యంజన సర్వదా లక్షణమీదనే ఆధారపడి ఉంటుం దనే మాట కూడా లేదు. కొన్నిచోట్ల ఇది అభిధమీద ఆధారపడి ఉంటుంది."

వి. నానార్థకశబ్దవ్యంజనాస్థలంలో ('భద్రాత్మనః' ఇత్యాది శ్లోకం(12)లో) వ్యంజన అభిధమీద ఆధారపడి ఉన్నది కదా?

వ్యా. వ్యంజన లక్షణా-అభిధలమీద రెండింటిమీదా ఆధారపడి ఉంటుంది అనే నియమం కూడా లేదు; ఏ అర్థాన్నీ బోధించని వర్ణాదులలో కూడ వ్యంజన కనబడుతుంది. అలా అని ఇది శబ్దంమీదనే ఆధారపడి ఉంటుం దని నియమం లేదు. శబ్దాత్మకం కాని కటాక్షవీక్షణాదులలో కూడా వ్యంజన ఉన్నదని ప్రసిద్ధి ఉంది. ("ఈమె కటాక్షంచేత తన మనస్సులోని అభిలాషను సూచించింది" ఇత్యాది ప్రసిద్ధి ఉన్నది కదా?) అందుచేత అభిధాతాత్పర్య-లక్షణ లనే మూడు వ్యాపారాలను మించిన, వ్యంజనావ్యాపారం కప్పిపుచ్చడానికి శక్యం కానిది. దీనికే ధ్వననం, ద్యోతనం, ప్రకాశనం, ప్రత్యాయనం, బోధనం, అంజనం మొదలైనవి పర్యాయపదాలు.

అవ. "ప్రతీయమానార్థం నియతసంబంధం కావచ్చు. అనియతసంబంధం కావచ్చు" సంబద్ధ సంబంధం కావచ్చు" అని వెనక చెప్పబడింది. వాటికి ఉదా హరణలు చూపుతున్నాడు.

వృ. తత్ర"అత్తా ఏత్థ"ఇత్యాదౌ నియతసంబన్ధః."కస్సవా హోఇ ణ రోసో" ఇత్యాదౌ అనియతసంబన్ధః.

గాథ. ''విపరీఅరఏ లచ్ఛీ బమ్హం దట్ఠూణ ణాహికమలత్థం.
హరిణో దాహిణణఅణం రసాఉలా ఝ త్తి ఢక్కేఇ''137

"విపరీతరతే లక్ష్మీర్బ్రహ్మాణం దృష్ట్వా నాభికమలస్థమ్,
హరేర్దక్షిణనయనం రసాకులా ఝటితి స్థగయతి".

ఇత్యాదౌ సంబద్ధసంబన్ధః. అత్ర హి హరిపదేన దక్షిణనయనస్య సూర్యాత్మకతా వ్యజ్యతే. తన్నిమీలనేన సూర్యాస్తమయః, తేన పద్మసంకోచః, తతో బ్రహ్మణః స్థగనం, తత్ర సతి గోప్యాఙ్గస్యాదర్శనేన అనిర్యన్త్రిణం నిధువనవిలసితమ్ ఇతి.

వ్యా. తత్ర ఇతి.'అత్తా ఏత్థ'ఇత్యాద్యుదాహరణాలలో వ్యంగ్యార్థం నియత సంబంధం కలది. "కస్స వా హోఇ ణ రోసో" ఇత్యాదులలో అనియతసంబంధం గలది.

వి. లక్షణాస్థలంలో లక్ష్యార్థం వాచ్యార్థంతో తప్పనిసరిగా సంబంధించి ఉంటుంది. కాని వ్యంజనాస్థలాలలో కొన్నిచోట్ల వ్యంగ్యార్థం వాచ్యార్థంతో సంబంధించి ఉండవచ్చు; కొన్ని చోట్ల సంబంధించి ఉండకపోవచ్చు, కొన్ని చోట్ల వాచ్యార్థంతో సంబంధించిన దానితో సంబంధించి ఉండవచ్చు-'అత్తా ఏత్థ' ఇత్యాదులలో నిషేధం వాచ్యార్థం, విధి (నా శయ్యమీదకు రమ్మని అనేది) వ్యంగ్యం. ఈ విధంగా ఇక్కడ వ్యంగ్యార్థం వాచ్యార్థంతో (విపరీతరూపేణ) సంబంధించి ఉంది. "కస్స వా" ఇత్యాది శ్లోకంలో "ఈమె అధరోష్ఠం ఉపపతిచేత దష్టంకాదు" అనేది వ్యంగ్యం. "ఇప్పుడు నేనేదో చెప్పి నిన్ను కాపాడాను, ఇటుపైన ఇలా చెయ్యకుము" ఇత్యాద్యర్థాలు కూడా వ్యంగ్యాలుగా ఉన్నాయి. కాని ఈ వ్యంగ్యార్థాలన్నీ వక్తను పట్టి, వినేవాళ్ళని పట్టి, ప్రకరణాన్ని పట్టి గమ్యం అయేవి. వీటికి

అన్నింటికి వాచ్యార్థంతో తప్పకుండా సంబంధం ఉండాలని లేదు. అందుచేత అవి అనియతసంబంధాలు.

వ్యా. "విపరీతరతే" ఇత్యాది:- విపరీతరతే=పురుషాయితమునందు, రసాకులా = పారవశ్యంతో వ్యాకులురాలైన లక్ష్మీః = లక్ష్మి, నాభికమలస్థమ్ = (విష్ణువు యొక్క) నాభిలోని కమలంలో ఉన్న. బ్రహ్మాణమ్ = బ్రహ్మదేవుణ్ణి, దృష్ట్వా = చూచి, ఝటితి = వెంటనే, హరేః = విష్ణువుయొక్క దక్షిణనయనమ్ = కుడి కన్నును, స్థగయతి=కప్పివేయుచున్నది. ఇత్యాదులలో వ్యంగ్యార్థం వాచ్యార్థంతో సంబంధించి దానితో సంబంధించినది. ఇక్కడ 'హరి' పదంచేత కుడి కన్ను సూర్యస్వరూపమైనది. అని వ్యంజింపబడుతున్నది. (సూర్యుడు మహావిష్ణువునకు కుడి కన్ను) దానిని మూయడంచేత సూర్యాస్తమయం, సూర్యాస్తమయంచేత పద్మం ముడుచుకొని పోవడం, దానిచేత ఆ పద్మంలో ఉన్న బ్రహ్మదేవుడు కప్పబడిపోవడం, అప్పుడు గోప్యాంగదర్శనం ఉండకపోవడంచేత నిఃసంకోచంగా సురతవిలాసం అని ఒక దానికి సంబంధించి ఒకటి వ్యంజింప చేయబడు తున్నది.

అవ. ఇప్పుడు వాక్యార్థం విషయంలో మరికొందరు శాస్త్రకారుల మతాన్ని ఉట్టంకిస్తూ వాళ్ళ మతం ప్రకారం కూడా వ్యంజనను అంగీకరించవలసి ఉంటుంది. అని ప్రతిపాదిస్తున్నారు :-

వృ. "అఖణ్డబుద్ధినిర్గ్రాహ్యో వాక్యార్థ ఏవ వాచ్యః; వాక్యమేవ చ వాచకమ్" ఇతి యేఽప్యాహుః తైరప్యవిద్యాపదపతితైః పద పదార్థకల్పనా కర్తవ్యైవేతి తత్పక్షేఽప్యవశ్యముక్తోదాహరణాదౌ విధ్యాదిర్వ్యఙ్గ్య ఏవ.

వ్యా- **అఖణ్డేతి :** "అఖండబుద్ధిగ్రాహ్యమైన వాక్యార్థమే వాచ్యం; వాక్యమే వాచకం" అని అనేవాళ్లు కూడా అవిద్యాపదంలో పడి ఉన్నంతవరకూ పదపదార్థ కల్పన చేయవలసిందే; అందుచేత వాళ్ల పక్షంలో కూడా పైన చెప్పిన ఉదాహరణలలో విధ్యాదికం వ్యంగ్యమే.

వి. వేదాంతులను మనస్సులో పెట్టుకొని మమ్మటుడు ఇది వ్రాసినా డని గోవింద ఠక్కురాదులు ప్రదీపాదివ్యాఖ్యానాలలో వివరించారు. అద్వైతసిద్ధాంతం ప్రకారం "సత్యం జ్ఞానమ్ అనన్తం బ్రహ్మ" ఇత్యాది వాక్యాలలోని పదాలకు వేరు

వేరుగా అర్థాలు లేవు. బ్రహ్మ నిర్గుణం. అందుచేత దీనిలోని గుణాలను వర్ణించే ప్రసక్తిలేదు. 'నల్లని కలవ' అన్నప్పుడు కలవలో నలుపు అనే గుణం ఉంది కనుక 'నల్లని' అనేదానిని 'కలువ' అనే దానికి విశేషణంగా వాడడం కుదిరింది. "ప్రకృష్టప్రకాశః చన్ద్రః" (అత్యధికమైన ప్రకాశ చంద్రుడు) అన్నప్పుడు చంద్రుడే ప్రకాశం. ప్రకాశమే చంద్రుడు. అందుచేత "ప్రకృష్టప్రకాశః చన్ద్రః" అనే మొత్తం వాక్యం ప్రకృష్టప్రకాశరూపచంద్రుణ్ణి బోధిస్తున్నది. అదే విధంగా "సత్యం జ్ఞానమ్" ఇత్యాదివాక్యం మొత్తం అఖండంగా, అఖండమైన బ్రహ్మరూప వాక్యార్థాన్ని బోధిస్తుంది. ఈ విధంగా అఖండవాక్యం అఖండవాక్యార్థాన్ని బోధిస్తుంది. అని చెప్పే వేదాంతులు కూడా అవిద్యావస్థలో ఉన్నప్పుడు పదాల సమూహం వాక్యం అనీ, ఒక్కొక్క పదం ఒక్కొక్క అర్థాన్ని బోధిస్తుందని అంగీకరించాలి కదా! అందుచేత వాళ్ళ మతం ప్రకారం కూడా నిశ్శేషేత్యాది వాక్యాలలో విధ్యాదికం వ్యంగ్యమే అని అంగీకరించవలసి ఉంటుంది అని పై వాక్యానికి భావం అని ప్రదీపాదులలో చెప్పబడింది.

వాస్తవంలో మమ్మటుడు పై వాక్యం వేదాంతులను కాక, వైయాకరణులను దృష్టిలో పెట్టుకొని వ్రాసినట్లు కనబడుతుంది వేదాంతులు 'తత్త్వమసి' ఇత్యాదిమహావాక్యాలు, బ్రహ్మస్వరూపలక్షణ ప్రతిపాదకాలైన "సత్యం జ్ఞానమ్" ఇత్యాదివాక్యాలు మాత్రమే అఖండవాక్యార్థబోధ కలిగిస్తా యని అంగీకరించారు. తదితరవాక్యాలకు అఖండార్థబోధకత్వాన్ని వారెక్కడా అంగీకరించలేదు. పై వాక్యాలకు అఖండార్థబోధకత్వం అవిద్యావస్థలోనే అంగీకరించారు కూడ. ఇతరవాక్యాలలో విధ్యాదుల వ్యంగ్యత్వాన్ని అంగీకరించడంలో వాళ్ళకు కూడా అభ్యంతరం ఉండదు. భాట్టుల్ని అంగీకరింపచేస్తే వాళ్లూ అంగీకరిస్తారు."వ్యవహారే భాట్టనయః" అని కదా వారి సిద్ధాంతం.

"వ్యాకరణం" అనగా ప్రకృతిప్రత్యయ విభాగం చేయడం. కొన్ని పదాలు తీసికొని వాటిలో ఈ భాగం 'ప్రకృతి' అనీ, దాని చివర చేర్చినది ప్రత్యయం అనీ, దీనికి ఇది అర్థం అనీ చెప్పినట్లయితే దానిని పట్టి ఇతరపదాలను గుర్తించి వాటి అర్థాలు తెలుసుకొనడానికి వీలవుతుంది. అయితే ఈ ప్రకృతి ప్రత్యయ విభాగం అంతా కాల్పనికమే; నిజానికి ప్రకృతీ లేదు, ప్రత్యయమూ లేదు; పదమూ లేదు; వాక్యం అనేది ఒక అఖండవస్తువు. అదే సత్యమైనది దానిచేత ఒక వాక్యార్థం బోధించబడుతుంది. ఇది వైయాకరణుల పరమసిద్ధాంతం. అందుచేతనే భర్తృహరి-

"పదే న వర్ణా విద్యన్తే వర్ణేష్వవయవా న చ,
వాక్యాత్ పదానామత్యన్తం ప్రవివేకో న విద్యతే".

(పదంలో వర్ణాలు లేవు; వర్ణాలలో అవయవాలు లేవు, వాక్యానికీ పదాలకూ ఏ మాత్రమూ భిన్నత్వం లేదు) అని అంటాడు.

ఈ ప్రకృతి ప్రత్యయవిభాగాదినిరూపణం అంతా భాష నేర్చుకుంటూన్న బాలులకు మనస్సుకు విషయం బాగా హత్తుకోవడం కోసం. అసత్యమైన అనగా కల్పించిన. ఈ ప్రకృతిప్రత్యయాదుల ద్వారా సత్యమైన వాక్యస్వరూపం తెలుసుకోవడానికి వీలు అవుతుంది అని కూడా అంటాడు భర్తృహరి.

"ఉపాయాః శిక్షమాణానాం బాలానాముపలాలనాః,
అసత్యే వర్త్మని స్థిత్వా తతః సత్యం సమీహతే".
(వాక్యపదీయం. II. 238)

ఈ విధంగా పారమార్థికదృష్టితో చూస్తే పదవర్ణాదివిభాగం లేకపోయినా కాల్పనికదృష్టితో చూచినప్పుడు ఈ భేదాలు అన్నీ ఉన్నాయని వైయాకరణులు కూడా అంగీకరించారు కాబట్టి వాళ్ళు కూడా నిఃశేషచ్యుతేత్యాదులలో విధ్యాదుల వ్యంగ్యత్వాన్ని అంగీకరించవలసినదే కదా అని మమ్మటుని పై వాక్యానికి అభిప్రాయం.

అవ. "అనుమానప్రమాణంచేతనే వ్యంగ్యార్థం తెలుస్తుంది, అందుచేత వ్యంగ్యార్థ ప్రతీతికోసం వ్యంజనావ్యాపారం అనే వ్యాపారాన్ని కొత్తగా అంగీకరించవలసిన పనిలేదు" అని మహిమభట్టు వ్యక్తివివేకంలో ధ్వనిసిద్ధాంతాన్ని ఖండించాడు. ఆయన మతాన్ని అనువదించి ఖండిస్తున్నాడు-

వృ. నను వాచ్యాదసంబద్ధం తావన్న ప్రతీయతే; యతః కుతశ్చిత్ యస్య కస్య చిదర్థస్య ప్రతీతేః ప్రసంగాత్, ఏవం చ సంబన్ధాత్ వ్యఙ్గ్యవ్యఞ్జకభావః అప్రతిబన్ధే అవశ్యం న భవతీతి వ్యాప్తత్వేన నియతధర్మినిష్ఠత్వేన చ త్రిరూపాల్లిఙ్గాత్ లిఙ్గిజ్ఞానమనుమానం యత్ తద్రూపః పర్యవస్యతి. తథాహి—

గాథ. "భమ ధమ్మిఅ వీసద్ధో సో సుణఓ అజ్జ మారిఓ తేణ,
గోలాణఈకచ్ఛకుడంగవాసిణా దరిఅసీహేణ".

"భ్రమ ధార్మిక విశ్రబ్ధః స శునకోఽద్య మారితస్తేన,
గోదావరీకచ్ఛకుఞ్జవాసినా దృప్తసింహేన".

వృ. అత్ర గృహే శ్వనివృత్త్యా భ్రమణం విహితం గోదావరీతీరే సింహోపలబ్ధేః అభ్రమణమనుమాపయతి. యత్ యత్ భీరుభ్రమణం తత్తత్ భయకారణనివృత్త్యుపలబ్ధిపూర్వకమ్; గోదావరీతీరే చ సింహోపలబ్ధిరితి వ్యాపకవిరుద్ధోపలబ్ధిః.

వ్యా. (పూర్వపక్షం) నను ఇత్యాది:- వాచ్యమైన అర్థంతో సంబంధం లేని మరొక అర్థం స్ఫురించదు. అలా స్ఫురించే పక్షంలో ఏ వాచ్యార్థంనుంచి అయినా ఏ అర్థమైనా స్ఫురించవచ్చును అని చెప్పవలసి వస్తుంది. అందుచేత సంబంధంవల్ల మాత్రమే ఏర్పడే వంగ్యవ్యంజకభావం, నియతసంబంధం లేకపోతే తప్పక ఉండదు గాన వ్యాప్తం అవడంచేత, నియతత్వంచేత, ధర్మినిష్ఠత్వంచేత త్రిరూపమైన లింగంవల్ల ఏ లింగిజ్ఞానరూపమైన అనుమానం ఉన్నదో ఆ రూపం కలదిగా పర్యవసానం చెందుతుంది. అది ఎట్లనగా-

భమేతి :- ఒక ధార్మికుడు, దేవతాపూజాదులు చేసే పుణ్యాత్ముడు, గోదావరీతీరంలో ఉన్న పొదలలో పుష్పాలు కోయడానికి వస్తూండడంచేత ఒక స్వైరిణి ఆ ప్రాంతంలో తన ప్రియుణ్ణి కలుసుకోవడానికి విఘ్నం కలుగుతుంది. అత డక్కడికి రాకుండా చేయడానికి ఆమె ఉపాయం పన్ని పలికే మాటలు. ఈ గాథగాథాసప్తశతిలోనిది. ధార్మిక=ధార్మికుడా! విశ్రబ్ధః=విశ్వాసం కలవాడవై, నిర్భయంగా, భ్రమ = తిరుగుము. సః శునకః = ఆ కుక్క, గోదానదీకచ్ఛకుఞ్జవాసినా = గోదానదియొక్క జలప్రాయ ప్రాంతంలోని పొదలలో నివసిస్తూన్న, తేన = ఆ, దృప్తసింహేన = గర్వించిన సింహంచేత, మారితః=చంపబడినది.

ఇక్కడ కుక్కలేకపోవడంచేత గృహంలో విధింపబడిన భ్రమణం సింహం ఉండడంచేత గోదావరీతీరంలో సంచరించకపోవడాన్ని అనుమానింపచేస్తున్నది. పిరికివాని ఏ ఏ సంచారం ఉన్నదో అది భయకారణనివృత్త్యుపలబ్ధిపూర్వకమైనది;

గోదావరీతీరంలో సింహం కనబడుతున్నది. ఈ విధంగా ఇక్కడ వ్యాపకవిరుద్ధో పలబ్ధి ఉన్నది.

పై. ఈ ప్రఘట్టకం అర్థం అవాలంటే సంక్షిప్తంగా అనుమాన ప్రమాణ స్వరూపం తెలుసుకోవలసి ఉంటుంది. ధూమం ఉన్న వంటిల్లు మొదలైన ప్రదేశాలన్నింటిలోనూ నిప్పు ఉండడం చూచిన వ్యక్తి "యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః" (ఎక్కడెక్కడ ధూమం ఉంటుందో అక్కడక్కడ నిప్పు ఉంటుంది) అనే ఒక నియమాన్ని గ్రహిస్తాడు. అది అతని మనస్సులో ఉండి పోతుంది. ఒకనాడు దూరంనుంచి పర్వతంమీద పొగ చూస్తాడు. వెంటనే అతనికి "పర్వతో వహ్నిమాన్; ధూమాత్; యథా మహానసః" (పర్వతం నిప్పుకలిగి ఉంది. ధూమం కనబడుతున్నది కాబట్టి; వంటిల్లువలె అనగా - వంటింట్లో వలె ఈ పర్వతంమీద పొగ కనబడుతున్నది; అందుచేత దీనిమీద నిప్పు ఉంది) అనే జ్ఞానం కలుగుతుంది. ఇక్కడ వహ్ని 'సాధ్యం'; ఉన్నట్లుగా సాధింపబడుతున్నది; ధూమం 'హేతువు'; వహ్నిజ్ఞానాన్ని కలిగిస్తున్నది. దీనికే సాధనం అని పేరు. మహానసం'దృష్టాంతం.' హేతువుకు 'లింగం'అనీ, సాధ్యానికి 'లింగి' అనీ కూడా పేర్లు.

"యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః"అని వెనక చెప్పినదానికి 'వ్యాప్తి' అని పేరు. దీనిలో ధూమానికి 'వ్యాప్యం' అనీ, వహ్నికి 'వ్యాపకం' అనీ పేర్లు. ఇది 'అన్వయవ్యాప్తి'. "యత్ర యత్ర వహ్న్యభావః తత్ర తత్ర ధూమాభావః" (ఎక్కడెక్కడ నిప్పు ఉండదో అక్కడ ధూమం ఉండదు)అనేది వ్యతిరేకవ్యాప్తి. ఈ రెండు విధాలైన వ్యాప్తులూ కూడ అనుమానానికి ఉపకరిస్తాయి. దేనిమీద సాధ్యం ఉన్నట్లు నిశ్చితం కాదో, సాధ్యాన్ని ఊహిస్తారో, అది 'పక్షం'. ఇక్కడ పర్వతంమీద వహ్ని ఉన్నట్లు నిశ్చితం కాకపోవడంచేత ఉన్నట్లు ఊహిస్తున్నాడు; అందుచేత పర్వతం 'పక్షం'. దీనికే 'ధర్మి' అని కూడా పేరు. దేనియందు సాధ్యం నిశ్చితమో అది 'సపక్షం'. అనేకపర్యాయాలు చూడడంచేత వంటఇంట్లో అగ్ని ఉండడం నిశ్చితం; అందుచేత ఇది 'సపక్షం'. దేనియందు సాధ్యం ఉండడానికి వీలు లేదని నిశ్చితంగా తెలియునో అది 'విపక్షం'. మహాహ్రదం (చెరువు)లో అగ్ని ఉండదని నిశ్చితంగా తెలుసును. అందుచేత మహాహ్రదం 'విపక్షం'.

ఒక హేతువుచేత ఒక సాధ్యాన్ని సాధించాలంటే ఆ హేతువులో మూడు అంశాలు ఉండాలి. ఒకటి వ్యాప్తత్వం. అనగా ఆ హేతువు సపక్షాలన్నింటిలోనూ ఉండాలి. రెండవది నియతత్వం; సపక్షాలలో మాత్రమే ఉండాలి; విపక్షాలలో ఉండగూడదు. మూడవది ధర్మినిష్ఠత్వం; అది ధర్మియందు, అనగా పక్షంలో ఉండాలి. ఈ మూడు అంశాలు ఉన్న త్రిరూపమైన హేతువే (లింగమే) సాధ్యాన్ని (లింగిని) తెలుసుకొనడానికి ఉపకరిస్తుంది. ఇక్కడ మమ్మటుడు ప్రయోగించిన పారిభాషికపదాల అర్థాలు తెలుసుకొనడానికి ఇంతమాత్రం చాలు. ఇతోధికజ్ఞానం కావలసినవారు తర్కసంగ్రహ - తర్కభాషాదిగ్రంథాలనుండి ఇతరవిషయాలు గ్రహించవచ్చును.

అభిధా లక్షణావృత్తులకంటె భిన్నంగా మూడవదైన వ్యంజనావృత్తిని అంగీకరించవలసిన పని లేదు అనే మహిమభట్టాదుల అభిప్రాయం ఇది - ఒక వాక్యం వినగానే దాని వాచ్యార్థం తెలిసిన తరవాత మరొక అర్థం కూడా ప్రతీయమానం అవుతుంది; అదే వ్యంగ్యార్థం అని కదా మీరు (వ్యంజనా వ్యాపారవాదులు) చెప్పేది ? వాచ్యార్థంకంటె భిన్నమైన మరొక అర్థం బుద్ధిగోచరం అవుతుం దనే మాట నిజమే. అయితే ఆ రెండవ అర్థానికీ, వాచ్యార్థానికీ సంబంధం ఉంటుందా ఉండదా ? ఉంటుం దనే చెప్పాలి. ఏ సంబంధమూ లేని మరొక అర్థాన్ని బోధిస్తుంది అని చెప్పే పక్షంలో ఒకవాచ్యార్థంనుంచి ఏ అర్థమైనా గమ్యం కావలసివస్తుంది. వాచ్యార్థంతో సంబంధం ఉన్న మరొక అర్థాన్ని బోధిస్తుంది అని ఎప్పుడు అంగీకరించామో ఈ వాచ్యార్థానికీ ఆ రెండవ అర్థానికీ నియత సంబంధం ఉన్న దని అర్థం. అనగా ధూమానికీ అగ్నికి ఏ విధంగా వ్యాప్తి (నియతసంబంధం) ఉన్నదో అట్లే ఈ రెండర్థాలకీ ఉన్నదన్న మాట. ప్రతిబంధం లేకపోతే (ప్రతిబంధం అనగా నియతసంబంధం, అది లేకపోతే), వ్యంగ్య వ్యంజకభావం కుదరదు. అనగా వ్యంగ్యమైన రెండవఅర్థానికీ, వ్యంజకమైన వాచ్యార్థానికీ నియతమైన సంబంధం ఉండితీరాలి. అందుచేత సపక్షంలో ఉండడం విపక్షంలో లేకపోవడం, పక్షంతో సంబంధించి ఉండడం అనే మూడు రూపాలు గల లింగాన్ని (హేతువును) పట్టి లింగిని (సాధ్యాన్ని) తెలుసుకున్నట్లు వాచ్యార్థాన్ని పట్టి రెండవ అర్థాన్ని గ్రహిస్తున్నాం కాబట్టి నీవు చెప్పే ఈ వ్యంగ్య వ్యంజకభావం చివరికి అనుమానంగానే పర్యవసన్నం అవుతుంది.

ఆనందవర్ధనుడు ధ్వనికి ఉదాహరణగా ఇచ్చిన "భమ ధమ్మిఅ" ఇత్యాది గాథలో "కుక్కకే భయపడి గృహప్రాంగణంలో కూడా తిరగడానికి జంకేవాడు సింహం ఉన్న గోదావరీనదీతీర ప్రాంతంలో తిరగడం అసంభావ్యం; అందుచేత 'భమ' అనే దానికి 'మా భమ' అని అర్థం. అది వ్యంగ్యం" అని ప్రతిపాది స్తున్నారు. కాని దీనిని వ్యంగ్యం అని చెప్పవలసిన పనిలేదు. అనుమేయం (అను మాన ప్రమాణగమ్యం అని చెప్పవచ్చు. ఇక్కడ వాక్యార్థాన్ని పట్టి "యద్యత్ భీరు భ్రమణం తత్తత్ భయకారణనివృత్తిజ్ఞానపూర్వకమ్" అనే వ్యాప్తి ఏర్పడు తుంది. "భయకారణం ఏదీ లేదు అని ఎప్పుడు తెలుసుకుంటాడో అప్పుడే పిరికి వాడు సంచరిస్తాడు"అని దీని అర్థం. ఈ వ్యాప్తిలో 'భీరుభ్రమణం' వ్యాప్యం; 'భయకారణనివృత్త్యుపలబ్ధి' వ్యాపకం'. గోదావరి తీరంలో భయకారణనివృ త్త్యుపలబ్ధి కాక, భయకారణసింహోపలబ్ధి ఉన్నది. అందుచేత వ్యాపకానికి విరుద్ధమైనదాని జ్ఞానం ఉన్నది. అనగా వ్యాపకం అయిన వహ్ని లేకపోతే వ్యాప్యమైన ధూమం ఎలా ఉండదో అదే విధంగా వ్యాపకం అయిన భయకారణ నివృత్త్యుపలబ్ధి లేకపోవడంచేత వ్యాప్యం అయిన భీరుభ్రమణం కూడా ఉండదు. అందుచేత అనుమాన ప్రమాణంచేతనే ఈ గాథలో ధార్మికభ్రమణాభావం తెలుస్తు న్నది గాన దానికోసమై వ్యంజనను అంగీకరించి ఆ రెండవ అర్థం వ్యంగ్యం అని చెప్పవలసిన పని లేదు. అది అనుమేయమే. ఈ విధంగా మీ వ్యంజన అనుమానంచేతనే గతార్థం అయిపోతుంది.

అవ. పై మతాన్ని ఖండిస్తున్నాడు :-

వృ. అత్రోచ్యతే-భీరురపి గురోః ప్రభోర్వా నిదేశేన, ప్రియాను రాగేణ, అన్యేన చైవంభూతేన హేతునా సత్యపి భయకారణే భ్రమతీత్య నైకాన్తికో హేతుః. శునో బిభ్యదపి వీరత్వేన సింహాన్న బిభేతీతి విరు ద్ధోఽపి. గోదావరీతీరే సింహసద్భావః ప్రత్యక్షాదనుమానాద్వా న నిశ్చితః, అపి తు వచనాత్. న చ వచనస్య ప్రామాణ్యమస్తి, అర్థేనాప్రతిబన్ధాత్ ఇతి అసిద్ధః చ. తత్కథమేవం విధాద్ధేతోః సాధ్యసిద్ధిః ?

వ్యా. అత్రోచ్యతే ఇతి - ఈ విషయంలో (సమాధానం) చెప్పబడుచున్నది. పిరికివాడు కూడా గురువుయొక్క లేదా ప్రభువుయొక్క ఆజ్ఞచేత లేదా ప్రియ

రాలిపై అనురాగంచేత (లేదా) ప్రియులైన వ్యక్తులమీద ప్రేమచేత లేదా మరొక ఈ విధమైన (నిధిలాభం వంటి) హేతువుచేత భయకారణం ఉన్నా కూడ సంచరించవచ్చును. అందుచేత హేతువు అనైకాంతికం. (స్వర్శదోషాదులవల్ల) కుక్కకి భయపడినా వీరుడు అవడంచేత సింహానికి భయపడకపోవచ్చును; అందుచేత హేతువు విరుద్ధం కూడ. గోదావరీతీరంలో సింహం ఉన్నదని ప్రత్యక్షంవల్ల గాని అనుమానం వల్ల గాని నిశ్చితంగా తెలియదు. కేవలం ఆ కులట మాటవల్లనే తెలుస్తూన్నది. (ఆప్తవాక్యానికే ప్రామాణ్యం కాని) కులటావాక్యానికి ప్రామాణ్యం లేదు. అర్థంతో ఆ వాక్యానికి తప్పక సంబంధం ఉందని చెప్పడానికి వీలులేదు కదా ? అందుచేత ఈ హేతువు అసిద్ధం కూడ. ఈ విధమైన హేతువువల్ల సాధ్యసిద్ధి ఎట్లు కలుగుతుంది ?

వి. అనుమితిలో హేతువును పట్టి సాధ్యాన్ని సాధిస్తాం. అయితే ఆ హేతువు అసద్ధేతువు కాకూడదు. అసద్ధేతువుకు 'హేత్వాభాస'అని కూడ పేరు. అలాంటి అసద్ధేతువును ప్రయోగించిన అనుమితి ప్రమాణం కాదు. హేత్వాభాసలు మొత్తం అయిదు. వాటిలో కొన్ని అవాంతరభేదాలు కూడా ఉన్నాయి. పూర్వపక్షి చూపిన అనుమానప్రయోగంలో మమ్మటుడు మూడు హేతు దోషాలను చూపుతున్నాడు.

అనైకాంతికం - సాధ్యం లేనిదానిలో కూడా ఉన్న హేతువు అనైకాంతికం. దీనికి 'సవ్యభిచారం'అని కూడా పేరు. ఉదా. "పర్వతో ధూమవాన్; వహ్నేః" (పర్వతంమీద ధూమం ఉన్నది; అగ్ని ఉంది కాబట్టి) అనే ప్రయోగంలో వహ్ని హేతువు, ధూమం సాధ్యం. ఇలాంటి ప్రయోగం చేయాలంటే "యత్ర యత్ర వహ్నిః తత్ర తత్ర ధూమః" (ఎక్కడెక్కడ నిప్పు ఉంటుందో అక్కడ ధూమం ఉంటుంది) అనే వ్యాప్తి ఉండాలి. కాని ఎఱ్ఱగా కాల్చిన అయః పిండం (ఇనుప గుండు) మీద నిప్పు ఉన్నా అక్కడ పొగ ఉండదు. అందుచేత సాధ్యమైన పొగ లేని అయః పిండంమీద హేతువైన నిప్పు ఉన్నది కాబట్టి, ఇది, (వహ్నేః అనే హేతువు), అనైకాంతికం.

ప్రకృతంలో "యద్యత్ భీరుభ్రమణం తత్తత్ భయకారణ నివృత్తి జ్ఞానపూర్వకమ్" అనే వ్యాప్తిని పట్టి "గోదావరీతీరం భీరుభ్రమణాయోగ్యమ్, సింహవత్త్వాత్; యన్నైవం తన్నైవమ్, యథా గృహమ్" (గోదావరీతీరం పిరికివాడు సంచరించడానికి యోగ్యం అయినది కాదు; సింహం ఉంది కాబట్టి; ఏది ఇట్లు

కాదో అది ఇట్లు కాదు; అనగా ఎక్కడ సింహం లేదో అది భ్రమణాయోగ్యం కాదు; గృహం వలె) అని అనుమితిని పూర్వపక్షి కల్పించినాడు కదా ? అయితే "సింహవత్త్వాత్" అనే హేతువు అనైకాంతికం. పిరికివాడు కూడా గురువుల అజ్ఞ చేతనో, ప్రభువు ఆజ్ఞచేతనో ఇతరకారణాలచేతనో సింహాదిభయకారణం ఉన్న చోట కూడా సంచరించవచ్చు కదా ? అందుచేత సింహం ఉన్న ప్రదేశం భీరు భ్రమణానికి యోగ్యం కాదు అనే నియమం లేదు.

విరుద్ధహేతువు : ఏ హేతువును సాధ్యాన్ని సాధించడానికి చూపుతామో ఆ హేతువుకు సాధ్యాభావంతో వ్యాప్తి ఉన్నట్లయితే అది విరుద్ధహేతువు. ఉదా. "శబ్దః నిత్యః, కార్యత్వాత్" అనే ప్రయోగంలో కార్యత్వాన్ని హేతువుగా చూపి శబ్దానికి నిత్యత్వం సాధిస్తున్నాం. అయితే కార్యత్వాత్ (పుట్టించబడుతుంది కాబట్టి) అనే హేతువుకు సాధ్యవిరుద్ధమైన అనిత్యత్వంతో వ్యాప్తి ఉంది కాని నిత్యత్వంతో లేదు. 'యద్యత్ కార్యం తత్తత్ అనిత్యమ్' అని వ్యాప్తి. 'ఏది పుట్టించబడుతుందో అది అనిత్యం' అని దీని అర్థం. అందుచేత అనిత్యత్వంతో వ్యాప్తి ఉన్న హేతువు నిత్యత్వాన్ని ఎలా సాధిస్తుంది ?

ప్రకృతంలో అపవిత్రం అయిన కుక్కను స్పృశిస్తే పాపం వస్తుం దని కుక్కని చూచి భయపడినా పిరికిడు సింహానికి భయపడడు. అందుచేత "యత్ర యత్ర సింహవత్త్వం తత్ర తత్ర శునకభీరుభీరుభ్రమణయోగ్యత్వమ్ "(సింహం ఉన్న ప్రదేశం కుక్కకి భయపడే పిరికిడు సంచరించడానికి యోగ్యమే) అని వ్యాప్తి ఉండడంచేత "సింహవత్త్వాత్" అనే హేతువు విరుద్ధం. సింహవత్త్వ హేతువుకు సాధ్యమైన భీరుభ్రమణాయోగ్యత్వం యొక్క అభావంతో, (భీరు భ్రమణాయోగ్యత్వాభావంతో) అనగా భీరుభ్రమణయోగ్యత్వంతో వ్యాప్తి ఉన్నది కదా ? అందుచేత మీరు చూపిన హేతువులో విరుద్ధత్వం అనే దోషం కూడా ఉంది.

అసిద్ధహేతువు : అసిద్ధిభేదాలలో 'స్వరూపాసిద్ధి' అనేది ఒకటి. పక్షంలో హేతువు లేకపోవడం స్వరూపాసిద్ధి. స్వరూపాసిద్ధి అనే దోషం ఉన్న హేతువు స్వరూపాసిద్ధం. ఉదా. "హ్రదో వహ్నిమాన్; ధూమాత్" (చెరువులో నిప్పు ఉన్నది; పొగ ఉండికనక) అనే ప్రయోగంలో ధూమాత్ అనే హేతువు హ్రదం అనే పక్షంలో లేదు గాన అసిద్ధం. ప్రకృతంలో - గోదావరీతీరంలో సింహం

ఉన్న దనే విషయం అనిశ్చితం. ఆప్తుడు పలికిన మాటలకే ప్రామాణ్యం కాని కులట మాటలకు ప్రామాణ్యం లేదు. శబ్దం ఉచ్చరించినంతమాత్రంచేత ఆ అర్థం ఉండి తీరాలనే నియమం లేదు గాన ఎవరు పలికినా శబ్దం ప్రమాణమే అనడం కుదరదు. అందుచేత 'సింహవత్త్వాత్' అనే హేతువు అసిద్ధం.

ఈ విధంగా మూడు దోషాలు ఉన్న ఈ హేతువు హేత్వాభాసం మాత్రమే; ఇది సాధ్యాన్ని సాధించజాలదు.

అవ. తాను ధ్వన్యుదాహరణంగా ఇచ్చిన 'నిఃశేషచ్యుత' ఇత్యాదిశ్లోకంలో కూడా అనుమానంచేత వ్యంజనను గతార్థం చేయడం కుదరదు అని నిరూపిస్తున్నాడు:-

వృ. తథా నిఃశేషచ్యుతేత్యాదౌ గమకతయా యాని చన్దనచ్యవనాదీన్యుపాత్తాని తాని కారణాన్తరతోఽపి భవన్తి. అతశ్చాత్రైవ స్నానకార్యత్వేనోక్తానీతి నోపభోగే ఏవ ప్రతిబద్ధానీతి అనైకాన్తికాని. వ్యక్తివాదినా చ అధమపదసహాయానామేషాం వ్యఞ్జకత్వముక్తమ్, న చాత్రాధమత్వం ప్రమాణప్రతిపన్నమితి కథమనుమానమ్ ? ఏవంవిధాదర్థాదేవం విధోఽర్థః ఉపపత్త్యనపేక్షత్వేఽపి ప్రకాశతే ఇతి వ్యక్తివాదినః పునస్తత్ అదూషణమ్.

ఇతి కావ్యప్రకాశే ధ్వనిగుణీభూత వ్యఙ్గ్య సంకీర్ణభేద నిర్ణయో నామ పఞ్చమ ఉల్లాసః

వ్యా. తథా ఇతి :- "నిఃశేషచ్యుతచన్దనమ్" ఇత్యాదిశ్లోకంలో కూడా ఏ చందనచ్యవనాదులు సంభోగసూచకాలుగా చెప్పబడ్డాయో అవి ఇతర కారణాలవల్ల కూడా కలగవచ్చును. అందుచేతనే స్నానకార్యాలుగా ఇక్కడనే చెప్పబడ్డాయి. అందువలన ఉపభోగంతోనే ప్రతిబద్ధాలు, అనగా నియతంగా సంబంధించినవి, కావు. అందుచేత అవి అనైకాంతికాలు.

వి. నిఃశేషేత్యాదిశ్లోకంలో చందనం పూర్తిగా తొలగిపోవడం మొదలైనవి సంభోగాన్ని సూచిస్తున్నాయి అని చెప్పి ఉన్నాం. అయితే ఈ చందనచ్యవ

నాదులను పట్టి సంభోగం అనుమేయం అని చెప్పడానికి వీలులేదు సంభోగం వల్లనే కాకుండా ఇతరకారణాలచేత కూడా ఇవి జరగవచ్చును కదా? స్నానం చేయడం వల్ల ఇవి జరిగినట్లు ఈ శ్లోకంలోనే చెప్పబడింది కదా? అందుచేత చందనచ్యవనాదులు తప్పకుండా సంభోగంతోనే సంబంధించినవి, సంభోగం తప్ప మరొక ఏ కారణంచేతా జరగవు, అని చెప్పడానికి వీలులేదు గాన అవి అనైకాంతికాలు. అనైకాంతికాలైన ఆ హేతువులచేత అనుమానప్రమాణం ద్వారా సంభోగాన్ని సాధించడం కుదరదు గాన సంభోగం వ్యంగ్యమే కాని అనుమేయం కాదు.

వ్యా. వ్యక్తితి:- వ్యక్తి (వ్యంజనా) వాది "ఈ చందనచ్యవనాదులు 'అధమ' పదసాహాయ్యంచేత సంభోగాన్ని వ్యంజింపచేస్తున్నాయి" అని ప్రతిపాదించాడు. అయితే ఇక్కడ అధమత్వం ఇతరప్రమాణాలచేత నిర్ధారితం కాలేదు; అందుచేత అనుమానం కుదరదు. ఉపపత్తి ఉన్నా లేకపోయినా ఈ విధమైన అర్థంనుంచి ఈ విధమైన అర్థం ప్రతీతం అవుతుంది అని వ్యంజనావాది చెప్పవచ్చు.

వి. నువ్వు "ఆ అధమునిదగ్గరికి వెళ్ళలేదు" అని 'అధమ' పదాన్ని ప్రయోగించడంచేత ఈ చందనచ్యవనాదులు సంభోగంవల్లనే జరిగినాయి అని వ్యంగ్యం అవుతున్నది అని వ్యంజనావాది చెప్పగలడు. ఎందుచేత ననగా అనైకాంతికత్వాదిదోషాలు అనుమానంలోనే కాని వ్యంజనవిషయంలో లేవు. ఇక్కడ ఉన్న 'అధమ' పదాన్ని పట్టి సంభోగానుమితి చేయవచ్చును కదా అనే ఆశంకకుకూడా తావు లేదు. అతడు అధముడు అని చెప్పడానికి మరొకప్రమాణం ఏదైనా ఉంటే అలా చెప్పవచ్చునేమో. కాని అలాంటి ప్రమాణం ఏదీ లేదు కదా? ఒక వాచ్యార్థం తెలిసిన వెంటనే కొన్ని ఇతరార్థాలు స్ఫురించడం అనేది అనుభవసిద్ధం. ఆ అర్థాలు ఉపపన్నాలా అనుపపన్నాలా అనే ప్రశ్నతో వ్యంజనావాదికి సంబంధం లేదు అవి అనుపపన్నాలైతే అది ఇంకా అతనికి భూషణమే, దూషణం కాదు. ఎందుచేత ననగా వ్యంజనావాదంలో ఉన్న సొగసు అంతా ఇదే. ప్రతి వ్యంగ్యార్థాన్ని అనుమేయం అని స్థాపించడం మాత్రం కుదరదు. వ్యభిచార-అసిద్ధత్వ-విరుద్ధత్వాదిదోషాలు ఉన్నంతవరకూ ఆ అనుమానం ప్రమాణం కాదు కదా? అలాంటి దోషాలు ఏవీ లేనిచోట ఎక్కడైనా గమ్యమానార్థం అనుమేయం అని అనుమితివాది నిరూపిస్తే అది అనుమేయమే, వ్యంగ్యం కాదు అని అంగీకరించ

డానికి వ్యంజనావాదికికూడా ఏమీ అభ్యంతరం ఉండదు. "వాడు లేచినిలబడ్డాడు" అన్నప్పుడు "అంతకు పూర్వం అతడు కూర్చున్నాడు" అనే అర్థం గమ్యం అవుతుంది. అది అనుమేయమే అని మీరు వాదిస్తే మాకూ అభ్యంతరం లేదు. వ్యంజననే పూర్తిగా అనుమానంలో అంతర్గతం చేయడం మాత్రం కుదరదు.

"బాలానందిని' అనే కావ్యప్రకాశవ్యాఖ్యానంలో ధ్వని-గుణీభూతవ్యంగ్య సంకీర్ణభేదనిర్ణయం అనే పంచమోల్లాసం సమాప్తం.

* * *

# అథ షష్ఠ ఉల్లాసః

అవ. వెనుకటి ఉల్లాసంలో మధ్యమకావ్యస్వరూపం నిర్ణయించబడింది. ఇప్పుడు క్రమప్రాప్తమైన అధమకావ్యాన్ని నిరూపిస్తున్నాడు. అధమకావ్యభేదాలైన శబ్దచిత్ర-అర్థచిత్రకావ్యాలను లక్షణోదాహరణాలతో సంక్షిప్తంగా ప్రథమోల్లాసం లోనే విశదీకరించడం జరిగింది. నవమదశమోల్లాసాలలో క్రమంగా శబ్దాలంకార అర్థాలంకారాలను లక్షణోదాహరణపూర్వకంగా విశదీకరించనున్నాడు. అయితే వెనక చెప్పిన భేదద్వయం అనుపపన్నంగా ఉంది. ఎందుచేత ననగా "స్వచ్ఛన్దోచ్ఛలత్" (4వ శ్లోకం) ఇత్యాదిశబ్దచిత్రోదాహరణంలో ఇతరనదులకంటె గంగకు ఆధిక్యం ఉన్న దని వర్ణించడంచేత వ్యతిరేకాలంకారం (అర్థాలంకారం) ఉన్నది కాబట్టి దీనిలో అర్థచిత్రం కూడా ఉంది. "వినిర్గతం మానదమ్" (5వ శ్లోకం) ఇత్యాద్యర్థచిత్రోదాహరణంలో "మానదమాత్మమన్దిరాత్" అన్నప్పుడు మకారాను ప్రాస, 'ససంభ్రమేన్ద్రద్రుత' అన్నప్పుడు మరొక అనుప్రాసా కూడా ఉన్నాయి కాబట్టి ఇక్కడ శబ్దచిత్రం కూడా ఉంది. అందుచేత పరస్పరాపేక్ష లేని శబ్దచిత్ర-అర్థచిత్రాలు లేవు కదా. అప్పుడు ఈ చిత్రకావ్యద్వైవిధ్యం ఎలా కుదురుతుంది అని ఆశంక కలగవచ్చును. తన్నివృత్తికై ఈ షష్ఠోల్లాసం ప్రారంభిస్తున్నాడు-

కా. శబ్దార్థచిత్రం యత్పూర్వం కావ్యద్వయముదాహృతమ్,
గుణప్రాధాన్యతస్తత్ర స్థితిశ్చిత్రార్థశబ్దయోః. 48

వృ. న తు శబ్దచిత్రే అర్థస్య అచిత్రత్వమ్; అర్థచిత్రే వా శబ్దస్య. తథా చోక్తమ్-

వ్యా. శబ్దేతి :- పూర్వమ్ = పూర్వము, శబ్దార్థచిత్రమ్ = శబ్దచిత్రము, అర్థచిత్రమూ అని, యత్ = ఏ, కావ్యద్వయమ్ = కావ్యముల ద్వయము, ఉదాహృతమ్ = చెప్పబడిందో, తత్ర = ఆ కావ్యద్వయమునందు, చిత్రార్థశబ్దయోః = చిత్రములైన అర్థ శబ్దములయొక్క, స్థితిః = ఉనికి, గుణప్రాధాన్యతః = గుణత్వంచేత, ప్రాధాన్యంచేత (ఏర్పడును).

వి. శబ్దచిత్రంలో అర్థచిత్రం కూడా ఉండవచ్చును; అర్థచిత్రంలో శబ్ద చిత్రం కూడా ఉండవచ్చును. అయితే శబ్దచిత్రం ప్రధానంగా ఉండి అర్థచిత్రం అప్రధానంగా ఉంటే దాన్ని శబ్దచిత్రం అనీ తద్విరుద్ధంగా ఉంటే అర్థచిత్రం అనీ గ్రహించాలి. మొదటినుండి చివరిదాకా చిత్రశబ్దం విషయంలోనే కవిసంరంభం ఉంటే అది శబ్దచిత్రం. మొదటినుండి చివరిదాకా చిత్రార్థవిషయంలోనే కవిసంరంభం ఉంటే అది అర్థచిత్రం అని భావం.

వ్యా. నత్వితి :- అంతేనే కాని శబ్దచిత్రంలో అర్థం చిత్రంగా ఉండదనీ, అర్థచిత్రంలో శబ్దం చిత్రంగా ఉండదనీ అర్థం కాదు. ఈ విషయమే (భామహుని చేత) చెప్పబడింది.

శ్లో॥ "రూపకాదిరలఙ్కారస్తస్యాన్యైర్బహుధోదితః,
సకాన్తమపి నిర్భూషం విభాతి వనితాననమ్,
రూపకాదిమలంకారం బాహ్యామాచక్షతే పరే,
సుపాం తిఙాం చ వ్యుత్పత్తిం వాచాం వాఞ్ఛన్త్యలంకృతిమ్,
తదేతదాహుః సౌశబ్ద్యం నార్థవ్యుత్పత్తిరీదృశీ,
శబ్దాభిధేయాలంకారభేదాదిష్టం ద్వయం తు నః." ఇతి.

వ్యా. రూపకాదిరితి :- అన్యైః = కొందరిచేత, తస్య = కావ్యంయొక్క, రూపకాదిః = రూపకంమొదలైన, బహుధా = అనేకవిధాలైన, అలంకారః = అర్థాలంకారం, ఉదితః = చెప్పబడింది. కాన్తమపి = సుందరమైనా, వనితాననమ్ = స్త్రీముఖము, నిర్భూషమ్ = అలంకారాలు లేనిదై, న భాతి = ప్రకాశించదు కదా? కావ్యసౌందర్యానికి రూపకాద్యర్థాలంకారాలు చాలా ప్రధానమైనవి అని వీరి అభిప్రాయం. పరే = మరి కొందరు, రూపకాదిమ్ = రూపకం మొదలైన, అలంకారమ్ = అలంకారాన్ని, బాహ్యమ్ = బాహ్యమైనదానినిగా, ఆచక్షతే = చెప్పుచున్నారు. సుపామ్ = సుప్పులయొక్క అనగా సుబంతశబ్దాలయొక్క, తిఙాం చ = తిఙ్‌లయొక్క, తిఙంతశబ్దాలయొక్క, వ్యుత్పత్తిమ్ = చక్కని కూర్పును, వాచామ్ = వాక్కులకు, అలంకృతిమ్ = అలంకారమునుగా, వాఞ్ఛన్తి = కోరుచున్నారు. తత్ ఏతత్ = అట్టి దీనినే, సౌశబ్ద్యమ్ = శబ్దసౌందర్యమునుగా అనగా శబ్దాలంకారమునుగా, ఆహుః = చెప్పుచున్నారు. అర్థవ్యుత్పత్తిః = అర్థాలకూర్పు,

ఈదృశే = ఇట్టిది, న = కాదు. ముందుగా శబ్దం విన్న తరవాత కదా అర్థం తెలిసేది? అందుచేత అర్థాలంకారాలు బాహ్యమైనవి. శబ్దం వినగానే చమత్కారాన్ని కలిగించే సుబంతతిజంతశబ్దసంసివేశరూపాలైన శబ్దాలంకారాలే అంతరంగమైనవి. అందుచేత వాటికే ప్రాధాన్యం అని వీరి అభిప్రాయం. నః తు = మాకైతే, శబ్దాభిధేయాలంకారభేదాత్ = శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు అనే భేదంవల్ల, ద్వయమ్ = ద్వయమూ కూడ. ఇష్టమ్ = ఇష్టమైనదే. కావ్యంలో శబ్దాలంకారాలు అర్థాలంకారాలూ కూడా ఉండాలి అని మా అభిప్రాయం. ఇవి భామహుని కావ్యాలంకారంలోని (1-13-15) శ్లోకాలు.

వి. ఈ విధంగా శబ్దచిత్ర-అర్థచిత్రాలకు ప్రాధాన్యం సమానమే అయినా కొన్ని శ్లోకాలలో కవి శబ్దచిత్రాన్నీ, కొన్నింటిలో అర్థచిత్రాన్నీ నిర్వహించడానికి ప్రయత్నంచేస్తూ ఉంటాడు. దానిని పట్టి ఏదో ఒక పేరు పెట్టాలి. ఒక శ్లోకంలో రెండింటికి సమప్రాధాన్యమే కనబడిన పక్షంలో అక్కడ ఉభయచిత్రం అని చెప్పవచ్చును.

వృ. శబ్దచిత్రం యథా—

శ్లో॥ ప్రథమమరుణచ్ఛాయస్తావత్తతః కనకప్రభః
తదను విరహోత్తామ్యత్తన్వీకపోలతలద్యుతిః,
ఉదయతి తతో ధ్వాన్తధ్వంసక్షమః క్షణదాముఖే
సరసబిసినీకన్దచ్ఛేదచ్ఛవిర్మృగలాఞ్ఛనః. 139

వ్యా. శబ్దచిత్రం ఎట్లనగా-

ప్రథమమ్ ఇతి :- క్షణదాముఖే = రాత్రి ప్రారంభమునందు, ప్రథమమ్ = ముందుగా, అరుణచ్ఛాయః = ఎఱ్ఱని కాంతి గలవాడు, తతః = అటు పిమ్మట, కనకప్రభః తావత్ = బంగారు కాంతి గలవాడు, తదను = అటుపిమ్మట, విరహోత్తామ్యత్తన్వీకపోలతలద్యుతిః = విరహంచేత బాధపడుతున్న స్త్రీయొక్క చెక్కిలితో సమానమైన కాంతి గలవాడు, తతః = అటుపిమ్మట, సరసబిసినీకన్దచ్ఛేదచ్ఛవిః = సరసమైన తామరతూడు దుంపలయొక్క ఖండించిన ముక్కవంటి కాంతి గలవాడై, ధ్వాన్తధ్వంసక్షమః = చీకటిని తొలగించుటకు సమర్థుడూ అయిన, మృగలాఞ్ఛనః = చంద్రుడు. ఉదయతి = ఉదయించుచున్నాడు.

వి. ఇక్కడ ప్రారంభంనుంచి చివరి దాకా కవి కొన్ని వర్ణాల ఆవృత్తి చేసి అనుప్రాసను నిర్వహించడంకోసమే ప్రయత్నం చేస్తూన్నట్లు కనబడుతున్నది; అందుచేత ఇది శబ్దచిత్రం. రెండు మకారాలు, మూడు తకారాలు, రెండు తకారాలు, రెండు ధకారాలు, రెండు క్షకారాలు, రెండు భకారాలు, సకారభకారలకారాలు వీటి ఆవృత్తి కనబడుతున్నది. స్వభావోక్తి-ఉపమాలంకారాలు, కూడా ఉన్నాయి. కాని కవి సంరంభం వాటిని నిర్వహించడంలో ఉన్నట్లు లేదు. అందుచేత అవి అప్రధానాలు.

వృ. అర్థచిత్రం యథా-

శ్లో॥ తే దృష్టిమాత్రపతితా అపి కస్య నాత్ర
క్షోభాయ పక్ష్మలదృశామలకాః ఖలాశ్చ,
నీచాః సదైవ సవిలాసమలీకలగ్నా
యే కాలతాం కుటిలతామివ న త్యజన్తి. 140

వ్యా. అర్థచిత్రం ఎట్లనగా-

తే ఇతి :- నీచాః = నీచములు (అలకముల పక్షంలో పొట్టివి అని, ఖలుల పక్షంలో నీచస్వభావం గలవారు అనీ అర్థం), సదైవ = ఎల్లప్పుడూ, సవిలాసమ్ = విలాసపూర్వకంగా, అలీకలగ్నాః = అలీకలగ్నములు అయిన (అలకాలపక్షంలో లలాటంమీద లగ్నమైనవి అని, ఖలుల పక్షంలో అసత్యం వలకడంలో లగ్నమైన వారు అనీ అర్థం) యే = ఏవి, (ఎవరు)కుటిలతామ్ ఇవ = వక్రత్వమును వలె, (అలకాలపక్షంలో వంకర అనీ, ఖలుల పక్షంలో వక్రస్వభావం అనీ అర్థం), కాలతామ్ = కాలత్వాన్ని (అలకల పక్షంలో నలుపు అనీ, ఖలులపక్షంలో పరపీడకత్వం అని అర్థం), న త్యజన్తి = విడువవో (విడువరో), తే = అట్టి, పక్ష్మలదృశామ్ = దట్టమైన రెప్పలు గల కళ్ళు గల స్త్రీలయొక్క, అలకాః = ముంగురులు, ఖలాః చ = దుర్మార్గులు, దృష్టిమాత్రపతితాః = దృష్టిమాత్రమునందే పడినవై (వారై), కనబడినంతమాత్రంచేతనే అని అర్థం. అత్ర = ఈ లోకంలో, కస్య = ఎవనికి, క్షోభాయ = క్షోభకొరకు, న = కావు? (కారు)?

వి. ఇక్కడ క్షోభ అనే ఒక కార్యాన్ని చేయడంలో అలకాలకూ, ఖలులకూ, సముచ్చయం (ఇవీ వాళ్ళు కూడా అని) చెప్పడంవల్ల సముచ్చయాలం

కారం శ్లేష-ఉపమాలంకారాలు, ఈ సముచ్చయలంకారానికి అంగాలు. అనుప్రాస ఉన్నా దానికి అంత ప్రాధాన్యం లేదు. అర్థాలంకారనిర్వహణంలోనే కవిసంరంభం కనబడుతున్నది.

అవ. "పైన ఉదాహరించిన శ్లోకాలలో మొదటిదానిలో శృంగారరసం, రెండవదానిలో విప్రలంభశృంగారం వ్యంగ్యం అవుతున్నాయి కదా? ఇవి వ్యంగ్య రహితాధమకావ్యాలు ఏలా అవుతాయి?" అని ఆశంకించుకొని, "ఏ శ్లోకంలో వర్ణించిన విషయమైనా చివరికి విభావాదిరూపంలో పర్యవసానం చెందుతుంది, అందుచేత రసభావాదికం ఏదో వ్యంగ్యంగా ఉంటుంది. అయినా ఆ వ్యంగ్యం అస్ఫుటంగా ఉండడంచేత దాన్ని లేనట్లే భావించి శబ్దచిత్రాన్నో అర్థచిత్రాన్నో అంగీకరించడం జరుగుతూ ఉంటుంది. అందుచేత "అవ్యఙ్గ్యం త్వవరం స్మృతమ్" అన్నప్పుడు అవ్యంగ్యం అనగా స్ఫుటవ్యంగ్యం లేనిదని అర్థం" అని సమాధానం చెబుతున్నాడు—

వృ. యద్యపి సర్వత్ర కావ్యే అన్తతః విభావాదిరూపతయైవ పర్యవసానమ్, తథాపి స్ఫుటస్య రసస్య అనుపలమ్భాత్ అవ్యఙ్గ్యమేత త్కావ్యద్వయముక్తమ్. అత్ర చ శబ్దార్థాలఙ్కారభేదాద్బహవో భేదాః. తే చాలంకారనిర్ణయే నిర్ణేష్యన్తే.

ఇతి కావ్యప్రకాశే శబ్దార్థచిత్రనిరూపణం నామ షష్ఠ ఉల్లాసః

వ్యా. యద్యపి ఇతి :- అన్ని కావ్యాలలో కూడా చివరికి విభావాదిరూపం లోనే పర్యవసానం ఉంటుంది. విభావాదులు రసభావాభివ్యంజకాలు గాన చివరికి ప్రతి కావ్యంలోను రసమో, భావమో వ్యంగ్యంగా ఉంటుంది అని భావం. అయినా స్ఫుటమైన రసం కనబడకపోవడంచేత ఈ కావ్యద్వయంలో (శబ్దచిత్ర-అర్థచిత్ర కావ్యాలలో) వ్యంగ్యం లేదన్నట్లు చెప్పబడింది. శబ్దాలంకారాలు అర్థాలంకారాలు అనే భేదంచేత ఈ శబ్దచిత్రార్థచిత్రాలలో అనేక భేదాలుఉన్నాయి. వాటి నిర్ణయం అలంకారనిర్ణయంలో (నవమదశమోల్లాసాలలో) చేయబడగలదు.

'బాలానందిని' అను కావ్యప్రకాశవ్యాఖ్యానంలో శబ్దార్థచిత్రనిరూపణం
అనే షష్ఠోల్లాసం సమాప్తము.

# అథ సప్తమోల్లాసః

వృ. కావ్యస్వరూపం నిరూప్య దోషాణాం సామాన్యలక్షణ
మాహ-

కా. ముఖ్యార్థహతిర్దోషో రసశ్చ ముఖ్యస్తదాశ్రయాద్వాచ్యః,
ఉభయోపయోగినః స్యుః శబ్దాద్యాస్తేన తేష్వపి సః. 49

వృ. హతిరపకర్షః. శబ్దాద్యాః ఇత్యాద్యగ్రహణాద్వర్ణరచనే.

వ్యా. కావ్య ఇత్యాది :- కావ్యస్వరూపాన్ని నిరూపించి దోషాల సామాన్య లక్షణాన్ని చెబుతున్నారు-

వి. "తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి" అనే కావ్య లక్షణంలో దోషరహితములూ, గుణసహితములూ, చాలా వరకు అలంకారాలు ఉన్నవీ అయిన శబ్దార్థాలు కావ్యం అని చెప్పబడింది. ప్రథమోల్లాసంలో సంగ్రహంగా కావ్యభేదాలు, ద్వితీయ తృతీయోల్లాసాలలో శబ్దార్థస్వరూపం, చతుర్థోల్లాసంలో ధ్వనిస్వరూపం, పంచమోల్లాసంలో గుణీభూతధ్వనిభేదాలు, షష్ఠోల్లాసంలో శబ్దచిత్రార్థచిత్రాలు ప్రతిపాదించబడ్డాయి. ఇక కావ్యలక్షణవాక్యంలో మొదట చెప్పిన దోషాలను గూర్చి వివరించవలసి ఉన్నది. వాటిని ఈ సప్తమోల్లాసంలో ప్రతిపాదిస్తున్నాడు-

వ్యా. ముఖ్యేతి :- ముఖ్యార్థహతిః = ముఖ్యార్థానికి అపకర్ష దేనివలన కలుగునో అది, దోషః = దోషము. రసః చ = రసము, ముఖ్యః = ముఖ్యము, తదాశ్రయాత్ = ఆ రసానికి ఆశ్రయం అవడం వల్ల, వాచ్యః=వాచ్యార్థం కూడా ముఖ్య మని చెప్పబడుతుంది. శబ్దాద్యాః = శబ్దం మొదలైనవి అనగా శబ్దం, వర్ణాలు, రచన కూడ, ఉభయోపగినః = రెండింటికీ, అనగా రసానికీ, వాచ్యార్థానికీ, ఉపయోగించేవి, స్యుః = అగును. తేన = ఆ కారణంచేత, సః = ఆ దోషము, తేష్వపి = శబ్దాదులయందు కూడా ఉంటుంది.

హతిః ఇతి :- హతిః అనగా అపకర్ష. కొంత చెడిపోవడం. 'శబ్దాద్యాః' అన్నప్పుడు 'ఆద్యాః' అనడంచేత వర్ణరచనలు కూడా గ్రహించాలి.

వి. కావ్యంలో ముఖ్యమైనది రసం. రసశబ్దంచేత భావాదులను కూడా గ్రహించాలి. అందుచేత రసభావాదులు ముఖ్యమైనవి. ఇవి వాచ్యార్థాన్ని ఆశ్రయించుకొని ఉంటాయి కాబట్టి వాచ్యార్థాన్ని కూడా ముఖ్యం అని అంటారు. శబ్ద-వర్ణ-రచనలు రసాదులకూ వాచ్యార్థానికీ కూడా ఉపయోగిస్తాయి. అందుచేత దోషాలు వాటియందు కూడా ఉంటాయి. అనగా దోషాలు రసభావాదులలోను, శబ్దార్థాలలోను, వర్ణాలలోను రచనలోను ఉంటాయి. ఆ దోషాలను కావ్యంలో వర్జించాలి. ఏ ఒక్క దోషం ఉన్నా కావ్యసౌందర్యం దెబ్బతింటుంది. దోషాలు ఉన్న కవిత్వం కుకవిత్వం అని ఆలంకారికుల సిద్ధాంతం. అందుచేతనే-

"తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యాద్వపుః సున్దరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్" (కావ్యాదర్శం 1.7)

(అత్యల్పమైన దోషం కూడా కావ్యంలోనికి రానీయకూడదు. ఎంత అందమైన శరీరమైనా ఒక్క శ్విత్రం (బొల్లి) చేత సౌందర్య విహీనం అయిపోతుంది.) అని దండి.

"నాకవిత్వమధర్మాయ వ్యాధయే దణ్డనాయ వా
కుకవిత్వం పునః సాక్షాత్ మృతిమాహుర్మనీషిణః" (కావ్యాలంకారం 1.12)

(కవిత్వం చెప్పకపోతే అధర్మం చేసినట్లుకాదు. వ్యాధి రాదు, రాజు దండించడు; కుకవిత్వం అయితే సాక్షాత్తు మరణమే అని పండితులు అంటారు) అని భామహుడూ అంటాడు.

ప్ర. విశేషలక్షణమాహ-

కా. దుష్టం పదం శ్రుతికటు చ్యుతసంస్కృత్యప్రయుక్తమసమర్థమ్
నిహతార్థమనుచితార్థం నిరర్థకమవాచకం త్రిధాశ్లీలమ్. 50

సందిగ్ధమప్రతీతం గ్రామ్యం నేయార్థమథ భవేత్ క్లిష్టమ్,
అవిమృష్టవిధేయాంశం విరుద్ధమతికృత్ సమాసగతమేవ. 51

వ్యా. దోషాల విశేషలక్షణం చెబుతున్నాడు. ముందు పదదోషాలు చెప్పుతున్నాడు-

దుష్టమ్ ఇతి :- 1. శ్రుతికటువు, 2. చ్యుతసంస్కృతి, 3. అప్రయుక్తం, 4. అసమర్థం, 5. నిహతార్థం, 6. అనుచితార్థం, 7. నిరర్థకం. 8. అవాచకం, 9. మూడు విధాలైన అశ్లీలం, 10. సందిగ్ధం, 11. అప్రతీతం, 12. గ్రామ్యం, 13. నేయార్థం, 14. క్లిష్టం, 15. అవిమృష్టవిధేయాంశం, 16. విరుద్ధమతికృత్ (ఈ మూడూ సమాసగతాలు) అయిన పదం దుష్టమైనది. అనగా శ్రుతికటుత్వ-చ్యుతసంస్కృతిత్వాదులు పదహారూ పదగతదోషాలు అని అర్థం.

వృ. 1. శ్రుతికటు పరుషవర్ణరూపం దుష్టం యథా-

శ్లో॥ అనఙ్గమఙ్గలగృహాపాఙ్గభఙ్గితరఙ్గితైః,
ఆలిఙ్గితః స తన్వఙ్గ్యా కార్తార్థ్యం లభతే కదా. 14

వృ. అత్ర కార్తార్థ్యమితి.

వ్యా. శ్రుతీతి:- పరుషమైన వర్ణాలు ఉన్నది (శ్రుతికటువు). చెవులకు వినడానికి కటువుగా ఉంటుంది. అట్టి దుష్టపదానికి ఉదాహరణం ఎట్లనగా-

అనఙ్గేతి :- అనఙ్గ........తరఙ్గితైః- అనఙ్గ = మన్మథునియొక్క, మఙ్గలగృహ = మంగళప్రదగృహము లైన, అపాఙ్గభఙ్గి = క్రీకంటిచూపుల భంగిమల, తరఙ్గితైః = తరంగముల వలె ప్రసారములతో కూడిన, తన్వఙ్గ్యా = స్త్రీచేత, ఆలిఙ్గితః = కౌగలించుకొనబడినవాడై , సః = అతడు, కార్తార్థ్యమ్ = కృతార్థత్వమును, కదా లభతే = పొందగలడు. 'కదా' శబ్దం ప్రయోగించినప్పుడు భవిష్యదర్థంలో లట్. "విభాషా కదా కర్హ్యోః" (పా. సూ. 3.3.5). ఇక్కడ ఒక కుట్టని (తార్పుడుకత్తె) ఇద్దరు యువతీయువకుల సమాగమాన్ని గూర్చి ఆలోచిస్తున్నది.

ఇక్కడ 'కార్తార్థ్యమ్' అనేది పరుషవర్ణయుక్తం అవడంచేత శ్రుతికటుత్వదోషం. ఇది శృంగారాదులలో అసంగత మైనది. యమకాదులలో మాత్రం ఇది దుష్టంకాదు.

వృ. 2. చ్యుతసంస్కృతి వ్యాకరణలక్షణహీనం యథా:-

శ్లో॥ ఏతన్మన్దవిపక్వతిన్దుకఫలశ్యామోదరాపాణ్డర
ప్రాన్తం హన్త పులిన్దసున్దరకరస్పర్శక్షమం లక్ష్యతే.
తత్ పల్లీపతిపుత్రి కుఞ్జరకులం కుమ్భాభయాభ్యర్థనా
దీనం త్వామనునాథతే కుచయుగం పత్రావృతం మా కృథాః.

వృ. అత్రానునాథతే ఇతి. 'సర్పిషో నాథతే' ఇత్యాదావాశిష్యేవ నాథతే రాత్మనేపదం విహితమ్-"ఆశిషి నాథః" ఇతి. అత్ర తు యాచన మర్థః. తస్మాత్ "అనునాథతి" స్తనయుగమ్ ఇతి పఠనీయమ్.

వ్యా. వ్యాకరణలక్షణానికి విరుద్ధమైనది 'చ్యుతసంస్కృతి'. వ్యాకరణవిరుద్ధమైనది అని అర్థం. ఉదాహరణం ఎట్లనగా:-

ఏతదితి:- ఒక యువతి కుచకుంభాలను చూడవలె ననే ఆసక్తి గల ఒక చతురుని మాటలివి. హే! పల్లీపతిపుత్రి = ఓ! గ్రామనాయకుని పుత్రీ! మన్దవిపక్వతిన్దుకఫలశ్యామోదరాపాణ్డర ప్రాన్తమ్ = కొంచెం ముదిరిన తిందుక ఫలంయొక్క నల్లని ఉదరం వలె కొంచెం తెల్లనైన ప్రాంతభాగాలు గల, ఏతత్ = ఇది (ఈకుచద్వంద్వం), హన్త = ఆహా! పులిన్దసున్దరకరస్పర్శక్షమమ్ = పులిందసుందరుని (ఆటవిక యువకుని) హస్తస్పర్శకు తగినదిగా, లక్ష్యతే = కనబడుచున్నది. కుఞ్జరకులమ్ = ఏనుగుల సముదాయం, కుమ్భాభయాభయాభ్యర్థనాదీనమ్ = కుంభస్థలములకు అభయమును ప్రార్థించుటకై దీనముగా, త్వామ్ = నిన్ను, అనునాథతే = యాచిస్తూన్నది. తత్ = అందువలన, కుచయుగమ్ = కుచద్వంద్వమును, పత్రావృతమ్ = ఆకులచేత కప్పబడినదానినిగా, మా కృథాః = చేయకుము. నీవు నీ కుచకుంభాలను ఆకులతో కప్పకపోయినచో శబరయువకుని దృష్టి వాటిపై లగ్నం అవుతుంది అప్పుడు అతడు ఏనుగుల కుంభస్థలాలను బ్రద్దలు కొట్టడం మానేస్తాడు. ఆ శక్తి కూడా తగ్గిపోతుంది. అందుచేత తమ కుంభస్థలాలను రక్షించుకొనడం కోసం ఏనుగులు నీ కుచాలు కప్పివేయవద్దని నిన్ను యాచిస్తున్నాయి అని భావం.

అత్రేతి:- ఇక్కడ 'అనునాథతే' అనేది వ్యాకరణవిరుద్ధం. 'నాథ్' ధాతువుకు ఆశీరర్థంలో (కోరుట అనే అర్థంలో) మాత్రమే "సర్పిషః నాథతే" (నెయ్యి కావాలని కోరుకొనుచున్నాడు) ఇత్యాదులలో వలె, ఆత్మనేపదం "క్రీడోఽనుసం

పరిభ్యశ్చ" (పా. సూ. 1-3-21) అను సూత్రం క్రింద ఉన్న 'ఆశిషి నాథః' అనే వార్తికంచేత విధించబడింది. 'నాథ్' ధాతువుకు ఆశీరర్థంలో మాత్రమే ఆత్మనే పదం ఉంటుం దని దీని అర్థం. ఇక్కడ యాచించడం అర్థం. అందుచేత ఆత్మనే పదప్రయోగం అసాదువు. అందుచేత "దీనం త్వామనునాథతే కుచయుగమ్" అనే పాఠానికి బదులు "దీనం త్వామనునాథతి స్తనయుగమ్" అని పాఠం మార్చుకుంటే యుక్తంగా ఉంటుంది. ఇది నిత్యదోషం.

వృ. 3. అప్రయుక్తం తథా ఆమ్నాతమపి కవిభిర్నాదృతమ్. యథా-

శ్లో॥ యథాయం దారుణాచారః సర్వదైవ విభావ్యతే,
తథా మన్యే దైవతోఽస్య పిశాచో రాక్షసోఽథవా. 143

వృ. అత్ర దైవతశబ్దో "దైవతాని పుంసి వా" ఇతి పుంస్యా మ్నాతోఽపి న కేనచిత్ ప్రయుజ్యతే.

వ్యా. అప్రయుక్తమితి :- ఆ విధంగా కోశవ్యాకరణాదులలో చెప్పబడినా కవులచేత ఆదరింపబడనిది అప్రయుక్తం.

వి. కొన్ని పదాలను కోశవ్యాకరణాదులు సాదువులే అని అంగీకరించినా కవులు పండితులు ఆదరించనిచో అనగా కవిప్రయోగాలలో లేనిచో వాటిని ప్రయోగించకూడదు అని అర్థం. ఎట్లనగా-

వ్యా. యథా ఇతి :- అయమ్=ఇతడు, సర్వదైవ = ఎల్లప్పుడూ, దారుణాచారః = క్రూరమైన ప్రవృత్తి కలవాడుగా, యథా = ఎట్లు, విభావ్యతే = చూడబడుచున్నాడో, తథా = అట్లు, అస్య = వీనియొక్క, దైవతః = దైవతం, పిశాచః = పిశాచం, అథవా = లేక, రాక్షసః = రాక్షసుడు అని, మన్యే = తలచెదను. వీని క్రూరప్రవృత్తి చూడగా వీని ఆరాధ్యదైవం పిశాచమో, రాక్షసుడో అయి ఉండాలని తోస్తున్నది అని భావం.

అత్రేతి :- "వృన్దారకా దైవతాని పుంసి వా" అని అమరుడు దైవతశబ్దం పుంలింగంలో కూడా ప్రయోగించవచ్చును అని చెప్పినా కవు లెవ్వరూ దీన్ని

పుంలింగంలో ప్రయోగించరు. అందుచేత ఇక్కడ 'దైవతః' అనే దానికి అప్రయుక్తత్వదోషం. యమకాదులలో ఇది దోషం కాదు.

వృ. 4. అసమర్థం యత్తదర్థం పఠ్యతే న చ తత్రాస్య శక్తిః.
యథా-

శ్లో॥ తీర్థాన్తరేషు స్నానేన సముపార్జితసత్కృతిః,
సురస్రోతస్వినీమేష హన్తి సంప్రతి సాదరమ్. 144

వృ. అత్ర హన్తీతి గమనార్థమ్.

వ్యా. అసమర్థమితి :- ఆ అర్థం కలదిగా శాస్త్రాదులలో పఠింపబడినా (చెప్పబడినా) కూడ ప్రకృతంలో ఆ అర్థాన్ని బోధించడానికి శక్తి లేని పదం అసమర్థం. ఎట్లనగా-

తీర్థాన్తరేష్వితి :- తీర్థాన్తరేషు = ఇతర తీర్థములయందు, స్నానేన = స్నానంచేత, సముపార్జితసత్కృతిః = సంపాదించబడిన పుణ్యం గల, ఏషః = ఇతడు, సంప్రతి = ఇప్పుడు, సాదరమ్ = ఆదరపూర్వకంగా, సురస్రోతస్వినీమ్ = గంగానదిని గూర్చి, హన్తి = వెళ్ళుచున్నాడు.

అత్రేతి :- ఇక్కడ గమనార్థకంగా ప్రయోగించబడిన 'హన్తి' అనేది అసమర్థం. "హన హింసాగత్యోః" (హన్ ధాతువుకు హింస, గమనము అని అర్థము) అని ధాతుపాఠంలో హన్‌ధాతువుకు గమనం అనే అర్థం చెప్పబడింది. అయినా 'ప్రహత' 'ఉద్ధత' 'పద్ధతి' ఇత్యాదులలో ఇతరశబ్దాలతో (ఉపసర్గాదులతో)పాటు కలిపి ప్రయోగించినప్పుడే దీనికి గమనార్థబోధనసామర్థ్యం ఉంది కాని స్వతంత్రంగా ప్రయోగించినప్పుడు లేదు. ఇది నిత్యదోషం.

వృ. 5. నిహతార్థం యదుభయార్థమప్రసిద్ధేఽర్థే ప్రయుక్తమ్.
యథా-

శ్లో॥ యావకరసార్ద్రపాదప్రహారశోణితకచేన దయితేన,
ముగ్ధా సాధ్వసతరలా విలోక్య పరిచుమ్బితా సహసా. 145

వృ. అత్ర శోణితశబ్దస్య రుధిరలక్షణేనార్థేన ఉజ్జ్వలీకృతత్వ రూపః అర్థః వ్యవధీయతే.

వ్యా. నిహతార్థమితి :- రెండు అర్థాలు కలిగి ఉండి అప్రసిద్ధార్థంలో ప్రయోగించబడిన పదం నిహతార్థమ్. 'నిహతార్థ' శబ్దానికి 'అణచివేయబడిన అర్థం కలది' అని అర్థం. ఒక పదానికి రెండు అర్థాలు ఉంటాయి. వాటిలో ఒకటి ప్రసిద్ధం, రెండవది అప్రసిద్ధం. ఆ పదాన్ని అప్రసిద్ధార్థంలో ప్రయోగించి నప్పుడు ప్రసిద్ధార్థం చటున స్ఫురించడంచేత ఆ అప్రసిద్ధార్థం అణచివేయబడి నట్లు అయిపోయి అది తెలియడంలో ఆలస్యం అవుతుంది. ఎట్లనగా-

యావకేతి :- 'యావక... కచేన'- యావకరస = లత్తుకరసంచేత, అర్ద్రి = తడిసిఉన్న, పాద = పాదంచేత, ప్రహార = కొట్టడంచేత, శోణిత = ఎఱ్ఱగా మెరిసేటట్లుచేయబడిన, కచేన = జుట్టు గల, దయితేన = ప్రియునిచేత, సాధ్వ సతరలా = భయంచేత చంచలురాలైన, అనగా రక్తం వచ్చినదేమో అని భయ పడిన, ముగ్ధా = ముగ్ధురాలు, విలోక్య = చూచి, సహసా = వెంటనే, పరిచుమ్బితా = చుంబించబడింది.

అత్రేతి :- ఇక్కడ 'శోణిత' శబ్దానికి ఉన్న రక్తము అనే ప్రసిద్ధమైన అర్థంచేత 'మెరిసేటట్లు చేయబడడం' అనే అర్థం వ్యవహితం అవుచున్నది.

వి. 'శోణిత' శబ్దం వినగానే రక్తం అనే అర్థమే ప్రసిద్ధం అవడంచేత ముందుగా స్ఫురిస్తుంది. 'శోణంగా చేయబడింది' 'ఎఱ్ఱగా మెరిసేటట్లు చేయబడింది' అనే అర్థాన్ని రక్తరూపార్థం కప్పివేస్తుంది. అందుచేత ఇది నిహతార్థం.

వృ. అనుచితార్థం యథా-

శ్లో॥ తపస్విభిర్యా సుచిరేణ లభ్యతే
ప్రయత్నతః సత్త్రిభిరిష్యతే చ యా,
ప్రయాన్తి తామాశు గతిం యశస్వినో
రణాశ్వమేధే పశుతాముపాగతాః. 146

వృ. అత్ర పశుపదం కాతరతామభివ్యనక్తీతి అనుచితార్థమ్.

వ్యా. అనుచితార్థం అనగా తగని అర్థం కలది. అది ఎట్లనగా-

తపస్విభిరితి :- రణాశ్వమేధే=రణ మనే అశ్వమేధంలో, పశుతామ్ = పశుత్వాన్ని, ఉపాగతాః = పొందిన, యశస్వినః = కీర్తి మంతులు, తపస్విభిః= మునులచేత, యా = ఏ గతి, సుచిరేణ = చాలా ఆలస్యంగా, లభ్యతే = పొంద బడునో, యా = ఏది, సత్త్రిభిః = యజ్ఞాలు చేసే వాళ్ళచేత, ప్రయత్నతః = ప్రయత్నంవలన, ఇష్యతే = అభిలషించబడుతుందో, తామ్ = ఆ, గతిమ్ = ఉత్తమగతిని, ఆశు = శీఘ్రంగా, ప్రయాన్తి = పొందుదురు.

అత్రేతి :- ఇక్కడ ప్రయోగించిన పశుపదం పిరికితనాన్ని సూచిస్తుంది. అందుచేత రణశూరులవిషయంలో దీనిని ప్రయోగించడం అనుచితం. ఇది నిత్య దోషం అనికొందరు.

వృ 7 నిరర్థకం పాదపూరణమాత్రప్రయోజనం చాదిపదమ్- యథా-

శ్లో॥ ఉత్ఫుల్లకమలకేసరపరాగగౌరద్యుతే మమ హి గౌరి,
అభివాఞ్ఛితం ప్రసిధ్యతు భగవతి యుష్మత్ప్రసాదేన. 147

వృ. అత్ర 'హి' శబ్దః.

వ్యా. పాదాన్ని పూరించడమే ప్రయోజనంగాగల, (పాదాన్ని పూరించడం కోసమే ప్రయోగించిన) 'చ' మొదలైన పదం నిరర్థకం; అనగా ప్రయోజన శూన్యం. ఎట్లనగా-

ఉత్ఫుల్లేత్యాది :- ఇది నాగానందంలోని శ్లోకం. ఉత్ఫుల్లకమలకేసరపరాగ గౌరద్యుతే = వికసించిన పద్మాల కింజల్కములయందలి పుప్పొడి వలె గౌర మైన కాంతి గల, భగవతి = సకలైశ్వర్యసంపన్నురాలవైన, గౌరి = ఓ! పార్వతీ! యుష్మత్ప్రసాదేన = మీ అనుగ్రహంచేత, మమ = నాయొక్క, అభివాఞ్ఛితమ్= కోరిక, ప్రసిధ్యతు హి = సిద్ధించుగాక.

ఇక్కడ 'హి' శబ్దం నిరర్థకం. పాదపూరణం తప్ప మరొక ప్రయోజనం లేదు.

వృ. 8. అవాచకం యథా.

శ్లో॥ అవన్ధ్యకోపస్య విహన్తురాపదాం
భవన్తి వశ్యాః స్వయమేవ దేహినః,
అమర్షశూన్యేన జనస్య జన్తునా
న జాతహార్దేన న విద్విషాదరః. 148

వృ. అత్ర జన్తుపదమదాతర్యర్థే వివక్షితమ్. తత్ర చ నాభిధాయకమ్.

వ్యా. అవాచకం ఎట్లనగా. అవాచకత్వం అనగా ఏ అర్థం చెప్పాలని ఆ పదం ప్రయోగించబడిందో ఆ అర్థాన్ని ఆ పదం చెప్పజాలకపోవడం. ఇది నిత్యదోషం.

అవన్ధ్యేతి :- ఇది కిరాతార్జునీయంలో ద్రౌపది దుర్యోధనుణ్ణి నిగ్రహించవలె నని యుధిష్ఠిరునికి చెప్పే ఘట్టంలోని శ్లోకం. అవన్ధ్యకోపస్య = వ్యర్థము కాని కోపం కలవాడు, ఆపదామ్ = ఆపదలకు, విహన్తుః = వినాశకుడూ అయినవానికి, దేహినః = జనులు, స్వయమేవ = స్వయంగానే, వశ్యాః = స్వాధీనులు, భవన్తి = అవుతారు. అమర్షశూన్యేన = అమర్షం, అనగా వ్యర్థం కాని కోపం, లేని జన్తునా = పురుషునిచేత, జనస్య = జనానికి, జాతహార్దేన = పుట్టిన స్నేహం కలవాడైనా, ఆదరః = ఆదరం, న = ఉండదు, విద్విషా = శత్రువైనా, ఆదరః = ఆదరం (లేదా దరః = భయం) న = ఉండదు. ఆపదలను తొలగించడం అనగా దారిద్ర్యాదిబాధలను పోగొట్టడం అని అర్థం.

అత్రేతి :- ఇక్కడ 'జన్తు' పదం 'అదాత' అనే అర్థంలో వివక్షితమైనది కాని ఆ అర్థాన్ని చెప్పజాలదు.

వి. పూర్వార్ధంలో దాతృత్వంచేత ఆపదలను పోగొట్టేవానికి జనం తమంతట తామే లొంగి ఉంటారు అని చెప్పి ఉత్తరార్ధంలో అలాంటి దాతృత్వం లేనివానిని గూర్చి చెప్పడం కవి అభీష్టం. కాని ఇక్కడ ప్రయోగించిన 'జంతు' శబ్దానికి 'దాత కానివాడు' అనే అర్థాన్ని బోధించే శక్తి లేదు గాన ఇది అవాచకతాదోషదుష్టం.

వృ. యథా వా-

శ్లో॥ హా ధిక్ సా కిల తామసీ శశిముఖీ దృష్టా మయా యత్ర సా
తద్విచ్ఛేదరుజాన్ధకారితమిదం దగ్ధం దినం కల్పితమ్,
కిం కుర్మః కుశలే సదైవ విధురో ధాతా న చేత్తత్కథం
తాదృగ్యామవతీమయో భవతి మే నో జీవలోకోఽధునా. 149

వృ. అత్ర దినమితి ప్రకాశమయమిత్యర్థే అవాచకమ్.

వ్యా. అవాచకానికే మరొక ఉదాహరణం ఎట్లనగా- హా ధిక్ ఇతి :- ఒక రాత్రి స్వప్నంలో ఊర్వశిని చూచిన పురూరవుడు విక్రమోర్వశీయంలో అన్న మాట లని కొందరు వ్యాఖ్యాతలు. ఇది విక్రమోర్వశీయంలో లేదని బాలబోధినీ వ్యాఖ్యాకారుడు వ్రాసినాడు. ఎక్కడనైనా కొన్ని ప్రతులలో ఉండవచ్చునేమో కాని ఇది కాళిదాసు శ్లోకం వలె కనబడదు. హా ధిక్ = అయ్యో! ఛీ! సా = ఆ, శశిముఖీ = చంద్రముఖి, మయా = నాచేత, యత్ర = ఏ రాత్రియందు, దృష్టా= చూడబడిందో, సా = ఆ రాత్రి, తామసీ కిల = చీకటితో నిండినదట. శశిముఖి కనబడినప్పుడు అది చీకటి ఎలా అవుతుంది? తద్విచ్ఛేదరుజా = ఆమె వియోగ బాధచేత, అన్ధకారితమ్ = అంధకారంగా చేయబడిన, ఇదమ్ = ఇది, దగ్ధమ్ = పాడుదైన, దినమ్ = పగలుగా, (బ్రహ్మచేత), కల్పితమ్ = కల్పించబడింది. కిం కుర్మః = ఏమిచేయుదుము! ధాతా=బ్రహ్మదేవుడు, సదైవ=ఎల్లప్పుడూ, కుశలే =కుశలం చేయుటయందు, విధురః = ప్రతికూలుడు, తత్ = అది, న చేత్ = కానిచో (బ్రహ్మ కుశలవిధానప్రతికూలుడు కానిచో) అధునా = ఇప్పుడు, జీవ లోకః = ఈ జీవలోకం, మే = నాకు, తాదృగ్యామవతీమయః = అలాంటి (నేను ఆమెను చూచిన రాత్రిలాంటి) రాత్రిగా, కథమ్ = ఎట్లు, న భవతి = అవడం లేదు?

అత్రేతి :- ఇక్కడ 'దినమ్' అనేది ప్రకాశమయం అనే అర్థంలో అవాచకం. ఆమె కనబడిన కాలాన్ని బ్రహ్మదేవుడు చీకటి రాత్రి అంటున్నాడు. ఆమె విరహంచేత నాకు అంధకారబంధురంగా ఉన్న కాలాన్ని 'దినం' అంటున్నాడు అని చెప్పడంలో ఇక్కడ 'దిన' శబ్దం ప్రకాశకలది అనే అర్థంలో ప్రయోగించ

బడింది. కాని 'సూర్యుడున్న సమయం' అని అర్థమే కాని 'దిన' శబ్దానికి ఆ అర్థం లేదు. అందుచేత ఇది అవాచకం అని భావం.

వృ. యచ్చోపసర్గసంసర్గాదర్థాన్తరగతమ్. యథా-

శ్లో॥ జఙ్ఘాకాణ్డోరునాలో నఖకిరణలసత్కేసరాలీకరాలః
ప్రత్యగ్రాలక్తకాభాప్రసరకిసలయో మఞ్జుమఞ్జీరభృఙ్గః,
భర్తుర్నృత్తానుకారే జయతి నిజతనుస్వచ్ఛలావణ్యవాపీ
సంభూతామ్భోజశోభాం విదధదభినవో దణ్డపాదో భవాన్యాః

వృ. అత్ర దధదిత్యర్థే విదధదితి.

వ్యా. ఉపసర్గ చేరడంచేత అర్థాంతరాన్ని పొందినది (మరొక అర్థాన్ని బోధించేది) కూడా అవాచకమే. ఎట్లనగా.

జఙ్ఘా ఇతి :- భర్తుః = భర్తయొక్క, నృత్తానుకారే = నృత్తమును అనుకరించు సమయంలో, భవాన్యాః = పార్వతీదేవియొక్క, జఙ్ఘాకాణ్డోరునాలః = కాండం వంటి పిక్కయే పెద్ద నాళం కలది, నఖకిరణలసత్కేసరాలీకరాలః = గోళ్ళ కిరణము లనే ప్రకాశిస్తూన్న కింజల్కాలపంక్తులచేత నిమ్నోన్నతమైనది, ప్రత్యగ్రాలక్తకాభాప్రసరకిసలయః = నూతనమైన లత్తుకయొక్క కాంతియొక్క ప్రసారమే చిగుళ్ళుగా కలదీ, నిజతనుస్వచ్ఛలావణ్యవాపీసంభూతామ్భోజశోభామ్ = తన శరీరం యొక్క స్వచ్ఛమైన లావణ్యమనే దిగుడుబావియందు పుట్టిన పద్మముయొక్క శోభను, విదధత్ = ధరించుచున్నదీ అయిన, దణ్డపాదః = దండపాదము, జయతి = సర్వోత్కర్షగా ఉన్నది హఠాత్తుగా ఎత్తి నిట్టనిలువుగా నిలపబడిన పాదం (కాలు) 'దండపాదం'

అత్రేతి :- ఇక్కడ 'దధత్' అనే అర్థంలో 'విదధత్' అనే పదం అవాచకం.

వి. ఉపసర్గ లేకుండా 'దధత్'అని ప్రయోగిస్తే 'ధరించుచున్న' అనే అర్థం వస్తుంది. కాని 'వి'అనే ఉపసర్గ చేర్చగానే 'విదధత్' అనేదానికి 'చేస్తూన్న' అని అర్థం మారిపోతుంది. అందుచేత ఇక్కడ 'విదధత్' అనేది కావలసిన అర్థాన్ని చెప్పడంలేదు గాన అవాచకం.

వృ. 9. త్రిధా ఇతి వ్రీడాజుగుప్సామఙ్గలవ్యఞ్జకత్వాత్. యథా

శ్లో॥ సాధనం సుమహద్యస్య యన్నాన్యస్య విలోక్యతే
తస్య ధీశాలినః కోఽన్యః సహేతారాలితాం భ్రువమ్. 151

వ్యా. వ్రీడా - జుగుప్సా — అమంగలవ్యంజకం అవడంచేత మూడు విధాలు అని చెప్పబడింది.

వి. 'రలయోరభేదః' (రేఫలకారాలకు అభేదం) అనే న్యాయం ప్రకారం 'శ్రీలః' 'శ్లీలః' అయింది. శ్రియమ్ = సభ్యావశీకరణసంపత్తిని, లాతి ఇతి = సంపాదించేది కాబట్టి 'శ్రీలః' అని విగ్రహం. అదే శ్లీలం. శ్లీలం కానిది అశ్లీలం. వినేవాళ్ళకీ, సిగ్గు అనేది ఉంటే పలికే వాళ్ళకి కూడా సిగ్గును కలిగించేది, ఏవగింపు కలిగించేది, అమంగళకరమూ అని అశ్లీలం మూడు విధాలు అని అర్థం. వ్రీడాజనకమైన అశ్లీలానికి ఉదాహరణం ఎట్లనగా -

సాధనమ్ ఇతి :- యత్ = ఏది, దేనివంటిది, అన్యస్య = ఇతరునకు, న విలోక్యతే = చూడబడదో (లేదో), అట్టి, సుమహత్ = చాల గొప్పదైన, సాధనమ్ = సైన్యం, యస్య = ఎవనికి ఉన్నదో, తస్య = అట్టి, ధీశాలినః = బుద్ధిశాలియొక్క, అరాలితామ్ = వక్రము చేయబడిన, భ్రువమ్ = కనుబొమ్మను, అన్యః = ఇతరుడు, కః = ఎవడు, సహేత = సహించును ?

వి ఇక్కడ సాధన శబ్దానికి పురుషలింగం అవి అర్థం కూడా ప్రసిద్ధంగా ఉంది. అందుచేత 'సాధనం సుమహద్యస్య' అని వినగానే ఆ అర్థం ప్రతీతమై సభ్యులకు వ్రీడను కలిగిస్తుంది. అందుచేత ఇది వ్రీడాజనకాశ్లీలానికి ఉదాహరణం.

అవ జుగుప్సాకరమైన అశ్లీలానికి ఉదాహరణం చూపుతున్నారు -

శ్లో॥ లీలాతామరసాహతోఽన్యవనితానిఃశఙ్కదష్టాధరః
కశ్చిత్కేసరదూషితేక్షణ ఇవ వ్యామీల్య నేత్రే స్థితః,
ముగ్ధా కుడ్మలితాననేన దదతీ వాయుం స్థితా తత్ర సా
భ్రాన్త్యా ధూర్తతయాథవా నతిమృతే తేనానిశం చుమ్బితా.

వ్యా లీలేతి - ఇది అమరుకంలోని శ్లోకం అన్యవనితానిఃశఙ్కదష్టాధరః = మరియొక స్త్రీచేత గట్టిగా కొరకబడిన అధరోష్ఠము గల, కశ్చిత్ = ఒక నాయకుడు, లీలాతామరసాహతః = విలాసార్థమైన (విలాసార్థం చేతిలో ఉంచుకొన్న) పద్మంచేత కొట్టబడినవాడై, (ఆ కొట్టినది అధరవ్రణాన్ని చూడడంచేత కోపించిన అతని భార్య). కేసరదూషితేక్షణః ఇవ = కింజల్కములచేత పీడింపబడిన నేత్రాలు కలవాడు వలె, నేత్రే = నేత్రాలను, వ్యామీల్య = మూసికొని, స్థితః = ఉండిపోయినాడు. సా ముగ్ధా = ఆ ముగ్ధురాలు, కుడ్మలితాననేన = మొగ్గ వలె చేయబడిన నోటితో, తత్ర = నేత్రాలలో, వాయుమ్ = పూత్కారమును, దదతీ = ఇచ్చుచున్నదై, స్థితా = ఉన్నది. భ్రాన్త్యా = ఆమె కోపం తొలగిపోయినది అనే భ్రాంతిచేతనో, అథవా = లేక, ధూర్తతయా = ధూర్తత్వంచేతనో, తేన = వానిచేత. నతిమ్ ఋతే = నమస్కారం లేకుండగానే, అనిశమ్ = మాటిమాటికి, చుమ్బితా = చుంబించబడింది.

వి. ఇక్కడ 'వాయుం దదతీ' అన్నప్పుడు 'వాయు' శబ్దం వినగానే అపానవాయు స్మృతి కలుగుతున్నది. అందుచేత ఇక్కడ జుగుప్సాకరమైన అశ్లీలం.

అవ. అమంగలాశ్లీలానికి ఉదాహరణం చూపుతున్నాడు -

శ్లో॥ మృదుపవనవిభిన్నో మత్ప్రియాయా వినాశాద్
ఘనరుచిరకలాపో నిఃసపత్నోఽద్య జాతః,
రతివిగలితబన్ధే కేశపాశే సుకేశ్యాః
సతి కుసుమసనాథే కం హరేదేష బర్హీ. 153

వృ. ఏషు సాధన- వాయు-వినాశశబ్దాః వ్రీడాదివ్యఞ్జకాః.

వ్యా. మృద్వితి - విక్రమోర్వశీయంలో ఊర్వశీవిరహపీడితుడైన పురూరవుని మాట లివి. మత్ప్రియాయాః = నా ప్రియురాలియొక్క, వినాశాత్ = కనబడకపోవుటవలన, అద్య = ఇప్పుడు, మృదుపవనవిభిన్నః = మృదువైన గాలిచేత వేరుచేయబడిన, ఘనరుచిరకలాపః = దట్టమైన అందమైన నెమలి పింఛము, నిఃసపత్నః = పోటీ చేసే శత్రువు లేనిది, జాతః = అయింది. సుకేశ్యాః = మంచి

కేశములు గల నా ప్రియురాలియొక్క, రతివిగలితబన్ధే = రతియందు జారిపోయిన బంధం గల, కుసుమసనాథే=పుష్పాలతో కూడిన, కేశపాశే=కేశపాశము, సతి= ఉండగా, ఏషః బర్హీ= ఈ నెమలి, కమ్ = ఎవనిని. హరేత్ = ఆకర్షించును !

వి. ఇక్కడ మరణార్థకమైన వినాశశబ్దం అమంగళకరం. అందుచేత ఇది అమంగళాశ్లీలం.

వ్యా. ఏష్వితి– ఈ మూడు శ్లోకాలలో సాధన-వాయు-వినాశశబ్దాలు వ్రీడాదులను వ్యంజింపచేస్తున్నాయి. అందుచేత అశ్లీలదోష దుష్టములు. రత్యుపక్రమ-శమాదులలో ఇది దోషం కాదు; అందుచేత అనిత్యదోషం.

వృ. 10. సందిగ్ధం యథా–

శ్లో. ఆలిఙ్గిత స్తత్రభవాన్ సంపరాయే జయశ్రియా,
ఆశీఃపరంపరాం వన్ద్యాం కర్ణేకృత్వా కృపాం కురు 154

వృ. అత్ర వన్ద్యాం కిం హఠహృతమహిలాయాం కింవా నమస్యామితి సందేహః.

వ్యా. సందిగ్ధం అనగా ఏ అర్థమునందు తాత్పర్యమా అనే సందేహానికి ఆస్పదం అయిన రెండుఅర్థాలు బోధించేది అని అర్థం. అది ఎట్లనగా–

ఆలిఙ్గిత ఇతి :- సంపరాయే= యుద్ధంలో, జయశ్రియా= జయలక్ష్మి చేత, ఆలిఙ్గితః=కౌగలించుకొనబడిన, తత్రభవాన్=పూజ్యుడవైన నీవు, వన్ద్యామ్ = నమస్కరించదగిన, ఆశీఃపరమ్పరామ్= (శత్రువుల) ఆశీర్వాదపంక్తిని, కర్ణేకృత్వా= చెవిలో ఉంచి (విని), కృపామ్ = కృపను, కురు = చేయుము.

అత్రేతి :– ఇక్కడ 'వన్ద్యామ్' అనేదానికి 'బందీగా గ్రహింపబడిన రాజకార్యయందు' అని అర్థమా లేక వందనముచేయదగిన (ఆశీఃపరంపరాం అనే దానికి విశేషణం) అని అర్థమా అని సందేహం కలుగుతున్నది గాన ఇక్కడ సందిగ్ధత్వదోషం.

వృ. 11. అప్రతీతం యత్ కేవలే శాస్త్రే ప్రసిద్ధమ్. యథా–

శ్లో. సమ్యగ్జ్ఞానమహాజ్యోతిర్దలితాశయతాజుషః,
విధీయమానమప్యేతన్న భవేత్కర్మ బన్ధనమ్. 155

వృ. అత్రాశయశబ్దో వాసనాపర్యాయః యోగశాస్త్రాదావేవ ప్రయుక్తః.

వ్యా. కేవలం శాస్త్రంలోనే ప్రసిద్ధమైనది అప్రతీతం. అనగా వ్యాకరణం, కోశం మొదలైనవాటిలో గాని, లోకకావ్యాదులలో గాని ప్రసిద్ధి లేక కేవలం కొన్ని శాస్త్రాలలో మాత్రమే ప్రసిద్ధమైన పదం అప్రతీతం అని అర్థం. అది ఎట్లనగా-

సమ్యగితి :- "సమ్యగ్జ్ఞాన.... .... జుషః" - సమ్యగ్జ్ఞాన = మంచి జ్ఞానం (తత్త్వజ్ఞానం)అనే, మహాజ్యోతిః = గొప్ప తేజస్సుచేత, దలిత = నశింప చేయబడిన, ఆశయతాజుషః = సంస్కారములు కలిగి ఉండడాన్ని పొందిన వానికి, తత్త్వజ్ఞానం అనే తేజస్సుచేత సంస్కారాలు అన్నీ నశించినవానికి అని అర్థం, విధీయమానమపి = చేయబడుచున్నా కూడ, ఏతత్ = ఈ, కర్మ=కర్మ, బన్ధనమ్ = బంధనము, న భవేత్ = కాదు.

అత్రేతి :- వాసనలు, లేదా సంస్కారాలు. అనే అర్థంలో 'ఆశయ' శబ్దం యోగశాస్త్రాదులలో మాత్రమే ప్రయోగించబడుతుంది. అందుచేత ఇక్కడ ఇది అప్రతీతత్వదోషదుష్టం

వృ. 12. గ్రామ్యం యత్ కేవలే లోకే స్థితమ్. యథా-

శ్లో. రాకావిభావరీకాన్తసంక్రాన్తద్యుతి తే ముఖమ్,
తపనీయశిలాశోభా కటిశ్చ హరతే మనః. 156

వృ. అత్ర కటిరితి.

వ్యా కేవలం లోకంలో మాత్రమే ప్రచారంలో ఉన్నది గ్రామ్యం వైదగ్ధ్యం, అనగా చాతుర్యం, లేనివాడు గ్రామ్యుడు. అలాంటివాడు ప్రయోగించే సర్వసాధారణమైన పదం గ్రామ్యం అని అర్థం. అలాంటి పదం ప్రయోగించినప్పుడు వక్త వైదగ్ధ్యం లేనివాడు అని తెలియగానే శ్రోతకు వైముఖ్యం కలుగుతుంది. ఎట్లనగా-

రాకేతి :- రాకావిభావరీకాన్తసంక్రాన్తద్యుతి = పూర్ణిమాచంద్రునియందు సంక్రమించిన కాంతి గల, తే ముఖమ్ = నీ ముఖమూ, తపనీయశిలాశోభా = బంగారు శిల వంటి శోభ గల, కటిశ్చ = కటిప్రదేశము, మనః = మనస్సును, హరతే = హరించును.

ఇక్కడ 'కటి'పదం గ్రామ్యం. విదగ్ధులు 'శ్రోణి', 'నితంబం' మొదలైన పదాలు మాత్రమే ప్రయోగిస్తారు; కటిపదాన్ని వైదగ్ధ్యం లేని గ్రామ్యులు మాత్రమే ప్రయోగిస్తారు.

వృ. 13. నేయార్థమ్–

శ్లో. "నిరూఢా లక్షణాః కాశ్చిత్ సామర్థ్యాదభిధానవత్,
క్రియన్తే సాంప్రతం కాశ్చిత్ కాశ్చిన్నైవ త్వశక్తితః."

ఇతి యన్నిషిద్ధం లాక్షణికమ్. యథా–

శ్లో. శరత్కాలసముల్లాసి పూర్ణిమాశర్వరీప్రియమ్,
కరోతి తే ముఖం తన్వి చపేటాపాతనాతిథిమ్. 157

వృ. అత్ర చపేటాపాతనేన నిర్జితత్వం లక్ష్యతే.

వ్యా. ఏ పదానికి అర్థాన్ని కల్పించాలో అది నేయార్థం. "నేయః అర్థః యస్య తత్"అని విగ్రహం. "నిరూఢా లక్షణాః కాశ్చిత్" ఇత్యాదిశ్లోకం కుమారిలభట్టు శ్లోకవార్తికంలోనిది. అరుణాధికరణంలో లక్షణను గూర్చి చెపుతూ – "కొన్నిలక్షణలు, శక్తివలె, సామర్థ్యంచేత రూఢమైన అర్థాన్ని చెపుతాయి. ఉదాహరణకు-'కుశలః'ఇత్యాదులు లక్షణచేత 'నేర్పరి'అనే అర్థాన్ని, వాచ్యార్థాన్నివలె బోధిస్తాయి. ఇవి రూఢార్థాలు. కొన్ని లక్షణలు మనం ఇప్పుడు ఏర్పరచుకుంటాం. ఉదాహరణకు 'గఙ్గాయాం ఘోషః' ఇత్యాదులు. కొన్ని లక్షణలు కల్పించినా వాటికి ఆ అర్థాన్ని బోధించే శక్తి లేకపోవడంచేత ఆ అర్థాన్ని చెప్పజాలవు. అలాంటివాటిని కల్పించకూడదు"అని కుమారిలభట్టు ప్రతిపాదించాడు. ఈవిధంగా నిషేధించబడిన లాక్షణికప్రయోగం నేయార్థం అని అర్థం. ఎట్లనగా-

శరదితి :- తన్వి = ఓ! సన్ననిదానా! తే ముఖమ్ = నీముఖం, శరత్కాల

సముల్లాసిపూర్ణిమాశర్వరీప్రియమ్ = శరత్కాలంలో ప్రకాశిస్తున్న పూర్ణిమాచంద్రుణ్ణి, చపేటాపాతనాతిథిమ్ = చెంపకాయ వేయడానికి (తగిన) అతిథినిగా కరోతి = చేయుచున్నది. జయించుచున్నది అని లాక్షణికార్థం.

అత్రేతి :- ఇక్కడ చపేటాపాతనం చేత నిర్జితత్వం లక్షణయా బోధించబడుతున్నది. అయితే ఈ విధంగా లక్షణ అంగీకరించడంలో ప్రయోజనమూ లేదు, రూఢీ లేదు. శ్రమపడి అర్థాన్ని దూరంగా లాగినట్లు అయింది. అందుచేత నేయార్థత్వదోషం. ఆధునికకవిత్వాలలో అత్యధికంగా కనబడుతుంది.

వృ. అథ సమాసగతమేవ దుష్టమితి సంబన్ధః. అన్యత్ కేవలం, సమాసగతం చ.

వ్యా. ఇటుపైన చెప్పినది సమాసగతం అయినపుడే దుష్టం. మిగిలినది కేవలం, సమాసగతమూ కూడ దుష్టమే.

వి. పై 51వ కారికలో "అథ భవేత్ క్లిష్టమ్. అవిమృష్టవిధేయాంశం విరుద్ధమతికృత్సమాసగతమేవ" అని చెప్పబడింది. 'క్లిష్టః' 'అవిమృష్టవిధేయాంశః' 'విరుద్ధమతికృత్'అనేవి సమాసంలో మరొక పదంతో కలిసి ఒక పదంగా ఏర్పడినప్పుడే దుష్టమైనవి. సమాసంలో కలవక వ్యస్తంగా ప్రయోగించినపుడు క్లిష్టత్వాదులు వాక్యదోషాలు అవుతాయి. ఇంక మిగిలిన శ్రుతికటుత్వాదిదోషాలలో ఆ పదాలను స్వతంత్రంగా (వ్యస్తంగా) ప్రయోగించినా సమాసంలో ప్రయోగించినా అవి దుష్టపదాలే. శ్రుతికటుత్వాదులు పదదోషాలే అని అర్థం.

వృ. 14. క్లిష్టం యతః అర్థప్రతిపత్తిర్వ్యవహితా. యథా-

శ్లో॥ అత్రిలోచనసంభూతజ్యోతిరుద్గమభాసిభిః,
సదృశం శోభతేఽత్యర్థం భూపాల తవ చేష్టితమ్. 158

వృ. అత్ర అత్రిలోచనసంభూతస్య చన్ద్రస్య జ్యోతిరుద్గమేన భాసిభిః కుముదైః ఇత్యర్థః.

వ్యా. ఏ పదంవల్ల అర్థజ్ఞానం చాలా దూరంగా అవుతుందో అది క్లిష్టం ఎట్లనగా-

అత్రేతి :- భూపాల = రాజా ! తవ చేష్టితమ్ = నీ చేష్ట, "అత్రి....భాసిభిః" అత్రి = అత్రిమునియొక్క, లోచన = నేత్రమునుండి, సంభూత = పుట్టిన చంద్రుని యొక్క, జ్యోతిః = జ్యోతిస్సుయొక్క అనగా కాంతియొక్క, ఉద్గమ = పైకి రావడంచేత, భాసిభిః = ప్రకాశించే కలవలతో, సదృశమ్ = సమానమై, అత్యర్థమ్ = మిక్కిలి, భాసతే = ప్రకాశించుచున్నది.

అత్రేతి :- ఇక్కడ "అత్రినేత్రంనుండి పుట్టిన చంద్రుని కాంతి పైకి రావడంచేత ప్రకాశించే కలవలు" అని అర్థం. ఇది చాలా దూరార్థం కాబట్టి ఈ పదం క్లిష్టత్వదోషదుష్టం. ఇది కూడా ఆధునికకవిత్వాలలో అత్యధికంగా కన బడుతుంది.

వృ. 15, అవిమృష్టః ప్రాధాన్యేన అనిర్దిష్టః విధేయాంశః యత్ర తత్. యథా-

శ్లో. మూర్ధ్నా ముద్వృత్తకృత్తావిరలగలగలద్రక్తసంసక్తధారా
ధౌతేశాఙ్ఘ్రిప్రసాదోపనతజయజగజ్జాతమిథ్యామహిమ్నామ్,
కైలాసోల్లాసనేచ్ఛావ్యతికరపిశునోత్సర్పిదర్పోద్ధురాణాం
దోష్ణాం చైషాం కిమేతత్ ఫలమిహ నగరీరక్షణే యత్ ప్రయాసః

వృ. అత్ర మిథ్యామహిమత్వం నానువాద్యమ్; అపి తు విధేయమ్.

వ్యా. ఎక్కడ విధేయాంశం అవిమృష్టమో, అనగా ప్రాధాన్యంతో నిర్దేశించ బడలేదో, అది అవిమృష్టవిధేయాంశం?

వి. సిద్ధమైన అంశాన్ని అనువదించి దానికి సంబంధించి మరొక అంశాన్ని విధించడం జరుగుతుంది. సిద్ధమైనదానిని ఉద్దేశ్యం అని సాధ్యమైనదానిని, అనగా కొత్తగా చెప్పేదానిని, (విధించేదానిని), విధేయం అని అంటారు. సాధారణంగా ఒక వాక్యంలో సిద్ధమైనదానిని యచ్ఛబ్దంచేత అనువదించి తచ్ఛబ్దంతో కొత్త అంశాన్ని విధిస్తారు. కొన్ని చోట్ల యచ్ఛబ్దతచ్ఛబ్దాలు ప్రయోగించకపోయినా అవి ఉన్నట్లుగా భావించాలి. అనూద్యం అన్నా ఉద్దేశ్యం అన్నా ఒకటే. ఇక్కడ అనువదించడం అనగా తెలుగులో చెప్పుకొనే అనువదించడం (Translation) కాదు. ఒక మాట చెప్పినదానిని, లేదా వక్తకూ శ్రోతకూ కూడా తెలిసిన దానిని,

నిర్దేశించడం. కుమారిలభట్టు శ్లోకవార్తికంలో అనూద్యవిధేయాల స్వరూపాన్ని ఈ విధంగా వివరించారు.

"యచ్ఛబ్దయోగః ప్రాథమ్యం సిద్ధత్వం చాప్యనూద్యతా
తచ్ఛబ్దయోగ ఔత్తర్యం సాధ్యత్వం చ విధేయతా".

యచ్ఛబ్దతో సంబంధించడం, వాక్యంలో ముందు చెప్పడం, సిద్ధంఅయి (ముందేతెలిసి) ఉండడం ఇది అనూద్యత్వం అనగా ఉద్దేశ్యత్వం. తచ్ఛబ్దంతో సంబంధించడం, వాక్యంలో తరవాత చెప్పబడడం, సాధ్యత్వం. ఇదే విధేయత్వం. ఉదాహరణకి-"యః క్రియావాన్ స పణ్డితః""ఎవడు క్రియకలవాడో, అనగా తెలిసిన దానిని ఆచరణలో పెడతాడో, అతడు పండితుడు". ఇక్కడ క్రియావంతుణ్ణి అనువదించి (ఉద్దేశించి) పండితత్వం కొత్తగా విధించబడుతున్నది. విధేయమైన పండితత్వం ప్రధానం. దీని విధేయత్వం స్పష్టంగా తెలియాలంటే దీనిని బోధించే పదాన్ని స్వతంత్రంగా ప్రయోగించాలి. సమాసంలో గలిపి ప్రయోగిస్తే దాని ప్రాధాన్యం కనబడదు. అది విధేయం అనే విషయం తెలియదు.

ఒకచోట ఇద్దరు మిత్రులు కూర్చొని ఉన్నారు. దూరంనుంచి కృష్ణ దనే బాలుడు వస్తున్నట్లు కనబడ్డాడు. అతడు కృష్ణ దనీ, ఇటు వస్తున్నా డనీ ఇద్దరికీ తెలుసు. అయితే అతడు బుద్ధిశాలి అనే విషయం ఒకనికే తెలుసు, రెండవవానికి తెలియదు. అప్పుడు మొదటివాడు రెండవవానితో "ఆ వస్తున్న కృష్ణుడు బుద్ధిశాలి" అని చెపుతాడు. అనగా ఇక్కడ వస్తూన్న కృష్ణ డనే బాలుణ్ణి అనువదించి, (ఉద్దేశించి) 'బుద్ధిశాలి'అనే విషయం కొత్తగా, (రెండవవానికి తెలియనిది) చెప్పబడుతున్నది. అందుచేత బాలుడు ఉద్దేశ్యుడు, బుద్ధిశాలిత్వం విధేయం. ఈ వాక్యాన్నే క్రమం మార్చి "బుద్ధిశాలియైన కృష్ణుడు వస్తున్నాడు" అన్నట్లయితే బుద్ధిశాలియైన కృష్ణుడు ఉద్దేశ్యుడు, ఆగమనం విధేయం.

ఐశ్వర్యాధికారబలాలు ఉన్న ఒక వ్యక్తి హత్యా కేసువంటి కేసునుంచి తన కుమారుణ్ణి విడిపించలేకపోయాడు. అప్పుడు అతడు తనలో "వ్యర్థైశ్వర్యాధికారబలాలు గల నేను ఇప్పు డేంచెయ్యాలి" అని అనుకొన్నా డనుకుందాం. ఈ వాక్యం సరి కాదు. "నేను నా కుమారుణ్ణి రక్షించలేకపోయాను; నా ఐశ్వర్యం, నా అధికారం, నా బలం అంతా వ్యర్థం" అని అతని అభిప్రాయం. అనగా ఐశ్వ

ర్యాధికారాదుల వ్యర్థత్వం విధేయం. పై వాక్యంలో వ్యర్థత్వానికి ప్రాధాన్యం కన బడడం లేదు. కారణం; అది సమాసంలో ఉండిపోవడం. అందుచేత "నా కుమా రుణ్ణి రక్షించుకొనలేకపోయిన నా ఐశ్వర్యాదులు వ్యర్థం"అని ఉండాలి. అప్పుడు విధేయాంశానికి ప్రాధాన్యం ఉంటుంది. ఉద్దేశ్యవిధేయభావాల స్వరూపం శాస్త్రా లతో అంతగా పరిచయం లేనివాళ్ళకి కూడా స్పష్టంగా తెలియడంకోసం కొంచం విస్తృతంగా వ్రాయడం జరిగింది.

వ్యా. ఉదాహరణం ఎట్లనగా—

మూర్ధ్నామితి:- ఇది హనుమన్నాటకంలోని శ్లోకం. లంకను వానరులు ముట్టడించినట్లు విని ఏమి చేయాలో తెలియని స్థితిలో ఉన్న రావణుని మాటలు— "ఉద్వృత్త....మహిమ్నామ్"-ఉద్వృత్త = ఉద్ధతంగా, కృత్త = ఛేదింపబడినవి, అవిరల=అధికంగా, గల=కంఠములనుండి, గలత్=కారుచున్న, రక్త=రక్తం యొక్క, సంసక్త = అవిచ్ఛిన్నమైన, ధారా = ధారచేత, ధౌత = కడగబడిన, ఈశ = ఈశ్వరునియొక్క, అఙ్ఘ్రి=పాదాలయొక్క, ప్రసాద = అనుగ్రహంచేత, ఉపనత = లభించిన, జయ = జయంగల, జగత్=జగత్తునందు, జాత = పుట్టిన, మిథ్యామహిమ్నామ్ = అసత్యమైన మహిమ గల, ఈశ్వరప్రసాదనం ద్వారా జగ జ్జయం అనే అసత్యమైన మహిమను సంపాదించుకొనిన అని అర్థం, మూర్ధ్నామ్= శిరస్సులకు, "కైలాసో...ఉద్ధురాణామ్"-కైలాస = కైలాసపర్వతముయొక్క, ఉల్లాసన = పైకి ఎత్తుటయందు, ఇచ్ఛా = ఇచ్ఛయొక్క, వ్యతికర = ఆధిక్యాన్ని, పిశున=సూచించే, ఉత్సర్పి=ఉత్కటమైన, దర్ప=దర్పంచేత, ఉద్ధురాణామ్= సమర్థములైన, ఏషామ్=ఈ. దోష్ణాం చ = బాహువులకు, ఇహ = ఇక్కడ, ఇప్పుడు, నగరీరక్షణే = నగరాన్ని రక్షించుకొనడంలో, ప్రయాసః ఇతి యత్= ప్రయాస అనేది ఏది కలదో, ఏతత్ = ఇదే, ఫలం కిమ్ = ఫలమా?

అత్రేతి:- ఇక్కడ మిథ్యామహిమత్వం అనువాద్యం కాదు, విధేయం.

వి. "నా శిరస్సులు మిథ్యామహిమలైపోయినవి"అని వాటికి మిథ్యామహిమత్వం విధించాలిగాని, 'మిథ్యామహిమలైన నా శిరస్సులు'అని అనువాద్యకోటిలో చేర్చ కూడదు. అలా చేయడంచేత విధేయాంశం ఇక్కడ ప్రధానంగా చెప్పబడలేదు గాన అవిమృష్టవిధేయాంశత్వం అనే దోషం.

వృ. యథా వా -

శ్లో॥ స్రస్తాం నితమ్బాదవరోపయన్తీ
పునః పునః కేసరదామకాఞ్చీమ్,
న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ
ద్వితీయమౌర్వీమివ కార్ముకస్య. 160

వృ. అత్ర ద్వితీయత్వమాత్రముత్ప్రేక్ష్యమ్. మౌర్వీం ద్వితీయామితి యుక్తః పాఠః.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా—

స్రస్తామితి:- ఇది కుమారసంభవం తృతీయసర్గలో పార్వతి శివునికి పుష్పాలు సమర్పించడానికి వచ్చే సమయంలో ఆమెను వర్ణించే శ్లోకం. స్థానవిదా= మంచి స్థానమును గూర్చి ఎరిగిన, స్మరేణ = మన్మథునిచేత, న్యాసీకృతామ్ = న్యాసంగా చేయబడిన (దాచడానికి ఇచ్చిన వస్తువు న్యాసం). కార్ముకస్య=ధనస్సు యొక్క, ద్వితీయమౌర్వీమ్ ఇవ = రెండవ అల్లెత్రాడు వలె ఉన్న, (కాంచీం అనేదానికి విశేషణం), నితమ్బాత్ = నితంబంనుండి, స్రస్తామ్ = జారుచున్న, కేసరదామకాఞ్చీమ్ = బొగడపూవుల దండ అనే వడ్డాణమును, అవరోపయన్తీ= పైకి ఎక్కించుచున్నదై.

అత్రేతి:- ఇక్కడ ద్వితీయత్వం మాత్రమే ఉత్ప్రేక్షించదగినది. అందుచేత "మౌర్వీం ద్వితీయామ్"అనే పాఠం యుక్తం.

ఇక్కడ ఉత్ప్రేక్షించవలసింది మౌర్వీత్వం కాదు. రెండవది అవడం (ద్వితీయత్వం) ఉత్ప్రేక్షించతగింది. 'ద్వితీయమౌర్వీ'అని సమాసం చేయడంతో విధేయం అయిన ద్వితీయత్వానికి ప్రాధాన్యం తగ్గిపోయింది. అందుచేత "మౌర్వీం ద్వితీయామ్"అని వ్యస్తంగా ప్రయోగించడం యుక్తం. అప్పుడు విధేయం అయిన ద్వితీయత్వానికి ప్రాధాన్యం ఉంటుంది.

వృ. యథా వా-

శ్లో॥ వపుర్విరూపాక్షమలక్ష్యజన్మతా
దిగమ్బరత్వేన నివేదితం వసు.
వరేషు యద్బాలమృగాక్షి మృగ్యతే
తదస్తి కిం వ్యస్తమపి త్రిలోచనే. 161

వృ. అత్ర "అలక్షితా జనిః" ఇతి వాచ్యమ్.

వ్యా. మరియొక ఉదాహరణం పెట్టనగా—

వపురితి:- కుమారసంభవం పంచమసర్గలో పరమేశ్వరుడు బ్రహ్మచారి వేషంలో, తపస్సు చేస్తూన్న పార్వతి దగ్గరకు వచ్చి ఆమె ఎదుట శివుణ్ణి (తనను) నిందిస్తూన్న ఘట్టంలోని శ్లోకం. వపుః = శరీరం, విరూపాక్షమ్ = విపరీతమైన కళ్లు గలది. అలక్ష్యజన్మతా = తెలియబడని జన్మ కలిగియుండుట. దిగమ్బరత్వేన = దిగంబరత్వంచేత, వసు = ధనం, నివేదితమ్ = తెలుపబడింది. బాలమృగాక్షి = లేడి పిల్ల కన్నుల వంటి కన్నులు గలదానా! వరేషు = వరులలో, యత్ = ఏది, మృగ్యతే = వెదకబడుతుందో, తత్ = అది, వ్యస్తమపి = ఒక్కటైనా, త్రిలోచనే = శివునియందు, అస్తి కిమ్ = ఉన్నదా?

అత్రేతి:- ఇక్కడ 'అలక్షితా జనిః' అని చెప్పాలి.

ఏ "శివుని శరీరం వికృతమైన కళ్ళతో ఉంటుంది. అతని జన్మను గూర్చి తెలియదు" ఈ విధంగా చెప్పినట్లయితే దోషాలను స్పష్టంగా లెక్కించినట్లు అవుతుంది. జన్మ తెలియక పోవడం అనే విధేయాన్ని స్పష్టంగా చెప్పడం జరుగుతుంది. అలా కాకుండా "అతనికి తెలియని జన్మ కలిగియుండుట ఉన్నది" అని చెప్పడంలో విధేయం మరుగుపడిపోతూన్నది. అందుచేత "అలక్షితా జనిః" "పుట్టుక తెలియబడదు"అని చెప్పడం యుక్తం.

వృ. యథా వా-

శ్లో॥ ఆనన్దసిన్ధురతిచాపలశాలిచిత్త
సందాననైకసదనం క్షణమప్యముక్తా,
యా సర్వదైవ భవతా తదుదన్తచిన్తా
తాన్తిం తనోతి తవ సంప్రతి ధిగ్ధిగస్మాన్. 162

వృ. అత్ర "న ముక్తా" ఇతి నిషేధో విధేయః;యథా-

శ్లో॥ నవజలధరః సంనద్ధోఽయం న దృప్తనిశాచరః
సురధనురిదం దూరాకృష్టం న తస్య శరాసనమ్,
అయమపి పటుర్ధారాసారో న బాణపరమ్పరా
కనకనికషస్నిగ్ధా విద్యుత్ ప్రియా మమ నోర్వశీ. 163

ఇత్యత్ర. న త్వముక్తతానువాదేన కించిద్విహితమ్, యథా-

శ్లో॥ జుగోపాత్మానమత్రస్తో భేజే ధర్మమనాతురః,
అగృధ్నురాదదే సోఽర్థానసక్తః సుఖమన్వభూత్. 164

ఇత్యత్ర అత్ర స్తత్వాద్యనువాదేన ఆత్మనో గోపనాది.

వ్యా మరొక ఉదాహరణం ఎట్లనగా—

ఆనన్దేతి:- నాయికవిషయంలో విముఖుడైన నాయకునితో ఆమె సఖురాళ్లు అంటూన్నమాటలు. ఆనన్దసిన్ధుః = (నీ) ఆనందానికి సముద్రమూ, అతిచాపలశాలిచిత్తసందాననైకసదనమ్=మిక్కిలి చాపల్యంతో కూడిన (నీ) చిత్తముయొక్క బంధనమునకు ఏకైకస్థానమూ అయిన, యా=ఏ నీ ప్రియురాలు, భవతా=నీచేత, సర్వదైవ= ఎల్లప్పుడూ, క్షణమపి = క్షణకాలమైనా, అముక్తా = విడవబడలేదో, తదుదన్తచిన్తా=ఆమెను గూర్చిన వార్తల చింతయే. సంప్రతి = ఇప్పుడు, తవ= నీకు, తాన్తిమ్=మనస్సుకు గ్లానిని, తనోతి = చేయుచున్నది. అస్మాన్=మమ్ములను గూర్చి, ధిక్ ధిక్ = నింద అగుగాక.

అత్రేతి:- ఇక్కడ, 'నవజలధరః' ఇత్యాదిశ్లోకంలో వలె 'న ముక్తా' (విడవబడలేదు) అని నిషేధం విధించదగినది.

వి. 'నీవు క్షణకాలం కూడ ఆమెను విడవలేదు' అని విడవకపోవడం విధేయం. ఇక్కడ 'అముక్తా'అని నఞ్సమాసం చేయడంతో దానికి (విడవకపోవడానికి) ప్రాధాన్యం పోయినది. సమాసానికి 'విడవబడని ఆమె' అనే అర్థం వస్తుంది కాని 'ఆమె విడవబడలేదు' అనే వాంఛితార్థం రాదు. నిషేధానికి విధేయత్వం స్పష్టంగా కనబడే శ్లోకాన్ని ఉదాహరిస్తున్నాడు.

నవజలధరః ఇతి:- ఇది విక్రమోర్వశీయంలోని శ్లోకం, పూరూరవుడు మేఘాన్ని చూచి తన ప్రియురాలిని అపహరించుకొనిపోతూన్న రాక్షసు డని భ్రాంతిపడి, చివరకు రాక్షసుడు కాడని తనను తానే సమాధానపరచుకొనుచున్నాడు. అయమ్ = ఇది, నవజలధరః = క్రొత్త మేఘం; సంనద్ధః = యుద్ధ సంనద్ధుడైన, దృప్తనిశాచరః = గర్వించిన రాక్షసుడు, న = కాడు. ఇదమ్ = ఇది, సురధనుః=ఇంద్రధనస్సు, తస్య = ఆ రాక్షసునియొక్క, దూరాకృష్టమ్= బాగా లాగబడిన, శరాసనమ్ = ధనస్సు, న = కాదు. అయమపి = ఇది కూడా, పటుః = తీవ్రమైన, ధారాసారః = జలధారాపాతము; బాణపరమ్పరా = బాణ పంక్తి, న = కాదు. కనకనికషస్నిగ్ధా = (గీటురాయిమీద) బంగారంగీత వలె ప్రకాశిస్తూన్న ఇది, విద్యుత్ = మెరుపు; మమ = నాయొక్క, ప్రియా = ప్రియురాలైన, ఊర్వశీ = ఊర్వశి, న = కాదు.

వి. ఈ శ్లోకంలో కూడా నిషేధం విధేయమైనది. అందుచేత సమాసం చేయకుండా 'న దృప్తనిశాచరః'. 'న శరాసనమ్' 'న బాణపరమ్పరా' 'న మమ ప్రియా ఊర్వశీ' అని వ్యస్తప్రయోగాలు చేయబడ్డాయి. అదే విధంగా 'ఆనన్ద' ఇత్యాదిశ్లోకంలో కూడా 'న ముక్తా'అని ప్రయోగించడం యుక్తం అని అర్థం.

ఆమె 'అముక్త' అని చెప్పి తరవాత ఆ అముక్తత్వాన్ని అనువదిస్తూ, "జుగోప" ఇత్యాది శ్లోకంలో వలె మరొక అంశం ఏదైనా విధించి ఉన్నట్లయితే సమాసం చేయడం యుక్తమే అని చెప్పడానికి అవకాశం ఉండేది. కాని ఆ విధంగా అముక్తత్వానువాదపూర్వకంగా మరేదీ విధించబడలేదు.

జుగోపేతి :- ఇది రఘువంశంలో ప్రథమసర్గలో దిలీపమహారాజును వర్ణించే ఘట్టంలోని శ్లోకం. సః = అతడు, అత్రస్తః = భయపడనివాడై, ఆత్మానమ్ = శరీరాన్ని. జుగోప = రక్షించుకొనెను. అనాతురః = వ్యాధిగ్రస్తుడు కాకపోయినా, ధర్మమ్=ధర్మాన్ని, భేజే= సేవించెను. అగృధ్నుః = లుబ్ధుడు కానివాడై, అర్థమ్ = ధనాన్ని, ఆదదే = గ్రహించెను; అసక్తః = అనాసక్తుడై, సుఖమ్ = సుఖాన్ని అన్వభూత్ = అనుభవించెను.

వి. ఈ శ్లోకంలో అత్రస్తత్వాన్ని అనువదించి ఆత్మరక్షణం, అనాతురత్వాన్ని అనువదించి ధర్మసేవనం. అలుబ్ధత్వాన్ని అనువదించి అర్థగ్రహణం, అసక్తత్వాన్ని అనువదించి సుఖానుభవం విధించబడ్డాయి. అందుచేత విధింప

బడే ఆత్మరక్షణాదులకు ప్రాధాన్యం కాబట్టి త్రాసాభావం మొదలైనవాటికి విధేయత్వం లేకపోయినా దోషం లేదు. ఇక్కడ అత్యక్తత్వాన్ని అనువదించి మరేదీ విధింపబడడంలేదు. అందుచేత విదవకపోవడానికే విధేయత్వం వచ్చేటట్లు చూడాలి అని భావం.

వృ. 16. విరుద్ధమతికృద్యథా-

శ్లో. సుధాకరకరాకారవిశారదవిచేష్టితః,
అకార్యమిత్రమేకోఽసౌ తస్య కిం వర్ణయామహే. 165

వృ. అత్ర 'కార్యం వినా మిత్రమ్' ఇతి వివక్షితమ్. "అకార్యే మిత్రమ్"ఇతి తు ప్రతీతిః.

వ్యా. 'విరుద్ధమతికృత్'అనగా చెప్పదలచినదానికి విరుద్ధమైన భావాన్ని కలిగించేది అని అర్థం. ఉదాహరణం ఎట్లనగా-

సుధా ఇతి :- సుధాకరకరాకారవిశారదవిచేష్టితః = చంద్రుని కిరణముల వంటి ఆకారం గల(నిర్మలమైన) ప్రగల్భమైన చేష్ట గల, అసౌ = ఇతడు, ఏకః = ఒక్కడే, అకార్యమిత్రమ్ = కార్యం లేకుండా (స్వార్థచింత లేకుండా)మిత్రుడు. తస్య = వానికి, కిం వర్ణయామహే = ఏమి వర్ణింతుము ?

అత్ర ఇతి :- ఇక్కడ "కార్యం లేకుండా"అని చెప్ప దలచిన అర్థం. కాని "చెడ్డపనిలో మిత్రుడు" అనే అర్థం స్ఫురిస్తూన్నది. అందుచేత ఈ పదం విరుద్ధమతికృత్త్వదోషదుష్టం.

వృ. యథా వా-

శ్లో. చిరకాలపరిప్రాప్తలోచనానన్దదాయినః,
కాన్తా కాన్తస్య సహసా విదధాతి గలగ్రహమ్. 166

వృ. అత్ర 'కణ్ఠగ్రహమ్' ఇతి వాచ్యమ్.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

చిరకాలేతి :- కాన్తా = కాంత, చిరకాలపరిప్రాప్తలోచనానన్దదాయినః =

చిరకాలానికి వచ్చినవాడూ, నేత్రాలకి ఆనందం ఇచ్చేవాడూ అయిన, కాన్తస్య = ప్రియునియొక్క, గలగ్రహమ్ = గలగ్రహమును (కంఠాలింగనమును), సహసా = వెంటనే, విదధాతి = చేయుచున్నది.

అత్రేతి :- ఇక్కడ 'కణ్ఠగ్రహమ్'అని చెప్పవలెను.

వి. 'గలగ్రహ' శబ్దానికి ఒకానొక రోగం అని అర్థం. అది రూఢ్యర్థం. "రూఢిః యోగమపహరతి"(రూఢి యోగాన్ని హరిస్తుంది)అనే న్యాయం ప్రకారం ఆ అర్థమే చెప్పాలి. అందుచేత ఇక్కడ ఈ పదం చెప్పదలచిన'కంఠగ్రహణం'అనే అర్థాన్ని కాక విరుద్ధమైన అర్థాన్ని చెపుతున్నది.

వృ. యథా వా—

శ్లో. న త్రస్తం యది నామ భూతకరుణాసంతానశాన్తాత్మనః
తేన వ్యారుజతా ధనుర్భగవతో దేవాద్భవానీపతేః,
తత్పుత్రస్తు మదాన్ధతారకవధాద్విశ్వస్య దత్తోత్సవః
స్కన్దః స్కన్ద ఇవ ప్రియోఽహమథవా శిష్యః కథం విస్మృతః.

వృ. అత్ర భవానీపతిశబ్దః భవాన్యాః పత్యన్తరే ప్రతీతిం కరోతి.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

నేతి :- మహావీరచరితంలో రాముడు శివధనుర్భంగం చేసినట్లు విన్న పరశురాముడు కోపంతో అంటూన్న మాటలు. ధనుః = ధనస్సును, వ్యారుజతా = భగ్నం చేసిన, తేన = ఆ రామునిచేత, భూతకరుణాసంతానశాన్తాత్మనః = భూతములపై కరుణయొక్క నైరంతర్యంచేత శాంతమైన ఆత్మ గల, భగవతః = పూజ్యుడైన, దేవాత్ = దేవుడైన, భవానీపతేః = మహేశ్వరునినుండి, న త్రస్తం యది నామ = భయము పొందబడకపోవచ్చును. మదాన్ధతారకవధాత్ = మదాంధుడైన తారకుణ్ణి చంపడంవలన, విశ్వస్య = జగత్తుకు, దత్తోత్సవః = ఇవ్వబడిన ఉత్సవం గల, తత్పుత్రః = ఆ మహేశ్వరుని పుత్రుడైన, స్కన్దః = కుమారస్వామి, అథవా = లేక, శిష్యః = శిష్యుడను, స్కన్దః ఇవ = కుమారస్వామి వలె, ప్రియః = ప్రియుడనూ అయిన, అహమ్ = నేను, కథమ్ = ఎట్లు, విస్మృతః = మరవబడినాడు(ను)?

అత్రేతి :- ఇక్కడ 'భవానీపతి'శబ్దం 'భవానియొక్క మరొక భర్త' అనే అర్థాన్ని స్ఫురింపచేస్తుంది.

వి. 'భవానీ' అనగా 'భవుని భార్య'అని అర్థం. 'భవానీపతిః' అనగా 'భవుని భార్యయొక్క భర్త' అని అర్థం. ఆ మాటవల్ల మరొక భర్త అనే విరుద్ధార్థప్రతీతి కలుగుతుంది అని అర్థం.

వృ. యథా వా-

శ్లో. గోరపి యద్వాహనతాం ప్రాప్తవతః సోఽపి గిరిసుతాసింహః,
సవిధే నిరహంకారః పాయాద్వః సోఽమ్బికారమణః. 168

వృ. అత్ర 'అమ్బికారమణః'ఇతి విరుద్ధాం ధియముత్పాదయతి.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

గోరపీతి :- యద్వాహనతామ్ = ఎవనికి వాహనత్వాన్ని, ప్రాప్తవతః = పొందిన, గోః = ఎద్దుయొక్క, సవిధేఽపి=సమీపంలో కూడ, సః=ఆ, గిరిసుతాసింహోఽపి = పార్వతియొక్కసింహం, నిరహంకారః = అహంకారం లేనిదో, సః = అట్టి, అమ్బికారమణః = పార్వతి భర్త, వః = మిమ్ములను, పాయాత్ = రక్షించుగాక.

అత్రేతి :- ఇక్కడ 'అమ్బికారమణః'అనేది విరుద్ధమైన మతిని కలిగించుచున్నది. అమ్బికా అనగా తల్లి అని కూడా అర్థం. ఆమెను రమింపచేసే జారుడు అనే విరుద్ధార్థం ప్రతీతం అవుతున్నది. అందుచేత ఈ పదం విరుద్ధమతికృత్త్వదోషదుష్టం.

అవ క్లిష్టత్వం మొదలైనవి మూడూ సమాసగతాలే కాని వ్యస్తపదాలలో ఉండవని, శ్రుతికటుత్వాదులు మాత్రం సమాసగతాలు కావచ్చును, వ్యస్తపదగతాలు కావచ్చును అని చెప్పబడింది. వాటికి వ్యస్తపదగతాలకే ఉదాహరణలు చూపబడ్డాయి. ఇప్పుడు సమాసగతశ్రుతికటుత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. శ్రుతికటు సమాసగతం యథా-

శ్లో. సా దూరే చ సుధాసాన్ద్రతరఙ్గితవిలోచనా,
బర్హి ర్నిర్హ్రాదనార్హోఽయం కాలశ్చ సముపాగతః. 169

వృ. ఏవమన్యదపి జ్ఞేయమ్.

వ్యా. సా ఇతి :- సుధాసాన్ద్రతరఙ్గితవిలోచనా = అమృతంతో దట్టమైన తరంగితములైన (చంచలములైన నేత్రాలు గల, సా చ = ఆమె, దూరే = దూరంలో ఉన్నది. బర్హినిర్హ్రాదనః = నెమళ్ళను ధ్వనింపచేసే, అయమ్ = ఈ, కాలః చ = కాలం కూడ, సముపాగతః = వచ్చినది.

వి. ఇక్కడ 'బర్హిర్నిర్హ్రానార్హః' అనే సమాసం శ్రుతికటువుగా ఉన్నది. సమాసం ఒక పదం కాబట్టి ఇది పదగతదోషం.

"ఈ విధంగానే సమాసగతాలైనచ్యుతసంస్కృతిత్వాది దోషాలను కూడా ఊహించుకోవాలి."

అవ. పైన చెప్పిన పదదోషాలనే వాక్యంలోను, పదైకదేశంలోను అతి దేశిస్తున్నాడు. ఒకదానికి సంబంధించిన విషయాలు చెప్పి అవే ఇతరమైన వాటిలో కూడా ఉంటాయి అని చెప్పడం అతిదేశం.

కా. అపాస్య చ్యుతసంస్కారమసమర్థం నిరర్థకమ్,
వాక్యేఽపి దోషాః సన్త్యేతే పదస్యాంశేఽపి కేచన. 52

వృ. కేచన; న పునః సర్వే. క్రమేణోదాహరణమ్.

వ్యా. చ్యుతసంస్కారమ్ = చ్యుతసంస్కారత్వాన్ని, అసమర్థమ్ = అసమర్థత్వాన్ని, నిరర్థకమ్ = నిరర్థకత్వాన్ని, అపాస్య = విడచి (మినహాయించి), ఏతే దోషాః = ఈ దోషాలు, వాక్యేఽపి = సాకాంక్షనానాపదసమూహరూపమైన వాక్యంలో కూడ, సన్తి = ఉండును. కేచన = కొన్ని, పదస్య = పదంయొక్క, అంశేఽపి = భాగంలో కూడా ఉండును.

కేచనేతి :- కేచన అనడంచేత కొన్ని మాత్రమే కాని అన్నీ కాదు అని అర్థం. క్రమంగా ఉదాహరణాలు-

శ్లో. సోఽధ్యైష్ట వేదాంస్త్రిదశానయష్ట
పితౄనతార్ప్సీత్ సమమంస్త బన్ధూన్,

వ్యజేష్ట షడ్వర్గమరంస్త నీతౌ
సమూలఘాతం న్యవధీదరీంశ్చ. 170

వ్యా. స ఇతి :- ఇది భట్టికావ్యం ప్రథమసర్గలో దశరథుణ్ణి వర్ణించే శ్లోకం. సః = అతడు, వేదాన్ = వేదాలను, అధ్యైష్ట = అధ్యయనం చేశాడు. త్రిదశాన్ = దేవతలను, అయష్ట = పూజించాడు, పితౄన్ = పితృదేవతలను, అకార్షీత్ = తృప్తిపరచాడు. బన్ధూన్ = బంధువులను, సమమంస్త = సన్మానించాడు. షడ్వర్గమ్ = కామక్రోధలోభమోహమదమాత్సర్యా లనే అరిషడ్వర్గాన్ని, వ్యజేష్ట = జయించాడు. నీతౌ = నీతియందు, అరంస్త = క్రీడించాడు. అరీన్ చ = శత్రువులను కూడ, సమూలఘాతమ్ = సమూలంగా నశించేటట్లు, న్యవధీత్ = వధించాడు.

ఇక్కడ శ్రుతికటుత్వం అనేకపదాలలో ఉండడంచేత వాక్యదోషం.

అవ. వాక్యగతమైన అప్రయుక్తత్వదోషాన్ని ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ స రాతు వో దుశ్చ్యవనో భావుకానాం పరమ్పరామ్,
అనేడమూకతాద్యైశ్చ ద్యతు దోషైరసంమతాన్. 171

వృ. అత్ర దుశ్చ్యవనః ఇన్ద్రః; అనేడమూకో మూకబధిరః,

వ్యా. సః దుశ్చ్యవనః = ఆ ఇంద్రుడు. వః = మీకు, భావుకానామ్ = కల్యాణములయొక్క, పరంపరామ్ = పరంపరను, రాతు = ఇచ్చుగాక, అసంమతాన్ = మీ అనిష్టులను, శత్రువులను. అనేడమూకతాద్యైః = చెవుడు మూగతనం మొదలైనవాటిచేత, ద్యతు = ఖండించుగాక. పీడించుగాక.

అత్రేతి :- ఇక్కడ దుశ్చ్యవనః అనగా ఇంద్రుడు. అనేకమూకః = మూగతనం చెముడు ఉన్నవాడు.

వి. "సంక్రన్దనో దుశ్చ్యవనః తురాషాణ్మేఘవాహనః" (అమరుడు) అని, "అనేడమూక ఉద్దిష్టః శఠే వాక్ శ్రుతివర్జితే" (మేదిని) అనీ నిఘంటువులలో పై అర్థాలు చెప్పబడినా కవులు ప్రయోగించరు గాన అప్రయుక్తత్వదోషం.

అవ. వాక్యగతమైన నిహతార్థత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ సాయకసహాయబాహోర్మకరధ్వజనియమితక్షమాధిపతేః,
అబ్జరుచిభాస్వరస్తే భాతి తరామవనిప శ్లోకః. 172

వృ. అత్ర సాయకాదయః శబ్దాః ఖడ్గాబ్ధిభూచన్ద్రయశఃపర్యాయాః శరాద్యర్థతయా ప్రసిద్ధాః.

వ్యా. సాయకేతి :- అవనిప = రాజా! సాయకసహాయబాహోః = ఖడ్గం సహాయంగా గల బాహువు కలవాడవు, "మకరధ్వజ....అధిపతేః" మకరధ్వజ = సముద్రంచేత, నియమిత = చుట్టబడిన, క్షమా = భూమికి, అధిపతేః = ప్రభువూ అయిన, తే = నీయొక్క, అబ్జరుచిభాస్వరః = చంద్రునివంటి కాంతితో ప్రకాశిస్తూన్న, శ్లోకః = కీర్తి, భాతితరామ్ = మిక్కిలి ప్రకాశిస్తూన్నది.

అత్రేతి :- ఇక్కడ ఖడ్గం, సముద్రం, భూమి, చంద్రుడు, కీర్తి అనే వాటికి పర్యాయపదాలుగా ప్రయోగించబడిన సాయక-మకరధ్వజ-క్షమా-అబ్జ శ్లోక అనే పదాలకి వరసగా బాణం, మన్మథుడు, ఓర్పు, పద్మం, పద్యం అనే అర్థాలే ప్రసిద్ధిలో ఉన్నాయి. అందుచేత వీటికి నిహతార్థత్వదోషం. ప్రసిద్ధమైన అర్థమే ఆ పదం వినగానే స్ఫురించి చెప్పదలచిన అర్థాన్ని కప్పివేస్తుంది. ఈ దోషం ఇక్కడ అనేకపదాలలో ఉన్నది కాబట్టి వాక్యదోషం.

అవ. వాక్యగతమైన అనుచితార్థత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ కువిన్దస్త్వం తావత్పటయసి గుణగ్రామమభితో
యశో గాయన్త్యేతే దిశి దిశి చ నగ్నాస్తవ విభో,
శరజ్జ్యోత్స్నాగౌరస్ఫుటవికటసర్వాఙ్గసుభగా
తథాపి త్వత్కీర్తిర్భ్రమతి విగతాచ్ఛాదనమిహ. 173

వృ. అత్ర కువిన్దాదిశబ్దోఽర్థాన్తరం ప్రతిపాదయన్నుపశ్లోక్యమానస్య తిరస్కారం వ్యనక్తీతి అనుచితార్థః.

వ్యా. కువిన్ద ఇతి :- రాజుతో కవి అంటూన్న మాట లివి. విభో = ఓ ప్రభూ! కువిన్దః = భూమిని పొందిన, త్వమ్ = నీవు, గుణగ్రామమ్ = శౌర్యాది గుణాల సముదాయాన్ని, అభితః = అంతటా, పటయసి = పటువైనదానినిగా

చేయుచున్నావు. 'పటుం కరోషి' అని విగ్రహవాక్యం. ఏతే = ఈ, నగ్నాః=స్తుతి పాఠకులు, దిశి దిశి = ప్రతి దిక్కునందూ, తవ = నీయొక్క, యశః = కీర్తిని, గాయన్తి=గానం చేస్తున్నారు, తథాపి=అట్లయినా కూడ, శరజ్జ్యోత్స్నాగౌరస్ఫుట వికటసర్వాఙ్గసుభగా = శరత్కాలపు వెన్నెల వలె తెల్లని, స్పష్టమైన, విశాల మైన సకలావయవములతో సుందరి అయిన, త్వత్కీర్తిః = నీ కీర్తి, ఇహ = ఇక్కడ, విగతాచ్ఛాదనమ్=పోయిన అచ్ఛాదనం కలుగునట్లుగా, అడ్డు లేకుండగా భ్రమతి = తిరుగుతున్నది. వ్యాజస్తుతి.

వ్యంగ్యార్థం :- కువిన్దః = సాలెవాడవైన, త్వమ్ = నీవు, అభితః= అంతటా, పడుగూ పేక అమర్చి, గుణగ్రామమ్ = దారముల సముదాయాన్ని, పటయసి = వస్త్రంగా చేస్తున్నావు, "పటం కరోషి" అని విగ్రహం. ఈ నగ్నులు అనగా వస్త్రవిహీనులు నీనుండి వస్త్రం లభించడం చేత అన్ని దిక్కులందు నీ కీర్తిని గానం చేస్తున్నారు. అయితే నీ కీర్తి మాత్రం వస్త్రాచ్ఛాదనం లేకుండా తిరుగుతున్నది.

అత్రేతి :- ఇక్కడ పైన చూపినట్లు కువిందాదిశబ్దాలు మరొక అర్థాన్ని ప్రతిపాదించడం ద్వారా వర్ణించబడే రాజుయొక్క తిరస్కారాన్ని సూచిస్తూ న్నాయి. అందుచేత అనుచితార్థత్వం. ఒక మహారాజును పట్టుకొని నీవు బట్టలు నేసే సాలెవాడవు అనడం అయుక్తం కదా?

అవ. వాక్యగతమైన అవాచకత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ప్రాభ్రభ్రాడ్విష్ణుధామాప్య విషమాశ్వః కరోత్యయమ్,
నిద్రాం సహస్రపర్ణానాం పలాయనపరాయణామ్. 174

వృ. అత్ర ప్రాభ్రభ్రాడ్విష్ణుధామా-విషమాశ్వ-నిద్రా-పర్ణశబ్దాః ప్రకృష్టజలదగగన సప్తాశ్వసంకోచదలానామవాచకాః.

వ్యా. ప్రాభ్రేతి :- అయమ్ = ఈ, విషమాశ్వః = బేసి సంఖ్య గుఱ్ఱములు గల సూర్యుడు, ప్రాభ్రభ్రాట్- 'అభ్రభ్రాట్' అనగా ఆకాశం మీద ప్రకాశించే మేఘం. ప్రాభ్రభ్రాట్ = ప్రకృష్టము లైన మేఘాలు గల, విష్ణుధామ = ఆకా శాన్ని, ఆప్య = పొంది, సహస్రపర్ణానామ్ = వేయి దళాలు గల పద్మాలయొక్క,

నిద్రామ్ = ముకులీభావాన్ని, పలాయనపరాయణామ్ = పారిపోవడంలో ఆసక్తి కలదానినిగా, కరోతి = చేయుచున్నాడు.

అత్రేతి :- ఇక్కడ ప్రాభ్రభాడ్-విష్ణుధామ-విషమాశ్వ-నిద్రా-పర్ణశబ్దాలు ప్రకృష్టమైన మేఘం, ఆకాశం, ఏడుగుఱ్ఱాలు గల సూర్యుడు, సంకోచము, దళాలు అనే అర్థాలను చెప్పవు. అందుచేత ఈ వాక్యంలో అవాచకత్వం అనే దోషం ఉంది.

అవ. మూడు రకాల అశ్లీలాలలో వాక్యగతమైన వ్రీడాజనకాశ్లీలానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ భూపతేరుపసర్పన్తీ కమ్పనా వామలోచనా,
తత్తత్ప్రహరణోత్సాహవతీ మోహనమాదధౌ. 175

వృ. అత్ర ఉపసర్పణప్రహరణమోహనశబ్దాః వ్రీడాదాయిత్వాదశ్లీలాః.

వ్యా. భూపతేః ఇతి :- వామలోచనా = శత్రువుల విషయంలో విరుద్ధాలైన నేత్రాలు గలదీ, ఉపసర్పన్తీ = శత్రువులకు అభిముఖంగా నడుస్తున్నదీ అయిన, భూపతేః = రాజుయొక్క, కమ్పనా = సేన, తత్తత్ప్రహరణోత్సాహవతీ = ఆయా ఆయుధాల ప్రయోగంలో ఉత్సాహం కలదై, మోహనమ్ = శత్రుసంమోహనమును, ఆదధౌ = చేసెను.

వి. ఇక్కడ ప్రయోగించిన శబ్దాలవల్ల మరొక అర్థం గమ్యం అవుతున్నది. ఉపసర్పన్తీ = రతేచ్ఛతో సమీపిస్తున్న, కమ్పనా = కంపాన్ని కలిగించే, వామలోచనా = సుందరనేత్రి అయిన నాయిక. తత్తత్ప్రహరణోత్సాహవతీ = కామశాస్త్ర ప్రసిద్ధాలైన ఆ యా తాడనములయందు ఉత్సాహం కలదై, భూపతేః = రాజుకు, మోహనమ్ = మైథునవిలాసాతిశయాన్ని, ఆదధౌ = చేసినది. ఈ విధంగా ఇక్కడ వ్రీడాజనకమైన అశ్లీలత్వదోషం ఉన్నది.

అవ. జుగుప్సాజనకాశ్లీలానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ తేఽన్యైర్వాన్తం సమశ్నన్తి పరోత్సర్గం చ భుఞ్జతే,
ఇతరార్థగ్రహే యేషాం కవీనాం స్యాత్ప్రవర్తనమ్. 176

వృ. అత్ర వాన్తోత్సర్గప్రవర్తనశబ్దాః జుగుప్సాదాయినః.

వ్యా. తే ఇతి :- యేషాం కవీనామ్ = ఏ కవులకు, ఇతరార్థగ్రహే = ఇతరకవుల అర్థాలను గ్రహించడమునందు, ప్రవర్తనమ్ = ప్రవృత్తి, స్యాత్ = అగునో, తే = వాళ్ళు, అన్యైః = ఇతరులచేత, వాన్తమ్ = కక్కబడినదానిని, సమశ్నన్తి = తినుచున్నారు. పరోత్సర్గమ్ = పరుల మలమును, భుఞ్జతే చ = తినుచున్నారు కూడ.

అత్రేతి :- ఇక్కడ వాన్త-ఉత్సర్గ-ప్రవర్తన శబ్దాలు జుగుప్సను కలిగిస్తున్నాయి. మొదటి రెండు పదాల వాచ్యార్థమే జుగుప్సాకరం, 'ప్రవర్తన' శబ్దానికి పురీషోత్సర్గం అనే రెండవ అర్థం కూడా ఉన్నది. అది స్ఫురించడంచేత అది జుగుప్సాకరం.

అవ. అమంగళకరమైన అశ్లీలానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ పితృవసతిమహం వ్రజామి తాం
సహపరివారజనేన యత్ర మే,
భవతి సపది పావకాన్వయే
హృదయమశేషితశోకశల్యకమ్. 177

వృ. అత్ర పితృగృహమిత్యాదౌ వివక్షితే శ్మశానాదిప్రతీతావమఙ్గలార్థత్వమ్.

వ్యా. పితృవసతిమితి :- భర్త గృహంలో కష్టాలు పడుతున్న ఒక స్త్రీ అంటూన్న మాటలు. అహమ్ = నేను, పరివారజనేన సహ = పరివారజనంతో కూడ, తామ్ = ఆ, పితృవసతిమ్ = తండ్రిగృహమును గూర్చి, వ్రజామి = వెళ్ళెదను, యత్ర = ఎక్కడ, పావకాన్వయే = పవిత్రులైన తండ్రి మొదలైన వారితో సంబంధం కలగగా, మే హృదయమ్ = నా హృదయం, సపది = వెంటనే, అశేషితశోకశల్యమ్ = శేషం లేకుండా చేయబడిన శోక మనే శల్యం కలదిగా, భవతి = అగునో. ఇది వివక్షితార్థం. ఇక్కడ 'పితృవసతిమ్' 'పావకాన్వయే' అనే పదాలకు- 'శ్మశానం' 'అగ్నితో సంబంధం' అనే అర్థాలు కూడా ఉండడం చేత "నేను శ్మశానానికి వెడతాను; అక్కడ చితాగ్నిలో పడడంతో

నా హృదయశోకం అంతా తొలగిపోతుంది" అనే అమంగళకరమైన అర్థం ప్రతీయమానం అవడంచేత ఇక్కడ అశ్లీలత్వదోషం.

అవ. వాక్యగతమైన సందిగ్ధత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ సురాలయోల్లాసపరః ప్రాప్తపర్యాప్తకమ్పనః,
మార్గణప్రవణో భాస్వద్భూతిరేష విలోక్యతామ్. 178

వృ. అత్ర కిం సురాదిశబ్దాః దేవసేనా-శరవిభూత్యర్థాః కిం మదిరాద్యర్థాః ఇతి సందేహః.

వ్యా. సురాలయేతి :- సురాలయోల్లాసపరః = దేవాలయమునందు సంతోషించుటయందు ఆసక్తుడు, ప్రాప్తపర్యాప్తకమ్పనః = పొందబడిన, సరిపోవునంత సైన్యం కలవాడు, మార్గణప్రవణః = బాణాలయందు, ఆసక్తి గలవాడు, భాస్వద్భూతిః = ప్రకాశించుచున్న ఐశ్వర్యం కలవాడూ అయిన, ఏషః = ఇతడు, విలోక్యతామ్ = చూడబడుగాక. చెప్పదలచిన అర్థం ఇది.

సూరాలయోల్లాసపరః = మద్యగృహంలో ఆనందించుటకు ఆసక్తి గలవాడు, ప్రాప్తపర్యాప్తకమ్పనః = పొందబడిన సరిపోవునంత కంపం కలవాడు, మార్గణప్రవణః = యాచించుట యందు ఆసక్తి గలవాడు, భాస్వద్భూతిః = ప్రకాశిస్తూన్న భస్మం (బూడిద) కలవాడు అయిన ఇతడు చూడబడు గాక అని మరొక అర్థం వస్తూన్నది.

అత్రేతి :- ఇక్కడ సురాది శబ్దాలు దేవ-సేనా-బాణ-వైభవా లనే అర్థాలు కలవా లేదా మద్యం మొదలైన అర్థాలు కలవా అని సందేహం. అందుచేత ఈ వాక్యంలో సందిగ్ధార్థత్వదోషం.

అవ. వాక్యగతమైన అప్రతీతత్వదోషానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ తస్యాధిమాత్రోపాయస్య తీవ్రసంవేగతాజుషః,
దృఢభూమిః ప్రియప్రాప్తౌ యత్నః స ఫలితః సఖే. 179

వృ. అత్రాధిమాత్రోపాయాదయః శబ్దాః యోగశాస్త్రమాత్రప్రయుక్తత్వాత్ అప్రతీతాః.

వ్యా. తస్యేతి :- సఖే = ఓ స్నేహితుడా! అధిమాత్రోపాయస్య = అత్యధికమైన యమనియమాద్యుపాయాలు కలవాడు, తీవ్రసంవేగతాజుషః = తీవ్రమైన వైరాగ్యం కలిగి యుండుటను లేదా తీవ్రమైన ఉపాయానుష్ఠానశీఘ్రత్వం కలిగి ఉండుటను పొందినవాడు, అనగా తీవ్రమైన వైరాగ్యం ఉన్నవాడు లేదా తీవ్రమైన ఉపాయాలు శీఘ్రంగా చేసేవాడు అని అర్థం. తస్య=వానియొక్క, ప్రియప్రాప్తౌ =ప్రియమైన ఆత్మసాక్షాత్కారాన్ని పొందడంలో. దృఢభూమిః = దృఢమైన భూమికగల, సః యత్నః = ఆ యత్నం, ఫలితః = ఫలించింది. ఇక్కడ ఉన్న అధిమాత్రోపాయాది పారిభాషికశబ్దాల అర్థం తెలియగోరువారు అస్మద్విరచిత యోగదర్శనాంధ్రవ్యాఖ్య బాలానందిని చూడవచ్చును.

అత్రేతి :- ఇక్కడ ఉన్న అధిమాత్రోపాయాదిశబ్దాలు, ఆదిశబ్దంచేత 'తీవ్రసంవేగ' 'దృఢభూమి' శబ్దాలు యోగశాస్త్రంలో మాత్రమే ప్రయోగించబడతాయి. అందుచేత అప్రతీతాలు.

అవ. వాక్యగతగ్రామ్యతాదోషానికి ఉదాహరణ చూపుతున్నాడు-

శ్లో॥ తామ్బూలభృతగల్లోఽయం భల్లం జల్పతి మానుషః,
కరోతి ఖాదనం పానం సదైవ తు యథా తథా. 180

వృ. అత్ర గల్లాదయః శబ్దాః గ్రామ్యాః.

వ్యా. తామ్బూలేతి :- తామ్బూలభృతగల్లః = తాంబూలంచేత నింపబడిన బుగ్గ గల, అయం మానుషః = ఈ మనిషి, సదైవ = కూడానే, తాంబూలచర్వణంతో పాటు, యథా = ఎట్లు, ఖాదనమ్ = నమలడం, పానమ్ = త్రాగడం, కరోతి = చేస్తాడో! తథా = అట్లే, భల్లమ్ = బాగుగా, దీనికి అనుగుణంగా, జల్పతి = పేలుతున్నాడు.

అత్రేతి :- ఇక్కడ గల్లాది శబ్దాలు గ్రామ్యాలు.

వి. విదగ్ధులు గండస్థలం మొదలైన అర్థాలలో 'కపోల' మొదలైన శబ్దాలే ప్రయోగిస్తారు కాని గల్లాది శబ్దాలు ప్రయోగించరు. అందుచేత గల్ల-భల్ల-మానుష ఖాదన-పానశబ్దాలు గ్రామ్యాలు.

అవ. వాక్యంలో ఉన్న నేయార్థత్వానికి ఉదాహరణం ఇస్తున్నాడు-

శ్లో॥ వస్త్రవైడూర్యచరణైః క్షతసత్త్వరజఃపరా,
నిష్కమ్పా రచితా నేత్రయుద్ధం వేదయ సాంప్రతమ్. 181

వృ. అత్ర అమ్బరరత్నపాదైః క్షతతమా అచలా భూః కృతా నేత్రద్వన్ద్వం బోధయేతి నేయార్థతా.

వ్యా. వస్త్రేతి :- నిద్రపోవుచున్న సఖురాలి మాట లివి :- వస్త్రవైడూర్య చరణైః- వస్త్రం అనగా అంబరం; అనగా ఆకాశం. వైడూర్యం అనగా మణి. వస్త్రవైడూర్యం అనగా అంబరమణి, సూర్యుడు, వస్త్రవైడూర్యచరణైః = సూర్యుని పాదాలచేత. క్షతసత్త్వరజః పరా- సత్త్వరజఃపరం అనగా సత్త్వగుణ రజోగుణాలకంటె భిన్నమైన తమోగుణం, అనగా చీకటి. క్షతసత్త్వరజః పరా = తొలగించబడిన చీకటి గలదిగా, నిష్కమ్పా అనగా కంపం లేనిది. అనగా అచల, అనగా భూమి; రచితా = చేయబడినది. సాంప్రతమ్ = ఇప్పుడు, నేత్ర యుద్ధమ్ = యుద్ధం అనగా ద్వంద్వం. ఇద్దరి మధ్య యుద్ధం జరుగుతుంది కదా. నేత్రయుద్ధం అనగా నేత్ర ద్వంద్వాన్ని, వేదయ = బోధింపచేయుము. తెలుపుము.

అత్రేతి :- ఇక్కడ "సూర్యుని పాదాలచేత భూమి తొలగిపోయిన చీకటి కలదిగా చేయబడింది; అందుచేత నేత్రద్వంద్వాన్ని తెరువుము" అనే అర్థం నేయార్థం. వస్త్ర-వైడూర్య-చరణ-సత్త్వరజఃపర-నిష్కమ్పా-యుద్ధ-వేదయ అనే పదాలకు ఇక్కడ తమ వాచ్యార్థం కుదరదు. అందుచేత అమ్బర-రత్న-పాద తమః-అచలా-ద్వన్ద్వ-బోధయ పదాలు లక్షణచేత చెప్పబడుతాయి. అవి, లక్షణా బోధితాలైన ఆ పదాలు వరసగా ఆకాశమణి-కిరణ-అంధకార-భూమి-యుగల ఉద్ఘాటయ అనే అర్థాలను ఉపస్థాపింపచేస్తాయి అందుచేత ఇది లక్షితలక్షణ. ఈ విధంగా శ్రమపడి, రూఢిప్రయోజనాలు లేకపోయినా లక్షణను అంగీకరించి అర్థాలు చెప్పాలి గాన నేయార్థత్వదోషం.

అవ. వాక్యగతమైన క్లిష్టత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ధమ్మిల్లస్య న కస్య ప్రేక్ష్య నికామం కురఙ్గశాబాక్ష్యాః,
రజ్యత్యపూర్వబన్ధవ్యుత్పత్తేర్మానసం శోభామ్. 182

వృ. అత్ర ధమ్మిల్లస్య శోభాం ప్రేక్ష్య కస్య మానసం న రజ్యతీతి సంబన్ధే క్లిష్టత్వమ్.

వ్యా. ధమ్మిల్లస్య ఇతి :- కురఙ్గశాబాక్ష్యాః = లేడిపిల్ల కన్నుల వంటి కన్నులు గల ఈమెయొక్క, అపూర్వబన్ధవ్యుత్పత్తేః = క్రొత్తదైన బంధము యొక్క విశిష్టమైన సంబంధం గల, ధమ్మిల్లస్య = ముడివేసిన కేశపాశంయొక్క, శోభామ్ = శోభను, ప్రేక్ష్య = చూచి, కస్య = ఎవనియొక్క, మానసమ్ = మనస్సు, న రజ్యతి = రంజితం కాదు?

అత్రేతి :- ఇక్కడ "ధమ్మిల్లంయొక్క శోభను చూచి ఎవని మనస్సు అనురక్తం కాదు" అని సంబంధంలో (అన్వయంలో) క్లిష్టత్వం ఉన్నది. పదాలు దూరదూరంగా విసిరివేసినట్లు ఉండడంచేత శ్లోకం విన్నవెంటనే పదాల అన్వయం కుదరదు అని అర్థం.

అవ. వాక్యగతమైన అవిమృష్టవిధేయాంశత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ న్యక్కారో హ్యయమేవ మే యదరయస్తత్రాప్యసౌ తాపసః
సోఽప్యత్రైవ నిహన్తి రాక్షసకులం జీవత్యహో రావణః,
ధిక్ ధిక్ శక్రజితం ప్రబోధితవతా కిం కుమ్భకర్ణేన వా
స్వర్గగ్రామటికావిలుణ్ఠనవృథోచ్ఛూనైః కిమేభిర్భుజైః 183

వృ. అత్ర 'అయమేవ న్యక్కారః' ఇతి వాచ్యమ్. ఉచ్ఛూనత్వమాత్రం చానువాద్యం న వృథాత్వవిశేషితమ్. అత్ర చ శబ్దరచనా విపరీతా కృతేతి వాక్యస్యైవ దోషః న వాక్యార్థస్య.

వ్యా. న్యక్కారః ఇతి :- రాముడు రాక్షససంహారం చేస్తూన్న సమయంలో రావణుడు తనలో అనుకుంటూన్న మాటలు. ఈ శ్లోకం హనుమన్నాటకంలోనిది. మే = నాకు, అరయః ఇతి యత్ = శత్రువు లుండడం అనే మాట ఏది కలదో, అయమేవ = ఇదే, న్యక్కారః = అవమానం. తత్రాపి = అందులోనూ, తాపసః = తాపసుడైన, అసౌ = ఈ మానవుడు శత్రువు. సోఽపి = అతడు కూడా, అత్రైవ

= ఇక్కడనే, రాక్షసకులమ్=రాక్షససముదాయాన్ని, నిహన్తి=చంపుతున్నాడు, అహో = ఏమి ఆశ్చర్యము! రావణః = రావణుడు, జీవతి=జీవించియే ఉన్నాడు! శక్రజితమ్ = ఇంద్రజిత్తును గూర్చి, ధిక్ ధిక్ = నింద అగుగాక. ప్రబోధితవతా = మేల్కొలుపబడిన, కుమ్భకర్ణేన = కుంభకర్ణునిచేత, కిం వా = ఏమి ప్రయోజనం? స్వర్గగ్రామటికావిలుణ్ఠనవృథోచ్ఛూనైః = స్వర్గం అనే చిన్న గ్రామాన్ని దోచుకోవడంచేత వ్యర్థంగా బలిసిన, ఏభిః = ఈ, భుజైః = భుజాలచేత, కిమ్ = ఏమి ప్రయోజనం?

అత్రేతి :— ఇక్కడ 'అయమేవ న్యక్కారః' అని చెప్పాలి. ఉచ్ఛూనత్వ మాత్రాన్నే అనువదించాలి కాని వృథాత్వంతో విశేషితమైన ఉచ్ఛూనత్వాన్ని అనువదించకూడదు. ఇక్కడ శబ్దాల కూర్పు విపరీతంగా చేయబడింది. అందు చేత ఇది వాక్యదోషమే కాని వాక్యార్థదోషం కాదు.

వి. 'అయమ్' అనగా నాకు శత్రువు ఉండడం. దాన్ని అనువదించి న్యక్కారం విధించబడుతున్నది. అందుచేత అనువదించబడేదానిని ముందు, విధే యాన్ని తరవాత ప్రయోగించి వాక్యనిర్మాణం చెయ్యాలి. "అనువాద్యాన్ని చెప్ప కుండా విధేయాన్ని ప్రతిపాదించకూడదు" (అనువాదమనుక్త్వైవ న విధేయము దీరయేత్) అని నియమం. అందుచేత 'అయమేవ న్యక్కారః' అనాలి కాని 'న్యక్కారో హ్యయమేవ' అనకూడదు. ఇది వ్యస్తపదాలలో ఉంది కాబట్టి వాక్య గత అవిమృష్టవిధేయాంశత్వదోషం.

పూర్వం 'మూర్ధ్నామ్' ఇత్యాది శ్లోకంలో(159) చెప్పినట్లు 'వృథోచ్ఛూనైః' అని సమాసం చేయడంచేత వృథాత్వం కూడా ఉచ్ఛూనత్వంతో పాటు అనువాద్య కోటిలో పడిపోయినది. అందుచేత విధేయం కావలసిన అది (నా భుజాలు బలిసి ఉండడం వృథా అని చెప్పి విధేయంగా చేయవలసిన అది) విధేయం కాకుండా అయిపోయింది. ఇది పదగత (సమాసం పదం కాబట్టి) అవిమృష్టవిధేయాంశత్వ దోషం అని ప్రసంగవశాత్ ఆ విషయం కూడా వృత్తిలో చెప్పబడింది. వాక్య గతఅవిమృష్టవిధేయత్వానికి 'న్యక్కారో హ్యయమ్' అనేది మాత్రమే ఉదాహరణం.

మరొక విషయం ఏమనగా ఈ దోషం పదాల కూర్పులో వైపరీత్యంవల్ల ఏర్పడింది గాన వాక్యదోషమే. పదాలు ఎలా కూర్చినా వాక్యార్థం ఒకటే కాబట్టి వాక్యార్థదోషం కాదు.

అవ. మరియొక ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అపాఙ్గసంసర్గి తరఙ్గితం దృశో
ర్భ్రువోరరాలాన్తవిలాసి వేల్లితమ్,
విసారి రోమాఞ్చనకఞ్చుకం తనో
స్తనోతి యోఽసౌ సుభగస్తవాగతః. 184

వృ. అత్ర యోఽసావితి పదద్వయమనువాద్యమాత్రప్రతీతికృత్.

వ్యా. అపాఙ్గేతి:- నాయకుడు రానున్నాడు అని నాయికతో సఖి అంటూన్న మాటలు. యః = ఏ, సుభగః = సుందరుడు, తవ దృశోః = నీ నేత్రాలకు, అపాఙ్గసంసర్గి = నేత్రాంతములతో కలిసే, తరఙ్గితమ్ = వంకర చూపుల పరంపరను, భ్రువోః = కనుబొమ్మలకు, అరాలాన్తవిలాసి = వక్రము లైన అంతభాగములందు ప్రకాశించు, వేల్లితమ్ = ముణుచుకొనడాన్ని, తనోః = శరీరమునకు, రోమాఞ్చనకఞ్చుకమ్ = రోమాంచం అనే కంచుకాన్ని, తనోతి = చేయునో, అసౌ = అట్టి నాయకుడు, ఆగతః = వచ్చినాడు.

అత్రేతి:- ఇక్కడ 'యః అసౌ' అనే రెండు పదాలూ కూడ అనువాద్య మైనదాని ప్రతీతిని మాత్రమే కలిగిస్తాయి.

వి. "యః తనోతి అసౌ ఆగతః" ఎవడు ఈ విధంగా చేస్తాడో అతడు వచ్చినాడు అని యచ్ఛబ్దార్థాన్ని అనువదించి తత్‌శబ్దార్థపరామర్శకంగా 'అసౌ' అనేది ప్రయోగించి దానిని విధేయకోటిలో చేర్చడం రచయిత ఉద్దేశ్యం. కాని "యత్తదోః నిత్యసంబన్ధః" అనే న్యాయంచేత యచ్ఛబ్దంచేత నిర్దేశింపబడినదానిని పరామర్శించడానికి తత్‌శబ్దం మాత్రమే ప్రయోగించాలి. 'యః తనోతి సః ఆగతః" అని అనాలి. తత్‌శబ్దం కాక అదస్, ఇదమ్, ఏతత్ శబ్దాలలో ఏ శబ్ద మైనా యచ్ఛబ్దంతో 'యః అసౌ' 'యః అయమ్' 'యః ఏషః' ఇత్యాది విధంగా ప్రయోగించినా సంబద్ధత్వార్థం రాదు. ప్రసిద్ధత్వార్థమే బోధించబడుతుంది. యః అసౌ = ప్రసిద్ధుడైన ఏ ఇతడు అని అర్థం. ఇతరపదాలు ప్రయోగించినా అదే అర్థం. అందుచేత ఇక్కడ విధేయవాక్యం అసంపూర్ణంగా ఉన్నది. ఉద్దేశ్యవిధేయ

భావం స్పష్టంగా తెలియడం లేదు. అందుచేత ఇక్కడ కూడా అవిమృష్టవిధేయాంశత్వదోషం అని భావం.

ఈ సందర్భంలో మమ్మటుడు- "యత్తత్‌శబ్దాలకే నిత్యసంబంధం; వాటిని ప్రయోగించినప్పుడే ఉద్దేశ్యవిధేయభావం ఉంటుంది; ఉద్దేశ్యవిధేయభావం కావాలనుకొన్నచోట యచ్ఛబ్దంతో అదస్, ఇదమ్, ఏతచ్ఛబ్దాలు ప్రయోగిస్తే కుదరదు" అని 'తథాహి' మొదలు 'తథాభూతమేవ తత్‌శబ్దేన పరామృశ్యతే' వరకు ఉన్న గ్రంథంచేత సోదాహరణంగా, సవిస్తరంగా ప్రతిపాదిస్తున్నాడు. యత్తత్‌శబ్దాల ప్రయోగంలో కొన్ని మెలకువలు కూడా సూచిస్తూన్నాడు-

వృ. తథాహి-ప్రక్రాన్తప్రసిద్ధానుభూతార్థవిషయస్తచ్ఛబ్దోయచ్ఛబ్దోపాదానం నాపేక్షతే. క్రమేణోదాహరణమ్-

శ్లో॥ కాతర్యం కేవలా నీతిః శౌర్యం శ్వాపదచేష్టితమ్,
అతః సిద్ధిం సమేతాభ్యాముభాభ్యామన్వియేష సః. 185

వ్యా. తథాహీతి :- అదియుక్తమే కదా? ఉపక్రమించిన విషయాన్ని, ప్రసిద్ధమైన విషయాన్ని, పూర్వం అనుభవించిన విషయాన్ని పరామర్శించే తచ్ఛబ్దం యచ్ఛబ్దప్రయోగాన్ని అపేక్షించదు. ఈ మూడింటికీ వరసగా ఉదాహరణలు-

కాతర్యమితి :- ఇది రఘువంశం పదిహేడవ సర్గలో అతిథి అనే రాజును వర్ణించే శ్లోకం. కేవలా = కేవలమైన, నీతిః = నీతి, కాతర్యమ్ = పిరికితనం. శౌర్యమ్ = కేవలశౌర్యం, శ్వాపదచేష్టితమ్ = క్రూరమృగాల చేష్ట. అతః = అందువలన, సః = అతడు, సమేతాభ్యామ్ = కలిసిన, ఉభాభ్యామ్ = నీతి-శౌర్యాలు రెండింటిచేతా, సిద్ధిమ్ = కార్యసిద్ధిని, అన్వియేష = కోరెను.

వి. అతిథిని గూర్చిన వర్ణన వెనుకటి శ్లోకాలలోనే ప్రారంభం అయింది. అందుచేత ఇక్కడ 'సః' అని తత్‌శబ్దం ప్రయోగించినా దీనికి యత్‌శబ్దాపేక్ష లేదు. యత్‌శబ్దాన్ని ప్రయోగించవలసిన పని లేదు.

అవ. ప్రసిద్ధార్థకమైన తత్‌శబ్దానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా పినాకినః,

కలా చ సా కాన్తిమతీ కలావత
స్త్వమస్య లోకస్య చ నేత్రకౌముదీ. 186

వ్యా. ద్వయమితి :- దీని భావం వెనుక ఇవ్వబడింది (చూ. శ్లో. 132ఎ) ఇక్కడ 'సా' అనగా 'ప్రసిద్ధమైన' అని అర్థం. అందుచేత ఈ తత్‌శబ్దానికి యత్‌శబ్దాపేక్ష లేదు.

అవ. అనుభూతార్థపరామర్శకమైన తత్‌శబ్దానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ఉత్కమ్పినీ భయపరిస్ఖలదంశుకాన్తా
తే లోచనే ప్రతిదిశం విధురే క్షిపన్తీ,
క్రూరేణ దారుణతయా సహసైవ దగ్ధా
ధూమాన్ధితేన దహనేన న వీక్షితాసి. 187

వ్యా. ఉత్కమ్పినీ ఇతి :- హర్షవర్ధనుడు రచించిన రత్నావళినాటికలో వాసవదత్త అగ్నిదాహం వల్ల మరణించినదని విన్న వత్సరాజు ఆమెను గూర్చి విలపిస్తూ అన్న మాట అని చాలా మంది వ్యాఖ్యాతలు వ్రాసినారు. కాని ప్రస్తుతం లభ్యం అవుతున్న రత్నావళిలో ఈ శ్లోకం లేదని బాలబోధినీకారుడు. ఉత్కమ్పినీ = వణకుచున్నదానవు, భయపరిస్ఖలదంశుకాన్తా=భయంచేత కదలుతూన్న వస్త్రాంతం కలదానవు, విధురే = భయాక్రాంతములైన, తే = ఆ, లోచనే = నేత్రాలను, ప్రతిదిశమ్ = అన్ని దిక్కులా, క్షిపన్తీ = ప్రసరింపచేయుచున్న దానవూ అయిన నీవు, ధూమాన్ధితేన = ధూమంచేత గ్రుడ్డిదిగా చేయబడిన, క్రూరేణ = క్రూరమైన, దహనేన = అగ్నిచేత, దారుణతయా = క్రూరత్వం చేత, న వీక్షితాసి = చూడబడలేదు; సహసైవ = వెంటనే, దగ్ధా = కాల్చబడితివి.

వి. ఇక్కడ 'తే' అనేదానికి నాకు పూర్వపరిచితములైన, నేను అనుభవించిన, అనగా పూర్వం ఎరిగిఉన్న అని అర్థం. అందుచేత ఈ తత్‌శబ్దానికి యత్‌శబ్దప్రయోగాపేక్ష లేదు.

అయితే పై మూడు ఉదాహరణలలో యత్‌శబ్దాన్ని ప్రయోగించవలసిన పని లేకపోయినా యత్‌శబ్దం ఆక్షేపలభ్యం అవుతుంది. అనగా యత్‌శబ్దం ఉన్నట్లు

ఊహించుకొని అర్థం చెప్పుకోవాలి అని వ్యాఖ్యాతలు వివరించారు. "యః పూర్వోక్త గుణవాన్" ఎవడు పూర్వం చెప్పబడిన గుణాలు కలవాడో, సః=ఆ అతిథి అని మొదటి శ్లోకంలోను "యా ప్రసిద్ధా" ఏది ప్రసిద్ధమైనదో, సా = ఆ చంద్రకళ అని రెండవ శ్లోకంలోను, 'యే అనుభూతే' ఏవి అనుభవించబడినవో, తే = ఆ నేత్రాలు అని మూడవ శ్లోకంలోను యత్‌శబ్దం ఉన్నట్లుగా ఊహించి అర్థం చెప్పాలి అని భావం. యత్‌శబ్దాన్ని ప్రయోగించకపోవడంచేత సాకాంక్షత్వదోషం మాత్రం లేదు.

అవ. తత్‌శబ్దం ఎక్కడ యత్‌శబ్దప్రయోగాన్ని అపేక్షించదో చూపి, కొన్నిచోట్ల యత్‌శబ్దానికి కూడా తత్‌శబ్దప్రయోగాపేక్ష ఉండదని సోదాహరణంగా నిరూపిస్తున్నాడు-

వృ. యచ్ఛబ్దస్తూత్తరవాక్యానుగతత్వేన ఉపాత్తః సామర్థ్యాత్ పూర్వవాక్యానుగతస్య తచ్ఛబ్దస్యోపాదానం నాపేక్షతే. యథా

శ్లో॥ సాధు చన్ద్రమసి పుష్కరైః కృతం
మీలితం యదభిరామతాధికే,
ఉద్యతా జయిని కామినీముఖే
తేన సాహసమనుష్ఠితం పునః. 188

వ్యా. యచ్ఛబ్ద ఇతి :- ఉత్తరవాక్యంతో సంబంధించినట్లుగా ప్రయోగింపబడిన యత్‌శబ్దమైతే సామర్థ్యంవలన పూర్వవాక్యంతో సంబంధించిన తత్‌శబ్దంయొక్క గ్రహణాన్ని అపేక్షించదు. అనగా పూర్వవాక్యంలో తత్‌శబ్దాన్ని ప్రయోగించకపోయినా ఆక్షేపంచేత అది ఉన్నట్లు భావించి అర్థం చెప్పుకొనవచ్చును అని అర్థం.

సాధు ఇతి :- అభిరామతాధికే= మనోహరత్వంచేత అధికుడైన, చన్ద్రమసి=చంద్రుడు (ఉదయించుచుండగా), పుష్కరైః= పద్మాలచేత, యత్ మీలితమ్ (మీలితం ఇతి యత్)=ముకుళీభావము పొందబడినది అనేది ఏది గలదో, (తత్ = అది), సాధు = బాగుగానే, కృతమ్ = చేయబడింది. పునః = కాని, కామినీముఖే= కామినియొక్క ముఖం, జయిని= సర్వోత్కర్షతో ఉంటూండగా,

ఉద్యతా = ఉదయిస్తూన్న, తేన = ఆ చంద్రునిచేత, సాహసమ్ = సాహసం, అనుష్ఠితమ్ = చేయబడినది.

వి. ఇక్కడ 'యన్మీలితమ్' అనే ఉత్తరవాక్యంలో ఉన్న యచ్ఛబ్దానికి పూర్వవాక్యంలో '(తత్) సాధు కృతమ్' అని తచ్ఛబ్దాపేక్ష లేదు. తచ్ఛబ్దం ప్రయోగించకపోయినా ఆక్షేపంచేత అది లభిస్తుంది; ఉన్నట్లుగా భావించబడుతుంది.

వృ. ప్రాగుపాత్తస్తు యచ్ఛబ్దః తచ్ఛబ్దోపాదానం వినా సాకాఙ్క్షః. యథా అత్రైవ శ్లోకే ఆద్యపాదయో ర్వ్యత్యాసే. ద్వయోరుపాదానే తు నిరాకాఙ్క్షత్వం ప్రసిద్ధమ్.

వ్యా. ప్రాగితి - ముందు అనగా మొదటి వాక్యంలో ప్రయోగించబడిన యచ్ఛబ్దం మాత్రం తచ్ఛబ్దం (ఉత్తరవాక్యంలో) లేకపోతే సాకాంక్షంగానే ఉండిపోతుంది. ఉదాహరణకి ఈ శ్లోకంలోనే మొదటి రెండు పాదాలూ క్రమం మార్చి చూడవచ్చును. అనగా - "మీలితం యదభిరామతాధికే సాధు చన్ద్రమసి పుష్కరైః కృతమ్" అని చదివిన పక్షంలో పూర్వవాక్యంలో యచ్ఛబ్దం ఉన్నది. ఉత్తరవాక్యంలో తచ్ఛబ్దం లేకపోతే ఆ యచ్ఛబ్దం సాకాంక్షంగానే ఉండిపోతుంది; అర్థం సంపూర్ణం కాదు. అందుచేత "తత్ సాధు చన్ద్రమసి పుష్కరైః కృతమ్" అని రెండవపాదం ఉండాలి. యత్శబ్దతచ్ఛబ్దాలు రెండూ ప్రయోగించినప్పుడు యచ్ఛబ్దం నిరాకాంక్షం (ఆకాంక్ష - అపేక్ష లేనిది) అనే విషయం ప్రసిద్ధమే. ఉదాహరణకి - "యదువాచ తన్మిథ్యా" అనే వాక్యంలో ముందు యచ్ఛబ్దమూ తరువాత తచ్ఛబ్దమూ ఉపయోగించబడినాయి కాబట్టి ఇక్కడ యచ్ఛబ్దం నిరాకాంక్షం.

వృ. అనుపాదానేఽపి సామర్థ్యాత్ కుత్రచిత్ ద్వయమపి గమ్యతే. యథా -

శ్లో॥ యే నామ కేచిదిహ నః ప్రథయన్త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ. 189

వృ. అత్ర యః ఉత్పత్స్యతే తం ప్రతీతి.

వ్యా. అనుపాదానేఽపి ఇతి - కొన్ని చోట్ల యచ్ఛబ్దతచ్ఛబ్దాలు రెండూ ప్రయోగించకపోయినా వాక్యసామర్థ్యంచేత ఆ రెండూ కూడా గమ్యములు అవుతాయి. ఎట్లనగా -

యే ఇతి - మాలతీమాధవప్రారంభంలో కవి మాట లివి - యే నామ = ఏ, కేచిత్ = కొందరు, నః = మా విషయంలో, అవజ్ఞామ్ = అనాదరాన్ని, ప్రథయన్తి = ప్రకటిస్తారో, తే = వాళ్ళు, కిమపి = ఏమేమో, జానన్తు = తెలిసి ఉందురు గాక. ఏషః యత్నః = ఈ ప్రయత్నం, తాన్ ప్రతి = వాళ్ళను గూర్చి, న = కాదు. మమ = నాకు, సమానధర్మా = సమానమైన ధర్మం కలవాడు, ఉత్పత్స్యతే = పుట్టగలడు; అస్తి చ = ఎక్కడనో ఉండి ఉండవచ్చు కూడ. అయం కాలః = ఈ కాలం, నిరవధిః హి = అవధిలేనిది కదా ? పృథ్వీ చ = భూమి కూడ, విపులా చ = విశాలమైనది కదా ?

అత్రేతి - ఇక్కడ "యః ఉత్పత్స్యతే తం ప్రతి" (ఎవడు పుట్టగలడో వానిని గూర్చి యే) నా యత్నం అని యచ్ఛబ్దతచ్ఛబ్దాలు రెండూ కూడా గమ్యం అవుతున్నాయి.

పూర్వార్ధంలో 'యే తే' అని రెండూ ప్రయోగించడంచేత అక్కడ ఆకాంక్ష లేనట్లు స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది.

అవ. పూర్వవాక్యంలో ఉన్న యచ్ఛబ్దానికి తత్‌శబ్దాకాంక్ష ఉంటుం దని స్థాపించబడింది. అందుచేత ప్రకృతంలో "తనోతి యోఽసౌ సుభగః" అనే చోట తచ్ఛబ్దం లేదు కాబట్టి అవిమృష్టవిధేయాంశత్వం ఉన్నది అని చెపుతున్నాడు -

వృ. ఏవం చ తచ్ఛబ్దానుపాదానేఽత్ర సాకాఙ్క్షత్వమ్. న చాసా వితి తచ్ఛబ్దార్థమాహ.

శ్లో॥ అసౌ మరుచ్చుమ్బితచారుకేసరః
ప్రసన్నతారాధిపమణ్డలాగ్రణీః,
వియుక్తరామాతురదృష్టివీక్షితో
వసన్తకాలో హనుమానివాగతః. 190

వృ. అత్ర హి న తచ్ఛబ్దార్థప్రతీతిః.

వ్యా. ఏవం చ ఇతి - ఈ కారణంచేత అనగా పూర్వవాక్యగతమైన యచ్ఛబ్దం తచ్ఛబ్దాపేక్షం అని స్థాపించడంచేత, ఇక్కడ ("తనోతి యోఽసౌ సుభగః" అనే వాక్యంలో) తచ్ఛబ్దం ప్రయోగించకపోతే సాకాంక్షత్వం ఉంటుంది. 'అసౌ' అనే పదం తత్‌శబ్దార్థాన్ని చెప్పదు కదా ? ఉదాహరణకి ఈ క్రింది శ్లోకంలో 'అసౌ' అనే దానికి తచ్ఛబ్దార్థం ('సః' అనేదాని అర్థం) చెప్పడం కుదరదు కదా?

అసౌ ఇతి - మరుచ్చుమ్బితచారుకేసరః = వాయువుచేత స్పృశించబడిన అందమైన కింజల్కములు కలదీ, హనుమంతునిపక్షంలో వాయువుచేత చుంబించ బడిన జూలు కలవాడు, ప్రసన్నతారాధిపమణ్డలాగ్రణీః=ప్రసన్నం (నిర్మలం)గా ఉన్న చంద్రమండలం నాయకుడుగా కలదీ, సుఖంగా ఉన్న తార భర్తయైన సుగ్రీవుని రాజ్యంలో అగ్రనాయకుడు అని రెండవ అర్థం. వియుక్త రామాతుర దృష్టివీక్షితః = వియోగం చెందిన స్త్రీలయొక్క దీనమైన దృష్టితో చూడబడినదీ, సీతావియోగము పొందిన రాముని దీనదృష్టితో చూడబడినవాడు అని రెండవ అర్థం, అయిన, వసన్తకాలః = వసంతకాలం, హనుమానివ = హనుమంతుడు వలె, ఆగతః = వచ్చినది.

అత్రేతి - ఇక్కడ 'అసౌ' అనేదానివల్ల తచ్ఛబ్దార్థప్రతీతి కలగడంలేదు.

తచ్ఛబ్దార్థప్రతీతి కలిగే పక్షంలో ఆ వసంతం (అట్టి వసంతం) అనగానే అది విధేయం అవడంచేత ఏది, ఎట్టిది అనే అనువాదకయచ్ఛబ్దాపేక్ష ఉండేది అని భావం.

అవ. 'అసౌ' అనే అదశ్శబ్దంవల్ల తచ్ఛబ్దార్థప్రతీతి కలుగుతుందనే పక్షానికి బాధకం చూపుతున్నాడు -

వృ. ప్రతీతౌ వా -

శ్లో॥ కరవాల కరాలదోఃసహాయో
యుధి యోఽసౌ విజయార్జునైకమల్లః,
యది భూపతినా స తత్ర కార్యే
వినియుజ్యేత తతః కృతం కృతం స్యాత్. 191

వృ. అత్ర స ఇత్యస్యానర్థక్యం స్యాత్.

వ్యా. అదః శబ్దంవల్ల తచ్ఛబ్దార్థ ప్రతీతి కలిగితే - "కరవాల" ఇత్యాది శ్లోకంలో 'అసౌ' అని ముందు ప్రయోగించిన తరవాత (నీ అభిప్రాయం ప్రకారం)

తత్సమానార్థకం అయిన 'సః' అనే శబ్దాన్ని ప్రయోగించడం వ్యర్థం అవుతుంది అని శ్లోకం తరవాత వచ్చే వాక్యంతో అన్వయం.

కరవాలేతి - యుధి = యుద్ధమునందు, కరవాల కరాలదోఃసహాయః = ఖడ్గంచేత భయంకరమైన బాహువే సహాయంగా గల, యః అసౌ = ఏ ఈ, విజయార్జునైక మల్లః = విజయార్జునైకమల్లుడు ఉన్నాడో, సః = అతడు, భూపతినా = రాజుచేత, తత్ర కార్యే = ఆ కార్యమునందు, వినియుజ్యేత యది = నియమించ బడినట్లయితే, తతః = అటుపిమ్మట, కృతమ్ = పని, కృతమ్ = చేయబడినది, స్యాత్ = అగును.

వి. ఈ శ్లోకం ఎక్కడిదో తెలియదు. అందుచేత కొందరు వ్యాఖ్యాతలు చెప్పినట్లు "అర్జునుణ్ణి ఎదిరించ గలిగిన ఏకమల్లుడైన కర్ణుణ్ణి సేనాపత్యంలో దుర్యోధనుడు నియోగిస్తే" ఇత్యాది వ్యాఖ్యానానికి ఆధారం లేదు. కర్ణుడు ఖడ్గధారిగా ప్రసిద్ధుడు కాడు. అందుచేత విజయార్జునైకమల్లుడు అనేది ఒక వీరుని పేరు అయిఉంటుం దని గ్రహించి వ్యాఖ్యానించినాము

అవ. పై శ్లోకంలో 'సః' అనేది వ్యర్థం అయిపోతుంది అనే భయంచేత అదః (అసౌ) శబ్దాన్ని తచ్ఛబ్ద సమానార్థకంగా గ్రహించకపోయినా 'తనోతి యోఽసౌ' అనే చోట ఇదమ్ శబ్దాదులకు వలె తచ్ఛబ్దసమానార్థకత్వాన్ని అంగీకరించవచ్చును కదా ? 'ఇదమ్' 'ఏతద్' 'అదస్' శబ్దాలు సమానార్థకాలే కదా అని ఆశంకిస్తున్నారు -

వృ. అథ -

శ్లో॥ యోఽవికల్పమిద మర్థమణ్డలం
పశ్యతీశ నిఖిలం భవద్వపుః,
ఆత్మపక్షపరిపూరితే జగ
త్యస్య నిత్యసుఖినః కుతో భయమ్. 192

వృ. ఇతీదంశబ్దవదదఃశబ్దస్తచ్ఛబ్దార్థమభిధత్తే ఇతి.

వ్యా. 'అథ' అనేది ఇక్కడ ప్రశ్నార్థకం. 'అథ అభిధత్తే' అని అన్వయం. "చెపుతుంది కదా ?" అని అర్థం.

యః ఇతిః - ఇది ఉత్పలాచార్యవిరచిత పరమేశ్వర స్తోత్రావలిలో పదమూడవ స్తోత్రంలో అద్వైతదృష్టి గల భక్తుడు భగవంతునితో అంటూన్న మాటలు. ఈశ = ఓః పరమేశ్వరా! యః = ఎవడు, నిఖిలమ్ = సమస్తమైన, ఇదమ్ = ఈ, అర్థమణ్డలమ్ = దృశ్యవస్తుసముదాయాన్ని, అవికల్పమ్=నిఃసంశయంగా, భవద్వపుః = నీ శరీరాన్నిగా, పశ్యతి = చూస్తాడో, అస్య = ఈ, నిత్యసుఖినః = నిత్యసుఖవంతునికి, ఆత్మపక్షపరిపూరితే = ఆత్మ స్వరూపపక్షంచేత నింపబడిన, జగతి = జగత్తునందు, భయమ్ = భయము, కుతః = ఎట్లు ?

ఈ శ్లోకంలో 'అస్య' అనే ఇదమ్‌శబ్దం తచ్ఛబ్దార్థాన్ని చెప్పినట్లు అదఃశబ్దంకూడా (తచ్ఛబ్దార్థాన్ని) చెప్పవచ్చునుకదా ?

అవ. ఈ ఆశంకకు సమాధానం చెపుతున్నారు - ('అథ....ఉచ్యతే' అనేది ప్రశ్న, తత్రేత్యాదికం సమాధానం అని చెప్పడం యుక్తం.)

వృ. ఉచ్యతే - తత్రైవ వాక్యాన్తరే ఉపాదానమర్హతి, న తత్రైవ; యచ్ఛబ్దస్య హి నికటే స్థితః ప్రసిద్ధిం పరామృశతి. యథా -

శ్లో॥ యత్తదూర్జితమత్యుగ్రం క్షాత్రం తేజోఽస్య భూపతేః,
దీవ్యతాక్షైస్తదానేన నూనం తదపి హారితమ్. 193

వృ. ఇత్యత్ర తచ్ఛబ్దః.

వ్యా. (సమాధానం) చెప్పబడుచున్నది. ఈ ('యోఽవికల్పమ్' ఇత్యాది) శ్లోకంలో ఇదం శబ్దాన్ని వలె ('తనోతి యోఽసౌ' ఇత్యాదిశ్లోకంలో కూడ) అదఃశబ్దాన్ని మరొక వాక్యంలో ప్రయోగించాలి కాని అక్కడనే (యచ్ఛబ్దం ఉన్న వాక్యంలో యచ్ఛబ్దం ప్రక్కనే) ప్రయోగించకూడదు. ఎందుచేత ననగా (యత్తదూర్జిత' ఇత్యాది శ్లోకంలో వలె) యచ్ఛబ్దానికి దగ్గర ప్రయోగించబడిన తత్‌శబ్దం ప్రసిద్ధత్వాన్ని మాత్రమే పరామర్శిస్తుంది. యత్తదిత్యాది శ్లోకంలోని తత్‌శబ్దం వలె అని అన్వయం.

యత్తదితి - వేణీసంహారంలో భీమసేనుడు యుధిష్ఠిరుణ్ణి నిందిస్తూ సహదేవునితో అంటూన్న మాటలు. తదా=ఆనాడు, అక్షైః=పాచికలచేత, దీవ్యతా= ఆడుచున్న (ఆడిన), అనేన = ఈ యుధిష్ఠిరునిచేత, అస్య భూపతేః = ఈ రాజు

యొక్క, ఊర్జితమ్ = గొప్పదీ, అత్యుగ్రమ్ = చాల ఉగ్రమూ అయిన, యత్ తత్ = ప్రసిద్ధమైన ఏ, క్షాత్రం తేజః = క్షత్రియతేజస్సు ఉన్నదో, తదపి = అదికూడా, హారితమ్ = హరింపచేయబడింది.

ఇక్కడ 'యత్ తత్' అని యచ్ఛబ్దం ప్రక్కనే ప్రయోగించిన తచ్ఛబ్దానికి ప్రసిద్ధిమాత్రమే అర్థం. అందుచేతనే యచ్ఛబ్దార్థాన్ని పరామర్శించడానికి 'తదపి' అని మరొక తచ్ఛబ్దం ప్రయోగించబడింది. అదే విధంగా 'యోఽసౌ' అన్నప్పుడు 'అసౌ' అనేది ప్రసిద్ధత్వరూపమైన అర్థాన్ని మాత్రమే బోధించగలదు గాని యచ్ఛబ్దార్థాన్ని పరామర్శించజాలదు అని అర్థం.

అవ:- యచ్ఛబ్దతచ్ఛబ్దాలలో ఒకదానిని ప్రయోగించకపోతే అవిమృష్టవిధేయాంశత్వదోషం అని చెప్పిన పక్షంలో ఈ క్రింది శ్లోకంలో కూడా ఆ దోషం ఉన్న దని చెప్పాలా అని ఆశంకిస్తున్నాడు.

వృ. నను కథమ్—

శ్లో॥ కల్యాణానాం త్వమసి మహసాం భాజనం విశ్వమూర్తే
ధుర్యాం లక్ష్మీమథ మయి భృశం దేహి దేవ ప్రసీద,
యద్యత్పాపం ప్రతిజహి జగన్నాథ నమ్రస్య తన్మే
భద్రం భద్రం వితర భగవన్ భూయసే మఙ్గలాయ. 194

వృ. అత్ర యద్యదిత్యుక్త్వా తన్మే ఇత్యుక్తమ్? ఉచ్యతే-యద్యదితి యేన కేన చిద్రూపేణ స్థితం సర్వాత్మకం వస్తు ఆక్షిప్తమ్; తథా భూతమేవ తచ్ఛబ్దేన పరామృశ్యతే.

వ్యా. "ననుకథమ్ ఇత్యుక్తమ్" అని అన్వయం.

కల్యాణానామితి:- మాలతీమాధవప్రకరణంలో సూత్రధారుడు సూర్యుణ్ణి ప్రార్థిస్తూ అన్న మాటలు. విశ్వమూర్తే = సకలజగత్స్వరూపా! త్వమ్ = నీవు, కల్యాణానామ్ = మంగళకరములైన, మహసామ్ = తేజస్సులకు, భాజనమ్ = స్థానము, అసి = అయి ఉన్నావు. అథ = ఈ నాట్యారంభంలో, మయి = నాయందు, ధుర్యామ్ = నాట్యభావాన్ని వహించగలిగిన, లక్ష్మీమ్ = సంపత్తిని, శక్తిని,

దేహి = ఉంచుము. దేవ = దేవా! భృశమ్ = మిక్కిలి, ప్రసీద = అనుగ్రహించుము. జగన్నాథ = ఓ! జగన్నాథా! నమస్య = నమస్కరించుచున్న, మే = నాయొక్క, యత్ యత్ = ఏ యే, పాపమ్=పాపముగలదో, తత్ = దానిని, ప్రతిజహి = నశింపచేయుము. భగవన్ = పూజ్యుడా! భూయసే = అధికమైన, మఙ్గలాయ = మంగళముకొరకు, భద్రం భద్రమ్ = అధికమైన భద్రమును, వితర = ఇమ్ము.

అత్రేతి:- ఇక్కడ 'యద్యత్' అని చెప్పి 'తత్ మే' అని ఎట్లు చెప్పబడింది?

వి. 'యత్ యత్' అని రెండు యచ్ఛబ్దాలు ప్రయోగించినప్పుడు వాటి అర్థాలను పరామర్శించడానికి రెండు తత్శబ్దాలు ప్రయోగించాలి కదా? ఒకటే ప్రయోగించబడింది. అందుచేత ఇక్కడ కూడా అవిమృష్టవిధేయాంశత్వదోషమున్నది కదా అని ఆశంక.

వ్యా. (దానికి సమాధానం) చెప్పబడుతున్నది - యద్యదితి— 'యద్యత్' అనే దానిచేత ఏ రూపంలో ఉన్నా సర్వవిధాలైన వస్తువు (పాపం) ఆక్షేపించబడుతున్నది. తత్శబ్దం సర్వవిధాలైన ఆ పాపాన్నే పరామర్శిస్తూన్నది.

వి. 'యత్ యత్'అనే యత్శబ్దద్వయం "తెలిసి చేసినదైనా, తెలియకుండా చేసినదైనా సమస్తపాపమూ"అనే అర్థాన్ని బోధిస్తూన్నది. ఆ పాపాన్నంతనీ పాపరూపంలో (పాపత్వావచ్ఛేదేన) తత్శబ్దం పరామర్శిస్తూన్నది. "యత్శబ్దార్థాన్ని తత్శబ్దం పరామర్శిస్తుంది" అని మాత్రమే నియమం కాని "యత్శబ్దం ఏ రూపంలో ఒక అర్థాన్ని ప్రతిపాదిస్తుందో ఆ రూపంలోనే తత్శబ్దం ఆ అర్థాన్ని పరామర్శిస్తుంది"అనే నియమం లేదు. అందుచేత ఇక్కడ అవిమృష్టవిధేయాంశత్వదోషం లేదు అని భావం.

అవ. ఈ విధంగా సమాసం చెయ్యనప్పుడు వాక్యగతమైన అవిమృష్టవిధేయాంశత్వదోషాన్ని ఉదాహరించి సమాసం చేసినప్పుడు కూడా అనేకపదగతం అవడంచేత వాక్యదోషం అయిన అవిమృష్టవిధేయాంశత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు—

వృ. యథా వా-

శ్లో॥ కిం లోభేన విలఙ్ఘితః స భరతో యేనైతదేవం కృతం
మాత్రా స్త్రీలఘుతాం గతా కిమథవా మాతైవ మే మధ్యమా,
మిథ్యైతన్మమచిన్తితం ద్వితయమప్యార్యానుజోఽసౌ గురు
ర్మాతా తాతకలత్రమిత్యనుచితం మన్యే విధాత్రా కృతమ్.

వృ. అత్ర ఆర్యస్యేతి, తాతస్యేతి చ వాచ్యమ్, నత్వనయోః సమాసే గుణీభావః కార్యః. ఏవం సమాసాన్తరేఽప్యుదాహార్యమ్.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా—

కిమ్ ఇతి:- రాముని వనవాసాన్ని గూర్చి ఆలోచిస్తూన్న లక్ష్మణుని మాటలు, సః భరతః = ఆ భరతుడు, లోభేన = లోభంచేత, విలఙ్ఘితః కిమ్ = ఆక్రమించబడ్డాడా ? యేన = ఏ కారణంచేత, మాతా = తల్లియైన కైకేయిచేత, ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లు, కృతమ్ = చేయబడినదో; అథవా = లేక మధ్యమా మాతైవ = మధ్యమమాతయైన కైకేయియే, స్త్రీలఘుతామ్ = స్త్రీయొక్క లఘుస్వభావమును, గతా = పొందినదా ? మమ = నాయొక్క, ఏతత్ = ఈ, ద్వితయమపి = రెండు విధములైన, చిన్తితమ్ = ఆలోచన, భరతుని లుబ్ధత్వాన్ని, మధ్యమమాత లఘుబుద్ధిని గూర్చిన ఆలోచన, మిథ్యా = అసత్యమే. గురుః = నా అన్నగారైన, అసౌ = ఈ భరతుడు, ఆర్యానుజః = పూజ్యుడైన (అన్నగారైన) రామునికి తమ్ముడు, అతనియందు లుబ్ధత్వం అసంభావ్యం. మాతా = తల్లియైన కైకేయి, తాతకలత్రమ్ = తండ్రిగారి భార్య, ఆమె యందు క్షుద్రత్వం ఉండదు, అనుచితమ్ = ఈ అనుచితకృత్యము, విధాత్రా = బ్రహ్మదేవునిచేత, కృతమ్ = చేయబడినది అని, మన్యే = తలచెదను.

అత్రేతి :- ఇక్కడ ఆర్యస్య, తాతస్య అని అనాలి. ఈ రెండింటిని సమాసంలో అప్రధానం చేయగూడదు.

వి. అనుజానికి ఆర్యసంబంధము, భార్యకు తండ్రిగారితో సంబంధము వాళ్ళిద్దరియొక్క గొప్పతనాన్ని సూచించడంకోసం చెప్పబడింది. రాముని అనుజుడైన భరతునిలో లోభం గాని, మన తండ్రిగారి భార్యయైన కైకేయిలో క్షుద్రబుద్ధి గాని ఉండడానికి అవకాశం లేదనడానికి వాళ్ళకు గల రామ - దశరథ

సంబంధం కారణం అని సూచించడం కవి ఉద్దేశ్యం. కాని 'ఆర్యానుజః' 'త్యాత కలత్రమ్'అని సమాసాలలో చేర్చివేయడంతో వాటి ప్రాధాన్యం తగ్గిపోయినది గాన సమాసం చేయడంవల్ల ఏర్పడిన వాక్యగత అవిమృష్టవిధేయాంశత్వానికి ఉదాహరణం అయినది.

ఏవమితి :— ఇతరసమాసాలలో కూడా ఈ విధంగా ఉదాహరించుకొనవలెను. ఇక్కడ షష్ఠీతత్పురుషసమాసంలో ఉదాహరణం చూపబడింది. ఇతర సమాసాలలో కూడ ఊహించుకొనవలెను అని అర్థం. బహువ్రీహి సమాసకృత వాక్యగత అవిమృష్టవిధేయత్వానికి ఉదాహరణం-

"యః స్థలీకృతవిన్ధ్యాద్రిః ఆచాన్తాపరవారిధిః,
యశ్చ తాపితవాతాపిః స మునిః శ్రేయసేఽస్తు వః".

"స్థలంగా చేయబడిన వింధ్యపర్వతం కలవాడు, ఆచమనంచేయబడిన అపర సముద్రం కలవాడు, పీడించబడిన (జీర్ణంచేసికొనబడిన)వాతాపి గలవాడు అయిన ఆ ముని మీకు శ్రేయస్సు ఇచ్చుగాక"అని అర్థం. ఇక్కడ బహువ్రీహి సమాసం చేయడంచేత స్థలీకరణ-ఆచమన-తాపనాలకి 'అప్రాధాన్యం ఏర్పడి అవిమృష్టవిధేయత్వం వచ్చినది.

"యేన స్థలీకృతో విన్ధ్యో యేనాచాన్తః పయోనిధిః,
వాతాపిస్తాపితో యేన స మునిః శ్రేయసేఽస్తు వః"

అన్నట్లయితే ఈ దోషం లేదు.

తృతీయాసమాసంలో ఉదాహరణం—

"ధాత్రా స్వహస్తలిఖితాని లలాటపట్టే,
కో వాక్షరాణి పరిమార్జయితుం సమర్థః."

"లలాటంమీద బ్రహ్మచేత స్వహస్తలిఖితాలైన అక్షరాలను తుడిచివేయడానికి ఎవడు సమర్థుడు ?" ఇక్కడ "స్వహస్తేన లిఖితాని"అని ఉండాలి.

ద్వంద్వసమాసంలో ఉదాహరణం—

"సీతాయా ఊర్మిళాయాశ్చ సదృశౌ రామలక్ష్మణౌ"

"సీతకూ, ఊర్మిళకూ రామలక్ష్మణులు తగినవారు". ఇక్కడ "రామః లక్ష్మణః చ"అని వ్యస్తంగా ప్రయోగించాలి.

ద్విగుసమాసంలో ఉదాహరణ-

"బ్రహ్మా విష్ణశ్చ రుద్రశ్చ త్రిలోకీమధికుర్వతే"

"బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు ముల్లోకాలమీద అధికారం కలిగి ఉన్నారు." ఇక్కడ 'త్రీన్ లోకాన్'అని చెప్పవలెను.

వ్యాఖ్యాతలు ఈ చివరి ఉదాహరణను చూపినారు కాని దీనిలో ఈ దోషం లేదని తోచుచున్నది. మూడు లోకాలలో బ్రహ్మకు ఒక లోకంమీద, విష్ణువుకు ఒక లోకంమీద, రుద్రునికి ఒక లోకంమీద అధికారం అని చెప్పవలసి ఉన్నట్లయితే 'త్రిలోకీమ్' అని ద్విగుసమాసం చేయడం దోషం కావచ్చును. కాని ఒక్కొక్కరికి ఒక్కొక్క లోకంమీద అధికారం అని ఎక్కడా లేదుకదా ? ముల్లోకాలమీదా ముగ్గురికీ సమానాధికారమే అని కవి వివక్ష అయినపుడు ఇది అవిమృష్టవిధేయాంశదోషానికి ఉదాహరణం కాదు.

అవ. వాక్యగతమైన విరుద్ధమతికృత్త్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. విరుద్ధమతికృద్యథా-

శ్లో. శ్రితక్షమా రక్తభువః శివాలిఙ్గితమూర్తయః,
విగ్రహక్షపణేనాద్య శేరతే తే గతాసుఖాః. 196

వృ. అత్ర క్షమాదిగుణయుక్తాః సుఖమాసతే ఇతి వివక్షితే హతాః ఇతి విరుద్ధా ప్రతీతిః.

వ్యా. వాక్యగతమైన విరుద్ధమతికృత్త్వదోషం ఎట్లనగా-

శ్రితేత్యాది :- సామోపాయంచేత కార్యసిద్ధిని పొందిన రాజుల వర్ణనం ఇది. శ్రితక్షమాః = ఆశ్రయించబడిన ఓర్పు కలవారు, రక్తభువః = అనురాగము గల భూమి (ప్రజలు) కలవారు, శివాలిఙ్గితమూర్తయః = మంగళంచేత ఆలింగనం చేసికొనబడిన శరీరాలు కలవారు అయిన, తే = వారు, అద్య = ఇప్పుడు, విగ్రహ

క్షపణేన = విరోధముయొక్క (యుద్ధముయొక్క) త్యాగంచేత, గతాసుఖాః = పోయిన అసుఖం(దుఃఖం) కలవారై, శేరతే = శయనించుచున్నారు.

విరుద్ధమైన మరొక అర్థం :- శ్రితక్షమాః = ఆశ్రయించబడిన భూమి కలవారు, రక్తభువః = రక్తమునకు స్థానమైనవారు, శివాలిఙ్గితమూర్తయః = ఆడనక్కలచేత కౌగలించుకొనబడిన శరీరాలు కలవారు అయిన, తే = వాళ్ళు, అద్య = ఇప్పుడు. విగ్రహక్షపణేన = శరీరముల వినాశముచేత, గతాసుఖాః = పోయిన ప్రాణాలు, ఇంద్రియాలు కలవారై, శేరతే = శయనించి ఉన్నారు.

అత్రేతి :- క్షమాదిగుణములతో కూడి సుఖంగా ఉన్నారు అని చెప్పడానికి ఉద్దేశించగా చంపబడినారు అని విరుద్ధార్థం ప్రతీతం అవుతున్నది.

వృ. పదైకదేశే యథాసంభవం క్రమేణోదాహరణమ్-

శ్లో. అలమతిచపలత్వాత్స్వప్నమాయోపమత్వాత్
పరిణతివిరసత్వాత్సఙ్గమేనాఙ్గనాయాః,
ఇతి యది శతకృత్వస్తత్త్వమాలోచయామ
స్తదపి న హరిణాక్షీం విస్మరత్యన్తరాత్మా. 197

వృ. అత్ర త్వాదితి.

వ్యా. పదేతి :- పదైకదేశంలో (పదానికి సంబంధించిన ఒక భాగంలో) ఈ దోషాలకు యథాసంభవంగా, క్రమంగా ఉదాహరణలు చూపబడుతున్నవి. ముందుగా పదైకదేశంలో శ్రుతికటుత్వదోషానికి ఉదాహరణం చూపుతున్నాడు-

అలమితి :- అతిచపలత్వాత్ = చాల అస్థిరం అవడంవల్ల, స్వప్నమాయోపమత్వాత్ = స్వప్నం వంటిది, మాయవంటిదీ అవడంవల్ల. పరిణతివిరసత్వాత్ = పరిణామంలో విరసం అవడంవల్లా, అఙ్గనాయాః సంగమేన = స్త్రీసంగమంచేత, అలమ్ = చాలును; ఇతి = అని, శతకృత్వః = నూరు సార్లు, తత్త్వమ్ = తత్త్వమును,యదిఆలోచయామః=ఆలోచించినట్లయితే,తదపి=అట్లయినను, అన్తరాత్మా = మనస్సు, హరిణాక్షీమ్ = స్త్రీని, న విస్మరతి = మరవకున్నది.

అత్రేతి :- "ఇక్కడ 'త్వాత్' అనేది."

వి. ఇక్కడ స్వవిరోధియైన శాంతాన్ని ఉపమర్దించి శృంగారం పరిపుష్టం అవుతున్నది. శృంగారం అతిమధురం. దానిలో కటువైన 'త్వాత్'వంటి వాటితో కూడిన పదాల ప్రయోగం అపకర్ష హేతువు. త్వాత్ అనేది పదంలో ఒక భాగం కాబట్టి ఈ శ్రుతికటుత్వదోషం పదైకదేశగతం.

వృ. యథా వా-

శ్లో. తద్గచ్ఛ సిద్ధ్యై కురు దేవకార్యమ్
అర్థోఽయమర్థాన్తరలభ్య ఏవ,
అపేక్షతే ప్రత్యయమఙ్గలబ్ధ్యై
బీజాఙ్కురః ప్రాగుదయాదివామ్భః. 198

వృ. అత్ర 'ద్ధ్యై' 'బ్ధ్యై' ఇతి కటు.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

తదితి : కుమారసంభవం తృతీయసర్గలో శివునికి పార్వతిపై అనురాగం కలిగేటట్లు చేసి వారికి తారకాసురసంహారియైన కుమారుడు పుట్టేటట్లు సహకరించవలసిందిగా దేవేంద్రుడు మన్మథుణ్ణి కోరుచున్న శ్లోకం. తత్ = ఆ కారణంవల్ల, సిద్ధ్యై = (శివునికి పార్వతిపై ప్రేమకలిగించుటకై) కార్యసిద్ధికై, గచ్ఛ = వెళ్లుము. దేవకార్యమ్ = దేవతల కార్యమును, కురు = చేయుము. బీజాఙ్కురః = బీజం నుండి వచ్చు అంకురం, ఉదయాత్ ప్రాక్ = పైకి మొలచుటకు ముందు, అమ్భః ఇవ = ఉదకమును వలె, అర్థాన్తరలభ్యః ఏవ = శివపార్వతీ వివాహరూపమైన మరియొక విషయంచేత మాత్రమే లభ్యమైన, అయమ్ అర్థః=స్కందోత్పత్తిరూపమైన కార్యం, అఙ్గలబ్ధ్యై = తన స్వరూపం లభించడంకొరకు, తాను సిద్ధించడంకొరకు (నిన్ను), ప్రత్యయమ్ = కారణమునుగా, అపేక్షతే = అపేక్షించుచున్నది.

అత్రేతి :- ఇక్కడ 'సిద్ధ్యై'లోని 'ద్ధ్యై', 'లబ్ధ్యై' లోని 'బ్ధ్యై' శ్రుతికటువులుగా ఉన్నాయి.

అవ. పదైకదేశంలో నిహతార్థత్వానికి ఉదాహరణంగా కుమారసంభవం ప్రథమసర్గలో హిమాలయవర్ణనఘట్టంలోని శ్లోకం చూపుతున్నాడు-

శ్లో. యశ్చాప్సరోవిభ్రమమణ్డనానాం
సంపాదయిత్రీం శిఖరైర్బిభర్తి,
వలాహకచ్ఛేదవిభక్తరాగా
మకాలసంధ్యామివ ధాతుమత్తామ్. 199

వృ. అత్ర మత్తాశబ్దః క్షీబార్థే నిహతార్థః.

వ్యా. య ఇతి :- యః = ఏ హిమవత్పర్వతం, శిఖరైః = శిఖరాలచేత, అప్సరోవిభ్రమమణ్డనానామ్ = అప్సరఃస్త్రీల విలాసపూర్వకములైన అలంకారాలకు, సంపాదయిత్రీమ్ = సంపాదకమూ (సంపాదించేదీ), వలాహకచ్ఛేదవిభక్తరాగామ్ = మేఘముల ఖండములయందు సంక్రమింపచేయబడిన రంగుగల, 'సంధ్యామ్'కు విశేషణం, అకాలసంధ్యామివ = అకాలసంధ్య వలె ఉన్నదీ అయిన, ధాతుమత్తామ్ = ధాతువులు కలిగిఉండుటను, బిభర్తి = ధరించుచున్నదో,

అత్రేతి :- ఇక్కడ 'మత్తా'శబ్దం క్షీబార్థంలో నిహతార్థం.

'ధాతుమతః భావః ధాతుమత్తా'. మతుప్ప్రత్యయాంతంమీద తల్ ప్రత్యయం. ధాతువులు కలిగి ఉండుట అని వివక్షితార్థం. 'మత్తా'శబ్దం వినగానే ప్రసిద్ధమైన 'మద్యంతాగి మత్తెక్కిన'అనే అర్థం స్ఫురించడంచేత వివక్షితార్థం నిహతం (అణగద్రొక్కబడినది) అయిపోతుంది. అందుచేత పదాంశగతనిహతార్థత్వదోషం.

అవ. పదైకదేశంలో నిరర్థకత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ఆదావఞ్జనపుఞ్జలిప్తవపుషాం శ్వాసానిలోల్లాసిత
ప్రోత్సర్పద్విరహానలేన చ తతః సంతాపితానాం దృశామ్,
సంప్రత్యేవ నిషేకమశ్రుపయసా దేవస్య చేతోభువో
భల్లీనామివ పానకర్మ కురుతే కామం కురఙ్గేక్షణా. 200

వృ. అత్ర దృశామితి బహువచనం నిరర్థకమ్; కురఙ్గేక్షణాయా ఏకస్యా ఏవోపాదానాత్. న చ 'అలసవలితైః' ఇత్యాదివత్ వ్యాపార భేదాద్బహుత్వమ్; వ్యాపారాణామనుపాత్తత్వాత్. న చ వ్యాపారేఽత్ర దృక్శబ్దో వర్తతే. అత్రైవ 'కురుతే' ఇత్యాత్మనేపదమప్యనర్థకమ్; ప్రధానక్రియాఫలస్య కర్త్రసంబన్ధే కర్త్రభిప్రాయక్రియాఫలాభావాత్.

వ్యా. ఆదావితి :- భర్త ప్రవాసమునకు వెళ్ళనుండగా నాయిక బాధను వర్ణించే శ్లోకం ఇది. కురఙ్గేక్షణా = ఆడలేడి నేత్రాల వంటి నేత్రాలు గల ఈమె, ఆదౌ = ముందుగా, అఞ్జనలిప్తవపుషామ్ = కాటుకచేత పూయబడిన శరీరం కలవీ, తతః = అటుపిమ్మట, శ్వాసానిలోల్లాసితప్రోత్సర్పద్విరహానలేన = శ్వాసవాయువు చేత అధికం చేయబడిన వ్యాపించుచున్న విరహాగ్నిచేత, సంతాపితానామ్ = తపింపచేయబడినవీ (కాల్చబడినవీ) అయిన, దృశామ్ = నేత్రముల యొక్క (కు), దేవస్య = ప్రభువైన, చేతోభువః = మన్మథునియొక్క, భల్లీనామ్ = భల్లబాణాలకు, పానకర్మ ఇవ = పానకర్మను వలె, సంప్రత్యేవ = ఇప్పుడే. అశ్రుపయసా = కన్నీటిచేత, కామమ్ = అతిశయంచేత, నిషేకమ్ = తడుపుటను, కురుతే = చేయుచున్నది.

వి. ఆయుధాలకు పదును పెట్టడంకోసం ముందు వాటికి బురదపూసి, తిత్తితో గాలి ఊదుతూ రగల్చిన నిప్పులో కాల్చి తరవాత నీళ్ళల్లో ముంచుతారు. దీనికి పానకర్మ అని పేరు. ఆగామివిరహార్తయైన ఈమె నేత్రాలు మన్మథుని భల్లబాణాల వంటివి. వాటికి ఆమె ముందుగా అంజనం పూసింది. శ్వాసవాయువులచేత రగల్చిన విరహాగ్నితో కాల్చింది. పిదప కన్నీళ్ళతో తడుపుచున్నది. ఈ విధంగా ఈమె మన్మథుని భల్లబాణాలకు పానకర్మ చేస్తూన్నదా అన్నట్లున్నది అని భావం.

అత్రేతి :- ఇక్కడ కురంగేక్షణ ఒక్కతెయే చెప్పబడినది గాన 'దృశామ్' అని బహువచనం నిరర్థకమైనది. 'అలసవలితైః' ఇత్యాది శ్లోకంలో వ్యాపార భేదంచేత బహుత్వం చెప్పినట్లుగా ఇక్కడ కూడా వ్యాపారభేదంచేత బహుత్వం చెప్పవచ్చును కదా అని అనడానికి వీలులేదు. ఇక్కడ వ్యాపారాలు చెప్పబడ లేదు. ఇక్కడ ఉన్న 'దృక్' శబ్దం వ్యాపారరూపార్థంలో ప్రయోగించబడలేదు కూడ. అదే విధంగా ఇక్కడ 'కురుతే' అని ఆత్మనేపదం కూడా అనర్థకమే.

ప్రధానక్రియాఫలానికి కర్తతో సంబంధం లేనప్పుడు కర్త్రభిప్రాయక్రియాఫలం లేదు కదా?

ఏ. ఒక్క కురంగేక్షణనే చెప్పినప్పుడు 'దృశౌ' అని ద్వివచనంలో ప్రయోగించాలి కాని బహువచనంలో ప్రయోగించకూడదు. అందుచేత బహువచనం నిరర్థకం. (ఆశంక) నేత్రాలు రెండే అయినా వాటి వ్యాపారాలు చాలా ఉండడం చేత వ్యాపారబహుత్వాన్ని పట్టి బహువచనం ప్రయోగించవచ్చు కదా? ఉదాహరణకి అమరుకంలోని-

"అలసవలితైః ప్రేమార్ద్రార్ద్రైర్ముహుర్ముకులీకృతైః
క్షణమభిముఖైర్లజ్జాలోలైర్నిమేషపరాఙ్ముఖైః,
హృదయనిహితం భావాకూతం వమద్భిరివేక్షణైః
కథయ సుకృతీ కోఽయం ముగ్ధే త్వయాద్య విలోక్యతే"

""ఓ సుందరీ! నీ చూపులు మందమందంగా త్రిప్పబడుతున్నాయి. ప్రేమచేత తడి తడిగా ఉన్నాయి. మాటి మాటికీ ముడుచుకుంటున్నాయి. క్షణకాలం అభిముఖంగా ఉంటున్నాయి. లజ్జచేత చంచలంగా ఉన్నాయి. రెప్పపాటుకు పరాఙ్ముఖంగా (దూరంగా) ఉన్నాయి. హృదయంలో ఉన్న భావాన్ని వెలికి కక్కుతున్నట్లు ఉన్నాయి. అలాంటి ఈ చూపులతో ఏ పుణ్యాత్ముణ్ణి చూస్తున్నావు?" అని దీని అర్థం. అనే శ్లోకంలో కండ్లలో ఉన్న అనేక వ్యాపారాలను (పనులను) పట్టి ద్వివచనానికి బదులు 'ఈక్షణైః' అని బహువచనం ప్రయోగించబడింది. అందుచేత చూపులు అని అర్థం చెప్పుకొన్నాం. అదే విధంగా ఇక్కడ కూడా బహువచనప్రయోగం చేయవచ్చునుకదా? ఈ ఆశంకకు అవకాశం లేదు. అమరుకశ్లోకంలో వివిధవ్యాపారాలు పేర్కొన్నట్లు ఇక్కడ వ్యాపారాలేవీ చెప్పలేదు కదా? ఆ శ్లోకంలో 'ఈక్షణ' శబ్దానికివలె 'దృక్' శబ్దానికి నేత్రాల వ్యాపారాలు (చూపులు) అనే అర్థం చెప్పవచ్చు కదా అని ఆశంకకు అవకాశం లేదు. అంజనలేపనాదులు నేత్రాలకే కుదురుతాయి కాని నేత్రాల వ్యాపారాలకి (చూపులకి) కుదరవు గాన ఇక్కడ 'దృక్' శబ్దానికి నేత్రా లనే అర్థమే చెప్పాలి కాని నేత్రాల వ్యాపారాలు అని అర్థం చెప్పడం కుదరదు. అందుచేత 'దృశామ్' అని బహువచనప్రయోగం నిరర్థకతాదోషదుష్టమే.

ఈ శ్లోకంలోనే నిరర్థకతాదోషం ఉన్న మరొక పదం కూడా ఉంది. 'కృఞ్' ధాతువు ఉభయపది. అందుచేత "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే" (1.3.72) అనే పాణినిసూత్రం ప్రకారం ప్రధానక్రియాఫలం కర్తకు చెందినప్పుడే ఆత్మనేపదం ఉపయోగించాలి. కర్త్రభిప్రాయక్రియాఫలం అనగా ప్రధాన క్రియాఫలం కర్తకు చెందడం. ఇక్కడ ఈమె నేత్రాలను కన్నీళ్ళతో తడపడం మన్మథుని భల్లబాణాలకు పానకర్మ చేయడమా అన్నట్లున్నది అని ఉత్ప్రేక్షించబడుచున్నది. భల్లపానకర్మసంపాదనంద్వారా మన్మథునకు సకలజగజ్జేతృత్వం అనే ప్రధానక్రియాఫలం లభిస్తుంది కాని ఈమెకు లభించదు గాన ప్రధానక్రియాఫలం కర్తకు చెందనప్పుడు ఆత్మనేపదప్రయోగం అనర్థకం అని అర్థం.

అవ. పదైకదేశంలో ఉన్న అవాచకత్వదోషానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ చాపాచార్యస్త్రిపురవిజయీ కార్తికేయో విజేయః
శస్త్రవ్యస్తః సదనముదధిర్భూరియం హన్తకారః,
అస్త్యేవైతత్ కిము కృతవతా రేణుకాకణ్ఠబాధాం
బద్ధస్పర్ధస్తవ పరశునా లజ్జతే చన్ద్రహాసః. 201

వృ. అత్ర 'విజేయః' ఇతి కృత్యప్రత్యయః క్తప్రత్యయార్థే అవాచకః.

వ్యా. చాపేతి :- రాజశేఖరుడు రచించిన బాలరామాయణంలో రావణుడు పరశురామునితో అంటూన్న మాటలు. త్రిపురవిజయీ = త్రిపురవిజేత అయిన మహేశ్వరుడు , చాపాచార్యః = (నీకు) ధనుర్విద్యలో ఆచార్యుడు. కార్తికేయః = స్కందుడు, విజేయః = జయింపబడినాడు. శస్త్రవ్యస్తః = బాణంచేత దూరంగా తొలగించబడిన, ఉదధిః = సముద్రం, సదనమ్ = నీ నివాసస్థానం. ఇయం భూః = ఈ భూమి, హన్తకారః = హంతకారం, అనగా పదహారు గ్రాసాల ప్రమాణం గల అతిథిభిక్ష. ఒక గ్రాసం, అనగా ఒకమారు నోటిలో పెట్టుకొనదగిన ఆహారం, 'భిక్ష'. నాలుగు గ్రాసాల భిక్ష 'అగ్రం'. నాలుగు రెట్లు అగ్రం అనగా పదహారు గ్రాసాలు, హంతకారం అని మార్కండేయపురాణవచనం-

"గ్రాసప్రమాణా భిక్షా స్యాదగ్రం గ్రాసచతుష్టయమ్,
అగ్రం చతుర్గుణం ప్రాహుర్హన్తకారం ద్విజోత్తమాః".

ఏతత్ = ఇది అంతా, అస్త్యేవ = ఉన్నది. కిము = ఇంకేమనగా, రేణుకా కణ్ఠబాధామ్ = రేణుకయొక్క కంఠానికి బాధను, కృతవతా = చేసిన, తవ పరశునా = నీ గండ్రగొడ్డలితో, బద్ధస్పర్ధః = కట్టబడిన పోటీ గల, చన్ద్రహాసః = చంద్రహాసం, లజ్జతే = సిగ్గుపడుతూన్నది.

వి. పరశురాముడు ధనుర్విద్యలో మహేశ్వరుని శిష్యుడు. అప్పుడప్పుడు స్కందునితో చేసిన స్నేహయుద్ధంలో ఆతనిని జయించేవాడు. 'కార్తవీర్యో విజేయః' అని పాఠాంతరం కూడా ఉంది. కార్తవీర్యుణ్ణి పరశురాముడు సంహరించి నట్లు ప్రసిద్ధమే. క్షత్రియుల నందరినీ ఇరవై ఒక్క సార్లు సంహరించి, భూమిని జయించి దానిని కశ్యపు డనే బ్రాహ్మణునికి దానం చేసివేసి, తాను నివసించడానికి భూమి లేకపోవడంతో శస్త్రబలంచేత సముద్రాన్ని దూరానికి నెట్టివేసి ఆ స్థానంలో నివసిస్తున్నాడు. తండ్రి ఆజ్ఞచేత తల్లియైన రేణుక కంఠం ఖండించాడు. ఈ పురాణకథ ఇక్కడ అనుసంధించుకోవాలి.

అత్రేతి :- ఇక్కడ 'విజేయః' (జయించదగినవాడు) అనే 'య ప్రత్యయాంతం క్త ప్రత్యయాంతం అయిన 'విజితః' అనే దాని అర్థంలో ప్రయోగించబడింది. ఇది ఆ అర్థాన్ని చెప్పజాలదు గాన అవాచకత్వదోషదుష్టం.

కొన్ని కృత్ప్రత్యయాలకు కృత్యప్రత్యయా లని పేరు. 'య' ప్రత్యయం వాటిలో చేరినది. భూతకర్మార్థంలో ధాతువుకు 'క్త' ('త' మిగులుతుంది) ప్రత్యయం చేర్చబడుతుంది. భుక్తమ్ = తినబడినది. శ్రుతమ్ = వినబడినది. విజితః = జయించబడ్డాడు ఇత్యాదులు ఉదాహరణలు.

అవ. పదైకదేశగతవ్రీడాదాయకాశ్లీలానికి ఉదాహరణలు చూపుతున్నాడు.

శ్లో॥ అతిపేలవమతిపరిమితవర్ణం లఘుతరముదాహరతి శఠః,
పరమార్థతః స హృదయం వహతి పునః కాలకూటఘటితమివ.

వృ. అత్ర పేలవశబ్దః.

వ్యా, శఠః = దుష్టుడు, అతిపేలవమ్ = చాలా మృదువు, అతిపరిమిత వర్ణమ్ = చాలా పరిమితములైన వర్ణాలు కలదీ అయిన వాక్యమును, లఘుతరమ్ = చాలా మందంగా, ఉదాహరతి = పలుకుతాడు. పరమార్థతః పునః = వాస్తవంలో అయితే, సః = అతడు, కాలకూటఘటితమివ = కాలకూటంతో కూడినది వలె ఉన్న, హృదయమ్ = హృదయాన్ని, వహతి = వహిస్తాడు.

అత్రేతి :- ఇక్కడ 'పేలవ' శబ్దంలో ఉన్న 'పేల' అనే ఏకదేశం లాట భాషలో వృషణరూప గుహ్యాంగ స్మృతిని కలిగిస్తుంది. అందుచేత వ్రీడాజనకాశ్లీలం

అవ. పదైకదేశగతమైన జుగుప్సావ్యంజకాశ్లీకాలానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ యః పూయతే సురసరిన్ముఖతీర్థసార్థ
స్నానేన శాస్త్రపరిశీలనకీలనేన,
సౌజన్యమాన్యజనిరూర్జితమూర్జితానాం
సోఽయం దృశోః పతతి కస్యచిదేవ పుంసః. 203

వృ. అత్ర పూయ శబ్దః.

వ్యా. యః ఇతి :- యః = ఎవడు, సురసరిన్ముఖతీర్థసార్థస్నానేన = గంగానది మొదలైన తీర్థసముదాయములయందు స్నానంచేత, శాస్త్రపరిశీలనకీలనేన = శాస్త్రములను పరిశీలించుటవలన కలిగిన సంస్కారదార్ఢ్యంచేతను, పూయతే = పవిత్రుడుగా చేయబడతాడో, సౌజన్యమాన్యజనిః = సౌజన్యంచేత పూజించదగిన జన్మ కలవాడు, ఊర్జితానామ్ = బలశాలులకు, ఊర్జితమ్ = బలమూ అయిన, సః అయమ్ = అట్టి ఇతడు, కస్యచిదేవ = ఎవరో ఒకడే, పుంసః = పురుషుని యొక్క, దృశోః = నేత్రములయందు, పతతి = పడును.

అత్రేతి :- ఇక్కడ 'పూయ' శబ్దం జుగుప్సాకరం. అనగా 'పూయతే' అనే పదంలో ఏకదేశమైన 'పూయ' అనే శబ్దం చెవిని పడగానే 'చీము' అనే జుగుప్సితార్థం స్ఫురిస్తుంది. అందుచేత అశ్లీలత్వదోషం.

అవ. పదైకదేశగతమైన అమంగళవ్యంజకాశ్లీలానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ వినయప్రణయైకకేతనం
సతతం యోఽభవదఙ్గ తాదృశః,
కథమద్య స తద్వదీక్ష్యతాం
తదభిప్రేతపదం సమాగతః. 204

వృ. అత్ర ప్రేతశబ్దః.

వ్యా. వినయేతి :- నాయిక సవతికి వశంవదుడైపోయిన నాయకుణ్ణి గూర్చి సఖితో అంటూన్న మాటలు. అఙ్గ = ఓయీ! యః = ఎవడు, సతతమ్ = ఎల్లప్పుడూ, వినయప్రణయైకకేతనమ్ = వినయానికి ప్రణయానికి ఏకైక స్థానంగా, అభవత్ = అయెనో, అద్య = ఇప్పుడు, తత్ = ఆ, అభిప్రేతపదమ్ = ఇష్టమైన స్థానమును (ఆమెను), సమాగతః = పొందిన, తాదృశః = అట్టి, సః = అతడు, తద్వత్ = అతడు వలె, వెనుకటివాడు వలె, కథమ్ = ఎట్లు, వీక్ష్యతామ్ = చూడబడవలెను?

అత్రేతి :- ఇక్కడ "తదభిప్రేతపదమ్" అనే పదంలో ఏకదేశమైన 'ప్రేత' శబ్దం శవవాచకం అవడంచేత అమంగళకరాశ్లీలం.

అవ. పదైకదేశంలో సందిగ్ధత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ కస్మిన్ కర్మణి సామర్థ్యమస్య నోత్తపతే తరామ్,
అయం సాధుచరస్తస్మాదఞ్జలిర్బధ్యతామిహ. 205

వృ. అత్ర కిం పూర్వం సాధుః, ఉత సాధుషు చరతీతి సందేహః.

వ్యా. కస్మిన్నితి :- అస్య = ఇతనియొక్క, సామర్థ్యమ్ = సామర్థ్యం, కస్మిన్ = ఏ, కర్మణి = కర్మయందు, నోత్తపతే తరామ్ = ప్రకాశించడం లేదు? అయమ్ = ఇతడు, సాధుచరః = సత్పురుషులలో సంచరించువాడు. తస్మాత్ = ఆ కారణం వలన, ఇహ = ఇతని విషయంలో, అఞ్జలిః = దోసిలి, బధ్యతామ్ = కట్టబడు గాక.

అత్రేతి - ఇక్కడ "పూర్వం సాధుః" అని అర్థమా, లేక "సాధుషు చరః" అని అర్థమా అని సందేహం.

వి. "చరేష్టః" (పా. సూ. 3-2-16) అనే సూత్రంచేత 'చర' ధాతువుకు 'ట' ప్రత్యయం చేర్చగా చరః (చరించువాడు) అను పదం సిద్ధం అవుతుంది. "కురుచరః". ఇత్యాదులు ఉదాహరణం "సాధుషు చరతీతి సాధుచరః"- 'సత్పురుషులలో సంచరించువాడు' అని అర్థం. "భూతపూర్వే చరట్" (పా. సూ. 5-3-53) అను సూత్రంచేత 'చరట్' అనే తద్ధితప్రత్యయం చేర్చగా "పూర్వమ్ ఆఢ్యః ఆఢ్యచరః' అన్నట్లు "పూర్వం సాధుః సాధుచరః" - 'పూర్వం సత్పురుషుడు' అనే అర్థం బోధించబడుతుంది. ప్రకరణాదులు ఏవీ లేకపోవడం చేత వక్త తాత్పర్యం ఏమో తెలియడానికి అవకాశం లేకపోవడంచేత 'సాధుచరః'అనే పదంలో ఏకదేశమైన 'చర'లో సందిగ్ధత్వం.

అవ. పదైకదేశంలో నేయార్థత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు -

శ్లో॥ కిముచ్యతేఽస్య భూపాలమౌలిమాలామహామణేః,
సుదుర్లభం వచోబాణై స్తేజో యస్య విభావ్యతే. 206

వృ. అత్ర 'వచః'శబ్దేన 'గీః' శబ్దో లక్ష్యతే. అత్ర ఖలు న కేవలం పూర్వపదమ్, యావదుత్తరపదమపి పర్యాయపరివర్తనం న క్షమతే. జలధ్యాదావుత్తరపదమేవ, వడవానలాదౌ పూర్వపదమేవ.

వ్యా. భూపాల మౌలిమాలా మహామణేః = రాజుల కిరీట పంక్తులయందు మహామణి యైన, అస్య = ఇతనివిషయమునందు, కిమ్ = ఏమి, ఉచ్యతే = చెప్పబడును ? యస్య = ఎవనియొక్క, తేజః = తేజస్సు, వచోబాణైః = (వబలకు అభేదం గాన) గీర్వాణులచేత, అనగా దేవతలచేత కూడ, సుదుర్లభమ్ = చాల దుర్లభ మయినదో.

అత్రేతి - ఇక్కడ 'వచః' శబ్దంచేత 'గీః' శబ్దం లక్షణయా బోధింపబడుతుంది. ఇక్కడ పూర్వపదమే కాదు, ఉత్తరపదం కూడా పర్యాయపరివర్తనాన్ని సహించదు. 'జలధి' మొదలైనవాటిలో ఉత్తరపదమే పర్యాయపరివర్తనాన్ని

సహించదు. 'వడవానల' ఇత్యాదులలో పూర్వపదమ్ పర్యాయపరివర్తనాన్ని సహించదు.

ఏ. 'వచోబాణ' శబ్దం దేవతలు అనే అర్థంలో ప్రయోగించబడింది. కాని ఆ పదానికి ఆ అర్థాన్ని బోధించే శక్తి లేదు. అందుచేత 'వచః' శబ్దం లక్షణచేత 'గీః' అనే శబ్దాన్ని బోధిస్తుంది. స్వవాచ్య వాచకత్వం, అనగా తనచేత (వచః శబ్దంచేత) ఏ అర్థం బోధించబడుతుందో ఆ అర్థాన్ని బోధించడం, సంబంధం. గీః + బా (వా) ణ = 'గీర్వాణ' అయింది. ఈ విధంగా శ్రమపడి అర్థాన్ని తీసి కొని రావలసి వచ్చింది గాన నేయార్థత్వదోషం.

'గీర్వాణ' శబ్దంలో 'గిర్' 'వాణ' అనే రెండు శబ్దాలు ఉన్నాయి. ఈ రెండిం టినీ కలిపి 'గీర్వాణ' అనే శబ్దాన్ని ప్రయోగిస్తేనే 'దేవతలు' అని అర్థం. అలా కాకుండా పూర్వపదమైన 'గీః'కి పర్యాయపదాలైన 'వచస్' 'వచన' ఇత్యాది పదాలు చేర్చి 'వచోబాణ' 'వచనబాణ' ఇత్యాదులు ఏర్పరిచి ప్రయోగిస్తే ఆ అర్థం రాదు. అట్లే 'బాణ' అనే ఉత్తరపదం స్థానంలో దాని పర్యాయాలైన 'శర' 'ఇషు' ఇత్యాదిపదాలు చేర్చగా ఏర్పడిన 'గీఃశర' 'గీరిషు' పదాలకు కూడా దేవత లనే అర్థం రాదు. అందుచేత ఈ పదంలోని పూర్వోత్తర పదాలకు బదులు పర్యాయపదాలు ప్రయోగించి మార్చడానికి శక్యం కాదు. ఈ రెండు పదాలనూ కలిపి ప్రయోగిస్తేనే రూఢిచేత ఆ అర్థం బోధించబడుతుంది. కొన్ని పదాలలో పూర్వపదం, కొన్నింటిలో ఉత్తరపదం పర్యాయపరివృత్తిసహంగా (దాన్ని తీసి వేసి దాని స్థానంలో మరొక పర్యాయపదం ప్రయోగించడానికి వీలుగా) ఉంటుంది ఉదాహరణకి 'జలధి' అనే పదంలోని రెండవపదం 'ధి'ని మార్చి 'ధర' అనో 'పాత్ర' అనో చేర్చి 'జలధర' 'జలపాత్ర' ఇత్యాది శబ్దాలు ప్రయో గిస్తే సముద్రం అనే అర్థం రాదు; కాని పూర్వపదం మార్చి 'ఉదధి' 'పయోధి' ఇత్యాది శబ్దాలు తయారుచేయవచ్చు. 'వడవానలః' ఇత్యాదులలో పూర్వపదం మార్చి 'అశ్వానలః' ఇత్యాది ప్రయోగాలు చేస్తే వివక్షితార్థబోధ కలగదు. ఉత్తర పదం మార్చి 'బడవాగ్నిః' ఇత్యాది శబ్దాలు ప్రయోగించినా తప్పు లేదు.

ఆవ. "చెప్పదలచిన అర్థాన్ని బోధించే సామర్థ్యం లేకపోవడం అస మర్థత్వం" అని అంగీకరించి అలాంటి సామర్థ్యం లేకపోవడానికి ప్రసిద్ధ్యభావ మైనా కావచ్చు, సమయాద్యభావ (సంకేతాద్యభావ) మైనా కావచ్చును అని

చెప్పినట్లయితే అప్రయుక్తత్వ - అవాచకత్వ - నిహతార్థత్వాది భేదాలు కూడా అసమర్థత్వంలోనే అంతర్గతాలైపోతాయి: అందుచేత వీటి నన్నింటినీ స్వతంత్ర దోషాలుగా అంగీకరించడం ఎందుకు అని ఆశంకించుకొని సమాధానం చెప్తున్నాడు -

వృ. యద్యప్యసమర్థస్యైవాప్రయుక్తాదయః కేచన భేదాః తథాప్యన్యైరాలంకారికైర్విభాగేన దర్శితా ఇతి, భేదప్రదర్శనేన ఉదాహర్తవ్యా ఇతి చ విభజ్యోక్తాః.

వ్యా. యద్యపీతి - అప్రయుక్తత్వాదిదోషాలు అసమర్థత్వదోషంలోని కొన్ని భేదాలు మాత్రమే అయినా ఆలంకారికులు వాటిని వేరు వేరుగా చూపి ఉండడంచేత, వాటిలో ఉన్న భేదాలు చూపి ఉదాహరించడం యుక్తం అనే ఉద్దేశంతో విభజించి (అసమర్థత్వదోషంకంటె వేరుగా) ప్రతిపాదించబడ్డాయి

వి. పైన "అప్రయుక్తాదయః"అని 'ఆది' పదంచేత అవాచకత్వ-నిహతార్థకత్వ - నేయార్థకత్వాదులను గ్రహించాలి. బాగా పరిశీలిస్తే అప్రయుక్తత్వాదులు అసమర్థత్వంలోనే చేరుతాయి. అయినా శిష్యబోధసౌకర్యంకోసం ఆలంకారికులు వాటిని వేరు వేరుగా నిరూపించారు. ఆ మార్గాన్నే అనుసరించి నేను కూడా ఆయా భేదాలను సోదాహరణంగా వివరించాను అని అర్థం. అలా కాకపోతే 'రసాపకర్షకత్వం' అనే సామాన్య లక్షణాన్ని పట్టి అన్ని దోషాలను ఒకే దోషంగా పరిగణించవలసి వస్తుంది.

ఇక్కడ చెప్పిన దోషాలలో చ్యుతసంస్కృతి - అసమర్థ - అనుచితార్థ - అవాచక - అశ్లీల - సందిగ్ధ - అప్రతీత - క్లిష్ట - అవిమృష్టవిధేయాంశ - విరుద్ధమతికృత్త్వదోషాలు కావ్యాలలోనే కాకుండా కావ్యేతరగ్రంథాలలో కూడా దోషాలే అని వ్యాఖ్యాతలు.

అవ. ఇంతవరకు పద - వాక్య - పదైకదేశాలకు సాధారణాలైన, అనగా పదాదులలో ఉండడానికి అవకాశం ఉన్న దోషాలు చెప్పి ఇప్పుడు వాక్యాలలో మాత్రమే ఉండే దోషాలు చెపుతున్నాడు -

**కా. ప్రతికూల వర్ణ ముపహతలుప్త విసర్గం విసంధి హతవృత్తమ్
న్యూనాధికకథితపదం పతత్ప్రకర్షం సమాప్తపునరాత్తమ్,**

అర్థాన్తరైకవాచకమభవన్మతయోగమనభిహితవాచ్యమ్
అపదస్థపదసమాసం సంకీర్ణం గర్భితం ప్రసిద్ధిహతమ్
భగ్నప్రక్రమమక్రమమమతపరార్థం చ వాక్యమేవ తథా.

వ్యా. ప్రతికూలవర్ణం, ఉపహతవిసర్గం, లుప్తవిసర్గం, విసంధి, హతవృత్తం, న్యూనపదం, అధికపదం, కథితపదం, పతత్ప్రకర్షం, సమాప్తపునరాత్తం, అర్ధాంతరైకవాచకం, అభవన్మతయోగం, అనభిహితవాచ్యం, అపదస్థపదం, అపదస్థసమాసం, సంకీర్ణం, గర్భితం, ప్రసిద్ధిహతం, భగ్నప్రక్రమం, అక్రమం, అమతపరార్థం అయిన వాక్యం దుష్టం.

వి. ప్రతికూలములైన వర్ణా లున్న వాక్యం ప్రతికూలవర్ణం. అది దుష్టం. ఆ వాక్యంలో ఉన్న దోషం 'ప్రతికూలవర్ణత్వం'. మిగిలినవాటి విషయంలో కూడా ఇట్లే చూచుకోవాలి, ప్రతికూలవర్ణత్వం మొదలైన ఈ ఇరవై ఒక్క దోషాలూ వాక్యంలోనే ఉంటాయి కాబట్టి వాక్యదోషాలు.

అవ. ప్రతికూలవర్ణత్వానికి లక్షణోదాహరణలు చూపుతున్నాడు -

వృ. 1) రసానుగుణత్వం వర్ణానాం వక్ష్యతే; తద్విపరీతం ప్రతికూలవర్ణమ్. యథా శృఙ్గారే :-

శ్లో॥ అకుణ్ఠోత్కణ్ఠయా పూర్ణమాకణ్ఠం కలకణ్ఠి మామ్
కమ్బుకణ్ఠ్యాః క్షణం కణ్ఠే కురు కణ్ఠార్తిముద్ధర. 207

వ్యా. రసేతి - ఏ ఏ వర్ణాలు ఏ రసానికి అనుగుణంగా ఉంటాయో (అష్టమోల్లాసంలో) చెప్పబడగలదు. దానికి విపరీతంగా ఉన్న వాక్యం 'ప్రతికూలవర్ణం'. శృంగారానికి సంబంధించిన ఉదాహరణం ఎట్లనగా -

అకుణ్ఠేతి - నాయికాసమాగమాన్ని కోరుతున్న ఒకడు ఆమె సఖితో అంటూన్న మాటలు. కలకణ్ఠి = మధురమైన కంఠధ్వని కలదానా ! అకుణ్ఠోత్కణ్ఠయా = మొరపోని బెంగతో, ఆకణ్ఠమ్ = కంఠం వరకూ, పూర్ణమ్ = నిండి ఉన్న, మామ్ = నన్ను, క్షణమ్ = క్షణకాలం పాటు, కమ్బుకణ్ఠ్యాః = శంఖం వంటి కంఠం గల ఆమెయొక్క, కణ్ఠే = కంఠమునందు, కురు = చేయుము. కణ్ఠార్తిమ్ = కంఠంయొక్క పీడను, ఉద్ధర = తొలగించుము.

ఎ. ఇక్కడ శృంగారరసానికి ప్రతికూలమైన టవర్గీయవర్ణాల పునఃపునః ప్రయోగం దోషం.

వృ. రౌద్రే యథా -

శ్లో॥ దేశః సోఽయమరాతిశోణితజలైర్యస్మిన్ హ్రదాః పూరితాః
క్షత్త్రాదేవ తథావిధః పరిభవస్తాతస్య కేశగ్రహః,
తాన్యేవాహితహేతిఘస్మరగురూణ్యస్త్రాణి భాస్వన్తి మే
యద్రామేణ కృతం తదేవ కురుతే ద్రోణాత్మజః క్రోధనః.

వృ. అత్ర హి వికటవర్ణత్వం దీర్ఘసమాసత్వం చోచితమ్.

వ్యా॥ రౌద్రే ఇతి - రౌద్రరసంలో ప్రతికూలవర్ణత్వం ఎట్లనగా -

దేశః ఇతి-తన తండ్రియైన ద్రోణాచార్యుణ్ణి ధృష్టద్యుమ్నుడు చంపివేసినా డని విన్న అశ్వత్థామ,వేణీసంహారంలో, అంటూన్న మాటలు: అయమ్=ఈ దేశం, యస్మిన్=దేనియందు, అరాతిశోణితజలైః=శత్రువుల రక్తోదకాలచేత, హ్రదాః= మడుగులు, పూరితాః = నింపబడినవో, సః దేశః = అట్టి దేశం. తాతస్య = మా తండ్రికి, కేశగ్రహః=కేశాలను పట్టుకొనడం అనే, తథావిధః=అట్టి, పరిభవః= పరాభవం, క్షత్త్రాదేవ = క్షత్రియునివలననే జరిగినది. కార్తవీర్యార్జునుడు పరశు రాముని తండ్రియైన జమదగ్నిని కేశగ్రహణం చేసి ఏ విధంగా అవమానించాడో అదే విధంగా ధృష్టద్యుమ్నుడు నా తండ్రిని అవమానించినాడు అని భావం. మే = నాయొక్క, అహితహేతిఘస్మరగురూణి=శత్రువుల ఆయుధాలను మ్రింగి వేసే స్వభావం గల గొప్పవైన, భాస్వన్తి = ప్రకాశించుచున్న, అస్త్రాణి = బ్రహ్మాస్త్రాదులు, తాన్యేవ = అవియే. మా తండ్రిచేత పరశురాముని నుండి పొందబడినవే. క్రోధనః = కోపం గల, ద్రోణాత్మజః= ఈ అశ్వత్థామ, రామేణ= పరశురామునిచేత, యత్ = ఏది, కృతమ్ = చేయబడినదో, తదేవ = దానినే, కురుతే = చేస్తున్నాడు, చేయనున్నాడు.

అత్రేతి :- ఇక్కడ వికటములైన వర్ణాలు ఉండడం, దీర్ఘసమాసాలు ఉండడం ఉచితం.

వి. అనగా ఓజోగుణద్యోతకాలైన పరుషవర్ణాల ప్రయోగం రౌద్రరసంలో ఉండాలి. అది లేదు గాన ప్రతికూలవర్ణత్వదోషం.

వి. దీర్ఘసమాసాలు ఉండడంకూడ రౌద్రరసానికి అనుగుణమే. అది లేక పోవడం కూడ లోపమే అని సూచించడానికి దీర్ఘసమాసత్వం ఉచితం అని చెప్ప బడింది. అంతే కాని దీర్ఘసమాసాభావం ప్రతికూలవర్ణత్వం కాదు.

అవ. రౌద్రానుగుణమైన వికటవర్ణత్వమూ, దీర్ఘసమాసత్వమూ ఉన్న ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. యథా—

శ్లో. ప్రాగప్రాప్తనిశుమ్భశామ్భవధనుర్ద్వేధావిధావిర్భవత్
క్రోధప్రేరితభీమభార్గవభుజస్తమ్భాపవిద్ధః క్షణాత్,
ఉజ్జ్వాలః పరశుర్భవత్వశిథిలస్త్వత్కణ్ఠపీఠాతిథి
ర్యేనానేన జగత్సు ఖణ్డపరశుర్దేవో హరః ఖ్యాప్యతే. 209

వృ. యత్ర తు న క్రోధస్తత్ర చతుర్థపాదాభిధానే తథైవ శబ్ద ప్రయోగః.

వ్యా. రౌద్రానుగుణవర్ణాదులున్న ఉదాహరణం ఎట్లనగా-

ప్రాగితి :- మహావీరచరితనాటకంలో శివధనుర్భంగాన్ని గూర్చిన వార్త విని, పరశురాముడు కోపంతో శ్రీరాముణ్ణి ఉద్దేశించి అంటున్న మాటలు. ప్రాగ ప్రాప్త... అపవిద్ధః"— ప్రాక్ = పూర్వం, అప్రాప్త = పొందబడని, నిశుమ్భ = వంచడం గల, శామ్భవధనుః = శివధనస్సుయొక్క, ద్వేధావిధా = రెండు ముక్క లుగా చేయడంచేత, ఆవిర్భవత్ = పుట్టిన, క్రోధ = కోపంచేత, ప్రేరిత = ప్రేరే పించబడిన, భీమ = భయంకరమైన, భార్గవభుజాస్తమ్భ = పరశురాముని భుజ స్తంభంచేత, అపవిద్ధః = విడవబడిన (విసరబడిన), ఉజ్జ్వాలః = పైకి లేచుచున్న అగ్ని జ్వాలలుగల, అశిథిలః = వేగం గల, పరశుః = నా గండ్రగొడ్డలి, క్షణాత్ = క్షణకాలంలో, లేదా క్షణకాలంపాటు, త్వత్కణ్ఠపీఠాతిథిః = నీ కంఠపీఠానికి అతిథిగా, భవతు = అగుగాక. యేన = ఏ, అనేన = ఈ గండ్రగొడ్డలిచేత, దేవః

= దేవుడైన, హరః = హరుడు, జగత్సు = జగత్తులయందు, ఖండపరశుః = ఖండపరశువుగా, ఖ్యాప్యతే = ప్రసిద్ధి పొందింపబడుచున్నాడో. పరమేశ్వరుడు తన పరశువును ఖండించి సగం భాగం శిష్యుడైన పరశురామునికి పరశువుగా ఇచ్చినా డనీ, ఖండరూపమైన పరశువును తన దగ్గర ఉంచుకొనుటచేత ఆయన పేరు 'ఖండపరశువు' అనీ పురాణకథ. శత్రువులను ఖండించే పరశువు కలవాడు గాన ఖండపరశువు అని కూడా మరొక వ్యుత్పత్తి.

వి. ఇక్కడ పరశురామునికి శ్రీరామునిమీద కలిగిన క్రోధాన్ని వర్ణించే మొదటి మూడు పాదాలలోను వికటవర్ణాలతో, దీర్ఘసమాసంతో వాక్యరచన రౌద్రానుగుణంగా నడిచింది. అందుచేత ఇక్కడ ప్రతికూలవర్ణత్వదోషం లేదు. మరొక విశేషం ఏమనగా గురువైన పరమేశ్వరుని పేరు స్మరించగానే క్రోధం శాంతించి నట్లు సూచించడానికై నాల్గవ పాదం తదనుగుణంగా దీర్ఘసమాసం లేకుండా, వికటవర్ణాధిక్యం లేకుండా కూర్చబడింది.

అవ. 2. ఉపహతవిసర్గత్వ- లుప్తవిసర్గత్వాలను వివరిస్తున్నాడు.

వృ. (2) ఉపహతః ఉత్వం ప్రాప్తః (3) లుప్తో వా విసర్గః యత్ర తత్ యథా-

శ్లో. ధీరో వినీతో నిపుణో వరాకారో నృపోఽత్ర సః,
యస్య భృత్యా బలోత్సిక్తా భక్తా బుద్ధిప్రభావితాః. 210

వ్యా. ఉపహతేతి :- ఉపహతః = ఉత్వాన్ని పొందిన, లుప్తో వా = లేదా లోపించిన విసర్గ ఎక్కడనో అది ఎట్లనగా.

విసర్గ 'ఉ'గామారి తరవాత వెనుక అకారం ఉండడంచేత రెండూ కలిసి 'ఓ'గా మారుతాయి. అది ఉపహతవిసర్గం. ఉపసర్గ లోపిస్తే అది లుప్తవిసర్గం.

ధీరః ఇతి :- ధీరః = ధీరుడు, వినీతః = వినయవంతుడు, నిపుణః = నేర్పరి, వరాకారః = శ్రేష్ఠమైన ఆకారం కలవాడు అయిన, సః = అతడు, అత్ర = ఇక్కడ, నృపః = రాజు. యస్య = ఎవనియొక్క, భృత్యాః = భృత్యులు, బలోత్సిక్తాః = బలంచేత దృప్తులైన, బుద్ధిప్రభావితాః = బుద్ధిప్రభావంతో కూడిన, భక్తాః = భక్తులో.

వి. ఇక్కడ పూర్వార్ధంలో ఉపహతవిసర్గత్వం, ఉత్తరార్ధంలో లుప్తవిస ర్గత్వం. ఇవి ఉన్నచోట బంధం శిథిలంగా ఉంటుంది. అందుచేత వ్యాకరణసమ తాలైనా ఇవి దోషాలు. విసర్గలు అలాగే ఉన్నా దోషమే. "స్మరః ఖరః ఖలః కాన్తః కాయః కృశతరః సఖే" ఇత్యాదులు ఉదాహరణలు.

అవ. విసంధిపదత్వాన్ని వివరిస్తున్నాడు.

వృ. (4). విసంధి సంధివైరూప్యమ్; విశ్లేషః, అశ్లీలత్వం, కష్టత్వం చ. తత్రాద్యం యథా-

శ్లో॥ రాజన్విభాన్తి భవతశ్చరితాని తాని
ఇన్దోర్ద్యుతిం దధతి యాని రసాతలేఽన్తః,
ధీదోర్బలే అతితతే ఉచితానువృత్తీ
ఆతన్వతీ విజయసంపదమేత్య భాతః. 211

వ్యా. విసంధీతి :- సంధి విరూపంగా, వికృతరూపంగా, ఉండడం విసంధిత్వం. ఇది విశ్లేషం అనీ, అశ్లీలత్వం అనీ, కష్టత్వం అనీ మూడు విధాలు.

వి. వర్ణాన్ని ఉచ్చరించడానికి పట్టే కాలానికి 'మాత్ర'అని పేరు. హ్రస్వ మైన అచ్చును ఉచ్చరించడానికి ఒక మాత్ర, దీర్ఘాచ్చును ఉచ్చరించడానికి రెండు మాత్రలూ, హల్లును ఉచ్చరించడానికి అర్ధమాత్ర అవసరం.

"ఏకమాత్రో భవేద్ధ్రస్వో ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే,
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః వ్యఞ్జనం త్వర్ధమాత్రకమ్."

వర్ణాలను ఉచ్చరించడానికి కనీసం ఎంత సమయం కావాలో అంత సమ యమే వినియోగించి ఉచ్చరించినప్పుడు రెండు వర్ణాలు దగ్గరగా రావడానికి (అధికసంనికర్షకు) 'సంహిత' అని పేరు. దీనికే 'సంధి' అని కూడా పేరు. 'సంహిత''సంధి'అనే రెండు పదాలు సంపూర్వక'ధా'ధాతువునుండి తయారయినవే; కాని పాణిని ఎక్కడా కూడ 'సంధి' పదాన్ని వాడినట్లు కనబడదు. "పరః సంని కర్షః సంహితా" (పా.సూ. 1-4-109)అనే సూత్రంచేత 'సంహితా'అనే సంజ్ఞను ఏర్పరచుకొన్నాడు గాన దానినే వాడినాడు.

"సంహితైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః,
నిత్యా సమాసే వాక్యే తు సా వివక్షామపేక్షతే."

అని ఒక ప్రసిద్ధకారిక ఉన్నది. ఒక్క పదంలోను, ధాతు-ఉపసర్గల మధ్యా, సమాసంలోను సంధి అనగా సంధికార్యం, నిత్యం; చేసి తీరాలి. వాక్యంలో ఉచ్చరించేవాని ఇచ్ఛను పట్టి ఉంటుంది; కావాలనుకుంటే చేయవచ్చు లేకపోతే మానివేయవచ్చు. ఉదా - తృతీయైకవచనంలో 'మతి+ఆ' అని ఉన్నప్పుడు సంధికార్యం తప్పక చేసి 'మత్యా'అనే ప్రయోగించాలి. 'పరి+అగచ్ఛత్'అని ఉన్నప్పుడు ఈ ఉపసర్గకీ ధాతువుకీ తప్పకుండా సంధికార్యం చేసి 'పర్యగచ్ఛత్' అని ప్రయోగించాలి. 'సుధీ+ఉపాస్య' మధు+అరి' మొదలైన సమాసాలలో కూడ సంధికార్యం తప్పకుండా చేసి 'సుధ్యుపాస్య' 'మధ్వరి' ఇత్యాది విధంగా ప్రయోగించాలి. 'గౌరీ అగచ్ఛతి' 'బాలః అగమత్' ఇత్యాదివాక్యాలలో ప్రయోక్త ఇష్టానుసారం "గౌర్యాగచ్ఛతి"అని కాని 'గౌరీ అగచ్ఛతి' అని కాని, 'బాల అగమత్' అని కాని, 'బాలః అగమత్'అని కాని ప్రయోగించవచ్చును అని ఈ కారికకు అర్థం

అయితే వాక్యంలో సంధికార్యం ఇచ్ఛానుసారం చేయవచ్చును అనేది కేవలం ఛందోబద్ధం కాని వాక్యంలోనే. పద్యవాక్యంలో మాత్రం సంధికార్యం ఐచ్ఛికం కాదు. తప్పకచెయ్యాలి. వ్యాకరణవిరోధం లేకపోయినా పద్యం చదివేటప్పుడు ధార కుంటుపడుతుంది. కాబట్టి అది దోషమే అని ఆలంకారికుల అభిప్రాయం. ఐచ్ఛికం కదా అని సంధికార్యం చేయకపోవడం రచయిత అశక్తికి సూచకం కదా ?

ఈకారాంత-ఊకారాంత-ఏకారాంతద్వివచనశబ్దాలకి పాణిని 'ప్రగృహ్యం' అనే సంజ్ఞ పెట్టుకొని, ప్రగృహ్యసంజ్ఞ కలవి ప్రకృతిభావం పొందుతాయి, అనగా వాటికి ఉత్తరపదంలోని ఆద్యవర్ణంతో సంధికార్యం చేయవలసినా చేయకూడదు అని "ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్"(1-1-11) "ప్లుతప్రగృహ్యా అచి నిత్యమ్" (6-1-125) అనే సూత్రాలలో చెప్పి ఉన్నాడు. అందుచేత ప్రగృహ్యసంజ్ఞ కల వాటికి సంధికార్యం చేయకూడదు కదా అని, ఒక సారి పరవా లేదు కాని, రెండు మూడు సార్లు ఒక శ్లోకంలో విశ్లేషం (అనగా సంధికార్యాభావం)చేస్తే అది దోషం.

ఈ విధంగా విశ్లేషం (సంధికార్యాభావం) ఐచ్ఛికం అనీ, అనుశాసనికం

(వ్యాకరణప్రోక్త)ం అనీ రెండు విధాలు. ఆనుశాసనికం కూడా ప్రగృహ్యసంజ్ఞా నిమిత్తకం (ప్రగృహ్యసంజ్ఞవల్ల ఏర్పడినది) అనీ, అసిద్ధి హేతుకం అనీ రెండు విధాలు. మొత్తం మూడు విధాలు. వీటిలో ఐచ్ఛిక-ప్రగృహ్యసంజ్ఞానిమిత్తకాలను గూర్చి తెలుసుకున్నాం. 'చన్ద్రః-ఉదితః' అనే వాక్యాలలో "లోపః శాకల్యస్య" (8-3-19)అనే పాణిని సూత్రంచేత (విసర్గస్థానంలో వచ్చిన వకారం)లోపించగా 'చన్ద్ర ఉదిత'అని ఉన్నది. (విసర్గస్థానంలో ఏమి వచ్చింది మొదలైన వన్నీ జిజ్ఞాసువులు సిద్ధాంతకౌముద్యాదులద్వారా తెలుసుకోవాలి.) ఇక్కడ 'అ + ఉ'అని ఉండడం చేత గుణం రావడానికి అవకాశం ఉన్నా అది రాదు. ఎందుచేత ననగా "ఆద్గుణః" (6-1-7)అనే సూత్రం దృష్టిలో లోపసూత్రం అసిద్ధం. ఆ సూత్రం ఉన్నట్లే ఆద్గుణసూత్రానికి తెలియదు. అందుచేత దానికి అకారానికీ ఉకారానికీ మధ్య 'వ్' కనబడుతూ ఉంటుంది. అందుచేత వ్యాకరణశాస్త్రరీత్యా కూడ సంధి రాదు. అందుచేత ఇది అసిద్ధిహేతుకమైన ఆనుశాసనికసంధ్యభావం. ఒక సారి ప్రయోగిస్తే దోషం కాకపోయినా అధికంగా ఈ సంధ్యభావరూపాలు ప్రయోగిస్తే దోషమే.

ఐచ్ఛిక-ప్రగృహ్యసంజ్ఞాహేతుకానుశాసనికవిశ్లేషాలకి ఉదాహరణం ఎట్లనగా-రాజన్నితి-రాజన్ = రాజా ! యాని = ఏవి, రసాతలే = పాతాళమునందు, అన్తః = లోపల, ఇన్దోః = చంద్రుని యొక్క, ద్యుతిమ్ = కాంతిని, దధతి = ధరిస్తున్నాయో, తాని = అట్టి, భవతః చరితాని = నీ చరిత్రములు, విభాన్తి = ప్రకాశించుచున్నవి. ఉచితానువృత్తీ = కాలానురూపమైన అనువర్తనాలను, ఆతన్వతీ= చేస్తున్న, ధీదోర్బలే = బుద్ధిబలబాహుబలాలు, అతితతే = చాల వ్యాపించినవై, విజయసంపదమ్ = విజయసంపదను, ఏత్య = పొంది, భాతః = ప్రకాశిస్తున్నవి.

ఇక్కడ పూర్వార్ధంలో 'తాని ఇన్దోః'అనే చోట సంధికార్యం ఐచ్ఛికమే అయినా విశ్లేషం, ఒక్క మారే ప్రయోగించినా, దోషమే. ఉత్తరార్ధంలో "ధీదోర్బలే అతితతే"అనే చోట. "అతితతే ఉచితానువృత్తీ" అనేచోట "ఉచితానువృత్తీ ఆతన్వతీ" అనే చోట విశ్లేషం ప్రగృహ్యసంజ్ఞను పట్టి చేసినది. ఒక మారు ఇది దోషం కాకపోయినా మూడు సార్లు చేయడం దోషం.

అవ. అసిద్ధిహేతుకానుశాసనిక విశ్లేషానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ తత ఉదిత ఉదారహారహారి
ద్యుతిరుచ్చైరుదయాచలాదివేన్దుః,
నిజవంశ ఉదాత్తకాన్తకాన్తి
ర్బత ముక్తామణివచ్చకాస్త్యనర్ఘః 212

వృ. సంహితాం న కరోమీతి స్వేచ్ఛయా సకృదపి దోషః, ప్రగృహ్యాదిహేతుకత్వే త్వసకృత్.

వ్యా. తత ఇతి:- ఉచ్చైః = ఉన్నతమైన, ఉదయాచలాత్ = ఉదయ పర్వతంనుండి, ఇన్దుః ఇవ = చంద్రుడు వలె, తతః = ఆ వంశమునుండి లేదా వెనుక చెప్పిన ఆ రాజునుండి. ఉదితః = పుట్టినవాడు, ఉదారహారహారిద్యుతిః = శ్రేష్ఠమైన హారంచేత మనోహరమైన కాంతి గలవాడు, శ్రేష్ఠమైన హారం వలె మనోహరమైన కాంతి గలవాడు అని ఈ విశేషణం చంద్రునికి కూడా వర్తిస్తుంది, ఉదాత్తకాన్తకాన్తిః = ఉత్తమమైన మనోహరమైన కాంతి గలవాడు అయిన, ఇది చంద్రుడికి కూడా ఇదే అర్థంతో వర్తిస్తుంది, అనర్ఘః = శ్రేష్ఠుడైన ఇతడు, నిజవంశే = తన వంశమునందు, ముక్తామణివత్ = ముత్యమువలె, చకాస్తి = ప్రకాశిస్తు న్నాడు. ముత్యాలు వెదురునుండి కూడా పుడతా యని ప్రసిద్ధి ఉన్నది గాన అనర్ఘమైన, అనగా అమూల్యమైన, ముత్యం కూడా తన వంశం (వెదురుకఱ్ఱ) మీద ప్రకాశిస్తుంది.

"గజేన్ద్రజీమూతవరాహశఙ్ఖ
మత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని,
ముక్తాఫలాని ప్రథితాని లోకే
తేషాం తు శుక్త్యుద్భవమేవ భూరి,"

అని ప్రసిద్ధశ్లోకం. ఏనుగులు, మేఘం, అటవీవరాహం, శంఖం, మత్స్యం, సర్పం, ముత్యపు చిప్ప, వెదురు — వీటినుండి ముత్యాలు పుడతాయి. అయితే ముత్యపు చిప్పలలో పుట్టినవే అధికంగా లభిస్తాయి—అని దీనికి అర్థం.

వి. ఇక్కడ "తత ఉదితః" "ఉదిత ఉదార" "నిజవంశ ఉదాత్త" అనే చోట సంధ్యభావం అసిద్ధిహేతుకం.

సంహితామితి:- సంహితను (సంహితాకార్యమును) చెయ్యను అని స్వేచ్ఛ చేత ఒక్కమారు చేయకపోయినా దోషమే. ప్రగృహ్యాదులు ఉండడం చేత చేయక పోతే ఒకమాటు దోషం కాకపోయినా, చాలా మార్లు దోషం. అనగా ఆ పదాలకు బదులు ఇతరపదాలతో శ్లోకం కూర్చుకోవాలి.

అవ. అశ్లీలత్వరూపమైన సంధివైరూప్యానికి ఉదాహరణం చూపుతున్నారు-

శ్లో॥ వేగాదుడ్డీయ గగనే చలడ్డామరచేష్టితః.
అయముత్తపతే పత్రీ తతోఽత్రైవ రుచిం కురు. 213

వృ. అత్ర సంధావశ్లీలతా.

వ్యా. వేగాదితి:- సఖి నాయికకు సంకేతస్థానాన్ని చూపుతున్నది. అయమ్ పత్రీ = ఈ పక్షి, వేగాత్ = వేగంవలన, ఉడ్డీయ = ఎగిరి, డామరచేష్టితః = తీవ్రమైన చేష్టలు కలదై, గగనే = ఆకాశమునందు, ఉత్తపతే = ప్రకాశిస్తున్నది. తతః = అందువలన, అత్రైవ = ఈ ప్రాంతమునందే, రుచిమ్ = అభిలాషను, కురు = చేయుము.

అత్రేతి:- ఇక్కడ సంధిచేయగా, కలిపి చదవగా, అశ్లీలత్వం ఉన్నది. 'చలడ్డామర' అనే చోట ఏర్పడిన 'లండా' అనే శబ్దం కాశీప్రాంతభాషలో పురుష గుహ్యాంగాభిధాయకం. 'రుచిం కురు' అని కలిపి చదివినప్పుడు ఏర్పడిన 'చింకు' శబ్దం లాటభాషలో అశ్లీలార్థబోధకం అని వెనుక చెప్పబడింది. ఈ విధంగా ఇక్కడ విసంధిత్వదోషం చాలా పదాలలో ఉండడంచేత వాక్యగతం.

అవ. కష్టత్వరూపమైన విసంధికి ఉదాహరణం చూపుతున్నారు-

శ్లో॥ ఉర్వ్యసావత్ర తర్వాలీ మర్వన్తే చార్వవస్థితిః,
నాత్రర్జు యుజ్యతే గన్తుం శిరో నమయ తన్మనాక్. 214

వ్యా. అత్ర = ఇక్కడ, మర్వన్తే = మరుప్రదేశప్రాంతభాగమునందు, అసౌ = ఈ, ఉర్వీ = గొప్పదైన, తర్వాలీ = వృక్షపంక్తి, చార్వవస్థితిః = అందమైన స్థితి గలది. అత్ర=ఇక్కడ, ఋజు=ఋజువుగా (వంగకుండగా), గన్తుమ్

= వెళ్లటకు, న యుజ్యతే = యుక్తం కాదు. తత్ = ఆ కారణంవలన, మనాక్ = కొంచెం, శిరః = శిరస్సును, నమయ = వంచుము.

వి. ఇక్కడ ఉన్న 'ర్వ్యః' "ర్వా" 'ర్వ' 'అత్రర్జు' అనే సంధులు శ్రుతికటువుగా ఉన్నాయి. అందుచేత ఇది 'శ్రుతికటువిసంధి'కి ఉదాహరణం.

అవ. హతవృత్తానికి ఉదాహరణలు చూపడానికి ముందు 'హత' పదానికి మూడు అర్థాలు చెప్పి, 'హతవృత్త' పదానికి విగ్రహం చూపుతున్నాడు-

వృ. హతం లక్షణానుసరణేఽప్యశ్రవ్యమ్, అప్రాప్తగురుభావాన్త లఘు, రసాననుగుణం చ వృత్తం యత్ర తత్ హతవృత్తమ్. క్రమేణోదాహరణమ్-

శ్లో॥ అమృతమమృతం కః సందేహో మధూన్యపి నాన్యథా
మధురమధికం చూతస్యాపి ప్రసన్నరసం ఫలమ్,
సకృదపి పునర్మధ్యస్థః సన్ రసాన్తరవిజ్జనో
వదతు యదిహాన్యత్స్వాదు స్యాత్ప్రియాదశనచ్ఛదాత్.

వృ. అత్ర 'యదిహాన్యత్స్వాదు స్యాత్' ఇత్యశ్రవ్యమ్.

వ్యా. హతమితి:- లక్షణాన్ని అనుసరించినా అశ్రావ్యంగా ఉండేది, గురుత్వాన్ని పొందని చివరి లఘువు కలది, రసానికి అనుగుణం కానిది 'హతం'. ఈ మూడు విధాల హతం అయిన వృత్తం ఉన్నది హతవృత్తం.

వి. ఛందఃశాస్త్రంలో చెప్పిన లక్షణం అనుసరించకపోతే అశ్రవ్యత్వం (వినడానికి ఇంపుగా లేకపోవడం) అనేది ప్రసిద్ధమే. అదొక అశ్రవ్యత్వం. వృత్త లక్షణాన్ని అనుసరించినా యతిభంగాదులచేత అశ్రవ్యంగా ఉంటుంది. అది రెండవ అశ్రవ్యత్వం. స్థానవిశేషంలో గణవిశేషాన్ని చేర్చడంవల్ల కూడా అశ్రవ్యత్వం ఏర్పడుతుంది. అది మూడవ అశ్రవ్యత్వం. ఈ త్రివిధాశ్రవ్యత్వాలలో ఏది ఉన్నా ఆ వృత్తం హతం అయిపోతుంది (పాడయిపోతుంది). ఈ త్రివిధాశ్రవ్యత్వరూపహతవృత్తత్వం మొదటిది. "వా పాదాన్తే" (పాదాంతంలో ఉన్న లఘువు వికల్పంగా గురువు అవుతుంది) అని చెప్పిన గురుత్వం పాదాంతలఘువుకు

లభించకపోవడం రెండవ హతవృత్తత్వం. రసానికి అనుగుణంగా లేకపోవడంచేత వృత్తం చెడిపోవడం మూడవ హతవృత్తత్వం.

మొదటి హతవృత్తత్వానికి చెందిన త్రివిధాశ్రవ్యత్వాలలో వృత్తం ఛందః శాస్త్రప్రకారం లేకపోవడం వల్ల కలిగే అశ్రవ్యత్వం ప్రసిద్ధమే గాన దానికి ఉదాహరణ చూపకుండా రెండవ విధమైన అశ్రవ్యత్వానికి చూపుతున్నాడు-

అమృతమితి:- అమృతమ్=అమృతం, అమృతమ్=అమృతమే; సందేహః = సందేహం, కః = ఏమిటి ? మధూన్యపి = తేనెలు కూడా, అన్యథా = మరొక విధంగా, న=కావు, అనగా తేనెలు తేనెలే. చూతస్య=చూతవృక్షంయొక్క, ప్రసన్న రసమ్=స్వచ్ఛమైన రసం గల, ఫలమ్ అపి=ఫలం కూడా, అధికమ్=అధికంగా, మధురమ్ = మధురమైనది. పునః = కాని, రసాన్తరవిత్ = రసాల తారతమ్యం ఎరిగిన, జనః = జనుడు, సకృదపి=ఒక్కమారైనా, మధ్యస్థః సన్ = మధ్యస్థుడై, పక్షపాతబుద్ధి లేనివాడై, వదతు = చెప్పుగాక; యత్ = ఏమనగా, అన్యత్ = ఇతరవస్తువు ఏదైనా, ప్రియాదశనచ్ఛదాత్ = ప్రియురాలి అధరోష్ఠంకంటె, స్వాదు = మధురమైనదిగా, స్యాత్ = ఉండునా?

అత్రేతి:- ఇక్కడ "యదిహాన్యత్ స్వాదు స్యాత్" అనేది అశ్రవ్యం.

'అమృతమమృతం' ఇత్యాదిశ్లోకం హరిణీవృత్తంలో ఉంది. "రసయుగ హయైర్‌న్సౌ మౌ స్లౌ గో యదా హరిణీ తదా" అని దీని లక్షణం. మొదటినుంచి ఆరవ అక్షరం, దాని తరవాత నాల్గవ అక్షరం, దాని తరవాత ఏడవ అక్షరం యతిస్థానాలు. కాని ఈశ్లోకం చతుర్థపాదంలో ఆరవ అక్షరం 'హా' అక్కడ పదం విరగలేదు. "అందుచేత యతిభంగం కలిగి అశ్రవ్యత్వం వచ్చింది.

అవ. లక్షణాన్ని అనుసరించినా మాత్రావృత్తంలో స్థానవిశేషంలో గణ విశేషం కూర్చడంవల్ల మూడవ విధమైన అశ్రవ్యత్వానికి ఉదాహరణం చూపు తున్నాడు-

వృ. యథా వా.

గాథ. జం పరిహరిఉం తీరఇ మణఅం పి ణ సున్దరత్తణగుణేణ,
అహ ణవరం జస్స దోసో పక్ఖేడిపహీం పి వడివణ్ణో.

"యత్ పరిహర్తుం తీర్యతే మనాగపి న సున్దరత్వగుణేన
అథ కేవలం యస్య దోషః ప్రతిపక్షైరపి ప్రతిపన్నః".

వృ. అత్ర ద్వితీయతృతీయగణౌ సకారభకారౌ.

వ్యా. మరొకఉదాహరణం ఎట్లనగా-

జం ఇత్యాది:- ఒక సఖి ప్రియునిపై అలిగిన మానినిని సమాధాన పరచు చున్న గాధ. ఇది ఆనందవర్ధనుని పంచబాణలీలలోనిది. యత్ = ఏది సున్దరత్వ గుణేన = సౌందర్య గుణంతో కూడినదో, అది, మనాగపి = కొంచెం కూడా, పరిహర్తుమ్ = పరిహరించుటకు, న తీర్యతే = శక్యం కాదు. అథ = మరియు, యస్య = దేనియొక్క, దోషః=అపరిహార్యత్వరూపదోషం, కేవలమ్ = కేవలము, ప్రతిపక్షైః అపి = యతులు మొదలైనవారిచేత కూడ, ప్రతిపన్నః = అంగీకరించ బడినదో. అందుచేత దైవవశంచేత నీ భర్త సౌందర్యాతిశయం ఉన్న మరొక కాంతపై ఆసక్తు డవడంలో ఆశ్చర్యం లేదు, నీవు కోపించక ఓపిక పట్టి ఉండడం మంచిది. కామచేష్ట ఇలాగే ఉంటుంది అని భావం.

అత్రేతి:- ఇక్కడ ద్వితీయతృతీయగణాలు సకారభకారాలు.

వి. ఇది మాత్రావృత్తం; గాథ. అందుచేత ఒక్కొక్క గణం మాత్రా చతుష్టయాత్మకమై వర్ణత్రయాత్మకం అయిఉంటుంది. 'హరిఉం' అనేది రెండవ గణం. సోఽన్తగురుః' (అంత్యగురువు సగణం) అనే వచనాన్ని పట్టి ఇది సగణం, మూడవగణం 'తీరఇ' అనేది "భ ఆది గురుః" అనే వచనాన్ని పట్టి భగణం. ఇక్కడ రెండవ గణం చివరి అక్షరం 'ఉం' అనేది, మూడవగణం మొదటి అక్షరం 'తీ' అనేదీ గురువులై ఉండి ఆ రెండూ 'ఉంతీ' అని పక్కపక్కనే ఉండడంవల్ల ఉచ్చారణలో అశ్రవ్యత్వం ఉన్నది అని బాలబోధినీకారుడు.

అవ. అంత్యలఘువు గురుత్వాన్ని పొందని వృత్తాన్ని ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ వికపితసహకారతారహారిపరిమలగుఞ్జితపుఞ్జితద్విరేఫః,
నవకిసలయచారుచామరశ్రీర్హరతి మునేరపిమానసంవసన్తః.

వృ. అత్ర 'హారి'శబ్దః."హారిప్రముదితసౌరభ"ఇతిపాఠో యుక్తః.

వ్యా. "వికసిత.. ద్విరేఫః" - వికసిత = వికసించిన, సహకార = తీయ మామిడిచెట్లయొక్క, తార = అత్యధికమైన, హారి = మనోహరమైన పరిమల= పరిమలముచేత, గుఞ్జిత = ధ్వనిచేస్తూన్న, పుఞ్జిత = ప్రోగుపడిన, ద్విరేఫః = తుమ్మెదలు గల, నవకిసలయచారుచామరశ్రీః=నూతనములైన చిగుళ్ళచేత సుందరమైన చామరశోభగల, వసన్తః = వసంతఋవు, మునేః = మునియొక్క, మానసమపి = మనస్సును కూడ, హరతి = హరిస్తున్నది.

అత్రేతి:- ఇక్కడ"హారి"శబ్దం."హారిప్రముదితసౌరభ"అనిపాఠం యుక్తం.

వి. ప్రథమపాదం చివరి 'హారి' అనే పదంలోని ఇకారం పాదాంతంలో ఉన్నా గురువు అవడంలేదు. చదివేటప్పుడు తేలిపోతున్నది. అందుచేత 'వా పాదాన్తే' అని పాదాంతలఘువుకు వైకల్పికంగా గురుత్వం చెప్పబడింది కదా అని బంధం శిథిలంగా ఉందా, బాగుందా అని చూచుకోకుండా ఆ సూత్రాన్ని పాటించకూడదు. ముఖ్యంగా పుష్పితాగ్రావృత్తం వంటి వృత్తాలలో బంధశైథిల్యం వస్తుంది. వసంతతిలకాదులలో అంత బాధలేదు. ఇక్కడ 'హారిపరిమల'కు బదులు "హారిప్రముదితసౌరభ" అని మార్చుకుంటే సంయుక్తాక్షరపరత్వంచేత 'రి' లోని 'ఇ' గురువు అవుతుంది.

అవ. శార్దూలవిక్రీడితవృత్తంలో కూడ పాదాంత్యలఘువు గురువు కాక పోవడానికి ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ అన్యాస్తా గుణరత్నరోహణభువో ధన్యా మృదన్యైవ సా
సంభారాః ఖలు తేఽన్య ఏవ విధినా యైరేష సృష్టో యువా,
శ్రీమత్కాన్తిజుషాం ద్విషాం కరతలాత్ స్త్రీణాం నితమ్బస్థలాత్
దృష్టే యత్ర పతన్తి మూఢమనసామస్త్రాణి వస్త్రాణి చ. 218

వృ. అత్ర 'వస్త్రాణ్యపి' ఇతి పాఠే లఘురపి గురుతాం భజతే.

వ్యా. అన్యా ఇతి :- ఒక రాజు వర్ణనం ఇతి. ఏషః యువా = ఈ యువకుడు, విధినా = బ్రహ్మదేవునిచేత, యైః = ఏ సంభారాలతో, సృష్టః = సృష్టించబడినాడో, తాః = ఆ, గుణరత్నరోహణభువః = గుణరత్నములు మొలచిన రోహణపర్వత భూములు, అన్యాః = అన్యమైనవి. ఆ భూములే వేరు అని అర్థం.

ధన్యా = ధన్యమైన, సా = ఆ, మృత్ = మట్టి, అన్యైవ = అన్యమైనది. ఆ మట్టియే వేరు. తే = ఆ, సంభారాః = సంభారాలు, అన్య ఏవ ఖలు = అన్యములు. యత్ర = ఎవడు, దృష్టే = చూడబడగానే. మూఢమనసామ్ = మూఢములై పోయిన మనస్సులు గల, శ్రీమత్కాన్తిజుషామ్ = శ్రీమంతులు, కాంతికలవారు అయిన, ద్విషామ్ = శత్రువులయొక్క, కరతలాత్ = హస్తములనుండి, అస్త్రాణి = ఆయుధాలు, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, 'మూఢమనసామ్' 'శ్రీమత్కాన్తిజుషామ్' అనే విశేషణద్వయం 'స్త్రీణామ్'కు కూడా అన్వయించుకోవాలి. వస్త్రాణి చ = వస్త్రాలు, పతన్తి = పడిపోవుచుండునో, జారిపోవుచుండునో.

అత్రేతి :- ఇక్కడ 'వస్త్రాణ్యపి' అని పాఠంలో లఘువు కూడా గురువు అవుతుంది. "వస్త్రాణి చ" అని చదివినప్పుడు ఊతం అంతా 'స్త్రా' మీద పడడం చేత చివర ఉన్న 'చ' తేలిపోతున్నది. ఈ పాఠం మార్చి "వస్త్రాణ్యపి" అని చదివినప్పుడు 'పి' లోని లఘువు గురువు అవుతుంది. ఈ విషయా లన్నీ అనుభవైకవేద్యాలు. మాటలలో కొంతవరకే స్పష్టం చేయకలుగుతాం.

అవ. రసానికి అనుగుణం కాని వృత్తాన్ని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ హా నృప హా బుధ హా కవిబన్ధో విప్రసహస్రసమాశ్రయ దేవ
ముగ్ధవిదగ్ధసభాన్తరరత్న క్వాసి గతః క్వ వయం చ తవైతే.

వృ. హాస్యరసవ్యఞ్జకమేతద్వృత్తమ్.

వ్యా. హా ఇతి:- ఒక రాజు మరణించగా అతనికి సంబంధించినవారి విలాపం ఇది- "అయ్యో! రాజా! అయ్యో! బుధుడా! అయ్యో! కవులబంధువా! విప్రసహస్రానికి ఆశ్రయమైన ఓ ప్రభూ! సుందరమైన వాడా! విదగ్ధుల సభామధ్యంలో రత్నమా! ఎక్కడికి వెళ్ళిపోయినావు. మేమందరం ఎక్కడ ఉన్నాం"? ఇది దోధక వృత్తం.

హాస్యేతి :- ఈ వృత్తం హాస్యరసవ్యంజకం.

వి. ఇక్కడ వాడిన దోధకవృత్తం ప్రతిపదంలోను విరిగిపోతుంది. కాబట్టి హాస్యరసానికి అనుగుణం గాని కరుణరసానికి అనుగుణం కాదు. కరుణరసానికి మన్దాక్రాన్తాపుష్పితాగ్రాదులు, శృంగారాదులకు పృథ్వీస్రగ్ధరాదులు, వీరరసాదులకు

శిఖరిణీశార్దూలవిక్రీడితాదులు, హాస్యానికి దోధకం అనుగుణాలు. ఈ విషయాలన్నీ నాట్యశాస్త్రం పదిహేడవ అధ్యాయంలో ప్రతిపాదితములై ఉన్నాయి.

అవ. (6) చెప్పదలచిన అర్థాన్ని చెప్ప గలిగిన పదాలు లేని వాక్యం 'న్యూనపదం' దీనికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. న్యూనపదం యథా-

శ్లో॥ తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాఞ్చాలతనయాం
వనే వ్యాధైః సార్ధం సుచిరముషితం వల్కలధరైః,
విరాటస్యావాసే స్థితమనుచితారమ్భనిభృతం
గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు. 220

వృ. అత్రాస్మాభిరితి, 'ఖిన్నే'ఇత్యస్మాత్ పూర్వమ్ ఇత్థమితిచ.

వ్యా. తథాభూతామితి :- ఇది 15 వ శ్లోకంగా తృతీయోల్లాసంలో వచ్చినది. అర్థాదికం అక్కడ చూచుకొనవచ్చును. ఇక్కడ మూడు పాదాలకి సంబంధించి 'అస్మాభిః' అనే పదం, 'ఖిన్నే' అనేదానికి ముందు "ఇత్థమ్" (ఇట్లు) అనే పదం అవసరం. కర్తను చెప్పకపోవడంచేత, 'ఈ విధంగా' అని చెప్పకపోవడం చేత వాక్యానికి ఏకవాక్యత కుదరదు. అందుచేత న్యూనపదత్వదోషం.

అవ. (7) చెప్పదలచిన అర్థంకంటె అధికమైన అర్థం చెప్పే పదాలు ఉన్నది 'అధికపదం'. దానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. అధికం యథా-

శ్లో॥ స్ఫటికాకృతినిర్మలః ప్రకామం
ప్రతిసంక్రాన్తనిశాతశాస్త్రతత్త్వః,
అవిరుద్ధసమన్వితోక్తియుక్తః
ప్రతిమల్లాస్తమయోదయః స కోఽపి. 221

వృ. అత్ర 'ఆకృతి' శబ్దః.

వ్యా. అధికపదం ఎట్లనగా-

స్ఫటికేతి :- ఇది ఒక విద్వాంసుని వర్ణనం. స్ఫటికాకృతినిర్మలః = స్ఫటికముయొక్క, ఆకారం వలె నిర్మలుడు, స్వచ్ఛమైన అంతఃకరణం కలవాడు, ప్రకామమ్ = మిక్కిలి, ప్రతిసంక్రాన్తనిశాతశాస్త్రతత్త్వః = హృదయంలో సంక్రమించిన, హృదయంలో స్థిరంగా ఉన్న, సానపట్టబడిన శాస్త్రతత్త్వం కలవాడు, అవిరుద్ధసమన్వితోక్తియుక్తః = లోకశాస్త్రాదులకు విరుద్ధములు కాని సమన్వయంతో కూడిన మాటలతో కూడినవాడు, ప్రతిమల్లాస్తమయోదయః = ప్రతివాదుల అస్తమయానికి, ఓటమికి, ఉదయభూతుడు, కారణమైనవాడు అయిన, సః = అతడు, కోఒపి = వర్ణింప శక్యం కానివాడు.

అత్రేతి :- ఇక్కడ 'ఆకృతి' శబ్దం. అనగా "స్ఫటికనిర్మలః" అంటేనే "స్ఫటికం వలె నిర్మలమైనవాడు" అనే అర్థం లభిస్తుంది. నైర్మల్యం విషయంలో స్ఫటికంతోనే కదా పోల్చేది. ఇంక స్ఫటికంయొక్క ఆకారం వలె నిర్మలుడు అని చెప్పడం అనావశ్యకం. అందుచేత 'స్ఫటికాకృతినిర్మలః' లోని 'ఆకృతి' పదం అధికం గాన ఈ వాక్యం అధికపదత్వదోషదుష్టం.

అవ. అసమాసస్థలంలో కూడా అధికపదత్వం ఉండవచ్చును. దీనికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. యథా వా-

శ్లో॥ ఇదమనుచితమక్రమశ్చ పుంసాం
యదిహ జరాస్వపి మాన్మథా వికారాః,
యదపి చ న కృతం నితమ్బినీనాం
స్తనపతనావధి జీవితం రతం వా. 222

వృ. అత్ర కృతమితి. 'కృతం' ప్రత్యుత ప్రక్రమభఙ్గమావహతి. తథా చ 'యదపి చ న కురఙ్గలోచనామ్' ఇతి పాఠే నిరాకాఙ్క్షైవ ప్రతీతిః.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

ఇదమితి :- ఇహ = ఈ జగత్తులో, పుంసామ్ = పురుషులకు, జరాస్వపి = ముసలితనములందు కూడ, మాన్మథాః వికారాః ఇతి యత్ = మన్మథవికారములు అనేది ఏది కలదో, ఇదమ్ = ఇది, అనుచితమ్ = అనుచితము, అక్రమః చ = క్రమవిరుద్ధము. నితమ్బినీనాంచ = స్త్రీలకు కూడ, స్తనపతనావధి = స్తనాలు వాలిపోయేవరకే, జీవితమ్ = జీవితము గాని, రతమ్ = రతము కాని, యదపి న కృతమ్ = బ్రహ్మచేత చేయబడలేదు అనేది ఏది కలదో ఇది కూడ అనుచితం అక్రమం కూడ.

అత్రేతి :- ఇక్కడ 'కృతమ్' అనేది అధికం. ఇది అధికం అవడమే కాదు. ప్రక్రమభంగం కూడా కలిగిస్తుంది. అందుచేత "యదపి చ న కురఙ్గలోచనానామ్" అనే పాఠంలో అర్థప్రతీతి ఆకాంక్ష లేకుండా కలుగుతుంది.

వి. పూర్వార్ధంలో 'కృత'శబ్దం లేకపోయినా, అనగా "జరాస్వపి మాన్మథా వికారాః కృతాః"అని అనకపోయినా ఏ ఆకాంక్షా లేకుండా అర్థప్రతీతి కలుగుతున్నది. అట్లే ఉత్తరార్ధంలో నిరాకాంక్షమైన అర్థప్రతీతి కలుగుతున్నప్పుడు 'కృతమ్'అనేది అధికం; అనావశ్యకం. అంతే కాకుండా 'కృత'శబ్దప్రయోగంవల్ల ప్రక్రమభంగదోషం కూడా కలుగుతుంది. పూర్వార్ధంలో పురుషధర్మం అనుచితం అని చెప్పినట్లుగా ఉత్తరార్ధంలో కూడా స్త్రీధర్మం అనుచితం అని చెపితే ఎలా ప్రారంభించాడో అలా పూర్తిచేయడం అవుతుంది. కాని స్త్రీలకు ఆ ధర్మాలు ఇవ్వనందుకు బ్రహ్మయందు అనుచితత్వదోషం చెప్పడంలో పూర్వార్ధంలో చెప్పిన పద్ధతి వేరు, ఉత్తరార్ధంలో చెప్పిన పద్ధతి వేరు అవడం చేత ప్రక్రమభంగదోషం వస్తుంది. అందుచేత న "యదపి చ న కురఙ్గలోచనానామ్" అని పాఠం ఉంచే బాగుంటుంది పురుషులకు వార్ధకంలో కూడ మన్మథవికారాలు అనుచితమైనవి; స్త్రీలకు జీవితం కాని రతం కాని స్తనపతనావధి కాకపోవడం అనుచితం అని ఏలా ప్రారంభించబడిందో అలాగే ముగించడంవల్ల ప్రక్రమభంగదోషం ఉండదు.

అవ. కథితపదవాక్యాన్ని ఉదాహరిస్తున్నాడు-

వృ. (8). కథితపదం యథా-

శ్లో॥ అధికరతలతల్పం కల్పితస్వాపలీలా
పరిమిలననిమీలత్పాణ్డిమాగణ్డపాలీ,

సుతను కథయ కస్య వ్యఞ్జయత్యఞ్జసైవ
స్మరనరపతిలీలాయౌవరాజ్యాభిషేకమ్. 223

వృ. అత్రలీలేతి.

వ్యా. ఒకే అర్థం, ఒకే ఆనుపూర్వి (అక్షరక్రమం) ఉన్న పదాన్ని ఒక వాక్యంలో రెండు పర్యాయాలు ప్రయోగించడం కథితపదత్వదోషం. "కథితం పదం యస్మిన్ వాక్యే తత్ కథితపదమ్"అని విగ్రహవాక్యం. అట్టి కథితపద వాక్యం ఎట్లనగా-

అధికరతలమితి :- అరచేతిలో చెక్కిలి ఉంచుకొని ఏమేమో ఆలోచిస్తూన్న నాయికతో చెలికత్తె అంటూన్న మాటలు. సుతను = ఓ ! సుందరాంగీ ! అధికరతలతల్పమ్=అరచేయి అనే తల్పంమీద, "కల్పిత.... పాణ్డిమా"-కల్పిత= కల్పించబడిన, స్వాపలీలా = నిద్రించుట అనే లీలయందు, పరిమిలన = దగ్గరగా కలవడంచేత, మీలత్ = తొలగుచున్న, పాణ్డిమా = ఎరుపుగల, గణ్డపాలీ=గండస్థలం, గండస్థలం విరహంచేత తెల్లగా ఉన్నా ఇప్పుడు అరచేతి ఒత్తిడికి ఆ తెలుపు పోయి ఎరుపు వచ్చింది అని భావం, కస్య = ఎవనికి, అఞ్జసైవ = శీఘ్రంగా, స్మరనరపతిలీలాయౌవరాజ్యాభిషేకమ్ = మన్మథమహారాజు లీలలయందు (చుంబనాదులయందు) యువరాజత్వాన్ని, వ్యఞ్జయతి = సూచించుచున్నది ? కథయ = చెప్పుము.

అత్రేతి :- ఇక్కడ 'లీలా'శబ్దం (మొదటిపాదంలోను నాల్గవపాదంలోను) రెండు సార్లు ప్రయోగించబడింది. అందుచేత కథితపదత్వదోషం.

అవ. పతత్ప్రకర్షాన్ని ఉదాహరిస్తున్నాడు-

వృ. (9) పతత్ప్రకర్షం యథా-

శ్లో॥ కః కః కుత్ర న ఘుర్ఘురాయితఘురీ ఘోరో ఘురేత్సూకరః
కః కః కం కమలాకరం వికమలం కర్తుం కరీ నోద్యతః,
కే కే కాని వనాన్యరణ్యమహిషా నోన్మూలయేయుర్యతః
సింహీస్నేహవిలాసబద్ధవసతిః పఞ్చాననో వర్తతే. 224

వ్యా. పతదితి :- "పతన్ ప్రకర్షః యత్ర తత్ పతత్ప్రకర్షమ్" అలంకారాలవలన గాని, బంధంవలన గాని ఏర్పడిన ప్రకర్ష ఎక్కడ పడిపోతుందో, క్రమంగా తగ్గిపోతుందో, అది పతత్ప్రకర్షం. దానికి ఉదాహరణం ఎట్లనగా-

కః ఇతి :- పఞ్చాననః = సింహం, యతః = ఎందువలన, సింహీస్నేహ విలాసబద్ధవసతిః = ఆడసింహముతో స్నేహవిలాసములచేత కట్టబడిన నివాసం కలదై, వర్తతే = ఉన్నాడో, అందువల్ల, అనగా సింహం ఆడసింహంతో కాలక్షేపం చేస్తూ దానితో కలిసి ఉండిపోవడంవల్ల, కః కః సూకరః = ఏ యే అడవి పంది, ఘుర్ఘురాయితఘుఠీఘోరః = 'ఘుర్' 'ఘుర్'అని ధ్వనిచేస్తూన్న ముట్టెతో భయంకరమైనదై, కుత్ర = ఎక్కడ, న ఘురేత్ = భయంకరశబ్దం చెయ్యదు ? కః కః కరీ = ఏ యే ఏనుగ, కమ్ = ఏ, కమలాకరమ్ = పద్మసరస్సును, వికమలమ్ = కమలాలు లేనిదానినిగా, కర్తుమ్ = చేయుటకు, నోద్యతః = ఉద్యమించదు ? కే కే అరణ్యమహిషాః = ఏ యే అడవిదున్నపోతులు, కాని = ఏ, వనాని = వనములను, నోన్మూలయేయుః = పెరికివేయవు ?

వి. ఇక్కడ- శత్రువినాశంకోసం ఉద్యమించే స్వభావం గల ఏనుగులు సూకరాల కంటె గొప్పవి. దేవి శత్రుకోటికి చెందినవి అవడంచేత, యముని వాహనమైన మహిషం జాతికి చెందినవి అవడంచేత వాటికంటె మహిషాలు ఉత్కృష్టమైనవి. ఏనుగులు మొదలైనవాటిని చంపకలగడంచేత సింహాలు అన్నింటి కంటె ఉత్కృష్టమైనవి. అందుచేత సూకరాలను నిర్దేశించినప్పుడు కంటె ఏనుగులను నిర్దేశించినప్పుడు, వాటిని నిర్దేశించినప్పుడు కంటె మహిషాలను నిర్దేశించినప్పుడు, వాటిని నిర్దేశించినప్పుడుకంటె సింహాన్ని నిర్దేశించినప్పుడు బంధదార్ఢ్యాదికం ప్రకృష్టంగా ఉండాలి. సూకరాలను వర్ణించినప్పుడు అనుప్రాసాదులచేత లభించిన బంధదార్ఢ్యం సింహాన్ని గూర్చి చెప్పినప్పుడు పూర్తిగా తగ్గిపోయింది. బంధం శిథిలం అయిపోయింది. చప్పపడిపోయింది. అందుచేత పతత్ప్రకర్షత్వదోషం.

అవ. సమాప్తపునరాత్తాన్ని ఉదాహరిస్తున్నాడు-

వృ. (10) సమాప్తపునరావృత్తం యథా-

శ్లో॥ క్రేంకారః స్మరకార్ముకస్య సురతక్రీడా పికీనాం రవః
ఝఙ్కారో రతిమఞ్జరీమధులిహాం లీలాచకోరీధ్వనిః,

తన్వ్యాః కఞ్చులికాపసారణభుజాక్షేపస్ఖలత్కఙ్కణ
క్వాణః ప్రేమ తనోతు వో నవవయోలాస్యాయ వేణుస్వనః.

వ్యా. సమాప్తేతి:- సమాప్తం చ తత్ పునరాత్తం చ సమాప్తపునరాత్తమ్; సమాప్తం అయిపోయిన తరవాత మళ్ళీ గ్రహించబడినది అని అర్థం. క్రియాకారకాదులు అన్వయించి ఒక వాక్యం పూర్తి అయిపోయిన తరవాత మళ్ళీ దానికి (ఆ వాక్యానికి) సంబంధించిన మరొక అంశం చెప్పడం సమాప్తపునరాత్తత్వం. దానికి ఉదాహరణం ఎట్లనగా-

క్రేంకారః ఇతి :- స్మరకార్ముకస్య = మన్మథుని ధనస్సుయొక్క, క్రేంకారః = క్రేంకారము. సురతక్రీడాపికీనామ్ = సురతం అనే క్రీడాశుకములయొక్క. రవః = ధ్వని, రతిమఞ్జరీమధులిహామ్ = రతి అనే పుష్పగుచ్ఛములయందలి తుమ్మెదలయొక్క. ఝఙ్కారః = ఝంకారమూ. లీలాచకోరీధ్వనిః = విలాసములనే ఆడ చకోరపక్షుల ధ్వనీ, నవవయోలాస్యాయ = నూతనవయస్సుయొక్క లాస్యం కొరకు, వేణుస్వనః = వేణునాదమూ అయిన, తన్వ్యాః = సుందరియొక్క, కఞ్చులికాపసారణభుజాక్షేపస్ఖలత్కఙ్కణక్వాణః = రవికెను తొలగించు సమయంలో భుజములను కదల్చుటచేత కదలుచున్న కంకణముల ధ్వని, వః = మీయొక్క, ప్రేమ = ప్రేమను. తనోతు = వృద్ధి పొందించుగాక.

వి ఇక్కడ "కంకణక్వాణం మీ ప్రేమను వృద్ధిపొందించుగాక" అనే అర్థం గల "కఙ్కణక్వాణః వః ప్రేమ తనోతు" అనేది ప్రధానవాక్యం. ఆ క్వాణం మీద స్మరకార్ముకక్రేంకారత్వాదులు నాలుగు ఆరోపించబడ్డాయి. ఆ రూపకాలతో సహా వాక్యం పూర్తి అయిపోయింది. పూర్తి అయిపోయినదాని మీద "నవవయోలాస్యాయ వేణుస్వనః" అనే మరొక రూపకంకోసం మళ్ళీ గ్రహించడం వల్ల సమాప్తపునరాత్తత్వదోషం.

అవ. అర్థాన్తరైకవాచకాన్ని నిరూపిస్తున్నాడు-

వృ. (11) ద్వితీయైకార్థగతైకవాచకశేషప్రథమార్థం యథా-

శ్లో॥ మసృణచరణపాతం గమ్యతాం భూః సదర్భా
విరచయ సిచయాన్తం మూర్ధ్ని ఘర్మః కఠోరః,

తదితి జనకపుత్రీ లోచనైరశ్రుపూర్ణైః
పథి పథికవధూభిర్వీక్షితా శిక్షితా చ. 226

వ్యా. ద్వితీయేతి :- ద్వితీయార్ధంలో ఉన్న ఒక పదం శేషంగా గల ప్రథమార్ధం గలది ఎట్లనగా.

వి. శ్లోకంలోని ప్రథమార్ధంలో అన్వయించవలసిన ఒక పదం ద్వితీయార్ధంలో ఉంటుంది. అది అర్ధాంతరైకవాచకం అని అర్థం. ఎట్లనగా-

వ్యా. మసృణేతి:- రాజశేఖరుడు రచించిన బాలరామాయణంలో రామునితో పాటు సీత కూడా వనవాసానికి వెళ్ళిన పిమ్మట ఆ విషయాన్ని దశరథునికి చెపుతూన్న సుమంత్రుని మాటలు. భూః = భూమి, సదర్భా = దర్భలతో కూడినది, తత్ = ఆ కారణంవల్ల, మసృణచరణపాతమ్ = మృదువైన పాదన్యాసం కలుగునట్లుగా, గమ్యతామ్ = నడువుము. ఘర్మః = వేడి, కఠోరః = అధికంగా ఉన్నది. అందువలన, సిచయాన్తమ్ = వస్త్రాంతమును, మూర్ధ్ని = శిరస్సుపై, విరచయ = రచించుము, కప్పికొనుము, ఇతి = అని, జనకపుత్రీ = సీత, పథికవధూభిః = మార్గంలో నడచి వెడుతూన్న స్త్రీలచేత, పథి = మార్గమునందు, అశ్రుపూర్ణైః = కన్నీళ్ళతో నిండిన, లోచనైః = నేత్రాలతో, వీక్షితా = చూడబడింది; శిక్షితా చ = బోధించబడింది కూడ.

ఇక్కడ "భూః సదర్భా; (తత్) మసృణచరణపాతం గమ్యతామ్" అనే పూర్వార్ధంలోని వాక్యం ఉత్తరార్ధంలోని 'తత్' (ఆకారణంవలన) అనే పదంచేత పూరించబడుతుంది అనగా ఆ వాక్యం పూర్తి అవడానికి కావలసిన 'తత్' అనే పదం ద్వితీయార్ధంలో ఉంది. అందుచేత అర్ధాంతరైకవాచకత్వదోషం.

అవ. అభవన్మతయోగాన్ని విశదీకరిస్తున్నాడు-

వృ. (12) అభవన్ మతః (ఇష్టః) యోగః (సంబన్ధః) యత్ర తత్ యథా-

శ్లో॥ యేషాం తాస్త్రిదశేభదానసరితః పీతాః ప్రతాపోష్మభి
ర్లీలాపానభువశ్చ నన్దనవనచ్ఛాయాసు యైః కల్పితాః,

యేషాం హుంకృతయః కృతామరపతిక్షోభాః క్షపాచారిణాం
కిం తైస్త్వత్పరితోషకారివిహితం కించిత్ప్రవాదోచితమ్.

వృ. అత్ర "గుణానాం చ పరార్థత్వాదసంబన్ధః సమత్వాత్ స్యాత్" ఇత్యుక్తనయేన యచ్ఛబ్దనిర్దేశ్యానామర్థానాం పరస్పరసమన్వయేన యైరిత్యత్ర విశేష్యస్య అప్రతీతిరితి. 'క్షపాచారిభిః' ఇతి పాఠే యుజ్యతే సమన్వయః.

వ్యా. అభవన్నితి :- ఏ వాక్యంలో ఇష్టమైన (ఉండాలని అనుకొన్న) సంబంధం (పదార్థాలకు) ఉండదో అది 'అభవన్మతయోగం'.

వి. ఇది (అభవన్మతయోగత్వం) కొన్ని చోట్ల (1) విభక్తిభేదనిబంధనం అనగా విభక్తుల భేదాన్ని పట్టి ఏర్పడినది కావచ్చు. కొన్నిచోట్ల (2) న్యూనత్వాది నిబంధనం కావచ్చును. కొన్నిచోట్ల (3) ఆకాంక్షాభావనిబంధనం కావచ్చును. కొన్ని చోట్ల (4) వాచ్యవ్యంగ్యార్థాలకు వివక్షితసంబంధం లేకపోవడంవల్ల ఏర్పడింది కావచ్చును. కొన్నిచోట్ల (5) సమాసంచేత కప్పబడిపోవడంవల్ల ఇష్టమైన సంబంధం కుదరకపోవడంమూలాన కావచ్చును. కొన్నిచోట్ల (6) వ్యుత్పత్తివిరోధనిబంధనం కావచ్చును. వాటిలో విభక్తిభేదనిబంధనమైన అభవన్మతయోగత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

యేషామితి :- హనుమంతుడు లంకాదహనం చేసివేసిన పిమ్మట వీరులైన రాక్షసుల్ని ఆక్షేపిస్తూ ఒకడు రావణునితో అంటూన్న మాటలివి. యేషామ్ = ఏ, క్షపాచారిణామ్ = రాక్షసులయొక్క, ప్రతాపోష్మభిః = ప్రతాపముల వేడుల (వేడి)చేత, త్రిదశేభదానసరితః=దేవతల ఏనుగైన ఐరావతముయొక్క మదోదక నదులు, పీతాః = తాగబడినవో, యైః = ఏ రాక్షసులచేత, నన్దనవనచ్ఛాయాసు= నందనవనముల నీడలలో, లీలాపానభువః = విలాసార్థమైన మద్యపానభూములు, కల్పితాః = ఏర్పరచబడినవో. యేషామ్ = ఏ రాక్షసులయొక్క, హుంకృతయః =హుంకారాలు, కృతామరపతిక్షోభాః = చేయబడిన ఇంద్రుని క్షోభ గలవో, ఇంద్రుణ్ణి క్షోభింపచేసినవో, తైః = వాళ్ళచేత, ప్రవాదోచితమ్ = సభలో మాట లాడినదానికి తగినట్లుగా, కించిత్=ఏదైనా, త్వత్పరితోషకారి = నీకు సంతోషం కలిగించేది, కిం విహితమ్ = చేయబడిందా?

అత్రేతి:- ఇక్కడ "గుణానాం చ పరార్థత్వాదసంబన్ధః సమత్వాత్ స్యాత్" అనే న్యాయాన్ని అనుసరించి యచ్ఛబ్దనిర్దేశ్యాలైన అర్థాలకు పరస్పరం సమన్వయం ఉండదు గాన 'యైః' అనే పదంచేత విశేష్యప్రతీతి కలగదు. 'క్షపాచారిభిః' అనే పాఠంలో సమన్వయం కుదురుతుంది.

వి. "గుణానాం చ పరార్థత్వాదసమ్బన్ధః సమత్వాత్ స్యాత్" అని జైమిని సూత్రం. తృతీయాధ్యాయప్రథమ పాదంలోనిది. అప్రధానాలైన అనేక విషయాలు చెప్పినప్పుడు వాటికి అన్నింటికీ ప్రధానమైనదానితోనే సంబంధం ఉంటుంది కాని పరస్పరసంబంధం ఉండదు. ఉదాహరణకి— "అనాహతం, నవం, శుక్లం వస్త్రమ్" (నలగని, క్రొత్తదైన, తెల్లని వస్త్రం) అన్నప్పుడు 'అనాహతమ్' 'నవమ్' 'శుక్లమ్' అనేవి విశేషణాలు. 'వస్త్రమ్' విశేష్యం. విశేషణాలు గుణాలు అనగా అప్రధానాలు; విశేష్యం ప్రధానం. అప్రధానాలైన విశేషణా లన్నీ ప్రధానమైన విశేష్యంతోనే అన్వయిస్తాయి కాని తాము ఒకదానితో ఒకటి (పరస్పరమూ) అన్వయించవు. 'అనాహతమ్' అనేది 'నవమ్'తో కాని 'శుక్లమ్'తో కాని అన్వయించదు. అట్లే ఆ రెండూ కూడా. దీనికి కారణం ఏమిటనగా గుణాలు (అప్రధానాలు) ప్రధానమైన దానికి ఉపకరించడంకోసమే ఉద్దిష్టములు అయి (ఉద్దేశించబడి) ఉంటాయి కాని అప్రధానాలకు ఉపకరించడానికి ఉద్దిష్టాలు కావు. గుణానామ్ = అప్రధానమైనవి, పరార్థత్వాత్ = ప్రధానమైన మరొకదానితో సంబంధించడంకోసం ఉద్దేశించబడడం వల్ల, సమత్వాత్ = అవన్నీ సమానములు అవడంవల్ల, అనగా అప్రధానాలే అవడం వల్ల, అసంబన్ధః = వాటిలో ఒకదానితో మరొకదానికి సంబంధం లేకపోవడం, స్యాత్ = ఉండవలెను, అవి పరస్పరం సంబంధించకూడదు, ప్రధానంతోనే సంబంధించాలి" అని సూత్రానికి అర్థం.

ప్రస్తుతంలో 'యైః'అనేదానికి క్షపాచారులతో విశేషణవిశేష్యభావసంబంధం వివక్షితమైనది. అనగా 'ఏ రాక్షసులచేత ఇట్లు చేయబడిందో ఆ రాక్షసులచేత నీకు సంతోషం కలిగించే పని ఏదైనా చేయబడిందా" అన్నప్పుడు ప్రధాన వాక్యార్థం "తైః కిం విహితమ్" అనేది. ఇక్కడ 'తైః' అనగా ఆ రాక్షసులచేత అని అర్థం. 'యైః' అనేది 'క్షపాచారిభిః' అనేదానితో విశేషణంగా సంబంధించి ఉన్న పక్షంలో 'తైః' అనేదానిచేత ఆ రాక్షసులను నిర్దేశించడం కుదురుతుంది. కాని 'యైః' అనే దానితో సంబంధించడానికి తగిన 'క్షపాచారిభిః' అనే తృతీయాంతవిశేష్యం లేదు. 'క్షపాచారిణామ్' అని షష్ఠ్యంతవిశేష్యమే ఉంది. వేరు వేరు విభక్తులలో

ఉన్న 'యైః' 'క్షపాచారిణామ్' అనేవాటికి విశేషణవిశేష్యభావంతో సంబంధం కుదరదు.

అయితే "యేషాం క్షపాచారిణాం సరితః పీతాః" "యేషాం హుంకృతయః కృతామరపతిక్షోభాః" అనే అవాంతరవాక్యాలలో యచ్ఛబ్దక్షపాచారిశబ్దాలు షష్ఠీవిభక్తులలోనే ఉండి పరస్పరాన్వయంతో ఉన్నాయి కదా; ఈ 'యైః' అనే దానికి వాటితో సంబంధం ఉండడంచేత తద్ద్వారా క్షపాచారిశబ్దంతో కూడా అన్వయం కుదురుతుంది కదా అని శంక కలగవచ్చు. అది కుదరదు. పైన చెప్పిన జైమినిసూత్రం ప్రకారం అప్రధానమైనవాటికి పరస్పరసంబంధం ఉండదు కదా? అందుచేత తృతీయాంతమైన క్షపాచారిశబ్దం ఉంటేనే దానితో 'యైః' అనే తృతీయాంతానికి సంబంధం కుదురుతుంది. అప్పుడు ఆ అర్థాన్ని 'తైః' అనే తృతీయాంతంచేత నిర్దేశించడం సాధ్యం అవుతుంది. ఈ విధంగా ఈ శ్లోకంలో విభక్తిభేదనిబంధనమైన అభవన్మతయోగత్వం అనే దోషం ఉంది. ఇది లేకుండా ఉండాలంటే 'క్షపాచారిణామ్'కు బదులు 'క్షపాచారిభిః' అనే పాఠం కల్పించుకోవాలి.

అవ. న్యూనతాదినిబంధనమైన అభవవన్మతయోగానికి ఉదాహరణం చూపుతున్నాడు.

వృ. యథా వా-

శ్లో॥ త్వమేవంసౌన్దర్యా స చ రుచిరతాయాః పరిచితః
కలానాం సీమానం పరమిహ యువామేవ భజథః,
అపి ద్వన్ద్వం దిష్ట్యా తదితి సుభగే సంవదతి వామ్
అతః శేషం యత్స్యాజ్జితమిహ తదానీం గుణితయా. 228

వృ. అత్ర యదిత్యత్ర తదితి, తదానీమిత్యత్ర యదేతి వచనం నాస్తి. 'చేత్స్యాత్' ఇతి యుక్తః పాఠః.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

త్వమితి :- నాయికతో దూతి మాటలివి. సుభగే = సౌభాగ్యవంతురాలా!

త్వమ్ = నీవు, ఏవంసౌన్దర్యా = ఇట్టి సౌందర్యం కలదానవు, సః చ = అతడు కూడా, రుచిరతాయాః = సుందరత్వానికి, పరిచితః = పరిచితుడు, సుందరుడు. ఇహ = ఈ లోకంలో, యువామేవ = మీరిద్దరే, కలానామ్ = చతుష్షష్టికళల యొక్క, పరమ్ = అత్యధికమైన, అత్యున్నతమైన, సీమానమ్ = చివరి సరిహద్దును, పరోత్కర్షను, భజతః = పొందుచున్నారు. వామ్ = మీఇద్దరియొక్క, తత్ = ఆ, ద్వన్ద్వమ్ = ద్వంద్వం, దిష్ట్యా = బాగ్యంచేత, ఇతి = ఇట్లు, పైన చెప్పిన విధంగా, సంవదతి = యోగ్యం అవుతున్నది. అతః = అందువలన, శేషమ్ = మిగిలిన, యత్ = ఏది ఉన్నదో, మీ సమాగమం అనే మిగిలిన విషయం ఏదున్నదో అది, స్యాత్ = అయితే, తదానీమ్ = అప్పుడు, గుణితయా = మంచి గుణాలు కలిగి ఉండడంచేత, మంచిగుణాలచేత, జితమ్ = జయం పొందబడింది.

అత్రేతి :- ఇక్కడ 'యత్' అన్నచోట 'తత్' అనేది 'తదానీమ్' అని అన్నచోట 'యదా' అనేది లేవు. 'చేత్ స్యాత్' అనే పాఠం యుక్తం.

"శేషం యత్ తత్ యదా స్యాత్ తదానీం" (మిగిలినది ఏది ఉన్నదో అది ఎప్పుడు ఆగునో అప్పుడు" అనే అర్థం రావాలి. అందుకు కావలసిన 'తత్' అనేది 'యత్' అనేదాని దగ్గర 'యదా' అనేది 'తదానీమ్' అనేదాని దగ్గరా లేవు. అందుచేత ఇక్కడ పదన్యూనతాకృతమైన (పదాలు తక్కువపడడంవల్ల ఏర్పడిన) అభవన్మతయోగత్వదోషం. "అతః శేషం చేత్స్యాత్" అనే పాఠం అంటే ఈ దోషం ఉండదు.

అవ. ఆకాఙ్క్షావిరహనిబంధనమైన అభవన్మతయోగత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు.

వృ. యథా వా-

శ్లో॥ సంగ్రామాఙ్గణమాగతేన భవతా చాపే సమారోపితే
దేవాకర్ణయ యేన యేన సహసా యద్యత్సమాసాదితమ్,
కోదణ్డేన శరాః శరై రరిశిరస్తేనాపి భూమణ్డలం
తేన త్వం భవతా చ కీర్తిరతులా కీర్త్యా చ లోకత్రయమ్.

వృ అత్రాకర్ణనక్రియాకర్మత్వే కోదణ్డం శరానిత్యాది, వాక్యార్థస్య

కర్మత్వే కోదణ్డః శరాః ఇతి ప్రాప్తమ్. న చ యచ్ఛబ్దార్థస్తద్విశేషణం వా కోదణ్డాది. న చ కేన కేనేత్యాది ప్రశ్నః.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా.

సంగ్రామేతి :- దేవ = రాజా! సంగ్రామాజ్గణమ్ = యుద్ధరంగమును, ఆగతేన = పొందిన, భవతా = నీచేత, చాపే = ధనస్సు, సమారోపితే = ఎక్కు-పెట్టబడినదగుచుండగా, సహసా = వెంటనే, యేన యేన = దేనిచేత దేనిచేత, యత్ యత్ = ఏదేది, సమాసాదితమ్ = పొందబడినదో, ఆకర్ణయ = వినుము. కోదణ్డేవ = ధనస్సుచేత, శరాః = బాణాలు (పొందబడినవి), శరైః = బాణాల చేత, అరిశిరః = శత్రువు శిరస్సు, తేనాపి = ఆ శత్రు శిరస్సుచేత కూడ, భూమణ్డలమ్ = భూమండలమూ, తేన = దానిచేత, త్వమ్ = నువ్వు, భవతా = నీ చేత, అతులా = సాటి లేని, కీర్తిః = కీర్తి, కీర్త్యా = కీర్తి చేత, లోకత్రయమ్ = లోకముల త్రయమూ (పొందబడినవి).

అత్రేతి :- ఇక్కడ కోదండాదులకు ఆకర్ణనక్రియలో కర్మత్వం అంగీకరించినట్లయితే 'కోదణ్డమ్' 'శరాన్' ఇత్యాదికీతితో ద్వితీయావిభక్తిలో ఉండాలి. వాక్యార్థం కర్మ అయితే 'కోదణ్డః' 'శరాః' ఇత్యాదిరీతిలో ప్రథమావిభక్తిలో ఉండాలి. కోదండాదికం యచ్ఛబ్దార్థమూ కాదు. దానికి విశేషణమూ కాదు కదా? దేనిచేత? ఇత్యాదివిధంగా ప్రశ్న కూడా లేదు కదా?

వి. ఇక్కడ ఉత్తరార్ధానికి పూర్వార్ధంతో సంబంధం వివక్షితం (ఉన్నట్లు చెప్పడానికి ఉద్దేశించబడింది) కాని అది కుదరదు. "దేనిచేత ఏది పొందబడిందో దానిని వినుము" అనడంచేత 'ఆ పొందినదానినీ, పొందబడ్డదానినీ వినుము' అని అర్థం. అనగా పొందినవీ పొందబడ్డవీ శ్రవణక్రియలో కర్మలు అని కదా అర్థం. అప్పుడు వాటికి 'కర్మణి ద్వితీయా' (పా.సూ. 2.3.2) అను నియమం ప్రకారం ద్వితీయావిభక్తి వచ్చి 'కోదణ్డమ్', 'శరాన్' ఇత్యాదివిధంగా ప్రయోగించాలి.

శ్రవణక్రియలో కోదండాదులు కర్మ కాదు; పరస్పరం అన్వయించని (సంబంధంలేని) కోదండాదులు అన్నీ ఒకే మాటు వాక్యార్థరూపంలో శ్రవణానికి కర్మ అని చెవుతాం. అప్పుదు ద్వితీయ రావలసిన పని లేదు. ద్వితీయ ప్రాతిపదికకే కావి వాక్యానికి రాదు కదా. అందుచేత కోదండాదిశబ్దాలు తృతీయాది

విభక్తులలో ఉండడానికి అభ్యంతరం ఏమీ ఉండదు కదా అని ఆశంకించవచ్చు. ఇది కూడా కుదరదు-

"యో యో వీరః సమాయాతస్తం తం శృణు మహీపతే,
భీష్మో ద్రోణః కృపః కర్ణః సౌమదత్తిర్ధనంజయః"

(రాజా! ఏ యే వీరుడు వచ్చాడో ఆతనిని గూర్చి వినుము. భీష్ముడు ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, భూరిశ్రవస్సు, అర్జునుడు) అనే శ్లోకంలో పరస్పరాన్వితాలైన భీష్మః ఇత్యాదిశబ్దాలను ప్రథమావిభక్తిలో ఉపయోగించినట్లు ఇక్కడ కూడా పరస్పరానన్వితాలైన కోదండాదిశబ్దాలను "ప్రాతిపదికార్థంలో ప్రథమ ప్రయోగించాలి" అనే నియమం ప్రకారం ("ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనమాత్రే ప్రథమా" (పా. సూ. 2-3-46) 'కోదణ్డః' 'శరాః' ఇత్యాదిరీతిలో ప్రథమావిభక్తిలో ప్రయోగించవలసి ఉంటుంది.

మరొక ఆశంక కలగవచ్చును. బుద్ధిలో ఉన్నదానినే యచ్ఛబ్దం బోధిస్తుంది గాన ఇక్కడ 'యేన' 'యేన' 'యత్' 'యత్' అనే శబ్దాలకి కోదండం, బాణాలు మొదలైనవి అర్థం. అందుచేత తృతీయవిభక్త్యంతయచ్ఛబ్దాన్ని పట్టి 'కోదణ్డేన' ఇత్యాదితృతీయావిభక్తులు ప్రథమాంతయచ్ఛబ్దాన్ని పట్టి 'శరాః' ఇత్యాది ప్రథమావిభక్తులు ప్రయోగించబడినవి అని చెప్పవచ్చును కదా? ఇది కూడా యుక్తం కాదు. యచ్ఛబ్దాలకే కోదండాదులు అర్థం అయిన పక్షంలో మళ్ళీ కోదండాదిశబ్దాల ప్రయోగం ఎందుకు? అలా ప్రయోగించడం "ఘటో ఘటః" అనే ప్రయోగం వంటిది అవుతుంది కదా?

కోదండాదికం యచ్ఛబ్దార్థం అని అనకుండగా కోదండాదికాలు యచ్ఛబ్దార్థాలైన కర్తకు, కర్మలకు విశేష్యాలు కాని విశేషణాలు కాని అని అంటాం. అప్పుడు విశేష్యానుసారంగా లేదా విశేషణానుసారంగా వీటి విభక్తులు ప్రయోగింపబడ్డాయి అని చెప్పవచ్చును కదా అనే ఆశంక కూడా యుక్తం కాదు. కోదండాదులు విశేష్యాలు అనే పక్షంలో "యేన కోదణ్డేన యత్ శరాః సమాసాదితం తత్ ఆకర్ణయ" అని వాక్యార్థం అవుతుంది. అప్పుడు "కేన కోదణ్డేన కే శరాః" (ఏ ధనస్సుచేత ఏ బాణాలు?) అనే ఆశంక నివర్తించదు. అది అలాగే ఉండిపోతుంది. కోదండాలు విశేషణాలు అని చెప్పిన పక్షంలో కూడా "కోదణ్డేన యేన

శరాః యత్ సమాసాదితమ్ తత్ ఆకర్ణయ" అని వాక్యార్థం అవుతుంది. అప్పుడు కూడా పైన చెప్పిన ఆకాంక్షానువృత్తిరూపదోషమే. అందుచేత యచ్ఛబ్దార్థకోదండాదులకు విశేషణవిశేష్యభావాన్ని అంగీకరించినా కూడా అర్థం కుదరదు.

(మరొక ఆశంక) 'యేన' 'యత్' అనే పదాలచేత సామాన్యరూపంలోనే "ఒకానొకదానిచేత ఒకటి పొందబడినది" అని తెలుస్తుంది. "కేన కేన కిమ్ కిమ్" (దేనిచేత ఏది?) అనే విశేషాన్ని గూర్చిన ప్రశ్నకు సమాధానంగా "కోదణ్డేన శరాః" ఇత్యాదులు చెప్పబడ్డాయి అని చెప్పవచ్చును కదా అని ఆశంక. ఇది కూడా యుక్తం కాదు. ఇక్కడ అలాంటి ప్రశ్నవాచకపదాలేవీ లేవు కదా?

ఈ విధంగా ఇక్కడ ఎలా చూచినా ప్రథమార్ధార్థ ద్వితీయార్ధార్థాలకు మతమైన (అనుకొన్న)అన్వయం కుదరడంలేదు. అందుచేత అభవన్మతయోగత్వ దోషం అనివార్యం అని భావం.

అవ. వ్యంగ్యానికి వివక్షితయోగం లేనప్పుడు ఏర్పడే అభవన్మతయోగత్వ దోషానికి ఉదాహరణం చూపుతున్నారు.

వృ. యథా వా-

"చాపాచార్యస్త్రిపురవిజయీ...." (230)-

ఇత్యాదౌ భార్గవస్య నిన్దాయాం తాత్పర్యమ్. కృతవతేతి పరశౌ సా ప్రతీయతే. 'కృతవతః' ఇతి పాఠే మతయోగో భవతి.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

చాపాచార్యః ఇత్యాది:- ఈ శ్లోకం ఈ ఉల్లాసంలోనే 201వ శ్లోకంగా వచ్చినది. వ్యాఖ్యానం అక్కడ చూచుకొనవలెను. "చాపాచార్యః" ఇత్యాదిశ్లోకంలో రావణునికి పరశురాముణ్ణి నిందించడంలోనే తాత్పర్యం కాని పరశువును నిందించడంలో కాదు. పరశువు నింద్యమైన పక్షంలో పరశురాముడు పరశువు కాక మరొక ఆయుధంతో వచ్చి యుద్ధం చేస్తే రావణునికి అతనితో యుద్ధం చేయడం ఇష్టమే అన్నట్టు అవుతుంది. కాని ఇక్కడ 'కృతవతా' అని పరశువుకు విశేషణంగా ప్రయోగించడంచేత ఇలా చేసిన పరశువు నింద్యం అని వ్యంగ్యం అవుతున్నది. అందుచేత 'కృతవతా'కు బదులు 'కృతవతః' అని పాఠం మార్చిన పక్షంలో

'కృతవతః తవ' అని ఇది 'తవ'కు విశేషణం అవడంచేత "ఇలాంటి పనులు చేసిన నీ పరశువుతో" అని అర్థం వస్తుంది. చేసినవాడు నింద్యుడు గాన నింద పరశు రామునికి చెందుతుంది.

అవ. సమాసంచేత కప్పబడడంచేత ఏర్పడిన అభవన్మతయోగత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు—

వృ. యథా వా-

శ్లో॥ చత్వారో వయమృత్విజః స భగవాన్ కర్మోపదేష్టా హరిః
సంగ్రామాధ్వరదీక్షితో నరపతిః పత్నీ గృహీతవ్రతా,
కౌరవ్యాః పశవః ప్రియాపరిభవక్లేశోపశాన్తిః ఫలం
రాజన్యోపనిమన్త్రణాయ రసతి స్ఫీతం హతో దున్దుభిః.

వృ. అత్ర అధ్వరశబ్దః సమాసే గుణీభూత ఇతి న తదర్థః సర్వైర్యుజ్యతే.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

చత్వారః ఇతి:- వేణీసంహారంలో రణదుందుభిధ్వని విని భీమసేనుడు ద్రౌపదితో అంటూన్న మాటలు. వయమ్ = మేము, చత్వారః = నలుగురము, ఋత్విజః = ఋత్విక్కులము, సః = ఆ, భగవాన్ = భగవంతుడైన, హరిః = శ్రీకృష్ణుడు, కర్మోపదేష్టా = కర్మలను ఉపదేశించేవాడు. నరపతిః = రాజు, సంగ్రామాధ్వరదీక్షితః = యుద్ధం అనే యజ్ఞంలో దీక్ష తీసికొన్నవాడు. పత్నీ = భార్యవైన నీవు, గృహీతవ్రతా = గ్రహించబడిన వ్రతం కలదానవు. కౌరవ్యాః = కౌరవులు, పశవః = యజ్ఞపశువులు. ప్రియాపరిభవక్లేశోపశాన్తిః = ప్రియురాలి పరాభవక్లేశంయొక్క శాంతి, ఫలమ్ = ఫలము. రాజన్యోపనిమన్త్రణాయ = క్షత్రియుల ఆహ్వానంకొరకు, హతః = మ్రోగించబడిన, దున్దుభిః = దుందుభి, స్ఫీతమ్ = అధికంగా, రసతి = ధ్వనిచేస్తూన్నది.

అత్రేతి:- ఇక్కడ అధ్వరశబ్దం సమాసంలో గుణీభావం చెందినది (అప్రాధాన్యం పొందింది). అందుచేత దాని అర్థం అన్నింటితోను అన్వయించడంలేదు.

వి. "యుద్ధమే ఒక మహాయజ్ఞం ఆ యజ్ఞంలో దీక్షితుడు రాజు. దానిలో మేము నలుగురు సోదరులం ఋత్విక్కులం" ఇత్యాదివిధంగా యజ్ఞం ఋత్విక్కులు మొదలైనవాళ్ళందరితోను అన్వయించాలి: కాని 'అధ్వర' శబ్దాన్ని 'సంగ్రామాధ్వర దీక్షితః' అనే సమాసంలో చేర్చడంచేత అది అప్రధానమై పోయింది దాని అర్థం ఒక్క 'దీక్షితః' అనేదానితో మాత్రమే అన్వయిస్తూన్నది గాని 'ఋత్విజః' 'కర్మోపదేష్టా' ఇత్యాదులతో అన్వయించడంలేదు. అందుచేత కావాలనుకున్న అన్వయం కుదరడంలేదు గాన అభవన్మతయోగత్వదోషం.

అవ. వ్యుత్పత్తివిరోధనిబంధనమైన అభవన్మతయోగత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. యథా వా-

శ్లో॥ జఙ్ఘాకాణ్డోరునాలో నఖకిరణలసత్కేసరాలీకరాలః
ప్రత్యగ్రాలక్తకాభాప్రసరకిసలయో మఞ్జుమఞ్జీరభృఙ్గః,
భర్తుర్నృత్తానుకారే జయతి నిజతనుస్వచ్ఛలావణ్యవాపీ
సంభూతామ్భోజశోభాం విదధదభినవో దణ్డపాదో భవాన్యాః.

వి. అత్ర దణ్డపాదగతా నిజతనుః ప్రతీయతే; భవాన్యా సంబన్ధినీతి తు వివక్షితా.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా:-

జఙ్ఘా ఇతి:- ఈ శ్లోకం 150వ శ్లోకంగా వెనక వచ్చినది. వ్యాఖ్యానం అక్కడ చూచుకొనవలెను

అత్రేతి:- ఇక్కడ దండపాదానికి సంబంధించి నిజతనువు అని అర్థం వస్తూన్నది. కాని పార్వతికి సంబంధించినది వివక్షితం.

"ససమ్బన్ధినాం నిజస్వాత్మాదిపదార్థానాం ప్రధానక్రియాన్వయికారకపదార్థ ఏవాన్వయః" అనే వ్యుత్పత్తి (నియమం) ఉన్నది. సంబంధాన్ని బోధించే 'నిజ' 'స్వ' 'ఆత్మన్' మొదలైన పదాలు ప్రధానక్రియతో అన్వయించే కారకపదార్థంతో మాత్రమే అన్వయిస్తాయి" అని దీని అర్థం. "తన శరీరంయొక్క స్వచ్ఛమైన....

శోభ ధరిస్తూన్న పార్వతియొక్క దండపాదం సర్వోత్కర్షగా ఉన్నది"అనే అర్థం గల "నిజతనుస్వచ్ఛ....శోభాం విదధత్ భవాన్యాః దణ్డపాదః జయతి" అనే వాక్యంలో ప్రధానక్రియ అయిన 'జయతి'తో అన్వయిస్తూన్న కారకం 'దణ్డపాదః' అనేది. అందుచేత 'నిజ' (తన) అనేది దండపాదంతోనే అన్వయిస్తుంది కాని భవానితో అన్వయించదు. 'తన దేహంయొక్క' అనగా 'దండపాదం దేహంయొక్క' అని అర్థం. కాని 'నిజ' అనేది 'భవాన్యాః'తో అన్వయించి "తన"అనగా "పార్వతి యొక్క శరీరం"అనే అర్థం రావా లని కవి అభిప్రాయం. అది లభించదం లేదు గాన అభవన్మతయోగత్వం.

అవ. అనభిహితవాచ్యాన్ని వివరిస్తున్నాడు-

వృ. (13) అవశ్యవక్తవ్యమనుక్తం యత్ర యథా-

శ్లో॥ అప్రాకృతస్య చరితాతిశయైశ్చ దృష్టై
రత్యద్భుతైరపహృతస్య తథాపి నాస్థా,
కోఽప్యేష వీరశిశుకాకృతిరప్రమేయ
సౌన్దర్యసారసముదాయమయః పదార్థః. 233

వృ. అత్ర "అపహృతోఽస్మి" ఇత్యపహృతత్వస్య విధిర్వాచ్యః. తథాపీత్యస్య ద్వితీయవాక్యగతత్వేనైవోపపత్తేః.

వ్యా. అవశ్యేతి:- తప్పకుండా చెప్పలసినది (పదం మొదలైనది) ఎక్కడ చెప్పబడదో అది అనభిహితవాచ్యం. ఎట్లనగా—

అప్రాకృతస్యేతి:- మహావీరచరితంలో శ్రీరాముడు శివధనుర్భంగం చేసి నప్పుడు పరశురాముడు తనలో అనుకుంటూన్న మాటలు. అప్రాకృతస్య = అసామాన్యుడైన ఇతనియొక్క, దృష్టైః = చూడబడిన, అత్యద్భుతైః = చాల ఆశ్చర్య కరములైన, చరితాతిశయైః = చరిత్రయొక్క ఉత్కర్షలచేత, అపహృతస్య = అపహరించబడిన, ఆకర్షించబడిన మనస్సు గల నాకు, తథాపి = అట్లైనను, ఆస్థా = ఆదరం, అనగా ఈదశరథపుత్రుడే ధనుర్భంగం చేసినా డనే నిశ్చయం, న = లేదు. ఏషః = ఇతడు, కోఽపి = ఒకానొక, వర్ణింప శక్యం కాని, వీరశిశుకాకృతిః

= వీరశిశువుయొక్క ఆకారం గల, అప్రమేయ సౌన్దర్యసారసముదాయమయః= ఇంత అని ఊహించ శక్యం కాని సౌందర్యంయొక్క, బలంయొక్క సముదాయం రూపమైన, సౌందర్యసారసముదాయప్రచురమైన, పదార్థః = పదార్థము.

అత్రేతి:- ఇక్కడ 'అవహృతః అస్మి' (అపహరించబడినాను) అని అప హృతత్వాన్ని విధించి నట్లు చెప్పాలి. అప్పుడు రెండవ వాక్యంలో ఉన్న తథాపి అనేదానితో అన్వయం కుదురుతుంది.

వి. "అపహరింపబడిన నాకు, అట్లైనా ఆస్థ లేదు"అని చెప్పడం కంటె "నేను అపహరించబడ్డాను" అని ముందు చెప్పి, "అట్లైనా నాకు అస్థ లేదు" అని చెప్పినట్లయితే అన్వయం బాగుంటుంది. అందుచేత "అహృతోఽస్మి" (అస్మి = నేను, అపహరించబడితిని; 'అస్మి' అనేది ఇక్కడ అవ్యయం, నేను అని అర్థం) అనే పాఠం యుక్తం. ఈ విధంగా ఇక్కడ 'అవహృతస్య' అనే షష్ఠ్యంతస్థానంలో 'అపహృతః'అని ప్రథమాంతం చెప్పబడలేదు గాన అనభిహితవాచ్యత్వదోషం.

అవ. 'అపి' మొదలైన నిపాతలు ప్రయోగించకపోవడం వల్ల ఏర్పడిన అనభిహితవాచ్యత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. యథా వా-

శ్లో॥ ఏషోఽహమద్రితనయాముఖపద్మజన్మా
ప్రాప్తః సురాసురమనోరథదూరవర్తీ,
స్వప్నేఽనిరుద్ధఘటనాధిగతాభిరూప
లక్ష్మీఫలామసురరాజసుతాం విధాయ. 234

వృ. అత్ర మనోరథానామపి దూరవర్తిత్యప్యర్థో వాచ్యః.

వ్యా. మరియొక ఉదాహరణం ఎట్లనగా-

ఏషఇతి :- ఉషాహరణనాటకంలో ఉష సఖురాలైన చిత్రలేఖతో వరం అంటూన్న మాటలు. ఇది హరివంశంలోని కథ. ప్రావీణ్యం గల సురాసురయక్ష గంధర్వోరగాదికన్యలు పార్వతీపరమేశ్వరుల ఎదుట గీతవాద్యనృత్యాలు చేస్తూ

ఉండాలి. ఒకనాడు బాణాసురిని కన్య ఉష కూడ ఆ విధంగా తన కళలను ప్రదర్శించింది. "ఈ దంపతులు ఎంత హాయిగా ఉన్నారు"! అని ఆమె పార్వతీపరమేశ్వరులను గూర్చి మనస్సులో అనుకొన్న దట. ఆమె చూపిన కళాప్రావీణ్యానికి సంతోషించిన పార్వతి "కొంత కాలం తరవాత నీకు తగిన భర్త స్వప్నంలో నిన్ను పొందగలడు" అని వరం ఇచ్చింది. అది కేవలం పరిహాసోక్తి అనుకొని ఉష దాని మాట మరచిపోయింది. కొంత కాలానికి ఆ వరప్రభావంవల్ల శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుడు స్వప్నంలో ఉషను కలుసుకుంటాడు. తన శీలానికి భంగం వాటిల్లిన దని ఉష ఆత్మహత్య చేసుకుంటుందేమో అనే సందేహంచేత పార్వతీదత్తవరం రూపం దాల్చి చిత్రలేఖతో ఈ మాటలు అన్నది అని సుధాసాగర వ్యాఖ్యాకారుడు వ్రాశాడు.

అద్రితనయాముఖపద్మజన్మా = పార్వతీముఖపద్మంనుండి పుట్టినవాడను, సురాసురమనోరథదూరవర్తీ=సురాసురుల మనోరథానికి దూరంగా ఉండేవాడను అయిన, ఏషః అహమ్ = ఈ నేను, అసురరాజసుతామ్ = బాణాసురుని కుమార్తె అయిన ఉషను, స్వప్నే=స్వప్నంలో. అనిరుద్ధఘటనాధిగతాభిరూపలక్ష్మీఫలామ్ =అనిరుద్ధునితో కలవడంచేత పొందబడిన అత్యధికసౌందర్యలక్ష్మియొక్క ఫలం కలదానినిగా, సఫలసౌందర్యవతినిగా, విధాయ=చేసి, ప్రాప్తః=తిరిగి వచ్చినాను.

అత్రేతి :- ఇక్కడ 'మనోరథాలకు కూడ దూరంగా ఉండేవాడను' అని 'అపి' శబ్దార్థం చెప్పడం ఉద్దేశ్యం. అనగా సురాసురమనోరథాలకు దూరంగా ఉంటాను అనడంలో 'నేను సురాసురుల మనోరథాలకి కూడా అందనివాడను' అని చెప్పడం ఉద్దేశం. కాని ఆ అర్థం రావాలంటే 'అపి' శబ్దం ప్రయోగించి "సురాసురాణామపి మనోరథానాం దూరవర్తీ" అని అనాలి. అలా అనకపోవడం చేత ఇక్కడ అనభిహితవాచ్యత్వదోషం.

అవ. సమాసం లేనప్పుడు కూడా ఈ అనభిహితవాచ్యత్వదోషానికి ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. యథా వా-

శ్లో॥ త్వయి నిబద్ధరతేః ప్రియవాదినః
ప్రణయభఙ్గపరాఙ్ముఖచేతసః,

కమపరాధలవం మమ పశ్యసి
త్యజసి మానిని దాసజనం యతః. 235

వృ. అత్ర "అపరాధస్య లవమపి" ఇతి వాచ్యమ్.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

త్వయీతి :- విక్రమోర్వశీయంలో కనబడకుండా పోయిన ఊర్వశిని ఉద్దేశించి పురూరవుడు అంటూన్న మాటలు. మానిని = ఓ! మానవంతురాలా! త్వయి = నీయందు, నిబద్ధరతేః = కట్టబడిన ప్రేమ కలవాడను, ప్రియవాదినః = ప్రియంగా మాటలాడేవాడను, ప్రణయభఙ్గపరాఙ్ముఖచేతసః = ప్రేమభంగం విషయంలో పరాఙ్ముఖమైన, భయపడే. మనస్సు కలవాడను అయిన, మమ = నాయొక్క, కమ్ = ఏ, అపరాధలవమ్ = అపరాధలేశాన్ని, పశ్యసి = చూచు చున్నావు? యతః = దేనివలన, దాసజనమ్ = ఈ దాసజనుణ్ణి, త్యజసి = విడచు చున్నావో.

అత్రేతి ;- ఇక్కడ "అపరాధస్య లవమ్ అపి" అపరాధముయొక్క లేశ ముళైనా" అని చెప్పాలి. అపి శబ్దం ప్రయోగించకపోతే "అపరాధలవాన్ని చూడడం లేదు. గొప్ప అపరాధాన్ని చూస్తున్నావు" అని అర్థం వస్తుంది. అందుచేత ఇక్కడ కూడా ప్రయోగించవలసిన 'అపి' శబ్దాన్ని ప్రయోగించక పోవడం చేత అనభిహితవాచ్యత్వదోషం.

అవ. అస్థానస్థపదత్వదోషాన్ని ఉదాహరిస్తున్నారు-

వృ. (14) అస్థానస్థపదం యథా-

శ్లో॥ ప్రియేణ సంగ్రథ్య విపక్షసంనిధా
వుపాహితాం వక్షసి పీవరస్తనే,
స్రజం న కాచిద్విజహౌ జలావిలాం
వసన్తి హి ప్రేమ్ణి గుణా న వస్తుషు. 236

వృ. అత్ర "కాచిత్ న విజహౌ" ఇతి వాచ్యమ్.

వ్యా. అస్థానస్థేతి :- ఉంచకూడని స్థానంలో ఉన్న పదం గల వాక్యం అస్థానస్థపదం. అది ఎట్లనగా-

ప్రియేణేతి :- కిరాతార్జునీయం అష్టమసర్గలో జలక్రీడావర్ణనఘట్టంలో ఒక నాయికను వర్ణించిన శ్లోకం ఇది. విపక్షసంనిధౌ = సవతుల సమీపమునందు, ప్రియేణ = భర్త చేత, సంగ్రథ్య = గ్రుచ్చి, పీవరస్తనే = బలిసిన స్తనాలు గల, వక్షసి = వక్షఃస్థలమునందు, ఉపాహితామ్ = ఉంచబడిన, జలావిలామ్ = నీటితో వ్యాకులమైన, స్రజమ్ = మాలికను, కాచిత్ = ఒక స్త్రీ, న విజహౌ = విడవ లేదు. గుణాః = గుణాలు, ప్రేష్ఠి = ప్రేమయందు. వసన్తి హి = ఉండును కదా? వస్తుషు = వస్తువులయందు, న = ఉండవు.

అత్రేతి :- ఇక్కడ "కాచిత్ న విజహౌ" అని చెప్పాలి. అలా చెప్పవలసి ఉండగా 'న కాచిద్విజహౌ' అని చెప్పినప్పుడు 'న' అస్థానంలో ఉన్నది గాన దోషం. "న కాచిద్విజహౌ" అన్నప్పుడు "ఒక్కతే విడవలేదు. మరే మనగా అందరూ విడచిరి" అనే అర్థం స్ఫురించడానికి అవకాశం ఉన్నది.

వృ. యథా వా-

శ్లో॥ లగ్నః కేలికచగ్రహశ్లథజటాలమ్బేన నిద్రాన్తరే
ముద్రాఙ్కః శితికన్ధరేన్దుశకలేనాన్తఃకపోలస్థలమ్,
పార్వత్యా నఖలక్ష్మశఙ్కితసఖీనర్మస్మితహ్రీతయా
ప్రోన్మృష్టః కరపల్లవేన కుటిలాతామ్రచ్ఛవిః పాతు వః.

వృ. అత్ర నఖలక్ష్మేత్యతః పూర్వం "కుటిలాతామ్ర" ఇతి వాచ్యమ్.

వ్యా. నిద్రాన్తరే = నిద్రమధ్యయందు, అన్తఃకపోలస్థలమ్ = (పార్వతి యొక్క) కపోలస్థలం మధ్య, లగ్నః = లగ్నమైనది, నఖలక్ష్మశఙ్కితసఖీనర్మ స్మితహ్రీతయా = నఖాంకము అని శంకించిన సఖురాలియొక్క వేళాకోళం చిరు నవ్వుచేత సిగ్గుపడిన పార్వతిచేత, కరపల్లవేన = చిగురువంటి హస్తంచేత, ప్రోన్మృష్టః = తుడిచివేయబడినది, కుటిలాతామ్రచ్ఛవిః = వంకరగాను, కొంచెము ఎఱ్ఱని కాంతి కలదిగాను ఉన్నదీ అయిన, 'ముద్రాఙ్కః'కు విశేషణం. కేలికచ

గ్రహశ్లథజటాలమ్బేన = విలాసార్థమై జుట్టు పట్టుకొనినప్పుడు జారిన జటనుండి వ్రేలాడుచున్న, 'ఇన్దుశకలేన'కు విశేషణం, శితికణ్ఠేన్దుశకలేన = శివుని చంద్ర ఖండంచేత (ఏర్పడిన), ముద్రాఙ్కః = ముద్రచిహ్నం, వః = మిమ్ములను, పాతు = రక్షించుగాక.

అత్రేతి :- ఇక్కడ "కుటిలాతామ్ర" ఇత్యాదిపదం 'నఖలక్ష్మ' ఇత్యాది పదానికి ముందు చెప్పాలి.

ఇది నఖలక్ష్మ అనే భ్రాంతి కలగడానికి కారణం వంకరగాను, కొంచెం ఎఱ్ఱగానూ ఉండడం. అందుచేత దీనిని "కుటిలాతామ్రచ్ఛవిః" అనే పదాన్ని, "నఖలక్ష్మ.... ప్రీతయా" అనే పదానికి ముందు కూర్చడం యుక్తం. అలా కాక మరొక చోట ప్రయోగించడంచేత అస్థానస్థపదత్వదోషం.

వృ. (15) అస్థానస్థసమాసం యథా-

శ్లో॥ అద్యాపి స్తనశైలదుర్గవిషమే సీమన్తినీనాం హృది
స్థాతుం వాఞ్ఛతి మాన ఏష ధిగితి క్రోధాదివాలోహితః,
ప్రోద్యద్దూరతరప్రసారితకరః కర్షత్యసౌ తత్‌క్షణాత్
ఫుల్లత్కైరవకోశనిఃసరదలిశ్రేణీకృపాణం శశీ. 238

వృ. అత్ర క్రుద్ధస్యోక్తౌ సమాసో న కృతః, కవేరుక్తౌ తు కృతః.

వ్యా. అస్థానేతి :- ప్రయోగించ కూడనిచోట సమాసం ప్రయోగిస్తే అది అస్థానస్థసమాసం లేదా అపదస్థసమాసం. అది ఎట్లనగా-

అద్యాపీతి :- ఏషః మానః = ఈ మానం (కోపం), అద్యాపి = ఇప్పుడు కూడా, స్తనశైలదుర్గవిషమే = స్తనములనే పర్వతదుర్గంచేత విషమమైన, సీమన్తినీనామ్ = స్త్రీలయొక్క, హృది = హృదయమునందు, స్థాతుమ్ = ఉండుటకు, వాఞ్ఛతి = కోరుచున్నది, ధిక్ = ఛీ! ఇతి = అని, క్రోధాత్ ఇవ = కోపం వలన వలె, ఆలోహితః = ఎఱ్ఱగా ఉన్న, అసౌ = ఈ, శశీ = చంద్రుడు, తత్‌క్షణాత్ = వెంటనే, ప్రోద్యద్దూరతరప్రసారితకరః = పైకి లేచుచున్న దూరంగా ప్రసరింప

చేయబడిన కరములు (హస్తములు, కిరణములు అని రెండర్థాలు) కలవాడై, ఫుల్లత్కైరవకోశనిఃసరదలిశ్రేణీకృపాణమ్ = వికసించుచున్న కలవపూవు కోశం అనే కోశంనుండి (కోశం అనగా మొగ్గ, కత్తి ఒర అని రెండర్థాలు) పైకి వచ్చుచున్న తుమ్మెదలవంక్తి అనే ఖడ్గాన్ని, కర్షతి = లాగుచున్నాడు.

అత్రేతి :- ఇక్కడ కోపించిన చంద్రుని మాటలలో సమాసం చేయబడ లేదు. కవి మాటలలో చేయబడింది.

వి. దీర్ఘసమాసం క్రోధసూచకం. అందుచేత కోపించిన చంద్రుని మాటలలో దీర్ఘసమాసం ఉండడం యుక్తం. కాని ఇక్కడ చంద్రుని మాటలలో కాక 'ఈ విధంగా అంటూ చంద్రుడు ఖడ్గం పైకి లాగుతున్నాడు" అని కవి మాటలలో చేయబడింది. అందుచేత ఇక్కడ అస్థానస్థసమాసత్వదోషం.

అవ. సంకీర్ణాన్ని వివరిస్తున్నాడు-

వృ. (16) సంకీర్ణం యత్ర వాక్యాన్తరస్య పదాని వాక్యాన్తరమనుప్రవిశన్తి. యథా-

శ్లో॥ కిమితి న పశ్యసి కోపం పాదగతం బహుగుణం గృహాణేమమ్,
నను ముఞ్చ హృదయనాథం కణ్ఠే మనసస్తమోరూపమ్. 239

వృ. అత్ర పాదగతం బహుగుణం హృదయనాథం కిమితి న పశ్యసి, ఇమం కణ్ఠే గృహాణ; మనసస్తమోరూపం కోపం ముఞ్చ ఇతి. ఏకవాక్యతాయాం తు క్లిష్టమితి భేదః.

వ్యా. ఒక వాక్యానికి సంబంధించిన పదాలు మరొక వాక్యంలో ప్రవేశించినప్పుడు ఆ వాక్యం సంకీర్ణం. ఎట్లనగా-

కిమితీతి :- ఒక మానినితో సఖి అంటూన్న మాట లివి. పాదగతమ్ = పాదాలను పొందిన, పాదాలకు నమస్కరిస్తూన్న, బహుగుణమ్ = అనేకగుణాలు గల, హృదయనాథమ్ = ప్రియుణ్ణి, కిమితి న పశ్యసి = ఎందుకు చూడవు? ఇమమ్ = ఈతనిని, కణ్ఠే = కంఠమునందు, గృహాణ = గ్రహించుము, ఆలింగనం

చేసికొనుము. మనసః = మనస్సుయొక్క, తమోగుణమ్=తమోగుణమైన, కోపమ్ = కోపమును, ముఞ్చ = విడువుము.

అత్రేతి :- 'ఇక్కడ పాదగతమ్ బహుగుణం హృదయనాథమ్ కిమితి న పశ్యసి' 'ఇమం కక్షే గృహాణ' "మనసః తమోరూపం కోపం ముఞ్చ" అని అన్వయం. (ఈ అన్వయం ప్రకారం అర్థం పైన చూపబడింది.) ఇక్కడ మూడు వాక్యాలకు చెందిన పదాలు కలిసిపోవడంచేత సంకీర్ణత్వదోషం.

ఏకేతి :- ఏకవాక్యం అయినప్పుడుమాత్రం క్లిష్టం అని దానికి దీనికి భేదం. అనగా ఒకే వాక్యానికి సంబంధించిన పదాలు అన్వయం వెంటనే తోచని విధంగా ఇటూ అటూ చెదిరి పడి ఉంటే అది క్లిష్టత్వం. రెండు మూడు వాక్యాలకు సంబంధించిన పదాలు కలిసిపోతే సంకీర్ణత్వం అని ఈ రెండింటికీ భేదం.

అవ. గర్భితాన్ని నిరూపిస్తున్నాడు—

వృ. (17) గర్భితం యత్ర వాక్యస్య మధ్యే వాక్యాన్తరమనుప్రవిశతి. యథా-

శ్లో॥ పరాపకారనిరతైర్దుర్జనైః సహ సంగతిః,
వదామి భవతస్తత్త్వం న విధేయా కదాచన. 240

వృ. అత్ర తృతీయపాదో వాక్యాన్తరమధ్యే ప్రవిష్టః.

వ్యా. గర్భితమితి :- ఎక్కడ ఒక వాక్యం మధ్య మరొక వాక్యం ప్రవేశిస్తుందో అది గర్భితం. ఎట్లనగా-

పరేతి :- పరాపకారనిరతైః = పరులకు అపకారం చేయడంలోనే ఆసక్తి గల, దుర్జనైః సహ = దుర్జనులతో కూడా, సంగతిః = సంబంధం, కదాచన = ఎన్నడూ కూడ, న విధేయా = చేయదగినది కాదు. భవతః = నీకు, తత్త్వమ్ = = తత్త్వమును, వదామి = చెప్పుచున్నాను.

అత్రేతి :- ఇక్కడ మరొకవాక్యం మధ్యలో తృతీయపాదం (వాక్యరూపమైన తృతీయపాదం) ప్రవేశించింది గాన గర్భితత్వదోషం.

వృ. యథా వా-

శ్లో॥ లగ్నం రాగావృతాఙ్గ్యా సుదృఢమిహ యయైవాసి యష్ట్యారికణ్ఠే
మాతఙ్గానామపీహోపరి పరపురుషైర్యా చ దృష్టా పతన్తీ,
తత్సక్తోఽయం న కించిద్గణయతి విదితం తేఽస్తు తేనాస్మి దత్తా
భృత్యేభ్యః శ్రీనియోగాద్గదితుమివ గతేత్యమ్బుధిం యస్య కీర్తిః.

వృ. "అత్ర విదితం తేఽస్తు" ఇత్యేతత్ కృతమ్. ప్రత్యుత లక్ష్మీస్తతోఽపసరతీతి విరుద్ధమతికృత్.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

లగ్నమిత్యాది:- ఈ శ్లోకంలో అసియష్టిని (ఖడ్గాన్ని) అసతిగాను, లక్ష్మిని రాజు భార్యగాను, కీర్తిని దూతిగాను అధ్యవసాయం చేసి కవి వర్ణిస్తున్నాడు. యయైవ = ఏ. రాగావృతాఙ్గ్యా = ఎరుపుచేత కప్పబడిన శరీరం గల, అసియష్ట్యా = కట్టెవంటి (కట్టెవలె పొడవైన) ఖడ్గంచేత, ఇహ = ఇక్కడ, అరికణ్ఠే = శత్రువుల కంఠమునందు, లగ్నమ్ = లగ్న మగుటయో, అనురాగంతో నిండిన ఒక నాయిక శత్రుకంఠాలింగనం చేసినది అని మరొక గమ్యమానార్థం. యా చ = ఏది, ఇహ = ఇక్కడ, మాతఙ్గానామ్ ఉపరి = ఏనుగుల పైన, చండాలుల పైన అని మరొక అర్థం. పతన్తీ = పడుచున్నదిగా, కామవశంచేత వాళ్ళమీద పడుతున్నది అని గమ్యమానార్థం; పరపురుషైః = ఉత్తములైన లేదా మధ్యస్థులైన పురుషులచేత, దృష్టా = చూడబడినదో, తత్సక్తః = దానియందు ఆసక్తుడై, అయమ్ = ఈ రాజు, కించిత్ = దేనినీ, న గణయతి = లెక్కచేయడం లేదు. తే = నీకు, విదితమ్ = తెలియబడినది, అస్తు = అగుగాక. తేన = ఆతనిచేత, భృత్యేభ్యః = భృత్యులకొరకు, దత్తా = ఇవ్వబడినదానను. అస్మి = అయిఉన్నాను అని, శ్రీనియోగాత్ = లక్ష్మియొక్క ఆజ్ఞవలన, యస్య = ఎవనియొక్క, కీర్తిః = కీర్తి, అమ్బుధిమ్ = లక్ష్మి తండ్రియైన సముద్రాన్ని గూర్చి, గతా ఇవ = వెళ్ళినదా అన్నట్లున్నదో. "నా భర్త యైన ఈ రాజు కులటాలగ్నచిత్తుడై ఏమీ లెక్క చేయక నన్ను భృత్యులకు ఇచ్చివేస్తున్నాడు" అని కీర్తిని దూతగా పంపి లక్ష్మి తన తండ్రి యైన సముద్రునికి తెలుపుతున్నదా అని ఉత్ప్రేక్ష. పైకి కనబడే ఈ నింద ద్వారా ఆ రాజు మహావీరు డనీ, గొప్ప త్యాగశీలం కలవా డనీ, ఆతని కీర్తి భూమండలం చివరిదాకా వ్యాపించిన దనీ స్తుతి గమ్యం.

అత్రేతి :- ఇక్కడ 'విదితం తేఽస్తు' అనేది ప్రయోగించబడినది. చెప్ప దలచినదానికి విరుద్ధంగా "లక్ష్మి ఆ రాజును విడచివేయుచున్నది" అని విరుద్ధ మతిని కూడా కలిగిస్తూన్నది.

వి. వాక్యమధ్యంలో "విదితం తేఽస్తు" అనే వాక్యం చొనవడంచేత గర్భితత్వదోషం. 'విదితం తేఽస్తు' అనడంవల్ల- "తరవాత నన్ను నిందించి ప్రయోజనం లేదు. ముందుగానే నీకు తెలుపుతున్నాను. నేనుగా వెళ్ళిపోవడం లేదు. నన్ను భర్త విడచివేశాడు. నేను ఇతరులతో వెళ్ళిపోతున్నాను." అని స్తుతికి విరుద్ధమైన అర్థం కూడా తోస్తూన్నది. అందుచేత ఇక్కడ విరుద్ధమతికృత్త్వ దోషం కూడ ఉన్నది.

అవ. ప్రసిద్ధిహతాన్ని నిరూపిస్తున్నాడు-

శ్లో॥ (18) "మఞ్జీరాదిషు రణితప్రాయం పక్షిషు చ కూజితప్రభృతి,
స్తనితమణితాది సురతే మేఘాదిషు గర్జితప్రముఖమ్."

వృ. ఇతి ప్రసిద్ధిమతిక్రాన్తం యథా-

శ్లో॥ మహాప్రలయమారుతక్షుభితపుష్కరావర్తక
ప్రచణ్డఘనగర్జితప్రతిరుతానుకారీ ముహుః,
రవః శ్రవణభైరవః స్థగితరోదసీకన్దరః
కుతోఽద్య సమరోదధేరయమభూతపూర్వః పురః. 243

వృ. అత్ర రవో మణ్డూకాదిషు ప్రసిద్ధో న తూక్తవిశేషే సింహనాదే.

వ్యా. మఞ్జీరాదీతి :- అందెళ్ళ చప్పుళ్ళు మొదలైనవాటిని చెప్పడానికి 'రణితం' మొదలైన శబ్దాలు, పక్షుల కూతలకు 'కూజితం' మొదలైన శబ్దాలు, సురతంలో 'స్తనితం' 'మణితం' మొదలైన శబ్దాలు, మేఘాదిధ్వనులకు 'గర్జితం' మొదలైన శబ్దాలు ప్రసిద్ధాలు ఈ ప్రసిద్ధిని అతిక్రమించినది 'ప్రసిద్ధిహతం'. ఎట్లనగా-

మహేతి :- "వేణీసంహారంలో రణకోలాహలం విన్న అశ్వత్థామ మాట లివి. మహాప్రలయ....అనుకారీ- మహాప్రలయ = మహాప్రలయమునందలి, మారుత = వాయువుచేత, క్షుభిత = క్షోభింపచేయబడిన, పుష్కరావర్తక = పుష్కరావర్తకములయొక్క, ప్రచణ్డఘనగర్జిత = తీవ్రము గంభీరమూ అయిన గర్జితముయొక్క, ప్రతిరుత = ప్రతిధ్వనిని, అనుకారీ = అనుకరించుచున్న, స్థగితరోదసీకన్దరః = కప్పబడిన భూమ్యాకాశమధ్యభాగం గల, శ్రవణభైరవః = చెవులకు భయంకరంగా ఉన్న, అభూతపూర్వః = పూర్వం ఎన్నడూ లేని, రవః = ధ్వని, పురః = ఎదుట, రణోదధేః = యుద్ధసముద్రంనుండి, అద్య = ఇప్పుడు, కుతః = ఎందువలన, ముహుః = మాటిమాటికి వచ్చుచున్నది?

అత్రేతి :- ఇక్కడ ప్రయోగించిన 'రవ' శబ్దం కప్పల బెకబెకల వంటి మృదుధ్వనులవిషయంలో ప్రయోగించబడుతుంది కాని పై దీర్ఘవిశేషణాలతో వర్ణించిన సింహనాదం విషయంలో ప్రయోగించబడదు. అందుచేత ప్రసిద్ధిహతత్వ దోషం.

అవ. భగ్నప్రక్రమాన్ని విశదీకరిస్తున్నాడు-

వృ. (19) భగ్నః ప్రక్రమః ప్రస్తావః యత్ర. యథా-

శ్లో॥ నాథే నిశాయా నియతేర్నియోగా
దస్తం గతే హన్త నిశాపి యాతా,
కులాఙ్గనానాం హి దశానురూపం
నాతః పరం భద్రతరం సమస్తి. 243

వృ. అత్ర 'గతా'ఇతి ప్రస్తావే 'యాతా'ఇతి ప్రకృతేః. "గతా నిశాపి"ఇతి తు యుక్తమ్.

వ్యా. భగ్న ఇతి :- దేనియందు, ప్రక్రమః = ప్రస్తావము, (అనగా ప్రారంభంలో ప్రయోగించడం)భగ్నం అవుతుందో అది 'భగ్నప్రక్రమం'. అనగా ఏ విధంగా ఉపక్రమం చేయబడుతుందో ఆ విధంగానే సమాపనం చెయ్యాలి. అలా చేయకపోతే అది ప్రక్రమభంగం. ఎట్లనగా—

నాథే ఇతి :- నియతేః = దైవంయొక్క, నియోగాత్ = ఆజ్ఞవలన, నిశాయాః

నాథే = నిశానాథుడైన చంద్రుడు, అస్తంగతే = అస్తమించగా, అస్తాద్రినిగూర్చి వెళ్ళిపోగా, హన్త = ఆహా ! నిశాపి = రాత్రి కూడ, యాతా = వెళ్ళిపోయినది. కులాఙ్గనానామ్ = పతివ్రతాస్త్రీలకు, దశానురూపమ్ = వైధవ్యదశకు తగిన, అతః పరమ్ = దీనిని మించిన, భద్రతరమ్ = అధికంగా భద్రమైనది, న సమస్తి హి = లేదు కదా ?

అత్రేతి :- ఇక్కడ 'గతా' అని ప్రస్తావించిన తరవాత 'యాతా' అని ప్రయోగించడంవల్ల ప్రకృతియొక్క ప్రక్రమభంగం. 'గతా నిశాపి' అనడం యుక్తం.

వి. భగ్నప్రక్రమత్వం ప్రకృతికీ, ప్రత్యయానికీ, సర్వనామానికీ, పర్యాయపదానికీ, వచనాదులకీ సంబంధించి అనేకవిధాలుగా ఉండవచ్చు. పై శ్లోకంలో 'అస్తం గతే'అని 'గత'అనే ప్రాతిపదికను ముందు ప్రయోగించినప్పుడు రాత్రి విషయంలో ఆ 'గత' ప్రాతిపదికనే ప్రయోగిస్తే బాగుంటుంది. అలా కాక 'యాత' అనే ప్రాతిపదికను ప్రయోగించడంచేత భగ్నప్రక్రమత్వదోషం.

వృ. నను "నైకం పదం ద్విః ప్రయోజ్యం ప్రాయేణ" ఇత్యన్యత్ర, "కథితపదం దుష్టమ్" ఇతి చ ఇహైవోక్తమ్. తత్కథమేకస్య పదస్య ద్విః ప్రయోగః ? ఉచ్యతే- ఉద్దేశ్యప్రతినిర్దేశ్యవ్యతిరిక్తో విషయ ఏకపదప్రయోగనిషేధస్య. తద్వతి విషయే ప్రత్యుత తస్యైవ పదస్య సర్వనామ్నో వా ప్రయోగం వినా దోషః. తథాహి–

శ్లో. ఉదేతి సవితా తామ్రస్తామ్ర ఏవాస్తమేతి చ,
సంపత్తౌ చ విపత్తౌ చ మహతామేకరూపతా. 244

వృ. అత్ర "రక్త ఏవాస్తమేతి"ఇతి యది క్రియేత తదా పదాన్తరప్రతిపాదితః స ఏవార్థోఽర్థాన్తరతయేవ ప్రతిభాసమానః ప్రతీతిం స్థగయతి.

వ్యా. (ఆశంక) నన్వితి :- "సాధారణంగా, అనగా కొన్ని పరిస్థితులలో తప్ప, ఒక పదాన్ని రెండు సార్లు ప్రయోగించకూడదు"అని మరొకచోట, (ఇది

వామనుడు అలంకారసూత్రవృత్తిలో ప్రథమాధ్యాయపంచమాధికరణంలో అన్న మాట), "కథితపదం దుష్టం" అని ఇక్కడనే (అనగా కావ్యప్రకాశసప్తమోల్లాసం లోనూ) చెప్పబడినది కదా ? ఒకే పదాన్ని రెండు మార్లు ప్రయోగించడం ఎట్లు ? (సమాధానం) చెపుతున్నాను; విను. 'ఒకే పదాన్ని ప్రయోగించకూడదు'అనే నిషేధానికి విషయం ఉద్దేశ్యప్రతినిర్దేశ్యభిన్నమైన ప్రదేశం. ఉద్దేశ్యప్రతినిర్దేశ్యస్థలంలో రెండు మాట్లు ఒకే పదాన్ని ప్రయోగించడం దోషం కాకపోవడమే కాదు కదా ఆ పదాన్ని గాని, సర్వనామాన్ని గాని అలా రెండు మాట్లు ప్రయోగించకపోవడం దోషం. (ముందుగా తెలుపబడింది ఉద్దేశ్యం. మళ్లీ తెలుపదగినది ప్రతినిర్దేశ్యం). ఎందుచేతననగా- (తథాహి=అది యుక్తమే కదా)-

ఉదేతీతి :- సవితా = సూర్యుడు, తామ్రః = ఎఱ్ఱనివాడుగానే, ఉదేతి = ఉదయిస్తున్నాడు. తామ్రః ఏవ చ = ఎఱ్ఱనివాడుగానే, అస్తమ్ ఏతి = అస్తమిస్తున్నాడు. సంపత్తౌ చ = సంపదయందు, విపత్తౌ చ = ఆపదయందూ కూడ, మహతామ్ = మహాత్ములకు, ఏకరూపతా = ఏకరూపత్వమే.

అత్రేతి :- ఇక్కడ 'తామ్ర ఏవాస్తమేతి చ' అనడానికి బదులు 'రక్త ఏవాస్తమేతి చ'అని అన్నట్లయితే 'తామ్రః' అనేదానికి ఏ అర్థమో ఆ అర్థాన్నే 'రక్తః' అనే మరోపదం చేత చెప్పినప్పుడు కొత్తపదం వినగానే మరొక అర్థం అన్న ప్రతీతి వెంటనే కలిగి అసలు అర్థం ప్రతీతిని కప్పివేస్తుంది. అందుచేత ఇలాంటి స్థలాలలో ఒకే పదాన్ని రెండు సార్లు తప్పక ప్రయోగించాలి. ప్రయోగించకపోవడం దోషం.

అవ. ప్రత్యయానికి సంబంధించిన ప్రక్రమభంగాన్ని ఉదాహరిస్తున్నాడు.

వృ. యథా వా-

శ్లో. యశోఽధిగన్తుం సుఖలిప్సయా వా
మనుష్యసంఖ్యామతివర్తితుం వా,
నిరుత్సుకానామభియోగభాజాం
సముత్సుకేవాఙ్కముపైతి సిద్ధిః. 245

వృ. అత్ర ప్రత్యయస్య, "సుఖమీహితుం వా" ఇతి యుక్తః పాఠః.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

యశః ఇతి :- కిరాతార్జునీయం తృతీయసర్గలో అర్జునునితో ద్రౌపది మాటలు, యశః = కీర్తిని, అధిగన్తుమ్ = పొందుటకు కాని, సుఖలిప్సయా = సుఖమును పొందవలె నను కోరికచేత గాని, మనుష్యసంఖ్యామ్ = మనుష్యుల సంఖ్యను, అతివర్తితుం వా = అతిక్రమించుటకు గాని, మనుష్యులకు దుర్లభమైన ఉత్కర్షను పొంది మనుష్యులలో ముందు నిలచుటకు అని అర్థం. నిరుత్సుకానామ్ = ఆత్యాసక్తి లేని, అభియోగభాజామ్ = ప్రయత్నం చేసే పురుషులయొక్క, అఙ్కమ్ = సమీపాన్ని గూర్చి, సిద్ధిః = కార్యసిద్ధి, సముత్సుకేవ = బెంగగొన్నది వలె, ఉపైతి = పొందును.

అత్రేతి :- ఇక్కడ ప్రత్యయానికి ప్రక్రమభంగం. "అధిగన్తుమ్"అని 'తుమున్' ప్రత్యయంతో ప్రారంభించి మధ్య 'లిప్సయా' అని 'సన్'ప్రత్యయాన్ని ప్రయోగించాడు కవి. అందుచేత ప్రక్రమభంగం. 'సుఖమీహితుం వా' అని 'తుమున్'ప్రత్యయాన్ని ప్రయోగించిన పాఠం యుక్తం.

అవ. సర్వనామశబ్దానికి సంబంధించిన ప్రక్రమభంగానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో. తే హిమాలయమామన్త్ర్య పునః ప్రేక్ష్య చ శూలినమ్,
సిద్ధం చాస్మై నివేద్యార్థం తద్విసృష్టాః ఖముద్యయుః.

వృ. అత్ర సర్వనామ్నః. "అనేన విసృష్టాః"ఇతి తు వాచ్యమ్.

వ్యా. తే ఇతి :- కుమారసంభవంలో షష్ఠసర్గలోని శ్లోకం ఇది. తే = ఆ సప్తర్షులు, హిమాలయమ్ = హిమాలయపర్వతమును, ఆమన్త్ర్య = ఆమంత్రించి, ఆతనిదగ్గర సెలవు తీసికొని, పునః = మరల, శూలినమ్ = ఈశ్వరుణ్ణి, ప్రేక్ష్య చ = చూచి, అర్థమ్ = కార్యమును, సిద్ధమ్ = సిద్ధమైనదానినిగా, అస్మై = ఇతనికి, నివేద్య = తెలిపి, తద్విసృష్టాః = అతనిచేత విడవబడినవారై, ఖమ్ = ఆకాశాన్ని గూర్చి, ఉద్యయుః = ఎగిరి వెళ్ళిరి.

అత్రేతి :- ఇక్కడ సర్వనామశబ్దానికి ప్రక్రమభంగం. "అస్మై అర్ఘం నివేద్య"అని 'ఇదమ్' శబ్దాన్ని ముందు ఉపయోగించినప్పుడు ఆ 'ఇదమ్' శబ్దాన్నే మళ్ళీ ఉపయోగించి "అనేన విసృష్టాః" అనడం యుక్తం.

అవ. పర్యాయపదానికి సంబంధించిన ప్రక్రమభంగాన్ని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ మహీభృతః పుత్రవతోఽపి దృష్టి
స్తస్మిన్నపత్యే న జగామ తృప్తిమ్,
అనన్తపుష్పస్య మధోర్హి చూతే
ద్విరేఫమాలా సవిశేషసఙ్గా. 247

వృ. అత్ర పర్యాయస్య. "మహీభృతోఽపత్యవతోఽపి" ఇతి యుక్తమ్. అత్ర 'సత్యపి పుత్రే కన్యాయామపేఽపత్యే స్నేహోఽభూత్'ఇతి కేచిత్సమర్థయన్తి.

మహీభృతః ఇతి :- కుమారసంభవం ప్రథమసర్గలోని శ్లోకం. పుత్రవతోఽపి = పుత్రవంతుడైనా, మహీభృతః = హిమవంతునియొక్క, దృష్టిః = దృష్టి, తస్మిన్ = ఆ, అపత్యే = సంతానమునందు, తృప్తిమ్ = తృప్తిని, న జగామ = పొందలేదు. అనన్తపుష్పస్య = అనంతములైన పుష్పాలు గల, మధోః = వసంతర్తువుయొక్క, ద్విరేఫమాలా = తుమ్మెదల పంక్తి, చూతే = చూతపుష్పమునందు, సవిశేషసంగా హి = అధికమైన ఆసక్తి కలది కదా ?

అత్రేతి :- ఇక్కడ పర్యాయానికి ప్రక్రమభంగం. అనగా- ఎంతోమంది అపత్యాలు ఉన్నప్పటికీ ఈ అపత్యంమీదనే అతనికి అధికమైన స్నేహం అని చెప్పడం కవి ఉద్దేశ్యం. అందుచేత ప్రారంభంలో కూడా 'అపత్యవతోఽపి' అని 'అపత్య'శబ్దాన్ని ప్రయోగించడం యుక్తం. అప్పుడు ప్రారంభంలోను, తరవాతా కూడ 'అపత్య'శబ్దప్రయోగం చేయడంచేత ప్రక్రమభంగదోషం ఉండదు. "మహీభృతోఽపత్యవతోఽపి"అనే పాఠం యుక్తం.

కొందరు "మైనాకు డనే కుమారు డున్నా కూడ హిమవంతునికి కన్యా

రూపమైన ఈ అపసత్యంమీదనే అధిక స్నేహం"అని చెప్పడం కవి అభిప్రాయం. అందుచేత ఈ దోషం లేదు అని అన్నారు.

అవ. ఒకే శ్లోకంలో ఉపసర్గ — పర్యాయాలకు సంబంధించిన ప్రక్రమ భంగాన్ని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ విపదోఽభిభవన్త్యవిక్రమం
రహయత్యాపదుపేతమాయతిః,
నియతా లఘుతా నిరాయతే
రగరీయాన్న పదం నృపశ్రియః. 248

వృ. అత్రోపసర్గస్య పర్యాయస్య చ. "తదభిభవః కురుతే నిరాయతిమ్. లఘుతాం భజతే నిరాయతిర్లఘుతావాన్న పదం నృపశ్రియః" ఇతి యుక్తమ్.

వ్యా. విపదః ఇతి కిరాతార్జునీయంలో యుధిష్ఠిరునితో భీమసేనుని మాటలు. అవిక్రమమ్ = పరాక్రమం లేనివాణ్ణి, విపదః = ఆపదలు, అభిభవన్తి= తిరస్కరించును. ఆపదుపేతమ్ = ఆపదలతో కూడినవాణ్ణి, ఆయతిః = మంచి భవిష్యత్తు, రహయతి=విడిచివేస్తుంది. నిరాయతేః=మంచి భవిష్యత్తు లేనివానికి, లఘుతా = తేలిక అయిపోవడం, నియతా = తప్పనిసరి అయినది. అగరీయాన్ = తేలిక అయిపోయినవాడు, నృపశ్రియః = రాజలక్ష్మికి, పదమ్ = స్థానం, న = కాదు.

అత్రేతి :- ఇక్కడ ఉపసర్గకు, పర్యాయపదానికి ప్రక్రమభంగం. "తదభిభవః కురుతే నిరాయతిమ్. లఘుతాం భజతే నిరాయతిర్లఘుతావాన్న పదం నృపశ్రియః"అనే పాఠం యుక్తం.

వి. ప్రారంభంలో ఉన్న 'విపదః'అనే పదంలో 'వి'అనే ఉపసర్గను ఉపయోగించి 'ఆపత్'అనే పదంలో 'ఆఙ్'అనే ఉపసర్గ ఉపయోగించబడింది. అందుచేత 'ఆఙ్'అనే ఉపసర్గకు ప్రక్రమభంగం. అదే విధంగా 'నియతా లఘుతా' అని మొదట 'లఘుతా'అనే పదం ప్రయోగించి తరవాత ఆ పదాన్ని ప్రయోగించకుండగా 'అగరీయాన్'అని అదే అర్థం గల పదం ప్రయోగించబడింది. అందుచేత

ఈ పదంతో 'పర్యాయపదప్రక్రమభంగం'. ఈ దోషం లేకుండా ఉండడానికి 'తదభిభవః' ఇత్యాది విధంగా పాఠం మార్చుకుంటే బాగుంటుంది. "తదభిభవః = ఆ ఆ విపత్తుల అభిభవం, నిరాయతిమ్ = ఆయతి లేనివానినిగా, కురుతే = చేయును. నిరాయతిః = ఆయతి లేనివాడు, లఘుతామ్ = లఘుత్వమును, భజతే = పొందును. లఘుతావాన్-లఘుత్వం కలవాడు, నృపశ్రియః = రాజలక్ష్మికి, పదమ్ = స్థానం, న = కాదు అని అర్థం.

అవ. వచనప్రక్రమభంగానికి ఉదాహరణ చూపుతున్నాడు.

శ్లో॥ కాచిత్కీర్ణా రజోభిర్దివమనువిదధౌ మన్దవక్త్రేన్దులక్ష్మీ
రశ్రీకాః కాశ్చిదన్తర్దిశ ఇవ దధిరే దాహముద్భ్రాన్తసత్త్వాః,
భ్రేముర్వాత్యా ఇవాన్యాః ప్రతిపదమపరా భూమివత్కమ్పమానాః
ప్రస్థానే పార్థివానామశివమితి పురో భావి నార్యః శశంసుః.

వృ. అత్ర వచనస్య. "కాశ్చిత్కీర్ణా రజోభిర్దివమనువిదధుర్మన్దవక్త్రేన్దుశోభా నిఃశ్రీకా" ఇతి 'కమ్పమానాః' ఇత్యత్ర 'కమ్పమాపుః' ఇతి చ పఠనీయమ్.

వ్యా. కాచిదితి :- మాఘకావ్యం పదిహేనవ సర్గలో శిశుపాలుని పక్షానికి చెందిన రాజులు యుద్ధానికి బయలుదేరి నప్పుడు వాళ్ళ భార్యల అమంగలచేష్టల వర్ణనం. కాచిత్ = ఒక స్త్రీ, రజోభిః = ఆర్తవములతో, ఆకీర్ణా = వ్యాప్తురాలై (రజస్వలయై),ఆకాశం పక్షాన పరాగాలచేత వ్యాప్తమై అని అర్థం. మన్దవక్త్రేన్దులక్ష్మీః = మందమైన ముఖచంద్రశోభకలదై. మందమైన ముఖం వంటి చంద్రుని శోభ కలదై అని ఆకాశపక్షంలో, దివమ్ = ఆకాశమును, అనువిదధే = అనుకరించినది. కాశ్చిత్ = కొందరు స్త్రీలు, అశ్రీకాః = శోభ లేనివారై, దిక్కుల పక్షంలో శోభ లేనివై, ఉద్భ్రాన్తసత్త్వాః = వ్యాకులమైన చిత్తం కలవారై, దిక్కులపక్షంలో ఇటు అటూ విసిరివేయబడిన ప్రాణులు కలవి అని అర్థం. దిశః ఇవ = దిక్కులు వలె, అన్తః = హృదయమునందు, మధ్యయందు అని దిక్కుల పక్షంలో అర్థం. దాహమ్ = సంతాపమును, దిక్కులపక్షంలో అగ్నిదాహమును, దిక్కులలో మంటలు చెలరేగడం అశుభసూచకం. దధిరే = ధరించిరి. అన్యాః = మరికొందరు.

స్త్రీలు, వాత్యాః ఇవ = వాయుసమూహాలు వలె, ప్రతిపదమ్ = అడుగడుగునా, భ్రేముః = తిరిగిరి. అప్పుడు వేగంగా గాలులు కూడా వీచినవి అని అర్థం. అపరాః = మరికొందరు స్త్రీలు, భూమివత్ = భూమి వలె, కమ్పమానాః = కంపించుచున్న వారు అయిరి. భూమికూడ అదిరిం దని అర్థం. ఇతి = ఈ విధంగా, పార్థివానామ్ = రాజులయొక్క, ప్రస్థానే = ప్రస్థానసమయంలో, నార్యః = స్త్రీలు, పురః భావి = ముందు రానున్న, అశివమ్ = అమంగళమును, శశంసుః = చెప్పిరి.

అ్రత్రేతి :- ఇక్కడ వచనానికి ప్రక్రమభంగం. "కాశ్చిత్కీర్ణా రజోభిర్దివ మనువిదధుర్మన్దవక్త్రేన్దుశోభాః, నిశ్రీకాః" అనీ, 'కమ్పమానాః' అనేదానికి బదులు "కమ్పమాపుః" అనీ పఠించాలి.

వి. 'కాచిత్' అని ఏకవచనం ప్రారంభించబడింది. మిగిలిన వాక్యాలలో బహువచనం ప్రయోగించబడింది. అందుచేత 'వచనప్రక్రమభంగం'. దీన్ని తొలగించడానికి పైన చూపినట్లు "కాశ్చిత్" ఇత్యాదివిధంగా పాఠం మార్చాలి. 'విదధౌ' 'దధిరే' 'భ్రేముః' అని అన్ని వాక్యాలలోను లిట్‌ను ప్రయోగించి "కమ్పమానాః' అని క్రియారహితమైన వాక్యం ప్రయోగించబడింది. అందుచేత ఇక్కడ ఆఖ్యాతప్రక్రమభంగం కూడా ఉంది. దాన్ని తొలగించడానికి 'కమ్పమానాః' కు బదులు 'కమ్పమాపుః' అనే పాఠం కల్పిస్తే బాగుంటుంది.

అవ. కారకానికి సంబంధించిన ప్రక్రమభంగానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ గాహన్తాం మహిషా నిపానసలిలం శృఙ్గైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదమ్బకం మృగకులం రోమన్థమభ్యస్యతామ్,
విస్రబ్ధైః క్రియతాం వరాహతతిభిర్ముస్తాక్షతిః పల్వలే
విశ్రాన్తిం లభతామిదం చ శిథిలజ్యాబన్ధమస్మద్ధనుః. 250

వృ. అత్ర కారకస్య. "విశ్రబ్ధా రచయన్తు సూకరవరా ముస్తాక్షతిమ్" ఇత్యదుష్టమ్.

వ్యా. గాహన్తామితి :- శాకుంతలనాటకంలో వేటమీద ఆసక్తి తగ్గిన

దుష్యంతుడు సేనాపతితో అంటూన్న మాటలు. (ఇప్పుడు) మహిషాః = అడవి దున్నలు, శృఙ్గైః = కొమ్ములచేత, ముహుః = మాటిమాటికి, తాడితమ్ = కొట్టబడిన, నిపానసలిలమ్ = నూతి దగ్గర ఉండే చిన్న చెరువుయొక్క నీటిని, గాహన్తామ్ = ప్రవేశించుగాక. మృగకులమ్ = మృగముల సముదాయం, ఛాయాబద్ధకదమ్బకమ్ = నీడలయందు కట్టబడిన గుంపులు గలదై, రోమన్థమ్ = నెమరును, అభ్యస్యతామ్ = అభ్యసించుగాక. విశ్రబ్ధైః = విశ్వాసము గల, భయం లేని, వరాహతతిభిః = వరాహసముదాయములచేత, పల్వలే = చిన్నచెరువులో, ముస్తాక్షతిః = తుంగగడ్డియొక్క నాశము, అడవిపందులు తుంగగడ్డిని ముట్టెతో పైకి పెకలించి వాటి చిన్న దుంపలు తింటాయి. క్రియతామ్ = చేయబడుగాక. ఇదమ్ = ఈ, అస్మద్ధనుః = మా ధనస్సు, శిథిలజ్యాబన్ధమ్ = శిథిలమైన అల్లెతాడు బంధం కలదై, విశ్రాన్తిమ్ = విశ్రాంతిని, లభతామ్ = పొందుగాక.

అత్రేతి :- ఇక్కడ కారకానికి సంబంధించిన ప్రక్రమభంగం అనగా 'గాహన్తామ్' అని కర్తృకారకవాచకమైన తిజంతంతో ప్రారంభించి మూడవ పాదంలో 'క్రియతామ్' అని కర్మకారకవాచకతిజంతం ప్రయోగించడంచేత కారకప్రక్రమభంగం. మూడవపాదంలో పాఠం "విశ్రబ్ధా రచయన్తు సూకరవరా ముస్తాక్షతిమ్" అని మారుస్తే దోషం లేదు.

అవ. క్రమానికి సంబంధించిన ప్రక్రమభంగానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అకలితతపస్తేజోవీర్యప్రథిమ్ని యశోనిధా
వవితథమదాధ్మాతే రోషాన్మునావభిగచ్ఛతి,
అభినవధనుర్విద్యాదర్పక్షమాయ చ కర్మణే
స్ఫురతి రభసాత్పాణిః పాదోపసంగ్రహణాయ చ. 251

వృ. అత్ర క్రమస్య. పాదోపసంగ్రహణాయేతి పూర్వం వాచ్యమ్. ఏవమన్యదప్యనుసర్తవ్యమ్.

వ్యా. అకలితేతి :- మహావీరచరితంలో శివధనుర్భంగంచేత కోపించిన పరశురాముడు వచ్చినప్పుడు శ్రీరాముడు అంటూన్న మాటలు. అకలితతపస్తేజో

వీర్యప్రథిమ్ని = అపరిమితమైన మనస్సుయొక్క, తేజస్సుయొక్క, పరాక్రమం యొక్క మహిమ గలవాడు, యశోనిధౌ = కీర్తికినిధీ, అవితథమదాధ్మాతే = వ్యర్థం కాని, అనగా ఉండదంలో తప్పులేని, మదంచేత ఉద్దీపితుడూ, నిండబడిన వాడూ అయిన, మునౌ = ఈ పరశురాముడు, రోషాత్ = కోపంవల్ల, అభిగచ్ఛతి = ఎదురుగా వచ్చుచుండగా, పాణిః = నా చెయ్యి, అభినవధనుర్విద్యాదర్పక్షమాయ = కొత్తదైన ధనుర్విద్యవలన గలిగిన దర్పానికి యోగ్యమైన, కర్మణే = యుద్ధానికి, అనగా నేను క్రొత్తగా నేర్చిన ధనుర్విద్యను చూపదగిన యుద్ధం చెయ్యడానికీ, పాదోపసంగ్రహణాయ చ = పాదాలు పట్టుకొనడానికీ, రభసాత్ = తొందరగా, స్ఫురతి = కదలుచున్నది.

అత్రేతి :- ఇక్కడ క్రమానికి ప్రక్రమభంగం. 'పాదోపసంగ్రహణాయ' అనేది ముందు చెప్పాలి. ఈ విధంగానే ఇతరవిధాలైన ప్రక్రమభంగాలు అనుసరింపదగినవి; అనగా ఊహించుకొనదగినవి.

వి. ఈ శ్లోకంలోని ప్రథమపాదంలో నమస్కరించడానికి కారణమైన తపస్సు మొదలైనవి చెప్పబడ్డాయి. యుద్ధంచేయడానికి తగిన కారణం రెండవ పాదంలో చెప్పబడింది. అందుచేత ఆ క్రమం ప్రకారం ఆయన పాదాలు పట్టుకోవాలని, యుద్ధం చెయ్యాలనీ నా చెయ్యి కదులుతూన్నది అని చెప్పాలి. అలా చెప్పలేదు గాన క్రమానికి సంబంధించిన ప్రక్రమభంగం. ఇలాంటి ప్రక్రమభేదాలు ఇంకా ఎన్నో ఉంటాయి. వాటిని బుద్ధిమంతులు ఊహించుకొనవచ్చు అని భావం.

అవ. అక్రమపదాన్ని విశదీకరిస్తున్నాడు—

వృ (20) అవిద్యమానః క్రమః యత్ర. యథా-

శ్లో॥ ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా కపాలినః,
కలా చ సా కాన్తిమతీ కలావత
స్త్వమస్య లోకస్య చ నేత్రకౌముదీ. 251

వృ. అత్ర త్వంశబ్దానన్తరం చకారో యుక్తః.

వ్యా. ఏ వాక్యంలో క్రమం లేదో అది అక్రమం. ఏ పదం తరవాత ఏ

పదాన్ని ప్రయోగించాలో దానిని అక్కడ ప్రయోగించని వాక్యం 'అక్రమం' అని అర్థం. ఎట్లనగా.

ద్వయమ్ ఇతి:- పంచమోల్లాసంలో 132 వ శ్లోకం తరవాత దీని భావం వ్రాయబడింది. ఈ శ్లోకంలో 'చ' అనే పదం 'లోకస్య' తరవాత కాక 'త్వం' తరవాత ఉండడం యుక్తం.

వృ. యథా వా-

శ్లో॥ శక్తిర్నిస్త్రింశజేయం తవ భుజయుగలే నాథ దోషాకరశ్రీ
ర్వక్త్రే పార్శ్వే తథైషా ప్రతివసతి మహాకుట్టనీ ఖడ్గయష్టిః,
ఆజ్ఞేయం సర్వగాత్రే విలసతి చ పురః కిం మయా వృద్ధయా తే
ప్రోచ్యేవేత్థం ప్రకోపాచ్ఛశికరసితయాయస్యకీర్త్యా ప్రయాతమ్.

వృ. 'ఇత్థం ప్రోచ్యేవ' ఇతి న్యాయ్యమ్. తథా "లగ్నం రాగా వృతాఙ్గ్యా" ఇత్యాదౌ 'ఇతి శ్రీనియోగాత్' ఇతి వాచ్యమ్.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా.

శక్తిరితి :- 'శక్తిః' 'కీర్తిః' ఇత్యాదులు స్త్రీలింగశబ్దాలు అవడంచేత శక్తి మొదలైనవి పెద్ద స్త్రీలనీ, కీర్తి రాజభార్య అనీ అధ్యవసానం చేసి కవి చేస్తూన్న వ్యాజస్తుతి. నాథ=నాథా! నిస్త్రింశజా=ఖడ్గంవల్ల పుట్టిన, దుష్టునివలన పుట్టిన అని మరొక అర్థం. ఇయమ్=ఈ, శక్తిః=శక్తి, తవ=నీయొక్క, భుజయుగలే=భుజ ద్వంద్వమునందు ఉన్నది. దోషాకరశ్రీః=చంద్రశోభ, దోషాలకు నిలయమైన శ్రీ, వక్త్రే=నీ ముఖమునం దున్నది. తథా=మరియు, మహాకుట్టనీ=గొప్పదీ, ఛేదిం చేదీ అయిన, గొప్ప తార్పుడుకత్తె అని రెండవ అర్థం; ఏషా=ఈ, ఖడ్గయష్టిః= ఖడ్గయష్టి, యష్టివంటి పొడవైన ఖడ్గం, పార్శ్వే=పార్శ్వంలో, ప్రతివసతి= ఉన్నది. సర్వగా=అందరినీ పొందే, తే=నీయొక్క, ఇయమ్=ఈ, ఆజ్ఞా= ఆజ్ఞ, పురః=నీ ఎదుటనే, విలసతి=ప్రకాశిస్తూన్నది. వృద్ధయా=వృద్ధురాల నైన, బాగా వృద్ధి చెందిన అని కూడా అర్థం. మయా=నాచేత, తే=నీకు, కిమ్=ఏమి ప్రయోజనం? ఇత్థమ్=ఇట్లు, ప్రోచ్యేవ=పలికి వలె, శశికరసి తయా=చంద్రకిరణాల వలె తెల్లనైన, కీర్త్యా=కీర్తి చేత, ప్రకోపాత్=అధిక

కోపంవల్ల, ప్రయాతమ్ = దూరంగా వెళ్ళిపోవుట, కీర్తి చాల దూరంగా వెళ్ళి పోయింది.

అత్రేతి :- ఇక్కడ 'ప్రోచ్యేవ ఇత్థమ్' అని కాకుండా 'ఇత్థం ప్రోచ్యేవ' అని చెప్పడం న్యాయం. అప్పుడు 'ఇత్థమ్' అనే పదం తగినస్థానంలో ఉన్నది అవుతుంది. ఇదే విధంగా "లగ్నం రాగావృతాఙ్గ్యా" ఇత్యాది శ్లోకంలో (చూ. 241 శ్లో.) "శ్రీనియోగాత్" అనేదానికి ముందు 'ఇతి'అనే పదం చేర్చి 'ఇతి శ్రీని యోగాత్' అని చెప్పాలి.

అవ. అమతపరార్థాన్ని వివరిస్తున్నాడు-

వృ. (21) అమతః ప్రకృతవిరుద్ధః పరార్థో యత్ర. యథా-

శ్లో॥ రామమన్మథశరేణ తాడితా
దుఃసహేన హృదయే నిశాచరీ,
గన్ధవద్రుధిరచన్దనోక్షితా
జీవితేశవసతిం జగామ సా. 254

వృ. అత్ర ప్రకృతే రసే విరుద్ధస్య శృఙ్గారస్య వ్యఞ్జకః అప రోఽర్థః.

వ్యా. అమత ఇతి :- అమతః=ప్రకృతమైన అర్థానికి విరుద్ధమైన, మరొక అర్థం ఎక్కడనో అది 'అమతపరార్థం'. ఎట్లనగా-

రామేతి :- రఘువంశం ఏకాదశసర్గలో రామునిచేత చంపబడిన తాటక వర్ణనం. దుఃసహేన= సహింప శక్యం కాని, రామమన్మథశరేణ= రాము డనే మన్మథుని బాణంచేత, హృదయే= హృదయమునందు, తాడితా= కొట్టబడిన, సా= ఆ, నిశాచరీ= తాటక, గన్ధవద్రుధిరచన్దనోక్షితా= గంధం గల రక్తమనే చందనంచేత పూయబడినదై, జీవితేశవసతిమ్= యముని గృహమును గూర్చి, ప్రాణనాథుని గృహమును గూర్చి అని మరొక అర్థం. జగామ= వెళ్ళెను.

అత్రేతి :- ఇక్కడ ప్రకృతరసంలో విరుద్ధమైన శృంగారరసాన్ని వ్యంజింపచేసే మరియొక్క అర్థం ఉండడంచేత అమతపరార్థత్వదోషం.

వి. ఇక్కడ రూపకాలంకారంలో ఆరోపించబడిన అప్రకృతార్థాలు శృంగార రసాన్ని వ్యంజింపచేస్తున్నాయి. ఆ శృంగారరసం ప్రకృతమైన బీభత్సరసానికి విరుద్ధం. అందుచేత అమతపరార్థత్వదోషం అని అర్థం.

అవ. ఇంతవరకు శబ్దదోషాలు చెప్పి ఇప్పుడు ఇరవైమూడు అర్థదోషాలు చెపుతున్నాడు.

వృ. అర్థదోషానాహ-

కా. అర్థో౾పుష్టః కష్టో వ్యాహతపునరుక్తదుష్క్రమగ్రామ్యాః.
సందిగ్ధో నిర్హేతుః ప్రసిద్ధివిద్యావిరుద్ధశ్చ.
అనవీకృతః సనియమానియమవిశేషావిశేషపరివృత్తాః. 56
సాకాఙ్క్షో౾పదయుక్తః సహచరభిన్నః ప్రకాశితవిరుద్ధః.
విధ్యనువాదాయుక్తస్త్యక్తపునఃస్వీకృతో౾శ్లీలః. 57

వృ. దుష్టః ఇతి సంబధ్యతే. క్రమేణోదాహరణమ్.

వ్యా. అర్థదోషాలు చెప్పుచున్నాడు-

అర్థ ఇతి:- (1) అపుష్టం (2) కష్టం (3) వ్యాహతం (4) పునరుక్తం (5) దుష్క్రమం (6) గ్రామ్యం (7) సందిగ్ధం (8) నిర్హేతువు (9) ప్రసిద్ధివిరుద్ధం (10) విద్యావిరుద్ధం (11) అనవీకృతం (12) సనియమపరివృత్తం (13) అనియమ పరివృత్తం (14) విశేషపరివృత్తం (15) అవిశేషపరివృత్తం (16) సాకాంక్షం (17) అపదయుక్తం (18) సహచరభిన్నం (19) ప్రకాశితవిరుద్ధం (20) విధ్యయుక్తం (21) అనువాదాయుక్తం (22) త్యక్తపునఃస్వీకృతం (23) అశ్లీలం అయిన అర్థం, దుష్టః అనేది వెకటి కారికనుండి సంబంధిస్తుంది, దుష్టమైనది. అపుష్టత్వాదులు అర్థదోషాలు. క్రమంగా ఉదాహరణలు ఎట్లనగా: (1) అపుష్టార్థానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అతివితతగగనసరణిప్రసరణపరిముక్తవిశ్రమానన్దః
మరుదుల్లాసితసౌరభకమలాకరహాసకృద్రవిర్జయతి. 255

వృ. అత్ర అతివితతత్వాదయోఽనుపాదానేఽపి ప్రతిపాద్యమాన మర్థం న బాధన్తే ఇతి అపుష్టాః. న త్వసంగతాః, పునరుక్తా వా.

వ్యా. అతివితతేతి:- "అతి....అనన్దః" అతివితత = చాలవిస్తృతం అయిన, గగనసరణి = ఆకాశమార్గమునందు, ప్రసరణ = సంచరించడంచేత, పరిముక్త = విడవబడిన, విశ్రమానన్దః = విం్రాంత్యానందం గల, "మరుత్....కృత్"— మరుత్ = గాలిచేత, ఉల్లాసిత = ప్రసరింపచేయబడిన, సౌరభ = పరిమళం గల, కమలాకర = పద్మసరస్సుకు, హాసకృత్ = వికాసం చేసే, రవిః = సూర్యుడు, జయతి = సర్వోత్కర్షగా ఉన్నాడు.

అత్రేతి:- ఇక్కడ అతివితతత్వాదులు చెప్పకపోయినా ఇక్కడ ప్రతిపాదించబడే అర్థాన్ని బాధించవు, అందువలన అపుష్టములు. అయితే అసంగతాలు కాని, పునరుక్తాలు కాని కావు.

వి. "గగనప్రసరణపరిముక్తవిశ్రమానన్దః, కమలాకరహాసకృత్ రవిః జయతి"అని చెపితే చాలు; సూర్యుని గొప్పతనాన్ని వర్ణించి నట్లే అవుతుంది. మిగిలిన అవితతసరణిత్వ. మరుదుల్లాసిత సౌరభత్వా లనే అర్థాలు చెప్పకపోయినా ఇక్కడ ప్రతిపాదించదలచిన సూర్యోత్కర్షరూపమైన అర్థానికి బాధ అనగా ఏమాత్రం లోపం లేదు. అందుచేత ఇక్కడ ఈ అర్థాలకి అపుష్టత్వం.

అయితే ఇది అధికపదత్వదోషం కాని పునరుక్తత్వదోషం కాని అవుతుందా అని ఆశంక. ఇక్కడ ఆ రెండు దోషాలు లేవు, అపుష్టత్వమే. అసంగతాః = అధికములు అని అర్థం. మరొక ప్రయోజనం ఏమీ లేకపోవడంచేత ఆ అర్థాన్ని చెప్పనవసరం లేకపోయినా ఆ పదాలను ప్రయోగించడం అధికపదత్వం. ప్రస్తుతానికి ఉపయోగించకపోయినా స్వరూపకథనంకోసం ఒక అర్థాన్ని చెపితే అపుష్టార్థత్వం; ఇది ఈ రెండింటికీ భేదం. అదే విధంగా ఆకాశం అని చెప్పగానే అది చాలా విశాలమైనది అనే అర్థం స్ఫురిస్తుంది గాన మళ్ళీ 'అతివితత' అని చెప్పడం పునరుక్తి అవుతుంది అనడానికి వీలులేదు. రెండుపర్యాయపదాలను ప్రయోగిస్తేనే పునరుక్తి. ఆకాశం అని వినగానే దాని వైశాల్యం స్ఫురించినా 'గగన' 'అతివితత' శబ్దాలు పర్యాయపదాలు కావు గాన పునరుక్తి లేదు.

అవ. (2) చాలా శ్రమపడితేనే కాని బోధపడనిది కష్టం. దానికి ఉదాహరణం చూపుతున్నారు.

శ్లో॥ సదా మధ్యే యాసామియమమృతనిస్యన్దసురసా
సరస్వత్యుద్దామా వహతి బహుమార్గా పరిమలమ్,
ప్రసాదం తా ఏతా ఘనపరిచితాః కేన మహతాం
మహాకావ్యవ్యోమ్ని స్ఫురితమధురా యాన్తు రుచయః. 246

వృ. అత్ర యాసాం కవిరుచీనాం మధ్యే సుకుమార - విచిత్ర మధ్యమాత్మకత్రిమార్గా భారతీ వహతి తాః గమ్భీరకావ్యపరిచితాః కథ మితరకావ్యవత్ ప్రసన్నా భవన్తు. యాసామాదిత్యప్రభాణాం మధ్యే త్రిప థగా వహతి తాః మేఘపరిచితాః కథం ప్రసన్నాః భవన్తి ఇతి సంక్షే పార్థః.

వ్యా. సదేతి:- తన కావ్యం గమ్భీరసరసార్థప్రతిపాదకం అవడంచేత స్ఫుటత్వం లేకపోయినా దోషం లేదు అని ఒక కవి చెపుతున్న మాటలు. ఇక్కడ కావ్యరూపమైన అర్థంతో పాటు సూర్యరూపార్థం కూడా స్ఫురిస్తున్నది. కావ్య పక్షంలో_యాసామ్=ఏ కవిరుచులయొక్క- అనగా కవి అభిప్రాయములయొక్క, అనగా కావ్యాలయొక్క, మధ్యే=మధ్యయందు, సదా=ఎల్లప్పుడూ, అమృత నిస్యన్దసురసా=అమృతమును స్రవించేదీ, మంచి శృంగారాదిరసాలు కలదీ, ఉద్దామా=ప్రౌఢమూ, బహుమార్గా=సుకుమార-విచిత్ర-మధ్యమము లనే అనేక మార్గాలు కలదీ, అనగా వైదర్భి, గౌడి, పాంచాలి అను మూడు రీతులు కలది అని అర్థం, అయిన, ఇయమ్=ఈ, సరస్వతీ=సరస్వతి (కవిత్వరూపమైనభారతి), పరిమలమ్=చమత్కారమును, వహతి=ధరించుచున్నదో, తాః=అట్టి, ఏతాః= ఈ, మహతామ్=గొప్ప కవులయొక్క, రుచయః=కావ్యరూపములైన అభి ప్రాయాలు, ఘనపరిచితాః=అధికంగా అభ్యసించబడినవై, స్ఫురితమధురాః= అనుభవానికి వచ్చి మధురములై, మహాకావ్యవ్యోమ్ని=ఆకాశం వంటి, ఆకాశం వలె అపరిచ్ఛిన్నమైన, మహాకావ్యంలో, కేన=ఏ ప్రకారంచేత, ప్రసాదమ్= సులభంగా తెలిసికొనడానికి శక్యములై ఉండుటను, యాన్తు=పొందును? ఇతర కవికావ్యాల వలె అంత సులభంగా ఎలా అర్థం అవుతాయి అని అర్థం.

సూర్యరూపాప్రకృతార్థపక్షంలో_యాసామ్=ఏ సూర్యకాంతులయొక్క,

మధ్యే = మధ్యయందు, సదా = ఎల్లప్పుడు, అమృతనిస్యన్దసురసా = జలాన్ని స్రవించేదీ, చాలా మధురమూ అయిన, ఉద్దామా = గొప్పదైన, బహుమార్గా = మూడు మార్గాలు గల, ఇయమ్ = ఈ, సరస్వతీ = నది, గంగానది, పరిమలమ్ = స్వచ్ఛంగా, వహతి = ప్రవహిస్తూ న్నదో, తాః = అట్టి, ఏతాః = ఈ, స్ఫురిత మధురాః = ప్రకాశచేత మనోహరములైన, మహతామ్ = ద్వాదశాదిత్యులయొక్క, రుచయః = కాంతులు, మహాకావ్యవ్యోమ్ని = మహాకావ్యం వంటి ఆకాశంలో, ఘనపరిచితాః = మేఘాలతో సంబంధించినవై, కేన = ఏ ప్రకారంచేత, ప్రసాదమ్ = స్వచ్ఛత్వాన్ని, యాన్తు = పొందును? శరత్కాలాదులందు వలె వర్షాకాలంలో సూర్య కాంతులు స్వచ్ఛంగా ఎలా కనబడతాయి అని అర్థం.

అత్రేతి:- ఇక్కడ ఏ కవిరుచుల మధ్య సుకుమార-విచిత్ర-మధ్యమాత్మక మార్గత్రయం గల భారతి చమత్కారాన్ని వహిస్తున్నదో గంభీరకావ్యపరిచితాలైన ఆ కవిరుచులు ఇతర కావ్యాల వలె ఎలా ప్రసన్నంగా ఉంటాయి ? ఏ సూర్య కాంతుల మధ్య త్రిపథగ (మూడు లోకాలలో ప్రవహించే గంగ) ప్రవహిస్తూ న్నదో అవి మేఘాలతో సంబంధించి ఉన్నప్పుడు ప్రసన్నాలు ఎలా అవుతాయి? అని ఈ శ్లోకానికి సంక్షిప్తార్థం.

వి. ఈ శ్లోకంలో వివక్షితార్థాన్ని ఏదో శ్రమపడి, ఆ పదాలూ ఈ పదాలూ చేర్చి చెప్పుకొన్నా ఈ అర్థం అతికష్టంమీదనే తెలుస్తూన్నది. అందుచేత ఈ అర్థంలో కష్టత్వదోషం.

అవ. (6) వ్యాహతానికి ఉదాహరణం చూపుతున్నాడు. ఏ విషయానికి ముందు ఉత్కర్ష చెపుతారో దానికే తరవాత అపకర్ష చెప్పినా దేనికి ముందు అప కర్ష చెప్పుతారో దానికే తరవాత ఉత్కర్ష చెప్పినా అది వ్యాహతార్థం.

శ్లో॥ జగతి జయినస్తే తే భావా నవేన్దుకలాదయః
ప్రకృతిమధురాః సన్త్యేవాన్యే మనో మదయన్తి యే,
మమ తు యదియం యాతా లోకే విలోచనచన్ద్రికా
నయనవిషయం జన్మన్యేకః స ఏవ మహోత్సవః. 257

వృ. అత్ర ఇన్దుకలాదయో యం ప్రతి పస్పశప్రాయాః స ఏవ చన్ద్రికాత్వముత్కర్షార్థమారోపయతీతి వ్యాహతత్వమ్.

వ్యా. జగతీతి:- మాలతీమాధవంలో మాధవుని మాట ఇది.

జగతి = ఈ జగత్తులో, నవేన్దుకలాదయః = నూతనచంద్రకళ మొదలైన, తే తే భావాః = ఆ యా పదార్థాలు, జయినః = సర్వోత్కర్షగా ఉన్నవి. ప్రకృతి మధురాః = స్వభావంచేతనే మధురములైన, యే = ఏ, అన్యే = ఇతరపదార్థములు, మనః = మనస్సును, మదయన్తి = మదింపచేస్తాయో, మనస్సుకు మత్తెక్కిస్తాయో, అవి కూడ, సన్తి ఏవ = తప్పకుండా ఉన్నాయి. మమ తు = నాకైతే, లోకే = లోకంలో, విలోచనచన్ద్రికా = నేత్రాలకు వెన్నెల అయిన, ఇయమ్ = ఈ మాలతి, నయనవిషయమ్ = నేత్రగోచరమును, యాతా ఇతి యత్ = పొందినది అను మాట ఏదికలదో, సః ఏవ = అదే, జన్మని = జన్మలో, ఏకః = ఒక్క, మహోత్సవః = మహోత్సవము.

అత్రేతి:- ఇక్కడ ఎవనికి చంద్రకళాదు లన్నీ తుచ్ఛ ప్రాయాలో అతడే తన ప్రేయసి ఉత్కర్షను చెప్పడంకోసం 'విలోచనచన్ద్రికా' (ఆమె చూపులకు వెన్నెల) అని అంటూ ఆమెయందు చంద్రికాత్వాన్ని ఆరోపిస్తున్నాడు. ముందు తుచ్ఛము అని నిందించిన దానినే ప్రశంసించి నట్లు అయినది గాన వ్యాహతత్వదోషం.

అవ. (4) పునరుక్తానికి ఉదాహరణం చూపుతున్నాడు. ఒక మాటు పేర్కొన్నదానినే మళ్ళీ పేర్కొనడం పునరుక్తం.

వృ. "కృతమనుమతమ్" ఇత్యాది.

అత్ర అర్జున అర్జునేతి భవద్భిరితి చోక్తే సభీమకిరీటినామితి కిరీటి పదార్థః పునరుక్తః.

వ్యా. 'కృతమనుమతమ్' ఇత్యాది శ్లోకం పునరుక్తానికి ఉదాహరణం. ఇది చతుర్థోల్లాసంలో (౬౨వ శ్లోకం) వ్యాఖ్యానించబడింది.

అత్రేతి :- ఇక్కడ 'అర్జునా' అనీ 'భవద్భిః' అనీ చెప్పినతరవాత మళ్ళీ "సభీమకిరీటినామ్" అని కిరీటిపదార్థం చెప్పబడింది.

వి. ఈ శ్లోకానికి ముందు ఉన్న- "అరే! రే! అర్జున! అర్జున! సాత్యకే! సాత్యకే! న యుక్త ఈదృశో మత్తాతస్య సుతశోకభ్రాన్త్యా న్యస్తశస్త్రస్య దివముప

గచ్ఛతః కేశాకర్షణరూపః పరాభవః. అపిచ"- అనే వాక్యంలో అర్జునుణ్ణి సంబో ధించి, ఈ శ్లోకంలో 'భవద్భిః' (మీ అందరిచేత) అని అందరితో పాటు అర్జునుణ్ణి కూడా పరామర్శించడం జరిగింది. ఇలా చేసిన తరవాత "భీమునితోను, అర్జు నునితోను సహా" అంటూ అర్జునుణ్ణి మళ్ళీ పేర్కొనడంవల్ల పునరుక్తదోషం.

అవ. మరొక ఉదాహరణం చూపుచున్నాడు-

వృ. యథా వా-

శ్లో॥ అస్త్రజ్వాలావలీఢప్రతిబలజలధేర న్తరౌర్వాయమాణే
సేనానాథే స్థితేఽస్మిన్మమ పితరి గురౌ సర్వధన్వీశ్వరాణామ్,
కర్ణాలం సంభ్రమేణ వ్రజ కృప సమరం ముఞ్చ హార్దిక్య శఙ్కాం
తాతే చాపద్వితీయే వహతి రణధురం కో భయస్యావకాశః. 259

వృ. అత్ర చతుర్థపాదవాక్యార్థః పునరుక్తః.

వ్యా. అస్త్రేతి- "అస్త్ర.... జలధేః" :- అస్త్రజ్వాలా=అస్త్రజ్వాలలచేత, అవ లీఢ = నాకివేయబడిన, ప్రతిబలజలధేః = శత్రుబలసముద్రంయొక్క, అన్తః = మధ్యయందు, ఔర్వాయమాణే = బడబాగ్ని వలె ఉన్నవాడు, సర్వధన్వీశ్వరా ణామ్ = సమస్తధనుర్ధరనాయకులకు, గురౌ = గురువు అయిన, అస్మిన్ = ఈ, మమ పితరి = నా తండ్రి, సేనానాథే = సేనానాయకుడుగా, స్థితే = ఉండగా, కర్ణ = ఓ! కర్ణా! సంభ్రమేణ = తొందరచేత, అలమ్ = చాలును. కృప = కృపా చార్యా! సమరమ్=యుద్ధమును గూర్చి, వ్రజ=వెళ్ళుము. హార్దిక్య=కృతవర్మా! శఙ్కామ్ = శంకను, ముఞ్చ = విడువుము, చాపద్వితీయే = ధనస్సే సహాయంగా గల, తాతే=తండ్రి. రణధురమ్=యుద్ధభారమును, వహతి = వహించుచుండగా, భయస్య = భయానికి, అవకాశః = అవకాశం, కః = ఏమున్నది.

అత్రేతి -: ఇక్కడ చతుర్థపాదవాక్యార్థం పునరుక్తం. మొదటి రెండు పాదాలలో చెప్పిన విషయమే చతుర్థపాదంలో చెప్పబడింది గాన పునరుక్తతా దోషం.

అవ. (6) దుష్క్రమానికి ఉదాహరణం చూపుతున్నాడు. లోక విరుద్ధమూ, శాస్త్రవిరుద్ధమూ అయిన క్రమం దుష్క్రమం.

శ్లో॥ భూపాలరత్న నిర్దైన్యప్రదాన ప్రథితోత్సవ
విశ్రాణయ తురఙ్గం మే మాతఙ్గం వా మదాలసమ్. 260

వృ. అత్ర మాతఙ్గస్య ప్రాజ్ నిర్దేశో యుక్తః.

వ్యా. నిర్దైన్య ప్రదాన ప్రథితోత్సవ = దైన్యం పోయేటట్లుగా దానం చేయుట యందు ప్రసిద్ధమైన ఉత్సవం కలవాడా ! భూపాలరత్న=రాజశ్రేష్ఠుడా ! మే= నాకు, తురఙ్గమ్ = గుఱ్ఱమును గాని, మదాలసమ్ = మదంచేత మందమైన, మాతఙ్గం వా = ఏనుగును గాని, విశ్రాణయ = ఇమ్ము.

అత్రేతి. ఇక్కడ ఏనుగును ముందు చెప్పడం యుక్తం. ఏనుగు ఎక్కువ విలువ కలది గాన ముందు ఏనుగును అడిగి, అది ఇవ్వడం శక్యం కాకపోతే గుఱ్ఱాన్ని ఇమ్మ అని అడగడం ఉచితం. ఇది లోకప్రసిద్ధం. అలా లేకపోవడంచేత ఇక్కడ దుష్క్రమత్వదోషం.

అవ. (6) గ్రామ్యానికి ఉదాహరణం చూపుతున్నాడు. వైదగ్ధ్యం, అనగా నేర్పు, మాటలలో సున్నితం లేనివాడు చెప్పే విషయం గ్రామ్యం.

శ్లో॥ స్వపితి యావదయం నికటే జనః
స్వపిమి తావదహం కిమపైతి తే,
తదయి సాంప్రతమాహర కూర్పరం
త్వరితమూరుముదఞ్చయ కుఞ్చితమ్. 261

వృ. ఏషోఽవిదగ్ధః.

వ్యా. స్వపితీతి :- అయి = ఓ ! చిన్నదానా ! అయం జనః = ఈ జనం (ఇంట్లో ఉన్న వాళ్ళందరూ), యావత్ = ఎంతవరకూ, స్వపితి = నిద్రించునో, తావత్ = అంతవరకు, అహమ్ = నేను, నికటే=నీ సమీపమునందు, స్వపిమి= పండుకుంటాను. తే = నీకు, కిమ్ = ఏమి, అపైతి=పోవును ? తత్=ఆ కారణం వలన, సాంప్రతమ్=ఇప్పుడు, కూర్పరమ్=మోచేతిని, ఆహర=తొలగించుము. కుఞ్చితమ్ = ముణవబడిన, ఊరుమ్ = తొడను, త్వరితమ్ = శీఘ్రంగా, ఉదఞ్చయ = చాపుము.

ఏషఇతి :- ఇక్కడ మాటలాడుతున్నవాడు వైదగ్ధ్యం లేని గ్రామీణుడు.

అవ. (7) సందిగ్ధానికి ఉదాహరణం చూపుతున్నాడు. ప్రకరణాదులు లేక పోవడంచేత సందిగ్ధంగా (సందేహాస్పదంగా) ఉన్న అర్థం సందిగ్ధం.

వృ. మాత్సర్యముత్సార్యేత్యాది. 262

అత్ర ప్రకరణాద్యభావే సందేహః. శాన్త శృఙ్గార్యన్యతరాభిధానే తు నిశ్చయః.

వ్యా. 'మాత్సర్య ముత్సార్య' ఇత్యాది శ్లోకం వెనక (133వ శ్లోకం) పంచమోల్లాసంలో వ్యాఖ్యానించబడింది. ఇక్కడ ప్రకరణాదులు లేనప్పుడు భూధరనితంబాలను సేవించా లని చెపుతున్నాడా, లేక కామినీనితంబాలను సేవించా లని చెప్పుతున్నాడా అని సందేహం. అయితే ఈ మాటలు అంటూన్నది శాంతచిత్తుడు అని తెలిసిన పక్షంలో భూధరనితంబాల సేవ్యత్వాన్ని చెపుతున్నాడనీ, శృంగారి అని తెలిసిన పక్షంలో కామినీనితంబాల సేవ్యత్వాన్ని చెపుతున్నాడనీ నిశ్చయం చేయవచ్చును.

అవ. (8) నిర్హేతువుకు ఉదాహరణం చూపుతున్నాడు. హేతువును చెప్పని అర్థం 'నిర్హేతువు'.

శ్లో॥ గృహీతం యేనాసీః పరిభవభయాన్నోచితమపి
ప్రభావాద్యస్యాభూన్న ఖలు తవ కశ్చిన్న విషయః,
పరిత్యక్తం తేన త్వమసి సుతశోకాన్న తు భయా
ద్విమోక్ష్యే శస్త్ర త్వామహమపి యతః స్వస్తి భవతే. 263

వృ. అత్ర శస్త్రవిమోచనే హేతుర్నోక్తః.

వ్యా. గృహీతమితి :- వేణీసంహారం తృతీయాంకంలో ద్రోణాచార్యుడు చంపబడిన పిమ్మట శోకాక్రాంతుడైన అశ్వత్థామ తన శస్త్రంతో అంటూన్న మాటలు. శస్త్ర = ఓ ఆయుధమా! యేన = నాతండ్రియైన ఏద్రోణాచార్యునిచేత, నోచితమపి = తగనిదానవైనా, బ్రాహ్మణునికి అస్త్రగ్రహణం అయుక్తం గాన అనుచితమైనా, పరిభవభయాత్ = శస్త్రధారులవల్ల పరాభవం జరుగుతుం దనే

భయంవల్ల. గృహీతమ్‌ఆసీః=గ్రహింపబడినావో, యస్య=ఏ ద్రోణాచార్యునియొక్క ప్రభావాత్=ప్రభావంవల్ల, తవ=నీకు, కశ్చిత్=ఒక్కడూ కూడ, న విషయః= విషయం (గురి) కానివాడు, నాసీత్ ఖలు = కాలేదో, తేన = అట్టి ద్రోణాచార్యుని చేత, త్వమ్ = నీవు, సుతశోకాత్ = పుత్రశోకంవల్ల, పరిత్యక్తమ్ ఆసి = విడువ బడినావు; భయాత్తు=భయంవల్లనైతే. న= కాదు. త్వామ్=నిన్ను, అహమపి= నేను కూడ, విమోక్ష్యే = విడచెదను. భవతే = నీకు, స్వస్తి = క్షేమం అగుగాక.

అత్రేతి :- ఇక్కడ అశ్వత్థామ ఎందుకు శస్త్రం విడిచిపెడుతున్నాడో హేతువు చెప్పబడ లేదు గాన నిర్హేతుత్వదోషం.

అవ. (8) ఏ విషయంలో ప్రసిద్ధి లేదో అది ప్రసిద్ధివిరుద్ధం, లోకప్రసిద్ధి విరుద్ధం, కవిప్రసిద్ధివిరుద్ధం అని ఇది రెండు విధాలు మొదటిదానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ ఇదం తే కేనోక్తం కథయ కమలాతఙ్కవదనే
యదేతస్మిన్ హేమ్నః కటకమితి ధత్సే ఖలు ధియమ్,
ఇదం తద్దుస్సాధాక్రమణపరమాస్త్రం స్మృతిభువా
తవ ప్రీత్యా చక్రం కరకమలమూలే వినిహితమ్. 264

వృ. అత్ర కామస్య చక్రం లోకే అప్రసిద్ధమ్.

వ్యా. ఇదమితి :- కమలాతఙ్కవదనే = కమలములకు భయకారణమైన ముఖం గలదానా ! ఇదమ్ = ఇది, తే = నీకు, కేన = ఎవనిచేత, ఉక్తమ్=చెప్ప బడింది ? కథయ = చెప్పుము. యత్ = ఏమనగా, ఏతస్మిన్=ఈ వస్తువునందు, హేమ్నః కటకమ్ ఇతి = బంగారు కంకణము అని, ధియమ్ = బుద్ధిని, ధత్సే ఖలు = ధరించుచున్నావు. ఇదమ్=ఇది, స్మృతిభువా=మన్మథునిచేత, ప్రీత్యా= ప్రేమతో, తవ=నీయొక్క, కరకమలమూలే=హస్తపద్మం యొక్క మూలంలో, వినిహితమ్ = ఉంచబడిన, దుఃసాధాక్రమణపరమాస్త్రమ్ = కష్టసాధ్యమైన ఆక్ర మణం కలవారి విషయంలో మహాస్త్రమైన, అనగా సులభంగా జయించడానికి శక్యం కానివాళ్ళ విషయంలో గొప్ప అస్త్రం అయిన, తత్ = ఆ, చక్రమ్= చక్రము. ఇది మన్మథుని అమోఘాస్త్రమైన చక్రం కాని నీవు అనుకొంటున్నట్లుగా బంగారు చేతి కంకణం కాదు అని అర్థం.

అత్రేతి :- ఇక్కడ మన్మథునికి చక్రం లోకంలో అప్రసిద్ధం. మన్మథునికి పుష్పబాణాలే ఆయుధం అని లోకప్రసిద్ధి కాని చక్రం ఆయుధం అన్నట్లు ప్రసిద్ధి లేదు. చక్రాయుధం శ్రీమహావిష్ణువుకే ప్రసిద్ధం.

అవ. కవిప్రసిద్ధివిరుద్ధార్థానికి ఉదాహరణం చూపుతున్నాడు.

వృ. యథా వా-

శ్లో॥ ఉపపరిసరం గోదావర్యాః పరిత్యజతాధ్వగాః
సరణిమపరో మార్గస్తావద్భవద్భిరిహేక్ష్యతామ్,
ఇహ హి విహితో రక్తాశోకః కయాపి హతాశయా
చరణనలినన్యాసోదఞ్చన్నవాఙ్కురకఞ్చుకః. 265

వృ. అత్ర పాదాఘాతేనాశోకస్య పుష్పోద్గమః కవిషు ప్రసిద్ధః న పునరఙ్కురోద్గమః.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా

ఉపపరిసరమితి :- అధ్వగాః = పాంథులారా! గోదావర్యాః = గోదావరి యొక్క, ఉపపరిసరమ్ = ప్రాంతభూమిదగ్గర, సరణిమ్ = మార్గమును, పరిత్యజత = త్యజించండి. భవద్భిః = మీచేత, అపరః = మరి యొక, మార్గః = మార్గం, ఇహ = ఇక్కడ, ఈక్ష్యతాం తావత్ = చూడబడుగాక. హతాశయా = చెడ్డ ఆశ గల, చెడ్డ ఆలోచన గల, కయాపి = ఎవతెచేతనో, ఇహ = గోదావరీప్రాంతమునందు, రక్తాశోకః = రక్తాశోకవృక్షం, చరణనలినన్యాసోదఞ్చన్నవాఙ్కురకఞ్చుకః = పాదపద్మాన్ని ఉంచడంచేత బయల్వెడలిన నూతనాంకుర కంచుకం కలదిగా, విహితః హి = చేయబడింది కదా ?

అత్రేతి - ఇక్కడ పాదాఘాతంచేత అశోకవృక్షానికి పుష్పోద్గమం కలుగుతుం దని కవులలో ప్రసిద్ధం కాని అంకురోద్గమం కాదు. అందుచేత కవిప్రసిద్ధి విరుద్ధం.

అవ. కవిప్రసిద్ధం అయిన పక్షంలో లోకవిరుద్ధం కూడా విరుద్ధం కాదని చెపుతున్నాడు.

శ్లో॥ సుసితవసనాలంకారాయాం కదాచన కౌముదీ
మహసి సుదృశి స్వైరం యాన్త్యాం గతోఽ స్తమభూద్విధుః
తదను భవతః కీర్తిః కేనాప్యగీయత యేన సా
ప్రియగృహమగాన్ముక్తాశఙ్కా క్వ నాసి శుభప్రదః. 266

వృ. అత్రామూర్తాపి కీర్తిః జ్యోత్స్నావత్ప్రకాశరూపా కథితేతి లోకవిరుద్ధమపి కవిప్రసిద్ధేర్న దుష్టమ్.

వ్యా. సుసితేతి :- కదాచన = ఒకానొకరోజున, సుసితవసనాలఙ్కారాయామ్ = బాగా తెల్లనైన వస్త్రాలు అలంకారాలూ గల, తెల్లటి వెన్నెలలో తెల్లటి వస్త్రాదులు ధరించి ప్రియుని దగ్గరకు వెళ్ళేటప్పుడు రంగు రంగులో కలిసిపోయి ఎవరూ గుర్తుపట్ట రనే అభిప్రాయంచేత అని భావం. సుదృశి = చక్కని నేత్రాలు గల ఆమె, కౌముదీమహసి = వెన్నెల కాంతిలో, స్వైరమ్ = స్వేచ్ఛగా, నిర్భయంగా, యాన్త్యామ్ = వెళ్ళుచుండగా, విధుః = చంద్రుడు, అస్తం గతః అభూత్ = అస్తమించినాడు. తదను = అనంతరం, కేనాపి = ఎవనిచేతనో, భవతః = నీ యొక్క, కీర్తిః = కీర్తి, అగీయత = గానం చేయబడెను, యేన = దేనిచేత, సా = ఆమె, ముక్తాశఙ్కా = విడవబడిన ఆశంక కలదై, ప్రియగృహమ్ = ప్రియుని గృహాన్ని గూర్చి, అగమత్ = వెళ్లెను. క్వ = ఎక్కడ, ఎవరి విషయంలో, శుభప్రదః = శుభాన్ని ఇచ్చేవాడవు, నాసి = కావు ? కీర్తి వెన్నెల వలె తెల్లగా ఉండడంచేత ఆమె నిర్భయంగా వెళ్ళిన దని భావం.

అత్రేతి :- ఇక్కడ కీర్తి మూర్తం కాకపోయినా వెన్నెల వలె ప్రకాశరూపమైన దని చెప్పబడింది. ఇది లోకవిరుద్ధమే అయినా కవిప్రసిద్ధి (కీర్తి తెల్లగా ఉంటుం దని కవిసమయం) ఉండడంచేత దుష్టం కాదు.

అవ. (10) శాస్త్రవిరుద్ధమైనదానికి విద్యావిరుద్ధం అని పేరు. దానికి ఉదాహరణ చూపుచున్నాడు.

శ్లో॥ సదా స్నాత్వా నిశీథిన్యాం సకలం వాసరం బుధః,
నానావిధాని శాస్త్రాణి వ్యాచష్టే చ శృణోతి చ. 267

వృ. గ్రహోపరాగాదికం వినా రాత్రౌ స్నానం ధర్మశాస్త్రవిరుద్ధమ్.

వ్యా. సదా ఇతి :- బుధః = ఆ పండితుడు, సదా = ఎల్లప్పుడూ, నిశీథిన్యామ్ = అర్ధరాత్రియందు, స్నాత్వా = స్నానంచేసి, సకలమ్ = సమస్తమైన, వాసరమ్ = దివసమును, రోజంతా అని అర్థం. నానావిధాని = అనేకవిధాలైన, శాస్త్రాణి = శాస్త్రాలను, వ్యాచష్టే = వ్యాఖ్యానిస్తాడు. శృణోతి చ = వింటూ ఉంటాడు.

గ్రహేతి:- చంద్రగ్రహణాదినిమిత్తం లేకుండా రాత్రి స్నానం చెయ్యడం ధర్మశాస్త్రవిరుద్ధం.

అను. అర్థశాస్త్రవిరుద్ధానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అనన్యసదృశం యస్య బలం బాహ్వోః సమీక్ష్యతే,
షాడ్గుణ్యానుసృతి స్తస్య సత్యం సా నిష్ప్రయోజనా. 268

వృ. ఏతత్ అర్థశాస్త్రేణ.

వ్యా. అనన్యేతి :- యస్య = ఎవనియొక్క, బాహ్వోః = బాహువుల యొక్క, బలమ్ = బలము, అనన్యసదృశమ్ = సాటి లేనిదిగా, సమీక్ష్యతే = చూడబడుచున్నదో, తస్య = వానికి, షాడ్గుణ్యానుసృతిః = సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధీభావం, సమాశ్రయణం అనే షడ్గుణాలను అనుసరించడం, నిష్ప్రయోజనా = ప్రయోజనశూన్యమైనది. సత్యమ్ = సత్యము.

ఏతదితి :- ఇది అర్థశాస్త్రంతో విరుద్ధం. రాజు తప్పక షడ్గుణాలను అవలంబించా లని అర్థశాస్త్రం చెపుతున్నది. కేవలబాహుబలంతో రాజ్యం ఏలడం అసాధ్యం.

అను. కామశాస్త్రవిరుద్ధాన్ని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ విధాయ దూరే కేయూరమనఙ్గాఙ్గణమఙ్గనా,
బభార కాన్తేన కృతాం కరజోల్లేఖమాలికామ్. 269

వృ. అత్ర కేయూరపదే నఖక్షతం న విహితమితి ఏతత్కామ శాస్త్రేణ.

వ్యా. విధాయేతి :- అనఙ్గాఙ్గణమ్ = మన్మథుని విహారస్థానమైన, అఙ్గనా = ఒక స్త్రీ, కేయూరమ్ = బాహుపురిని (దండకడియమును), దూరే విధాయ = దూరము నందుంచి, తీసివేసి, కాన్తేన = ప్రియునిచేత, కృతామ్ = చేయబడిన, కరజోల్లేఖ మాలికామ్ = నఖక్షతముల పంక్తిని, బభార = ధరించెను.

అత్రేతి :- దండకడియాలు ధరించేచోట నఖక్షతాలు (కామశాస్త్రంలో) విధింపబడలేదు గాన ఇక్కడ ఇది కామశాస్త్రానికి విరుద్ధం.

అవ. యోగశాస్త్రవిరుద్ధానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అష్టాఙ్గయోగపరిశీలనకీలనేన
దుఃసాధసిద్ధిసవిధం విదధద్విదూరే,
ఆసాదయన్నభిమతామధునా వివేక
ఖ్యాతిం సమాధిధనమౌలిమణిర్విముక్తః. 270

వృ. అత్ర వివేకఖ్యాతిః, తతః సంప్రజ్ఞాతసమాధిః, పశ్చాదసంప్రజ్ఞాతః, తతో ముక్తిః. న తు వివేకఖ్యాతౌ. ఏతత్ యోగశాస్త్రేణ. ఏవం విద్యాన్తరైరపి విరుద్ధముదాహార్యమ్

వ్యా. అష్టాఙ్గేతి :- సమాధిధనమౌలిమణిః = సమాధియే (యోగమే) ధనంగా గలవారిలో శిరోమణి అయిన అతడు, అష్టాఙ్గయోగపరిశీలనకీలనేన = ఎనిమిది అంగాలు గల యోగంయొక్క అనుష్ఠానంయొక్క దార్ఢ్యంచేత, దుఃసాధసిద్ధిసవిధమ్ = సాధింప శక్యం కాని అణిమాద్యష్టసిద్ధుల సామీప్యాన్ని, విదూరే = దూరమునందు, విదధత్ = ఉంచుచు, ఆ సిద్ధులను దూరంగా విడచివేసి, అధునా = ఇప్పుడు, వివేకఖ్యాతిమ్ = ప్రకృతి వేరు పురుషుడు వేరు అను జ్ఞానమును, ఆసాదయన్ = పొందుచు, విముక్తః = ముక్తుడైనాడు. అష్టాంగయోగ- సంప్రజ్ఞాత సమాధి- అసంప్రజ్ఞాతసమాధి - సిద్ధ్యాదులను గూర్చి తెలిసికొనగోరువారు మా పాతంజలయోగదర్శనవ్యాఖ్యను పరిశీలించవచ్చును.

అత్రేతి :— ముందు వివేకఖ్యాతి, తరవాత సంప్రజ్ఞాతసమాధి, తరవాత అసంప్రజ్ఞాతసమాధి, తరవాత మోక్షం అని యోగశాస్త్రం చెపుతున్నది. వివేకఖ్యాతి కలిగినంతమాత్రాన ముక్తి రాదు. అందుచేత ఇది యోగశాస్త్రవిరుద్ధం. ఈ విధంగానే ఇతరవిద్యావిరుద్ధాలకు కూడా ఉదాహరణలు చూచుకొనవచ్చును.

అవ. మరొక భంగిలో చెప్పి క్రొత్తతనం తీసికొనిరానిది 'అనవీకృతం'. అనగా అనేకవిషయాలను ఒకే పద్ధతిలో చెప్పడం. దానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ప్రాప్తాః శ్రియః సకలకామదుఘా స్తతః కిం
దత్తం పదం శిరసి విద్విషతాం తతః కిమ్,
సంతర్పితాః ప్రణయినో విభవై స్తతః కిం
కల్పం స్థితం తనుభృతాం తనుభి స్తతః కిమ్. 271

వృ. అత్ర తతః కిమితి న నవీకృతమ్.

వ్యా. సకలకామదుఘాః = సమస్తకామసుఖాలను పితికే(ఇచ్చే), శ్రియః = ఐశ్వర్యాలు, ప్రాప్తాః = పొందబడ్డాయి, తతః = అందువలన, కిమ్ = ఏమి ? విద్విషతామ్ = శత్రువులయొక్క, శిరసి = శిరస్సుమీద, పదమ్ = అడుగు, దత్తమ్ = ఇవ్వబడింది; ఉంచబడింది; తతః కిమ్ = ఐతే ఏమి ? ప్రణయినః = ప్రేమపాత్రులైనవాళ్ళు, విభవైః = ఐశ్వర్యాలచేత, సంతర్పితాః = తృప్తిపొందించబడ్డారు; తతః కిమ్ = ఐతేమాత్రం ఏమి ? తనుభృతామ్ = దేహధారులయొక్క, తనుభిః = శరీరాలచేత, కల్పమ్ = కల్పకాలం, స్థితమ్ = ఉండుట, తతః కిమ్ = ఐతే ఏమి ?

అత్రేతి :- ఇక్కడ నాలుగు వాక్యాలలోనూ కూడా "ఐతే ఏం, ఐతే ఏం" అని చెప్పడమే జరిగింది. క్రొత్తవిషయం ఏదీ చెప్పబడలేదు. అందుచేత అనవీకృతత్వదోషం.

అవ. నవీకృతం ఎలా ఉంటుందో చెపుతున్నాడు-

వృ. తత్తు యథా-

శ్లో॥ యది దహత్యనలోఽత్ర కిమద్భుతం
యది చ గౌరవమద్రిషు కిం తతః,
లవణమమ్బు సదైవ మహోదధేః
ప్రకృతిరేవ సతామవిషాదితా. 232

వ్యా. నపీకృతత్వం ఎట్లనగా-

యదీతి :- అనలః = అగ్ని, దహతి యది = కాల్చినట్లయితే, అద్భుతమ్ = ఆశ్చర్యం, కిమ్ = ఏమున్నది ? అద్రిషు = పర్వతాలలో, గౌరవం యది = బరువు ఉన్నట్లయితే, తతః = దానివలన, కిమ్ = ఏమి ఆశ్చర్యం ? మహోదధేః = మహాసముద్రంయొక్క, అమ్బు = నీరు, సదైవ = ఎల్లప్పుడూ, లవణమ్ = ఉప్పగా ఉండును. సతామ్=సత్పురుషులకు, అవిషాదితా=దిగులుచెందకుండడం, ప్రకృతిః ఏవ = స్వభావమే.

ఇక్కడ- "సత్పురుషులు విషాదంచెందకపోవడం స్వాభావికమే; ఆశ్చర్య పడవలసిన పని లేదు. అగ్న్యాదులకు దాహకత్వాదులు ఏ విధంగా ఆశ్చర్య కరాలు కావో అట్లే"అని చెప్పేటప్పుడు సమానమైన భావం వేరు వేరు విధాలుగా ప్రకటించబడింది. "కిమద్భుతమ్" అనేది "తతః కిమ్" అనే దానిచేత నపీకృతం అయింది. 'తతః కిమ్' అనేది 'సదైవ' అనేదానిచేత నపీకృతం అయింది. అది 'ప్రకృతిరేవ' అనేదానిచేత నపీకృతం అయింది. ఈ విధంగా 'కిమద్భుతమ్' అనే అర్థాన్నే వేరు వేరు భంగులలో చెప్పడం జరిగింది గాన నపీకృతత్వం లభించింది.

అవ. (12) సనియమంగా ఉన్నట్లు చెప్పవలసినదానిని అనియమంగా చెప్పినట్లయితే అది సనియమపరివృత్తం. దానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ యత్రానుల్లిఖితార్థమేవ నిఖిలం నిర్మాణమేతద్విధే
రుత్కర్షప్రతియోగి కల్పనమపి న్యక్కారకోటిః పరా,
యాతాః ప్రాణభృతాం మనోరథగతీరుల్లఙ్ఘ్య యత్సమ్పద
స్తస్యాభాసమణీకృతాశ్మసు మణేరశ్మత్వమేవోచితమ్.

వృ. అత్ర "ఛాయామాత్రమణీకృతాశ్మసు మణేస్తస్యాశ్మతైవో చితా"ఇతి సనియమత్వం వాచ్యమ్.

వ్యా. యత్రేతి :- యత్ర = ఏ చింతామణి ఉండగా, విధేః = బ్రహ్మ దేవునియొక్క, ఏతత్ = ఈ, నిర్మాణమ్ = సృష్టి, నిఖిలమ్ = సమస్తమూ, అను ల్లిఖితార్థమేవ = చూడబడని ప్రయోజనం కలది అవుతుంతో; దేనిముందు ఈ సృష్టి అంతా ప్రయోజనశూన్యంగా కనబడుతుందో, ఉత్కర్షప్రతియోగికల్పనమపి = ఉత్కర్షయందు సామ్యంయొక్క కల్పనం కూడా, పరా = గొప్ప, న్యక్కార కోటిః = అవమానకోటియో, దీనితో మరొక వస్తువును పోల్చడం కూడా దీనికి గొప్ప అవమానమే అని అర్థం. యత్సమ్పదః = దేని సంపదలు. ప్రాణభృతామ్ = ప్రాణులయొక్క, మానవులయొక్క, మనోరథగతీః = మనోరథమార్గాలను, ఉల్లఙ్ఘ్య = దాటి, యాతాః = వెళ్ళినవో, దీని సంపదలు మనోరథాలకు కూడా అందవు అని అర్థం. తస్య = అట్టి, మణేః = చింతామణికి. ఆభాసమణీకృతాశ్మసు = కొంచెం ప్రకాశచేత మణులుగా చేయబడిన (పరిగణించబడిన) రాళ్ళ మధ్య, అశ్మత్వమేవ = రాయిగా ఉండడమే, ఉచితమ్ = తగినది. కొంచెం ప్రకాశం ఉన్నంతమాత్రంచేత మణులం అని చెప్పుకొనేవాటి మధ్య ఉన్నప్పుడు చింతామణి రాయిగా ఉండడమే మంచిది. వాటితోపాటు ఇదీ మణి అనడం మంచిది కాదు.

అత్రేతి :- ఇక్కడ 'ఛాయామాత్రమణీకృతాశ్మసు మణేస్తస్యాశ్మతైవో చితా' అని సనియమత్వం ఉచితం.

వి. ఆభాసచేత (కొంచెం కాంతి ఉండడంచేత) మణులుగా చేయబడిన అని చెపితే చాలదు. 'ఆభాసమాత్రంచేత' 'కొంచెం మెరుపు ఉన్నంతమాత్రంచేత' అని సనియమత్వం చెప్పాలి. అనగా మణు లని చెప్పేవాటిలో ఉన్న గుణం అల్లా కొంచెం మెరుపుమాత్రమే; ఇతరగుణా లేవీ లేవు అనే అర్థం వచ్చేటట్లుగా "ఛాయా మా త్రమణీకృతాశ్మసు"అని 'మాత్ర'శబ్దం చేరుస్తే సనియమత్వం వస్తుంది అది లేకపోవడంచేత ఇక్కడ 'సనియమపరివృత్తత్వదోషం'.

అవ. (13) అనియమపరివృత్తానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ వక్త్రామ్భోజం సరస్వత్యధివసతి సదా శోణ ఏవాధరస్తే
బాహుః కాకుత్స్థవీర్యస్మృతికరణపటుర్దక్షిణస్తే సముద్రః,

వాహిన్యః పార్శ్వమేతాః క్షణమపి భవతో నైవ ముఞ్చన్త్యభీక్ష్ణం
స్వచ్ఛే న్తర్మానసేఽస్మిన్ కథమవనిపతే తేఽమ్బుపానాభిలాషః.

వృ. అత్ర 'శోణ ఏవ' ఇతి నియమో న వాచ్యః.

వ్యా. వక్త్రేతి:- వేటకి వెళ్లి దప్పికొని "ఏలోశీరలవఙ్గచన్దనలసత్కర్పూర కస్తూరికాజాతీపాటలకేతకైః సురభితం పానీయమానీయతామ్" అని మంచినీళ్ళు తెమ్మంటున్న విక్రమార్కునితో మాగధుడు (స్తోత్రపాఠకుడు) అన్న శ్లోకంగా భోజప్రబంధంలో ఉంది. అవనిపతే=రాజా! వక్త్రామ్భోజమ్ = నీ ముఖపద్మాన్ని, సదా=ఎల్లప్పుడూ, సరస్వతీ=సరస్వతి, అధివసతి=అధిష్ఠించిఉన్నది. సరస్వతీ అనగా విద్యాధిదేవియైన సరస్వతీదేవి, సరస్వతీనది అని రెండర్థాలు, తే= నీయొక్క, అధరః=అధరోష్ఠము, శోణః ఏవ=శోణమే. ఎఱ్ఱగా ఉన్నది, శోణం అనే ఒక నదం అని రెండర్థాలు. తూర్పుకు ప్రవహించేవి నదులు అనీ, నర్మద తప్ప పడమరకు ప్రవహించేవి నదాలనీ అంటారు. కాకుత్స్థవీర్యస్మృతికరణపటుః = శ్రీరాముని పరాక్రమాన్ని స్మరింపచేయడంలో సమర్థమైన, తే = నీయొక్క, దక్షిణః బాహుః = కుడి చెయ్యి, దక్షిణః సముద్రః = దక్షిణసముద్రం. ఏతాః = ఈ, వాహిన్యః = వాహినులు, సేనలు, నదులు అని రెండర్థాలు, క్షణమపి = క్షణ కాలమైనా, భవతః = నీయొక్క, పార్శ్వమ్ = పార్శ్వమును, నైవ ముఞ్చన్తి = విడచుటలేదు. అభీక్ష్ణమ్=మిక్కిలి, స్వచ్ఛే=స్వచ్ఛమైన, తే=నీయొక్క, అస్మిన్ = ఈ, అన్తర్మానసే=మనస్సులో, మానససరస్సు అని కూడా అర్థం. అమ్బుపానాభి లాషః = జలపానాభిలాష, కథమ్ = ఎట్లు ?

అత్రేతి :- ఇక్కడ 'శోణః ఏవ' అని నియమం చెప్పదగినది కాదు. 'శోణము' అని చెప్పగానే ఇతరనదుల వలె శోణనదం కూడ స్ఫురిస్తుంది. అంత మాత్రం చాలు. శోణమే అని నిర్ధారణ అనావశ్యకం. అందుచేత అనియమపరి వృత్తత్వదోషం

అవ. (14) విశేషపరివృత్తానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ శ్యామాం శ్యామలిమానమానయత భోః సాన్ద్రైర్మషీకూర్చకై
ర్మన్త్రం తన్త్రమథ ప్రయుజ్య హరత శ్వేతోత్పలానాం శ్రియమ్,

చన్ద్రం చూర్ణయత క్షణాచ్చ కణశః కృత్వా శిలాపట్టకే
యేన ద్రష్టుమహం క్షమే దశదిశ స్తద్వ క్త్రముద్రాఙ్కితాః.

వృ. అత్ర 'జ్యోత్స్నమ్' ఇతి శ్యామావిశేషో వాచ్యః.

వ్యా. శ్యామామితి :- రాజశేఖరుని విద్ధసాలభంజికలో ప్రియావియోగంతో బాధపడుతూన్న రాజు మాటలు. భోః = ఓ ! పరిజనులారా ! సాన్ద్రైః=దట్టమైన, మషీకూర్చకైః = నల్లరంగు కుంచెలచేత, శ్యామామ్ = రాత్రిని, శ్యామలిమానమ్ = నలుపును, ఆనయత = పొందించండి. మన్త్రమ్ = మంత్రమునూ, అథ = మరియు, తన్త్రమ్=తంత్రమునూ, ప్రయుజ్య = ప్రయోగించి, శ్వేతోత్పలానామ్ = తెల్లకలవలయొక్క, శ్రియమ్ = శోభను, హరత = హరించండి. క్షణాత్ = క్షణకాలంలో, శిలాపట్టకే = రాతిపలకమీద, కృత్వా = ఉంచి, చన్ద్రమ్ = చంద్రుణ్ణి, కణశః = కణాలుగా, చూర్ణయత = చూర్ణం చెయ్యండి, యేన = దేని చేత (ఇలా చేయడంచేత), అహమ్ = నేను, తద్వక్త్రముద్రాఙ్కితాః = ఆమె యొక్క ముఖముద్రలచేత చిహ్నితములైన, దశ = పది, దిశః = దిక్కులను, ద్రష్టుమ్ = చూచుటకు, క్షమే = సమర్థుడను అగుదునో. నా మనస్సుకు బాధ కలిగించే వీటిని అన్నింటినీ తొలగిస్తే నేను భావనాబలంచేత ఆమె ముఖాన్ని అన్ని దిక్కులలోను చూడగలుగుతాను అని భావం.

అత్రేతి :- ఇక్కడ 'జ్యోత్స్నమ్'అని శ్యామావిశేషాన్ని చెప్పాలి.

'శ్యామా'అనగా సామాన్యరూపంగా రాత్రి అని అర్థం. చీకటి రాత్రి కావచ్చు, వెన్నెల రాత్రి కావచ్చు. చీకటిరాత్రిని మసితో నల్లగా చేయవలసిన పని లేదు. వెన్నెలరాత్రినే చెయ్యాలి. అందుచేత రాత్రిసామాన్యవాచకమైన 'శ్యామా'శబ్దానికి బదులు, వెన్నెలరాత్రి అనే అర్థం గల 'జ్యోత్స్నమ్' అనే పదం ప్రయోగించడం యుక్తం. ఈ విధంగా ఇక్కడ రాత్రివిశేషవాచకానికి బదులు సామాన్యవాచకాన్ని చెప్పడంచేత విశేషపరివృత్తత్వదోషం.

అవ. (15) అవిశేషపరివృత్తానికి (సామాన్యపరివృత్తానికి) ఉదాహరణం చూపుతున్నారు-

శ్లో॥ కల్లోలవేల్లితదృషత్పరుషప్రహారై
రత్నాన్యమూని మకరాలయ మావమంస్థాః,
కిం కౌస్తుభేన విహితో భవతో న నామ
యాచ్ఞాప్రసారితకరః పురుషోత్తమోఽపి. 275

వృ. అత్ర "ఏకేన కిం న విహితో భవతః స నామ" ఇతి సామాన్యం వాచ్యమ్.

వ్యా. కల్లోలేతి :- భల్లటశతకంలోని పద్యం. మకరాలయ=సముద్రుడా! కల్లోలవేల్లితదృషత్పరుషప్రహారైః=పెద్ద తరంగాలచేత చలింపచేయబడిన రాళ్ల యొక్క తీవ్ర ఆఘాతములచేత, అమూని రత్నాని= ఈ రత్నాలను, మావమంస్థాః= అవమానించకుము. భవతః=నీయొక్క, కౌస్తుభేన=కౌస్తుభమాణిక్యం చేత, పురుషోత్తమః అపి=శ్రీమహావిష్ణువు కూడ, యాచ్ఞాప్రసారితకరః=యాచించుట యందు చాపబడిన చెయ్యి కలవాడుగా, న నామ విహితః కిమ్ = చేయబడలేదా ?

అత్రేతి :- ఇక్కడ "ఏకేన కిం న విహితో భవతః స నామ" అని సామాన్యం చెప్పదగినది.

వి. 'ఇక్కడ నీ కౌస్తుభమాణిక్యం సాక్షాత్తు శ్రీమహావిష్ణువు కూడా నీ ముందు చెయ్యి చాపే టట్లు చేసింది'అని రత్నవిశేషం అయిన కౌస్తుభాన్ని పేర్కొనడంచేత దాన్ని అవమానించకపోయినా, ఇతరరత్నాలను అవమానించడంలో దోషం లేదు కదా అనే ప్రశ్న వస్తుంది. అందుచేత విశేషానికి బదులు సామాన్యార్థం వచ్చేటట్లు "నీ రత్నాలలో ఒక రత్నం ఇలా చేసింది కదా ?"అన్నప్పుడు ఇతరరత్నాలు కూడా అలా చేయవచ్చును; అందుచేత వాటిని అవమానించవద్దు అని చెప్పినట్లు అవుతుంది. ఇక్కడ సామాన్యానికి బదులు విశేషాన్ని చెప్పడం చేత అవిశేషపరివృత్తత్వదోషం.

అవ. (16) సాకాంక్షానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అర్థిత్వే ప్రకటీకృతేఽపి న ఫలప్రాప్తిః ప్రభోః ప్రత్యుత
ద్రుహ్యన్ దాశరథిర్విరుద్ధచరితో యుక్తస్తయా కన్యయా,

ఉత్కర్షం చ పరస్య మానయశసోర్విస్రంసనం చాత్మనః
స్త్రీరత్నం చ జగత్పతిర్దశముఖో దేవః కథం మృష్యతే.

వృ. అత్ర స్త్రీరత్నమ్ 'ఉపేక్షితుమ్' ఇత్యాకాఙ్క్షతి. న హి పరస్యే త్యనేన సమ్బన్ధో యోగ్యః.

వ్యా. అర్థిత్వే ఇతి :- మహావీరచరితంలో సీత లభించదని నిరాశచెందిన రావణామాత్యుడైన మాల్యవంతుని మాట లివి. అర్థిత్వే = యాచకత్వం (నన్ను దూతగా పంపడం ద్వారా) ప్రకటీకృతేఽపి = ప్రకటించబడినా కూడ, ప్రభోః = సమర్థుడైన రావణునికి, ఫలప్రాప్తిః = ఫలలాభం, న = కలగలేదు. ప్రత్యుత = దీనికివిపరీతంగా, అర్థిత్వం సఫలం కాకపోవడం అటుండగా, ద్రుహ్యన్ = (తాటకావధాధికంచేత) ద్రోహంచేసిన, విరుద్ధచరితః=విరుద్ధమైన నడవడిక గల, దాశరథిః = రాముడు, తయా కన్యయా = ఆ కన్యతో, యుక్తః = కూడినాడు. పరస్య = శత్రువుయొక్క, ఉత్కర్షమ్ = ఉత్కర్షను, ఆత్మనః = తనయొక్క, మానయశసోః = గౌరవకీర్తులయొక్క, విస్రంసనం చ = భ్రంశాన్ని, స్త్రీరత్నం చ = స్త్రీరత్నమైన సీతనూ, జగత్పతిః = జగత్తుకు ప్రభువు, దేవః = విజిగీషువు, జయేచ్ఛకలవాడూ అయిన, దశముఖః = రావణుడు, కథమ్ = ఎట్లు, మృష్యతే = సహిస్తాడు ?

అత్రేతి :- ఇక్కడ 'స్త్రీరత్నమ్' అనేది 'ఉపేక్షితుమ్' అనేదానిని ఆకాంక్షిస్తున్నది. దీనికి పరస్య అనేదానితో సంబంధం యోగ్యం కాదు కదా?

వి. శత్రువుయొక్క ఉత్కర్షనూ తనకు జరిగిన అవమానాన్నీ ఎట్లు సహిస్తాడు ? అని అనడం యుక్తమే. 'స్త్రీరత్నమైన సీతను ఎలా సహిస్తాడు' అంటే అర్థం లేదు. ఆమెయందు ద్వేషం లేదు కదా? అందుచేత 'స్త్రీరత్నమ్'అనే పదం యొక్క అర్థం "ఉపేక్షితుమ్" 'ఉపేక్షించుటకు'అనే పదంయొక్క అర్థాన్ని అపేక్షిస్తున్నది. 'స్త్రీరత్నమ్' అనేదానిని తృతీయపాదంలోని 'పరస్య' అనేదానితో అన్వయించి 'పరుని స్త్రీరత్నం' అని అర్థం చెప్పడం కుదరదు. 'పరస్య' కు 'ఉత్కర్షం' అనేదానితో అన్వయించడం జరిగిపోయిందికదా ?

అప. (18) అపదయుక్తం అనగా తగని స్థానంలో సంబంధించినది.

అనగా ప్రకృతార్థానికి విరుద్ధమైన అర్థం చెప్పే పదాలు ఉండడం అని అర్థం. ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ ఆజ్ఞా శక్రశిఖామణిప్రణయినీ శాస్త్రాణి చక్షుర్నవం
భక్తిర్భూతపతౌ పినాకిని పదం లఙ్కేతి దివ్యా పురీ,
ఉత్పత్తిర్ద్రుహిణాన్వయే చ తదహో నేదృగ్వరో లభ్యతే
స్యాచ్చేదేష న రావణః క్వ ను పునః సర్వత్ర సర్వే గుణాః.

వృ. అత్ర "స్యాచ్చేదేష న రావణః" ఇత్యత ఏవ సమాప్యమ్.

వ్యా. ఆజ్ఞా ఇతి :— ఇది రాజశేఖరుని బాలరామాయణం ప్రథమాంకంలోనిది. జనకుని పురోహితుడైన శతానందుడు-"ఆశ్చర్యమ్; ఏకోఽపి గరీయాన్ దోషః సమగ్రమపి గుణగ్రామం దూషయతి. తథాహి"(ఆశ్చర్యము! పెద్ద దోషం ఒక్కటే అయినా సమస్తగుణసముదాయాన్నీ పాడుచేస్తుంది. అది యుక్తమే కదా) అని ఉపక్రమించి జనకునితో అన్న మాటలివి. ఆజ్ఞా = ఆజ్ఞ, శక్రశిఖామణిప్రణయినీ = దేవేంద్రుని శిఖామణియందు ప్రేమ గలది. దేవేంద్రునికి శిరోధార్యమైనది. శాస్త్రాణి = శాస్త్రాలు, నవమ్ = నూతనమైన, చక్షుః = నేత్రం. భూతపతౌ = భూతములపతి అయిన, పినాకిని = ఈశ్వరునియందు, భక్తిః = భక్తి. లఙ్కా ఇతి = లంక అనే, దివ్యా = దివ్యమైన, పురీ = పట్టణం, పదమ్ = నివాసస్థానం. ఉత్పత్తిః చ = పుట్టుక కూడ, ద్రుహిణాన్వయే = బ్రహ్మదేవుని వంశంలో. ఏషః = ఇతడు, రావణః=లోకాల్ని ఏడ్పించిన రావణుడు, న స్యాత్ చేత్=కాకపోతే, ఈదృక్ = ఇట్టి, వరః = వరుడు, న లభ్యతే = పొందబడడు. సర్వత్ర = ప్రతి వానిలోనూ, సర్వే గుణాః = అన్ని గుణాలూ, క్వ ను పునః = ఎక్కడ ఉన్నవి.

అత్రేతి :- ఇక్కడ "స్యాచ్చేదేష న రావణః" అనే దానితో పూర్తి చెయ్యాలి.

వి. "ఆశ్చర్యమ్; ఏకోఽపి...."ఇత్యాది వాక్యంతో కలిపి ఈ శ్లోకం చదవగా ఈ రావణుణ్ణి ఉపేక్షించడమే మంచిది అని చెపుతున్నట్లు స్పష్టం అవుతున్నది. అందుచేత ఈ శ్లోకానికి 'ఇతడు రావణుడే కాకపోతే మిగిలినవి అన్నీ బాగానే ఉన్నాయి; కాని వీని రావణత్వం గుణా లన్నింటినీ అణగద్రొక్కేసింది'

అని అర్థం కుదురుతుంది. అదే శతానందుడు చెప్పదలచింది కూడా. అయితే "అన్ని గుణాలు అందరిలోను ఎక్కడ ఉంటాయి?" అనడంలో "ఈ దోషం ఉన్నా రావణునికి సీతను ఇవ్వవచ్చును" అనే అర్థం వస్తుంది. అది అయుక్తం. అందుచేత ఇక్కడ సంబంధం ఉండకూడనిదానితో, "స్యాచ్చేదేష న రావణః" అనేదానితో, ఇతరపద్యభాగానికి సంబంధం ఏర్పడింది కాబట్టి అపదయుక్తత్వదోషం.

అవ. (18) చెప్పబడిన విషయాలలో ఒకటి రెండు, మిగిలినవాటితో, ఉత్కృష్టత్వంచేత గాని, అపకృష్టత్వంచేత గాని, విజాతీయంగా ఉన్నట్లయితే అది సహచరభిన్నం. దానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ శ్రుతేన బుద్ధిర్వ్యసనేన మూర్ఖతా
మదేన నారీ సలిలేన నిమ్నగా,
నిశా శశాఙ్కేన ధృతిః సమాధినా
నయేన చాలంక్రియతే నరేన్ద్రతా. 279

వృ. అత్ర శ్రుతాదిభిరుత్కృష్టైః సహచరితైః వ్యసనమూర్ఖత్వయోః భిన్నత్వమ్.

వ్యా. శ్రుతేనేతి :- శ్రుతేన = శాస్త్రాభ్యాసంచేత, బుద్ధిః = బుద్ధీ, వ్యసనేన = వ్యసనంచేత, మూర్ఖతా = మూర్ఖత్వమూ, మదేన = మదంచేత, నారీ = స్త్రీ, సలిలేన = ఉదకంచేత, నిమ్నగా = నదీ, శశాఙ్కేన = చంద్రునిచేత, నిశా = రాత్రీ, సమాధినా = యోగంచేత, ధృతిః = ధైర్యమూ, నయేన = నీతిచేత, నరేన్ద్రతా చ = రాజత్వమూ, అలంక్రియతే = అలంకరించబడును.

అత్రేతి :- ఇక్కడ కలిపి చెప్పబడిన ఉత్కృష్టములైన శ్రుతాదులతో, వాటికంటె భిన్నములైన, నికృష్టములైన వ్యసనమూర్ఖత్వాలు చెప్పబడ్డాయి. అందుచేత సహచరభిన్నత్వదోషం

అవ. (19) 'ప్రకాశితవిరుద్ధం' అనగా చెప్పదలచిన అర్థానికి విరుద్ధమైన అర్థాన్ని వ్యంజింపచేసే వాక్యార్థం. దానికి ఉదాహరణం చూపుతున్నాడు..

వృ. "లగ్నం రాగావృతాఙ్గ్యా" (280) ఇత్యత్ర "విదితం తేఽస్తు" ఇత్యనేన శ్రీస్తస్మాదపసరతీతి విరుద్ధం ప్రకాశ్యతే.

వ్యా. 'లగ్నం రాగావృతాఙ్గ్యా' ఇత్యాదిశ్లోకంలో (చూ. 241వ శ్లోకం) 'విదితం తే అస్తు'అనే అవాంతరవాక్యం 'లక్ష్మి రాజును విడచి వెళ్ళిపోతూన్నది' అనే, రాజస్తుతికి విరుద్ధమైన, అర్థం స్ఫురిస్తూన్నది.

అవ. (20) 'విధ్యయుక్తం' అనగా అయుక్తమైనదాని విధి అని అర్థం. విధించతగనిది విధేయంగా ఉండడం, క్రమం అయుక్తంగా ఉండడం అని ఇది రెండు విధాలు. మొదటిదానికి ఉదాహరణం చూపుతున్నారు-

శ్లో॥ప్రయత్నపరిబోధితః స్తుతిభిరద్య శేషే నిశా
మకేశవమపాణ్డవం భువనమద్య నిఃసోమకమ్,
ఇయం పరిసమాప్యతే రణకథాద్య దోఃశాలినా
మపైతు రిపుకాననాతిగురురద్య భారో భువః. 281

వి. అత్ర 'శయితః ప్రయత్నేన బోధ్యసే' ఇతి విధేయమ్

వ్యా. ప్రయత్నేతి :- వేణీసంహారంలో తండ్రిని వధించడంచేత కోపించిన అశ్వత్థామ శత్రువుల విషయంలో ప్రతిక్రియ చేయవలె ననే ఇచ్ఛతో దుర్యోధనునికి ధైర్యం చెపుతూ అన్న మాటలు. అద్య=ఇప్పుడు, ఇటుపైన, స్తుతిభిః= స్తుతులచేత, ప్రయత్న పరిబోధితః = ప్రయత్నంచేత మేల్కొలుపబడినవాడవై, నిశామ్ = రాత్రిని, రాత్రి అంతా, శేషే = శయనించగలవు. అద్య = ఇప్పుడు, భువనమ్ = లోకమును, అకేశవమ్ = కృష్ణుడు లేనిదానినిగాను, అపాణ్డవమ్ = పాండవులు లేనిదానినిగాను, నిఃసోమకమ్ = పాంచాలులు లేని దానిగాను, చేయనున్నాను. అద్య = ఇప్పుడు, దోఃశాలినామ్ = బాహుబలశాలులైన వీరులయొక్క, రణకథా = యుద్ధకథ, పరిసమాప్యతే = సమాప్తి పొందింపబడుచున్నది. అద్య= ఇప్పుడు, భువః = భూమియొక్క, రిపుకాననాతిగురుః = శత్రువనంచేత చాల బరువైన, భారః = భారం, అపైతు = తొలగుగాక.

అత్రేతి :- ఇక్కడ "నిద్రపోయిన నీవు ప్రయత్నంచేత మేల్కొలుపబడగలవు"అని విధించాలి.

వి. "ఇంతవరకు నీవు పాండవులవల్ల భయంచేత సుఖంగా నిద్రపోలేకుండా ఉన్నావు. నేను వాళ్ళ నందరినీ సంహరించగలను. అప్పుడు నువ్వు

సుఖంగా గాఢనిద్ర పొంది ప్రయత్నపూర్వకంగా వందిమాగధులచేత మేల్కొలుపబడగలవు"అని భావం. ఈ విధంగా మేల్కొలుపబడడం విధేయం కావాలి. కాని ఇక్కడ 'శయనించగలవు' అని శయనం విధేయంగా చెప్పబడింది. అందుచేత అయుక్తవిధిత్వదోషం.

అవ. ద్వితీయభేదానికి ఉదాహరణం చూపుతున్నాడు.

వృ. యథా వా

శ్లో॥ వాతాహారతయా జగద్విషధరైరాశ్వాస్య నిఃశేషితం
తే గ్రస్తాః పునరభ్రతోయకణికాతీవ్రవ్రతైర్బర్హిభిః,
తేఽపి క్రూరచమూరుచర్మవసనైర్నీతాః క్షయం లుబ్ధకై
ర్దమ్భస్య స్ఫురితం విదన్నపి జనో జాల్మో గుణానీహతే.

వృ. అత్ర వాతాహారాదిత్రయం వ్యుత్క్రమేణ వాచ్యమ్.

వ్యా. వాతేతి :- ఇది భల్లటశతకంలోని పద్యం. విషధరైః=సర్పాలచేత, వాతాహారతయా = వాయుభక్షణవ్రతం కలవగుటచేత, ఆశ్వాస్య = విశ్వాసం కలిగించి, జగత్ = జగత్తు, నిఃశేషితమ్ = అంతా నశింపచేయబడింది. మునులవలె వాతాశనాలు అవడంచేత చాలా మంచివనే భ్రాంతిని కలిగించి సర్పాలు జగత్తును నశింపచేస్తున్నాయి తే పునః = అవి అయితే, అభ్రతోయకణికాతీవ్రవ్రతైః=మేఘంనుండి పడే జలబిందువులనే (బిందువులను మాత్రమే) త్రాగడం అనే తీవ్రమైన వ్రతం గల, బర్హిభిః = నెమళ్ళచేత, గ్రస్తాః = మింగివేయబడినవి. కొందరు మునులవలె జలంమాత్రమే ఆహారం తీసికొంటూన్నట్లు కనబడుతూ నెమళ్ళు సర్పాలను చంపివేస్తున్నాయి. తేఽపి = ఆ నెమళ్ళు కూడా, క్రూరచమూరుచర్మవసనైః=కఠినమైన చిత్రమృగచర్మ వస్త్రంగాగల, లుబ్ధకైః= బోయవాళ్ళచేత, క్షయమ్ = క్షయమును, నీతాః = పొందించబడినవి. జాల్మః= మూర్ఖుడైన, జనః = పామరజనుడు, దమ్భస్య = దంభంయొక్క, ఇతరులను మోసగించడం కోసం ధర్మాన్ని ఆచరించడం దంభం. స్ఫురితమ్ = చేష్టను, విదన్నపి = ఎరిగినవాడైనా, గుణాన్ = ధార్మికత్వాదిగుణాలనే, ఈహతే = కోరుతాడు, ఊహిస్తాడు. ఇతరులను మోసంచేయడంకోసమే ధర్మాచరణం చేస్తున్నాడు

అని తెలిసి కూడా పామరులు డాంభికులలో ధార్మికత్వాదిగుణాలు ఉన్నాయని అనుకొని మోసపోతారు అని అర్థం.

అత్రేతి :- ఇక్కడ వాతాహారాదిత్రయం వ్యుత్క్రమంచేత, చెప్పిన క్రమానికి విరుద్ధమైన క్రమంచేత, చెప్పడం యుక్తం.

వి. మృగచర్మను వస్త్రంగా ధరించడం, మేఘజలబిందుపానం, వాయుభక్షణం అనేవి ఒకదానికంటె ఒకటి (ఉత్తరోత్తరం) తీవ్రమైనవి. అందుచేత ఆ క్రమంలోనే విధి యుక్తం. ఇక్కడ దానికి విరుద్ధంగా చెప్పడంచేత అయుక్తక్రమత్వంవల్ల ఏర్పడిన విధ్యయుక్తత్వం. విధి అనగా తెలియనిదానిని తెలపడం. ఇక్కడ నిఃశేషం చేయడం, గ్రాసం, నశింపచేయడం అనేవి విధేయాలు.

అవ. (21) సిద్ధమైన విషయాన్ని చెప్పడం అనువాదం. అనువాదం విధికి అనుగుణంగా లేకపోతే అది అనువాదాయుక్తం. అనగా అయుక్తమైన అనువాదం. దీనికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అరే రామాహస్తాభరణ భసలశ్రేణీశరణ
స్మరక్రీడావ్రీడాశమన విరహిప్రాణదమన,
సరోహంసోత్తంస ప్రచలదల నీలోత్పల సఖే
సఖేదోఽహం మోహం శ్లథయ కథయ క్వేన్దువదనా.283

వృ. అత్ర 'విరహిప్రాణదమన' ఇతి నానువాద్యమ్.

వ్యా. అరే ఇతి :- ఇది విక్రమోర్వశీయంలోనిది అని చాలమంది వ్యాఖ్యాతలు వ్రాశారు కాని ఇది అందులో లేదని బాలబోధినీ కారుడు. రామా హస్తాభరణ = స్త్రీల హస్తములలో ఆభరణమైనదానా ! భసల శ్రేణీశరణ=తుమ్మెదల పంక్తికి శరణమా ! స్మరక్రీడావ్రీడాశమన = మన్మథక్రీడలయందు సిగ్గును శమింపచేయుదానా, విరహిప్రాణదమన = విరహవంతుల ప్రాణాలను నశింపచేసేదానా ! సరోహంసోత్తంస = శ్రేష్ఠమైన సరస్సుకు భూషణమా! ప్రచలదల = కదలుచున్న దళములు కలదానా! సఖే = మిత్రమా, అరే నీలోత్పల = ఓ! నల్లకలువా! అహమ్ = నేను, సఖేదః = ఖేదంతో కూడినవాడను. ఇన్దువదనా =

ఆ చంద్రవదన, క్వ = ఎక్కడ ఉన్నది ? కథయ = చెప్పుము, మోహమ్ = మోహమును, శ్లథయ = శిథిలం చేయుము.

అత్రేతి :- ఇక్కడ 'విరహిప్రాణదమన' అని అనువదించకూడదు. అనగా విరహంతో బాధపడుతున్నవాడు 'నా మోహాన్ని తొలగించుము' అని ప్రార్థిస్తూ "నువ్వు విరహుల ప్రాణాలు తీసేదానవు" అని అనువదించడం యుక్తం కాదు. అందుచేత ఈ అనువాదం 'నా మోహాన్ని తొలగించు' అనే విధికి తగనిదిగా లేదు గాన 'అనువాదాయుక్తం' అని అర్థం.

అవ. పూర్వం విడిచివేసి మళ్ళీ స్వీకరించబడినది "త్యక్తపునఃస్వీకృతం'.

వృ. "లగ్నం రాగావృతాఙ్గ్యా" ఇత్యాది. 284

అత్ర 'విదితం తేఽస్తు" ఇత్యుపసంహృతోఽపి పునరుపాత్తః.

వ్యా. 'లగ్నం రాగావృతాఙ్గ్యా' ఇత్యాది శ్లోకంలో (చూ. 241 వ శ్లోకం) 'నీకు తెలియబడుగాక' అని పూర్తిచేసిన విషయాన్ని 'తేన' ఇత్యాది వాక్యంచేత మళ్ళీ కొనసాగించడం జరిగింది. అందుచేత ఇది సమాప్తపునఃస్వీకృతం'. ఇదే 'త్యక్తపునఃస్వీకృతం'

అను. (23) 'అశ్లీలం' అనగా వ్రీడాదులను కలిగించే అర్థం. దానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ హన్తుమేవప్రవృత్తస్య స్తబ్ధస్య వివరైషిణః,
యథాస్య జాయతే పాతో న తథా పునరున్నతిః. 285

వృ. అత్ర పుంవ్యంజనస్యాపి ప్రతీతిః. యత్రైకో దోషః ప్రదర్శితః తత్ర దోషాన్తరాణ్యపి సన్తి. తథాపి తేషాం తత్రాప్రకృతత్వాత్ ప్రకాశనం న కృతమ్.

వ్యా. హన్తుమితి :- హన్తుమేవ = హింసించుటకే, సురతక్రియారూప యోనితాడనం చేయుటకే అని మరొక అర్థం, ప్రవృత్తస్య = ఉద్యుక్తుడూ, ఉద్యుక్తమూ, స్తబ్ధస్య = వినయం లేనివాడు. ఉన్నతము, వివరైషిణః = వరుల దోషాలను అన్వేషించేవాడు, వివరాలు అన్వేషించేది అయిన. అస్య = వీనికి, దీనికి ,..

పాతః = పాతము, యథా = ఎట్లు కలుగునో, తథా = అట్లు, పునః ఉన్నతిః = మరల ఉన్నతి, న = కలుగదు.

అత్రేతి :- ఇక్కడ పురుషలింగప్రతీతి కూడ కలుగుచున్నది. (అందు చేత వ్రీడాజనకాశ్లీలం). ఒక దోషం చూపిన ఉదాహరణశ్లోకంలో ఇతరదోషాలు కూడా ఉంటాయి. అయినా అవి అక్కడ ప్రకృతాలు కాకపోవడంచేత (అప్రస్తుతాలు అవడంచేత) వాటిని విశదీకరించలేదు.

అవ. కొన్ని సందర్భాలలో దోషాలు దోషాలు కావు అనే విషయం ప్రతిపాదించవలసి ఉంది. ముందుగా ఒక అర్థదోషం దోషం కాదని చెపుతున్నారు.

కా. కర్ణావతంసాదిపదే కర్ణాదిధ్వనినిర్మితిః,
సంనిధానాదిబోధార్థమ్.

వృ. అవతంసాదీని కర్ణాద్యాభరణాన్యేవోచ్యన్తే. తత్ర కర్ణాదిశబ్దాః కర్ణాదిస్థితిప్రతిపత్తయే యథా

శ్లో॥ అస్యాః కర్ణావతంసేన జితం సర్వం విభూషణమ్,
తథైవ శోభతేఽత్యర్థమస్యాః శ్రవణకుణ్డలమ్. 286

అపూర్వమధురామోదప్రమోదితదిశస్తతః
ఆయయుర్భృఙ్గముఖరాః శిరఃశేఖరశాలినః. 287

వృ. అత్ర కర్ణశ్రవణశిరఃశబ్దాః సంనిధానప్రతీత్యర్థాః.

వ్యా. కర్ణేతి :- ఈ కారికను వామనుడు (8వ శతాబ్దంవాడు) కావ్యాలంకారసూత్రవృత్తిలో ఒక ప్రాచీనకారికగా ఉదాహరించాడు. దానినే మమ్మటుడు, ఈ విషయం తనకు కూడా అంగీకారయోగ్యం అవడంచేత యథాతథంగా స్వీయ కారికగా స్వీకరించాడు.

కర్ణావతంసాదిపదే = 'కర్ణావతంసః' ఇత్యాదిపదంలో, కర్ణాదిధ్వనినిర్మితిః = 'కర్ణ' మొదలైన శబ్దాల నిర్మాణం, ప్రయోగం, సంనిధానాదిబోధార్థమ్ = సంనిధానం మొదలైన అర్థాలను బోధించడంకొరకు చేయబడును.

వి. కర్ణాదుల ఆభరణాలే 'అవతంస' ఇత్యాదులుగా చెప్పబడతాయి. అక్కడ కర్ణాది శబ్దాల ప్రయోగం 'కర్ణాదులలో అవి ఉన్నాయి' అనే అర్థం తెలియడంకొరకే. అనగా - 'అవతంసః' 'ఉత్తంసః' అనే పదాలకు కర్ణాలంకారం అని అర్థం. 'శేఖరః' అనగా శిరోభూషణం అని అర్థం. అందుచేత ఈ పదాలను స్వతంత్రంగా ప్రయోగిస్తేనే 'కర్ణభూషణం' మొదలైన అర్థాలు బోధించబడినప్పుడు వీటి ప్రక్క 'కర్ణ' 'శిరః' మొదలైన పదాలు చేర్చడం అనావశ్యకం. అయినా 'కర్ణావతంసః' 'శిరఃశేఖరః' ఇత్యాది ప్రయోగా లున్నాయి. వాటిని సమర్థించాలికదా ? అందుచేత ఆ అవతంసం చెవికే ఉన్నది; ఆ శేఖరం శిరస్సుపైనే ఉన్నది; అనే అర్థం స్ఫురించడంకోసం కర్ణాదిపదాలు 'చేర్చబడతాయి అని ఇక్కడ సమర్థనం చూపబడింది. ఎట్లనగా -

అస్యాః ఇతి :- అస్యాః = ఈమెయొక్క, కర్ణావతంసేన = చెవికి ఉన్న కర్ణభూషణంచేత, సర్వమ్ = సమస్తమైన, విభూషణమ్ = అలంకారం, జితమ్ = జయించబడింది. తత్రైవ = అట్లే, అస్యాః = ఈమెయొక్క, శ్రవణకుణ్డలమ్ = చెవియందు ఉన్న కుండలం (కుండలం అంటేనే చెవికిధరించే ఆభరణం అని అర్థం) అత్యర్థమ్ = మిక్కిలి, శోభతే = ప్రకాశిస్తూన్నది.

అపూర్వేతి - తతః = అటుపిమ్మట, అపూర్వమధురామోదప్రమోదితదిశః = లోకోత్తరమైన మధురమైన సువాసనచేత సుగంధం కలవిగా చేయబడిన దిక్కులు గల, భృఙ్గముఖరాః = తుమ్మెదలతో ధ్వని చేస్తూన్న, శిరఃశేఖరశాలినః = శిరస్సులపై ఉన్న శిరోభూషణములైన మాలలతో ప్రకాశించువారు, ఆయయుః = వచ్చిరి.

అత్రేతి. ఇక్కడ 'కర్ణ' 'శ్రవణ' 'శిరః' శబ్దాలు "ఆ యా అలంకారాలు ఆ యా ప్రదేశాలలోనే ఉన్నవి" అనే భావం స్ఫురించడంకోసం చేర్చబడినవి. కుండల - అవతంస-శేఖరాదుల్ని తీసి ప్రక్కన పెట్టినా అవి కుండలాదులే. అలా తీసివేయలేదు, అవి ఆ యా అవయవాలమీదనే ఉన్నాయి అని చెప్పడం ఉద్దేశ్యం అని భావం.

అవ. మరొక ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ విదీర్ణముఖరారాతికరాలే సంగరాన్తరే,
ధనుర్జ్యాకిణచిహ్నేన దోష్ణా విస్ఫురితం తవ. 288

వృ. అత్ర ధనుఃశబ్దః ఆరూఢతావగతయే.

వ్యా. విదీర్ణాభిముఖారాతికరాలే=చీల్చివేయబడిన, ఎదురుగా ఉన్న శత్రువులచేత చాలా భయంకరంగా ఉన్న, సంగరాన్తరే= యుద్ధమధ్యమునందు, ధనుర్జ్యాకిణచిహ్నేన= ధనస్సుయొక్క అల్లెత్రాడువల్ల కలిగిన కాయలు చిహ్నంగా గల, తవ దోష్ణా= నీ బాహువుచేత, విస్ఫురితమ్= విజృంభించుట.

అత్రేతి:- ఇక్కడ 'ధనుః' శబ్దం ఆరూఢత్వం తెలియడంకొరకు.

'జ్యా' అనే పదానికే ధనస్సుకు కట్టే త్రాడు అని అర్థం. అలాంటప్పుడు దాని ప్రక్క 'ధనుః' శబ్దం చేర్చి 'ధనుర్జ్యా' అనడం ధనస్సుకు రెండు ప్రక్కలా కట్టిన త్రాడు అనే అర్థం తెలియడంకోసం. ధనస్సును ఉపయోగించనప్పుడు దాని ఒక కొన నున్న నారి విప్పివేస్తారు.

అవ:- 'ధనస్సుకు కట్టిన'అనే అర్థం అవసరం లేనప్పుడు కేవలం జ్యాశబ్దాన్నే ప్రయోగించవచ్చు. అందుకు ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. అన్యత్ర తు-

శ్లో॥ జ్యాబన్ధనిష్పన్దభుజేన యస్య
వినిఃశ్వసద్వక్త్రపరంపరేణ,
కారాగృహే నిర్జితవాసవేన
లఙ్కేశ్వరేణోషితమాప్రసాదాత్. 289

వృ. ఇత్యత్ర కేవలో జ్యాశబ్దః.

వ్యా. ధనస్సుకు ఎక్కుపెట్టిన నారి అనే అర్థం కానప్పుడు-

జ్యా ఇతి:- రఘువంశంలో షష్ఠసర్గలో కార్తవీర్యార్జునుని పరాక్రమాన్ని ప్రశంసిస్తూ ఇందుమతితో సునంద అంటూన్న మాటలు. నిర్జితవాసవేన=జయించబడిన ఇంద్రుడుగల, లఙ్కేశ్వరేణ= రావణునిచేత, జ్యాబన్ధనిష్పన్దభుజేన= నారిచేత కట్టివేయడంచేత కదలని భుజాలు కలవాడుగాను, వినిఃశ్వసద్వక్త్రపరంపరేణ =నిట్టూర్పుచున్న ముఖముల పంక్తి కలవాడుగాను, యస్య=ఏ కార్తవీర్యార్జునుని

యొక్క, కారాగృహే = కారాగారమునందు, ఆ ప్రసాదాత్ = ఆతనికి అనుగ్రహం కలిగేవరకు, ఉషితమ్ = నివసించుటయో-

అనేచోట (నారిమాత్రమే అని అర్థం కావాలి గాన) కేవలం జ్యాశబ్దమే ప్రయోగించబడింది.

అవ. మరొక ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ప్రాణేశ్వరపరిష్వఙ్గవిభ్రమప్రతిపత్తిభిః,
ముక్తాహారేణ లసతా హసతీవ స్తనద్వయమ్. 290

వి. అత్ర ముక్తానామ్ అన్యరత్నామిశ్రితత్వబోధనాయ ముక్తాశబ్దః.

వ్యా. ప్రాణేశ్వరేతి:- "ప్రాణేశ్వర...ప్రతిపత్తిభిః"-ప్రాణేశ్వర=ప్రియుని యొక్క, పరిష్వఙ్గ = ఆలింగనసమయమునందలి, విభ్రమ = విలాసలయొక్క, ప్రతిపత్తిభిః = జ్ఞానములచేత, ఆ విలాసలను చూడడంచేత, లసతా = ప్రకాశించుచున్న, ముక్తాహారేణ=ముత్యాలహారంతో కూడిన, స్తనద్వయమ్= స్తనద్వయము, హసతీవ = నవ్వుచున్నదా అన్నట్లున్నది.

అత్రేతి:- ఇక్కడ ముత్యములు ఇతరములైన పద్మరాగాదిరత్నాలతో కలవకుండా గుచ్చబడినవి అనే విషయం సూచించడంకోసం ముక్తాశబ్దం ప్రయోగించబడింది.

వి. 'హార' శబ్దానికే ముత్యాల దండ అని పేరు. ఈ దండలో అన్నీ ముత్యాలే. ఇతరరత్నాలేవీ కలవలేదు అనే అర్థంకోసం 'ముక్తా' శబ్దం 'హార'శబ్దం ప్రక్కన చేర్చబడింది.

అవ. మరొక ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ సౌన్దర్యసంపత్ తారుణ్యం యస్యాస్తే తే చ విభ్రమాః,
షట్పదాన్ పుష్పమాలేవ కాన్ న కర్షతి సా సఖే. 291

వృ. అత్ర ఉత్కృష్టపుష్పవిషయే పుష్పశబ్దః. నిరుపపదో హి మాలాశబ్దః పుష్పస్రజమేవాభిధత్తే.

కా. స్థితేష్వేతత్ సమర్థనమ్. 58

వృ. న ఖలు కర్ణావతంసాదివత్ జఘనకాఞ్చీ ఇత్యాది క్రియతే.

వ్యా. సౌన్దర్యేతి:- సఖే=మిత్రుడా! యస్యాః=ఎవతెయొక్క (ఎవతెకు), సౌన్దర్యసంపత్ = సౌందర్యసంపద, తారుణ్యమ్ = యౌవనమూ, తే = ఆ, అనుభవైకవేద్యాలైన, విభ్రమాః = విలాసలు ఉన్నవో, సా = అట్టి ఆమె, షట్పదాన్= తుమ్మెదలను, పుష్పమాలేవ = పుష్పమాల వలె, కాన్ = ఎవరిని, నాకర్షతి = ఆకర్షించదు?

అత్రేతి:- ఇక్కడ 'పుష్ప' శబ్దం ఉత్కృష్టములైన పుష్పాలు అనే అర్థంలో ప్రయోగించబడింది. ఉపపదాలు లేని, ప్రక్కన ఏ పదాలూ లేని, 'మాలా'శబ్దం పుష్పస్రక్కునే బోధించును కదా?

వి. ప్రక్కన 'రత్న', 'మణి''నక్షత్ర' ఇత్యాదిపదాలు చేర్చి 'రత్నమాలా' 'మణిమాలా' 'నక్షత్రమాలా' ఇత్యాదిప్రయోగాలు చేసినప్పుడు 'మాలా' శబ్దానికి ఇతరార్థాలు ఉన్నా కేవలం 'మాలా' అన్నప్పుడు పుష్పమాల అని మాత్రమే అర్థం. అందుచేత 'మంచి పుష్పాలతో కట్టిన మాల' అనే అర్థం కోసం ఇక్కడ 'పుష్పమాలా' శబ్దం ప్రయోగించబడింది అని అర్థం.

స్థితేష్వితి:- ఏతత్ = ఇది, స్థితేషు = ప్రచారంలో ఉన్న ప్రయోగాల విషయంలో, సమర్థనమ్ = సమర్థనము.

న ఖల్వితి:- 'కర్ణావతంస'ఇత్యాదిప్రయోగాలు ఉన్నాయి కదా అని 'జఘనకాఞ్చీ' (జఘనస్థలంలో వడ్డాణం) ఇత్యాదిప్రయోగాలు సృష్టించబడవు కదా ?

వి. ఉన్న మహాకవి ప్రయోగాలను ఏదో విధంగా సమర్థించుకొనాలి కాని ఆ ప్రయోగాలను పట్టి కొత్తపదాలు సృష్టించకూడదు అని భావం.

అవ. "జగాద మధురాం వాచమ్"అనే చోట 'గద వ్యక్తాయాం వాచి' అను ధాతుపాఠాన్ని అనుసరించి వ్యక్తమైన వాక్కు పలుకుట అనే అర్థం 'జగాద' అనే క్రియలోనే ఉన్నది గాన 'వాచమ్' అనేది వ్యర్థమే కదా అని ఆశంకించుకొని, వామనుడు కావ్యాలంకారసూత్రవృత్తిలో (2-2-18) "వాచమ్ అనేది వ్యర్థం కాదు; 'మధురామ్' అనే విశేషణాన్ని చేర్చడానికి దానిని ప్రయోగించడం యుక్తమే.

'వాచమ్' అనేది లేకపోతే 'మధురామ్' అనే విశేషణం చేర్చడం కుదరదు కదా" అని సమాధానం చెప్పాడు. దానిని నిరాకరిస్తున్నాడు.

శ్లో॥ జగాద మధురాం వాచం విశదాక్షరశాలినీమ్ 292

వృ. ఇత్యాదౌ క్రియావిశేషణత్వేఽపి వివక్షితార్థప్రతీతిసిద్ధౌ-"గతార్థస్యాపి విశేష్యస్య విశేషణదానార్థం క్వచిత్ప్రయోగః కార్యః" ఇతి న యుక్తమ్. యుక్తత్వే వా-

శ్లో॥ చరణత్రపరిత్రాణరహితాభ్యామపి ద్రుతమ్,
పాదాభ్యాం దూరమధ్వానం వ్రజన్నేష న ఖిద్యతే 293

వృ. ఇత్యుదాహార్యమ్.

వ్యా. జగాదేతి:-"మధురామ్=మధురమైన, విశదాక్షరశాలినీమ్=స్పష్టమైన అక్షరములతో కూడిన, వాచమ్ = వాక్కును, జగాద = పలికెను"- ఇత్యాదులలో క్రియావిశేషణం వేసికొన్నా కావలసిన అర్థం సిద్ధిస్తుంది గాన."విశేష్యం గతార్థమే అయినా, అనగా ధాతువులోనే దాని అర్థం వచ్చినా, విశేషణం కూర్చడం కోసం కొన్ని చోట్ల దానిని (విశేష్యాన్ని) ప్రయోగించాలి" అని చెప్పడం అయుక్తం.

వి. 'వాచమ్' అనే విశేష్యం లేకపోతే 'మధురామ్' 'విశదాక్షరశాలినీమ్' అను విశేషణాలు చేర్చడం కుదరదు; అందుచేత దానిని ప్రయోగించాలి అని కదా "గతార్థస్యాపి" ఇత్యాదివాక్యానికి అభిప్రాయం. ఇక్కడ విశేషణాల ప్రయోగం అవసరం లేకుండా క్రియావిశేషణాలను 'మధురమ్' 'విశదాక్షరమ్' (మధురంగాను, స్పష్టాక్షరాలు కలుగునట్లుగాను) ఇత్యాది విధంగా ప్రయోగిస్తే చెప్పదలచుకొన్న అర్థం చెప్పవచ్చును. అందుచేత ధాత్వర్థంలో ఇమిడి ఉన్నదానిని విశేష్యంగా ప్రయోగించవలసిన పని లేదు అని మమ్మటుని అభిప్రాయం.

వ్యా. యుక్తత్వే ఇతి:- అయితే క్రియావిశేషణం ప్రయోగించడానికి వీలు లేని స్థలాలలో మాత్రం ధాత్వర్థాదులచేత గతార్థమైన పదాన్ని ప్రయోగించినా తప్పు లేదు-ఉదాహరణకి-చరణేతి:- "చరణత్ర పరిత్రాణరహితాభ్యామపి = పాదుకల రక్షణతో శూన్యములైనప్పటికీ, పాదాభ్యామ్ = పాదాలతో, దూరమ్ =

దూరమైన, అధ్వానమ్ = మార్గమును, వ్రజన్ = వెళ్లుచున్న, ఏషః = ఇతడు, న ఖిద్యతే = ఖేదం చెందడంలేదు" అనే శ్లోకంలో = 'ఉత్తరదేశసంయోగానికి అనుకూలంగా పాదాలను కదపడం' అనే వ్రజధాత్వర్థంలోనే పాదాలతో నడవడం అనేది ఉన్నా 'చరణత్రపరిత్రాణరహితాభ్యామ్' అనే విశేషణం కూర్చడానికి 'పాదాభ్యామ్' అనే విశేష్యం ప్రయోగించడంలో దోషం లేదు. ఇక్కడ పాదుకల రక్షణ లేకపోవడం అనే అర్థాన్ని చెప్పడానికి క్రియావిశేషణం ప్రయోగించడం కుదరదు కదా? అందుచేత ఎక్కడ విశేషణం చేర్చకుండా చెప్పదలచిన అర్థాన్ని చెప్పడం కుదరదో అక్కడ మాత్రమే గతార్థమైనదానిని కూడా ప్రయోగించవచ్చును. అలా కాకపోతే ప్రయోగించకూడదు అని మమ్మటుని నిర్ణయం.

అవ. కొన్నిచోట్ల నిర్హేతుత్వం దోషం కాదు అని చెపుతున్నాడు-

కా. ఖ్యాతేఽర్థే నిర్హేతోరదుష్టతా.

వృ. యథా-

శ్లో॥ చన్ద్రం గతా పద్మగుణాన్న భుఙ్క్తే
పద్మాశ్రితా చాన్ద్రమసీమభిఖ్యామ్,
ఉమాముఖం తు ప్రతిపద్య లోలా
ద్విసంశ్రయాం ప్రీతిమవాప లక్ష్మీః. 294

వృ. అత్ర రాత్రౌ పద్మస్య సంకోచః దివా చన్ద్రమసశ్చ నిష్ప్రభత్వం లోకప్రసిద్ధమితి 'న భుఙ్క్తే' ఇతి హేతుం నాపేక్షతే.

వ్యా. ఖ్యాతే ఇతి :- ప్రసిద్ధమైన విషయంలో నిర్హేతువు దుష్టం కాదు. ఎట్లనగా-

చన్ద్రమ్ ఇతి :- ఇది కుమారసంభవం ప్రథమసర్గలోని శ్లోకం. లోలా= చంచలమైన, లక్ష్మీః = లక్ష్మి, చన్ద్రమ్ = చంద్రుణ్ణి, గతా = పొందినదై, పద్మగుణాన్ = పద్మముయొక్క గుణాలను, న భుఙ్క్తే = అనుభవించడం లేదు. పద్మాశ్రితా = పద్మమును ఆశ్రయించినదై, చాన్ద్రమసీమ్=చంద్రునికి సంబంధించిన, అభిఖ్యామ్ = శోభను, అనుభవించడం లేదు. తు = కాని, ఉమాముఖమ్ =

ఉమ ముఖమును, ప్రతిపద్య = పొంది, ద్విసంశ్రయామ్ = రెండింటికీ సంబంధించిన, ప్రీతిమ్ = ఆనందమును, అవాప = పొందెను.

వృ. రాత్రియందు పద్మం సంకోచం చెందుతుం దనీ, పగలు చంద్రుడు కాంతివిహీనుడు అవుతా డనీ లోకప్రసిద్ధమే. అందుచేత "ఎందుకు అనుభవించడం లేదు" అనే ప్రశ్నకు అవకాశం లేదు. దానికి సమాధానంగా హేతువును చెప్పవలసిన పని లేదు.

కా. (అ) నుకరణే తు సర్వేషామ్.

వృ. సర్వేషాం శ్రుతికటుప్రభృతీనాం దోషాణామ్. యథా-

శ్లో॥ మృగచక్షుషమద్రాక్షమిత్యాది కథయత్యయమ్,
పశ్యైష చ గవిత్యాహ సుత్రామాణం యజేతి చ. 295

వ్యా. అనుకరణే ఇతి :- "అనుకరణంలో అన్ని దోషాలూ అదోషాలే". 'శ్రుతికటువు' మొదలైన దోషా లన్నీ అనుకరణలో దోషాలు కావు. ఎట్లనగా-

మృగేతి :- అయమ్ = ఇతడు, మృగచక్షుషమ్ = మృగము నేత్రముల వంటి నేత్రాలు గల సుందరిని, అద్రాక్షమ్ = చూచితిని, ఇత్యాది = ఈ మొదలైన దానిని, కథయతి = చెప్పుచున్నాడు. ఏషః చ = ఇతడు, గో = గోవును, పశ్య = చూడుము, ఇతి = అని, ఆహ = అంటున్నాడు. సుత్రామాణమ్ = ఇంద్రుణ్ణి, యజ ఇతి చ = పూజించుము అని కూడ అంటున్నాడు.

వి. ఇక్కడ మూడు దోషాలు ఉన్నాయి. శృంగారానికి విరుద్ధమైన "చక్షుషమ్ అద్రాక్షమ్" అని శ్రుతికటుత్వ దోషం. "ప్రత్యయం లేని ప్రకృతిని ప్రయోగించకూడదు" ("న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా నాపి ప్రత్యయః") అనే వ్యాకరణనియామానికి విరుద్ధంగా తృతీయపాదంలో 'గామ్' అని ద్వితీయాంతాన్ని ప్రయోగించడానికి బదులు 'గో' అని ప్రాతిపదికమాత్రాన్ని ప్రయోగించడంచేత చ్యుతసంస్కృతిత్వదోషం. నిఘంటువుల ప్రకారం 'సుత్రామన్' శబ్దానికి ఇంద్రు డనే అర్థం ఉన్నా కావ్యాదులలో దాన్ని ప్రయోగించరు. ఇక్కడ దాన్ని ప్రయోగించడంవల్ల అప్రయుక్తత్వదోషం. అయితే 'ఎవరో ఇలా అన్నారు' అని అనుకరణం అవడంచేత ఇవి దోషాలుగా పరిగణింపబడవు.

కా. వక్త్రాద్యౌచిత్యవశాద్దోషోఽపి గుణః క్వచిత్ క్వచిన్నోభౌ.

వృ. వక్తృ-ప్రతిపాద్య-వ్యఙ్గ్య-వాచ్య-ప్రకరణాదీనాం మహిమ్నా దోషోఽపి క్వచిద్గుణః; క్వచిన్న దోషః, న గుణః. తత్ర వైయాకరణాదౌ వక్తరి, ప్రతిపాద్యే చ, రౌద్రాదౌ చ రసే వ్యఙ్గ్యే కష్టత్వం గుణః. క్రమేణోదాహరణమ్-

శ్లో॥ దీధీవేవీట్సమః కశ్చిద్గుణవృద్ధ్యోరభాజనమ్,
క్విప్రత్యయనిభః కశ్చిద్యత్ర సంనిహితే న తే. 296

శ్లో॥ యదా త్వామహమద్రాక్షం పదవిద్యావిశారదమ్,
ఉపాధ్యాయం తదాస్మార్షం సమప్రాక్షం చ సంమదమ్.

వ్యా. వక్త్రాదీతి :- వక్త్రాద్యౌచిత్యవశాత్ = వక్త మొదలైనవారి ఔచిత్యాన్ని పట్టి, క్వచిత్ = కొన్నిచోట్ల, దోషోఽపి = దోషం కూడా, గుణః = గుణం అవుతుంది. క్వచిత్ = కొన్ని చోట్ల, ఉభౌ = దోషగుణాలు రెండూ కూడ, న = కాదు.

వక్త్రితి :- వక్త, ప్రతిపాద్యుడు (వక్త ఎవరితో చెపుతాడో వాడు ప్రతిపాద్యుడు) వ్యంగ్యం, వాచ్యం, ప్రకరణం మొదలైనవాటి మహిమచేత కొన్ని చోట్ల దోషం కూడా గుణమే అవుతుంది. కొన్ని చోట్ల దోషమూ కాదు గుణమూ కాదు. వైయాకరణాదులు వక్తలైనప్పుడు, లేదా ప్రతిపాద్యులైనప్పుడు, రౌద్రాదిరసం వ్యంగ్యం అయినప్పుడు కష్టత్వం గుణమే అవుతుంది. క్రమంగా ఉదాహరణాలు.

అవ. వైయాకరణుడు వక్త అయినప్పుడు కష్టత్వం గుణం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

దీధీతి :- ఈ గ్రామంలో మనుషులు ఎటువంటి వారు అనే ప్రశ్నకు సమాధానం ఇది. కశ్చిత్ = ఒకడు, దీధీవేవీట్ సమః = 'దీధీఙ్ దీప్తిదేవనయోః' 'వేవీఙ్ వేతినా తుల్యే' అని అదాదిగణంలో చెప్పిన ధాతువులతోను, 'ఇట్' అనే ఆగమంతోను సమానుడు; గుణవృద్ధ్యోః = గుణవృద్ధులకు, అనగా సద్గుణాలకి

కాని సమృద్ధికి గాని, అభాజనమ్ = స్థానం కానివాడు. పాణినీయం ప్రకారం "అ, ఏ, ఓల"కు 'గుణం' అనీ, 'ఆ, ఐ, ఔ'లకు 'వృద్ధి' అనీ సంజ్ఞలు. "దీధీవేవీటామ్" (1-1-6) అనే సూత్రంచేత ఈ మూడింటికీ గుణం కాని, వృద్ధి కాని రాదు అని నిషేధించబడింది. ఈ విధంగా 'దీధీఙ్' 'వేవీఙ్' 'ఇట్' అనేవి ఏ విధంగా గుణ వృద్ధులకు యోగ్యం కావో అదే విధంగా కొందరు గుణవృద్ధులు లేనివాళ్ళు అని అర్థం. కశ్చిత్ = ఒకడు, క్విప్ప్రత్యయనిభః = 'క్విప్' అనే ప్రత్యయంతో సమానుడు, యత్ర = ఏది, (ఎవడు), సంనిహితే = దగ్గర ఉండగా, తే = ఆ గుణ వృద్ధులు, న = ఉండవో ధాతువులకు చివర 'క్విప్' అనే ప్రత్యయం విధించబడింది. ఇది చేర్చడం వల్ల 'లిట్' (లిహౌ-లిహః) ఇత్యాది రూపాలు తయారవుతాయి. అయితే ఈ ప్రత్యయం పూర్తిగా లోపిస్తుంది. దీన్ని చేర్చడానికి ప్రయోజనం 'ఆ పని చేసేవాడు" అనే అర్థం రావడమే. మరొక విషయం ఏమనగా ఈ ప్రత్యయం దేనికి చేరుస్తామో ఆ ధాతువుకు గుణం కాని, వృద్ధి కాని రాదు. అందుచేత "కొందరు ఈ క్విప్ ప్రత్యయం వంటి వాళ్ళు, సర్వలోపం ఉన్నవాళ్ళు; వాళ్ళకి గుణవృద్ధులు లేవు సరికదా వాళ్ళ ప్రక్కన ఉంటే ఇతరులకుకూడా గుణ వృద్ధులు ఉండవు" అని భావం.

ఈ మాటలు పలికేవాడు వైయాకరణుడు కాబట్టి కష్టత్వం గుణమే. ఇది అతని వ్యాకరణపాండిత్యాదులను సూచిస్తున్నది కదా?

ప్రతిపాద్యుడు వైయాకరణుడు అయినప్పుడు కూడా కష్టత్వం గుణం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

యదా ఇతి :- అహమ్ = నేను, పదవిద్యావిశారదమ్ = వ్యాకరణంలో విశారదుడవైన త్వామ్ = నిన్ను, యదా = ఎప్పుడు, అద్రాక్షమ్ = చూచితినో, తదా = అప్పుడు ఉపాధ్యాయమ్ = గురువును. అస్మార్షమ్ = స్మరించితిని. సంమదమ్ = ఆనందమును, సమ్ప్రాప్సం చ = స్పృశించితిని (పొందితిని).

ఇక్కడ ప్రతిపాద్యుడు (శ్రోత)వైయాకరణుడు గాన 'అస్మార్షమ్', 'సమప్రాప్సమ్' అనే లుఙ్ప్రయోగాలు కష్టములైనా గుణాలే.

అవ. రసరూపమైన వ్యంగ్యం మహిమచేత శ్రుతికటుత్వరూపకష్టత్వం కూడా గుణం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అన్త్రైః ప్రోతబృహత్కపాలనలకక్రూరక్వణత్కఙ్కణ
ప్రాయప్రేఙ్ఖితభూరిభూషణరవైరాఘోషయన్త్యమ్బరమ్,
పీతచ్ఛర్దితరక్తకర్దమఘనప్రాగ్భారఘోరోల్లస
ద్వ్యాలోలస్తనభారభైరవవపుర్దర్పోద్ధతం ధావతి. 98

వ్యా. అన్త్రైః ఇతి :- మహావీరచరితంలో లక్ష్మణుడు తాటకను దూరం నుంచి చూచి "కాపునరియమ్" (ఈమె ఎవరు) అని ఉపక్రమించి చేసిన తాటకా వర్ణనం. (ఎవరిమె!) "అన్త్రైః........రవైః- అన్త్రైః = ప్రేగులతో, ప్రోత = గుచ్చబడిన, బృహత్ = పెద్దవైన, కపాల = పుఱ్ఱెలు, నలక = మోకాటిచిప్పలు అనే, క్రూరక్వణత్ = క్రూరంగా ధ్వనిచేస్తూన్న, కఙ్కణ = కంకణాలు, ప్రాయ = అధికంగా ఉన్న, ప్రేఙ్ఖిత = కదులుతూన్న, భూరి = అనేకమైన, భూషణ = అలంకారాలయొక్క, రవైః = ధ్వనులచేత, అమ్బరమ్ = ఆకాశాన్ని, ఆఘోష యన్తీ = ప్రతిధ్వనింపచేయుచున్నదై, "పీత....వపుః"- పీత = త్రాగబడిన, ఛర్దిత = కక్కబడిన (త్రాగి కక్కిన), రక్త = రక్తం అనే, కర్దమ = బురదచేత, ఘన = వ్యాప్తమైన, ప్రాగ్భార = ఉత్తరకాయమునందు, శరీరం పై భాగమునందు, ఘోర = భయంకరంగా, ఉల్లసత్ = స్పష్టంగా కనబడుతూన్న, వ్యాలోల = కదలు చున్న, స్తనభార = స్తనభారంచేత, భైరవ = భయంకరమైన, వపుః = దేహం కలదై, దర్పోద్ధతమ్ = గర్వంచేత ఉద్ధతంగా, విఱ్ఱవీగుతూ, ధావతి = పరుగెత్తు చున్నది?

వి. ఇక్కడ వ్యంగ్యం అయిన బీభత్సరసానికి పరుషశబ్దాలు అనుగుణంగా ఉన్నాయి. అందుచేత కష్టత్వం గుణమే కాని దోషం కాదు.

అవ. వాచ్యంయొక్క మహిమచేత కష్టత్వం గుణం అవడానికి ఉదా హరణం చూపుతున్నాడు-

వృ. వాచ్యవశాద్యథా-

శ్లో॥ మాతఙ్గాః కిము వల్గితైః కిమఫలైరాడమ్బరైర్జమ్బుకాః
సారఙ్గా మహిషా మదం వ్రజథ కిం శూన్యేషు శూరా న కే,

కోపాటోపసముద్భటోత్కటసటాకోటేరిభారేః పురః
సిన్ధుధ్వానిని హ్యూంకృతే స్ఫురతి యత్ తద్గర్జితం గర్జితమ్.

వృ. అత్ర సింహే వాచ్యే పరుషాః శబ్దాః.

వ్యా. వాచ్యవశంవల్ల, అనగా వర్ణింపబడేదానిని పట్టి, కష్టత్వం గుణం అవడానికి ఉదాహరణం ఎట్లనగా-

మాతఙ్గాః ఇతి:- మాతఙ్గాః = ఏనుగులారా ! వల్గితైః = గతివిశేషాలచేత, దీరంగా నడవడంచేత, కిము = ఏమి ప్రయోజనం ? జమ్బుకాః = నక్కలారా! అఫలైః = ఫలంలేని. ఆడమ్బరైః = ఆడంబరాలచేత, కిమ్ = ఏమి ప్రయోజనం? సారఙ్గాః = లేళ్ళలారా! మహిషాః=మహిషములారా! కిమ్ = ఎందుకు, మదమ్= మదమును, వ్రజథ = పొందుచున్నారు? శూన్యేషు=శూన్యప్రదేశాలలో, బలవంతు లెవరూ లేని చోట్ల, కే = ఎవరు, శూరాః = శూరులు, న = కారు ? "కోపా.... కోటేః"—కోప = కోపంయొక్క, ఆటోప = ఉద్రేకంచేత, సముద్భట = తీవ్రమైన, ఉత్కట = లేచిన, సటా=జూలుయొక్క, కోటేః = అగ్రభాగం గల, ఇభారేః= సింహంయొక్క, సిన్ధుధ్వానిని = సముద్రధ్వనివంటి ధ్వని గల, హుంకృతే = హుంకారం, పురః = ఎదుట, స్ఫురతి = స్ఫురించుచుండగా, యత్ = ఏ, గర్జితమ్ = గర్జనం చేయడమో, తత్ = అదే, గర్జితమ్ = గర్జితము.

అత్రేతి:- ఇక్కడ వాచ్యం (వర్ణించబడేది) సింహం అవడంచేత పరుష శబ్దాలు ప్రయోగించబడ్డాయి. ఇక్కడ పరుషశబ్దప్రయోగరూపమైన కష్టత్వం గుణమే.

అవ. ప్రకరణమహిమచేత కష్టత్వం గుణం అవడానికి ఉదాహరణం చూపుతున్నారు-

శ్లో॥ రక్తాశోక కృశోదరీ క్వ ను గతా త్యక్త్వానురక్తం జనం
నో దృష్టేతి ముధైవ చాలయసి కిం వాతావధూతం శిరః,
ఉత్కణ్ఠాఘటమానషట్పదఘటాసంఘట్టదష్టచ్ఛద-
స్తత్పాదాహతిమన్తరేణ భవతః పుష్పోద్గమోఽయం కుతః.

వృ. అత్ర శిరోధూననేన కుపితస్య వచసి.

వ్యా. రక్తాశోకేతి:- విక్రమోర్వశీయంలో ఊర్వశీ విరహాతురుడైన పురూరవుని మాటలు. రక్తాశోక = ఓ! రక్తాశోకవృక్షమా! కృశోదరీ = సన్నని ఉదరం గల ఆ ఊర్వశి, అనురక్తమ్=అనురాగవంతుడైన, జనమ్ = ఈ జనుణ్ణి (నన్ను), త్యక్త్వా = విడచి, క్వ ను గతా = ఎక్కడికి వెళ్ళినది? నో దృష్టా ఇతి = చూడ బడలేదు అని, వాతావధూతమ్ = వాయువుచేత కదల్చబడిన, శిరః = శిరస్సును, ముధైవ = అసత్యంగానే, కిమ్ = ఎందుకు, చాలయసి = కదుపుతున్నావు? "ఉత్కణ్ఠా....ష్పదః"-ఉత్కణ్ఠా = ఆత్యాసక్తితో, ఘటమాన = వచ్చిచేరుచున్న, షట్పదఘటా=తుమ్మెదల సముదాయంయొక్క, సంఘట్ట = రాపిడిచేత, దష్ట= ఛేదించబడిన, ఛదః = రేకులు గల, అయమ్ = ఈ, పుష్పోద్గమః = పుష్పముల ఆవిర్భావం, భవతః=నీకు, తత్పాదాహతిమ్ అన్తరేణ=ఆమె కాలి తన్ను లేకుం డగా, కుతః=ఎట్లు వచ్చినది? ఆమె పాదాహతిచేతనే నీకీ పుష్పోద్గమం కలిగింది. అందుచేత ఆమె జాడ నీకు తెలిసినా తెలియ దని వాతంచేత (గాలిచేత, వాత ప్రకోపంచేత అని రెండర్థాలు) కదల్చబడిన శిరస్సు ఊపుతున్నావు అని అర్థం.

అత్రేతి:- ఇక్కడ శిరస్సు కదల్చడంచేత కోపించిన పురూరవుని మాట లలో, కోపసూచకంగా పరుషాక్షరపదాలు ప్రయోగించబడ్డాయి. అందుచేత కష్టత్వం కూడా గుణమే.

అవ. రసాన్ని చెరిచేదే కదా దోషం? అందుచేత ఏ రసమూ లేనిచోట్ల ఈ కష్టత్వం ఉన్నా అది గుణమూ కాదు, దోషమూ కాదు, అని చెపుతున్నారు-

వృ. క్వచిత్ నీరసే న గుణః, న దోషః. యథా-

శ్లో॥ శీర్ణఘ్రాణాఙ్ఘ్రిపాణీన్ వ్రణిభిరపఘనైర్ఘర్ఘరావ్యక్తఘోషాన్
దీర్ఘాఘ్రాతానఘౌఘైః పునరపి ఘటయత్యేక ఉల్లాఘయన్ యః,
ఘర్మాంశోస్తస్య వోఽన్తర్ద్విగుణఘనఘృణానిఘ్ననిర్విఘ్నవృత్తే
ర్దత్తార్ఘాః సిద్ధసంఘైర్విదధతు ఘృణయః శీఘ్రమంహోవిఘాతమ్.

వ్యా. క్వచిదితి:- ఏ రసమూ లేని కొన్ని చోట్ల కష్టత్వం గుణమూ కాదు, దోషమూ కాదు; ఎట్లనగా-

శీర్ణేతి:- ఇది మయూరకవి రచించిన సూర్యశతకంలోని శ్లోకం. అఘౌఘైః = పాపసముదాయాలచేత, శీర్ణఘ్రాణాఙ్ఘ్రిపాణీన్=శిథిలాలైపోయిన, చెడిపోయిన ముక్కు, పాదాలు, చేతులూ కలవాళ్లు. వ్రణిభిః = వ్రణాలు గల, అపఘనైః = అవయవాలతో కూడినవారు, ఘర్ఘరావ్యక్తఘోషాన్ = 'ఘర్ ఘర్' అనే నీటిచప్పుడు వలె, అస్పష్టమైన ధ్వనులు కలవారు, దీర్ఘాఘ్రాతాన్ = దీర్ఘములైన నిట్టూర్పులు కలవారు, లేదా అఘౌఘైః దీర్ఘాఘ్రాతాన్ = పాపసముదాయాలచేత దీర్ఘకాలం ఆక్రమించబడినవారు అయిన కుష్ఠరోగులను, ఉల్లాఘయన్=రోగం లేనివాళ్లనుగా చేయుచు, యః = ఏ సూర్యుడు, పునః అపి = మరల, ఘటయతి = పోయిన అవయవాలతో కూరుస్తాడో, తస్య = అట్టి, అన్తర్ద్విగుణఘనఘృణానిఘ్ననిర్విఘ్నవృత్తేః=హృదయంలో రెండు రెట్లైన (అధికమైన) దట్టమైన కృపకు అధీనమైన, విఘ్నరహితమైన ఉద్యమం గల, ఘర్మాంశోః=సూర్యునియొక్క, సిద్ధసంఘైః= సిద్ధుల సముదాయాలచేత, దత్తార్ఘ్యాః = ఇవ్వబడిన పూజోపహారాలు గల, ఘృణయః = కిరణాలు, వః = మీయొక్క, అంహోవిఘాతమ్ = పాపాల వినాశమును శీఘ్రమ్ = శీఘ్రంగా, విదధతు = చేయుగాక.

ఇక్కడ ప్రధానంగా రసం ఏదీ లేకపోవడంచేత ఈ కష్టత్వం దోషమూ కాదు, గుణమూ కాదు. సూర్యవిషయకమైన కవిగతరతి వ్యంజింపచేయబడుతున్నది కాని కవిసంరంభం అంతా శబ్దాలంకారనిర్వహణలోనే కేంద్రీకృతం అయినట్లు ఉండడంచేత రత్యభివ్యక్తి స్పష్టంగా లేదు.

వృ. అప్రయుక్తనిహతార్థౌ శ్లేషాదావదుష్టౌ. యథా-

శ్లో॥ యేన ధ్వస్తమనో భవేన బలిజిత్కాయః పురాస్త్రీకృతో
యశ్చోద్వృత్తభుజఙ్గహారవలయో గఙ్గాం చ యోఽధారయత్,
యస్యాహుః శశిమచ్ఛిరోహర ఇతి స్తుత్యం చ నామామరాః
పాయాత్స స్వయమన్ధకక్షయకరస్త్వాం సర్వదో మాధవః.

వృ. అత్ర మాధవపక్షే శశిమదన్ధకక్షయశబ్దౌ అప్రయుక్తనిహతార్థౌ.

వ్యా. అప్రయుక్తేతి:- శ్లేషాదులలో అప్రయుక్తం నిహతం మొదలైనవి దుష్టములు కావు; ఎట్లనగా-

యేనేతి:- ఇది చంద్రకు డనే కవి రచించిన శ్లోకం. దీనికి విష్ణుపరంగాను, శివపరంగాను అర్థం చెప్పుకోవాలి. విష్ణుపక్షంలో పదచ్ఛేదం-యేన, ధ్వస్తమ్, అనః, అభవేన, బలిజిత్, కాయః, పురా, స్త్రీకృతః, యః, చ, ఉద్వృత్తభుజఙ్గహా, రవలయః, అగమ్, గామ్, చ, యః, అధారయత్. యస్య, ఆహుః, శశిమచ్ఛిరో హరః, ఇతి, స్తుత్యమ్, చ, నామ, అమరాః. పాయాత్, సః, స్వయమ్, అన్ధకక్షయ కరః, త్వామ్, సర్వదః, మాధవః.

శివునిపక్షంలో పదచ్ఛేదం—యేన, ధ్వస్తమనోభవేన, బలిజిత్కాయః, పురా, అస్త్రీకృతః, యః, చ, ఉద్వృత్తభుజఙ్గహారవలయః, గఙ్గామ్, చ, యః, అధారయత్, యస్య, ఆహుః, శశిమత్, శిరః, హరః, ఇతి, స్తుత్యమ్, చ, నామ, అమరాః, పాయాత్, సః, స్వయమ్, అన్ధకక్షయకరః, త్వామ్, సర్వదా, ఉమాధవః.

విష్ణుపక్షంలో అర్థం—యేన = ఎవనిచేత, అనః = శకటము, ధ్వస్తమ్ = నశింపచేయబడిందో, విష్ణువు శ్రీకృష్ణుడుగా అవతరించి బాలుడుగా ఉన్నప్పుడు శకటరూపంలోవచ్చిన అసురుణ్ణి సంహరించాడు. అభవేన=పుట్టుక, లేదా సంసారం లేని, యేన = ఎవనిచేత, బలిజిత్ = బలిని జయించిన, కాయః = తన శరీరం, పురా = పూర్వం, స్త్రీకృతః=స్త్రీగా, మోహినిగా, చేయబడిందో, యశ్చ=ఎవడు, ఉద్వృత్తభుజఙ్గహా=దృప్తుడైన కాలియు డనే సర్పాన్ని హింసించినాడో, రవలయః = శబ్దాలకు అనగా వేదకు లయస్థానమో, నామరూపాదు లన్నీ పరబ్రహ్మలో లీనములైపోతా యని వేదాంతులు చెపుతారు. యః = ఎవడు, అగమ్ = గోవర్ధన పర్వతమును, గాం చ=భూమినీ, (వరాహావతారంలో), అధారయత్=ధరించెనో, యస్య= ఎవనియొక్క, శశిమచ్ఛిరోహరః = శశినమ్ మథ్నాతి ఇతి శశిమత్ = చంద్రుణ్ణి పీడించే రాహువు. ఆ రాహువుయొక్క శిరస్సును హరించినా డని, స్తుత్యమ్ = స్తుతింపదగిన, నామ = పేరును, అమరాః = దేవతలు, ఆహుః = చెప్పుచుందురో, అన్ధకక్షయకృత్ = యాదవులకు క్షయమును, అనగా ద్వారకా రూప నివాసమును కల్పించిన, సర్వదః = అన్నీ ఇచ్చే, సః = ఆ, మాధవః = లక్ష్మీపతియైన విష్ణువు, స్వయమ్ = స్వయంగా, త్వామ్ = నిన్ను, పాయాత్ = రక్షించుగాక.

శివుని పక్షంలో అర్థం–ధ్వస్తమనోభవేన = నశింపచేయబడిన మన్మథుడు గల, యేన=ఎవనిచేత, పురా=పూర్వం, త్రిపురదైత్యవధకాలంలో, బలిజిత్కాయః = బలిని జయించిన విష్ణువుయొక్క శరీరం, అస్త్రీకృతః = అస్త్రంగా, బాణంగా చేయబడిందో; శివుడు భూమిని రథంగాను, బ్రహ్మదేవుణ్ణి సారథిగాను, మేరు పర్వతాన్ని ధనస్సుగాను, వాసుకిని నారిగాను, చంద్ర సూర్యుల్ని రథచక్రాలు గాను, విష్ణువును బాణంగాను, అగ్నిని బాణాగ్రంగాను చేసికొనివెళ్ళి త్రిపురాసుర సంహారం చేసినా దని పురాణకథ. యః చ=ఎవడు, ఉద్వృత్తభుజఙ్గహారవలయః = ఉద్ధతాలైన సర్పాలు హారంగాను వలయాలుగాను కలవాడో, యః = ఎవడు, గఙ్గాం చ = గంగను కూడ, అధారయత్ = ధరించెనో, యస్య = ఎవనియొక్క, శిరః = శిరస్సు, శశిమత్ = చంద్రుడు కలదో, హరః ఇతి = సర్వలోకసంహార కుడు అని, స్తుత్యమ్ = స్తుతించదగిన, నామ = ఎవని పేరును, అమరాః = దేవ తలు, అహుః = చెపుతూంటారో, సః = అట్టి, అన్ధకక్షయకరః=అంధకాసురుణ్ణి నశింపచేసిన, ఉమాధవః = ఉమాపతియైన శివుడు, సర్వదా = ఎల్లప్పుడూ, త్వామ్ = నిన్ను, స్వయమ్ = స్వయంగా, పాయాత్ = రక్షించుగాక.

అత్రేతి:- ఇక్కడ మాధవపక్షంలో 'శశిమథ్' అనే పదం రాహువు అనే అర్థంలో అప్రయుక్తం. 'క్షయ' శబ్దం వినగానే వినాశం అనే అర్థం స్ఫురిస్తుంది. దీనిచేత గృహం, నివాసం అనే అర్థం కప్పబడిపోతుంది. అందుచేత ఇది నిహ తార్థం. ఈ విధంగా 'అప్రయుక్తత్వ' 'నిహతార్థత్వ' దోషాలు ఉన్నా శ్లేషకోసం ప్రయోగించడంచేత వీటిని దోషాలుగా పరిగణించకూడదు.

వృ. అశ్లీలం క్వచిద్గుణః, యథా సురతారమ్భ గోష్ఠ్యామ్-"ద్వ్యర్థైః పదైః పిశునయేచ్చ రహస్యవస్తు" ఇతి కామశాస్త్ర స్థితౌ.

వ్యా. కొన్నిచోట్ల అశ్లీలం కూడా గుణమే. ఎట్లనగా-"తామ్బూలదానవిధినా విసృజేద్వయస్యాం ద్వ్యర్థైః పదైః పిశునయేచ్చ రహస్యవస్తు" (తాంబూలం ఇచ్చి చెలికత్తెను పంపి వెయ్యాలి. రెండర్థాలు వచ్చే మాటలతో రహస్యపువస్తువు సూచించాలి) అని కామశాస్త్రంలో ఉన్నది కాబట్టి సురతప్రారంభవర్ణనాదులలో అశ్లీలం (వ్రీడాశ్లీలం) దోషం కాదు; గుణమే. ఈ విధంగా వాక్యగతమైన వ్రీడా వ్యంజకాశ్లీలం గుణం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ కరిహస్తేన సంబాధే ప్రవిశ్యాన్తర్విలోడితే
ఉపసర్పన్ ధ్వజః పుంసః సాధనాన్తర్విరాజతే. 303

వ్యా. కరిహస్తేనేతి:- సంబాధే = రథాశ్వాదులతో ఇరుకైన, సాధనాన్తః = సైన్యమధ్యము, కరిహస్తేన = ఏనుగు తొండంచేత, అనగా గజబలంచేత, ప్రవిశ్య = ప్రవేశించి, విలోడితే = కలిగిపోవునట్లు, అవకాశం కలిగేటట్లు, చేయబడిం దగు చుండగా, ఉపసర్పన్ = లోపల ప్రవేశించి సంచరిస్తూన్న, పుంసః = వీరునియొక్క, ధ్వజః = ధ్వజం, విరాజతే = ప్రకాశిస్తూన్నది.

మరొక గుప్తార్థం-సంబాధే = సంకుచితమైన, సాధనాన్తః = స్త్రీవరాంగము లోపలిభాగము, కరిహస్తేన = కరిహస్తంచేత, మధ్యవ్రేలును బైట ఉంచి తర్జనిని, అనామికను కలిపిన ముద్రకు కరిహస్తం అని పేరు, అన్తః = లోపల, ప్రవిశ్య = ప్రవేశించి, విలోడితే = కెలకబడిందగుచుండగా, ఉపసర్పన్ = గతాగతాలు చేస్తూన్న, పుంసః = పురుషునియొక్క, ధ్వజః = లింగము, విరాజతే = ప్రకాశిం చుచున్నది.

వి. "ద్వ్యర్థైః పదైః పిశునయేచ్చ రహస్యవస్తు" అని చెప్పిన రీతిగా సురతప్రారంభగోష్ఠిలో ఈ వ్రీడాకరాశ్లీలం గుణమే కాని దోషం కాదు.

అవ. శమానికి సంబంధించిన మాటలలో జుగుప్సాకరాశ్లీలం దోషం కాదు అని చూపడానికి ఉదాహరిస్తున్నాడు-

వృ. శమకథాసు-

శ్లో॥ ఉత్తానోచ్ఛూనమణ్డూకపాటితోదరసంనిభే,
క్లేదిని స్త్రీవ్రణే సక్తిరకృమేః కస్య జాయతే. 304

వ్యా. శమకథలలో అశ్లీలం గుణం ఎట్లనగా-

ఉత్తానేతి :- ఉత్తానోచ్ఛూనమణ్డూకపాటితోదరసంనిభే = తిరగబడి ఉన్న ఉబ్బిన, మధ్య చీల్చబడిన కప్ప పొట్టతో సమానమైన, క్లేదిని = తడిగా ఉండే, స్త్రీవ్రణే = స్త్రీయొక్క వ్రణమునందు, వరాంగమునందు, అకృమేః = కృమి కాని, కస్య = ఎవనికి, సక్తిః = ఆసక్తి, జాయతే = కలుగును?

వి. వైరాగ్యం కలిగించడానికై చెప్పినది గాన దీనిలో ఉన్న జుగుప్సా కరాశ్లీలం దోషం కాదు.

అవ. అమంగళకరాశ్లీలం కూడా భావ్యర్థాన్ని సూచించడం కోసం చెప్పిన వాక్యంలో దోషం కాదని చూపుతున్నాడు—

శ్లో॥ నిర్వాణవైరదహనాః ప్రశమాదరీణాం
నన్దన్తు పాణ్డుతనయాః సహ మాధవేన,
రక్తప్రసాధితభువః క్షతవిగ్రహాశ్చ
స్వస్థా భవన్తు కురురాజసుతాః సభృత్యాః. 305

వృ. అత్ర భావ్యమఙ్గలసూచకమ్.

వ్యా. నిర్వాణేతి :- వేణీసంహారంలో సూత్రధారుని మాట లివి. పాణ్డుతనయాః = పాండవులు, అరీణామ్ = శత్రువులయొక్క, ప్రశమాత్ = శాంతించుట వలన, నిర్వాణవైరదహనాః = శాంతించిన వైరాగ్ని కలవారై, మాధవేన సహ = శ్రీకృష్ణునితో కూడ, నన్దన్తు = సంతోషించెదరు గాక. కురురాజసుతాః = కౌరవులు, రక్తప్రసాధితభువః = అనురక్తమైన, బాగా వశంచేసికొనబడిన భూమి గలవారై, క్షతవిగ్రహాః చ = నశించిన విరోధం కలవారై, సభృత్యాః = భృత్య సహితులై, స్వస్థాః = స్వస్థులుగా, భవన్తు = అగుదురు గాక.

ఇక్కడ- అరీణాంప్రశమాత్ = శత్రువుల వినాశం వలన, రక్తప్రసాధితభువః = రక్తంచేత అలంకరించబడిన భూమి గలవారై, క్షతవిగ్రహాః = ఖండించబడిన శరీరాలు కలవారై, స్వస్థాః భవన్తు = స్వర్గస్థులు అగుదురుగాక అనే అమంగళార్థం కూడా స్ఫురిస్తూన్నది. కాని ఇది భావ్యర్థసూచనం కోసం ఉపయోగిస్తూన్నది గాన దోషం కాదు. ఆ మాటే చెపుతున్నాడు-

అత్రేతి :- ఇక్కడ అశ్లీలం రాబోయే అమంగళాన్ని సూచిస్తున్నది.

అవ. కొన్ని చోట్ల వాక్యగతమైన సందిగ్ధత్వం కూడా గుణమే అని చెపుతున్నాడు-

వృ సందిగ్ధమపి వాచ్యమహిమ్నా క్వచిన్నియతార్థప్రతీతి కృత్త్వేన వ్యాజస్తుతిపర్యవసాయిత్వే గుణః. యథా-

శ్లో॥ పృథుకార్తస్వరపాత్రం భూషితనిఃశేషపరిజనం దేవ,
విలసత్కరేణుగహనం సంప్రతి సమమావయోః సదనమ్.

వ్యా. సందిగ్ధమితి :- సందిగ్ధం కూడా కొన్ని చోట్ల వాచ్యులైన రాజా మొదలైన వాని మహిమచేత, నియతమైన అనగా ప్రకృతమైన అర్థంయొక్క ప్రతీతిని కలిగించడం చేత వ్యాజస్తుతిలో పర్యవసానం పొందితే గుణమే.

అనగా పైకి సందిగ్ధంగా కనబడే వాక్యం కూడా వర్ణించబడే రాజాదులను పట్టి ప్రకృతమైన నిశ్చితార్థాన్నే బోధిస్తూ వ్యాజస్తుతిగర్భితంగా ఉన్నప్పుడు ఆ సందిగ్ధత్వం గుణమే కాని దోషం కాదు. ఎట్లనగా-

పృథుకేతి :- కవి రాజుతో అంటున్నాడు. దేవ = రాజా! పృథుకార్తస్వర పాత్రమ్ = (రాజపక్షంలో) పృథు + కార్తస్వరపాత్రమ్ = పెద్ద బంగారు పాత్రలు గలది, (కవిపక్షంలో) పృథుక = చిన్న పిల్లలయొక్క, ఆర్తస్వర = దీనములైన ఏడ్పులకు, పాత్రమ్ = స్థానము, భూషితనిఃశేషపరిజనమ్ = (రాజ పక్షంలో) అలంకరించుకొనబడిన సమస్తమైన పరివారం గలదీ, (కవిపక్షంలో) భూ + ఉషిత = నేలమీదనే నివసించే, సమస్త భార్యాపుత్రాదిపరిజనం కలదీ, విల సత్కరేణుగహనమ్ = ప్రకాశించుచున్న, కరేణువులచేత, ఏనుగులచేత, ప్రవేశింప శక్యం కానిది, (కవిపక్షంలో) 'వబయోరభేదః' అవడంచేత 'విల' అనగా బిలం. బిలంలో, సత్క = ఉండే ఎలుకలయొక్క, రేణువులచేత, అవి త్రవ్విపోసిన మట్టిచేత, ప్రవేశింప శక్యం కానిదీ అయిన, ఆవయోః సదనమ్ = మన ఇద్దరి ఇల్లూ, సంప్రతి = ఇప్పుడు, సమమ్ = సమంగా ఉన్నది.

ఇక్కడ ప్రయోగించిన మూడు విశేషణాలకీ ఈ అర్థమా ఆ అర్థమా అని మొదట సందేహం కలిగినా ప్రకరణవశంచేత నిశ్చితార్థాన్ని చెపుతూ ఇవి రాజ స్తుతిలో పర్యవసానం చెందుతున్నాయి. వ్యాజస్తుత్యలంకారం. అందుచేత అపా తతః కనబడే సంగిగ్ధత్వం ఇక్కడ గుణమే అయింది.

అవ. కొన్ని చోట్ల అప్రతీతత్వం కూడా గుణం అవుతుం దని ప్రతి పాదిస్తున్నాడు.

వృ. ప్రతిపాద్యప్రతిపాదకయోః జ్ఞత్వే సతి అప్రతీతం గుణః. యథా-

శ్లో॥ ఆత్మారామా విహితమతయో నిర్వికల్పే సమాధౌ
జ్ఞానోద్రేకాద్విఘటితతమోగ్రన్థయః సత్త్వనిష్ఠాః,
యం వీక్షన్తే కమపి తమసాం జ్యోతిషాం వా పరస్తా
త్తం మోహాన్ధః కథమయమముం వేత్తి దేవం పురాణమ్.

వ్యా. ప్రతిపాద్యేతి :- ప్రతిపాద్యుడు అనగా శ్రోత, ప్రతిపాదకుడు అనగా వక్త- ఇద్దరూ కూడా శాస్త్రం తెలిసినవారైనప్పుడు అప్రతీతం గుణమే అవుతుంది. ఎట్లనగా-

ఆత్మారామాఇతి :- వేణీసంహారం ప్రథమాంకంలో దుర్యోధనుడు కృష్ణుణ్ణి బంధించడానికి ప్రయత్నించాడని విని సహదేవుడు- "ఆర్యా! దుర్మార్గుడైన దుర్యోధనునికి శ్రీకృష్ణుని నిజస్వరూపం తెలియదా" అని ప్రశ్నించి నపుడు భీమసేనుడు అంటూన్న మాటలు. ఆత్మరామాః=ఆత్మయందే క్రీడించే వారు, అనగా ఆత్మానందం అనుభవించేవారు, నిర్వికల్పే సమాధౌ = నిర్వికల్పసమాధియందు, ధ్యేయమైన వస్తువు తప్ప ఇతరవస్తువుల జ్ఞానం లేని, తదేకాగ్రధ్యానమునందు, విహితరతయః = చేయబడిన ఆసక్తి గలవారు, జ్ఞానోద్రేకాత్ = జ్ఞానంయొక్క ఉద్రేకంవలన, విఘటితతమోగ్రన్థయః = తొలగించబడిన అజ్ఞానబంధం గలవారు, సత్త్వనిష్ఠాః=సత్త్వగుణంలో మాత్రమే స్థితికలవారు అయిన మహాయోగులు, తమసామ్ = తమస్సులకు కాని, జ్యోతిషాం వా = సామాన్యతేజస్సులకు గాని, పరస్తాత్ = అవతల దూరంగా (తామసవృత్తులకు కాని రాజసవృత్తులకు గాని దూరంగా అని మరొక వ్యాఖ్యానం), కమపి = వర్ణించ శక్యం కాని, యమ్ = ఎవనిని, వీక్షన్తే = చూస్తారో, తమ్ = అట్టి, అముమ్ = ఈ, పురాణం దేవమ్ = ప్రకృతికంటె కూడా పూర్వమునందున్న శ్రీకృష్ణుణ్ణి, అనగా ప్రకృతిని కూడా వశంలో ఉంచుకొన్న పురాతన పురుషుడైన శ్రీకృష్ణుణ్ణి, మోహాన్ధః = మోహాంధుడైన, అయమ్ = ఇతడు, కథమ్ = ఎట్లు, వేత్తి = తెలుసుకొనును?

ఇక్కడ నిర్వికల్పసమాధి మొదలైన శబ్దాలు యోగశాస్త్రమాత్రప్రసిద్ధాలవడంచేత అప్రతీతాలే అయినా వక్త అయిన భీమసేనుడు, శ్రోత అయిన సహ

దేవుడూ కూడా శాస్త్రజ్ఞానవంతులే కాబట్టి ఈ అప్రతీతత్వం గుణమే కాని దోషం కాదు.

వృ. స్వయం వా పరామర్శే- యథా-

శ్లో॥ షడధికదశనాడీచక్రమధ్యస్థితాత్మా
హృది వినిహితరూపః సిద్ధిదస్తద్విదాం యః,
అవిచలితమనోభిః సాధకైర్మృగ్యమాణః
స జయతి పరిణద్ధః శక్తిభిః శక్తినాథః. 308

వ్యా. స్వయమితి :- వక్త తాను పర్యాలోచనం చేస్తున్నప్పుడు కూడా అప్రతీతత్వం గుణమే. ఎట్లనగా-

షడితి :- మాలతీమాధవంలో కపాలకుండల అనే కాపాలిక తనలో అను కుంటూన్న మాటలు. "షడధిక...ఆత్మా"- షడధికదశ = పదహారు, నాడీ = నాడుల, చక్ర = చక్రంయొక్క, మధ్య = మధ్యయందు, స్థితాత్మా = ఉన్న స్వరూపం గలవాడు. ఇడ, పింగల, సుషుమ్న, అపరాజిత, గాంధారి, హస్తిజిహ్వ, పూష. అలంబుస. కుహూ, శంఖిని. తాలుజిహ్వ, ఇభజిహ్వ, విజయ, కామద, అమృత, బహుల అని పదహారు నాడులు. వాటి మధ్య ఉన్న చక్రం అనగా హృదయంలో ఉన్న మణిపూరం అనే చక్రం. దాని మధ్యలో ఉన్నవాడు అని అర్థం. హృది = హృదయమునందు, వినిహితరూపః = ఉంచబడిన జ్యోతిః స్వరూపం గల, యః = ఎవడు, తద్విదామ్ = దానిని ఎరిగినవారికి, సిద్ధిదః = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనే అష్ట సిద్ధులను ఇచ్చువాడో, అవిచలితమనోభిః = నిశ్చలమైన మనస్సులు గల, సాధకైః = సాధకులచేత, మృగ్యమాణః = అన్వేషించబడుతున్న, శక్తిభిః = జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, కృతిశక్తి అనే శక్తులచేత, పరిణద్ధః = వ్యాప్తుడైన, సః = అట్టి, శక్తినాథః = పార్వతీపతి, జయతి = సర్వోత్కర్షగా ఉన్నాడు.

ఇక్కడ ఆగమాలలో మాత్రమే ప్రసిద్ధాలైన నాడీ-సిద్ధ్యాదిపదాలు ప్రయోగించినా ఈ విషయాలన్నీ తెలిసిన వ్యక్తియే వీటిని గూర్చి పర్యాలోచన చేస్తూన్నది గాన ఈ అప్రతీతత్వం గుణమే.

వృ. అధమప్రకృతిషు గ్రామ్యో గుణః. యథా-

శ్లో॥ ఫుల్లుక్కరం కలమకూరణిహం వహన్తి
జే సిన్ధువారవిడవా మహ వల్లహా దే,
జే గాలిదస్స మహిసీదహిణో సరిచ్ఛా
దే కించ ముద్ధవిఅఇల్లపసూణపుఞ్జా. 309

"పుష్పోత్కరం కలమభక్తనిభం వహన్తి
యే సిన్ధువారవిటపా మమ వల్లభాస్తే,
యే గాలితస్య మహిషీదధ్నః సదృశా
స్తే కించ ముగ్ధవిచకిలప్రసూనపుఞ్జాః. 309

వృ. అత్ర కలమ భక్తమహిషీదధిశబ్దాః గ్రామ్యా అపి విదూషకోక్తాః.

వ్యా. అధమేతి:- అధమప్రకృతికలవాళ్ళ, అనగా నీచపాత్రల, మాటలలో గ్రామ్యం గుణమే. ఎట్లనగా-

పుష్పోత్కరమితి :- రాజశేఖరుని కర్పూరమంజరిలో విదూషకుని మాటలివి- యే = ఏ, సిన్ధువారవిటపాః = సింధువారవృక్షముల కొమ్మలు, కలమభక్తనిభమ్ = వరి అన్నంతో సమానమైన, పుష్పోత్కరమ్ = పుష్పసముదాయమును, వహన్తి = వహించుచున్నవో, తే = అవి, మమ = నాకు. వల్లభాః = ఇష్టమైనవి ఆ పువ్వులు వరి అన్నం వలె ఉండడం దీనికి కారణం. కిం చ = మరియు యే = ఏవి, గాలితస్య = నీళ్ళు లేకుండా వడగట్టిన, మహిషీదధ్నః = గేదె పెరుగుకు, సదృశాః = సమానమైనవో తే = ఆ, ముగ్ధవిచకిలప్రసూనపుఞ్జాః = సుందరములైన మల్లెపూవుల సముదాయాలు కూడ నాకు ఇష్టమైనవి. వీటికి దధిసాదృశ్యమే ఇందుకు కారణం.

అత్రేతి :- 'కలమ-భక్త-మహిషీదధి' శబ్దాలు-'కలమ-కూర-మహిసీదహి' శబ్దాలు గ్రామ్యాలు. విదగ్ధజనులు ప్రయోగించేవి కావు. అయినా నీచ పాత్రయైన

విదూషకుని మాటలు కాబట్టి వీటి ప్రయోగంలో దోషం లేదు. ఈ గ్రామ్యత్వం గుణమే

వృ. న్యూనపదం క్వచిద్గుణః. యథా-

శ్లో॥ గాఢాలిఙ్గనవామనీకృతకుచప్రోద్భూతరోమోద్గమా
సాన్ద్రస్నేహరసాతిరేకవిగలచ్ఛ్రీమన్నితమ్బామ్బరా.
మా మా మానద మాతి మామలమితి క్షామాక్షరోల్లాపినీ
సుప్తా కిం ను మృతా ను కిం మనసి మే లీనా విలీనా ను కిమ్.

వ్యా. న్యూనేతి :- కొన్ని చోట్ల న్యూనపదత్వం గుణం. ఎట్లనగా-

గాఢేతి :- అమరుశతకంలోని శ్లోకం. రతిశ్రమఖిన్నురాలైన ప్రియురాలిని గూర్చి అనేకవిధాల స్మరిస్తూన్న ఒక నాయకుని మాటలు. గాఢాలిఙ్గనవామనీకృతకుచప్రోద్భూతరోమోద్గమా = గాఢాలింగనంచేత పొట్టివిగా చేయబడిన (నొక్కి వేయబడిన) కుచములమీద పుట్టిన రోమాంచం కలదీ, సాన్ద్రస్నేహరసాతిరేకవిగలచ్ఛ్రీమన్నితమ్బామ్బరా = దట్టమైన స్నేహరసము ఆధిక్యంచేత జారుచున్న, సుందరమైన, నితంబవస్త్రం కలదీ, మానద = మానమును (కోపమును) నశింపచేయువాడా! లేదా మానమును (గౌరవమును) ఇచ్చువాడా! మా = నన్ను, మా (ఆయాసయ) = ఆయాస పెట్టకుము. మామ్ = నన్ను, అతి = అధికంగా, మా (పీడయ) = పీడించకుము. అలమ్ = చాలును, ఇతి = అని, క్షామాక్షరోల్లాపినీ = అస్పష్టములైన అక్షరాలను ఉచ్చరించుచున్న ఆ నా ప్రేయసి, (నిశ్చలంగా ఉండిపోవడంచేత ఊహిస్తున్నాడు) సుప్తా కిం ను = నిద్రించినదా? మృతా ను కిమ్ = మరణించిందా? మే మనసి = నా మనస్సులో, లీనా = అణగిపోయిందా: విలీనా ను కిమ్ = కలిసిపోయిందా.

వి. ఇక్కడ 'మా మా' అన్నచోట 'ఆయాసయ' అనే పదమూ, 'మాతి' అన్నచోట 'పీడయ' అనే పదమూ ఉండాలి. అందుచేత న్యూనపదత్వదోషం. కాని ఇక్కడ ఆ పదాలు ప్రయోగించకపోయినా వాటి అర్థం వెంటనే స్ఫురిస్తూన్నది అంతేకాకుండా వాటిని ప్రయోగించకపోవడంచేత ఆ సమయంలో నాయికకు ఉన్న హర్షమోహాతిశయం గమ్యం అవుతున్నది. అందుచేత ఇక్కడ న్యూనపదత్వం గుణమే కాని దోషం కాదు.

వృ. క్వచిన్న గుణో న దోషః. యథా-

శ్లో॥ తిష్ఠేత్కోపవశాత్ప్రభావపిహితా దీర్ఘం న సా కుప్యతి
స్వర్గాయోత్పతితా భవేన్మయి పునర్భావార్ద్రమస్యా మనః,
తాం హర్తుం విబుధద్విషోఽపి న చ మే శక్తాః పురో వర్తినీం
సా చాత్యన్తమగోచరం నయనయోర్యాతేతి కోఽయం విధిః.

వృ. అత్ర 'పిహితా' ఇత్యతః అనన్తరం 'నైతద్యతః' ఇత్యేతైః న్యూనైః పదైః విశేషబుద్ధేరకరణాత్ న గుణః. ఉత్తరా ప్రతిపత్తిః పూర్వాం ప్రతిపత్తిం బాధతే ఇతి న దోషః.

వ్యా. క్వచిదితి:- కొన్ని చోట్ల ఈ న్యూనపదం గుణమూ కాదు దోషమూ కాదు. ఎట్లనగా-

తిష్ఠేదితి :- విక్రమోర్వశీయంలో విరహంతో బాధపడుతున్న పురూరవుని మాట లివి. కోపవశాత్ = కోపంవలన, ప్రభావపిహితా = తిరస్కరిణీవిద్యా ప్రభావంచేత అంతర్ధానంచెందనదై, తిష్ఠేత్=ఉండునా? "నైతద్యుక్తమ్; యతః" = ఇదియుక్తం కాదు; ఎందువలన అని అంటే" అని అధ్యాహారం తెచ్చుకోవాలి. సా = ఆమె, దీర్ఘమ్ = దీర్ఘంగా, న కుప్యతి = కోపించదు. స్వర్గాయ = స్వర్గం కొరకు (స్వర్గానికి), ఉత్పతితా భవేత్ = ఎగిరిపోయి ఉంటుందా? (పైవలె అధ్యాహారం). పునః = కాని, అస్యాః మనః = ఈమె మనస్సు, మయి = నాయందు, భావార్ద్రమ్=ప్రేమభావంచేత అర్ద్రమైనది మే పురోవర్తినీమ్ = నా ఎదుటఉన్న, తామ్ = ఆమెను, హర్తుమ్ = హరించుటకు, విబుధద్విషోఽపి = రాక్షసులుకూడ, న శక్తాః = సమర్థులు కారు. సా చ = ఆమె, నయనయోః=నేత్రములకు, అగోచరమ్ = అవిషయత్వమును, యాతా = పొందినది, పూర్తిగా కనబడకుండా పోయినది, ఇతి = ఈ, విధిః = దైవం, కః = ఏమిటి?

అత్రేతి :- ఇక్కడ 'పిహితా' అన్న తరవాత "న ఏతత్; యతః" అనే పదాలు న్యూనం అయినవి. కాని ఇలా న్యూనం అవడంవల్ల విశేషభావం ఏదీ స్ఫురించడంలేదు. అందుచేత ఇది (న్యూనపదత్వం) గుణం కాదు. తరువాతి ఆలోచన, "దీర్ఘం న సా కుప్యతి" అనేది, మొదటి ఆలోచనను, "తిష్ఠేత్ కోపవ

శాత్రృభావపిహితా" అనే దానిని, బాధిస్తున్నది, తొలగిస్తున్నది. అందుచేత న్యూన పదాల స్ఫూర్తి వెంటనే కలుగుతున్నది గాన దోషం కూడా కాదు. 'స్వర్గాయ' ఇత్యాది రెండవ పాదంలో కూడా 'భవేత్' తరవాత న్యూనపదత్వం, దాని పరిహారం ఇట్లే చూచుకొనవలెను.

వృ. అధికపదత్వం క్వచిద్గుణః. యథా-

శ్లో॥ యద్వఞ్చనాహితమతిర్బహుచాటుగర్భం
కార్యోన్ముఖః ఖలజనః కృతకం బ్రవీతి,
తత్సాధవో న న విదన్తి విదన్తి కిం తు
కర్తుం వృథా ప్రణయమస్య న పారయన్తి. 312

వృ. అత్ర 'విదన్తి' ఇతి ద్వితీయపదమన్యయోగవ్యవచ్ఛేద పరమ్.

వ్యా. కొన్ని చోట్ల అధికపదత్వం గుణమే. ఎట్లనగా-

యదితి:- వఞ్చనాహితమతిః = వంచన చేయుటయందు స్థాపితమైన బుద్ధి గల, వంచన చేయాలని నిశ్చయించుకొన్న, కార్యోన్ముఖః = కార్యాభిముఖుడైన, తన కార్యం సాధించుకొనడంకోసం ప్రయత్నించే, ఖలజనః = దుష్టుడు, కృతకమ్ = కృత్రిమమైన, అసత్యమైన, యమ్ = ఏ వచనమును, బ్రవీతి = పలుకుతాడో, తత్ = దానిని, సాధవః = సత్పురుషులు, న విదన్తి ఇతి న = ఎరుగరు అనే మాట లేదు. విదన్తి = ఎరుగుదురు. కింతు = కాని, అస్య = వీనియొక్క, ప్రణయమ్ = కృత్రిమస్నేహాన్ని కూడా, వృథా = వ్యర్థంగా, కర్తుమ్ = చేయుటకు, న పారయన్తి = సమర్థులు కారు.

అత్రేతి :- ఇక్కడ 'విదన్తి' అనే రెండవ పదం అన్యయోగాన్ని వ్యవచ్ఛేదం చేయడం కోసం. అనగా 'న విదన్తి ఇతి న' అనే వాక్యంలోనిది కాక రెండవ 'విదన్తి' అనేది పైకి అధికపదం వలె కనబడుతుంది. కాని "వాళ్ళే ఎరుగుదురు. కాని ఇతరులకు తెలువరు" అనే భావాన్ని సూచించడంకోసం ఈ పదం ప్రయోగించబడింది అని అర్థం. అందుచేత ఇక్కడ అధికపదత్వం గుణమే.

వృ. యథా వా-

శ్లో॥ వద వద జితః స శత్రుర్న హతో జల్పంశ్చ తవ తవాస్మీతి,
చిత్రం చిత్రమరోదీద్ధా హేతి పరం మృతే పుత్రే. 313

వృ. ఇత్యేవమాదౌ హర్షభయాదియుక్తే వక్తరి.

వ్యా. అధికపదత్వం గుణం అవడానికి మరొక ఉదాహరణం ఎట్లనగా.

వదేతి :- సః శత్రుః = ఆ శత్రువు, జితః = జయించబడినాడా? వద వద = చెప్పుము, చెప్పుము. ఇది యుద్ధంనుంచి వచ్చినవారిని ప్రభువు అడిగిన ప్రశ్న. తవ అస్మి, తవ అస్మి ఇతి = 'నీ వాడను', 'నీ వాడను' అని, జల్పన్ చ = పలుకుతున్న అతడు, న హతః = చంపబడలేదు. పరమ్ = కాని, పుత్రే = పుత్రుడు, మృతే = మరణించినవాడగుచుండగా, హా హా ఇతి = హా హా అని, చిత్రం చిత్రమ్ = చిత్ర చిత్రంగా, అరోదీత్ = ఏడ్చెను.

ఇతీతి :- ఈ మొదలైనవాటిలో వక్త హర్షభయాదులతో కూడినప్పుడు అధికపదత్వం గుణం అవుతుంది.

వి. ఇక్కడ మొదటి పాదంలోని వక్త ప్రభువు. అతడు హర్షావేశంలో ఉండడంచేత 'వద వద' అని రెండు మాట్లు అన్నాడు. రెండవపాదంలో వక్త ఓడిపోయిన శత్రువు. భయావేశంచేత అతడు 'తవాస్మి, తవాస్మి' అని రెండు మాట్లు అన్నాడు. మూడవ పాదంలో వక్తలు యుద్ధంనుంచి వచ్చిన యోధులు. వాళ్ళు ఆశ్చర్యావేశంలో "చిత్రం చిత్రమ్" అని రెండు మాట్లు అన్నారు. నాల్గవ పాదంలో వక్త ఓడిపోయి శరణుజొచ్చిన శత్రువు. అతడు దుఃఖావేశంలో ఉండడంచేత 'హా హా' అని రెండు మాట్లు అన్నాడు. ఈ విధంగా హర్షాదివ్యంజకాలు గాన అధికపదాలు దుష్టములు కావు అని అర్థం.

వృ. కథితపదం క్వచిద్గుణః లాటానుప్రాసే అర్థాన్తరసంక్రమితవాచ్యే విహితస్య అనువాద్యత్వే చ. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ సితకరకరరుచిరవిభా విభాకరాకార ధరణిధరకీర్తిః,
పౌరుషకమలా కమలా సాపి తవైవాస్తి నాన్యస్య. 314

వ్యా. కథితేతి :- కొన్ని చోట్ల అనగా లాటానుప్రాసంలోను, అర్థాంతర సంక్రమితవాచ్యధ్వనిలోను, విధించబడినదాన్ని అనువదించేటప్పుడు కథితపదం గుణం అవుతుంది. క్రమంగా ఉదాహరణలు.

సితేతి :- ఇది లాటానుప్రాసలో కథితపదత్వానికి గుణత్వం ఉండడానికి ఉదాహరణం. విభాకరాకార = సూర్యుని వంటి ఆకారం గలవాడా! తీవ్రమైన ప్రతాపం గలవాడా, ధరణీధర = రాజా! సితకరకరరుచిరవిభా = చంద్రుని కిరణముల వంటి అందమైన కాంతి గల, కీర్తిః=కీర్తి, పౌరుషకమలా = పౌరుష లక్ష్మి, సా = అప్రసిద్ధమైన, కమలా అపి = లక్ష్మి, తవైవ = నీకే, అస్తి = ఉన్నది అన్యస్య = ఇతరునకు, న = లేదు.

వి. సమానార్థకాలైన పదాలు ఆవృత్తి చేయబడితే, రెండుసార్లు ప్రయోగించ బడితే, లాటానుప్రాసం. రెండు పదాలకీ అర్థం ఒకటే అయి ఉంటేనే ఈ అను ప్రాసం. ఇక్కడ 'కరకర' 'విభావిభా' 'కమలాకమలా' అని రెండుసార్లు పదాలు ప్రయోగించబడ్డాయి. అందుచేత లాటానుప్రాసం. ఈ అనుప్రాసకొరకై ఒకే అర్థం గల పదాన్ని ఆవృత్తి చేయడం జరిగింది. అందుచేత ఇక్కడ కథిత పదత్వం గుణమే కాని దోషం కాదు.

అవ. అర్థాన్తరసంక్రమితవాచ్యధ్వనిలో కథిపదం గుణం అవడానికి ఉదా హరణం చూపుతున్నాడు—

శ్లో॥ తాలా జాఅంతి గుణా జాలా దే సహిఅఏహిం ఘేప్పన్తి,
రఇకిరణాణుగ్గహిఆఇం హోన్తి కమలాఇం కమలాఇం. 315

"తదా జాయన్తే గుణాః యదా తే సహృదయైర్గృహ్యన్తే
రవికిరణానుగృహీతాని భవన్తి కమలాని కమలాని"

వ్యా. ఆనందవర్ధనుని విషమబాణలీలలోని శ్లోకం. యదా = ఎప్పుడు, తే = అవి, సహృదయైః = సహృదయులచేత. గృహ్యన్తే = గ్రహింపబడతాయో, తదా = అప్పుడు, తే = అవి, గుణాః = గుణాలుగా, జాయన్తే = అవుతాయి. రవి కిరణానుగృహీతాని = సూర్యకిరణాలచేత అనుగ్రహించబడిన, కమలాని = కమ లాలు, కమలాని = కమలాలుగా, భవన్తి = అవుతున్నాయి.

వి. ఇక్కడ రెండవ 'కమల' పదం అర్థాంతరసంక్రమితవాచ్యం చాలా. గొప్పది, అసాధారణమైనది, సౌరభాదిగుణయుక్తము అని వ్యంగ్యం. ఈ వ్యంగ్యార్థానికి కమలపదపునరావృత్తియే కారణం. అందుచేత ఇక్కడ కూడా కథిత పదత్వం గుణమే.

అవ. విహితమైనదానిని అనువదించవలసివచ్చినప్పుడు కథితపదం గుణం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ జితేన్ద్రియత్వం వినయస్య కారణం
గుణప్రకర్షో వినయాదవాప్యతే,
గుణప్రకర్షేణ జనోఽనురజ్యతే
జనానురాగప్రభవా హి సంపదః. 316

వ్యా. జితేతి :- జితేన్ద్రియత్వమ్ = జయించబడిన ఇంద్రియాలు కలిగి ఉండడం, ఇంద్రియాలను జయించడం, వినయస్య = వినయానికి, కారణమ్ = కారణము. వినయాత్ = వినయంవలన, గుణప్రకర్షః = గుణాల ఉత్కర్ష, అవాప్యతే = పొందబడును. గుణప్రకర్షాత్ = గుణాల ప్రకర్షవలన, జనః = జనం, అనురజ్యతే = అనురాగం కలది అగును. సంపదః = సంపదలు, జనానురాగప్రభవాః హి = జనుల అనురాగమే కారణంగా కలవి కదా?

వి. ఇక్కడ మొదటి వాక్యంలో జితేంద్రియత్వంచేత వినయం కలుగుతుందని వినయం విధించబడింది. ఆ విషయాన్ని అనువదించి ద్వితీయపాదంలో గుణప్రకర్ష విధించబడింది. ఆ గుణప్రకర్షను అనువదించి తృతీయపాదంలో జనానురాగం విధించబడింది. జనానురాగాన్ని అనువదించి చతుర్థపాదంలో సంపదలు విధించబడ్డాయి. ఈ విధంగా విధించబడినదానిని అనువదించేటప్పుడు కథితపదత్వం గుణమే కాని దోషం కాదు.

వృ. పతత్ప్రకర్షమపి క్వచిద్గుణః. యథా ఉదాహృతే ప్రాగప్రాప్తేత్యాదౌ- 317. సమాప్తపునరాత్తం క్వచిన్నగుణః, న దోషః, యత్ర న విశేషణమాత్రదానార్థం పునర్గ్రహణమ్, అపి తు వాక్యాన్తరమేవ క్రియతే. యథా అత్రైవ ప్రాగప్రాప్తేత్యాదౌ- 318.

అపదస్థసమాసం క్వచిద్గుణః. యథా ఉదాహృతే రక్తాశోకేత్యాదౌ 319.

వ్యా. పతదితి:- పతత్ప్రకర్షం కూడా కొన్ని చోట్ల గుణమే ఉదాహరించిన "ప్రాగప్రాప్త" ఇత్యాదిపద్యంలో (చూ. 209 శ్లోకం) వలె. ఈ పద్యంలోని చతుర్థపాదంలో గురువును స్మరించగానే క్రోధం తగ్గడంచేత మృదువైన కోమల పదయుక్తబంధమే యుక్తం గాన ఇక్కడ పతత్ప్రకర్షత్వం (వికటవర్ణదీర్ఘసమాసాదులతో ప్రారంభించిన రచనలో చతుర్థపాదం వచ్చే సరికి అది సడలినా) గుణమే అని అర్థం.

సమాప్తేతి :- ఎక్కడ మళ్ళీ గ్రహించడం విశేషణం కూర్చడం కోసం మాత్రమే కాదో, మరొక వాక్యమే నిర్మించబడుతుందో అలాంటి కొన్ని స్థలాలలో పూర్వం ఉదాహరించిన ప్రాగప్రాప్తేత్యాది శ్లోకంలో వలె (చూ. 209 శ్లోకం) సమాప్తపునరాత్తం గుణమూ కాదు, దోషమూ కాదు. ఈ శ్లోకంలో 'యేనానేన' ఇత్యాదికం కేవలం విశేషణం కూర్చడంకోసం చేర్చబడలేదు. మరొక వాక్యమే నిర్మించబడింది. అందుచేత ఇక్కడ యచ్ఛబ్దంచేత సమాప్తమైన దానిని మళ్ళీ గ్రహించినా, 'సమాప్తపునరాత్తత్వం' ఉన్నా అది దోషం కాదు; దీనివల్ల వైశిష్ట్యం ఏదీ కనబడడం లేదు గాన గుణం కూడా కాదు.

వెనుక ఉదాహరించిన 'రక్తాశోక' ఇత్యాది శ్లోకంలో వలె (చూ. 300 శ్లోకం) కొన్నిచోట్ల 'అపదస్థసమాసం' గుణం అవుతుంది. ఈ శ్లోకంలో తృతీయ పాదంలోని దీర్ఘసమాసం విప్రలంభశృంగారానికి అనుగుణం కాకపోయినా అశోక వృక్షంమీద నాయకునికి కలిగిన క్రోధాన్ని సూచించడంద్వారా విప్రలంభపోషకం గానే ఉన్నది. అందుచేత అపాతతః అపదస్థసమాసత్వం ఉన్నా అది గుణమే.

నిజానికి ఇక్కడ అపదస్థసమాసత్వమే లేదు. అన్ని పాదాలకీ వక్త ఒకడే కదా! అస్థానస్థ (అపదస్థ) సమాసానికి ఉదాహరణంగా ఇచ్చిన 'అద్యాపి' ఇత్యాది శ్లోకంలో వలె (చూ. 238 శ్లోకం) వక్తృభేదం లేదు కదా? అందుచేత ఇది చింత్యము అని ప్రదీపకారుడు అభిప్రాయపడగా సుధాసాగరవ్యాఖ్యానకర్త మమ్మటుణ్ణి సమర్థించడానికి ప్రయత్నించాడు. కాని ప్రదీపకారుడు చెప్పినదే యుక్తం అని తోస్తుంది. 'సుధాసాగరం' అనే వ్యాఖ్య రచించిన భీమసేనుడు అడుగడుగునా మమ్మటుణ్ణి 'వాగ్దేవ్యవతారం' అని కొనియాడుతూ, ఆయనమీద ఈగ వాలకుండా

చూస్తూంటాడు. కొన్నిచోట్ల ఇతడు చేసే వాదనలు స్వతంత్రంగా ఆలోచించడం అలవాటున్నవాళ్ళకి అనుచితంగా కనబడతాయి.

వృ. గర్భితం తథైవ. యథా-

గాథ. హుమి అవహత్థిఅరేహో ణిరంకుసో అహ వివేఅరహిఓ వి
సివిణే వి తుమమ్మిపుణో పత్తిహి భత్తిం ణ పసుమరామి.

"భవామ్యపహస్తితరేఖో నిరఙ్కుశోఽథ వివేకరహితోఽపి
స్వప్నేఽపి త్వయి పునః ప్రతీహి భక్తిం న ప్రస్మరామి"

వృ. అత్ర 'ప్రతీహి' ఇతి మధ్యే దృఢప్రత్యయోత్పాదనాయ. ఏవమన్యదపి లక్ష్యాల్లక్ష్యమ్.

వ్యా. గర్భితమితి :- గర్భితం కూడా అట్లే. అనగా కొన్నిచోట్ల గుణం అవుతుంది. ఎట్లనగా-

భవామీతి :- ఆనందవర్ధనుడు రచించిన విషమబాణలీలలో మన్మథునితో యౌవనం అంటూన్న మాటలు. నేను, అపహస్తితరేఖః = తొలగించబడిన మర్యాదలు (కట్టుబాట్లు) కలవాడను, నిరఙ్కుశః = నిరంకుశుడను, అథ = మరియు, వివేకరహితః అపి = వివేకం లేనివాడను, భవామి = అగుదును, ఇలాంటివాడిని కావచ్చును. స్వప్నే అపి = స్వప్నంలో కూడ, త్వయి = నీయందు, భక్తిం పునః = భక్తినైతే, న ప్రస్మరామి=మరువను; ప్రతీహి = తెలుసుకొనుము.

అత్రేతి :- ఇక్కడ వాక్యమధ్యంలో 'ప్రతీహి' అనేది దృఢమైన నమ్మకం కలిగించడం కోసం. ఈ విధంగానే ఇతరమైనది కూడా లక్ష్యాన్ని పట్టి ఊహించుకోవాలి.

వి. ఇక్కడ దృఢంగా నమ్మకం కలగడంకోసం వాక్యమధ్యంలో 'ప్రతీహి' అని ప్రయోగించబడింది. అందుచేత గర్భితత్వం గుణమే కాని దోషం కాదు.

ఈ విధంగానే లక్ష్యాలను పట్టి ఎక్కడ దోషం కూడా గుణం అవుతుందో, ఎక్కడ దోషమూ, గుణమూ కూడా కాదో ఊహించుకోవాలి. అనగా ఈ ఘట్టంలో

చెప్పిన దోషాల విషయంలోనే కాకుండా ఇతరదోషాల విషయంలో కూడా ఊహించుకోవాలి అని అర్థం. ఇతరశ్లోకాలలో కూడా ఈ దోషాలు కనబడినంత మాత్రాన దోషం అనకూడదు; పై ఉదాహరణలలో చూపిన విధంగా ఇతరాంశాలు కూడా పరిశీలించి నిర్ణయించాలి అని కూడా అర్థం.

ఈ ఘట్టంలో (58, 59వ కారికలు తద్వ్యాఖ్యోదాహరణాలు) మమ్మటుడు అపుష్టార్థత్వం, పునరుక్తత్వం, నిర్హేతుత్వం, కష్టత్వం, అప్రయుక్తత్వం, నిహతార్థత్వం, అశ్లీలం, సందిగ్ధత్వం, అప్రతీతత్వం, గ్రామ్యత్వం, న్యూనపదత్వం, అధికపదత్వం, కథితపదత్వం, పతత్ప్రకర్షత్వం, సమాప్తపునరాత్తత్వం, అపదస్థసమాసత్వం, గర్భితత్వం అనే 17 దోషాలు కొన్ని సందర్భాలలో దోషాలు కావనీ,దోషాలు కాకపోవడమే కాకుండా గుణా లనీ సోదాహరణంగా ప్రతిపాదించాడు. దీనిని పట్టి పై దోషాలు అనిత్యదోషాలనీ, ఇంక మిగిలిన దోషాలన్నీ నిత్యదోషాలనీ వ్యాఖ్యాతలు విశదీకరించారు. అనగా అవి ఎల్లప్పుడూ పరిత్యాజ్యాలే అని అర్థం అయితే మమ్మటుడు చూపినట్లుగా ఇతరదోషాలలో మరి కొన్నింటిని కూడా దోషాలు కావని సోదాహరణంగా ఎవరైనా నిరూపించగలిగితే వాటిని కూడా అనిత్యదోషా లని అంగీకరించడంలో మమ్మటునికి అభ్యంతరం ఉండదు. అందుచేతనే- "ఏవమన్యదపి లక్ష్యాల్లక్ష్యమ్" అని ఆయన ఈ ఘట్టాన్ని ముగించాడు.

అవ. ఇంతవరకూ చెప్పిన దోషాలన్నీ పద-వాక్య-అర్థాల ద్వారా రసానికి భంగం కలిగిస్తాయి. ఇప్పుడు సాక్షాత్తు రసవిరోధులైన దోషాలను నిరూపిస్తునాడు.

కా. వ్యభిచారిరసస్థాయిభావానాం శబ్దవాచ్యతా,
కష్టకల్పనయా వ్యక్తిరనుభావవిభావయోః. 60

ప్రతికూలవిభావాదిగ్రహో దీప్తిః పునః పునః,
అకాణ్డే ప్రథనచ్ఛేదౌ అఙ్గస్యాప్యతివిస్తృతిః. 61

అఙ్గినోఽననుసంధానం ప్రకృతీనాం విపర్యయః,
అనఙ్గస్యాభిధానం చ రసే దోషాః స్యురీదృశాః. 62

వ్యా. వ్యభిచారీతి :— వ్యభిచారిరసస్థాయిభావానామ్ = వ్యభిచారిభావాలు, రసం, స్థాయిభావాలు, శబ్దవాచ్యతా = తమ తమ శబ్దాలచేత, పేర్లచేత చెప్ప బడడం, (ఇవి మూడు దోషాలు). కష్టకల్పనయా = కష్టమైన కల్పనచేత, అను భావవిభావయోః = అనుభావవిభావాలయొక్క, వ్యక్తిః = వ్యంజనం, (ఇవి రెండు దోషాలు), ప్రతికూలవిభావాదిగ్రహః = ప్రస్తుతరసానికి ప్రతికూలములైన విభా వాదులను గ్రహించడం, పునః పునః = మాటిమాటికి, దీప్తిః = ఒకే రసాన్ని దీపింపచేయడం, అకాణ్డే = అసమయంలో, ప్రథనచ్ఛేదౌ = రసాన్ని విస్తరింప చేయడం, ఛేదించివేయడం, (ఇవి రెండు దోషాలు), అఙ్గస్య = అంగముయొక్క, అతివిస్తృతిః=అధికవిస్తరణం, అధికవర్ణనం, అఙ్గినః=అంగియొక్క, అననుసంధా నమ్=అనుసంధానం చేయకపోవడం, ప్రధానవ్యక్తులు మొదలైనవారిని మర్చిపోవడం వంటిది. ప్రకృతీనామ్ = ప్రకృతులయొక్క, నాయకాదులయొక్క, విపర్యయః = తారుమారు చేయడం, అనఙ్గస్య=అంగం కానిదానియొక్క, అభిధానమ్=చెప్పడం, ఈదృశాః = ఇట్టివి, రసే = రసమునందు, దోషాః = దోషాలు, స్యుః = అగును. ఈ పదమూడు దోషాలు, ఇంకా ఇటువంటి దోషాలు రసానికి సంబంధించినవి ఉంటాయి అని అర్థం.

వృ. (1) స్వశబ్దోపాదానం వ్యభిచారిణో యథా—

శ్లో॥ సవ్రీడా దయితాననే సకరుణా మాతఙ్గచర్మామ్బరే
సత్రాసా భుజగే సవిస్మయరసా చన్ద్రేఽమృతస్యన్దిని,
సేర్ష్యా జహ్నుసుతావలోకనవిధౌ దీనా కపాలోదరే
పార్వత్యా నవసంగమప్రణయినీ దృష్టిః శివాయాస్తు వః. 321

వృ. అత్ర వ్రీడాదీనామ్.

"వ్యానమ్రా దయితాననే ముకులితా మాతఙ్గచర్మామ్బరే
సోత్కమ్పా భుజగే నిమేషరహితా చన్ద్రేఽమృతస్యన్దిని
మీలద్భ్రూః సురసిన్ధుదర్శనవిధౌ మ్లానా కపాలోదరే"

ఇత్యాది తు యుక్తమ్.

వ్యా. స్వేతి :- వ్యభిచారిభావాలను స్వశబ్దంచేత గ్రహించడం ఎట్లనగా-

వి. వ్యభిచారిభావాలను, రసాలను, స్థాయిభావాలను వాటి వాటి కార్యాదుల వర్ణనం ద్వారా వ్యంజింపచెయ్యాలి కాని వాటి పేర్లు చెప్పి వాచ్యం చేయకూడదు. అలా చెయడం దోషం. వ్యభిచారిభావాల స్వశబ్దోపాదానానికి ఉదాహరణం ఎట్లనగా-

సవ్రీడా ఇతి :- దయితాననే = భర్త ముఖమునందు, సవ్రీడా = సిగ్గుతో కూడినది, మాతఙ్గచర్మామ్బరే = గజచర్మవస్త్రమునందు, సకరుణా = జాలితో కూడినది, భుజగే = సర్పమునందు, సత్రాసా = భయంతో కూడినదీ, అమృతస్యన్దిని = అమృతాన్ని స్రవిస్తూన్న, చన్ద్రే = చంద్రునియందు, సవిస్మయరసా = ఆశ్చర్యంతో కూడినదీ, జహ్నుసుతావలోకనవిధౌ = గంగను చూచుటయందు, సేర్ష్యా = ఈర్ష్యతో కూడినదీ, కపాలోదరే = కపాలమధ్యమునందు, దీనా = దీనమూ అయిన, నవసంగమప్రణయినీ = నవసంగమమునందు ప్రేమ గల, పార్వత్యాః దృష్టిః = పార్వతియొక్క చూపు, వః = మీయొక్క, శివాయ = మంగళం కొరకు, అస్తు = అగుగాక.

అత్రేతి :- ఇక్కడ వ్రీడ మొదలైన వ్యభిచారిభావాల పేర్లు చెప్పబడ్డాయి. అది దోషం. పై మూడు పాదాలకు బదులు "వ్యానమ్రా" ఇత్యాది పాఠం యుక్తంగా ఉంటుంది. "ప్రియుని ముఖంలో క్రిందికి వంగినది, గజచర్మవస్త్రంలో ముడుచుకున్నది, సర్పంలో కంపంతో కూడినదీ, అమృతం స్రవిస్తూన్న చంద్రునియందు రెప్పపాటు లేనిదీ, గంగను చూచుటయందు కనుబొమ్మల విరుపుతో కూడినదీ, కపాలోదరంలో మ్లానమైనది అయిన పార్వతి చూపు మీకు మంగళము లిచ్చుగాక" అని దీని అర్థం. ఈ పాఠంలో వ్రీడాదుల అనుభావాలైన క్రిందికి వంగడం మొదలైనవాటిచేత వ్రీడాదులు వ్యంజింపబడుతున్నాయి. ఈ విధంగా వ్యభిచారిభావాలు వ్యంగ్యాలుగా ఉండాలి గాని స్వశబ్దవాచ్యాలుగా ఉండకూడదు.

వృ. రసస్య స్వశబ్దేన, శృఙ్గారాదిశబ్దేన చ వాచ్యత్వమ్. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ తామనఙ్గజయమఙ్గలశ్రియం
కించిదుచ్చభుజమూలలోకితామ్,

నేత్రయోః కృతవతోఽస్య గోచరే
కోఽప్యజాయత రసో నిరన్తరః. 322

వ్యా. రసస్యేతి :- రసం సామాన్యరూపంలో 'రస' శబ్దంచేత, విశేష రూపంలో 'శృఙ్గార' మొదలైన శబ్దాలచేత వాచ్యం కావచ్చును. క్రమంగా ఉదాహరణం.

తామితి :- అనఙ్గజయమఙ్గలశ్రియమ్ = మన్మథుని విజయమంగల లక్ష్మి రూపురాలైన, (ముందుగా), కించిత్ = కొంచెము, ఉచ్చభుజమూలలోకితామ్ = ఉన్నతమైన స్తనసంధియందు చూడబడిన, తామ్ = ఆమెను, నేత్రయోః = నేత్రములయొక్క, గోచరే = గోచరమునందు, కృతవతః = చేసిన (పూర్తిగా చూచిన), అస్య = వీనికి, నిరన్తరః = నిరంతరమైన, అత్యధికమైన, కోఽపి = చెప్ప శక్యం కాని, రసః = శృంగార రసం, అజాయత = పుట్టెను.

వి. ఇక్కడ శృంగారరసం 'రస' శబ్దంచేత సామాన్యరూపంలో (శృంగార రసంగా కాకపోయినా, రసంగా) నిర్దేశించబడింది. ఇది దోషం.

అవ. రసం విశేషరూపంలో శృంగారపదంచేత నిర్దేశించబడిన ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ ఆలోక్య కోమలకపోలతలాభిషిక్త
వ్యక్తానురాగసుభగామభిరామమూర్తిమ్,
పశ్యైష బాల్యమతివృత్య వివర్తమానః
శృఙ్గారసీమని తరఙ్గితమాతనోతి. 323

వ్యా. ఆలోక్యేతి :- కోమలకపోలతలాభిషిక్తవ్యక్తానురాగసుభగామ్ = కోమలములములైన చెక్కిళ్ళయందు అభిషేకింపబడిన, అనగా ముఖవికాసాదుల ద్వారా స్థాపించబడిన, వ్యక్తమైన అనురాగంచేత సుందరమైన, అభిరామమూర్తిమ్ = మరోహరమైన మూర్తి గల ఆమెను, ఆలోక్య = చూచి, బాల్యమ్ = బాల్యమును, అతివృత్య = దాటి, వివర్తమానః = మార్పు చెందుదున్న, యౌవనంలో ప్రవేశిస్తూన్న, ఏషః = ఇతడు, శృఙ్గారసీమని = శృంగారసీమయందు, తరఙ్గి

తమ్ = అవిచ్ఛిన్నమైన ఉల్లాసమును, ఆతనోతి = చేయుచున్నాడు. పశ్య = చూడుము.

వి. ఇక్కడ రసాలలో ఒక రసమైన శృంగారాన్ని చెపుతూ 'శృంగార' శబ్దం ప్రయోగించబడినది. అది దోషం.

వృ. (3) స్థాయినో యథా-

శ్లో॥ సంప్రహారే ప్రహరణైః ప్రహారాణాం పరస్పరమ్,
ఠణత్కారైః శ్రుతిగతైరుత్సాహస్తస్య కోఽప్యభూత్. 324

వృ. అత్రోత్సాహస్య.

వ్యా. స్థాయినః ఇతి :- స్థాయి స్వశబ్దవాచ్యం అయిన ఉదాహరణం ఎట్లనగా-

సంప్రహారే ఇతి :- సంప్రహారే = యుద్ధమునందు, ప్రహరణైః = ఆయుధాలచేత, పరస్పరమ్=పరస్పరము చేయబడిన, ప్రహారాణామ్=దెబ్బలయొక్క, ఠణత్కారైః = 'ఠణ్ ఠణ్' అనే చప్పుళ్ళచేత, తస్య = వానికి, కోఽపి = చెప్ప శక్యం కాని, ఉత్సాహః = ఉత్సాహం, అభూత్ = ఆయెను.

అత్రేతి :- ఇక్కడ ఉత్సాహం స్వశబ్దంచేత ('ఉత్సాహ' శబ్దంచేత) చెప్పబడింది.

అవ. "కష్టకల్పనయా వ్యక్తిః" అనగా అనుభావవిభావాల అభివ్యక్తి కష్ట కల్పనచేత కలగడం అని అర్థం. అనగా ఇతరశ్లోకాదుల పరిశీలన, ప్రకరణాదులను గుర్తించడం చేస్తేనే కాని అవి అభివ్యక్తం కాకపోవడం. అప్పుడు వాటి ప్రతీతి ఆలస్యంగా జరుగుతుంది గాన రసానుభూతిలో చమత్కారం తగ్గుతుంది. అనుభావం కష్టకల్పనచేత వ్యక్తం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ కర్పూరధూలిధవలద్యుతిపూరధౌత
దిఙ్మణ్డలే శిశిరరోచిషి తస్య యూనః,
లీలాశిరోంశుకనివేశవిశేషక్లృప్తి
వ్యక్తస్తనోన్నతిరభూన్నయనావనౌ సా. 325

వృ. అత్రోద్దీపనాలమ్బనరూపాః శృఙ్గారయోగ్యా విభావా అనుభావపర్యవసాయినః స్థితాః ఇతి కష్టకల్పనా.

వ్యా. కర్పూరేతి :- శిశిరరోచిషి = చంద్రుడు, "కర్పూర....మణ్డలే"- కర్పూర = కర్పూరముయొక్క, ధూలి = పరాగం వలె, ధవల = తెల్లని, ద్యుతిపూర = కాంతిసముదాయంచేత, ధౌత = కడిగివేయబడిన, దిఙ్మణ్డలే = దిక్కుల మండలం కలవా డగుచుండగా, లీలాశిరోంశుకనివేశవిశేషక్లృప్తి వ్యక్తస్తనోన్నతిః = విలాసచేత శిరోవస్త్రము యొక్క (స్థితియొక్క) విశేషరచనచేత, అనగా శిరస్సుపై మేలిముసుగుగా వేసికొన్న వస్త్రాన్ని విలాసపూర్వకంగా, ఒక విధంగా సర్దుకోవడంచేత, స్పష్టంగా కనబడుచున్న, స్తనౌన్నత్యం గల, సా = ఆమె, తస్య = ఆ, యూనః = యువకునకు, నయనావనౌ = నేత్రభూమియందు, అభూత్ = ఆయెను.

అత్రేతి :- ఇక్కడ ఉద్దీపనాలమ్బనరూపములైన శృంగారయోగ్యాలైన విభావాలు అనుభావంలో పర్యవసానం చెందేవిగా ఉన్నాయి. అందుచేత కష్ట కల్పన.

వి. ఇక్కడ రసం (రతి) నాయకనిష్ఠంగా వర్ణింపబడుతున్నది. దానికి తగిన స్తంభరోమాంచాదిరూపాలైన అనుభావాలు ఆతనిలో ఉన్నట్లు చెప్పాలి. కాని ఆ విషయం చాల ఆలస్యంగా తెలుస్తూన్నది. వెన్నెల ఉద్దీపన విభావం. అభివ్యక్తస్తనోన్నతి యైన లలన ఆలంబనవిభావం. శృంగారానికి తగిన ఈ ఉద్దీపనాలంబనవిభావాలను మాత్రం చెప్పడం జరిగింది. దీనిని పట్టి చంద్రోదయంలో యువతీ యువకులు పరస్పరాలోకనం చేసినప్పుడు వికారం కలగకుండా ఉండదు గాన స్తంభాద్యనుభావాలు కలిగి నట్లుగా కల్పించుకోవాలి. ఈ విధంగా ఇక్కడ అనుభావకల్పన కష్టంమీద జరుగుతున్నది గాన ఇది దోషం.

అవ. (౭) కష్టకల్పనచేత విభావప్రతీతికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ పరిహరతి రతిం మతిం లునీతే
స్ఖలతి భృశం పరివర్తతే చ భూయః,
ఇతి బత విషమా దశాస్య దేహం
పరిభవతి ప్రసభం కిమత్ర కుర్మః. 326

వృ. అత్ర రతిపరిహారాదీనామనుభావానాం కరుణాదావపి సంభ వాత్ కామినీరూపః విభావః యత్నతః ప్రతిపాద్యః.

వ్యా. పరిహరతీతి :- రతిమ్ = భోగ్యవస్తువులయందు ఆసక్తిని, పరిహ రతి = తొలగిస్తూన్నది. మతిమ్ = ఆలోచనాశక్తిని, లునీతే = ఖండిస్తూన్నది. భృశమ్ = మిక్కిలి, స్ఖలతి = తొట్రుపాటుకలిగిస్తూన్నది. భూయః = మాటిమాటికి, పరివర్తతే చ = ఇటూ ఆటూ దొర్లేటట్లు చేస్తూన్నది. ఇతి = ఈ విధంగా, విషమా = విషమమైన, దశా = అవస్థ, అస్య = వీనియొక్క, దేహమ్ = దేహాన్ని, ప్రసభమ్ = బలాత్కారంగా, పరిభవతి = తిరస్కరిస్తూన్నది. బత = అయ్యో!

అత్రేతి :- ఇక్కడ రతిపరిహారం మొదలైన అనుభావాలు కరుణాదిరసా లలో కూడ సంభవించవచ్చును. అందుచేత కామినీరూపమైన విభావం ప్రయత్న పూర్వకంగా ప్రతిపాద్యం అయి ఉంది.

వి. నాయకనిష్ఠ మైన విప్రలంభశృంగారానికి కామిని ఆలంబనవిభావం అని సూచించవలసి ఉంది. రతిపరిహారాదులు కరుణాదులలో కూడ ఉండవచ్చును గాన వాటిని పట్టి ఆలంబనవిభావాన్ని ఊహించడానికి వీలులేదు ఇంక ప్రక రణాదులను పట్టి మాత్రమే దాన్ని గూర్చి తెలిసికొనవలసి ఉంది. అందుచేత ఇక్కడ విభావవ్యక్తి కష్టకల్పనాసాధ్యం అయి ఉంది కాబట్టి దోషం.

అవ. (6) 'ప్రతికూలవిభావాది గ్రహణం' అనగా ప్రకృతరసానికి విరుద్ధమైన రసానికి సంబంధించిన విభావానుభావవ్యభిచారులను నిబంధించడం. అలాంటి విభావవ్యభిచారుల నిబంధనానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ ప్రసాదే వర్తస్వ ప్రకటయ ముదం సంత్యజ రుషం
ప్రియే శుష్యన్త్యఙ్గాన్యమృతమివ తే సిఞ్చతు వచః,
నిధానం సౌఖ్యానాం క్షణమభిముఖం స్థాపయ ముఖం
న ముగ్ధే ప్రత్యేతుం ప్రభవతి గతః కాలహరిణః. 327

వృ. అత్ర శృఙ్గారే ప్రతికూలస్య శాన్తస్యానిత్యతాప్రకాశరూపో విభావః, తత్ప్రకాశితో నిర్వేదశ్చ వ్యభిచారీ ఉపాత్తః

వ్యా. ప్రసాదే ఇతి :- ప్రణయకోపం చెందిన నాయికతో నాయకుడు అంటూన్న మాటలు- ప్రియే = ఓ ప్రియురాలా! ప్రసాదే = ప్రసాదమునందు, వర్తస్వ = ఉండుము, అనుగ్రహించుము. ముదమ్ = సంతోషమును, ప్రకటయ = ప్రకటించుము. రుషమ్ = కోపమును, సంత్యజ = విడువుము. తే = నీయొక్క అమృతమివ = అమృతం వంటి. వచః = వచనము, శుష్యన్తి = ఎండిపోవుచున్న. అఙ్గాని = నా అవయవాలను, సిఞ్చతు = తడుపుగాక. సౌఖ్యానామ్ = సౌఖ్యములకు, నిధానమ్ = నిధి అయిన, ముఖమ్ = ముఖమును, క్షణమ్ = క్షణకాలమును, క్షణంపాటు, అభిముఖమ్ = అభిముఖమైనదానినిగా, స్థాపయ = ఉంచుము. ముగ్ధే = ఓ తెలివి తక్కువదానా! గతః = వెళ్ళిపోయిన, కాలహరిణః = కాలం అనే లేడి, ప్రత్యేతుమ్ = తిరిగి వచ్చుటకు, న ప్రభవతి = సమర్థం కాదు.

అత్రేతి :- ఇక్కడ శృంగారంలో, శృంగారరసఘట్టంలో, శృంగారానికి ప్రతికూలమైన శాంతరసానికి సంబంధించిన కాలానిత్యత్వాన్ని ప్రకాశింపచేయడం అనే విభావమూ దానిచేత ప్రకాశించబడిన నిర్వేదం అనే వ్యభిచారిభావమూ గ్రహించబడ్డాయి.

అవ. ప్రతికూలానుభావం చెప్పడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ణిహుఅరమణమ్మి లోఅణపహమ్మి పడిఏ గురుఅణమజ్ఝమ్మి,
సఅలపరిహారహిఅఆ వణగమణం ఏవ్వ మహఇ వహూ,

"నిభృతరమణే లోచనపథే పతితే గురుజనమధ్యే,
సకలపరిహారహృదయా వనగమనమేవేచ్ఛతి వధూః"

వృ. అత్ర సకలపరిహారవనగమనే శాన్తానుభావౌ. ఇన్ధనాద్యానయనవ్యాజేన ఉపభోగార్థం వనగమనం చేత్ న దోషః.

వ్యా. నిభృతేతి :- నిభృతరమణే = గుప్తకాముకుడు, జారుడు, గురుజనమధ్యే = పెద్దల మధ్యయందు, లోచనపథే = నేత్రమార్గమునందు, పతితే = పడినవాడగుచుండగా, వధూః = ఆ స్త్రీ, సకలపరిహారహృదయా = అన్నింటిని విడిచిపెట్టివేయడమునందు హృదయం కలదై, వనగమనమేవ = వనమును గూర్చి వెళ్ళుటను మాత్రమే, ఇచ్ఛతి = కోరుచున్నది.

అత్ర ఇతి :- ఇక్కడ అన్నింటినీ విడిచిపెట్టడం, అరణ్యానికి వెళ్ళడం అనేవి (శృంగారానికి ప్రతికూలమైన) శాంతానికి అనుభావాలు. అయితే కట్టెలు మొదలైనవి తీసుకొని రావా లనే వంకతో (ఇంట్లో పనులన్నీ విడచి) ఉపభోగం కోసం వనానికి వెళ్ళడం అని అభిప్రాయం అయితే దోషం లేదు.

వృ. (7) దీప్తిః పునః పునర్యథా కుమారసంభవే రతివిలాపే.

(8) అకాణ్డేప్రథనం వేణీసంహారే ద్వితీయేఽఙ్కే అనేకవీరక్షయే ప్రవృత్తే భానుమత్యా సహ దుర్యోధనస్య శృఙ్గారవర్ణమ్.

(9) అకాణ్డే ఛేదో యథా వీరచరితే ద్వితీయే అఙ్కే రాఘవ భార్గవయోర్ధారాధిరూఢే వీరరసే "కఙ్కణమోచనాయ గచ్ఛామి" ఇతి రాఘవస్యోక్తౌ.

(10) అఙ్గస్య అప్రధానస్య అతివిస్తరేణ వర్ణనమ్. యథా-హయగ్రీవవధే హయగ్రీవస్య.

(11) అఙ్గినః అననుసంధానమ్-యథా రత్నావళ్యాం చతుర్థే అఙ్కే బాభ్రవ్యాగమనే సాగరికాయాః విస్మృతిః.

వ్యా. దీప్తిరితి :- (7) ఒకమారు దీపితమైనదానికి, అనగా పోషించబడిన దానికి, మధ్య మధ్య విచ్ఛేదం కలిగించి మళ్ళీ గ్రహిస్తూ ఉండడం 'పునః పునర్దీప్తి'. దీనికి ఉదాహరణం కుమారసంభవం చతుర్థసర్గలోని రతివిలాపఘట్టం. "అథ మోహపరాయణా సతీ" (4.1) ఇత్యాదులచేత ప్రారంభంలో దీప్తి పొందింపబడిన కరుణరసం మళ్ళీ "అథ సా పునరేవ విహ్వలా" (4 4) ఇత్యాదులచేత మరల దీప్తం చేయబడింది. తరవాత వసంతుణ్ణి చూచినప్పుడు దానికి విచ్ఛేదం కలిగింది. మళ్ళీ "తమవేక్ష్య రురోద సా భృశమ్" ఇత్యాదికం చేత ఉద్దీపితం అయింది. ఈ పునఃపునర్దీపితమైన ఒకే రసాన్ని ఆస్వాదించడం సహృదయ హృదయోద్వేజకంగా (సహృదయుల హృదయాలకు విసుగు పుట్టించేదిగా) ఉంటుంది. అందుచేత ఇది దోషం

(8) అకాణ్డే ఇతి :- సమయం కాని సమయంలో రసాన్ని విస్తరింప

చేయడం "అకాండప్రథనం'. వేణీసంహారం ద్వితీయాంకంలో, అనేక మహావీరులు నశించే యుద్ధం ప్రారంభం అయిన సమయంలో (సమయం కాని సమయంలో, కరుణవీరాదులు ఆస్వాదించదగిన సమయంలో) భానుమతితో దుర్యోధనుని శృంగారాన్ని వర్ణించడం వంటిది 'అకాండప్రథనం'.

(9) అకాణ్డే ఛేద ఇతి :– ప్రారంభం అయి మంచి ఊపులో ఉన్న రసాన్ని హటాత్తుగా సమయం కాని సమయంలో ఛేదించివేయడం అకాండచ్ఛేదం. మహావీరచరితంలో శ్రీరామపరశురాముల మధ్య వీరరసం (ఉత్సాహం) అత్యుచ్చ స్థాయికి అందుకొన్న సమయంలో రాముడు 'కంకణమోచనంకోసం వెళ్ళి వస్తాను' అని అన్న మాట అకాండచ్ఛేదానికి ఉదాహరణం.

వి. వివాహానంతరం పదవరోజున చేసే ఒక ఉత్సవం కంకణమోచనం. ఒకరి నొకరు ఢీకొనడానికి సిద్ధం అయిన సమయంలో రాముడు అలా పలకడం అతని వీరత్వం విషయంలో సామాజికులకు సందేహం కలిగిస్తుంది. అందుచేత హటాత్తుగా ఉచ్చస్థాయిలో ఉన్న రసాన్ని ఖండించకూడదు.

10. అఙ్గస్యేతి :- అంగమైనదానిని లేదా అంగం అయినవానిని, అనగా అప్రధానమైనవానిని, అతివిస్తరంగా వర్ణించడం "అంగస్యాప్యతివిస్తృతిః" అనే దానికి అర్థం. ఎట్లనగా- హయగ్రీవవధంలో హయగ్రీవవర్ణనం.

వి. కాశ్మీరదేశీయుడైన మేంఠకవి రచించిన 'హయగ్రీవవధ' అనే నాటకంలో ప్రధాననాయకుడు విష్ణువు. ఆ విష్ణువును వర్ణించడం మానేసి అప్రధానుడైన హయగ్రీవు డనే ప్రతినాయకునికి సంబంధించిన జలక్రీడా-వనవిహార-రతి కేళ్యాదులు వర్ణించడం అతడే ప్రధాననాయకు డనే భ్రాంతిని కలిగిస్తుంది. అందుచేత అప్రధానవిస్తృతవర్ణనం దోషం.

(11) అఙ్గిన ఇతి:- అంగి అయిన వ్యక్తిని అనగా ప్రధానమైన నాయకుణ్ణి గాని, నాయికను గాని పరామర్శించకపోవడం "అఙ్గినః అననుసంధానం", ఎట్లనగా- 'రత్నావళి' నాటికలో సింహళేశ్వరుని కంచుకి అయిన బాభ్రవ్యుడు వచ్చిన సందర్భంలో రాజు ప్రధానపాత్ర అయిన సాగరిక మాటే ఎత్తకపోవడంచేత ఆమెను మరచినట్లయింది. దీనివల్ల నాటికలో ప్రతిపాద్యం అయిన శృంగారరసం విచ్ఛిన్నప్రాయం అయిపోయింది.

వృ. (12) ప్రకృతయో దివ్యాః, అదివ్యాః, దివ్యాదివ్యాశ్చ. వీరరౌద్రశృఙ్గారశాన్తరసప్రధానాః ధీరోదాత్త-ధీరోద్ధత-ధీరలలిత-ధీరప్రశాన్తాః; ఉత్తమాధమ-మధ్యమాశ్చ. తత్ర రతిహాసశోకాద్భుతాని అదివ్యోత్తమప్రకృతివత్ దివ్యేష్వపి. కిం తు రతిః సంభోగశృంగారరూపా ఉత్తమదేవతావిషయా. న వర్ణనీయా తద్వర్ణనం హి పిత్రోః సంభోగవర్ణనమివాత్యన్తమనుచితమ్.

వ్యా. ప్రకృతయ ఇతి :- ఏ ప్రకృతికి ఏ వర్ణనం ఉచితమో అదే చెయ్యాలి. అనుచితవర్ణనం చేసినట్లయితే అది 'ప్రకృతివిపర్యయం'. ప్రకృతులు నాయకులు దివ్యులు, అదివ్యులు, దివ్యాదివ్యులు. అట్టి ఈ నాయకులు వరుసగా వీర-రౌద్ర-శృంగార-శాంతరసప్రధానులైన ధీరోదాత్త-ధీరోద్ధత-ధీరలలిత-ధీరశాంతులు. ఉత్తమాధమమధ్యములు కూడ.

ఇంద్రాదులు దివ్యులు. వత్సరాజు మొదలైన మానవులు అదివ్యులు. మానవులుగా అవతరించిన శ్రీరామ శ్రీకృష్ణాదులు దివ్యాదివ్యులు. ఈ నాయకులే ఆయా రసాల ప్రాధాన్యాన్ని పట్టి ధీరోదాత్తాదిసంజ్ఞలు పొందుతారు. వీరరసప్రధానులైన శ్రీరామాదులు ధీరోదాత్తులు. రౌద్రరస ప్రధానులైన భీమసేనాదులు ధీరోద్ధతులు. శృంగారరసప్రధానులైన శ్రీకృష్ణాదులు ధీరలలితులు. శాంతరసప్రధానులైన జీమూతవాహనాదులు ధీరశాంతులు. నాయకులలోనే కొందరు ఉత్తములు. కొందరు అధములు. కొందరు మధ్యములు. ధీరోదాత్తాదిలక్షణాలు, ఇంకా అనుకూల-దక్షిణ-ధృష్ట-శఠులనే నాలుగు భేదాలు ప్రతాపరుద్రీయ సాహిత్యదర్పణాదులనుండి గ్రహించవచ్చును.

తత్రేతి :- అదివ్యులైన ఉత్తమప్రకృతినాయకుల విషయంలో వలెనే దివ్యులైన నాయకుల విషయంలో కూడా రతి-హాస-శోక-అద్భుతాలు వర్ణించవచ్చును. కాని సంభోగశృంగారరూపమైన రతిని మాత్రం ఉత్తమదేవతల విషయంలో వర్ణించకూడదు. అట్టి ఉత్తమదేవతాసంభోగవర్ణనం తలిదండ్రుల సంభోగవర్ణనం వలె చాల అనుచితమైనది.

శ్లో॥ క్రోధం ప్రభో సంహరసంహరేతి
యావద్గిరః ఖే మరుతాం చరన్తి,

తావత్స వహ్నిర్భవనేత్రజన్మా
భస్మావశేషం మదనం చకార. 329

వృ. ఇత్యుక్తవత్ భృకుట్యాదివికారవర్జితః క్రోధః సద్యఃఫలదః, స్వర్గపాతాల గగనసముద్రోల్లఙ్ఘనాద్యుత్సాహశ్చ దివ్యేష్వేవ. అదివ్యేషు తు యావదవదానం ప్రసిద్ధముచితం వా తావదేవోపనిబద్ధవ్యమ్. అధికం తు నిబధ్యమానమసత్యప్రతిభాసేన "నాయకవద్వర్తితవ్యం, న ప్రతినాయకవత్" ఇత్యుపదేశే న పర్యవస్యేత్. దివ్యాదివ్యేషు ఉభయథాపి. ఏవముక్తస్యౌచిత్యస్య దివ్యాదీనామివ ధీరోదాత్తాదీనామప్యన్యథావర్ణనం విపర్యయః. 'తత్రభవన్' 'భగవన్' ఇత్యుత్తమేన న అధమేన, మునిప్రభృతౌ న రాజాదౌ, భట్టారకేతి నోత్తమేన రాజాదౌ, ప్రకృతివిపర్యయాపత్తేర్వాచ్యమ్. ఏవం దేశకాలవయోజాత్యాదీనాం వేషవ్యవహారాదికముచితమేవ ఉపనిబద్ధవ్యమ్.

వ్యా. క్రోధమితి :- కుమారసంభవంలో మన్మథుడు బాణప్రయోగం చేయడానికి ఉద్యమించగానే శివుడు కోపించి అతనిని భస్మంగా చేసినట్లు వర్ణించే శ్లోకం. ప్రభో = ఓ! ప్రభూ! క్రోధమ్ = కోపమును, సంహర సంహర = ఉపసంహరించుము, ఉపసంహరించుము, ఇతి = అని. ఖే = ఆకాశమునందు, మరుతామ్ = దేవతలయొక్క, గిరః = వాక్కులు, యావత్ = ఎంతలో, చరన్తి = ప్రసరిస్తున్నవో, తావత్ = అంతలో, భవనేత్రజన్మా = శివుని నేత్రాలనుండి పుట్టిన, సః వహ్నిః = ఆ అగ్ని, మదనమ్ = మన్మథుణ్ణి, భస్మావశేషమ్ = భస్మమే శేషం కలవానినిగా, చకార = చేసెను.

అని (పై శ్లోకంలో) చెప్పిన విధంగా కనుబొమ్మలు విరవడంవంటివి లేనిదీ వెంటనే ఫలాన్ని ఇచ్చేదీ అయిన కోపమూ, స్వర్గానికీ పాతాలానికీ వెళ్ళడానికీ, ఆకాశసముద్రాలను లంఘించడానికీ ఉత్సాహమూ, దివ్యనాయకులలోనే వర్ణించతగింది. అదివ్యులతో మాత్రం ప్రసిద్ధమూ, ఉచితమూ అయిన పూర్వం జరిగిన చరిత్ర (అవదానం) ఎంత (ఎట్టిది) ఉందో అంత మాత్రమే వర్ణించతగింది. అంతకు మించి వర్ణిస్తే ఇదంతా అసత్యం అనే అభిప్రాయం (పాఠకులకు) కల

గరంచేత "నాయకుని వలె ప్రవర్తించాలి కాని ప్రతినాయకుడు వలె ప్రవర్తించ కూడదు" అనే ఉపదేశంలో పర్యవసానం చెందదు. (ఇదంతా అసత్యం అనే అభి ప్రాయం కలిగిన తరవాత నాయకుని వలె ప్రవర్తించా లనే ప్రయత్నం ఉండదు కదా!) దివ్యాదివ్యులవిషయంలో రెండు విధాలా కూడా వర్ణనం చేయవచ్చును. ఈ విధంగా దివ్యాదులవిషయంలో చెప్పిన ఔచిత్యానికి విరుద్ధంగా వర్ణించడం ఎలా విపర్యయమో అట్లే ధీరోదాత్తాదులను మరొకవిధంగా వర్ణించడం కూడా విపర్యయమే.

'తత్రభవన్' 'భగవన్' ఇత్యాదిసంబోధనం ఉత్తముడు మాత్రమే, మునులు మొదలైనవారి విషయంలో మాత్రమే ప్రయోగించాలి. రాజాదుల విష యంలో ప్రయోగించకూడదు. అధముడు ఈ పదాలను మున్యాదుల విషయంలో కూడా ప్రయోగించకూడదు. 'భట్టారక' అని ఉత్తముడు రాజాదివిషయంలో ప్రయోగించకూడదు. (అధముడు మాత్రమే ఈ పదాన్ని రాజాదుల విషయంలో ప్రయోగించాలి). మరొక విధంగా ప్రయోగిస్తే ప్రకృతివిపర్యయం ఏర్పడుతుంది. ఇట్లే వేషం, వ్యవహారం మొదలైనవాటిని దేశానికీ, కాలానికీ వయస్సుకూ, జాతి మొదలైనవాటికీ ఉచితంగా ఉండేటట్లు వర్ణించాలి.

వృ. (13) అనఙ్గస్య రసానుపకారకస్య వర్ణనమ్. యథా కర్పూర మఞ్జర్యాం నాయికయా, స్వాత్మనా చ కృతం వసన్తవర్ణనమనాదృత్య వన్దివర్ణితస్య రాజ్ఞా ప్రశంసనమ్.

వ్యా. అనఙ్గస్యేతి :- 'అనఙ్గస్య అభిధానమ్' అనేదాని అర్థం- అనఙ్గస్య= రసానికి ఉపకరించనిదానియొక్క, వర్ణనము. ఎట్లనగా- 'కర్పూరమంజరి' అనే సట్టకంలో నాయిక అయిన విభ్రమలేఖా, స్వయంగా తానూ చేసిన వసంతవర్ణనాన్ని అనాదరించి, దానిని విడిచివేసి, వందులు చేసిన దానిని రాజు ప్రశంసించడం. ఇది రసానికి ఉపకరించేది కాదు. అందుచేత అనుచితం అని అర్థం.

వృ. "ఈదృశాః" ఇతి. నాయికాపాదప్రహారాదినా నాయకకోపా దివర్ణనమ్. ఉక్తం హి ధ్వనికృతా-

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్,
ఔచిత్యోపనిబన్ధస్తు రసస్యోపనిషత్పరా". ఇతి.

వ్యా. అరవై రెండవ కారిక చివర ఉన్న 'ఈదృశాః' అనేదానికి- "నాయిక పాదప్రహారం చేయడంచేత నాయకునికి కోపం రావడంవంటివాట్ల వర్ణనం" అని అర్థం. (ఇలాంటివి అనుచితాలే). అందుచేతనే ధ్వనికారుడు (ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకం తృతీయోద్యోతంలో).

"అనౌచిత్యాత్ ఋతే = అనౌచిత్యం తప్ప, అన్యత్ = మరొకటి, రసభఙ్గస్య = రసభంగానికి, కారణమ్ = కారణము, న = కాదు (లేదు). ఔచిత్యోపనిబన్ధః తు = ఔచిత్యాన్ని కూర్చడం అయితే, రసస్య = రసంయొక్క, పరా = గొప్ప, ఉపనిషత్ = రహస్యం" అని చెప్పి ఉన్నాడు.

వృ. ఇదానీం క్వచిదదోషా అప్యేతే ఇత్యుచ్యన్తే.

కా. న దోషః స్వపదేనోక్తావపి సంచారిణః క్వచిత్.

వృ. యథా-

శ్లో॥ ఔత్సుక్యేన కృతత్వరా సహభువా వ్యావర్తమానా హ్రియా
తైస్తైర్బన్ధువధూజనస్య వచనైర్నీతాభిముఖ్యం పునః,
దృష్ట్వాగ్రే వరమాత్తసాధ్వసరసా గౌరీ నవే సంగమే
సంరోహత్పులకా హరేణ హసతా శ్లిష్టా శివాయాస్తు వః 330

వృ. అత్ర ఔత్సుక్యశబ్ద ఇవ తదనుభావో న తథా ప్రతీతికృత్. అత ఏవ 'దూరాదుత్సుకమ్" ఇత్యాదౌ వ్రీడాప్రేమాద్యనుభావానాం వివలితత్వాదీనామివ ఉత్సుకత్వానుభావస్య సహసాప్రసరణాదిరూపస్య తథా ప్రతిపత్తికారిత్వాభావాత్ 'ఉత్సుకమ్' ఇతి కృతమ్.

వ్యా. ఇదానీమితి :- ఇప్పుడు. కొన్ని చోట్ల ఇవి దోషాలు కూడ కాదు అని చెప్పబడుచున్నవి.

నేతి:- 'కొన్ని చోట్ల సంచారిభావాన్ని స్వశబ్దంతో చెప్పినా దోషం కాదు". ఎట్లనగా-

ఔత్సుక్యేతి :- రత్నావళిలోని మంగళాచరణశ్లోకం ఇది. ఔత్సుక్యేన =

= ప్రియుని దగ్గరికి వెళ్ళాలనే ఉత్కంఠచేత, కృతత్వరా = చేయబడిన తొందర గలదీ, సహజుపా = సహజమైన. హియా = సిగ్గుచేత. వ్యావర్తమానా = వెనుకకు మరలుచున్నదీ. బన్ధుజనస్య = బంధుస్త్రీ జనంయొక్క. తైస్తైః = ఆయా, వచనైః = మాటలచేత, పునః = మరల, అభిముఖ్యమ్ = అభిముఖత్వమును, నీతా = పొందించబడినదీ, వరమ్ = వరుణ్ణి. అగ్రే = ఎదుట, దృష్ట్వా = చూచి, ఆత్తసాధ్వసరసా = పొందబడిన భయరసం కలదీ అయి, సంరోహత్పులకా = అంకురించిన పులకములు కలదీ. నవే సంగమే = నవసంగమమునందు, హసతా = నవ్వుచున్న, హరేణ = శివునిచేత, శ్లిష్టా = కౌగలించుకొనబడినదీ అయిన, గౌరీ = పార్వతి, వః = మీయొక్క, శివాయ = మంగళం కొరకు, అస్తు = అగు గాక.

అ తేలి :- ఇక్కడ 'ఔత్సుక్య' శబ్దం వలె దాని అనుభావం ఆ విధమైన ప్రతీతిని కలిగించదు. అందుచేతనే "దూరాదుత్సుకమ్" ఇత్యాది శ్లోకంలో (చూ. 29వ శ్లోకం) వ్రీడ, ప్రేమ మొదలైన సంచారిభావాలకి అనుభావాలైన వివలితత్వం మొదలైనవి వలె ఔత్సుక్యానికి అనుభావం అయిన తొందరగా వెళ్ళడం మొదలైనది ఆ విధమైన ప్రతీతిని కలిగించదు. కాబట్టియే 'ఉత్సుకమ్' అని చేయబడింది (చెప్పబడింది).

వి. 'ఔత్సుక్యం' అనే సంచారిభావాన్ని స్వశబ్దంతో చెప్పకుండా దాని అనుభావం ద్వారా సూచించాలంటే 'తొందరగా రావడం' అనే అనుభావాన్ని చెప్పాలి. అయితే ఆ అనుభావం కేవలం ఔత్సుక్యంమాత్రంచేతనే కాక భయాదుల వలన కూడా కలగవచ్చు. అందుచేత దానిని చెప్పగానే ఔత్సుక్యం స్ఫురిస్తుందనే నమ్మకం లేదు. అందుచేత 'ఔత్సుక్యేన' అని స్వశబ్దప్రయోగమే చేయబడింది. ఈ కారణంచేతనే "దూరాదుత్సుకమ్" ఇత్యాది శ్లోకంలో కూడా కవి వ్రీడ, ప్రేమ మొదలైనవాటిని 'వివలితత్వం' మొదలైన వాటి వాటి అనుభావాలచేత సూచించి, ఉత్సుకత్వానికి అనుభావం అయిన సహసాప్రసరణాదికం తప్పక దానినే స్ఫురింపచేస్తుం దనే నియమం లేకపోవడంచేత ఔత్సుక్యం విషయంలో మాత్రం 'ఉత్సుక' పదాన్నే ప్రయోగించాడు అని అర్థం.

కా. సంచార్యాదేర్విరుద్ధస్య బాధ్యస్యోక్తిర్గుణావహా. 63

వృ. బాధ్యత్వోక్తిర్న పరమదోషః యావత్ ప్రకృతరసపరిపోష కృత్. యథా-

శ్లో॥ 'క్వాకార్యం శశలక్ష్మణః క్వ చ కులమ్' ఇత్యాదౌ. 331

వృ. అత్ర వితర్కాదిషు ఉద్గతేష్వపి చిన్తాయామేవ విశ్రాన్తిరితి ప్రకృతరసపరిపోషః.

వ్యా. సంచారీతి :- విరుద్ధస్య = విరుద్ధమైన, అనగా ప్రకృతరసానికి విరోధి యైన రసానికి అంగమైన, సంచార్యాదేః = సంచారిభావం మొదలైన దాని యొక్క, బాధ్యస్య = బాధ్యమైన దానియొక్క (దానినిగా), ఉక్తిః = చెప్పడం, గుణావహా = గుణమును కలిగించేది అగును.

బాధ్యత్వేనేతి :- (విరుద్ధసంచార్యాదికాన్ని) బాధ్యంగా, బాధింపబడేదాని నిగా, నిరాకరింపబడేదానినిగా. చెప్పడం దోషం కాకపోవడమే కాకుండా ప్రకృత రసపరిపోషణం కూడా చేస్తుంది. "క్వాకార్యం" ఇత్యాదిశ్లోకం (చూ. 53. శ్లో.) ఉదాహరణం. ఇక్కడ వితర్కాదులు బయలుదేరినా చివరికి చింతయందే విశ్రాంతి (ముగింపు) గాన ప్రకృతరసపరిపోషం జరుగుతున్నది.

వి. పై శ్లోకంలో నాలుగు పాదాలలోనూ మొదటి భాగాలలో శాంత సంచారిభావాలైన, శృంగారవిరోధులైన వితర్క, మతి, శంకా, ధృతులు సూచించి వాటిని రెండవ భాగాలలో సూచించిన శృంగారాంగాలైన ఔత్సుక్య-స్మృతి దైన్య-చింతలచేత తిరస్కరించడం జరిగింది. ఇలా చేయడంచేత చివరికి చింత యందే పర్యవసానం జరిగి ప్రకృతమైన శృంగారరసం పరిపుష్టం అయింది. ఈ విధంగా కొన్ని చోట్ల బాధ్యబాధకభావంతో విరుద్ధసంచారిభావాల కూర్పు దోషం కాదు అని భావం.

శ్లో॥ పాణ్డు క్షామం వదనం హృదయం సరసం తవాలసం చ వపుః,
ఆవేదయతి నితాన్తం క్షేత్రియరోగం సఖి హృదన్తః. 332

వృ. ఇత్యాదౌ సాధారణత్వం పాణ్డుతాదీనామితి న విరుద్ధమ్.

వ్యా. సఖి=ఓ! సఖీ, తవ=నీయొక్క, నితాన్తమ్ = మిక్కిలి, ఈ క్రియా

విశేషణం 'పాణ్డు' మొదలైన అన్ని విశేషణాలకి అన్వయిస్తుంది. పాణ్డు = తెల్లనైన, క్షామమ్ = చిక్కిన, వదనమ్ = ముఖమూ, సరసమ్ = అనురాగంతో కూడిన (అస్రు రసంతో కూడిన అని మరొక అర్థం). హృదయమ్=హృదయము, అలసమ్ = ఏ పనులూ చేయజాలని, వపుః చ = శరీరమూ, హృదన్తః = హృదయంలోపల, క్షేత్రియరోగమ్=ఈ శరీరంలో చికిత్స చేయశక్యం కాని రోగాన్ని, విరహరూపమైన అసాధ్యరోగాన్ని అని అర్థం. ఆవేదయతి = సూచిస్తున్నది.

ఇత్యాదావితి :_ ఇత్యాదులలో ('పాణ్డు' ఇత్యాది శ్లోకాలలో) పాండుతాదులకు సాధారణత్వం గాన విరుద్ధం కాదు.

వి. ఈ శ్లోకంలో వర్ణించిన పాండుత్వాదులు రాజయక్ష్మ (క్షయ) మొదలైన రోగాల అనుభావాలు అవడంచేత కరుణరసానికి తగినవి, విప్రలంభశృంగారానికి విరుద్ధ మైనవి. అయినా వీటిని విప్రలంభశృంగారంలో ఆరోపించడంవల్ల దానికి అంగాలు అయి దాన్ని పోషిస్తున్నాయి. అందుచేత విరోధం లేదు, దోషం లేదు, అని ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో ప్రతిపాదించాడు. అయితే ఈ విధమైన సమాధానం చెప్ప నవసరం లేదు. పాండుత్వాదులు అటు కరుణకీ, ఇటు విప్రలంభానికీ కూడా సాధారణాలే (రెండింటిలోనూ కనబడేవే). అందుచేత విరోధమే లేదు. పాండుత్వాదులు విప్రలంభపోషకాలు అవడం సమంజసమే అని మమ్మటుని అభిప్రాయం.

అవ. పై కారికలో 'సంచార్యాదేః' అని 'ఆది' పదం ప్రయోగించడంచేత విభావాలను కూడా గ్రహించాలి. విరుద్ధవిభావాలను బాధ్యరూపంలో నిబంధిస్తే గుణమే అని అర్థం. దానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ సత్యం మనోరమా రామాః సత్యం రమ్యా విభూతయః,
కిం తు మత్తాఙ్గనాపాఙ్గభఙ్గలోలం హి జీవితమ్. 333

వృ. ఇత్యత్రాద్యమర్ధం బాధ్యత్వేనైవోక్తమ్. జీవితాదపి అధికమపాఙ్గభఙ్గస్యాస్థిరత్వమితి ప్రసిద్ధభఙ్గురోపమానతయోపాత్తం శాన్తమేవ పుష్ణాతి న పునః శృఙ్గారస్యాత్ర ప్రతీతిః; తదఙ్గాప్రతిపత్తేః. న తు వినేయోన్ముఖీకరణమత్రపరిహారః. శాన్తశృఙ్గారయోర్నైరన్తర్యస్యాభావాత్. నాపి కావ్యశోభాకరణమ్. రసాన్తరాదనుప్రాసమాత్రాద్వా తథాభావాత్.

వ్యా. రామాః = స్త్రీలు, మనోరమాః = మనోహరరులైనవారు, సత్యమ్ = నిజమే. విభూతయః = ఐశ్వర్యాలు, రమ్యాః = రమ్యమైనవి; సత్యమ్ = నిజమే. కిన్తు = కాని, జీవితమ్ = జీవితం, మత్తాఙ్గనాపాఙ్గభఙ్గలోలమ్ = యౌవనమదంచేత, మదించిన స్త్రీయొక్క క్రీకంటి చూపు విరుపు వలె చంచల మైనది.

వి. ఇక్కడ పూర్వార్ధంలో పురుషనిష్ఠశృంగారానికి 'రామాః' అనే ఆలంబనవిభావం చెప్పబడింది. ఉత్తరార్ధంలో శాంతానికి విభావమైన జీవితచాంచల్యం చెప్పబడింది. ఈ రెండూ విరుద్ధాలే అయినా పూర్వార్ధం బాధ్యంగా చెప్పబడింది. కాబట్టి విరుద్ధానుభావాలను చెప్పడం దోషం కాదు. శాంతపరిపోషకం అవడంచేత గుణమే. జీవితం ఉంటేనే కదా దాని సౌకర్యంకోసం స్త్రీ ధనాదులను సంపాదించుకోవాలి. జీవితం అతిచంచలం అయినప్పుడు అవన్నీ ఎందుకు? అందుచేత రమ్యమైనా అవన్నీ నిష్ఫలాలే అని చివరికి తేలిన విషయం. ఈ విషయాన్నే చెప్తున్నాడు— ఇత్యాదౌ ఇతి :— "సత్యం" ఇత్యాది శ్లోకంలోని పూర్వార్ధం (ఉత్తరార్ధంచేత) బాధ్యంగానే, నిరాకరించబడేదిగానే చెప్పబడింది.

(ఆశంక) పూర్వార్ధప్రతిపాద్యమైన విషయం బాధ్యమే అయినా "మత్తాఙ్గనాపాఙ్గభఙ్గ" అనే మాటలో స్త్రీనిష్ఠమైన శృంగారం ప్రతీతం అవుతున్నది. అందుచేత ఈ శృంగారానికీ, శాంతానికీ విరోధం ఉన్నది కదా? ఇక్కడ శృంగారప్రతీతి లేనే లేదని అనడానికి వీలు లేదు. అట్లయితే ఈ పదాన్ని (మత్తేత్యాది పదాన్ని) ప్రయోగించడం ఎందుకు? (సమాధానం) ఈ విరోధాన్ని పరిహరిస్తూ సమాధానం చెప్తున్నాడు— జీవితాదపీతి :- అపాంగభంగం యొక్క అస్థిరత్వం జీవితంకంటె కూడా, అనగా జీవితంయొక్క అస్థిరత్వం కంటె కూడా అధికమైనది అనే విషయం ప్రసిద్ధం. అందుచేత ప్రసిద్ధమైన విరిగిపోయే (నశించిపోయే) స్వభావం గల ఉపమానంగా అది గ్రహింపబడింది. అందుచేత ఈ పదం శాంతరసాన్నే పోషిస్తున్నది. అంతేనే కాని ఇక్కడ శృంగారప్రతీతి కలగడం లేదు. శృంగారానికి సంబంధించిన అంగా లేవీ (విభావాదులేవీ) లేవు కదా! శృంగారప్రతీతియే లేనప్పుడు శృంగారశాంతాలకి ఇక్కడ విరోధం ఉన్నది కదా అనే ప్రశ్నకే అవకాశం లేదు.

వి. ఇక్కడ శృంగారప్రతీతి కూడా ఉన్నదనే అభిప్రాయంతో ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకం తృతీయోద్ద్యోతంలో(30వ కారిక) ఈశృంగారానికి శాంతంలో

విరోధం లేకపోవడాన్ని రెండు ఉపపత్తులతో సమర్థించాడు. గుడజిహ్వికాన్యాయం చేత శిష్యులలో అభిరుచి కలిగించడంకోసం ముందు శృంగారసం రుచి చూపించి తరవాత వాళ్ళమనస్సు శాంతంలో స్థిరం అవడానికి ఇలా చెప్పడం (శృంగారశాంతాలను కలిపి చెప్పడం) జరిగింది అనేది మొదటి ఉపపత్తి. (చేదు మందు తాగించే ముందు పిల్లలకి నోట్లో కొంచెం బెల్లంముక్క వేస్తే ఆ తీపికి ఆశపడి వాళ్ళు చేదు మందు మింగుతారు. ఇది 'గుడజిహ్వికాన్యాయం'. లేదా కావ్యానికి శోభ కలగడం కోసం ఈ శృంగారం కూర్చబడింది" అనేది ఆనందవర్ధనుడు చూపిన రెండవ ఉపపత్తి. అందుచేత ఇక్కడ విరోధం లేదని ఆయన అభిప్రాయం.

ఈ విషయంలో మమ్మటుడు ఆనందవర్ధనునితో ఏకీభవించడం లేదు. న తు ఇతి .. ఇక్కడ వినేయోన్ముఖీకరణం, అనగా శిష్యులకు అభిరుచి కలిగేటట్లు చేయడం, పరిహారం కాదు. పరస్పరవిరుద్ధాలైన శాంత-శృంగారాలను ఒకదాని ప్రక్క ఒకటి కూర్చడం కుదరదు కదా కావ్యశోభకోసం శృంగారాన్ని కూర్చడం జరిగింది అనేది కూడ సరియైన సమాధానం కాదు. ఈ కావ్యశోభ రసాంతరం చేతనో (నీవు చెప్పిన శృంగారరసం కాక శాంతరసంచేతనో) 'మత్తాఙ్గనాపాఙ్గభఙ్గ" అనే అనుప్రాసమాత్రంచేతనో లభిస్తుంది కదా. అందుచేత ఇక్కడ శృంగారరసప్రతీతియే లేదు అని మమ్మటుని అభిప్రాయం.

అవ. ఇప్పుడు రసవిరోధపరిహారోపాయాన్ని చెపుతున్నాడు.

కా. ఆశ్రయైక్యే విరుద్ధో యః స కార్యో భిన్నసంశ్రయః,
రసాన్తరేణాన్తరితో నైరన్తర్యేణ యో రసః. 64

వృ. వీరభయానకయోరేకాశ్రయత్వేన విరోధ ఇతి ప్రతిపక్షగతత్వేన భయానకో నివేశయితవ్యః. శాన్తశృఙ్గారయోస్తు నైరన్తర్యేణ విరోధ ఇతి రసాన్తరమన్తరే కార్యమ్. యథా నాగానన్దే శాన్తస్య జీమూతవాహనస్య "అహో గీతమ్ అహో వాదిత్రమ్" ఇత్యద్భుతమన్తర్నివేశ్య మలయవతీం ప్రతి శృఙ్గారో నిబద్ధః.

వ్యా. ఆశ్రయేతి:- ఆశ్రయైక్యే = ఆశ్రయంయొక్క ఏకత్వమునందు, యః = ఏది, విరుద్ధః = విరుద్ధమైనదో, సః = అది, భిన్నసంశ్రయః = భిన్నమైన

ఆశ్రయం కలదిగా, కార్యః = చేయదగినది. యః రసః = ఏ రసం, నైరన్తర్యేణ = నిరంతరత్వంచేత విరుద్ధమో, అది, రసాన్తరేణ = మరియొక రసంచేత, అన్తరితః = వ్యవధానం కలదిగా, చేయదగినది.

వి. కొన్ని రసాలు పరస్పరవిరుద్ధ మైనవి. ఈ విరోధం రెండు విధాలు- ఆశ్రయవిరోధం, నైరంతర్యవిరోధం. ఒకే ఆశ్రయంలో రెండు రసాలు ఉండ జాలకపోవడం ఆశ్రయవిరోధం. ఇక్కడ ఆశ్రయం అనగా ఆలంబనమూ, ఆధారమూ కూడ అని అర్థం. ఒకదాని వెంటనే మరొక రసం ఉండనప్పుడు అది నైరంతర్యవిరోధం. ఆశ్రయవిరోధం ఉన్న రెండు రసాలను వర్ణించేటప్పుడు ఒకదాని ఆశ్రయం, (ఆలంబనం లేదా ఆధారం) వేరుగా ఉన్నట్లు చూపితే ఆ రసాలకు విరోధం ఉండదు. నైరంతర్యవిరోధం ఉన్న రసాలను వర్ణించేటప్పుడు ఆ రెండింటికీ మధ్య మరొక రసాన్ని ప్రవేశ పెడితే విరోధం పరిహరించబడుతుంది.

వ్యా. వీరేతి:- ఒకే ఆశ్రయంలో వీర-భయానకరసాలకు విరోధం. అందువల్ల భయానకరసం శత్రువులో ఉన్నట్లు (వీరం నాయకునిలో ఉన్నట్లు) కూర్చాలి (అప్పుడు విరోధం లేదు). శాంతశృంగారాలకు నైరంతర్యవిరోధం. అందుచేత ఆ రెండింటి మధ్యా మరొకరసం కూర్చాలి. ఉదాహరణకి నాగానందంలో శాంతుడైన జీమూతవాహనునికి "అహో గీతమ్, అహో వాదిత్రమ్" అని (అహో! ఏమి గానం! ఏమి వాద్యనైపుణ్యం); అని మధ్యలో అద్భుతరసాన్ని చేర్చి తరవాత మలయవతి విషయంలో శృంగారం కూర్చబడింది. దీనిచేత అంతవరకూ శాంతప్రధానుడుగా వర్ణింపబడిన జీమూతవాహనునిలో శృంగారం వర్ణించడంలో దోషం లేదు.

వృ. న పరం ప్రబన్ధే; యావదేకస్మిన్నపి వాక్యే రసాన్తరవ్యవధినా విరోధో నివర్తతే. యథా-

శ్లో॥ భూరేణుదిగ్ధాన్నవపారిజాత
మాలారజోవాసితబాహుమధ్యాః,
గాఢం శివాభిః పరిరభ్యమాణాన్
సురాఙ్గనాశ్లిష్టభుజాన్తరాలాః. 334

సశోణితైః క్రవ్యభుజాం స్ఫురద్భిః
పక్షైః ఖగానాముపవీజ్యమానాన్,
సంవీజితాశ్చన్దనవారిసేకైః
సుగన్ధిభిః కల్పలతాదుకూలైః. 334 (అ)

విమానపర్యఙ్కతలే నిషణ్ణాః
కుతూహలావిష్టతయా తదానీమ్,
నిర్దిశ్యమానాన్ లలనాఙులీభి
ర్వీరాః స్వదేహాన్ పతితానపశ్యన్. 335

వృ. అత్ర భీభత్సశృఙ్గారయోరన్తర్వీరరసో నివేశితః.

వ్యా. నేతి :- ఇది కేవలం ప్రబంధంలోనే కాదు; ఒక వాక్యంలో కూడా (రెండు రసాల మధ్య) మరొక రసాన్ని చేర్చడంచేత విరోధం నివర్తిస్తుంది. ఎట్లనగా—

భూ ఇతి :- ఇవి ధ్వన్యాలోకం తృతీయోద్ద్యోతంలో ఉదాహరించబడ్డాయి. మూడు శ్లోకాలకీ ఒకటే అన్వయం. రెండు శ్లోకాలకు ఒకే అన్వయం అయితే 'యుగ్మం'; మూడింటికి 'విశేషకం'; నాలుగింటికి 'కలాపకం'; అంతకు మించితే 'కులకం'.

"ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం త్రిభిః శ్లోకైర్విశేషకమ్,
కలాపకం చతుర్భిః స్యాత్తదూర్ధ్వం కులకం స్మృతమ్."

అని చెప్పిన విధంగా ఇది విశేషకం. యుద్ధంలో ప్రాణాలు త్యజించిన వీరులు ఆ పుణ్యంచేత వెంటనే స్వర్గానికి వెళ్ళి విమానాధిరూఢులై తమ ప్రక్క చేరిన అప్సరసలతో ఆనందిస్తూ క్రింద పడి ఉన్న తమ దేహాలను వాళ్ళు వ్రేళ్ళతో చూపుతుండగా, చూస్తున్నట్లు వర్ణిస్తూన్న శ్లోకాలు. తదా = అప్పుడు, విమానపర్యఙ్కతలే = విమానములలో ఉన్న పరుపులపై (సోఫాలమీద), నిషణ్ణాః = కూర్చున్న, నవపారిజాతమాలారజోవాసితబాహుమధ్యాః = నూతనములైన పారిజాతపుష్పమాలలయందలి పుప్పొడిచేత సువాసన కలవిగా చేయబడిన బాహు

మధ్యములు కలవారు, సురాఙ్గనాశ్లిష్టభుజాన్తరాలాః = అప్సరసలచేత కౌగలించు కొనబడిన వక్షఃస్థలాలు కలవారు, చన్దనవారిసేకైః = మంచిగంధపు నీళ్ళ తడుపు గల, సుగన్ధిభిః = మంచి వాసన గల, కల్పలతాదుకూలైః=కల్పలతలయందున్న పట్టువస్త్రాలచేత, సంవీజితాః=వీచబడినవారూ అయిన, వీరాః=వీరులు, భూరేణు దిగ్ధాన్ = భూమియందున్న పరాగంచేత పూయబడినవీ, శివాభిః = ఆడనక్కల చేత, గాఢమ్ = గాఢంగా, పరిరభ్యమాణాన్ = కౌగలించుకొనబడుచున్నవి, క్రవ్య భుజామ్ = మాంసం తినే, ఖగానామ్ = పక్షులయొక్క, సశోణితైః = రక్తంతో కూడిన, పక్షైః=రెక్కలచేత, ఉపవీజ్యమానాన్=వీచబడుతున్నవీ, లలనాఙ్గులీభిః = స్త్రీల వ్రేళ్ళచేత, నిర్దిశ్యమానాన్ = చూపబడుతున్నవీ అయిన, పతితాన్ = పడిన, స్వదేహాన్ = తమ దేహాలను, కుతూహలావిష్టతయా = కౌతుహలంచేత ఆవేశించబడడంతో, కౌతుకావేశంతో. అపశ్యన్ = చూచిరి.

వి. ఈ శ్లోకాలలో దేహాలకి, వీరులకూ సంబంధించిన (ద్వితీయాంత-ప్రథమాంత) విశేషణాలు ప్రక్క ప్రక్కనే చేర్చబడ్డాయి. 'భూరేణుదిగ్ధాన్' మొదలైన దేహవిశేషణాలచేత బీభత్సప్రతీతి. "నవ....మధ్యాః" ఇత్యాదివీరవిశేషణాల చేత వాటిని వినగానే శృంగారరసప్రతీతి కలుగుతున్నాయి. భూరేణుదిగ్ధత్వాదులకు, పారిజాతరజోవాసితత్వాదులకూ మూలం రణోత్సాహం. ఈ రణోత్సాహ ప్రతీతిచేత వీరరసం. ఈ విధంగా ముందు బీభత్సం, తరవాత వీరం, తరవాత శృంగారం ఈ విధంగా బీభత్స-శృంగారాల మధ్య వీరరసవ్యవధానం ఉండడం చేత విరుద్ధరసాలను కూర్చినందువల్ల దోషం లేదు. ఆ రెండింటినీ ఒకదాని వెంట ఒకటి చేరిస్తేనే దోషం. ఈ విషయమే చెబుతున్నాడు- అత్రేతి :- ఇక్కడ బీభత్స శృంగారాల మధ్య వీరరసం కూర్చబడింది.

కా. స్మర్యమాణో విరుద్ధోఽపి సామ్యేనాథ వివక్షితః,
అఙ్గిన్యఙ్గత్వమాప్తౌ యౌ తౌ న దుష్టౌ పరస్పరమ్. 65

శ్లో॥ అయం స రశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః,
నాభ్యూరుజఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః. 336

వ్యా. ఏతత్ భూరిశ్రవసః సమరభువి పతితం హస్తమాలోక్య

తద్వ్యభిచారభిధయా. అత్ర పూర్వావస్థాస్మరణం శృఙ్గారాఙ్గమపి కరుణం పరిపోషయతి.

వ్యా. స్మర్యమాణ ఇతి :- విరుద్ధోఽపి = విరుద్ధమైనా ఒక రసం, స్మర్యమాణః = ప్రధానరసంతో కూడా స్మరింపబడినట్లయితే దుష్టం కాదు. అథ = మరియు, విరుద్ధోఽపి = విరుద్ధమైన రసం కూడ, సామ్యేన = సామ్యంతో అనగా ప్రకృతరసంతో సమానంగా, వివక్షితః = వివక్షితమైతే, చెప్పనిచ్ఛయింపబడినట్లయితే, అది కూడా దుష్టం కాదు. అఙ్గిని = అంగియైన ఒక రసమునందు, యౌ = ఏ విరుద్ధరసములు, అఙ్గత్వమ్ = అంగత్వాన్ని, అప్తౌ = పొందినవో, తౌ = అవి కూడ, పరస్పరమ్ = పరస్పరమూ, న దుష్టౌ = దుష్టములు కావు.

అయమితి :- రశనోత్కర్షీ = వడ్డాణమును లాగేదీ, పీనస్తనవిమర్దనః = పీనములైన స్తనాలను మర్దించేది, నాభ్యూరుజఘనస్పర్శీ = నాభిని, ఊరువులను, జఘనాన్ని స్పృశించేదీ, నీవీవిస్రంసనః = వస్త్రగ్రంథిని జార్చేదీ అయిన, సః కరః = ఆ హస్తము, అయమ్ = ఇదే.

ఏతదితి :- యుద్ధభూమిలో పడి ఉన్న భూరిశ్రవస్సు హస్తాన్ని చూచి ఈ మాటలు అతని భార్య పలికింది. ఇక్కడ ఉన్న పూర్వావస్థాస్మరణం శృంగారానికి అంగమైన ప్రస్తుతమైన కరుణరసాన్ని పోషిస్తున్నది. అందుచేత కరుణ శృంగారాలు విరోధిరసాలే అయినా ఒక దానిని స్మరిస్తూన్నట్లు వర్ణించిన పక్షంలో విరోధం లేదు అని భావం.

అవ. సామ్యవివక్షచేత విరోధం లేకపోవడానికి ఉదాహరణం చూపుతున్నారు.

శ్లో॥ దన్తక్షతాని కరజైశ్చ విపాటితాని
ప్రోద్భిన్నసాన్ద్రపులకే భవతః శరీరే,
దత్తాని రక్తమనసా మృగరాజవధ్వా
జాతస్పృహైర్మునిభిరప్యవలోకితాని. ౩౩౭

అత్ర కాముకస్య దన్తక్షతాదీని యథా చమత్కారకారీణి తథా

జినస్య, యథా వా పరః శృఙ్గారీ తదవలోకనాత్ సస్పృహః తద్వత్ ఏతద్దృశో మునయ ఇతి సామ్యవివక్షా.

వ్యా. దన్తక్షతానీతి :— ఈనిన ఆడసింహం ఆకలిచేత తన పిల్లలను తినడం ప్రారంభించగా చూచి దయచేత తన శరీరాన్నే దానికి తినడానికి సమర్పించిన జినుణ్ణి (బుద్ధుణ్ణి) గూర్చి అంటూన్న మాటలు. భవతః = నీయొక్క, ప్రోద్భిన్నసాన్ద్రపులకే = ఆవిర్భవించిన దట్టమైన పులకములు గల, శరీరే = = శరీరమునందు, రక్తమనసా = రక్తమునందు మనస్సు గల, అనురాగంతో కూడిన మనస్సు గల అని మరొక అర్థం. మృగరాజవధ్వా = ఆడ సింహం చేత, మృగం అనే పురుషజాతికి చెందిన రాజుయొక్క భార్యచేత అని మరొక అర్థం, దత్తాని = ఇవ్వబడిన, దన్తక్షతాని = దంతక్షతాలను, కరజైః = నఖములచేత, విపాటితాని చ = చీల్చబడాలను (దంతక్షతములను, నఖక్షతములను అని కూడా అర్థాలు) జాతస్పృహైః = పుట్టిన ఆసక్తి గల, మునిభిః అపి = మునులచేత కూడ, అవలోకితాని = చూడబడినవి.

అత్రేతి :— ఇక్కడ కాముకుని దంతక్షతాదులు ఎట్లు చమత్కారజనకములో అట్లే జినునివి కూడ. శృంగారి అయిన మరొకడు వాటిని చూడడంవల్ల ఎట్లు ఆసక్తి కలవాడవుతాడో వీటిని చూచిన మునులు కూడ అట్లే అని సామ్యం చెప్ప నిశ్చయింపబడింది.

వి. ఎవడైన ఒక కాముకుని శరీరంమీద ఉన్న దంతక్షతనఖక్షతాదులు చూచి శృంగారి అయిన ఇతరుని మనస్సులో "నాకు కూడ ఇవి లభిస్తే బాగుండును" అని అభిలాష కలిగినట్లుగా జినుని శరీరంమీద సింహి ఇచ్చిన దంతక్షతాదులు చూచి మునులకు "మనం కూడ ఈ విధంగా దయామయస్వరూపులం అవాలి" అని అభిలాష కలుగుతున్నది అనే అర్థం స్ఫురిస్తున్నది. దయావీర శృంగారరసాలకి అంగాలైన దంతక్షతాదులు ఉద్దీపనవిభావాలు. అంగాలైన వీటికి సామ్యవివక్ష ఉండడంచేత, అంగులైన, ముని-శృంగారిపరనిష్ఠాలైన దయావీర శృంగారాలకి కూడా సామ్యం వివక్షితం అవుతున్నది. ఈవిధంగా శృంగారరసం ఉపమానరూపంలో దయావీరానికి అంగమై దానికి ఉత్కర్షకంగా ఉంది అందుచేత ఇక్కడ ఈ రెండు రసాల మధ్య ఉన్న విరోధం పరిహృతం అవుతున్నది అని భావం.

మమ్మటుడు దయావీరాన్ని అంగీకరించలేదు గాన ఇక్కడ శాంత - శృంగారా లని గాని, బీభత్సశృంగారా లని కాని గ్రహించడం యుక్తం. కొందరు వ్యాఖ్యాతలు వాటిని గ్రహించి వ్యాఖ్యానించారు.

అవ. "అఙ్గిన్యఙ్గత్వ-మాప్తౌ" అని చెప్పిన మూడవ ప్రకారంలో ఒక అంగికి విరుద్ధమైన రెండు రసాలు అంగంగా ఉండడం సమానమైన హోదా గల ఇద్దరు సేనాపతులు ఒక రాజుకు అంగంగా ఉన్నట్లు. స్వభృత్యసహితుడైన సేనాపతి రాజుకు అంగంగా ఉన్నట్లు రెండు విధాల జరగవచ్చును. మొదటి పద్ధతికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ క్రామన్త్యః క్షతకోమలాఙ్గుళిగలద్రక్తైః సదర్భాః స్థలీః
పాదైః పాతితయావకైరివ గలద్బాష్పాంబుధౌతాననాః,
భీతా భర్తృకరావలమ్బితకరా స్త్వచ్ఛత్రు నార్యోఽధునా
దావాగ్నిం పరితో భ్రమన్తి పునరప్యుద్యద్వివాహా ఇవ.

వృ. అత్ర చాటుకే రాజవిషయా రతిః ప్రతీయతే. తత్ర కరుణ ఇవ శృఙ్గారోఽప్యఙ్గమితి తయోర్న విరోధః.

వ్యా. క్రామన్త్యః ఇతి :- ఒక కవి రాజును స్తుతిస్తూన్నాడు - క్షతకోమలాఙ్గులిగలద్రక్తైః = గాయపడిన కోమలములైన వ్రేళ్ళనుండి కారుతున్న రక్తం కల, పాతితయావకైః ఇవ = పూయబడిన లత్తుక కలపి వలె ఉన్న, పాదైః = పాదాలతో, సదర్భాః = దర్భలతో కూడిన, స్థలీః = స్థలములను, మెట్ట ప్రదేశములను, క్రామన్త్యః = నడచి దాటుచున్న, గలద్బాష్పామ్బుధౌతాననాః = కారుతున్న కన్నీటిచేత కడిగివేయబడిన ముఖాలు గల, భీతాః = భయపడిన, త్వచ్ఛత్రునార్యః = నీ శత్రువుల స్త్రీలు . అధునా = ఇప్పుడు, భర్తృకరావలమ్బిత కరాః = భర్తలచేత పట్టుకొనబడిన హస్తాలు కలవారై, పునః అపి = మరల, ఉద్యద్వివాహాః ఇవ = జరుగుతూన్న వివాహం కలవారు వలె, దావాగ్నిం పరితః = దావాగ్ని చుట్టూ, భ్రమన్తి = తిరుగుచున్నారు పాదాలకు పారాయణ పెట్టుకొన్న వధువు, వివాహంలో లాజహోమానంతరం, భర్త తన చేయి పట్టుకొని ముందు నడవగా అగ్ని ప్రదక్షిణం చేస్తుంది. ఆ సమయంలో పొగకి కన్నీళ్ళు రావడం సహజం. ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకొని చేసిన వర్ణన.

అత్రేతి - ఈ చాటుపద్యంలో రాజవిషయకమైన (కవిలో ఉన్న) రతి ప్రతీయమానం అవుతున్నది. దానికి కరుణరసం వలె శృంగారం కూడా అంగంగా ఉంది. ఈ రెండు రసాలకూ పరస్పరం విరోధం ఉన్నా ఈ రెండూ మరొక దానికి (రతికి) అంగాలు అయినవి కాబట్టి విరోధం లేదు.

అవ. మరొకదానికి అంగాలు అయినంతమాత్రంచేత సహజంగా ఉన్న విరోధం ఎట్లు పోతుంది ? అని ఆశంక కలుగవచ్చు. దానికి సమాధానం చెప్పుతున్నాడు.

వృ. యథా -

శ్లో॥ ఏహి గచ్ఛ పతోత్తిష్ఠ వద మౌనం సమాచర
ఏవమాశాగ్రహగ్రస్తైః క్రీడన్తి ధనినోఽర్థిభిః. 339

ఇత్యత్ర 'ఏహీతి క్రీడన్తి', 'గచ్ఛేతి క్రీడన్తి' ఇతి క్రీడనాపేక్ష యోర్గమనాగమనయోర్న విరోధః.

వ్యా. యథా ఇతి ; ఏహీతి - ఏహి = రమ్ము; గచ్ఛ = వెళ్ళుము, పత = క్రిందపడుము; పాదాలకి నమస్కారం చెయ్యుము, ఉత్తిష్ఠ = లెమ్ము, వద = (ఏమి చెప్పాలో) చెప్పుము, మౌనం సమాచర = మౌనం అవలంబించుము. ఏవమ్ = ఇట్లు, ధనినః = ధనవంతులు, ఆశాగ్రహగ్రస్తైః = ఆశ అనే గ్రహం చేత ఆవహించబడిన, అర్థిభిః = యాచకులతో, క్రీడన్తి = ఆడుకొనుచున్నారు.

ఈ శ్లోకంలో 'రా' అని ఆడుకుంటారు; 'పో' అని ఆడుకుంటారు అని ఆడుకోవడాన్ని అపేక్షించిన, అనగా దానికి సాధనాలుగా, అంగాలుగా, ఉన్న గమనాగమనాలకు ఏ విధంగా విరోధం లేదో అట్లే.

వి. గమనం, ఆగమనం అనేవి పరస్పరవిరుద్ధాలు అయినా వాటిని 'క్రీడన్తి' అనే దానికి అంగాలుగా చెప్పడంచేత ఏ విధంగా విరోధం కనబడదం లేదో అట్లే పై శ్లోకంలో రతికి అంగాలు అవడంతో కరుణశృంగారాల విరోధం తొలగిపోయింది అని అర్థం.

అవ. ఇప్పుడు తృతీయప్రకారానికి సంబంధించిన రెండవ భేదానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోంఽశుకాన్తం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితః సంభ్రమేణ,
ఆలిఙ్గన్ యోఽవధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శామ్భవో వః శరాగ్నిః.

వృ. ఇత్యత్ర త్రిపురరిపుప్రభావస్య కరుణః అఙ్గమ్. తస్య తు శృఙ్గారః, తథాపి న కరుణే విశ్రాన్తిరితి తస్యాఙ్గత్వైవ. అథవా ప్రాక్ యథా కాముక ఆచరతి స్మ తథా శరాగ్నిరితి శృఙ్గారపోషితేన కరుణేన ముఖ్య ఏవార్థః ఉపోద్బల్యతే.

వ్యా. క్షిప్తః ఇతి -: ఇది అమరుశతకంలోని మంగళశ్లోకం, యః = ఏ శరాగ్ని, సాశ్రునేత్రోత్పలాభిః = కన్నీళ్ళతో కూడిన, ఉత్పలముల వంటి నేత్రములు గల, త్రిపుర యువతిభిః = త్రిపురాసుర స్త్రీలచేత, ఆర్ద్రాపరాధః = పచ్చిగా ఉన్న (కొత్తదైన, అప్పుడే చేసిన) అపరాధం గల, కామీవ = కాముకుడు వలె, హస్తావలగ్నః = చేతులకు తగులుకొంటూ, హస్తస్పర్శ చేస్తూ, క్షిప్తః = దూరంగా విసరివేయబడినదో, ప్రసభమ్ = బలాత్కారంగా, అంశుకాన్తమ్ = వస్త్రాంతమును ఆదదానః అపి = గ్రహిస్తూన్నా, అభిహతః = కొట్టబడినదో, కేశేషు = కేశములయందు, గృహ్ణన్ = గ్రహిస్తూ, అపాస్తః = విదిలించుకొనబడిందో, చరణనిపతితః = పాదాలమీద పడినదై, సంభ్రమేణ = తొందరచేత, నేక్షితః = చూడబడలేదో, ఆలిఙ్గన్ = కౌగలించుకొంటూ, అవధూతః = తిరస్కరించబడిందో, సః = ఆ, శామ్భవః = శివుని సంబంధమైన, శరాగ్నిః = బాణాగ్ని, వః = మీయొక్క, దురితమ్ = పాపమును, దహతు = కాల్చివేయుగాక.

ఇత్యత్రేతి -: ఇక్కడ కరుణరసం పరమేశ్వరుని ప్రభావానికి, అనగా మహాప్రభావం గల పరమేశ్వరుని గూర్చిన కవిరతికి, అంగం. దానికి శృంగారం అంగం. అయినా, అనగా కరుణకు శృంగారం అంగం అయినా, కరుణలో విశ్రాంతి లేదు కాబట్టి, కరుణతోనే ఆగిపోవడం లేదు కాబట్టి, ఆ కరుణరసం అంగమే కాని అంగి కాదు. 'అథవా' అనేపదానికి 'యతః' అని అర్థం. ఎందుచేతననగా పూర్వం కాముకుడు ఏ విధంగా ఆచరించేవాడో శరాగ్ని కూడా ఆ విధంగానే ఆచరించినది అని శృంగారంచేత పోషించబడిన కరుణరసంచేత

ముఖ్యార్థమే బలం కలదిగా చేయబడుతున్నది. ఈ విధంగా చాలమంది వ్యాఖ్యాతలు వ్యాఖ్యానించారు. కొందరు 'అథవా' అనేదానికి 'లేదా' అనే ప్రసిద్ధార్థాన్ని గ్రహించి, "ఇక్కడ రెండు పక్షాలు చెప్పబడ్డాయి; మొదటి పక్షం ప్రకారం కరుణకి శృంగారం అంగం, కరుణ రతికి అంగం; అందుచేత శృంగారంకూడా కరుణద్వారా రతికి అంగం అనీ, రెండవ పక్షం ప్రకారం ('అథవా' ఇత్యాది వాక్యంలో చెప్పిన పక్షం ప్రకారం) కరుణరసం శృంగారవిశిష్ట మనీ, రతి శృంగారవిశిష్ట కరుణవిశిష్టం అనీ అర్థం" అని వివరించారు. 'అవ్యయానామనేకార్థకత్వమ్' అనే సామాన్యోక్తిని తీసికొని 'అన్యథా' అనేదానికి 'యతః' అని అర్థం చెప్పడం కంటె ఈ వ్యాఖ్యానమే బాగున్నది. అతిప్రాచీన వ్యాఖ్య అయిన 'సంకేతం' కూడా దీనికి అనుకూలంగా ఉంది.

అవ. ఈ విధంగా ప్రభావాతిశయానికి అంగమైన కరుణకు అంగమైన శృంగారం కూడా ప్రభావాతిశయాంగం అని చెప్పబడింది. దీనికి న్యాయసమ్మతిని చూపుతున్నాడు.

వృ. ఉక్తం హి -

శ్లో॥ "గుణః కృతాత్మసంస్కారః ప్రధానం ప్రతిపద్యతే,
ప్రధానస్యోపకారే హి తథా భూయసి వర్తతే." ఇతి

వ్యా. చెప్పబడిందికదా (ఈ విషయం శాస్త్రకారులచేత అంగీకరించబడిందికదా).
గుణః ఇతి -: గుణః = అప్రధానమైనది, కృతాత్మసంస్కారః = చేయబడిన తన సంస్కారము కలదై, అనగా మరొకదాని సాహాయ్యంచేత తనను తాను సంస్కరించుకొని, ప్రధానమ్=ప్రధానమైనదానిని, ప్రతిపద్యతే=పొందును, దానిని సంస్కరించును. తథా = అట్లుచేయడంచేత, ముందు తనను తాను సంస్కరించుకొనడంచేత, ప్రధానస్య = ప్రధానమైనదానికి, భూయసి = అధికమైన, ఉపకారే= ఉపకారమునందు, వర్తతే = ఉండును.

వి. ప్రస్తుతంలో ప్రభావాతిశయం (రతి) ప్రధానం; కరుణరసం గుణం (అప్రధానం). గుణమైన కరుణరసం శృంగారరససంబంధం ద్వారా తనను తాను సంస్కరించుకొని పిమ్మట రతికి ఉపకారకంగా ఉంది. అందుచేత కరు

ణకు అధికోపకారకత్వశక్తిని ఇచ్చిన శృంగారం కూడా ఒక విధంగా రతికి అంగమే అని భావం.

ఇంతవరకు - ఒక రసానికి మరొక రసంతో విరోధం, రసాలకు పరస్పరం అంగాంగిభావం అనే విషయాలు చర్చించబడ్డాయి. రసస్వరూపనిరూపణ సమయంలో "వేద్యాంతరసంపర్కం లేనిదే రసం" అని నిరూపించబడింది కదా ? ఒక రసం ఉన్నప్పుడు ఇతరరసా లేవీ ఉండవు కదా ? అప్పుడు వీటికి విరోధిత్వచింత, అంగాంగిభావచింతా కూడ అర్థరహితాలే కదా అని ఆశంకించు కొని చెపుతున్నాడు -

వృ. ప్రాక్ ప్రతిపాదితస్య రసస్య రసాన్తరేణ న విరోధః, నాప్యఙ్గాఙ్గిభావో భవతి ఇతి రసశబ్దేనాత్ర స్థాయిభావ ఉపలక్ష్యతే.

ఇతి కావ్యప్రకాశే దోషదర్శనో నామ సప్తమ ఉల్లాసః.

వ్యా. వెనుక ప్రతిపాదించబడిన రసానికి మరొకరసంతో విరోధం గాని అంగాంగి భావం కాని ఉండదు. అందుచేత ఈ ఘట్టంలో ప్రయోగించిన 'రస' శబ్దానికి లక్షణావృత్తిచేత 'స్థాయిభావం' అని అర్థం.

'బాలానందిని' అనే కావ్యప్రకాశాంధ్రవ్యాఖ్యానంలో
సప్తమోల్లాసం సంపూర్ణం

* *

# అథ అష్టమ ఉల్లాసః

వృ. ఏవం దోషానుక్త్వా గుణాలంకారవివేకమాహ -

కా. యే రసస్యాఙ్గినో ధర్మాః శౌర్యాదయ ఇవాత్మనః,
ఉత్కర్షహేతవస్తే స్యు రచలస్థితయో గుణాః. 66

వృ. ఆత్మన ఏవ హి యథా శౌర్యాదయో నాకారస్య తథా రసస్యైవ మాధుర్యాదయో గుణా న వర్ణానామ్. క్వచిత్తు శౌర్యాది సముచితస్యాకారమహత్త్వాదేర్దర్శనాత్ "ఆకార ఏవాస్య శూరః" ఇత్యాదే ర్వ్యవహారాత్, అన్యత్ర అశూరేఽపి వితతాకృతిత్వమాత్రేణ 'శూరః" ఇతి, క్వాపి శూరేఽపి మూర్తిలాఘవమాత్రేణ 'అశూరః' ఇతి అవిశ్రాన్త ప్రతీతయో యథా వ్యవహరన్తి తద్వన్మధురాదివ్యఞ్జకసుకుమారాది వర్ణానాం మధురాదివ్యవహారప్రవృత్తేః, అమధురాదిరసాఙ్గానాం వర్ణానాం సౌకుమార్యాదిమాత్రేణ మాధుర్యాది, మధురాదిరసోపకరణానాం తేషా మసౌకుమార్యాదేః అమాధుర్యాది రసపర్యన్తవిశ్రాన్తప్రతీతివన్ధ్యాః వ్యవహరన్తి. అత ఏవ మాధుర్యాదయో రసధర్మాః సముచితైః వర్ణైః వ్యజ్యన్తే; న తు వర్ణమాత్రాశ్రయాః. యత్తైషాం వ్యఞ్జకత్వం తథోదాహరిష్యతే.

వ్యా. ఏవమితి - ఈ విధంగా దోషాలను గూర్చి చెప్పి ఇప్పుడు గుణాలకీ అలంకారాలకీ ఉన్న భేదం చెపుతున్నాడు.

వి. కావ్య లక్షణ ఘటితాలైన దోషాలను గూర్చి చెప్పిన తరవాత గుణాలను నిరూపించ వలసి ఉంది. అయితే కొందరు ప్రాచీనాలంకారికులు గుణాలకీ అలంకారాలకీ భేదం లేదని అన్నారు. వామనుడు మొదలైనవారు గుణాలు శబ్దార్థాల ధర్మా లని అంగీకరిస్తూ కావ్యానికి శోభ కలిగించేవి గుణా లనీ, ఆ

శోభను ఇనుమడింపచేసేవి అలంకారా లనీ అన్నారు. మమ్మటుడు ఆ రెండు మతాలనూ నిరాకరిస్తూ ముందు గుణాలకీ అలంకారాలకి ఉన్న భేదాన్ని రెండు కారికలలో నిరూపిస్తున్నాడు.

యే ఇతి - ఆత్మనః = ఆత్మకు, శౌర్యాదయః ఇవ = శౌర్యం మొదలైనవి వలె, యే = ఏవి, అఙ్గినః = అంగియైన, రసస్య = రసంయొక్క, ధర్మాః = ధర్మాలో, ఉత్కర్షహేతవః = ఆ రసంయొక్క ఉత్కర్షకు కారణాలో, తే = అవి, అచలస్థితయః = చలనం లేని స్థితి గల, అనగా తప్పక రసంతో సంబంధించిన, గుణాః = గుణాలు.

వి. శౌర్యం అనేది ఒక జ్ఞానవిశేషం. అది జీవాత్మధర్మమే కాని అచేతనమైన దేహం ధర్మం కాదు. అదే విధంగా గుణాలు కావ్యాత్మయైన రసం ధర్మాలు కాని కావ్యశరీరం అయిన శబ్దార్థాల ధర్మాలు కావు. వీటివల్ల ఆ యా రసాలకు ఉత్కర్ష లభిస్తుంది. ఇవి తప్పక రసాలతోనే సంబంధించి ఉంటాయి. ఈ విధంగా "రసానికి ఉత్కర్ష కలగడానికి హేతువులైన రసధర్మాలు గుణాలు" అని, లేదా "రసంతో అవినాభావసంబంధం ఉన్నవి గుణాలు"అని గుణాల లక్షణం చెప్పినట్లయింది. కొందరు వ్యాఖ్యాతలు 'ఉత్కర్షహేతవః' అనే దానికి 'కావ్యం యొక్క ఉత్కర్షకు హేతువులు' అనీ, 'అచలస్థితయః అనేదానికి "ఈ రసానికి ఈ గుణాలు అని నియతమైన స్థితి గలవి" అని అర్థం చెప్పారు.

ఆత్మన ఇతి - ఏ విధంగా శౌర్యం మొదలైన ధర్మాలు ఆత్మకు మాత్రమే సంబంధించి ఉంటాయో, ఆకారానికి సంబంధించినవి కావో, అదే విధంగా మాధుర్యాదిగుణాలు రసానికి సంబంధించినవే కాని వర్ణాలకి సంబంధించినవి కావు. కొంతమందిలో శౌర్యాదులకు తగిన ఆకారమహత్త్వం మొదలైనవి (మంచి ఆకారంమొదలైనవి) కనబడడం వల్ల ఇతని ఆకారమే శూరంగా ఉంది అని వ్యవహరిస్తారు (అంటారు) మరొకడు శూరుడు కాకపోయినా మంచి ఆకారం ఉండడంచేత అతణ్ణి శూరుడు అంటారు. ఇంకొకడు నిజంగా శూరుడే అయినా కేవలం ఆతని మూర్తిలాఘవాన్ని (చిన్న ఆకారాన్ని పట్టి) 'అశూరః', ఇతడు శూరుడు కాదు అని అంటారు. అవిశ్రాంతమతులు, అనగా సరియైన నిర్ణయం చేయగలిగిన దీశక్తి లేనివాళ్ళు (పైన చెప్పినట్లు), ఏ విధంగా అనుకుంటూ ఉంటారో, అదే విధంగా రసం వరకూ వెళ్ళగలిగిన బుద్ధిబలం లేని వాళ్ళు (రసపర్యన్త

ప్రతీతివంద్యులు) మధురాదివ్యంజకాలైన, అనగా శృంగారాదివ్యంజకాలైన, సుకుమారా దివర్ణాలనే మధురాదులనీ,మధురాదిరసాలకు, అనగా శృంగారాది రసాలకు, వ్యంజ కాలు కాకపోయినా సౌకుమర్యాదులు ఉన్నంతమాత్రంచేత కొన్ని వర్ణాలను మాధుర్యాదు లనీ, అనగా మధురాలనీ, మధురాదిరసాలకు (శృంగారాది రసాలకు) ఉపకరణాలుగా ఉపయోగించపడిన వర్ణాలలో సౌకుమార్యాదులు లేకపోవడం చేత ఆ వర్ణాలు అమాధుర్యాదు లనీ, మాధుర్యాది శూన్యా లనీ, వ్యవహరిస్తూ ఉంటారు. అత ఏవ = గుణాలు రసనియతాలు అవడంవల్ల, రసధర్మాలైన మాధు ర్యాదుల్ని తగిన వర్ణాలు వ్యంజింపచేస్తాయి. అంతేనే కాని మాదుర్యాదులు వర్ణా లని మాత్రమే ఆశ్రయించుకొని ఉండవు. ఇవి (వర్ణాలు) ఏ విధంగా మాదుర్యాది గుణవ్యంజకాలో ఉదాహరణలు చూపగలం.

అవ. ఇప్పుడు అలంకారాల స్వరూపం విశదీకరిస్తున్నాడు.

కా. ఉపకుర్వన్తి తం సన్తం యేఽఙ్గద్వారేణ జాతు చిత్,
హారాదివదలంకారాస్తేఽనుప్రాసోపమాదయః. 67

వృ. యే వాచకవాచ్యలక్షణాఙ్గాతిశయముఖేన ముఖ్యం రసం సంభవినమ్ ఉపకుర్వన్తి తే కణ్ఠాద్యఙ్గానామ్ ఉత్కర్షాధానద్వారేణ శరీ రిణోఽపి ఉపకారకాః హారాదయ ఇవాలఙ్కారాః. యత్ర తు నాస్తి రసః తత్రోక్తివైచిత్ర్యమాత్రపర్యవసాయినః. క్వచిత్తు సన్తమపి నోప కుర్వన్తి. యథాక్రమముదాహరణాని.

వ్యా. యే = ఏవి. సన్తమ్ = అంగిగా ఉన్న, తమ్ = ఆ రసాన్ని, జాతు చిత్ = ఒక్కొకప్పుడు, అఙ్గద్వారేణ = అంగములైన శబ్దార్థాలద్వారా, హారాదివత్ = హారాదుల వలె, ఉపకుర్వన్తి = ఉత్కర్ష కలదానినిగా చేస్తాయో, తే = అట్టి, అను ప్రాసోపమాదయః = అనుప్రాస, ఉపమ మొదలైనవి. అలఙ్కారాః = అలం కారాలు.

యే ఇతి- ఏవి, ముఖ్యమైన సంభవి అయిన రసాన్ని, అనగా ముఖ్యమైన రసం ఉన్నట్లయితే దానిని, శబ్దాలు, అర్థాలూ అనే అంగాలకు అతిశయం కలిగించడం ద్వారా, ఉత్కర్ష కలదానినిగా చేస్తాయో అవి, కంఠం

మొదలైన అవయవాలకి ఉత్కర్ష కలిగించడం ద్వారా, శరీరికి (ఆత్మకు) ఉప కారకాలుగా ఉన్న హారాదులు వలె అలంకారాలు. ఎక్కడైతే రసం ఉండదో అక్కడ ఆ అలంకారాలు చెప్పే విధానంలో కొంత వైచిత్ర్యం కల్పించడంతోనే పర్యవసానం చెందుతాయి. కొన్ని చోట్ల రసం ఉన్నా, ఒక్కొకప్పుడు అక్కడ ఉన్న అలంకారాలు ఆ రసానికి ఉపకారకాలు కావు. వరసగా ఉదాహరణలు చూపబడుతున్నాయి. ముందు అలంకారం శబ్దం ద్వారా రసోపకారకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అపసారయ ఘనసారం కురు హారం దూర ఏవ కిం కమలైః,
అలమలమాలి మృణాలైః ఇతి వదతి దివానిశం బాలా. 341

వృ. ఇత్యాదౌ వాచకముఖేన.

వ్యా. అపసారయేతి:- కుట్టనీమతంలో ఒక విరహిణి అంటూన్న మాటలు, ఆలి = ఓ! సఖీ! ఘనసారమ్ = కర్పూరమును, అపసారయ = తొలగించు, హారమ్ = ముత్యాలహారాన్ని, దూరే ఏవ = దూరమునందే, కురు = ఉంచు, కమలైః = పద్మాలచేత, కిమ్ = ఏమి ప్రయోజనం? మృణాలైః = తామరతూడుల చేత, అలమ్ అలమ్ = చాలును, చాలును. ఇతి = ఈ విధంగా, బాలా = ఆ బాల, దివానిశమ్ = రాత్రింబగళ్లు, వదతి = పలుకుతూన్నది. శీతలోపచారాలు వద్దం టూన్నది.

ఇత్యాదౌ:- ఈ మొదలైన శ్లోకాలలో వాచకం (శబ్దం) ద్వారా (దీనికి 'అలంకారౌ రసముపకురుతః'అని రాబోయే వాక్యంతో అన్వయం). శబ్దాలంకారం రసానికి ఉపకరిస్తూన్నది.

వి. ఇక్కడ ఉన్న రేఫలకారానుప్రాస శబ్దాన్ని అలంకరించి, దాని ద్వారా విప్రలంభశృంగారంలో ఉన్న మాధుర్యాన్ని వ్యంజింపచేస్తూ ఆ రసానికి ఉపకరి స్తూన్నది.

అవ. అర్థం ద్వారా అలంకారం రసోపకారకం అవడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ మనోరాగ స్తీవ్రం విషమివ విసర్పత్యవిరతం,
ప్రమాథీ నిర్ధూమం జ్వలతి విధుతః పావక ఇవ.
హినస్తి ప్రత్యఙ్గం జ్వర ఇవ గరీయానిత ఇతో,
న మాం త్రాతుం తాతః ప్రభవతి న చామ్బా న భవతీ.

వృ. ఇత్యాదౌ వాచ్యముఖేన అలంకారౌ రసముపకురుతః.

వ్యా. మాలతీమాధవంలో మాధవునిపై తీవ్రమైన అనురాగం గల మాలతి సఖియైన లవంగికతో అంటూన్న మాటలు. మనోరాగః = మనస్సులోని అనురాగం, తీవ్రమ్ = తీవ్రమైన, విషమివ = విషంవలె, అవిరతమ్ = విరామం లేకుండా, విసర్పతి = వ్యాపిస్తూన్నది. నిర్ధూమమ్ = ధూమం లేకుండా, విధుతః = విసరబడిన, రగల్చబడిన, ప్రమాథీ = అధికంగా క్షోభనుచేస్తూన్న, పావకః ఇవ = అగ్ని వలె, జ్వలతి = మండుచున్నది. గరీయాన్ = గొప్పదైన, జ్వరః ఇవ = జ్వరం వలె, ఇతః ఇతః = ఇటు ఇటు, ప్రత్యఙ్గమ్ = అన్ని అవయవాలలోను, హినస్తి = పీడిస్తూన్నది. లేదా ఇతః = ఈ కారణంవల్ల, ఇతః = ఈ మనోరాగం నుండి అని అర్థంచెప్పవచ్చును. మామ్ = నన్ను, త్రాతుమ్ = రక్షించుటకు, తాతః = తండ్రి, న ప్రభవతి = సమర్థుడు కాడు. అమ్బా చ = తల్లి కూడ, న = కాదు. భవతీ = నీవు, న = కావు.

అత్రేతి :- ఇక్కడ వాచ్యముఖంచేత. ఈ విధంగా ఈ రెండు అలంకారాలూ రసానికి ఉపకరిస్తున్నాయి.

వి. ఇక్కడ 'విషమివ' ఇత్యాద్యుపమాలంకారాలు అర్థాన్ని అలంకరించి రసానికి ఉత్కర్షను కలిగిస్తున్నాయి. ఈ విధంగా పూర్వశ్లోకంలో అనుప్రాస, ఈ శ్లోకంలో మాలోపమ రసానికి ఉత్కర్ష కలిగిస్తున్నాయి.

అవ. రసం ఉన్నా శబ్దాలంకారం దానికి ఉపకారకం కాకపోవడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ చిత్తే విహట్టది ణ టుట్టది సా గుణేసుం
పేజ్జాసు లోట్టది విసట్టది దిమ్ముహేసుం,

బోలమ్మి వట్టది పవట్టది కవ్వబన్ధే
ఝాణేణ టుట్టది చిరం తరుణీ తరట్టీ.

"చిత్తే విఘటతే న త్రుట్యతి సా గుణేషు
శయ్యాసు లుఠతి విసర్పతి దిఙ్ముఖేషు,
వచనే వర్తతే ప్రవర్తతే కావ్యబన్ధే
ధ్యానేన త్రుట్యతి చిరం తరుణీ ప్రగల్భా.

వృ. ఇత్యాదౌ వాచకమేవ.

వ్యా. చిత్తే ఇతి :- రాజశేఖరుడు రచించిన కర్పూరమంజరి అనే సట్టకంలో రాజు కర్పూరమంజరిని గూర్చి అంటూన్న మాటలు. ప్రగల్భా=ప్రగల్భురాలైన, తరుణీ = ఆ యువతి, చిత్తే = చిత్తమునందు, విఘటతే = దృఢంగా ఘటితురాలు అవుతున్నది. స్థిరంగా ఉండిపోతూన్నది. గుణేషు = గుణాలయందు, న త్రుట్యతి = లోపం కలది కాదు. గుణహీనురాలు కాదు. శయ్యాసు = శయ్యలపైన, లుఠతి = దొరలుచున్నది. దిఙ్ముఖేషు = దిక్కుల ముఖములయందు, విసర్పతి = సంచరిస్తూన్నది. వచనే = వచనమునందు, వర్తతే = ఉంటూన్నది. అనగా పేలాపనలు చేయుచున్నది. కావ్యబన్ధే = కావ్యరచనయందు, ప్రవర్తతే= ప్రవర్తిస్తూన్నది. చిరమ్ = చిరకాలమును, ధ్యానేన = ఆలోచనచేత, త్రుట్యతి= కృశిస్తూన్నది.

అత్రేతి :- ఇక్కడ (అలంకారం) శబ్దానికే (ఉపకరిస్తూన్నది). (రాలోయే వాక్యంలో ఉన్న 'న తు రసమ్' అనేది ఇక్కడ కూడా అన్వయిస్తుంది). రసానికి మాత్రం ఉపయోగించడం లేదు.

వి. పై శ్లోకంలో టవర్గానుప్రాస (శబ్దాలంకారం) ఉంది. ఇది శబ్దాన్ని మాత్రమే అలంకరిస్తూన్నది కాని ఇక్కడ విప్రలంభశృంగారం ఉన్నా దానికి ఉపకరించడం లేదు. టవర్గం శృంగారానికి ప్రతికూలమైనది.

అవ. రసం ఉన్నా, అర్థాలంకారం దానికి ఉపకరించకపోవడానికి ఉదాహరణం చూపుతున్నారు.

శ్లో॥ మిత్రే క్వాపి గతే సరోరుహవనే బద్ధాననే తామ్యతి
క్రన్దత్సు భ్రమరేషు వీక్ష్య దయితాసన్నం పురఃసారసమ్,
చక్రాహ్వేన వియోగినా బిసలతా నాస్వాదితా నోజ్ఝితా
కణ్ఠే కేవలమర్గలేవ నిహితా జీవస్య నిర్గచ్ఛతః. 344

వృ. ఇత్యాదౌ వాచ్యమేవ, న తు రసమ్. అత్ర బిసలతా న జీవం రోద్ధుం క్షమేతి ప్రకృతాననుగుణోపమా.

వ్యా. మిత్రే ఇతి :- మిత్రే = సూర్యుడు, ధైర్యం చెప్పే స్నేహితుడు అని కూడా అర్థం, క్వాపి = ఎక్కడికో, గతే=వెళ్ళిపోయినవాడగుచుండగా, సరోరుహవనే=పద్మవనము, బద్ధాననే=కట్టబడిన (వాడిన) ముఖము కలదై, తామ్యతి = దుఃఖించుచుండగా, మాట్లాడలేని స్థితిలో ఉండగా అని కూడ అర్థం. భ్రమరేషు = తుమ్మెదలు, క్రన్దత్సు = ఆక్రందిస్తూండగా, పురః = ఎదుట, దయితాసన్నమ్ = ప్రియురాలికి సమీపంలో ఉన్న, సారసమ్ = సారసపక్షిని, వీక్ష్య = చూచి, ఆ స్థితిలో ప్రియురాలితో కూడి ఉన్న మరొకరిని చూడగానే విరహబాధ ఎక్కువ అవుతుం దని భావం, వియోగినా=వియోగం గల, చక్రాహ్వేన=చక్రవాకంచేత, బిసలతా = తామరతూడు, నాస్వాదితా = తినబడలేదు, నోజ్ఝితా = విడవబడలేదు. కేవలమ్ = కేవలము, నిర్గచ్ఛతః = పైకి లేచిపోతూన్న, జీవస్య = జీవునికి. అర్గలేవ = అడ్డగడియ వలె, కణ్ఠే = కంఠమునందు, నిహితా = ఉంచబడినది.

ఇత్యాదౌ ఇతి :- ఇత్యాదిస్థలాలలో అర్థాలంకారం వాచ్యాన్ని మాత్రమే అలంకరిస్తూన్నది. రసానికి ఉపకారకంగా లేదు. ఇక్కడ బిసలత జీవనాన్ని అడ్డుకొనడానికి యోగ్యమైనది కాదు. అందుచేత ఈ ఉపమ ప్రకృతానికి ఉపయోగకరంగా కూడ లేదు.

వి. ఇక్కడ చక్రవాకగతమైన విప్రలంభశృంగారం ఉన్నా అర్థాలంకారమైన ఉపమ అర్థానికి ఉపకరిస్తూన్నది కాని విప్రలంభానికి ఉపకారకంగా లేదు. విరహంతో బాధపడుతున్నవాళ్ళు జీవనం పోవడానికి ప్రయత్నించాలి కాని ఏదో విధంగా దానిని నిలుపుకోవడానికి కాదు. అందుచేత ప్రకృతరసానికి అనుగుణంగా లేదు.

వృ. ఏష ఏవ గుణాలంకారవిభాగః. ఏవం చ "సమవాయ వృత్త్యా శౌర్యాదయః, సంయోగవృత్త్యా తు హారాదయః ఇత్యస్తు గుణాలంకారాణాం భేదః. ఓజః ప్రభృతీనామ్, అనుప్రాసోపమాదీనాం చ ఉభయేషామపి సమవాయవృత్త్యా స్థితిః ఇతి గడ్డలికాప్రవాహేణైవ ఏషాం భేదః" ఇత్యభిధానమసత్.

వ్యా. ఏష ఇతి :- ఇదే గుణాలంకారవిభాగం. అందుచేత (మానవుడిలో) గుణాలు సమవాయసంబంధంతో, అనగా విడదీయరాని విధంగా, ఉంటాయి. హారాదులు సంయోగసంబంధంచేత ఉంటాయి. ఇదే గుణాలంకారాల భేదం అని లోకంలోని గుణాదులను గూర్చి చెప్పవచ్చును. కావ్యంలో ఓజస్సు మొదలైన గుణాలు, అనుప్రాసోపమాదులూ కూడా సమవాయసంబంధంతోనే ఉంటాయి కాబట్టి వీటికి భేదం లేదు. సంయోగసమవాయాలను పురస్కరించుకొని వీటికి భేదం చెప్పడం గడ్డలికాప్రవాహన్యాయంతో జరుగుతూన్నది" అని భామహవృత్తిలో ఉద్భటుడన్న మాటలు సరికావు.

వి. పైన చెప్పిన విధంగా గుణాలు రసధర్మాలనీ, అలంకారాలు చంచలవృత్తు లనీ ఆ రెండింటికీ బేదం చెప్పడానికి వీలున్నది. సమవాయసంయోగాలను పురస్కరించుకొని బేదం చెప్పడంలేదు. అందుచేత భట్టోద్భటుడు చేసిన భేదనిరాకరణం యుక్తం కాదు అని అర్థం. గడ్డలికాప్రవాహన్యాయం అనగా 'గొఱ్ఱెల మంద పోకడ' అని చెప్పే న్యాయం. ఒక గొఱ్ఱె ఎటు దారి తీస్తే మిగిలిన వన్నీ అదే దారిలో వెడతాయి.

అవ. ఇప్పుడు వామనుడు చెప్పిన భేదాన్ని నిరాకరిస్తున్నాడు-

వృ. యదప్యుక్తం "కావ్యశోభాయాః కర్తారో ధర్మాః గుణాః, తదతిశయహేతవస్తు అలంకారాః" ఇతి తదపి న యుక్తమ్ యతః కిం సమస్తైర్గుణైః కావ్యవ్యవహారః, ఉత కతిపయైః? యది సమస్తైః తత్కథమసమస్తగుణా గౌడీ పాఞ్చాలీ చ రీతిః కావ్యస్యాత్మా? అథ కతిపయైః, తతః.

శ్లో॥ అద్రావత్ర ప్రజ్వలత్యగ్నిరుచ్చైః
ప్రాజ్యః ప్రోద్యన్నుల్లసత్యేష ధూమః. 345

వృ. ఇత్యాదావోజఃప్రభృతిషు గుణేషు సత్సు కావ్యవ్యవహార ప్రాప్తిః.

శ్లో॥ స్వర్గప్రాప్తిరనేనైవ దేహేన వరవర్ణినీ,
అస్యా రదచ్ఛదరసో న్యక్కరోతితరాం సుధామ్. 346

ఇత్యాదౌ గుణనిరపేక్షౌ విశేషోక్తివ్యతిరేకౌ కావ్యవ్యవహారస్య ప్రవర్తకౌ.

వ్యా. "కావ్యానికి శోభను కూర్చే ధర్మాలు గుణాలు; ఆ శోభను అతిశయింపచేసేవి అలంకారాలు" అని (వామనుడు) చెప్పినది కూడా యుక్తం కాదు. అన్ని గుణాలచేత కావ్యవ్యవహారమా లేక కొన్ని గుణాలచేతనా? సమస్తగుణాల చేత అయితే సమస్తగుణాలు లేని గౌడి పాంచాలి అనే రీతులు కావ్యాత్మ ఎలా అవుతాయి.

వి. వామనుని మతం ప్రకారం కావ్యానికి రీతి ఆత్మ. పదసంఘటనా రూపమైన రీతి వైదర్భి, గౌడి, పాంచాలి అని మూడు విధాలు. సర్వగుణాలను వ్యంజింపచేసే వర్ణాలు ఉన్న రీతి వైదర్భి. ప్రసాదాన్ని, ఓజస్సును వ్యంజింప చేసే వర్ణా లున్నది గౌడి. మాధుర్య-ప్రసాదాలు గల వర్ణా లున్నది పాంచాలి. నీవు చెప్పిన అన్ని గుణాలు ఉన్నదే కావ్యమా లేదా కొన్ని గుణాలు ఉంటే చాలునా అని మమ్మటుని ప్రశ్న. అన్ని గుణాలు ఉంటేనే కావ్యం అని అనే పక్షంలో వైదర్భీరీతిలో అన్ని గుణాలూ ఉండడంచేత ఆ రీతి ఆత్మగా ఉన్నది కావ్యం అయినప్పటికీ అన్ని గుణాలూ లేని గౌడీ-పాంచాలీరీతు లున్నది కావ్యం అవదు కదా ?

అథేతి :. అలా కాదు, కొన్ని గుణాలు ఉంటే చాలు అని అన్నట్లయితే "అద్రావత్ర" ఇత్యాదివాక్యంలో ఓజస్సుమొదలైన గుణాలు ఉండడంచేత దీన్ని కూడా కావ్యం అనవలసి వస్తుంది. (ప్రాజ్యః = అత్యధికమైన, ప్రోద్యన్ = పైకి లేస్తూన్న, ఏషః ధూమః = ఈ ధూమం, ఉల్లసతి = ప్రకాశిస్తూన్నది, అందుచేత, అత్ర = ఈ, అద్రౌ = పర్వతంమీద, అగ్నిః = అగ్ని, ఉచ్చైః = ఉన్నతంగా,

ప్రజ్వలతి = మండుతూన్నది; అని ఈ వాక్యానికి అర్థం. "పర్వతో వహ్నిమాన్ ధూమాత్" అనే దానినే మరో మాటలో చెప్పడం జరిగిన సౌందర్యవిహీనమైన వాక్యం ఇది).

స్వర్గేతి:- వరవర్ణిని = ఈ సుందరాంగి, అనేన = ఈ, దేహేనైవ = దేహం చేతనే, స్వర్గప్రాప్తిః = స్వర్గప్రాప్తి. అస్యాః = ఈమెయొక్క, రదచ్ఛదరసః = అధరరసం, సుధామ్ = అమృతాన్ని, న్యక్కరోతి తరామ్ = పూర్తిగా తిరస్కరిస్తూన్నది.

ఇత్యాదులలో గుణాల అపేక్ష లేకుండా విశేషోక్తి-వ్యతిరేకాలంకారాలే కావ్యవ్యవహారానికి ప్రయోజకాలుగా ఉన్నాయి.

వి. పైన ఉదాహరించిన 'అద్రౌ' ఇత్యాదివాక్యంలో కొన్ని గుణా లున్నా కావ్యత్వం లేదు. అందుచేత అన్ని గుణాలూ ఉంటేనే కావ్యం అని చెప్పాలి. అందులో దోషం మొదటనే చెప్పబడింది. ఇంకొక దోషం ఏమనగా ఈ శ్లోకంలో ఒకటి రెండు గుణాలున్నా కావ్యత్వం ఆ గుణాలను పట్టి కాక పూర్వార్ధంలో విశేషోక్త్యలంకారం, ఉత్తరార్ధంలో వ్యతిరేకాలంకారం ఉండడంచేత లభిస్తూన్నది. దీనిని పట్టి గుణాలు ఉండడంవల్ల కావ్యత్వం లభించదు; అందుచేత రీతి కావ్యాత్మ కాదు అని తేలుతున్నది. "ఏకగుణహానికల్పనయా శేషగుణదార్ఢ్యకల్పనా విశేషోక్తిః" (ఒక గుణం లోపించింది అని చెప్పడం ద్వారా మిగిలిన గుణాలకు దార్ఢ్యం కల్పించడం విశేషోక్తి) అని వామనుడు చెప్పిన విశేషోక్తిలక్షణం. ఇక్కడ దివ్య దేహం అనే ఒక గుణం లేదని చెప్పి తద్ద్వారా ఈమెలో ఉన్న సుఖదాయకత్వం అత్యధికం అని సూచించడంచేత విశేషోక్తి. "ఉపమేయస్య గుణాతిరేకత్వం వ్యతిరేకః"అని వామనుడే చెప్పిన వ్యతిరేకలక్షణం. ఇక్కడ ఉపమేయమైన అధరానికి సుధారసంకంటె ఆధిక్యం చెప్పడంచేత వ్యతిరేకాలంకారం.

వృ. ఇదానీం గుణానాం భేదమాహ-

కా. మాధుర్యౌజఃప్రసాదాఖ్యాస్త్రయస్తే న పునర్దశ.

వ్యా. ఇప్పుడు గుణాల భేదాన్ని (విభిన్నగుణాలను) చెపుతున్నాడు.

మాధుర్యేతి:- మాధుర్యౌజఃప్రసాదాఖ్యాః = మాధుర్యం, ఓజస్సు, ప్రసాదం

అనే పేర్లు గల, తే = ఆ గుణాలు, త్రయః = మూడు, పునః = కాని, దశ = పది, న = కావు.

వి. భరతుడు నాట్యశాస్త్రంలో-

"శ్లేషః ప్రసాదః సమతా సమాధి
ర్మాధుర్యమోజః పదసౌకుమార్యమ్,
అర్థస్య చ వ్యక్తిరుదారతా చ
కాన్తిశ్చ కావ్యస్య గుణా దశైతే".

అని పది కావ్యగుణాలు అంగీకరించాడు. దండి కావ్యాదర్శంలో-

"శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా,
అర్థవ్యక్తిరుదారత్వమోజః కాన్తిసమాధయః" (కావ్యాద. 1-41)

అని ఈ పది గుణాలనే అంగీకరించాడు. ఈ పదింటిలో శ్లేష-సమతా-సుకుమారతా- ఓజస్సులు నాలుగూ శబ్దగుణా లనీ, ప్రసాద-అర్థవ్యక్తి-ఉదారతా-కాంతి-సమాధులు ఐదూ అర్థగుణాలనీ, మాధుర్యం ఉభయగుణం అనీ ఇతడిచ్చిన లక్షణోదాహరణాలను పట్టి తెలుస్తుంది. కాని వామనుడు-"ఓజఃప్రసాదశ్లేష సమతా సమాధి మాధుర్యసౌకుమార్యోదారతార్థవ్యక్తికాన్తయః బన్ధగుణాః" (3-1-4) అని ఈ పదింటినీ శబ్దగుణాలుగా అంగీకరించి, ఇవే పేర్లతో పది అర్థగుణాలనుకూడా అంగీకరించాడు-"త ఏవార్థగుణాః" (1-2-1). ఈ విధంగా దండ్యాదుల మతం ప్రకారం గుణాలు పది లేదా ఇరవై; అవి శబ్దార్థాలకి సంబంధించినవి. ధ్వని సిద్ధాంతస్థాపనానంతరం గుణాలు రసధర్మాలే కాని శబ్దార్థధర్మాలు కావనీ, వాటి సంఖ్య మూడే కాని పది (లేదా ఇరవై) కాదనీ ఆనందవర్ధనాదులు సిద్ధాంతీకరించారు. ఆ పద్ధతినే అనుసరించి మమ్మటుడు "గుణాలు మూడే కాని పది కావు" అని ఇక్కడ ప్రతిపాదిస్తున్నాడు. ముందు ఈ మూడు గుణాల స్వరూపం నిరూపించి మిగిలిన గుణాలు ఎందుకు అంగీకరించ నవసరం లేదో చెపుతాడు.

వృ. ఏషాం క్రమేణ లక్షణమాహ-

కా. ఆహ్లాదకత్వం మాధుర్యం శృఙ్గారే ద్రుతికారణమ్. 68

వృ. శృఙ్గారే అర్థాత్ సంభోగే, ద్రుతిర్గలితత్వమివ. శ్రవ్యత్వం పునః ఓజఃప్రసాదయోరపి.

వ్యా. ఆహ్లాదకత్వమితి :- ద్రుతికారణమ్ = చిత్తం ద్రవించడానికి కారణమైన, ఆహ్లాదకత్వమ్ = ఆనందాన్ని కలిగించకలిగి ఉండడం, మాధుర్యమ్ = మాధుర్యం. అది, శృఙ్గారే = శృంగారంలో ఉన్నది.

వి. 'ఆహ్లాద' శబ్దాన్ని భావే ఘఞంత శబ్దంగా గ్రహించి, దానికి స్వార్థ 'క' ప్రత్యయం చేర్చడంచేత 'ఆహ్లాదకత్వమ్' అనేదానికి 'ఆహ్లాదము' అని అర్థం చెప్పాలి. అంతేనే కాని ఆహ్లాదం కలిగించడం అని చెప్పకూడదు. ఈ ఆహ్లాదకత్వం శృంగారంలో ఉన్నది అని చెపుతున్నాడు కదా? శృంగారం ఆహ్లాదస్వరూపమే కాని ఆహ్లాదం కలిగించేది కా దు కదా అని బాలబోధినీకారులు చెప్పినారు. కాని 'మాధుర్యం' అనగా ఆహ్లాదకత్వం. అది శృంగారంలో ఉంది అని అన్నప్పుడు ఈ మాధుర్యానికీ శృంగారానికీ ఆధార-ఆధేయభావం చెప్పబడుతూన్నది. గుణం రసధర్మం కదా? రసాన్నుంచి గుణాన్ని వేరుగా చూపి వ్యవహరిస్తున్నాం. అందుచేత శృంగారం ఆనందరూపమే అయినా దానికి ఆనందరూపత్వాన్ని ఇచ్చేది మాధుర్యం అని చెప్పడమే యుక్తం అని తోస్తుంది.

వ్యా. శృఙ్గారే ఇతి:- అనగా సంభోగశృంగారంలో, ద్రుతిః అనగా చిత్తం కరిగిపోయినట్లు అయిపోవడం. శ్రవ్యత్వం అయితే ఓజః ప్రసాదాలలో కూడా ఉంది.

వి. భామహుడు శ్రవ్యత్వం, అనగా వినడానికి ఇంపుగా ఉండడం, మాధుర్యం అని మాధుర్యానికి లక్షణం చెప్పాడు. ఈ శ్రవ్యత్వం ఓజఃప్రసాదాలలో కూడా ఉంది అందుచేత శ్రవ్యత్వం మాధుర్యలక్షణంగా చెప్పకూడదు అని భావం.

కా. కరుణే విప్రలమ్భే తచ్ఛాన్తే చాతిశయాన్వితమ్.

వృ. అత్యన్తద్రుతిహేతుత్వాత్.

వ్యా. కరుణే ఇతి :- తత్ = ఆ మాధుర్యం, కరుణే = కరుణరసంలోను,

విప్రలమ్భే = విప్రలంభశృంగారంలోను, శాన్తే చ = శాంతరసంలోను, అతిశయాన్వితమ్ = అతిశయంతో కూడినది.

వి. మాదుర్యం సంభోగంలో కంటె కరుణలోను, దానిలోకంటె విప్రలంభలోను, దానిలోకంటె శాంతంలోను అతిశయంగా ఉంటుం దని అభిప్రాయం. దీనికి కారణం- అత్యన్తద్రుతిహేతుత్వాత్ = అధికమైన చిత్తద్రుతికి కారణం అవడంవల్ల.

కా. దీప్త్యాత్మవిస్తృతేర్హేతురోజో వీరరసస్థితి. 69

వృ. చిత్తస్య విస్తారరూపదీప్తత్వజనకమోజః.

కా. బీభత్సరౌద్రరసయోస్తస్యాధిక్యం క్రమేణ చ.

వృ. వీరాద్బీభత్సే, తతో రౌద్రే సాతిశయమోజః.

వ్యా. దీప్త్యాత్మేతి :- దీప్త్యాత్మవిస్తృతేః = దీప్తిరూపమైన, ప్రజ్వలించడం వంటి రూపం గల, ఆత్మవిస్తృతికి అనగా మనస్సు విస్తరించడానికి, హేతుః = హేతువైనది, ఓజః = ఓజస్సు. అది వీరరసస్థితి = వీరరసంలో ఉండేది.

చిత్తస్యేతి :- చిత్తానికి విస్తారరూపమైన ప్రజ్వలనాన్ని కలిగించేది ఓజస్సు.

బీభత్సేతి :- క్రమేణ = క్రమంచేత, తస్య = దానికి, బీభత్సరౌద్రరసయోః = బీభత్సరౌద్రరసాలలో, ఆధిక్యమ్ = ఆధిక్యము.

వీరాదితి :- వీరంకంటె బీభత్సంలోను, దానికంటె రౌద్రంలోనూ ఓజస్సు అధికంగా ఉంటుంది.

కా. శుష్కేన్ధనాగ్నివత్ స్వచ్ఛజలవత్సహసైవ యః. 70
వ్యాప్నోత్యన్యత్ ప్రసాదోఽసౌ సర్వత్ర విహితస్థితిః.

వృ. అన్యదితి వ్యాప్యమిహ చిత్తమ్. సర్వత్రేతి. సర్వేషు రసేషు, సర్వాసు రచనాసు చ.

వ్యా. యః = ఏది, శుష్కేన్ధనాగ్నివత్ = ఎండిపోయిన కట్టెను అగ్ని వలె, స్వచ్ఛజలవత్ = స్వచ్ఛమైన వస్త్రాన్ని జలం వలె, సహసైవ = వెంటనే అన్యత్ = చిత్తమును, వ్యాప్నోతి = వ్యాపించునో, అసౌ = ఇది, ప్రసాదః = ప్రసాదము, సర్వత్ర = అంతటా, విహితస్థితిః = చేయబడిన స్థితి గలది.

వి. ఈ విధంగా మాదుర్యం చిత్తద్రుతినీ, ఓజస్సు చిత్తదీప్తినీ లేదా విస్తారాన్నీ, ప్రసాదం చిత్తవికాసాన్ని కలిగిస్తా యని చెప్పినట్లయింది.

వ్యా. అన్యదితి :- 'అన్యత్' అనగా ఇక్కడ 'వ్యాపింపదగిన చిత్తం' అని అర్థం. 'సర్వత్ర' అనగా 'అన్ని రసాలలోను అన్ని రచనలోను' అని అర్థం

కా. గుణవృత్త్యా పునస్తేషాం వృత్తిః శబ్దార్థయోర్మతా. 71

వృ గుణవృత్త్యా ఉపచారేణ. తేషామ్ గుణానామ్ ఆకారే శౌర్య స్యేవ.

వ్యా. తేషామ్ = ఆ గుణాలకు, గుణవృత్త్యా పునః = గౌణవృత్తి అనగా ఉపచారంచేత, శబ్దార్థయోః = శబ్దార్థాలలో, వృత్తిః = స్థితి, మతా = అంగీకరించ బడింది.

గుణేతి :- గుణవృత్త్యా = ఉపచారంచేత అనగా ఆరోపంచేత, తేషామ్ = గుణాలకు, శౌర్యాన్ని ఆకారంలో ఆరోపించి నట్లు ఈ గుణాలని శబ్దార్థాలలో ఉన్నట్లు ఆరోపించి ఇవి శబ్దార్థధర్మాలు అని చెప్పడం జరుగుతున్నది.

వృ. కుతస్త్రయ ఏవ న దశ ఇత్యాహ-

కా. కేచిదన్తర్భవన్త్యేషు దోషత్యాగాత్పరే శ్రితాః,
అన్యే భజన్తి దోషత్వం కుత్రచిత్ న తతో దశ. 72

వ్యా. మూడు గుణాలే ఎందుచేత, పది ఎందుకు కాదు అని ఆశంకించు కొని చెపుతున్నాడు.

కేచిదితి :- కేచిత్ = కొన్ని గుణాలు, ఏషు = ఈ మూడు గుణాలలో, అన్తర్భవన్తి = అంతర్భావం చెందుతాయి. కేచిత్ = కొన్ని గుణాలు, దోషత్యా

గాత్ = దోషాభావరూపాలవడంవల్ల, శ్రితాః = అంగీకరించబడినవి. అన్యే = కొన్ని గుణాలు, క్వచిత్ = కొన్ని స్థలాలలో కొన్ని రసాలలో, కొన్ని ఉదాహరణలలో, దోషత్వమ్ = దోషత్వాన్ని, భజన్తి = పొందుతాయి. తతః = అందువలన, దశ = పది, న = కాదు.

అవ. ముందుగా పది శబ్దగుణాలను అంగీకరించవలసిన అవసరం లేదు అని చెపుతున్నాడు.

వృ. బహూనామపి పదానామేకపదవద్భాసమానాత్మా యః శ్లేషః, యశ్చారోహావరోహక్రమరూపః సమాధిః, యా చ వికటత్వలక్షణా ఉదారతా, యశ్చౌజోమిశ్రితశైథిల్యాత్మా ప్రసాదః తేషామోజస్యన్తర్భావః. పృథక్పదత్వరూపం మాధుర్యం భఙ్గ్యా సాక్షాదుపాత్తమ్. ప్రసాదేనార్థవ్యక్తిర్గృహీతా. మార్గాభేదరూపా సమతా క్వచిద్దోషః. తథాహి-"మాతఙ్గాః కిము వల్గితైః" ఇత్యాదౌ సింహాభిధానే మసృణమార్గత్యాగో గుణః- కష్టత్వగ్రామ్యత్వయోర్దుష్టతాభిధానాత్. తన్నిరాకరణేన అపారుష్యరూపం సౌకుమార్యమ్. ఔజ్జ్వల్యరూపా కాన్తిశ్చ స్వీకృతా. ఏవం న దశ శబ్దగుణాః.

వ్యా. వామనుడు చెప్పిన శ్లేష-సమాధి-ఉదారతా-ప్రసాదాలు తాను పైన చెప్పిన ఓజస్సులో అంతర్గతా లవుతాయి. వాటిని స్వతంత్రగుణాలుగా గ్రహింపనవసరం లేదని చెపుతున్నాడు. అనేకపదాలు కూడా ఒక్క పదంలాగ భాసించడం అనే శ్లేష, ఆరోహావరోహ రూపమైన సమాధి, వికటత్వరూపమైన ఉదారత, ఓజోమిశ్రితమైన శైథిల్యం అనే స్వరూపం గల ప్రసాదం- వీటి కన్నింటికీ ఓజస్సులో అంతర్భావం.

వి. వామనుడు "మసృణత్వం శ్లేషః" (3.1.11) అని శ్లేషకు లక్షణం చెప్పి "అనేకపదాలు ఒకే పదంగా (చదువుతున్నప్పుడు) భాసించడం మసృణత్వం" అని మసృణత్వాన్ని నిర్వచించి-

"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః"

అనే కుమారసంభవప్రథమశ్లోకాన్ని దీనికి ఉదాహరణగా ఇచ్చాడు. ఇది పైన చెప్పిన ఓజస్సులో అంతర్గతం అవుతుంది.

వామనుడు సమాధికి "ఆరోహావరోహ క్రమః సమాధిః" (3.1.13) అని లక్షణం చెప్పాడు. ఆరోహం అనగా గాఢత్వం. అవరోహం అనగా శైథిల్యం. వీటికి క్రమం-ముందు ఆరోహం, తరవాత అవరోహం లేదా ముందు అవరోహం తరవాత ఆరోహం- ఈ విధంగా క్రమం, సమాధి అని సోదాహరణంగా నిరూపించాడు. ఇది కూడా ఓజస్సులో అంతర్గతమే.

ఉదారతకు 'వికటత్వముదారతా' (3.1.23) అని లక్షణం చెప్పాడు. ఏది ఉంటే వినేవాళ్ళకి పదాలు నృత్యం చేస్తున్నట్లు అనిపిస్తుందో అదే వికటత్వం అని వివరించి-

"స్వచరణవినిక్షిప్తైర్నూపురైర్నర్తకీనాం
ఝణితి రణితమాసీత్తత్ర చిత్రం కలం చ"

అని వామనుడు ఉదాహరించాడు. అది కూడా ఓజస్సులోనే అంతర్గతం.

వామనుని ప్రకారం బంధశైథిల్యం ప్రసాదం; "శైథిల్యం ప్రసాదః" (3.1.6). అయితే పూర్తి శైథిల్యం దోషం అవుతుంది. అందుచేత ఓజోమిశ్రితమైన శైథిల్యం ప్రసాదం అని చెప్పాలి. అప్పుడు ఇది కూడా ఓజస్సులో అంతర్గతం అయిపోతుంది.

వామనుడు "పృథక్పదత్వం మాధుర్యమ్" (3.1.21) అని మాధుర్యానికి లక్షణం ఇచ్చాడు. అనగా పదాలు విడివిడిగా కనబడడం. ఈ మాధుర్యం. మమ్మటుడు మాధుర్యాన్ని గూర్చి చెప్పేటప్పుడు 'దీనిలో సమాసాలు ఉండకూడదు' అని చెప్పడంచేత దానిలో అంతర్గతం అయిపోతుంది. అనగా మాటలలో భేదం తప్ప వామనుడు చెప్పిన మాధుర్యమూ, మమ్మటుడు చెప్పిన మాధుర్యమూ ఒక్కటే అని అర్థం.

చదివిన వెంటనే అర్థం స్పష్టం అవడం అర్థవ్యక్తి అని ("అర్థవ్యక్తిహేతుత్వమర్థవ్యక్తిః"-3.1.24) వామనుడు చెప్పిన అర్థవ్యక్తి ప్రసాదంచేతనే గ్రహించబడింది.

వామనుడు సమతకు "మార్గాభేదః సమతా" (3.1.12) అని లక్షణం ఇచ్చాడు. ఏ మార్గంచేత ఉపక్రమిస్తే ఆ మార్గంచేతనే చివరివరకూ నడవడం

అని అర్థం. అయితే ఈ విధమైన సమత కొన్ని చోట్ల దోషం అవుతుంది. ఎందు చేతననగా "మాతఙ్గాః కిము" ఇత్యాది శ్లోకంలో (చూ. 299 వ శ్లో) సింహాన్ని గూర్చి చెప్పినప్పుడు మృదుమార్గాన్ని త్యజించడం గుణం. త్యజించకపోతే అది దోషం అవుతుంది.

"కష్టత్వగ్రామ్యత్వాలు దుష్టమైనవి" అని చెప్పడంచేత వాటిని నిరాకరించ డంచేత, అపారుష్యరూపమైన సౌకుమార్యం ఔజ్జ్వల్యరూపమైన కాంతీ కూడా స్వీకరించబడ్డాయి.

"అజరఠత్వం సౌకుమార్యమ్" (3.1.22) అని సౌకుమార్యానికి లక్షణం చెప్పి వామనుడు "బంధంలో పారుష్యం లేకపోవడం సౌకుమార్యం" అని వివ రించారు. కష్టత్వం, అనగా పారుష్యం, దోషం అని చెప్పడంచేత వామనుడు చెప్పిన ఈ సౌకుమార్యం అపారుష్యం అన్నట్లు అయింది. అందుచేత ఇది కష్టత్వ రూపదోషాభావంలో అంతర్గతం.

కాంతికి "ఔజ్జ్వల్యం కాన్తిః" (3.1.25) అని లక్షణం చెప్పి వామనుడు "బంధంలో ఉజ్జ్వలంగా ఉండడం కాంతి" అని వివరించి "కురఙ్గీనేత్రాలీస్తబకితవ నాలీపరిసరః" అని ఉదాహరణం ఇచ్చాడు. గ్రామ్యత్వం దుష్టం అని చెప్పడం చేత ఈ కాంతి గ్రామ్యత్వరూపదోషాభావం అవుతుంది. అందుచేత దీనిని వేరుగా పరిగణించనక్కర్లేదు.

ఈ విధంగా పది శబ్దగుణాలు లేవు; అనగా పది శబ్దగుణాలను అంగీక రించవలసిన పని లేదు.

అవ. శబ్దగుణాలను నిరాకరించి ఇప్పుడు అర్థగుణాలను కూడా నిరాక రిస్తున్నాడు.

> "పదార్థే వాక్యరచనం వాక్యార్థే చ పదాభిధా,
> ప్రౌఢిర్వ్యాససమాసౌ చ సాభిప్రాయత్వమస్య చ".

ఇతి యా ప్రౌఢిరిత్యుక్తం తత్ వైచిత్ర్యమాత్రమ్. న గుణః. తద భావేఽపి కావ్యవ్యహారప్రవృత్తేః. అపుష్టార్థత్వాధికపదత్వానవీకృత త్వామఙ్గలరూపాశ్లీలగ్రామ్యాణాం నిరాకరణేన చ సాభిప్రాయత్వమోజః,

అర్థవైమల్యాత్మా ప్రసాదః, ఉక్తివైచిత్ర్యరూపం మాధుర్యమ్, అపారుష్యరూపం సౌకుమార్యమ్, అగ్రామ్యత్వరూపా ఉదారతా చ స్వీకృతాని. అభిధాస్యమానస్వభావోక్త్యలంకారేణ రసధ్వనిగుణీభూతవ్యఙ్గ్యాభ్యాం చ వస్తుస్వభావస్ఫుటత్వరూపా అర్థవ్యక్తిః, దీప్తరసత్వరూపా కాన్తిశ్చ స్వీకృతా. క్రమకౌటిల్యోల్బణత్వోపపత్తియోగరూపఘటనాత్మా శ్లేషోఽపి విచిత్రత్వమాత్రమ్. అవైషమ్యరూపా సమతా దోషాభావమాత్రం న పునర్గుణః. కః ఖల్వనున్మత్తః అన్యస్య ప్రస్తావే అన్యదభిదధ్యాత్. అర్థస్య అయోనేరచ్ఛాయాయోనేర్వా యది న భవతి దర్శనం తత్కథం కావ్యమ్? ఇత్యర్థదృష్టిరూపః సమాధిరపి న గుణః.

కా. తేన నార్థగుణా వాచ్యాః.

వృ. వాచ్యాః వక్తవ్యాః.

వ్యా. పదార్థే ఇతి:- "పదార్థే=ఒకపదంచేత చెప్పదగిన అర్థంలో (అర్థం చెప్పడానికి), వాక్యరచనమ్ = వాక్యాన్ని రచించడం, వాక్యార్థే = వాక్యార్థమునందు, పదాభిధా = పదంచేత చెప్పడం, వాక్యంచేత చెప్పవలసిన అర్థాన్ని ఒక పదంతో చెప్పడం, వ్యాససమాసౌ చ=విస్తరించి చెప్పడం, సంక్షిప్తంగా చెప్పడం, అస్య = విశేషణంయొక్క, సాభిప్రాయత్వమ్ = అభిప్రాయంతో కూడి ఉండడం, ప్రౌఢిః = ప్రౌఢి. అనగా ఈ విధంగా ప్రౌఢి ఐదు విధాలు. ఈ ప్రౌఢియే ఓజస్సు అని ఏది చెప్పబడిందో అది కేవలం చెప్పే విధానంలో వైచిత్ర్యమే కాని గుణం కాదు. అది లేకపోయినా కావ్యవ్యవహారం ఉంటూన్నది కదా.

పైన చెప్పిన ఐదువిధాలైన ప్రౌఢి ఓజస్సు అనే అర్థగుణం అని వామనుడు చెప్పినాడు. ప్రౌఢిలోని మొదటి నాలుగు భేదాలూ కూడ వైచిత్ర్యం మాత్రమే కాని గుణం కాదు. ఇవి లేకపోయినా కావ్యాన్ని కావ్యం అంటూనే ఉన్నారు కదా. కావ్యవ్యవహారానికి హేతువులైనవే గుణాలు అని చెప్పే వామనాదుల మతం ప్రకారం కావ్యవ్యవహారానికి కారణం కాని ఓజస్సు (ప్రౌఢికి సంబంధించిన నాలుగు భేదాలు) గుణం కాకూడదు కదా అని భావం.

అవ. ఇప్పుడు ప్రౌఢిలో ఐదవ భేదం అయిన సాభిప్రాయత్వం, ప్రసాదం,

మాధుర్యం, సౌకుమార్యం, ఉదారతా కూడ స్వతంత్రార్థగుణాలు కావని ప్రతి పాదిస్తున్నాడు.

అపుష్టార్థత్వేతి :- అపుష్టార్థత్వ-అధికపదత్వ-అనవీకృతత్వ-అమంగళ రూపాశ్లీల-గ్రామ్యాలు నిరాకరించడంచేత, వీటిని దోషాలుగా పరిగణించి ఇవి త్యాజ్యమైనవి అని చెప్పడంచేత (ప్రౌఢిలో ఐదవభేదమైన) సాభిప్రాతత్వరూపమైన ఓజస్సు, అర్థవైమల్యరూపమైన, అనగా అపేక్షించిన అర్థాన్ని మాత్రమే పరిగ్రహించడం అనే, ప్రసాదమూ, ఉక్తివైచిత్ర్యరూపమైన, అనగా ఒకే అర్థాన్ని భంగ్యంతరంచేత మళ్ళీ చెప్పడం అనే, మాధుర్యమూ, అపారుష్యరూపమైన, అనగా పరుషమైన అర్థాన్ని చెప్పకపోవడం అనే, సౌకుమార్యమూ, అగ్రామ్యత్వరూపమైన, అనగా గ్రామ్యార్థం చెప్పవలసినప్పుడు కూడ వైదగ్ధ్యంతో చెప్పడం అనే, ఉదారత్వమూ స్వీకరింపబడిపోయినవి.

సాభిప్రాయత్వం అపుష్టార్థత్వాభావరూపం. ప్రసాదం అధికపదత్వాభావరూపం. మాధుర్యం అనవీకృతత్వాభావరూపం. సౌకుమార్యం అమంగలరూపాశ్లీలాభావరూపం. ఉదారత గ్రామ్యత్వాభావరూపం. ఈ విధంగా వీటిని స్వతంత్ర గుణాలుగా అంగీకరించ వలసిన పని లేదు అని అర్థం.

అభిధాస్యమానేతి :- వస్తుస్వభావస్ఫుటత్వరూపమైన, అనగా వస్తువుయొక్క స్వభావం స్పష్టంగా కనబడడం అనే, అర్థవ్యక్తి (దశమోల్లాసంలో)చెప్పబడ నున్న స్వభావోక్త్యలంకారంచేత, దీప్తరసత్వరూపమైన కాంతి రసధ్వనిచేత గాని, గుణీభూతవ్యంగ్యంచేత గాని స్వీకరించబడతాయి. అనగా ఈ రెండూ వాటిలో అంతర్గతాలు అవుతాయి.

క్రమేతి :- అర్థగుణమైన శ్లేషకి వామనుడు "ఘటనా శ్లేషః" (3.2-4) అని లక్షణం చెప్పి దానిని "క్రమకౌటిల్యానుల్బణత్వోపపత్తియోగో ఘటనా" అని వివరించాడు. క్రియల పరంపరలో కౌటిల్యం, అనగా చతురచేష్టాజనితమైన చమత్కారం, ఆ క్రియల అస్పష్టత్వం (ఆ పనులు ఎందుకు చేశాడో తెలియక పోవడం), ఉపపత్తి, అనగా ఆ క్రియాపరంపరను సమర్థించే యుక్తి కలిస్తే శ్లేష అని అర్థం. ఈ శ్లేష కూడ కవివైదగ్ధ్యాన్ని సూచించే వైచిత్ర్యం మాత్రమే; గుణం కాదు.

అవైషమ్యేతి :- అవైషమ్యరూపమైన సమత దోషాభావమాత్రమే. గుణం కాదు. ఉన్మత్తుడు కానివాడు ఎవడైన ఒకటి చెప్పడానికి ప్రారంభించి మరొక విషయం చెపుతాడా ?

ఉపక్రమించినదానిని ఉపసంహారంలో పరిత్యజించడం వైషమ్యం. ఇదే ప్రక్రమభంగం అనే దోషం. ఈ వైషమ్యం లేకపోవడమే సమత. అందుచేత ఇది ప్రక్రమభంగరూపదోషాభావమే కాని స్వతంత్రగుణం కాదు.

అర్థస్యేతి :- అయోని కాని, అన్యచ్ఛాయాయోని కాని అయిన అర్థం యొక్క దర్శనం కాకపోతే అది కావ్యం ఎలా అవుతుంది. అందుచేత అర్థదృష్టి రూపమైన సమాధి కూడా గుణం కాదు.

వి. వామనుడు 'సమాధి'అనే అర్థగుణానికి "అర్థదృష్టిః సమాధిః"(3-2-7) అని లక్షణం చెప్పాడు. "అయోని, అన్యచ్ఛాయాయోని అని రెండు విధాలైన అర్థం చూడడం సమాధి" అని దాని అర్థం. అయోని అనగా కవి తాను స్వయంగా కల్పించిన అర్థం. పూర్వం కవిసంప్రదాయంలో లేనిది. ప్రాచీనకవిపరంపరా ప్రాప్తమై కొంచెం మార్చి చెప్పబడిన అర్థం అన్యచ్ఛాయాయోని. వీటి దర్శనం సమాధి అని వామనుని అభిప్రాయం. అయితే ఈ విధమైన అర్థం ఏదో ఒకటి లేకపోతే ఇంక కావ్యం ఏమిటి ? అందుచేత ఇది కావ్యస్వరూపనిర్వాహకమే కాని గుణం కాదు అని మమ్మటుని అభిప్రాయం.

వ్యా. తేనేతి :- తేన = ఆ కారణంచేత, అర్థగుణాః = అర్థగుణాలు, న వాచ్యాః=చెప్పదగినవి కావు. 'వాచ్యాః' అనగా 'వక్తవ్యాః'=వేరుగా చెప్పదగినవి కావు.

కా. ప్రోక్తాః శబ్దగుణాశ్చ యే,
వర్ణాః సమాసో రచనా తేషాం వ్యఞ్జకతామితాః. 73

వ్యా. యే = ఏ, మాధుర్యౌజఃప్రసాదాలనే, శబ్దగుణాః = శబ్దగుణాలు, ప్రోక్తాః = చెప్పబడినవో, వాస్తవంలో రసధర్మాలే అయినా ఉపచారంచేత శబ్ద గుణాలుగా ఏవి చెప్పబడ్డాయో అని అర్థం, తేషామ్ = ఆ గుణాలకు, వర్ణాః = వర్ణాలు, సమాసః = సమాసము, రచనా=రచన, వ్యఞ్జకతామ్=వ్యంజకత్వాన్ని,

ఇతాః = పొందినవి. అనగా వర్ణసమాసరచనలు ఆ గుణాలను వ్యంజింపచేస్తాయి;. అందుచేతనే అవి శబ్దగుణా లని ప్రసిద్ధి ఏర్పడింది అని భావం.

వృ. కే కస్య ఇత్యాహ-

కా. మూర్ధ్ని వర్గాన్త్యగాః స్పర్శా అటవర్గా రణౌ లఘూ,
అవృత్తిర్మధ్యవృత్తిర్వా మాధుర్యే ఘటనా తథా. 74

వృ. టఠడఢవర్జితాః కాదయో మాన్తాః శిరసి నిజవర్గాన్త్యయుక్తాః, తథా రేఫణకారౌ హ్రస్వాన్తరితావితి వర్ణాః, సమాసాభావో, మధ్యమః సమాసో వేతి సమాసః, తథా మాధుర్యవతీ పదాన్తరయోగేన రచనా మాధుర్యస్య వ్యఞ్జికా. ఉదాహరణమ్–

శ్లో॥ అనఙ్గరఙ్గప్రతిమం తదఙ్గం
భఙ్గీభిరఙ్గీకృతమానతాఙ్గ్యాః,
కుర్వన్తి యూనాం సహసా యథైతాః
స్వాన్తాని శాన్తాపరచిన్తనాని. 347

వ్యా. కే ఇతి :- ఏవి దేనికి వ్యంజకాలో చెప్తున్నాడు–

మూర్ధ్ని ఇతి :- అటవర్గాః = టవర్గభిన్నమైనవి, మూర్ధ్ని = అగ్రభాగంలో, వర్గాన్త్యగాః = వర్గాంత్యాక్షరాలను, అనగా క-చ-ట-త-ప వర్గాల చివరి అక్షరాలైన ఙ, ఞ, ణ, న, మ అనే అక్షరాలను పొందినవి అయిన, స్పర్శాః = క మొదలు మ వరకు ఉన్న అక్షరాలు, లఘూ = లఘువులైన, రణౌ = రేఫణకారాలు, అవృత్తిః = అల్పసమాసం, మధ్యవృత్తిః వా = లేదా మధ్యమసమాసం, అతిదీర్ఘం కాని సమాసం, తథా = అట్టి, అనగా మాధుర్యం గల, ఘటనా = కూర్పు, మాధుర్యే = మాధుర్యగుణమునందు, (వ్యఞ్జకతామ్ ఇతాః = వ్యంజకత్వాన్ని పొందుతాయి).

టేతి :- ట, ఠ, డ, ఢ లు మినహాయించి కాదిమాంతవర్ణాలు, శిరస్సునందు (ప్రారంభంలో) తమ వర్గకు చెందిన పంచమాక్షరంతో కూడిన (స్పర్శలు-కాదిమాంతవర్ణాలు), మరియు హ్రస్వాచ్చుచేత అంతరితాలైన అనగా లఘువులైన

అచ్చులతోకూడిన రేఫణకారాలు, ఈ విధంగా పైన చెప్పిన వర్ణాలు, సమాసాభావం కాని, ఇక్కడ 'సమాసాభావం' (అనగా అల్పమైనసమాసం అని అర్థం చెప్పాలని వ్యాఖ్యాతలు) లేదా మధ్యమసమాసం కాని అని సమాసమూ, తథా = ఇతరపదాలతో యోగంచేత మాధుర్యం గల, అనగా సుకుమారమైన, రచన, ఇవి మాధుర్యవంజకాలు. ఉదాహరణం ఎట్లనగా—

అనఙ్గేతి :- ఆనతాఙ్గ్యాః = కొంచెం వంగిన శరీరం గల ఆమెయొక్క, అనఙ్గరఙ్గప్రతిమమ్ = మన్మథుని నృత్యస్థానంతో సమానమైన, తత్ = ఆ, అఙ్గమ్ = శరీరము, భఙ్గీభిః = (వశీకరణహేతువులైన) భంగిమలచేత, అఙ్గీకృతమ్ = అంగీకరించబడినది. ఆ భంగిమలు వాటంతట అవే వచ్చి ఈ శరీరాన్ని ఆశ్రయిస్తున్నాయి. యథా = ఎట్లనగా, ఏతాః = ఈ భంగులు, యూనామ్ = యువకుల యొక్క, స్వాన్తాని = మనస్సులను, సహసా = వెంటనే, శాన్తాపరచిన్తనాని = శాంతించిన ఇతరఆలోచనలు కలవాటినిగా, కుర్వన్తి = చేస్తున్నాయి.

వి ఇక్కడ గకారాలకీ, తకారాలకీ వాటి పంచమవర్ణాలు మొదటఉన్నాయి. హ్రస్వంతో కూడిన రేఫ ఉన్నది. 'అనఙ్గరఙ్గప్రతిమమ్' అని మధ్యమసమాసం, నాతిదీర్ఘమైన సమాసం, 'అఙ్గం భఙ్గీభిః' అని మాధుర్యం గల రచన ఉన్నాయి. ఈ విధంగా ఈ శ్లోకంలో వర్ణాలు, సమాసం, రచన ఇవన్నీ విప్రలంభశృంగారానికి అనుగుణంగా ఉన్నాయి.

అవ. ఓజోగుణవ్యంజకాలను చెపుతున్నాడు—

కా. యోగ ఆద్యతృతీయాభ్యామన్త్యయో రేణ తుల్యయోః,
టాదిః శషౌ వృత్తిదైర్ఘ్యం గుమ్ఫ ఉద్ధత ఓజసి. 75

వృ. వర్గప్రథమతృతీయాభ్యామ్ అన్త్యయోః ద్వితీయచతుర్థయోః, రేఫేణ అధః ఉపరి, ఉభయత్ర వా, యస్య కస్య చిత్ తుల్యయోః తేన తస్యైవ సంబన్ధః, టవర్గః, అర్థాత్ ణకారవర్జితః, శకారషకారౌ, దీర్ఘసమాసః, వికటా సంఘటనా ఓజసః. ఉదాహరణమ్- "మూర్ధ్నాముద్వృత్తకృత్త" ఇత్యాది. 348

వ్యా. యోగ ఇతి :- ఆద్యతృతీయాభ్యామ్ = మొదటి మూడవ వర్గాక్ష

రాలతో, కగచజటడతదపబ- లతో, అన్త్యయోః = వాటి చివరివాటికి, ద్వితీయ చతుర్థాక్షరాలకు, ఖఘఛఝఠఢథధఫభ-లకు, యోగః = కలయిక 'పుచ్ఛ' 'బద్ధ' ఇత్యాదులు ఉదాహరణం. రేణ=రేఫతో యోగము, ఒక అక్షరానికి మొదట గాని, చివర గాని, రెండు ప్రక్కలా గాని రేఫ ఉండడం 'వక్త్ర' 'అర్క' 'నిర్హ్రాద' మొదలైనవి ఉదాహరణలు. తుల్యయోః = సమానవర్ణములయొక్క యోగమూ, 'దిక్కాల' 'చిత్త' ఇత్యాదులు ఉదాహరణం, టాదిః=టమొదలైన నాలుగువర్ణాలు, శషౌ = శకారషకారాలు, వృత్తిదైర్ఘ్యమ్ = సమాసదీర్ఘత్వం అనగా దీర్ఘసమాసం, ఉద్ధతః = ఉద్ధతమైన, వికటమైన, గుమ్ఫః = రచన, ఇవి, ఓజసి=ఓజస్సునందు, వ్యఞ్జకతామ్ ఇతాః = వ్యంజకత్వాన్ని పొందుతాయి.

వర్గేతి :- వర్గప్రథమతృతీయవర్ణాలతో, అన్త్యయోః = ద్వితీయచతుర్థ వర్ణాలకీ, ఏవర్ణానికైనా మొదట గాని, చివర గాని, రెండు ప్రక్కలా గాని రేఫతో యోగం, ఒక వర్ణానికి ఆ వర్ణంతోనే సంబంధం, టవర్గ, అనగా ణకారం మినహా యించిన టవర్గ, శకారషకారాలు, దీర్ఘసమాసం, వికటమైన సంఘటన ఇవి ఓజ స్సుకు వ్యంజకాలు, "మూర్ధ్నాముద్వృత్తకృత్త" మొదలైన శ్లోకం (చూ. 159వ శ్లోకం) ఉదాహరణం, 'మూర్ధ్నామ్' 'ఉత్సర్పి' 'దర్ప'అనే పదాలలో రేఫతో పైన యోగం, 'అఙ్ఘ్రి' అనే పదంలో చివర యోగం, 'ఉద్వృత్త' 'కృత్త' అనే పదాలలో తకారానికి తకారంతో యోగం, 'ఈశ' 'పిశున' శబ్దాలలో శకారం, 'దోష్ణామ్' అనే పదంలో షకారం, సమాసదైర్ఘ్యం, ఉద్ధతమైన రచన ఈ శ్లోకంలో స్పష్టంగా ఉన్నాయి. "వటురటత్రూత్కారధారః కుఠారః" ఇత్యాదులలో టవర్గ ప్రయోగం.

అవ. ప్రసాదాన్ని గూర్చి చెపుతున్నాడు-

కా. శ్రుతిమాత్రేణ శబ్దాత్తు యేనార్థప్రత్యయో భవేత్,
సాధారణః సమగ్రాణాం స ప్రసాదో గుణో మతః. 76

వృ. సమగ్రాణాం రసానాం సంఘటనానాం చ. ఉదాహరణమ్.

శ్లో॥ పరిమ్లానం పీనస్తనజఘనసంగాదుభయత
స్తనోర్మధ్యస్యాన్తః పరిమిలనమప్రాప్య హరితమ్,

ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజలతాక్షేపవలనైః
కృశాఙ్గ్యాః సంతాపం వదతి బిసినీపత్రశయనమ్. 349

వ్యా. శ్రుతీతి :- యేన = దేనిచేత, శబ్దాత్ = శబ్దంవల్ల, శ్రుతిమాత్రేణ = వినినంతమాత్రంచేతనే, అర్థప్రత్యయః = అర్థజ్ఞానం, భవేత్ = అగునో, సః = అది, సమగ్రాణామ్ = అన్నింటికీ, సాధారణః = సాధారణమైన, ప్రసాదః గుణః = ప్రసాదగుణంగా, మతః = చెప్పబడినది.

సమగ్రాణామితి :- సమగ్రాణామ్ = సమస్తమైన రసాలకీ, సంఘటనలకు కూడ అని అర్థం. ఉదాహరణం ఎట్లనగా-

పరిమ్లానమితి :- రత్నావళిలో సాగరికను గూర్చి రాజు అంటూన్న మాటలు. పీనస్తనజఘనసంగాత్ = బలిసిన స్తనాలయొక్క జఘనంయొక్క సంబంధవల్ల, ఉభయతః = ఆ రెండూ అనిన రెండు చోట్లయందు, పరిమ్లానమ్ = వాడిపోయినదీ, తనోః = కృశించిన, మధ్యస్య = నడుముయొక్క, అన్తః = మధ్యయందు, పరిమిలనమ్ = (శరీరంతో) సంబంధాన్ని, అప్రాప్య = పొందక, హరితమ్ = ఆకుపచ్చగా ఉన్నదీ, శ్లథభుజలతాక్షేపవలనైః = శిథిలంగా (పట్టులేకుండా) భుజలతలను పడవేయడంచేత, దొర్లడాలచేతా, వ్యస్తన్యాసమ్ = తారుమారు చేయబడిన కూర్పు గలదీ ఆయిన, బిసినీపత్రశయనమ్ = తామరాకుల శయనం, కృశాఙ్గ్యాః = సన్నని శరీరం గల ఆమెయొక్క, సంతాపమ్ = సంతాపాన్ని, వదతి = చెప్పుచున్నది.

వి. ఈ శ్లోకంలో అన్వయానుగుణంగా పదాల కూర్పు ఉన్నది. అందుచేత చదివిన వెంటనే అర్థజ్ఞానం కలుగుతుంది. ఇది ప్రసాదం. "సంగాత్కృశాఙ్గ్యాః" ఇత్యాదులలో మాధుర్యానికి తగిన వర్ణాలు, మధ్యమసమాసం, అనుద్ధతమైన రచన ఉన్నాయి. ఇది శృంగారరసానికి సంబంధించిన ప్రసాదం.

వృ. యద్యపి గుణపరతన్త్రాః సంఘటనాదయః, తథాపి-

కా. వక్తృవాచ్యప్రబన్ధానామౌచిత్యేన క్వచిత్ క్వచిత్,
రచనావృత్తివర్ణానామన్యథాత్వమపీష్యతే. 77

వ్యా- యద్యపీతి :- సంఘటనాదులు, సంఘటన-వర్ణ-సమాసాలు, గుణాధీనాలే అయినా, గుణాలను వట్టి కూర్చవలసినవే అయినా-

వక్త్రితి :- క్వచిత్ = కొన్నిచోట్ల, వక్తృవాచ్యప్రబన్ధానామ్ = వక్త యొక్క, వాచ్యంయొక్క, అనగా కవి చెప్పే అర్థంయొక్క, ప్రబంధంయొక్క, ఔచిత్యేన = ఔచిత్యంచేత, రచనావృత్తివర్ణానామ్ = సంఘటనకు, సమాసానికి, వర్ణాలకీ, అన్యథాత్వమ్=మరొక విధంగా ఉండడం కూడ, ఇష్యతే=అంగీకరించబడుతుంది.

రచనాదులు గుణవ్యంజకా లనేది సామాన్యంగా చెప్పిన విషయం. వక్త, అర్థం, ప్రబంధం, వీటిని వట్టి రచనాదులు, గుణాలకు విరుద్ధంగా ఉండే అవకాశం ఉంది. అందుచేత రచనాదులు గుణవ్యంజకా లనే నియమం వక్తమొదలైనవాటి ఔచిత్యానికి భంగం కలగ నప్పుడే అని అర్థం.

వృ. క్వచిద్వాచ్యప్రబన్ధాపేక్షయా వక్త్రౌచిత్యాదేవ రచనాదయః. యథా-

శ్లో॥ మన్థాయస్తార్ణవామ్భఃప్లుతకుహరచలన్మన్దరధ్వానధీరః
కోణాఘాతేషు గర్జత్ప్రలయఘనఘటాన్యోన్యసంఘట్టచణ్డః,
కృష్ణాక్రోధాగ్రదూతః కురుకులనిధనోత్పాతనిర్ఘాతవాతః
కేనాస్మత్సింహనాదప్రతిరసితసఖో దున్దుభిస్తాడితోఽసౌ.

వృ. అత్ర హి న వాచ్యం క్రోధాదివ్యఞ్జకమ్. అభినేయార్థం చ కావ్యమితి తత్ప్రతికూలా ఉద్ధతా రచనాదయః. వక్తా చాత్ర భీమసేనః.

వ్యా. క్వచిదితి :- కొన్ని చోట్ల వాచ్య-ప్రబంధాల అపేక్ష లేకుండానే అనగా వాచ్యమైన విషయం ప్రబంధమూ ఎట్లా ఉన్నా, వక్తయొక్క ఔచిత్యాన్ని వట్టి రచనాదులు ఉంటాయి. ఎట్లనగా-

మన్థేతి :- వేణీసంహారంలో రణరంగంనుంచి బయలుదేరిన దుందుభి ధ్వనిని విని భీమసేనుడు ప్రశ్నిస్తున్నాడు- "మన్థా........ధీరః"- మన్థ = మథించడంచేత, ఆయస్త = క్షోభింపచేయబడినది, అర్ణవ = సముద్రంయొక్క, అమ్భః = ఉదకంతో, ప్లుత = వ్యాప్తములైన, కుహర=గుహలు గల, చలత్ = చలించు

చున్న, మన్దర = మందరపర్వతంయొక్క, ధ్వాన = ధ్వని వలె, ధీరః = ధీరమూ, కోణాహతేషు = దండంచేత కొట్టడములయందు (దండంతో కొట్టినప్పుడు), "గర్జత్.........చణ్డః"- గర్జత్ = గర్జిస్తూన్న, ప్రలయ = ప్రలయకాలమునందలి, ఘనఘటా = మేఘసముదాయంయొక్క, అన్యోన్యసంఘట్ట = పరస్పరమూ ఢీకొనడం వలె, చణ్డః = తీవ్రమూ, కృష్ణాక్రోధాగ్రదూతః = ద్రౌపదియొక్క క్రోధం యొక్క ముందు పంపబడిన దూత, కురుకులనిధనోత్పాతనిర్ఘాతవాతః = కురువంశవినాశాన్ని సూచించే ఉత్పాతరూప మైన నిర్ఘాతవాయువు; రాబోయే వినాశాన్ని సూచించేది 'ఉత్పాతం'. మేఘవాయువుల సంఘట్టనంవల్ల పుట్టిన అశుభ సూచకమైన శబ్దం 'నిర్ఘాతం'. అస్మత్సింహనాదప్రతిరసితసఖః = మా సింహనాదప్రతిధ్వనికి మిత్రము, అనగా ప్రతిధ్వనితో సమానము, అయిన, అసౌ = ఆ, దున్దుభిః = దుందుభి, కేన = ఎవనిచేత, తాడితః = కొట్టబడినది, మ్రోగించబడింది?

అత్రేతి :- ఇక్కడ వాచ్యమైన అర్థం క్రోధాదులను వ్యంజింపచేసేది కాదు. కావ్యం అభినయించదగిన అర్థం కలది. చతుర్విధాభినయం ద్వారా అర్థాన్ని బోధించవలసిన నాటకాది ప్రబంధాలలో దీర్ఘసమాసాదిప్రయోగంవల్ల అర్థప్రతీతి శీఘ్రంగా కలగదు అని అర్థం. అందుచేత ఇక్కడ ఉన్న రచనాదులు వీటికి ప్రతికూలంగానే ఉన్నాయి. అయినా ఇక్కడ వక్త భీమసేనుడు అవడంచేత ఇలాంటి రచన యుక్తమే.

వృ. 'క్వచిద్వక్తృప్రబన్ధానపేక్షయా వాచ్యౌచిత్యాదేవ రచనాదయః. యథా-

శ్లో॥ ప్రౌఢచ్ఛేదానురూపోచ్ఛలనరయభవత్సైంహికేయోపఘాత
త్రాసాకృష్టాశ్వతిర్యగ్వలితరవిరథేనారుణేనేక్ష్యమాణమ్,
కుర్వత్ కాకుత్స్థవీర్యస్తుతిమివ మరుతాం కన్దరారన్ధ్రభాజాం
భాంకారైర్భీమమేతన్నిపతతి వియతః కుమ్భకర్ణోత్తమాఙ్గమ్.

వ్యా. క్వచిదితి :- కొన్నిచోట్ల రచనాదులు, వక్త అపేక్ష గాని, ప్రబంధం అపేక్ష గాని లేకుండా వాచ్యమైన అర్థం ఔచిత్యాన్నిపట్టి ఉంటాయి. ఎట్లనగా-

ప్రౌఢేతి :- ఇది 'ఛలితరామం' అనే నాటకంలోని పద్యం అని అంటారు.

"ప్రౌఢ.... ... రథేన" ప్రౌఢ = ప్రౌఢమైన, వేగంతో కూడిన, ఛేద = ఛేదించ డానికి, అనురూప = తగిన, ఉచ్చలనరయ = పైకి ఎగిరే వేగంవల్ల, భవత్ = కలిగిన, సైంహికేయోపఘాతత్రాస = రాహ్వాక్రమణం వల్ల భయంచేత, ఆకృష్ట = వెనుకకు లాగబడిన, అశ్వ = గుఱ్ఱాలచేత, తిర్యగ్వలిత = అడ్డంగా త్రిప్ప బడిన, రథేన = రథం గల, అరుణేన = సూర్యునిచేత, ఈక్ష్యమాణమ్ = చూడ బడుతూన్నదీ, కన్దరారన్ధ్రభాజామ్ = కంఠరంధ్రాలను పొందిన, రంధ్రాలలో ప్రవే శించిన, మరుతామ్ = వాయువులయొక్క, భాంకారైః = భాంకారాలచేత, కాకుత్స్థ వీర్యస్తుతిమ్ = శ్రీరాముని పరాక్రమంయొక్క స్తుతిని, కుర్వత్ ఇవ = చేస్తూన్నదా అన్నట్లు ఉన్న, ఏతత్ = ఈ, కుమ్భకర్ణోత్తమాఙ్గమ్ = కుంభకర్ణుని శిరస్సు, వియతః = ఆకాశంనుండి, నిపతతి = పడుచున్నది.

వి. ఇక్కడ వక్త వైతాళికుడు. ప్రబంధం అభినేయాత్మకం. అందుచేత దీర్ఘసమాసాలతో ఉద్ధతరచన యుక్తం కాదు. అయినా కుంభకర్ణుని శిరస్సు భయంకరం అయినది అవడంచేత వర్ణించబడే దాని ఔద్ధత్యానికి అనుగుణంగా ఉద్ధతరచనాదులు చేయబడ్డాయి.

వృ. క్వచిద్వక్తృవాచ్యానపేక్షాః ప్రబన్ధోచితా ఏవ తే. తథాహి- ఆఖ్యాయికాయాం శృఙ్గారేఽపి న మసృణవర్ణాదయః. కథాయాం రౌద్రేఽపి నాత్యన్తముద్ధతాః నాటకాదౌ రౌద్రేఽపిన దీర్ఘసమాసాదయః. ఏవమన్యదప్యౌచిత్యమ్ అనుసర్తవ్యమ్.

ఇతి కావ్యప్రకాశే గుణాలంకారభేదనియతగుణనిర్ణయో నామ
అష్టమ ఉల్లాసః

వ్యా. క్వచిదితి :- కొన్ని చోట్ల ఆ రచనాదులు వక్తృవాచ్యాల అపేక్ష లేకుండా, ప్రబంధానికి ఉచితంగా ఉండే టట్లు కూర్చబడతాయి. ఎట్లనగా-ఆఖ్యా యికలో శృంగారరసం వ్యంగ్యం అయినప్పుడు కూడా మృదువర్ణాదులు ప్రయో గించబడవు. కథలో రౌద్రరసంలో కూడా అంతగా ఉద్ధతమైన రచనాదులు ఉండవు. నాటకాదులలో రౌద్రంలో కూడా దీర్ఘసమాసాదులు ఉండవు. ఈ విధంగా ఇతరమైన ఔచిత్యాన్ని కూడా పాటించాలి.

'ఆఖ్యాయిక' 'కథ' అనేవి గద్యకావ్యభేదాలు. బాణాదుల హర్షచరితాదులు ఆఖ్యాయికలు. బాణాదుల కాదంబర్యాదులు కథలు. వీటి లక్షణాదులు భామహ కావ్యాలంకార- కావ్యాదర్శ-సాహిత్యదర్పణాదులనుండి తెలుసుకొనవచ్చును. వీటి లక్షణాలను పట్టి రచనాదులు ఉండాలి అని అర్థం. దృశ్యకావ్యాలైన నాటకాదుల్లో కూడా ఝటిత్యర్థస్ఫూర్తివిఘాతకాలవడంచేత దీర్ఘసమాసాదులు ఉపయోగించ కూడదు అని అర్థం.

"బాలానందిని' అను కావ్యప్రకాశవ్యాఖ్యానంలో గుణాలంకారభేద-నియత గుణనిర్ణయం అనే అష్టమోల్లాసం సమాప్తం.

# అథ నవమ ఉల్లాసః

వృ. గుణవివేచనే కృతే అలంకారాః ప్రాప్తావసరాః ఇతి సంప్రతి శబ్దాలంకారానాహ-

కా. యదుక్తమన్యథా వాక్యమన్యథాన్యేన యోజ్యతే,
శ్లేషేణ కాక్వా వా జ్ఞేయా సా వక్రోక్తిస్తథా ద్విధా. 79

వృ. తథేతి శ్లేషవక్రోక్తిః కాకువక్రోక్తిశ్చ.

వ్యా. గుణేతి :- గుణాల వివేచనం చేసిన పిమ్మట అలంకారాలను గూర్చి చెప్పవలసి ఉంది. అందుచేత ఇప్పుడు శబ్దాలంకారాలను చెపుతున్నాడు.

యదితి :- (ఒక వక్తచేత), అన్యథా = మరియొక అభిప్రాయంచేత, ఉక్తమ్ = చెప్పబడిన, యత్ = ఏ, వాక్యమ్ = వాక్యం, అన్యేన = మరియొకని చేత, శ్లేషేణ = శ్లేషచేత గాని, కాక్వా వా = కాకుస్వరంచేత గాని, అన్యథా = మరియొక విధంగా, యోజ్యతే = కూర్చబడుతుందో, దానికి మరొకవిధంగాఅర్థం చెప్పబడుతుంది అని అర్థం, సా = అది, తథా = ఆ విధంగా, అనగాశ్లేషమూలకమూ, కాకుమూలకమూ అని, ద్విధా = రెండు విధములు.

తథేతి :- తథా అనగా శ్లేషవక్రోక్తి కాకువక్రోక్తి అని అర్థం.

వృ. తత్ర పదభఙ్గశ్లేషేణ యథా-

శ్లో॥నారీణామనుకూలమాచరసి చేజ్జానాసి కశ్చేతనో
వామానాం ప్రియమాదధాతి హితకృన్నైవాబలానాం భవాన్,
యుక్తం కిం హితకర్తనం నను బలాభావప్రసిద్ధాత్మనః
సామర్థ్యం భవతః పురన్దరమతచ్ఛేదం విధాతుం కుతః. 352

వ్యా సభంగపదశ్లేష, అభంగపదశ్లేష అని శ్లేష రెండు విధాలు. అందు

చేత శ్లేషమూలకవక్రోక్తి కూడ రెండు విధాలు.

తత్రేతి :- వాటిలో పదభంగశ్లేషవక్రోక్తికి ఉదాహరణం ఎట్లనగా-

నారీణామితి :- నారీణామ్ = స్త్రీలకు, అనుకూలమ్ = అనుకూలంగా, ఆచరసి చేత్ = ఆచరించినట్లయితే, జానాసి=నీవు ఎరుగుదువు. నీవు విజ్ఞుడవు, విజ్ఞుడైనవాడే స్త్రీలకు అనుకూలంగా ప్రవర్తించుకుంటాడు అని భావం. ఇది వక్త అభిప్రాయం. దీనికి- "అరీణామ్ = శత్రువులకు, అనుకూలమ్=అనుకూలంగా, నాచరసి చేత్ = (నువ్వు) ఆచరించకపోతే, జానాసి" అని అర్థం గ్రహించి శ్రోత అంటున్నాడు- చేతసః=జ్ఞానవంతుడు, కః=ఎవడు, వామానామ్=ప్రతికూలంగా ఉన్నవాళ్ళకి, (శత్రువులకు), ప్రియమ్ = ప్రియమును, ఆదధాతి = చేయును ? 'వామానామ్' అనే పదానికి 'స్త్రీలకు' అని అర్థం గ్రహించి మొదటివాడు మళ్ళీ అంటున్నాడు- భవాన్ = నీవు, అబలానామ్ = స్త్రీలకు, హితకృత్ = హితం చేసేవాడవు, నైవ=కావు. రెండవవాడు 'అబలానామ్' అనే పదానికి "బలంలేనివాళ్లకు" అనీ, 'హితకృత్' అనే పదానికి "హితం కృన్తతీతి హితకృత్" అనే విగ్రహంచేత హితాన్ని ఛేదించేవా డనీ అర్థం గ్రహించి అంటున్నాడు- నను=ఓయీ! బలాభావప్రసిద్ధాత్మనః = బలం లేకపోవడంచేత ప్రసిద్ధమైన స్వరూపంకలవానియొక్క, అనగా బలం లేనివాడుగా ప్రసిద్ధుడైనవానియొక్క, హితకర్తనమ్ = హితాన్ని ఛేదించడం, కిం యుక్తమ్ = యుక్తమా ? మొదటివాడు బలాభావప్రసిద్ధాత్మనః= బలాసురుని అభావంచేత, బలాసురుణ్ణి సంహరించడంచేత ప్రసిద్ధమైన ఇంద్రుని యొక్క హితకర్తనం అని అర్థం గ్రహించి అంటున్నాడు - పురన్దరమతచ్ఛేదమ్ = దేవేంద్రునికి ఇష్టమైనదాని ఛేదమును, విధాతుమ్=చేయుటకు, భవతః=నీకు, సామర్థ్యమ్ = సామర్థ్యం, కుతః = ఎట్లు ?

వి. ఇక్కడ వక్త ఒక అభిప్రాయంతో చెప్పిన వాక్యానికి శ్రోత మరొక అర్థం కల్పించడంచేత వక్రోక్త్యలంకారం. 'నారీణామ్' ఇత్యాదిపదాలకు రెండేసి అర్థాలు ఉండడంచేత శ్లేష. అందుచేత ఇది శ్లేషమూలకవక్రోక్తి. 'నారీణామ్' 'అబలానామ్' అనేపదాలలో సభంగశ్లేష.'నారీ' 'అబలా'పదాలురూఢిచేత స్త్రీ అనే అర్థం బోధిస్తాయి. 'న + అరీణామ్' 'న విద్యతే బలం యేషామ్' అనే వ్యుత్పత్తి చేత ఈ పదాలు విడగొట్టి మరొక అర్థం చెప్పడంచేత సభంగశ్లేష (పదాల విరుపు వల్ల ఏర్పడిన శ్లేష). ఒకవిధంగా 'హితకృత్' అనేదానిలో కూడ, 'కృ'ధాతువును గ్రహించి 'హితం కరోతీతి హితకృత్'అనీ, 'కృన్తీ' ధాతువును గ్రహించి 'హితం

కృన్తతీతి హితకృత్' అనీ చెప్పడంచేత సభంగశ్లేషయే. వీటిని పట్టి ఇది సభంగశ్లేషమూలకవక్రోక్తి.

వృ. అభఙ్గశ్లేషేణ యథా-

శ్లో॥ అహో కేనేదృశీ బుద్ధిర్దారుణా తవ నిర్మితా,
త్రిగుణా శ్రూయతే బుద్ధిర్న తు దారుమయీ క్వచిత్. 353

వ్యా. అభంగశ్లేషచేత ఎట్లనగా—

అహో ఇతి :- అహో = ఏమి ఆశ్చర్యము! తవ = నీయొక్క, దారుణా = దారుణమైన, ఈదృశీ = ఇట్టి, బుద్ధిః = బుద్ధి, కేన = ఎవనిచేత, కల్పితా = కల్పించబడింది ? త్రిగుణా = సత్త్వరజస్తమోగుణా లనే మూడు గుణాలు గల, లేదా సూక్ష్మంగా గ్రహించడం, శీఘ్రంగా గ్రహించడం, గ్రహించినదానిని గ్రహించడం అనే మూడు గుణాలు గలదిగా, బుద్ధిః = బుద్ధి, శ్రూయతే = వినబడుతున్నది. తు = కాని, దారుమయీ = కఱ్ఱతో చేసినది, క్వచిత్ = ఎక్కడా కూడ, న = వినబడదు.

వి. ఇక్కడ మొదటి వక్త 'దారుణా' అనే పదాన్ని ఆకారాంతస్త్రీలింగ శబ్దంగా 'దారుణమైన' అనే అర్థంలో ప్రయోగించాడు. ప్రతివక్త దాన్ని 'దారు' శబ్దతృతీయైకవచనాంతంగా గ్రహించి 'కఱ్ఱచేత' అనే అర్థం తీసికొని వక్రీకరించి సమాధానం చెప్పాడు. 'దారుణా' పదాన్ని విరవకుండానే రెండర్థాలు చెప్పడం చేత అభంగశ్లేష- ఈ విధంగా ఇది అభంగశ్లేషమూలకవక్రోక్త్యలంకారం.

వృ. కాక్వా యథా -

శ్లో॥ గురుజనపరతంత్రతయా దూరతరం దేశముద్యతో గన్తుమ్,
అలికులకోకిలలలితే నైష్యతి సఖి సురభిసమయేఽసౌ. 354

వా. కాకువుచేత వక్రోక్తి ఎట్లనగా -

గుర్వితి - నాయకుడు ప్రవాసానికి వెళ్ళబోవుచుండగా నాయిక ఆమె సఖురాలు అనుకుంటూన్నమాట లివి. ముందు ఈ మాటలు నాయిక పలకగా ఈ మాటలే సఖురాలు సమాధానంగా చెపుతూన్నది. సఖి = సఖీ ! గురుజన పర

త్రస్తతయా = గురుజనానికి (పెద్ద వాళ్ళకు) పరాధీను దవడంచేత, దూర తరమ్ = అతిదూరమైన, దేశమ్ = దేశాన్ని గూర్చి, గన్తుమ్ = వెళ్ళడానికి, ఉద్యతః = ఉద్యుక్తుడైన, అసౌ = ఇతడు (ఈ నా ప్రియుడు), అలికులకోకిల లలితే = తుమ్మెదల సముదాయంచేత కోకిలలచేత సుందరమైన, సురభిసమయే = వసంతకాలంలో, నైష్యతి = రాడు.

ఈ వాక్యమే తీసికొని సఖురాలు సమాధానం చెపుతున్నది. చివరి క్రియలో "నైష్యతి" అనేదానికి కాకువుచేత 'రాడూ' అని అర్థం వచ్చేటట్లు చేసి తప్పక వస్తాడు అని చెపుతున్నది. ఇది కాకుమూలకవక్రోక్తి. ఈ వక్రోక్తిభేదా లన్నింటి లోను పదాలకే ప్రాధాన్యం ఉన్నది కాబట్టి ఇది శబ్దాలంకారంగా చెప్పబడింది.

కా. వర్ణసామ్యమనుప్రాసః

వృ. స్వరవైసాదృశ్యేఽపి వ్యంజనసదృశత్వం వర్ణసామ్యమ్, రసాద్యనుగతః ప్రకృష్టో న్యాసః అనుప్రాసః.

అవ. వర్ణానుప్రాస, పదానుప్రాస అని అనుప్రాస రెండు విధాలు. అర్థం లేని వర్ణాలను మాత్రమే ఆవృత్తి చేస్తే వర్ణానుప్రాస. అర్థం ఉన్న పదాలను ఆవృత్తి చేస్తే పదానుప్రాస. వర్ణానుప్రాస నిరూపిస్తున్నాడు -

వర్ణేతి-వర్ణాల సామ్యం వర్ణానుప్రాస. అనగా వ్యవధానం లేకుండా వర్ణాలను రెండు పర్యాయాలు కూర్చడం అని అర్థం.

స్వరేతి - స్వరాలలో (అచ్చులలో) సామ్యం లేకపోయినా వ్యంజనాల (హల్లుల) సామ్యం వర్ణసామ్యం రసాదులను అనుగమించే, రసాదులకు అను కూలంగా ఉండే, ప్రకృష్టమైన న్యాసం, కూర్పు, 'అనుప్రాస'.

కా. ఛేకవృత్తిగతో ద్విధా.

వృ. ఛేకాః విదగ్ధాః, వృత్తిర్నియతవర్ణగతః రసవిషయః వ్యాపారః. గతః ఇతి ఛేకానుప్రాసః వృత్త్యనుప్రాసశ్చ. కిం తయోః స్వరూపమ్ ఇత్యాహ.

కా. సోఽనేకస్య సకృత్పూర్వః,

వృ. అనేకస్య, అర్థాత్ వ్యఞ్జనస్య, సకృదేకవారమ్ సాదృశ్యం చేకానుప్రాసః. ఉదాహరణమ్ -

శ్లో॥ తతోఽరుణపరిస్పన్దమన్దీకృతవపుః శశీ
దధ్రే కామపరిక్షామకామినీగణ్డపాణ్డుతామ్. 355

వ్యా. చేకేతి - అనుప్రాస చేకగతమూ, వృత్తిగతమూ అని రెండువిధాలు.

చేకాః ఇతి - 'ఛేకులు' అనగా విదగ్ధులు. నేర్పు గలవారు. 'వృత్తి' అనగా నియతమైన అనగా ఆయా రసాలకు సంబంధించినవిగా నిశ్చితాలైన, వర్ణాలకు సంబంధించిన రసవిషయకమైన వ్యంజనావ్యాపారం. గతః = వాటిని (ఛేక వృత్తులను) పొందినది. అనగా మొదటిది ఛేకానుప్రాస, రెండవది వృత్త్యనుప్రాస.

కిమితి - వాటి స్వరూపం ఏమిటో చెపుతున్నాడు -

స ఇతి - అనేకస్య = అనేకమునకు, అనేకవర్ణాలకు, సకృత్ = ఒక పర్యాయం, సః = సామ్యం, పూర్వః = మొదటిది.

అనేకస్యేతి - అనేకస్య అనగా అనేకవ్యంజనానికి (లకి), సకృత్ = ఒక పర్యాయం, సాదృశ్యం ఛేకానుప్రాస. ఉదాహరణం -

తతః ఇతి - తతః = అటు పిమ్మట, అరుణపరిస్పన్దమన్దీకృతవపుః = అనూరుని కొంచెం చలనంచేత మందంగా చేయబడిన శరీరం గల, శశీ = చంద్రుడు, కామపరిక్షామకామినీగణ్డపాణ్డుతామ్ = కామంచేత చిక్కిన స్త్రీయొక్క గండస్థలంయొక్క తెలుపును, దధ్రే = ధరించెను.

ఇక్కడ 'స్పన్దమన్దీ' అన్నప్పుడు నకారదకారరూపమైన అనేకవ్యంజనాన్ని 'గణ్డపాణ్డు' అన్నప్పుడు ణకారడకారరూపమైన అనేకవ్యంజనాన్ని ఒకే మారు ఆవృత్తి చేయడం వల్ల ఛేకానుప్రాస.

కా. ఏకస్యాప్యసకృత్ పరః. 79

వృ. ఏకస్య, అపిశబ్దాదనేకస్య, వ్యఞ్జనస్య ద్విః బహుకృత్వో వా సాదృశ్యం వృత్త్యనుప్రాసః. తత్ర-

కా. మాధుర్యవ్యఞ్జకైర్వర్ణైరుపనాగరికోచ్యతే,
ఓజః ప్రకాశకై స్తైస్తు పరుషా.

వృ. ఉభయత్రాపి ప్రాగుదాహృతమ్.

కా. కోమలా పరైః. 80

వృ. పరైః శేషైః. తామేవ కేచిత్ గ్రామ్యేతి వదన్తి. ఉదాహరణమ్. 356.

శ్లో॥ అపసారయ ఘనసారం కురు హారం దూర ఏవ కిం కమలైః,
అలమలమాలి మృణాలైరితి వదతి దివానిశం బాలా. 356

వ్యా. ఏకస్యేతి :- ఏకస్యాపి = ఒక వ్యంజనానికి కూడా, అసకృత్ = అనేకపర్యాయాలు సాదృశ్యం, పరః = రెండవది; వృత్త్యనుప్రాస.

ఏకేతి :— ఒకదానికి, అపిశబ్దంచేత అనేకమైన వ్యంజకానికి రెండు పర్యాయాలు గాని బహుపర్యాయాలు గాని సాదృశ్యం వృత్త్యనుప్రాస. అందులో—

మాధుర్యేతి :- మాధుర్యవ్యఞ్జకైః = మాధుర్యాన్ని వ్యంజింపచేసే, వర్ణైః= వర్ణాలచేత, ఉపనాగరికా = ఉపనాగరికావృత్తి అని. 'ఉపనాగరికా' అనగా చాతుర్యవంతురాలైన నాగరికస్త్రీతో పోల్చదగినది అని అర్థం. ఉచ్యతే = చెప్పబడుచున్నది. ఓజః ప్రకాశకైః = ఓజస్సును వ్యంజింపచేసే, తైః తు = వర్ణాల చేత నైతే, పరుషా = పరుషవృత్తి.

ఉభయత్రేతి :- ఈ రెండింటికీ వెనుక ఉదాహరణం చూపబడినది. "అనఙ్గరఙ్గ ప్రతిమమ్" (చూ. 347 శ్లో) అనే శ్లోకం ఉపనాగరికావృత్తికి, 'మూర్ధ్నాముద్వృత్త' ఇత్యాదిశ్లోకం (చూ. 348 శ్లో) పరుషకు ఉదాహరణలుగా చూపబడ్డాయి. అనగా ఆ శ్లోకాలను వీటికి ఉదాహరణాలుగా గ్రహించాలి.

కోమలేతి :. పరైః = మిగిలిన వర్ణాలచేత, కోమలా = కోమలవృత్తి.

పరైరితి :— పరైః = శిష్టవర్ణాలచేత, దానికే కొందరు 'గ్రామ్యవృత్తి' అంటారు. ఉదాహరణం- "అపసారయ ఘనసారమ్" మొ (చూ. 341 శ్లో). ఈ

శ్లోకంలో మాధుర్యవ్యంజకవర్ణాలు కాని, ఓజోవ్యంజకవర్ణాలు కాని లేవు. అందు చేత ఇది కోమలవృత్తి.

కా. కేషాంచిదేతా వైదర్భీప్రముఖా రీతయో మతాః.

వృ. ఏతాస్తిస్రో వృత్తయః వామనాదీనాం మతే వైదర్భీగౌడీపాఞ్చాల్యాఖ్యా రీతయో మతాః.

వ్యా. కేషామితి :- ఏతాః = ఇవి, కేషాంచిత్ = కొంతమందికి, వైదర్భీప్రభృతయః = వైదర్భి మొదలైన, రీతయః = రీతులుగా, మతాః = చెప్పబడినవి.

ఏతా ఇతి :- ఈ మూడు వృత్తులు వామనాదుల మతంలో వైదర్భి, గౌడి, పాంచాలి అను పేర్లు గల రీతులుగా ఇష్టమైనవి.

అవ. ఇంతవరకు వర్ణానుప్రాసను చెప్పి ఇప్పుడు శబ్దానుప్రాసను వివరిస్తున్నారు-

కా. శాబ్దస్తు లాటానుప్రాసో భేదే తాత్పర్యమాత్రతః. 81

వృ. శబ్దగతోఽనుప్రాసః శబ్దార్థయోరభేదేఽప్యన్వయభేదాత్. లాటజనవల్లభత్వాచ్చ లాటానుప్రాసః. ఏష పదానుప్రాస ఇత్యన్యే.

వ్యా. శాబ్ద ఇతి :- తాత్పర్యమాత్రతః = తాత్పర్యం మాత్రంవల్ల, భేదే = భేదం ఉండగా, శాబ్దః = శాబ్దమైన, లాటానుప్రాసః = లాటానుప్రాస.

శబ్దేతి :- శబ్దార్థాలకు భేదం లేకపోయినా, అనగా అక్కడ ప్రయోగించిన శబ్దాలు వాటి అర్థాలూ ఒకటే అయినా, అన్వయభేదంవల్ల ఏర్పడిన అనుప్రాస శబ్దగతానుప్రాస. ఇది లాటదేశీయులకు ఇష్టం అవడంచేత దీనికి 'లాటానుప్రాస' అని కూడా పేరు. ఇది 'పదానుప్రాస' అని కొందరు అంటారు.

శాబ్దానుప్రాస పదగతము, నామ (ప్రాతిపదిక) గతమూ అని రెండు విధాలు. అనేకపదగతము, ఏకపదగతమూ అని పదగతం రెండు విధాలు. నామగతం కూడా సమాసగతము, అసమాసగతమూ అని రెండు విధాలు. సమాసగతం ఏకసమాసగత మనీ, విభిన్నసమాసగతం అనీ రెండు విధాలు. ఈ విధంగా శాబ్దానుప్రాస ఐదు విధాలు.

కా. పదానాం సః.

వృ స ఇతి లాటానుప్రాసః. ఉదాహరణమ్.

శ్లో॥ యస్య న సవిధే దయితా దవదహనస్తుహినదీధితిస్తస్య
యస్య చ సవిధే దయితా దవదహనస్తుహినదీధితిస్తస్య.

వ్యా. పదానామితి :- సః = అది, పదానామ్ = పదములకు.

స ఇతి :- సః అనగా లాటానుప్రాస. ఉదాహరణం—

యస్యేతి :— యస్య = ఎవనికి, సవిధే = సమీపమునందు, దయితా = ప్రియురాలు, న = లేదో, తస్య = వానికి, తుహినదీధితిః = చంద్రుడు, దవదహనః = దావాగ్ని. యస్య చ = ఎవనికి, సవిధే = సమీపమునందు, దయితా = ప్రియురాలుఉన్నదో, తస్య = వానికి, దవదహనః = దావాగ్ని, తుహినదీధితిః = చంద్రుడు.

వి. ఈ శ్లోకంలో 'దవదహనస్తుహినదీధితి స్తస్య' అని అనేకపదాల ఆవృత్తి ఉన్నది. ఈ పదాల అర్థాలలో కూడ భేదం లేదు. తాత్పర్యాన్ని పట్టి అన్వయంలో భేదం ఉంది. పూర్వార్ధంలో తుహినదీధితియందు దవదహనత్వం విధేయం. ఉత్తరార్ధంలో దవదహనంమీద తుహినదీధితిత్వం విధేయం.

అవ. ఏకపదగతమైన రెండవ భేదాన్ని చెపుతున్నాడు.

కా. పదస్యాపి.

వృ. అపిశబ్దేన సః ఇతి సముచ్చీయతే. ఉదాహరణమ్-

శ్లో॥ వదనం వరవర్ణిన్యాస్తస్యాః సత్యం సుధాకరః,
సుధాకరః క్వ ను పునః కలఙ్కవికలో భవేత్. 358

వ్యా. పదస్యేతి :- పదానికి కూడ.

అపీతి :- 'అపి' శబ్దంచేత 'సః' అనేది సముచ్చితం అవుతుంది. (ఒక

దానితో పాటు కలిపి మరొకదానిని చెప్పడం సముచ్చయం). అనగా లాటాను ప్రాస ఒక్క పదానికిమాత్రమే కూడా ఉంటుంది. ఉదాహరణం.

వదనమితి :- తస్యాః = ఆ. వరవర్ణిన్యాః = ఉత్తమస్త్రీయొక్క, వదనమ్ = ముఖం, సుధాకరః = చంద్రుడే, సత్యమ్ = నిజము. సుధాకరః = చంద్రుడు, కలఙ్కవికలః = కలంకశూన్యుడై, క్వ ను భవేత్ = ఎక్కడ ఉంటాడు. అందు చేత పైన చెప్పినది సత్యంకా దని అర్థం.

వి. ఇక్కడ 'సుధాకరః' అనే ఒక్క పదాన్ని తాత్పర్యభేదంచేత ఆవృత్తి చేయడం జరిగింది. మొదటి సుధాకరపదం విధేయపరం, రెండవది ఉద్దేశ్యపరం. అందుచేత లాటానుప్రాస.

అవ. నామగతానుప్రాస మూడు విధా లని చెపుతున్నారు-

కా. వృత్తావన్యత్ర తత్ర వా,
నామ్నః స వృత్త్యవృత్త్యోశ్చ.

వృ. ఏకస్మిన్ సమాసే, భిన్నే వా సమాసే సమాసాసమాసయోర్వా నామ్నః ప్రాతిపదికస్య, న తు పదస్య, సారూప్యమ్. ఉదాహరణమ్.

శ్లో॥ సితకరకరరుచిరవిభా విభాకరాకారధరణిధరకీర్తిః,
పౌరుషకమలాకమలా సాపి తవైవాస్తి నాన్యస్య. 359

వ్యా. వృత్తావితి :- తత్ర వృత్తౌ = ఆ మాసంలో కాని, అన్యత్ర వా = మరియొక సమాసంలో గాని, భిన్నసమాసాలలో గాని, వృత్త్యవృత్త్యోః చ = సమాసాసమాసాలలో గాని, నామ్నః = ప్రాతిపదికకు, సః = ఆ లాటానుప్రాస అగును.

ఏకస్మిన్ ఇతి :- ఒకే సమాసంలో గాని, వేరు వేరు సమాసాలలో గాని, సమాసంలోను అసమాసంలోను గాని ప్రాతిపదికకే, అంతే కాని పదానికి కాదు, సారూప్యం లాటానుప్రాస. ఉదాహరణం-

సితకరేతి :- ఈ శ్లోకం పూర్వం 314వ శ్లోకంగా వచ్చినది. ఇక్కడ 'కర కర' అని ఒకే సమాసంలో 'విభా' 'విభా' అని రెండు వేరు వేరు సమాసా

లలో,'కమలా' 'కమలా' అని మొదటిది సమాసంలోను రెండవది అసమాసంలోను ఉన్నాయి. ఈ విధంగా త్రివిధనామసామ్యరూపలాటాను ప్రాసలకి ఉదాహరణాలు ఈ శ్లోకంలో ఉన్నాయి.

కా. తదేవం పఞ్చధా మతః. 82

అర్థే సత్యర్థభిన్నానాం వర్ణానాం సా పునః శ్రుతిః
యమకమ్.

వృ. "సమరసమరసోఽయమ్" ఇత్యాదావేకేషామ్ అర్థవత్త్వే, అన్యేషామనర్థకత్వే భిన్నార్థానామితి న యుజ్యతే వక్తుమ్ ఇతి అర్థే సతీత్యుక్తమ్. సేతి 'సరోరస' ఇత్యాదివైలక్షణ్యేన తేనైవ క్రమేణ స్థితా.

వ్యా. తదితి :- తత్ = ఆ కారణంవలన, ఏవమ్ = ఈ విధంగా, పఞ్చధా = ఐదు విధాలుగా, స్మృతః = చెప్పబడినది.

ఇప్పుడు యమకానికి లక్షణం చెపుతున్నారు- అర్థే ఇతి :- అర్థే సతి = అర్థం ఉన్న పక్షంలో, అర్థభిన్నానామ్ = వేరు వేరు అర్థాలు గల, వర్ణానామ్ = వర్ణాలయొక్క, సా = అదే క్రమం గల, పునః శ్రుతిః = మళ్ళీ వినిపించడం, ఆవృత్తి, యమకమ్ = యమకము.

వి. యమకంలో చాలా వర్ణాల ఆవృత్తి ఉంటుంది. వాటికి అర్థం ఉన్న పక్షంలో ఒక్కొక్క వర్ణసముదాయానికి ఒక్కొక్క అర్థం ఉంటుంది. కొన్ని చోట్ల వర్ణాలు వేరుగా ఉన్నా శ్రుతిసామ్యాన్ని పట్టి (అవి ఒకే విధంగా చెవికి వినబడడం చేత) యమకం అంగీకరించబడుతుంది.

"యమకాదౌ భవేదైక్యం డలయోః రలయోర్బవోః,
శషయోర్నణయోశ్చాన్తే సవిసర్గావిసర్గయోః,
సబిన్దుకాబిన్దుకయోః స్యాదభేదప్రకల్పనమ్."

యమకాదులలో డల లకు, రల లకు, బవ లకు, శష లకు, నణ లకు, ఏకత్వం ఉంటుంది. అవి ఒకే అక్షరంగా పరిగణింపబడతాయి. చివర విసర్గలు ఉన్నవాటికి లేనివాటికి, అనుస్వార ఉన్నవాటికీ లేనివాటికీ కూడా అభేదం అని అర్థం.

వ్యా. సమరేతి :- "సమరసమరసోఽయమ్" ఇత్యాదులలో కొన్ని వర్ణాలు అర్థవంతములు, కొన్ని అర్థం లేనివీ అయినప్పుడు 'భిన్నార్థానామ్' అని చెప్పడం కుదరదు. అందుచేత 'అర్థే సతి' అని చెప్పబడింది. 'సా' అనగా 'సరోరసః' ఇత్యాదివైలక్షణ్యంచేత 'సరోరసః' ఇత్యాదులందువలె కాక అదే క్రమంలో ఉన్నది అని అర్థం.

వి. లాటానుప్రాసలో ఆవృత్తి చేయబడిన రెండుపదాలకూ ఒకే అర్థం ఉంటుంది. తాత్పర్యం వేరుగా ఉంటుంది. అందుచేత లాటానుప్రాసలో యమక లక్షణానికి అతివ్యాప్తి లేకుండా ఉండడంకోసం 'అర్థభిన్నానామ్' అని చెప్ప బడింది. అనగా యమకంలో ఆవృత్తిచేయబడే వర్ణసముదాయాలకు వేరు వేరు అర్థాలు ఉండాలి అని అర్థం. అయితే "సమరసమరసః అయమ్" అనే యమక స్థలంలో 'సమర' అనే మొదటి వర్ణసముదాయానికి యుద్ధం అనే అర్థం ఉన్నా రెండవదానికి అర్థం లేదు. అది 'సమరసః' అనే దానిలో భాగం. 'సమరసః' అనే మొత్తం వర్ణసముదాయానికి అర్థం ఉన్నా దానిలోని ఒక భాగం అయిన 'సమర' అనేదానికి అర్థం లేదు కదా? 'భిన్నార్థయోః' అని చెప్పిన పక్షంలో ఇది యమకం కాకపోవలసివస్తుంది. అందుచేత ఈ అవ్యాప్తిని తొలగించడంకోసం 'అర్థే సతి' అని చెప్పబడింది. అనగా వర్ణసముదాయాలకి అర్థం ఉంటే మాత్రం వేరు వేరు అర్థం ఉండాలి అని అర్థం. ఒక వర్ణ సముదాయానికి అర్థం ఉండి రెండవదానికి లేకపోయినా, లేదా రెండు వర్ణసముదాయాలకీ కూడా 'శమరతేమరతేజసి పార్థివే' ఇత్యాదిరఘువంశశ్లోకంలో (9.4) వలె అర్థం లేకపోయినా యమకత్వానికి భంగం లేదు.

వి. దేనికైనా లక్షణం చెప్పినప్పుడు ఆ లక్షణానికి అతివ్యాప్తి, అవ్యాప్తి అసంభవం అనే దోషాలలో ఏ ఒక్క దోషమూ కూడా పట్టకుండా చూచుకోవాలి. లక్ష్యం కానిదానికి కూడా లక్షణం పట్టడం అతివ్యాప్తి. గోవుకు లక్షణం ఏమిటి అంటే "కొమ్ములున్నది గోవు" అని చెపితే గోవులు కాని మహిషాదులకి కూడా కొమ్ము లున్నాయి కాబట్టి వాటిని కూడా గోవు లనవలసివస్తుంది. ఇది లక్షణానికి అతివ్యాప్తిదోషం. ఈ దోషాన్ని పరిహరించడం కోసం "కొమ్ములుండి తెల్లగా ఉన్నది గోవు" అని లక్షణం చెపితే తెల్లగోవు లన్నీ ఈ లక్షణం క్రిందికి వచ్చినా ఎరుపు నలుపూ మొదలైన రంగులున్న గోవులకు ఈ లక్షణం వర్తించదు. అందుచేత లక్ష్యాలన్నింటికీ వర్తించకపోవడంచేత ఇది అవ్యాప్తి. అందుచేత

"కొమ్ములుండి గంగడోలు కూడా ఉన్నది గోవు" అని లక్షణం చెపితే ఈ రెండు దోషాలూ కూడా ఉండవు. అయితే ఈ మధ్య వచ్చిన జెర్సీఆవులలో ఈ లక్షణానికి కూడా అవ్యాప్తి పడుతుంది. అందుచేత మరొక విశేషణం ('మహిషాదిభిన్నం' వంటిది) వేసికొని ఆ దోషాన్ని నివారించుకోవాలి. నిజానికి జెర్సీఆవులు గోజాతికి చెందినవి ఔనో కాదో! కంచరగాడిదవంటి జాత్యంతరం కావచ్చు. కాకికి లక్షణం ఏమిటి అన్నప్పుడు "తెల్లగా ఉన్న పక్షి కాకి" అని చెబితే అది అసంభవదోషం. తెల్ల కాకులు ఉండవు కదా? ఉంటే అవి వేరే జాతి అనుకుందాం.

కా. పాదతద్భాగవృత్తి తద్యాత్యనేకతామ్. 83

వృ. ప్రథమో ద్వితీయాదౌ, ద్వితీయ స్తృతీయాదౌ, తృతీయ శ్చతుర్థే, ప్రథమస్త్రిష్వపీతి సప్త. ప్రథమో ద్వితీయే, తృతీయశ్చతుర్థే, ప్రథమశ్చతుర్థే, ద్వితీయస్తృతీయే ఇతి ద్వే. తదేవం పాదజం నవభేదమ్. అర్ధావృత్తిః శ్లోకావృత్తిశ్చేతి ద్వే.

వ్యా. పాదేతి :- పాదతద్భాగవృత్తి = శ్లోకపాదంలోను, దాని ఒక భాగంలోను ఉండు, తత్ = ఆ యమకం, అనేకతామ్ = అనేకత్వమును, యాతి = పొందును. దీనికి అనేకభేదాలు ఉండును అని అర్థం.

ప్రథమః ఇతి :- 'ప్రథమః' మొదలైన పదాలకి, దూరంగా ఉన్న 'యమ్యతే' అనేదానితో "ప్రథమః యమ్యతే" ఇత్యాదివిధంగా అన్వయం. మొదటి పాదం ద్వితీయాదిపాదాలలోనూ, ద్వితీయపాదం తృతీయాదిపాదాలలోను, తృతీయ పాదం చతుర్థపాదంలోను ప్రథమపాదం అన్ని (మూడు) పాదాలలోను నియమించబడితే ఏడు భేదాలు అవుతాయి.

వి. నియమించడం అనగా కూర్చడం; ఆవృత్తి చేయడం. ప్రథమ పాదాన్ని ద్వితీయపాదంలో నియమిస్తే, ప్రథమపాదాన్ని ద్వితీయపాదంలో ఆవృత్తి చేస్తే అది (1) 'ముఖం' అనే యమకం; తృతీయపాదంలో నియమిస్తే (2) 'సందంశం' అనే యమకం, చతుర్థపాదంలో నియమిస్తే (3) 'ఆవృత్తి' అనే యమకం. ద్వితీయపాదాన్ని తృతీయపాదంలో నియమిస్తే (4) 'గర్భం' అనే యమకం. చతుర్థపాదంలో నియమిస్తే (5) 'సందష్టకం' అనే యమకం

తృతీయపాదాన్ని చతుర్థపాదంలో నియమిస్తే (6) 'వృచ్ఛం' అనే యమకం. ప్రథమపాదాన్ని మిగిలిన అన్ని పాదాలలోనూ నియమిస్తే (7) 'పంక్తి' అనే యమకం ఈ విధంగా ఏడు భేదాలు.

వ్యా. ప్రథమో ద్వితీయే ఇతి :- ప్రథమపాదం ద్వితీయపాదంలోను తృతీయపాదం చతుర్థంలోను, మొదటిపాదం చతుర్థంలోను రెండవ పాదం తృతీయపాదంలోను అని రెండు భేదాలు.

వి. ఒక శ్లోకంలో ప్రథమపాదాన్ని ద్వితీయపాదంలోను, తృతీయ పాదాన్ని చతుర్థపాదంలోను నియమిస్తే అనగా ప్రథమద్వితీయపాదాలు, తృతీయ చతుర్థపాదాలు ఒకే విధంగా ఉంటే, (8) 'యుగ్మకం' అనే యమకం. ప్రథమపాదాన్ని చతుర్థపాదంలోను, ద్వితీయపాదాన్ని తృతీయపాదంలోను నియమిస్తే (9) 'పరివృత్తి' అనే యమకం.

తదితి - ఈ విధంగా పాదాలవల్ల ఏర్పడిన యమకానికి తొమ్మిది భేదాలు. అర్ధావృత్తి, అనగా పూర్వార్ధాన్నే ఉత్తరార్ధంగా ఆవృత్తి చేయడం, శ్లోకావృత్తి, మొత్తం శ్లోకాన్ని ఆవృత్తిచేయడం (రెండు శ్లోకాలు అవుతుతాయి). అని రెండు భేదాలు. అర్ధావృత్తికి (10) 'సముద్గం' అనీ, శ్లోకావృత్తికి (11) 'మహాయమకం' అనీ పేర్లు. ఈ విధంగా మొత్తం పాదగతయమకానికి పదకొండు భేదాలు.

అవ. పాదభాగవృత్తియమకానికి చాల భేదాలు ఉంటాయని చెపుతున్నాడు.

వృ. ద్విధా విభక్తే పాదే ప్రథమాదిపాదాదివిభాగః పూర్వవత్ ద్వితీయాదిపాదాదిభాగేషు, అన్తభాగః అన్తభాగేష్వితి వింశతిర్భేదాః. శ్లోకాన్తరే హి నాసౌ భాగావృత్తిః. త్రిఖణ్డే త్రింశత్. చతుఃఖణ్డే చత్వారింశత్.

వ్యా. ద్విధేతి :- రెండు భాగాలుగా విభజించబడిన పాదంలో ప్రథమాది పాదాల మొదటి విభాగం వెనుకటి వలె ద్వితీయాదిపాదాల ఆదిభాగాలయందు నియమించబడుతుంది. అంతభాగం అంతభాగాలలో నియమించబడుతుంది. ఈ విధంగా ఇరవై భేదాలు. ఈ భాగావృత్తి వేరైన మరొక శ్లోకంలో కుదరదు కదా. పాదాన్ని మూడు ఖండాలు చేసిన పక్షంలో ముప్పై భేదాలు. నాలుగు ఖండాలు చేస్తే నలభై భేదాలు.

వి. పాదాన్ని రెండు భాగాలు చేసినప్పుడు మొదటి పాదం మొదటి

భాగాన్ని పాదావృత్తిలో వలెనే ద్వితీయ-తృతీయ-చతుర్థపాదాలలో నియమిస్తే (ఆవృత్తి చేస్తే) మూడు భేదాలు. ద్వితీయపాదం మొదటిభాగాన్ని తృతీయ చతుర్థపాదాల మొదటి భాగాలలో ఆవృత్తి చేస్తే రెండు భేదాలు. తృతీయపాదం మొదటి భాగాన్ని చతుర్థపాదం మొదటి భాగంలో ఆవృత్తి చేస్తే ఒక భేదం. మొదటిపాదం మొదటి భాగాన్ని మిగిలిన మూడు పాదాల మొదటి భాగాలలో ఆవృత్తి చేస్తే ఒక భేదం. ఈ విధంగా ఏడు భేదాలు ఏర్పడతాయి. మొదటి పాదం మొదటి భాగం రెండవ పాదం మొదటి భాగం సమంగా ఉండి మూడవ పాదం మొదటి భాగం చతుర్థపాదం మొదటి భాగం సమంగా ఉంటాయి. ఇది ఒక భేదం. ప్రథమపాదం మొదటి భాగం, తృతీయపాదం మొదటి భాగం తుల్యంగా ఉండి రెండవ పాదం మొదటి భాగం చతుర్థపాదం మొదటి భాగం తుల్యంగా ఉంటాయి. ఇది ఒక భేదం. పై ఏడూ ఈ రెండూ కలిస్తే తొమ్మిది భేదాలు. పూర్వార్ధంలోను ఉత్తరార్ధంలోనూ కూడా ఒకే పాదభాగం ఉంచే, అనగా శ్లోకం అంతా ఒకే పాదభాగాన్ని ఏడు సార్లు ఆవృత్తి చేయగా ఏర్పడితే అది పదవ భేదం.

పాదానికి సంబంధించిన మొదటి భాగం వలె దాని రెండవ భాగం కూర్చితే పది భేదాలు ఎట్లనగా :- ప్రథమపాదాంత్య భాగాన్ని ద్వితీయ-తృతీయ చతుర్థపాదాంత్యభాగాలలో ఆవృత్తి చేస్తే మూడు భేదాలు. ద్వితీయపాదాంత్య భాగాన్ని తృతీయచతుర్థపాదాంత్యభాగాలలో ఆవృత్తి చేస్తే రెండు భేదాలు. తృతీయపాదాంత్యభాగాన్ని చతుర్థపాదాంత్యభాగంగా ఆవృత్తి చేస్తే ఒక భేదం. ప్రథమపాదాంత్యభాగాన్ని మిగిలిన అన్ని పాదాల చివరి భాగంలో ఆవృత్తి చేస్తే అదొక భేదం. ఈ విధంగా ఏడు భేదాలు. ప్రథమపాదాంత్యభాగం ద్వితీయ పాదాంత్యభాగంతో తుల్యంగా ఉండగా ద్వితీయపాదాంత్యభాగం చతుర్థపాదాంత్య భాగంతో తుల్యంగా ఉంటుంది. అది ఒక భేదం. ప్రథమపాదాంత్యభాగమూ, తృతీయపాదాంత్యభాగమూ తుల్యంగా ఉండి ద్వితీయపాదాంత్యభాగమూ చతుర్థ పాదాంత్యభాగమూ తుల్యంగా ఉంచే అదొక భేదం. మొత్తం తొమ్మిది భేదాలు. అర్ధావృత్తి కలిపితే పది భేదాలు. ఈ విధంగా పాదాన్ని రెండు ఖండాలు చేసిన యమకంలో మొత్తం ఇరవై భేదాలుంటాయి. శ్లోకావృత్తిభేదాలు రెండూ కలిపితే ఇరవై రెండు భేదాలు అవుతాయి కదా అనే ఆశంకకు అవకాశం లేదు. ఈ భాగా వృత్తిని మరొక శ్లోకంతో చేస్తే సౌందర్యం ఉండదు కదా?

ఇదే విధంగా పాదాన్ని మూడు భాగాలుగా విభజించిన పక్షంలో వాటిని ఆద్యంతమధ్యాలలో ఆవృత్తిచేయడం చేత ముప్పై భేదాలు. నాలుగు భాగాలుగా విభజిస్తే నలభై భేదాలు ఏర్పడతాయి.

అవ. పాదంలోని ఆద్యభాగం మరొక పాదంలోని ఆద్యభాగం తుల్యంగా ఉండడం, పాదంలోని అంత్యభాగం మరొక పాదంలోని అంత్యంగా ఉండడం అనేది సజాతీయభాగావృత్తి. ఇది పైన చెప్పబడింది. పాదంలోని ఆద్యభాగం మరొక పాదంలోని అంత్యభాగం తుల్యంగా- ఈ విధంగా ఉంటే అది విజాతీయ భాగావృత్తి. దీనిని ఇప్పుడు చెపుతున్నాడు.

వృ. ప్రథమపాదాదిగతాన్త్యార్ధాదిభాగో ద్వితీయపాదాదిగతే ఆద్యార్ధాదిభాగే యమ్యతే ఇత్యాద్యన్వర్థతానుసరణేన అనేకభేదమ్ 'అన్తాదికమ్' 'ఆద్యన్తికమ్' తత్సముచ్చయః, 'మధ్యాదికమ్', 'ఆదిమధ్యమ్', 'అన్తమధ్యమ్' 'మధ్యాన్తికమ్' తేషాం సముచ్చయః. తథా తస్మిన్నేవ పాదే ఆద్యాదిభాగానాం మధ్యాదిభాగేషు అనియతే చ స్థానే ఆవృత్తిరితి ప్రభూతతమభేదమ్. తదేతత్కావ్యాన్తర్గడుభూతమ్. ఇతి నాస్య భేద లక్షణం కృతమ్. దిఙ్మాత్రముదాహ్రియతే.

వ్యా. ప్రథమేతి:- ప్రథమపాదాదులలోని అంత్య-అర్ధాదిభాగం ద్వితీయాది పాదాలలోని ఆది-అర్ధాదిభాగాలలో నియమించబడుతుంది. ఈ విధంగా అర్థాను సారంగా పేర్లు పెట్టిన 'అంతాధికం' 'ఆద్యంతికం' వీటి సముచ్చయం (కలయిక) 'మధ్యాధికం' 'ఆదిమధ్యం' 'అంతమధ్యం' 'మధ్యాంతికం' వీటి సముచ్చయం (ఈ భేదాలు రెండు మూడు కలిసి ఉండడం) అని ఈ యమకానికి అనేకభేదాలు ఉండవచ్చును. అదే విధంగా ఆ పాదంలో ఆద్యాదిభాగాలను మధ్యాధిభాగాలలో అనియతమైన (ఫలానా అని చెప్పని) స్థానంలోను ఆవృత్తి చేయవచ్చును. ఈ విధంగా దీని భేదాలు అత్యధికసంఖ్యలో ఉంటాయి. అయితే ఈ యమకం కావ్యంలో గ్రంథివంటిది. అందుచేత ఈ భేదాలకు లక్షణాలు చెప్పలేదు.

వి. పాదం రెండు భాగాలు చేసినప్పుడు-మొదటి పాదం చివరి భాగం ద్వితీయపాదాద్యభాగంలో ఆవృత్తి చేయబడితే అది 'అంతాదియమకం'. ప్రథమ

పాదాద్యభాగం ద్వితీయపాదాన్త్యభాగంలో ఆవృత్తి చేయబడితే అది ఆద్యంత యమకం ప్రథమపాదాద్యంతభాగాలు ద్వితీయపాదాంతాదిభాగాలలో ఆవృత్తి చేయ బడితే అది ఆద్యంతిక-అంతాదికయమకాల సముచ్చయం. త్రిఖండచతుఃఖండా లలో పూర్వపాదమధ్యభాగాన్ని ఉత్తరపాదాద్యభాగంలో ఆవృత్తి చేస్తే అది 'మధ్యాదికయమకం'. పూర్వపాదాదిభాగాన్ని ఉత్తరపాదమధ్యభాగంలో ఆవృత్తి చేస్తే అది 'ఆదిమధ్యయమకం'. పూర్వపాదమధ్యాదిభాగాల్ని ఉత్తరపాదఆద్య మధ్యభాగాలలో ఆవృత్తి చేస్తే అది మధ్యాదిక-ఆదిమధ్యయమకాల సముచ్చయం. ప్రథమపాదాంత్యభాగాన్ని ద్వితీయమధ్యభాగంలో ఆవృత్తి చేస్తే అది "అంత్యమధ్య యమకం". ప్రథమపాదమధ్యభాగం ద్వితీయపాదాంతభాగంలో ఆవృత్తి చేస్తే అది "మధ్యాంతికయమకం". ప్రథమపాదఅంత్యమధ్యభాగాలు ద్వితీయపాదమధ్యాంత భాగాలలో ఆవృత్తి చేయబడితే అది అంత్యమధ్య-మధ్యాంత్యాల సముచ్చయం. ఇదే విధంగా ఇతరపాదాలలో చూచినప్పుడూ, వాటి సముచ్చయాలు చేసినప్పుడు అనంతమైన బేదాలు ఏర్పడతాయి. ఒకే పాదంలోని ఆద్యాదిభాగాలను మధ్యాది భాగాలలో ఆవృత్తి చేస్తే కొన్ని భేదాలు ఏర్పడతాయి. ఇంతవరకూ చూచినవి నియతస్థానయమకాలు. అనగా మొదట, చివర, మధ్య అని నియతమైన స్థానా లలో ఆవృత్తి చేయడంవల్ల ఏర్పడినవి. స్థాననియమం కూడా లేకుండా ఆవృత్తి చేస్తే ఆ బేదాలు అనేకం తయారవుతాయి. ఈ బేదాలు అన్నీ లెక్క పెట్టుకుంటూ పోతే అంతం ఉండదు. ఈ లక్షణాల ప్రకారం యమకం కూర్చాలి అని ప్రయ త్నిస్తే ఈ యమకాలమీదనే దృష్టి ఉండడంచేత రసాస్వాదానికి భంగం కలుగు తుంది. చెరకుగడ తింటూంటే మధ్యమధ్య వచ్చే కణుపులు వంటివి ఈ యమ కాలు ('గడు' అనగా శరీరంమీద మొలచిన కంతి).

ఎంత ప్రతిభావంతుడైన కవి అయినా దృష్టి యమకాలమీదకు మరలుస్తే రసనిర్వహణం దెబ్బతింటుంది. అందుచేత ఇలాంటి యమకాదులు రసానికి అంగాలు కావు. రసనిర్వహణమీద దృష్టి ఉంచుకొని రచన సాగిస్తూన్న సమ యంలో అప్రయత్నంగా ఏ అలంకారాలు దొర్లి వచ్చిపడతాయో అవే రసాంగాలు అని ఆనందవర్ధనుడు అంటాడు.

"యమకాదినిబన్ధేషు పృథక్ యత్నోఽస్య జాయతే
శక్తస్యాపి రసేఽఙ్గత్వం తస్మాదేషాం న విద్యతే. (ధ్వ. అ. పే. 222)

"రసాక్షిప్తతయా యస్య బన్ధః శక్యక్రియో భవేత్
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలఙ్కారో ధ్వనౌ మతః"(ధ్వ.ఆ.పే.219)

దిగితి :- ఈ యమకాలలో కొన్నింటికి దిఙ్మాత్రంగా దారి చూపించ డానికి మాత్రం ఉదాహరణలు ఇవ్వబడుతున్నాయి.

శ్లో॥ సన్నారీభరణోమాయమారాధ్య విధుశేఖరమ్,
సన్నారీభరణోఽమాయస్తతస్త్వం పృథివీం జయ. 360

వ్యా. సన్నారీతి :- ఇది రుద్రటాలంకారంలోని శ్లోకం. ప్రథమపాదాన్ని తృతీయపాదంలో ఆవృత్తి చేయడంచేత ఏర్పడే 'సందశం' అనే యమకానికి ఉదాహరణం. "సన్నారీ....అయమ్"- సన్నారీ=ఉత్తమస్త్రీలను, భరణ=రక్షించే, ఉమా = పార్వతీదేవిని, అయమ్ = అర్ధనారీశ్వరభావంలో పొందిన, విధుశేఖరమ్ =మహేశ్వరుణ్ణి, ఆరాధ్య=సేవించి, తతః=పిమ్మట, "సన్నారీ...రణః"- సన్న = నశించిన, అరీభ=శత్రుగజాలు గల, రణః=యుద్ధం కలవాడవై, అమాయః =కపటం లేనివాడవై, పృథివీమ్ = భూమిని, జయ=జయించుము.

అవ. ప్రథమపాదాన్ని ద్వితీయపాదంలోను, తృతీయపాదాన్ని చతుర్థ పాదంలోను ఆవృత్తి చేయడంచేత ఏర్పడిన 'యుగ్మకం' అనే యమకాన్ని ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ వినాయమేనో నయతాసుఖాదినా
వినా యమేనోనయతా సుఖాదినా,
మహాజనోఽదీయత మానసాదరం
మహాజనోదీ యతమానసాదరమ్. 361

వినేతి :- రుద్రటాలంకారంలోని శ్లోకం. వినా, అయమ్, ఏనః, నయతా, అసుఖాదినా, వినా, యమేన, ఊనయతా, సుఖాదినా, మహాజనః, అదీయత, మానసాత్, అరమ్, మహాజనోదీ, యతమానసాదరమ్ అని పదచ్ఛేదం. మహాజనో దీ-మహ=ఉత్సవాలను, అజ=తొలగించే దుర్మార్గులను, నోదీ=దూరంచేసే స్వభావంగల, అయమ్= ఈ, మహాజనః= మహాత్ముడైన, వినా = 'విశ్చాసౌ నా చ'

అని విగ్రహం. పక్షిరూపుడైన, హంసరూపుడైన, పురుషుడు, జీవుడు, మానసాత్ = మనస్సు అనే మానససరస్సునుండి, అరమ్ = శీఘ్రంగా, యతమానసాద రమ్-యతమాన = రక్షించడానికి ప్రయత్నిస్తున్నవాళ్ళకి, సాద = వినాశాన్ని, (విషాదాన్ని). రమ్ = ఇచ్చే విధంగా, ఏనో వినా = అపరాధం లేకుండగానే, నయతా = తీసికొనిపోవువాడు, అసుఖాదినా = ప్రాణాలను భక్షించేవాడు, సుఖాదినా = సుఖం మొదలైనవాటితో, ఊనయతా = హీనుణ్ణిగా చేసేవాడూ, అనగా సుఖాదులులేకుండా చేసేవాడూ అయిన, యమేన = యమునిచేత, ఆదీయత = ఖండించబడ్డాడు.

అవ. శ్లోకావృత్తిరూపమైన మహాయమకాన్ని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ స త్వారమ్భరతోఽవశ్యమబలం వితతారవమ్
సర్వదా రణమానైషీ దవానలసమాస్థితః. 362

సత్వారమ్భరతోఽవశ్యమవలమ్బితతారవమ్
సర్వదా రణమానైషీ దవానలసమాస్థితః, 363

వ్యా. స ఇతి :- ఇది కూడ రుద్రటాలంకారంలోని శ్లోకం. సః, తు, ఆరమ్, భరతః, అవశ్యమ్, అబలమ్, వితతారవమ్, సర్వదా, రణమ్, అనైషీత్, అవాన్, అలసమ్, అస్థితః, సత్త్వారమ్భరతః, అవశ్యమ్, అవలమ్బితతారవమ్, సర్వదారణమానైషీ, దవానలసమస్థితః అని పదచ్ఛేదం. అలసమ్ = మందంగా, అవాన్ = వెళ్ళనివాడు, శీఘ్రంగా వెళ్ళేవాడు అని అర్థం. అస్థితః = విష్ణువునందు ఉన్నవాడు, విష్ణుభక్తుడు, సత్త్వారమ్భరతః = సత్త్వగుణంతో కూడిన, సాత్త్వికాలైన పనులలో ఆసక్తి కలవాడు, సర్వదారణమానైషీ = అందరినీ చీల్చివేయుటయందు మానమును కోరే స్వభావం కలవాడు, దవానలసమస్థితః = దవాగ్నితో సమానమైన స్థితి కలవాడు అయిన, సః తు = ఆ రాజైతే, అబలమ్ = బలం లేనిది, వితతారవమ్ = అధికమైన హాహాకారధ్వని కలదీ, అవశ్యమ్ = లొంగనిదీ, ఆశ్రితతారవమ్ = ఆశ్రయించబడిన తరు (వృక్ష) స్వభావం కలదీ, చెట్లవలె న్రమం కానిది అని అర్థం. అయిన, అరమ్ = అరి (శత్రు) సముదాయాన్ని, సర్వదా = ఎల్లప్పుడూ, అవశ్యమ్ = తప్పకుండగా, భరతః = అతిశయంచేత, రణమ్ = యుద్ధమును, అనైషీత్ = పొందించెను.

అవ. పాదభాగాల ఆవృత్తి చేసిన యమకాలలో ద్వితీయపాదాంతభాగాన్ని చతుర్థపాదాంతభాగంలో ఆవృత్తి చేయడంచేత ఏర్పడిన సందష్టకం అనే యమకానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ అనన్తమహిమవ్యాప్తవిశ్వాం వేధా న వేద యామ్,
యా చ మాతేవ భజతే ప్రణతే మానవే దయామ్. 364

వ్యా. అనన్తేతి :- ఇది ఆనందవర్ధనుని దేవీశతకంలో ప్రథమశ్లోకం. అనన్తమహిమవ్యాప్తవిశ్వామ్ = అనంతమైన మహిమచేత వ్యాపించబడిన ప్రపంచం గల, యామ్ = ఏ దుర్గాదేవిని, వేధాః = బ్రహ్మదేవుడు, న వేద = ఎరుగడో, యా చ = ఏదేవి, ప్రణతే = నమస్కరించిన, మానవే = మానవునియందు, మాతేవ = తల్లి వలె, దయామ్ = దయను, భజతే = పొందునో.

"తమాంసి ధ్వంసమాయాన్తి యస్యాః స్తుత్యాదరేణ వః
తస్యాః సిద్ధ్యై ధియాం మాతుః కల్పన్తాం పాదరేణవః"

అనే పంచమశ్లోకంతో అన్వయం. అట్టి తల్లి పాదపాంసువులు మీకు సిద్ధిని ఇచ్చుగాక అని అర్థం.

అవ. ఆద్యభాగాన్ని అంతిమభాగంలో ఆవృత్తి చేయడానికి (ఆద్యంతిక యమకానికి) ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ యదానతోఽయదానతో నయాత్యయం న యాత్యయమ్,
శివేహితాం శివే హితాం స్మరామితాం స్మరామి తామ్. 365

వ్యా. యదేతి :- ఆనందవర్ధనుని దేవీశతకంలో 49వ శ్లోకం. యదానతః = ఏ దేవికి నమస్కరించిన, అయమ్ = ఈ జనుడు, అయదానతః = శుభావహమైన విధియొక్క దానంచేత, అనగా దేవి శుభావహవిధిని అనుగ్రహించడంచేత. నయాత్యయమ్ = నీతి విశ్లేషాన్ని, నీతినుండి దూరం అవడాన్ని, న యాతి = పొందడో, శివేహితామ్ = శివునిచేత ప్రార్థితురాలు, శివే = కల్యాణమునందు, హితామ్ = అనుకూలురాలు, స్మరామితామ్ = మన్మథునిచేత కొలచుటకు శక్యం కానిదీ, మన్మథునిచేత తిరస్కరింప శక్యం కానిదీ అయిన, తామ్ = ఆ దేవిని, స్మరామి = స్మరిస్తున్నాను.

శ్లో॥ సరస్వతి ప్రసాదం మే స్థితిం చిత్తసరస్వతి,
సర స్వతి కురు క్షేత్రకురుక్షేత్రసరస్వతి. 366

వ్యా. సరస్వతీతి :- ఆనందవర్ధనుని దేవీశతకంలో యాభై యవ శ్లోకం. ఈ శ్లోకం పూర్వార్ధంలో ఆద్యంతికం, ఉత్తరార్ధంలో అంతాదికం, ఆద్యంతికం ఉన్నాయి. అందుచేత మూడింటి సముచ్చయానికి ఈ శ్లోకం ఉదాహరణం. క్షేత్ర కురుక్షేత్రసరస్వతి = శరీరం అనే కురుక్షేత్రంలో ఉన్న సరస్వతీనదివైన దానా! సరస్వతీ = ఓ సరస్వతీ! ప్రసాదమ్ = ప్రసన్నత్వాన్ని, సర = పొందుము, ప్రసన్నురాలవు అవుము. మే = నాయొక్క, చిత్తసరస్వతి = చిత్తం అనే సముద్రంలో, స్థితిమ్ = స్థితిని, స్వతి = బాగుగా, కురు = చేయుము, నివసించుము.

ఇక్కడ పూర్వార్ధంలో ప్రథమపాదం మొదటిభాగం రెండవ పాదం చివర ఆవృత్తి చేయబడింది. అందుచేత ఈ పాదంలో 'ఆద్యంతికం' ద్వితీయ పాదాంత్యభాగం తృతీయపాదాద్యభాగంలో ఆవృత్తి చేయబడింది. అందుచేత 'అంతాదికం'. తృతీయపాదాద్యభాగం చతుర్థపాదాంత్యభాగంతో ఆవృత్తి చేయబడింది. అందుచేత 'ఆద్యంతికం'.

శ్లో॥ ససార సాకం దర్పేణ కందర్పేణ ససారసా,
శరన్నవానా బిభ్రాణా నాబిభ్రాణా శరన్నవా. 367

వ్యా. ససారేతి :- ఇది రుద్రటాలంకారంలోనిది. ససారసా = సారసపక్షులతో కూడినది, నవానా = (నవాని ఆనాని వాహనాని యస్యాః సా) = క్రొత్త బన్ను కలది, శరమ్ = రెల్లుగడ్డిని, బిభ్రాణా = ధరించుచున్నది, నాబి(వి)భ్రాణా = (వచయోరభేదః) వీనాం భ్రాణం శబ్దః యస్యాం సా విభ్రాణా = పక్షుల ధ్వనులు కలది. న విభ్రాణా అవిభ్రాణా = పక్షిధ్వనులు లేనిది, న అవిభ్రాణా నావిభ్రాణా = పక్షిధ్వనులు లేనిది కానిది. అనగా పక్షిధ్వనులు ఉన్నదీ, నవా = ప్రశస్తమూ అయిన, శరత్ = శరదృతువు, దర్పేణ = గర్వస్వరూపుడైన, కందర్పేణ సాకమ్ = మన్మథునితో కూడ, ససార = ప్రసరించెను, వచ్చెను.

ఇక్కడ ప్రథమపాదం చివరి అర్ధభాగం ద్వితీయపాదాద్యార్ధభాగంలోను, ఆద్యభాగం అంత్యభాగంలోను ఆవృత్తి చేయబడ్డాయి. ఈ విధంగా పూర్వార్ధంలో

ఆద్యంతిక-అంతాదికాలు రెండింటి సముచ్చయం. తృతీయపాదం అంత్యాది భాగాలు చతుర్థపాదం ఆద్యాంత్యభాగాలలో ఆవృత్తి చేయబడ్డాయి. అక్కడ కూడా ఆద్యంతిక-అంతాదికాల సముచ్చయం.

అవ. అనియతాలైన స్థానాలలో ఆవృత్తి చేయడంవల్ల ఏర్పడిన యమకాన్ని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ మధుపరాజి పరాజితమానినీ
జనమనఃసుమనఃసురభి శ్రియమ్,
అభృత వారిత వారిజవిప్లవం
స్ఫుటితతామ్ర తతామ్రవణం జగత్. 368

వృ. ఏవం వైచిత్ర్యసహస్రైః స్థితమేతదున్నేయమ్.

వ్యా. మదు ఇతి :- రత్నాకరకవిరచించిన హరవిజయమహాకావ్యంలో వసంతవర్ణనం. మధుప....సురభి- మధుప=తుమ్మెదలయొక్క, రాజి= పంక్తి చేత, పరాజిత= పరాజయం పొందింపబడిన, తొలగించబడిన ధైర్యం గల, మానినీజన= స్త్రీలయొక్క, మనః= మనస్సులు గల, సుమనః= పుష్పాలతో, సురభి= పరిమళించుచున్నది, వారితవారిజవిప్లవమ్= నివారించబడిన పద్మాల వినాశం గలది, 'స్ఫుటితతామ్రతతామ్రవణమ్'- స్ఫుటిత= వికసించిన, తామ్ర= ఎఱ్ఱనైన, (చిగుళ్ళచేత ఎఱ్ఱనైన), తత= విస్తరించిన. ఆమ్రవణమ్= మామిడి తోటలుగలది అయిన, జగత్= జగత్తు, శ్రియమ్= శోభను, అభృత= ధరించెను.

ఏవమితి :- ఈవిధంగా వేలకొలది వైచిత్ర్యాలతో ఈ యమకం ఉన్నది. ఇతరభేదాలకు ఉదాహరణలు ఊహించుకొనవలెను.

అవ. శ్లేష లక్షణం చెపుతున్నాడు.

కా. వాచ్యభేదేన భిన్నా యత్ యుగపద్ భాషణస్పృశః,
శ్లిష్యన్తి శబ్దాః శ్లేషోఽసావక్షరాదిభిరష్టధా. 84

వృ. "అర్థభేదేన శబ్దభేదః" ఇతి దర్శనే, 'కావ్యమార్గే స్వరో న

గణ్యతే' ఇతి చ నయే వాచ్యభేదేన భిన్నా అపి శబ్దా యత్ యుగపదు చ్చారణేన శ్లిష్యన్తి, భిన్నం స్వరూపమపహ్నువతే స శ్లేషః. స చ వర్ణ పదలిఙ్గభాషాప్రకృతిప్రత్యయవిభక్తివచనానాం భేదాదష్టధా. క్రమేణోదా హరణమ్.

వ్యా. వాచ్యేతి :- వాచ్యభేదేన = అర్థభేదంచేత, భిన్నాః = వేరువేరైన, యుగపత్ = ఒక్క పర్యాయమే, భాషణస్పృశః = ఉచ్చారణను పొందుచున్న, ఒకే సారి ఉచ్చరించబడుతున్న, శబ్దాః = శబ్దాలు, శ్లిష్యన్తి ఇది యత్ = శ్లిష్ట ములు అవుచున్నవి, కలియుచున్నవి అనేది ఏది కలదో, అసౌ = ఇది, శ్లేషః = శ్లేష. అక్షరాదిభిః = అక్షరం మొదలైనవాటిచేత, అష్టధా = ఎనిమిది విధాలు.

అర్థేతి :- 'అర్థభేదంచేత శబ్దభేదం' అని నియమం ప్రకారం, 'కావ్య మార్గంలో స్వరం లెక్కలోనికి తీసికొనబడదు' అనే నియమం ప్రకారం, అర్థ భేదంచేత శబ్దాలు వేరువేరైనా ఒక్కమారే ఉచ్చారణచేత కలిసిపోతున్నాయి; తమ వేరైన స్వరూపాన్ని కప్పివేస్తున్నాయి. ఇది శ్లేష.

వి. "సకృదుచ్చరితః శబ్దః సకృదేవార్థం గమయతి" "ఒక మారు ఉచ్చ రించబడిన శబ్దం ఒకే మారు అర్థాన్ని బోధిస్తుంది"అని నియమం ఉన్నది. అందు చేత ఒక శబ్దం రెండు అర్థాలను బోధించడానికి వీలులేదు. దీనిని పట్టి ఒకే శబ్దా నికి రెండర్థాలు ఉన్నట్లు మనం అనుకుంటాం కాని అది యుక్తం కాదు. మొదటి అర్థాన్ని చెప్పే పదం వేరు, రెండవ అర్థాన్ని చెప్పే పదం వేరు. 'విష్ణువు' అనే అర్థం చెప్పే 'హరి' శబ్దం వేరు; 'సింహం' అనే అర్థం చెప్పే 'హరి'శబ్దం వేరు. అర్థభేదంచేత శబ్దభేదం అనగా ఇదే. అయితే ఒకే ఉచ్చారణప్రయత్నంచేత రెండు శబ్దాలనీ ఒకే మారు ఉచ్చరిస్తున్నాం. అప్పుడు ఆ రెండు శబ్దాలూ కలిసి పోయినట్లు అయిపోయి రెండర్థాలను ఒకే శబ్దం బోధిస్తున్నది అన్న ప్రతీతి కలుగు తుంది. ఇలా రెండు శబ్దాలు వేరు వేరుగా కనబడకుండా, తమ విభిన్నరూపాలను కప్పివేసి, కలిసిపోవడం శ్లేష. ఒక్కొక్క సమాసానికి ఒక్కొక్క స్వరం ఉంటుంది కదా ? స్వరాన్ని పట్టి శబ్దభేదం తెలుస్తుంది కదా ? అని ప్రశ్నించ వచ్చును. కాని "కావ్యమార్గంలో స్వరం పరిగణనలోనికి తీసికొనకూడదు" అనే నియమాన్ని పట్టి స్వరభేదం ఉన్నా ఒకే శబ్దంగా కనబడడం ఉంటుంది.

వా. స చేతి :- వర్ణ-పద-లింగ-భాషా-ప్రకృతి-ప్రత్యయ-విభక్తి-వచనాల భేదాన్ని పట్టి ఈ శ్లేష కూడా ఎనిమిది విధాలు. క్రమంగా ఉదాహరణం.

సభంగశ్లేష, అభంగశ్లేష అని శ్లేష రెండు విధాలు. పదాన్ని విరవడం చేత ఏర్పడినది సభంగశ్లేష. విరవకుండానే ఉన్నది అభంగశ్లేష. సభంగశ్లేష వర్ణాదిభేదంచేత ఎనిమిది విధాలు. పదం అనగా సుబంతం లేదా తిఙంతం. భాష లనగా-

"సంస్కృతప్రాకృతమాగధపిశాచభాషాశ్చ శౌరసేనీ చ
షష్ఠోఽత్ర భూరిభేదో దేశవిశేషాదపభ్రంశః"

అని సంకేతవ్యాఖ్యలో చెప్పినవి. అయితే ఈ నాడు ప్రచారంలో ఉన్న అన్ని భాషలూ కూడా తీసికొనవచ్చు. ఒక పదానికి ఒక భాషలో ఒక అర్థం మరొక భాషలో మరొక అర్థం ఉండవచ్చు. ఈ అర్థభేదాన్ని పురస్కరించుకుని కవి శ్లేష కల్పించవచ్చు. ఉదాహరణకి ఈ క్రింది శ్లోకంలో సంస్కృతాంధ్రభాషల శ్లేషం ఉంది—

"అంబలిద్వేషిణం వన్దే చిన్తకాయ శుభప్రదమ్,
కూరగాయ కృతత్రాసం పాలనేతిప్రియం గవామ్."

చిన్తకాయ = చింతించేవానికి, ధ్యానించేవానికి, శుభప్రదమ్ = శుభం ఇచ్చేవాడు, కూరగాయ = పెద్ద ఉరగానికి, సర్పానికి, కృతత్రాసమ్ = చేయబడిన భయం కలవాడు, గవామ్ = గోవులయొక్క, పాలనే = పాలనమునందు, అతిప్రియమ్ = చాల ఇష్టం కలవాడు, బలిద్వేషిణమ్ = బలిచక్రవర్తికి శత్రువూ అయిన, అమ్ = విష్ణువును, వన్దే = నమస్కరిస్తున్నాను అని సంస్కృతార్థం. 'అంబలి' 'చింతకాయ' 'కూరగాయ' 'పాలనేతి' అనేవి తెలుగు పదాలు. ఆ రోజులలో ప్రాకృత భాషలు కూడా అధికప్రచారంలో ఉండడంచేత ఆలంకారికులు సంస్కృతప్రాకృత శ్లేషలకు ఉదాహరణలు ఇచ్చారు. ఈ శ్లేషభేదాలకి క్రమంగా ఉదాహరణం. మొదట వర్ణశ్లేషకి ఉదాహరణం ఇస్తున్నాడు-

శ్లో॥ అలంకారః శఙ్కాకరనరకపాలం పరిజనో
విశీర్ణాఙ్గో భృఙ్గో వసు చ వృష ఏకో బహువయాః.

అవస్థేయం స్థాణోరపి భవతి సర్వామరగురో
ర్విధౌ వక్రే మూర్ధ్ని స్థితవతి వయం కే పునరమీ. 369

వ్యా. అలంకార ఇతి :- శక్రాకరనరకపాలమ్ = భయం కలిగించే మనుష్యకపాలం, అలంకారః = అలంకారం, విశీర్ణాఙ్గః = శిథిలములైన అవయవాలు గల, భృఙ్గః = భృంగు డనేవాడు, పరిజనః = పరిజనం. బహువయాః = చాల వయస్సు గల, ఏకః వృషః = ఒక ఎద్దు, వసు చ = ధనము. వక్రే = వంకర మైన, ప్రతికూలమైన అని రెండవ అర్థం, విధౌ = చంద్రుడు, దైవం అని రెండవ అర్థం, మూర్ధ్ని = నెత్తిమీద, స్థితవతి = ఉండగా, ఉండడంవల్ల, సర్వామరగురోః = సమస్తదేవతలకు పూజ్యుడైన, స్థాణోః అపి = ఈశ్వరునికి కూడా, ఇయమ్ = ఈ, అవస్థా = అవస్థ, భవతి = అవుతూన్నది; అమీ వయం పునః = ఈ మనమైతే, కే = ఎవళ్ళము, మన మాట చెప్పాలా అని అర్థం.

చంద్రుడు అనే అర్థం గల 'విధు' శబ్దానికి, దైవం అనే అర్థం గల 'విధి' శబ్దానికి సప్తమ్యేకవచనంలో 'విధౌ' అని రూపం ఉంటుంది. 'విధు' శబ్దంలోని 'ఉ'కారం 'విధి' శబ్దంలోని ఇకారం 'ఔ'గా మారాయి. అందుచేత 'ఉ'స్థానంలో వచ్చిన 'ఔ'వేరు, 'ఇ' స్థానంలో వచ్చిన 'ఔ' వేరు. అయినా రెండింటికి శ్లేష, వర్ణశ్లేష.

అవ. పదశ్లేషకు ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో. పృథుకార్తస్వరపాత్రం భూషితనిఃశేషపరిజనం దేవ,
విలసత్కరేణుగహనం సంప్రతి సమమావయోః సదనమ్.

వ్యా. పృథుకేతి :- ఇది వెనుక 306వ శ్లోకంగా వచ్చినది. అక్కడ వ్యాఖ్యానించబడింది. ఇక్కడ 'పృథుక+ఆర్తస్వర', 'పృథు+కార్తస్వర' ఇత్యాది విధంగా భిన్నపదాలకు శ్లేష.

అవ. లింగ-వచనశ్లేషలకు ఉదాహరణం ఇస్తున్నాడు-

శ్లో॥ భక్తిప్రహ్వావిలోకనప్రణయినీ నీలోత్పలస్పర్ధినీ
ధ్యానాలమ్బనతాం సమాధినిరతైర్నీతే హితప్రాప్తయే,

లావణ్యస్య మహానిధీ రసికతాం లక్ష్మీదృశో స్తన్వతీ
యుష్మాకం కురుతాం భవార్తిశమనం నేత్రే తనుర్వా హరేః.

వృ. ఏష వచనశ్లేషోఽపి.

వా. భక్తితి :- ఇది భాగవతామృతవర్దనకవి శ్లోకం అని వ్యాఖ్యాతలు. హరేః = విష్ణుమూర్తియొక్క, నేత్రే = నేత్రాలు, తనుః వా = శరీరమూ, యుష్మాకమ్ = మీయొక్క, భవార్తిశమనమ్ = సంసారబాధాశమనాన్ని, కురుతామ్ = చేయుగాక. 'నేత్రే' అనే నపుంసకలింగద్వివచనశబ్దానికి, 'తనుః' అనే స్త్రీలింగైకవచనశబ్దానికి అన్వయించేటట్లుగా విశేషణాలు ప్రయోగించాడు కవి. భక్తిప్రహ్వవిలోకనప్రణయినీ = నేత్రపక్షంలో. భక్తిచేత వంగినవారిని అనుగ్రహంతో చూడడానికి ఆసక్తి కలవి, శరీరపక్షంలో-భక్తిచేత వంగినవారిని చూడవలె ననే ఆసక్తి దేనివిషయంలో ఉందో అది; దీనిని చూడవలె నని భక్తులు అత్యాసక్తితో ఉంటారని అర్థం. నీలోత్పలస్పర్ధినీ = నల్లకలువలతో పోటీచేస్తున్నవి, చేస్తున్నదీ, సమాధినిరతైః = సమాధియందు ఆసక్తికలవాళ్ళచేత, హితప్రాప్తయే = హితలాభం కొరకు, ధ్యానాలమ్బనతామ్ = ధ్యానానికి ఆలంబనత్వాన్ని, విషయత్వాన్ని, నీతే = పొందింపబడినవి అని నేత్రపక్షంలో అర్థం. శరీరం పక్షంలో "నీతా+ఈహిత ప్రాప్తయే" అని పదచ్ఛేదం. ఈహితప్రాప్తయే = ఇష్టప్రాప్తికొరకు, ధ్యానాలంబితత్వాన్ని, నీతా = పొందించబడినది అని అర్థం. లావణ్యస్య = లావణ్యంయొక్క, మహానిధీ = గొప్ప నిధులు అని నేత్రపక్షంలో, శరీరపక్షంలో 'మహానిధిః' అని పదచ్ఛేదం. అర్థం సమానమే. లక్ష్మీదృశోః = లక్ష్మినేత్రాలకి, రసికతామ్ = రసికత్వాన్ని, తన్వతీ = చేయుచున్నవి, చేయుచున్నది అయిన, 'నేత్రే తనుః వా భవార్తిశమనం కురుతామ్' అని అన్వయం. 'కురుతామ్' అనేది 'కృఞ్' ధాతువునకు పరస్మైపదంలో లోట్ ప్రథమపురుషద్వివచనం. "కరోతు-కురుతామ్-కుర్వన్తు". 'నేత్రే' ద్వివచనం కాబట్టి 'కురుతామ్' ద్వివచనం. ఆత్మనేపదంలో ఏకవచనం. "కురుతామ్-కుర్వాతామ్-కుర్వతామ్". 'తనుః ఏకవచనం అందుచేత 'కురుతామ్' ఏకవచనం. 'ప్రణయినీ' ఇత్యాదిపదాలలో నపుంసకలింగస్త్రీలింగాలకి ద్వివచనఏకవచనాలకి శ్లేషలు. ఈ రెండు శ్లేషలకి ఇక్కడ సంకరం.

అవ. సంస్కృతప్రాకృతభాషల శ్లేషకి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ మహదేసురసంధమ్మే తమవసమాసంగమాగమాహరణే,
హరబహుసరణం తం చిత్తమోహమవసరఉమే సహసా.

వ్యా. మహదే ఇతి :- ఆనందవర్ధనుని దేవీశతకంలో 76వ పద్యం. సంస్కృతపక్షంలో "మహదే, సురసంధమ్, మే, తమ్, అవ, సమాసంగమ్, ఆగమాహరణే, హర, బహుసరణమ్, తమ్, చిత్తమోహమ్, అవసరే, ఉమే, సహసా అని పదచ్ఛేదం. ఉమే = ఓ! ఉమాదేవీ! మహదే = ఉత్సవమును ఇచ్చేదానా! అని దేవీసంబోధనం. లేదా మహదే = ఉత్సవమును ఇచ్చేదైన, 'ఆగమాహరణే'కి విశేషణం. మే ఆగమాహరణే = నా వేదవిద్యోపార్జనమునందు, సురసంధమ్ = = దేవతలతో సంబంధాన్ని కలిగించు (సురైః సంధా యస్మాత్ తత్), సమాసంగమ్ = అత్యంతాసక్తిని, అవ = రక్షించుము. అవసరే = మోహాన్ని తొలగించే సమయంవచ్చినప్పుడు, బహుసరణమ్ = అనేకవిధాల ప్రసరిస్తూన్న తమ్ = ఆ, చిత్తమోహమ్ = చిత్తమోహాన్ని, సహసా = శీఘ్రంగా, హర = తొలగించుము.

ప్రాకృతపక్షంలో మహ, దేసు, రసమ్, ధమ్మే, తమవసమ్, ఆసమ్, గమాగమా, హర, ణే, హరబహు, సరణమ్, తమ్, చిత్త మోహమ్, అవసరఉ, మే, సహసా అని పదచ్ఛేదం.

"మమ దేహి రసం ధర్మే తమోవశామ్ ఆశామ్ గమాగమాత్ హర నః,
హరవధు శరణం త్వం చిత్తమోహోఽపసరతు మే సహసా"
అని సంస్కృతమ్.

హే హరవధు = ఓ ఈశ్వరుని భార్యవైన దేవీ! మమ = నాకు, ధర్మే = ధర్మమునందు, రసమ్ = ఆసక్తిని, దేహి = ఇమ్ము. నః = మాయొక్క, తమోవశామ్ = తమస్సుకు వశమైన, ఆశామ్ = ఆశను. గమాగమాత్ = చావుపుట్టుకల రూపమైన సంసారంనుండి, హర = హరించుము. త్వమ్, = నీవే, శరణమ్ = శరణము. సహసా = వెంటనే, మే = నాయొక్క, చిత్తమోహః = చిత్తముయొక్క మోహం, అపసరతు = తొలగుగాక.

ఇక్కడ 'సహసా' అనే పదంలో తప్ప మిగిలిన అన్ని పదాలలోనూ సంస్కృత ప్రాకృతాలకు శ్లేష.

అవ. ప్రకృతిశ్లేషకు ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అయం సర్వాణి శాస్త్రాణి హృది జ్ఞేషు చ వక్ష్యతి,
సామర్థ్యకృదమిత్రాణాం మిత్రాణాం చ నృపాత్మజః. 373

వ్యా. అయమితి :- అయమ్ = ఈ, నృపాత్మజః = రాజకుమారుడు, సర్వాణి = సమస్తమైన, శాస్త్రాణి = శాస్త్రాలను, హృది = హృదయమునందు, వక్ష్యతి = వహించగలడు. జ్ఞేషు చ = పండితులయందు (కు), వక్ష్యతి చ = చెప్పగలడు కూడ. అమిత్రాణామ్ = శత్రువులయొక్క, సామర్థ్యకృత్ = సామర్థ్యాన్ని ఛేదించేవాడు, మిత్రాణామ్ = మిత్రులకు, సామర్థ్యకృత్ చ = సామర్థ్యం ఇచ్చేవాడు కూడ.

వి. దేనికి ప్రత్యయాలు చేరుస్తామో అది ప్రకృతి. ఇక్కడ 'వక్ష్యతి' అనుదానికి 'వహ్' ధాతువు, 'వచ్' ధాతువు ప్రకృతులు. ఈ రెండింటికి కూడ లృట్‌లో 'వక్ష్యతి' ఇత్యాది రూపాలు ఉంటాయి. 'సామర్థ్యకృత్' అనే పదం "సామర్థ్యం కృన్తతీతి సామర్థ్యకృత్" అని 'కృంత్' ధాతువునుండీ, "సామర్థ్యం కరోతీతి సామర్థ్యకృత్" అని 'కృఞ్' ధాతువునుండి ఏర్పడుతుంది. మైదానిలో ధాతురూపప్రకృతికి, రెండవదానిలో ధాతుజన్య (కృదంత) ప్రాతిపదికరూపప్రకృతికీ శ్లేష.

అవ. ప్రత్యయశ్లేషకి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ రజనిరమణమౌలేః పాదపద్మావలోక
క్షణసమయపరాప్తాపూర్వసంపత్సహస్రమ్,
ప్రమథనివహమధ్యే జాతుచిత్త్వత్ప్రసాదా
దహముచితరుచిః స్యాన్నన్దితా సా తథా మే. 374

వ్యా. రజనీతి :- రజనిరమణమౌలేః = చంద్రుడు శిరస్సునందు గల ఈశ్వరుని యొక్క, "పాదపద్మావలోక....సహస్రమ్"- పాదపద్మ = పాదపద్మాల యొక్క, అవలోక = చూడడం అనే, క్షణ = ఉత్సవముయొక్క, సమయ = సమయమునందు, పరాప్త = పొందబడిన, అపూర్వ = అపూర్వములైన, సంపత్ = సంప

దలయొక్క, సహస్రమ్ = సహస్రం కలుగునట్లుగా, అహమ్ = నేను, త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహంవలన, జాతు చిత్ = ఎప్పుడైనా, ప్రమథనివహమధ్యే = ప్రమథ గణాల మధ్యయందు, ఉచితరుచిః = తగిన కాంతి కలవాడనై, నన్దితా = సంతోషింపచేసేవాడను, స్యామ్ = అగుదును గాక. తథా = మరియు, సా = అదియే, మే = నాకు, నన్దితా = నందిత్వంగా, స్యాత్ = అగును గాక.

ఇక్కడ - "స్యామ్ + నన్దితా = స్యాన్నన్దితా" "స్యాత్ + నన్దితా = స్యాన్నన్దితా" అని ఉత్తమపురుషైకవచనంగాను, ప్రథమపురుషైకవచనంగా కూడా గ్రహించబడింది. అందుచేత ఉత్తమపురుష-ప్రథమపురుషప్రత్యయాలకు శ్లేష. నన్దితా = అనే పదంలో 'నన్దయతీతి నన్దితా' అని కర్త్రర్థకతృచ్ ప్రత్యయానికి "నన్దినః భావః నన్దితా" అని భావార్థక 'తల్' ప్రత్యయానికి శ్లేష. 'తృచ్' కృత్ప్రత్యయం, 'తల్' తద్ధితప్రత్యయం.

అవ. 'సుప్' 'తిఙ్' రూపవిభక్తుల శ్లేషకి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ సర్వస్వం హర సర్వస్య త్వం భవచ్ఛేదతత్పరః,
నయోపకారసాంముఖ్యమాయాసి తనువర్తనమ్. 375

వ్యా. సర్వస్వమితి :- భక్తుడు శివునితోను, దోపిడీదొంగ పుత్రుడితోను అంటూన్న మాటలు. మొదటిపక్షంలో- హర = శివుడా! భవచ్ఛేదతత్పరః = సంసారమును నశింపచేయడంలో ఆసక్తిగల, త్వమ్ = నీవు, సర్వస్య = అందరికీ, సర్వస్వమ్ = సర్వస్వమైనవాడవు. నయోపకారసాముఖ్యమ్ = నీతికి, ఉపకారానికి సాంముఖ్యం ఉన్న, దేనివలన నయోపకారాలకు సాంముఖ్యం, అనుకూలత్వం కలుగుతుందో అట్టి, తనువర్తనమ్ = శరీరస్థితిని, ఆయాసి = పొందుచున్నావు, ఇది వ్యాఖ్యాతలు చెప్పిన అర్థం. లోకోపకారం చేసి నీ జీవితాన్ని సార్థకం చేసుకుంటున్నావు అని ఈశ్వరునితో అన్నట్లు అవుతుంది. తనువర్తనమ్ = జనుల శరీర స్థితిని, నయోపకారసాంముఖ్యమ్ = నయోపకారములకు సాంముఖ్యమును, ఆయాసి = పొందించుచున్నావు (అంతర్భావితణిజర్థం) అని అర్థం చెపితే బాగుంటుంది.

రెండవ పక్షంలో- త్వమ్ = నీవు, సర్వస్య = అందరియొక్క, సర్వస్వమ్ = సర్వస్వాన్ని, హర = హరించుము. ఛేదతత్పరః = గ్రంథులను (ధనం దాచినముడులు) గోడలను ఛేదించడంలో ఆసక్తి కలవాడవు, భవ = అగుము.

ఉపకారసాంముఖ్యమ్ = ఉపకారంచేయడానికి సుముఖత్వాన్ని, నయ = దూరం చేయుము. ఆయాసి = ఇతరులకు ఆయాసం కలిగించే, వర్తనమ్ = జీవికను, తను = చేయుము.

ఇక్కడ 'హర' 'భవ' 'నయ' 'తను' అనే పదాలు ఒక అర్థంలో సుబంతాలు, రెండవ అర్థంలో తిజంతాలు. అందుచేత సుబంతతిజంతశ్లేష.

అవ. ఎనిమిది విధాలైన సభంగశ్లేషను నిరూపించి ఇప్పుడు అభంగశ్లేష చెపుతున్నాడు.

కా. భేదాభావాత్ప్రకృత్యాదేర్భేదోఽపి నవమో భవేత్.

వృ. నవమోఽపీతి అపిర్భిన్నక్రమః. ఉదాహరణమ్.

శ్లో॥ యోఽసకృత్పరగోత్రాణాం పక్షచ్ఛేదక్షణక్షమః,
శతకోటిదతాం బిభ్రద్విబుధేన్ద్రః స రాజతే. 376

వృ. అత్ర ప్రకారణాదినియమాభావాత్ ద్వావప్యర్థౌ వాచ్యౌ.

వ్యా. భేదేతి :- ప్రకృత్యాదేః = ప్రకృతి మొదలైన, భేదాభావాత్ = భేదం లేకపోవడంవలన, నవమోఽపి = తొమ్మిదవది కూడా, భేదః = భేదం, భవేత్ = అగును.

పైన చెప్పిన ప్రకృతి, అక్షరాలు మొదలైన భేదహేతువులు లేకపోవడం చేత అలాంటి వేపీ లేని తొమ్మిదవ భేదం కూడా ఒకటి శ్లేషలో ఉన్నది; అదే అభంగశ్లేష.

నవమోపీతి :- 'భేదోఽపి' అని ఉన్న 'అపి' శబ్దాన్ని 'నవమ' శబ్దంతో కలిపి 'నవమోఽపి' అని అర్థం చెప్పుకోవాలి. ఉదాహరణం ఎట్లనగా-

యః ఇతి :- యః = ఎవడు, అసకృత్ = అనేకపర్యాయములు, పరగోత్రాణామ్ = శత్రువంశాలయొక్క, పక్షచ్ఛేదక్షణక్షమః = పక్షాలను (సహాయులను) ఛేధించడంలో క్షణకాలంలోనే సమర్థుడో, శతకోటిదతామ్ = నూరుకోట్లను ఇచ్చేవాడగుటను, బిభ్రత్ = ధరించుచున్న, నూరుకోట్ల దానం చేసే, సః = ఆ, విబుధేన్ద్రః = పండితశ్రేష్ఠుడైన రాజా, రాజతే = ప్రకాశిస్తున్నాడు. ఇది రాజపక్షంలో అర్థం.

యః=ఎవడు, అసకృత్=అనేకపర్యాయములు, పరగోత్రాణామ్=శ్రేష్ఠములైన పర్వతాలయొక్క, పక్షచ్ఛేదక్షణక్షమః=రెక్కలను చేధించడంలో క్షణకాలంలోనే సమర్థుడో, శతకోటిదతామ్=వజ్రాయుధంతో ఖండించేవా డగుటను, బిభ్రత్=ధరిస్తూన్న, సః=ఆ, విబుధేన్ద్రః= దేవేంద్రుడు, రాజతే=ప్రకాశిస్తున్నాడు. ఇంద్రుని పక్షంలో అర్థం.

అత్ర ఇతి :- ఇక్కడ ప్రకరణాదినియామకాలు ఏవీ లేవు. అందువలన రెండర్థాలూ కూడ వాచ్యాలే.

వి. ప్రకరణాదులచేత ఒక అర్థమే వాచ్యం అని నియమం ఉన్నప్పుడు 'భద్రాత్మనః' ఇత్యాది శ్లోకంలో వలె (చూ. 22. వ శ్లో.) ఒక అర్థం వాచ్యం, రెండవ అర్థం వ్యంగ్యం అని చెప్పవలసి ఉంటుంది. అటువంటివి ఏవీ లేవు గాన ఇక్కడ రెండర్థాలూ వాచ్యాలే. అందుచేత శ్లేష. గోత్ర-పక్ష-విబుధేన్ద్ర ఇత్యాది పదాలు ఉన్నవి ఉన్నట్లుగా వర్ణ-ప్రకృత్యాదిభేదాలేవీ లేకుండా రెండర్థాలను బోధిస్తున్నాయి. విరుపులు మొదలైనవి లేవు. అందుచేత ఇది అభంగశ్లేష. "శతకోటిదతామ్" అన్నప్పుడు మాత్రం ప్రకృతిశ్లేష. 'శతకోటీః దదాతీతి శతకోటిదః' అనీ 'శతకోటినా ద్యతి ఖణ్డయతీతి శతకోటిదః" అనీ ధాతువులో భేదం ఉన్నది. మొదటి దానిలో 'దాఞ్' ధాతువు; రెండవదానిలో 'దో' ధాతువు.

అవ. కొందరు ప్రాచీనాలంకారికులు శ్లేష ఎక్కడ శబ్దాలంకారమో, ఎక్కడ అర్థాలంకారమో వ్యవస్థ చూపి ఈ అలంకారం ఇతరలంకారబాధకం అని ప్రతిపాదించారు. ఆ మతాన్ని నిరాకరిస్తున్నాడు.

వృ. నను స్వరితాదిగుణభేదాత్ భిన్నప్రయత్నోచ్చార్యాణాం తదభావాదభిన్నప్రయత్నోచ్చార్యాణాం చ శబ్దానాం బన్ధః అలంకారాన్తర ప్రతిభోత్పత్తిహేతుః శబ్దశ్లేషః అర్థశ్లేషశ్చేతి ద్వివిధోఽప్యర్థాలంకార మధ్యే పరిగణితోఽన్యైరితి కథమయం శబ్దాలంకారః? ఉచ్యతే-ఇహ దోషగుణాలంకారణాం శబ్దార్థగతత్వేన యో విభాగః సః అన్వయవ్యతిరేకాభ్యామేవ వ్యవతిష్ఠతే. తథాహి-కష్టత్వాదిగాఢత్వాద్యనుప్రాసాదయః, వ్యర్థత్వాదిప్రౌఢ్యాద్యుపమాదయః తద్భావతదభావానువిధాయిత్వాదేవ శబ్దార్థగతత్వేన వ్యవస్థాప్యన్తే.

వ్యా. నన్వితి-ఆశంక-స్వరితాదిగుణాల భేదంవల్ల భిన్నమైన ప్రయత్నంచేత ఉచ్చరించదగిన శబ్దాల బంధమూ, స్వరితాదులు లేకపోవడంచేత అభిన్నప్రయత్నం చేత ఉచ్చరింపదగిన శబ్దాల బంధమూ ఇతరాలంకారాల భానం కలగడానికి మాత్రమే హేతువు అయే 'శబ్దశ్లేష', 'అర్థశ్లేష' అని రెండు విధాలైనదానిని ఇతరులు (కొందరు ప్రాచీనాలంకారికులు) అర్థాలంకారాల మధ్యనే పరిగణించారు కదా? ఇది శబ్దాలంకారం ఎలా అవుతుంది? సమాధానం చెప్పబడుతుంది. ఇక్కడ (ఈ శాస్త్రంలో), దోష-గుణ-అలంకారాలు శబ్దార్థగతాలు అని ఏ విభాగం చేయబడుతున్నదో అది అన్వయవ్యతిరేకాలమీదనే ఆధారపడి ఉంటుంది. ఎందుచేతననగా-కష్టత్వాదులు, గాఢత్వాదులు, అనుప్రాసాదులు (ఈ మూడూ). వ్యర్థత్వాదులు, ప్రౌఢ్యాదులు ఉపమాదులు (ఈమూడూ) అవి, అనగా శబ్దార్థాలు, ఉండడాన్నీ, లేకపోవడాన్నీ అనుసరించి ఉండడంచేత శబ్దగతా లనీ అర్థగతాలనీ నిర్ణయించబడుతున్నాయి.

వి. ఇక్కడ మమ్మటుడు నిరాకరిస్తూన్న మతం అలంకారసర్వస్వంలో రుయ్యకుడు ప్రతిపాదించిన మతం అని ప్రదీపకారుడైన గోవిందఠక్కురుడు, బాలబోధిని రచయిత అయిన వామనఝల్కీకర్, తదితరవ్యాఖ్యాతలు అభిప్రాయపడి రుయ్యకుని మతం అంతా అనువదించి దానిని నిరాకరించడానికిప్రయత్నించారు. బలీయమైన అనేకప్రమాణాలచేత రుయ్యకుడు మమ్మటుని తరవాతివాడని తెలుస్తున్నది. అందుచేత ఇది తదీయమతనిరాకరణం కాదు. ఉద్భటుడు కావ్యాలంకారసారసంగ్రహంలో ప్రకటించిన అభిప్రాయాన్ని మమ్మటుడు ఇక్కడ ఖండిస్తున్నాడు (అయితే రుయ్యకుడు ఉద్భటమతాన్ని సమర్థించాడు. అతడు మమ్మటుని కావ్యప్రకాశతో పరిచితుడో కాడో నిశ్చితంగా చెప్పడం కష్టం. అదంతా మరొక అంశం), అందుచేతనే అతిప్రాచీనవ్యాఖ్య అయిన సంకేతంలో "అన్యైరితి. ఉద్భటాద్యైః" అని చెప్పబడింది. మరికొందరు వ్యాఖ్యాతలు కూడా ఇది ఉద్భటమతమే అని అన్నారు. ఈ సందర్భంలో మమ్మటుడు ఉదాహరించిన "స్వయం చ" ఇత్యాదిశ్లోకం కూడా ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహంలోదే. అందుచేత మమ్మటుడు ఉద్భటమతాన్నే ఉట్టంకించి నిరాకరిస్తున్నా డని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహం, దానికి ఇందురాజు రచించిన లఘువృత్తి పరిశీలిస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది-

"ఏకప్రయత్నోచ్చార్యాణాం తచ్ఛాయాం చైవ బిభ్రతామ్,
స్వరితాదిగుణైర్భిన్నైర్బన్ధః శ్లిష్టమిహోచ్యతే.

అలంకారాన్తరగతాం ప్రతిభాం జనయత్పదైః,
ద్వివిధైరర్థశబ్దోక్తివిశిష్టం తత్ప్రతీయతామ్" (కా.సా.సం.4.9,10)

ఇవి కావ్యాలంకారసారసంగ్రహంలో భట్టోద్భటుని కారికలు. "అర్థభేదాన్ని పట్టి శబ్దభేదం" అనే సిద్ధాంతాన్ని అంగీకరించినవాడు భట్టోద్భటుడు. రెండు వేరు వేరు అర్థాలు చెప్పే సమానాకారం గల రెండు శబ్దాలు ఉన్నాయి. వాటిని ఉచ్చరించే కంఠతాల్వాదిస్థానాలలో భేదం ఉండదు. అందుచేత ఒక్కమారు ఉచ్చరించినా రెండు శబ్దాలనీ ఉచ్చరించి నట్లు అనిపిస్తుంది. అలాంటి పదాలు ఉన్న శ్లేష అర్థ శ్లేష. కొన్ని శబ్దాలలో ఉదాత్తానుదాత్తస్వరితస్వరాలు వేరు వేరుగా ఉంటే వాటి ఉచ్చారణస్థానాదులు మారుతాయి. అందుచేత అలాంటి రెండు పదాలను ఒక్క ప్రయత్నంచేత ఉచ్చరించడం కుదరదు అయినా వీటికి ఏకప్రయత్నంచేత ఉచ్చరించడానికి శక్యమైన పదాల పోలిక ఉండడంచేత ఒక శబ్దాన్ని ఉచ్చరిస్తే, ఉచ్చరించని శబ్దం కూడా దీనితో శ్లిష్టం అవుతుంది. సమాసాదిభేదాన్ని పట్టి స్వరితాదిస్వరాలలో భేదం ఉంటుంది. తత్పురుషసమాసంలో ఉన్న పదం స్వరంవే రు, బహువ్రీహిలో వేరు, అసలు సమాసంలో కాకుండా వ్యస్తంగా ఉంటే వేరు. ఈ భేదాలన్నీ వ్యాకరణశాస్త్రంలో చెప్పబడ్డాయి ఈ శ్లేషకి శబ్దశ్లేష అని పేరు. అర్థశ్లేష అయినా శబ్దశ్లేష అయినా ఈ పేరు రావడానికి కారణం రెండు అర్థాలను బోధించడమేకాబట్టి ఈరెండు రకాల శ్లేషనీ కూడా అర్థాలంకారాలలోనే చేర్చారు.

ఇక్కడనే ఉద్భటుడు "అలంకారాన్తరగతాం ప్రతిభాం జనయత్పదైః" అని మరొక విషయం కూడా చెప్పాడు అనగా ఈ రెండు విధాలైన శ్లేషలకీ కూడా స్వతః అలంకారత్వం లేదు; ఉపమాద్యలంకారఆభాసాన్ని ఇవి కలిగిస్తాయి. అందుచేత ఇవి అలంకారాలు అయ్యాయి అయితే ఇక్కడ ఆ ఉపమాదులకు ప్రాధాన్యం లేదు శ్లేషకే ప్రాధాన్యం. ఎందుచేతననగా ఇక్కడ కూడా ఉపమాదులకే ప్రాధాన్యం అంగీకరిస్తే శ్లేషకి (అలంకారంగా) స్థానమే లేకుండా పోతుంది. అందుచేత ఆ ఉపమాదులు ఆభాసమాత్రాలే అని గ్రహించి శ్లేషకే ప్రాధాన్యం ఇవ్వాలి. శ్లేషతో సంబంధం లేని ఇతరస్థలాలు ఉపమాదులకు ఉండనే ఉన్నాయి కదా అని ఇందురాజు వ్యాఖ్యానంలో విశదీకరించాడు.

ఈ విషయాన్నే మమ్మటుడు "నను"తో ప్రారంభించి "కథమయం శబ్దాలంకారః" వరకు ఉన్న వాక్యంలో అనువదించాడు. ఈ కారికలలోని పదాలనే కొంచెం మార్చి 'స్వరితాదిగుణభేదాత్' 'అభిన్నప్రయత్నోచ్చార్యాణామ్' 'అలంకారాన్తరప్రతిభోత్పత్తిహేతుః' మొదలైనవాటిని, ఉపయోగించాడు, దీనిని

పట్టి కూడా మమ్మటుడు అనువదించి ఖండిస్తున్నది ఉద్భటుని మతమే అని స్పష్టం అవుతున్నది.

కొన్ని దోషాలు, కొన్ని గుణాలు (వామనాదుల ప్రకారం), కొన్ని అలంకారాలు శబ్దగతా లనీ, కొన్ని దోష-గుణ-అలంకారాలు అర్థగతా లనీ అనుకునే విభాగానికి ఆధారం అన్వయవ్యతిరేకాలే. కష్టత్వం మొదలైన దోషాలు, గాఢత్వంమొదలైన గుణాలు, అనుప్రాస మొదలైన అలంకారాలు ఒకవిధమైన శబ్దం ఉంటే ఉంటున్నాయి; అది లేకపోతే లేవు. ఈ అన్వయవ్యతిరేకాలను పట్టి ఇవన్నీ శబ్దానికి సంబంధించినవి అని నిర్ణయిస్తున్నారు. అదే విధంగా వ్యర్థత్వాది దోషాలు, ప్రౌఢ్యాదిగుణాలూ, ఉపమాద్యలంకారాలూ ఒక విధమైన అర్థం ఉంటే ఉంటున్నాయి; అది లేకపోతే లేవు. అందుచేత ఇవన్నీ అర్థానికి సంబంధించినవని నిర్ణయిస్తున్నారు.

శ్లో॥ స్వయం చ పల్లవాతామ్రభాస్వత్కరవిరాజితా, ఇత్యభఙ్గః
ప్రభాతసంధ్యేవాస్వాపఫలలుబ్ధేహితప్రదా. 377 ఇతి సభఙ్గః.

వృ. ఇతి ద్వావపి శబ్దైకసమాశ్రయావితి ద్వయోరపి శబ్దశ్లేషత్వముపపన్నమ్, న త్వాద్యస్యార్థశ్లేషత్వమ్. అర్థశ్లేషస్య తు స విషయః యత్ర శబ్దపరివర్తనేఽపి న శ్లేషత్వఖణ్డనా యథా-

శ్లో॥ స్తోకేనోన్నతిమాయాతి స్తోకేనాయాత్యధోగతిమ్,
అహో సుసదృశీ వృత్తిస్తులాకోటేః ఖలస్య చ. 378

వ్యా. స్వయమితి-ఇది ప్రతీహారేందురాజు రచించిన ఉద్భటాలంకారసారసంగ్రహలఘువృత్తిలోని పార్వతీవర్ణనపర శ్లోకం అని వామనఝల్కీకర్ వ్రాశారు. కాని ఇది ఉద్భటుని శ్లోకమే, లఘువృత్తికారునిది కాదు. ఉద్భటుడు కారికలు వ్రాసి తాను రచించిన కుమారసంభవంలోని కొంత భాగాన్ని ఉదాహరణలుగా ఇచ్చినట్లు ప్రతిహారేందురాజే- "అనేన గ్రన్థకృతా స్వోపరచితకుమారసంభవైకదేశోఽత్ర ఉదాహరణత్వేనోపన్యస్తః" (1.17) అని వ్రాశాడు. పార్వతిపక్షంలో-స్వయం చ=స్వయంగా కూడ, అనగా మహాత్ముడైన హిమవంతుని కూతురు అవడంచేతనే కాకుండా స్వయంగా కూడ ఈమె గొప్పది అని

భావం. "స్వాసంబన్ధేనైవ" (భర్తను పట్టి కాకుండా) అని వామన్ ఝల్కీకర్ వ్రాసినది సరికాదు. ప్రభాతసంధ్యేవ=ప్రాతఃకాలసంధ్యవలె, పల్లవాతామ్రభాస్వత్కరవిరాజితా=చిగుళ్ళవలె ఎఱ్ఱనైన ప్రకాశిస్తూన్న హస్తాలతో శోభింపచేయబడినది. అస్వాపఫలలుబ్ధేహితప్రదా=సులభంగా పొందశక్యం కాని మోక్షాదిఫలమునందు ఆసక్తి కలవాళ్ళ కోరికలను ఇచ్చేది. సంధ్యపక్షంలో-పల్లవాతామ్రభాస్వత్కరవిరజితా=చిగుళ్ళవలె కొంచెం ఎఱ్ఱగాఉన్న సూర్యకిరణాలచేత ప్రకాశింపచేయబడినది. అస్వాపఫలలుబ్ధే=నిద్రించకపోవడంవల్ల లభించే సంధ్యావందనాది ఫలములయందు ఆసక్తికలవానియందు (కి). హితప్రదా=హితం ఇచ్చేది.

వి. "పల్లవాతామ్రభాస్వత్కరవిరాజితా"లో అభంగశ్లేష, 'భాస్వత్' 'కర' అనే పదాలకి ఏ విరుపులూ లేకుండా రెండర్థాలు. "అస్వాపలుబ్ధేహితప్రదా" అనేదానిలో సభంగశ్లేష, పార్వతి పక్షంలో 'సు+ఆప', 'లుబ్ధ+ఈహిత', అని, సంధ్యావర్ణనంలో 'స్వాప', 'లుబ్ధే', 'హిత' అనీ పదచ్ఛేదం చేయబడింది.

పైన అభంగశ్లేషస్థలంలో 'అర్థశ్లేష' అనీ సభంగశ్లేషస్థలంలో శబ్దశ్లేష అనీ ఉద్భటుని మతం. దీనిని ప్రతీహారేందు స్పష్టంగా వివరించాడు. 'భాస్వత్' 'కర' అనేభిన్నార్థకాలైన శబ్దాలు వేరువేరుశబ్దాలే అయినా అవి ఒకే ప్రయత్నం చేత ఉచ్చరించడానికి వీలవడంచేత ఇక్కడ అర్థశ్లేష. "అస్వాపఫలలుబ్ధేహిత ప్రదా" అనేదానిలో మొదటి పక్షంలో ఒకే సమాసం అవడంచేతవ్యాకరణాను సారం దాని స్వరం వేరు, రెండవ పక్షంలో 'అస్వాపఫలలుబ్ధే', 'హితప్రదా' అని భిన్నపదా లవడంచేత వీటి స్వరం వేరు. అందుచేత ఈ రెండు పదాలనూ (అర్థ భేదం చేతనే కాకుండా స్వరభేదంచేత కూడా)రెండు పదాలుగా అంగీకరించవలసి ఉంది. "అస్వాపఫలలుబ్ధేహితప్రదా" "అస్వాపఫలలుబ్ధే, హితప్రదా" అనేవాటిని ఒకే ప్రయత్నంచేత ఉచ్చరించడం కుదరదు. అయినా కూడా ఈ పదంలో ఆ పదం శ్లిష్టం అయి ఏకపదంగా పరిగణించబడుతున్నది. అందుచేత ఇది శబ్దశ్లేష అని ఆయన వివరించాడు. ఈవివరణాన్ని పట్టి రెండవ శబ్దం మొదటిశబ్దం కలిసి పోయినట్లు అయింది; అందుచేత ఇది శబ్దశ్లేష అని ఉద్భటాదులు అభిప్రాయం అన్నట్లు తోస్తుంది.

దీనికి మమ్మటుని సమాధానం ఏమనగా-పై శ్లోకంలోని అభంగశ్లేష అయినా, సభంగశ్లేష అయినా, రెండూ కూడా శబ్దాన్నే ఆశ్రయించి ఉన్నాయి.

అందుచేత రెండింటినీ శబ్దశ్లేష అనడమే యుక్తం. మొదటిదానిని అర్థశ్లేష అనడం యుక్తం కాదు. శబ్దాలు మార్చినా కూడ ఎక్కడైతే శ్లేషత్వానికి భంగం వాటిల్లదో అక్కడనే అర్థశ్లేష అంగీకరించాలి. ఉదాహరణకి-

స్తోకేనేతి-స్తోకేన = అల్పమైనదానిచేతనే, ఉన్నతిమ్ = పైకి లేచుటను, గర్వమును అని రెండవ అర్థం. ఆయాతి = పొందును. స్తోకేన = అల్పమైనదాని చేతనే, అధోగతిమ్ = క్రిందికి దిగిపోవడాన్ని, అధఃపతనాన్ని అని రెండవ అర్థం. ఆయాతి = పొందును, తులాకోటేః = త్రాసు చివరిభాగంయొక్క, ఖలస్య = దుర్మార్గునియొక్క, వృత్తిః = ప్రవర్తన, సుసదృశీ = చాలా సామ్యం కలది, అహో = ఏమి ఆశ్చర్యము ?

వి. ఇక్కడ "స్తోకేనోన్నతిమ్" అనేదానికి బదులు 'అల్పేనోచ్చ్రస్త్వమాప్నోతి' ఇత్యాదిరీతిచేత శబ్దాలు మార్చినా రెండర్థాలు బోధించబడతాయి. అందుచేత ఇలాంటి చోట్ల మాత్రమే అర్థశ్లేష అంగీకరించాలి.

అవ. శ్లేష అలంకారాంతరప్రతిభోత్పత్తికి కారణం అనే వాదాన్ని తిరస్కరిస్తున్నాడు.

వృ. న చాయముపమాప్రతిభోత్పత్తిహేతుః శ్లేషః, అపి తు శ్లేషప్రతిభోత్పత్తిహేతురుపమా. తథాహి-యథా "కమలమివ ముఖం మనోజ్ఞమేతత్ కచతితరామ్" ఇత్యాదౌ గుణసామ్యే- క్రియాసామ్యే, ఉభయసామ్యే వా ఉపమా,తథా "సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబిమ్బమివ" ఇత్యాదౌ శబ్దమాత్రసామ్యేఽపి సా యుక్తైవ. తథాహ్యుక్తం రుద్రటేన-

స్ఫుటమర్థాలంకారావేతావుపమాసముచ్చయౌ కింతు,
ఆశ్రిత్య శబ్దమాత్రం సామాన్యమిహాపి సంభవతః". ఇతి

వ్యా. నేతి- ఈ శ్లేష, "(స్వయంచపల్లవాతామ్ర" అనే శ్లోకంలో చెప్పబడిన శ్లేష)ఉపమాప్రతిభోత్పత్తికి, ఉపమాలంకారం స్ఫురించడానికి, హేతువు కాదు, మరేమనగా ఉపమాలంకారమే శ్లేషప్రతిభోత్పత్తిహేతువు ఎందుచేతననగా"కమలంవలె మనోహరమైన ఈ ముఖం బాగా శోభిస్తూన్నది" ఇత్యాదులలో గుణ

సామ్యాన్ని (మనోజ్ఞత్వం అనే గుణాన్ని) పట్టి, క్రియాసామ్యాన్ని (కచతితరామ్" అనే క్రియాసామ్యాన్ని) పట్టి, లేదా గుణక్రియలు రెండింటియొక్క సామ్యాన్ని పట్టి ఏ విధంగా ఉపమాలంకారమో, (ఉపమాలంకారం అంగీకరింపబడుతూన్నదో) అదే విధంగా "సకలకలమ్ (ఇప్పుడు ఈ పురం చంద్రబింబం వలె సకలకలం- పురం పక్షంలో "కలకలధ్వనితో కూడినది" అనీ చంద్రుని పక్షంలో "సమస్తమైన కళలు కలది" అనీ అర్థం-అయింది) ఇత్యాదులలో శబ్దమాత్రసామ్యాన్ని పట్టి అది (ఉపమ) యుక్తమే (ఉపమాలంకారం అంగీకరించడం యుక్తమే)-

పూర్వం ఉదాహరించిన "స్వయం చ పల్లవాతామ్ర" ఇత్యాదిశ్లోకంలో శ్లేష ఉండడంచేత ఉపమాప్రతీతి కలగడం లేదు. ఉపమ ఉండడంచేత శ్లేషప్రతీతి కలుగుతున్నది. 'కమలమివ' ఇత్యాదులలో గుణక్రియాదుల సామ్యాన్ని పట్టి ఉపమాలంకారం అంగీకరిస్తున్నాం. అదే విధంగా 'సకలకలమ్' ఇత్యాదులలో కూడ శబ్దమాత్రసామ్యాన్ని పట్టి ఉపమనే అంగీకరించాలి. 'పురాన్ని చంద్రబింబంతో పోల్చడానికి సాధర్మ్యం ఏమున్నది' అని ప్రశ్న కలగగానే పురమూ సకలకలమే, చంద్రబింబమూ సకలకలమే, అందుచేత 'సకలకలత్వం' అనే శబ్దమాత్ర సామ్యాన్ని పట్టి పురాన్ని చంద్రబింబంతో పోల్చడం జరిగింది అని తెలుసు కుంటాం. చంద్రబింబంతో పోల్చారు కాబట్టి 'సకలకలమ్' అనేదానికి పురానికి చంద్రబింబానికీ సరిపడేటట్లుగా రెండర్థాలు చెప్పుకున్నాం. అలా పోల్చకుండా "సకలకలం పురమేతజ్జాతం సంప్రతి" అని మాత్రమే అంటే 'సకలకల' శబ్దానికి రెండర్థాలు చెప్పుకునే ప్రసక్తే లేదు. అందుచేత ఉపమాలంకారం ఉండడంచేత శ్లేషప్రతీతి కలుగుతున్నది. శ్లేష ఉండడంచేత ఉపమాప్రతీతి కలగడం లేదు. స్వయం చ పల్లవాతామ్రేత్యాది పూర్వోదాహృత శ్లోకంలో కూడా అంతే.

అవ. శబ్దమాత్రసాధర్మ్యంచేత కూడా ఉపమాలంకారం చెప్పవచ్చు అనడానికి రుద్రటుని సంమతిని చూపుతున్నాడు: తథాహీతి,- రుద్రటుడు అట్లే చెప్పినాడు కదా? స్ఫుటమితి-"ఈ ఉపమాసముచ్చయాలంకారాలు అర్థాలంకారాలనే మాట సత్యమే. కాని శబ్దమాత్రసామ్యాన్ని పట్టి కూడా ఈ అలంకారాలు సంభవిస్తాయి".

అవ. సామాన్యధర్మం పేర్కొన్న "కమలమివ ముఖం మనోజ్ఞమ్" ఇత్యాదులలో కూడా శ్లేషకే ప్రాధాన్యం అంగీకరించడం మంచిది. కమలంలో

ఉన్న మనోజ్ఞత్వం వేరు. ముఖంలో ఉన్న మనోజ్ఞత్వం వేరు. వాటిని ఒకే మనోజ్ఞత్వంగా చెప్పడంచేత శ్లేష. ఇక్కడ శ్లేషకి ప్రాధాన్యం అంగీకరించని పక్షంలో శ్లేషకి స్థానమే లేకుండా పోతుంది. మనోజ్ఞత్వం మొదలైన సామాన్యం చెప్పని 'కమలమివ ముఖమ్' ఇత్యాదులలో శ్లేష లేదు గాన అక్కడ ఉపమ చెప్పకోవచ్చును అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు-

వృ. న చ "కమలమివ ముఖమ్" ఇత్యాదిః సాధారణధర్మ ప్రయోగశూన్యః ఉపమావిషయ ఇతి వక్తుం యుక్తమ్; పూర్ణోపమాయా నిర్విషయత్వాపత్తేః.

శ్లో॥ దేవ త్వమేవ పాతాలమాశానాం త్వం నిబన్ధనమ్,
త్వం చామరమరుద్భూమిరేకో లోకత్రయాత్మకః. 379

ఇత్యాదిః శ్లేషస్య చోపమాలంకారవివిక్తోఽస్తి విషయ ఇతి ద్వయోర్యోగే సంకర ఏవ. ఉపపత్తిపర్యాలోచనే తు ఉపమాయా ఏవాయం యుక్తో విషయః. అన్యథా విషయాపహార ఏవ పూర్ణోపమాయాః స్యాత్.

వ్యా. న చేతి-సాధారణధర్మప్రయోగం లేని "కమలమివ ముఖమ్" ఇత్యాదికమే ఉపమావిషయం (సాధారణధర్మప్రయోగం ఉంటే అది శ్లేషయే)అని చెప్పడం యుక్తం కాదు. అప్పుడు పూర్ణోపమకు స్థానమే లేకుండా పోతుంది

వి. ఉపమేయం, ఉపమానం, సామాన్యధర్మం, ఉపమావాచకమైన ఇవాదికం ఈ నాలుగూ కూడా ఉన్నది పూర్ణోపమ అని అందరూ అంగీకరించిన విషయం. సామాన్యధర్మం ప్రయోగించినప్పుడు శ్లేషయే కాని ఉపమ కాదు అని చెప్పే పక్షంలో పూర్ణోపమకు స్థానమే లేకుండా పోతుంది అని అర్థం.

అవ. ఇక్కడ ఉపమను అంగీకరిస్తే శ్లేషకు స్థానం ఉండకుండా పోతుంది అనేదానికి సమాధానం చెపుతున్నాడు-

దేవ ఇతి-దేవ = ఓ! విష్ణో! త్వమేవ = నీవే, పాతాలమ్ = పాతాలము, త్వమ్ = నీవు, ఆశానామ్ = దిక్కులకు, నిబన్ధనమ్ = నియమస్థానమైన భూలోకము. సూర్యోదయాదులను పట్టి దిగ్భేదం ఉన్నది ఈ లోకంలోనే. త్వమ్ = నీవు, అమరమరుద్భూమిశ్చ = అమరులకూ మరుత్తులకు స్థానమైన స్వర్గలోకము.

ఏకః = నీవొక్కడవవే, లోకత్రయాత్మకః = త్రిలోకస్వరూపుడవు. ఇది విష్ణువు పక్షంలో అర్థం. రాజపక్షంలో- దేవ = రాజా! త్వమేవ = నీవే, అలమ్ = అత్యంతము, పాతా = రక్షించేవాడవు. త్వమ్ = నీవు, ఆశానామ్ = యాచకుల ఆశలకు, నిబన్ధనమ్ = కారణమైనవాడవు. త్వమ్ = నీవు, చామరమరుద్భూమిః = చామరముల వాయువులకు స్థానమైనవాడవు. ఏకః = ఒక్కడవే, లోకత్రయాత్మకః = మూడు విధాల లోకాల స్వరూపం కలవాడవు.

ఇత్యాదికం శ్లేషకు. ఉపమాద్యలంకారాలు ఏవీ లేని ప్రత్యేకస్థానం. అనగా దేవేత్యాదిశ్లోకాలలో ప్రకరణాదులు ఏమీ లేకపోవడంచేత, రెండర్థాలూ వాచ్యాలే. ఉపమాద్యలంకారాలకు అవకాశం లేదు. అందుచేత ఇవి ఉపమాద్యలంకార సంబంధం లేని శ్లేషమాత్రస్థానాలు. అందుచేత ఉపమాదులే శ్లేష ప్రతిభోత్పత్తి హేతువులు అని చెప్పే పక్షంలో శ్లేష ఉన్నచోటల్లా మరొక అలంకారం ఏదో ఒకటి ఉంటుంది. కాబట్టి శ్లేషకి ప్రత్యేకమైన స్థానమే లేకుండా పోతుంది అని చెప్పడం యుక్తం కాదు అని అర్థం.

ద్వయోరితి-ఎక్కడైనా రెండూ సమప్రాధాన్యంతో ఉన్నట్లయితే అప్పుడు వాటికి సంకరము అని అంగీకరించాలి. (ఇక్కడ సంకరం అనగా 'కలయిక' అని మాత్రమే అర్థం). ఉపపత్తి జాగర్తగా ఆలోచిస్తే ఉపమకే యుక్తమైన విషయం (ప్రదేశం)అనగా 'స్వయం చ' ఇత్యాదులలో ఉపమనే అంగీకరించడం యుక్తం. అలా కాని పక్షంలో పూర్ణోపమకి స్థానం ఉండదు.

అవ. ఉపమాలంకారం ఒక్కటే కాదు; ఇతరాలంకారాలు కూడా శ్లేష బాధకాలే అని చెపుతున్నాడు-

వృ. న చ "అబిన్దుసున్దరీనిత్యం గలల్లావణ్యబిన్దుకా" ఇత్యాదౌ విరోధప్రతిభోత్పత్తిహేతుః శ్లేషః, అపి తు శ్లేషప్రతిభోత్పత్తిహేతుః విరోధః. న హ్యత్రార్థద్వయప్రతిపాదకః శబ్దశ్లేషః, ద్వితీయార్థస్య ప్రతిభాతమాత్రస్య ప్రరోహాభావాత్. న చ విరోధాభాస ఇవ విరోధః శ్లేషాభాసః శ్లేషః.తదేవమాదిషు వాక్యేషు శ్లేషప్రతిభోత్పత్తిహేతురలంకారాన్తరమేవ.

వ్యా. నేతి-'అబిన్దు'ఇత్యాదివాక్యంలో కూడా విరోధప్రతిభోత్పత్తిహేతువైన శ్లేషాలంకారం కాదు; మరేమనగా శ్లేషప్రతిభోత్పత్తిహేతువైన విరోధాలంకారమే.

ఇక్కడ అర్థద్వయప్రతిపాదకమైన శబ్దశ్లేష కాదు. కేవలం స్ఫురణకు మాత్రమే వచ్చిన రెండవ అర్థం దృఢంగా నిలబడడంలేదు కదా. విరోధాభాసని విరోధం అన్నట్లు శ్లేషాభాస శ్లేష కాదు కదా ? అందువలన ఇలాంటి వాక్యాలలో శ్లేష ప్రతిభకు కారణమైన మరొక అలంకారమే.

పి. "అబిన్దుసున్దరీ నిత్యం గలల్లావణ్యబిన్దుకా" ఈ శ్లోకార్థం కూడ భట్టోద్భటునిదే. (4.17). అబిన్దుసున్దరీ = (అప్ + ఇన్దుసున్దరీ) నీటిలో ప్రతిబింబించిన చంద్రుడు వలె సుందరి; నిత్యం ఎల్లప్పుడూ. గలల్లావణ్యబిన్దుకా = స్రవిస్తూన్న లావణ్యబిందువులు కలది అయిన గౌరి అని అర్థం. అబిన్దుసుందరీ= బిందువులు లేని సుందరి అయినా, లావణ్యబిందువులను స్రవిస్తూన్నది అని మరొక అర్థం స్ఫురించడంచేత విరోధాలంకారం. ఇక్కడ కూడా "ప్రతీహారేందురాజు బిందువులచేత సౌందర్యం లేని ఆమెనుండి లావణ్యబిందువులు ఎలా ప్రసరిస్తాయి? అని విరోధ భాసించడానికి హేతువైన శ్లేష-"అబిన్దుసున్దరీత్యత్ర తు బిన్దుభిర్యస్యాః సౌన్దర్యం నాస్తి తస్యాః కథం లావణ్యబిన్దవః ప్రసరేయుః ఇతి విరోధప్రతిభోత్పత్తిహేతుః శ్లేషః" అని అన్నాడు. దీనిని పట్టి విరోధం భాసించడమే కాని విరోధాలంకారం కాదు, శ్లేషాలంకారమే అని ఉద్భటాదుల అభిప్రాయం అని తెలుస్తుంది. ఇక్కడ కూడా శ్లేషప్రతిభోత్పత్తిహేతువైన విరోధాలంకారమే కాని, శ్లేషాలంకారం కాదు అని మమ్మటుడు ప్రతిపాదిస్తున్నాడు. ఇక్కడ రెండు అర్థాలని ప్రతిపాదించే శబ్దశేష అని చెప్పడానికి వీలులేదు. శబ్దశక్తిని పట్టి 'బిందు'' అబిందు' అన్న మాటలు వినగానే కేవలం రెండవ అర్థం స్ఫురిస్తూన్నది. అంతమాత్రమే; ఈ రెండవ అర్థానికి వాక్యంలో అన్వయం లేదు. విరోధం భాసించినంతమాత్రాన 'విరోధాభాసాలంకారం' అని అంగీకరించినట్లు శ్లేష భాసించినంతమాత్రాన శ్లేషాలంకారం అనడానికి వీలు లేదు కదా? అందుచేత ఇలాంటి స్థలాలలో ఆయా ఇతరాలంకారాలనే అంగీకరిస్తూ కేవలం శ్లేష స్ఫురిస్తూన్నది అని మాత్రమే చెప్పాలి. శ్లేషకు అలంకారత్వం చెప్పడానికి వీలు లేదు. "ఇక్కడ ఉన్నది శ్లేషాలంకారమే, ఇతరాలంకారాలు భాసిస్తున్నాయి కాని వాటికి అలంకారత్వం లేదు" అనే వాదం సరికాదు అని అర్థం.

అవ. మరికొన్ని ఉదాహరణలు చూపుతున్నాడు-

వృ. తథా చ-

శ్లో॥ "సద్వంశముక్తామణిః." 380

"నాల్పః కవిరివ స్వల్పశ్లోకో దేవ మహాన్ భవాన్." 

"అనురాగవతీ సంధ్యా దివసస్తత్పురఃసరః,
అహో దైవగతిశ్చిత్రా తథాపి న సమాగమః" 382

"ఆదాయచాపమచలం కృత్వాహీనం గుణం విషమదృష్టిః,
యశ్చిత్రమచ్యుతశరోలక్ష్యమభాక్షీన్నమస్తస్మై" 383

ఇత్యాదావేకదేశవివర్తిరూపక- శ్లేషవ్యతిరేక-సమాసోక్తి-విరోధత్వ ముచితమ్. న తు శ్లేషత్వమ్.

వ్యా. తథేతి :- అందువలన 'సద్వంశముక్తామణిః' ఇత్యాదులలో వరుసగా ఏకదేశివివర్తిరూపక- శ్లేషమూలకవ్యతిరేక-సమాసోక్తి-విరోధాలంకారాలని అంగీకరించడమే యుక్తం కాని శ్లేషాలంకారం అంగీకరించడం యుక్తం కాదు.

వి. సద్వంశముక్తామణిః = సద్వంశ మనే వెదురుకఱ్ఱలో పుట్టిన ముత్యము. ఇక్కడ 'వంశ' శబ్దశ్లేషను పట్టి ('వంశ' శబ్దానికి రెండర్థాలు ఉండడంచేత) వేణుకులాలకు రూపకం. అనగా కులానికి వేణుత్వారోపం, దానిని పట్టి రాజుయందు ముక్తామణిత్వారోపం. అందుచేత ఇక్కడ శ్లిష్టపరంపరంపరితరూపకం. ముందు కులవేణురూపకం, తరవాత రాజముక్తామణిరూపకం అవడంచేత పరంపరితం. శ్లేష దీనికి అంగం. అందుచేత శ్లిష్టపరంపరితరూపకం. దీనిని భామహాదులు ఏకదేశవివర్తిరూపకం అంటారు. అందుచేత ఇక్కడ అలంకారం రూపకమే కాని, శ్లేష కాదు. రూపకాన్ని పట్టి అది భాసించి దానికి అంగ మయింది.

నాల్ప ఇతి :- దేవ = రాజా ! మహాన్ = గొప్పవాడవైన, భవాన్ = నీవు, అల్పః కవిరివ = క్షుద్రకవి వలె, స్వల్పశ్లోకః = స్వల్పమైన కీర్తి గలవాడవు, సల్పమైన శ్లోకాలు కలవాడవు అని రెండవ అర్థం, న = కావు. ఇక్కడ ఉపమానం కంటె ఉపమేయానికి ఉత్కృష్టత్వం చెప్పడంచేత వ్యతిరేకాలంకారం. దీనికి మూలం శ్లేష కాబట్టి శ్లేషమూలకవ్యతిరేకం. ఇక్కడ వ్యతిరేకానికే ప్రాధాన్యం కాని తన్నిర్వాహకమైన శ్లేషకు ప్రాధాన్యం లేదు అని అర్థం.

అనురాగవతీ ఇతి :- సంధ్యా=సంధ్య, అనురాగవతీ = అనురాగం గలది. (ప్రేమ, ఎరుపు అని రెండర్థాలు), దివసః = దివసము. తత్పురఃసరః = దానికి పురఃసరము (ముందు నడచుచున్నది, సంముఖంగా ఉన్నది అని రెండర్థాలు). తథాపి=అట్లు అయినా కూడ, సమాగమః=కలయిక, (స్త్రీపురుషసమాగమం అని రెండవ అర్థం), న = లేదు. అహో = ఏమి ఆశ్చర్యము, దైవగతిః = దైవప్రవర్తన, చిత్రా = చిత్రమైనది.

ఇది ప్రాతఃసంధ్యావర్ణనం అవడంచేత అభిధ నియమితం అయిపోయింది. రెండవ అర్థానికి అన్వయం లేకపోవడంచేత ఇది శ్లేష కాదు. శ్లిష్టములైన విశేషణాల మహిమచేత నాయికానాయకవృత్తాంతరూపమైన మరొక అర్థం కూడా స్ఫురిస్తూన్నది కాబట్టి సమాసోక్త్యలంకారమే కాని శ్లేషాలంకారం కాదు.

ఆదాయేతి :- యః=ఏ, విషమదృష్టిః=బేసి కన్ను గల శివుడు, అచలమ్ = మేరుపర్వతాన్ని, చాపమ్ = ధనస్సునుగా, ఆదాయ = గ్రహించి, అహీనమ్ = (అహి+ఇనమ్) సర్పరాజైన వాసుకిని, గుణమ్ = నారినిగా, కృత్వా = చేసి, అచ్యుతశరః = అచ్యుతుడు బాణంగా గలవాడై, చిత్రమ్ = ఆశ్చర్యకరముగా, లక్ష్యమ్ = త్రిపురాసురరూపమైన లక్ష్యాన్ని, అభాంక్షీత్ = భేదించెనో, తస్మై=అట్టి శివునకు, నమః = నమస్కారము. ఇక్కడ మరొక అర్థం- విషమదృష్టిః=లక్ష్యం మీద కాక మరొకచోట దృష్టి గల, యః = ఎవడు, అచలమ్ = చలించని, నిష్క్రియమైన, చాపమ్ = ధనస్సును, ఆదాయ = గ్రహించి, హీనమ్ = నికృష్టమైన, లేదా అహీనమ్ = ధనస్సుకంటె పొడవులో తక్కువ కాని, గుణమ్ = నారిని. కృత్వా = చేసి, అచ్యుతశరః = ధనస్సునుండి జారని (బైటకు వెళ్ళని) బాణం కలవాడై, లక్ష్యమ్ = లక్షసంఖ్యలో ఉన్న లక్ష్యాన్ని, కొట్టెనో అని విరోధాభాసం. ఇక్కడ కూడా ప్రధానాలంకారం విరోధాభాసమే కాని శ్లేష కాదు. రెండవ అర్థానికి అన్వయం లేదు గాన దృఢస్థితి లేదు గాన అది అంగం మాత్రమే అని అర్థం.

వృ. శబ్దశ్లేష ఇతి చోచ్యతే; అర్థాలంకారమధ్యే చ లక్ష్యతే ఇతి కోఽయం నయః? కించ వైచిత్ర్యమలంకార ఇతి య ఏవ కవిప్రతిభాసంరమ్భగోచర స్తత్రైవ విచిత్రతా ఇతి నైవాలంకారభూమిః. అర్థముఖప్రేక్షిత్వమేతేషాం శబ్దానామితి చేత్ అనుప్రాసాదీనామపి తథైవేతి తేఽ

ష్యర్థాలంకారాః కిం నోచ్యన్తే ? రసాదివ్యఞ్జకస్వరూపవాచ్యవిశేషసవ్య పేక్షత్వేఽపి హ్యనుప్రాసాదీనామలంకారతా. శబ్దగుణదోషాణామప్యర్థా పేక్షయైవ గుణదోషతా. అర్థగుణదోషాలంకారాణాం శబ్దాపేక్షయైవ వ్యవ స్థితిరితి శబ్దగతత్వేనోచ్యన్తామ్. "విధౌ వక్రే మూర్ధ్ని" ఇత్యాదౌ చ వర్ణాది శ్లేషే ఏకప్రయత్నోచ్చార్యత్వేఽర్థశ్లేషత్వం శబ్దభేదేఽపి ప్రసజ్యతా మిత్యేవమాది స్వయం విచార్యమ్.

వ్యా. శబ్దశ్లేష ఇతి :- (స్వరితాదిగుణభేదంచేత భిన్నప్రయత్నోచ్చార్యాలైన శబ్దాల బంధం) శబ్దశ్లేష అని అంటూ దీనిని అర్థాలంకారాల మధ్య పఠించడం- ఇదేమి పద్ధతి ?

కించేతి :- మరొక విషయం ఏమనగా- 'అలంకారం' అనగా వైచిత్ర్యం. కవిప్రయత్నం అంతా దేనిని గూర్చి చేయబడుతుందో దానిలోనే విచిత్రత్వం ఉంటుంది. అందుచేత ఆ విచిత్రత్వంలోనేఉంటుంది అలంకారత్వం ప్రకృతంలో కవిప్రయత్నం అంతా శబ్దాలను ఎన్నుకోవడంలోనే ఉన్నది కాబట్టి ఈ అలంకా రాన్ని (శ్లేషాలంకారాన్ని) శబ్దాలంకారం అనడమే యుక్తం అని భావం.

ఈ శబ్దాలు (శ్లేషస్థలంలో ప్రయోగించే శబ్దాలు) కూడా అర్థముఖం చూస్తూ ఉంటాయి, అనగా అర్థాన్ని అపేక్షిస్తాయి. శ్లేషలో కూడా నిరర్థకాలైన శబ్దాలను ప్రయోగించరు కదా? అందుచేత దీన్ని అర్థాలంకారం అనడంలో తప్పేమిటి అన్నట్లయితే-అనుప్రాసాదులు కూడా శబ్దముఖప్రేక్షులే కాబట్టి వాటిని కూడా అర్థాలంకారా లని ఎందుకు అనడం లేదు? రసాదుల అలంకారత్వం రసాది వ్యంజకస్వరూపాన్ని, వాచ్యవిశేషాన్ని, అపేక్షిస్తుంది కదా? అనగా అనుప్రాస రసభావాదివ్యంజకంగా ఉండాలి. రసభావాదులు అర్థం లేనిదే ఉండవు అందు చేత అనుప్రాసాదుల అలంకారత్వం అవి రసాదివ్యంజకాలు అవడంమీద, అధార పడి ఉంటుంది. రసాదివ్యంజకాలు కావాలంటే వాటికి అర్థాపేక్ష తప్పదు. అందు చేత వాటిని కూడా అర్థాలంకారాలు అనవలసి వస్తుంది కదా అని భావం. "శబ్ద గుణాలు శబ్దదోషాలు కూడా అర్థాన్ని పట్టే గుణాలనీ, దోషాలనీ చెప్పబడు తున్నాయి". అయినా వాటిని అర్థగుణాలనీ, అర్థదోషాలనీ కాక శబ్దగుణదోషాలు అంటున్నాం కదా అని భావం అర్థగుణాలు, అర్థదోషాలు, అర్థాలంకారాలూ కూడా

అర్థాన్ని బోధించే శబ్దాన్నే ఆధారంగా చేసుకొని ఉన్నాయి కాబట్టి వాటిని కూడా శబ్దగతము లని చెప్పండి. అనగా- శబ్దం అనేది ఉండి దానిచేత బోధించబడే అర్థానికి సంబంధించి కదా అర్థగుణాదు లుండేది? అందుచేత అవి కూడా శబ్దాన్ని ఆశ్రయించినట్లే కాబట్టి వాటిని శబ్దగతా లని ఎందుకు చెప్పడం లేదు అని భావం.

ఏకప్రయత్నోచ్చార్యత్వం అర్థశ్లేష అనడానికి నిమిత్తం అనేది కూడా సరి కాదని చెబుతున్నాడు. విధౌ ఇతి :- 'విధౌ వక్రే మూర్ధ్ని' ఇత్యాదులలోని వర్ణాదిశ్లేషలో ('విధి' 'విధు' అనే) శబ్దభేదం ఉన్నా ఏకప్రయత్నోచ్చార్యత్వం ఉంది కాబట్టి (మీరు చెప్పిన విధంగా) అర్థశ్లేష కావలసివస్తుంది. ఇత్యాది విషయాలు మీరే ఆలోచించుకోండి.

కా. తచ్చిత్రం యత్ర వర్ణానాం ఖడ్గాద్యాకృతిహేతుతా. 85

వృ. సంనివేశవిశేషేణ యత్ర న్యస్తా వర్ణాః ఖడ్గమురజపద్మాద్యాకారముల్లాసయన్తి తచ్చిత్రం కావ్యమ్. కష్టం కావ్యమేతదితి దిఙ్మాత్రం ప్రదర్శ్యతే ఉదాహరణమ్-

వ్యా. తదితి :- యత్ర = దేనియందు, వర్ణానామ్ = వర్ణములకు, ఖడ్గాద్యాకారహేతుతా = ఖడ్గం మొదలైనవాటి ఆకారానికి కారణత్వమో, తత్ = అది. చిత్రమ్ = చిత్రము.

సంనివేశేతి :- ఒక విధంగా చేసిన కూర్పులో ఉంచబడిన, వ్రాయబడిన, వర్ణాలు దేనియందు ఖడ్గం, మురజం, పద్మం మొదలైన ఆకారాలను కలిగిస్తాయో అది చిత్రకావ్యం. ఈ కావ్యం చాలా కష్టమైనది. అందుచేత దిఙ్మాత్రం అనగా పద్ధతిమాత్రం చూపబడుతున్నది.

ఇక్కడ "చిత్రం కావ్యమ్" అనగా చిత్రాలంకారయుక్తమైన కావ్యం అని అర్థం. ఈ అలంకారం కవికి ఉన్న నైపుణ్యాన్ని చూపడం ద్వారా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆ విధంగా అద్భుతరసానికి ఉపకరిస్తుంది. అని కొందరు వ్యాఖ్యాతలు. కాని మమ్మటునికి వీటి విషయంలో అంత సద్భావం లేదు.

అవ. ఖడ్గబంధానికి రెండు శ్లోకాలు ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ మారారిశక్రరామేభముఖై రాసారరంహసా
సారారబ్ధస్తవా నిత్యం తదార్తి హరణక్షమా. 384

మాతా నతానాం సంఘట్టః శ్రియాం బాధితసంభ్రమా
మాన్యాథ సీమా రామాణాం శం మే దిశ్యాదుమాదిమా.

వ్యా. మారారీతి:- ఇవి రుద్రటాలంకారంలోని పద్యాలు. మారారిశక్రరామేభముఖైః=శివ-ఇంద్ర-శ్రీరామ-విఘ్నేశ్వరులచేత, నిత్యమ్=ఎల్లప్పుడు, ఆసారరంహసా=వర్షధారాప్రవాహవేగంతో, సారారబ్ధస్తవా= శ్రేష్ఠమైన ప్రారంభించబడిన స్తోత్రంకలది, తదార్తిహరణక్షమా = వాళ్ళ బాధలను హరించుటకు సమర్థురాలు, నతానామ్ = నమ్రములకు, మాతా = తల్లి, శ్రియామ్ = ఐశ్వర్యాలకు. సంఘట్టః = దగ్గరగా కలిసిఉండే స్థానమూ, బాధితసంభ్రమా=తొలగించబడిన ఉద్వేగం కలది, మాన్యా = గౌరవించతగినది, అథ = మరియు, రామాణామ్ = స్త్రీలకు, సీమా = పరాకాష్ఠ అయినది. స్త్రీలలో అత్యుత్తమురాలు అని అర్థం. అయిన, ఆదిమా = ఆద్యురాలైన, ఆదిశక్తి, ఉమా = ఉమాదేవి, మే = నాకు, శమ్ = సుఖమును, దిశ్యాత్ = ఇచ్చుగాక. ఈ రెండు శ్లోకాలలోని అక్షరాలను ఒక పద్ధతిలో వ్రాస్తే ఖడ్గాకారం ఏర్పడుతుంది. ఇతరబంధాలలో కూడా ఆ యా ఆకారాలు ఏర్పడతాయి.

అవ. మురజబంధానికి ఉదాహరణం రుద్రాటాలంకారంనుంచి చూపుతున్నాడు-

శ్లో॥ సరలా బహులారమ్భతరలాలిబలారవా,
వారలాబహులా మన్దకరలా బహులామలా. 386

వ్యా. సరలేతి :- సరలా = సరలమైనది, "బహులా....రవా" బహుల= అత్యధికమైన, ఆరమ్భ = సంరంభాలచేత, తరల=చంచలాలైన, అలిబల = తుమ్మెదల సైన్యములయొక్క, ఆరవా = ధ్వనికలది, వారలాబహులా = ఆడహంసలు అధికంగా కలది, అమన్దకరలా = మందులు కాని అనగా రణోత్సాహవంతులైన రాజులు గలది, (కరం లాన్తి గృహ్ణన్తీతి కరలాః = పన్నులు తీసికొనేవారు, రాజులు), అబహులామలా = శుక్లపక్షంలో నిర్మలంగా ఉన్నదీ,

అయిన, ప్రకరణాన్ని పట్టి గమ్యమైన 'శరత్' విశేష్యం. శరత్ = శరత్కాలం, జయతి = సర్వోత్కర్షగా ఉన్నది.

అవ. పద్మబంధానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ భాసతే ప్రతిభాసార రసాభాతాహతావిభా
భావితాత్మా శుభా వాదే దేవాభా బత తే సభా. 387

వ్యా. ప్రతిభాసార = ప్రతిభచేత శ్రేష్ఠుడవైన ఓ! రాజా! రసాభాతా = రసాలచేత ప్రకాశిస్తున్నదీ, అహతా = అడ్డులేనిదీ, అవిభా = అంతటా గొప్ప కాంతి గలదీ, భావితాత్మా = వశంచేసికొనబడిన మనస్సు గలదీ, వాదే = వాదంలో (తత్త్వకథలో), శుభా = నేర్పుగలదీ, దేవాభా = దేవతాతుల్యమూ అయిన, తే = సభా = నీ సభ, భాసతే = ప్రకాశించుచున్నది. బత = ఏమి ఆశ్చర్యం!

అవ. సర్వతోభద్రానికి రుద్రటాలంకారంలోని శ్లోకం ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ రసాసార రసా సారసాయతాక్ష క్షతాయసా,
సాతావాత తవాతాసా రక్షతస్త్వస్త్వతక్షర. 388

వ్యా. రసాసార = భూమిలో సారమైనవాడా! శ్రేష్ఠుడా! సారసాయతాక్ష = పద్మముల వలె విశాలములైన నేత్రాలు కలవాడా! సాతవాత = నశింపచేయబడిన అజ్ఞానం కలవాడా! అతక్షర = అనల్పంగా ఇచ్చేవాడా! రక్షతః = రక్షించుచున్న, తవ = నీకు, రసా = భూమి, క్షతాయసా = దుర్జనులను నశింపచేసేది గాను, అతాసా తు = క్షయం లేనిది గాను, అస్తు = అగుగాక.

చివరి పాదంలో పదచ్ఛేదం:— రక్షతః, తు, అస్తు, అతక్షర. క్షతాయసా- క్షతః అయః యైః తే క్షతాయాః- అయః అనగా శుభప్రదమైన దైవం, క్షతాయాః అనగా శుభప్రదమైన దైవానికి భంగం తీసికొనివచ్చే దుర్మార్గులు. క్షతాయాన్ స్యతి ఇతి క్షతాయసా = దుర్మార్గులను నశింపచేసేది. 'వా' ధాతువుకు గతి అని అర్థం. గత్యర్థకాలు జ్ఞానార్థకా లని ఒక న్యాయం ఉంది. అందుచేత 'వాత' అనగా జ్ఞానం. అవాతం అజ్ఞానం. సాత = నశింపచేయబడిన, అతాసా—తాసః అనగా క్షీణించడం. న విద్యతే తాసః యస్యాః సాః. 'తు' 'చ' కు పర్యాయం. అతక్షం రాతి ఇతి అతక్షరః, అనల్పంగా ఇచ్చేవాడు.

వృ. సంభావినోఽప్యన్యే ప్రభేదాః శక్తిమాత్రప్రకాశకాః న తు కావ్యరూపతాం దధతీతి న ప్రదర్శ్యన్తే.

వ్యా. ఇంకా ఇలాంటి బంధభేదాలు ఉండడానికి అవకాశం ఉన్నా కవి మేధాశక్తిని మాత్రమే ప్రదర్శిస్తాయి కాని కావ్యరూపం ధరించవు, అనగా అతి నీరసాలవడంచేత కావ్యత్వం ఉన్నవి కావు అందుచేత ఇతరబేదాలను ప్రదర్శించడం లేదు.

అవ. 'పునరుక్తవదాభాసం శబ్దంలోను అర్థంలోనూ కూడా ఉంటుంది. అందుచేత శబ్దాలంకార.అర్థాలంకారాల మధ్య దాని లక్షణం చెబుతున్నాడు.

కా. పునరుక్తవదాభాసో విభిన్నాకారశబ్దగా,

ఏకార్థతేవ.

వృ భిన్నరూపసార్థకానర్థకశబ్దనిష్ఠమేకార్థత్వేన ముఖే భాసనం పునరుక్తవదాభాసః. స చ-

కా. శబ్దస్య

వృ. సభఙ్గాభఙ్గరూపకేవలశబ్దనిష్ఠః. ఉదాహరణమ్.

శ్లో॥ అరివధదేహశరీరః సహసా రథిసూతతురగపాదాతః,

భాతి సదానత్యాగః స్థిరతాయామవనితలతిలకః. 389

వ్యా. పునరితి :- విభిన్నాకారశబ్దగా = వేరైన ఆకారాలు గల శబ్దాలను పొందిన (శబ్దాలలో ఉన్న), ఏకార్థతేవ = ఒకే అర్థం ఉన్నట్లు కనబడడం, పునరుక్తవదాభాసః = పునరుక్తవదాభాస.

భిన్నేతి :- వేరు వేరు రూపాలు గల, సార్థక-అనర్థకశబ్దాలలో ఉన్న ముఖంలో (చూడగానే) ఒకే అర్థం ఉన్నట్లు భాసించడం పునరుక్త వదాభాసం.

వి. వేరు వేరు రూపాలలో ఉన్న రెండు శబ్దాలు ఉంటాయి. నిజానికి వాటి అర్థాలు కూడా వేరే కాని వాటి అర్థం ఒకటే అన్నట్లు భాసిస్తే అది పునరుక్త

పదాభాసం. అది శబ్దమాత్రపునరుక్తపదాభాసం అనీ, శబ్దార్థోభయపునరుక్తపదాభాసం అనీ రెండు విధాలు. దానిలో మొదటిదానిని గూర్చి చెపుతున్నాడు-

అది 'శబ్దానికి' సంబంధించినది-

సభఙ్గేతి :- సభంగరూపమూ, అభంగరూపమూ అయిన కేవలశబ్దంలో ఉండవచ్చు. అనగా సభంగరూపకేవలశబ్దనిష్ఠమూ అభంగరూపకేవలశబ్దనిష్ఠమూ అని శబ్దనిష్ఠం రెండు విధాలని అర్థం. ఉదాహరణం.

అరీతి :- అరివధదేహశరీరః = అరివధ+ద+ఈహ+శరి+ఈరః = శత్రువధను ఇచ్చే (చేసే) చేష్టలు గల బాణవంతులను (యోధులను) ప్రేరేపించేవాడు, సహసా = శీఘ్రంగా, రథిసూతతురగపాదాతః- రథి+సు+ఉత+తురగ+పాదాతః = రథికులచేత బాగా కట్టబడిన గుఱ్ఱాలూ, కాలిబంటులూ కలవాడూ, స్థిరతాయామ్ = స్థిరత్వమునందు, అగః = పర్వతమూ (సదానత్యా+అగ) అయిన, అవనితలతిలకః = భూతలానికి అలంకారమైన రాజు, సదానత్యా = సత్పురుషులయందు నమ్రతచేత, భాతి = ప్రకాశిస్తున్నాడు.

వి. ఇక్కడ 'దేహ' 'శరీర' శబ్దాలూ, 'సారథి' 'సూత' శబ్దాలూ, 'దాన' 'త్యాగ' శబ్దాలూ వినబడగానే ఒకే అర్థం గల రెండు పదాలను ప్రయోగించినట్లు తోచడంచేత పునరుక్తపదాభాసం. ఈ శబ్దా లన్నీ సభంగా లవడంచేత సభంగశబ్దనిష్ఠ మైనది.

అవ అభంగశబ్దనిష్ఠమైన పునరుక్తపదాభాసానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ చకాసత్యఙ్గనారామాః కౌతుకానన్దహేతవః,
తస్య రాజ్ఞః సుమనసో విబుధాః పార్శ్వవర్తినః. 390

వ్యా. చకాసతీతి :- అఙ్గనారామాః = స్త్రీలతో రమించేవారు, అనగా విరహబాధ ఎరగనివారు, కౌతుకానన్దహేతవః = నృత్యగీతాది కౌతుకములచేత ఆనందానికి కారణభూతులు, సుమనసః = మంచి మనస్సు కలవారు, విబుధాః = పండితులు అయిన, తస్య రాజ్ఞః = ఆ రాజుయొక్క, పార్శ్వవర్తినః = పార్శ్వచరులు, చకాసతి = ప్రకాశించుచున్నారు.

వి. ఇక్కడ 'అఙ్గనా' 'రామా' శబ్దాలకు స్త్రీ అని అర్థం. 'కౌతుక' 'ఆనన్ద' శబ్దాలకు సంతోషం అని అర్థం. 'సుమనసః' 'విబుధాః' శబ్దాలకి పండితులు అని అర్థం. ఈ విధంగా ఈ శబ్దాలు ఏకార్థకాలు అవడంచేత వినగానే పునరుక్తి ఉన్నట్లు భాసిస్తుంది. అందుచేత పునరుక్తవదాభాసం. ఈ శబ్దాలన్నీ అభంగ శబ్దాలు. అందుచేత అభంగశబ్దనిష్ఠపునరుక్తవదాభాసం. ఇక్కడ ఉన్న అన్ని శబ్దాలు అర్థం ఉన్నవే. అందుచేత ఇది సార్థకశబ్దనిష్ఠం.

వెనుకటి ఉదాహరణంలో దేహ-శరీరశబ్దాలు, సారథి-సూతశబ్దాలూ, దాన—త్యాగశబ్దాలూ, నిరర్థకాలే. అనగా వినగానే ఏ అర్థం స్ఫురిస్తూన్నదో ఆ అర్థం వాటికిలేదు. సభంగపదాలు అవడంచేత అసలు పదాలూ, వాటి అర్థాలూ వేరు కదా!

కా. తథా శబ్దార్థయోరయమ్. 86

వృ. ఉదాహరణమ్-

శ్లో॥ తనువపురజఘన్యోఽఽసౌ కరికుఞ్జరరుధిరరక్తఖరనఖరః,
తేజోధామ మహఃపృథుమనసామిన్ద్రో హరిర్జిష్ణుః. 391

వృ. అత్రైకస్మిన్ పదే పరివర్తితే నాలంకార ఇతి శబ్దాశ్రయః, అపరస్మింస్తు పరివర్తితేఽపి స న హీయతే ఇత్యర్థనిష్ఠ ఇత్యుభయాలంకారోయమ్.

ఇతి కావ్యప్రకాశే శబ్దాలంకారనిర్ణయో నామ నవమ ఉల్లాసః

వ్యా. తథేతి :— ఈ పునరుక్తవదాభాసం శబ్దార్థాలు రెండింటిలోనూకూడా ఉంటుంది. ఉదాహరణం-

తను ఇతి :- ఇది సింహవర్ణనం. అసౌ హరిః = ఈ సింహం, తనువపుః = సన్నని శరీరం కలదైనా, అజఘన్యః = శ్రేష్ఠమైనది. కరికుఞ్జరరుధిరరక్తఖరనఖరః = శ్రేష్ఠములైన, ఏనుగుల రక్తంచేత ఎఱ్ఱనైన వాడియైన నఖములు కలది. తేజోధామ = తేజస్సుకు ఆశ్రయం. మహఃపృథుమనసామ్ = తేజస్సుచేత గొప్ప మనస్సు కలవాటిలో, ఇన్ద్రః = శ్రేష్ఠము. జిష్ణుః = జయస్వభావం గలది.

ఏ. ఇక్కడ 'తను'- 'వపు' శబ్దాలకు దేహం అనీ'కరి' 'కుంజర' శబ్దాలకు ఏనుగ అనీ, 'రుధిర'- 'రక్త'శబ్దాలకు రక్తం అనీ, 'తేజో'-'ధామ'-'మహః' శబ్దాలకు తేజస్సు అనీ, 'ఇన్ద్ర'-'హరి'-'జిష్ణు' శబ్దాలకు దేవేంద్రు డనీ అర్థాలు ఉండడంచేత ఆపాతతః పౌనరుక్త్యం కనబడుతుంది. వీటిలో తను-కుఞ్జర-రక్త ధామ-హరి-జిష్ణు శబ్దాలు పరివృత్తిసహాలు కావు. అక్కడ శబ్దాలంకారం. వపుః కరి-రుధిర-ఇన్ద్రశబ్దాలు పరివృత్తిసహాలు. అక్కడ అర్థాలంకారం. ఈ విషయమే చెపుతున్నాడు-

అత్రేతి :- ఇక్కడ ఒక పదం (తన్వాదిపదం) మారుస్తే అలంకారం లేదు. అందుచేత శబ్దాశ్రయం. మరొక పదం (వపుః ఇత్యాదికం) మార్చినా అలంకారత్వం పోదు. అందుచేత అర్థనిష్ఠం. ఈ విధంగా ఇది ఉభయాలంకారం.

"బాలానందిని' అను కావ్యప్రకాశవ్యాఖ్యానంలో శబ్దాలంకారనిర్ణయం
అనే నవమోల్లాసం సమాప్తం.

## అథ దశమ ఉల్లాసః

వృ. అర్థాలంకారానాహ-

కా. సాధర్మ్యముపమా భేదే.

వృ. ఉపమనోపమేయయోరేవ న తు కార్యకారణాదికయోః సాధర్మ్యం భవతీతి తయోరేవ సమానేన ధర్మేణ సంబన్ధః ఉపమా. భేద గ్రహణమనన్వయవ్యవచ్ఛేదాయ.

వ్యా. అర్థాలంకారాలను చెవుతున్నాడు. సాధర్మమ్ ఇతి :- భేదే = ఉప మానోపమేయాలకు బేదం ఉంటూండగా, సాధర్మ్యమ్ = సమానమైన ధర్మం కలిగి ఉండడం ఉపమ.

ఉపమానేతి :- సాధర్మం అనేది ఉపమానోపమేయాలకే ఉంటుంది కాని కార్యకారణాదులకు ఉండదు. వాటికే సమానమైన ధర్మంతో సంబంధం ఉపమా లంకారం.

వి. సమానః ధర్మః యయోః తౌ సధర్మౌ- సమానమైన ధర్మం కలవి. సధర్మయోః భావః సాధర్మ్యమ్-సమానమైన ధర్మం కలిగిఉండడం అని అర్థం. సమానమైన ధర్మం ఉపమానోపమేయాలకే ఉంటుంది కాని ఇతరమైన కార్య కారణాదులకు ఉండదు. అందుచేత "ఉపమానోపమేయయోః" అని చెప్పకపోయినా తెలుస్తుంది అని భావం.

భేదేతి :- "ఉపమానోపమేయాలు వేరు వేరుగా ఉండాలి అని చెప్పడం అనన్వయాలంకారాన్ని వ్యావృత్తి చేయడంకోసం". అనన్వయాలంకారంలో ఒకే వస్తువు ఉపమేయంగాను ఉపమానంగాను ఉంటుంది. ఉపమేయోపమానాలు వేరుగా ఉండాలి అని చెప్పకపోతే ఆ అలంకారంలో ఈ లక్షణానికి అతివ్యాప్తి వస్తుంది. అది లేకుండా ఉండడంకోసం 'భేదే' అని లక్షణంలో చేర్చబడింది.

కా. పూర్ణా లుప్తా చ.

వృ. ఉపమానోపమేయసాధారణధర్మోపమాప్రతిపాదకానాముపాదానే పూర్ణా. ఏకస్య ద్వయోస్త్రయాణాం వా లోపే లుప్తా.

వ్యా. పూర్ణేతి :- ఇది పూర్ణ లుప్త అని రెండు విధాలు.

ఉపమానేతి :- ఉపమాన-ఉపమేయ-సాధారణధర్మ-ఉపమాప్రతిపాదకాలను గ్రహిస్తే (చెపితే) అది పూర్ణోపమ. ఈ నాల్గింటిలో ఒకటి కాని, రెండు గాని, మూడు గాని లోపిస్తే (చెప్పకపోతే) అది లుప్తోపమ.

వి. ఒక వస్తువును మరొకవస్తువుతో పోల్చినప్పుడు మొదటిది 'ఉపమేయం'; దేనితో పోలుస్తామో అది 'ఉపమానం'. ఇలా పోల్చడానికి ఈ రెండు వస్తువులలోనూ ఏదో ఒక సమానమైన ధర్మం ఉండాలి. దానికి 'సమానధర్మం' అని పేరు. ఈ సమానధర్మం గుణం కావచ్చు, క్రియ కావచ్చు, రెండింటికీ అన్వయించే ఒక విశేషణం (శ్లిష్టశబ్దం) కావచ్చు. ఈ రెండింటికీ పోలికను బోధించే 'ఇవ' 'యథా' మొదలైన శబ్దాలు ఉపమావాచకాలు. ఈ నాల్గింటినీ ప్రయోగిస్తే అది పూర్ణోపమ. ఉదాహరణకి "ముఖం చన్ద్ర ఇవ సున్దరమ్" అన్నప్పుడు ముఖం ఉపమేయం, చన్ద్రః ఉపమానం, 'ఇవ' అనేది ఉపమావాచకం, సౌందర్యం సమానధర్మం. ఈ విధంగా నాల్గింటినీ ప్రయోగిస్తే పూర్ణోపమ. ఈ నాల్గింటిలో ఒకటి చెప్పకపోయినా రెండు చెప్పకపోయినా, మూడు చెప్పకపోయినా అది లుప్తోపమ.

అవ. పూర్ణోపమను ఆరు విధాలుగా విభజిస్తున్నాడు-

కా. సాగ్రిమా

శ్రౌత్యార్థీ చ భవేద్వాక్యే సమాసే తద్ధితే తథా. 87

వృ. అగ్రిమా పూర్ణా. యథేవవాదిశబ్దా యత్పరాస్తస్యైవోపమానతాప్రతీతిరితి యద్యప్యుపమానవిశేషణాన్యేతే తథాపి శబ్దశక్తిమహిమ్నా శ్రుత్యైవ షష్ఠీవత్ సంబన్ధం ప్రతిపాదయన్తీతి తత్సద్భావే శ్రౌతీ ఉపమా. తథైవ "తత్ర తస్యేవ" ఇత్యనేన ఇవార్థే విహితస్య వతేః ఉపాదానే. 'తేన తుల్యం ముఖమ్" ఇత్యాదౌ ఉపమేయే ఏవ, "తత్

తుల్యమ్ అస్య" ఇత్యాదౌ చ ఉపమానే ఏవ "ఇదం చ తచ్చ తుల్యమ్" ఇత్యుభయత్రాపి తుల్యాదిశబ్దానాం విశ్రాన్తిరితి సామ్యపర్యాలోచనయా తుల్యతాప్రతీతిరితి సాధర్మ్యస్యార్థత్వాత్ తుల్యాదిశబ్దోపాదానే ఆర్థీ. తద్వత్ "తేన తుల్యం క్రియాచేద్వతిః" ఇత్యనేన విహితస్య వతేః స్థితౌ. "ఇవేన నిత్యసమాసో విభక్త్యలోపః పూర్వపదప్రకృతిస్వరత్వం చ" ఇతి నిత్యసమాసే ఇవశబ్దయోగే సమాసగా. క్రమేణోదాహరణమ్-

వ్యా. సేతి :- అగ్రిమా = మొదటిదైన, సా = అది, పూర్ణోపమ, శ్రౌతీ= శబ్దంచేత బోధింపబడేది. వాచ్యము, ఆర్థీ = అర్థం ద్వారా లభ్యం అయేదీ కూడ, వాక్యే=వాక్యంలోను, సమాసే=సమాసంలోనూ, తథా=మరియు, తద్ధితే=తద్ధిత ప్రత్యయంలోను, భవేత్=అవును. "అగ్రిమా అనగా మొదటిది, పూర్ణ అని అర్థం."

వి. పూర్ణోపమ ముందుగా శ్రౌతి అనీ ఆర్థి అనీ రెండు విధాలు. ఈ రెండూ కూడ వాక్యగతం అనీ, సమాసగతం అనీ, తద్ధితగతం అనీ మూడేసి విధాలు. ఈ విధంగా పూర్ణోపమ ఆరు విధాలు.

1. వాక్యగతశ్రౌత్యుపమ, 2. సమాసగతశ్రౌత్యుపమ, 3. తద్ధితగత శ్రౌత్యుపమ, 4. వాక్యగతఆర్థ్యుపమ, 5. సమాసగతఆర్థ్యుపమ, 6. తద్ధితగత ఆర్థ్యుపమ.

వ్యా. యథేవేతి :- 'యథా', 'ఇవ', 'వా' మొదలైన శబ్దాలు దేనికి పరంగా (ఏ పదం తరవాత) ప్రయోగించబడతాయో దానికే ఉపమానత్వప్రతీతి. అందుచేత ఇవి ఉపమానానికి విశేషణాలు: అయినా వినినంతమాత్రంచేతనే శబ్ద శక్తిమహిమచేత షష్ఠీవిభక్తి వలె సంబంధాన్ని ప్రతిపాదిస్తాయి కాబట్టి అవి ఉన్నప్పుడు 'శ్రౌతి' అయిన ఉపమ. అదే విధంగా 'తత్ర తస్యేవ' అనే సూత్రంచేత విధించబడిన వతిని గ్రహించినప్పుడు కూడా-

వి. "యద్ధి యదర్థే ధర్మవిశేషం ప్రతిపాదయతి తత్ తద్విశేషణమ్" అనీ, "ఏకవిశేషణం నావరత్ర స్వార్థం ప్రత్యాయయతి" అనీ నియమం ఉంది. "ఏది దేని అర్థంలో ధర్మవిశేషాన్ని, ఒక విశిష్టమైన ధర్మాన్ని, బోధిస్తుందో అది దానికి విశేషణం", "ఒకదాని విశేషణం మరొక చోట (మరొకపదంలో) తన అర్థాన్ని ప్రతీతం అయేటట్లు చేయదు" అని వీటి అర్థం. ఉదాహరణకి "నీలమ్

ఉత్పలమ్" (నల్లని కలువ) అన్నప్పుడు 'నీల' శబ్దం తన అర్థం (నీలత్వం) ఉత్పలశబ్దానికి అర్థమైన కలవలో ఉన్నట్లు తెలపడంచేత ఉత్పలానికి విశేషణం అయింది. ఇంక ఆ విశేషణం మరొక పదార్థంలో కూడా తన అర్థాన్ని (తన అర్థం ఉన్నట్లు) తెలుపదు. అదేవిధంగా "ముఖం మనోజ్ఞం కమలం యథా ఏతత్" (ఈ ముఖం కమలం వలె మనోహరంగా ఉన్నది) అనే వాక్యంలో 'యథా' శబ్దం 'కమల' శబ్దం తరవాత ప్రయోగించబడడంచేత కమలపదార్థం ఉపమానం అనే అర్థాన్ని బోధించడం ద్వారా కమలపదానికి విశేషణం అయింది. అందుచేత కమలశబ్దానికి విశేషణమైన ఆ 'యథా' పదం ఉపమానమైన కమలానికి సాదారణ ధర్మసంబంధం (మనోజ్ఞత్వసంబంధం) ఉన్నట్లు బోధించవచ్చును కాని కమల భిన్నమైన, ఉపమేయమైన, ముఖానికి కూడా సాధారణధర్మసంబంధం ఉన్నట్లు బోధించజాలదు కదా! అలాంటప్పుడు ఉపమ 'శ్రౌతి' అని చెప్పడం ఎలా కుదురుతుంది? ఉపమానోపమేయాలకు (సాదారణధర్మంతో సంబంధం ఉండడం అనే) సాధర్మ్యం శబ్దంచేత (యథా-ఇవాదులచేత) చెప్పబడడమే కదా శ్రౌతత్వం అనగా? అని ఆశంక. దీనికి సమాధానం ఏమనగా- నిజమే; 'యథా', 'ఇవ', 'వా' మొదలైన శబ్దాలు వేటి తరువాత ప్రయోగించబడతాయో వాటిలోని విశేషం మాత్రం చెప్పడమే న్యాయం. అయినా కొన్ని శబ్దాల శక్తి అనూహ్యంగా ఉంటుంది. అందుచేత ఈ శబ్దాలు వినగానే సాధారణధర్మంతో (మనోజ్ఞత్వాదులతో) సంబంధం కేవలం ఉపమానానికి మాత్రమే కాకుండా ఉపమేయానికి కూడా ఉంది అనే ప్రతీతి కలుగుతుంది. ఇది ఎలాగంటే- సంబంధార్థకం అయిన షష్ఠీవిభక్తి దేనికి చేర్చబడుతుందో దానియందు సంబంధరూపార్థాన్ని బోధించి దానికి విశేషణం అవుతుంది. "రాజ్ఞః రాజ్యమ్" అనే వాక్యంలో 'రాజన్'శబ్దం చివర ఉన్న షష్ఠి రాజుకు ఏదో సంబంధం ఉన్న దని బోధించడం ద్వారా రాజ రూపప్రకృత్యర్థానికి విశేషణం అవుతుంది. అయితే సంబంధం ద్వినిష్ఠం గాన అంతటితో ఆగక అది రాజుకూ రాజ్యానికీ ఉన్న స్వస్వామిభావరూప (సొత్తు, సొత్తుకలవాడు అనే) సంబంధాన్ని కూడా బోధిస్తుంది. అదే విధంగా ఉపమాన శబ్దాలకి ప్రక్క ఉన్న యథేవాదిశబ్దాలు వాటి ఉపమానత్వాన్ని లేదా సాదృశ్యాన్ని బోధిస్తూ దానితో పాటు (ఉపమానత్వం ఉపమేయత్వసాపేక్షం లేదా సాదృశ్యం ద్వినిష్ఠం అవడం చేత, ఉపమేయోపమానాలకు సాధారణధర్మసంబంధాన్ని కూడా బోధిస్తాయి. అది ఆ పదాల కున్న శక్తివైశిష్ట్యం. ఈ విధంగా

'యథా', 'ఇవ, వా', 'వ' మొదలైన పదాలు సాదృశ్యాన్ని (సాధారణధర్మ సంబంధాన్ని) ప్రత్యక్షంగా బోధిస్తాయి కాబట్టి వాటిని ప్రయోగించినప్పుడు ఉపమ 'శ్రౌతి'.

"తత్ర తస్యేవ" (పా.సూ. 5.1.116) అనే సూత్రంచేత 'వతి' ('వత్' మిగులుతుంది) ప్రత్యయం విధించబడింది. "సప్తమ్యంతపదానికి, షష్ఠ్యంతపదానికీ వతిప్రత్యయం వస్తుంది; ఆప్రత్యయం 'ఇవ' అనే అవ్యయం ఏ అర్థాన్ని బోధిస్తుందో" ఆ అర్థాన్ని బోధిస్తుంది" అని ఈ సూత్రానికి అర్థం. "మథురావత్ పాటలిపుత్రే ప్రాకారః" అనేది సప్తమ్యంతానికి చేరే వతిప్రత్యయానికి ఉదాహరణం. 'మథురావత్' అనే దానికి 'మథురాయామ్ ఇవ' (మథురయందు వలె)అని అర్థం. పాటలిపుత్రనగరమునందు ప్రాకారం మథురయందు వలె ఉన్నది అని ఈ వాక్యానికి అర్థం. "మథురావత్ పాటలిపుత్రస్య విస్తారః" అనేది షష్ఠ్యంతానికి వతి ప్రత్యయం చేర్చడానికి ఉదాహరణం. ఇక్కడ 'మథురావత్' అనే దానికి 'మథురాయాః ఇవ'అని అర్థం. 'పాటలిపుత్రం యొక్క వైశాల్యం మథుర యొక్క (వైశాల్యం) వంటిది'అని ఈవాక్యానికి అర్థం. ఈ విధంగా ఈ సూత్రంచేత విహితమైన 'వతి' ప్రత్యయం 'ఇవ'అనే అవ్యయానికి ఏ అర్థమో ఆ అర్థాన్ని బోధిస్తుంది. 'ఇవను ప్రయోగించినపుడు శ్రౌతి ఉపమ అయినట్లే, ఈ వతి ప్రత్యయం చేర్చిన పదం ప్రయోగించినప్పుడు కూడా 'శ్రౌతి' ఉపమ అని అర్థం. "ముఖం చన్ద్ర ఇవ సున్దరమ్" అన్నప్పుడు వాక్యగతశ్రౌతోపమ. "గ్రామేఽస్మిన్ నగరవత్ చతురాః జనాః" (ఈ గ్రామంలో జనులు నగరంలో వలె చతురులు) ఇత్యాదులలో తద్ధితగతశ్రౌతోపమ

వ్యా. ఇప్పుడు ఆర్థోపమను గూర్చి చెపుతున్నాడు-తేనేతి :— "తేన తుల్యం ముఖమ్" "ముఖం దానితో (పద్మంతో) తుల్యంగా ఉంది" ఇత్యాదులలో 'తుల్య' మొదలైన శబ్దాలు ఉపమేయంమీదనే విశ్రమిస్తున్నాయి; అనగా ఉపమేయానికి విశేషణాలు గాన దానినే చెపుతున్నాయి. "తత్ తుల్యమ్ అస్య" "అది (పద్మం) దీనికి (ముఖానికి) తుల్యంగా ఉంది" ఇత్యాదులలో తుల్యాదిశబ్దాలు ఉపమానంలో విశ్రమిస్తున్నాయి. "ఇదం చ తచ్చ తుల్యమ్" "ఇదీ (ఈ ముఖమూ) అదీ (ఆ పద్మమూ) తుల్యాలుగా ఉన్నాయి" ఇత్యాదులలో తుల్యాదిశబ్దాలు ఉపమేయోపమానాలు రెండింటిమీదా విశ్రమిస్తున్నాయి. అందువల్ల తుల్యత్వప్రతీతి సామ్యాన్ని

గూర్చి ఆలోచించగా ఏర్పడుతూన్నది. అందుచేత తుల్యాదిశబ్దాలు ప్రయోగించి నప్పుడు సాధర్మ్యం ఆర్థం; అనగా అర్థాన్ని పట్టి ఏర్పడింది. “తేన తుల్యం క్రియా చేద్వతిః” అని విధించిన వతి ప్రత్యయం ఉన్నప్పుడు కూడా ఇట్లే.

వి. ‘తుల్య’ ‘సమ’ ‘సదృశ’ ఇత్యాదిశబ్దాలు ఇతరశబ్దాలకి విశేషణాలుగా ఉపయోగించబడతాయి. అందుచేత ప్రత్యక్షంగా తుల్యత్వాదు లున్న ఆ విశేష్యాన్ని బోధిస్తాయి. అనగా ‘తుల్యః’ అనగా ‘సామ్యం కలది’ అని అర్థం. ‘సమ’ ‘సదృశ’ మొదలైన పదాల విషయం కూడా అంతే. ‘ముఖం చంద్రునితో తుల్యం’ అని అంటున్నారు కాబట్టి ఆ రెండింటికీ సాదృశ్యం ఉన్నది అనో, ఈ రెండింటికీ సామ్యం ఉంది కాబట్టి ఆ రెండూ తూల్యాలనో భావం ఏర్పడిన తరవాత సాదృశ్య జ్ఞానం (సాధర్మ్యం ఉన్న దనే జ్ఞానం) కలుగుతుంది. అందుచేత ఈ స్థలాలలో సాదృశ్యజ్ఞానం అర్థాత్ సిద్ధం అనగా అర్థాన్ని పట్టి తరవాత తెలిసేది. దీనినే ఆక్షిప్తం అంటారు. అందుచేత ఇక్కడ ఉపమ ఆర్థి. ఇవాది స్థలాలలో సాదృశ్యం ఇవాదులచేత ప్రత్యక్షంగానే చెప్పబడుతుంది. అందుచేత అక్కడ శ్రౌతి.

పై వాక్యంలో “సామ్యపర్యాలోచనయా తుల్యతాప్రతీతిః” అనేదానికి - ‘ముఖం చంద్రునితో తుల్యం’ అనే మాట విన్న తరవాత ఆ రెండింటికీ సామ్యాన్ని పరిశీలించి ‘ఓహో ! ఈ సామ్యం (సాధర్మ్యం) ఉండడంచేత ఈ రెండింటికి తుల్యత్వం కదా’ అని తెలుసుకుంటాం- అని అర్థం.

ఈ ఘట్టంలో వ్యాఖ్యాతలు అనేకవిధాలుగా వ్యాఖ్యానించారు. వామనఝళ్ కీకర్ కూడా- “యథేవాది శబ్దప్రయోగస్థలంలో సాధర్మ్యం వాచ్యం, సాదృశ్యం ఆర్థం, తుల్యాదిశబ్దప్రయోగస్థలంలో సాదృశ్యం వాచ్యం, సాధర్మ్యం అర్థం” అంటూ వ్రాశారు. (పేజి 553). ఆదేవిధంగా సాధర్మ్యం వేరు సాదృశ్యం వేరు అన్నట్లు భావించి “మూలకారుని, (మమ్మటుని) మతంలో సాధర్మ్యమే ఉపమ కాని సాదృశ్యం కాదు” అని వ్రాశారు. ఈ వ్యాఖ్య లన్నీ మమ్మటభావానుగుణంగా లేవేమో అనిపిస్తుంది. అప్పయదీక్షితులు “ఉపమితిక్రియానిష్పత్తిమత్ సాదృశ్య వర్ణనముపమా” అని ఉపమాలక్షణం చెప్పారు (చిత్రమీమాంస పే. 20). పండిత రాజు కూడా “సాదృశ్యం సున్దరం వాక్యార్థోపస్కారకముపమాలంకృతిః” అని ఉపమాలక్షణంలో ‘సాదృశ్య’పదాన్నే ప్రయోగించాడు. ఈ విధంగా ‘సాదృశ్య’

'సాధర్మ్య' పదాలు పర్యాయాలనే వీరి అభిప్రాయం అన్నట్లు తెలుస్తూన్నది. మమ్మటుడు కూడా ఇవి వేరు వేరు అని భావించినట్లు ఎక్కడా కనబడదు.

ఒకటి సాదృశ్యవాచకం, రెండవది సాదృశ్యవద్వాచకం అవడమే శ్రౌతీ త్వార్థీత్వాల భేదానికి కారణం అని అప్పయదీక్షితాదుల వ్రాతలవలన తెలుస్తూన్నది. "నను సదృశాదిశబ్దప్రయోగే సాదృశ్యవిశిష్టధర్మిపర్యన్తత్వాత్ ఆర్థీతి యుక్తమ్...." (చి.మీ. పే. 30) అని అప్పయదీక్షితులు ఒక చోట అంటారు. "అత్ర పూర్వార్ధే వతేః 'తత్ర తస్యేవ' ఇతి సాదృశ్యే విధానాత్ శ్రౌతీ, ఉత్తరార్ధే 'తేన తుల్యమ్' ఇతి విధానాత్ సాదృశ్యవదర్థకతయా ఆర్థీ' (ర.గం. పే. 215) అని పండిత రాయలు వ్రాశారు. దీనిని పట్టి శ్రౌతీత్వార్థీత్వభేదం పైన వివరించినట్లే చెప్పడం యుక్తం.

మమ్మటుడు ఉపమాభేదాలను అన్నింటినీ ప్రతీహారేందురాజవృత్తిసమేత మైన ఉద్భటకావ్యాలంకారసారసంగ్రహంనుంచి గ్రహించి నట్లు కనబడుతుంది. ఆర్థోపమను గూర్చి ప్రతీహారేందురాజు వ్రాసిన వాక్యాన్ని పై మమ్మటవాక్యాన్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది. "యా తూపమా సదృశాదిపదైః శ్లిష్టా తస్యాం న శ్రౌతేన రూపేణ ఉభయానుయాయితయా ఉపమానోపమేయభావోఽవగమ్యతే; అపి త్వర్థాత్, సదృశాదీనాం పదానామ్ ఉపమానోపమేయయోరేకతరత్రైవ విశ్రాన్తేః, అన్యత్ర చ తద్గతసాదృశ్యపర్యాలోచనయా తత్సంబన్ధిత్వావగతేః, తేనాసౌ ఆర్థీ" (కా.సా.సం. పేజీ 19).

"తేన తుల్యం క్రియాచేద్వతిః" అనే పాణినిసూత్రంచేత (5.1.115) తృతీయాంతంకంటె తుల్యార్థంలో, సాదృశ్యం క్రియకు సంబంధించినప్పుడు, 'వతి' ప్రత్యయం విధించబడింది. "బ్రహ్మణవత్ అధీతే క్షత్రియః" అని మహాభాష్యంలో ఇచ్చిన ఉదాహరణం. బ్రాహ్మణవత్" అనగా "బ్రహ్మణేన తుల్యమ్" అని అర్థం. "బ్రాహ్మణునితో సమంగా క్షత్రియుడు అధ్యయనం చేస్తున్నాడు" అని అర్థం. ఇక్కడ 'వతి' ప్రత్యయం తుల్యార్థంలో విధించబడింది గాన తుల్యశబ్ది ప్రయోగస్థలంలో వలెనే ఆర్థోపమ.

వ్యా. సమాసగతశ్రౌతోపమను వివరిస్తున్నాడు. ఇవేనేతి - "ఇవేన నిత్య సమాసో విభక్త్యలోపః పూర్వపదప్రకృతిస్వరత్వం చ" అని వార్తికాన్ని అనుస

రించి 'ఇవ'శబ్దంతో సమాసం వచ్చి, 'ఇవ'శబ్దంలో సంబంధం ఉన్నప్పుడు సమాస. గతశ్రౌతోపమ.

వి. "ఇవశబ్దంతో నిత్యంగా సమాసం ఏర్పడుతుంది. సమసించిన పదంలో ఉన్న విభక్తి ప్రత్యయానికి లోపం రాదు. మొత్తం సమాసానికి పూర్వపదప్రకృతి స్వరం వస్తుంది" అని ఈ వార్తికానికి అర్థం. "వాగార్థావివ" ఇత్యాదులు ఉదాహరణం. అయితే "ఇది నిత్యసమాసం కాదు; వైయాకరణులు ఈ సమాసం వైకల్పికం అనే అంగీకరించారు. నిత్యపదఘటితమైన పాఠం (భాష్యంలో) లేదు; అందుచేత 'నిత్య' పదం ప్రక్షిప్తం, అప్రామాణికం" అని ఉద్ద్యోతంలో నాగేశుడు వ్రాశాడు.

క్రమంగా ఉదాహరణలు- వాక్యగతశ్రౌతికి ఉదాహరణం చూపుతున్నాడు

శ్లో॥ స్వప్నేఽపి సమరేషు త్వాం విజయశ్రీర్న ముఞ్చతి,
ప్రభావప్రభవం కాన్తం స్వాధీనపతికా యథా. 392

వ్యా. స్వప్నేఽపీతి- స్వాధీనపతికా = స్వాధీనుడైన భర్త గల స్త్రీ, ప్రభావప్రభవమ్ = అత్యధికానురాగానికి కారణభూతుడైన, కాన్తం యథా = ప్రియుణ్ణి వలె, విజయశ్రీః = విజయలక్ష్మి, త్వామ్ = నిన్ను, సమరేషు = యుద్ధములలో, స్వప్నేఽపి = స్వప్నమునందు కూడా, న ముఞ్చతి = విడుచుట లేదు.

వి. ఇక్కడ స్వాధీనపతిక ఉపమానం. విజయశ్రీ ఉపమేయం. విడవక పోవడం సాధారణధర్మం. 'యథా' అనేది ఉపమావాచకం. వీటి మధ్య ఎక్కడా సమాసం లేదు. అందుచేత ఇది వాక్యగశ్రౌతోపమ.

అవ. వాక్యగతమైన ఆర్థోపమును ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ చకితహరిణలోలలోచనాయాః
క్రుధి తరుణారుణతారహారకాన్తి,
సరసిజమిదమాననం చ తస్యాః
సమమితి చేతసి సంమదం విధత్తే. 393

వ్యా. చకితేతి- చకితహరిణలోలలోచనాయాః = భయపడిన లేడియొక్క నేత్రముల వలె చంచలములైన నేత్రములు గల, తస్యాః = ఆమెయొక్క, క్రుధి = కోపమునందు, తరుణారుణతారహారికాన్తి = తరుణుడైన (బాగా పైకి వచ్చిన) అరుణుని వంటి అధికమైన మనోహరమైన కాంతి గల, ఇదమ్ = ఈ, ఆననం చ = ముఖము, సరసిజం చ = పద్మమూ, సమమ్ ఇతి = సమానమైనది అని, చేతసి = చిత్తమునందు, సంమదమ్ = సంతోషమును, విధత్తే = చేయుచున్నది.

వి. ఇక్కడ సరసిజం ఉపమానం; ముఖం ఉపమేయం. అరుణకాంతి కలిగి ఉండడం సాధారణధర్మం. 'సమ' శబ్దం ఉపమాప్రతిపాదకం. సమశబ్దం దేనితోను సమస్తం కాలేదు. అందుచేత ఇది వాక్యగతఆర్థపూర్ణోపమ.

అవ. సమాసగతశ్రౌతోపమకు ఉదాహరణం చూపుతున్నారు—

శ్లో॥ అత్యాయతైర్నియమకారిభిరుద్ధతానాం
దివ్యైః ప్రభాభిరనపాయమయైరుపాయైః,
శౌరిర్భుజైరివ చతుర్భిరదః సదాయో
లక్ష్మీవిలాసభవనైర్భువనం బభార. 394

వ్యా. శౌరిః = విష్ణువు, అత్యాయతైః = చాలా పొడవైనవి, (రాజపక్షంలో మంచి భవిష్యత్తు కలవి అని అర్థం), ఉద్ధతానామ్ = దానవులకు, (గర్వం కల వారికి అని రెండవ అర్థం), నియమకారిభిః = దండం ఇచ్చేవీ, దివ్యైః = దివ్యములు, (శ్రేష్ఠములు అని రెండవ అర్థం), ప్రభాభిః = ఉత్కృష్టమైన కాంతి గలవి, అనపాయమయైః = అపాయంలేకపోవడమే అధికంగా కలవీ, లక్ష్మీవిలాసభవనైః = లక్ష్మియొక్క విలాసగృహాలూ అయిన, చతుర్భిః = నాలుగు, భుజైః ఇవ = భుజములచేత వలె, యః = ఎవడు, సదా = ఎల్లప్పుడు, ఉపాయైః = ఉపాయాల చేత, అదః = ఈ, భువనమ్ = లోకమును, బభార = భరించెనో.

ఇక్కడ భుజాలు ఉపమానం; ఉపాయాలు ఉపమేయం. ఆయతత్వాదికం సాధారణధర్మం. 'ఇవ' ఉపమావాచకం. 'ఇవ' అనేది 'భుజైః' అనేదానితో సమస్తం అయింది. అందుచేత ఇది సమాసగతశ్రౌతపూర్ణోపమ.

అవ. సమాసగతఆర్థోపమకు ఉదాహరణం చూపుతున్నారు—

శ్లో॥ అవితథమనోరథపథప్రథనేషు ప్రగుణగరిమగీతశ్రీః,
సురతరుసదృశః స భవానభిలషణీయః క్షితీశ్వర న కస్య.

వ్యా. క్షితీశ్వర = రాజా! అవితథమనోరథపథప్రథనేషు = వ్యర్థం కాని మనోరథమార్గాలను విస్తరింపచేయడంలో, ప్రగుణగరిమగీతశ్రీః = అధికములైన గుణముల గురుత్వంచేత గానం చేయబడిన సంపద గల, సురతరుసదృశః = కల్పవృక్షములతో సమానుడవైన, భవాన్ = నీవు, కస్య = ఎవనికి, న అభిలషణీయః = అభిలషింపతగనివాడవు ?

వి. ఇక్కడ కల్పవృక్షం ఉపమానం. రాజు ఉపమేయం, అభిలషణీయత్వం సాధారణధర్మం. 'సదృశ'శబ్దం ఉపమాప్రతిపాదకం. 'సురతరుసదృశః' అని ఉపమానోపమేయప్రతిపాదకాలకి సమాసం. అందువలన సమాసగతమైన ఆర్థపూర్ణోపమ.

అవ. తద్ధితగతశ్రౌత- ఆర్థోపమలకు ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ గామ్భీర్యగరిమా తస్య సత్యం గఙ్గాభుజఙ్గవత్,
దురాలోకః స సమరే నిదాఘామ్బరరత్నవత్. 396

వ్యా. సత్యమ్ = నిజంగా, తస్య = వానియొక్క, గామ్భీర్యగరిమా = గాంభీర్యంయొక్క ఆధిక్యం, గఙ్గాభుజఙ్గవత్ = సముద్రంయొక్క గాంభీర్యగరిమ వలె ఉన్నది, సః = అతడు, సమరే = యుద్ధంలో, నిదాఘామ్బరరత్నవత్ = గ్రీష్మంలోని సూర్యుడు వలె, దురాలోకః = చూడ శక్యంకానివాడు.

వి ఇక్కడ పూర్వార్ధంలో సముద్రం ఉపమానం, రాజు ఉపమేయం. గాంభీర్యగరిమ సాధారణధర్మం. 'భుజంగవత్' అన్నప్పుడు "తత్ర తస్యేవ" అనే సూత్రంచేత షష్ఠ్యంతానికి ఇవార్థంలో 'వతి'ప్రత్యయం చేర్చబడింది గాన ఇది తద్ధితగత శ్రౌతపూర్ణోపమ.

ఉత్తరార్ధంలో సూర్యుడు ఉపమానం. రాజు ఉపమేయం. దురాలోకత్వం సాధారణధర్మం. 'అమ్బరరత్నవత్' అన్నప్పుడు 'వతి'ప్రత్యయం 'తేన తుల్యం క్రియాచేద్వతిః' అనే సూత్రంచేత వచ్చినది. "రత్నేన తుల్యం రత్నవత్" అని విగ్రహం. అందుచేత తద్ధితగతమైన ఆర్థపూర్ణోపమ.

అవ. గుణాలంకారయుక్తమై వ్యంగ్యం లేనిది 'చిత్రకావ్యం' అని వెనుక (5వ కారిక దగ్గర) చెప్పబడింది. అలంకారా లున్న ప్రదేశాలలో అలంకారాల వల్ల వైచిత్ర్యం ఉన్నా వాటితో వ్యంగ్యార్థం కూడా ఉంటుంది కదా ? అందుచేత ఇది ధ్వనికావ్యమో, గుణీభూతవ్యంగ్యమో అవుతుంది కాని చిత్రకావ్యం ఎందుకు అవుతుంది అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నారు–

వృ. స్వాధీనపతికా కాన్తం భజమానా యథా లోకోత్తరచమత్కారభూః తథా జయశ్రీః త్వదాసేవనేన ఇత్యాదినా ప్రతీయమానేన వినా యద్యపి నోక్తేర్వైచిత్ర్యమ్, వైచిత్ర్యం చాలంకారః, తథాపి న ధ్వని గుణీభూతవ్యఙ్గ్యవ్యవహారః. న ఖలు వ్యఙ్గ్యసంస్పర్శపరామర్శాదత్ర చారుతాప్రతీతిః, అపి తు వాచ్యవైచిత్ర్యప్రతిభాసాదేవ. రసాదిస్తు వ్యఙ్గ్యోఽర్థోఽలంకారాన్తరం చ సర్వత్రావ్యభిచారీత్యగణయిత్వైవ తత్ అలంకారాః ఉదాహృతాః. తద్రహితత్వేన తు ఉదాహ్రియమాణా విరసతామావహన్తీతి పూర్వాపరవిరుద్ధాభిధానమితి న చోదనీయమ్.

వ్యా. స్వాధీనేతి- "తన భర్తను భజిస్తూన్న స్వాధీనపతిక అయిన స్త్రీ ఏ విధంగా లోకోత్తరమైన చమత్కారం కలిగిస్తుందో, నిన్ను సేవించడంచేత జయ లక్ష్మి కూడా లోకోత్తరచమత్కారం కలిగిస్తూన్నది" అనే వ్యంగ్యార్థం లేక పోతే ఈ వర్ణనలో వైచిత్ర్యమే ఉండదు. అలంకారం అనగా వైచిత్ర్యమే. ఈ మాట నిజమే. అయినా ఇలాంటి కావ్యాలను 'ధ్వని' అని కాని, 'గుణీభూత వ్యంగ్యం' అని కాని వ్యవహరించము. ఎందుచేత ననగా ఇక్కడ చమత్కారం ఉన్నదంటే అది వ్యంగ్యార్థస్పర్శజ్ఞానంవల్ల కాదు. వాచ్యంలో ఉన్న వైచిత్ర్యం భాసించడంవల్లనే. ప్రతీ కావ్యంలోనూ రసాదివ్యంగ్యార్థమూ, ఏ అలంకారాన్ని గూర్చి చెప్పుకుంటున్నామో అది కాక మరొక ఏదో అలంకారము తప్పకుండా ఉండి తీరుతాయి. ఆ విషయాన్ని లెక్కలోనికి తీసికొనకుండా ఆ యా అలంకారాలకి ఉదాహరణలు చూపడం జరిగింది. అయితే ఆ రసాదులు ఏవీ లేని, ఆ అలంకారాలు మాత్రమే ఉన్న ఉదాహరణలు చూపవచ్చు కదా ప్రశ్నించవచ్చు. అలాంటివి చూపిస్తే అవి వైరస్యాన్ని కలిగిస్తాయి. 'చన్ద్రధవలః పటః' మొదలైన వాటిని ఉపమాద్యలంకారోదాహరణాలుగా చూపిస్తే ఏమి అందం ఉంటుంది ?

అందుచేత వెనుక చెప్పినదానికీ, ఇక్కడ చెపుతూన్నదానికీ విరోధం ఉన్నది అని ఆశంకించకూడదు.

వి. అనగా ఏదో ఒక అలంకారాన్ని గూర్చి చెప్పదలచినప్పుడు దానికి చూపే ఉదాహరణంలో కొద్దిగానో గొప్పగానో వ్యంగ్యార్థం కూడా ఉండవచ్చు. రసాదులే ఉండవచ్చు. మరొక అలంకారం కూడా ఉండవచ్చు. వాటిని అన్నింటినీ గూర్చి కూడా చెప్పుకుంటూ పోతే అంతం ఉండదు. అందుచేత వాటిని ప్రస్తావించకుండా ప్రకృతమైన అలంకారాన్ని గూర్చి మాత్రమే చెప్పడం జరుగుతుంది. కొన్ని స్థలాలలో వ్యంగ్యాదులు ఉన్నా వాటివల్ల కలిగే చమత్కారంకంటె ప్రకృతాలంకారంవల్ల కలిగే చమత్కారం అధికంగా ఉంటుంది. అందుచేత కూడా దానిని ఆ అలంకారానికి ఉదాహరణగా చెప్పడం జరుగుతుంది అని భావం.

కా. తద్వద్ధర్మస్య లోపే స్యాత్ న శ్రౌతీ తద్ధితే పునః

వృ. ధర్మః సాధారణః, తద్ధితే కల్పబాదౌ త్వార్థ్యేవ. తేన పఞ్చ. ఉదాహరణమ్-

శ్లో॥ ధన్యస్యానన్యసామాన్యసౌజన్యోత్కర్షశాలినః,
కరణీయం వచస్తేన సత్యం తస్యామృతం వచః. 397

వ్యా తద్వదితి-ధర్మస్య = సాధారణధర్మం యొక్క, లోపే=లోపమునందు, తద్వత్ = పూర్ణయందు వలె సమాస-వాక్య-తద్ధితములయందు శ్రౌతి ఉపమ, ఆర్థి ఉపమ ఉండును. శ్రౌతీ పునః = శ్రౌతి అయితే, తద్ధితే = తద్ధితమునందు, న = ఉండదు.

ధర్మ ఇతి- ధర్మః-సాధారణధర్మం, "కల్పప్" '(కల్ప' మిగులుతుంది) మొదలైన తద్ధితమునందైతే, ఆర్థి మాత్రమే ఉంటుంది; అందుచేత సాధారణ ధర్మలుప్తలో ఐదు బేదాలు మాత్రమే ఉంటాయి. ఉదాహరణం. వాక్యగతం అయిన ధర్మలుప్తశ్రౌతికి ఉదాహరణం చూపుతున్నాడు-

ధన్యస్యేతి-చేతః = ఓః చిత్తమా! ధన్యస్య = ధన్యుడు, అనన్యసామాన్యసౌజన్యోత్కర్షశాలినః = ఇతరులకు సాధారణం కాని (ఇతరులలో లేని) సౌజన్యోత్కర్షతో ప్రకాశిస్తున్నవాడూ, అయిన, తస్య = వానియొక్క, వచః=వచనము,

అమృతం యథా = అమృతం వంటిది. సత్యమ్ = తప్పక, కరణీయమ్ = చేయ దగింది. లేదా 'అమృతం వంటి వచనం' అని అన్వయం.

వి. ఇక్కడ-ఉపమానోపమేయాలైన అమృత-వాక్కులలో ఉన్న సాధారణ ధర్మం 'సంతోషజనకత్వం' మొదలైనది. అది చెప్పబడలేదు గాన ధర్మలుప్తోపమ. 'యథా' శబ్దప్రయోగంచేత శ్రౌతి.

అవ. వాక్యగతమైన ధర్మలుప్త అయిన ఆర్థోపమకు ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ఆకృష్టకరవాలోఽసౌ సంపరాయే పరిభ్రమన్,
ప్రత్యర్థిసేనయా దృష్టః కృతాన్తేన సమః ప్రభుః. 398

వ్యా. ఆకృష్టకరవాలః = లాగబడిన ఖడ్గం కల, సంపరాయే = యుద్ధమునందు, పరిభ్రమన్ = తిరుగుచున్న, అసౌ = ఆ, ప్రభుః = రాజు, ప్రత్యర్థిసేనయా = శత్రుసేనచేత, కృతాన్తేన = యమునితో, సమః = సమానుడుగా, దృష్టః = చూడబడినాడు.

వి. ఇక్కడ ఉపమానోపమేయాలైన యమరాజులలో ఉన్న సమానధర్మం 'భయంకరత్వం'. అది చెప్పలేదు గాన ధర్మలుప్తోపమ. 'సమ' శబ్దం ప్రయోగించడంవల్ల ఆర్థి ఉపమ. 'సమ' శబ్దం వ్యస్తంగా ఉపయోగించబడింది. అందుచేత వాక్యగతోపమ.

శ్లో॥ కరవాల ఇవాచార స్తస్య వాగమృతోపమా,
విషకల్పం మనో వేత్సి యది జీవసి తత్సఖే. 399

వ్యా. సఖే = ఓ! మిత్రమా! తస్య = వానియొక్క, ఆచారః = ఆచారం, కరవాలః ఇవ = ఖడ్గం వంటిది. వాక్ = వాక్కు, అమృతోపమా = అమృతంతో సమానము. మనః = మనస్సు, విషకల్పమ్ = విషం వంటిది. జీవసి = (నీవు) బ్రతికితే, తత్ = దానిని లేదా, అప్పుడు, వేత్సి = తెలిసికొంటావు.

వి. ఇక్కడ-'కరవాల ఇవ ఆచారః' అన్నప్పుడు ఉపమానోపమేయాలైన ఖడ్గ-దుష్టులకు సంబంధించిన సాధారణధర్మం ఘాతుకత్వం. అది చెప్పలేదు గాన

ధర్మలుప్తోపమ. 'ఇవ'తో సమాసం; అందుచేత ఇది సమాసగతశ్రౌతధర్మలు ప్తకు ఉదాహరణం. 'అమృతోపమా వాక్' అన్నప్పుడు ఉపమానోపమేయాలకి సంబంధించిన మాధుర్యరూపసమానధర్మం లుప్తం. 'ఉపమా' శబ్దం 'అమృత' శబ్దంతో సమాసంలో ఉంది. 'ఉపమా' అనగా 'తుల్యా, అని అర్థం. ఈ విధంగా ఇది సమాసగత ధర్మలుప్త ఆర్థోపమకు ఉదాహరణం. 'విషకల్పమ్' అన్నది "ఈషదసమాప్తౌ కల్పబ్‌దేశ్యదేశీయరః" (పా. సూ. 5.3.67) అనే సూత్రంచేత 'కల్పప్' చేర్చగా ఏర్పడిన రూపం. "కల్పప్, దేశ్య, దేశీయర్ అనే ప్రత్యయాలు కొంచెం తక్కువ అనే అర్థంలో చేర్చబడతాయి" అని ఈ సూత్రానికి అర్థం. "విషకల్పమ్" "కొంచెం (ఇంచుమించు) విషమే" అని అర్థం. పర్యవసానంలో ఈ ప్రత్యయం 'సమానము' అనే అర్థం బోధిస్తుంది. అందుచేత ఇది తద్ధితగత అర్థ ధర్మలుప్తోపమకు ఉదాహరణం. ఈ విధంగా ఈ శ్లోకంలో మూడు ధర్మలుప్తా భేదాలకు ఉదాహరణ లున్నాయి.

కా. ఉపమానానుపాదానే వాక్యగాథ సమాసగా. 88

గా. సఅలకరణపరవీసామసిరివిఅరణం ణ సరసకవ్వస్స,
దీసఇ అహ వ ణిసమ్మఇ సరిసం అంసంసమేత్తేణ. 400

"సకలకరణపరవిశ్రామశ్రీవితరణం న సరసకావ్యస్య
దృశ్యతేఽథవా నిశమ్యతే సదృశమంశాంశమాత్రేణ."

వృ. కవ్వస్సేత్యత్ర కవ్వసమమితి సరసమిత్యత్ర చ ణూణమితి పాఠే ఏష్వైవ సమాసగా.

వా. ఉపమానేతి- ఉపమానానుపాదానే=ఉపమానాన్ని గ్రహించనప్పుడు, వాక్యగా = వాక్యగతమూ, అథ = మరియు సమాసగా = సమాసగతము.

వి. ఉపమానలుప్తోపమకు వాక్యగతం, సమాసగతం అనే రెండు భేదాలు మాత్రమే ఉంటాయి. ఇవాదులు ఉపమానవాచకపదం ప్రక్కనే చేర్చబడతాయి. ఉపమానవాచకం లేనప్పుడు ఇవాదులప్రయోగం కూడా ఉండదు, అందుచేత దీనిలో శ్రౌతీభేదాలు ఉండవు. అట్లే తద్ధితప్రత్యయాలు కూడా ఉపమానవాచకానికే చేరుతాయి. అందుచేత తద్ధితగతోపమానలుప్త కూడ ఉండదు.

సకలేతి-అంశాంశమాత్రేణ = లేశమాత్రం కూడా, సరసకావ్యస్య = సరసమైన కావ్యానికి, సదృశమ్ = సమానమైన, సకలకరణపరవిశ్రమశ్రీవితరణమ్ = = సమస్తేంద్రియాలకీ గొప్ప విశ్రాంతి సంపదను ఇచ్చేది,న దృశ్యతే=చూడబడడంలేదు; అథవా=లేదా, న నిశమ్యతే = వినబడడంలేదు

వి. ఇక్కడ వర్ణించబడుతున్న కావ్యం ఉపమేయం, సకలేత్యాదికం సాధారణధర్మం, సదృశశబ్దం ఉపమావాచకం, అది సమాసంలో లేదు, ఉపమానం చెప్పలేదు అందుచేత ఇది వాక్యగతమైన ఉపమానలుప్తోపమ.

కవ్వస్సేతి- ఈ గాథలోనే 'కవ్వస్స'కు బదులు 'కవ్వసమమ్' అనీ 'సరిసమ్'కు బదులు 'ణూణం' (నూనం) అనీ మార్చి చదివితే ఇదే సమాసగతోపమానలుప్త అవుతుంది.

కా. వాదేర్లోపే సమాసే సా కర్మాధారక్యచి క్యజి.

కర్మకర్త్రోర్ణముల్.

వృ. 'వా'శబ్దః ఉపమాద్యోతక ఇతి వాదేరుపమాప్రతిపాదకస్య లోపే షట్, సమాసేన, కర్మణోఽధికరణాత్ చ ఉత్పన్నేన క్యచా, కర్తుః క్యజా, కర్మకర్త్రోః ఉపపదయోః ణములా చ భవేత్.

వ్యా. వాదేరితి-వాదేః = ఉపమావాచకాలైన 'వా', ఇవ. 'తుల్య', 'సదృశ' ఇత్యాదులయొక్క, లోపే = లోపమునందు, సమాసే = సమాసంలోను. కర్మాధారక్యచి = కర్మార్థ-ఆధారార్థములయందు విధించబడిన 'క్యచ్' ప్రత్యయం చేరినప్పుడు, 'క్యజి' = 'క్యజ్' ప్రత్యయం చేరినప్పుడు, కర్మకర్త్రోః = కర్మ, కర్త ఉపపదాలుగా ఉండగా, ణముల్ = 'ణముల్' ప్రత్యయం చేరినప్పుడు, సా = ఆ ఉపమ, అగును.

వా ఇతి-'వా' శబ్దం (ఉపమాద్యోతకం, ఉపమను సూచిస్తుంది) అందుచేత ఉపమాప్రతిపాదకాలైన 'వా' మొదలైనవి లోపించినప్పుడు ఆరు భేదాలు ఏర్పడతాయి. సమాసంచేత, కర్మార్థాధికరణార్థాలలో చేరిన 'క్యచ్' చేత, కర్త్రర్థంలో చేరిన 'క్యజ్' చేత, కర్మకర్తలు ఉపపదంగా ఉండగా చేర్చిన 'ణముల్' చేత ఆరు భేదాలు.

అవ. సమాసగతం ద్విపదసమాసగతం, బహుపదసమాసగతం అని రెండు విధాలు ఉంటుంది. ద్విపదసమాసగతవాదిలుప్తకు ఉదాహరణం చూపుతున్నాడు-

వృ. ఉదాహరణమ్:-

శ్లో॥ తతః కుముదనాథేన కామినీగణ్డపాణ్డునా
నేత్రానన్దేన చన్ద్రేణ మాహేన్ద్రీ దిగలంకృతా. 401

వ్యా. ఉదాహరణం-తతః ఇతి- తతః=అటుపిమ్మట, కామినీగణ్డపాణ్డునా = స్త్రీయొక్క గండస్థలం వలె తెల్లనైన, నేత్రానన్దేన= నేత్రానందకరుడైన, కుముదనాథేన= చంద్రునిచేత, మాహేన్ద్రీ దిక్ = తూర్పుదిక్కు, అలంకృతా= అలంకరించబడింది.

వి. ఇక్కడ "కామినీగణ్డపాణ్డునా" అనేది సమాసగతవాదిలుప్తోపమకు ఉదాహరణం. 'కామినీగణ్డ ఇవ పాణ్డుః కామినీగణ్డపాణ్డుః' అని విగ్రహవాక్యం. ఉపమానవాచకమైన 'కామినీగణ్డ' శబ్దానికి సమానధర్మవాచకమైన 'పాణ్డు' శబ్దంతో "ఉపమానాని సామాన్యవచనైః" (పా.సూ. 2.1.55) అనే సూత్రంచేత సమాసం. 'ఇవ' శబ్దం లోపించింది.

అవ. బహుపదసమాసగతవాదిలుప్తోపమకు ఉదాహరణం చూపుతున్నాడు.

వృ. తథా-

శ్లో॥ అసితభుజగభీషణాసిపత్రో
రుహరుహికాహితచిత్తతూర్ణచారః,
పులకితతనురుత్కపోలకాన్తిః,
ప్రతిభటవిక్రమదర్శనేఽయమాసీత్. 402

వ్యా. మరియు-అసితేతి-అయమ్= ఈ వీరుడు, ప్రతిభటవిక్రమదర్శనే= శత్రుభటుల పరాక్రమాన్ని చూడగానే, అసితభుజగభీషణాసిపత్రః= నల్లత్రాచు వలె భయంకరమైన ఖడ్గం కలవాడై, రుహరుహికాహితచిత్తతూర్ణచారః= అత్య

ధికమైన ఉత్కంఠతో (ఉత్సాహంతో) వ్యాప్తమైన చిత్తంతో శీఘ్రంగా సంచరించు చున్నవాడై, పులకితతనుః = పులకించిన శరీరం కలవాడుగాను, ఉత్కపోలకాన్తిః = బయలుదేరిన చెక్కిళ్ళ మెరుపు కలవాడుగాను, ఆసీత్ = అయెను.

వి. ఇక్కడ "అసితభుజగ ఇవ భీషణః అసితభుజగభీషణః" అని విగ్రహ వాక్యం. ఇది ఐదు పదాల సమాసం. అందుచేత బహుపదగతవాదిలుప్తకు ఉదాహరణం.

అవ. కర్మార్థ-అధికరణార్థాలలో 'క్యచ్' చేర్చినపుడు వాదిలుప్తకు ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ పౌరం సుతీయతి జనం సమరాన్తరేఽసా
వన్తఃపురీయతి విచిత్రచరిత్రచుఞ్చుః,
నారీయతే సమరసీమ్ని కృపాణపాణే
రాలోక్య తస్య చరితాని సపత్నసేనా. 403

వ్యా. విచిత్రచరిత్రచుఞ్చుః=విచిత్రములైన చరిత్రలచేత ప్రసిద్ధుడైన, అసౌ = ఈ రాజు, పౌరం జనమ్ = పౌరజనాన్ని, సుతీయతి=పుత్రుణ్ణి వలె ఆచరిస్తున్నాడు. పుత్రుణ్ణి వలె పాలిస్తున్నాడు. సమరాన్తరే = యుద్ధమధ్యమునందు, అన్తఃపురీయతి = అంతపురమునందు వలె ప్రవర్తిస్తున్నాడు. నిర్భయంగా తిరుగుతున్నాడు. సమరసీమ్ని = యుద్ధభూమియందు, కృపాణపాణేః = ఖడ్గం హస్తమునందు గల, తస్య = వానియొక్క, చరితాని = ప్రవర్తనలను, ఆలోక్య = చూచి, సపత్నసేనా = శత్రుసేన, నారీయతే = స్త్రీవలె ప్రవర్తిస్తున్నది.

వి. ఇక్కడ 'సుతీయతి' అనేది "సుతమ్ ఇవ ఆచరతి" (పుత్రుణ్ణి వలె ఆచరిస్తున్నాడు) అనే అర్థంలో ఉపమానవాచక ద్వితీయాంతసుతశబ్దానికి "ఉపమానాదాచారే" (పా.సూ. 3.1.10 అను సూత్రం చేత 'క్యచ్' ('య' మిగులుతుంది) ప్రత్యయం చేయగా ఏర్పడింది. ఇక్కడ ఆచారం స్నేహం, పాలనం మొదలైన రూపంలో ఉంటుంది. అదే సాధారణధర్మం.'క్యచ్' మొదలైన ప్రత్యయాలన్నీ 'ఆచరించడం' అనే అర్థాన్ని సాధారణరూపంలో బోధిస్తాయి. ఆ ఆచారంలో ఉన్న విశేషాన్ని, అది ఎలాంటి ఆచారం అనే విషయాన్ని ప్రకరణాన్ని

పట్టి తెలుసుకోవాలి. ఉపమాబోధకమైన 'ఇవ' మొదలైనవి గాని, 'తుల్య' మొద లైనవి గాని లేకపోవడంచేత ఇది "కర్మక్యచి వాదిలోపః" అనే దానికి ఉదా హరణం.

"అన్తఃపురీయతి" అనేది 'అన్తఃపురే ఇవ ఆచరతి' (అంతఃపురంలో వలె ప్రవర్తిస్తున్నాడు) అనే అర్థంలో "అధికరణాచ్చేతి వక్తవ్యమ్" అనే వార్తికం చేత ('ఉపమానాదాచారే' అనే సూత్రం దగ్గర ఉన్నది) సప్తమ్యంతమైన ఉప మానవాచక 'అంతఃపుర' శబ్దానికి ఆచారార్థంలో 'క్యచ్' ప్రత్యయం చేర్చడం చేత ఏర్పడింది. స్వేచ్ఛగా నిర్భయంగా సంచరించడం ఆచారం. అదే సాధా రణధర్మం. ఇక్కడ కూడా ఉపమావాచకాలేవీ లేవు. అందుచేత అధికరణక్యచ్ చేయగా వాదిలుప్తోమకు ఉదాహరణం.

'నారీయతే' అనేది 'నారీ ఇవ ఆచరతి' (స్త్రీ వలె ప్రవర్తిస్తూన్నది) అనే అర్థంలో ఉపమానవాచక 'నారీ' శబ్దానికి "కర్తుః క్యఙ్ సలోపశ్చ" (పా.సూ. 3.1.11) అనే సూత్రంచేత 'క్యఙ్' ('య' మిగులుతుంది) చేర్చగా ఏర్పడింది. ఇక్కడ భయపడడం, వినయం మొదలైనది ఆచారం. ఉపమాప్రతిపాదకపదా లేవీ లేకపోవడంచేత ఇది 'కర్తరి క్యఙ్' చేర్చగా వాదిలుప్తకు ఉదాహరణం.

శ్లో॥ మృధే నిదాఘఘర్మాంశుదర్శం పశ్యన్తి తం పరే,
స పునః పార్థసంచారం సంచరత్యవనీపతిః. 404

వ్యా. మృధే ఇతి :- పరే = శత్రువులు, తమ్ = ఆతనిని, మృధే = యుద్ధమునందు, నిదాఘఘర్మాంశుదర్శమ్ = గ్రీష్మ కాలమునందలి సూర్యుణ్ణి చూచినట్లుగా, పశ్యన్తి = చూస్తున్నారు. సః = ఆ, అవనీపతిః పునః = రాజైతే, పార్థసంచారమ్ = అర్జునుడు సంచరించి నట్లుగా, సంచరతి = సంచరిస్తున్నాడు.

వి. 'నిదాఘఘర్మాంశుదర్శమ్' అనేది "నిదాఘఘర్మాంశుమివ దర్శనమ్" (గ్రీష్మకాలసూర్యుణ్ణి వలె చూచుట) అనే అర్థంలో కర్మవాచకం ఉపపదం (ప్రక్కనున్నపదం)గా ఉంటూండగా 'దృశ్' ధాతువుకు భావార్థంలో "ఉపమానే కర్మణి చ" (పా. సూ. 3.4.45) అనే సూత్రంచేత 'ణముల్' ('అమ్' మిగులు తుంది) ప్రత్యయం చేర్చగా ఏర్పడింది. భావార్థంలో చేర్చబడడంచేత క్రియా విశేషణానికి వలె అర్థం చెప్పుకోవాలి. (సూర్యుణ్ణి చూచుటగా చూస్తున్నారు.

అనగా 'సూర్యుణ్ణి వలె చూస్తున్నారు' అని పర్యవసితార్థం). ఉపమాప్రతిపాదకాలేవీ లేకపోవడంచేత ఇది "కర్మవాచకం ఉపపదంగా ఉండగా 'ణముల్' చేర్చిన వాదిలుప్తోపమ". సూర్యాంశువు ఉపమానం. రాజు ఉపమేయం. దర్శనం సాధారణ ధర్మం.

'పార్థసంచారమ్' అనేది 'పార్థ ఇవ సంచరణమ్' (పార్థుడు వలె సంచరించడం) అనే అర్థంలో ఉపమానవాచకపార్థశబ్దం ఉపపదంగా ఉండగా సంపూర్వకచరధాతువుకు ('ఉపమానే కర్మణి చ' అనే సూత్రంలో 'చ'కారబలంచేత 'కర్తరి' అనే దానిని అనుకర్షించడంచేత 'ణముల్' ప్రత్యయం చేర్చగా ఏర్పడిన రూపం. పార్థుడు ఉపమానం. రాజు ఉపమేయం. సంచరించడం సామాన్యధర్మం. ఇవాదులు లేకపోవడంచేత 'కర్త' ఉపపదంగా ఉండగా 'ణముల్' చేర్చడంచేత ఏర్పడిన వాదిలుప్తోపమ.

అవ. ఇంతవరకు పదమూడు ఏకలుప్తోమాభేదాలు చెప్పబడ్డాయి. ఇపుడు ద్విలుప్తకు సంబంధించిన ఐదు విధాలలో ద్వివిధమైన ధర్మ-వాదిలుప్తను నిరూపిస్తున్నాడు.

కా. ఏతద్ద్విలోపే క్విప్సమాసగా. 89

వృ. ఏతయోః ధర్మవాద్యోః. ఉదాహరణమ్-

శ్లో॥ సవితా విధవతి విధురపి సవితరతి తథా దినన్తి యామిన్యః,
యామినయన్తి దినాని చ సుఖదుఃఖవశీకృతే మనసి. 405

వ్యా. ఏతదితి:— ఏతద్ద్విలోపే = ఈ రెండింటి లోపం కలిగగా, క్విప్ సమాసగా = క్విప్గ, సమాసగ అవుతుంది.

ఏతయోరితి:— ఏతయోః అనగా ఈ ధర్మవాదులయొక్క అని అర్థం. ఉదాహరణం ఎట్లనగా-

వి. ధర్మమూ ఇవాదులు రెండూ లోపించిన లుప్తోపమలో 'క్విప్' ప్రత్యయగత, సమాసగత అనే రెండుభేదాలు మాత్రమే ఉంటాయి. 'ముఖం చన్ద్రః' అన్నంతమాత్రాన ఉపమానోపమేయభావం తెలియదు. అందుచేత ఈ

ద్విలుప్తాభేదాలలో వాక్యగ ఉండదు. 'కల్పప్' మొదలైన తద్ధితలు ఉపమాప్రతి పాదకాలు. అవి ఉంటే వాచకలోపమే ఉండదు గాన 'తద్ధితగ' కూడ ఉండదు. ఇవాదులు లేకపోవడంచేత శ్రౌతి ఉండదు.

వ్యా. సవితా ఇతి :- మనసి = మనస్సు, సుఖదుఃఖవశీకృతే = సుఖ దుఃఖాలచేత వశం చేసికొనబడగా, సవితా = సూర్యుడు, విధవతి = చంద్రుడు వలె ఆచరిస్తాడు, విధురపి = చంద్రుడు కూడా, సవితరతి=సూర్యుడు వలె ఆచ రిస్తాడు, తథా = మరియు, యామిన్యః = రాత్రులు, దిన న్తి = దినముల వలె ఆచ రిస్తాయి. దినాని చ = దినాలు కూడా, యామినయ న్తి = రాత్రులవలె ఆచ రిస్తాయి.

వి. "విధుః ఇవ ఆచరతి" (చంద్రుడు వలె ఆచరిస్తున్నాడు అనగా చంద్రుడులాగ సుఖకరంగా ఉన్నాడు). "సవితా ఇవ ఆచరతి" (సూర్యుడు వలె ఆచరిస్తున్నాడు; క్లేశం కలిగిస్తున్నాడు) "దినానీవ ఆచర న్తి" (దినాల వలె ఆచ రిస్తున్నాయి), "యామిన్యః ఇవ ఆచర న్తి" (రాత్రుల వలె ఆచరిస్తున్నాయి) అనే అర్థాలలో 'విధు' 'సవితృ' 'దిన' 'యామినీ' శబ్దాలకు, "సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః" అనే వార్తికంచేత 'క్విప్' (ఈ ప్రత్యయం పూర్తిగా లోపిస్తుంది. అది చెప్పే అర్థం మాత్రం మిగులుతుంది) ప్రత్యయం చేర్చగా ఏర్పడ్డాయి. సుఖకరత్వ-క్లేశకారిత్వాదిరూపసాధారణధర్మాలు, ఉపమావాచకవాదులూ కూడా లేవు. ఉపమానోపమేయాలు మాత్రం ఉన్నాయి. అందుచేత క్విప్గతధర్మవాద్యు భయలుప్తోపమకు ఉదాహరణం.

అవ. సమాసగకు ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ పరిపన్థిమనోరాజ్యశతైరపి దురాక్రమః,
సంపరాయప్రవృత్తోఽసౌ రాజతే రాజకుఞ్జరః. 406

వ్యా. పరీతి :- పరిపన్థిమనోరాజ్యశతైరపి = శత్రువుల వందలకొలది మనోరాజ్యాలచేత కూడా, మనస్సులో నిర్మించుకొనే అత్యాశలచేత కూడా, దురా క్రమః = ఆక్రమింపశక్యం కాని, సంపరాయప్రవృత్తః=యుద్ధంలో ప్రవర్తించిన, అసౌ = ఈ, రాజకుఞ్జరః = ఏనుగు వంటి రాజు, రాజతే = ప్రకాశిస్తున్నాడు.

వి. ఇక్కడ ఏనుగ ఉపమానం. రాజు ఉపమేయం. ఎదిరింప శక్యం కాకపోవడం సమానధర్మం. ఈ సమానధర్మం, వాదిఉపమాద్యోతకపదాలూ లుప్తమైనవి. అందుచేత సమాసగత సాధారణధర్మవాదిలుప్తోపమ.

కా. ధర్మోపమానయోర్లోపే వృత్తౌ వాక్యే చ దృశ్యతే.

శ్లో॥ ఢుణ్ఢుణ్ణన్తో మరిహసి కణ్టకకలిఅఇం కేఅఇవణాఇం,
మాలఇకుసుమసరిచ్ఛం భమర భమన్తో ణ పావిహిసి.

"ఢుణ్ఢులాయమానో మరిష్యసి కణ్టకకలితాని కేతకీవనాని.
మాలతీకుసుమసదృక్షం భ్రమర భ్రమన్న ప్రాప్స్యసి."

వృ. కుసుమేణ సమమితి పాఠే వాక్యగా.

వ్యా. ధర్మేతి :- ధర్మోపమానములయొక్క, లోపే = లోపమునందు, వృత్తౌ = సమాసవృత్తియందు, వాక్యే చ = వాక్యమునందు, దృశ్యతే = చూడబడుచున్నది.

ఢుణ్ఢులాయమాన ఇతి :- భ్రమర = ఓ తుమ్మెదా! కణ్టకకలితాని = ముళ్ళతో కూడిన, కేతకీవనాని = మొగలిడొంకలను, ఢుణ్ఢులాయమానః = తిరుగుతూ, మరిష్యసి = మరణించగలవు; భ్రమన్ = ఎంత తిరిగినా, మాలతీకుసుమసదృక్షమ్ = మాలతీపుష్పంతో సమానమైన దానిని, న ప్రాప్యసి = పొందవు.

వి ఇక్కడ మాలతీకుసుమం ఉపమేయం. సదృక్షం ఉపమావాచకం. కాని ఉపమానం కాని, సమానధర్మం గాని చెప్పలేదు. అందుచేత సమాసగత ధర్మోపమానలుప్తోపమ.

కుసుమేనేతి :- 'మాలతీకుసుమసదృక్షమ్' అని సమాసం కాక "కుసుమేన సమమ్" అని వాక్యం ప్రయోగించిన పక్షంలో వాక్యగతధర్మోపమానలుప్తోపమకు ఉదాహరణం అవుతుంది.

కా. క్వచి వాద్యుపమేయాసే.

వృ. ఆసే నిరాసే.

శ్లో॥ అరాతివిక్రమాలోకవికస్వరవిలోచనః,
కృపాణోదగ్రకోదణ్డః స సహస్రాయుధీయతి. 408

వృ. అత్రాత్మా ఉపమేయః.

వ్యా. క్యచీతి :- క్యచి = 'క్యచ్' ప్రత్యయం చేర్చబడినప్పుడు, వాద్యుపమేయాసే = వాదులయొక్క, ఉపమేయంయొక్క లోపమునందు (ఒక భేదము).

వి. ఉపమేయ - ఉపమావాచకములు లోపించినప్పుడు ఒకే భేదం ఉంటుంది. అది 'క్యచ్' ప్రత్యయం చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

వ్యా. 'ఆసే' అనగా నిరాసం, లోపం అని అర్థం.

అరాతీతి :- "అరాతి........విలోచనః". అరాతి=శత్రువులయొక్క, విక్రమ=పరాక్రమం యొక్క, ఆలోక=చూడడంచేత, వికస్వర=వికసించే స్వభావం గల, లోచనః = నేత్రాలు గల, కృపాణోదగ్రకోదణ్డః = ఖడ్గంచేత భయంకరమైన బాహుదండం గల, సః = అతడు, సహస్రాయుధీయతి = వేయి ఆయుధాలు గల కార్తవీర్యార్జునుని వలె తనను ఆచరిస్తున్నాడు. అత్రేతి :- "ఇక్కడ ఆత్మ ఉపమేయం."

వి. 'సహస్రాయుధీయతి' అనేది "సహస్రాయుధమ్ ఇవ ఆత్మానమ్ ఆచరతి" (తనను కార్తవీర్యార్జునునిగా ఆచరిస్తున్నాడు) అనే అర్థంలో 'ఉపమానాదాచారే' (పా.సూ. 3.1.10) అనే సూత్రంచేత 'సహస్రాయుధమ్' అనే ద్వితీయాంతకర్మపదానికి 'క్యచ్' చేర్చగా ఏర్పడింది. ఉపమేయమైన ఆత్మ, ఇవాదికం లోపించాయి. అందుచేత 'క్యచ్' చేర్చగా ఏర్పడిన వాద్యుపమేయలుప్తోమకు ఉదాహరణం.

అవ. మూడు లోపించిన ఒక భేదం వివరిస్తున్నాడు.

కా. త్రిలోపే చ సమాసగా

వృ. త్రయాణాం వాదిధర్మోపమానానామ్. ఉదాహరణమ్.

శ్లో॥ తరుణిమని కృతావలోకనా
లలితవిలాసవితీర్ణవిగ్రహా,
స్మరశరవిసరాచితాన్తరా
మృగనయనా హరతే మునేర్మనః. 409

వృ. అత్ర సప్తమ్యుపమానేత్యాదినా యదా సమాసలోపౌ భవతః తదేదముదాహరణమ్.

వ్యా. త్రిలోపే = వాది-సాధారణధర్మ-ఉపమానాలు లుప్తములైనప్పుడు, సమాసగా = సమాసగత లుప్తోపమ మాత్రమే ఉంటుంది. ఉదాహరణం-

తరుణిమనీతి- తారుణిమని = తారుణ్యమునందు. కృతావలోకనా = చేయబడిన అవలోకనం కలదీ, తారుణ్యంలో ప్రవేశించినది అని అర్థం, లలితవిలాస వితీర్ణ విగ్రహా = సుందరములైన విలాసలకు ఇవ్వబడిన శరీరం కలదీ, స్మరశరవిసరా చితాన్తరా = మన్మథబాణసముదాయంచేత వ్యాప్తమైన హృదయం కలదీ అయిన, మృగనయనా = మృగము నేత్రముల వంటి నేత్రాలు గల ఆమె, మునేః = ముని యొక్క మనః = మనస్సును, హరతే = హరించుచున్నది.

వి. 'మృగనయనా' అనుదానికి "మృగనయనే ఇవ నయనే యస్యాః సా" (మృగనయనముల వంటి నయనములు కలది) అని విగ్రహం. "సప్తమ్యుపమాన పూర్వపదస్య బహువ్రీహిరుత్తరపదలోపశ్చ" అనే వార్తికంచేత సమాసం. "సప్తమ్యంతము ఉపమానవాచకము పూర్వపదంగా కలదానికి మరొక పదంతో సమాసం చేయబడుతుంది. పూర్వపదంలోని ఉత్తరపదానికి లోపం వస్తుంది," అని ఈ వార్తికానికి అర్థం. మృగస్య నయనే మృగనయనే = మృగంయొక్క నయనాలు. ఈ 'మృగనయన' అనే ఉపమానవాచకశబ్దానికి 'నయన' శబ్దంతో సమాసం చేయగా 'మృగనయననయనా' అని అవుతుంది. దీనిలోని పూర్వపదం 'మృగనయన' అనేది, దాని ఉత్తరపదం అయిన 'నయన' లోపించగా 'మృగ నయనా' అని సమాసం ఏర్పడుతుంది. ఇక్కడ వాదులు కాని, ఉపమానమైన 'నయన' శబ్దం కాని, చాంచల్యదీర్ఘత్వాదిసమానధర్మాన్ని చెప్పే పదం కాని లేదు, అందుచేత ఇది 'వాదిధర్మోపమానలుప్త'కు ఉదాహరణం.

అత్రేతి-ఇక్కడ సప్తమ్యుపమానేత్యాదివార్తికంచేత సమాసమూ, ఉత్తర పదలోపమూ చేసినప్పుడు త్రిలుప్తకు ఉదాహరణం.

వి. కొందరి అభిప్రాయం ప్రకారం ఇక్కడ ఉత్తరపదలోపం చేయకుండ గానే 'మృగనయనా'లోని'మృగ' శబ్దానికి లక్షణచేత మృగనేత్రములు అని అర్థం చెప్పడంచేత 'మృగనయనముల వంటి నయనములు కలది' అని అర్థం వస్తుంది. అప్పుడు "మృగ ఇవ నయనే యస్యాః సా" అని విగ్రహం. ఆ పక్షంలో ఇక్కడ ఉపమానవాచకలోపం లేదు గాన ఇది త్రిలుప్తకు ఉదాహరణం కాదు. ద్విలుప్తకే, ఉపమావాచక-ధర్మవాచకలుప్తకే, ఉదాహరణం.

వృ. క్రూరస్యాచారస్యాయఃశూలతయా అధ్యవసాయాత్ అయః శూలేనాన్విచ్ఛతి 'ఆయఃశూలికః' ఇత్యతిశయోక్తిః,న తు క్రూరాచారోప మేయతైక్ష్ణ్యధర్మవాదీనాం లోపే త్రిలోపేయముపమా. ఏవమేకోన. వింశతిర్లుప్తాః, పూర్ణాభిః సహ పఞ్చవింశతిః.

వ్యా. క్రూరస్యేతి- క్రూరమైన ప్రవర్తనను అయఃశూలంగా (ఇనుప శూలంగా) అధ్యవసానం చేయడంచేత 'అయఃశూలేన అన్విచ్ఛతి' అనే అర్థం గల 'అయఃశూలికః' అనేది అతిశయోక్తియే కాని ఉపమేయమైన క్రూరాచారము, తైక్ష్ణ్య రూపధర్మము, వాదులు లోపించిన త్రిలోపోపమ కాదు.

వి. 'మృగనయనా' ఇత్యాదులలో ఉపమేయాన్ని మాత్రమే చెప్పడంచేత ఉపమాన-వాది-ధర్మత్రిలుప్తోపమ అయినట్లు, 'అయఃశూలికః' ఇత్యాదులలో ఉపమానాన్ని మాత్రమే చెప్పడంచేత ఉపమేయ-వాది-ధర్మత్రిలుప్తోపమ చెప్ప వచ్చును. "అయఃశూలేన అన్విచ్ఛతి ఆయఃశూలికః" అని విగ్రహం. 'అయఃశూల' శబ్దానికి లక్షణచేత 'అయఃశూలంతో సమానమైన ప్రవృత్తి' అని అర్థం. అయః శూలం ఉపమానం, క్రూరప్రవృత్తి ఉపమేయం. ఈ ఉపమేయమూ వాదికమూ, ధర్మవాచకమూ మూడూ లేకపోవడంచేత దీనిని ఉపమేయ-వాది - ధర్మ త్రిలుప్తోపమకు ఉదాహరణంగా చెప్పవచ్చును అని కొందరు ప్రతిపాదించారు. అది యుక్తం కాదు; క్రూరాచారాన్ని అయఃశూలంగా అధ్యవసించడంచేత, నిర్ధ యించడంచేత, ఇక్కడ అధ్యవసాయమూలకమైన అతిశయోక్త్యలంకారమే కాని ఉపమాలంకారం కాదు. సాధ్యవసాయలక్షణచేత క్రూరాచారం అనే అర్థం బోధించే

'అయఃశూల' శబ్దానికి "అయఃశూలదణ్డాజినాభ్యాం ఠక్ఠఞౌ" (5.2.76) అనే సూత్రంచేత 'ఠక్' (అది 'ఇక'గా మారుతుంది) ప్రత్యయం చేర్చగా 'ఆయఃశూలికః' అనే రూపం ఏర్పడుతుంది. ఇక్కడ 'అతిశయోక్తియే' గాని ఉపమ కాదు అని భావం.

క్యచ్, క్యఙ్, క్విప్, తద్ధితాదులచేత ఏర్పడే లుప్తోపమాభేదాలను తొలి సారిగా ప్రతిపాదించినవాడు భట్టోద్భటుడు, తద్వ్యాఖ్యాత ప్రతీహారేందురాజు అని కనబడుతుంది. వాటినే మమ్మటుడు కొన్నిమార్పులు చేర్పులతో గ్రహించాడు, గ్రంథవిస్తరభీతిచేత కావ్యాలంకారసారసంగ్రహగతవిషయాలన్నీ ఇక్కడ చెప్పడంలేదు. జిజ్ఞాసువులు అక్కడ ఉపమాప్రకరణంనుండి గ్రహించవచ్చును. 'ఆయఃశూలిక' అన్నప్పుడు త్రిలుప్తోపమ అవి చెప్పినది ప్రతీహారేందురాజు. ఇక్కడ అతిశయోక్తి చెప్పడం యుక్తం కదా అని ఆశంకించుకొని ఉపమయే చెప్పాలి అని కూడ అతడు ప్రతిపాదించాడు. అతిశయోక్తి యుక్తం అని మమ్మటుని అభిప్రాయం. ఈ విధమైన విచిత్రభేదాలు ఉన్నా ఏది చేతోహారిగా ఉంటుందో అదే అలంకారం అవుతుంది. కాని అన్నింటికీ అలంకారత్వం ఉండదు అని ప్రతీహారేందురాజు విశదీకరించాడు. "ఏషా చోపమా విచిత్రభేదత్వే సత్యపి యత్రైవ చేతోహారిత్వమస్తి తత్రైవాలంకారతాం భజతే; న సర్వత్రేత్యుక్తమ్" (కా. సా. సం. పేజి 29). వ్యాకరణశాస్త్రవ్యుత్పత్తిప్రధానాలైన ఈ భేదాలన్నీ అంతగా ఉపకరించవు అని నాగేశభట్టు కూడా ఉద్ద్యోతంలో అన్నాడు.

వా. ఏవమితి- ఈ విధంగా లుప్తాభేదాలు పందొమ్మిది. పూర్ణోపమాభేదాలు కూడా కలపగా మొత్తం ఉపమాభేదాలు ఇరవైఆయిదు. ధర్మలుప్తోపమాభేదాలు ఐదు-5, ఉపమానలుప్తాభేదాలు రెండు-2, ఇవాదిలుప్తాభేదాలు ఆరు-6, ధర్మేవాదిలుప్తాభేదాలు రెండు-2, ధర్మోపమానలుప్తాభేదాలు రెండు-2, ఇవాద్యుపమేయలుప్తోపమా భేదం ఒకటి-1, త్రిలుప్త ఒక భేదం-1, మొత్తం 19 భేదాలు.

అవ. ప్రాచీనులు చెప్పిన 'మాలోపమ' మొదలైన భేదాలు కూడా లెక్క పెట్టుకుంటూ పోతే అంతం ఉండదు అని చెప్పడానికి అవి కొన్ని ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ అనయేనేవ రాజ్యశ్రీర్దైన్యేనేవ మనస్వితా
మమ్లౌ సాథ విషాదేన పద్మినీవ హిమామ్భసా 410

వృ ఇత్యభిన్నే సాధారణే ధర్మే,

శ్లో॥ జ్యోత్స్నేవ నయనానన్దః సురేవ మదకారణమ్,
ప్రభుతేవ సమాకృష్టసర్వలోకా నితమ్బినీ. 411

వృ. ఇతి భిన్నే చ తస్మిన్ ఏకస్యైవ బహూపమానోపాదానే మాలోపమా, యథోత్తరముపమేయస్యోపమానత్వే పూర్వవదభిన్నభిన్న ధర్మత్వే.

శ్లో॥ అనవరతకనకవితరణజలలవభృతకరతరఙ్గితార్థితతేః,
భణితిరివ మతిర్మతిరివ చేష్టా చేష్టేవ కీర్తిరతివిమలా.412

శ్లో॥ మతిరివ మూర్తిర్మధురా మూర్తిరివ సభా ప్రభావచితా,
తస్య సభేవ జయశ్రీః శక్యా జేతుం నృపస్య న పరేషామ్.

వృ. ఇత్యాదికా రశనోపమా చ న లక్షితా, ఏవంవిధవైచిత్ర్య సహస్రసంభవాత్; ఉక్తభేదానతిక్రమాచ్చ.

వ్యా. అనయేనేతి:- ఒక ఉపమేయానికి రెండు మూడు ఉపమానాలు చెప్పడం మాలోపమ. సాధారణధర్మం అభిన్నంగా (ఒకటే) ఉండడం, భిన్నంగా ఉండడం అనే భేదాన్ని పట్టి అది రెండు విధాలు. ఇది సాధారణధర్మం అభిన్నంగా ఉన్న మాలోపమకు ఉదాహరణం. అథ = పిమ్మట, సా = ఆమె, అనయేన = చెడ్డనీతిచేత, రాజ్యశ్రీః ఇవ=రాజ్యలక్ష్మి వలె, దైన్యేన=దైన్యంచేత, మనస్వితా ఇవ = ధీరత్వం వలె, అథ = మరియు, హిమామ్భసా=మంచుచేత, పద్మినీవ = పద్మలత వలె, విషాదేన = విషాదంచేత, మ్లానా = వాడిపోయెను.

వి. నాయికారూపమైన ఒక ఉపమేయానికి రాజ్యశ్రీ మొదలైన అనేక ఉపమానాలు చెప్పబడ్డాయి. అందుచేత మాలోపమ. గ్లాని అనేది ఒక్కటే సాధారణధర్మం.

వా. ఇతీతి:- ఈ విధంగా, పై శ్లోకంలో ఉన్నట్లు సాధారణధర్మం అభిన్నం, అనగా ఒకటే, అయినప్పుడు—

జ్యోత్స్నేవేతి:- నితమ్బినీ = ఆ స్త్రీ, జ్యోత్స్నేవ = వెన్నెల వలె, నయనానన్దః = నేత్రాలకు ఆనందం; సురేవ = మద్యం వలె, మదకారణమ్ =

మత్తుకు కారణం; ప్రభుతేవ = ప్రభుత్వం వలె సమాకృష్టసర్వలోకా = ఆకర్షించ బడిన సకలలోకాలూ గలది.

వి. ఇక్కడ నితంబిని అనే ఒక్క ఉపమేయానికి జ్యోత్స్నాదులు మూడు ఉపమానాలుగా చెప్పబడ్డాయి. అందుచేత మాలోపమ. సాధారణధర్మాలు భిన్నాలు; వేరు వేరు సాధారణధర్మాలు చెప్పబడ్డాయి.

వ్యా. ఇతీతి:- అని, (పైశ్లోకంలో) అవి, అనగా సాధారణధర్మం అభిన్నంగా ఉండగా ఒకే ఉపమేయానికి అనేక ఉపమానాలు గ్రహించినప్పుడూ ఏర్పడిన మాలోపమ, ముందు ఉపమేయంగా ఉన్నవే తరువాత వరసగా (ఉత్తరోత్తరం) ఉపమానంగా చెప్పినప్పుడు వెనుకటి వలె (మాలోపమలో వలె) భిన్న ధర్మమూ, అభిన్నధర్మమూ అయినప్పుడు; దీనికి "ఇత్యాదికా రశనోపమా" అనే దానితో అన్వయం.

అనవరతేతి:- "అనవరత... ....తతేః"-అనవరత = ఎడతెగకుండా కనక వితరణ = బంగారం ఇవ్వడమునందు. జలలవ = జలబిందువులతో, భృత = నిండిన, కర = హస్తమునందు. తరఙ్గిత = పంక్తిగా ఏర్పడిన, అర్థితతేః = యాచకసముదాయం గల అతనియొక్క, మతిః = బుద్ధి. భణితిః ఇవ = మాట వలె, చేష్టా = పని. మతిః ఇవ = బుద్ధి వలె, కీర్తిః = కీర్తి, చేష్టేవ = చేష్ట వలె, అతివిమలా = చాల స్వచ్ఛమైనది.

వి. ఇక్కడ మొదట ఉపమేయమైన మతి 'మతిరివ చేష్టా' అనే వాక్యంలో ఉపమానం అయింది. ఈ వాక్యంలో ఉపమేయమైన చేష్ట " చేష్టేవ కీర్తిః" అనే వాక్యంలో ఉపమానం అయింది సామాన్యధర్మం అతివిమలత్వం. అది అభిన్నం; ఒక్కటే. ఈ విధంగా ఇది అభిన్నసమానధర్మకరశనోపమ

వ్యా. మతిరివేతి:- తస్య నృపస్య = ఆ రాజుయొక్క, మూర్తిః = ఆకారం, మతిరివ = బుద్ధి వలె, మధురా = మధురమైనది. సభా = సభ, మూర్తిరివ = మూర్తి వలె, ప్రభావచితా = ప్రభావంలో కూడినది. జయశ్రీః = జయలక్ష్మి, సభేవ = సభ వలె, పరేషామ్ = పరులకు, జేతుమ్ = జయించుటకు, న శక్యా = శక్యమైనది కాదు.

వి. ఇక్కడ పూర్వం ఉపమేయంగా ఉన్నవి ఉత్తరవాక్యాలలో ఉపమానాలుగా చెప్పబడడంచేత రశనోపమ. కాని సమానధర్మాలు వేరు వేరు.

వ్యా. ఇత్యాదికేతి- ఈ మొదలైన రశనోపమ కూడ లక్షింపబడలేదు. అనగా మాలోపమా రశనోపమాదులకు లక్షణాలు చెప్పి వాటిని నిరూపించలేదు. ఎందుచేతననగా ఇలాంటి వైచిత్ర్యాలు వేలకొలది ఉండడానికి అవకాశం ఉంది. ఇది ఏదీ పైన చెప్పిన (ఇరవైఐదు) భేదాలు దాటి వెళ్ళవు. అనగా పైన చెప్పిన వాటిలో ఏదో ఒక భేదంలో అంతర్గతం అవుతాయి.

## 2. ఉపమేయోపమాలంకారం.

కా. ఉపమానోపమేయత్వే ఏకస్యైవైకవాక్యగే.

అనన్వయః

వృ. ఉపమానాన్తరసంబన్ధాభావః అనన్వయః. ఉదాహరణమ్-

శ్లో॥న కేవలం భాతి నితాన్తకాన్తిర్నితమ్బినీ సైవ నితమ్బినీవ,
యావద్విలాసాయుధలాస్యవాసాస్తే తద్విలాసా ఇవ తద్విలాసాః

వ్యా. ఉపమానేతి :. ఏకస్యైవ = ఒకేదానికి, ఏకవాక్యగే = ఒక వాక్యములో ఉన్న, ఉపమానోపమేయత్వే = ఉపమానోపమేయత్వాలు, అనన్వయః = అనన్వయాలంకారము.

ఉపమానేతి- మరియొక ఉపమానంతో సంబంధం లేకపోవడం అనన్వయం.

వి. ఒక వాక్యంలో ఒకే వస్తువును ఉపమేయంగాను, ఉపమానంగాను వర్ణించడం అనన్వయాలంకారం. 'అనన్వయ' శబ్దానికి "న విద్యతే అన్వయః ఉపమానాన్తరసంబన్ధః యత్ర సః" అని విగ్రహం. దేనియందు మరొక ఉపమానంతో సంబంధం ఉండదో అది అని అర్థం. ఆ వస్తువును ఆవస్తువుతోనే పోల్చడంలో ఉద్దేశ్యం దీనిని పోలిన మరొక వస్తువు లేదని చెప్పడం. ఉదాహరణం ఎట్లనగా-

నేతి- కేవలమ్ = కేవలమూ, నితాన్తకాన్తిః = గొప్ప కాంతి గల, సా = ఆ, నితమ్బినీ ఏవ = నితంబిని మాత్రమే, నితమ్బినీవ = నితంబిని వలె, న భాతి = ప్రకాశించడంలేదు. యావత్ = మరి ఏమనగా, తే = ఆ, విలాసాయుధ

లాస్యవాసాః = మన్మథుని లాస్యానికి స్థానాలైన, తద్విలాసాః = ఆమె విలాసలు, తద్విలాసాః ఇవ = ఆమె విలాసల వలె ఉన్నవి.

వి. ఇక్కడ పూర్వార్ధంలో నితంబిని (సుందరనితంబం గల యువతి) ఆ నితంబినితోనే పోల్చబడింది. ఉత్తరార్ధంలో ఆమె విలాసలు ఆమె విలాసలతోనే పోల్చబడ్డాయి. ఈ విధంగా రెండు అనన్వయాలంకారాలు. ఆమెతో పోల్చదగిన మరొక స్త్రీ లేదు. ఆమె విలాసలతో పోల్చదగిన విలాసలు లేవు అని చెప్పడం ఉద్దేశ్యం.

## 3. ఉపమేయోపమాలంకారం.

కా. విపర్యాస ఉపమేయోపమా తయోః. 9

వృ. తయోః ఉపమానోపమేయయోః. పరివృత్తిః అర్థాత్ వాక్యద్వయే. ఇతరోపమావ్యవచ్ఛేదపరా ఉపమేయేనోపమా ఇతి ఉపమేయోపమా. ఉదాహరణమ్-

శ్లో॥ కమలేవ మతిర్మతిరివ కమలా
తనురివ విభా విభేవ తనుః,
ధరణీవ ధృతిర్ధృతిరివ ధరణీ
సతతం విభాతి బత యస్య. 415

వ్యా. విపర్యాస ఇతి- తయోః = ఉపమనోపమేయాలయొక్క, విపర్యాసః = తారుమారుచేయడం, ఉపమేయోపమా = ఉపమేయోపమాలంకారం.

తయోరితి- ఆ ఉపమానోపమేయాల పరివృత్తి, అనగా రెండు వాక్యాలలో, మొదటి వాక్యంలో ఉపమానంగా చెప్పినదానిని రెండవ వాక్యంలో ఉపమేయంగాను, ఉపమేయంగా చెప్పినదానిని ఉపమానంగాను చెప్పడం ఉపమేయోపమాలంకారం. 'ఉపమేయేన ఉపమా యత్ర ఉపమేయోపమా' అని విగ్రహం. ఎక్కడ ఉపమేయంతో ఉపమయో అది ఉపమేయోపమ అని అర్థం. ఇక్కడ చెప్పిన ఉపమానం తప్ప మరొక ఉపమానం దీనికి లేదు అని చెప్పడం ప్రయోజనం. ఉదాహరణం-

కమలేవేతి- యస్య = ఎవనియొక్క, మతిః = బుద్ధి, కమలేవ = లక్ష్మి వలె, కమలా = లక్ష్మి. మతిరివ = బుద్ధి వలె, విభా = కాంతి, తనురివ = శరీరం వలె, తనుః = శరీరం విభేవ = కాంతి వలె, ధృతిః = ధైర్యం, ధరణీవ = భూమి వలె, ధరణీ = భూమి, ధృతిరివ = ధైర్యం వలె, విభాతి = ప్రకాశిందుచున్నదో. బత = ఎంత ఆశ్చర్యము.

వి ఇక్కడ కమలాదులు మత్యాదులతో పోల్చబడ్డాయి. మొదటి వాక్యంలో ఉపమానంగా ఉన్న కమల రెండవవాక్యంలో ఉపమేయం అయిది; ఉపమేయంగా ఉన్న మతి ఉపమానం అయింది. ఈ విధంగా మూడు ఉపమేయోపమాలంకారాలు ఉన్నాయి ఇక్కడ చెప్పిన వస్తువులతో పోల్చడానికి తగిన మూడవ వస్తువు లేదని చెప్పడం ప్రయోజనం.

## 4. ఉత్ప్రేక్షాలంకారం.

కా. సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్.

వృ. సమేన ఉపమానేన. ఉదాహరణమ్—

శ్లో॥ ఉన్మేషం యో మమ న సహతే జాతివైరీ నిశాయామ్
ఇన్దోరిన్దీవరదలదృశా తస్య సౌన్దర్యదర్పః.
నీతః శాన్తిం ప్రసభమనయా వక్త్రకాన్త్యేతి హర్షా
ల్లగ్నా మన్యే లలితతను తే పాదయోః పద్మలక్ష్మీః. 416

వ్యా. ఉపమా-అనన్వయ-ఉపమేయోపమాలంకారాలలో సాధర్మ్యం శబ్దం చేత బోధించబడుతుంది. ఇప్పుడు వ్యంగ్యమైన సాధర్మ్యం గల అలంకారాలలో ఉత్ప్రేక్షాలంకారాన్ని చెపుతున్నారు. సంభావనమితి :- అథ = ఇప్పుడు ఉత్ప్రేక్ష చెప్పబడుతున్నది. ప్రకృతస్య = ప్రకృతమైన ఉపమేయం యొక్క, సమేన = ఉపమానంతో. సంభావనమ్ = ఏకరూపత్వసంభావనం, ఉత్ప్రేక్షా = ఉత్ప్రేక్షాలంకారం. 'సమేన' అనగా ఉపమానంతో అని అర్థం.

వి. "ఆ కనబడుతున్నది పురుషుడా కాదా" అనేది సంశయం. పురుషుడు అనేది ఒక కోటి ఇది విధేయం. కాదు అనేది పురుషనిషేధం ఇది రెండవ కోటి.

రెండు కోటులూ సమంగా ఉంటే సంశయం. ఒక కోటి ఉత్కటంగా ఉంటే, అనగా ఒక కోటివైపు మొగ్గుదల ఉంటే, ఆ సంశయానికే 'సంభావన' అని పేరు. దీనిలో సాదృశ్యం అంతర్గతంగా ఉంటుంది. అందుచేత ఉత్ప్రేక్ష సాదృశ్య గర్భం.

ఉన్మేషమితి- మమ = నాయొక్క, జాతివైరీ = జన్మశత్రువైన, యః = ఏ చంద్రుడు, నిశాయామ్ = రాత్రియందు, మమ = నాయొక్క, ఉన్మేషమ్ = వికాసమును, న సహతే = సహించడో, తస్య ఇన్దోః = అట్టి చంద్రునియొక్క, సౌన్దర్యదర్పః = సౌందర్యగర్వం. ఇన్దీవరదలదృశా = నల్లకలువల దళముల వంటి నేత్రాలు గల, అనయా = ఈమెచేత, ప్రసభమ్ = బలాత్కారంగా, వక్త్ర కాన్త్యా = ముఖకాంతిచేత. శాన్తిమ్ = శాంతిని, నీతః = పొందించబడింది, ఇతి = అని, హర్షాత్ = సంతోషంవల్ల, పద్మలక్ష్మీః = పద్మశోభ, తే పాదయోః = నీ పాదాలయందు, లగ్నా = లగ్నమైనది అని, మన్యే = తలచుచున్నాను.

వి. ఇక్కడ స్వభావసిద్ధమైన పాదశోభ ఉపమేయం. పద్మశోభ ఉపమానం. ఈ ప్రకృతమైన పాదశోభ పాదాలమీద పడిన పద్మం శోభగా ఊహించబడుతున్నది అందుచేత ఉత్ప్రేక్షాలంకారం.

శ్లో॥ లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీవాఞ్జనం నభః.
అసత్పురుషసేవేవ దృష్టిర్విఫలతాం గతా. 417

వృ. ఇత్యాదౌ వ్యాపనాది లేపనాదిరూపతయా సంభావితమ్.

వ్యా. లిమ్పతీతి- ఈ శ్లోకం మృచ్ఛకటికంలోను, కావ్యాదర్శంలోనూ కూడ ఉంది. తమః = చీకటి, అఙ్గాని = అవయవాలను, లిమ్పతీవ = పూయుచున్నట్లు ఉన్నది. నభః = ఆకాశం, అఞ్జనమ్ = కాటుకను, వర్షతీవ = వర్షిస్తుందా అన్నట్లున్నది. అసత్పురుషసేవ = చెడ్డవాని సేవ వలె, దృష్టిః = దృష్టి. విఫలతామ్ = విఫలత్వమును. గతా = పొందినది.

ఇతీతి- ఇత్యాదులలో వ్యాపనాదికం లేపనాదిరూపంగా సంభావించబడినది.

వి. ఇక్కడ తమస్సు శరీరంలోని అవయవాలన్నీ వ్యాపిస్తూంది. ఈ వ్యాపించడాన్ని (మసివంటివి పూసినట్లు) అవయవాలకి పూయడంగా (అలమ

దంగా) సంభావన చేయబడింది. చీకటి అంతా వ్యాపించింది. ఈ వ్యాపించడం ఆకాశం అంజనవర్షం కురిపించడంగా సంభావన చేయబడింది. అందుచేత పూర్వార్ధంలో ఉత్ప్రేక్షాలంకారమే. కొందరు 'ఇవ' శబ్దాన్ని చూచి అనుకొన్నట్లు ఉపమాలంకారం కాదు. ఉత్తరార్ధంలోమాత్రం ఉపమాలంకారమే. ఈ విషయంలో అభిప్రాయభేదానికి అవకాశం లేదు.

5. ససందేహాలంకారం.

కా. ససందేహస్తు భేదోక్తౌ తదనుక్తౌ చ సంశయః. 92

వృ. భేదోక్తౌ యథా–

శ్లో॥ అయం మార్తణ్డః కిం స ఖలు తురగైః సప్తభిరితః
కృశానుః కిం సర్వాః ప్రసరతి దిశో నైష నియతమ్,
కృతాన్తః కిం సాక్షాన్మహిషవహనోఽసావితి చిరం
సమాలోక్యాజౌ త్వాం విదధతి వికల్పాన్ ప్రతిభటాః. 418

వృ. భేదోక్తావిత్యనేన న కేవలమయం నిశ్చయగర్భో, యావన్నిశ్చయాన్తోఽపి సందేహః స్వీకృతః. యథా–

వ్యా. ససందేహ ఇతి- వెనుకటి కారికనుంచి 'ప్రకృతస్య సమేన యత్' అనే పదాలు అనువర్తిస్తాయి. ప్రకృతమైన ఉపమేయాన్ని, సమానమైన, ఉపమానంగా గ్రహించడంవల్ల, సంశయః = ఏ సంశయం ఉన్నదో అది, ససందేహాలంకారం. భేదోక్తౌ = భేదం చెప్పడంలోను (చేత), తదనుక్తౌ = దానిని చెప్పకపోవడంలోను (చేత) అది రెండు విధాలు.

వి. ఒకదానిని చూచి మరొక దానితో దానికి ఉన్న పోలికను పట్టి ఇదా అదా అనే సంశయం ససందేహాలంకారం. అనగా ససందేహం సాదృశ్యమూలకం అవడంచేత సాదృశ్యగర్భం. భేదం చెప్పడం చెప్పకపోవడం అనేదానిని పట్టి ఇది రెండు విధాలు అని అర్థం. ఈ ససందేహం నిశ్చయగర్భం, నిశ్చయాంతం, శుద్ధం, అనగా కేవలసంశయరూపం, అని మూడు విధాలు. ఈ విషయం ఎదట స్పష్టం అవుతుంది. భేదం చెప్పినప్పుడు ససంశయం ఎట్లనగా-

అయమితి- త్వామ్ = నిన్ను, ఆజౌ = యుద్ధంలో, సమాలోక్య=చూచి, ప్రతిభటాః = శత్రుభటులు, అయమ్ = ఇతడు, మార్తాణ్డః కిమ్ = సూర్యుడా ? సః = అతడు, సప్తభిః = ఏడు, తురగైః = గుఱ్ఱాలతో, ఇతః = కూడినవాడు. ఇతని దగ్గర అసంఖ్యాకములైన గుఱ్ఱాలు ఉండడంచేత ఇతడు సూర్యుడు కాడు అని భావం. కృశానుః కిమ్ = అగ్నియా ? ఏషః = ఈ అగ్ని, నియతమ్ = నిశ్చితరీతిప్రకారం, సర్వాః దిశః = అన్ని దిక్కులను గూర్చి, న ప్రసరతి = ప్రసరించదు. గాలి వీచే వైపే ప్రసరిస్తుంది. ఇతడు అన్ని వైపులా ప్రసరిస్తు న్నాడు. అందుచేత అగ్ని అవడానికి వీలులేదు అని భావం. సాక్షాత్ = సాక్షాత్తు, కృతాన్తః కిమ్ = యముడా ? అసౌ = అతడు (యముడు), మహిషవహనః = మహిషవాహనుడు. ఇతడు మహిషవాహనుడు కాదు కాబట్టి యముడవడానికి వీలు లేదు అని భావం. ఇతి = అని, చిరమ్ = చిరకాలమును, వికల్పాన్ = సంశయా లను, విదధతి = చేయుచున్నారు.

వి. సప్తాశ్వాదులతో సంబంధం సూర్యాదులకే ఉన్నది కాని రాజుకు లేదు అని చెప్పడం చేత ఇది భేదోక్తి ఉన్న ససందేహాలంకారం.

వ్యా. భేదేతి— 'భేదోక్తౌ' అనడంచేత ఈ సందేహం కేవలం నిశ్చయ గర్భమే కాదు, నిశ్చయాంతం కూడా ఉండవచ్చు నని స్వీకరించబడింది.

వి. భేదాన్ని చెప్పిన ససందేహాలంకారంలో సందేహం ఒకప్పుడు నిశ్చయ గర్భం కావచ్చు, ఒకప్పుడు నిశ్చయాంతం కావచ్చు. పై ఉదాహరణంలో ముందుగా "ఇతడు సూర్యుడా ?" అని సందేహం ప్రకటించి, ఏడు గుఱ్ఱాలు లేక పోవడంచేత సూర్యుడు కాడు అని నిశ్చయించబడింది. ఒక ఉపమానంకంటె భిన్నమైనది అని గ్రహించినా మరొక ఉపమానం రూపంలో మరొక సందేహం కలగడానికి అవకాశం లేకపోలేదు. అందుచేత మరొక సంశయం. అదీ కాదని నిశ్చయించిన తరవాత మరొక సంశయం. ఈ విధంగా ఇది నిశ్చయగర్భ సంశయం ఉన్న ససంశయాలంకారం.

అవ. నిశ్చయాంతమైన సంశయానికి అనగా ముందు సంశయం కలిగి, భేదజ్ఞానంచేత చివరికి నిశ్చయంతోనే ముగిసే సందేహం ఉన్న ససందేహానికి ఉదాహరణం ఎట్లనగా-

శ్లో॥ఇన్దుః కిం క్వ కలఙ్కః సరసిజమేతత్ కిమమ్బు కుత్ర గతమ్,
లలితసవిలాసవచనైర్ముఖమితి హరిణాక్షి నిశ్చితం పరతః. 419

వృ. కింతు నిశ్చయగర్భ ఇవ నాత్ర నిశ్చయః ప్రతీయమాన ఇతి ఉపేక్షితో భట్టోద్భటేన.

వ్యా. హరిణాక్షి = ఓ! మృగనయనా! ఏతత్ = ఇది, ఇన్దుః కిమ్ = చంద్రుడా! కలఙ్కః = కలంకం, క్వ = ఎక్కడున్నది? కలంకం లేదు గాన చంద్రు డవడానికి వీలు లేదని భావం. ఏతత్ = ఇది, సరసిజం కిమ్ = పద్మమా? అమ్బు = జలము, కుత్ర గతమ్ = ఎక్కడికి పోయింది? నీళ్ళు లేవు కాబట్టి పద్మం అవడానికి వీలులేదని భావం. పరతః = అనంతరం, లలితసవిలాస వచనైః = మనోహరములైన విలాసపూర్వకములైన మాటలచేత, ముఖమ్ ఇతి = ముఖమే అని, నిశ్చితమ్ = నిర్ణయించబడింది.

ఇక్కడ భేదాన్ని చెప్పిన నిశ్చయాంతమైన ససందేహాలంకారం. అయితే కావ్యాలంకారసారసంగ్రహంలో ఈ నిశ్చయాంతససందేహాన్ని భట్టోద్భటుడు ఎందుకు చెప్పలేదు అని ప్రశ్నించుకొని సమాధానం చెపుతున్నాడు- కింత్వితి :- నిశ్చయగర్భంలో వలె దీనిలో నిశ్చయం ప్రతీయమానం (వ్యంగ్యం) కాదు. అందుచేత ఈ భేదాన్ని భట్టోద్భటుడు ఉపేక్షించాడు.

'అయం మార్తణ్డః కిమ్' ఇత్యాది శ్లోకంలో చూచినట్లుగా నిశ్చయగర్భ ససంశయాలంకారస్థలంలో నిశ్చయం వాచ్యం కాక వ్యంగ్యంగా ఉన్నది. అందుచేత దానిలో చమత్కారం ఉంది. ఈ నిశ్చయాంతంలో నిశ్చయం వాచ్యం అయినది కాబట్టి అంతగా చమత్కారం లేదు. అందుచేత భట్టోద్భటుడు దీనిని ఉపేక్షించినా డని భావం.

వృ. తదనుక్తౌ యథా-

శ్లో॥ అస్యాః సర్గవిధౌ ప్రజాపతిరభూచ్చన్ద్రో ను కాన్తిప్రదః
శృఙ్గారైకరసః స్వయం ను మదనో మాసో ను పుష్పాకరః,
వేదాభ్యాసజడః కథం ను విషయవ్యావృత్తకౌతూహలో
నిర్మాతుం ప్రభవేన్మనోహరమిదం రూపం పురాణో మునిః.

వ్యా. తదితి :- భేదాన్ని చెప్పనప్పుడు ఎట్లనగా-

అస్యా ఇతి :- విక్రమోర్వశీయంలో ఊర్వశి సౌందర్యం చూచి ముగ్ధుడైన పురూరవుడు అనుకొంటూన్న మాటలు. అస్యాః = ఈమెయొక్క, సర్గవిధౌ = సృష్టియందు, కాన్తిప్రదః = కాంతిని ఇచ్చు, చన్ద్రః = చంద్రుడు, ప్రజాపతిః = నిర్మాతగా, అభూత్ ను = అయినాడా! శృఙ్గారైకరసః = శృంగారం ప్రధాన రసంగా గల, మదనః = మన్మథుడు, స్వయం ను = స్వయంగా నిర్మాతగా అయినాడా? పుష్పాకరః = పుష్పాలకు ఆకరమైన, మాసః ను = మాసం, వసంత ఋవా? వేదాభ్యాసజడః = వేదాభ్యాసంచేత జడుడు, విషయవ్యావృత్తకౌతూహలః = విషయాలనుండి మరలిన ఆసక్తి గల, పురాణః = ప్రాచీనుడైన, మునిః = నారాయణుడు, మనోహరమ్ = మనోహరమైన, ఇదం రూపమ్ = ఈ రూపమును, నిర్మాతుమ్ = నిర్మించుటకు, కథం ను = ఎట్లు, ప్రభవేత్ = సమర్థుడగును?

ఇక్కడ ఊర్వశిని సృజించినవానిని గూర్చి చంద్రుడా, మన్మథుడా, వసంతుడా అనే సందేహం వ్యక్తీకరించబడింది; భేదం చెప్పబడలేదు. మధ్యలో గాని, అంతంలోగాని నిశ్చయం చెప్పబడలేదు. అందుచేత ఇక్కడ శుద్ధసందేహాలంకారం.

## 6. రూపకాలంకారం

కా. తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః.

వృ. అతిసామ్యాత్ అనపహ్నుతభేదయోః అభేదః.

కా. సమస్తవస్తువిషయం శ్రౌతా ఆరోపితా యదా. 93

వృ. ఆరోపవిషయా ఇవ ఆరోప్యమాణాః యదా శబ్దోపాత్తాః తదా సమస్తాని వస్తూని విషయః అస్యేతి సమస్తవస్తువిషయం. ఆరోపితా ఇతి బహువచనమవివక్షితమ్. యథా-

వ్యా. తదితి :- ఉపమానోపమేయయోః = ఉపమానోపమేయాలయొక్క, యః = ఏ, అభేదః = అభేదం కలదో, తత్ = అది, రూపకమ్ = రూపకాలంకారము.

అతీతి:- అతిసామ్యంవల్ల, కప్పబడని భేదం గలవాటికి అభేదం రూపకం.

వి. "ముఖమేవ చన్ద్రః" ముఖమే చంద్రుడు. ఇత్యాదులలో ముఖానికీ చంద్రునికీ ఉన్న సామ్యం వల్ల ముఖమునందు చంద్రత్వం ఆరోపించి ఉపమేయమైన ముఖానికి ఉపమానమైన చంద్రుడికీ భేదం లేనట్లు చెప్పబడుతున్నది. "ఇది ముఖం కాదు చంద్రుడు" అని ముఖత్వాన్ని కప్పిపుచ్చి నట్లయితే (ఇలా కప్పిపుచ్చడానికి 'అపహ్నవం' అని పేరు) అది రూపకం కాదు, అపహ్నవాలంకారం.

అవ. సాంగం, నిరంగం, పరంపరితం అని రూపకం మూడు విధాలు. సమస్తవస్తువిషయం, ఏకదేశవివర్తి అని సాంగం రెండువిధాలు. శుద్ధం (కేవలం) మాలారూపం అని నిరంగం రెండువిధాలు. శ్లిష్టశబ్దమూలకం అశ్లిష్టశబ్దమూలకం అని పరంపరితం రెండు విధాలు. ఈ రెండూకూడా ఒకొక్కటి 'కేవలం' 'మాలారూపం' అని రెండేసి విధాలు. ఈ విధంగా రూపకాలంకారంలో మొత్తం ఎనిమిది భేదాలు ఉన్నాయి. వీటిలో సాంగరూపకంలో ఒక భేదమైన సమస్తవస్తువిషయాన్ని వివరిస్తున్నాడు. సమస్తేతి :-

వ్యా. యదా = ఎప్పుడు, ఆరోపితాః = ఆరోపించబడినవి, శ్రౌతాః = శ్రౌతములో అనగా శబ్దంచేత చెప్పబడతాయో, అప్పుడు ఆ రూపకం సమస్తవస్తువిషయమ్ = సమస్తవస్తువిషయ మని చెప్పబడును.

ఆరోపేతి :- ఆరోపవిషయాల వలె, ఆరోపించబడేది కూడా శబ్దంచేత చెప్పబడి నప్పుడు ఆ రూపకంలో సమస్తవస్తువులూ కూడా విషయంగా ఉండడం చేత అది 'సమస్తవస్తువిషయం'. 'ఆరోపితాః' అనే పదంలో బహువచనం వివక్షితం కాదు; అనగా ఆరోపితాలు మూడు అంతకంటె ఎక్కువ ఉండాలని అర్థం కాదు. అందుచేత ఆరోపితాలు రెండే అయినా అవి శ్రౌతా లవుతే సమస్తవస్తువిషయమే.

వి. రూపకంలో ఉపమేయంమీద ఉపమానం ఆరోపించబడుతుంది. దేనిమీద మరొకటి ఆరోపించబడుతుందో అది (ఉపమేయం). 'ఆరోపవిషయం, ఆరోపించబడేది (ఉపమానం), 'ఆరోపవిషయి'. విషయానికి సంబంధించిన కొన్ని అంశాలు ఉంటే విషయికి సంబంధించిన అన్ని అంశాలను వాటిమీద, స్పష్టంగా మాటలలో చెబుతూ ఆరోపిస్తే అది సమస్తవస్తువిషయం. ఉదాహరణం ఎట్లనగా-

శ్లో॥ జ్యోత్స్నాభస్మచ్ఛురణధవలా బిభ్రతీ తారకాస్థీ
న్యన్తర్ధానవ్యసనరసికా రాత్రికాపాలికీయమ్,
ద్వీపాద్ద్వీపం భ్రమతి దధతీ చన్ద్రముద్రాకపాలే
న్యస్తం సిద్ధాఞ్జనపరిమలం లాఞ్ఛనస్య చ్ఛలేన. 421

వృ. అత్ర పాదత్రయే అన్తర్ధానవ్యసనరసికత్వమారోపితధర్మ ఏవేతి రూపకపరిగ్రహే సాధకమస్తీతి తత్సఙ్కరాశఙ్కా న కార్యా.

వ్యా. జోత్స్నేతి :- జ్యోత్స్నాభస్మచ్ఛురణధవలా = వెన్నెల అనే భస్మం (యొక్క) పూసికొనడం చేత తెల్లగా ఉన్నదీ, తారకాస్థీని = నక్షత్రా లనే ఎముకలను, బిభ్రతీ = ధరిస్తూన్నదీ, అన్తర్ధానవ్యసనరసికా = అంతర్ధానం అనే క్రీడయందు ఆసక్తికలదీ అయిన. ఇయమ్ = ఈ, రాత్రికాపాలికీ = రాత్రి అనే కాపాలికి, చన్ద్రముద్రాకపాలే = చంద్రు డనే ముద్రాకపాలమునందు, కాపాలికలు దీక్షా గ్రహణసమయంలో తీసికొన్న కపాలం (పుఱ్ఱె) 'ముద్రాకపాలం'. లాఞ్ఛనస్య = కళంకముయొక్క, చ్ఛలేన = = మిషచేత, న్యస్తమ్ = ఉంచబడిన సిద్ధాఞ్జనపరిమలమ్ = సిద్ధాంజనచూర్ణముమ, అంతర్ధానం చెందడానికి, మళ్ళీ కనబడడానికీ సాధనమైన వస్తువును, దధతీ = ధరిస్తూన్నదై, ద్వీపాత్ = ద్వీపంనుండి, ద్వీపమ్ = మరొక ద్వీపమును గూర్చి, భ్రమతి = తిరుగుతున్నది.

వి. ఇక్కడ రాత్రి ఉపమేయం, కాపాలికి ఉపమానం. రాత్రియందు కాపాలికాత్వం ఆరోపించబడుతున్నది. 'రాత్రికాపాలికీ' అనేది అంగి (ప్రధాన) రూపకం. మిగిలినవి అంగరూపకాలు. 'జోత్స్నాభస్మచ్ఛురణ' 'తారకాస్థీ' మొదలైన ఈ అంగరూపకాలు అంగిరూపకానికి పోషకాలు రాత్రి, జ్యోత్స్న మొదలైన ఉపమేయాలమీద ఆరోపించబడుతూన్న కాపాలికీ-భస్మాదులు అన్నీ మాటలలో చెప్పబడ్డాయి; ఊహకు వదిలివేయబడలేదు. అందుచేత ఇది సమస్తవస్తువిషయరూపకం. కాపాలికను ఆరోపించినట్లే, దానికి అంగాలైన, అనగా ఆమెకు సంబంధించిన భస్మాదుల్ని కూడా ఆరోపించడంవల్ల ఈ రూపకం సాంగరూపకం. చతుర్థపాదంలో ఉన్న "లాఞ్ఛనస్య చ్ఛలేన సిద్ధాఞ్జనపరిమలమ్" అనేది మాత్రం అపహ్నుత్యలంకారం.

అప. 'రాత్రికాపాలికీ' 'జ్యోత్స్నాభస్మ' ఇత్యాదులలో "ఉపమితం

వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే" (పా.సూ. 2.1.56) అనే సూత్రంచేత సమాసం చేయగా 'కాపాలికవంటి రాత్రి' 'భస్మం వంటి వెన్నెల' ఇత్యాదివిధంగా అర్థం చెప్పినట్లయితే ఉపమాలంకారం అవుతుంది. పైన చెప్పిన రాత్రియే కాపాలికి, వెన్నెలయే భస్మ ఇత్యాద్యర్థాలు చెపితే రూపకాలంకారం అవుతుంది. ఇక్కడ ఏ అర్థం చెప్పాలో సాధకబాధకప్రమాణం ఏదీ లేకపోవడంచేత ఉపమాలంకారమా, రూపకాలంకారమా అనే సందేహం కలుగుతుంది. అందుచేత సందేహరూప మైన సంకరాలంకారం చెప్పాలి కదా అని ఆశంకించుకొని చెబుతున్నాడు.

అత్రేతిః- ఇక్కడ అంతర్ధానవ్యసనరసికత్వం ఆరోపింపబడినదాని (కాపాలికయొక్క)ధర్మమే గాన మూడు పాదాలలోను రూపకాన్ని అంగీకరించడానికి ఇది సాధకప్రమాణంగా ఉంది. అందుచేత ఉపమా-రూపకసంకరం అనే ఆశంక చేయదగినది కాదు.

వి. ఉపమాలంకారంలో ఉపమేయానికి ప్రాధాన్యం ఉంటుంది. రూపకాలంకారంలో ఉపమానానికి ప్రాధాన్యం ఉంటుంది. వాక్యార్థంలో అన్వయించడం అన్వయించకపోవడం అనే దానిని పట్టి ప్రాధాన్యాప్రాధాన్యాలు నిర్ణయించాలి. 'గురుచరణారవిన్దాభ్యాం నమః' అనే వాక్యంలో 'గురుచరణారవిన్ద' శబ్దానికి 'పద్మాలతో సమానములైన గురుచరణాలు' 'గురుచరణాలే పద్మాలు' అని రెండు విధాలుగా అర్థం చెప్పవచ్చు. మొదటి అర్థంలో ఉపమ; రెండవ అర్థంలో రూపకం. అయితే ఇక్కడ నమస్కారం పాదాలకి చెందవలసి ఉందికాని పద్మాలకి కాదు. గురుచరణాలే పద్మాలు వాటికి నమస్కారం అని చెపితే పద్మాలకి నమస్కరించి నట్లు అవుతుంది. అది అసంగతం. పద్మాల వంటి గురుచరణాలు, వాటికి నమస్కారం అని చెబితే చరణాలకి నమస్కార కర్మత్వం కలిగి ప్రాధాన్యం ఏర్పడుతుంది. ప్రస్తుతంలో అంతర్ధానవ్యసనంలో రసికత్వం కాపాలికకు ఉంటుంది. అందుచేత కాపాలికకు ప్రాధాన్యం వచ్చే విధంగా రూపకాలంకారమే చెప్పాలి. దీనిని పట్టి ఇతరపదాలలో కూడా రూపకాలంకారమే చెప్పాలి. ఈవిధంగా అంతర్ధానవ్యసనరసికత్వం రూపకాలంకారసాధక మైన ప్రమాణం. అందుచేత ఉపమాలంకారం చెప్పాలా రూపకాలంకారం చెప్పాలా అనే సందేహానికి, సందేహరూపసంకరానికి తావు లేదు.

కా. శ్రౌతా ఆర్థాశ్చ తే యస్మిన్నేకదేశవివర్తి తత్.

వృ. కేచిదారోప్యమాణాః శబ్దోపాత్తాః కేచిదర్థసామర్థ్యావసేయాః

ఇత్యేకదేశవివర్తనాత్ ఏకదేశవివర్తి. యథా-

గాథ. జస్స రణన్తేఉరఏ కరే కుణన్తస్స మణ్డలగ్గలఅమ్,
రససంముహీ వి సహసా పరంముహీ హోఈ రిఉసేణా.

"యస్య రణాన్తఃపురే కరే కుర్వతో మణ్డలాగ్రలతామ్,
రససంముఖ్యపి సహసా పరాఙ్ముఖీ భవతి రిపుసేనా"

వృ. అత్ర రణస్యాన్తఃపురత్వమారోప్యమాణం శబ్దోపాత్తమ్. మణ్డలాగ్రలతాయాః నాయికాత్వం, రిపుసేనాయాశ్చ ప్రతినాయికాత్వమ్ అర్థసామర్థ్యాదవసీయతే ఇతి ఏకదేశే విశేషేణ వర్తనాదేశవివర్తి.

వ్యా. శ్రౌతా ఇతి :- యస్మిన్ = దేనియందు, తే = ఆరోపించబడేవి. శ్రౌతాః = సాక్షాత్తు శబ్దంచేత చెప్పబడేవి, ఆర్థాశ్చ = అర్థాన్ని పట్టి ఊహించబడేవి, ఆక్షిప్తములు అవుతాయో, తత్ = అది, ఏకదేశవివర్తి = ఏకదేశవివర్తి రూపకం.

కేచిదితి :- ఆరోపించబడేవాటిలో కొన్ని శబ్దాలచేత గ్రహించబడతాయి, కొన్ని అర్థాన్ని పట్టి ఊహించబడతాయి. ఈ విధంగా ఏకదేశంలో ఒక భాగంలో మాత్రమే వివర్తనంవల్ల, విశేషించి వర్తించడం (ఉండడం) వల్ల ఏకదేశవివర్తి రూపకం. ఎట్లనగా-

యస్యేతి :- రణాన్తః పురే=యుద్ధము అనే అంతఃపురంలో, మణ్డలాగ్రలతామ్ = ఖడ్గాగ్రం అనే లతను, కరే = హస్తమునందు, కుర్వతః = చేస్తూన్న, యస్య = ఎవనికి, రిపుసేనా = శత్రుసేన, రససంముఖ్యపి = రసంచేత అభిముఖమైనా, సహసా = వెంటనే, పరాఙ్ముఖీ = పరాఙ్ముఖురాలు, భవతి = అగుచున్నదో.

అత్రేతి :- ఇక్కడ రణానికి ఆరోపించబడిన అంతఃపురత్వం శబ్దంచేత గ్రహించబడింది. దీనిని పట్టి మణ్డలాగ్రలత నాయిక అనీ, రిపుసేన ప్రతినాయిక అనీ అర్థసామర్థ్యంచేత ఊహించబడుతున్నది. ఈ విధంగా ఒక దేశంలో విశేషించి (స్పష్టంగా) ఉండడంచేత ఏకదేశవివర్తిరూపకం.

వి. ఎంతో రణోత్సాహంతో ఎదురుగా వచ్చిన సేన ఇతడు హస్తంలో ఖడ్గం ధరించగానే వెనుకకు తిరిగి పోయింది అని చెప్ప దలచిన కవి రణంమీద అంతఃపురత్వాన్ని ఆరోపించాడు. ఈ ఆరోపణ ఆరోపవిషయాన్నీ, ఆరోప్యాన్నీ శబ్దాలలో చెప్పడంచేత స్పష్టంగా ఉంది (వివర్తతే). రణమునందు అంతఃపుర త్వాన్ని ఆరోపించడంచేత మండలాగ్రలతయందు నాయికాత్వారోపణం రిపుసేన యందు ప్రతినాయికాత్వారోపణం మాటలలో చెప్పకపోయినా అర్థాన్ని పట్టి ఊహించడంచేత (ఆక్షేపంచేత) తెలుస్తూన్నది. అందుచేత ఇది ఏకదేశవివర్తి రూపకం. ఒక నాయికుని దగ్గరకు రిరంసతో వస్తూన్న ఒక (ప్రతి) నాయిక ఆతడు అంతఃపురంలో నాయికతో కలిసి ఉండడం చూడగానే ఎలా వెంటనే వెనక్కి వెళ్ళిపోతుందో ఆ విధంగా శత్రుసేన వెనక్కి వెళ్ళిపోయింది అని భావం.

కా. సాఙ్గమేతత్

వృ. ఉక్తద్విభేదం సావయవమ్.

కా. నిరఙ్గం తు శుద్ధమ్

వృ. యథా-

శ్లో॥ కురఙ్గీవాఙ్గాని స్తిమితయతి గీతధ్వనిషు యత్
సఖీం కాన్తోదన్తం శ్రుతమపి పునః ప్రశ్నయతి యత్,
అనిద్రం యచ్చాన్తః స్వపితి తదహో వేద్మ్యభినవాం
ప్రవృత్తోఽస్యాం సేక్తుం హృది మనసిజః ప్రేమలతికామ్.

వ్యా. సాఙ్గమితి :- ఏతత్ = ఇది, సాఙ్గమ్ = సాంగము, సావయవము.

ఉక్తేతి :- పైన చెప్పబడిన రెండు భేదాలూ గల రూపకం సావయవం.

నిరఙ్గమితి :- నిరఙ్గం తు = నిరవయవమైతే, శుద్ధమ్ = శుద్ధము.

వి. పైన చెప్పిన రూపకంలో, అనగా సమస్తవస్తువిషయ-ఏకదేశవివర్తి రూపకా లనే రెండు భేదాలలో, అంగితోపాటు అవయవాలు కూడా ఉన్నాయి.

అందుచేత దీనికి సావయవరూపకం అని పేరు. అవయవాలు లేని ఒకే రూపకం ఉన్నచో దానికి శుద్ధం అని, అనగా నిరవయవం అని, పేరు ఎట్లనగా-

కురఙ్గీతి :- ఈమె, కురఙ్గీవ = ఆడలేడి వలె, గీతధ్వనిషు = సంగీత ధ్వనులయందు, సంగీతధ్వని చెవిని పడగానే, యత్ = ఎందువలన, అఙ్గాని = అవయవవాలను, స్తిమితయతి = నిశ్చలములుగా చేస్తున్నదో, శ్రుతమపి = ఒక మారు వినబడినదైనా, కాన్తోదన్తమ్ = భర్తయొక్క వృత్తాంతమును, పునః = మరల, సఖీమ్ = సఖురాలిని, యత్ = ఏ కారణంవలన, ప్రశ్నయతి = అడుగు చున్నదో, అనిద్రమ్ = నిద్రలేకుండానే, అన్తః = గృహమధ్యంలో, యత్ = ఏ కారణంవలన, స్వపితి = నిద్రపోవుచున్నదో, తత్ = అందువలన, మనసిజః = మన్మథుడు, అభినవామ్ = నూతనమైన, ప్రేమలతికామ్ = ప్రేమలతను, అస్యాః = ఈమెయొక్క, హృది = హృదయంలో, సేక్తుమ్ = తడుపుటకు, ప్రవృత్తః = ప్రారంభించినాడు అని, వేద్మి = తెలుసుకొనుచున్నాను, అహో = ఆహా!

ఇక్కడ ప్రేమయందు లతికాత్వం ఆరోపించబడింది. ఇంక అంగా లేవీ లేవు. అందుచేత ఇది నిరవయవశుద్ధరూపకం.

కా. మాలా తు పూర్వవత్. 94

వృ. మాలోపమాయామివ ఏకస్మిన్ బహవ ఆరోపితాః. యథా-

శ్లో॥ సౌన్దర్యస్య తరఙ్గిణీ తరుణిమోత్కర్షస్య హర్షోద్గమః
కాన్తేః కార్మణకర్మ నర్మరహసాముల్లాసనావాసభూః,
విద్యా వక్రగిరాం విధేరనవధిప్రావీణ్యసాక్షాత్క్రియా
బాణాః పఞ్చశిలీముఖస్య లలనాచూడామణిః సా ప్రియా.

వ్యా. మాలా ఇతి :- మాల పూర్వం వలె.

మాలేతి :- మాలోపమలో వలె, అనగా ఒక ఉపమేయానికి అనేక ఉప మానాలను చేర్చడంచేత మాలోపమ ఏర్పడినట్లు ఒకదానియందు అనేకవస్తువులు ఆరోపించబడినట్లయితే అది మాలారూపకం. ఎట్లనగా-

సౌన్దర్యస్యేతి :- లలనాచూడామణిః = స్త్రీలలో చూడామణి అయిన, సా =

అ, ప్రియా = ప్రియురాలు. సౌన్దర్యస్య = సౌందర్యంయొక్క, తరఙ్గిణీ = నది. తరుణిమోత్కర్షస్య = యౌవనోత్కర్షయొక్క, హర్షోద్గమః = సంతోషావిర్భావం, కాన్తేః = కాంతియొక్క, కార్మణకర్మ = వశీకరణప్రక్రియ, నర్మరహసామ్ = క్రీడారహస్యములయొక్క, ఉల్లాసనావాసభూః = విజృంభణానికి నివాసస్థానం. వక్రగిరామ్ = వక్రములైన, మాటలకు, విద్యా = ఉపదేశంచేసేది. విధేః = బ్రహ్మదేవునియొక్క, అనవరతప్రావీణ్యసాక్షాత్క్రియా = అవిచ్ఛిన్నమైన ప్రావీణ్యం యొక్క సాక్షాత్కారం. ఈమెను చూస్తే బ్రహ్మదేవునికి ఎంత ప్రావీణ్యం ఉందో తెలుస్తుంది అని అర్థం. పఞ్చశిలీముఖస్య = మన్మథునియొక్క, బాణాః = బాణాలు.

వి. ఇక్కడ ఉపమేయమైన ఒక్క ప్రియురాలియందు తరంగిణి మొదలైన అనేకఉపమానాలు ఆరోపించబడ్డాయి. అందుచేత ఇది మాలారూపకం.

అవ. పరంపరితరూపకానికి లక్షణం చెపుతున్నాడు-

కా. నియతారోపణోపాయః స్యాదారోపః పరస్య యః.
తత్ పరమ్పరితం శ్లిష్టే వాచకే భేదభాజి వా. 95

వృ. యథా-

శ్లో॥ విద్వన్మానసహంస వైరికమలాసంకోచదీప్తద్యుతే
దుర్గామార్గణనీలలోహిత సమిత్స్వీకారవైశ్వానర,
సత్యప్రీతివిధానదక్ష విజయప్రాగ్భావభీమ ప్రభో
సామ్రాజ్యం వరవీర వత్సరశతం వైరిఞ్చముచ్చైఃక్రియాః.

వృ. అత్ర మానసమేవ మానసమ్, కమలాయాః సంకోచ ఏవ కమలానామసంకోచః, దుర్గాణామమార్గణమేవ దుర్గాయాః మార్గణమ్; సమితాం స్వీకార ఏవ సమిధాం స్వీకారః. సత్యే ప్రీతిరేవ సత్యామ్ అప్రీతిః; విజయః పరపరాభవ ఏవ విజయః అర్జునః, ఏవమారోపణ నిమిత్తో హంసాదేరారోపః. యద్యపి శబ్దాలంకారః అయమిత్యుక్తమ్, వక్ష్యతే చ తథాపి, ప్రసిద్ధ్యనురోధాదత్రోక్తః, ఏకదేశవివర్తి హి ఇదమ్ అన్యైరభిధీయతే.

వ్యా. నియతేతి :- యః = ఏ, పరస్య = అన్యవస్తువుయొక్క, ఆరోపః = ఆరోపము, నియతారోపణోపాయః = వర్ణింపదగిఉండడంచేత తప్పక అపేక్షణీయమైన ఆరోపణకు సాధారణధర్మసంపాదనం ద్వారా ఉపాయం అగునో, తత్ = అది, వాచకే = వాచకం, శ్లిష్టే = శ్లిష్టమైనా, భేదభాజి వా = వేరుగా ఉన్నా, పరంపరితమ్ = పరంపరితము. అనగా వర్ణింపదగిన ఆరోపణానికి (ప్రకృతమైన ఆరోపణానికి) మరొక ఆరోపణం సాధారణధర్మసంపాదనంద్వారా ఉపాయం అయితే అది పరంపరితరూపకం అని అర్థం. ఒక రూపకం మరొకరూపకంమీద ఆధారపడిఉంటుంది. అని భావం. 'వాచకం' అనగా ప్రకృతరూపకానికి ఉపయుక్తమైన అన్యరూపకాన్ని చెప్పేది అని అర్థం. అది శ్లిష్టమైనా కావచ్చు. భిన్నరూపంలోనైనా ఉండవచ్చును.. శ్లిష్టమాలారూపపరంపరితరూపకానికి ఉదాహరణం. ఎట్లనగా-విద్వదితి-విద్వన్మానసహంస = విద్వాంసుల చిత్తము అనే మానససరోవరమునందు హంస అయినవాడా! 'మానస' శబ్దం శ్లిష్టం; ఇట్లే ముందుకూడా. వైరికమలాసంకోచదీప్తద్యుతే-'కమలాసంకోచ', 'కమలా + అసంకోచ' అని రెండు విధాలుగా పదచ్ఛేదం, శత్రువుల లక్ష్మియొక్క సంకోచం అనే పద్మాల అసంకోచానికి, వికాసానికి, సూర్యుడా, దుర్గామార్గణనీలలోహిత-'దుర్గా + అమార్గణ', 'దుర్గామార్గణ' అని రెండు విధాల పదచ్ఛేదం. దుర్గాలను వెదగక పోవడం అనే పార్వత్యన్వేషణంలో పరమేశ్వరుడా, సమిత్స్వీకారవైశ్వానర = యుద్ధం అనే సమిధలను స్వీకరించడంలో అగ్ని అయినవాడా, తకారాంత'సమిత్' శబ్దానికి యుద్ధం అనీ-ధకారాంత 'సమిధ్' శబ్దానికి సమిధ లనీ అర్థం. సమిత్+స్వీకార, సమిధ్+స్వీకార = సమిత్స్వీకార అని సంధి. సత్యప్రీతివిధానదక్ష-'సత్య+ప్రీతి', 'సతీ+అప్రీతి' అని రెండు విధాల పదచ్ఛేదం. సత్యమునందు ప్రీతిని చేయుట అనే సతీదేవికి కష్టం కలిగించడంలో దక్షుడా, సమర్థుడు, దక్షప్రజాపతి అని రెండర్థాలు. విజయప్రాగ్భవభీమ = విజయం అనే విజయునికి, అర్జునునికి, ప్రథమోత్పత్తియందు భీమసేనుడా, 'ప్రాగ్భవ' అనగా ముందు ఉండడం, ముందు పుట్టడం, రాజు విషయంలో విజయానికి ముందు ఇతడు ఉంటాడని, భీమసేనుని పక్షంలో అర్జునునికంటె ముందు పుట్టా డనీ అర్థం. ప్రభో = సమర్థుడా, వరవీర = మహావీరుడా! వైరిఞ్చమ్ = బ్రహ్మకు సంబంధించిన, వత్సరశతమ్ = సంవత్సరాల శతమును, సామ్రాజ్యమ్ = సామ్రాజ్యమును, ఉచ్చైః = ఉన్నతముగా, క్రియాః = చేసెదవు గాక.

వి. ఇక్కడ మానసమే మానసం, కమలాసంకోచమే కమలాసంకోచం, దుర్గామార్గణమే దుర్గామార్గణం, సమిత్స్వీకారమే సమిత్స్వీకారం, సత్యప్రీతియే సత్యప్రీతి, విజయప్రాగ్భావమే విజయప్రాగ్భావం అని శ్లిష్టరూపకాలను ఆధారంగా చేసికొని రాజునందు హంసత్వ-దీప్తద్యుతిత్వ-నీలలోహితత్వ-వైశ్వానరత్వ-దక్షత్వ భీమత్వాలు ఆరోపించబడ్డాయి. అందుచేత పరంపరితరూపకం. శ్లేషమీద ఆధారపడడం చేత శ్లిష్టరూపకం. ఒకే ఉపమేయంమీద అనేక ఉపమానాలను ఆరోపించడంచేత మాలారూపకం.

వ్యా. అత్రేతి:- ఇక్కడ మానసమే మానసం. కమలయొక్క సంకోచమే కమలాల అసంకోచం, దుర్గాల అమార్గణమే దుర్గయొక్క మార్గణం. సమిత్తుల స్వీకారమే, సమిధల స్వీకారం, సత్యమునందు ప్రీతియే సతియందు అప్రీతి, పరులను పరాభవింపచేయడం అనే విజయమే విజయుడు, అర్జునుడు- ఈ విధంగా ఆరోపణలు హంసాద్యారోపానికి నిమిత్తాలు.

యద్యపీతి:- ఇక్కడ మానసాదిపదాలు పరివృత్త్యసహాలు. అందుచేత శబ్దాలంకారం. హంసాదిపదాలు పరివృత్తిసహాలు; అందుచేత అర్థాలంకారం. ఈ విధంగా ఇది శబ్దార్థోభయాలంకారం అని నవమోల్లాసంలో "ఇహ దోషగుణాలంకారాణామ్' ఇత్యాదిగ్రంథంలో చెప్పినట్లే మున్ముందు కూడా సంకరాలంకార ప్రకరణంలో చెప్పబడనున్నది. అయినా ప్రసిద్ధిని పట్టి ఈ శ్లిష్టరూపకాన్ని అర్థాలంకారాల మధ్య చెప్పడం జరిగింది. ప్రాచీనులైన భామహాదులు దీనిని ఏకదేశ వివర్తి రూపకం అని చెప్పి ఉన్నారు కదా.

వృ. భేదభాజి యథా-

శ్లో॥ ఆలానం జయకుఞ్జరస్య దృషదాం సేతుర్విపద్వారిధేః
పూర్వాద్రిః కరవాలచణ్డమహసో లీలోపధానం శ్రియః,
సంగ్రామామృతసాగరప్రమథనక్రీడావిధౌ మన్దరో
రాజన్ రాజతి వీరవైరివనితావైధవ్యదస్తే భుజః. 426

వృ. అత్ర జయాదేర్భిన్నశబ్దవాచ్యస్య కుఞ్జరత్వాద్యారోపే భుజస్య ఆలానత్వారోపో యుజ్యతే.

వ్యా. భిన్నంగా ఉన్నప్పుడు, అనగా శ్లేష లేనప్పుడు, ఎట్లనగా-

ఆలానమితి:- రాజన్ = రాజా! జయకుఞ్జరస్య = జయమనే ఏనుగకు, ఆలానమ్ = బంధనస్తంభమూ, విపద్వారిధేః = ఆపద లనే సముద్రానికి, దృషదాం సేతుః = రాళ్ళతో కట్టిన సేతువు, కరవాలచణ్డమహసః = ఖడ్గం అనే సూర్యునికి, పూర్వాద్రిః = పూర్వాద్రి (తూర్పుపర్వతం), శ్రియః = సంపద అనే లక్ష్మికి, లీలోపధానమ్ = విలాసార్థమైన తలగడ, సంగ్రామామృతసాగరప్రమథనక్రీడావిధౌ = యుద్ధం అనే క్షీరసాగరాన్ని మథించడంలో, మన్దరః = మందరపర్వతమూ వీరవైరివనితావైధవ్యదః = వీరులైన శత్రువుల స్త్రీలకు వైధవ్యం ఇచ్చేదీ అయిన, తే భుజః = నీ భుజం, రాజతి = ప్రకాశిస్తూన్నది.

అత్రేతి:- ఇక్కడ వేరు వేరు శబ్దాలచేత చెప్పబడిన జయాదులయందు కుంజరత్వాదులను ఆరోపించగా భుజానికి ఆలానత్వారోపం యుక్తంగా ఉంది.

వి. జయంమీద కుంజరత్వాన్ని ఆరోపించడం మూలాన భుజంమీద ఆలానత్వం ఆరోపించడం కుదిరింది. ఇట్లే విపదాదులవిషయంలో కూడా. అందుచేత ఒక రూపకానికి మరొక రూపకం నిమిత్తం అవడంచేత పరంపరిత రూపకం. ఒక ఉపమేయం (భుజం) మీద అనేక ఆలానత్వాదులు ఆరోపించడం చేత మాలారూపం. శ్లేషలేదు గాన అశ్లిష్టం. 'శ్రియః' అనే చోట మాత్రం శ్లిష్టం.

అవ. మాలారూపం కాని శ్లిష్టపరంపరితరూపకానికి అశ్లిష్టపరంపరితరూపకానికి ఉదాహరణలు చూపుతున్నాడు-

శ్లో॥ అలౌకికమహాలోకప్రకాశితజగత్త్రయః,
స్తూయతే దేవ సద్వంశముక్తారత్నం న కైర్భవాన్. 427

శ్లో॥ నిరవధి చ నిరాశ్రయం చ యస్య
స్థితమనివర్తితకౌతుకప్రపఞ్చమ్,
ప్రథమ ఇహ భవాన్ స కూర్మమూర్తి
ర్జయతి చతుర్దశలోకవల్లికన్దః 428

వృ. ఇతి చ అమాలారూపకమపి పరంపరితం ద్రష్టవ్యమ్.

వ్యా. దేవ = రాజా! అలౌకికమహాలోకప్రకాశితజగత్త్రయః = అలౌకికమైన

గొప్ప కాంతిచేత ప్రకాశింపచేయబడిన ముల్లోకాలు గల, సద్వంశముక్తారత్నమ్ =మంచి వంశం అనే మంచివెదురుకఱ్ఱయందు పుట్టిన ముత్యమైన, భవాన్=నీవు, కైః = ఎవరిచేత, న స్తూయతే = స్తుతించబడడంలేదు ?

వి. ఇక్కడ వంశశబ్దం శ్లిష్టం. కులమునందు వేణుదండత్వాన్ని ఆరోపించడంవల్ల రాజునందు ముక్తామణిత్వారోపం వీలయింది. అందుచేత పరంపరిత రూపకం. ఒకే ఉపమేయంమీద అనేక ఉపమానాల ఆరోపం లేదు కాబట్టి మాలా రూపకం కాదు.

వ్యా. నిరవధీతి-యస్య=ఏ నీయొక్క, నిరవధి=అవధి లేనిది, నిరాశ్రయం చ = ఆశ్రయం లేనిదీ అయిన, స్థితమ్ = నిలచుట, ఏ ఆధారమూ లేకుండా ఉండడం, అనివర్తితకౌతుకప్రపఞ్చమ్=నివర్తింపచేయదని కౌతుకంగల ప్రపంచం కలదో, సః= అట్టివాడవు, చతుర్దశలోకవల్లికన్దః = పద్నాలుగు లోకా లనే లతకు దుంపవూ (అంకురమూ) అయిన, ప్రథమః కూర్మమూర్తిః= మొదటి కూర్మమైన, భవాన్ = నీవు. జయతి = సర్వోత్కర్షగా ఉన్నావు.

వి. ఇక్కడ చతుర్దశలోకాలయందు వల్లీత్వాన్ని ఆరోపించడంచేత, కూర్మమూర్తి యందు కందత్వారోపం కుదిరింది శ్లేషలేదు. అందుచేత, ఒక ఉపమేయం మీద అనేక ఉపమానాల ఆరోపణ లేదు. అందుచేత శ్లిష్టం కాని పరంపరితరూపకం. మాలారూపకం కాదు.

వా. ఇతీతి- ఈ విధంగా (పై రెండు శ్లోకాలలో చూపిన విధంగా) మాలా రూపకం కాని పరంపరితరూపకం కూడా చూచుకొనవలెను.

శ్లో॥ కిసలయకరైర్లతానాం కరకమలైః కామినాం మనో జయతి
నలినీనాం కమలముఖైః ముఖేన్దుభిర్యోషితాం మదనః 429

వృ. ఇత్యాదిరసనారూపకం న వైచిత్ర్యవదితి న లక్షితమ్

వ్యా. కిసలయేతి-మదనః = మన్మథుడు, లతానామ్ = లతలయొక్క, కిసలయకరైః=చిగు ళ్ళనే కరములచేత, యోషితామ్=స్త్రీలయొక్క, కరకమలైః కరము లనే పద్మాలచేత, ముఖేన్దుభిః = ముఖా లనే చంద్రులచేత, నలినీనామ్ = పద్మలతలయొక్క, కమలముఖైః = కమలము లనే ముఖాలచేత, కామినామ్= కాముకులయొక్క, మనః = మనస్సును, జయతి = జయించుచుండును.

వి. ఇక్కడ 'కిసలయకరైః' 'కరకమలైః' అనే పదాలలో పూర్వపదం లోని 'కర' శబ్దం రెండవపదంలో గ్రహించబడింది. 'కమలముఖైః' ముఖేన్దుభిః' అనే పదాలలో మొదటిపదంలో ఉన్న 'ముఖ' శబ్దం రెండవ పదంలో గ్రహించ బడింది. ఇది రశనారూపకం అని చెప్పవచ్చును. కాని దీనిలో అంత అందం ఏమీ లేకపోవడంచేత దీన్ని వేరుగా చెప్పలేదు అని అంటున్నాడు-

వ్యా. ఇత్యాదీతి-ఈ మొదలైన రశనారూపకంలో వైచిత్ర్యం లేదు గాన దానికి లక్షణం చెప్పలేదు.

## 7. అపహ్నుత్యలంకారం

కా. ప్రకృతం యన్నిషిధ్యాన్యత్ సాధ్యతే సా త్వపహ్నుతిః.

వృ. ఉపమేయమ్ అసత్యం కృత్వా ఉపమానం సత్యతయా యత్ స్థాప్యతే సా తు అపహ్నుతిః. ఉదాహరణమ్.

శ్లో॥ అవాప్తః ప్రాగల్భ్యం పరిణతరుచః శైలతనయే
కలఙ్కో నైవాయం విలసతి శశాఙ్కస్య వపుషి,
అముష్యేయం మన్యే విగలదమృతస్యన్దశిశిరే
రతిశ్రాన్తా శేతే రజనిరమణీ గాఢమురసి. 430

వ్యా. ప్రకృతమితి :- ప్రకృతమ్ = ప్రకృతమైన ఉపమేయాన్ని, నిషిధ్య = నిషేధించి, అన్యత్ = అప్రకృతమైన, ఉపమానం, యత్ సాధ్యతే = సాధించ బడడం అనేది ఏది కలదో, సా = అది, అపహ్నుతిః = అపహ్నుత్యలంకారము.

ఉపమేయమితి :- ఉపమేయాన్ని అసత్యమైనదాన్నిగా చేసి, అనగా అది కాదు అని చెప్పి, ఉపమానాన్ని సత్యంగా స్థాపించడం అపహ్నుతి.

వి. శాబ్ది, ఆర్థి అని అపహ్నుతి రెండు విధాలు. ఉపమేయం అసత్యం అని ప్రత్యక్షంగా శబ్దంతో చెపితే అది శాబ్ది. ఆక్షేపలభ్యమైనది, అర్థాన్ని పట్టి ఊహించేది ఆర్థి. ఆర్థి అయిన అపహ్నుతి కొన్ని చోట్ల కపటం అని అర్థం గల శబ్దాలను ప్రయోగించడంచేత, కొన్ని చోట్ల పరిణామం అనే అర్థం గల శబ్దాలను ప్రయోగించడంచేత, కొన్ని చోట్ల మరొక విధంగాను సూచించబడుతుంది.

వ్యా. శాబ్దాపహ్నుతికి ఉదాహరణం చూపుతున్నాడు- అవాప్తః ఇతిః- పూర్ణ చంద్రునిలోని కలంకం చూపుతూ మహేశ్వరుడు పార్వతితో అంటున్నాడు. శైల తనయే = పార్వతీ! పరిణతరుచః = పూర్ణమైన కాంతి గల, శశాఙ్కస్య = చంద్రునియొక్క, వపుషి = శరీరమునందు, ప్రాగల్భ్యమ్ = ప్రకటత్వాన్ని, అవాప్తః = పొందిన, అయమ్ = ఈ పదార్థం, కలఙ్కః=కలంకం, నైవ విలసతి = ప్రకాశించడంలేదు, కలంకం కాదు. ఇయమ్ = ఈ, రజనిరమణీ = రాత్రి అనే స్త్రీ, రతిశ్రాన్తా = రతిచేత అలసినదై, అముష్య = ఇతనియొక్క, విగల దమృతస్యన్దశిశిరే = స్రవిస్తూన్న అమృతప్రవాహంచేత చల్లనైన, ఉరసి = వక్ష స్థలమునందు, గాఢమ్ = గాఢంగా, శేతే = శయనించుచున్నది అని, మన్యే = తలుస్తున్నాను.

వి. ఇక్కడ ఉపమేయమైన కలంకాన్ని అసత్యం చేసి, అది కాదు అని చెప్పి, ఉపమానమైన రాత్రి సత్యమైనదిగా చెప్పబడింది కాబట్టి అపహ్నుత్య లంకారం. 'నైవ' అని 'నఞ్'ను ప్రయోగించి ప్రత్యక్షంగా నిషేధించడంచేత శాబ్ది అయిన అపహ్నుతి.

అవ. నిషేధించడంలో భంగిభేదంచేత లక్ష్యాలలో భేదాన్ని సూచిస్తున్నాడు.

వృ. ఇత్థం వా-

శ్లో॥ బత సఖి కియదేతత్ పశ్య వైరం స్మరస్య
ప్రియవిరహకృశేఽస్మిన్ రాగిలోకే తథా హి,
ఉపవనసహకారోద్భాసిభృఙ్గచ్ఛలేన
ప్రతివిశిఖమనేనోట్టఙ్కితం కాలకూటమ్. 431

వృ. అత్ర న సభృఙ్గాణి సహకారాణి, అపి తు సకాలకూటాః శరా ఇతి ప్రతీతిః. ఏవం వా-

శ్లో॥ అముష్మిన్ లావణ్యామృతసరసి నూనం మృగదృశః
స్మరః శర్వప్లుష్టః పృథుజఘనభాగే నిపతితః,

యదఙ్గాఙ్గారాణాం ప్రశమపిశునా నాభికుహరే
శిఖా ధూమస్యేయం పరిణమతి రోమావలివపుః. 432

వృ. అత్ర న రోమావలిః, ధూమశిఖేయమితి ప్రతిపత్తిః. ఏక మియం శబ్దాన్తరై రప్యూహ్యా.

వ్యా. ఈ విధంగానైనా (ఉదాహరణం ఉండవచ్చును).

బతేతి :— సఖి = సఖురాలా! స్మరస్య = మన్మథునకు, ప్రియవిరహకృశే = ప్రియుల విరహంచేత కృశమైన, అస్మిన్ = ఈ, రాగిలోకే = అనురాగవంతుల సముదాయమునందు, ఏతత్ = ఈ, వైరమ్ = వైరము, కియత్ = ఎంతో, పశ్య = చూడు, ఉపవనసహకారోద్భాసిభృఙ్గచ్ఛలేన = ఉద్యానంలోని మామిడిపువ్వుల మీద ప్రకాశిస్తున్న తుమ్మెద అనే మిషచేత, అనేన = ఇతనిచేత, ప్రతివిశిఖమ్ = ఒక్కొక్క బాణం మీదా కూడ, కాలకూటమ్ = కాలకూటవిషం, ఉట్టఙ్కితమ్ = ఉంచబడినది. బత = ఎంత కష్టం!

వి. ఇక్కడ తుమ్మెదలతో కూడిన మామిడి పూవులు కావు; కాలకూటం పూసిన బాణాలు అనే అర్థం ప్రతీయమానం అవుతుంది.

పై అర్థం శబ్దంచేత ప్రత్యక్షంగా చెప్పబడక 'ఛల' శబ్దప్రయోగంద్వారా సూచించబడింది గాన ఇది ఆర్థాపహ్నుత్యలంకారం అని భావం. ఈ విధంగానైనా ఉదాహరించవచ్చు.

అముష్మిన్ ఇతి :— శర్వప్లుష్టః = శివునిచేత కాల్చివేయబడిన, స్మరః = మన్మథుడు, నూనమ్ = సత్యంగా, మృగదృశః = ఈ మృగనయనయొక్క, పృథుజఘనభాగే = విశాలమైన జఘన ప్రదేశమునందు, అముష్మిన్ = ఈ, లావణ్యామృతసరసి = లావణ్యామృతంయొక్క సరస్సునందు, నిపతితః = పడినాడు, యత్ = ఎందువలన అనగా, అఙ్గాఙ్గారాణామ్ = ఇతని అవయవాల బొగ్గుల యొక్క, ప్రశమపిశునా = శాంతించుటను సూచించే, ఇయమ్ = ఈ, ధూమస్య శిఖా = ధూమశిఖ, నాభికుహరే = నాభిరంధ్రమునందు, రోమావలివపుః = రోమ పంక్తిరూపం గలదై, పరిణమతి = పరిణమించుచున్నది.

వి. ఇక్కడ 'పరిణమతి' అనే శబ్దాన్ని ప్రయోగించడం ద్వారా రోమా

వలిని నిషేధించి ధూమరేఖను సత్యం చేసి నట్లు అయినది గాన అర్థఅపహ్నుత్యలంకారం.

వ్యా. అత్రేతి :- ఇక్కడ ఇది రోమావలి కాదు; ధూమశిఖ అని ప్రతీతి కలుగుతున్నది. ఈ విధంగా ఈ అలంకారాన్ని ఇతరభంగులలో కూడా ఊహించుకొనవలెను.

## 8. శ్లేషాలంకారం

కా. శ్లేషః స వాక్య ఏకస్మిన్ యత్రానేకార్థతా భవేత్. 96

వృ. ఏకార్థప్రతిపాదకానామేవ శబ్దానాం యత్రానేకోఽర్థః స శ్లేషః. ఉదాహరణమ్-

శ్లో॥ ఉదయమయతే దిఙ్మాలిన్యం నిరాకురుతేతరాం
నయతి నిధనం నిద్రాముద్రాం ప్రవర్తయతి క్రియాః,
రచయతితరాం స్వైరాచారప్రవర్తనకర్తనం
బత బత లసత్తేజఃపుఞ్జో విభాతి విభాకరః. 433

వృ. అత్రాభిధాయా అనియన్త్రణాత్ ద్వావప్యర్కభూపౌ వాచ్యౌ.

వ్యా. శ్లేష ఇతి :- యత్ర=ఎక్కడ, ఏకస్మిన్వాక్యే = ఒక వాక్యమునందు, అనేకార్థతా = అనేకములైన అర్థములు కలిగి ఉండడం, భవేత్ = అవుతుందో, సః = అది, శ్లేషః = శ్లేష.

వి. పరివృత్తిసహాలైన శబ్దాలు, ఒకే తొడిమికి ఉన్న రెండు పండ్ల వలె ఉన్న రెండు అర్థాలను బోధిస్తే అది శ్లేష. ఇదే అర్థశ్లేష.

వ్యా. ఏకేతి :- ఒకే అర్థాన్ని బోధించే శబ్దాలకు ఎక్కడ అనేకార్థాలు ఉంటాయో అది శ్లేష. ఉదాహరణం ఎట్లగా-

ఉదయమితి :- ఈ శ్లోకంలో సూర్యుడు, విభాకరు డనే రాజు వర్ణించబడు

తున్నారు. రెండర్థాలలోను కూడ ఇక్కడ ప్రయోగించిన శబ్దాలు బోధించే అర్థాలు వేరు వేరు విధంగా అన్వయిస్తాయి. లసత్తేజఃపుఞ్జః = ప్రకాశిస్తూన్న తేజః సముదాయం గల, విభాకరః = సూర్యుడు (విభాకరు డను పేరు గల రాజు అని రెండవ అర్థం), ఉదయమ్ = ఉదయాద్రిని, (అభివృద్ధిని). అయతే = పొందు చున్నాడు. దిఙ్మాలిన్యమ్=దిక్కులమలినత్వాన్ని, (దిక్కులలో ఉన్న ప్రజలమలినత్వాన్ని) నిరాకురుతేతరామ్=పూర్తిగానిరాకరిస్తున్నాడు. నిద్రాముద్రామ్=నిద్ర వలన కలిగిన నేత్రనిమీలనమును, (అలసత్వాన్ని), నిధనం నయతి=నశింపచేస్తున్నాడు. క్రియాః = క్రియలను, ప్రవర్తయతి = ప్రవర్తింపచేస్తున్నాడు. స్వైరాచారప్రవర్తనకర్తనమ్ = స్వేచ్ఛాచారాల ప్రవర్తనంయొక్క ఛేదమును (సూర్యుని పక్షంలో జారచోరాదుల స్వేచ్ఛాప్రవృత్తి; రాజపక్షంలో ప్రజల స్వేచ్ఛాప్రవృత్తి), రచయతితమామ్ = బాగాచేయుచున్నాడు, బత బత = ఏమి ఆశ్చర్యం.

అత్రేతి :- ఇక్కడ అభిధ నియంత్రించబడలేదు. అందువలన ఈ సూర్యుడు, రాజు, ఇద్దరూ కూడా వాచ్యార్థాలే.

వి. 'ఉదయమ్' ఇత్యాదిశబ్దాల అర్థం ఇట్లే చెప్పాలి అని నియమించే సంయోగాదులు ఏవీ లేకపోవడంచేత రెండు అర్థాలు కూడా వాచ్యాలే. ఈ పదాలు పర్యాయపరివృత్తిసహాలు అవడంచేత అర్థశ్లేష. 'విభాకర' శబ్దం మాత్రం పరివృత్త్యసహం. అందుచేత అక్కడ శబ్దశేష.

## 9. సమాసోక్త్యలంకారం

కా. పరోక్తిర్భేదకైః శ్లిష్టైః సమాసోక్తిః.

వృ. ప్రకృతార్థప్రతిపాదకవాక్యేన శ్లిష్టవిశేషణమాహాత్మ్యాత్, న తు విశేష్యస్య సామర్థ్యాదపి, యత్ అప్రకృతస్యార్థస్యాభిధానం సా సమాసేన సంక్షేపేణార్థద్వయకథనాత్ సమాసోక్తిః. ఉదాహరణమ్.

గాథ. లహిఊణ తుజ్ఝ బాహుప్ఫంసం జీఏ స కోవి ఉల్లాసో,
జఅలచ్ఛీ తుహ విరహే ణ హుజ్జలా దుబ్బలా ణం సా.

"లబ్ధ్వా తవ బాహుస్పర్శం యస్యాః స కోఽప్యుల్లాసః
జయలక్ష్మీస్తవ విరహే న ఖలూజ్జ్వలా దుర్బలా నను సా"

వృ. అత్ర జయలక్ష్మీశబ్దస్య కేవలం కాన్తావాచకత్వం నాస్తి.

వ్యా. పరేతి :- శ్లిష్టైః=శ్లిష్టములైన, భేదకైః=విశేషణాలచేత, పరోక్తిః= మరొక అర్థం చెప్పడం, సమాసోక్తిః = సమాసోక్తిః.

ప్రకృతేతి :- ప్రకృతార్థాన్ని బోధించే వాక్యంచేత శ్లిష్టములైన విశేషణాల మహాత్మ్యంవల్ల, అంతేకాని విశేష్యసామర్థ్యం వల్ల కూడా కాదు, అప్రకృతమైన అర్థాన్ని చెప్పడం సమాసోక్త్యలంకారం. సమాసేన-సంక్షేపంచేత, రెండు అర్థాలు చెప్పడంచేత దీనికి 'సమాసోక్తి' అని పేరు వచ్చింది. ఇక్కడ సంక్షేపం అనగా తక్కువ మాటలు అని అర్థం. రెండు వాక్యాలలో చెప్పవలసిన రెండు భావాల్ని ఒకే వాక్యం చేత చెప్పడం అని అర్థం. ఉదాహరణం-

లబ్ధ్వా ఇతి :- యుద్ధరంగంలో పడి ఉన్న స్వామిని చూచి వీరపత్ని అంటూన్న మాటలు. తవ = నీయొక్క, బాహుస్పర్శమ్=బాహుస్పర్శను, లబ్ధ్వా =పొంది, యస్యాః=ఎవతెకు, సః = ఆ, కోఽపి= చెప్పశక్యం కాని, ఉల్లాసః = హర్షం ఉండేదో, సా = ఆ, జయలక్ష్మీః = జయలక్ష్మి, తవ విరహే = నీ విరహమునందు, దుర్బలా = దుర్బలురాలై, ఉజ్జ్వలా = ప్రకాశిస్తూన్నది, న ఖలు = కాదు కదా.

అత్రేతి :- ఇక్కడ కేవలజయలక్ష్మీశబ్దం కాంత అనే అర్థాన్ని బోధించ జాలదు.

'జయలక్ష్మి' శబ్దానికి కేవలం జయలక్ష్మి అని మాత్రమే అర్థం. కాంత అనే అర్థం దీనివల్ల రాదు. అయినా 'బాహుస్పర్శం లబ్ధ్వా' ఇత్యాదివిశేషణాలకు కాంతా విషయకార్థాన్ని కూడా బోధించే శక్తి ఉంది. అందుచేత ప్రియుని హస్తస్పర్శ కలగగానే అనిర్వాచ్యమైన హర్షం పొందిన ఒక నాయిక అతని విరహంలో దుర్బలయై కాంతిని అంతా కోల్పోవడం అనే మరొక అర్థం స్ఫురిస్తూన్నది. జయలక్ష్మీ వ్యవహారం వ్యంగ్యమైన ఈ కాంతావ్యవహారం కంటె అభిన్నం అన్నట్లు గోచరిస్తుంది. ఈవిధంగా వ్యంగ్యమైన వ్యవహారానికి, వాచ్యమైనవ్యవహారానికీ అభేదం

గోచరించడం, వ్యంగ్యవ్యవహారాన్ని వాచ్యవ్యవహారంమీద ఆరోపించడం, సమాసోక్తి.

## 10 నిదర్శనాలంకారం

కా. నిదర్శనా
అభవన్ వస్తుసంబన్ధ ఉపమాపరికల్పకః. 97

వృ. నిదర్శనం దృష్టాన్తకరణమ్. ఉదాహరణమ్.

శ్లో॥ క్వసూర్యప్రభవో వంశః క్వ చాల్పవిషయా మతిః.
తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్. 435

వృ. అత్ర ఉడుపేన సాగరతరణమివ మన్మత్యా సూర్యవంశవర్ణనమిత్యుపమాయాం పర్యవస్యతి.

వ్యా. నిదర్శనేతి :- అభవన్ = సంభవించని, కుదరని, వస్తుసంబన్ధః = పదార్థముల లేదా, వాక్యార్థముల సంబంధం, ఉపమాపరికల్పకః = ఉపమను కల్పించినట్లయితే అది, నిదర్శనా = నిదర్శనాలంకారం.

నిదర్శనమితి :- 'నిదర్శనమ్' అనగా దృష్టాంతంగా చూపడం. అది దీనిలో ఉంటుంది కాబట్టి దీనికి నిదర్శన అనిపేరు. ఈ అలంకారంలో చెప్పిన వస్తుసంబంధం కుదరకపోవడంచేత ఆ రెండింటికి ఉపమానోపమేయభావం కల్పించడం జరుగుతుంది. దృష్టాంతాలంకారంలో కుదరకపోవడంఅనేది ఉండదు. ఈ రెండింటికీ అదే భేదం. ఉదాహరణం.

క్వేతి :- రఘువంశంలోని శ్లోకం- సూర్యప్రభవః = సూర్యుడు కారణంగా గల, సూర్యునివలన పుట్టిన, వంశః = వంశం, క్వ = ఎక్కడ? అల్పవిషయా = అల్పములైన విషయాలు గల, మతిః = బుద్ధి, క్వ = ఎక్కడ? మోహాత్ = అజ్ఞానంవల్ల, దుస్తరమ్ = దాట శక్యం కాని, సాగరమ్ = సముద్రాన్ని, ఉడుపేన = తెప్పచేత, తితీర్షుః = దాటనిశ్చయించినవాడను, అస్మి = అయి ఉన్నాను.

అత్రేతి :- ఇక్కడ "నా మతిచేత సూర్యవంశాన్ని వర్ణించడం తెప్పచేత సముద్రాన్ని దాటడం వంటిది" అని ఉపమలో పర్యవసానం చెందుతున్నది.

వి. సూర్యవంశాన్ని వర్ణించే సందర్భంలో "నేను సాగరాన్ని దాటా లని అనుకుంటూన్నాను" అని సాగరతరణసంబంధాన్ని చెప్పడం అసంగతం. అందుచేత ఇది (సాగరతరణసంబంధవచనం) ఉడుపంతో సాగరతరణం వలె నా మతితో సూర్యవంశవర్ణనం అసంభావ్యం (ఊహింప శక్యం కాని విషయం) అని ఉపనును కల్పిస్తూన్నది. అందుచేత ఇక్కడ వాక్యార్థనిదర్శన.

వృ- యథా వా-

శ్లో॥ ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా
వహిమరుచౌ హిమధామ్ని యాతి చాస్తమ్,
వహతి గిరిరయం విలమ్బిఘణ్టా
ద్వయపరివారితవారణేన్ద్రలీలామ్. 536

వృ. అత్ర కథమన్యస్య లీలామన్యః వహతీతి తత్సదృశీమిత్యుపమాయాం పర్యవసానమ్.

వ్యా. మరియొక ఉదాహరణం. ఎట్లనగా. (ఇది పదార్థనిదర్శనకు ఉదాహరణం).

వ్యా. ఉదయతీతి :- వితతోర్ధ్వరశ్మిరజ్జౌ = విస్తీర్ణములైన, పైకి ప్రసరిస్తూన్న, కిరణా లనే త్రాళ్ళు గల, అహిమరుచౌ = సూర్యుడు, ఉదయతి = ఉదయించుచుండగా, హిమధామ్ని = చంద్రుడు, అస్తమ్ = అస్తాద్రిని గూర్చి, యాతి చ = వెళ్ళుచుండగా, అయం గిరిః = ఈ పర్వతం, (రైవతకపర్వతం) విలమ్బిఘణ్టాద్వయపరివారితవారణేన్ద్రలీలామ్=వ్రేలాడుచున్న రెండు ఘంటలతో సంబంధించిన గజేంద్రము లీలను, వహతి=వహిస్తూన్నది.

అత్రేతి :- ఇక్కడ ఒకదాని లీలను మరొకటి ఎలా వహిస్తుంది? అందుచేత 'దానితో సమానమైన లీలను' అని ఉపమలో పర్యవసానం.

వి. ఏనుగు శోభ వేరు, పర్వతం శోభ వేరు. పర్వతం ఏనుగు శోభను వహించడం అనేది కుదరదు. అందుచేత "ఆ పర్వతం ఏనుగు శోభవంటి శోభను వహిస్తూన్నది" అని ఉపమ కల్పించబడుతుంది. 'వారణేంద్రలీలా' పదార్థ 'గిరి'

పదార్థాల సంబంధం అనుపపన్నం అవడంచేత కల్పించబడిన ఔపమ్యం అవడం చేత ఇది పదార్థ నిదర్శన.

అవ. మాలారూపనిదర్శనను ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ దోర్భ్యాం తితీర్షతి తరఙ్గవతీం భుజఙ్గ
మాదాతుమిచ్ఛతి కరే హరిణాఙ్కబిమ్బమ్.
మేరుం లిలఙ్ఘయిషతి ధ్రువమేష దేవ
యస్తే గుణాన్ గదితుముద్యమమాదధాతి. 437

వృ. ఇత్యాదౌ మాలారూపాప్యేషా ద్రష్టవ్యా.

వ్యా- దేవేతి:- దేవ = ఓ! దేవా! యః = ఎవడు, తే = నీయొక్క, గుణాన్ = గుణాలను, గదితుమ్ = చెప్పుటకు, ఉద్యమమ్ = ఉద్యమమును, ఆదధాతి = చేయునో అతడు, దోర్భ్యామ్ = బాహువులతో, తరఙ్గవతీమ్ = మహానదిని, లిలఙ్ఘయిషతి = లంఘింప గోరుచున్నాడు. హరిణాఙ్కబిమ్బమ్ = చంద్రబింబమును, కరే = హస్తమునందు, ఆదాతుమ్ = గ్రహించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు. మేరుమ్ = మేరుపర్వతమును, లిలఙ్ఘయిషతి = లంఘించ దలచుచున్నాడు. ధ్రువమ్ = నిశ్చయము.

ఇతీతి- ఇత్యాదులలో ఈ నిదర్శనను మాలారూపంలో కూడా చూచుకోవాలి.

వి. "ఎవడు నీ గుణగణాలను చెప్పే ప్రయత్నం చేస్తాడో" అనేది ఒక వాక్యార్థం. "అతడు నదిని బాహువులతో దాటగోరుచున్నాడు" ఇత్యాదికం మరొక వాక్యార్థం. ఈ రెండింటికి ఇక్కడ చెప్పిన సంబంధం అసంభావ్యం. అందుచేత "నీ గుణగణాలను చెప్పడం నదీతరణాదులతో సమానం" అని ఉపమలో పర్యవసానం చెందుతుంది. మూడు ఉండడంచేత మాలారూపనిదర్శన.

అవ. మరొకవిధమైన నిదర్శనను నిరూపిస్తున్నాడు—

కా. స్వస్వహేత్వన్వయస్యోక్తిః క్రియయైవ చ సా పరా

వృ. క్రియయైవ స్వస్వరూప స్వకారణయోః సంబన్ధో యదవగమ్యతే సా అపరా నిదర్శనా. యథా-

శ్లో॥ ఉన్నతం పదమవాప్య యో లఘు
ర్హేలయైవ స పతేదితి బ్రువన్,
శైలశేఖరగతో దృషత్కణ
శ్చారుమారుతధుతః పతత్యధః. 438

వృ. అత్ర పాతక్రియయా పతనస్య, లాఘవే సతి ఉన్నతిపద ప్రాప్తిరూపస్య చ సంబన్ధః ఖ్యాప్యతే.

వ్యా. స్వేతి-క్రియయైవ = క్రియచేతనే, స్వస్వహేత్వన్వయస్య = తనకు, తన కారణానికి ఉన్న సంబంధాన్ని చెప్పడం, అపరా = మరియొక విధమైన, సా = నిదర్శన.

క్రియయేతి-క్రియచేతనే స్వస్వరూప-స్వకారణాల సంబంధం బోధించబడి నప్పుడు అది మరియొక నిదర్శన.

వి. ఒక క్రియ ఉంది. దానికి ఒక కారణం ఉంటుంది- అందుచేత ఆ క్రియ కార్యం. తనకీ తన కారణానికీ ఉన్న సంబంధాన్ని ఆ క్రియ బోధించి నట్లయితే అది మరొక విధమైన నిదర్శన అని అర్థం.

వ్యా. ఎట్లనగా-యః = ఎవడు (ఏది), లఘుః = తేలిక అయిన వాడో (అయినదో), సః = వాడు (అది), ఉన్నతమ్ = ఉన్నతమైన, పదమ్ = స్థానమును, అవాప్య = పొంది, హేలయైవ = అనాయాసంగావే, పతేత్ = పడి పోవును, ఇతి = అని, బ్రువన్ = చెప్పుచూ, శైలశేఖరగతః = పర్వతశిఖరంమీద ఉన్న, దృషత్కణః = చిన్న రాయి, చారుమారుతధుతః = మృదువైన వాయువు చేత కదల్చబడినదై, అధః = క్రింద, పతతి = పడుచున్నది.

అత్రేతి:- ఇక్కడ పాతక్రియచేత పతనానికీ, లఘువు అయి ఉండి ఉన్నత పదం పొందడానికీ సంబంధం చెప్పబడుతున్నది.

వి. 'పతతి' అనే పతనక్రియ కార్యం. 'పతేత్' అనే పదం ఈ పతనరూప కార్యానికీ, దీనికి కారణమైన 'లఘువై ఉండి ఉన్నతపదం పొందడం' అనే దానికి ఉన్న సంబంధాన్ని బోధిస్తూన్నది. "లఘువైనవాడు ఉన్నతపదాన్ని పొందడం

పతనానికే హేతువు" అనే అర్థం బోధిస్తూన్నది. అందుచేత ఇది మరొకవిధమైన నిదర్శన.

## 11. అప్రస్తుతప్రశంసాలంకారం.

కా. అప్రస్తుతప్రశంసా యా సా సైవ ప్రస్తుతాశ్రయా, 98

వృ. అప్రాకరణికస్యాభిధానేన ప్రాకరణికస్యాక్షేపః అప్రస్తుత ప్రశంసా.

కా. కార్యే నిమిత్తే సామాన్యే విశేషే ప్రస్తుతే సతి
తదన్యస్య వచస్తుల్యే తుల్యస్యేతి చ పఞ్చధా. 99

వృ. తదన్యస్య కారణాదేః. క్రమేణోదాహరణమ్.

వ్యా. అప్రస్తుతేతి-యా = ఏ, అప్రస్తుతప్రశంసా = అప్రకృతమైనదాని వర్ణనం ఉన్నదో, సా = అది, ప్రస్తుతాశ్రయా = ప్రకృతార్థానికి సంబంధించినది, అనగా ప్రకృతార్థజ్ఞానం కలగడానికి హేతువు, అయినట్లయితే, సైవ = అప్రస్తుత ప్రశంసయే.

అప్రాకరణకేతి- అప్రాకరణికమైనదానిని చెప్పడంచేత ప్రాకరణికార్థాన్ని ఆక్షేపించడం (గ్రహించడం) 'అప్రస్తుతప్రశంస'.

ప్రకృతం కాని విషయాన్ని వర్ణించినప్పుడు అది వినగానే ప్రకృతమైన విషయం బుద్ధిగోచరం అవుతుంది. అది అప్రస్తుత ప్రశంసాలంకారం.

ఈ అలంకారానికి ఉన్న ఐదు బేదాలను చెపుతున్నాడు-కార్యే ఇతి-కార్యే= కార్యము, నిమిత్తే = కారణము, సామాన్యే = సామాన్యము, విశేషే = విశేషము, ప్రస్తుతే సతి = ప్రకృతమై ఉండగా, తదన్యస్య = దానికంటె భిన్నమైనదాని యొక్క, తుల్యే = తుల్యమైనది ప్రకృతమైనప్పుడు, తుల్యస్య = తుల్యమైనదాని యొక్క, వచః = చెప్పడము, ఇతి = అని, పఞ్చధా = ఐదు విధాలు. 'తదన్యస్య' అనగా కారణాదికముయొక్క అని అర్థం.

1. ఒక కార్యం ప్రకృతం అయినప్పుడు దాన్ని చెప్పకుండా దాని

కారణాన్ని వర్ణిస్తాడు. ఆ కారణాన్ని పట్టి కార్యాన్ని ఊహించుకోవాలి. ఇది ఒక భేదం. కారణం ప్రకృతం అయినప్పుడు కార్యాన్ని వర్ణిస్తాడు.అది రెండవ భేదం. సామాన్యం ప్రకృతం అయినప్పుడు విశేషాన్ని వర్ణిస్తాడు. అది మూడవ భేదం. విశేషం ప్రస్తుతం అయినప్పుడు సామాన్యాన్ని వర్ణిస్తాడు. అది నాల్గవ భేదం. ఒక తుల్యవస్తువు ప్రకృతం అయినప్పుడు దానికి తుల్యమైన మరొక వస్తువు వర్ణిస్తాడు. అది ఐదవ భేదం. క్రమంగా ఉదాహరణాలు-

శ్లో॥ యాతాః కిం న మిలన్తి సున్దరి పునశ్చిన్తా త్వయా మత్కృతే
నో కార్యా నితరాం కృశాసి కథయత్యేవం సబాష్పే మయి,
లజ్జామన్థరతారకేణ నిపతత్పీతాశ్రుణా చక్షుషా
దృష్ట్వా మాం హసితేన భావిమరణోత్సాహ స్తయా సూచితః.

వృ. అత్ర ప్రస్థానాత్ కిమితి నివృత్తోఽసి ఇతి కార్యే పృష్టే కారణమభిహితమ్.

వ్యా. యాతా ఇతి-సున్దరి=ఓ! సున్దరీ! యాతాః=దూరదేశములకు వెళ్ళిన వాళ్ళు, పునః= మరల, న మిలన్తి కిమ్=కలవరా? త్వయా=నీచేత, మత్కృతే= నా నిమిత్తం, చిన్తా=చింత, నో కార్యా=చేయదగినదికాదు. నితరామ్=మిక్కిలి, కృశా = కృశించినదానవు, అసి = అయినావు. సబాష్పే= కన్నీళ్ళతో కూడిన, మయి = నేను, ఏవమ్ = ఇట్లు, కథయతి = చెప్పుచుండగా, తయా = ఆమెచేత, లజ్జామన్థరతారకేణ = లజ్జచేత మందమైన కనుగ్రుడ్లు గల, నిపతత్పీతాశ్రుణా = కారుచున్న, త్రాగబడిన (లోలోనఅణచివేయబడిన) కన్నీళ్ళు గల, చక్షుషా = నేత్రంతో, మామ్ = నన్ను. దృష్ట్వా = చూచి, హసితేన = నవ్వుచేత, భావిమరణోత్సాహః = రాబోయే మరణమునందు ఉత్సాహం, సూచితః = సూచించబడింది.

అత్రేతి.ఇక్కడ-"దూరమైనదేశానికి వెళ్ళడంనుండి నివర్తించావా?" అని కార్యం ప్రశ్నించగా కారణం చెప్పబడింది.

వి. ప్రయాణం విరమించుకోవడం ప్రస్తుతం. "ఔను విరమించాను" అని చెప్పకుండా అప్రస్తుతమైన ప్రియాభావిమరణోత్సాహం చెప్పబడింది. దీనిని పట్టి

ప్రయాణం మానివేసి నట్లు (కార్యం) తెలుస్తున్నది. అందుచేత అప్రస్తుత ప్రశంస.

అవ. కారణం ప్రస్తుతమై ఉండగా కార్యాన్ని చెప్పడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ రాజన్ రాజసుతా న పాఠయతి మాం దేవ్యోఽపి తూష్ణీం స్థితాః
కుబ్జే భోజయ మాం కుమార సచివై ర్నాద్యాపి కిం భుజ్యతే.
ఇత్థం నాథ శుక స్తవారిభవనే ముక్తోఽధ్వగైః పఞ్జరాత్
చిత్రస్థానవలోక్య శూన్యవలభా వేకైకమాభాషతే. 440

వృ. అత్ర ప్రస్థానోద్యతం భవన్తం జ్ఞాత్వా సహసైవ త్వదరయః పలాయ్య గతాః ఇతి కారణే ప్రస్తుతే కార్యముక్తమ్.

వ్యా. నాథ = రాజా! అధ్వగైః = బాటసారులచేత, తవ అరిభవనే = నీ శత్రుగృహమునందు, పఞ్జరాత్ = పంజరం నుంచి, ముక్తః = విడబడవడిన, శుకః = చిలుక, శూన్యవలభౌ = జనశూన్యమైన పై డాబామీద, చిత్రస్థాన్ = చిత్రమునందు ఉన్న రాజాదులను, అవలోక్య = చూసి, రాజన్ = రాజా! రాజసుతా = రాజకుమారి, మామ్ = నన్ను, న పాఠయతి = చదివించడంలేదు. దేవ్యః అపి = రాణులు కూడా, తూష్ణీం స్థితాః = మౌనంగా ఉన్నారు. కుబ్జే = ఓ! గూనుదానా! మామ్ = నన్ను. భోజయ = భుజింపచేయుము. కుమార = కుమారా! సచివైః = మంత్రులతో కూడ, అద్యాపి = ఇంకా, కిమ్ = ఎందువలన, న భుజ్యతే = భోజనం చేయబడడంలేదు? ఇత్థమ్ = ఇట్లు, ఏకైకమ్ = ఒక్కొక్కని గూర్చి, ఆభాషతే = మాటలాడుచున్నది.

అత్రేతి-ఇక్కడ-"నువ్వు యుద్ధయాత్రకు బయలుదేరినావని వినగానే నీ శత్రువులు పారిపోయినారు" అనే విషయం (ఇది కారణం) ప్రకృతం. దానిని చెప్పకుండా దాని కార్యమైన శుకభాషణం చెప్పబడింది. అందుచేత అప్రస్తుత కార్యవర్ణనరూపమైన అప్రస్తుతప్రశంస.

అవ. సామాన్యం ప్రస్తుతం అయినప్పుడు విశేషాన్ని వర్ణించడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ ఏత త్తస్య ముఖాత్కియత్ కమలినీపత్రే కణం వారిణో
యన్ముక్తామణిరిత్యమం స్త స జడః శృణ్వన్యదస్మాదపి,
అఙ్గుల్యగ్రలఘుక్రియాప్రవిలయిన్యాదీయమానే శనైః
కుత్రోడ్డీయ గతో మమేత్యనుదినం నిద్రాతి నాన్తః శుచా. 441

వృ. అత్రాస్థానే జడానాం మమత్వసంభావనా భవతీతి సామాన్యే ప్రస్తుతే విశేషః కథితః.

వా. ఏతదితి- భల్లటశతకంలోని పద్యం- ఒక మూర్ఖుని మూర్ఖత్వాన్ని గూర్చి ఆశ్చర్యంతో మాటలాడుతూన్న ఒకనితో అతని మిత్రుడంటూన్న మాటలు: తస్య = వానియొక్క, ముఖాత్ = ముఖమునుండి, ఏతత్ = ఇది, కియత్ = ఎంత? అతడు ఇలా మాటలాడాడంటే ఆశ్చర్యం ఏమిటి అని అర్థం. యత్ = ఎందువలన అనగా, సః జడః = ఆ మూర్ఖుడు, కమలినీపత్రే = తామరాకుపైన, స్థితమ్ = ఉన్న, వారిణః కణమ్ = జలబిందువును, ముక్తామణిః ఇతి = ముత్యము అని, అమంస్త = తలచెను. అస్మాదపి = దీనికంటె కూడ, అన్యత్ = మరొక విషయాన్ని, శృణు = వినుము. శనైః = మెల్లగా, ఆదీయమానే = గ్రహించబడుచూ, అఙ్గుల్యగ్రలఘుక్రియా ప్రవిలయిని = వ్రేళ్ళ అగ్రభాగముల లఘువైన క్రియచేత (తేలికగా ముట్టుకోవడంచేత) అది వ్రేళ్ళమీదనే లీనమైపోగా, మమ= నాయొక్క ఆ ముత్యం, ఉడ్డీయ = ఎగిరి, కుత్ర = ఎక్కడికి, గతః = వెళ్ళిపోయినది, ఇతి = అని, అనుదినమ్ = ప్రతిరోజూ, అన్తఃశుచా = లోపల దుఃఖం చేత, న నిద్రాతి = నిద్రపోవడంలేదు.

అత్రేతి-"మూర్ఖులు అనవసరంగా మమకారంతో బాధపడుతూ ఉంటారు," అనే సామాన్యం ప్రస్తుతం. దానికి ఇక్కడ ఒక విశేషం (ఈ మూర్ఖుని వృత్తాంతం) చెప్పబడింది. దీనిని పట్టి సామాన్యాన్ని గ్రహించడం జరుగుతుంది అందుచేత అప్రస్తుతప్రశంసాలంకారం.

అవ. విశేషం ప్రస్తుతం అయినప్పుడు సామాన్యవర్ణనానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ సుహృద్వధూబాష్పజలప్రమార్జనం
కరోతి వైరప్రతియాతనేన యః,
స ఏవ పూజ్యః స పుమాన్ స నీతిమాన్
సుజీవితం తస్య స భాజనం శ్రియః. 442

వృ. అత్ర "కృష్ణం నిహత్య నరకాసురవధూనాం యది దుఃఖం ప్రశమయసి తత్ త్వమేవ శ్లాఘ్యః" ఇతి విశేషే ప్రకృతే సామాన్య మభిహితమ్.

వ్యా. సుహృదితి :- శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణి సంహరించిన తరవాత అతని మిత్రుడైన శాల్వునితో అతని మంత్రి పలికిన మాటలు. యః = ఎవడు, వైరప్రతియాతనేన = వైరానికి ప్రతిక్రియ చేయడంచేత, సుహృద్వధూబాష్ప జలప్రమార్జనమ్ = మిత్రుని భార్యల కన్నీరు తుడుచుటను, కరోతి = చేయునో, సః ఏవ = అతడే, పుమాన్ = పురుషుడు, సః = అతడే, నీతిమాన్ = నీతి కల వాడు. తస్య = అతనిదే, సుజీవితమ్ = మంచి జీవితం. సః = అతడే, శ్రియః = లక్ష్మికి, భాజనమ్ = స్థానము.

అత్రేతి - "కృష్ణుణ్ణి సంహరించి నరకాసురుని స్త్రీల దుఃఖాన్ని శమింప చేస్తేనే నీవు ధన్యుడవు" అని విశేషం ప్రస్తుతం. దీన్ని మనస్సులో ఉంచుకొని ఇక్కడ సామాన్యం చెప్పబడింది. సామాన్యం ద్వారా ప్రస్తుతార్థస్ఫూర్తి కలుగు తుంది గాన అప్రస్తుతప్రశంసాలంకారం.

వృ. తుల్యే ప్రస్తుతే తుల్యాభిధానే త్రయః ప్రకారాః. శ్లేషః, సమాసోక్తిః, సాదృశ్యమాత్రం వా తుల్యాత్ తుల్యస్య హ్యాక్షేపే హేతుః. క్రమేణోదాహరణమ్-

శ్లో॥ పుంస్త్వాదపి ప్రవిచలేద్యది యద్యధోఽపి
యాయాద్యది ప్రణయనే న మహానపి స్యాత్,
అభ్యుద్ధరేత్తదపి విశ్వమితీదృశీయం
కేనాపి దిక్ ప్రకటితా పురుషోత్తమేన.

వ్యా. తుల్యే ఇతి :- తుల్యం ప్రస్తుతం అయినప్పుడు తుల్యాన్ని చెప్ప డంలో మూడు పద్ధతులు ఉండవచ్చు. శ్లేష కాని, సమాసోక్తి కాని లేదా కేవలం సాదృశ్యం కాని తుల్యమైనదానిని పట్టి తుల్యమైన మరొకవస్తువును ఆక్షేపించ డానికి (ఊహించడానికి) హేతువు కావచ్చు. క్రమంగా ఉదాహరణలు ఎట్లనగా-

పుంస్త్వాదితి :- ఇది భల్లటశతకంలోని శ్లోకం. శత్రువులు అపహరించిన రాజ్యాన్ని మళ్ళీ ఉద్ధరించడానికి ఒక రాజును ప్రోత్సహిస్తూన్న మాటలు. శ్రీమహావిష్ణువు, పుంస్త్వాదపి=పురుషత్వంనుండి కూడా, ప్రవిచలేద్యది=చలించ వచ్చును, పురుషత్వాన్ని విడచి మోహినీరూపం ధరించినప్పుడు. అధోఽపి= క్రిందికి కూడ, యాయాద్యది= వెళ్ళవచ్చును వరాహావతారంలో చేసినట్లు. ప్రణ యనే=యాచనమునందు, నమహానపి=చాలా చిన్నవాడు కూడ, స్యాత్ యది= కావచ్చు. వామనావతారంలో వలె. తదపి= అయినను, విశ్వమ్= ప్రపంచాన్ని అభ్యుద్ధరేత్ = ఉద్ధరించును. ఇతి= ఇట్లు, కేనాపి= ఒకానొక వర్ణింపశక్యం కాని, పురుషోత్తమేన శ్రీమహావిష్ణువుచేత, ఈదృశీ= ఇట్టి, ఇయమ్= ఈ, దిక్= పద్ధతి, ప్రకటితా=ప్రకటించబడింది.

ప్రస్తుతరాజపక్షంలో- "పౌరషం నుండి చ్యుతుడు కావచ్చును. సంపద్వి నాశం పొందవచ్చును. యాచనసమయంలో మహత్త్వశూన్యుడు కావచ్చును. అయినా ఈ పురుషోత్తముడైన రాజు శత్రువులు అపహరించిన రాజ్యాన్నంతనీ ఉద్ధరిస్తాడు" అని భావం.

వి. ఇక్కడ సత్పురుషుణ్ణి వర్ణించాలి. అందుచేత అతడు ప్రస్తుతమైన వాడు. అతనితో సమానుడైన అప్రస్తుతుడైన శ్రీమహావిష్ణువు ఇక్కడ వర్ణించ బడుతున్నాడు. 'పుంస్త్వాత్' ఇత్యాదివిశేషణాలు, 'పురుషోత్తమేన' అనే విశేష్యమూ కూడ శ్లిష్టాలు అవడంచేత విష్ణువుతో సమానుడైన ప్రస్తుతరాజుఅనే అర్థం ఆక్షే పించబడుతూన్నది గాన ఇది అప్రస్తుతప్రశంసాలంకారం.

అవ. సమాసోక్తివలన ఏర్పడిన అప్రస్తుతప్రశంసను ఉదాహరిస్తున్నాడు.

శ్లో॥ యేనాస్యభ్యుదితేన చన్ద్ర గమితః క్లాన్తిం రవౌ తత్ర తే
యుజ్యేత ప్రతికర్తుమేవ న పునస్తస్యైవ పాదగ్రహః,

క్షీణేనైతదనుష్ఠితం యది తతః కిం లజ్జసే నో మనా
గస్త్వేవం జడధామతా తు భవతో యద్వ్యోమ్ని విస్ఫూర్జసే.

వ్యా. యేనేతి :— తనకు అపకారం చేసినవానినే జీవికకోసం ఆశ్రయించిన ఒక క్షీణావస్థలో ఉన్నవానిని ఒకడు నిందిస్తున్నాడు. చన్ద్ర = చంద్రుడా, అభ్యుదితేన = ఉదయించిన, యేన = ఏ సూర్యునిచేత, క్లాన్తిమ్ = తేజోవిహీనత్వాన్ని, గమితః = పొందించబడినానో, తత్ర = ఆ, రవౌ = సూర్యునివిషయంలో, ప్రతికర్తుమేవ = ప్రతిక్రియచేయుటకే, తే = నీకు, యుజ్యేత = తగి ఉండును. తస్యైవ = ఆతనియొక్కయే, పాదగ్రహః పునః = పాదగ్రహణం అయితే, న = యుక్తం కాదు పాదాలు పట్టుకోవడం, కిరణాలను గ్రహించడం అని రెండర్థాలు. సూర్య కిరణాల సంక్రమణంవల్లనే చంద్రుడిలో కాంతి ఉంటుంది కదా? క్షీణేన = క్షీణుడ వైన (ధనహీనుడు, కలాహీనుడు అని రెండర్థాలు) నీచేత, ఏతత్ = ఈ పాద గ్రహణం, అనుష్ఠితం యది = చేయబడినట్లయితే, మనాక్ = కొంచెమైనను, కిమ్ = ఎందువలన, నో లజ్జసే = సిగ్గుపడవు? ఏవమ్ = ఇట్లే, అస్తు = అగుగాక. వ్యోమ్ని = ఆకాశమునందు, యత్ విస్ఫూర్జసే = సగర్వంగా ఉన్నావు అనేది ఏది కందో అది, భవతః = నీయొక్క, జడధామతా = జడధామత్వమే, జలానికి స్థానం అవడం. జడత్వానికి స్థానం అవడం అని రెండు అర్థాలు.

వి. ఇక్కడ విశేష్యమైన చన్ద్ర పదం శ్లిష్టం కాదు. విశేషణాలు శ్లిష్టాలు. వాటి మహిమచేత ప్రస్తుతమైన సధన-నిర్ధనుల వృత్తాంతం ఆక్షేపించబడుతున్నది. అందుచేత సమాసోక్తిహేతుకమైన అప్రస్తుతప్రశంసాలంకారం.

అవ. కేవలం సాదృశ్యాన్ని పట్టి ఏర్పడిన అప్రస్తుతప్రశంసాలంకారానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ ఆదాయ వారి పరితః సరితాం ముఖేభ్యః
కిం తావదర్జితమనేన దురర్ణవేన,
క్షారీకృతం చ వడవాదహనే హుతం చ
పాతాలకుక్షికుహరే వినివేశితం చ. 445

వ్యా. ఆదాయేతి :- సరితామ్ = నదులయొక్క, ముఖేభ్యః = ముఖాల

నుండి, పరితః = అన్నివైపులనుండీ, వారి = జలమును, ఆదాయ = గ్రహించి, అనేన = ఈ, దురర్ణవేన = దుష్టసముద్రంచేత, కిం తావత్ = ఏమి, అర్జితమ్ = సంపాదించబడింది? క్షారీకృతం చ = ఉప్పగా చేయబడింది. వడవాదహనే = వడవాగ్నిలో, హుతం చ = హోమంచేయబడింది. పాతాళకుక్షికుహరే = పాతాల మధ్యరంధ్రంలో, వినివేశితం చ = ఉంచబడింది.

వి. ఇతరులనుండి ధనం ఆకర్షించి పెద్ద ఖర్చు చేస్తూన్నవాడు ప్రకృతుడై ఉండగా అప్రకృతమైన సముద్రం వర్ణించబడింది. సామ్యాన్ని పట్టి ప్రకృతపురుషవృత్తాంతం గమ్యం అవుతూన్నది గాన సాదృశ్యమాత్రహేతుకమైన అప్రస్తుతప్రశంసాలంకారం.

కా. ఇయం చ కాచిద్వాచ్యే ప్రతీయమానార్థానధ్యారోపేణైవ భవతి. యథా-

శ్లో॥ అబ్ధేరమ్భఃస్థగితభువనాభోగపాతాలకుక్షేః
పోతోపాయా ఇహ హి బహవో లఙ్ఘనేఽపి క్షమన్తే,
ఆహో రిక్తః కథమపి భవేదేష దైవాత్తదానీం
కో నామ స్యాదవటకుహరాలోకనేఽప్యస్య కల్పః. 446

వ్యా. ఇయమితి :- ఈ అప్రస్తుత ప్రశంస కొన్ని చోట్ల వాచ్యార్థంమీద ప్రతీయమానార్థాన్ని ఆరోపించకుండానే ఏర్పడుతుంది. ఎట్లనగా-

అబ్ధేరితి :- ఇహ = ఇక్కడ, అమ్భఃస్థగితభువనాభోగపాతాలకుక్షేః = నీటిచేత కప్పివేయబడిన భువనవైశాల్యమూ, పాతాలకుక్షీ గల, అబ్ధేః = సముద్రము యొక్క, లఙ్ఘనేఽపి = దాటడంలో కూడ (దాటడానికి కూడ), బహవః = చాలా మంది, పోతోపాయాః = చిన్న తెప్పలు ఉపాయంగా కలవారై, క్షమన్తే హి = సమర్థు లగుదురు కదా. దైవాత్ = దైవంవల్ల, ఏషః = ఇది, కథమపి = ఎట్లో, రిక్తః = జలశూన్యం, ఆహోభవేదపి = అయితే, తదానీమ్ = అప్పుడు, అస్య = దీనియొక్క, అవటకుహరాలోకనేఽపి = గోతి రంధ్రాన్ని చూడడానికి కూడ, కో నామ = ఎవడు, కల్పః = సమర్థుడు, స్యాత్ = అగును?

వి. ప్రజలను పీడించే స్వభావం గల దుష్టప్రభువు ఐశ్వర్యసంపన్నుడై ఉండడమే మంచిది కాని ఐశ్వర్యవిహీనుడు అవడం మంచిది కాదు. అతడు ఇంకా బాధిస్తాడు అనేది ప్రస్తుతమైన ప్రతీయమానార్థం. వాచ్యార్థం సముద్రరూపార్థం. సముద్రరూపమైన ఈ వాచ్యార్థం స్వయంగానే సంభావ్యం. అసంభావ్యం కాదు. దానిని ఉపపన్నం చేయడానికి ప్రతీయమానమైన అర్థాన్ని దానిమీద ఆరోపించ వలసిన పని లేదు.

వృ. క్వచిదధ్యారోపేణైవ. యథా—

శ్లో॥ కస్త్వం భోః కథయామి దైవహతకం మాం విద్ధి శాఖోటకం
వైరాగ్యాదివ వక్షి సాధు విదితం కస్మాదిదం కథ్యతే,
వామేనాత్ర వటస్తమధ్వగజనః సర్వాత్మనా సేవతే,
న చ్ఛాయాపి పరోపకారకరణే మార్గస్థితస్యాపి మే. 447

వ్యా. క్వచిదితి:- కొన్నిచోట్ల ప్రతీయమానమైన ప్రకృతార్థం ఆరోపించడం ద్వారానే ఈ అప్రస్తుతప్రశంస ఏర్పడుతుంది. ఎట్లనగా—

కఇతి-భోః = ఓయీ! త్వమ్ = నీవు, కః = ఎవరవు? కథయామి = చెపుతున్నాను, మామ్ = నన్ను, దైవహతకమ్ = దైవోపహతుడనైన, శాఖోటకమ్ = శాఖోటకవృక్షమునుగా, భూతాలు నివసించే ఒక వృక్షం అని కొందరు వ్యాఖ్యాతలు. శ్మశానంలో అగ్నిజ్వాలలకి ఆకులూ చిగుళ్లూ మాడిపోయిన ఒక వృక్షం అని ధ్వన్యాలోకలోచనంలో అభినవగుప్తుడు, విద్ధి = తెలుసుకొనుము. వైరాగ్యాదివ = వైరాగ్యంవలన వలె, ఏదో నిరాశతో పలె, వక్షి = మాటలాడు తున్నావే? సాదు = బాగా, విదితమ్ = తెలియబడింది. కస్మాత్ = ఎందువల్ల? ఇదం కథ్యతే = ఇదిగో చెప్పబడుతూన్నది. అత్ర = ఇక్కడ, వామేన = ఎడమ ప్రక్క, వటః = మఱ్ఱిచెట్టు ఉంది. అధ్వగజనః = బాటసారుల జనం, తమ్ = దానిని, సర్వాత్మనా = అన్నివిధాలా, సేవతే = సేవిస్తూన్నది. మార్గస్థితస్యాపి = మార్గం లోనే ఉన్నా, మే = నాయొక్క, ఛాయాపి = నీడ కూడా, పరోపకారకరణే = పరోపకారం చేయడంలో, న = ఉపయుక్తం కాదు.

తాను దానం ఇవ్వాలని ఎంత అనుకున్నా అది పాపపు సొమ్ము అనో,

మరే కారణంచేతనో సత్పాత్రలెవ్వరూ దానం తీసి కొనడానికి రాకపోవడంచేత దిగులుచెందిన వ్యక్తి ప్రకృతుడు. శాఖోటకవృత్తాంతం అప్రస్తుతం. ఇది వాచ్యం. అచేతనమైన వృక్షంతో ప్రశ్నోత్తరాలు అసంభావ్యాలు కాన శాఖోటకాదిరూపమైన ప్రతీయమానార్థంమీద దానం చెయ్యాలనే కోరిక గలవాని ఆరోపణం ఆవశ్యకం.

వృ. క్వచిదంశేష్వధ్యారోపేణ. యథా-

శ్లో॥ సోఽపూర్వో రసనావిపర్యయవిధిః తత్ కర్ణయోశ్చాపలం
దృష్టిః సా మదవిస్మృతస్వపరదిక్ కిం భూయసోక్తేన వా,
సర్వం విస్మృతవానసి భ్రమర హే యద్వారణోఽద్యాప్యసౌ
అన్తః శూన్యకరో నిషేవ్యత ఇతి భ్రాతః క ఏష గ్రహః.

వృ. అత్ర రసనావిపర్యాసః శూన్యకరత్వం చ భ్రమరస్యాసేవనే న హేతుః, కర్ణచాపలం తు హేతుః. మదః పునః ప్రత్యుత సేవనే నిమిత్తమ్.

వ్యా. క్వచిదితి-కొన్ని చోట్ల వాచ్యార్థానికి సంబంధించిన కొన్ని అంశాలలో ప్రతీయనార్థారోపణం ఉంటుంది ఎట్లనగా-

సోఽపూర్వః ఇతి-ఇది భల్లటశతకంలోని శ్లోకం. ఇక్కడ వక్త భ్రమరాన్ని ఉద్దేశించి నీకు ఆ ఏనుగువల్ల ఏమీ ప్రయోజనం లేదు; దాన్నే పట్టుకొని ఎందుకు పాకులాడుతున్నావో తెలియదు అని అంటాడు. ఈ అప్రస్తుత వర్ణనం వల్ల-ఎందుకూ ఉపకరించని స్వామిని పట్టుకొని, అతడు వద్దంటున్నా అతనినే ఆశ్రయిస్తూన్న సేవకుని వృత్తాంతం, శ్లేషసాహాయ్యంచేత గమ్యం అవుతున్నది. ఇది ప్రస్తుతం. ఇక్కడ ప్రయోగించిన పదాలకుకూడా రెండేసి అర్థాలు ఉన్నాయి. భ్రాతః = సోదరుడా! హేః భ్రమర = ఓ। తుమ్మెదా; సః = ఆ, అపూర్వః = అపూర్వమైన, రసనావిపర్యయవిధిః=నాలుక వెనక్కి తిరిగి పోవడం, ఏనుగులకు మాటలాడే శక్తి ఉండే దని, అగ్నిశాపంచేత వాటి నాలుకలు వెనక్కి తిరిగి పోవడంతో వాటికి ఆ శక్తి పోయిన దని పురాణప్రసిద్ధి. సేవ్యుని విషయంలో నాలికమడత వ్యవహారం అనగా అసత్యం పలకడం అని అర్థం. తత్ = ఆ, కర్ణయోః = చెవులయొక్క, చాపలమ్ = చపలత్వమూ, ఏనుగ పక్షంలో మాటి

మాటికి చెవులు ఊపడం, స్వామి పక్షంలో చెప్పుడు మాటలు వినడం. మద విస్మృతస్వపరదిక్ = మదంచేత మరువబడిన తన పర అనే మార్గం (వివేకం) గల, దృష్టిః = చూపు, మదం అనగా ఏనుగు పక్షంలో మదోదకం. స్వామిపక్షంలో గర్వం. 'దృష్టి' అనగా ఏనుగు పక్షంలో చూపు. స్వామి పక్షంలో ప్రవర్తన. భూయసా = అధికమైన, ఉక్తేన = చెప్పడంచేత, కిం వా = ఏమి ప్రయోజనం? సర్వమ్ = అంతనూ, విస్మృతవాన్ అసి = మరచిపోయినావు. అన్తఃశూన్యకరః = లోపల శూన్యమైన తొండం గల, శూన్యహస్తుడైన అని రెండవ అర్థం, అసౌ = ఈ వారణః అపి = ఏనుగు కూడా, రావద్దు అని నివారించేవాడు అని రెండవ అర్థం. అద్యాపి = ఇప్పటికి కూడా, యత్ సేవ్యతే ఇతి = సేవించబడుచున్నది అనేది ఏది కలదో, ఏషః = ఈ, గ్రహః = మొండి పట్టుదల, కః = ఏమిటి?

వి. ఈ శ్లోకంలో రసనావిపర్యయం, కర్ణచాపలం, శూన్యకరత్వం మద విస్మృతస్వపరదిక్త్వం అనే నాలుగు అంశాలు చెప్పబడ్డాయి. ఆ వారణాన్ని నువ్వు సేవించడం యుక్తం కాదు అని భ్రమరంతో అంటున్నాడు. రసనావిపర్యయ విధి కాని, శూన్యకరత్వం కాని వారణాన్ని భ్రమరం సేవించక పోవడానికి కారణం కాదు, అవి ఉన్నా భ్రమరానికి ఏమీ నష్టం లేదు కదా? కర్ణచాపలం అందుకు, సేవించకపోవడానికి హేతువు అని చెప్పవచ్చు. దాని చెవుల దెబ్బకు భ్రమరం చచ్చిపోవచ్చును కదా? మదం ఉండడం సేవించకపోవడానికి అసలే కారణం కాదు; అది సేవించడానికే కారణం. అందుచేత కర్ణచాపలాంశంలో ప్రతీయమానపురుషార్థాద్యారోపం అవసరం లేదు. ఆ ఆరోపం లేకుండానే ఆ వారణానికి కర్ణచాపలం ఉంది; నువ్వు దానిని సేవించకూడదు అని చెప్పడంలో తప్పు లేదు. మదం ఉంది కాబట్టి నువ్వు సేవించకూడదు అనేది కూడా కుదరదు. భ్రమరానికి కావలసింది మదాఘ్రాణమే. రసనావిపర్యయ- శూన్యకరత్వాలు ఉన్నా దానికి ఏమీ నష్టంలేదు కాబట్టి సేవించడంలో తప్పు లేదు. అందుచేత ఈ మూడు అంశాలలోను ప్రకృతప్రతీయమానసేవ్యసేవకపురుషవృత్తాంతసమారోపం చేసి ఈ రసనావిపర్యయమే అసత్యభాషణరూపమైన సేవ్యగతరసనావిపర్యయం, ఇత్యాది విధంగా ఆరోపం చేయడంవల్ల దాని సేవను నిషేధించడం యుక్తం అవుతుంది. ఈ విధంగా కర్ణచాపలాంశంలో ఆరోపం లేదు, మిగిలిన అంశాలలో ఆరోపం చెయ్యాలి. ఈ విషయాన్నే చెవుతున్నాడు.

అత్రేతి:- భ్రమరం వారణాన్ని సేవించకపోవడానికి రసనావిపర్యయ-

శూన్యకరత్వాలు హేతువు కాదు. కర్ణచాపలం మాత్రం హేతువు. పైదానికి విపరీతంగా మదం సేవనానికే హేతువు.

## 12. అతిశయోక్త్యలంకారం.

కా. నిగీర్యాధ్యవసానం తు ప్రకృతస్య పరేణ యత్,
ప్రస్తుతస్య యదన్యత్వం యద్యర్థోక్తౌ చ కల్పనమ్. 100
కార్యకారణయోర్యశ్చ పౌర్వాపర్యవిపర్యయః
విజ్ఞేయాతిశయోక్తిః సా.

వృ. ఉపమానేన అన్తర్నిగీర్ణస్య ఉపమేయస్య యదధ్యవసానం సా ఏకా. యథా-

శ్లో॥ కమలమనమ్భసి కమలే చ కువలయే తాని కనకలతికాయామ్,
సా చ సుకుమారసుభగేత్యుత్పాతపరంపరా కేయమ్.

వృ. అత్ర ముఖాది కమలాదిరూపేణ అధ్యవసితమ్.

వ్యా. నిగీర్యేతి:- పరేణ = ఉపమానంచేత, నిగీర్య = మింగివేసి, వేరుగా చెప్పకుండగా, ప్రకృతప్య = ఉపమేయంయొక్క, యత్ = ఏ, అధ్యవసానమ్= అధ్యవసానం కలదో, కావాలని ఈ వస్తువే ఆ వస్తువు అని నిశ్చయించడం అధ్యవసానం. ముఖం వేరు పద్మం వేరు అని తెలిసి కూడ ముఖం మాట ఎత్తకుండా దానిని 'పద్మం' అనడం అధ్యవసానం. సా = అది, అతిశయోక్తిః = అతిశయోక్తిగా (ఒక అతిశయోక్తి భేదంగా), విజ్ఞేయా = తెలియదగినది. ఇట్లే మిగిలినచోట్ల "విజ్ఞేయాతిశయోక్తిః" అన్వయించాలి. ప్రస్తుతస్య = ప్రకృతమైనదానికి, యత్ = ఏ, అన్యత్వమ్ = మరొక విధంగా వర్ణించడం ఉన్నదో, అది రెండవ అతిశయోక్తి. యద్యర్థోక్తౌ = 'యది' శబ్దంయొక్క అర్థాన్ని చెప్పడం ఉండగా, కల్పనమ్ = కల్పించడం, అనగా ఇది ఆ విధంగా ఉంటే అది ఆ విధంగా ఉండి ఉండేది అని కల్పించడం మూడవ అతిశయోక్తి. కార్యకారణయోః = కార్యకారణాల

యొక్క, పౌర్వాపర్యవిపర్యయః = క్రమంలో తారుమారు చేయడం నాల్గవ అతిశయోక్తి.

ఉపమానేతి:- ఉపమానంచేత లోపలికి మ్రింగివేయబడిన ఉపమేయాన్ని అప్రకృతరూపంలో అధ్యవసానం చేయడం, దృఢమైన ఆరోపం, ఒక అతిశయోక్తి. ఎట్లనగా-

కమలమితి:- అనమ్భసి = నీరు లేని ప్రదేశంలో, కమలమ్ = పద్మం, కమలే చ = పద్మంలో, కువలయే = రెండు నల్ల కలవలు, తాని = అవన్నీ, కనకలతికాయామ్ = బంగారు తీగమీద, సా చ = అది కూడా, సుకుమారసుభగా = సుకుమారంగాను సుందరంగానూ ఉంది. ఇయమ్ = ఈ, ఉత్పాతపరంపరా = ఉత్పాతాల పంక్తి, కా = ఏమిటి! రాబోయే అనర్థాన్ని సూచించే ప్రకృతి విరుద్ధములైన విషయాలు ఉత్పాతాలు.

అత్రేతి:- ఇక్కడ ముఖాదికం కమలాదిరూపంలో అధ్యవసితం అయింది.

వి. ఇక్కడ ఉపమానాలైన పద్మ-కువలయ-కనకలతలు ఉపమేయాలైన ముఖ-నేత్ర-శరీరాలను పూర్తిగా మింగివేశాయి. వాటిని చెప్పకుండా ఉపమానాలు మాత్రమే గ్రహించబడ్డాయి. ఇదే అధ్యవసాయం. భేదం ఉన్నా భేదం లేనట్లు చెప్పడం. అందుచేత ఇది నిగీర్యాధ్యవసానరూపమైన, 'భేదే అభేద' రూపమైన అతిశయోక్తి.

కా. యచ్చ తదేవాన్యత్వేనాధ్యవసీయతే సా అపరా. యథా-

గాథ- అణ్ణం లడహత్తణఅం అణ్ణా విఅ కావి వత్తణచ్ఛాఆ,
సామా సామణ్ణపఆవఇణో రేహచ్చి అ ణ హోఈ. 450

"అన్యత్సౌకుమార్యమ్ అన్యైవ చ కాపి వర్తనచ్ఛాయా,
శ్యామా సామాన్యప్రజాపతేః రేఖైవ చ న భవతి".

వ్యా- యచ్చేతి:- అదే వస్తువును మరొక వస్తువునుగా (కావాలని) నిశ్చయించినట్లయితే మరియొక అతిశయోక్తి. ఇదే 'అభేదేభేద' రూపాతిశయోక్తి. భేదం లేకపోయినా భేదం ఉన్నట్లు చెప్పడం. ఎట్లనగా-

అన్యదితి:- సౌకుమార్యమ్ = (ఆమె) సౌకుమార్యం, అన్యత్ = వేరైనది. కాపి = చెప్పశక్యంకాని, వర్తనచ్ఛాయా = శరీరకాంతి, అన్యైవ = వేరే. శ్యామా = ఈ నవయౌవనవతి, సామాన్య ప్రజాప్రతేః = మామూలు సృష్టికర్తయొక్క, రేఖైవ = నిర్మాణపరిపాటియే, న భవతి = కాదు, "శీతకాలే భవేదుష్ణా గ్రీష్మే చ సుఖశీతలా, సర్వావయవశోభాఢ్యా సా శ్యామా పరికీర్తితా" అని శ్యామాలక్షణం.

వి. ఇక్కడ లోకప్రసిద్ధాలైన సౌకుమార్యాదులకంటె అన్యత్వం లేక పోయినా ఉన్నట్లు వర్ణించడంచేత అభేదేభేదాధ్యవసాయ రూపమైన అతిశయోక్తి.

వృ. 'యద్యర్థస్య' యదిశబ్దేన చేచ్ఛబ్దేన వా ఉక్తౌ యత్ కల్పనమ్ అర్థాత్ అసంభవినః అర్థస్య సా తృతీయా. యథా-

శ్లో॥ రాకాయామకలఙ్కం చేదమృతాంశోర్భవేద్వపుః,
తస్యా ముఖం తదా సామ్యపరాభవమవాప్నుయాత్ 451

వ్యా. యద్యర్థస్యేతి:- 'యది' శబ్దార్థంయొక్క, అనగా 'యది' శబ్దంచేత గాని, 'చేత్' శబ్దంచేత గాని చెప్పినప్పుడు ఏ కల్పనం, అనగా అసంభావ్యమైన విషయముయొక్క కల్పనం, ఉంటుందో అది మూడవ అతిశయోక్తి, ఎట్లనగా-

రాకాయామితి:- అమృతాంశోః = చంద్రునియొక్క, వపుః = శరీరం, రాకాయామ్ = పూర్ణిమయందు, అకలఙ్కమ్ = కలంకం లేనిది, భవేత్ చేత్ = అయితే, తదా = అప్పుడు తస్యాః ముఖమ్ = ఆమె ముఖం, సామ్యపరాభవమ్ = సామ్యం అనే పరాభవాన్ని, దీనితో సమానమైనది మరొకటి ఉన్నది అనే పరాభవాన్ని, అవాప్నుయాత్ = పొందును.

ఇక్కడ 'చేత్'ను ప్రయోగించి చేసిన పూర్ణిమనాడు చంద్రునిలో కలంకం అనే కల్పన అసంభావ్యం గాన ఇది అతిశయోక్తి.

వృ. కారణస్య శీఘ్రకారితాం వక్తుం కార్యస్య పూర్వముక్తౌ చతుర్థీ. యథా-

శ్లో॥ హృదయమధిష్ఠితమాదౌ మాలత్యాః కుసుమచాపబాణేన,
చరమం రమణీవల్లభ లోచనవిషయం త్వయా భజతా. 452

వ్యా. కారణస్యేతి:- కారణం తన కార్యాన్ని అతిశీఘ్రంగా పుట్టిస్తుంది అని చెప్పడంకోసం కార్యాన్ని కారణంకంటె ముందు చెప్పడం నాల్గవ అతిశయోక్తి. ఎట్లనగా-

హృదయమితి:- కుట్టనీమతంలోని శ్లోకం. రమణీవల్లభ = ఓ! కామినీ వల్లభా! కుసుమచాపబాణేన = మన్మథుని బాణంచేత, మాలత్యాః = మాలతి యొక్క, హృదయమ్ = హృదయము, ఆదౌ = ముందుగా, అధిష్ఠితమ్ = అధిష్ఠించ బడింది. లోచనవిషయమ్ = నేత్రగోచరత్వమును, భజతా = పొందిన, త్వయా = నీచేత, చరమమ్ = తరవాత అధిష్ఠించబడింది.

నాయకుణ్ణి చూచినతరవాతనే మన్మథబాణం హృదయంలో ప్రవేశించినా చూడకముందే ప్రవేశించింది అని కారణంకంటె కార్యంముందు జరిగినట్లు వర్ణించ బడింది. కారణమైన నాయకదర్శనం అతిశీఘ్రంగా నాయిక హృదయంలో అను రాగం అనే కార్యాన్ని పుట్టించిన దని చెప్పడం ఉద్దేశ్యం. ఇది కార్యకారణాల క్రమం తారుమారు అవడంచేత ఏర్పడిన అతిశయోక్త్యలంకారానికి ఉదాహరణం.

## 13. ప్రతివస్తూపమాలంకారం

కా. ప్రతివస్తూపమా తు సా. 101

సామాన్యస్య ద్విరేకస్య యత్ర వాక్యద్వయే స్థితిః.

వృ. సాధారణో ధర్మః ఉపమేయవాక్యే ఉపమానవాక్యే చ, కథితపదస్య దుష్టతయా అభిహిత్వాత్, శబ్దభేదేన యత్ ఉపాదీయతే సా వస్తునో వాక్యార్థస్య ఉపమానత్వాత్ ప్రతివస్తూపమా. యథా-

శ్లో॥ దేవీభావం గమితా పరివారపదం కథం భజత్వేషా,
న ఖలు పరిభోగయోగ్యం దైవతరూపాఙ్కితం రత్నమ్.

వ్యా. ప్రతీతి :- యత్ర = ఎక్కడ, ఏకస్య సామాన్యస్య = ఒక సాధా రణధర్మానికి, ద్విః = రెండు పర్యాయాలు, వాక్యద్వయే = రెండు వాక్యాలలో, స్థితిః = ఉండుటయో, అక్కడ, ప్రతివస్తూపమా = ప్రతివస్తూపమాలంకారం.

సాధారణ ఇతి:- కథితపదం దుష్టం అని చెప్పడంవల్ల ఒకే సాధారణ ధర్మం, ఉపమేయమైన వాక్యం, ఉపమానమైన వాక్యం అయిన రెండు వాక్యాలలో, రెండు వేరు వేరు పదాలచేత గ్రహింపబడినప్పుడు అది, వస్తువు, అనగా వాక్యార్థం, ఉపమానం అవడం వల్ల 'ప్రతివస్తూపమ'.

వి. రెండు వాక్యాలలో ఒకే సామాన్యధర్మం రెండు మాట్లు చెప్పినట్లయితే అది ప్రతివస్తూపమ. ప్రయోగించిన పదాన్నే మళ్ళీ ప్రయోగించడం (కథిత పదత్వం) దోషం కనుక సామాన్యధర్మాన్ని సమానార్థకాలైన రెండు పదాలచేత రెండు వాక్యాలలో చెప్పాలి. ఈ రెండు వాక్యాలలో ఒకటి ఉపమేయవాక్యం, రెండవది ఉపమానవాక్యం. వస్తువు అనగా వాక్యార్థం. ఈ అలంకారంలో ఒక వాక్యార్థం ఉపమానంగా ఉంటుంది. (మరొకటి ఉపమేయంగా ఉంటుంది). అందు చేత దీనికి 'ప్రతివస్తూపమ' అని పేరు. ఎట్లనగా-

దేవీతి :- దేవీభావమ్ = దేవీత్వాన్ని, గమితా = పొందించబడిన, ఏషా = ఈమె, పరివారపదమ్ = పరివారస్థానాన్ని, కథమ్ = ఎట్లు, భజతు = పొందవలెను. దైవతరూపాఙ్కితమ్ = దేవతారూపంతో చిహ్నితమైన, రత్నమ్ = రత్నము, పరిభోగయోగ్యమ్ = అనుభవించడానికి యోగ్యం, న ఖలు = కాదు కదా?

వి. ఇక్కడ 'కథం భజతు' అనే మాట పరివారపదాన్ని పొందడం అనుచితం అని తెలుపుతున్నది. 'న ఖలు' అనేది పరిభోగం అనుచితం అని తెలుపుతున్నది. ఈ విధంగా అనౌచిత్యరూపమైన ఒకే సామాన్యం రెండు శబ్దాల చేత రెండు వాక్యాలలో రెండు మార్లు గ్రహించబడింది. పూర్వవాక్యం ఉపమేయం. ఉత్తరవాక్యం ఉపమానం. దేవతారూపచిహ్నితమైన రత్నానికి పరిభోగ యోగ్యత్వం ఎలా అనుచితమో దేవికి పరివారపదయోగ్యత్వం అదే విధంగా అనుచితం అని ఔపమ్యం తెలుస్తూన్నది. అందుచేత ఇది ప్రతివస్తూపమాలంకారం.

అవ. మాలారూపప్రతివస్తూపమను ఉదాహరిస్తున్నాడు-

శ్లో॥ "యది దహత్యనలోఽత్ర కిమద్భుతం
యది చ గౌరవమద్రిషు కిం తతః,
లవణమమ్బు సదైవ మహోదధేః
ప్రకృతిరేవ సతామవిషాదితా". 454

వృ. ఇత్యాదికా మాలా ప్రతివస్తూపమా ద్రష్టవ్యా. ఏవమన్యత్రా ప్యనుసర్తవ్యమ్.

వ్యా. యదీతి:- ఇది సప్తమోల్లాసంలో 272వ శ్లోకంగా వచ్చినది.

వి. "స్వాభావికములైన కార్యాలు ఆశ్చర్యజనకాలు కావు" అనే సాధారణ ధర్మం శబ్దభేదంచేత నిర్దేశించబడింది. "అగ్న్యాదుల దాహకత్వాదికం స్వాభావికం అవడంచేత ఎలా ఆశ్చర్యకరం కాదో సత్పురుషులు విషాదరహితులుగా ఉండడం కూడా స్వాభావికమే అవడంచేత ఆశ్చర్యకరం కాదు" అని ఉపమానోపమేయ భావంలో పర్యవసానం. 'కిమద్భుతమ్' 'కిం తతః' 'సదైవ' 'ప్రకృతిరేవ' అనే వేరు వేరు శబ్దాలతో ఆశ్చర్యం లేకపోవడం అనే సామాన్యధర్మాన్ని నాలుగు వాక్యాలలో చెప్పడంచేత మాలారూపప్రతివస్తూపమ. ఈ విషయమే చెపుతున్నాడు-

ఇత్యాదికా ఇతి :- ఈ మొదలైనది మాలా ప్రతివస్తూపమ అని చూచు కొనవలెను. ఈ విధంగా మరొక చోట కూడ అనుసరింపవలెను. అనగా 'దేవీ భావమ్' ఇత్యాద్యుదాహరణలలో సాధర్మ్యరూపంలో ఉన్నట్లే కొన్ని స్థలాలలో ఈ అలంకారం వైధర్మ్యరూపంలో కూడా ఉండవచ్చును అని అర్థం. వైధర్మ్య స్థలంలో ప్రతివస్తూపమకు రాజశేఖరుని బాలరామాయణంలోని-

> "చకోర్య ఏవ చతురాశ్చన్ద్రికాపానకర్మణి,
> వినావన్తీర్న నిపుణాః సుదృశో రతకర్మణి"

అనే శ్లోకం ఉదాహరణం. "వెన్నెల త్రాగడంలో ఆడచకోరపక్షులే నేర్పుగలవి. అవంతిదేశస్త్రీలు తప్ప ఇతరస్త్రీలు రతికర్మయందు నైపుణ్యం కలవారు కారు" అని అర్థం. ఇక్కడ వైధర్మ్యాన్ని 'అవంతీస్త్రీలే నేర్పుగలవారు' అని సాధర్మ్యం లోనికి మార్చుకుంటే ప్రతివస్తూపమ.

## 14. దృష్టాంతాలంకారం

కా. దృష్టాన్తః పునరేతేషాం సర్వేషాం ప్రతిబిమ్బనమ్. 102

వృ. ఏతేషాం సాధారణధర్మాదీనామ్. దృష్టోఽన్తః నిశ్చయః యత్ర స దృష్టాన్తః.

శ్లో॥ త్వయి దృష్టే ఏవ తస్యా నిర్వాతి మనో మనోభవజ్వలితమ్,
ఆలోకే హి హిమాంశోర్వికసతి కుసుమం కుముద్వత్యాః.

వృ. ఏష సాధర్మ్యేణ. వైధర్మ్యేణ తు-

శ్లో॥ తవాహవే సాహసకర్మశర్మణః
కరం కృపాణాన్తికమానినీషతః,
భటాః పరేషాం విశరారుతామగుః
దధత్యవాతే స్థిరతాం హి పాంసవః. 456

వ్యా. దృష్టాన్త ఇతి :- వెనుకటి కారికనుంచి 'వాక్యద్వయే' అనే పదం అనువర్తిస్తుంది. వాక్యద్వయంలో, ఏతేషామ్=ఈ, సర్వేషామ్=అన్నింటి యొక్క, అనగా ఉపమానోపమేయసాధారణధర్మాలయొక్క, ప్రతిబిమ్బనం పునః =ప్రతిబింబించడం అయితే, దృష్టాన్తః=దృష్టాంతాలంకారం.

ఏతేషామితి :- 'ఏతేషామ్' అనగా సాధారణధర్మాదులయొక్క. "దృష్టః అన్తః నిశ్చయః యత్ర సః" అనే విగ్రహంచేత దేనియందు నిశ్చయం చూడబడిందో అది దృష్టాంతం.

వి. బయట ఉన్న ముఖం బింబం; అద్దంలో కనబడేది ప్రతిబింబం. ఈ రెండూ వేరు అయినా పరస్పరసాదృశ్యాన్ని పట్టి అవి రెండూ ఒకటే అన్న ప్రతీతి కలుగుతుంది. అదే విధంగా రెండు వాక్యాలలో వేరువేరు ఉపమాన-ఉపమేయ-సాధారణధర్మాలను కూర్చినప్పుడు ఆ కూర్చిన తీరును పట్టి ఈ సాధారణ ధర్మం ఆ సాధారణధర్మం కూడా ఒక్కటా అన్న ప్రతీతి కలుగుతుంది. ప్రతివస్తూపమాలంకారంలో రెండు వాక్యాలలోను చెప్పిన సాధారణధర్మం ఒకటే; మాటలు మాత్రమే వేరు. దృష్టాంతాలంకారంలో సాధారణధర్మాలూ వేరే, మాటలూ వేరే,"ఏకస్యార్థస్య శబ్దద్వయేనాభిధానం వస్తుప్రతివస్తుభావః; ద్వయోరర్థయోః ద్విః ఉపాదానం బిమ్బప్రతిబిమ్బభావః" అని విద్యానాథుడు ప్రతాపరుద్రీయంలో చెప్పి ఉన్నాడు. "ఒకే విషయాన్ని రెండు శబ్దాలలో చెప్పడం వస్తుప్రతివస్తుభావం; రెండు విషయాలను రెండు మార్లు చెప్పడం బింబప్రతిబింబభావం" అని దీని అర్థం. "వస్తుతో భిన్నయోరప్యుపమానోపమేయధర్మయోః పరస్పరసాదృశ్యాద

భిన్నయోః పృథగుపాదానం బిమ్బప్రతిబిమ్బభావః' అని అప్పయదీక్షితులు చెప్పి నాడు. "నిజానికి వేరు వేరే అయినా పరస్పరం పోలిక ఉండడంచేత అభిన్నాలైన (అభిన్నాలు వలె కనబడుతున్న) ఉపమానోపమేయధర్మాలను వేరు వేరుగా చెప్పడం బింబప్రతిబింబభావం" అని దీని అర్థం.

ఒక విషయాన్ని చెప్పి అది అంతే అని ధ్రువీకరించడానికి మరొక విషయం ఉదాహరణగా చెప్పబడుతుంది. ఉదాహరణగా చెప్పబడేది దృష్టాంతం. మొదటి విషయం దార్ష్టాంతికం.'అంత' శబ్దానికి నిశ్చయం అని అర్థం. "దృష్టః అంతః యస్మిన్ ఇది దృష్టాన్తః" దేనియందు అనగా దేనిని పట్టి దార్ష్టాంతికం నిశ్చయించబడుతుందో అది దృష్టాంతం అని అర్థం. దీనికి ఉదాహరణం-

వ్యా. త్వయీతి :- త్వయి = నీవు, దృష్టే ఏవ = చూడబడగానే, తస్యాః = ఆమెయొక్క, మనోభవజ్వలితమ్ = మన్మథునిచేత ప్రజ్వలింపచేయబడిన, మనః = మనస్సు, నిర్వాతి = శాంతిస్తుంది. హిమాంశోః = చంద్రునియొక్క, ఆలోకే = దర్శనము కలగగానే, కుముద్వత్యాః = కలువతీగయొక్క, కుసుమమ్ = పుష్పం, వికసతి హి = వికసిస్తుంది కదా?

వి. ఇక్కడ నృప-చంద్రులకు, నాయికా-కుముద్వతులకు, మనః-కుసుమాలకు, మనోభవజ్వలిత-సూర్యకిరణజ్వలితాలకూ, నిర్వాణ-వికాసాలకు బింబప్రతిబింబభావం. ఉపమేయవాక్యంలో చెప్పిన నాయకాదుల ప్రతిబింబాలు లాగ ఉపమానవాక్యంలోని చంద్రాదులు ఉన్నాయి. అందుచేత ఇది దృష్టాంతాలంకారం. ఇది సాధర్మ్యంచేత (పోలికనుపట్టి) ఏర్పడిన దృష్టాంతం. ఇది వైధర్మ్యంచేత కూడా, అనగా విరుద్ధధర్మాన్ని పట్టి కూడా ఉంటుంది. ఉదాహరణం.

వ్యా. తవేతి :- ఆహవే = యుద్ధమునందు, సాహసకర్మశర్మణః = సాహసకృత్యములయందు సుఖం గలవాడవు, కరమ్ = హస్తమును, కృపాణాన్తికమ్ = ఖడ్గసమీపమును, ఆనినీషతః = పొందించదలచుచున్నవాడవూ అయిన, తవ = నీయొక్క, పరేషామ్ = శత్రువులయొక్క, భటాః = భటులు, విశరారుతామ్ = విడిపోవడాన్ని, (పారిపోవడాన్ని). అగుః = పొందిరి, పాంసవః = పరాగాలు, అవాతే = వాయువు లేని ప్రదేశమునందు మాత్రమే, స్థిరతామ్ = స్థిరత్వమును, దధతి హి = ధరిస్తాయికదా! ఇక్కడ పారిపోవడం, స్థిరంగా ఉండడం అనే విరుద్ధధర్మాలు వర్ణించబడ్డాయి. నిన్ను చూడగానే భటులు పారిపోతారు.

గాలిరాగానే దూళి ఎగిరిపోతుంది అనే సాధర్మ్యం పర్యవసితం అవుతుంది.అప్పుడు భటులకు పాంసువులకు, రాజుకు, వాయువుకు, పారిపోవడానికి ఎగిరిపోవడానికి బింబప్రతిబింబభావం ఏర్పడుతుంది. అందుచేత దృష్టాంతాలంకారం.

## 15. దీపకాలంకారం

కా. సకృద్వృత్తిస్తు ధర్మస్య ప్రకృతాప్రకృతాత్మనామ్,
సైవ క్రియాసు బహ్వీషు కారకస్యేతి దీపకమ్. 103

వృ. ప్రాకరణికాప్రాకరణికానామ్, అర్థాత్ ఉపమానోపమేయానాం ధర్మః క్రియాదిః ఏకవారమేవ యదుపాదీయతే తత్ ఏకస్థస్యైవ సమస్తవాక్యదీపనాత్ దీపకమ్. యథా-

గాథ. కివణాణం ధణం ణాఅణం ఫణమణీ కేశరాఇం సీహాణం,
కులబాలిఆణం త్థణఅ కుత్తో చ్ఛిప్పన్తి అముఆణం. 457

"కృపణానాం ధనం నాగానాం ఫణమణిః కేసరాః సింహానామ్,
కులబాలికానాం స్తనాః కుతః స్పృశ్యన్తే ఽమృతనామ్".

వ్యా. సకృదితి :- ప్రకృతాప్రకృతాత్మనామ్ = ప్రకృత-అప్రకృత స్వరూపం గల ధర్ములయొక్క, అనగా ఉపమేయోపమానాలయొక్క, ధర్మస్య= ధర్మంయొక్క, సకృద్వృత్తిః = ఒక్క పర్యాయం చెప్పడం, అనగా ఉపమేయోపమానాలు రెండింటికీ సంబంధించిన క్రియాగుణాదిధర్మాన్ని ఒక్కమారు పేర్కొనడం, దీపకమ్ = దీపకాలంకారం. (ఇది క్రియాదీపకం అనే మొదటి భేదం). బహ్వీషు = అనేకములైన, క్రియాసు = క్రియలయందు. కారకస్య = కారకం యొక్క, సైవ = ఆ సకృద్వృత్తియే, (రెండవ దీపకం).

ప్రాకరణికేతి :- ప్రాకరణికాప్రాకరణికాలకు అనగా ఉపమేయోపమానాలకు సంబంధించిన క్రియాదిధర్మం ఒక్కమారే చెప్పినప్పుడు అది (ఆ ధర్మం) సమస్తవాక్యాన్ని ప్రకాశింపచేస్తుంది కాబట్టి దీపకం అనే (సార్థకనామం గల) అలంకారం. ఎట్లనగా-

కృపణానామితి :- అమృతానామ్=జీవించి ఉన్న, కృపణానామ్=లుబ్ధుల యొక్క, ధనమ్ = ధనమూ, నాగానామ్ = సర్పాలయొక్క, ఫణమణిః = పడగ మీద ఉన్న మణీ, సింహానామ్ = సింహాలయొక్క, కేసరాః = జూలు, కులబాలికానామ్ = కులబాలికలయొక్క, స్తనాః=స్తనాలూ, కుతః = ఎట్లు, స్పృశ్యన్తే = = స్పృశించబడతాయి? వాళ్ళు జీవించి ఉండగా వీటిని ముట్టడం కష్టం అని భావం.

ఈ అలంకారంలో చెప్పినవాటిలో ఒకటి ప్రకృతం అయి ఉంటుంది. మిగిలినవి అప్రకృతాలు. ప్రకృతం ఉపమేయం; అప్రకృతాలు ఉపమానాలు, కులస్త్రీస్తనాలు ప్రకృతా లని గ్రహిస్తే కృపణధనాదులు అప్రకృతాలు. ఈ ప్రకృతాప్రకృతాలకు సంబంధించే టట్లు 'స్పర్శన' రూపక్రియ ఒక్క మారే చెప్ప బడింది. అందుచేత ఇది క్రియాదీపకానికి ఉదాహరణం. కృపణధనాదులను స్పృశించడం ఏ విధంగా అసంభావ్యమో కులకాంతాకుచస్పర్శ అంత అసంభావ్యం అని ఉపమ ప్రతీయమానం అవుతుంది. ఈ విధంగా ప్రతివస్తూపమా-దృష్టాంత-దీపక-తుల్యయోగితాద్యలంకారాలు ఉపమాగర్భాలుగా ఉంటాయి.

వృ. కారకస్య చ బహ్వీషు క్రియాసు సకృద్వృత్తిః దీపకమ్. యథా-

శ్లో॥ స్విద్యతి కూణతి వేల్లతి విచలతి నిమిషతి విలోకయతి తిర్యక్,
అన్తర్నన్దతి చుమ్బితుమిచ్ఛతి నవపరిణయా వధూః శయనే.

కారకస్యేతి :- అనేక క్రియలలో ఒక కారకం ఒకే పర్యాయం ఉండడం మరొక దీపకం. "కర్తా కర్మ చ కరణం సంప్రదానం తథైవ చ. అపాదానాధి కరణమిత్యాహుః కారకాణి షట్" అని చెప్పిన ఆరు కారకాలలో ఏదైన ఒకటి అనేకక్రియలతో సంబంధించి ఉన్నట్లు చెప్పడం అని అర్థం. ఎట్లనగా-

స్విద్యతీతి :- నవపరిణయా = నూతనవివాహం గల, వధూః = నాయిక, శయనే = శయ్యమీద, స్విద్యతి = చెమట కారుస్తున్నది. కూణతి = అవయవాలు ముణుచుకొంటూన్నది. వేల్లతి= మెలికలు తిరుగుతున్నది. విచలతి = ఆ మూలకు, ఈ మూలకు తిరుగుతున్నది. నిమిషతి = కళ్ళుమూసుకుంటూన్నది. తిర్యక్ =

అడ్డంగా, విలోకయతి=చూస్తున్నది, అన్తః=లోలోన, నన్దతి=సంతోషిస్తూన్నది. చుమ్బితుమ్ = చుంబించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నది.

ఇక్కడ అనేకక్రియలకు సంబంధించిన 'వధూః' అనే కర్తృకారకమూ, 'శయనే' అనే అధికరణకారకమూ ఒకే మారు గ్రహించబడ్డాయి. అందుచేత ఇది క్రియాదీపకం

అప. మాలాదీపకాన్ని నిరూపిస్తున్నాడు-

కా. మాలాదీపకమాద్యం చేద్యథోత్తరగుణావహమ్.

వృ. పూర్వేణ పూర్వేణ వస్తునా ఉత్తరముత్తరం చేదుపక్రియతే తత్ మాలాదీపకమ్. యథా.

శ్లో॥ సంగ్రామాఙ్గణమాగతేన భవతా చాపే సమారోపితే
దేవాకర్ణయ యేన యేన సహసా యద్యత్సమాసాదితమ్,
కోదణ్డేన శరాః శరై రరిశిరస్తేనాపి భూమణ్డలం
తేన త్వం భవతా చ కీర్తిరతులా కీర్త్యా చ లోకత్రయమ్.

వ్యా. మాలేతి :- ఆద్యమ్ = మొదట చెప్పబడినది, ఉత్తరోత్తరగుణావహం చేత్ = తరవాత చెప్పబడేవాటి గుణమును కూర్చేది అయితే, మాలాదీపకమ్ = మాలాదీపకాలంకారం.

పూర్వేణేతి :- పూర్వపూర్వవస్తువుచేత, ఉత్తరోత్తరవస్తువుకు ఉపకారం జరిగినట్లు, ఏదో విశేషం లభించి నట్లు, వర్ణిస్తే అది మాలాదీపకం. ఎట్లనగా-

సంగ్రామేతి :- (వ్యాఖ్యానానికి 229వ శ్లోకం చూడుడు). ఇక్కడ ఒక్క ఆసాదనక్రియ కోదండాదులతో సంబంధించినది. అందుచేత దీపకాలంకారం. శత్రుశిరస్సులమీదికి పంపడం ద్వారా కోదండం శరాలకు ఉపకరించింది. భూమండలాన్ని పొందించడం ద్వారా శత్రుశిరస్సుకు శరాలు ఉపకరించాయి. అరిశిరస్సు నీవంటి నాయకుణ్ణి ఇవ్వడం ద్వారా భూమండలానికి ఉపకరించింది. భూమండలం కీర్తిని పొందించడం ద్వారా రాజుకు ఉపకరించింది. రాజు మూడు

లోకాలలో వ్యాపింపచేయడం ద్వారా కీర్తికి ఉపకరించాడు. ఈ విధంగా పూర్వ పూర్వం ఉత్తరోత్తరోపకారకంగా ఉండడంచేత మాలాదీపకం.

## 16. తుల్యయోగితాలంకారం

కా. నియతానాం సకృద్ధర్మః సా పునస్తుల్యయోగితా. 104

వృ. నియతానాం ప్రాకరణికానామేవ అప్రాకరణికానామేవ వా. క్రమేణోదాహరణమ్-

శ్లో॥ పాణ్డు క్షామం వదనం సరసం తవాలసం చ వపుః,
ఆవేదయతి నితాన్తం క్షేత్రియరోగం సఖి హృదన్తః. 460

శ్లో॥ కుముదకమలనీలనీరజాలి
ర్లలితవిలాసజుషోర్దృశోః పురః కా,
అమృతమమృతరశ్మిరమ్బుజన్మ
ప్రతిహతమేకపదే తవాననస్య. 461

వ్యా. నియతేతి:- నియతానామ్=కేవలప్రకృతముల యొక్క గాని కేవల అప్రకృతములయొక్క గాని, ధర్మః=ధర్మం, సకృత్=ఒక్కమారు, గ్రహించబడినట్లయితే, సా పునః=అది అయితే, తుల్యయోగితా=తుల్యయోగితాలంకారం.

నియతానామితి:- 'నియతానామ్' అనగా ప్రాకరణికములే కాని, అప్రాకరణికములే కాని అయినవాటి యొక్క అని అర్థం. క్రమంగా ఉదాహరణం.

పాణ్డు ఇతి:- (ఇది వెనుక 332వ పద్యంగా వచ్చినది). ఇక్కడ పాండుత్వం మొదలైనవి అన్నీ విరహానికి అనుభావాలుగా ప్రకృతాలే. వాటికి సంబంధించిన ఆవేదనం (తెలపడం) అనే క్రియ ఒక్కమారే చెప్పబడింది. అందుచేత ప్రాకరణికాలకు సంబంధించిన ధర్మం ఒక్క మారు చెప్పడం అనే తుల్యయోగితా ప్రథమభేదం.

అవ. అన్నీ అప్రాకరణికాలే ఉన్న తుల్యయోగితకు ఉదాహరణం చూపుతున్నాడు-

కుముదేతి:- ఒక నాయకుడు నాయికతో అంటున్నాడు-లలితవిలాసజుషోః = సుందరమైన విలాసను పొందిన, దృశోః = నీ నేత్రముల, పురః = ఎదుట, కుముదకమలనీలనీరజాలిః = కలువలయొక్క, పద్మములయొక్క, నల్లని కమలాలయొక్కా, పంక్తి, కా = ఏమి? తవ ఆననస్య = నీ ముఖము ఎదుట, అమృతమ్ = అమృతము, అమృతరశ్మిః = చంద్రుడు, అమ్బుజన్మ = పద్మము, ఏకపదే = ఒక్కపదంలో (ఒక్కదెబ్బలో), ప్రతిహతమ్ = కొట్టబడింది.

వి. ఇక్కడ పూర్వార్ధంలో కామినీనయనాలు ప్రకృతాలు. కుముదాదులన్నీ అప్రకృతాలు. ఆ కుముదాదులకు సంబంధించిన 'కా'పదవ్యంగ్యమైన అధిక్షేపం, అనగా తిరస్కారం, చెప్పబడింది. ఉత్తరార్ధంలో అప్రకృతాలైన అమృతాదుల ఒక ధర్మంగా ప్రతిహతత్వం చెప్పబడింది. అందుచేత ఇది కేవలం అప్రకృతాలే ఉన్న తుల్యయోగితాలంకారం.

## 17. వ్యతిరేకాలంకారం.

కా. ఉపమానాద్యదన్యస్య వ్యతిరేకః స ఏవ సః,

వృ. అన్యస్య ఉపమేయస్య వ్యతిరేకః ఆధిక్యమ్.

శ్లో॥ క్షీణః క్షీణోఽపి శశీ భూయో భూయోఽభివర్ధతే సత్యమ్,
విరమ ప్రసీద సున్దరి యౌవనమనివర్తి యాతం తు. 462

ఇత్యాదౌ ఉపమానస్యోపమేయాదాధిక్యమితి కేనచిదుక్తమ్. తదయుక్తమ్, అత్ర యౌవనగతాస్థైర్యాధికం హి వివక్షితమ్.

వ్యా. ఉపమానాదితి:- ఉపమానాత్ = ఉపమానంకంటె, అన్యస్య = ఉపమేయం యొక్క, యత్ వ్యతిరేకః = అధిక్యం అనేది ఏది ఉన్నదో, సః = ఆ వ్యతిరేకం, స ఏవ = ఆ వ్యతిరేకాలంకారమే.

అన్యస్యేతి:- అన్యముయొక్క అనగా ఉపమేయం యొక్క, వ్యతిరేకం అనగా ఆధిక్యం.

వి. సాధారణంగా ఉపమేయంకంటె ఏదో కొంత ఆధిక్యం ఉన్నదానినే

ఉపమానంగా చెపుతారు. అలా కాకుండా ఉపమానం కంటె ఉపమేయమే అధికం అని చెప్పినట్లయితే అది వ్యతిరేకాలంకారం. కాని కొందరు ప్రాచీనాలంకారికులు ఉపమేయంకంటె ఉపమానం గొప్పది అని చెప్పడం కూడా వ్యతిరేకాలంకారమే అని చెప్పి దానికి 'క్షీణః క్షీణోఽపి' ఇత్యాదిశ్లోకం ఉదాహరణంగా ఇచ్చారు.

క్షీణః ఇతి:- శశీ = చంద్రుడు, క్షీణః క్షీణః అపి = క్షీణించినా, భూయో భూయః = మాటిమాటికీ, వివర్ధతే = వృద్ధిపొందును. సత్యమ్ = నిజమే. సున్దరి = ఓ! సుందరీ, విరమ = విరమించుము. ప్రసీద = అనుగ్రహించుము. యాతమ్ = వెళ్ళిపోయిన, యౌవనం తు = యౌవనమైతే, అనివర్తి = మరలి రానిది.

అవ. ఈ శ్లోకంలో ఉపమేయమైన వెళ్ళిపోతే మరలిరాని యౌవనం కంటె, ఉపమానమైన క్షీణించినా తిరిగి వృద్ధి పొందే చంద్రునిలో వైశిష్ట్యం ఉన్నట్లు చెప్పబడింది. అందుచేత ఇది ఉపమానాధిక్యవర్ణనరూపమైన వ్యతిరేకాలంకారం అని వాళ్ళ అభిప్రాయం. అది యుక్తం కాదని చెపుతున్నాడు-

ఇత్యాదావితి:- ఇత్యాదులలో ('క్షీణః క్షీణోఽపి' ఇత్యాదులలో) ఉపమేయం కంటె ఉపమానానికి ఆధిక్యం ఉన్నది అని ఒకడు అన్నాడు. అది యుక్తం కాదు. ఇక్కడ యౌవనంలో ఉన్న అస్థైర్యం యొక్క ఆధిక్యమే చెప్పదలచిన విషయం. అందుచేత ఉపమేయాధిక్యమే కాని ఉపమానాధిక్యం కాదు అని భావం.

వి. ఈ విధంగా చెప్పిన ప్రాచీనాలంకారికుడు అలంకారసర్వస్వకర్త అయిన రుయ్యకుడని వ్యాఖ్యాతలు వ్రాసినారు. కాని రుయ్యకుడు మమ్మటునికంటె అర్వాచీనుడని అనడానికి ఆధారాలు ఉన్నాయి. అందుచేత రుయ్యకుడు కూడా ఈ విషయం చెప్పినా మమ్మటుడు నిర్దేశించిన వ్యక్తి అతడు అవడానికి వీలులేదు. అతిప్రాచీన వ్యాఖ్యాత అయిన మాణిక్యచంద్రుడు-"కేనచిదితి-రుద్రటేన" అని వ్రాసినాడు. దీనిని పట్టి ఇక్కడ మమ్మటుడు కావ్యాలంకారం సప్తమాధ్యాయం 89, 90 శ్లోకాలలో చెప్పిన దానిని నిర్దేశిస్తున్నాడని చెప్పాలి.

అవ. వ్యతిరేకాలంకారానికి సంబంధించిన ఇరవైనాల్గు భేదాలు వివరిస్తున్నాడు-

కా. హేత్వోరుక్తావనుక్తీనాం త్రయే సామ్యే నివేదితే 105<br>
శబ్దార్థాభ్యామథాక్షిప్తే శ్లిష్టే తద్వత్త్రిరష్ట తత్.

వృ. వ్యతిరేకస్య హేతుః ఉపమేయగతముత్కర్షనిమిత్తమ్, ఉపమానగతమపకర్షకారణమ్, తయోర్ద్వయోరుక్తిః, ఏకతరస్య, ద్వయోర్వా అనుక్తిరిత్యనుక్తిత్రయమ్; ఏతద్భేదచతుష్టయముపమానోపమేయభావే శబ్దేన ప్రతిపాదితే, ఆర్థేన చ క్రమేణోక్తాః చత్వార ఏవ భేదాః. ఆక్షిప్తే చౌపమ్యే తావన్త ఏవ.ఏవం ద్వాదశ.ఏతే శ్లేషేఽపి భవన్తీతి చతుర్వింశతి భేదాః. క్రమేణోదాహరణమ్.

హేత్వోః ఇతి:- హేత్వోః = రెండు హేతువులయొక్క, ఉక్తౌ = చెప్పుట యందు, అనుక్తీనామ్ = చెప్పకపోవడాలయొక్క, త్రయే = త్రయమునందు, సామ్యే = సామ్యము, శబ్దార్థాభ్యామ్ = శబ్దార్థాలచేత, నివేదితే = తెలుపబడిందగు చుండగా, అథ = లేక, ఆక్షిప్తే = ఆక్షిప్తం అయిన దగుచుండగా, తద్వత్ = అదే విధంగా, శ్లిష్టే = శ్లిష్టం కాగా, తత్ = ఆ కారణంవలన, త్రిః = మూడు రెట్లైన, అష్ట = ఎనిమిది, అనగా ఇరవైనాలుగు భేదాలు.

వ్యతిరేక స్యేతి:- ఉపమేయంలో ఉన్న ఉత్కర్షకు నిమిత్తము, ఉపమానంలో ఉన్న అపకర్షకు నిమిత్తము-ఇవి వ్యతిరేకానికి హేతువులు. ఈ రెండింటినీ కూడ చెప్పినట్లయితే అదొక భేదం. వీటిలో ఒకదానిని, అనగా ఉపమేయోత్కర్ష నిమిత్తాన్ని గాని ఉపమానగతాపకర్షనిమిత్తాన్ని కాని చెప్పకపోవడం.లేదా రెండింటినీ కూడా చెప్పకపోవడం అనే చెప్పకపోవడాలు మూడు; నాలుగు భేదా లయ్యాయి. ఉపమానోపమేయభావాన్ని శబ్దంచేత ప్రతిపాదించినా అర్థంచేత, అనగా తుల్యాది శబ్దాలచేత ప్రతిపాదించినా క్రమంగా పైన చెప్పిన భేదాలే నాలుగు శబ్దప్రతిపాదితౌపమ గల భేదాలు గాను,నాలుగు అర్థప్రతిపాదితభేదాలు గాను అయి మొత్తం ఎనిమిది భేదాలుఅవుతాయి. పైన చెప్పిన నాలుగు భేదాలలో ఔపమ్యం ఆక్షిప్తం కావచ్చు; ఊహించబడవచ్చు. అప్పుడు పై ఎనిమిది భేదాలు, ఈ నాలుగు భేదాలు కలిసి మొత్తం పన్నెండు భేదాలు అవుతాయి. ఈ పన్నెండు భేదాలూ శ్లేషలో కూడా ఉంటాయి. అందుచేత మొత్తం ఇరవైనాలుగు భేదాలు. క్రమంగా ఉదాహరణలు-

అవ. అశ్లిష్టభేదాలలో హేతువులు రెండూ చెప్పిన, శాబ్ద సామ్యం ఉన్న, వ్యతిరేకానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అసిమాత్రసహాయస్య ప్రభూతారిపరాభవే,
అన్యతుచ్ఛజనస్యేవ న స్మయో௨స్య మహాధృతేః. 463

వృ. అత్రైవ తుచ్ఛేతి-మహాధృతేరిత్యనయోః పర్యాయేణ యుగపద్వా అనుపాదానే అన్యత్ భేదత్రయమ్. ఏవమన్యేష్వపి ద్రష్టవ్యమ్. అత్ర ఇవశబ్దస్య సద్భావాత్ శాబ్దమ్ ఔపమ్యమ్.

వ్యా. అసీతి:- మహాధృతేః = గొప్ప ధైర్యం కలవాడు, అసిమాత్రసహాయస్య = ఖడ్గంమాత్రమే సహాయంగా కలవాడు అయిన, అస్య = ఈవీరునకు, ప్రభూతారిపరాభవే = చాలమంది శత్రువుల పరాభవంలో కూడ,(వాళ్ళను జయించినా కూడ) అన్యతుచ్ఛజనస్యేవ = ఇతరులైన తుచ్ఛజనులకు వలె, స్మయః = గర్వం, న = లేదు.

వి. ఇక్కడ రాజు ఉపమేయం, ఇతరరాజులు ఉపమానం, అరిపరాభవం సమానధర్మం, మహాధృతిత్వం ఉపమేయోత్కర్షహేతువు. తుచ్ఛత్వం ఉపమానాపకర్షహేతువు. ఈ విధంగా రెండు హేతువులూ చెప్పబడ్డాయి. 'ఇవ' అనేది ఉండడంచేత ఔపమ్యం శాబ్దం. శ్లేష లేదు. ఈ విధంగా వ్యతిరేకాలంకార ప్రథమభేదానికి ఉదాహరణం.

అత్రేతి:- ఈ శ్లోకంలోనే 'తుచ్ఛ' శబ్దాన్ని, 'మహాధృతేః', అనే పదాన్ని పర్యాయంచేత గాని, రెండింటిని కలిపి గాని తీసివేస్తే మిగిలిన మూడు భేదాంకి ఉదాహరణం అవుతుంది. ఈ విధంగానే చెప్పబోయే ఉదాహరణలలో కూడా చూచుకోవాలి. ఇక్కడ 'ఇవ' శబ్దం ఉంది కాబట్టి ఔపమ్యం శాబ్దం.

ఈ శ్లోకంలో తుచ్ఛశబ్దాన్ని తీసి చదివితే అప్పుడది ఉపమానగతాపకర్ష చెప్పని రెండవ వ్యతిరేకం అవుతుంది. 'మహాధృతేః'అనే పదం తీసివేస్తే అది ఉపమేయగతోత్కర్ష చెప్పని మూడవ వ్యతిరేకభేదం అవుతుంది. ఈ రెండూ తీసివేస్తే రెండూ చెప్పని నాల్గవ వ్యతిరేకభేదం అవుతుంది.

శ్లో॥ అసిమాత్రసహాయో௨పి ప్రభూతారిపరాభవే,
నైవాన్యతుచ్ఛజనవత్సగర్వోయం మహాధృతిః 464

వృ. ఇతి తుల్యార్థే వతిరిత్యార్థమౌపమ్యమ్.

వ్యా. అసీతి:- మహాధృతిః = గొప్ప ధైర్యం గల, అయమ్ = ఈరాజు, ప్రభూతారివరాభవే = అనేకులైన శత్రువులను ఓడించడంలో, అసిమాత్ర సహాయోఽపి = ఖడ్గంమాత్రమే సహాయం కలవాడైనా, అన్యతుచ్ఛజనవత్ = ఇతర తుచ్ఛజనులతో సమానంగా, సగర్వః = గర్వంతో కూడినవాడు, న = కాడు.

ఇతీతి:- ఈ విధంగా మార్చినప్పుడు తుల్యార్థంలో "తేన తుల్యం క్రియా చేద్వతిః" అనే సూత్రంచేత వతిప్రత్యయం వచ్చింది కాబట్టి ఔపమ్యం అర్థాత్ సిద్ధించింది.

వి. పైన చెప్పినట్లు 'తుచ్ఛ' 'మహాధృతి' శబ్దాలలో ఒక్కొక్కటి తీసి వేయగా, రెండూ తీసివేయగా ఉపమానాపకర్షవాచకలోప-ఉపమేయోత్కర్ష వాచకలోప-ఉభయలోపాలచేత మిగిలిన అర్థసామ్యవ్యతిరేకాలంకారభేదాలకు కూడా ఉదాహరణలు అవుతాయి.

అవ. అశ్లిష్టభేదాలలో హేతువులు రెండూ చెప్పినప్పుడు సామ్యం ఆక్షిప్తం (వ్యంగ్యం) అయినప్పుడు వ్యతిరేకాలంకారానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ ఇయం సునయనా దాసీకృతతామరసశ్రియా,
ఆననేనాకలఙ్కేన జయతీన్దుం కలఙ్కినమ్. 465

వృ. అత్ర ఇవాదితుల్యాదిపదవిరహేణ ఆక్షిప్తైవ ఉపమా.

వ్యా. సునయనా = అందమైన నేత్రాలుగల, ఇయమ్ = ఈమె, దాసీకృత తామరసశ్రియా = దాసీగా చేయబడిన పద్మము శోభ గల, అకలఙ్కేన = కలంకం లేని, ఆననేన = ముఖంతో, సకలఙ్కమ్ = కలంకంతో కూడిన, ఇన్దుమ్ = చంద్రుణ్ణి, జయతి = జయించుచున్నది.

అత్రేతి:- ఇక్కడ ఇవాదిపదాలు, తుల్యాదిపదాలు లేకపోవడంచేత ఉపమ ఆక్షిప్తమైనది.

వి. ఇక్కడ ఉపమానమైన చంద్రునిలో సంకలంకత్వం అనే అపకర్ష హేతువూ, ఉపమేయం అయిన ముఖంలో అకలంకత్వం అనే ఉత్కర్ష హేతువూ

కూడ చెప్పబడ్డాయి ఇవాదిపదాలు కాని, తుల్యాదిపదాలు కాని లేకపోవడంచేత సామ్యం జయతిపదంచేత ఆక్షిప్తం, వ్యంగ్యం. శ్లేష లేదు. ఉత్కర్షాపకర్షహేతువులలో ఒక్కొక్కదానిని కాని, రెండింటినీ గాని గ్రహించకపోతే ఉపమేయోత్కర్షవాచకలోప–ఉపమానాపకర్షవాచకలోప–ఉభయలోపాలచేత మిగిలిన ఆక్షిప్తసామ్యవ్యతిరేకాలంకారోదాహరణలు ఏర్పడతాయి.

అవ. శ్లిష్టభేదాలలో హేతువులు రెండు చెప్పగా, సామ్యం శాబ్దం అయిన వ్యతిరేకానికి ఉదాహరణ చూపుతున్నాడు–

శ్లో॥ జితేన్ద్రియతయా సమ్యగ్విద్యావృద్ధనిషేవిణః,
అతిగాఢగుణస్యాస్య నాబ్జవద్భఙ్గురా గుణాః. 466

వృ. అత్ర ఇవార్థే వతిః; గుణశబ్దః శ్లిష్టః, శాబ్దమౌపమ్యమ్.

వ్యా. జితేన్ద్రియతయా = జితేంద్రియుడు అవడంచేత, సమ్యక్ = బాగుగా, విద్యావృద్ధనిషేవిణః = విద్యావృద్ధులను సేవించేవాడు, అతిగాఢగుణస్య = చాల దృఢములైనగుణాలు కలవాడు అయిన, అస్య = ఇతనియొక్క, గుణాః = గుణాలు, మంచిగుణాలు, దారాలు అని రెండర్థాలు. అబ్జవత్ = తామరతూడు గుణాల వలె, భఙ్గురాః = తెగిపోయే స్వభావం కలవి, న = కాదు.

అత్రేతి :– ఇక్కడ 'ఇవ' అనేదాని అర్థంలో వతిప్రత్యయం. ("తత్ర తస్యేవ" అనే సూత్రంచేత) వచ్చినది. అందుచేత ఔపమ్యం శాబ్దం. గుణశబ్దం శ్లిష్టం.

వి. రాజపక్షంలో గుణశబ్దానికి సద్గుణాలు అనీ, తామరతూడు పక్షంలో దారాలు అనీ అర్థం. ఉపమేయమైన రాజగుణాల ఉత్కర్షకు హేతువైన అతిగాఢత్వం, ఉపమానమైన అబ్జగుణాల అపకర్షకు హేతువైన భంగురత్వం చెప్పబడ్డాయి. వీటిలో ఒకదానిని గాని రెండింటినీ కాని చెప్పనిపక్షంలో ఉపమేయగతోత్కర్షహేతులోప ఉపమానగతాపకర్షహేతులోప-ఉభయలోపాలకి ఉదాహరణలు అవుతాయి.

అవ. శ్లిష్టభేదాలలో హేతువులు రెండూ చెప్పగా, సామ్యం ఆర్థం అయిన వ్యతిరేకానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అఖణ్డమణ్డలః శ్రీమాన్ పశ్యైష పృథివీపతిః,
న నిశాకరవజ్జాతు కలావైకల్యమాగతః. 467

వృ. అత్ర తుల్యార్థే వతిః. కలాశబ్దః శ్లిష్టః.

వ్యా. అఖణ్డమణ్డలః = పూర్ణమైన మండలం కలవాడు, (రాజపక్షంలో 'రాజమండలం' అనీ, చంద్రపక్షంలో 'బింబం'అనీ అర్థం. శ్రీమాన్ = శ్రీమంతుడు అయిన, (ఐశ్వర్యం, శోభ అని రెండర్థాలు), ఏషః పృథివీపతిః = ఈ రాజు, నిశాకరవత్ = చంద్రునితో తుల్యంగా (చంద్రుడువలె), జాతు = ఎన్నడూ కూడ, కలావైకల్యమ్ = కలావికలత్వాన్ని (చతుఃషష్టికళలు, షోడశకళలు అని రెండర్థాలు). న ఆగతః = పొందలేదు.

అత్రేతి :- ఇక్కడ ("తేన తుల్యం క్రియా చేద్వతిః" అను సూత్రంచేత తుల్యార్థంలో 'వతి' ప్రత్యయం (అందుచేత సామ్యం అర్థం) కలాశబ్దం శ్లిష్టం.

రాజు ఉపమేయం, చంద్రుడు ఉపమానం. అఖండమండలత్వం ఉపమేయోత్కర్షహేతువు. కలావైకల్యం ఉపమానాపకర్షహేతువు. రెండూ చెప్పబడ్డాయి. ఈ ఉత్కర్షాపకర్షహేతువులలో ఏదో ఒకదానిని గాని, రెండింటిని గాని చెప్పకపోతే వెనుకటి వలె హేత్వనుపాదాననిమిత్తకమైన భేదత్రయానికి ఉదాహరణలు అవుతాయి.

వృ. మాలాప్రతివస్తూపమావత్ మాలావ్యతిరేకోఽపి సంభవతి. తస్యాపి భేదా ఏవమూహ్యాః. దిఙ్మాత్రముదాహ్రియతే. యథా-

శ్లో॥ హరవన్న విషమదృష్టిర్హరివన్న విభో విధూతవితతవృషః,
రవివన్న చాతిదుఃసహకరతాపితభూః కదాచిదసి. 468

వృ. అత్ర తుల్యార్థే వతిః; విషమాదయశ్చ శబ్దాః శ్లిష్టాః.

వ్యా. మాలేతి :- మాలాప్రతివస్తూపమ వలె మాలావ్యతిరేకం కూడా ఉండవచ్చును. దాని భేదాలుకూడా ఈ విధంగానే ఊహించుకోవాలి. దిఙ్మాత్రం, (దారిచూపడానికి మాత్రం) ఉదాహరించబడుతున్నది. ఎట్లనగా-

హరవదితి :- విభో = ఓ! రాజా! హరవత్ = మహేశ్వరుడు వలె, విషమ

దృష్టిః=విషమదృష్టి కలవాడవు (బేసిసంఖ్యలో ఉన్న నేత్రాలు కలవాడు, సమం కానిదృష్టి కలవాడు అని రెండర్థాలు), కదాచిత్=ఎన్నడూ కూడ, న అసి=కావు. హరివత్ = శ్రీమహావిష్ణువు వలె, విధూతవితతవృషః = దూరంగా విసిరివేయ బడిన గొప్ప వృషం కలవాడవు (వృషం అనగా వృషభం. ధర్మం అని రెండ ర్థాలు. శ్రీకృష్ణుడు వృషభాసురుణ్ణి సంహరించాడు). న = కావు. రవివత్ = సూర్యుడు వలె, అతిదుఃసహకరతాపితభూః = చాల సహింపశక్యం కాని కరముల చేత (కిరణాలచేత) కరంచేత (పన్నుచేత) తపింపచేయబడిన (పీడింపబడిన) భూమి కలవాడవు, న = కావు.

అత్రేతి :- ఇక్కడ తుల్యార్థంలో 'వతి' ప్రత్యయం. విషమాదిశబ్దాలు శ్లిష్టాలు.

వి. రాజు ఉపమేయం. హరాదులు ఉపమానం. విషమాదిశబ్దాలు శ్లిష్ట శబ్దాలు. అపకర్షహేతువైన విషమదృష్టిత్వం చెప్పబడింది. ఉత్కర్షహేతువైన సమదృష్టిత్వం చెప్పబడలేదు. తుల్యార్థవతిప్రత్యయం ప్రయోగించడంచేత సామ్యం అర్థం. ఒకే ఉపమేయానికి అనేక ఉపమానాలకంటె ఆధిక్యం వర్ణించడం చేత మాలావ్యతిరేకాలంకారం.

అవ. శ్లిష్టభేదాలలో, హేతువులు రెండూ చెప్పగా సామ్యం ఆక్షిప్తం అయి నప్పుడు వ్యతిరేకానికి ఉదాహరణ చూపుతున్నాడు-

వృ- యథా వా-

శ్లో॥ నిత్యోదితప్రతాపేన త్రియామామీలితప్రభః,
భాస్వతానేన భూపేన భాస్వానేష వినిర్జితః. 469

వృ. అత్ర హ్యాక్షిప్తైవోపమా. భాస్వతేతి శ్లిష్టః.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా-

నిత్యేతి :- నిత్యోదితప్రతాపేన = నిత్యమూ ఉదయించిన ప్రతాపం (పరా క్రమం, ప్రకృష్టమైన తాపం అని రెండర్థాలు) గల, భాస్వతా = కాంతి గల, (సూర్యునిచేత అని రెండవ అర్థం). అనేన భూపేన = ఈ రాజుచేత, త్రియామా

మీలితప్రభః = రాత్రిచేత కప్పివేయబడిన కాంతి గల, ఏషః = ఈ, భాస్వాన్ = సూర్యుడు, వినిర్జితః = జయించబడ్డాడు.

అత్రేతి :- ఇక్కడ ఉపమ ఆక్షిప్తం. భాస్వతా అనేది శ్లిష్టం.

వి. రాజు ఉపమేయం. సూర్యుడు ఉపమానం. నిత్యోదితత్వం ఉపమేయోత్కర్షహేతువు. రాత్రి కాంతివిహీను డవడం ఉపమానాపకర్షహేతువు. ఇవ-తుల్యాదిపదాలు లేకపోవడంచేత సామ్యం 'వినిర్జిత' శబ్దంచేత ఆక్షిప్తం. 'భాస్వతా' అనేది శ్లిష్టం. ప్రతాపశబ్దం కూడ శ్లిష్టం. ఈ భాస్వంతుడు ఆ భాస్వంతుణ్ణి జయించినాడని అర్థం. ఇక్కడ కూడా ఉత్కర్షాపకర్షహేతువులలో ఒకదానిని గాని, రెండింటిని గాని గ్రహించనిచో మిగిలిన మూడు భేదాలు ఏర్పడుతాయి

అవ. కొన్ని చోట్ల 'నిర్జిత' 'జయతి' ఇత్యాది పదాలు లేకపోయినా శ్లిష్టవిశేషణాల సామర్థ్యంచేత ఔపమ్యం ఆక్షేపించవచ్చునని చెప్పడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ స్వచ్ఛాత్మతాగుణసముల్లసితేన్దుబిమ్బం
బిమ్బప్రభాధరమకృత్రిమహృద్యగన్ధమ్,
యూనామతీవ పిబతాం రజనీషు యత్ర
తృష్ణాం జహార మధు నాననమఙ్గనానామ్. 470

వృ. అత్రేవాదీనాం తుల్యాదీనాం చ పదానామభావేఽపి శ్లిష్టవిశేషణై రాక్షిప్తైవోపమా ప్రతీయతే. ఏవంజాతీయకాః శ్లిష్టోక్తియోగ్యస్య పదస్య పృథగుపాదానే అన్యేఽపి భేదాః సంభవన్తి. తేఽపి అనయైవ దిశా ద్రష్టవ్యాః.

వ్యా. స్వచ్ఛేతి :- ఈ ద్వితీయాంత విశేషణాలు శ్లేషచేత 'మధు' అనే దానికి 'ఆననమ్' అనేదానికీ కూడా వర్తిస్తాయి. స్వచ్ఛాత్మతాగుణసముల్లసితేన్దుబిమ్బమ్ = నిర్మలస్వరూపం కలిగి ఉండడం అనే గుణంచేత ప్రతిబింబించిన చంద్రబింబం గలది, ముఖపక్షంలో కూడా చెక్కిళ్ళు స్వచ్ఛంగా ఉండడంచేత వాటిలో చంద్రబింబం ప్రతిబింబిస్తున్నది అని అర్థం. బిమ్బప్రభాధరమ్ = దొండ

పండు కాంతిని ధరించేది. ముఖపక్షంలో దొండపండు వంటి కాంతి గల అధరోష్ఠం కలది అని అర్థం. అకృత్రిమహృద్యగన్ధమ్ = సహజమైన మనోహరమైన సువాసన గలది అయిన, ముఖపక్షంలో కూడా ఇదే అర్థం. మధు = మద్యము, రజనీషు = రాత్రులయందు, అతీవ = మిక్కిలి, పిబతామ్ = త్రాగుచున్న, యూనామ్ = యువకులయొక్క, తృష్ణామ్ = పానేచ్ఛను, జహార = హరించెను. అఙ్గనానామ్ = స్త్రీలయొక్క, ఆననమ్ = ముఖము, న = హరించలేదు, అధరపాన తృష్ణ అలాగే ఉండెను అని భావం.

వి. హృద్యమైన గంధము మొదలైనవి ఉండడంచేత స్త్రీల ముఖం మధువు వలె ఉన్నది అని శ్లిష్టవిశేషణాల సామర్థ్యంవల్ల ఔపమ్యం ఆక్షిప్తం అవుతున్నది. అయితే మధువు తృష్ణను హరించింది కాని ఆననం హరించలేదు అని చెప్పడం చేత వ్యతిరేకాలంకారం.

అత్రేతి :- ఇక్కడ ఇవాదిపదాలు, తుల్యాదిపదాలు లేకపోయినా శ్లిష్ట విశేషణాల సామర్థ్యంచేత ఉపమ ఆక్షిప్తమై (వ్యంగ్యమై) ప్రతీతం అవుతున్నది. శ్లిష్టోక్తికి (శ్లేషతో కూడిన ఉక్తికి) తగిన పదాన్ని వేరుగా గ్రహించినప్పుడు ఈ విధమైన ఇతరభేదాలు కూడా సంభవిస్తాయి. వాటిని కూడా ఈ పద్ధతిలోనే గ్రహించాలి.

## 18. ఆక్షేపాలంకారం

కా. నిషేధో వక్తుమిష్టస్య యో విశేషాభిధిత్సయా. 106
వక్ష్యమాణోక్తవిషయః స ఆక్షేపో ద్విధా మతః.

వృ. వివక్షితస్య ప్రాకరణికత్వాదనుపసర్జనీకార్యస్య అశక్య వక్తవ్యత్వమ్ అతిప్రసిద్ధత్వం వా విశేషం వక్తుం నిషేధో నిషేధ ఇవ యః సః వక్ష్యమాణవిషయః ఉక్తవిషయశ్చేతి ద్విధా ఆక్షేపః. క్రమేణోదాహరణమ్-

వ్యా. నిషేధ ఇతి :- విశేషాభిధిత్సయా = విశేషాన్ని చెప్పవలెననే అభిలాషచేత, వక్తుమ్ = చెప్పుటకు, ఇష్టస్య = ఇష్టమైనదానియొక్క, యః = ఏ, నిషేధః = నిషేధం ఉన్నదో, సః = అది, వక్ష్యమాణోక్తవిషయః = చెప్పనున్న

దానికి, చెప్పబడినదానికీ సంబంధించిన, ద్విధా = రెండు విధాలైన, ఆక్షేపాలంకారంగా చెప్పబడింది.

వివక్షితస్యేతి :- ప్రాకరణికం అవడంచేత అప్రధానంగా చేయడానికి వీలుకాని, చెప్పదలచిన విషయాన్ని, దాన్ని గూర్చి చెప్పడం శక్యం కాదు అనే ఉద్దేశ్యంచేతనో, ఆ విషయం చాల ప్రసిద్ధమైనది; చెప్పవలసిన పని లేదు అనే ఉద్దేశ్యంచేతనో, నిషేధించడం (నిజానికి ఇది నిషేధించడంకాదు, నిషేధించడం వంటిది, నిషేధాభాసం)ఆక్షేపాలంకారం. ఇది చెప్పనున్నదాని నిషేధం కావచ్చు, చెప్పినదాని నిషేధం కావచ్చు. అందుచేత రెండువిధాలు. క్రమంగా ఉదాహరణం.

గాథ. ఏ ఏహి కింపి కీఏవి కఏణ ణిక్కివ భణామి అలమహవా,
అవిఅరిఅకజ్జారమ్భఆరిణీ మరఉ ణ భణిస్సం. 471

"ఏ ఏహి కిమపి కస్యా అపి కృతే నిష్కృప భణామి అలమథవా,
అవిచారితకార్యారమ్భకారిణీ మ్రియతాం న భణిష్యామి"

వ్యా. ఏ ఇతి :- నాయకునితో నాయిక సఖురాలు అంటూన్న మాటలు. ఏ = ఏయ్! నిష్కృప = జాలి లేనివాడా! ఏహి = రమ్ము, కస్యాః అపి కృతే = ఒకానొకతె విషయంలో, భణామి = చెప్పెదను. అథవా = లేదా, అలమ్ = చాలును, అవిచారితకార్యారమ్భకారిణీ = ఆలోచించకుండగా కార్యారంభం చేసిన ఈమె, మ్రియతామ్ = మరణించుగాక; న భణిష్యామి = చెప్పను.

వి. ఇక్కడ విరహంవల్ల నాయిక పడుతూన్న బాధను చెప్పవలెనని అనుకొని అది చెప్పడం కష్టం అని వ్యంజింపచేయడానికి 'చెప్పను' అని అంటూ నిషేధించడంవల్ల వక్ష్యమాణవిషయకనిషేధం.

అవ. ఉక్తవిషయనిషేధానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ జ్యోత్స్నా మౌక్తికదామ చన్దనరసః శీతాంశుకాన్తద్రవః
కర్పూరం కదలీ మృణాలవలయాన్యమ్భోజినీపల్లవాః,
అన్తర్మానసమాస్త్వయా ప్రభవతా తస్యాః స్ఫులిఙ్గోత్కర
వ్యాపారాయ భవన్తి హన్త కిమనేనోక్తేన న బ్రూమహే.

వ్యా. జ్యోత్స్నేతి:- నాయకునితో దూతి మాటలు. జ్యోత్స్నా=వెన్నెల, మౌక్తికదామ=ముత్యాలహారం, చన్దనరసః=మంచిగంధం, శీతాంశుకాన్తద్రవః= చంద్రకాంతమణులద్రవం, కర్పూరమ్ = కర్పూరం, కదలీ = అరటిచెట్టు, మృణాలవలయాని = తామరతూడులు, అమ్భోజినీపల్లవాః=తామరతీగచిగుళ్ళు, అన్తర్మానసమ్ = మనస్సుమధ్యయందున్న, ప్రకటవతా = సమర్థుడవైన, త్వయా = నీచేత, నీమూలంగా, తస్యాః = ఆమెకు, స్ఫులిఙ్గోత్కరవ్యాపారాయ = నిప్పురవ్వలసముదాయముయొక్క వ్యాపారంకొరకు, నిప్పురవ్వల వలె బాధించడానికి, భవన్తి = అవుతున్నాయి. అః = ఏమి ఘోరము। హన్త = ఎంత కష్టం! ఉక్తేన = చెప్పబడిన, అనేన = దీనిచేత, కిమ్ = ఏమి ప్రయోజనం! న బ్రూమహే = చెప్పము.

వి. ఇక్కడ కొంత చెప్పి ప్రసిద్ధమైనదానిని ఇంక విస్తరించి చెప్పడం ఎందుకు అన్నట్లు నిషేధించడంవల్ల ('చెప్పను' అని అనడంవల్ల) ఇది ఉక్తవిషయనిషేధం.

## 19. విభావనాలంకారం

కా. క్రియాయాః ప్రతిషేధేఽపి ఫలవ్యక్తిర్విభావనా. 107

వృ. హేతురూపక్రియాయాః నిషేధేఽపి తత్ఫలప్రకాశనం విభావనా. యథా-

శ్లో॥ కుసుమితలతాభిరహతాప్యధత్త రుజమలికులైరదష్టాపి,
పరివర్తతే స్మ నలినీలహరీభిరలోలితాప్యఘూర్ణత సా. 473

వ్యా. క్రియాయా ఇతి:- క్రియాయాః = హేతువైన క్రియయొక్క, ప్రతిషేధేఽపి = ప్రతిషేధమునందు కూడ, ఫలవ్యక్తిః = ఫలవ్యక్తి, విభావనా = = విభావనాలంకారం.

హేత్వితి :- హేతువైన క్రియ లేదు అని చెప్పినా కూడ ఫలం కనబడినట్లు వర్ణించడం విభావనాలంకారం. అనగా హేతువు ఉంటేనే కాని ఫలం కలగకూడదు. హేతువు లేదని అంటూనే ఫలం కలిగిందని చెప్పడం విభావనాలంకారం.. ఎట్లనగా-

కుసుమితేతి :- కుసుమితలతాభిః = పుష్పించిన లతలచేత, అహతాపి = కొట్టబడకపోయినా కూడ, సా = ఆమె, రుజమ్ = పీడను, అధత్త = ధరించెను. అలికులైః = తుమ్మెదల సముదాయాలచేత, అదష్టాపి = కరవ(కుట్ట)బడకపోయినా, పరివర్తతేస్మ = దొర్లుచుండెను. నలినీలహరీభిః = పద్మలతలతో కూడిన (సరస్సులోని) తరంగాలచేత, అలోలితాపి = కదల్చబడకపోయినా, అఘూర్ణత = తిరిగిపోయెను.

పీడ మొదలైన కార్యాలకు కారణాలైన కొట్టబడడం మొదలైనవి లేకపోయినా ఆ కార్యాలు కలిగినట్లు వర్ణించడంచేత విభావనాలంకారం.

## 20. విశేషోక్త్యలంకారం

కా. విశేషోక్తిరఖణ్డేషు కారణేషు ఫలావచః.

వృ. మిలితేష్వపి కారణేషు కార్యస్యాకథనం విశేషోక్తిః అనుక్తనిమిత్తా, ఉక్తనిమిత్తా, అచిన్త్యనిమిత్తా చ. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ నిద్రానివృత్తావుదితే ద్యురత్నే
సఖీజనే ద్వారపదం పరాప్తే,
శ్లథీకృతాశ్లేషరసే భుజఙ్గే
చచాల నాలిఙ్గనతోఽఙ్గనా సా. 474

వ్యా. విశేషోక్తిరితి :- కారణేషు = కారణాలు, అఖణ్డేషు = పరిపూర్ణములుగా ఉన్నా కూడ, ఫలావచః = ఫలమును చెప్పకపోవడం, విశేషోక్తిః = విశేషోక్త్యలంకారం.

మిలితేష్వితి :- కావలసిన కారణాలన్నీ కలిసినా కూడ కార్యం కలిగినట్లు చెప్పకపోవడం విశేషోక్తి. కార్యం కలగకపోవడానికి నిమిత్తం చెప్పనట్లయితే ఆ విశేషోక్తి 'అనుక్తనిమిత్తం'; చెప్పినట్లయితే 'ఉక్తనిమిత్తం'; దాని నిమిత్తం ఊహించరానిదైతే 'అచింత్యనిమిత్తం'. ఈ మూడు భేదాలకీ వరసగా ఉదాహరణలు-

నిద్రా ఇతి:- నిద్రానివృత్తౌ = నిద్ర తేలిపోయినా, ద్యురత్నే = సూర్యుడు,

ఉదితే = ఉదయించినా, సఖీజనే = సఖీజనం, ద్వారపదమ్ = ద్వారస్థానాన్ని, పరాప్తే = పొందినా, భుజజ్గే = ప్రియుడు, శ్లథీకృతాశ్లేషరసే = శిథిలం చేయబడిన ఆలింగనాసక్తి కలవాడైనా, సా = ఆ, అఙ్గనా = స్త్రీ, ఆలిఙ్గనతః = ఆలింగగనం నుండి, న చచాల = చలించలేదు.

వి. ఆలింగనంనుండి చలించడానికి తగిన కారణాలన్నీ ఉన్నా ఆలింగన చలనం అనే ఆ కార్యం కలగలేదుగాన విశేషోక్తి అది కలగకపోవడానికి నిమిత్తమైన గాఢానురాగం చెప్పబడలేదు. అందుచేత అనుక్తనిమిత్త.

అవ. ఉక్తనిమిత్తవిశేషోక్తికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ కర్పూర ఇవ దగ్ధోఽపి శక్తిమాన్ యో జనే జనే,
నమోఽస్త్వవార్యవీర్యాయ తస్మై మకరకేతవే. 475

వ్యా. కర్పూర ఇతి :- ఇది రాజశేఖరుని బాలరామాయణంలోని తృతీయాంకంలోని శ్లోకం. యః = ఏ మన్మథుడు, కర్పూరః ఇవ = కర్పూరం వలె, దగ్ధః = అపి = కాల్చబడినా కూడా, జనే జనే = ప్రతిజనునివిషయంలో, శక్తిమాన్ = శక్తిగలవాడో, అవార్యవీర్యాయ = నివారింప శక్యం కాని పరాక్రమం కల, తస్మై = ఆ, మకరకేతవే = మన్మథునకు, నమః = అస్తు = నమస్కారం అగుగాక.

వి శరీరం కాల్చివేయడం శక్తి నశించడానికి కారణం. ఆ కారణం ఉన్నా శక్తి వినాశం అనే కార్యం కలగలేదు. శక్తి ఉంది. దీనికి నిమిత్తమైన అవార్యవీర్యత్వం చెప్పబడింది గాన 'ఉక్త నిమిత్తవిశేషోక్తి'.

అవ. అచింత్యనిమిత్తవిశేషోక్తికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ స ఏకస్త్రీణి జయతి జగన్తి కుసుమాయుధః,
హరతాపి తనుం యస్య శమ్భునా న బలం హృతమ్.

వ్యా. స ఇతి :- సః = ఆ, కుసుమాయుధః = మన్మథుడు, ఏకః = ఒక్కడే, త్రీణి = మూడు, జగన్తి = జగత్తులను, జయతి = జయిస్తున్నాడు, యస్య = ఎవనియొక్క, తనుమ్ = శరీరాన్ని, హరతాపి = హరించినవాడైనా. శమ్భునా = మహేశ్వరునిచేత, బలమ్ = బలం, న హృతమ్ = హరించబడలేదో.

వి. శరీరాన్ని హరించడం బలం హరించడానికి కారణం. కారణం ఉంది. కార్యం కలగలేదు. అందువలన విశేషోక్తి. ఎందుకు హరించలేదో చెప్పజాలం. అందుచేత 'అచింత్యనిమిత్తవిశేషోక్తి'.

## 21. యథాసంఖ్యాలంకారం

కా. యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః. 108

వృ. యథా-

శ్లో॥ ఏకస్త్రిధా వససి చేతసి చిత్రమత్ర
దేవ ద్విషాం చ విదుషాం చ మృగీదృశాం చ,
తాపం చ సంమదరసం చ రతిం చ పుష్ణన్
శౌర్యోష్మణా చ వినయేన చ లీలయా చ. 477

వ్యా. యథాసంఖ్యమితి :- క్రమికాణామ్=ఒక క్రమంలో ఉన్నవాటికి, క్రమేణైవ= ఆ క్రమంచేతనే, సమన్వయః = సమన్వయం, యథాసంఖ్యమ్= యథాసంఖ్యాలంకారం

ఎట్లనగా-

ఏక ఇతి :- దేవ=ఓ! రాజా! ఏకః=ఒక్కడవే అయిన నీవు, ద్విషాం చ=శత్రువులయొక్క, విదుషాం చ=విద్వాంసులయొక్క, మృగీదృశాం చ= మృగనయనలయొక్క, చేతసి=చిత్తమునందు, శౌర్యోష్మణా చ=శౌర్యం వేడి చేత, వినయేన చ=వినయంచేత, లీలయా చ = విలాసచేత తాపం చ = తాపాన్ని, సంమదరసం చ=ఆనందాన్ని, రతిం చ=అనురాగాన్ని, పుష్ణన్= =పోషిస్తూ, త్రిధా=మూడు విధాలుగా, వససి=నివసిస్తున్నావు. చిత్రమ్= ఆశ్చర్యము.

వి. ఇక్కడ శౌర్యోష్మచేత శత్రువుల మనస్సులో తాపాన్ని, వినయం చేత విద్వాంసుల మనస్సులో సంతోషాన్ని, లీలచేత స్త్రీల మనస్సులో అనురాగాన్ని కలిగిస్తున్నావు అని క్రమానుసారం అన్వయం. అందుచేత యథాసంఖ్యాలంకారం.

## 22. అర్థాంతరన్యాసాలంకారం

కా. సామాన్యం వా విశేషో వా తదన్యేన సమర్థ్యతే
యత్తు సో౽ర్థాన్తరన్యాసః సాధర్మ్యేణేతరేణ వా. 109

వృ. సాధర్మ్యేణ వైధర్మ్యేణ వా సామాన్యం విశేషేణ యత్ సమర్థ్యతే, విశేషో వా సామాన్యేన సో౽ర్థాన్తరన్యాసః. క్రమేణోదాహరణమ్.

వ్యా. సామాన్యమితి:- సామాన్యం వా = సామాన్యం కాని, విశేషో వా = విశేషం కాని, తదన్యేన = దానికంటె భిన్నమైనదానిచేత, అనగా సామాన్యం విశేషంచేత, విశేషం సామాన్యంచేత, సాధర్మ్యేణ = సాధర్మ్యంచేతగాని, ఇతరేణ వా = వైధర్మ్యంచేత గాని, యత్ సమర్థ్యతే = సమర్థించబడును అనేది ఏది కలదో, సః = అది, అర్థాన్తరన్యాసః = అర్థాంతరన్యాసాలంకారం.

సాధర్మ్యేణేతి:- సాధర్మ్యంచేత గాని, వైధర్మ్యంచేత గాని సామాన్యం విశేషంచేత సమర్థించబడడం, లేదా విశేషం సామాన్యంచేత సమర్థించబడడం అర్థాంతరన్యాసాలంకారం.

వి. సాధర్మ్యం అనగా సమానమైన ధర్మాలు కలిగి ఉండడం. వైధర్మ్యం అనగా విరుద్ధధర్మాలు కలిగి ఉండడం. ఏదైనా ఒక వస్తువుకు మరొకవస్తువును దృష్టాంతంగా చూపేటప్పుడు సాధర్మ్యాన్ని పురస్కరించుకొని చూపవచ్చు, వైధర్మ్యాన్ని పురస్కరించుకొని చూపవచ్చును. ఉదాహరణకి 'గోపాలుడు రాముడు వలె తెలివైనవాడు కాడు' అన్నప్పుడు గోపాలుణ్ణి రాముడితో పోలుస్తున్నాం. అయితే ఈ వాక్యానికి "రాముడు తెలివైనవాడు; కాని గోపాలుడు తెలివైనవాడు కాడు" అని భావం చెప్పవచ్చు. అప్పుడు ఇది వైధర్మ్యంచేత పోల్చడం అవుతుంది. "రాముడు తెలివైనవాడు కాదని మీకు తెలుసుకదా? అతని వలెనే గోపాలుడు కూడా తెలివైనవాడు కాడు" అని భావం చెప్పవచ్చు. అప్పుడు సాధర్మ్యంచేత పోల్చినట్లు అవుతుంది.

ఒక సామాన్యవిషయం చెప్పి దానిని, విశేషంచేత సాధర్మ్యం పురస్కరించు

కొని, సమర్థిస్తే ఒక భేదం. వైధర్మ్యం పురస్కరించుకొని సమర్థిస్తే రెండవ భేదం. ఒక విశేషాన్ని చెప్పి దానిని సామాన్యంచేత, సాధర్మ్యం పురస్కరించు కొని సమర్థిస్తే ఒక భేదం, వైధర్మ్యంచేత సమర్థిస్తే రెండవ భేదం. ఈ విధంగా అర్థాంతరాన్యాసాలంకారంలో నాలుగు భేదాలు ఉంటాయి. క్రమంగా ఉదాహరణలు.

సాధర్మ్యపూర్వకంగా విశేషంచేత సామాన్యసమర్థనానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ నిజదోషావృతమనసామతిసున్దరమేవ భాతి విపరీతమ్,
పశ్యతి పిత్తోపహతః శశిశుభ్రం శఙ్ఖమపి పీతమ్. 478

వ్యా. నిజేతి:- నిజదోషావృతమనసామ్ = తమ దోషముల చేత కప్పి వేయబడిన మనస్సు కలవాళ్ళకు, అతిసున్దరమేవ = చాల సుందర మైనదే, విపరీతమ్ = విపరీతంగా, భాతి = తోచును. పిత్తోపహతః = పైత్యంచేత పీడితుడు, శశిశుభ్రమ్ అపి = చంద్రుడు వలె తెల్లగా ఉన్నా కూడ, శఙ్ఖమ్ = శంఖమును, పీతమ్ = పచ్చగా ఉన్నదానినిగా, పశ్యతి = చూస్తాడు.

వి. ఇక్కడ నిజదోషేత్యాదిసామాన్యం శంఖం పచ్చగా కనబడడం అనే విశేషంచేత సమర్థించబడింది. ఇది సాధర్మ్యంతో అర్థాంతరన్యాసకు ఉదాహరణం.

అవ. సాధర్మ్యపూర్వకంగా సామాన్యంచేత విశేషాన్ని సమర్థించడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

శ్లో॥ సుసితవసనాలంకారాయాం కదాచన కౌముదీ
మహసి సుదృశి స్వైరం యాన్త్యాం గతోఽస్తమభూద్విధుః,
తదను భవతః కీర్తిః కేనాప్యగీయత యేన సా
ప్రియగృహమగాన్ముక్తాశఙ్కా క్వ నాసి శుభప్రదః. 479

వ్యా. సుసితేతి:- (అర్థానికి చూ. 266వ శ్లోకం). ఇక్కడ సుసితేత్యాది వాక్యంలో చెప్పిన విశేషం 'క్వ నాసి' ఇత్యాది సామాన్యంచేత సమర్థించబడింది.

అవ. వైధర్మ్యపూర్వకంగా సామాన్యాన్ని విశేషంచేత సమర్థించడానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ గుణానామేవ దౌరాత్మ్యాద్ధురి ధుర్యో నియుజ్యతే,
అసంజాతకిణస్కన్ధః సుఖం స్వపితి గౌర్గలిః. 480

వ్యా. ధుర్యః = కార్యభారవహనసమర్థుడు, గుణానామ్ = గుణాలయొక్క, దౌరాత్మ్యాదేవ = చెడ్డతనంవలననే, అపరాధంవలననే, ధురి = కార్యభారమునందు, నియుజ్యతే = నియమించబడుతున్నాడు. గలిః = సామర్థ్యం ఉన్నా కాడిమోయని, కాడి భుజంమీద పెట్టగానే క్రిందికి పడదోసే, గౌః = ఎద్దు, అసంజాతకిణస్కన్ధః = కాయలు కలగని మూపు కలదై, సుఖమ్ = సుఖంగా, స్వపితి = నిద్రపోతున్నది.

వి. ఇక్కడ పూర్వార్ధంలో చెప్పిన సామాన్యం ఉత్తరార్ధంలో చెప్పిన విశేషమైన గలివృత్తాంతంచేత సమర్థించబడుతున్నది. గుణాలు లేక పోవడంచేత గలి కాడికి కట్టబడదు అని వైధర్మ్యరూపేణ సమర్థించబడింది.

అవ. వైధర్మ్యపూర్వకంగా సామాన్యంచేత విశేషసమర్థనానికి ఉదాహరణం చూపుతున్నాడు-

శ్లో॥ అహో హి మే బహ్వపరాద్ధమాయుషా
యదప్రియం వాచ్యమిదం మయేదృశమ్,
త ఏవ ధన్యాః సుహృదః పరాభవం
జగత్యదృష్ట్వైవ హి యే క్షయం గతాః. 481

వ్యా. అహో ఇతి:- ఏదో అప్రియవార్తను చెప్పవలసివచ్చినందుకు దుఃఖిస్తూన్నవాని మాటలు- అహో = అయ్యో! మే = నావిషయమునందు, ఆయుషా = ఆయుర్దాయంచేత, బహు = అధికంగా, అపరాద్ధమ్ = అపరాధం చేయబడింది. యత్ = ఎందువలన అనగా, మయా = నాచేత, ఈదృశమ్ = ఇట్టి, అప్రియమ్ = అప్రియము, వాచ్యమ్ = చెప్పవలసివచ్చినది. జగతి = ఈ జగత్తులో యే = ఎవరు, సుహృదః = మిత్రునియొక్క, పరాభవమ్ = పరాభవాన్ని, అదృష్ట్వైవ = చూడకుండ

గానే, క్షయమ్ = నాశమును, గతాః = పొందినారో, తే ఏవ = వాళ్ళే, ధన్యాః హి = ధన్యులు కదా?

వి. ఇక్కడ 'త ఏవ ధన్యాః' ఇత్యాదివాక్యంలో చెప్పినది సామాన్యం. దీని చేత పూర్వార్ధంలో చెప్పిన "నా ఆయుర్దాయం నాకు చాల అపకారం చేసింది" అనే విశేషం సమర్థించబడింది. "వాళ్ళు ధన్యులు" అనే సామాన్యం 'నేను అధన్యుణ్ణి' అనే విశేషం వైధర్మ్యంతో కూడినవి.

## 23. విరోధాలంకారం

కా. విరోధః సోఽవిరోధేఽపి విరుద్ధత్వేన యద్వచః

వృ. వస్తువృత్తేనావిరోధేఽపి విరుద్ధయోరివ యదభిధానం స విరోధః.

కా. జాతిశ్చతుర్భిర్జాత్యాద్యైర్విరుద్ధా స్యాద్గుణస్త్రిభిః, 110
క్రియా ద్వాభ్యామపి ద్రవ్యంద్రవ్యేణైవేతి తే దశ.

వృ. క్రమేణోదాహరణమ్-

వ్యా. విరోధః ఇతిః- అవిరోధేఽపి = వాస్తవంలో విరోధం లేకపోయినా, విరుద్ధత్వేన = విరుద్ధముగా-ఉన్నట్లు, యత్ = ఏ, వచః = చెప్పడం ఉన్నదో అది, విరోధః=విరోధాలంకారం (విరోధాభాసం).

వ్యా. వాస్తవంలో విరోధం లేకపోయినా విరుద్ధములైనట్లు రెండు వస్తువులను వర్ణించడం విరోధాలంకారం.

జాతిరితిః- జాతిః = జాతి, జాత్యాద్యైః = జాతి మొదలైన, చతుర్భిః = నాలిగింటితోను, విరుద్ధా = విరుద్ధమైనది, స్యాత్ = అవవచ్చును. గుణః = గుణం, త్రిభిః = మూడింటితో, విరుద్ధం కావచ్చును. (4 + 3 = 7). క్రియా = క్రియ, ద్వాభ్యామ్ = రెండింటితో విరుద్ధం కావచ్చును. (7+2 = 9). ద్రవ్యమ్=ద్రవ్యం, ద్రవ్యేణైవ = ద్రవ్యంతోమాత్రమే విరుద్ధం కావచ్చును. (9 + 1 = 10). ఇతి = ఇట్లు, తే = ఆ విరోధాలు, దశ = పది.

వి. ఈ విరోధాలంకారంలో పది భేదాలు ఉంటాయి. పదార్థాలు జాతి, గుణం, క్రియ, ద్రవ్యం అని నాలుగు విధాలు గాన జాతి జాత్యాదులతోను, అనగా జాతి-గుణ-క్రియా-ద్రవ్యాలతోనూ, గుణం గుణ-క్రియా-ద్రవ్యా లనే మూడింటి తోను, క్రియ, క్రియా-ద్రవ్యములనే రెండింటితోను, ద్రవ్యం ద్రవ్యంతోను విరుద్ధ ములైనట్లు వర్ణిస్తే అవి పది భేదాలు ఏర్పడ తాయి. క్రమంగా ఉదాహరణలు.

శ్లో॥ అభినవనలినీకిసలయమృణాలవలయాది దవదహనరాశిః,
సుభగ కురఙ్గదృశోఽస్యా విధివశత స్త్వద్వియోగపవిపాతే.

వ్యా. అభినవేతి,- సుభగ = ఓ! సుందరుడా! విధివశతః = దైవవశం వల్ల, త్వద్వియోగపవిపాతే = నీ వియోగం అనే పిడుగు పడగానే, అస్యాః = ఈ, కురఙ్గదృశః = మృగనయనకు, అభినవనలినీకిసలయమృణాలవలయాది = నూతన మైన పద్మలత, చిగుళ్ళు, తామరతూడుల వలయాలు మొదలైనది, దవదహనరాశిః = దావాగ్ని యొక్క రాశిగా అయినది.

వి. ఇక్కడ నలినీత్వాదిజాతులకు దవదహనత్వజాతితో విరోధం. అనగా నలినత్వాదులు దవదహనత్వాన్ని పొందడం విరుద్ధం. ఈ విధంగా జాతికి జాతితో విరోధం అనే విరోధాలంకారం. ఇలా అవడానికి కారణం విరహతాపం అని తెలి యడంచేత విరోధానికి పరిహారం. అందుచేత విరోధాభాసం. విరోధంగా కనబడు టయే కాని వాస్తవంలో విరోధం లేదు గాన విరోధాభాసం. రాబోయే ఉదా హరణలలో కూడా విరోధతత్పరిహారాలు ఈ విధంగానే ఉంటాయి.

శ్లో॥ గిరయోఽప్యనున్నతియుజో మరుదప్యచలోఽబ్ధయోఽగమ్భీరాః
విశ్వమ్భరాప్యతిలఘుర్నరనాథ తవాన్తికే నియతమ్. 483

వ్యా. నరనాథ = రాజా! తవ అన్తికే = నీ సమీపమునందు, నియతమ్ = తప్పక, గిరయః అపి = పర్వతాలు కూడ, అనున్నతియుజః = ఔన్నత్యం లేనివి. మరుదపి = వాయువు కూడ, అచలః = కదలజాలనిది. అబ్ధయః = సముద్రాలు, అగమ్భీరాః = గంభీరములు కానివి. విశ్వంభరాపి = భూమి కూడ, అతిలఘుః = చాల తేలిక అయినది.

వి. ఇక్కడ గిరిత్వాదిజాతులకు అనున్నతత్వాదిగుణాలతో విరోధం. రాజా

గొప్పతనాన్ని వర్ణించడంలో కవి తాత్పర్యం గాన విరోధపరిహారం. అందుచేత విరోధాభాసం. మొదటి ఉదాహరణలో శుద్ధం, ఈ శ్లోకంలో శ్లేషమూలకం.

శ్లో॥ యేషాం కణ్ఠపరిగ్రహప్రణయితాం సంప్రాప్య ధారాధర
స్తీక్ష్ణః సోఽప్యనురజ్యతే చ కమపి స్నేహం పరాప్నోతి చ,
తేషాం సంగరసఙ్గసక్తమనసాం రాజ్ఞాం త్వయా భూపతే
పాంసూనాం పటలైః ప్రసాధనవిధిర్నిర్వర్త్యతే కౌతుకమ్.

వ్యా. యేషామితి:- భూపతే = రాజా! సంగరసఙ్గసక్తమనసామ్ = యుద్ధ సంబంధమునందు ఆసక్తి గల మనస్సు గల, యేషామ్ = ఏ రాజులయొక్క, కణ్ఠపరిగ్రహప్రణయితామ్ = కంఠమును గ్రహించడంలో ప్రేమ కలిగిఉండడాన్ని, సంప్రాప్య = పొంది, సః = ఆ, తీక్ష్ణః = తీక్ష్ణమైన, ధారాధరః అపి = ఖడ్గం కూడ, అనురజ్యతే = అనురక్తం అవుతున్నదో (ఎఱ్ఱపడుచున్నది. అనురాగం కలది అవుతున్నది అని రెండర్థాలు), కమపి = ఒకానొక, స్నేహం చ = స్నేహాన్ని కూడ (నున్నదనం, మైత్రి అని రెండర్థాలు), పరాప్నోతి = పొందుతూన్నదో, తేషాం రాజ్ఞామ్ = ఆ రాజులకు, త్వయా = నీచేత, పాంసూనామ్ = పరాగముల యొక్క, పటలైః = సముదాయాలచేత, ప్రసాధనవిధిః = అలంకరణము, నిర్వర్త్యతే = చేయబడుచున్నది. కౌతుకమ్ = ఆశ్చర్యము! ఇక్కడ ఖడ్గత్వజాతికి అనురాగ స్నేహాలను పొందడం అనే క్రియలతో విరోధం. ఆ పదాలకు ఉన్న ఎఱ్ఱబడడం, నున్నగా (జిడ్డుగా) ఉండడం అనే అర్థాలను పట్టి విరోధపరిహారం. పాంసుత్వ జాతికి అలంకరణక్రియతో విరోధం. కంఠం చేదించి యుద్ధరంగ ధూళిదూసరి తాలుగా చేయడం అని గ్రహించడం చేత విరోధపరిహారం.

శ్లో॥ సృజతి చ జగదిదమవతి చ సంహరతి చ హేలయైవ యో నియతమ్
అవసరవశతః శఫరో జనార్దనః సోఽపి చిత్రమిదమ్ 485

వ్యా. సృజతీతి:- యః = ఏ జనార్దనుడు, ఇదమ్ = ఈ, జగత్ = జగత్తును, హేలయైవ = విలాసతోనే, నియతమ్ = నిశ్చితప్రకారంగా, సృజతి చ = సృజించు చున్నాడో, అవతి చ = రక్షిస్తున్నాడో, సంహరతి చ = సంహరిస్తున్నాడో, సః = ఆ, జనార్దనః అపి = జనార్దనుడు కూడ, అవసరవశతః = సమయాన్ని పట్టి, శఫరః = మత్స్యంగా, జాతః = అయినాడు. ఇదమ్ = ఇది, చిత్రమ్ = ఆశ్చర్యం.

వి. ఇక్కడ శఫరత్వజాతికి జనార్దను డనే వ్యక్తితో విరోధం. ఇది భగవ ల్లీలాకృతం అవడంచేత విరోధపరిహారం.

శ్లో॥ సతతం ముసలాసక్తా బహుతరగృహకర్మఘటనయా నృపతే,
ద్విజపత్నీనాం కఠినాః సతి భవతి కరాః సరోజసుకుమారాః.

వ్యా. సతతమితి:- నృపతే = రాజా! సతతమ్ = ఎల్లప్పుడు, ముసలాసక్తాః = రోకళ్ళతో సంబంధించినవీ, బహుతరగృహకర్మఘటనయా = అత్యధికమైన ఇంటి పనులు చేసికోవడంచేత, కఠినాః = కఠినములూ అయిన, ద్విజపత్నీనాం కరాః = బ్రాహ్మణపత్నుల చేతులు, భవతి సతి = నీవు ఉండగా, సరోజసుకుమారాః = పద్మాల వలె సుకుమారములు అయినవి.

వి. ఇక్కడ కఠినత్వ సుకుమారత్వా లనే గుణాలకు విరోధం. రాజువల్ల ఐశ్వర్యం లభించగా గృహకర్మవ్యాపృతత్వం లేకపోవడంచేత కాలాంతరంలో హస్తాలు సుకుమారాలు అయినవి అని గ్రహించడంచేత విరోధపరిహారం.

శ్లో॥ పేశలమపి ఖలవచనం దహతితరాం మానసం సతత్త్వవిదామ్,
పరుషమపి సుజనవచనం మలయజరసవత్ ప్రమోదయతి.

వ్యా. పేశలమితి:- ఖలవచనమ్ = దుష్టుల వచనం, పేశలమ్ అపి = మృదువైనా కూడ, సతత్త్వవిదామ్ = తత్త్వజ్ఞానవంతులయొక్క, మానసమ్ = మనస్సును, దహతి తరామ్ = మిక్కిలి కాల్చివేస్తుంది. సుజనవచనమ్ = సుజనుల వాక్యం, పరుషమ్ అపి = పరుషమైనా, మలయజరసవత్ = చందనరసం వలె, ప్రమోదయతి = ఆనందింపచేస్తుంది.

వి ఇక్కడ పేశలత్వం, పరుషత్వం అనే గుణాలకు కాల్చడం, సంతోషం కలిగించడం అనే క్రియలతో విరోధం. ఖలత్వ-సుజనత్వాలను పట్టి విరోధ పరిహారం.

శ్లో॥ క్రౌఞ్చాద్రిరుద్దామదృషద్దృఢోఽసౌ
యన్మార్గణానర్గలశాతపాతే,
అభూన్నవామ్భోజదలాభిజాతః
సభార్గవః సత్యమపూర్వసర్గః. 488

వ్యా. క్రౌఞ్చేతి :— ఉద్దామదృషద్దృఢః = పెద్ద రాళ్ళచేత దృఢమైన, అసౌ = ఈ, క్రౌఞ్చాద్రిః = క్రౌంచపర్వతం, యన్మార్గణానర్గలశాతపాతే = ఏ భార్గవరాముని బాణంయొక్క అడ్డు లేని తీవ్రమైన పడడమునందు, ఎవని బాణం పడగా, నవామ్భోజదలాభిజాతః = నూతనమైన పద్మదలం వలె సుకుమారంగా, అభూత్ = అయెనో, సః భార్గవః = అట్టి భార్గవరాముడు, సత్యమ్ = నిజంగా, అపూర్వసర్గః = అపూర్వమైన సృష్టి

వి. ఇక్కడ కోమలత్వగుణానికి క్రౌంచాద్రి అనే ద్రవ్యంతో విరోధం. పరశురామమాహాత్మ్యం కారణం అవడంచేత విరోధపరిహారం.

శ్లో॥ పరిచ్ఛేదాతీతః సకలవచనానామవిషయః,
పునర్జన్మన్యస్మిన్ననుభవపథం యో న గతవాన్,
వివేకప్రధ్వంసాదుపచితమహామోహగహనో
వికారః కోఽప్యన్తర్జడయతి చ తాపం చ కురుతే. 489

వ్యా. పరితి :— (చూ. 107వ శ్లోకం). ఇక్కడ జడీకరణ-తాపకరణ క్రియలకు విరోధం. విరహవైచిత్ర్యంచేత పరిహారం.

శ్లో॥ అయం వారామేకో నిలయ ఇతి రత్నాకర ఇతి
శ్రితోఽస్మాభిస్తృష్ణాతరలితమనోభిర్జలనిధిః,
క ఏవం జానీతే నిజకరపుటీకోటరగతం
క్షణాదేనం తామ్యత్తిమిమకరమాపాస్యతి మునిః. 490

వ్యా. అయమితి :- భల్లటశతకంలోని శ్లోకం. అయమ్ = ఈ సముద్రం, వారామ్ = ఉదకాలకు, ఏకః = ముఖ్యమైన, నిలయః ఇతి = స్థానం అనీ, రత్నాకరః ఇతి = రత్నాలకి ఆకరం అనీ, జలధిః = సముద్రం, తృష్ణాతరలితమనోభిః = దప్పికచేత చలింపచేయబడిన మనస్సు గల, అస్మాభిః = మాచేత, శ్రితః = ఆశ్రయించబడింది. మునిః = అగస్త్యమహాముని, నిజకరపుటీకోటరగతమ్ = తన దొప్పవంటి (దొప్పవలె చేయబడిన) చేతి రంధ్రంలో ఉన్న (ఇముడ్చబడిన), తామ్యత్తిమిమకరమ్ = వాడిపోతూన్న తిములు, మకరాలూ గల, ఏనమ్ = ఈ

సముద్రాన్ని, క్షణాత్ = క్షణంలో, అపాస్యతి = త్రాగివేస్తాడు అని, ఏవమ్ = ఇట్లు, కః = ఎవడు, జానీతే = ఎరుగును!

వి ఇక్కడ పానక్రియకు అగస్త్యుడు, సముద్రం అనే ద్రవ్యాలతో విరోధం. అగస్త్యమహిమాతిశయంచేత విరోధపరిహారం.

శ్లో॥ సమదమతఙ్గజమదజలనిష్యన్దతరఙ్గిణీపరిష్వఙ్గాత్,
క్షితితిలక త్వయి తటజుషి శంకరచూడాపగాపి కాలిన్దీ.

వ్యా. సమదేతి :- క్షితితిలక = భూమికి తిలకమైన రాజా! త్వయి = నీవు, తటజుషి = తటమును పొందినవాడవు అగుచుండగా, "సమద....పరిష్వఙ్గాత్"- సమద = మదంతో కూడిన, మతఙ్గజ = ఏనుగులయొక్క, మదజల = మదోదకము యొక్క, నిష్యన్ద = స్రవించడంవల్ల కలిగిన, తరఙ్గిణీ = నదియొక్క, పరిష్వఙ్గాత్ = ఆలింగనంవల్ల, కలవడంవల్ల, శంకరచూడాపగాపి = గంగానది కూడ, కాలిన్దీ = యమున అయినది.

వి. ఇక్కడ గంగ అనే ద్రవ్యానికి యమున అనే ద్రవ్యంతో విరోధం. 'కాలిన్దీ' శబ్దానికి 'శ్యామవర్ణం కలది' అని మాత్రం అర్థం గ్రహించడంచేత విరోధపరిహారం

## 24. స్వభావోక్త్యలంకారం

కా. స్వభావోక్తిస్తు డిమ్భాదేః స్వక్రియారూపవర్ణనమ్. 111

వృ. స్వయోః తదేకాశ్రయయోః రూపం వర్ణః సంస్థానం చ. ఉదాహరణమ్.

శ్లో॥ పశ్చాదఙ్ఘ్రీ ప్రసార్య త్రికనతివితతం ద్రాఘయిత్వాఙ్గముచ్చై
రాసజ్యాభుగ్నకణ్ఠో ముఖమురసి సటాం ధూలిధూమ్రాం విధూయ
ఘాసగ్రాసాభిలాషాదనవరతచలత్ప్రోథతుణ్డస్తురఙ్గో
మన్దం శబ్దాయమానో విలిఖతి శయనాదుత్థితః క్ష్మాం ఖురేణ.

వ్యా. స్వభావోక్తిరితి :- డిమ్భాదేః = శిశువులు మొదలైన వాటియొక్క,

స్వక్రియారూపవర్ణనమ్ = వాటికి మాత్రమే సంబంధించిన క్రియలయొక్క, రూపంయొక్క వర్ణనము, స్వభావోక్తిః తు = స్వభావోక్త్యలంకారం.

స్వయోరితి :- డింభాదులుమాత్రమే ఆశ్రయంగా గల అనగా డింభా లకు మాత్రమే సంబంధించిన 'రూపమ్' అనగా రంగు, శరీరసంస్థానము అనగా అవయవసంనివేశము.

వి. ఏ డింభాదులు వర్ణించబడుతున్నారో వారికి లేదా వాటికి మాత్రమే సంబంధించిన క్రియలు, రంగు, అవయవసంనివేశం మొదలైనవాటిని మనో హరంగా వర్ణిస్తే అది స్వభావోక్తి. దీనికే 'జాతి' అని ప్రాచీనాలంకారికు లిచ్చిన పేరు. ఉదాహరణం ఎట్లనగా-

పశ్చాదితి :- బాణభట్టు రచించిన హర్షచరితం తృతీయోచ్ఛ్వాసంలోని శ్లోకం. పశ్చాదఙ్ఘ్రీ = వెనుకటి రెండు కాళ్లూ, ప్రసార్య = చాపి, త్రికనతివితతమ్ = వెన్నెముక మొదటి భాగాన్ని వంచడంచేత విస్తృతమైన, అఙ్గమ్=శరీరాన్ని, ఉచ్చైః = అధికంగా, ద్రాఘయిత్వా = పొడవుగా ఉండేటట్లు చేసి, ఆభుగ్నకణ్ఠః = వంకరచేయబడిన కంఠం కలదై. ముఖమ్ = ముఖమును, ఉరసి = వక్షః స్థలమునందు. ఆసజ్య = తగల్చి, ధూలిధూమ్రామ్=ధూలిచేత ధూమ్రవర్ణం గల, సటామ్ = జూలును, విధూయ = దులిపి, ఘాసగ్రాసాభిలాషాత్ = పచ్చగడ్డి తిన వలె ననే అభిలాషవలన, అనవరతచలత్ప్రోథతుణ్డః = ఎడతెరిపి లేకుండా కదలుచున్న నాసికాగ్రం గల, ముట్టె గల, శయనాత్ = శయనంనుంచి, ఉత్థితః = లేచిన, తురఙ్గః = గుఱ్ఱం, మన్దమ్ = మందంగా, శబ్దాయమానః=ధ్వనిచేస్తూ, క్ష్మామ్ = భూమిని, ఖురేణ = డెక్కచేత, విలిఖతి = వ్రాయుచున్నది.

వి. ఇక్కడ గుఱ్ఱం స్వభావస్వరూపాదులు సహజంగా వర్ణించబడ్డాయి గాన స్వభావోక్తి.

## 25. వ్యాజస్తుత్యలంకారం

కా. వ్యాజస్తుతిర్ముఖే నిన్దా స్తుతిర్వా రూఢిరన్యథా,

వృ. వ్యాజరూపా వ్యాజేన వా స్తుతిః. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ హిత్వా త్వాముపరోధవన్ధ్యమనసాం మన్యే న మౌలిః పరో
లజ్జావర్జనమన్తరేణ న రమామన్యత్ర సందృశ్యతే,
యస్త్యాగం కురుతేతరాం ముఖశతైరేత్యాశ్రితాయాః శ్రియః
ప్రాప్య త్యాగకృతావమాననమపి త్వయ్యేవ యస్యాః స్థితిః.

వ్యా. వ్యాజేతి :- ముఖే = ప్రారంభంలో, నిన్దా = నింద, స్తుతిర్వా = లేదా స్తుతీ, అన్యథా = మరొక విధంగా, అనగా వరసగా స్తుతి-నిందారూపంగా, రూఢిః = పర్యవసానం, వ్యాజస్తుతిః = వ్యాజస్తుత్యలంకారం.

వి. "వ్యాజరూపా స్తుతిః" (వ్యాజరూపమైన స్తుతి) లేదా "వ్యాజేన స్తుతిః" (వ్యాజంచేత స్తుతి) అని అర్థం. పైకి నిందగా కనబడుతుంది; స్తుతి తాత్పర్య విషయం అవుతుంది. అది 'వ్యాజేన స్తుతిః' కపటంగా స్తుతించడం. పైకి స్తుతి వలె కనబడుతుంది; లోపల నింద ఉంటుంది. అది 'వ్యాజరూపా స్తుతిః' (కపటమైన స్తుతి). ఈ రెండూ వ్యాజస్తుతి భేదాలే.

వ్యా. పైకి నింద వలె కనబడి లోపల స్తుతి ఉన్నదానికి ఉదాహరణం- 'హిత్వా' ఇతి. త్వాం హిత్వా = నిన్ను విడచి, నీవు తప్ప, ఉపరోధవన్ధ్యమనసామ్ = ఉపరోధంతో శూన్యమైన మనస్సు కలవారిలో, ఉపరోధం అనగా ఆశ్రితుల విషయంలో అనుకూలంగా ప్రవర్తించడం, మౌలిః = శిరోమణి, పరః = మరొకడు, న = లేడు అని, మన్యే = తలచెదను. రమామ్ అన్తరేణ = లక్ష్మి తప్ప, అన్యత్ర = మరొకరిలో, లజ్జావర్జనమ్ = సిగ్గు విడవడం, న సందృశ్యతే = కనబడడం లేదు. యః = ఏ నీవు, ముఖశతైః = వందలకొలది మార్గాలచేత, ఏత్య = వచ్చి, ఆశ్రితాయాః = ఆశ్రయించిన, శ్రియః = లక్ష్మియొక్క, త్యాగమ్ = త్యాగమును, తనుతేతరామ్ = అధికంగా చేస్తున్నావో; త్యాగకృతావమాననమ్ = త్యాగంచేత చేయబడిన అవమానాన్ని, ప్రాప్యాపి = పొందికూడా, యస్యాః = ఏ లక్ష్మియొక్క, స్థితిః = స్థితి, త్వయ్యేవ = నీయందే ఉన్నదో.

వి. ఇక్కడ రాజును లక్ష్మని నిందిస్తూన్నట్లు పైకి కనబడుతున్నా రాజులోని దానగుణ-ఐశ్వర్యాదుల స్తుతి గమ్యం అవుతున్నది. కాబట్టి వ్యాజస్తుత్యలంకారం.

అవ. నిందలో పర్యవసానం చెందే స్తుతికి ఉదాహరణం చూపుతున్నాడు

శ్లో॥ హే హేలాజితబోధిసత్త్వ వచసాం కిం విస్తరై స్తోయధే
నాస్తి త్వత్సదృశః పరః పరహితాధానే గృహీతవ్రతః,
తృష్యత్పాన్థజనోపకారఘటనా వైముఖ్యలబ్ధాయశో
భారప్రోద్వహనే కరోషి కృపయా సాహాయకం యన్మరోః.

వ్యా. హే ఇతి :- హేలాజితబోధసత్త్వ=అనాయాసంగా జయించబడిన బోధిసత్త్వుడు గల, హే తోయధే=ఓ! సముద్రమా! వచసామ్=వాక్కుల యొక్క, విస్తరైః=విస్తరములచేత, కిమ్=ఏమి ప్రయోజనం? పరహితాధానే= =పరులకు హితం చేయడంలో, గృహీతవ్రతః=గ్రహించబడిన వ్రతం గల, త్వత్సదృశః=నీతో సమానుడైన, పరః=అన్యుడు, నాస్తి=లేడు. యత్= ఎందువలన, "తృష్యత్....వహనే" తృష్యత్=దప్పికొన్న, పాన్థజన=బాటసారు లకు, ఉపకారఘటనా=ఉపకారం చేయడంలో, వైముఖ్య=వైముఖ్యంచేత, లబ్ధ=పొందబడిన, అయశోభార=అపకీర్తి భారముయొక్క, ప్రోద్వహనే= మోయడంలో, కృపయా=జాలితో, మరోః=ఎడారిప్రదేశానికి, సాహాయకమ్ =సాహాయ్యమును, కరోషి=చేయుచున్నావో.

వి. ఇక్కడ పైకి స్తుతి వలె కనబడే నింద. ఈ శ్లోకం భర్తృహరి రచించిన వాక్యపదీయానికి పుంజరాజు రచించిన వ్యాఖ్యలో ద్వితీయకాండ 249వ శ్లోకం క్రింద ఉదాహరించబడింది.

## 26. సహోక్త్యలంకారం

కా. సా సహోక్తిః సహార్థస్య బలాదేకం ద్వివాచకమ్. 112

వృ. ఏకార్థాభిధాయకమపి సహార్థబలాత్ యత్ ఉభయస్యాప్య వగమకం సా సహోక్తిః. యథా-

శ్లో॥ సహ రిఅహఁణిసాహిం దీహరా సాసదణ్డా
సహ మణివలయేహిం బాప్పధారా గలన్తి,

తుహ సుహఅ విఓఏ తీఅ ఉవ్విగ్గిరీఏ
సహ అ తణులదాఏ దుబ్బలా జీవిదాసా. 495

"సహ దివసనిశాభిర్దీర్ఘాః శ్వాసదణ్డాః
సహ మణివలయైర్బాష్పధారా గలన్తి,
తవ సుభగ వియోగే తస్యా ఉద్విగ్నాయాః
సహ చ తనులతయా దుర్బలా జీవితాశా".

వృ. శ్వాసదణ్డాదిగతం దీర్ఘత్వాది శాబ్దమ్. దివసనిశాదిగతం తు సహార్థసామర్థ్యాత్ ప్రతిపద్యతే.

వ్యా. సా ఇతి :- ఏకమ్ = ఒక పదం, సహార్థస్య = 'సహ' అనే శబ్దం అర్థంయొక్క, బలాత్ = బలంవల్ల, యత్ ద్వివాచకమ్ = రెండింటిని చెప్పును. అనేది ఏది కలదో, సా = అది, సహోక్తిః = సహోక్త్యలంకారం. ఒక అర్థాన్ని మాత్రమే చెప్పేదయినా ఒక పదం ప్రక్కనే ప్రయోగించిన, సహ, సాకం, సార్ధమ్, సమమ్ ఇత్యాదిపదాల అర్థం ప్రభావంవల్ల రెంటింటినీ చెప్పినట్లయితే అది సహోక్త్యలంకారం

సహేతి :— ఇది 'కర్పూరమంజరి' అనే సట్టకంలో నాయికావిరహావస్థను వర్ణిస్తూన్న శ్లోకం. సుభగ = సుందరుడా, తవ వియోగే = నీ వియోగమునందు, ఉద్విగ్నాయాః = ఉద్వేగం చెందిన, తస్యాః = ఆమెయొక్క, శ్వాసదణ్డాః = దండాకారములైన శ్వాసలు, దివసనిశాభిః సహ = పగళ్ళతోను. రాత్రుల తోను కూడ, దీర్ఘాః = దీర్ఘములైనవి. శ్వాసలు, దివసనిశాలూ కూడ దీర్ఘము లయినవి అని అర్థం. బాష్పధారాః = కన్నీటి ధారలు, మణివలయైః సహ = మాణిక్యవలయాలతో కూడ, గలన్తి = జారుతున్నాయి జీవితాశా = జీవితంమీద ఆశ, తనులతయా సహ = శరీరలతతో కూడ, దుర్బలా = దుర్బలమైనది.

శ్వాసేతి :- శ్వాసదండాదులలోని దీర్ఘత్వాదికం శాబ్దం; అనగా శబ్దం చేతనే ప్రత్యక్షంగా చెప్పబడింది. దివసనిశాదులలోని దీర్ఘత్వం 'సహ' శబ్దార్థ సామర్థ్యం వల్ల తెలుస్తూన్నది.

వి 'శ్వాసదణ్డాః దీర్ఘాః' ఇత్యాది విధంగా శ్వాసాదుల దీర్ఘత్వాదులు

ప్రత్యక్షంగా శబ్దం చేతనే చెప్పబడుతున్నాయి. దివసాదుల దీర్ఘత్వాదులు 'సహ' శబ్దార్థాన్ని పట్టి తెలుస్తున్నాయి. శ్వాసలు, దివసనిశలూ కూడా దీర్ఘంగా ఉన్నాయి. మణివలయాలు, బాష్పధారలూ కూడా కారుతున్నాయి. తనులత, జీవితాశా కూడ దుర్బలము లయ్యాయి అని అర్థం.

## 27. వినోక్త్యలంకారం

కా. వినోక్తిః సా వినాన్యేన యత్రాన్యః సన్న నేతరః.

వృ. క్వచిదశోభనః, క్వచిచ్ఛోభనః. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ అరుచిర్నిశయా వినా శశీ
శశినా సాపి వినా మహత్తమః,
ఉభయేన వినా మనోభవ
స్ఫురితం నైవ చకాస్తి కామినోః. 496

శ్లో॥ మృగలోచనయా వినా విచిత్ర
వ్యవహార ప్రతిభా ప్రభాప్రగల్భః,
అమృతద్యుతిసున్దరాశయోఽయం
సుహృదా తేన వినా నరేన్ద్రసూనుః. 497

వ్యా. వినోక్తిరితి :- అన్యేన వినా = అన్యమైన వస్తువు లేకుండా, యత్ర = ఎక్కడ, అన్యః = మరి యొకటి, సన్ = మంచిది, న = కాదో, అనగా అశోభనం అవుతుందో, ఇతరః = అసత్, చెడ్డది, న = కాదో, అనగా శోభనం అవుతుందో, సా = అది, వినోక్తిః = వినోక్తి.

క్వచిదితి:- కొన్ని చోట్ల శోభనం, కొన్నిచోట్ల అశోభనం. అనగా "ఇది లేకపోవడంచేత అది శోభనంగా లేదు" అని వర్ణిస్తే అదొక వినోక్తి భేదం. "ఇది లేకపోవడం వల్ల అది శోభనంగా ఉంది" అని వర్ణిస్తే అది రెండవ వినోక్తి భేదం. క్రమంగా ఉదాహరణలు—

అరుచిరితి:- నిశయా వినా = రాత్రి లేకుండా, శశీ = చంద్రుడు, అరుచిః = కాంతి లేనివాడు. శశినా వినా = చంద్రుడు లేకుండా, సాపి = రాత్రి కూడ, మహత్ = గొప్ప, తమః = చీకటి. ఉభయేన = నిశాచంద్రులు రెండూ లేకుండా, కామినోః = కాముకులయొక్క, మనోభవస్ఫురితమ్ = కామవిలాసం, నైవ చకాస్తి = ప్రకాశించనే ప్రకాశించదు.

వి. ఇక్కడ చంద్రాదులు లేకపోతే రాత్ర్యాదులు శోభాయుక్తంగా ఉండవు అని వర్ణించడంచేత వినోక్త్యలంకారప్రథమభేదం.

అవ. శోభనత్వానికి ఉదాహరణం చూపుతున్నాడు.

వ్యా. మృగేతి :- అయం నరేన్ద్రసూనుః = ఈ రాజకుమారుడు, మృగలోచనయా వినా = ఆ స్త్రీ లేకుండా (లేకపోవడంచేత), విచిత్రవ్యవహారప్రతిభాప్రభాప్రగల్భః = విచిత్రములైన వ్యవహారాల కాంతిచేత ప్రగల్భుడు. తేన = ఆ, సుహృదా వినా = మిత్రుడు లేకుండగా, అమృతద్యుతిసున్దరాశయః = చంద్రుడువలె సుందరమైన అంతఃకరణం కలవాడు.

వి. ఏ రాజపుత్రుడు స్త్రీమోహితుడై కార్యవికలుడుగా ఉండేవాడో, ఆ దుష్టుని స్నేహం చేత చెడిన అంతఃకరణంతో ఉండేవాడో అతడే వాళ్ళు దూరం అవడంతో బాగున్నాడు అని చెప్పడంచేత వినోక్త్యలంకారద్వితీయభేదం.

## 28. పరివృత్త్యలంకారం

కా. పరివృత్తిర్వినిమయో యోఽర్థానాం స్యాత్సమాసమైః. 113

వృ. పరివృత్తిః అలంకారః. ఉదాహరణమ్-

శ్లో॥ లతానామేతాసాముదితకుసుమానాం మరుదయం
మతం లాస్యం దత్వా శ్రయతి భృశమామోదమసమమ్,
లతాస్త్వధ్వన్యానామహహ దృశమాదాయ సహసా
దదత్యాధివ్యాధిభ్రమిరుదితమోహవ్యతికరమ్. 497

వృ. అత్ర ప్రథమార్ధే సమేన సమస్య ద్వితీయే ఉత్తమేన న్యూనస్య.

వ్యా. పరివృత్తిరితి:- అర్థానామ్=వస్తువులయొక్క, సమాసమైః=సమములైన వాటితోను, అసమములైనవాటితోను, యః=ఏ, వినిమయః=వినిమయం (మార్పిడి) కలదో, అది, పరివృత్తిః = పరివృత్త్యలంకారం.

వి. ఒక వస్తువును సమమైన మరొక వస్తువుతో వినిమయం చేస్తే అదొక పరివృత్తి; సమపరివృత్తి. చాల విలువైనదానిని తక్కువ విలువ కలదానితో వినిమయం చేసినా, తక్కువ విలువ కలదానిని చాల విలువ ఉన్నదానితో విని మయం చేసినా అది విషమపరివృత్తి; రెండు విధాల ఉదాహరణం-

లతానామితి:- అయం మరుత్ = ఈ వాయువు, ఉదితకుసుమానామ్ = పుట్టినపుష్పాలుగల, ఏతాసాం లతానామ్ = ఈ లతలకు, మతమ్ = ఇష్టమైన, లాస్యమ్ = లాస్యమును, దత్వా=ఇచ్చి, భృశమ్ = మిక్కలి, అసమమ్=సాటి లేని, ఆమోదమ్ = సువాసనను, శ్రయతి = పొందుచున్నాడు. లతాః తు = లత లైతే, అధ్వన్యానామ్ = బాటసారులయొక్క, దృశమ్ = దృష్టిని, ఆదాయ = గ్రహించి, సహసా = వెంటనే, ఆధివ్యాధిభ్రమిరుదితమోహవ్యతికరమ్ = మనో వ్యథ, వ్యాధి, తిరిగిపోవడం, ఏడ్పు, మోహం-వీటి సంబంధాన్ని లేదా వీటి సముదాయాన్ని, దదతి = ఇస్తున్నాయి. అహహ = అయ్యో!

అత్రేతి:- ఇక్కడ పూర్వార్థంలో సమమైన దానిచేత సమమైనదానికీ, ఉత్తరార్థంలో ఉత్తమమైనదానిచేత న్యూనమైనదానికీ వినిమయం.

అవ. న్యూనమైనదానిచేత ఉత్తమమైనదాని పరివృత్తికి ఉదాహరణం చూపు తున్నాడు-

శ్లో॥ నానావిధప్రహరణైర్నృప సంప్రహారే
స్వీకృత్య దారుణనినాదవతః ప్రహారాన్,
దృప్తారివీరవిసరేణ వసుంధరేయం
నిర్విప్రలమ్భపరిరమ్భవిధిర్వితీర్ణా. 499

వృ. అత్ర న్యూనేనోత్తమస్య పరివృత్తిః.

వ్యా. నానేతి:. నృప = రాజా! సంప్రహారే = యుద్ధమునందు, దృప్తారి వీరవిసరేణ = గర్వించిన శత్రువీరుల సముదాయంచేత, నానావిధప్రహరణైః =

అనేకవిధాలైన ఆయుధాలచేత, ప్రహారాన్ = దెబ్బలను, స్వీకృత్య = స్వీకరించి, నిర్వ్యవలమ్బపరిరమ్భ విధిః = వియోగం లేని ఆలింగనం గల, ఇయం వసుంధరా = ఈ భూమి, వితీర్ణా = ఇవ్వబడింది.

అత్రేతి:- ఇక్కడ న్యూనవస్తువుచేత, ఉత్తమమైనదాని పరివృత్తి.

## 29. భావికాలంకారం

కా. ప్రత్యక్షా ఇవ యద్భావాః క్రియన్తే భూతభావినః
తద్భావికమ్.

వృ. భూతాశ్చ భావినశ్చేతి ద్వన్ద్వః, భావః కవేః అభిప్రాయః అత్రాస్తీతి భావికమ్. ఉదాహరణమ్-

శ్లో॥ ఆసీదఞ్జనమత్రేతి పశ్యామి తవ లోచనే,
భావిభూషణసంభారాం సాక్షాత్కుర్వే తవాకృతిమ్. 500

వృ. ఆద్యే భూతస్య ద్వితీయే భావినః దర్శనమ్.

వ్యా. ప్రత్యక్షా ఇతి:- భూతభావినః = భూతకాలానికి సంబంధించినవి, భవిష్యత్కాలానికి సంబంధించినవీ అయిన, భావాః = పదార్థాలు, ప్రత్యక్షాః ఇవ = ప్రత్యక్షములు వలె, యత్ దృశ్యన్తే = చూడబడుతాయి అనేది ఏది కలదో, తత్ = అది, భావికమ్ = భావికాలంకారం. జరిగిపోయిన విషయాలను, జరుగబోయే విషయాలను ప్రత్యక్షంగా కనబడుతున్నట్లు వర్ణించడం భావికాలంకారం.

భూతా ఇతి:- "భూతాశ్చ భావినశ్చ భూతభావినః" అని ద్వంద్వసమాసం. భావం అనగా కవి అభిప్రాయం. అది దీనిలో ఉంది కాబట్టి భావికం అని చెప్పబడుతున్నది. భూతభావులను కూడా ప్రత్యక్షంగా జరుగుతున్నట్లు చూపాలని కవి ఇచ్ఛగిస్తున్నాడు కాబట్టి ఆ విధంగా వర్ణిస్తాడు. అందుచేత కవిభావాన్ని పట్టి ఏర్పడినది భావికం. ఉదాహరణం—

ఆసీదితి:- అత్ర = ఈ, తవ లోచనే = నీ నేత్రమునందు, అఞ్జనమ్ = కాటుక, ఆసీత్ ఇతి = ఉండెను అని, పశ్యామి = చూస్తున్నాను. భావిభూషణ

సంభారామ్=రాబోవు భూషణముల సంభారం గల, తవ ఆకృతిమ్=నీ ఆకారాన్ని, సాక్షాత్కుర్వే= ప్రత్యక్షంగా చూస్తున్నాను.

ఆద్యే ఇతి:- మొదటి అర్ధంలో భూతమైనదాని దర్శనం, రెండవ అర్ధంలో భావి అయినదాని దర్శనం వర్ణించబడ్డాయి.

## 30. కావ్యలింగాలంకారం

కా. కావ్యలిఙ్గం హేతోర్వాక్యపదార్థతా. 114

వృ. వాక్యార్థతా యథా-

శ్లో॥ వపుఃప్రాదుర్భావాదనుమితమిదం జన్మని పురా
పురారే న ప్రాయః క్వచిదపి భవన్తం ప్రణతవాన్,
నమన్ ముక్తః సమ్ప్రత్యహమతనురగ్రేఽప్యనతిభాక్
మహేశ క్షన్తవ్యం తదిదమపరాధద్వయమపి. 501

వ్యా. కావ్యలిఙ్గమితి:- హేతోః = హేతువుయొక్క, వాక్యపదార్థతా = వాక్యార్థత్వం కాని, పదార్థత్వం కాని, కావ్యలిఙ్గమ్ = కావ్యలింగాలంకారం.

వి. ఏదైనా ఒక విషయం చెప్పి దానికి హేతువును చెప్పడం కావ్యలింగాలంకారం. వాక్యంచేతగాని, ఒక పదంచేత కాని, రెండు మూడు పదాలచేత కాని హేతువును చెప్పవచ్చు. వాక్యంచేత చెపితే అది వాక్యార్థమైన కావ్యలింగం అవుతుంది. పదంచేత లేదా పదాలచేత చెపితే పదార్థమైన కావ్యలింగం అవుతుంది. ఈ విధంగా హేతువు వాక్యార్థం గాని, ఏకపదార్థం గాని, అనేకపదార్థం కాని అవడంచేత కావ్యలింగం మూడువిధాలు. "వాక్యార్థత్వం ఎట్లనగా"-

వపురితి:-పురారే=మహేశ్వరా! వపుఃప్రాదుర్భావాత్=(నాకు) ఈ శరీరం కలగడంవల్ల, ఇదమ్ = ఇది, అనుమితమ్ = ఊహించబడినది; ఏమనగా-పురా జన్మని = పూర్వజన్మయందు, ప్రాయః = బహుశా, క్వచిదపి = ఎక్కడా కూడ, భవన్తమ్ = నిన్ను, న ప్రణతవాన్ = నమస్కరించలేదు. సమ్ప్రతి = ఇప్పుడు, నమన్ = నమస్కరించుచున్న, అహమ్ = నేను, ముక్తః=ముక్తుడనై, అతనుః=

శరీరం లేనివాడనై, అగ్రే అపి = మున్ముందు కూడా, అనతిభాక్ = నమస్కారా భావాన్ని పొందేవాడను, నమస్కరించనివాడను కాగలను. మహేశ = ఓ! మహేశా! తత్ = ఆ, ఇదమ్ = ఈ, అపరాధద్వయమపి = అపరాధద్వయమూ కూడ, క్షన్తవ్యమ్ = క్షమించదగినది.

వి. ఇక్కడ "పురా క్వచిదపి నాహం భవన్తం ప్రణతవాన్" "అగ్రేఽప్యనతిభాక్" అనే అవాంతరవాక్యాల అర్థం అయిన నమస్కరించకపోవడం అపరాధహేతువుగా చెప్పబడింది గాన వాక్యార్థహేతుకకావ్యలింగాలంకారం.

వృ. అనేకపదార్థతా యథా-

శ్లో॥ ప్రణయిసఖీసలీలపరిహాసరసాధిగతై-
ర్లలితశిరీషపుష్పహననైరపి తామ్యతి యత్,
వపుషి వధాయ తత్ర తవ శస్త్రముపక్షిపతః
పతతు శిరస్యకాణ్డయమదణ్డ ఇవైష భుజః, 502

వ్యా. అనేకేతి:- అనేకపదార్థత్వం ఎట్లనగా-

ప్రణయీతి;- మాలతీమాధవంలో మాలతిని బలి ఇవ్వడానికి ఉద్యుక్తుడైన ఆ ఘోరఘంటునితో మాధవుడు అంటూన్న మాటలు. ప్రణయిసఖీసలీలపరిహాసరసాధిగతైః = ప్రేమగల సఖురాళ్ళ విలాసపూర్వకమైన ఉపహాసంచేత పొందబడిన, లలితశిరీషపుష్పహననైరపి = సుకుమారములైన శిరీషపుష్పాల దెబ్బలచేత కూడ, యత్ = ఏ శరీరం, తామ్యతి = కందిపోతుందో, తత్ర వపుషి = అట్టి శరీరంమీద, శస్త్రమ్ = ఆయుధాన్ని, ఉపక్షిపతః = ఎత్తుతున్న, తవ = నీయొక్క, శిరసి = శిరస్సుమీద, ఏషః భుజః = ఈ భుజం, అకాణ్డయమదణ్డః ఇవ = అసమయంలో (హఠాత్తుగా) పడిన యమదండం వలె, పతతు = పడుగాక.

వి. ఇక్కడ "వపుషి శస్త్రముపక్షిపతః" అనే అనేకపదాల అర్థమైన శస్త్రోపక్షేపం, భుజం, వాని నెత్తిమీద పడడానికి హేతువుగాన బహుపదార్థహేతుక కావ్యలింగాలంకారం.

వృ. ఏకపదార్థతా యథా-

శ్లో॥ భస్మోద్ధూలన భద్రమస్తు భవతే రుద్రాక్షమాలే శుభం
హా సోపానపరంపరాం గిరిసుతాకాన్తాలయాలంకృతిమ్,
అద్యారాధనతోషితేన విభునా యుష్మత్సపర్యాసుఖా
లోకోచ్ఛేదిని మోక్షనామని మహామోహే నిలీయమహే.

వృ. ఏషు అపరాధద్వయే పూర్వాపరజన్మనోరనమనం, భుజపాతే శస్త్రోప్రక్షేపః, మహామోహే సుఖాలోకోచ్ఛేదిత్వం చ యథా క్రమముక్తరూపో హేతుః.

వ్యా. ఏకేతి:- ఏకపదార్థత్వం ఎట్లనగా-

భస్మేతి:- శివానుగ్రహంచేత తత్త్వజ్ఞానం కలిగిన ఒక యోగిపుంగవుని మాటలు. భస్మోద్ధూలన = భస్మోద్ధూలనమా? (భస్మం పూసికొనడమా!), తే = నీకు, భద్రమ్ = మంగళం, అస్తు = అగుగాక. రుద్రాక్షమాలే = ఓ! రుద్రాక్షమాలా? శుభమ్ = శుభం ఆగుగాక. గిరిసుతాకాన్తాలయాలంకృతిమ్ = మహేశ్వరుని ఆలయానికి అలంకారమైన, సోపానపరంపరామ్ = మెట్ల పంక్తిని గూర్చి, హా = అయ్యో! (అయ్యో! సోపానపరంపరా!). ఆరాధనతోషితేన = ఆరాధనంచేత సంతోషింపచేయబడిన, విభునా = ప్రభువైన మహేశ్వరునిచేత, అద్య = ఇప్పుడు, యుష్మత్సపర్యాసుఖాలోకోచ్ఛేదిని = మీ సేవాసుఖం అనే వెలుతురును నశింపచేసే, మోక్షనామని = మోక్షం అనే పేరు గల, మహామోహే = మహామోహంలో, నిలీయామహే = అణగిపోతున్నాము.

వి. ఇక్కడ మోక్షం మహామోహం అనడానికి హేతువు సుఖాలోకోచ్ఛేదిత్వం. అది ఒకే పదంచేత చెప్పబడింది గాన ఏకపదార్థహేతుక కావ్యలింగాలంకారం.

ఏషు ఇతి:- పై మూడు శ్లోకాలలో పూర్వాపరజన్మలలో నమస్కరించక పోవడం అపరాధద్వయానికి, శస్త్రోప్రక్షేపం భుజపాతానికి, సుఖాలోకోచ్ఛేదిత్వం మహామోహానికి, క్రమంగా, పైన చెప్పిన రూపం గల, అనగా వాక్యార్థ- అనేకపదార్థ-ఏకపదార్థ రూపమైన, హేతువు.

## 31. పర్యాయోక్తాలంకారం

కా. పర్యాయోక్తం వినా వాచ్యవాచకత్వేన యద్వచః.

వృ. వాచ్యవాచకభావవ్యతిరేకేణావగమనవ్యాపారేణ యత్ ప్రతిపాదనం తత్ పర్యాయేణ భఙ్గ్యన్తరేణ కథనాత్ పర్యాయోక్తమ్. ఉదాహరణమ్-

శ్లో॥ యం ప్రేక్ష్య చిరరూఢాపి నివాసప్రీతిరుజ్ఝితా,
మదేనైరావణముఖే మానేన హృదయే హరేః. 514

వృ. అత్ర ఐరావణశక్రౌ మదమానముక్తౌ జాతావితి వ్యఙ్గ్యమపి శబ్దేనోచ్యతే; తేన యదేవోచ్యతే తదేవ వ్యఙ్గ్యమ్, యథా తు వ్యఙ్గ్యం న తథోచ్యతే-యథా-గవి శుక్లే చలతి దృష్టే "గౌః శుక్లః చలతి" ఇతి వికల్పః యదేవ దృష్టం తదేవ వికల్పయతి. న తు యథా దృష్టం తథా. యతః అభిన్నసంసృష్టత్వేన దృష్టం భేదసంసర్గాభ్యాం వికల్పయతి-

వ్యా. పర్యాయోక్తమితి :- వినా వాచ్యవాచకత్వేన = వాచ్యవాచకభావం లేకుండా, యత్ = ఏ, వచః = చెప్పడం ఉన్నదో అది, పర్యాయోక్తమ్ = పర్యాయోక్తాలంకారం.

వాచ్యేతి :- వాచ్యవాచకభావంకంటె భిన్నమైన అవగమనవ్యాపారం చేత, అనగా వ్యంజనావ్యాపారంచేత, ఏ ప్రతిపాదించడం ఉన్నదో అది పర్యాయోక్తాలంకారం. పర్యాయేణ = భంగ్యంతరంచేత, ఉక్తమ్ = చెప్పుట, పర్యాయోక్తం అని ఈ శబ్దానికి అర్థం.

వి. ఏ అర్థాన్ని శక్తిచేత వాచ్యవాచకభావాన్ని పురస్కరించుకొని చెప్పవలసి ఉన్నదో ఆ అర్థాన్నే వ్యంగ్యవ్యంజకభావాన్ని పురస్కరించుకొని చెప్పడం పర్యాయోక్తం. సాధారణంగా ధ్వనిస్థలాలలో వాచ్యార్థం ఒకటి ఉంటుంది వ్యంగ్యార్థం మరొకటి ఉంటుంది. పర్యాయోక్తంలో రెండూ ఒకటే అని అర్థం. ఉదాహరణం-

యమితి :- మేంఠకుడు అనే కాశ్మీరకవి రచించిన హయగ్రీవవధం అనే నాటకంలోని శ్లోకం అని వ్యాఖ్యాతలు. యమ్ = ఏ హయగ్రీవుణ్ణి, ప్రేక్ష్య = చూచి, ఐరావణముఖే = ఐరావత మనే ఇంద్రుని ఏనుగ ముఖమునందు, మదేన = మదంచేత, హరేః = ఇంద్రునియొక్క, హృదయే = హృదయమునందు, మానేన = అహంకారంచేత, చిరరూఢాపి = చాలకాలమునండి వృద్ధిపొందినదైనా, నివాసప్రీతిః = నివాసమునందు ఆసక్తి, ఉజ్ఝితా = విడవబడిందో.

అత్రేతి :- ఇక్కడ "ఐరావణ-ఇంద్రులు మద-మానవిహీనులు అయినారు" అనే వ్యంగ్యార్థం కూడా శబ్దంచేతనే బోధించబడుతున్నది. అందుచేత ఏది వాచ్యంగా చెప్పబడుతూన్నదో అదే వ్యంగ్యార్థం కూడా. అయితే ఏ విధంగా వ్యంగ్యంగా ఉందో ఆ విధంగా చెప్పబడడం లేదు.

వి. ఒకే అర్థం "ఐరావణ-ఇంద్రులు మదమానవిముక్తులు అయినారు" అని వ్యంజనచేతను, "మదమానాలు ఐరావతేంద్రుల ముఖహృదయాలలో నివాసప్రీతిని విడిచిపెట్టినవి" అని అభిధచేతను చెప్పబడుతున్నది. చెప్పే విధానంలో భేదం ఉంది గాని విషయంలో భేదం లేదు.

అవ. ఒక పద్ధతిలో తెలిసిన అర్థాన్నే మరొక పద్ధతిలో తెలుసుకొనడానికి ఉదాహరణం చూపుతున్నారు-

యథేతి :- తెల్లని ఎద్దు నడిచి వెడుతుండగా చూచినప్పుడు "తెల్లని ఎద్దు నడిచి వెడుతున్నది" అనే వికల్పజ్ఞానం కలుగుతుంది. దేనిని చూచాడో దాన్నే వికల్పిస్తున్నాడు. ఎలా చూచాడో అలా వికల్పించడం లేదు. ఎందువలన అనగా అభిన్నం గాను, అసంసృష్టంగాను చూచినదానినే భేద సంసర్గాలచేత వికల్పిస్తున్నాడు.

వి. దూరంగా నడచివెడుతున్న తెల్లని ఎద్దును చూచినపుడు చూచిన వెంటనే ఒక పదార్థం అనే జ్ఞానం మాత్రమే కలుగుతుంది. ఆ క్షణంలో గోవు (గోత్వజాతి కలది). తెల్లగా ఉంది (తెలుపు అనే గుణం ఉంది), కదలుతూన్నది (చలనం అనే క్రియ ఉంది), ఇది మహిషాదుల కంటె భిన్నమైనది అనే జ్ఞానం కలగదు. మరుక్షణంలో వీటి అన్నింటి జ్ఞానం కలుగుతుంది. మొదటి జ్ఞానం నిర్వికల్పకం, రెండవది సవికల్పకం. సవికల్పకజ్ఞానంలో ఏ జాతి-గుణ-క్రియాదులను చూచాడో అవన్నీ నిర్వికల్పకజ్ఞానం కలిగిన క్షణంలోకూడా చూచే ఉన్నాడు. కాని,

వేరు వేరుగా కలగలేదు. వాటి నన్నింటినీ ఒక ముద్దగా చూచాడు. ఆ విధంగా ఒక ముద్దగా చూచిన వాటినే మళ్ళీ రెండవ జ్ఞానంలో ఏ విధంగా వేరు వేరుగా గ్రహిస్తాడో అదేవిధంగా పైన చెప్పిన శ్లోకంలో వాచ్యంగా ఉన్న అర్థాన్నే వ్యంగ్య రూపంలో గ్రహిస్తాడు. గ్రహణవిధానంలో భేదం తప్ప గ్రహించబడిన అర్థాలలో భేదం లేదు అని భావం.

ద్వితీయోల్లాసంలో ఏడవ కారిక వ్యాఖ్యలో విశదీకరించిన విధంగా బౌద్ధులు అపోహవాదాన్ని అంగీకరిస్తారు. గోవును చూచినప్పుడు 'ఇది గోవుకంటె భిన్నము లైన అశ్వాదులకంటె భిన్నము' అని జ్ఞానం కలుగుతుంది అని వాళ్ళు చెప్పుతారు. వాళ్ళు జాతిని అంగీకరించరు. కాని జాతిని అంగీకరించిన వైయాకరణాదులు 'ఇది గోత్వం అనే జాతితో కూడినది' అనే జ్ఞానం కలుగుతుంది అని అంటారు. పై వృత్తిలో 'అభిన్నాసంసృష్టత్వేన దృష్టమ్' అని పై రెండుమతాలను దృష్టిలో పెట్టుకొని చెప్పబడింది. నిర్వికల్పకజ్ఞానసమయంలో ఆ వస్తువును భిన్నంగా గాని, అనగా గోభిన్నాశ్వాదిభిన్నం అని గాని, జాతి-గుణ-క్రియావిశిష్టం అని కాని చూడడు అని అర్థం.

## 32. ఉదాత్తాలంకారం

కా. ఉదాత్తం వస్తునః సంపత్.

వృ. సంపత్ సమృద్ధియోగః. యథా-

శ్లో॥ ముక్తాః కేలివిసూత్రహారగలితాః సంమార్జనీభిర్హృతాః
ప్రాతః ప్రాఙ్గణసీమ్ని మన్థరచలద్బాలాఙ్ఘ్రిలాక్షారుణాః.
దూరాద్దాడిమబీజశఙ్కితధియః కర్షన్తి కేలీశుకాః
యద్విద్వద్భవనేషు భోజనృపతేస్తత్ త్యాగలీలాయితమ్.

వ్యా. ఉదాత్తమితి :- వస్తునః = వస్తువుయొక్క, సంపత్ = సమృద్ధితో సంబంధం, ఉదాత్తమ్ = ఉదాత్తాలంకారం. వస్తువుల అత్యధిక సమృద్ధిని వర్ణించడం ఉదాత్తాలంకారం అని అర్థం. ఎట్లనగా-

ముక్తాః ఇతి :- యద్విద్వద్భవనేషు = ఎవని విద్వాంసుల గృహాలలో, కేలి

విస్రస్తహారగలితాః = ఆటలలో పోయిన దారాలు గల హారాలనుండి జారినవి, మన్థరచలద్బాలాఙ్ఘ్రిలాక్షారుణాః = మందంగా నడుస్తూన్న బాలుల పాదాల లత్తుక చేత ఎఱ్ఱనైనవి, ప్రాఙ్గణసీమ్ని = వాకిళ్ళలో, ప్రాతః = ప్రాతఃకాలమునందు, సంమార్జనీభిః = చీపుళ్ళచేత, హృతాః = తుడవబడినవి అయిన, ముక్తాః = ముత్యాలను, దాడిమబీజశఙ్కితధియః = దానిమ్మగింజ లని శంకించిన బుద్ధులు గల, కేళీశుకాః = క్రీడాశుకములు. దూరాత్ = దూరంగా, కర్షన్తి ఇతి యత్ = లాగుచున్నాయి అనేది ఏది కలదో, తత్ = అది, భోజనృపతేః = భోజరాజుయొక్క, త్యాగలీలాయితమ్ = దానవిలాసము.

ఇక్కడ పండితుల గృహాలలోని ధనసమృద్ధిని వర్ణించడంచేత ఇది ఉదాత్తాలంకారం.

అవ. మరొకవిధమైన ఉదాత్తాలంకారం చెపుతున్నాడు-

కా. మహతాం చోపలక్షణమ్. 115

వృ. ఉపలక్షణమ్ అఙ్గభావః; అర్థాదుపలక్షణీయే అర్థే. ఉదాహరణమ్-

శ్లో॥ తదిదమరణ్యం యస్మిన్ దశరథవచనానుపాలనవ్యసనీ,
నివసన్ బాహుసహాయశ్చకార రక్షఃక్షయం రామః. 506

వృ. న చాత్ర వీరో రసః; తస్యేహాఙ్గత్వాత్.

వ్యా మహతామితి :- (అంగియైన వర్ణించబడే విషయంలో) మహతామ్ = మహాపురుషులయొక్క, ఉపలక్షణమ్ = అంగత్వవర్ణనం కూడా ఉదాత్తాలంకారం అని అర్థం.

ఉపలక్షణమితి :- ఉపలక్షణమ్ అనగా అంగత్వం. అనగా వర్ణింపదగిన విషయంలో అని అర్థం. ఉదాహరణం-

తదితి :— దశరథవచనానుపాలనవ్యసనీ = దశరథుని వచనాన్ని అనుసరించడంలో అత్యాసక్తి గల, రామః = రాముడు, యస్మిన్ = దేనియందు, నివసన్ = నివసిస్తూ, బాహుసహాయః = బాహువులు మాత్రమే సహాయంగా కలవాడై,

రక్షఃక్షయమ్ = రాక్షసుల క్షయాన్ని, చకార = చేసెనో, తత్ అరణ్యమ్ = ఆ అరణ్యం, ఇదమ్ = ఇదే.

వి. ఇక్కడ మహాపురుషుడైన రాముణ్ణి వర్ణించబడుతూన్న అరణ్యానికి అంగంగా, ఈ అరణ్యంతో సంబంధించి నట్లు, వర్ణించడంచేత ఉదాత్తాలంకారం.

నేతి :- ఇక్కడ వీరరసం అని చెప్పడానికి వీలులేదు. అది ఇక్కడ వర్ణించబడే ప్రస్తుతమైన అరణ్యానికి అంగం కదా? అందుచేత దీనిని అలంకారం గానే గ్రహించడం యుక్తం అని భావం.

## 33. సముచ్చయాలంకారం

కా. తత్సిద్ధిహేతావేకస్మిన్ యత్రాన్యత్తత్కరం భవేత్.
సముచ్చయోఽసౌ

వృ. తస్య ప్రస్తుతస్య కార్యస్య ఏకస్మిన్ సాధకే స్థితే సాధకాన్తరాణి యత్ర సంభవన్తి సః సముచ్చయః. ఉదాహరణమ్—

శ్లో॥ దుర్వారాః స్మరమార్గణాః ప్రియతమో దూరే మనోఽత్యుత్సుకం
గాఢం ప్రేమ నవం వయోఽతికఠినాః ప్రాణాః కులం నిర్మలమ్
స్త్రీత్వం ధైర్యవిరోధి మన్మథసుహృత్ కాలః కృతాన్తోఽక్షమో
నో సఖ్యశ్చతురాః కథం ను విరహః సోఢవ్య ఇత్థం శఠః.

వృ. అత్ర విరహాసహత్వం స్మరమార్గణా ఏవ కుర్వన్తి; తదుపరి ప్రియతమదూరస్థిత్యాది ఉపాత్తమ్. ఏష ఏవ సముచ్చయః సద్యోగే అసద్యోగే సదసద్యోగే చ పర్యవస్యతీతి న పృథక్ లక్ష్యతే. తథాహి-

శ్లో॥ కులమమలినం భద్రా మూర్తిర్మతిః శ్రుతిశాలినీ
భుజబలమలం స్ఫీతా లక్ష్మీః ప్రభుత్వమఖణ్డితమ్,
ప్రకృతిసుభగా హ్యేతే భావా అమీభిరయం జనో
వ్రజతి సుతరాం దర్పం రాజన్ త ఏవ తవాఙ్కుశః. 508

వృ. అత్ర సతాం యోగః. ఉక్తోదాహరణే త్వసతాం యోగః.

శ్లో॥ శశీ దివసధూసరో గలితయౌవనా కామినీ
సరో విగతవారిజం ముఖమనక్షరం స్వాకృతేః,
ప్రభుర్ధనపరాయణః సతతదుర్గతః సజ్జనో
నృపాఙ్గణగతః ఖలో మనసి సప్త శల్యాని మే. 509

వృ. శశిని ధూసరే శల్యే శల్యాన్తరాణీతి శోభనాశోభనయోగః.

వ్యా. తదితి :- తత్సిద్ధిహేతౌ = ఆ కార్యంయొక్క సిద్ధికి హేతువైన, ఏకస్మిన్ = ఒకటి ఉంటూండగా, యత్ర = ఎక్కడ, తత్కరమ్ = ఆ కార్యాన్నే చేసే, అన్యత్ = మరొకటి కూడ, భవేత్ = ఉండునో, అసౌ = ఇది, సముచ్చయః = సముచ్చయాలంకారము.

తస్యేతి :- ప్రస్తుతకార్యాన్ని సాధించేది ఒకటి ఉండగా, ఎక్కడ ఇతర సాధకాలు కూడా చేరుతాయో అది సముచ్చయం. ఉదాహరణం-

దుర్వారా ఇతి :- స్మరమార్గణాః = మన్మథబాణాలు, దుర్వారాః = నివారింప శక్యం కానివి. ప్రియతమః = ప్రియతముడు, దూరే = దూరంలో ఉన్నాడు. మనః = మనస్సు, అత్యుత్సుకమ్ = చాల బెంగగొని ఉన్నది. ప్రేమ = ప్రేమ, గాఢమ్ = గాఢంగా ఉన్నది. వయః = వయస్సు, నవమ్ = నూతనమైనది. ప్రాణాః = ప్రాణాలు, అతికఠినాః = చాల కఠినమైనవి; పోకుండా ఉన్నాయి. కులమ్ = కులము, నిర్మలమ్ = నిర్మలమైనది. స్త్రీత్వమ్ = స్త్రీస్వభావం, ధైర్య విరోధి = ధైర్యానికి విరోధి యైనది. కాలః = కాలం, మన్మథసుహృత్ = మన్మథునికి మిత్రుడు; వసంతము. కృతాన్తః = యముడు, అక్షమః = అసమర్థుడు. అకాలంలో ప్రాణాలు తీయజాలడు. సఖ్యః = సఖురాళ్ళు, చతురాః = నేర్పు గలవాళ్ళు, నో = కారు. ఇత్థమ్ = ఈ విధంగా, శఠః = దుష్టమైన, కాలః = కాలం, కథమ్ = ఎట్లు, సోఢవ్యః = సహించదగినది.

అత్రేతి:- ఇక్కడ-మన్మథబాణాలే విరహాన్ని సహించజాలకపోవడాన్ని చేస్తున్నాయి. పైగా ప్రియతముడు దూరంలో ఉండడం మొదలైనవి కూడా గ్రహించబడ్డాయి. ఈ విధంగా విరహాసహత్వరూపకార్యాన్ని సాధించడానికి

స్మరమార్గణాలు ఉండగా ఇంకా ఇతరకారణాలు కూడా చెప్పబడ్డాయి. అందు చేత సముచ్చయాలంకారం.

అవ. కొందరు, రుద్రటాది ప్రాచీనాలంకారికులు, సద్యోగసముచ్చయం, అసద్యోగసముచ్చయం, సదసద్యోగసముచ్చయం అని కొన్ని భేదాలు చెప్పారు. ఈ చెప్పిన సముచ్చయమే దానిలో పర్యవసానం చెందుతుంది కాబట్టి వాటికి వేరుగా లక్షణాలు చెప్పవలసిన పని లేదు అని చెపుతున్నాడు-ఏష ఇతి-ఈ సముచ్చయమే సద్యోగం (మంచివాటి కలయిక) లోను, అసద్యోగంలోను, సదసద్యోగంలోను పర్యవసానం చెందుతుంది. అందుచేత వాటికి వేరుగా లక్షణాలు చెప్పడంలేదు. ఎట్లనగా-

కులమితి:- రాజన్=రాజా ! అమలినమ్=పరిశుద్ధమైన, కులమ్=కులము, భద్రా = మంగళప్రదమైన, మూర్తిః = ఆకారం, శ్రుతిశాలినీ = శాస్త్రాభ్యాసంచేత ప్రకాశిస్తూన్న, మతిః = బుద్ధి, అలమ్ = అధికమైన, భుజబలమ్ = భుజబలమూ, స్ఫీతా=అత్యధికమైన, లక్ష్మీః=ఐశ్వర్యం, అఖణ్డితమ్=అడ్డులేని, ప్రభుత్వమ్= ప్రభుత్వమూ, ఏతే = ఈ, భావాః = పదార్థాలు, ప్రకృతిసుభగాః హి = స్వభావం చేతనే సుందరమైనవి కదా? అయమ్=ఈ, జనః=సామాన్యపురుషుడు, అమీభిః= వీటిచేత, సుతరామ్ = మిక్కిలి, దర్పమ్ = గర్వాన్ని, వ్రజతి = పొందుతాడు. తే ఏవ = అవే, తవ = నీకు, అఙ్కుశాః = అంకుశాలు, అమార్గంలో ప్రవర్తించ కుండా ఆపే నియంత్రణలు.

అత్రేతి-: ఈ శ్లోకంలో మంచివాటి యోగం. మొదట చెప్పిన 'దుర్వారాః' ఇత్యాది శ్లోకంలో చెడ్డవాటియొక్క యోగం.

శశీ ఇతి:- దివసధూసరః = పగటియందు ధూసరవర్ణం గల, శశీ= చంద్రుడు, గలితయౌవనా = జారిపోయిన యౌవనం గల, కామినీ= కాముకు రాలు, విగతవారిజమ్ = పోయిన పద్మాలు గల, సరః = సరస్సు, స్వాకృతేః = మంచి ఆకారంకలవానియొక్క, అనక్షరమ్ = అక్షరాలు లేని, చదువు లేని, ముఖమ్ = ముఖమూ, ధనపరాయణః = ధనమునందే అత్యాసక్తి గల, ప్రభుః = ప్రభువు, సతతదుర్గతః = ఎల్లప్పుడు దరిద్రుడైన, సజ్జనః = సజ్జనుడు, నృపాఙ్గణ గతః = రాజు ఇంటి వాకిట ఉన్న, ఖలః = దుష్టుడు, సప్త = ఈ ఏడూ, మే మనసి = నా మనస్సునందు, శల్యాని = శల్యాలు.

అత్రేతి:- దూసరవర్ణం గల చంద్రుడు శల్యంగా ఉంటూండగా శల్యాంతరాలు కూడా చెప్పబడ్డాయి గాన శోభనాశోభనాల యోగం.

వి. ఇక్కడ ఒక విషయం పరిశీలించవలసి ఉన్నది. మమ్మటుడు సముచ్చయాలంకారానికి పైన చెప్పిన లక్షణోదాహరణలు చూపి "రుద్రటాదులు సద్యోగం, అసద్యోగం, సదసద్యోగం అని మూడు విధాలైన మరొక సముచ్చయం కూడా అంగీకరించారు. ఆ విభేదాలు కూడా నేను చెప్పిన సముచ్చయోదాహరణలలోనే కనబడతాయి; అందుచేత దానిని వేరుగా నేను చెప్పలేదు"అని అంటూ మూడు ఉదాహరణలు ఇచ్చాడు. 'దుర్వారాః' ఇత్యాది ప్రథమోదాహరణంలో అసద్యోగం అనీ, 'కులమమలినమ్' ఇత్యాది ద్వితీయోదాహరణంలో సద్యోగం అనీ, 'శశీ' ఇత్యాది తృతీయోదాహరణంలో సదసద్యోగం అనీ వివరించాడు. మొదటి ఉదాహరణంలో విరహం దుఃస్సహం అవడానికి స్మరమార్గణాల దుర్వారత్వం అనే ఒక సాధకం (కారణం) ఉంటూండగా, ఇతర కారణాలు కూడా చెప్పబడ్డాయి. రెండవ ఉదాహరణంలో సామాన్యజనులకు గర్వం కలిగించడానికీ, ప్రకృతుడైన రాజుకు వినయం కలిగించడానికీ అమలినకులం అనే ఒక కారణం ఉంటూండగా ఇతర కారణాలు చెప్పబడ్డాయి. మూడవ ఉదాహరణంలో హృదయ శల్యత్వానికి దివసధూసరచంద్రుడు అనే ఒక కారణం ఉంటూండగా మరి కొన్ని కారణాలు కూడా చెప్పబడ్డాయి. ఈ విధంగా మమ్మటుడు చెప్పిన సముచ్చయ లక్షణం వీటికి సమన్వయిస్తుంది. అయితే రుద్రటాలంకారంలో చెప్పిన సద్యోగ-అసద్యోగ-సదసద్యోగాలను ఇక్కడ సమన్వయించడం కుదురుతుందా అనేది ప్రశ్న. రుద్రటుడు సముచ్చయాలంకారాన్ని వాస్తవాలంకార భేదాలలోను, ఔపమ్యాలంకారభేదాలలోను రెండుచోట్ల ప్రతిపాదించాడు. వాస్తవాలంకారాలలో చెప్పిన సముచ్చయంలో చెప్పిన కొన్ని భేదాలలో సద్యోగం, అసద్యోగం, సదసద్యోగం అనే భేదాలు చెప్పి వాటికి ఈ క్రింది ఉదాహరణలు ఇచ్చాడు.

"సామోదే మధు కుసుమే జననయనానన్దనే సుధా చన్ద్రే।
క్వచిదపి రూపవతి గుణా జగతి సునీతం విధాతురిదమ్"(Vii-24)

"సువాసన గల పుష్పంలో తేనెను, జనుల నయనాలకు ఆనందదాయకుడైన చంద్రునిలో అమృతాన్నీ, కొందరు రూపవంతులలో గుణాలను ఉంచి బ్రహ్మదేవుడు మంచి పని చేశాడు" అని దీని భావం. ఇక్కడ 'పుష్పం-మధువు',

'చంద్రుడు-అమృతం', 'రూపవంతుడు - సద్గుణాలు' అని మంచి వాటి కలయిక సద్యోగం.

"అలిఙ్గితాః కరీరైః శమ్యస్తప్తోష్ణపాంసు నిచయేన
మరుతోఽతిఖరా గ్రీష్మే కిమతోఽన్యదభద్రమస్తు మరౌ" (Vii-25)

"గ్రీష్మకాలంలో, మరుప్రదేశంలో కరీరవృక్షాలు (ఒక రకమైన ముళ్ళ చెట్లు) శమీవృక్షాలతోనూ, తీవ్రమైన గాలులు వేడెక్కిన ఇసుక దిబ్బలతోనూ కలిశాయి. ఇంతకంటె చెడ్డది ఏం కావాలి?" అని భావం. ఇక్కడ 'కరీరాలు-శములు', 'వేడిగాలులు-ఇసుక' అనే చెడ్డవాటి కలయిక-అసద్యోగం.

"కమలవనేషు తుషారో రూపవిలాసాదిశాలినీషు జరా
రమణీష్వపి దుశ్చరితం ధాతుర్లక్ష్మీశ్చ నీచేషు" (Vii-26)

"పద్మవనాలమీద మంచు; రూపవిలాసాదులతో ప్రకాశించే స్త్రీలకు ముసలితనం; నీచులకు ఐశ్వర్యం - బ్రహ్మదేవుడు ఎంత చెడ్డ పని చేస్తున్నాడు!" అని భావం. ఇక్కడ మంచివాటికీ చెడ్డవాటికీ కలయిక సదసద్యోగం.

ఈ ఉదాహరణలలో మమ్మటుడు చెప్పిన సముచ్చయలక్షణం అన్వయించదు. అయితే తాను సముచ్చయాలంకారానికి ఉదాహరణగా ఇచ్చిన శ్లోకాలలోనే ఈ సద్యోగ-అసద్యోగ-సదసద్యోగాలలో ఏదో ఒకటి ఉంటుంది కాబట్టి వీటిని ప్రత్యేకంగా పేర్కొనవలసిన పని లేదు అని మమ్మటుని అభిప్రాయం అయి ఉండాలి. కాని మమ్మటు డిచ్చిన సముచ్చయలక్షణం పట్టని రుద్రటుని పై శ్లోకాలలో ఏ అలంకారం అంగీకరించాలి? అందుచేతనే ఇదొక సముచ్చయబేదం అని రుద్రటుడు చెప్పాడు.

రుద్రటుడు ఇచ్చిన ఉదాహరణలలో ఏ జతకు ఆ జతను వేరు చేసి దానిలో సద్యోగాదులు చెప్పినట్లు కనబడుతుంది. కాని మమ్మటుడు తానిచ్చిన ఉదాహరణలలో కూడా ఈ సద్యోగాదులు ఉన్నాయి అని చెప్పుతూ వాటిలో జతలను వేరుచేయకుండా ఒక కార్యం సాధించడానికి ఒక ఉదాహరణంలో అన్నీ అసత్తులూ, ఒక ఉదాహరణంలో అన్నీ సత్తులూ, మూడవ ఉదాహరణంలో సదసత్తులూ కలిశాయి అని విశదీకరిస్తున్నాడు. అందుచేత రుద్రటుడు చెప్పిన సద్యో

గాదులు మమ్మటుడు చెప్పినవాటిలో అంతర్గతం కావు. మమ్మటుడు చూపిన మూడవ ఉదాహరణంలో సదసద్యోగం అని చెప్పాడు. నిజానికి ఇవన్నీ అసద్యోగాలే అని చెప్పాలి. మొదటి ఉదాహరణలో దుర్వారస్మరమార్గణాదులు అన్నీ ఏ విధంగా విరహబాధాకరా లవడంచేత అసత్తులో (చెడ్డవో) అదే విధంగా మనః శల్యాలవడంచేత దివసధూసరశశ్యాదు లన్నీ కూడా అసత్తు లనే చెప్పాలి. కాని మమ్మటుడు ఇక్కడ సదసద్యోగం అన్నాడు. అందుచేత ప్రదీపవ్యాఖ్యానంలో గోవిందఠక్కుర్ చంద్రుడు సత్తు, మిగిలిన వన్నీ అసత్తులు; వీటి యోగం అని ఏదో విధంగా సమర్థించాడు. మమ్మటుని అభిప్రాయం ఇదే కావచ్చును. సమర్థనం మాత్రమే. అందుచేత మరికొందరు వ్యాఖ్యాతలు ఈ అభిప్రాయాన్ని ఖండిస్తూ మరొక విధంగా సమర్థించడం కోసం ప్రయత్నించారు. సదసద్యోగం అంటే సత్తూ అసత్తూ కలవడం అని అర్థంకాదు (ద్వంద్వసమాసం కాదు), సత్తూ అసత్తూ కూడా అయిన వాటి కలయిక (కర్మధారయసమాసం); చంద్రుడు సహజంగా సత్తు. ధూసరత్వంచేత అసత్తు. ఈ విధంగా చంద్రునిలోనే సదసద్యోగం అని వ్యాఖ్యానించారు. ఇది మమ్మటుడు పై రెండు శ్లోకాల విషయంలో ఆవిష్కరించిన అభిప్రాయానికి అనుగుణంగా లేదు. ఇలా చెపితే 'ప్రియతమో దూరే' అన్న చోట కూడా ఇలాంటి సదసద్యోగమే కదా అని ఆశంకించుకొని దానికి ఏదో కుదరని సమాధానం చెప్పారు. అందుచేత మమ్మటుని సద్యోగాదులను గూర్చిన ఈ విమర్శ అనావశ్యకం అని తోస్తుంది.

అవ. మరొక విధమైన సముచ్చయాలంకారం నిరూపిస్తున్నాడు-

కా. స త్వన్యో యుగపద్ యా గుణక్రియాః. 116

వృ. గుణౌ చ క్రియే చ గుణక్రియే చ గుణక్రియాః. క్రమేణో దాహరణమ్-

శ్లో॥ విదలితసకలారికులం తవ బలమిదమభవదాశు విమలం చ,
ప్రఖలముఖాని నరాధిప మలినాని చ తాని జాతాని. 510

శ్లో॥ అయమేకపదే తయా వియోగః
ప్రియయా చోపనతః సదుఃసహో మే,

నవవారిధరోదయాదహోభి
ర్భవితవ్యం చ నిరాతపత్వరమ్యైః. 511

శ్లో॥ కలుషం చ తవాహితేష్వకస్మా
త్సితపఙ్కేరుహసోదరశ్రి చక్షుః,
పతితం చ మహీపతీన్ద్ర తేషాం
వపుషి ప్రస్ఫుటమాపదాం కటాక్షైః. 512

వ్యా. స ఇతి :- యుగపత్ = ఒక్కమారుగా, యాః=ఏ, గుణక్రియాః= గుణాలు, క్రియలూ ఉన్నవో. సః తు = అది, అన్యః=మరియొక సముచ్చయం.

గుణౌ ఇతి:- 'గుణక్రియాః' అనే దానికి 'రెండు గుణాలు', లేదా 'రెండు క్రియలు', లేదా 'గుణమూ, క్రియా' అని అర్థం.

వి. ఒకే సమయంలో రెండు గుణాలు కాని, రెండు క్రియలు గాని, గుణమూ క్రియా గాని ఏర్పడినట్లు (కలిసినట్లు) వర్ణిస్తే అది కూడ సముచ్చయాలంకారమే. వరసగా ఉదాహరణలు—

విదలితేతి - ఇది రుద్రటకావ్యాలంకారంలోని శ్లోకం. నరాధిప = రాజా! తవ = నీయొక్క, ఇదమ్ = ఈ, బలమ్ = సేన, అశు = శీఘ్రంగా, విదలితసకలారికులమ్ = నశింపచేయబడిన సమస్తశత్రుసముదాయం కలది, విమలం చ = నిర్మలమూ, అభవత్ = ఆయెను. తాని = ఆ, ప్రఖలముఖాని = దుష్టుల ముఖాలు కూడ, మలినాని = మలినములుగా. జాతాని = అయినవి.

వి. ఇక్కడ విమలత్వ-మలినత్వాలు అనే గుణాలు ఒకే సమయంలో కలిగినట్లు చెప్పబడింది గాన సముచ్చయాలంకారం.

అయమితి :- విక్రమోర్వశీయంలో పురూరవుని మాటలు. మే = నాకు, ఏకపదే = హటాత్తుగా, సుదుఃసహః = చాల సహించ శక్యం కాని, తయా ప్రియయా వియోగః = ఆ ప్రియురాలితో వియోగం, ఉపనతః = వచ్చినది. అహోభిః = దివసములచేత, నవవారిధరోదయాత్=నూత్నమేఘాల ఉదయంవల్ల, నిరాతపత్వరమ్యైః = ఎండ లేకపోవడంచేత రమ్యాలుగా, భవితవ్యం చ = అగుట కూడ (జరిగింది).

వి. ఇక్కడ విరహం రావడం, దివసాలు రమ్యాలుగా అవడం అనే రెండు క్రియలు ఒకే సమయంలో జరిగినట్లు వర్ణించడంచేత సముచ్చయాలంకారం.

కలుషమితి :- మహీపతీన్ద్ర = ఓ! రాజేంద్రా! తవ = నీయొక్క, సిత పఙ్కేరుహసోదరశ్రి = తెల్లని పద్మం వంటి కాంతి గల, చక్షుః = నేత్రం, అకస్మాత్ = అకస్మాత్తుగా, అహితేషు=శత్రువుల విషయంలో, కలుషం చ = కలుషము. తేషాం వపుషి = వాళ్ళ శరీరమునందు, ఆపదామ్ = ఆపదలయొక్క, కటాక్షైః = కటాక్షాలచేత, పతితం చ = పడుట.

వి. ఇక్కడ కలుషత్వం అనే గుణం, పతనం అనే క్రియా రెండూ ఒకే కాలంలో సంభవించి నట్లు వర్ణించడంచేత సముచ్చయాలంకారం.

వృ. "ధునోతి చాసిం తనుతే చ కీర్తిమ్" ఇత్యాదేః "కృపాణపాణిశ్చ భవాన్ రణక్షితౌ ససాధువాదాశ్చ సురాః సురాలయే" ఇత్యాదేశ్చ దర్శనాత్ 'వ్యధికరణే' ఇతి 'ఏకస్మిన్ దేశే' ఇతి చ న వాచ్యమ్.

వ్యా. రుద్రటాదులు ఈ గుణక్రియాదుల సముచ్చయం వేరు వేరు స్థానాలలో సంభవించాలి అనే అభిప్రాయంతో 'వ్యధికరణే' అని చెప్పారు. ఒకే ప్రదేశంలో జరగాలి అనే అభిప్రాయంతో కొందరు 'ఏకస్మిన్ దేశే' అని చెప్పారు. ఈ రెండూ కూడా యుక్తం కాదని చెప్పుచున్నాడు.

ధునోతీతి :- "ఖడ్గాన్ని కదుపుతున్నాడు; కీర్తిని వ్యాపింప చేస్తున్నాడు" ఇత్యాదులు, "నువ్వు రణరంగంలో చేతితో ఖడ్గం పట్టావు; స్వర్గంలో దేవతలు సాధువాదాలు చేయడం ప్రారంభించారు" ఇత్యాదులు కనబడుతున్నాయి. అందువల్ల 'వ్యధికరణే' అనీ, 'ఏకస్మిన్ దేశే' అనీ (లక్షణంలో) చేర్చకూడదు.

వి. 'ధునోతి' ఇత్యాదివాక్యంలో ఖడ్గం కదల్చడం, కీర్తిని వ్యాపింపచేయడం అనే రెండు క్రియలూ ఒకే వీరునిలో ఉన్నట్లు చెప్పబడింది. అందుచేత వైయధికరణ్యం లేదు గాన 'వ్యధికరణే' అని లక్షణంలో చేర్చగూడదు. "కృపాణపాణిః" ఇత్యాది వాక్యంలో రాజు రణభూమిలో ఖడ్గం ధరించినట్లు, స్వర్గంలో దేవతలు సాధువాదాలు చేస్తూన్నట్లు వర్ణించడంచేత ఒక క్రియ రణభూమిలో

జరిగింది. మరొకటి స్వర్గంలో జరిగింది గాన 'ఏకస్మిన్ దేశే' అని కూడ లక్ష ణంలో చేర్చకూడదు అని భావం.

## 34. పర్యాయాలంకారం

కా. ఏకం క్రమేణానేకస్మిన్ పర్యాయః.

వృ. ఏకం వస్తు క్రమేణానేకస్మిన్ భవతి, క్రియతే స పర్యాయః. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ నన్వాశ్రయస్థితిరియం తవ కాలకూట
కేనోత్తరోత్తరోత్తరవిశిష్టపదోపదిష్టా,
ప్రాగర్ణవస్య హృదయే వృషలక్ష్మణోఽథ
కణ్ఠేఽధునా వససి వాచి పునః ఖలానామ్. 513

వ్యా. ఏకమితి :- ఏకమ్ = ఒక వస్తువు, క్రమేణ = క్రమంచేత, అనేకస్మిన్ = అనేకమైనదానియందు సంబంధించినట్లయితే, పర్యాయః = పర్యాయాలంకారం.

ఏకమితి :- ఒక వస్తువు క్రమంగా అనేకవస్తువులమీద ఉన్నా లేదా చేయబడినా అది పర్యాయాలంకారం. అనగా ఈ అలంకారంలో రెండు భేదా లని అర్థం. క్రమంగా ఉదాహరణం.

నన్వితి:- ఇది భల్లటశతకంలోని శ్లోకం. నను కాలకూట=ఓ! కాలకూటమా! తవ=నీకు, ఉత్తరోత్తరవిశిష్టపదా=ఉత్తరోత్తరంవిశిష్టమైన స్థానం గల, ఇయమ్ =ఈ, ఆశ్రయస్థితిః = ఆశ్రయాలమీద స్థితి, కేన = ఎవనిచేత, ఉపదిష్టా=నేర్ప బడింది? ప్రాక్ = పూర్వం, అర్ణవస్య = సముద్రంయొక్క, హృదయే = హృద యంలోను, అథ = అటుపిమ్మట, వృషలక్ష్మణః = ఈశ్వరునియొక్క, కణ్ఠే= కంఠమునందు ఉంటివి. అధునా పునః = ఇప్పుడైతే, ఖలానామ్=దుష్టులయొక్క, వాచి = వాక్కునందు, వససి = వసిస్తున్నావు.

వి. ఇక్కడ ఒకే కాలకూటం క్రమంగా వేరు వేరు స్థానాలలో ఉన్నట్లు

వర్ణించబడింది గాన ఒకే వస్తువు అనేకాధారాలలో వరసగా ఉండడం అనే ప్రథమ పర్యాయభేధానికి ఉదాహరణం.

వృ. యథా వా-

శ్లో॥ బిమ్బోష్ఠ ఏవ రాగస్తే తన్వి పూర్వమదృశ్యత,
అధునా హృదయేఽప్యేష మృగశాబాక్షి దృశ్యతే. 514

వృ. రాగస్య వస్తుతో భేదేఽప్యేకతయా అధ్యవసితత్వాదేకత్వమ్ అవిరుద్ధమ్.

వ్యా. యథా ఇతి :- మరొక ఉదాహరణం ఎట్లనగా-

బిమ్బోష్ఠ ఇతి :- పద్మగుప్తుని నవసాహసాంకచరితంలోని శ్లోకం ఇది. మృగశాబాక్షి=లేడి కన్నుల వంటి కళ్లు గలదానా! తన్వి=ఓ! సుందరీ! (సన్నని దానా!) పూర్వమ్ = పూర్వం, రాగః = రాగం, రాగశబ్దానికి ఎరుపు అనురాగం అని రెండర్థాలు. తే = నీ యొక్క, బిమ్బోష్ఠే ఏవ = దొండపండు వంటి ఓష్ఠం మీదనే, అదృశ్యత = చూడబడెను. అధునా = ఇప్పుడు, ఏషః = ఇది. హృదయేఽపి = హృదయంలో కూడా, లక్ష్యతే = చూడబడుచున్నది.

రాగస్యేతి:- వాస్తవంలో రాగం వేరే అయినా ఒకటిగా అధ్యవసానం (కావాలని నిశ్చయంచేయడం) వల్ల ఏకత్వం విరుద్ధం కాదు.

వి. ఓష్ఠాలలో ఉన్న రాగం (ఎరుపు) వేరు. హృదయంలో ఉన్న రాగం (అనురాగం) వేరు. అయినా రాగత్వేన ఈ రెండూ ఒకటే అని కావాలని నిశ్చయం చేయడంచేత (అధ్యవసానంచేత) ఏకంగా భావించి అక్కడ ఉన్న రాగమే ఇక్కడ ఉన్నది అని వర్ణించబడింది వాస్తవికమైన ఏకత్వం పై ఉదాహరణలో; ఈ ఉదాహరణలో కల్పితమైన ఏకత్వం.

అవ. ఒకదానిని అనేకస్థానాలలో చేయడానికి ఉదాహరణం చూపుతున్నాడు.

గాథ. తం తాణ సిరిసహోఅరరఅణాహరణమ్మి హిఅఅమేక్కరసం
బిమ్బాహరే పిఆణం ణివేసిఅం కుసుమబాణేణ. 515

"తత్తేషాం శ్రీసహోదరరత్నాహరణే హృదయమేకరసమ్,
బిమ్బాధరే ప్రియాణాం నివేశితం కుసుమబాణేన"

వ్యా. తం ఇతి :- ఆనందవర్ధనుని విషమబాణలీలలోని శ్లోకం. శ్రీసహోదరరత్నాహరణే = లక్ష్మికి సహోదరులైన రత్నాలను హరించడంలో, ఏకరసమ్ = ఒకే ఒక ఆసక్తి గల, తత్ = ఆ, తేషాం హృదయమ్ = ఆ అసురుల హృదయం, కుసుమబాణేన = మన్మథునిచేత, ప్రియాణామ్ = ప్రియురాళ్ళయొక్క, బిమ్బాధరే = బింబం వంటి అధరోష్ఠమునందు, నివేశితమ్ = ఉంచబడింది.

వి. పూర్వం లక్ష్మినివాసస్థానాలైన రత్నాలను (శ్రేష్ఠవస్తువులను) హరించడంలో ఆసక్తి కలదిగా చేయబడిన హృదయం ఇప్పుడు ప్రియాబింబోష్ఠంమీద ఆసక్తమైనట్లు చేయబడింది అని వర్ణించడంచేత పర్యాయాలంకారం.

వి. కావ్యప్రకాశం కొన్ని ప్రతులలో 'నన్వాశ్రయస్థితిః' ఇత్యాది శ్లోకం తరవాత ఈ క్రింది శ్లోకం కూడా ఉంది. ప్రదీపకారుడైన గోవింద ఠక్కుర్ పాఠం ప్రకారం లేదు. అతిప్రాచీనమైన సంకేతవ్యాఖ్యానం ప్రకారం ఈ శ్లోకం ఉంది.

శ్లో॥ శ్రోణీభారస్త్యజతి తనుతాం సేవతే మధ్యభాగః
పద్భ్యాం ముక్తాస్తరలగతయః సంశ్రితా లోచనాభ్యామ్,
ధత్తే వక్షః కుచసచివతామద్వితీయం చ వక్త్రం
తద్గాత్రాణాం గుణవినిమయః కల్పితో యౌవనేన.

వ్యా. శ్రోణీభారః = కటిప్రదేశభారం, తనుతామ్ = సూక్ష్మత్వాన్ని, త్యజతి = విడచుచున్నది. మధ్యభాగః = నడుము, సేవతే = తనుత్వాన్ని పొందుతున్నది. పద్భ్యామ్ = పాదాలచేత, తరలగతయః = చంచలగమనాలు, ముక్తాః = విడవబడ్డాయి. లోచనాభ్యామ్ = నేత్రాలచేత, సంశ్రితాః = ఆశ్రయించబడ్డాయి. వక్షః = వక్షఃస్థలం, కుచసచివతామ్ = కుచములతో కూడుటను (సద్వితీయత్వాన్ని), ధత్తే = ధరించుచున్నది. వక్త్రం చ = ముఖం, అద్వితీయమ్ = రెండవది లేనిది (సాటి లేనిది). యౌవనేన = యౌవనంచేత, తద్గాత్రాణామ్ = ఆమె అవయవాలలో, గుణవినిమయః = గుణాల వినిమయం (మార్పిడి), కల్పితః = చేయబడింది.

వి. ఇక్కడ ముందు శ్రోణీప్రదేశంలో ఉన్న తనుత్వం తరవాత మధ్య భాగం చేరింది అనీ, పాదాలలో ఉన్న చాంచల్యం నేత్రాలలో చేరిందనీ, వక్షః స్థలంలో ఉన్న అద్వితీయత్వం (రెండవది లేకపోవడం, సాటి లేకపోవడం అని రెండర్థాలు) ముఖాన్ని చేరిం దనీ వర్ణించడంచేత పర్యాయాలంకారం. ఈ శ్లోకం లోని పూర్వార్ధం మాత్రమే పర్యాయానికి ఉదాహరణం అని సంకేతవ్యాఖ్యలో చెప్పబడింది.

కా. అన్య స్తతోఽన్యథా.

వృ. అనేకమేకస్మిన్ క్రమేణ భవతి క్రియతే వా సోఽన్యః. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ మధురిమరుచిరం వచః ఖలానా
మమృతమహో ప్రథమం పృథు వ్యనక్తి,
అథ కథయతి మోహహేతుమన్త
ర్గతమివ హాలహలం విషం తదేవ. 516

శ్లో॥ తద్గేహం నతభిత్తి మన్దిరమిదం లబ్ధావకాశం దివః
సా ధేనుర్జరతీ నదన్తి కరిణామేతా ఘనాభా ఘటాః,
స క్షుద్రో ముసలధ్వనిః కలమిదం సంగీతకం యోషితా
మాశ్చర్యం దివసైర్ద్విజోఽయమియతీంభూమింసమారోపితః

వృ. అత్ర ఏకస్యైవ హానోపాదానయోరవివక్షితత్వాత్ న పరివృత్తిః

వ్యా. అన్య ఇతి:- తతః = వెనుక చెప్పినదాని కంటె, అన్యథా = విపరీతంగా ఉన్నట్లయితే, అన్యః = మరొకవిధమైన పర్యాయం.

అనేకమితి:- అనేకవస్తువులు క్రమంగా ఒక వస్తువునందు ఉన్నా లేదా, చేయబడినా అది మరియొక పర్యాయాలంకారభేదం. క్రమంగా ఉదాహరణం.

మదురిమేతి:- మధురిమరుచిరమ్ = మాధుర్యంచేత సుందరమైన, ఖలానాం

వచః = దుష్టుల వచనం, ప్రథమమ్=ముందుగా, పృథు = అధికమైన, అమృతమ్ = అమృతాన్ని, వ్యనక్తి = ప్రకటిస్తుంది. అథ = పిమ్మట, తదేవ = అదే, అన్తర్గతమ్ = లోపల ఉన్న, మోహహేతుమ్=మోహానికి హేతువైన, హాలహలం విషమ్ = హాలహలవిషాన్ని, కథయతీవ = చెప్పునట్లు ఉంటుంది. అహో = ఏమి ఆశ్చర్యం!

వి. ఇక్కడ ఒకే ఖలవచనంలో క్రమంగా అమృతవ్యంజకత్వం, విష కథనం అనేవి ఉన్నట్లు వర్ణించబడింది గాన పర్యాయాలంకారం.

తదితి:- తత్ = ఆ, గేహమ్ = గృహం, నతభిత్తి = వంగిపోయిన గోడలు గలది. ఇదం మన్దిరమ్ = ఈ ఇల్లు, దివః = ఆకాశంనుండి, లబ్ధావకాశమ్ = పొందబడిన అవకాశం గలది. సా = ఆ, ధేనుః = ఆవు, జరతీ = ముసలిది, కరిణామ్ = ఏనుగుల యొక్క, ఏతాః = ఈ, ఘనాభాః = మేఘాలవంటి కాంతి గల, ఘటాః = సమూహాలు, న్నదన్తి = ధ్వనిచేస్తున్నాయి. సః = ఆ, క్షుద్రః = నికృష్టమైన, ముసలధ్వనిః = రోకళ్ళ చప్పుడు; ఇదమ్ = ఈ, కలమ్ = మధుర మైన, యోషితామ్ = స్త్రీలయొక్క, సంగీతకమ్ = గానము. అయం ద్విజః = ఈ బ్రాహ్మణుడు, దివసైః = కొన్ని రోజులచేతనే, ఇయతీమ్ = ఇంతటి, భూమిమ్= సమృద్ధిసీమను, సమారోపితః = అధిష్ఠింపచేయబడ్డాడు.

వి. ఇక్కడ ఒక్క బ్రాహ్మణునియందు ఆ గేహం, ఈ మందిరం మొదలైనవి క్రమంగా (ముందు ఆ గేహం, తరవాత ఈ మందిరం అనే క్రమం చేత) దివసాలు సమకూర్చినట్లు వర్ణింపబడింది. అందుచేత ఒక వస్తువునందు అనేక వస్తువులను చేయడం అనే పర్యాయాలంకారం.

అత్రేతి:- ఇక్కడ ఒకే వ్యక్తి హానోపాదానాలు చేసినట్లు వివక్షితం కాదు గాన పరివృత్త్యలంకారం కాదు.

వి. పూర్వం ఉన్న గేహాదులను విడచి మందిరాదులను స్వీకరించి నట్లు వర్ణించడంచేత పరివృత్త్యలంకారం చెప్పవచ్చును కదా అని ఆశంకకు అవకాశం లేదు. ఉన్నదానిని విడచి మరొకటి స్వీకరించడం అనేది చెప్పడం ఇక్కడ అభీష్టం కాదు. తన వద్ద ఉన్నదానిని మరొకరికి ఇచ్చి తాను వారినుండి ఒక వస్తువు గ్రహిస్తే పరివృత్తి. ఇక్కడ గేహాదుల్ని ఎవరూ తీసికొన్నట్లు వర్ణించ

లేదు; ఎవరో మందిరాదులు ఇచ్చినట్లు కూడా చెప్పలేదు. అందుచేత పరివృత్తి కాదని భావం.

## 35. అనుమానాలంకారం

కా. అనుమానం తదుక్తం యత్సాధ్యసాధనయోర్వచః. 117

వృ. పక్షధర్మాన్వయవ్యతిరేకిత్వేన త్రిరూపో హేతుః సాధనమ్. ధర్మిణి అయోగవ్యవచ్ఛేదో వ్యాపకస్య సాధ్యత్వమ్. యథా-

శ్లో॥ యత్రైతా లహరీచలాచలదృశో వ్యాపారయన్తి భ్రువం
యత్ తత్రైవ పతన్తి సంతతమమీ మర్మస్పృశో మార్గణాః,
తచ్చక్రీకృతచాపమఞ్చితశరప్రేఙ్ఖత్కరః క్రోధనో
ధావత్యగ్రత ఏవ శాసనధరః సత్యం సదాసాం స్మరః.518

వృ. సాధ్యసాధనయోః పౌర్వాపర్యవికల్పేన కించిద్వైచిత్ర్యమితి న తథా దర్శితమ్.

వ్యా. అనుమానమితి :- సాధ్యసాధనయోః = సాధ్యసాధనాలయొక్క, యత్ = ఏ, వచః = చెప్పడం ఉన్నదో, తత్ = అది, అనుమానమ్ = అనుమానాలంకారంగా, ఉక్తమ్ = చెప్పబడినది.

పక్షేతి:- పక్షధర్మత్వ-అన్వయిత్వ-వ్యతిరేకిత్వాలచేత మూడు విధాలైన హేతువు సాధనం. వ్యాపకానికి ధర్మియందు అయోగవ్యవచ్ఛేదం సాధ్యత్వం.

వి. 'పర్వతో వహ్నిమాన్ ధూమాత్' (పర్వతంమీద అగ్ని ఉంది, ధూమం ఉంది కాబట్టి) అనే వాక్యంలో ధూమం సాధనం; దీనికే హేతువు అని పేరు. వహ్ని సాధ్యం. సాధ్యం దేనిమీద ఉన్నదో అది పక్షం. ఇక్కడ పర్వతం పక్షం. సాధనం (హేతువు)లో మూడు అంశాలు ఉండాలి. అది పక్షంలో ఉండాలి. పక్షంలో ఉండడానికి 'పక్షధర్మత్వం అని పేరు. ఇది మొదటి అంశం. ఎక్కడ సాధ్యం నిశ్చితమో, తప్పకుండా ఉంటుం దని తెలుసునో, అది సపక్షం. ధూమం ఉన్న వంటిల్లు మొదలైనవాటిలో అగ్ని ఉన్నది అని నిశ్చితంగా తెలుసును, అందుచేత

అది సపక్షం. సాధనం సపక్షంలో ఉండాలి. దీనికే 'అన్వయిత్వం' అని పేరు. ఇది రెండవ అంశం. ఎక్కడ సాధ్యం ఉండడం అసంభవం అని నిశ్చితమో అది విపక్షం. చెరువు మొదలైనవాటిల్లో వహ్ని ఉండదు అని నిశ్చితంగా తెలుసును. అందుచేత అది విపక్షం. సాధనం విపక్షంలో ఉండకూడదు దీనికే 'వ్యతిరేకిత్వం' అని పేరు. ఇది మూడవ అంశం, ఈ మూడు అంశాలు ఉన్నదే సాధనం అవుతుంది "యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః" (ఎక్కడెక్కడ ధూమం ఉంటుందో అక్కడల్లా నిప్పు ఉంటుంది)అనేదానికి, 'వ్యాప్తి' అని పేరు. దీనితో ధూమానికి 'వ్యాప్యం' అనీ, అగ్నికి 'వ్యాపకం' అనీ పేరు ధర్మియందు అనగా పక్షమునందు, వ్యాపకంయొక్క, అయోగవ్యవచ్ఛేదం సాధ్యత్వం. అయోగవ్యవచ్ఛేదం అనగా లేకపోవడాన్ని నిషేధించడం; అనగా తప్పకుండా ఉన్న దని చెప్పడం. ధర్మియందు తప్పకుండా ఉన్న దని ఏ వ్యాపకం చెప్పబడుతుందో అది సాధ్యం. ఇక్కడ ధూమం సాధనం, అగ్ని సాధ్యం. కవి ప్రతిభచేత కల్పించిన సాధనంచేత ఒక ధర్మియందు సాధ్యాన్ని ఊహించడం అనుమానాలంకారం అని అర్థం. చమత్కారజనకంగా ఉన్నప్పుడు మాత్రమే సాధ్యసాధననిర్దేశం అలంకారం అవుతుంది. కాని పైన చూపిన "పర్వతో వహ్నిమాన్" ఇత్యాదులు అలంకారాలు కావు. శాస్త్రీయన్యాయమూలకాలైన అలంకారా లన్నింటిలోనూ చమత్కారజనకత్వం అనేది ఉండేనే అలంకారత్వం అని గ్రహించాలి. ఉదాహరణం ఎట్లనగా-

యత్రేతి:- లహరీచలాచలదృశః = తరంగాల వలె మిక్కిలి చంచలములైన నేత్రాలు గల, ఏతాః = ఈ యువతులు, యత్ర = ఎవనియందు, భ్రువమ్ = కనుబొమ్మను, వ్యాపారయన్తి = వక్రంగా చేస్తున్నారో, కటాక్షం ప్రసరింపచేస్తున్నారో, తత్రైవ = అక్కడనే, ఆ యువకునియందే మర్మస్పృశః = మర్మస్థలాలను స్పృశించే. అమీ మార్గణాః = ఈ బాణాలు, సంతతమ్ = అవిచ్ఛిన్నంగా, పతన్తి ఇతి యత్ = పడుచున్న వనే మాట ఏది కలదో, తత్ = ఆ కారణంవల్ల, ఆసామ్ = ఈ యువతులయొక్క, శాసనధరః = ఆజ్ఞను ధరిస్తూన్నవాడై, క్రోధనః = క్రోధస్వభావం గల, స్మరః = మన్మథుడు, అఞ్చితశరప్రేఙ్ఖత్కరః = ధనస్సునందు సంధించబడిన బాణాలయందు కదలుచున్న హస్తాలు కలవాడై, చక్రీకృతచాపమ్ = చక్రంగా చేయబడిన ధనస్సు కలుగునట్లుగా, అగ్రతః ఏవ = వాళ్ళ ఎదుటనే, ధావతి = శీఘ్రంగా వస్తున్నాడు. సత్యమ్ = సత్యము.

వి. ఇక్కడ యువతుల కటాక్షాలకు లక్ష్యమైనవానియందు బాణాలు పడడం అనేది సాధనం. ఈ సాధనాన్ని పట్టి ఆ యువతుల ముందు మన్మథుడు ధనస్సు ఎక్కుపెట్టి శీఘ్రంగా వస్తున్నాడు అనేది సాధ్యంగా చెప్పబడింది. అందు చేత ఇది అనుమానాలంకారం.

సాధ్యేతి:- సాధ్యసాధనాల పౌర్వాపర్యవికల్పంలో వైచిత్ర్యం ఏమీ లేదు గాన ఆ విధంగా చెప్పబడలేదు.

వి. సాధ్యసాధనాల నిర్దేశం అనుమానాలంకారం అని చెప్పబడింది. సాధ్యప్రతిపాదకవాక్యాన్ని ముందు చెప్పి తరవాత సాధనప్రతిపాదకవాక్యాన్ని చెప్పవచ్చు. లేదా సాధనవాక్యాన్ని ముందు చెప్పి తరవాత సాధ్యవాక్యాన్ని చెప్ప వచ్చు. ఈ విధంగా రుద్రటాదులు చెప్పినట్లు ఈ అలంకారంలో రెండు భేదాలు చెప్పవచ్చును. కాని దీనిలో వైచిత్ర్యం ఏమీ లేదు గాన భేదద్వయాన్ని చెప్ప వలసిన పని లేదు. ఒక భేదంలో ఉన్న చమత్కారంకంటె రెండవ భేదంలోని చమత్కారం విలక్షణంగా ఉంటేనే రెండు భేదా లని చెప్పాలి కాని చమత్కారంలో వైలక్షణ్యం లేనప్పుడు అలాంటి విభాగాలు అనావశ్యకాలు.

## 36. పరికరాలంకారం

కా. విశేషణైర్యత్సాకూతైరుక్తిః పరికరస్తు సః.

వృ. అర్థాద్విశేష్యస్య. ఉదాహరణమ్.

శ్లో॥ మహౌజసో మానధనా ధనార్చితా
ధనుర్భృతః సంయతి లబ్ధకీర్తయః
న సంహతాస్తస్య నభేదవృత్తయః
ప్రియాణి వాఞ్ఛన్త్యసుభిః సమీహితుమ్. 519

వృ. యద్యప్యపుష్టార్థస్య దోషతాభిధానాత్తన్నిరాకరణేన పుష్టార్థ స్వీకారః కృతః తథాప్యేకనిష్ఠత్వేన బహూనాం విశేషణానామేవముపన్యాసే వైచిత్ర్యమిత్యలంకారమధ్యే గణితః.

వ్యా. విశేషణైరితి:- సాకూతైః = అభిప్రాయంతో కూడిన, అభిప్రాయగర్భితాలైన, విశేషణైః = విశేషణాలచేత, యత్ = ఏ, లేదా, ఎక్కడ, ఉక్తిః = (విశేష్యం యొక్క) పరిపుష్టి చేయబడుతుందో, సః = అది, పరికరః = పరికరాలంకారం.

అర్థాదితి:- అనగా విశేష్యం యొక్క అని అర్థం.

అభిప్రాయగర్భితాలైన విశేషణాలను ఉపయోగించి విశేష్యంలో ఒక విధమైన వైశిష్ట్యాన్ని సూచించడం పరికరాలంకారం. ఉదాహరణం–

మహౌజసః ఇతి:- కిరాతార్జునీయంలో గూఢచారి యుధిష్ఠిరునితో చెప్పుచున్న మాటలు. మహౌజసః = గొప్ప తేజస్సు గలవారు, మానధనాః = మానమే ధనంగా కలవారు. ధనార్చితాః = ధనంచేత పూజించబడ్డవారూ, సంయతి = యుద్ధంలో, లబ్ధకీర్తయః = పొందబడిన కీర్తి గలవారు, నసంహతాః = తమలో తాము కలవనివారు,అనగా అందరూ కలిసి రాజుకు ఎదురుతిరిగే అవకాశంలే దని భావం, నభిన్నవృత్తయః = వేరు వేరు ప్రవృత్తులు కలవారు కానివారు, పరస్పరం విరోధం కూడా లేనివారు; అందుచేత రాజు విషయంలో అందరూ అనుకూలులే అని అర్థం. ధనుర్భృతః = ధనుర్ధారులైన యోధులు, అసుభిః = ప్రాణాలచేత, ప్రాణాలు ఇచ్చి కూడ, తస్య = ఆ దుర్యోధనునియొక్క, ప్రియాణి = ప్రియాలను, సమీహితుమ్ = చేయుటకు, వాఞ్ఛన్తి = కోరుచున్నారు.

ఇక్కడ 'ధనుర్భృతః' అనే విశేష్యానికి 'మహౌజసః' ఇత్యాది విశేషణాలు ప్రయోగించడంచేత యోధుల గొప్పతనం, తద్ద్వారా దుర్యోధనుని ప్రాధాన్యం సూచితం అవుతున్నాయి.

ఆశంక. 'అపుష్టార్థం' దోషం అని వెనుక చెప్పబడింది. ఆ దోషం లేకుండా ఉండా లంటే పుష్టార్థత్వం (ప్రకృతార్థానికి పరిపుష్టి చేకూర్చడం) అవసరం. అందుచేత ఈ విధంగా విశేషణాల ప్రయోగం ద్వారా చేసిన అర్థపుష్టి అపుష్టార్థత్వరూపదోషాభావమే అవుతుంది కాని దీనికి అలంకారత్వం అంగీకరించవలసిన ఆవశ్యకత ఉన్నదా అని ప్రశ్నించవచ్చు. కాని చాల విశేషణాలు ప్రయోగించడంలో ఒక చమత్కారం ఉంది గాన దీనిని దోషాభావమాత్రంగా పరిగణించకూడదు. అలంకారంగా అంగీకరించాలి అని చెపుతున్నాడు- యద్యపీది-'అపుష్టార్థం'

దోషం అని చెప్పడంచేత ఆ దోషాన్ని పరిహరించడం ద్వారా పుష్టార్థాన్ని స్వీకరించడం అవసరమే అయినా ఒక విశేష్యానికి సంబంధించిన అనేకవిశేషణాలు ఉపయోగించడంలో వైచిత్ర్యం ఉంది గాన దీనిని అలంకారాల మధ్య పఠించడం జరిగింది.

వి. అంగా అపుష్టార్థత్వదోషం పరిహరించడానికి ఇన్ని విశేషణాలు ప్రయోగించకపోయినా పుష్టార్థత్వం సంపాదించవచ్చు. ఇన్ని విశేషణాలు ప్రయోగించడంలో దోషపరిహారాన్ని మించిన చమత్కారం ఉన్నదని భావం.

## 37. వ్యాజోక్త్యలంకారం

కా. వ్యాజోక్తిశ్ఛద్మనోద్భిన్నవస్తురూపనిగూహనమ్. 118

వృ. నిగూఢమపి వస్తునో రూపం కథమపి ప్రభిన్నం కేనాపి వ్యపదేశేన యదపహ్నూయతే సా వ్యాజోక్తిః. న చైషాపహ్నుతిః; ప్రకృతాప్రకృతోభయనిష్ఠస్య సామ్యస్య ఇహాసంభవాత్. ఉదాహరణమ్.

శ్లో॥ శైలేన్ద్రప్రతిపాద్యమానగిరిజాహస్తోపగూఢోల్లస
ద్రోమాఞ్చాదివిసంష్ఠులాఖిలవిధివ్యాసఙ్గభఙ్గాకులః,
హా శైత్యం తుహినాచలస్య కరయోరిత్యూచివాన్ సస్మితం
శైలాన్తఃపురమాతృమణ్డలగణైర్దృష్టోఽవతాద్వః శివః. 520

వృ. అత్ర పులకవేపథూ సాత్త్వికరూపతయా ప్రసృతౌ శైత్యకారణతయా ప్రకాశితత్వాదపలపితస్వరూపౌ వ్యాజోక్తిం ప్రయోజయతః.

వ్యా. వ్యాజోక్తిరితి-ఛద్మనా=మిషచేత, ఉద్భిన్నవస్తురూపనిగూహనమ్=పైకి పొక్కిన వస్తువుయొక్క రూపాన్ని కప్పిపుచ్చడం, వ్యాజోక్తిః=వ్యాజోక్త్యలంకారం.

నిగూఢమితి:- నిగూఢంగానే ఉన్న వస్తుస్వరూపం ఏదో విధంగా పైకి తెలిసిపోయి నప్పుడు దానిని ఏదో ఒక వంకచేత కప్పిపుచ్చడం అనేది ఏది కలదో

అది వ్యాజోక్త్యలంకారం. ఇది అపహ్నుత్యలంకారం కాదు. ప్రకృతాప్రకృతో భయనిష్ఠమైన సామ్యం ఇక్కడ అసంభవం కదా?

వి. అపహ్నుత్యలంకారంలో సామ్యమూలకమైన అపహ్నవం ఉంటుంది. అనగా ప్రకృతమైన విషయాన్ని దానితో సామ్యం గల మరొక (అప్రకృతమైన) విషయంచేత కప్పిపుచ్చడం ఉంటుంది. ఉపమేయాన్ని నిషేధించి ఉపమాన వ్యవస్థాపనం చేయబడుతుంది. ఇక్కడ అలాంటిది ఏది లేదు. ఏవో చిహ్నాలచేత బైటకు తెలిసిన విషయాన్ని దీనికి కారణం మరొకటి అని చెప్పి నిషేధించడం జరుగుతుంది. ఉదాహరణం-

శైవేతి:- "శైలేన్ద్ర....అకులః"—శైలేన్ద్ర = హిమవంతునిచేత, ప్రతిపాద్య మాన=అందించబడుతూన్న, గిరిజాహస్త=పార్వతీహస్తంయొక్క, ఉపగూఢ= స్పర్శచేత, ఉల్లసత్ = బయలుదేరిన, రోమాఞ్చాది = రోమాంచకంపాదులచేత, విసంష్ఠుల = స్థైర్యం తప్పినవాడు, అఖిలవిధి = సమస్త విధులయొక్క, వివాహ సమయంలో చేయవలసిన హోమాదివిధులయొక్క, వ్యాసంగ = అవిచ్ఛిన్న సంబంధంయొక్క, భఙ్గ=భంగంచేత, అకులః= వ్యాకులుడూ, తుహినాచలస్య= హిమవత్పర్వతంయొక్క, కరయోః = హస్తాలయొక్క, శైత్యమ్ = చల్లదనం, హా = ఎంతగా ఉన్నది ! ఇతి = అని, ఊచివాన్ = పలికినవాడు. శైలాన్తఃపుర మాతృమణ్డలగణైః = హిమవంతుని అంతఃపురస్త్రీలచేత, బ్రాహ్మి మొదలైన సప్తమాతలచేత, ఎంట మొదలైన గణాలచేత, సస్మితమ్ = చిరునవ్వుతో కూడి నట్లుగా, దృష్టః = చూడబడినవాడు అయిన శివః = శివుడు, వః = మిమ్ములను, అవతాత్ = రక్షించుగాక.

అత్రేతి:- ఇక్కడ సాత్త్వికభావరూపంలో పుట్టిన పులకాలను కంపాన్నీ శైత్యం మూలాన కలిగినట్లు కప్పిపుచ్చడం జరిగింది. ఈ విధంగా కప్పిపుచ్చ బడిన పులకవేపథువులు వ్యాజోక్తిని ప్రయోగిస్తున్నాయి. వ్యాజోక్తి అలంకారం అవడానికి కారణం అవుతున్నాయి అని అర్థం.

## 38. పరిసంఖ్యాలంకారం

కా. కించిత్ పృష్టమపృష్టం వా కథితం యత్ ప్రకల్ప్యతే,
తాదృగన్యవ్యపోహాయ పరిసంఖ్యా తు సా స్మృతా.

వృ. ప్రమాణాన్తరావగతమపి వస్తు శబ్దేన ప్రతిపాదితం ప్రయోజనాన్తరాభావాత్ సదృశవస్త్వన్తరవ్యవచ్ఛేదాయ యత్ పర్యవస్యతి సా భవేత్పరిసంఖ్యా. అత్ర చ కథనం ప్రశ్నపూర్వకం తదన్యథా చ పరిదృష్టమ్, తథా ఉభయత్ర వ్యపోహ్యమానస్య ప్రతీయమానతా వాచ్యత్వం చేతి చత్వారో భేదాః. క్రమేణోదాహరణమ్.

వ్యా. కించిదితి-పృష్టం వా = అడగబడి గాని, అపృష్టం వా = అడగబడకుండా కాని, యత్ = ఏ, కించిత్ = ఒకానొక వస్తువు, తాదృగన్య వ్యపోహాయ = అట్టిదే అయిన మరియొకదానియొక్క నిషేధంకొరకు, ప్రకల్పతే ఇతి యత్ = సమర్థం అవుతుంది అనేది ఏది కలదో, సా = అది, పరిసంఖ్యా = పరిసంఖ్యాలంకారంగా, స్మృతా = చెప్పబడింది.

ప్రమాణేతి:- ఒక వస్తువు ఇతర ప్రమాణాలచేత తెలియబడినా కూడ దానిని మరల శబ్దంచేత ప్రతిపాదిస్తే, మరొక ప్రయోజనం లేకపోవడంచేత సదృశమైన మరొక వస్తువుయొక్క పరిచ్ఛేదానికి పర్యవసిస్తే అది పరిసంఖ్యాలంకారం. శబ్దంచేత చెప్పడం ప్రశ్నపూర్వకం కావచ్చు, కాకపోవచ్చు. రెండు విధాలా కూడ కనబడుతున్నది. ఈ రెండు స్థలాలలోనూ కూడ నిషేధించబడేది ప్రతీయమానం కావచ్చు, వాచ్యం కావచ్చు. ఈ విధంగా దీనికి నాలుగు భేదాలు ఉన్నాయి.

వి. అనుమానాలంకారానికి న్యాయశాస్త్రాది ప్రసిద్ధమైన అనుమానప్రమాణం మూలం. అట్లే ఈ అలంకారానికి మీమాంసాప్రసిద్ధమైన 'పరిసంఖ్యావిధి' మూలం. మీమాంసకులు అపూర్వవిధి, నియమవిధి, పరిసంఖ్యావిధి అనే మూడు విధాలైన విధులు అంగీకరిస్తారు. ఇతర ప్రమాణాలవల్ల వేటివల్లా తెలియని విషయాన్ని విధించేది 'అపూర్వవిధి'. ఉదా "యజేత స్వర్గకామః" "స్వర్గం కావలసినవాడు యాగం చెయ్యాలి" అని దీని అర్థం. యాగం చేస్తే స్వర్గం వస్తుం దనే విషయం ఈ వ్యాకం తప్ప మరి ఏ ప్రమాణంచేతా తెలియదు; అందుచేత ఇది 'అపూర్వవిధి'. పాక్షికంగా వచ్చే విషయాన్ని విధించేది నియమవిధి. బియ్యంపిండితో పురోడాశం చేసి హోమం చేయ్యాలి. అందుకు బియ్యం కావాలి. ఆ ఘట్టంలో 'వ్రీహీన్ అవహన్తి' (ధాన్యం దంచాలి) అనే వాక్యం ఉంది. ధాన్యంనుంచి బియ్యం తియ్యాలంటే వాటిని దంచినా దంచవచ్చు; గోళ్ళతో ఒలిచి బియ్యం తీయవచ్చు; ఈ రోజుల్లో

అయితే మిల్లులో పోయవచ్చు. ఈ అనేక ఉపాయాలలో ఏ ఒక్క ఉపాయం అవలంబించినా మిగిలిన ఉపాయాల అవసరం ఉండదు. అందుచేత అవహననానికి పాక్షిక ప్రాప్తి, అనగా ఇతర ఉపాయాలు చేబట్టకపోతే దంచడం జరుగుతుంది. అలాంటి అవహననాన్ని ఈ వాక్యం విధిస్తూన్నది. అందుచేత బియ్యం తీయడానికి ధాన్యం దంచాలేకాని మరొక ఉపాయం పనికిరాదు అని దీని భావం. అవహననమే చెయ్యాలి అని చెపుతున్నది కాబట్టి ఇది 'నియమవిధి'.

"పఞ్చ పఞ్చనఖా భక్ష్యా ధర్మతః పరికీర్తితాః,
గోధా కూర్మః శశః ఖడ్గీ శల్యకశ్చేతి తే స్మృతాః"

అని స్మృతివాక్యం "ఉడుము, తాబేలు, చెవులపిల్లి, ఖడ్గమృగం, శల్యకమృగం అనే ఐదుగోళ్ళ జంతువులు ఐదింటిని తినాలి" అని చెపుతూన్నది. ఆకలి వేస్తే ఎలాగా తింటాడు కాబట్టి తినాలి అవి విధించ నక్కరలేదు. ఐదు గోళ్ళు ఉన్న జంతువుల మాంసం తినవలసి వస్తే ఈ ఐదు జంతువుల మాంసం మాత్రమే తినాలి కాని ఇతర పంచనఖజంతువుల మాంసం తినకూడదు అని చెప్పడం ఈ వాక్యం ఉద్దేశ్యం. అనగా ఈ వాక్యం గోధాదిపంచనఖభక్షణాన్ని విధించడం లేదు; తద్భిన్నపంచనఖభక్షణాన్ని నిషేధిస్తూన్నది. దీనికి 'పరిసంఖ్యావిధి' అని పేరు. కావ్యంలో ఉండి చమత్కారజనకం అవుతే ఇదే అలంకారం.

ఇతర ప్రమాణాలచేత తెలిసిన దానినినే మళ్ళీమాటలలో చెప్పడం అనవసరం. దానికి మరొక ప్రయోజనం ఏదీ లేదు కాబట్టి దానితో సమానమైన మరొక విషయాన్ని నిరాకరించడంకోసం అలా చెప్పబడింది అని గ్రహించాలి. ఎవరైనా ప్రశ్నిస్తే ఇలా చెప్పవచ్చు; అదొక భేదం. ప్రశ్నించకుండా చెప్పవచ్చు. అదొక భేదం. ఏదైతే నిరాకరించబడుతుందో దానినిసూచిస్తే అదొక భేదం; అది వాచ్యం అయితే రెండవ భేదం. ఈ విధంగా ప్రశ్నపూర్వక ప్రతీయమానవ్యవచ్ఛేద్యపరిసంఖ్య, ప్రశ్నపూర్వకవాచ్యవ్యవచ్ఛేద్యపరిసంఖ్య, అప్రశ్నపూర్వకప్రతీయమానవ్యవచ్ఛేద్యపరిసంఖ్య అప్రశ్నపూర్వగవాచ్యవ్యవచ్ఛేద్యపరిసంఖ్య అని మొత్తం నాలుగు విధాలు. వరుసగా ఉదాహరణలు.

శ్లో॥ కిమాసేవ్యం పుంసాం సవిధమనవద్యం ద్యుసరితః
కిమేకాన్తే ధ్యేయం చరణయుగలం కౌస్తుభభృతః,

కిమారాధ్యం పుణ్యం కిమభిలషణీయం చ కరుణా
యదాసక్త్యా చేతో నిరవధివిముక్త్యై ప్రభవతి. 521

వ్యా. కిమితి:- (ప్రశ్న) పుంసామ్ = పురుషులకు, కిమ్ = ఏది, ఆసేవ్యమ్ = సేవించదగినది? (ఉత్తరం) ద్యుసరితః=గంగానదియొక్క, అనవద్యమ్ = దోషాలు లేని, సవిధమ్=సమీపము. ఇతర నదీతీరం గాని, నారీనితంబాదికం కాని కాదు అని భావం. (ప్ర) ఏకాన్తే=ఏకాంతమునందు, కిమ్=ఏది, ధ్యేయమ్ = ధ్యానించదగినది? (ఉ) కౌస్తుభభృతః = శ్రీమహావిష్ణువుయొక్క, చరణయుగలమ్ = పాదద్వంద్వము. ఇతరదేవుల పాదద్వంద్వం కాని, ధనాదికం కాని కాదు అని భావం. (ప్ర) కిమ్ = ఏమి, ఆరాధ్యమ్ = ఆరాధించదగినది? (ఉ) పుణ్యమ్ = పుణ్యం. పాపం కాదని భావం. (ప్ర)కిమ్=ఏమి, అభిలషణీయమ్=అభిలషించదగినది? (ఉ) కరుణా = కరుణ. హింసాదికం కాదు అని భావం. యదాసక్త్యా= వేటియందు ఆసక్తిచేత, చేతః = చిత్తం, నిరవధివిముక్త్యై = అనంతమైన ముక్తికొరకు, ప్రభవతి = సమర్థం అవుతుందో.

వి. గంగాతటాదుల సేవ్యత్వాదికం శాస్త్రంవల్లనే తెలుస్తూన్నది. వేరుగా చెప్పవలసిన పని లేదు. అందుచేత వీటిని చెప్పడంలో ఉద్దేశ్యం అన్యనదీతట-నారీనితంబాదిసేవనం చేయకూడదు అని చెప్పడం. ఇది ప్రతీయమానంగానే ఉన్నది కాని వాచ్యం కాదు. ప్రశ్నపూర్వకంగా ఈ విషయాలు చెప్పబడ్డాయి. అందుచేత ఇది మొదటి భేదానికి (ప్రశ్నపూర్వకప్రతీయమానవ్యచ్ఛేద్యపరిసంఖ్యకు) ఉదాహరణం.

శ్లో॥ కిం భూషణం సుదృఢమత్ర యశో న రత్నం
కిం కార్యమార్యచరితం సుకృతం న దోషః,
కిం చక్షురప్రతిహతం ధిషణా న నేత్రం
జానాతి కస్త్వదపరః సదసద్వివేకమ్. 522

వ్యా. కిమితి (ప్ర) అత్ర = ఈ లోకంలో, సుదృఢమ్ = చాల దృఢమైన, భూషణమ్ = అలంకారం. కిమ్ = ఏమిటి? (ఉ) యశః = కీర్తి, రత్నమ్ = రత్నం, న = కాదు. (ప్ర.) కార్యమ్ = చేయదగింది, కిమ్ = ఏమి? (ఉ) ఆర్య

చరితమ్ = పూజ్యులచేత ఆచరించబడిన, సుకృతమ్ = మంచి పని, దోషః = (వాళ్ళు ఆచరించిన) దోషం, (వ్యభిచారాదికం), న = కాదు. (ప్ర.) అప్రతిహతమ్ అడ్డు లేని, చక్షుః = నేత్రం, కిమ్ = ఏది? (ఉ) ధిషణా = బుద్ధి, నేత్రమ్ = కన్ను, న = కాదు. త్వదపరః = నీకంటె వేరైన. కః = ఎవడు, సదసద్వివేకమ్ = మంచి చెడుగుల వివేకాన్ని, జానాతి = ఎరుగును? పై జవాబులు విని సంతోషించిన ద్రష్ట పలికిన మాటలు ఇవి.

వి యశస్సు మొదలైనవాటి భూషణత్వాదికం శాస్త్రంవల్లనే తెలుస్తున్నది. ఇక్కడ వాటిని చెప్పడం రత్నాదుల భూషణత్వాదికాన్ని నిరాకరించడం కోసం. ప్రశ్న ఉంది; నిషేధం కూడా వాచ్యంగా ఉంది. అందుచేత ఇది ప్రశ్న పూర్వకవాచ్యవ్యవచ్ఛేద్యపరిసంఖ్యకు ఉదాహరణం.

శ్లో॥ కౌటిల్యం కచనిచయే కరచరణాధరదలేషు రాగస్తే,
కాఠిన్యం కుచయుగలే తరలత్వం నయనయోర్వసతి.

వ్యా. కౌటిల్యమ్ = కుటిలత్వం, తే = నీయొక్క, కచనిచయే = కొప్పులో ఉన్నది. హృదయంలో లేదు అని భావం. కౌటిల్యం అనగా వక్రత్వం, కపటం అని రెండర్థాలు. రాగః = ఎరుపు, కరచరణాధరదలేషు = హస్తాలయందు, పాదాలయందు. అధరోష్ఠమునందూ ఉన్నది. పరపురుషునియందు లేదు అని భావం. రాగం అనగా ఎరుపు అనురాగం అని రెండర్థాలు. కాఠిన్యమ్ = కఠినత్వం, కుచయుగలే = కుచద్వంద్వంలో ఉన్నది. హృదయంలో లేదు అని భావం. కాఠిన్యం అనగా ఇక్కడ దృఢత్వం, నిర్దయత్వం అని రెండర్థాలు. తరలత్వమ్ = తరలత్వం, నయనయోః = నేత్రాలలో, వసతి = ఉన్నది, మనస్సులో లేదు అని భావం. తలరత్వం అనగా చంచలత్వం, చపలత్వం అని రెండర్థాలు.

వి. ఇక్కడ ప్రశ్న లేదు. వ్యవచ్ఛేద్యం అయినది వ్యంగ్యం. అందుచేత ఇది అప్రశ్నపూర్వకప్రతీయమానవ్యవచ్ఛేద్యపరిసంఖ్యకు ఉదాహరణం.

శ్లో॥ భక్తిర్భవే న విభవే వ్యసనం శాస్త్రే న యువతికామాస్త్రే,
చిన్తా యశసి న వపుషి ప్రాయః పరిదృశ్యతే మహతామ్.

వ్యా. భక్తిరితి :- మహతామ్ = మహాత్ములకు, ప్రాయః = సాధారణంగా,

భక్తిః = భక్తి, భవే = ఈశ్వరునియందు, పరిదృశ్యతే = చూడబడుచున్నది; విభవే = వైభవమునందు, న = కాదు. వ్యసనమ్ = అత్యాసక్తి, శాస్త్రే = శాస్త్రమునందు; యువతికామాస్త్రే = యువతిరూపమైన మన్మథాస్త్రమునందు, న = కాదు. చిన్తా = చింత, యశసి = కీర్తియందు, వపుషి = శరీరమునందు, న = కాదు.

వి. ఇక్కడ ప్రశ్న లేదు. వ్యవచ్ఛేద్యం వాచ్యంగా ఉంది. అందుచేత ఇది అప్రశ్నపూర్వకవాచ్యవ్యవచ్ఛేద్యపరిసంఖ్యకు ఉదాహరణం.

## 39. కారణమాలాలంకారం

కా. యథోత్తరం చేత్ పూర్వస్య పూర్వస్యార్థస్య హేతుతా.
తదా కారణమాలా స్యాత్.

వృ. ఉత్తరముత్తరం ప్రతి యథోత్తరమ్. ఉదాహరణమ్-

శ్లో॥ జితేన్ద్రియత్వం వినయస్య కారణం
గుణప్రకర్షో వినయాదవాప్యతే,
గుణప్రకర్షేణ జనోఽనురజ్యతే
జనానురాగప్రభవా హి సంపదః. 525

వ్యా. యథోత్తరమితి:- పూర్వస్య పూర్వస్య=పూర్వపూర్వమైన, అర్థస్య = వస్తువునకు, యథోత్తరమ్ = ఉత్తరోత్తరవస్తువును గూర్చి, హేతుతా చేత్ = కారణత్వం ఉన్నట్లయితే, తదా = అప్పుడు, కారణమాలా = కారణమాలాంకారం, స్యాత్ = అవుతుంది.

ఉత్తరమితి :- 'యథోత్తరమ్' అనగా ఉత్తరోత్తరమును గూర్చి అని అర్థం.

వి. ముందు చెప్పిన వస్తువులు ఒక్కొక్కటిగా తరవాత వచ్చేవాటికి కారణం అని పర్కొన్తే అది కారణమాలాలంకారం. ఉదాహరణం.

జితేన్ద్రియత్వమితి:- (ఇది 316వ శ్లోకంగా వచ్చినది). ఇక్కడ జితేంద్రియత్వంవల్ల వినయం, వినయంవల్ల గుణప్రకర్షం, గుణప్రకర్షంవల్ల జనానురాగం,

జనానురాగంవల్ల సంపదలు కలుగుతాయి అని పూర్వపూర్వం ఉత్తరోత్తరానికి కారణంగా చెప్పడంచేత కారణమాలాలంకారం.

శ్లో॥ ''హేతుమతా సహ హేతోరభిధానమభేదతో హేతుః''

(రుద్రటకావ్యాలంకారం. VII. 82)

వృ. ఇతి హేత్వలంకారో న లక్షితః. ఆయుర్ఘృతమిత్యాది రూపో హ్యేష న భూషణతాం కదాచిదర్హతి; వైచిత్ర్యాభావాత్.

శ్లో॥ "అవిరలకమలవికాసః సకలాలిమదశ్చ కోకిలానన్దః,
రమ్యోఽయమేతి సంప్రతి లోకోత్కణ్ఠాకరః కాలః"

(రు. కా. అ. VII 83)

ఇత్యత్ర కావ్యరూపతాం కోమలానుప్రాసమహిమ్నైవ సమామ్నాసిషర్మ పునః హేత్వలంకారకల్పనయేతి పూర్వోక్తకావ్యలిఙ్గమేవ హేతుః.

వ్యా. కొందరు ప్రాచీనాలంకారికులు హేత్వలంకారాన్ని అంగీకరించినారు; అది అనావశ్యకం అని చెపుతున్నాడు. హేతుమతేతి:- "హేతుమత్తుతో హేతువును అభిన్నంగా చెప్పడం హేతువు. అనగా కార్యాన్ని, కారణాన్ని అభిన్నములుగా వర్ణించడం హేత్వలంకారం" అని (ప్రాచీనులుచెప్పిన) హేత్వలంకారానికి ఇక్కడ లక్షణాదులు చెప్పలేదు. ఆయుర్దాయానికి హేతువైన ఘృతాన్నీ, కార్యమైన ఆయుర్దాయాన్నీ ఒకటిగా భావించి "ఆయుర్ఘృతమ్" 'నెయ్యి ఆయుర్దాయం' ఇత్యాదిప్రయోగం (లాక్షణిక ప్రయోగం) ఎటువంటిదో ఇది కూడా అటువంటిదే. అందుచేత దీనికి భూషణత్వం (అలంకారత్వం) ఎన్నడూ కుదరదు. ఎందుచేత ననగా దీనిలో వైచిత్ర్యం ఏమీ లేదు.

అయితే ఇలాంటి హేతుహేతుమదభేదం వర్ణించినవాటిని కావ్యాలుగా ప్రాచీనులు అంగీకరించారు కదా! ఇది అలంకారం కాకపోతే వాటికి కావ్యత్వం ఎలా కుదురుతుంది అని ఆశంకించుకొని వాటికి వాళ్ళు కావ్యత్వం అంగీకరించా రనగా- ఈ హేత్వలంకారం ఉండడాన్ని పట్టి కాదు; కోమలానుప్రాస అనే

శబ్దాలంకారం ఉండడాన్ని పట్టి అని చెపుతున్నాడు- అవిరలేతి :- అవిరలకమల వికాసః = అవిచ్ఛిన్నమైన పద్మవికాసరూపము, సకలాలిమదః చ = సమస్తములైన తుమ్మెదల మదమూ, కోకిలానన్దః = కోకిలల ఆనంధమూ, లోకోత్కణ్ఠాకరః = లోకులకు ఉత్కంఠను కలిగించేదీ అయిన, అయమ్ = ఈ, రమ్యః కాలః = రమ్యమైనకాలం, సంప్రతి = ఇప్పుడు, ఏతి = వచ్చుచున్నది. ఇక్కడ వికాసాదులకు కారణమైన కాలమే వికాసాదిరూపంగా వర్ణించబడింది గాన హేత్వలంకారం అని అభిప్రాయం. ఈ శ్లోకంలో కోమలానుప్రాస ఉండడంచేతనే కావ్యత్వాన్ని అంగీకరించారు కాని హేత్వలంకారకల్పనచేత కాదు. అందుచేత పూర్వం చెప్పిన కావ్యలింగాలంకారమే హేత్వలంకారం.

వి రుద్రటుడు పైన చూపిన హేత్వలంకారలక్షణోదాహరణలు ఇచ్చి ఉన్నాడు. ఆ హేత్వలంకారాన్ని అంగీకరించకపోతే అంగీకరించకపోవచ్చునేమో కాని ఆ ఉదాహరణ శ్లోకంలో ఉన్న అనుప్రాసను పట్టి కావ్యత్వం అంగీకరించారు అని చెప్పడం ఒక ప్రక్క హేత్వలంకారం అంగీకరించి అది ఉండడం చేత ఇది కావ్యం అంటూన్న రుద్రటుని అభిప్రాయం కాజాలదు. ఇది 'నా అభిప్రాయం' అని చెపితే చెప్పవచ్చును. ఈ అలంకారానికి లక్షణోదాహరణలు చూపినది రుద్రటుడు అయి ఉండగా ప్రారంభంలో ఉద్భటుడనీ, తరవాత భామహుడనీ వామనఝల్కీకర్ రుద్రటుని కావ్యాలంకారం చూడకుండా వ్రాసి నట్లు కనబడుతుంది. హేత్వలంకారం అలంకారం కాదని భామహుడు స్పష్టంగా నిరాకరించాడు. ఈ శ్లోకం ఎక్కడా ఉదాహరించలేదు కూడ.

## 40. అన్యోన్యాలంకారం

కా. క్రియయా తు పరస్పరమ్, 120
వస్తునోర్జననేఽన్యోన్యమ్.

వృ. అర్థయోరేకక్రియాముఖేన పరస్పరం కారణత్వే సతి అన్యోన్యనామాలంకారః. ఉదాహరణమ్-

గాథ. హంసాణం సరేహిం సిరీ సారిజ్జఇ అహ సరాణ హంసేహిం
అణ్ణోణ్ణం విఅ ఏఏ అప్పాణం ణవర గుఱు అన్తి. 527

శ్లో॥ "హంసానాం సరోభిః శ్రీః సార్యతే అథ సరసాం హంసైః,
అన్యోన్యమేవ ఏతే ఆత్మానం కేవలం గరయన్తి".

వృ. అత్రోభయేషామపి పరస్పరజనకతా మిథః శ్రీసారతా సంపాదనద్వారేణ.

వ్యా. క్రియయేతి :- వస్తునోః = వస్తువులయొక్క, క్రియయా = క్రియ చేత, పరస్పరమ్ = పరస్పరము, జననే = పుట్టించడం జరుగుచుండగా, అన్యోన్యమ్ = అన్యోన్యాలంకారము.

అర్థయోరితి :- ఒక్క క్రియ ద్వారా రెండు వస్తువులు పరస్పరము కారణం అయినట్లయితే అన్యోన్యం అనే పేరు గల అలంకారం.

వి. సిద్ధమైన వస్తువులు ఒకదాని కొకటి కారణం అవడం అనేది ఉండదు. అందుచేత క్రియ ద్వారా పరస్పరం కారణం అవడం అనగా పరస్పరమునందు ఒక సజాతీయమైన క్రియను పుట్టించడం, క్రియలకు కారణం అవడం, అని అర్థం. ఉదాహరణం.

హంసానామితి :- సరోభిః = సరస్సులచేత, హంసానామ్ = హంసల యొక్క. శ్రీః = శోభ, సార్యతే = సారంగా, ఉత్కృష్టంగా చేయబడుతున్నది. హంసైః = హంసలచేత, సరసామ్ = సరస్సులయొక్క శోభ వృద్ధి పొందించ బడుచున్నది. ఏతే = ఇవి, అన్యోన్యమ్ = పరస్పరమును, ఆత్మానమ్ = తనను, కేవలమ్ = కేవలం, గరయన్తి = గురువుగా, గౌరవం కలదానినిగా చేస్తున్నవి.

ఇక్కడ సరోహంసలు రెండూ పరస్పరం శోభ అను సారం కలుగునట్లు చేయడం ద్వారా ఒకదాని నొకటి పుట్టించుచున్నవి. పరస్పరం శోభను పుట్టించు కొనడమే ఇక్కడ పరస్పరజననం అని భావం.

## 41. ఉత్తరాలంకారం

కా. ఉత్తరశ్రుతిమాత్రతః
ప్రశ్నస్యోన్నయనం యత్ర క్రియతే తత్ర వా సతి. 121
అసకృద్యదసంభావ్యముత్తరం స్యాత్ తదుత్తరమ్.

వృ. ప్రతివచనోపలమ్భాదేవ పూర్వవాక్యం యత్ర కల్ప్యతే తదేకం తావదుత్తరమ్. ఉదాహరణమ్-

వ్యా. ఉత్తరేతి :- యత్ర = ఎక్కడ, ఉత్తరశ్రుతిమాత్రతః = ఉత్తరం వినగానే, ప్రశ్నస్య = ప్రశ్నయొక్క. ఉన్నయనమ్=ఊహించడం, క్రియతే= చేయబడునో, అది, తత్ర= అది, ప్రశ్న, అసకృత్ = అనేకపర్యాయాలు, సతి వా = ఉన్నప్పటైనా, అసకృత్ = అనేకపర్యాయాలు, అసంభావ్యమ్ = అందరిచేత ఊహించడానికి శక్యం కాని, ఉత్తరమ్= ఉత్తరము, స్యాత్ = ఉండునో, తత్= అదీ, ఉత్తరాలంకారం.

ప్రతీతి:- ప్రతివచనం తెలియడంవల్లనే పూర్వవాక్యం, అనగా ప్రశ్న వాక్యం, ఎక్కడ కల్పించబడుతుందో అది ఒక ఉత్తరం. ఉదాహరణం-

గాథ. వాణిఅఅ హత్థిదన్తా కుత్తో అమ్హాణ వగ్ఘకిత్తీఅ,
జావ లులిఆలఅముహీ ఘరమ్మి పరిసక్కఏ సోణ్హా. 528

"వాణిజక హస్తిదన్తాః కుతోఽస్మాకం వ్యాఘ్రకృత్తయశ్చ,
యావత్ లులితాలకముఖీ గృహే పరిష్వక్కతే స్నుషా".

వృ. "హస్తిదన్తవ్యాఘ్రకృత్తీనామహమర్థీ, తాః మూల్యేన ప్రయచ్ఛ" ఇతి క్రేతుర్వచనమ్ అమునా వాక్యేన సమున్నీయతే. న చైతత్ కావ్యలిఙ్గమ్, ఉత్తరస్య తాద్రూప్యానుపపత్తేః. న హి ప్రశ్నస్య ప్రతివచనం జనకో హేతుః, నాపీదమనుమానమ్, ఏకధర్మినిష్ఠతయా సాధ్యసాధనయోరనిర్దేశాదిత్యలంకారాన్తరమేవోత్తరం సాధీయః.

వ్యా. వాణిఅఅఇతి:- వర్తకునితో ఒకవృద్ధుడైన ఆటవికుని మాటలివి- వాణిజక=వర్తకుడా! లులితాలకముఖీ=చంచలములైన అలకలు ముఖమునందు గల, స్నుషా = కోడలు, యావత్=ఎంతవరకు, గృహే=ఇంట్లో, పరిష్వక్కతే =తిరుగుతూంటుందో, అంతవరకు, అస్మాకమ్ = మాకు, హస్తిదన్తాః = ఏనుగ దంతాలు, వ్యాఘ్రకృత్తయః చ = పులి చర్మలు, కుతః = ఎక్కడినుండి వస్తాయి? నా పుత్రుడు ఆమెతోనే కాలక్షేపంచేస్తూ వేటకి వెళ్ళడంలేదు అని అర్థం.

హస్తీతి:- "నాకు ఏనుగుదంతాలు, పులిచర్మాలు కావాలి, అవి ఖరీదుకు ఇమ్ము" అని కొనడంకోసం వచ్చినవాడు అన్నట్లు ఈ వాక్యంచేత ఊహించబడు తుంది. ఇది కావ్యలింగాలంకారం అని చెప్పకూడదా అని ఆశంకించరాదు; ఎందుచేత అనగా ఉత్తరానికి తాద్రూప్యం అనగా హేతువు, అవడం కుదరదు, ఉత్తరం హేతువు అని చెప్పడం కుదరదు. ప్రతివచనం ప్రశ్నను పుట్టించే హేతువు కాదు కదా. జన్యజనకభావం ఉన్నచోటనే కావ్యలింగాలంకారం గాన ఇది కావ్యలింగాలంకారం కాదు అని అర్థం. ఇది అనుమానాలంకారం కూడా కాదు. ఎందుచేతననగా ఇక్కడ సాధ్యసాధనాలు ఒకధర్మియందు, పక్షంమీద, ఉన్నట్లు చెప్పబడలేదు కదా? సాధనమూ సాధ్యమూ ఒక దానియందు ఉన్నట్లు స్పష్టంగా చెప్పినప్పుడే అనుమానాలంకారం అవుతుంది. ఇక్కడ సాధ్యమైన ప్రశ్నను మాటలతో చెప్పలేదు గాన అనుమానం కాదు అని అర్థం. అందుచేత ఉత్తరాలంకారం ఒక స్వతంత్రాలంకారం అని అంగీకరించడమే మంచిది.

వృ. ప్రశ్నాదనన్తరం లోకాతిక్రాన్తగోచరతయా యత్ అసంభావ్యరూపం ప్రతివచనం స్యాత్ తత్ అపరముత్తరమ్. అనయోశ్చ సకృదుపాదానే న చారుతాప్రతీతిరితి అసకృదిత్యుక్తమ్. ఉదాహరణమ్-

గాథ. కా విసమా దేవ్వగఈ కిం దుల్లహం జం జణో గుణగ్గాహీ,
కిం సోక్ఖం సుకలత్తం కిం దుక్ఖం జం ఖలో లోఓ. 529

"కా విషమా దైవగతిః కిం దుర్లభం యత్ జనో గుణగ్రాహీ,
కిం సౌఖ్యం సుకలత్రం కిం దుఃఖం యత్ ఖలో లోకః".

వృ. ప్రశ్నపరిసంఖ్యాయామన్యవ్యపోహే ఏవ తాత్పర్యమ్. ఇహ తు వాచ్యే ఏవ విశ్రాన్తిరిత్యనయోర్వివేకః.

వ్యా. ప్రశ్నాదితి:- ప్రశ్న తరవాత దాని ఏ ప్రతివచనం లోకాన్ని అతిక్రమించిన విషయం అవడంచేత, అసాధారణవిషయం అవడంచేత, ఊహించడానికి శక్యం కాదో అది రెండవ ఉత్తరాలంకారం. ఈ ప్రశ్నోత్తరాలను ఒక్కమారే చెప్పినట్లయితే సౌందర్యప్రతీతి (చమత్కారం) ఉండదు; అందుచేత 'అసకృత్' (అనేకపర్యాయాలు) అని చెప్పబడింది. ఉదాహరణం ఎట్లనగా-

కేతి:- (ప్ర) విషమా = విషమమైనది. కా = ఏది? (స) దైవగతిః = దైవగతి. (ప్ర) కిమ్ = ఏది, దుర్లభమ్ = పొందశక్యంకానిది? (స) జనః = జనుడు, గుణగ్రాహీఇతియత్ = గుణాలనుగ్రహించడంఅనేది (ప్ర) సౌఖ్యమ్ = సౌఖ్య, కిమ్ = ఏమి? (స) సుకలత్రమ్ = మంచి భార్య. (ప్ర) దుఃఖమ్ = దుఃఖం, కిమ్ = ఏమి? లోకః = లోకం, ఖలః ఇతి యత్ = చెడ్డది అనేది ఏది కలదో అది.

వి. ఇక్కడ 'దైవగతి' మొదలైన ఉత్తరాలు సాధారణమైనవి కాదు గాన అనాయాసంగా స్ఫురించవు. అలాంటి ప్రశ్నోత్తరాలు అనేకపర్యాయాలు కూర్చబడ్డాయి. కాబట్టి ఇది రెండవ ఉత్తరాలంకారం.

ప్రశ్నేతి:- ప్రశ్నపూర్వక పరిసంఖ్యలో ఇతరమైన దానిని నిరాకరించడంలోనే తాత్పర్యం ఉంటుంది, ఈ అలంకారంలో వాచ్యార్థంలోనే విశ్రాంతి (ఆగిపోతుంది). వాచ్యార్థాన్ని మించి మరొక అర్థం ఏదీ స్ఫురించదు. ఇదే ఈ రెండింటికీ భేదం.

## 42. సూక్ష్మాలంకారం

కా. కుతోఽపి లక్షితః సూక్ష్మోఽప్యర్థోఽన్యస్మై ప్రకాశ్యతే 122
ధర్మేణ కేన చిద్యత్ర తత్ సూక్ష్మం పరిచక్షతే.

వృ. కుతోఽపి ఆకారాదిఙ్గితాద్వా సూక్ష్మః తీక్ష్ణమతి సంవేద్యః. ఉదాహరణమ్.

శ్లో॥ వక్త్రస్యన్దిస్వేదబిన్దుప్రబన్ధై
ర్దృష్ట్వా భిన్నం కుఙ్కుమం కాపి కణ్ఠే,
పుంస్త్వం తన్వ్యా వ్యఞ్జయన్తీ వయస్యా
స్మిత్వా పాణౌ ఖడ్గలేఖాం లిలేఖ. 530

వృ. అత్ర ఆకృతిమవలోక్య కయాపి వితర్కితం పురుషాయితం అసిలతాలేఖనేన వైదగ్ధ్యాదభివ్యక్తిముపనీతమ్. పుంసామేవ కృపాణపాణితాయోగ్యత్వాత్. యథా వా.

వ్యా. కుతోఽపీతి:- యత్ర = ఎక్కడ, సూక్ష్మః అపి = సూక్ష్మమైనా కూడ, అర్థః = విషయం, కుతోఽపి = జ్ఞాపకమైన దేనివలననో, లక్షితః = ఊహించబడినదై, కేన చిత్ ధర్మేణ = ఏదో ఒక ధర్మంచేత, అన్యస్మై = ఇతరునకు, ప్రకాశ్యతే = తెలుపబడునో, తత్ = దానిని, సూక్ష్మమ్ = సూక్ష్మాలంకారమునుగా, పరిచక్షతే = చెప్పుచున్నారు.

కుతః ఇతి:- కుతోఽపి = అనగా ఆకారంచేత గాని, ఇంగితం చేతగాని. ఇంగితం అనగా మనస్సులో ఉన్న భావాన్ని సూచించే అప్రయత్నంగా జరిగే చేష్టలు. సూక్ష్మః అనగా వాడియైన, చురుకైన బుద్ధికలవాళ్ళచేతనే తెలియదగినది అని అర్థం. ఉదాహరణం.

వక్త్రేతి:- కాపి = ఒకానొక, వయస్యా = సఖురాలు, వక్త్రస్యన్ది స్వేద బిన్దుప్రబన్ధైః = ముఖంనుండి కారుచున్న చెమటబిందువుల అవిచ్ఛిన్న ప్రవాహాలచేత, కణ్ఠే = కంఠమునందు, కుఙ్కుమమ్ = కుంకుమమును, భిన్నమ్ = కలిసిపోయిన దానినిగా, దృష్ట్వా = చూచి, తస్యాః = ఆ యువతియొక్క, పుంస్త్వమ్ = పుంస్త్వాన్ని, వ్యఞ్జయన్తీ = సూచిస్తూన్నదై, స్మిత్వా = చిరునవ్వు నవ్వి, పాణౌ = హస్తమునందు, ఖడ్గలేఖామ్ = ఖడ్గముయొక్క చిత్రమును, లిలేఖ = వ్రాసెను.

అత్రేతి:- ఇక్కడ నాయిక ఆకారం చూచి ఒకతె ఈమె పురుషాయితం చేసిన దని ఊహించి తెలిసికొని ఆ విషయాన్ని నేర్పుగా అసిలతను చిత్రించడం ద్వారా అభివ్యక్తం చేసింది. ఖడ్గం చేతిలో ఉండడం అనేది పురుషులకే యుక్తం కదా? మరొక ఉదాహరణం ఎట్లనగా-

అవ. ఇంగితం ద్వారా ఊహించిన విషయాన్ని ప్రకటించడానికి ఉదాహరణం చూపుతున్నారు.

శ్లో॥ సంకేతకాలమనసం విటం జ్ఞాత్వా విదగ్ధయా,
ఈషన్నేత్రార్పితాకూతం లీలాపద్మం నిమీలితమ్. 531

వృ. అత్ర జిజ్ఞాసితః సంకేతకాలః కయాచిదిఙ్గితమాత్రేణ విదితో నిశాసమయశంసినా కమలనిమీలనేన లీలయా ప్రతిపాదితః.

వ్యా. సంకేతేతి:- ఈషన్నేత్రార్పితాకూతమ్ = కొంచెం కళ్ళలో అభిప్రాయాన్ని ఉంచిన, సాభిప్రాయంగా చూస్తూన్న, విటమ్ = విటుణ్ణి, సంకేతకాలమనసమ్ = సంకేతకాలమునందు మనస్సు కలవానినిగా, సంకేతసమయం తెలుసుకొనవలె నని అనుకుంటున్న వానినిగా, జ్ఞాత్వా = తెలుసుకొని, విదగ్ధయా = నేర్పు గల స్త్రీచేత, లీలాపద్మమ్ = విలాసార్థం చేతిలో ధరించిన పద్మం, నిమీలితమ్ = ముణవబడినది. దాని రేకులు ముణవబడినవి.

అత్రేతి:- ఇక్కడ విటునిచేత తెలియగోరబడిన సంకేతకాలం ఒకతెచేత ఇంగితమాత్రంచేతనే తెలియబడి రాత్రి సమయాన్ని సూచించే కమలనిమీలనంచేత విలాసపూర్వకంగా చెప్పబడింది. అనగా విటుని చూపు లనే ఇంగితాన్ని పట్టి అతని అభిప్రాయం తెలుసుకొని ఈమె చేతిలో ఉన్న పద్మం రేకులు ముణిచి, 'పద్మం ముకుళీభవించే రాత్రిసమయం సంకేతకాలం' అని సూచించినది అని అర్థం.

## 43. సారాలంకారం

కా. ఉత్తరోత్తరముత్కర్షో భవేత్సారః పరావధిః. 123

వృ. పరః పర్యన్తభాగః అవధిర్యస్య ధారాధిరోహితయా తత్రైవోత్కర్షస్య విశ్రాన్తేః. ఉదాహరణమ్-

శ్లో॥ రాజ్యే సారం వసుధా వసుధాయాం పురం పురే సౌధమ్.
సౌధే తల్పం తల్పే వరాఙ్గనానఙ్గసర్వస్వమ్. 532

వ్యా. ఉత్తరేతి :- ఉత్తరోత్తరమ్ = ఉత్తరోత్తరము, పరావధిః = చివరి అవధి గల, ఉత్కర్షః = ఉత్కర్ష, సారః భవేత్ = సారాలంకారం అవుతుంది.

వి. పరావధిః అనగా పర్యంతభాగం, అనగా ఒక వస్తువును వర్ణించే వాక్యం యొక్క, (అది శ్లోకరూపం గాని, గద్యరూపం కాని కావచ్చును.) చివరిభాగం అవధిగా ఉండేది. ఉత్తరోత్తరోత్కర్ష అనగా మొదటిదానికంటె రెండవది, రెండవదానికంటె మూడవది ఈ విధంగా వెనుకటివాటికంటె రాబోవువాటి ఉత్కర్ష సారాలంకారం అని కారికకు అర్థం.

పరః ఇతి:- పరః = పర్యంతభాగం, అవధి దేనికో అది ధారాధిరోహి అవడంచేత , అనగా వరసగా పై పైకి వెళ్ళడంచేత ఆ చివరనే ఆ ఉత్కర్షకు విశ్రాంతి, నిలుపుదల ఉండును. ఉదాహరణం ఎట్లనగా-

రాజ్యే ఇతి:- 'రాజ్యంలో సారం (శ్రేష్ఠమైనది) భూమి: భూమియందు సారం మేడ. మేడమీద సారం తల్పం. తల్పంమీద సారం మన్మథసర్వస్వమైన ఉత్తమ యువతి-"

వి. ఇక్కడ ఉత్తరోత్తరం శ్రేష్ఠమైనట్లు వర్ణించి వరాంగన దగ్గర నిలిపి వేయబడింది గాన సారాలంకారం.

## 44. అసంగత్యలంకారం

కా. భిన్నదేశతయాత్యన్తం కార్యకారణభూతయోః.
యుగపద్ధర్మయోర్యత్ర ఖ్యాతిః సా స్యాదసంగతిః. 124

వృ. ఇహ యద్దేశం కారణం తద్దేశమేవ కార్యముత్పద్యమానం దృష్టమ్. యథా దూమాది యత్ర తు హేతుఫలరూపయోరపి ధర్మయోః కేనాప్యతిశయేన నానాదేశతయా యుగపదవభాసనం సా తయోః స్వభావోత్పన్నపరస్పరసంగతిత్యాగాత్ అసంగతిః. ఉదాహరణమ్-

గాథ. జస్సేవ వణో తస్సేఅ వేఅణా భణఇ తం జణో అలిఅం,
దన్తక్ఖఅం కవోలే బహూఏ వేఅణా సవత్తీణం 533

"యస్యైవ వ్రణస్తస్యైవ వేదనా భణతి తజ్జనోఽలీకమ్,
దన్తక్షతం కపోలే వధ్వాః వేదనా సపత్నీనామ్."

వ్యా. భిన్నేతి:- యత్ర = ఎక్కడ, కార్యకారణభూతయోః = కార్యకారణాలైన, ధర్మయోః = రెండు ధర్మాలకు, అత్యన్తమ్ = మిక్కిలి, భిన్నదేశతయా = భిన్నములైన ప్రదేశాలు కలుగునట్లు, ఖ్యాతిః = చెప్పడం ఉండునో, సా = అది, అసంగతిః = అసంగత్యలంకారం, స్యాత్ = అగును.

ఇహేతి :- లోకంలో కారణం ఏ ప్రదేశంలో ఉంటుందో ఆ ప్రదేశం

లోనే కార్యం పుట్టడం కనబడుతుంది. ఉదాహరణకి అగ్ని ఉన్నచోటనే ధూమం పుడుతుంది. కాని హేతుఫలరూపాలైన అనగా కార్యకారణరూపాలైన రెండు ధర్మాలు ఒకే సమయంలో రెండు వేరు వేరు ప్రదేశాలలో ఉన్నట్లు, ఏదో ఒక అతిశయాన్ని, విశేషాన్ని పురస్కరించుకొని ఎక్కడ చెప్పబడుతుందో అక్కడ అసంగత్యలంకారం. స్వాభావికంగా ఒక చోట ఉండవలసినవి అలా ఉండడాన్ని (సంగతిని) విడచివేయడంచేత దీనికి 'అసంగతి' అని పేరు. ఉదాహరణం-

జస్యేవ ఇతి :- వ్రణః = వ్రణం, యస్యైవ=ఎవనికో, తస్యైవ = వానికే, వేదనా = వేదన (బాధ) కలుగును అని,జనః భణతి = జనం చెపుతుంది, తత్ = అది, అలీకమ్ = అసత్యం. దన్తక్షతమ్ = దంతక్షతం, వధ్వాః=నవోఢయొక్క, కపోలే = గండస్థలంమీద, వేదనా = వేదన, సపత్నీనామ్ = సవతులకు.

వి. నూతనవధూకపోలంమీద ప్రియునిచే చేయబడిన దంతక్షతాదులు చూడగానే సవత్నులకు వేదన కలిగింది అని వర్ణించబడింది. వేదనాకారణమైన దంతక్షతవ్రణంఒక చోట కార్యమైన వేదన మరొక చోట ఉండడంచేత అసంగత్యలంకారం.

అవ. ఇక్కడ విరోధాభాసాలంకారం చెప్పవచ్చును కదా, అసంగత్యలంకారం ఆంగీకరించడం ఎందుకు అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు-

వృ. ఏషా చ విరోధబాధినీ న విరోధః, భిన్నాధారతయైవ ద్వయోరిహ విరోధితాయాః ప్రతిభాసాత్. విరోధే తు విరోధిత్వమ్ ఏకాశ్రయనిష్ఠమ్ అనుక్తమపి పర్యవసితమ్. అపవాదవిషయపరిహారేణ ఉత్సర్గస్య వ్యవస్థితేః. తథా చైవం నిదర్శితమ్.

వ్యా. ఏషా ఇతి :- అసంగత్యలంకారం విరోధాలంకారాన్ని బాధిస్తుంది. అంతే కాని ఇదే విరోధాలంకారం కాదు. ఎందుచేత ననగా ఈ అలంకారంలో ఆధారాలు వేరు వేరుగా ఉండడంచేతనే విరోధం భాసిస్తూంది. విరోధాభాసలక్షణంలో చెప్పకపోయినా అక్కడ విరోధం ఒకే ఆశ్రయంలో ఉండడాన్ని పట్టి ఏర్పడినది అని పర్యవసితం అవుతుంది; చెప్పినట్లే అవుతుంది. అనగా వేరు వేరు ప్రదేశాలలో ఉండవలసిన వస్తువులు ఒకే ప్రదేశంలో ఉన్నట్లు వర్ణిస్తే విరోధా

లంకారం అవుతుంది అన్నట్లు అక్కడ చెప్పిన ఉదాహరణలను పట్టి తెలుస్తుంది. అందుచేత అక్కడ ఉన్న విరోధం ఏకదేశనిష్ఠత్వంవల్ల ఏర్పడింది. అసంగత్యలంకారంలో ఉన్న విరోధం భిన్నదేశనిష్ఠత్వంవల్ల ఏర్పడింది. అందుచేత ఈ రెండు అలంకారాలలోను సామాన్యరూపంలో విరోధం ఉన్నా ఆ విరోధం వేరు ఈ విరోధం వేరు. 'విరోధం ఉంటే విరోధాభాసాలంకారం' అని సాధారణరూపంలో చెప్పిన లక్షణం సామాన్యశాస్త్రం. 'ఒకచోట ఉండవలసిన ధర్మాలు వేరు వేరు చోట్ల ఉంటే అసంగతి' అనే లక్షణం విశేషశాస్త్రం (అపవాదశాస్త్రం). అపవాద శాస్త్రానికి చోటు వదిలిపెట్టి సామాన్యశాస్త్రం ప్రవర్తించాలి. తన పరిధిని సంకుచితం చేసుకోవాలి అని న్యాయం. "ప్రకల్ప్యాపవాదవిషయం తత ఉత్సర్గః అభినివిశతే". అందుచేత ఇక్కడ విరోధాభాసలక్షణాన్ని బాధించి అసంగతిలక్షణమే ప్రవర్తిస్తుంది అని భావం. తత్రైవ నిదర్శితమ్- అనగా రెండు విరుద్ధధర్మాలు ఒకచోట ఉన్నట్లు వర్ణిస్తే విరోధాభాసం అనేదానికి అనుగుణంగానే ఉదాహరణలు చూపబడ్డాయి అని అర్థం.

శాస్త్రాలలో 'సామాన్యశాస్త్రం' 'విశేషశాస్త్రం' అని రెండు విధాల శాస్త్రాలు ఉంటాయి. వీటికే వరసగా 'ఉత్సర్గం' 'అపవాదం' అని పేర్లు. ఉదాహరణకి- "మా హింస్యాత్సర్వా భూతాని" (ఏ ప్రాణినీ హింసించకూడదు) అనే శ్రుతివాక్యం ఉంది. "అగ్నీషోమీయం పశుమాలభేత" అని మరొక శ్రుతివాక్యం ఉంది. "అగ్నీషోమయాగంలో ఆ దేవతల నుద్దేశించి పశువును బలి ఇవ్వాలి" అని దీని అర్థం. మొదటి వాక్యం ప్రకారం ఈ పశువును చంపడానికి వీలులేదు. ఆ వాక్యాన్ని మాత్రమే ప్రమాణంగా తీసికుంటే ఈ రెండవ వాక్యం అప్రమాణం అవుతుంది. అందుచేత మొదటివాక్యం అర్థాన్ని సంకుచితం చేసి "అగ్నీషోమీయపశుభిన్నమైన ఏ ప్రాణినీ హింసించకూడదు" అని అర్థం చెప్పుకోవాలి. ఇలా చెపితే రెండవ వాక్యానికి చోటు విడిలినట్లు అవుతుంది. ఈ విధంగా సామాన్యశాస్త్రం విశేష శాస్త్రంచేత బాధించబడుతుంది.

## 45. సమాధ్యలంకారం

కా. సమాధిః సుకరం కార్యం కారణాన్తరయోగతః,

వృ. సాధనాన్తరోపకృతేన కర్త్రా యదక్లేశేన కార్యమారబ్ధం సమాధీయతే స సమాధిర్నామ. ఉదాహరణమ్-

శ్లో॥ మానమస్యా నిరాకర్తుం పాదయోర్మే పతిష్యతః,
ఉపకారాయ దిష్ట్యేదముదీర్ణం ఘనగర్జితమ్. 534

వ్యా. సమాధిరితి :- కారణాన్తరయోగతః = మరియొక కారణంయొక్క సంబంధంవల్ల, కార్యమ్ = కార్యం, సుకరమ్ = అనాయాసంగా చేయబడినట్లయితే, సమాధిః = సమాధ్యలంకారం.

సాధనేతి :- సాధనంచేత ఉపకృతుడైన కర్తచేత ప్రారంభించబడిన కార్యం క్లేశం లేకుండా చేయబడినట్లయితే అది సమాధ్యలంకారం.

వి. ఒక పనిచేయడానికి ఒకడు ప్రయత్నిస్తూండగా తలవని తలంపుగా (కాకతాళీయన్యాయంచేత) వచ్చిన మరొక కారణంచేత ఆ పని అనాయాసంగా పూర్తి అయినట్లయితే అది సమాధ్యలంకారం. అతడు ముందు ఉపయోగించదలచిన కారణం ప్రధానమైనది; హటాతుగా వచ్చిన రెండవకారణం అప్రధానమైనది. సముచ్చయాలంకారంలో అన్ని కారణాలకీ సమప్రాధాన్యమే. ఉదాహరణం.

మానమితి :- "నేను ఆమె కోపం శాంతింపచేయడానికి పాదాలమీద పడబోవుచుండగా దైవవశంచేత నాకు ఉపకారం చేయడానికి ఉరుము ఉరిమినది".

వి. ఉరుముకు భయపడి ఆమె కోపం మరచిపోయి ఆశ్లేషించినది అని భావం. ఉరుము రావడంచేత అతడు తలపెట్టిన పని అనాయాసంగా జరిగింది కాబట్టి సమాధ్యలంకారం.

## 46. సమాలంకారం

కా. సమం యోగ్యతయా యోగో యది సంభావితః క్వచిత్.

వృ. ఇదమనయోః శ్లాఘ్యమితి యోగ్యతయా సంబన్ధస్య నియత విషయమధ్యవసానం చేత్తదా సమం తత్. సద్యోగే అసద్యోగే చ. ఉదాహరణమ్.

శ్లో॥ ధాతుః శిల్పాతిశయనికషస్థానమేషా మృగాక్షీ
రూపే దేవోఽప్యయమనుపమో దత్తపత్రః స్మరస్య.

జాతం దైవాత్సదృశమనయోః సంగతం యత్తదేత
చ్ఛృఙ్గారస్యోపనతమధునా రాజ్యమేకాతపత్రమ్. 535

వ్యా. సమమితి :— క్వచిత్ = ఎక్కడనైన, యోగః = రెండింటి యోగం, యోగ్యతయా = యోగ్యమైనదిగా, సంభావితః యది = ఊహించబడినట్లయితే, సమః = సమాలంకారం.

ఇదమితి :- ఈ రెండింటికీ ఇది శ్లాఘనీయంగా ఉంది అని సంబంధాన్ని యోగ్యమైన దానినిగా నిశ్చయపూర్వకంగా తెలపడం ఉన్నట్లయితే నమాలంకారం. ఇది సద్యోగంలోను, అసద్యోగంలోనూ కూడా ఉంటుంది.

వి. రెండు మంచి వస్తువులు గాని, రెండు చెడ్డ వస్తువులు గాని కలిసి నప్పుడు వీటి కలయిక చాలా బాగుంది అని మెచ్చుకొనడం సమాలంకారం. ఉదాహరణం.

ధాతురితి :- ఏషా = ఈ, మృగాక్షీ = మృగనయన, ధాతుః = బ్రహ్మ దేవునియొక్క, శిల్పాతిశయనికషస్థానమ్ = నిర్మాణకౌశలాతిశయంయొక్క గీటు రాయి. స్మరస్య = మన్మథునకు, దత్తపత్రః = ఇవ్వబడిన పత్రం గల, దేవోఽపి = ఈ ప్రభువు కూడ, రూపే = రూపమునందు, అనుపమః = సాటి లేనివాడు. దైవాత్ = దైవవశంవలన, అనయోః = వీరిద్దరికీ, యత్ = ఎందువలన, సదృశమ్ = తగిన, సంగతమ్ = కలయిక, జాతమ్ = అయినదో, తత్ = అందువలన, అధునా = ఇప్పుడు, శృఙ్గారస్య = శృంగారానికి, ఏకాతపత్రమ్ = ఏకాతపత్రమైన, రాజ్యమ్ = రాజ్యం, ఉపనతమ్ = వచ్చినది.

వి. ఇక్కడ మంచివాళ్ళు ఇద్దరు కలిసి నట్లు వర్ణించడంచేత సద్యోగ యోగ్యతారూపమైన సమాలంకారం.

'దత్తపత్రః' అనేది ప్రాచీనకాలపు అలవాటును సూచించే శబ్దం వలె కనబడుతుంది. పోటీకి రమ్మని పిలుస్తూ లేఖ పంపినవాడు లేదా 'ఇతడు మంచి అర్హత కలవాడు' అని పత్రముఖాన చెప్పినవాడు 'దత్తపత్రుడు' అయి ఉంటాడు. 'స్మరస్య దత్తపత్రః' మన్మథుణ్ణి పోటీకి పిలుస్తూ లేఖ వ్రాసినవాడు అని కాని మన్మథునికి యోగ్యతాపత్రం ఇచ్చినవాడు అని కాని అర్థం అయి ఉంటుంది. వ్యాఖ్యాతలు వ్రాసిన అర్థాలేవీ సంతృప్తికరంగా లేవు.

అవ. అసద్యోగంలో సమాలంకారానికి ఉదాహరణం చూపుతున్నాడు–

శ్లో॥ చిత్రం చిత్రం బత బత మహచ్చిత్ర మేతద్విచిత్రం
జాతో దైవాదుచితరచనాసంవిధాతా విధాతా,
యన్నిమ్బానాం పరిణతఫలస్ఫీతిరాస్వాదనీయా
యచ్చైతస్యాః కవలనకలాకోవిదః కాకలోకః. 536

వ్యా. చిత్రమితి :- చిత్రం చిత్రమ్=ఆశ్చర్యం! ఆశ్చర్యం! బత బత= ఓహో! ఓహో! ఏతత్ = ఇది, మహత్ = గొప్ప, చిత్రమ్ = చిత్రం! విచిత్రమ్ = విచిత్రం! దైవాత్ = దైవంవల్ల, విధాతా = బ్రహ్మదేవుడు, ఉచితరచనా సంవిధాతా = తగిన రచన చేసేవాడుగా, జాతః = అయినాడు, యత్ = ఏమనగా నిమ్బానామ్ = వేపచెట్లయొక్క, పరిణతఫలస్ఫీతిః = ముగ్గిన పళ్ళ సమృద్ధి, ఆస్వా దనీయా = ఆస్వాదించతగినదిగా ఉంది, యత్ చ=ఇంకా ఏమనగా, కాకలోకః = కాకుల గుంపు, ఏతస్యాః = ఈ ఫలసమృద్ధియొక్క, కవలనకలాకోవిదః = తినడాన్ని బాగా ఎరిగినది. కవలనకళలో ప్రావీణ్యం కలది.

వి. ఇక్కడ రెండు అసద్వస్తువుల శ్లాఘ్యమైన యోగం వర్ణించబడింది కాబట్టి సమాలంకారం.

## 47. విషమాలంకారం

కా. క్వచిద్యదతివైధర్మ్యాన్న శ్లేషో ఘటనామియాత్
కర్తుః క్రియాఫలావాప్తిర్నైవానర్థశ్చ యద్భవేత్. 127

గుణక్రియాభ్యాం కార్యస్య కారణస్య గుణక్రియే.
క్రమేణ చ విరుద్ధే యత్ స ఏష విషమో మతః. 128

వృ. ద్వయోరత్యన్తవిలక్షణతయా యత్ అనుపపద్యమానతయైవ యోగః ప్రతీయతే, యచ్చ కించిదారభమాణః కర్తా క్రియాయాః ప్రణా శాత్ న కేవలమభీష్టం యత్ ఫలం న లభేత యావదప్రార్థితమప్యనర్థం విషయమాసాదయేత్, తథా సత్యపి కార్యస్య కారణరూపానుకారే యత్

తయోర్గుణౌ క్రియే చ పరస్పరం విరుద్ధతాం వ్రజతః స సమవిపర్య యాత్మా చతూరూపో విషమః. క్రమేణోదాహరణమ్.

వ్యా. క్వచిదితి :- అతివైధర్మ్యాత్ = చాల విరుద్ధములైన ధర్మాలు కలిగి ఉండడం వలన, శ్లేషః = రెండింటి కలయిక, ఘటనామ్ = యోగ్యత్వమును, క్వచిత్ = కొన్నిచోట్ల, న ఇయాత్ ఇతి యత్ = పొందదు అనేది ఏది కలదో అదీ, కర్తుః = కర్తకు, క్రియాఫలావాప్తిః = క్రియాఫలప్రాప్తి, నైవ = ఉండనే ఉండదు, అనర్థః చ = అనర్థం కూడా, భవేత్ ఇతి యత్ = అవుతుంది అనేది ఏది కలదో, కారణస్య=కారణంయొక్క, గుణక్రియాభ్యామ్=గుణక్రియలకంటె, క్రమేణ = క్రమంచేత, కార్యస్య = కార్యంయొక్క, గుణక్రియే = గుణక్రియలు, విరుద్ధే = విరుద్ధములుగా, స్యాతామ్ ఇతి యత్ = అవుతాయి అనేది ఏది కలదో, అవీ, సః = అట్టి, ఏషః = ఇది, విషమః = విషమాలంకారంగా, మతః = చెప్ప బడినది

ద్వయోరితి :- అత్యంతవిలక్షణాలైన రెండింటి కలయిక అనుపపన్నంగా అయుక్తంగా కనబడడం, ఒక పని ప్రారంభించిన కర్త ఆ పని చెడిపోవడంవల్ల ఇష్టమైన ఫలాన్ని పొందకపోవడమే కాకుండా తాను అనుకొనని (కోరని) అనర్థ కరమైన విషయయాన్ని పొందడమూ, కార్యం కారణానికి అనురూపమైన ఆకారం కలిగి ఉండవలసినా వాటి (కార్యకారణాల) గుణక్రియలు పరస్పరం విరుద్ధాలుగా ఉండడం- ఈ విధంగా సమానికి విరుద్ధమైన రూపం గల 'విషమా లంకారం' నాలుగు విధాలు వరసగా ఉదాహరణలు.

శ్లో॥ శిరీషాదపి మృద్వఙ్గీ క్వేయమాయతలోచనా,
అయం క్వచ కుకూలాగ్నికర్కశో మదనానలః. 537

వ్యా. శిరీషేతి :- పద్మగుప్తుడు రచించిన నవసాహసాంకచరితంలోని శ్లోకం. "శిరీషపుష్పంకంటె కూడ మృదువైన శరీరం గల విశాలనేత్రయైన ఈమె ఎక్కడ! ఊకనిప్పువలె దుర్భరమైన ఈ మన్మథాగ్ని ఎక్కడ"!

వి. ఇక్కడ అత్యంతవిరుద్ధధర్మాలు గల నాయికామన్మథాగ్నుల యోగం అనుపపన్నం అని వర్ణించబడింది గాన విషమాలంకారప్రథమభేదం.

శ్లో॥ సింహికాసుతసంత్రస్తః శశః శీతాంశుమాశ్రితః,
జగ్రసే సాశ్రయం తత్ర తమన్యః సింహికాసుతః. 538

వ్యా. సింహికేతి :- "సింహికాసుతభయంచేత చెవులపిల్లి చంద్రుణ్ణి ఆశ్రయించింది. అక్కడ మరొక సింహికాసుతుడు దాన్ని ఆశ్రయంతో సహా మింగేశాడు".

వి. 'సింహికాసుత' శబ్దానికి 'సింహం పిల్ల' అనీ, 'సింహిక అనే రాక్షసి పుత్రుడైన రాహువు' అనీ రెండర్థాలు. చంద్రునివల్ల రక్షణం లభించకపోగా చంద్ర సహితంగా చెవులపిల్లి మింగివేయబడింది అని చెప్పడంచేత 'అనుకొన్న ఫలం లభించకపోవడమే కాకుండా, అనుకొనని అనర్థం వాటిల్లడం' విషమాలంకార ద్వితీయభేదానికి ఉదాహరణం.

శ్లో॥ సద్యః కరస్పర్శమవాప్య చిత్రం
రణే రణే యస్య కృపాణరేఖా,
తమాలనీలా శరదిన్దుపాణ్డు
యశస్త్రిలోక్యాభరణం ప్రసూతే. 539

వి. సద్యః ఇతి :- యస్య = ఎవనియొక్క, తమాలనీలా = తమాల వృక్షం వలె నీలవర్ణం గల, కృపాణలేఖా = సన్నని ఖడ్గం, రణే రణే = ప్రతీ యుద్ధంలోను, కరస్పర్శమ్ = హస్తస్పర్శను, అవాప్య = పొంది, సద్యః = వెంటనే, శరదిన్దుపాణ్డు = శరత్కాలచంద్రుడు వలె తెల్లనైన, త్రిలోక్యాభరణమ్ = మూడు లోకాలకీ ఆభరణమైన, యశః = కీర్తిని, ప్రసూతే = కనుచున్నదో.

వి. కారణమైన ఖడ్గం రంగు నీలం, కార్యమైన యశస్సు రంగు తెలుపు. ఈ విధంగా కార్యకారణాల గుణాలు పరస్పరవిరుద్ధాలుగా ఉన్నట్లు వర్ణించడం చేత కార్యకారణగుణవైషమ్యరూపమైన విషమాలంకారతృతీయభేదానికి ఉదాహరణం.

శ్లో॥ ఆనన్దమమన్దమిమం కువలయదలలోచనే దదాసి త్వమ్,
విరహస్త్వయైవ జనితస్తాపయతి తరాం శరీరం మే. 540

వృ. అత్రానన్దదానం శరీరతాపేన విరుధ్యతే.

వ్యా. ఆనన్దమితి :- "ఓ! కువలనయనా! నీవే నాకు అత్యధికమైన ఆనందాన్ని ఇస్తున్నావు. నీచేతనే కలిగిన విరహం నా శరీరాన్ని చాల తపింపచేస్తున్నది".

వి. ఇక్కడ కారణంలో (నాయికలో) ఉన్న ఆనందదాయకత్వం అనే క్రియా, ఆమెవల్ల జనించిన కార్యమైన విరహంలో ఉన్న తాపనం అనే క్రియా పరస్పరవిరుద్ధాలు. అందుచేత ఇది కార్యకారణక్రియావైషమ్యరూపమైన విషమాలంకారం.

వృ. ఏవమ్-

శ్లో॥ విపులేన సాగరశయస్య కుక్షిణా
భువనాని యస్య పపిరే యుగక్షయే,
మదవిభ్రమాసకలయా పపే పునః
స పురస్త్రియైకతమయైకయా దృశా. 541

వృ. ఇత్యాదావపి విషమత్వం యథా యోగమవగన్తవ్యమ్.

వ్యా. ఏవమితి:- ఈ విధంగానే-

విపులేనేతి :- యుగక్షయే = ప్రలయకాలమునందు, సాగరశయస్య = సాగరంలో శయనించిన, యస్య = ఎవనియొక్క, విపులేన = విశాలమైన, కుక్షిణా = కుక్షిచేత, భువనాని = లోకాలు, పపిరే = పానం చేయబడ్డాయో, సః పునః = అతడు, ఏకతమయా = ఒక్క, పురస్త్రియా = నగరం లోని స్త్రీచేత, మదవిభ్రమాసకలయా = మదవిలాసలచేత అసంపూర్ణమైన, సగం మూయబడిన, ఏకయా దృశా = ఒక కన్నుచేత, పపే = త్రాగబడెను.

వి. ఇక్కడ కుక్షి అవయవం. శరీరం అవయవి. కుక్షి భువనపానం చేసినది గాన ఆ పానానికి కర్త. శరీరం దృక్కుచేత పానం చేయబడిందిగాన ఆ పానంలో కర్మ. ఈ విధంగా అవయవావయవులైన కుక్షి-శరీరాలకు కర్తృత్వ-కర్మత్వరూపవైషమ్యం ఉంది గాన ఇది కూడ విషమాలంకారమే.

ఇత్యాదావితి :- ఇత్యాదిశ్లోకాలలో కూడ వీలును అనుసరించి విషమా లంకారలక్ష్యత్వాన్ని గుర్తించాలి.

## 48 అధికాలంకారం

కా. మహతోర్యన్మహీయాంసావాశ్రితాశ్రయయోః క్రమాత్,
ఆశ్రయాశ్రయిణౌ స్యాతాం తనుత్వేఽప్యధికం తు తత్.

వృ. ఆశ్రితమ్ ఆధేయమ్. ఆశ్రయస్తదాధారః. తయోర్మహతోరపి విషయే తదపేక్షయా తనూ అపి ఆశ్రయాశ్రయిణౌ ప్రస్తుతవస్తు ప్రకర్షవివక్షయా యథాక్రమం యత్ అధికతరతాం వ్రజతః తదిదం ద్వివిధమ్ అధికం నామ. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ అహో విశాలం భూపాల భువనత్రితయోదరమ్,
మాతి మాతుమశక్యోఽపి యశోరాశిర్యదత్ర తే. 542

శ్లో॥ యుగాన్తకాలప్రతిసంహృతాత్మనో
జగన్తి యస్యాం సవికాశమాసత,
తనౌ మముస్తత్ర న కైటభద్విష
స్తపోధనాభ్యాగమసంభవా ముదః. 543

వ్యా. మహతోరితి:- మహతోః=పెద్దవైన, ఆశ్రితాశ్రయయోః=ఆధేయమూ, ఆధారమూ ఉంటూండగా, ఆశ్రయాశ్రయిణౌ=ఆధారాధేయాలు, తనుత్వే అపి =అల్పములైనాకూడ, క్రమాత్=క్రమంగా, మహీయాంసౌ=పెద్దవిగా, స్యాతామ్ ఇతి యత్ = అగును అనేది ఏది కలదో, అనగా అవి పెద్దవిగా వర్ణింపబడినట్లయితే అది, అధికమ్ = అధికాలంకారం.

ఆశ్రితమితి:- ఆశ్రితం అనగా ఆధేయం. ఆశ్రయం అనగా దాని ఆధారం. అవి పెద్దవే అయినా వాటి విషయంలో, వాటికంటె చిన్నవే అయినా ఆధారాధేయాలు ప్రస్తుతవిషయంయొక్క, ప్రకర్షను చెప్పడంకోసం, వరనగా అధికత్వాన్ని పొందినట్లయితే అది ద్వివిధమైన అధికాలంకారం.

వి. పెద్ద అధేయం. (ఒక్క ఆధారంమీద ఉండే వస్తువు ఆధేయం)ఉంది. దాని అధారం దానికంటె చిన్నది. అయినా దానిని పెద్దదానిగా వర్ణిస్తే అదొక అధికాలంకారభేదం. అట్లే పెద్ద ఆధారం ఉంది. దానికంటె అధేయం చిన్నదే. అయినా పెద్దదిగా వర్ణింపబడుతుంది. అది రెండవ అధికాలంకారభేదం. వరసగా ఉదాహరణలు ఎట్లనగా-

అహో ఇతి :- భూపాల = రాజా! భువనత్రితయోదరమ్=మూడు లోకాల మధ్యభాగం, విశాలమ్ = విశాలమైనది; అహో = ఎంత ఆశ్చర్యం! యత్ = ఎందువల్ల అనగా, తే=నీయొక్క, మాతుమ్ అశక్యః అపి=ఇమడడానికి శక్యం కానిదైనా, యశోరాశిః = కీర్తియొక్క రాశి, అత్ర = దీనియందు, మాతి = ఇముడుచున్నది.

వి. ఇక్కడ ఆధారం భువనత్రయం. అదేయం యశోరాశి. చాలా పెద్దదైన ఈ యశోరాశిని కూడా ఇముడ్చుకుంటున్నది అని చిన్నదైన భువనత్రయోదరాన్ని వర్ణించడంచేత అధికాలంకారప్రథమభేదం.

యుగేతి :- శిశుపాలవధలోని శ్లోకం. యుగాన్తకాలప్రతిసంహృతాత్మనః = యుగాంతకాలమునందు ఉపసంహరించుకొనబడిన సకలజీవసముదాయం గల, కైటభద్విషః = కృష్ణునియొక్క, యస్యామ్ = ఏ. తనౌ = శరీరమునందు, జగన్తి = జగత్తులు, సవికాశమ్ = అవకాశం కలుగునట్లుగా, ఇరుకు లేకుండా, ఆసత = ఉండెనో, తత్ర=ఆ శరీరమునందు, తపోధనాభ్యాగమసంభవాః=నారదముని రావడం వల్ల కలిగిన, ముదః = సంతోషాలు, న మముః = ఇమడలేదు.

వి. ఇక్కడ ఆదేయం అయిన సంతోషం ఆధారమైన శ్రీకృష్ణశరీరం కంటె పెద్దదిగా వర్ణించబడింది గాన అధికాలంకారద్వితీయభేదం.

## 49. ప్రత్యనీకాలంకారం

కా. ప్రతిపక్షమశక్తేన ప్రతికర్తుం తిరస్క్రియా,
యా తదీయస్య తత్స్తుత్యై ప్రత్యనీకం తదుద్యతే. 129

వృ. న్యక్కృతిపరమపి విపక్షం సాక్షాన్నిరసితుమశక్తేన కేనాపి

యత్ తమేవ ప్రతిపక్షముత్కర్షయితుం తదాశ్రితస్య తిరస్కరణం తత్ అనీకప్రతినిధితుల్యత్వాత్ ప్రత్యనీకమభిధీయతే. యథా అనీకే అభియోజ్యే తత్ప్రతినిధిభూతమపరం మూఢతయా కేన చిదభియుజ్యతే తథేహ ప్రతియోగిని విజేయే తదీయోఽన్యః విజీయతే ఇత్యర్థః. ఉదాహరణమ్.

వ్యా. ప్రతిపక్షమితి :- ప్రతిపక్షమ్ = శత్రువును గూర్చి, ప్రతికర్తుమ్= ప్రతిక్రియజేయుటకు, అశక్తేన = సమర్థుడు కానివానిచేత, తదీయస్య = వానికి సంబంధించినవానియొక్క, యా = ఏ, తిరస్క్రియా = తిరస్కరించడం, తత్స్తుత్యై = ఆ శత్రువుయొక్క స్తుతికోసం వర్ణించబడుతుందో, తత్ = అది, ప్రత్యనీకమ్ = ప్రత్యనీకాలంకారంగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

న్యక్కృతీతి :- తనను పరాభవిస్తున్నవాడైనా శత్రువును ప్రత్యక్షంగా జయించడానికి అసమర్థుడైన ఒకానొకడు ఆ శత్రువుకే ఉత్కర్ష కలిగించడానికై అనగా చివరికి అతని గొప్పతనమే వ్యక్తం అయ్యే విధంగా, అతనిని ఆశ్రయించినవాణ్ణి తిరస్కరించినట్లయితే అది ప్రత్యనీకం అని చెప్పబడును. సేనకు ప్రతినిధియైనవానిని జయించడం వంటిది గాన ఆ పేరు. అనీకాన్ని అనగా సేనను ఎదిరించవలసి ఉండగా ఒక మూఢునిచేత ఆ సేనకు ప్రతినిధి అయినవాడు ఎదిరించబడినట్లు ఇక్కడ శత్రువును జయించవలసి ఉండగా అతనికి సంబంధించిన మరొకడు జయించబడతాడు అని అర్థం. ఉదాహరణం

శ్లో॥ త్వం వినిర్జితమనోభవరూపః
సా చ సున్దర భవత్యనురక్తా,
పఞ్చభిర్యుగపదేవ శరైస్తాం
తాపయత్యనుశయాదివ కామః. 544

వృ. యథా వా-

శ్లో॥ యస్య కించిదపకర్తుమక్షమః
కాయనిగ్రహగృహీతవిగ్రహః,

కాన్తవక్త్రసదృశాకృతిం కృతీ
రాహురిన్దురధునాపి బాధతే. 545

వృ. ఇనోరత్ర తదీయతా సంబన్ధిసంబన్ధాత్.

వ్యా. త్వమితి :- సున్దర = ఓ సుందరుడా! త్వమ్ = నీవు, వినిర్జితమనోభవరూపః = జయించబడిన మన్మథరూపం కలవాడవు. సా చ = ఆమె, భవతి = నీయందు, అనురక్తా = అనురాగం కలది, కామః = మన్మథుడు, అనుశయాదివ = ద్వేషంవల్ల వలె, తామ్ = ఆమెను, పఞ్చభిః శరైః = ఐదు బాణాలచేత, యుగపదేవ = ఒక్కమాటే, అన్ని బాణాలు ఒకే సారి ప్రయోగించి, తాపయతి = పీడిస్తున్నాడు.

వి. ఇక్కడ మన్మథుడు తనను జయించిన ఆ సుందరుణ్ణి ఏమీ చేయజాలక అతనికి సంబంధించిన నాయికను పీడిస్తున్నట్లు వర్ణించడంచేత ప్రత్యనీకాలంకారం.

యస్యేతి :- రాయనిగ్రహగృహీతవిగ్రహః = శరీరాన్ని నిగ్రహించడంచేత గ్రహించబడిన విరోధం గల, కృతీ = నేర్పరి అయిన, రాహుః = రాహువు, యస్య = ఏ శ్రీకృష్ణునికి, కించిత్ = కొంచెం కూడ, అపకర్తుమ్ = అపకారం చేయడానికి, అక్షమః = అసమర్థుడై, కాన్తవక్త్రసదృశాకృతిమ్ = మనోహరమైన, ముఖంతో సమానమైన ఆకారం గల, ఇన్దుమ్ = చంద్రుణ్ణి, అధునాపి = ఇప్పుడు కూడ, బాధతే = బాధించుచున్నాడు.

ఇన్దోరితి :- ఇక్కడ చంద్రుడు కృష్ణుని ముఖంతో సాదృశ్యరూపసంబంధం వల్ల కృష్ణునికి చెందినవాడు అయ్యాడు. సాక్షాత్సంబధం ఉన్నవారిని బాధించడానికి పై శ్లోకం ఉదాహరణం. ఈ శ్లోకం సంబంధించినదానికి సంబంధించిన దానిని బాధించడానికి ఉదాహరణం.

## 50. మీలితాలంకారం

కా. సమేన లక్ష్మణా వస్తు వస్తునా యన్నిగూహ్యతే,
నిజేనాగన్తునా వాపి తన్మీలితమితి స్మృతమ్. 134

వృ. సహజమ్ ఆగన్తుకం వా కిమపి సాధారణం యల్లక్షణం తద్ద్వారేణ యత్ కించిత్ కేన చిద్వస్తునా వస్తుస్థిత్యైవ బలీయస్తయా తిరోధీయతే తత్ మీలితమితి ద్విధా స్మరన్తి. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ అపాఙ్గతరలే దృశౌ మధురవక్రవర్ణా గిరో
విలాసభరమన్థరా మతిరతీవ కాన్తం ముఖమ్,
ఇతి స్ఫురితమఙ్గకే మృగదృశః స్వతో లీలయా
తదత్ర న మదోదయః కృతపదోఽపి సంలక్ష్యతే. 546

వృ. అత్ర దృక్తరలతాదికమఙ్గస్య లిఙ్గం స్వాభావికం సాధారణం చ మదోదయేన, తత్రాప్యేతస్య దర్శనాత్.

వ్యా. సమేనేతి :- నిజేన = సహజంగా తనది గాని, ఆగన్తునా వాపి = = నిమిత్తవశంచేత క్రొత్తగా వచ్చినది గాని అయిన, సమేన = కప్పబడేదానికీ కప్పేదానికీ సాధారణమైన, లక్ష్మణా = చిహ్నంచేత, వస్తు = ఒక వస్తువు, వస్తునా = వస్తుగతిచేతనే అనగా స్వాభావికంగానే, నిగూహ్యతే ఇతి యత్ = కప్పివేయబడుతుంది అనేది ఏది కలదో, తత్ = అది, మీలితమ్ ఇతి = మీలితాలంకారం అని, స్మృతమ్ = చెప్పబడింది.

సహజమితి :- సహజమైనది కాని, ఆగంతుకం కాని అయిన ఏ సాధారణమైన లక్షణం (చిహ్నం) ఉండునో దాని ద్వారా ఒక వస్తువు మరొక వస్తువుచేత, అది సహజంగా అధికబలం కలది అవడంచేత, కప్పివేయబడడం ఏది గలదో అది రెండు విధాలైన మీలితాలంకారం అని చెప్పుదురు.

వి. రెండు వస్తువులలో ఒకే విధమైన చిహ్నం ఉంటుంది అది సహజం కావచ్చు, తరవాత కారణాంతరంచేత వచ్చినది కావచ్చు. అలాంటి చిహ్నాన్ని పట్టి ఒక బలీయమైన వస్తువు మరొక వస్తువును కప్పివేస్తే అది మీలితం. ఆ చిహ్నం సహజం అయితే అదొక మీలితం, ఆగంతుకం అయితే అదొక మీలితం. ఈ విధంగా రెండు విధాలు. క్రమంగా ఉదాహరణలు.

అపాఙ్గేతి :- దృశౌ = నేత్రములు, అపాఙ్గతరలే = నేత్రాంతములయందు చంచలములైనవి. గిరః = వాక్కులు, మధురవక్రవర్ణాః = మధురములైన, వక్ర

ముతైన వర్ణాలు గలవి. గతిః = గమనం. విలాసభరమన్థరా = విలాసాతిశయం చేత మందమైనది. ముఖమ్ = ముఖం, అతీవ = మిక్కిలి, కాన్తమ్ = మనోహర మైనది, ఇతి = ఈ విధముగా, మృగదృశః = ఈ మృగనయనయొక్క, అఙ్గకే = శరీరమునందు, స్వతః = సహజంగానే, లీలయా = విలాసచేత, స్ఫురితమ్ = ప్రకాశించుట. విలాస = ప్రకాశిస్తూన్నది, తత్ = ఆ కారణం వల్ల, అత్ర = ఈ శరీరమునందు, కృతపదోఽపి = చేయబడిన స్థానం కలదైనా, మదోదయః = మదం యొక్క ఆవిర్భావం, న సంలక్ష్యతే = చూడబడడంలేదు.

అత్రేతి :- ఇక్కడ శరీరంలో ఉన్న నేత్రచాంచల్యాదికమైన లింగం, చిహ్నం, స్వాభావిక మైనది. ఇది మదోదయంతో సాధారణం. అనగా మత్తు కలిగినప్పుడు కూడా ఈ చిహ్నం ఉంటుంది. మత్తు కలిగినప్పుడు ఈ నేత్ర చాంచల్యాదికం ఉంటుంది కదా?

వి. సహజమైన నేత్రచాంచల్యాదిచిహ్నంచేత మదంవల్ల కలిగే చిహ్నం కప్పివేయబడింది గాన మీలితాలంకారం; ప్రథమభేదం.

శ్లో॥ యే కన్దరాసు నివసన్తి సదా హిమాద్రే
స్త్వత్పాతశఙ్కితధియో వివశా ద్విషస్తే,
అప్యఙ్గముత్పులకముద్వహతాం సకమ్పం
తేషామహో బత భియాం న బుధోఽప్యభిజ్ఞః. 547

వృ. అత్ర తు సామర్థ్యాదవసితస్య శైత్యస్య ఆస్తుకత్వాత్తత్ప్రభవయోరపి కమ్పపులకయోస్తాద్రూప్యం సమానతా చ; భయేష్వపి తయోరుపలక్షితత్వాత్.

వ్యా. యే ఇతి :- తే = నీయొక్క, యే = ఏ, ద్విషః = శత్రువులు, త్వత్పాతశఙ్కితధియః = నీయొక్క హటాత్తుగా రావడంచే భయపడుతున్న మనస్సులు గలవారై, వివశాః = వ్యాకులులై, హిమాద్రేః = హిమవత్పర్వతం యొక్క, కన్దరాసు = గుహలలో, సదా = ఎల్లప్పుడూ, నివసన్తి = నివసిస్తున్నారో, ఉత్పులకమ్ = బయలుదేరుచున్న పులకములు గల, సకమ్పమ్ = కంపంతో కూడిన, అఙ్గమ్ = శరీరమును, ఉద్వహతామపి = ధరిస్తూన్నవారైనా, తేషామ్ =

వారియొక్క, భియామ్ = భయాలకు, బుధః అపి = మంచి తెలివైనవాడు కూడ, అభిజ్ఞః = గుర్తించువాడు, న = కాదు.

అత్రేతి :. ఇక్కడ హిమాద్రికందరాలలో నివసిస్తున్నట్లు చెప్పడం సామర్థ్యంచేత శైత్యం ఉన్నట్లు తెలియబడుతున్నది. ఈ శైత్యం (శత్రువులకు) ఆగంతుకం. దీనివల్ల కలిగే కంపపులకలు భయంవల్ల కలిగే కంపపులకలు ఒకే విధంగా ఉంటాయి. ఇవి శైత్యానికీ, భయానికీ సాధారణమైనవి.

వి. ఆగంతుకమైన శైత్యం వల్ల కలిగిన కంపపులకలు భయంవల్ల కలిగిన కంపపులకలను తెలియకుండేటట్లు కప్పివేసినా యని వర్ణించడంచేత ఆగంతుకచిహ్నంచేత మీలితానికి ఉదాహరణం.

## 51. ఏకావల్యలంకారం

కా. స్థాప్యతేఽపోహ్యతే వాపి యథాపూర్వం పరం పరమ్,
విశేషణతయా యత్ర వస్తు సైకావలీ మతా. 131

వృ. పూర్వం పూర్వం ప్రతి యత్ర ఉత్తరస్య వస్తునో వీప్సయా విశేషణభావేన యత్ స్థాపనం నిషేధో వా సంభవతి సా ద్విధా బుధైరేకావలీ భణ్యతే. క్రమేణోదాహరణమ్.

వ్యా. స్థాప్యతే ఇతి :- యత్ర = ఎచట, యథాపూర్వమ్ = పూర్వపూర్వవస్తువును గూర్చి, పరంపరమ్ = ఉత్తరోత్తరవస్తువు, విశేషణతయా = విశేషణంగా, స్థాప్యతే = విధించబడుతుందో, అపోహ్యతే వాపి = లేదా నిషేధించబడుతుందో, సా = అది, ద్విధా = రెండు విధాలైన, ఏకావలీ = ఏకావల్యలంకారం.

పూర్వమితి :- ఎక్కడ పూర్వపూర్వవస్తువుకు విశేషణంగా, అనేక పర్యాయాలు ఉత్తరోత్తరవస్తువును విధించడం గాని, నిషేధించడం గాని జరుగుతుందో అది రెండు విధాలైన ఏకావలిగా పండితులచేత చెప్పబడుతుంది. క్రమంగా ఉదాహరణం.

వి. ఒక వస్తువును చెప్పి దానికి విశేషణంగా మరొక వస్తువును, దానికి విశేషణంగా మరొక వస్తువును, ఈ విధంగా వర్ణిస్తే అది ఏకావల్యలంకారం. విశే

షణంగా చెప్పినదానిని విధిస్తే (ఉన్నట్లు చెపితే) ఒక భేదం; నిషేధిస్తే మరొక భేదం.

శ్లో॥ పురాణి యస్యాం సవరాఙ్గనాని
వరాఙ్గనా రూపపురస్కృతాఙ్గ్యః,
రూపం సమున్మీలితసద్విలాస
మస్త్రం విలాసః కుసుమాయుధస్య.

శ్లో॥ న తజ్జలం యన్న సుచారుపఙ్కజం
న పఙ్కజం తత్ యదలీనషట్పదమ్,
న షట్పదోఽసౌ కలగుఞ్జితో న యో
న గుఞ్జితం తన్న జహార యన్మనః. 549

వ. పూర్వత్ర పురాణాం వరాఙ్గనాః, తాసామఙ్గవిశేషణముఖేన రూపం, తస్య విలాసాః, తేషామప్యస్త్రమిత్యమునా క్రమేణ విశేషణం విధీయతే. ఉత్తరత్ర ప్రతిషేధేఽప్యేవం యోజ్యమ్.

వ్యా. పురాణీతి :- పద్మగుప్తుని నవసాహసాంకచరితంలోని శ్లోకం. యస్యామ్ = ఏ నగరియందు, పురాణి = గృహాలు, సవరాఙ్గనాని = ఉత్తమస్త్రీలతో కూడినవి, వరాఙ్గనాః = వరాంగనలు, రూపపురస్కృతాఙ్గ్యః = రూపంచేత అలంకరించబడిన శరీరాలు గలవారు, రూపమ్ = రూపము, సమున్మీలితసద్విలాసమ్ = వికసించిన మంచి విలాసలు గలది. విలాసః = విలాస, కుసుమాయుధస్య = మన్మథునియొక్క, అస్త్రమ్ = అస్త్రము.

వి. ఇక్కడ పురానికి విశేషణంగా (సంబంధించినట్లుగా) వరాంగనలు, వరాంగనలకు విశేషణంగా రూపం, రూపానికి విశేషణంగా విలాసలు, విలాసలకు విశేషణంగా అస్త్రం చెప్పబడ్డాయి. ఇక్కడ విశేషణాల స్థితి వర్ణించబడింది. అందుచేత ఏకావలీప్రథమభేదం.

నేతి :- భట్టికావ్యంలోని శ్లోకం. యత్ = ఏది, సుచారుపఙ్కజమ్ = చాల

అందమైన పద్మాలు కలది, న = కాదో, తత్ = అట్టి, జలమ్ = జలము, న = లేదు. యత్ = ఏది, అలీనషట్పదమ్ = కూర్చుని ఉన్న (అణిగిఉన్న), తుమ్మెదలు కలది కాదో, తత్ = అట్టి, పఙ్కజమ్ = పద్మం, న = లేదు. యః = ఏది, కలగుఞ్జితః = మధురమైన ధ్వని కలది, న = కాదో, అసౌ = అట్టి, షట్పదః = తుమ్మెద, న = లేదు, యత్ = ఏది, మనః = మనస్సును, న జహార = హరించ లేదో, తత్ = అట్టి, గుఞ్జితమ్ = ధ్వని. న = లేదు.

వి. ఇక్కడ జలంలో పంకజాన్నీ, పంకజంలో షట్పాదాలనూ, షట్పదాలలో గుంజితాన్నీ, గుంజితంలో మనోహరణాన్నీ విశేషణంగా నిషేధిస్తూ వర్ణన చేయబడింది గాన ఇది ఏకావలీద్వితీయభేదానికి ఉదాహరణం. చివరికి జలాదులలో పద్మాదులు ఉన్నాయని చెప్పినా ఆ చెప్పడం నిషేధముఖంగా జరిగింది కాబట్టి దీనిలో ఒక వైచిత్ర్యవిశేషం ఉంది.

వ్యా. పూర్వత్రేతి :- మొదటి ఉదాహరణంలో పురాలకు వరాంగనలు, వాళ్ళ అంగానికి విశేషణంగా రూపం, దానికి విలాసలు, వాటికి అస్త్రమూ అని, ఈ క్రమంచేత విశేషణం విధించబడుతున్నది. రెండవ ఉదాహరణంలో నిషేధం విషయంలో కూడా ఇట్లే అన్వయించుకోవాలి.

## 52. స్మరణాలంకారం

కా. యథానుభవమర్థస్య దృష్టే తత్సదృశే స్మృతిః,
స్మరణమ్.

వృ. యః పదార్థః కేనచిదాకారేణ నియతః యదా కదాచిత్ అనుభూతోఽభూత్ స కాలాన్తరే స్మృతిప్రతిబోధాధాయిని తత్సమానే వస్తుని దృష్టే సతి యత్ తథైవ స్మర్యతే తత్ భవేత్ స్మరణమ్. ఉదాహరణమ్.

శ్లో॥ నిమ్ననాభికుహరేషు యదమ్భః
ప్లావితం చలదృశాం లహరీభిః,

తద్భవైః కుహరుతైః సురనార్యః
స్మారితాః సురతకణ్ఠరుతానామ్. 550

వృ. యథా వా-

గాథ. కరజుగహిఅజసోఆత్థణముహవిణివేసిఆహరపుడస్స,
సమరిఅపఞ్చజణ్ణస్స ణమహ కణ్హస్స రోమాఞ్చమ్. 551

"కరయుగగృహీతయశోదాస్తనముఖవినివేశితాధరపుటస్య
సంస్మృతపాఞ్చజన్యస్య నమత కృష్ణస్య రోమాఞ్చమ్".

వ్యా. యథేతి :- తత్సదృశే = ఆ వస్తువుతో సమానమైనది, దృష్టే = తెలియబడిందగుచుండగా, అర్థస్య = మరియొకవస్తువుయొక్క, యథానుభవమ్ = అనుభవాన్ని అనుసరించి, అది పూర్వం ఏ విధంగా అనుభవగోచరం అయిందో ఆ విధంగా, స్మృతిః = స్మృతి, స్మరణమ్ = స్మరణాలంకారము.

యః ఇతి:- ఒకానొక ఆకారంతో కూడినట్లు నిర్ధారితమైన ఏ పదార్థం పూర్వం ఒకప్పుడు అనుభవించబడిందో, అనగా తెలియబడిందో, దానినే, మరొక కాలంలో స్మృతిని మేల్కొలిపే మరొక వస్తువు చూడబడగానే, స్మరించడం స్మరణాలంకారం. ఉదాహరణం-

నిమ్నేతి:- లహరీభిః = తరంగాలచేత, యత్ = ఏ, అమ్బుః = నీరు, చలదృశామ్ = చంచలములైన చూపులు గల యువతులయొక్క, నిమ్ననాభికుహరేషు = లోతైన నాభిరంధ్రములయందు, ప్లావితమ్ = నింపబడిందో, తద్భవైః = దాని వల్ల కలిగిన, కుహరుతైః = 'కుహ' అనే శబ్దాలచేత, సురనార్యః = అప్సరసలు, సురతకణ్ఠరుతానామ్ = సురతసమయములందు కంఠధ్వనులకు, స్మారితాః = స్మరింపచేయబడిరి.

వి. ఇక్కడ ఈ ధ్వనులను వినడంచేత పూర్వం అనుభవించబడిన, అనగా తెలిసి ఉన్న, సురతసమయంలో చేసే ఖంఠధ్వనులు స్మరించబడినట్లు వర్ణించడంచేత స్మరణాలంకారం.

మరొక ఉదాహరణం ఎట్లనగా-కరజుఅ ఇతి:- "హస్తద్వయంచేత పట్టుకొన

బడిన యశోదస్తనాగ్రమునందు అధరపుటాన్ని (దొప్పవలె ముణిచిన పెదవులను) ఉంచగానే పాంచజన్యాన్ని స్మరించిన శ్రీకృష్ణుని రోమాంచానికి సమస్కరించండి".

వి. ఇక్కడ శంఖసందృశమైన స్తనాన్ని చూడగానే శ్రీకృష్ణునకు పూర్వ జన్మకు సంబంధించిన పాంచజన్యం జ్ఞాపకం వచ్చింది గాన స్మరణాలంకారం.

## 53. భ్రాంతి మదలంకారం

కా. భ్రాన్తిమానన్యసంవిత్తత్తుల్యదర్శనే. 132

వృ. తదితి అన్యత్ అప్రాకరణికం నిర్దిశ్యతే, తేన సమానమ్ అర్థాదిహ ప్రాకరణికం ఆశ్రీయతే. తస్య తథావిధస్య దృష్టౌ సత్యాం యత్ అప్రాకరణికతయా సంవేదనం స భ్రాన్తిమాన్. న చైష రూపకం, ప్రథమాతిశయోక్తిర్వా; తత్ర వస్తుతో భ్రమస్యాభావాత్. ఇహ చ అర్థాను గమనేన సంజ్ఞాయాః ప్రవృత్తేః; తస్య స్పష్టమేవ ప్రతిపన్నత్వాత్. ఉదాహరణమ్-

శ్లో॥ కపాలే మార్జారః పయ ఇతి కరాన్ లేఢి శశినః
తరుచ్ఛిద్రప్రోతాన్ బిసమితి కరీ సంకలయతి,
రతాన్తే తల్పస్థాన్ హరతి వనితాప్యంశుకమితి
ప్రభామత్తశ్చన్ద్రో జగదిదమహో విప్లవయతి. 552

వా. భ్రాన్తీతి-తత్తుల్యదర్శనే=అప్రకృతమైనదానితో సమానమైన ప్రకృత వస్తువును చూచినప్పుడు, అన్యసంవిత్=అన్యమైన, అప్రకృతమైన, వస్తువుయొక్క జ్ఞానం, భ్రాన్తిమాన్ = భ్రాంతిమదలంకారం.

తదితి-'తత్'అనే శబ్దంచేత అప్రాకరణికమైన మరొక వస్తువు నిర్దేశించ బడుతుంది. దానితో సమానం అనగా ఇక్కడ ప్రాకరణికము అని అర్థం. ఆ విధ మైన దానిని (ప్రాకరణికవస్తువును) చూడగానే దానిని అప్రాకరిణకవస్తువునుగా గ్రహించడం భ్రాంతిమదలంకారం. అయితే ఇది రూపకాలంకారమో లేదా ఉప మేయాన్ని పూర్తిగా కప్పివేసి అధ్యవసానం చేయడం అనే మొదటి అతిశయోక్తి

భేదమో అని చెప్పడానికి వీలులేదు. ఆ రూపకాతిశయస్థలాలలో భ్రమ లేదు. ఇక్కడ, "భ్రాంతి ఉన్నది"అనే అర్థాన్ని పట్టి ఈ అలంకారానికి ఈపేరు పెట్టడం చేత భ్రమ స్పష్టంగానే తెలుస్తూన్నది కదా? ఉదాహరణం.

కపాలే ఇతి:- మార్జారః = పిల్లి, పయః ఇతి = పాలు అనుకొని, కపాలే = మూకుట్లో, శశినః = చంద్రునియొక్క, కరాన్ = కిరణాలను, లేఢి = నాకుతున్నది. తరుచ్ఛాయాప్రోతాన్ = చెట్టు నీడలో గుచ్చబడిన (క్రిందికి ప్రసరింపచేయబడిన) ఆ కిరణాలను, బిసమ్ ఇతి=తామరతూడు అనుకొని, కరీ=ఏనుగు, సంకలయతి = గ్రహిస్తూన్నది. తల్పస్థాన్ = శయనంమీద ఉన్న ఆ కిరణాలను, అంశుకమితి = వస్త్రం అనుకొని, వనితాపి = స్త్రీకూడ, రతాన్తే = సురతాంతమునందు, హరతి=ప్రోగుచేస్తూన్నది. ప్రభామత్తః=కాంతిచేత మత్తెక్కిన, చన్ద్రః= చంద్రుడు, ఇదం జగత్ = ఈ జగత్తును, విప్లవయతి = కంగారుపెట్టేస్తున్నాడు. అహో = ఏమి ఆశ్చర్యం!

వి. ఇక్కడ అపకృతాలైన క్షీరాదులతో సమానమైన ప్రకృతచంద్రకిరణాలను చూచి మార్జారాదులు క్షీరాదులుగా భావించడంచేత భ్రాంతిమదలంకారం.

## 54 ప్రతీపాలంకారం

కా. ఆక్షేప ఉపమానస్య ప్రతీపముపమేయతా
తస్యైవ యది వా కల్ప్యా తిరస్కారనిబన్ధనమ్. 133

వృ. అస్య ధురం సుతరాముపమేయమేవ వోఢుం ప్రౌఢమితి కైమర్థ్యేన యదుపమానమాక్షిప్యతే, యదపి తస్యైవోపమానతయా ప్రసిద్ధస్య ఉపమానాన్తరవివక్షయా అనాదరార్థముపమేయభావః కల్ప్యతే తదుపమేయస్యోమానప్రతికూలవర్తిత్వాదుభయరూపం ప్రతీపమ్. క్రమేణోదాహరణమ్.

శ్లో॥ లావణ్యౌకసి సప్రతాపగరిమణ్యగ్రేసరే త్యాగినాం
దేవ త్వయ్యవనీభరక్షమభుజే నిష్పాదితే వేధసా,

ఇన్దుః కిం ఘటితః కిమేష విహితః పూషా కిముత్పాదితం
చిన్తారత్నమదో ముధైవ కిమమీ సృష్టాః కులక్ష్మాభృతః.

వ్యా. ఆక్షేప ఇతి:- ఉపమానస్య = ఉపమానంయొక్క, ఆక్షేపః = నిషేధం లేదా నింద, ప్రతీపమ్ = ఒక ప్రతీపాలంకారం. యది వా = లేక, తస్యైవ = ఆ ఉపమానానికే, తిరస్కారనిబన్ధనమ్ = తిరస్కారానికి కారణమైన, ఉపమేయతా = ఉపమేయత్వం, కల్ప్యా = కల్పించబడినట్లయితే అది రెండవ ప్రతీపాలంకారం.

అస్యేతి:- "దీని భారాన్ని పూర్తిగా ఉపమేయమే వహించగలదు. ఇంక ఇది ఎందుకు"అనే భావంతో ఉపమానం నిందించబడినట్లయితే అది మొదటి ప్రతీపాలంకారం. ఉపమానంగా లోకంలో ప్రసిద్ధమైన చంద్రాదులకు, మరొక ఉపమానం చెప్పవలె ననే ఉద్దేశంతో, అనగా ఉపమేయమైన ముఖాదికాన్నే ఉపమానంగా చెప్పవలె ననే అభిప్రాయంతో, ఉపమేయత్వం కల్పించినా అది రెండవ ప్రతీపాలంకారం. ఉపమేయం ఉపమానానికి ప్రతికూలంగా ఉండడంచేత దీనికి ఆ పేరు. ఈ విధంగా ఇది రెండు విధాలు. క్రమంగా ఉదాహరణాలు.

లావణ్యేతి:- దేవ = రాజా ! లావణ్యౌకసి = లావణ్యానికి స్థానమూ, సప్రతాపగరిమణి = ప్రతాపంయొక్క ఆధిక్యంతో కూడినవాడవు, త్యాగినామ్ = త్యాగవంతులలో, అగ్రేసరే = అగ్రమునందు ఉండేవాడవు, అవనీభరక్షమభుజే = భూభారానికి సమర్థమైన భుజం కలవాడవూ అయిన, త్వయి = నీవు, వేధసా = బ్రహ్మదేవునిచేత, నిష్పాదితే = సృష్టించబడినవాడ వగుచుండగా, ఇన్దుః = చంద్రుడు, కిమ్ = ఎందుకు, ఘటితః = కూర్చబడినాడు ? ఏషః పూషా = ఈ సూర్యుడు, కిమ్ = ఎందుకు, విహితః = సృష్టించబడ్డాడు? అదః = ఈ, చిన్తారత్నమ్ = చింతామణి, ముధైవ = వ్యర్థంగానే, కిమ్ = ఎందుకు, ఉత్పాదితమ్ = పుట్టించబడింది? అమీ = ఈ, కులక్ష్మాభృతః = కులపర్వతాలు, కిమ్ = ఎందుకు, సృష్టాః = సృష్టించబడ్డాయి?

ఇక్కడ లావణ్యాదిగుణాలు గల ఉపమేయమైన రాజు ఉండగా ఉపమానాలైన చంద్రాదుల సృష్టి అనావశ్యకం అని చెప్పడంచేత ప్రథమప్రతీపాలంకారం.

గాథ. ఏ ఏహి దావ సున్దరి కణ్ణం దాఊణ సుణసు వఅణిజ్జం
తుజ్ఝ ముహేణ కిసోఅరి చందో ఉఅమిజ్జఇ జణేణ. 554

"అయి ఏహి తావత్సున్దరి కర్ణం దత్వా శృణుష్వ వచనీయమ్,
తవ ముఖేన కృశోదరి చన్ద్ర ఉపమీయతే జనేన".

వృ. అత్ర ముఖేనోపమీయమానస్య శశినః స్వల్పతరగుణత్వాత్ ఉపమిత్యనిష్పత్త్యా 'వఅణిజ్జమ్' ఇతి వచనీయపదాభివ్యఙ్గ్యస్తిరస్కారః.

వ్యా. ఏ ఇతి:- "ఓ! సుందరీ! ఇటురా; నిన్నెంతగా కించపరుస్తున్నారో చెవి ఇచ్చి విను. ఓ! కృశోదరీ! లోకం చంద్రుణ్ణి నీ ముఖముతో పోలుస్తున్నారు".

అత్రేతి:- ఇక్కడ 'వచనీయ' పదంచేత ముఖంతో పోల్చబడుతూన్న చంద్రుడు చాల తక్కువగుణాలు కలవాడు అని సూచించడంచేత ఉపమితియే నిష్పన్నం కాదు. అనగా ఉపమానోపమేయభావమే కుదరదు, అని వ్యంగ్యం. తద్ద్వారా చంద్రతిరస్కారం వ్యంగ్యం. అందుచేత ప్రతీపాలంకారద్వితీయభేదం.

వృ. క్వచిత్తు నిష్పన్నైవోపమితిక్రియా అనాదరనిబన్ధనమ్. యథా-

శ్లో॥ గర్వమసంవాహ్యమిమం లోచనయుగలేన కిం వహసి ముగ్ధే,
సన్తీదృశాని దిశి దిశి సరస్సు నను నీలనలినాని. 555

వృ. ఇహోపమేయీకరణమేవోత్పలానామనాదరః.

వ్యా. క్వచిదితి :— కొన్నిచోట్ల ఉపమితిక్రియ నిష్పన్నమై కూడ అనాదరానికి కారణం అవుతుంది. ఎట్లనగా-

గర్వమితి :— "ఓ ముద్దరాలా! ఈ నేత్రయుగం చూచుకొని మోయలేనంత గర్వం ఎందుకు వహిస్తావు. అన్ని దిక్కులలోను, సరస్సులలో ఈ నేత్రాల వంటి నీలనలినాలు ఉన్నాయి కదా!"

అత్రేతి :- ఇక్కడ ఉపమానాలుగా చెప్పవలసిన నీలోత్పలాలను ఉపమేయంగా చెప్పడమే దాని విషయంలో అనాదరం అవుతుంది.

వి. ఉపమేయంకంటె ఉపమానం ఎల్లప్పుడూ గొప్పదే అనే విషయం సునిశ్చితం. అలాంటి ఉపమానాన్ని ఉపమేయంగా చేయడమే దాని గొప్పతనాన్ని తగ్గించడం అవుతుంది.

వృ. అనయైవ రీత్యా యదసామాన్యగుణయోగాత్ నోపమాన భావమపి అనుభూతపూర్వి తస్య తత్కల్పనాయామపి భవతి ప్రతీప మితి ప్రత్యేతవ్యమ్. యథా—

శ్లో॥ అహమేవ గురుః సుదారుణానా
మితి హాలాహల తాత మా స్మ హృష్యః,
నను సన్తి భవాదృశాని భూయో
భువనేఽస్మిన్ వచనాని దుర్జనానామ్. 556

వృ. అత్ర హాలాహలస్యోపమానత్వమసంభావ్యమానమేవోప నిబద్ధమ్.

వ్యా. అనయేతి :- ఇదే రీతిచేత ఏది అసాధారణమైన గుణం ఉండడం చేత పూర్వం ఎన్నడూ ఉపమానంగా కూడా చెప్పబడలేదో దానికి ఉపమానత్వం కల్పించినా కూడా ప్రతీపాలంకారం అని గ్రహించవలెను.

వి. ఒక వస్తువుకు మరొక వస్తువును ఉపమానంగా చెపుతున్నా మనగా ఆ రెండింటిలోను ఒక సమానధర్మం ఉన్న దని అర్థం. ఏ ఇతరవస్తువులోనూ లేని ఒక ధర్మం గలదానిని దేనికీ కూడా ఉపమానంగా చెప్పడం కుదరదు. కాని అలాంటిదానిని కూడా ఉపమానంగా చెపితే కూడ ప్రతీపాలంకారం అని అర్థం. ఎట్లనగా-

అహమితి :- తాత = నాయనా! హాలాహల = హాలాహలమా! సుదురుణా నామ్ = చాల దారుణమైన వాటిలో, అహమేవ = నేనే, గురుః = గొప్పదానను, ఇతి = అని, మా హృష్యః స్మ = సంతోషించకుము. అస్మిన్ భువనే = ఈ లోకంలో, భవాదృశాని = నీవంటి, దుర్జనానాం వచనాని = దుర్జనుల వచనాలు, భూయః = అనేకములుగా, సన్తి నను = ఉన్నాయి కదా?

అత్రేతి :- హాలాహలానికి ఊహింపశక్యం కాని ఉపమానత్వం చెప్ప బడింది గాన ప్రతీపం.

## 55. సామాన్యాలంకారం

కా. ప్రస్తుతస్య యదన్యేన గుణసామ్యవివక్షయా,
ఐకాత్మ్యం బధ్యతే యోగాత్తత్సామాన్యమితి స్మృతమ్.

వృ. అతాదృశమపి తాదృశతయా వివక్షితుం యత్ అప్రస్తుతార్థేన సంపృక్తమపరిత్యక్తనిజగుణమేవ తదేకాత్మతయా నిబధ్యతే తత్ సమానగుణనిబన్ధనాత్ సామాన్యమ్. ఉదాహరణమ్-

వ్యా. ప్రస్తుతస్యేతి:- ప్రస్తుతస్య = ప్రస్తుతమైనదానియొక్క, అన్యేన = అప్రస్తుతమైనదానితో, యోగాత్ = సంబంధంవల్ల, గుణసామ్యవివక్షయా = గుణముల సామ్యమును చెప్పాలనే ఇచ్ఛచేత, యత్ = ఏ, ఐకాత్మ్యమ్ = ఏకరూపత్వం, బధ్యతే = ప్రతిపాదించబడుతుందో అది, సామాన్యమితి = సామాన్యం అని, స్మృతమ్ = చెప్పబడింది.

అతాదృశమితి :- ప్రస్తుతవస్తువు వాస్తవంలో అప్రస్తుతార్థంతో సమానం కాకపోయినా సమానమని ప్రతిపాదించడం కోసం అది అప్రస్తుతవస్తువుతో కలిసి తన గుణాన్ని విడిచిపెట్టకుండానే ఆ అప్రస్తుతవస్తువుతో ఏకత్వం కలది అన్నట్లు వర్ణించడం సామాన్యాలంకారం. సమానమైన గుణాలను కూర్చడం వల్ల దీనికి ఆ పేరు పెట్టబడింది.

వి. తుల్యమైనవని చెప్పదలచిన రెండు వస్తువులు కలియడంవల్ల ఒకే వస్తువుగా భాసించినట్లయితే సామాన్యాలంకారం అని అర్థం. ఉదాహరణం.

శ్లో॥ మలయజరసవిలిప్తతనవో నవహారలతావిభూషితాః
సితతరదన్తపత్త్రకృతవక్త్రరుచో రుచిరామలాంశుకాః,
శశభృతి వితతధామ్ని ధవలయతి ధరామవిభావ్యతాం గతాః
ప్రియవసతిం ప్రయాన్తి సుఖమేవ నిరస్తభియోఽభిసారికాః.

వృ. అత్ర ప్రస్తుతతదన్యయోరన్యూనానతిరిక్తతయా నిబద్ధం ధవలత్వమేకాత్మతాహేతుః; అత ఏవ పృథగ్భావేన న తయోరుపలక్షణమ్.

వ్యా. మలయేతి :- మలయజరసవిలిప్తతనవః = మంచిగంధంచేత పూయబడినశరీరం కలవాళ్ళు, నవహారలతావిభూషితాః = నూతనములైన ముత్యాలహారాలచేత అలంకరించబడ్డవాళ్ళు, సితతరదన్తపత్రకృతవక్త్రరుచః = చాల తెల్లనైన దంతాల తాటంకాలచేత చేయబడిన ముఖకాంతి గలవాళ్ళు, రుచిరామలాంశుకాః = సుందరమైన నిర్మలమైన వస్త్రాలు కలవాళ్ళు అయిన, అభిసారికాః = అభిసారికలు, వితతధామ్ని = విస్తృతమైన కాంతిగల, శశభృతి = చంద్రుడు, ధరామ్ = భూమిని, ధవలయతి = తెల్లగా చేయుచుండగా, అవిభావ్యతామ్ = చూడశక్యం కాకపోవుటను, గతాః = పొందినవారై, నిరస్తభియః = తొలగించబడిన భయం కలవారై, సుఖమేవ = సుఖంగానే, ప్రియవసతిమ్ = ప్రియుల నివాసాన్ని గూర్చి, ప్రయాన్తి = వెళ్ళుచున్నారు.

వి. ఇక్కడ ప్రస్తుతలు అభిసారికలు. చంద్రిక అప్రస్తుతం. వివక్షితం అయిన శుక్లగుణంయొక్క సామ్యంచేత వీటికి ఏకాత్మత్వాన్ని (వెన్నెలలో అభిసారికలు కలిసిపోయినట్లుగా) వర్ణించడంచేత సామాన్యాలంకారం.

అత్రేతి :- ఇక్కడ ప్రస్తుతాప్రస్తుతములలో ధవళత్వం హెచ్చుతగ్గులు లేకుండా ఉన్నట్లు వర్ణించబడింది. అది వీటి ఏకాత్మతకు హేతువు. అందుచేతనే వీటిని వేరుగా గుర్తించడం శక్యం కాకుండా ఉంది.

వృ. యథా వా-

శ్లో॥ వేత్రత్వచా తుల్యరుచాం వధూనాం
కర్ణాగ్రతో గణ్డతలాగతాని,
భృఙ్గాః సహేలం యది నాపతిష్యన్
కోఽవేదయిష్యన్నవచమ్పకాని. 558

వృ. అత్ర నిమిత్తాన్తరజనితాపి నానాత్వప్రతీతిః ప్రథమప్రతి

పన్నమభేదం న వ్యుదసితుముత్సహతే, ప్రతీతత్వాత్, ప్రతీతేశ్చ బాధా యోగాత్.

వ్యా. మరొక ఉదాహరణం ఎట్లనగా—

వేత్రేతి :- వేత్రత్వచా=సీటిప్రబ్బలి కఱ్ఱ చర్మంతో, తుల్యరుచామ్=సమానమైన కాంతిగల, వధూనామ్=స్త్రీలయొక్క, కర్ణాగ్రతః=చెవుల అగ్రమునుండి, గణ్డతలాగతాని=గండస్థలములనుపొందిన, నవచమ్పకాని=నూతనములైనచంపక పుష్పములను, సహేలమ్=విలాసపూర్వకంగా, భృఙ్గాః=తుమ్మెదలు, నాపతిష్యన్ యది=వాలి ఉండకపోయినచో, కః=ఎవడు, అవేదయిష్యత్=తెలుసుకొని ఉండెడివాడు?

వి. ఇక్కడ గండస్థలాలు, చంపకపుష్పాలు కూడ గౌరవర్ణం కలవి ఆవడం చేత భేదం తెలియలేదు. అందుచేత సామాన్యాలంకారం.

అయితే ఇక్కడ తుమ్మెదలు వాలడంచేత అవి భిన్నము లని తెలిసినది కదా; సామాన్యాలంకారం ఎట్లు అని ఆశంకకు సమాధానం చెప్పుతున్నాడు.

అత్రేతి :- ఇక్కడ మరొక నిమిత్తంచేత (భృంగపతనంచేత) నానాత్వజ్ఞానం కలిగినా కూడ ముందు కలిగిన అభేదజ్ఞానాన్ని తొలగించజాలదు. ఎందుచేత ననగా భృంగాలు వాలక మునుపు అభేద ప్రతీతి కలిగింది. ఆ ప్రతీతి తొలగించడం శక్యం కాదు. సామాన్యాలంకారత్వానికి మొదట కలిగిన అభేదప్రతీతి చాలును అని భావం.

## 56. విశేషాలంకారం

కా. వినా ప్రసిద్ధమాధారమాధేయస్య వ్యవస్థితిః
ఏకాత్మా యుగపద్వృత్తిరేకస్యానేకగోచరా. 135
అన్యత్ ప్రకుర్వతః కార్యమశక్యస్యాన్యవస్తునః
తథైవ కరణం చేతి విశేషస్త్రివిధః స్మృతః. 136

వృ. ప్రసిద్ధాధారపరిహారేణ యత్ ఆధేయస్య విశిష్టా స్థితిరభిధీయతే స ప్రథమో విశేషః. ఉదాహరణమ్-

శ్లో॥ దివమప్యుపయాతానామాకల్పమనల్పగుణగణా యేషామ్,
రమయన్తి జగన్తి గిరః కథమిహ కవయో న తే వన్ద్యాః.

వ్యా. వినేతి .. ప్రసిద్ధమ్ = ప్రసిద్ధమైన, ఆధారమ్ = ఆధారమును, వినా = విడచి, ప్రసిద్ధమైన ఆధారం లేకుండా, ఆధేయస్య=అధేయంయొక్క, వ్యవస్థితిః = ఉండుట (ఇది మొదటి భేదం), ఏకస్య = ఒక వస్తువుయొక్క, యుగపత్ = ఒకే కాలంలో, ఏకాత్మా = ఒకే స్వరూపం గల, అనేకగోచరా = అనేకములు విషయంగా గల, వృత్తిః=ఉండుట, అనగా ఒక వస్తువు ఒకే స్వరూపంతో ఒకే సమయంలో అనేకాధారాలలో ఉండడం అని అర్థం. ఇది రెండవభేదం), అన్యత్ కార్యమ్ = మరియొక కార్యమును, ప్రకుర్వతః=చేయుచున్నవానియొక్క (వాడు), తత్రైవ = ఆ ప్రకారంగానే, అశక్యస్య = శక్యం కాని, అన్యవస్తునః= మరియొక్క వస్తువుయొక్క, కరణం చ = చేయడము, ఇతి = అని, విశేషః= విశేషాలంకారం, త్రివిధః = మూడు విధములైనదిగా, స్మృతః = చెప్పబడింది.

ప్రసిద్ధేతి - ఒక ఆదేయం ప్రసిద్ధమైన ఆధారం విడచి విశిష్టరూపంతో ఉన్నట్లు వర్ణించిన ట్లయితే అది మొదటి విశేషాలంకారం. ఉదాహరణం.

దివమితి :- దివమ్ = స్వర్గమును గూర్చి, ఉపయాతానామపి = వెళ్ళిపోయినవారైనా, యేషామ్ = ఎవరియొక్క, అనల్పగుణగణాః = అధికమైన గుణగణం గల, గిరః=వాక్కులు, ఆకల్పమ్=కల్పాంతం వరకు, జగన్తి = జగత్తులను, రమయన్తి = సంతోషపెట్టుచున్నాయో, తే కవయః = ఆ కవులు, ఇహ= ఇక్కడ, కథమ్ = ఎట్లు న వన్ద్యాః = నమస్కరింప దగనివారు

వి. ఇక్కడ ప్రసిద్ధమైన కవిరూపాధారం లేకపోయినా వారి వాక్కులు ఉన్నట్లు వర్ణించడంచేత విశేషాలంకారం.

వృ. ఏకమపి వస్తు యత్ ఏకేనైవ స్వభావేన యుగపదనేకత్ర వర్తతే స ద్వితీయః. ఉదాహరణమ్.

గాథ. సా వసఇ తుజ్ఝ హిఅఏ సా చ్చిఅ అచ్ఛీసు సా అ వఅణేషు
అహ్మారిసాణ సున్దర ఓసాసో కత్థ పావాణం. 560

"సా వసతి తవ హృదయే సైవాక్షిషు సా చ వచనేషు,
అస్మాదృశీనాం సున్దర అవకాశః కుత్ర పాపానామ్."

వ్యా. ఏకమితి :- ఒకే వస్తువు, ఒకే స్వరూపంచేత ఒకే సమయంలో అనేక స్థలాలలో ఉండడం రెండవ విశేషం. ఉదాహరణం- నేతి :- ఓ సుందరుడా? నీ హృదయంలో ఆమెయే ఉంది. నేత్రాలలో ఆమెయే ఉంది. మాటలలో కూడా ఆమెయే ఉంది. పాపాత్ములమైన మావంటివాళ్ళకు అవకాశం ఎక్కడ?"

వి. ఇక్కడ ఒకే స్త్రీ, ఒకే రూపంలో, ఒకే సమయంలో అనేక స్థలాలలో ఉన్నట్లు వర్ణించబడింది గాన విశేషాలంకారం.

వృ. యదపి కించిద్రభసేన ఆరభమాణస్తేనైవ యత్నేనాశక్యమపి కార్యాన్తరమారభతే సోఽపరో విశేషః. ఉదాహరణమ్-

శ్లో॥ స్ఫురదద్భుతరూపముత్ప్రతాప
జ్వలన త్వాం సృజతానవద్యవిద్యమ్,
విధినా ససృజే నవో మనోభూ
ర్భువి సత్యం సవితా బృహస్పతిశ్చ. 561

వృ. యథా వా-

శ్లో॥ గృహిణీ సచివః సఖీ మిథః
ప్రియశిష్యా లలితే కలావిధౌ,
కరుణావిముఖేన మృత్యునా
హరతా త్వాం బత కిం న మే హృతమ్. 562

వ్యా. యదపీతి :- తొందరలో ఒక పనిచేయడంకోసం ప్రారంభించినవాడు అదే ప్రయత్నంచేత శక్యం కాని మరొక కార్యాన్ని కూడా ప్రారంభిస్తే అది మరొక విశేషం. ఉదాహరణం.

స్ఫురదితి :- స్ఫురదద్భుతరూపమ్=ప్రకాశిస్తూన్న అద్భుతమైన రూపం కలవాడవు, ఉత్ప్రతాపజ్వలనమ్=బయలుదేరుతున్న ప్రతాపాగ్ని కలవాడవు,

అనవద్యవిద్యమ్=నిర్దుష్టమైన విద్య కలవాడవు అయిన, త్వామ్=నిన్ను, సృజతా = సృష్టించుచున్న, విధినా=బ్రహ్మదేవునిచేత, నవః=క్రొత్తవాడైన, మనోభూః =మన్మథుడు, సవితా = కొత్త సూర్యుడు, బృహస్పతిః చ = కొత్త బృహస్పతీ, భువి = భూలోకంలో, ససృజే = సృజించబడెను. సత్యమ్ = నిజము.

వి. ఇక్కడ రాజును సృజించడంకోసం ప్రయత్నం ప్రారంభించిన బ్రహ్మదేవుడు అదే ప్రయత్నంలో కొత్త మన్మథాదులను కూడా సృజించినా డని చెప్పడంచేత విశేషాలంకారం.

మరొక ఉదాహరణం ఎట్లనగా-

గృహిణీ ఇతి :- రఘువంశంలో ఇందుమతిని గూర్చి విలపిస్తూన్న అజుని మాటలు. గృహిణీ = భార్య, సచివః = మంత్రి, మిథః = రహస్యంలో, సఖీ = సఖురాలు, లలితే = లలితమైన, కలావిధౌ = కలానిర్మాణంలో, ప్రియశిష్యా = ప్రియశిష్యురాలు అయిన, త్వామ్=నిన్ను, హరతా=హరిస్తూన్న, కరుణావిముఖేన = కరుణ లేని, విధినా = దైవంచేత, మే = నాకు సంబంధించినది, కిమ్=ఏమి, న హృతమ్ = హరించబడలేదు? బత = అయ్యో!

వి. ఇక్కడ ఒక్క ఇందుమతిని హరించే ప్రయత్నంలోనే విధి గృహిణ్యాదు లందరినీ హరించి నట్లు వర్ణించడంచేత విశేషాలంకారం.

అవ. ఆధారం లేకుండా ఆధేయం ఉండడం, ఒక వస్తువు ఒకే సమయంలో అనేకస్థలాలలో ఉండడం, ఒకే యత్నంచేత అనేకకార్యాలు సాధించడం ఇవన్నీ కుదరవు కదా? ఇవి అలంకారాలు ఎట్లు అవుతాయి అనే అశంకకు సమాధానం చెపుతున్నాడు-

వృ. సర్వత్ర ఏవంవిధవిషయే అతిశయోక్తిరేవ ప్రాణత్వేనావతిష్ఠతే. తాం వినా ప్రాయేణాలంకారత్వాయోగాత్. అత ఏవోక్తమ్-

"సైషా సర్వత్ర వక్రోక్తిరనయార్థో విభావ్యతే,
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా" ఇతి.

వ్యా. సర్వత్రేతి:- ఇలాంటి విషయాలలో అంతటా అతిశయోక్తి ప్రాణంగా

ఉంటుంది. అతిశయోక్తి లేకుండా సాధారణంగా అలంకారత్వమే కుదరదు. అందుచేతనే (కావ్యాలంకారంలో భామహునిచేత) ఇలా చెప్పబడింది-

"ఈ వక్రోక్తి అంతటా ఉంటుంది. దీనిచేతనే అర్థం సంస్కరించబడుతుంది. అందుచేత కవి ఈ వక్రోక్తి విషయంలో ప్రయత్నం చెయ్యాలి. ఇది లేకపోతే అలంకారం ఏమిటి"?

వి. ఈ ఘట్టంలో భామహుడు 'అతిశయోక్తి' 'వక్రోక్తి' అనే పదాలను పర్యాయపదాలుగా వాడాడు. కావ్యంలో ఉపయోగించే శబ్దార్థాలలో కొంత వక్రత, అందమైన వంపు, అతిశయం, ఉండాలి. లోకంలో మాటలాడుకుంటున్నట్లు ఉంటే అది కావ్యం కాదు. అందుచేత ప్రతి అలంకారంలోనూ మూలాధారంగా అతిశయోక్తి కొద్దిగానో గొప్పగానో ఉండితీరుతుంది. ఈ అతిశయోక్తిని పురస్కరించుకొని కవులు చమత్కారాలు చేస్తూ ఉంటారు అని భావం.

## 57. తద్గుణాలంకారం

కా. స్వముత్సృజ్య గుణం యోగాదత్యుజ్జ్వలగుణస్య యత్,
వస్తు తద్గుణతామేతి భణ్యతే స తు తద్గుణః. 137

వృ. వస్తు తిరస్కృతనిజరూపం కేనాపి సమీపగతేన ప్రగుణయా స్వగుణసంపదా ఉపరక్తం తత్ప్రతిభాసమేవ యత్సమాసాదయతి స తద్గుణః, తస్య అప్రకృతస్య గుణోఽత్రాస్తీతి. ఉదాహరణమ్-

శ్లో॥ విభిన్నవర్ణా గరుడాగ్రజేన
సూర్యస్య రథ్యాః పరితః స్ఫురన్త్యా,
రత్నైః పునర్యత్ర రుచా రుచం స్వా
మానిన్యిరే వంశకరీరనీలైః. 563

వృ. అత్ర రవితురగాపేక్షయా గరుడాగ్రజస్య తదపేక్షయా చ హరిన్మణీనాం ప్రగుణవర్ణతా.

వ్యా. స్వమితి:- వస్తు = ఒక వస్తువు, ఉజ్జ్వలగుణస్య = అధికంగా ప్రకా

శించే గుణం గల మరొక వస్తువుయొక్క, యోగాత్ = సంబంధంవల్ల, స్వమ్ = తన సంబంధమైన, గుణమ్ = గుణమును, ఉత్సృజ్య = విడచి, తద్గుణతామ్ = దాని గుణం కలిగి యుండుటను, ఏతి ఇతి యత్ = పొందును అనేది ఏది కలదో, సః తు = అది, తద్గుణః = తద్గుణాలంకారం.

వస్తు ఇతి :- ఒక వస్తువు తన సమీపమునందున్న ఒకానొక వస్తువుచేత అధికమైన దాని గుణసంపదచేత పూయబడి (ఆచ్ఛాదింపబడి) తిరస్కరించబడిన స్వీయరూపం కలదై, దాని (సమీపమునందున్న వస్తువుయొక్క) రూపమునే పొందినట్లయితే అది తద్గుణాలంకారం. దానియొక్క అనగా అప్రస్తుతమైన దాని యొక్క, గుణం దీనియందు ఉన్నది గాన దీనికి తద్గుణం అని పేరు. ఉదాహరణం-

విభిన్నేతి :- మాఘకావ్యంలో రైవతవర్ణనప్రకరణంలోని శ్లోకం గరుడాగ్రజేన = సూర్యసారథి అయిన అరుణునిచేత, పరితః = అంతటా, స్ఫురన్త్యా = ప్రకాశిస్తూన్న, రుచా = కాన్తిచేత, విభిన్నవర్ణాః = భేదం పొందించబడిన వర్ణం గల, సూర్యస్య = సూర్యునియొక్క, రథ్యాః = గుఱ్ఱాలు, యత్ర = ఏ పర్వతమునందు, వంశకరీరనీలైః = వెదురు అంకురముల వలె నీలవర్ణములైన, రత్నైః = రత్నాలచేత, (అంతటా ప్రకాశిస్తూన్న కాంతిచేత), పునః = మరల, స్వామ్ = తమసంబంధమైన, రుచమ్ = కాంతిని, ఆనిన్యిరే = పొందించబడినవో.

అత్రేతి :. ఇక్కడ సూర్యుని గుఱ్ఱాలకంటె అరుణుడు, అతనికంటె మరకతమాణిక్యాలు అధికమైన వర్ణం గలవి.

వి. ఆకుపచ్చని రంగు గల సూర్యాశ్వాల రంగును అరుణుని రంగు కప్పివేసింది. ఈ పర్వతం దగ్గరకురాగానే దీనియందున్న మరకతమణుల కాంతి అరుణకాంతిని తొలగించి తమ కాంతి కప్పి మళ్ళీ వాటి సహజమైన ఆకుపచ్చని రంగుతో కనబడేటట్లు చేశాయి. అందుచేత తద్గుణాలంకారం.

## 58. అతద్గుణాలంకారం

**కా. తద్రూపాననుహారశ్చేదస్య తత్ స్యాదతద్గుణః.**

వృ. యది తు తదీయం వర్ణం సంభవన్త్యామపి యోగ్యతాయామ్

ఇదం న్యూనగుణం న గృహ్ణీయాత్ తదా భవేదతద్గుణో నామ. ఉదాహరణమ్.

గాథ.ధవలోఽసి జహవి సున్దర తహవి తఏ మజ్ఝ రఞ్జిఅం హిఅఅం
రాఅభరిఏవి హిఅఏ సుహఅ ణిహిత్తో ణ రత్తోసి 564

"ధవలోఽసి యద్యపి సున్దర త్వయా మమ రఞ్జితం హృదయమ్
రాగభరితేఽపి హృదయే సుభగ నిహితో న రక్తోఽసి"

వృ. అత్రాతిరక్తేనాపి మనసా సంయుక్తో న రక్తతాముపగత ఇతి అతద్గుణః.

వ్యా. తదితి :- అస్య = అప్రకృతవస్తువుయొక్క, తద్రూపాననుహారః చేత్ = తన ప్రక్కన ఉన్న ప్రకృతవస్తువుయొక్క రూపాన్ని తీసికొనకకపోవడం జరిగినచో, తత్ = అప్పుడు, అతద్గుణః స్యాత్ = అతద్గుణాలంకారం అగును.

యదీతి :- తక్కువగుణం గల ఈ వస్తువు, యోగ్యత ఉన్నా కూడ దాని (అధికగుణం ఉన్నదాని)వర్ణాన్ని గ్రహించనట్లయితే అది అతద్గుణాలంకారం అవుతుంది. ఉదాహరణమ్.

ధవల ఇతి:- సుందరుడా! నీవు తెల్లగా ఉన్నా కూడ నీచేత నా హృదయం రంజింపచేయబడింది (ఎఱ్ఱగా చేయబడింది; అనురాగం కలదిగా చేయబడింది అని రెండర్థాలు). ఓ! సౌందర్యవంతుడా! రాగంతో నిండిన హృదయంలో ఉంచబడినా కూడ నీవు మాత్రం రక్తుడవు (ఎఱ్ఱనివాడవు, అనురాగవంతుడవు. అని రెండర్థాలు) కాలేదు

అత్రేతి:- "ఇక్కడ చాల రక్తమైన మనస్సుతో సంయుక్తుడ వైనా రక్తత్వాన్ని పొందలేదు" అని అతద్గుణాలంకారం.

వృ. కించ తదితి అప్రకృతం అస్యేతి చ ప్రకృతమత్ర నిర్దిశ్యతే. తేన యత్ అప్రకృతస్య రూపం ప్రకృతేన కుతోఽపి నిమిత్తాత్ నానువిధీయతే స అతద్గుణ ఇత్యపి ప్రతిపత్తవ్యమ్. యథా-

శ్లో॥ గాఙ్గమమ్బు సితమమ్బు యామునం
కజ్జలాభముభయత్ర మజ్జతః,
రాజహంస తవ సైవ శుభ్రతా
చీయతే న చ న చాపచీయతే. 565

వ్యా. కించేతి :- పై లక్షణంలోని 'తద్రూప' అనే దానిలోని తచ్ఛబ్దం చేత అప్రకృతమూ 'అస్య' అనే దానిచేత ప్రకృతమూ, ఇక్కడ నిర్దేశింపబడుతున్నాయి. ఇలా చెప్పడంచేత ప్రకృతవస్తువు, ఏదో కారణంచేత అప్రకృతవస్తు గుణాన్ని స్వీకరించగపోయినట్లయితే అది కూడ అతద్గుణాలంకారం అని గ్రహించాలి. ఎట్లనగా—

వి. అనగా అప్రకృతవస్తువు ప్రకృతవస్తుగుణాన్ని గ్రహించకపోయినా, ప్రకృతవస్తువు అప్రకృతవస్తుగుణాన్ని గ్రహించకపోయినా అతద్గుణాలంకారమే. మొదటిదానికి పై శ్లోకం ఉదాహరణం; రెండవదానికి ఈ క్రింది శ్లోకం ఉదాహరణం.

గాఙ్గమితి :- గాఙ్గమ్ = గంగకు సంబంధించిన, అమ్బు = జలం, సితమ్ = తెల్లనిది, యామునమ్ = యమునకు సంబంధించిన, అమ్బు = జలం. కజ్జలాభమ్ = కాటుకవంటి కాంతి గలది, రాజహంస = ఓ రాజహంసా! ఉభయత్ర = ఆ రెంటింటిలోనూ, మజ్జతః = మునుగుచున్న, తవ = నీయొక్క, శుభ్రతా = తెల్లదనం. సైవ = అదే. పూర్వం ఎట్లున్నదో అట్లే ఉంది. న చ చీయతే = పెరగడం లేదు, న చ అపచీయతే = తరగడం లేదు.

వి. ఇక్కడ ప్రకృతమైన రాజహంస అప్రకృతనదీవర్ణాలను గ్రహించడం లేదుగాన అతద్గుణాలంకారద్వితీయభేదం.

## 59. వ్యాఘాతాలంకారం

కా. యద్యథా సాధితం కేనాప్యపరేణ తదన్యథా, 131
తథైవ యద్విధీయేత స వ్యాఘాత ఇతి స్మృతః.

వృ. యేనోపాయేన యత్ ఏకేనోపకల్పితం తస్యాన్యేన జిగీషు

తయా తదుపాయకమేవ యత్ అన్యథాకరణం స సాధితవస్తువ్యాహతి హేతుత్వాత్ వ్యాఘాతః. ఉదాహరణమ్-

శ్లో॥ దృశా దగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః,
విరూపాక్షస్య జయినీస్తాః స్తువే వామలోచనాః. 566

వ్యా. యదితి :- కేనాపి = ఒకనిచేత, యత్ = ఏది, యథా = ఏ ఉపాయంచేత, సాధితమ్ = చేయబడిందో, అపరేణ = మరొకనిచేత, తత్ = అది, తథైవ = ఆ ఉపాయంచేతనే, యత్ అన్యథా విధీయతే = మరొకవిధంగా చేయబడుతుంది అనేది ఏది కలదో, సః = అది, వ్యాఘాతః ఇతి = వ్యాఘాతాలంకారం అని, స్మృతః = చెప్పబడింది.

యేనేతి :- ఒకడు ఒక ఉపాయంచేత చేసినదానిని మరొకడు, ఆతనిని జయించవలె ననే అభిప్రాయంతో, అనగా ఆతనికంటె తన గొప్పతనాన్ని చూపుకోవాలనే అభిప్రాయంతో, అదే ఉపాయంచేత మరొక విధంగా చేస్తే అది వ్యాఘాతాలంకారం. ఒకడు సాధించిన వస్తువునకు వ్యాహతిని (నాశాన్ని) కలిగించడంచేత దీనికి ఈ 'వ్యాఘాతం' అని పేరు. ఉదాహరణం.

దృశాఇతి:. రాజశేఖరుని విద్ధసాలభంజికలో మంగళశ్లోకం. 'విరూపాక్షస్య' అనేది 'దృశా' 'జయినీః' అనే రెండు పదాలతోను అన్వయిస్తుంది. విరూపాక్షస్య = శివునియొక్క, దృశా = నేత్రాలచేత, దగ్ధమ్ = కాల్చబడిన, మనసిజమ్ = మన్మథుణ్ణి, యాః = ఏ వామలోచనలు. దృశైవ = దృక్కుచేతనే, (కన్ను, చూపు అని రెండర్థాలు) జీవయన్తి = జీవింపచేస్తారో, విరూపాక్షస్య = శివునకు, జయినీః = జయించే, తాః వామలోచనాః = ఆ స్త్రీలను, స్తువే = స్తుతిస్తున్నాను.

ఏ ఇక్కడ శివుడు దేనిని సాధనంగా చేసికొని మన్మథుణ్ణి భస్మం చేశాడో దానినే సాధనంగా చేసుకొని స్త్రీలు ఆతనిని బ్రతికించి శివుడు చేసినపనికి విఘాతం కలిగించి నట్లు వర్ణించడంచేత వ్యాఘాతాలంకారం.

## 60 సంసృష్టి

కా. సేష్టా సంసృష్టిరేతేషాం భేదేన యదిహ స్థితిః. 139

వృ. ఏతేషాం సమనన్తరమేవ ఉక్తస్వరూపాణాం యథాసంభవ మన్యోన్యనిరపేక్షతయా యత్ ఏకత్ర శబ్దభాగే ఏవ, అర్థవిషయే ఏవ, ఉభయత్రాపి వా అవస్థానం సా ఏకార్థసమవాయస్వభావా సంసృష్టిః.

వ్యా. సా ఇతి:- ఏతేషామ్ = ఈ అలంకారాలయొక్క, భేదేన = వేరువేరుగా, ఇహ = ఇక్కడ, ఒక కావ్యంలో అనగా శ్లోకంలో లేదా, వాక్యంలో, యత్ = స్థితిః = ఏ ఉండడం కలదో, సా = అది, సంసృష్టిః = సంసృష్టిగా, ఇష్టా = ఇష్టమైనది.

ఏతేషామితి :- ఏతేషామ్ = ఇంతవరకూ చెప్పబడిన స్వరూపం గల అలంకారాలయొక్క (లు), యథాసంభవంగా, పరస్పరాపేక్ష లేకుండా ఒక శబ్ద భాగంలో గాని, అర్థవిషయంలో గాని, రెండింటిలోనూ గాని ఉండడం, "ఒక అర్థంలో (విషయంలో) కలవడం" అనే రూపం గల సంసృష్టి.

వి. ఒక అర్థం విషయంలో అర్థాలంకారాల కలయిక శబ్దభాగంలో శబ్దాలంకారాల కలయిక లేదా శబ్దార్థభాగాలలో శబ్దాలంకార అర్థాలంకారాల కలయిక సంసృష్టి. ఈ అలంకారాలు ఒకదాని అపేక్ష మరొకదానికి లేకుండా ఉండాలి. ఒకదాని అపేక్ష మరొకదానికి ఉన్నట్లయితే అది సంకరం అవుతుంది. తరవాత చెప్పబడుతుంది. ఒకచోట అనేకములైన అలంకారాలు కలుస్తున్నాయి. కాబట్టి దీనికి సంసృష్టి అని పేరు.

వృ. తత్ర శబ్దాలంకారసంసృష్టిర్యథా-

శ్లో॥ వదనసౌరభలోభపరిభ్రమ
ద్భ్రమరసంభ్రమసంభృతశోభయా,
చలితయా విదధే కలమేఖలా
కలకలోఽలకలోలదృశాన్యయా. 567

వ్యా. తత్రేతి :- వాటిలో శబ్దాలంకారసంసృష్టి ఎట్లనగా-

వదనేతి :- ఇది మాఘకావ్యంలోని శ్లోకం. "వదన....శోభయా"- వదన = ముఖంయొక్క, సౌరభ = పరిమళమునందు, లోభ = ఆసక్తి చేత, పరిభ్రమత్

= తిరుగుచున్న, భ్రమర = తుమ్మెదలవల్ల కలిగిన, సంభ్రమ = కంగారుచేత, సంభృతశోభయా = పెంచబడిన శోభ గల, చలితయా = చలించిన, అలకలోల దృశా = ముంగురులచేత చంచలములైన నేత్రాలు గల, అన్యయా = మరియొక స్త్రీచేత, కలమేఖలాకలకలః = మధురమైన వడ్డాణంయొక్క కలకలం. విదధే= చేయబడెను.

వి. ఇక్కడ పూర్వార్ధంలో భకారానుప్రాస, తృతీయచరణంలో లకానుప్రాస, నాల్గవ పాదంలో 'లకలోలకలో' అని యమకం. వీటికి పరస్పరము అపేక్ష లేదు. ఈ విధంగా స్వతంత్రాలైన వృత్త్యనుప్రాసయమకాలకు సంసృష్టి.

వృ. అర్థాలంకారసంసృష్టిస్తు-

శ్లో॥ లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీవాఞ్జనం నభః.
అసత్పురుషసేవేవ దృష్టిర్విఫలతాం గతా. 568

వృ. పూర్వత్ర పరస్పరనిరపేక్షౌ యమకానుప్రాసౌ సంసృష్టిం ప్రయోజయతః; ఉత్తరత్ర తు తథావిధే ఉపమోత్ప్రేక్షే.

వ్యా. అర్థేతి:- అర్థాలంకారాల సంసృష్టి ఎట్లనగా- లిమ్పతీతి:- ఈ శ్లోకం వెనక 417వ శ్లోకంగా వచ్చినది.

పూర్వత్రేతి :- వెనకటి (వదనేత్యాది) శ్లోకంలో పరస్పరనిరపేక్షాలైన యమకానుప్రాస లనే శబ్దాలంకారాలు సంసృష్టికి హేతువులైనవి. ఈ శ్లోకంలో అలాంటివే అయిన (పరస్పరనిరపేక్షాలైన) ఉపమ, ఉత్ప్రేక్ష అనే అర్థాలంకారాలు సంసృష్టికి హేతువులైనవి.

వృ. శబ్దార్థాలంకారయోస్తు సంసృష్టిః -

గాథ. సో ణత్థి ఏత్థ గామే ఓ ఏ అం మహమహన్తలాఅణ్ణం,
తరుణాణ హిఅఅలూడిం పరిసక్కన్తిం ణివారేఇ. 569

"స నాస్త్యత్ర గ్రామే ఏనాం మహమహాయమానలావణ్యామ్
తరుణానాం హృదయలుణ్టాకీం పరిష్వక్కమాణాం నివారయతి"

వృ. అత్రానుప్రాసో రూపకం చాన్యోన్యానపేక్షే. సంసర్గశ్చ తయోరేకత్ర వాక్యే ఛన్దసి వా సమవేతత్వాత్.

వ్యా. శబ్దేతి :- శబ్దాలంకార-అర్థాలంకారాల సంసృష్టి ఎట్లనగా-

సో ఇతి :- మహమహాయమానలావణ్యామ్ = ఉత్సవంగా, ఉత్సవంగా ఏర్పడుతున్న లావణ్యం కలదీ, 'మహమల్లావణ్యామ్' అనే పాఠంలో కొంగ్రొత్తదిగా అవుతూన్న లావణ్యం కలది అని అర్థం. తరుణానామ్=యువకులయొక్క, హృదయలుణ్టాకీమ్ = హృదయాన్ని దోచుకొనేదీ, పరిష్వక్కమాణామ్ = తగిన పురుషుడు దొరకకపోవడంచేత ఇటూ అటూ తిరుగుతూన్న, ఏనామ్ = ఈమెను, యః=ఎవడు, నివారయతి = నివారిస్తాడో, సః = అట్టివాడు, అత్ర గ్రామే = ఈ గ్రామంలో, నాస్తి = లేడు.

వి. ఇక్కడ పూర్వార్ధంలో 'ఇత్థి' 'ఏత్థ' అని తకారథకారరూప అనేక వ్యంజనాలకు ఒకమారు సామ్యం ఉన్నదిగాన చేకానుప్రాస అనే శబ్దాలంకారం. 'హృదయలుణ్టాకీమ్' అన్నప్పుడు రూపకం అనే అర్థాలంకారం. ఈ రెండింటికీ పరస్పరాపేక్ష లేదు. అందుచేత సంసృష్టి.

అత్రేతి :- ఇక్కడ అనుప్రాస, రూపకమూ, పరస్పరాపేక్ష లేనివి. అలంకారాల సంసర్గం అనగా అవి ఒక వాక్యంలో కాని ఛందస్సు (శ్లోకం)లో కాని కలిసి ఉండడం.

## 61. సంకరం

కా. అవిశ్రాన్తిజుషామాత్మన్యఙ్గాఙ్గిత్వం తు సంకరః.

వృ. ఏతే ఏవ యత్రాత్మని అనాసాదితస్వతన్త్రభావాః పరస్పరమ్ అనుగ్రాహ్యానుగ్రాహకతాం దధతి స ఏషాం సంకీర్యమాణస్వరూపత్వాత్ సంకరః. ఉదాహరణమ్.

శ్లో॥ ఆత్తే సీమన్తరత్నే మరకతిని హృతే హేమతాటఙ్కపత్రే
లుప్తాయాం మేఖలాయాం ఝటితి మణితులాకోటియుగ్మే గృహీతే.

శోణం బిమ్బోష్ఠకాన్త్యా త్వదరిమృగదృశామిత్వరీణామరణ్యే
రాజన్ గుఞ్జాఫలానాం స్రజ ఇతి శబరా నైవ హారం హరన్తి.

వృ. అత్ర తద్గుణమపేక్ష్య భ్రాన్తిమతా ప్రాదుర్భూతమ్. తదాశ్రయేణ చ తద్గుణః సచేతసాం ప్రభూతచమత్కృతినిమిత్తమితి అనయోరఙ్గాఙ్గిభావః. యథా- వా.

వ్యా. అవిశ్రాన్తీతి:- ఆత్మని=తనయందు. అవిశ్రాన్తి జుషామ్=విశ్రాంతిని పొందని అలంకారాలకు, అఙ్గాఙ్గిత్వమ్ = అంగాంగిభావం, సంకరః = సంకరము.

ఏతే ఇతి :- ఈ అలంకారాలే, ఎక్కడ, తమయందు స్వాతంత్ర్యమును పొందనివై పరస్పరము అనుగ్రాహ్యానుగ్రాహకత్వాన్ని ధరిస్తాయో అప్పుడు అవి ఒకదానితో ఒకటి కలిసిపోయిన స్వరూపం కలవి అవడంచేత అది సంకరం.

వి. సంసృష్టిలో ఏ అలంకారానికి ఆ అలంకారం ఆత్మవిశ్రాంతం అయి, అనగా తనంతట తాను పూర్ణమై, స్వతంత్రమై ఉంటుంది. అందుచేత వాటి సంసృష్టి; తిలతండులాల సంసృష్టి వంటిది. సంకరంలో ఒకచోట ఉన్న అలంకారాలు ఆత్మవిశ్రాంతాలు కాక ఒకదానిమీద మరొకటి ఆధారపడి ఉంటాయి. అందుచేత దీనిలో వాటి కలయిక క్షీరనీరసంకరం వంటిది ఉదాహరణం.

ఆత్తే ఇతి:- రాజన్ = రాజా! అరణ్యే=అరణ్యంలో, ఇత్వరీణామ్ = వెళ్లుచున్న, త్వదరిమృగదృశామ్ = నీ శత్రుస్త్రీలయొక్క, సీమన్తరత్నే = పాపిడియందలి రత్నం, ఆత్తే= గ్రహించబడిందగుచుండగా, మరకతిని = మరకత మాణిక్యాలు గల, తాటఙ్కపత్రే = కర్ణాలంకారం, హృతే = హరించబడిందగుచుండగా, మేఖలాయామ్=వడ్డాణము, ఝటితి = శీఘ్రంగా. లుప్తాయామ్=తెంపి వేయబడగా, మణితులాకోటియుగ్మే = రత్నములు పొదిగిన అందెల ద్వయం, గృహీతే = గ్రహించబడిన దగుచుండగా, బిమ్బోష్ఠకాన్త్యా = దొండపండు వంటి పెదవుల కాంతిచేత, శోణమ్ = ఎఱ్ఱనైన, హారమ్ = ముత్యాలహారాన్ని, గుఞ్జాఫలానామ్ = గురివెంతగింజల, స్రజః ఇతి=మాలలు అని, శబరాః = బోయవాళ్లు, నైవ హరన్తి = హరించడంలేదు.

వి. ఇక్కడ ముత్యాలహారాన్ని చూచి గుంజాఫలాలమాలిక అని భ్రాంతి

కలగడానికి ముత్యాల రంగు బింబోష్ఠరుచిచేత మారిపోవడం కారణం, ఇది తద్గుణాలంకారం. ఈ తద్గుణాలంకారం భ్రాంతిమదలంకారానికి కారణం కాబట్టి దానికి అనుగ్రాహకం, అది అనుగ్రాహ్యం. తద్గుణాలంకారం భ్రాంతిమదలంకార సాహాయ్యంచేత చమత్కారాతిశయాన్ని కలిగిస్తున్నది కాబట్టి ఈ రెండు అలంకారాలకీ అంగాంగిభావరూప మైన సంకరం. తద్గుణాలంకారం అంగం, భ్రాంతిమదలంకారం అంగి. ఈ విషయమే చెవుతున్నాడు-

అత్రేతి:- ఇక్కడ తద్గుణాలంకారాన్ని ఆధారంగా చేసికొని భ్రాంతి మదలంకారం పుట్టింది. ఆ భ్రాంతిమదలంకారాన్ని ఆశ్రయించుకొని తద్గుణాలంకారం సహృదయులకు అధికమైన చమత్కారం కలగడానికి నిమిత్తం అవుతున్నది. అందుచేత వాటికి అంగాంగిభావసంబంధం. మరొక ఉదాహరణం ఎట్లనగా-

శ్లో॥ జటాభాభిర్భాభిః కరధృతకలఙ్కాక్షవలయో
వియోగివ్యాపత్తేరివ కలితవైరాగ్యవిశదః,
పరిప్రేఙ్ఖత్తారాపరికరకపాలాఙ్కితతలే
శశీ భస్మాపాణ్డుః పితృవన ఇవ వ్యోమ్ని చరతి.

వృ. ఉపమా, రూపకమ్, ఉత్ప్రేక్షా, శ్లేషశ్చేతి చత్వారోఽత్ర పూర్వవత్ అఙ్గాఙ్గితయా ప్రతీయన్తే.

వ్యా. జటేతి:- జటాభాభిః = జటలవంటి కాంతి గల, భాభిః = కిరణములతో కూడినవాడు, కరధృతకలఙ్కాక్షవలయః = హస్తమునందు ధరించబడిన కలంకం అనే అక్షమాల (జపమాల) కలవాడు, వియోగివ్యాపత్తేః ఇవ = వియోగులకు ఆపద కలగడంవల్లవలె, కలితవైరాగ్యవిశదః = పొందబడిన వైరాగ్యంచేత శుభ్రమైనవాడు, శుద్ధాంతఃకరణుడు అని రెండవఅర్థం. భస్మాపాణ్డుః = భస్మంవలె (భస్మంచేత అని మరొక అర్థం) తెల్లనైన, శశీ = చంద్రుడు, పరిప్రేఙ్ఖత్తారాపరికరకపాలాఙ్కితతలే = కదలుచున్న నక్షత్రసముదాయం అనే కపాలాలచేత చిహ్నితమైన ప్రదేశం గల, పితృవనే ఇవ = శ్మశానము వలె ఉన్న, వ్యోమ్ని = ఆకాశంమీద, చరతి = సంచరిస్తున్నాడు.

ఇక్కడ-'జటాభాభిః భాభిః', 'పితృవనే ఇవ వ్యోమ్ని' అన్నచోట్ల ఉపమా

లంకారం. 'కలఙ్కాక్షవలయః' 'తారాపరికరకపాల'అనే చోట్ల రూపకాలంకారం. 'వియోగివ్యాపత్తేరివ' అన్నప్పుడు ఉత్ప్రేక్ష. 'వైరాగ్యవిశదః' అనే చోట శ్లేష. ఈ నాలుగు అలంకారాలు పరస్పరం అంగాంగిభావంతో కనబడుతున్నాయి. ఉత్ప్రేక్ష శ్లేషకి అంగం. ఉత్ప్రేక్ష ఉండడంచేతనే'విశద'శబ్దానికి రెండర్థాలు చెప్ప వలసి వచ్చింది. శ్లేష ఉపమారూపకాలకి అంగం. దానివల్ల నిర్వేదం సూచించ బడడంచేతనే జటలు, అక్షమాల ధరించడం కుదురుతుంది. 'తారాపరికరకపాల' అనే రూపకం 'పితృవనే ఇవ' అనే ఉపమకు అంగం. వీటి అన్నింటినీ పట్టి చంద్రునియందు మహాయోగివ్యవహారం గమ్యం అవడంచేత 'సమాసోక్తి'. ఈ విధంగా ఐదు అలంకారాలకు ఇక్కడ సంకరం. సమాసోక్తి స్పష్టంగా ఉండడం చేత మూలకారుడు చెప్పలేదని వ్యాఖ్యాతలు. ఇక్కడ సమాసోక్తి లేదని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం.

ఉపమా ఇతి:- ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష, శ్లేష అనే నాలుగు అలంకారాలు ఇక్కడ వెనుక చెప్పిన విధంగా అంగాంగిభావంతో ప్రతీతములు అవుతున్నాయి.

వృ. కలఙ్క ఏవాక్షవలయమితి రూపకపరిగ్రహే కరధృతత్వమేవ సాధకప్రమాణతాం ప్రతిపద్యతే. అస్య హి రూపకత్వే తిరోహితకలఙ్కరూపమక్షవలయమేవ ముఖ్యతయావగమ్యతే, తస్యైవ చ కరగ్రహణయోగ్యతాయాం సార్వత్రికీ ప్రసిద్ధిః, శ్లేషచ్ఛాయయా తు కలఙ్కస్య కరధారణమ్ అసదేవ ప్రత్యాసత్త్యా ఉపచర్య యోజ్యతే; శశాఙ్కస్య కేవలం కలఙ్కస్య మూర్త్యైవ ఉద్వహనాత్, కలఙ్కః అక్షవలయమివ ఇతి తు ఉపమాయాం కలఙ్కస్య ఉత్కటతయా ప్రతీతిః. న చాస్య కరధృతత్వం తత్త్వతోఽస్తీతి ముఖ్యేఽప్యుపచార ఏవ శరణం స్యాత్.

వ్యా. కలఙ్క ఇతి:- 'కలంకమే అక్షవలయం' అని రూపకాన్ని అంగీకరించడంతో కరధృతత్వమే, చేతితో పట్టుకొనబడడమే, సాధకప్రమాణత్వాన్ని పొందుతుంది. ఇది రూపకం అయినప్పుడు కలంకరూపాన్ని తిరోహితం చేసిన అక్షవలయమే ముఖ్యంగా తెలియబడుతుంది. కరగ్రహణయోగ్యత దానికే ఉన్నదని అంతటా ప్రసిద్ధి ఉన్నది. శ్లేషచ్ఛాయచేత కలంకాన్ని కరంచేత ధరించడం

అనేది లేకపోయినా సామీప్యంచేత ఆరోపించి అన్వయించబడుతుంది. శశాంకునిచేత కలంకం మూర్తిచేతనే ధరించబడుతున్నది కదా ? అక్షవలయం వలె ఉన్న కలంకం అని ఉపమ చెప్పిన పక్షంలో కలంకం ఉత్కటంగా, ప్రధానంగా, ప్రతీతం అవుతుంది. వాస్తవంలో దీనికి కరధృతత్వం లేదు గాన ముఖ్యమైన దాని విషయంలో కూడ ఉపచారమే శరణం అవుతుంది.

వి. "కరధృతకలఙ్కాక్షవలయః" అనే పదానికి కరంచేత ధరించబడిన కలంకాక్షవలయం కలవాడు, అనగా కలంకాక్షవలయాన్ని కరంలో ధరించినాడు అని అర్థం. ఇక్కడ 'కలంకాక్షవలయ' అనే పదానికి 'కలంకమే అక్షవలయం' అని అర్థం గ్రహిస్తే రూపకాలంకారం అవుతుంది. 'అక్షవలయం వంటి కలంకం' అని అర్థం చెపితే ఉపమాలంకారం అవుతుంది. రూపకాలంకారంలో ఆరోపించబడే అక్షవలయానికి ప్రాధాన్యం ఉంటుంది. ఉపమాలంకారంలో ఉపమేయమైన కలంకానికి ప్రాధాన్యం ఉంటుంది. ఇక్కడ ఏ అలంకారం అనే విషయాన్ని ప్రక్కనున్న పదాలతో అన్వయించడానికి వీలుగా ఉండడం, లేకపోవడం అనేదాన్ని పట్టి నిర్ణయించాలి. కలంకాక్షవలయాన్ని కరంతో పట్టుకున్నట్లు చెప్పబడుతూన్నది. చేతిలో పట్టుకోవడం అనేది అక్షవలయం విషయంలోనే కుదురుతుంది కాబట్టి అక్షవలయానికి ప్రాధాన్యం వచ్చే విధంగా అలంకారం అంగీకరించాలి. అది రూపకాలంకారమే. కలంకాన్ని చేతితో పట్టుకొనడం కుదరదు గాన కలంకానికి ప్రాధాన్యం వచ్చే ఉపమాలంకారం గ్రహించకూడదు.

రూపకాలంకారం గ్రహించిన పక్షంలో కూడా కపాలంమీద అక్షవలయత్వాన్ని ఆరోపించడానికి సమానధర్మం ఏదో చూపించాలి కదా? ఆ సమానధర్మం ఏది అని ఆశంక కలగవచ్చు. దానికి సమాధానం ఏమనగా కరధృతత్వమే సమానధర్మం. చంద్రుడు కలంకాన్ని కరాలతో (కిరణాలతో) ధరిస్తున్నాడు కాబట్టి, 'కర' శబ్దానికి ఇక్కడ శ్లేష. అయితే ఈ శ్లేష కూడా సరియైన శ్లేష కాదు. చంద్రుడు కలంకాన్ని తన శరీరంమీద ధరిస్తున్నాడు కాని కిరణాలతో కాదు. అందుచేత 'కిరణాలతో కలంకాన్ని ధరిస్తున్నాడు' అనేదానిని 'కిరణాలతో సంబంధించిన శరీరంమీద ధరిస్తున్నాడు' అని ఔపచారిక (లాక్షణిక) ప్రయోగంగా అంగీకరించాలి. ఈ విధంగా కరధృతత్వాన్ని సమర్థించుకుని దాన్ని సాధారణ ధర్మంగా గ్రహించవచ్చు.

ఉపమాలంకారం గ్రహించిన పక్షంలో కూడ లేని కరధృతత్వాన్ని ఔప చారికంగా అంగీకరించవచ్చును కదా అని ఆశంకించవచ్చు, కాని ఉపమను అంగీక రించిన పక్షంలో కలంకం ముఖ్యం అవుతుంది కాబట్టి ముఖ్యమైన కలంకం విష యంలో కరధృతత్వంలో (చేతిలో ధరించడంలో) లాక్షణికత్వం అంగీకరించ వలసివస్తుంది. తప్పనిసరిగా లక్షణ అంగీకరించవలసి ఉన్నప్పుడు అప్రధానమైన దాని విషయంలో అంగీకరించడం యుక్తం కాని ప్రధానమైనదాని విషయంలో అంగీకరించకూడదు అని శాస్త్రసంప్రదాయం.

రూపకాలంకారపక్షంలో కలంకం అప్రధానమైనది. దాని విషయంలో కరధృతత్వం (కిరణాలలోధరించబడడం) కుదర్చడం కోసం లక్షణను అంగీక రిస్తున్నాం. ఉపమాపక్షంలో కలంకం ప్రధానం అవుతుంది. దానికి కరధృతత్వం (చేతిలో ధరించబడడం) కుదరడానికి లక్షణమ అంగీకరించవలసివస్తుంది అని భావం.

వృ. ఏవంరూపశ్చ సంకరః శబ్దాలంకారయోరపి పరిదృశ్యతే. యథా-

శ్లో॥ రాజతి తటీయమభిహతదానవరాసాతిపాతిసారావనదా,
గజతా చ యూథమవిరతదానవరా సాతిపాతి సారావనదా.

వృ. అత్ర యమకమనులోమప్రతిలోమశ్చ చిత్రభేదః పాదద్వ యగతే పరస్పరాపేక్షే.

వ్యా. ఏవమితి:- ఈ విధమైన అంగాంగిభావరూపసంకరం శబ్దాలంకారా లలో కూడ కనబడుతున్నది. ఎట్లనగా-

రాజతీతి:- ఇది రత్నాకరకవిరచించిన హరవిజయం పంచమసర్గలో పర్వత వర్ణన ప్రస్తావంలోని శ్లోకం. అభిహతదానవరాసా = కొట్టబడిన (తొలగిన) దాన వుల క్రీడ కలది, అతిపాతిసారావనదా = శీఘ్రంగా ప్రవహిస్తూన్న ధ్వనితో కూడిన సెలయేళ్లు కలదీ అయిన, ఇయమ్ = ఈ, తటీ = ఒడ్డు, రాజతి = ప్రకాశి స్తూన్నది. అవిరత దానవరా = ఎడతెగని మదోదకంచేత శ్రేష్ఠమైన, సారా = శ్రేష్ఠమైన, వనదా = వనాలను ఖండించే, సా = ఆ, గజతా చ = గజసముదాయం కూడ, యూథమ్ = గుంపును, అతిపాతి = బాగా రక్షిస్తూన్నది.

అత్రేతి:- ఇక్కడ రెండు పాదాలలో ఉన్న యమకం, అనులోమప్రతిలోమం అనే చిత్రభేదమూ, పరస్పరాపేక్ష గలవి.

రెండవ పాదం నాల్గవ పాదంలో ఆవృత్తిచేయబడింది. ఈ రెండు పాదాలలోను అనులోమప్రతిలోమం అనే శబ్దచిత్రం ఉన్నది ఆ పాదాల మొదటి అక్షరం నుంచి చదవగా ఏది వస్తుందో చివరిఅక్షరం నుంచి వెనుకకు చదవగా అదే వస్తుంది. ఈ రెండు శబ్దాలంకారాలకు పరస్పరాపేక్ష ఉండడంచేత అంగాంగి భావ సంకరం. ఒకదానివల్ల కలిగే చమత్కారమే గొప్పది. రెండవది కూడా ఉండడంతో ఆ చమత్కారం అత్యధికం అయింది కాబట్టి పరస్పరసాపేక్షత్వం అని ఏదో విధంగా సరిపెట్టుకోవాలి. నిజానికి ఇక్కడ సంసృష్టిని అంగీకరించడమే న్యాయం.

కా. ఏకస్య చ గ్రహే న్యాయదోషాభావాదనిశ్చయః. 140

వృ. ద్వయోర్బహూనాం వా అలంకారాణామేకత్ర సమావేశేఽపి విరోధాత్ న యత్ర యుగపదవస్థానం, న చైకతరస్య పరిగ్రహే సాధకం, తదితరస్య వా పరిహారే బాధకమస్తి యేనైకతర ఏవ పరిగృహ్యేత స నిశ్చయాభావరూపో ద్వితీయః సంకరః. సముచ్చయేన సంకరస్యైవాక్షేపాత్. ఉదాహరణమ్-

గాథ. జహ గహిరో జహ రఅణణిబ్భరో జహ అ ణిమ్మలచ్ఛాఓ,
తహ కిం విహిణా ఏసో సరసవాణీఓ జణిహీ ణ కిఓ.

"యథా గమ్భీరో యథా రత్ననిర్భరో యథా చ నిర్మలచ్ఛాయః,
తథా కిం విధినా ఏష సరసపానీయో జలనిధిర్న కృతః"

వృ. అత్ర సముద్రే ప్రస్తుతే విశేషణసామ్యాదప్రస్తుతప్రతీతేః కిమసౌ సమాసోక్తిః, కిమ్ అబ్ధేరప్రస్తుతస్య ముఖేన కస్యాపి తత్సమగుణతయా ప్రస్తుతస్య ప్రతీతేః ఇయమప్రస్తుతప్రశంసా ఇతి సందేహః. యథా వా-

వ్యా. ఏకస్యేతి:- ఏకస్య=ఒక అలంకారంయొక్క, గ్రహే=గ్రహించడంలో, న్యాయదోషాభావాత్=న్యాయం కాని, దోషం కాని లేకపోవడంచేత, అనిశ్చయః చ = నిశ్చయం లేకపోవడం కూడ సంకరం.

ద్వయోరితి:- రెండు లేదా అంతకంటె ఎక్కువ సంఖ్యలో ఉన్న అలంకారాలకు ఒక చోట సమావేశం ఉన్నా (అవకాశం ఉన్నా) విరోధంవల్ల ఎక్కడ ఒకే సమయంలో అవి ఉండడం కుదరదో, ఒకదానిని అంగీకరించడానికి సాధక ప్రమాణం గాని, రెండవదానిని పరిహరించడానికి బాధకప్రమాణం గాని లేదో, అందుచేత ఏదో ఒకదానిని అంగీకరించడానికి ఆధారం లేదో అక్కడ నిశ్చయాభావరూపమైన (ఇక్కడ ఈ అలంకారాన్నే అంగీకరించాలి అనే నిశ్చయం లేకపోవడం అనే) సంకరం రెండవది. సముచ్చయంచేత సంకరమే ఆక్షేపింపబడుతుంది గదా. అనగా కారికలో 'సంకరః'అనే పదం లేకపోయినా సముచ్చయార్థకమైన 'చ' ఉంది గాన దానిని పట్టి సంకరం అని గ్రహించాలి అని అర్థం. ఉదాహరణం.

జహ ఇతి:- "ఈ సముద్రం బ్రహ్మదేవునిచేత ఏ విధంగా గంభీరంగాను, ఏ విధంగా రత్నాలతో నిండినది గాను, ఏ విధంగా నిర్మలమైన కాంతిగలది గాను చేయబడిందో అదే విధంగా సరసమైన జలం కలదిగా కూడ ఎందుకు చేయబడ లేదో!"

ఇక్కడ-సముద్రం ప్రస్తుతం అయి ఉండగా విశేషణాల సామ్యంచేత అప్రస్తుతమైన అర్థం స్ఫురించడంవల్ల సమాసోక్త్యలంకారమా, లేక అప్రస్తుతమైన సముద్రం ద్వారా ఆ సముద్రంతో సమానమైన గుణాలు గల ఒక ప్రస్తుతపురుషుడు స్ఫురించడంచేత ఇది అప్రస్తుతప్రశంసాలంకారమా అని సందేహం.

ఒకే వస్తువు ప్రస్తుతమూ! అప్రస్తుతమూ కూడ అవడానికి వీలు లేదు గాన ఈ రెండు అలంకారాలు ఇక్కడ ఉన్నా యని చెప్పడం కుదరదు. ఈ అలంకారమే చెప్పాలనే సాధకప్రమాణం గాని, ఆ అలంకారం చెప్పకూడదు అని బాధక ప్రమాణం కాని లేదు. అందుచేత సందేహమే అని అర్థం. మరొక ఉదాహరణం ఎట్లనగా-

శ్లో॥ నయనానన్దదాయీన్దోర్బిమ్బమేతత్ప్రసీదతి,
అధునాపి నిరుద్ధాశమవిశీర్ణమిదం తమః. 574

వృ. అత్ర కిం కామస్యోద్దీపకః కాలో వర్తతే ఇతి భఙ్గ్యన్తరేణాభిధానాత్ పర్యాయోక్తమ్, ఉత వదనస్యేన్దుబిమ్బతయా అధ్యవసానాత్ అతిశయోక్తిః, కిం వా ఏతదితి వక్త్రం నిర్దిశ్య తద్రూపారోపవశాత్ రూపకమ్, అథవా తయోః సముచ్చయవివక్షాయాం దీపకమ్, అథవా తుల్యయోగితా, కిము ప్రదోషసమయే విశేషణసామ్యాదాననస్యావగతౌ సమాసోక్తిః, ఆహోస్విత్ ముఖనైర్మల్యప్రస్తావాత్ అప్రస్తుతప్రశంసా ఇతి సందేహాదయమేవ సంకరః.

వ్యా. :- నయనేతి నయనానన్దదాయి = నేత్రములకు ఆనందాన్ని ఇచ్చే, ఏతత్ = ఈ, ఇన్దోః బిమ్బమ్ = చంద్రబింబం, ప్రసీదతి = ప్రసన్నం అవుతూన్నది. నిరుద్ధాశమ్=కప్పబడిన దిక్కులు గల, తమః = చీకటి, అధునాపి= ఇప్పటికి కూడ, అవిశీర్ణమ్ = నశించలేదు.

అత్రేతి :- ఇక్కడ-కామోద్దీపకమైన కాలం వచ్చింది అనే విషయాన్ని మరొక భంగిలో చెప్పడంచేత పర్యాయోక్తాలంకారమా, లేక ముఖాన్ని చంద్ర బింబంగా అధ్యవసానం చేయడంచేత, అనగా ముఖాన్ని మనస్సులో పెట్టుకొని 'చంద్రబింబం' అనడంచేత, అతిశయోక్త్యలంకారమా, లేదా 'ఏతత్' అనేదాని చేత ఎదురుగా ఉన్న ముఖాన్ని నిర్దేశిస్తూ దానిమీద చంద్రబింబత్వాన్ని ఆరోపించడంవల్ల రూపకాలంకారమా లేదా ఈ ముఖమూ చంద్రబింబమూ కూడ ప్రసన్నం అవుతున్నాయి అని చెప్పడంచేత (ఒకటి ప్రకృతము మరొకటి అప్రకృతము కాగా) దీపకాలంకారమా, లేదా (రెండూ ప్రకృతాలో అప్రకృతాలో అవడంచేత) తుల్యయోగితాలంకారమా, ప్రదోషసమయంలో, విశేషణసామ్యం వల్ల ముఖం స్ఫురించడంచేత సమాసోక్త్యలంకారమా లేదా ప్రస్తుతమైన ముఖం యొక్క నైర్మల్యాన్ని ప్రస్తావించడంవల్ల అప్రస్తుతప్రశంసయా అని అనేక అలంకారాలసందేహం ఉండడంవల్ల సంకరం.

వృ. యత్ర తు న్యాయదోషయోరన్యతరస్యావతారః తత్ర ఏకతరస్య నిశ్చయాత్ న సంశయః. న్యాయశ్చ సాధకత్వమ్, అనుకూలతా. దోషోఽపి బాధకత్వమ్. ప్రతికూలతా. తత్ర-

"సౌభాగ్యం వితనోతి వక్త్రశశినో జ్యోత్స్నేవ హాసద్యుతిః"
ఇత్యత్ర ముఖ్యతయా అవగమ్యమానా హాసద్యుతిర్వక్త్రే ఏవానుకూల్యం భజతే ఇత్యుపమాయాః సాధకమ్, శశిని తు న తథా ప్రతికూలేతి రూపకం ప్రతి తస్యా అబాధకతా.

వ్యా. యత్రేతి :- ఎక్కడ న్యాయదోషాలలో ఏదో ఒకదానికి ప్రవేశం ఉంటుందో, అక్కడ అనగా న్యాయం కాని, దోషం కాని ఉన్నప్పుడు, ఒక దానిని, (ఒకఅలంకారాన్ని)నిశ్చయించడంవల్ల సంశయం ఉండదు. న్యాయం అనగా సాధించడం, అనగా ఆఅలంకారానికి అనుకూలంగా ఉండడం. దోషం అనగా బాధకత్వం. అనగా ఆ అలంకారానికి ప్రతికూలంగా ఉండడం. "వక్త్రశశియొక్క హాసద్యుతి వెన్నెలవలె సౌభాగ్యాన్ని కలిగిస్తున్నది" అనే చోట ముఖ్యంగా కనబడే హాసద్యుతి వక్త్రం విషయంలోనే ఆనుకూల్యాన్ని పొందింది కాబట్టి ఇది ఉపమకు సాధకం. అయితే చంద్రుని విషయంలో ఆ విధంగా ప్రతికూలం కాదు కాబట్టి రూపకాన్ని గూర్చి అది బాధకం కాదు.

పై శ్లోకపాదంలో 'వక్త్రశశినః' అన్నప్పుడు 'ముఖమే చంద్రునియొక్క' అని రూపకం గ్రహించాలా, "చంద్రుని వంటి ముఖంయొక్క" అని ఉపమాలంకారం గ్రహించాలా అని సందేహం. "హాసద్యుతి, అనగా నవ్వుయొక్క కాంతి, సౌందర్యాన్ని విస్తరింపచేస్తున్నది" అని చెప్పడంచేత హాసద్యుతి ప్రధానంగా కనబడుతుంది హాసం అనేది ముఖానికే యుక్తం గాన ముఖానికి ప్రాధాన్యం వచ్చేటట్లు ఉపమాలంకారమే గ్రహించాలి. ఈ విధంగా ఇక్కడ 'హాసద్యుతిః' అనేది ఉపమాసాధకం అని అర్థం. అయితే ముఖమే చంద్రుడు అని రూపకాలంకారం గ్రహించి చంద్రునికి ప్రాధాన్యం ఇవ్వడానికి ఇది, హాసద్యుతి, ప్రతికూలం కాదు. ఏదో విధంగా, లక్షణచేత, 'వికాసకాంతి' అని అర్థం చెపితే చంద్రుడికి అన్వయిస్తుంది కదా. ఈ విధంగా ఇక్కడ ఒక అలంకారం విషయంలో ఆనుకూల్యం ఉన్నా మరొకదాని విషయంలో ప్రాతికూల్యం లేదు. ఆనుకూల్యాన్ని పట్టి ఉపమాలంకారమే గ్రహించాలి.

శ్లో॥ "వక్త్రేన్దౌ తవ సత్యయం యదపరః శీతాంశురుజ్జృమ్భతే"

ఇత్యత్ర అపరత్వమిన్దోరనుగుణం, న తు వక్త్రస్య ప్రతికూలమితి రూపకస్య సాధకతాం ప్రతిపద్యతే న తూపమాయా బాధకతామ్.

"రాజనారాయణం లక్ష్మీస్త్వామాలిఙ్గతి నిర్భరమ్" 577

ఇత్యత్ర పునరాలిఙ్గనముపమాం నిరస్యతి, సదృశం ప్రతి పర ప్రేయసీప్రయుక్తస్య ఆలిఙ్గనస్య అసంభవాత్.

వ్యా. వక్త్రేన్దౌ ఇతి :- ఇది రత్నావళిలో సాగరికతో రాజు అంటూన్న మాటల సందర్భంలోని శ్లోకం తృతీయపాదం.

"కిం పద్మస్య రుచిం న హన్తి నయనానన్దం విధత్తే న కిం
వృద్ధిం వా ఝషకేతనస్య కురుతే నాలోకమాత్రేణ కిమ్,
దర్పః స్యాదమృతేన చేదిహ తవాప్యస్త్యేవ బిమ్బాధరే."

అని పూర్తి శ్లోకం. "(నీ ముఖచంద్రుడు) పద్మకాంతిని నశింపచేయడం లేదా ? నేత్రాలకి ఆనందం కలిగించడం లేదా ? చూడగానే మన్మథవృద్ధి చేయడంలేదా ? నీ ముఖచంద్రుడు ఉంటూండగా ఈ రెండవ చంద్రుడు ఎందుకు విజృంభిస్తున్నాడు. అమృతంచేత గర్వం అయితే అది నీ బింబాధరంలో మాత్రం లేదా ?" అని దీని భావం.

వక్త్రమే చంద్రుడు' అని రూపకాలంకారం అంగీకరించడానికి ఇక్కడ 'అపరః' (మరియొక) అనే పదం అనుకూలం. చంద్రునికి ప్రాధాన్యం వచ్చే రూపకాలంకారం చెపితేనే ఈ చంద్రు డుండగా 'ఆ మరొక' చంద్రుడు ఎందుకు విజృంభిస్తున్నాడు అనడం యుక్తంగా ఉంటుంది. అయితే 'చంద్రునివంటి ముఖం' అని ఉపమాలంకారాన్ని బాధించదు. "చంద్రునితో సమానమైన ముఖం ఉండగా ఆ చంద్రుడు ఎందుకు" అని ఏదో విధంగా సమర్థించవచ్చును కదా ?

"లక్ష్మి రాజనారాయణుడవైన నిన్ను గాఢంగా ఆలింగనం చేసుకుంటూన్నది" అన్నప్పుడు 'రాజనారాయణం' అనేది 'రాజే నారాయణుడు' అని రూపకమా, లేక నారాయణునివంటి రాజు అని ఉపమయా అని సందేహం. పోలిక ఉన్నంత మాత్రంచేత పరప్రేయసి ఒకనిని ఆలింగనం చేసుకొనదు. 'లక్ష్మీః ఆలిఙ్గతి' అని చెప్పడంచేత లక్ష్మి నారాయణుణ్ణే ఆలింగనం చేసుకుంటుంది కాబట్టి నారాయణునికి ప్రాధాన్యం వచ్చే రూపకం అంగీకరించాలి. ఆలింగనం ఇక్కడ ఉపమా బాధకం.

శ్లో॥ "పాదామ్బుజం భవతు నో విజయాయ మఞ్జు,
మఞ్జీరశిఞ్జితమనోహరమమ్బికాయాః" 578

ఇత్యత్ర మఞ్జీరశిఞ్జితమ్ అమ్బుజే ప్రతికూలమ్, అసంభవాత్; ఇతి రూపకస్య బాధకం; న తు పాదేఽనుకూలమిత్యుపమాయాః సాధక మభిధీయతే. విధ్యుపమర్దినో బాధకస్య తదపేక్షయా ఉత్కటత్వేన ప్రతిపత్తేః. ఏవమన్యత్రాపి సుధీభిః పరీక్ష్యమ్.

వ్యా. పాదామ్బుజమితి :-

"ఆనన్దమన్థరపురందరముక్తమాల్యం,
మౌలౌ హఠేన నిహితం మహిషాసురస్య"

అనేది ఈ శ్లోకానికి పూర్వార్ధం. ఈ శ్లోకం ధర్మాచార్యవిరచితమైన 'పంచస్తవి' అనే దేవీస్తుతికావ్యంలోనిది. "ఆనందంతో మందుడైన (పూర్తిగా నిండిన) ఇంద్రునిచేత పూజార్థమై విడవబడిన (ఉంచబడిన) పుష్పమాలలు కలది, బలాత్కారంగా మహిషాసురుని శిరస్సుపైన ఉంచబడినది, నూపురాల మధురమైన ధ్వనిచేత మనోహరమూ అయిన అంబిక పాదాంబుజం మీకు విజయమును ఇచ్చుగాక" అని దీని భావం.

ఇక్కడ మంజీరశింజితం పద్మానికి ప్రతికూలం. దానిలో ఇది ఉండదు కదా ? అందుచేత 'పాదమే అంబుజము' అని అంబుజానికి ప్రాధాన్యం ఇచ్చే రూపకం అంగీకరించకూడదు, ఇది రూపకానికి బాధకం. అయితే 'మంజీర శింజితం' పాదానికి అనుకూలం అవడంచేత పాదానికి ప్రాధాన్యం ఇచ్చే ఉపమకు అనుకూలం అని చెప్పకూడదు. ఎందుచేత ననగా-విధిని, పాదమునందు అంబుజత్వారోపాన్ని, విమర్దించే, బాధించే, బాధకం, సాధకంకంటె బలీయంగా, కొట్టవచ్చినట్లు ముందుగా కనబడుతుంది. "మంజీరశింజితం చెప్పబడింది కాబట్టి ఇక్కడ రూపకం కుదరదు" అనే బాధకం ముందుగా కనబడిన తరవాత ఉపమా సాధకత్వం కనబడినా దాని కంత ప్రాధాన్యం లేదు. రూపకత్యాగం బాధకాన్ని పట్టే జరిగిపోతుంది అని భావం. ఈ విధంగా ఇతర స్థలాలలో కూడ బుద్ధిమంతులు ఊహించుకొనవలెను.

అవ. మూడవ సంకరభేదాన్ని చెపుతున్నాడు-

కా. స్ఫుటమేకత్ర విషయే శబ్దార్థాలంకృతిద్వయమ్.
వ్యవస్థితం చ.

వృ. అభిన్నే ఏవపదే స్ఫుటతయా యత్ ఉభావపి శబ్దార్థాలంకారౌ వ్యవస్థాం సమాసాదయతః సోఽప్యపరః సంకరః. ఉదాహరణమ్.

శ్లో॥ స్పష్టోల్లసత్కిరణకేసరసూర్యబిమ్బ
విస్తీర్ణకర్ణికమథో దివసారవిన్దమ్.
శ్లిష్టాష్టదిగ్దలకలాపముఖావతార
బద్ధాన్ధకారమధుపావలి సంచుకోచ. 579

అత్ర ఏకపదానుప్రవిష్టౌ రూపకానుప్రాసౌ.

వ్యా. స్ఫుటమితి :- ఏకత్ర విషయే = ఒకశబ్దంలో, శబ్దార్థాలంకృతిద్వయమ్ = శబ్దార్థాలంకారాల ద్వయం, స్ఫుటమ్ = స్పష్టంగా, వ్యవస్థితం చ = ఉన్నది అనేది ఏది కలదో అది కూడ సంకరమే.

అభిన్నే ఇతి :- ఒకే పదంలో శబ్దార్థాలంకారాలు రెండూ స్పష్టంగా ఉనికిని పొంది ఉన్నట్లయితే (ఉంటే) అది కూడ మరొక సంకరం. ఉదాహరణం.

స్పష్టోల్లసదితి :- ఇది రత్నాకరుని హరవిజయంలోని సంధ్యాకాలవర్ణన ఘట్టంలోని శ్లోకం. అథో = అటుపిమ్మట, "స్పష్టో.........కర్ణికమ్"-స్పష్ట = స్పష్టంగా, ఉల్లసత్ = ప్రకాశిస్తూన్న, కిరణ = కిరణా లనే, కేసర = కింజల్కాలు గల, సూర్యబిమ్బ = సూర్యబింబం అనే, విస్తీర్ణకర్ణికమ్ = పెద్దదైన కర్ణికం (పుష్పం మధ్యలో ఉన్న దుద్దు) గల, "శ్లిష్టా.........అవలి"-శ్లిష్ట = కలసిన, అష్టదిగ్దల = ఎనిమిది దిక్కు లనే దళముల, కలాప = సముదాయముయొక్క, ముఖ = అగ్రభాగమునందు, అవతార = అవతరించడంచేత, బద్ధ = బంధింపబడిన, అనగా అష్టదిగ్దలములమీద వ్యాపించిన, అన్ధకార = అంధకారం అనే, మధుపావలి = తుమ్మెదల సముదాయం గల, దివసారవిన్దమ్ = పగలు అనే పద్మం, సంచుకోచ = సంకోచించెను.

అత్రేతి :- ఇక్కడ రూపకానుప్రాసలు ఒకే పదంలో, 'కిరణకేసర' "సూర్యబిమ్బ విస్తీర్ణకర్ణిక" 'దిగ్దలకలాప' అనే ఒకొక్క పదంలో కలిసి ఉన్నాయి. అందుచేత సంకరం.

కా. తేనాసౌ త్రిరూపః పరికీర్తితః. 141

వృ. తదయమనుగ్రాహకతయా, సందేహేన, ఏకపదప్రతిపాద్యతయా చ వ్యవస్థితత్వాత్త్రిప్రకార ఏవ సంకరో వ్యాకృతః. ప్రకారాన్తరేణ తు న శక్యో వ్యాకర్తుమ్; అనన్త్యాత్తత్ప్రభేదానామితి.

వ్యా. తేనేతి :- తేన = ఈ విధానం చేత, అసౌ = ఈ సంకరం, త్రిరూపః = మూడురూపాలు కలదిగా, పరికీర్తితః = చెప్పబడింది.

తదితి :- ఈ విధంగా అనుగ్రాహ్యానుగ్రాహకభావంచేత, సందేహంచేత, ఏకపదప్రతిపాద్యత్వంచేత నిశ్చితమై ఉండడంవల్ల మూడు ప్రకారాలే గల సంకరం ప్రతిపాదించబడింది. దీని ప్రభేదాలు అనంతములుగా ఉంటాయి. అందుచేత దీనిని మరొక ప్రకారంచేత నిరూపించడం శక్యం కాదు.

వృ. ప్రతిపాదితాః శబ్దార్థోభయగతత్వేన త్రైవిధ్యజుషోఽలఙ్కారాః. కుతః పునరేష నియమో యదేతాషాం తుల్యేఽపి కావ్యశోభాతిశయహేతుత్వే కశ్చిదలంకారః శబ్దస్య, కశ్చిదర్థస్య కశ్చిచ్చోభయస్య ఇతి చేత్- ఉక్తమత్ర, యథా కావ్యే దోషగుణాలంకారాణాం శబ్దార్థోభయగతత్వేన వ్యవస్థాయామన్వయవ్యతిరేకావేవ ప్రభవతః. నిమిత్తాన్తరస్యాభావాత్. తతశ్చ యోఽలంకారః యదీయాన్వయవ్యతిరేకావనువిధత్తే స తదలంకారో వ్యవస్థాప్యతే ఇతి. ఏవం చ యథా పునరుక్తవదాభాసః పరంపరితరూపకం చ ఉభయోర్భావాభావానువిధాయితయా ఉభయాలంకారౌ తథా శబ్దహేతుకార్థాన్తరన్యాసప్రభృతయోఽపి ద్రష్టవ్యాః. అర్థస్య తు వైచిత్ర్యమ్ ఉత్కటతయా ప్రతిభాసతే ఇతి వాచ్యాలంకారమధ్యే వస్తుస్థితిమనపేక్ష్యైవ లక్షితాః.

యోఽలంకారో యదాశ్రితః స తదలంకార ఇత్యపి కల్పనా

యామ్ అన్వయవ్యతిరేకావేవ సమాశ్రయితవ్యౌ. తదాశ్రయమ న్తరేణ విశిష్టస్యాశ్రయాశ్రయిభావస్య అభావాదిత్యలంకారాణాం యథోక్తనిమిత్త ఏవ పరస్పరవ్యతిరేకో జ్యాయాన్.

వ్యా. ప్రతిపాదితాః ఇతి :— కొందరు ఈ వాక్యాన్ని సంకరభేదాలను పరిగణించడం శక్యం కాదు అన్న వెనుకటి వాక్యంతో సమన్వయించి ఏమేమో వ్రాశారు. అది యుక్తంగా కనబడదు. ఈ భ్రాంతికి నాగేశుని ఉద్ద్యోతం కారణం అని తోస్తుంది. "అనన్త్యాత్తద్భేదానామ్ ఇతి" అనే దానితో సంకరాలంకారవిషయం పూర్తి అయిపోయింది. ఇప్పుడు అలంకారస్వరూపనామధేయాదుల నిర్ణయంకోసం మరొక ఘట్టాన్ని ఈ వాక్యంతో ప్రారంభిస్తున్నా దని చెప్పడం యుక్తం.

శబ్దగతములు, అర్థగతములు, ఉభయగతములూ అని మూడు విధాలైన అలంకారాలు ఇంతవరకు నవమదశమోల్లాసాలలో చెప్పబడ్డాయి. (ఆశంక) ఇవన్నీ శబ్దార్థరూపమైన కావ్యానికి శోభను కలిగించడంలో తుల్యములే అయి నప్పుడు ఒక అలంకారం శబ్దానికి అలంకారం అనీ, ఒకటి అర్థానికి అలంకారం అనీ, ఒకటి రెండింటికీ అలంకారం అనీ ఈ నియమం ఎలా కుదురుతుంది? (సమాధానం). కావ్యంలోని దోషగుణాలంకారాలలో కొన్ని శబ్దగతా లనీ, కొన్ని అర్థగతాలనీ, కొన్ని ఉభయగతా లనీ వ్యవస్థ ఏర్పరచడానికి అన్వయవ్యతిరేకాలే ఉపకరిస్తాయి; మరొక ఉపాయం ఏదీ లేదు అని వెనక శ్లేషాలంకారంలో చెప్పే ఉన్నాం. అందుచేత ఏ అలంకారం విషయంలో, (శబ్ద-అర్థ-శబ్దార్థోభయాలలో) దేని అన్వయవ్యతిరేకాలు కుదురుతాయో ఆ అలంకారం దానికి సంబంధించినది అని వ్యవస్థ చెయ్యబడుతుంది. 'పునరుక్తవదాభాస' 'పరంపరితరూపకం' ఈ రెండు అలంకారాలూ కూడ శబ్దార్థాల రెండింటి భావాభావాలను, అనగా అన్వయవ్యతిరేకాలను, అనుసరించి ఉండడం చేత వాటిని ఏ విధంగా ఉభయాలంకారాలు అని అన్నామో అదే విధంగా అర్థాలంకారాలుగా చెప్పిన అర్థాంతరన్యాసం మొదలైన కొన్ని అలంకారాలను కూడా ఉభయాలంకారాలు అనడమే న్యాయం.

"ఉత్పాదయతి లోకస్య ప్రీతిం మలయమారుతః,
నను దాక్షిణ్యసంపన్నః సర్వస్య భవతి ప్రియః"

"మలయమారుతం లోకానికి ప్రీతిని కలగచేస్తుంది. దాక్షిణ్యసంపన్నుడు అందరికీ ప్రియుడు అవుతాడు కదా?"

ఇది అర్థాన్తరన్యాసానికి ఉదాహరణం. 'దాక్షిణ్య'శబ్దానికి దక్షిణానికి సంబంధించినది, దాక్షిణ్యం, అనగా మంచితనం, అని రెండర్థాలు ఉండడంచేత "మలయమారుతం అందరికీ ప్రీతిని కలిగిస్తూన్నది" అనేదానిని'దాక్షిణ్యసంపన్నుడు అందరికీ ఇష్టుడు అవుతాడు కదా' అనే వాక్యంచేత సమర్థించడం కుదిరింది. ఇక్కడ 'దాక్షిణ్య' శబ్దం పరివృత్త్యసహం. దాన్ని తీసి మరొక పదం వేస్తే ఈ సమర్థనం కుదరదు. అందుచేత ఇక్కడ అర్థాంతరన్యాసం దక్షిణశబ్దాన్వయవ్యతిరే కానువిధాయిగా ఉంది. కొన్ని చోట్ల అలా లేకపోవచ్చు. అందుచేత దీనిని 'ఉభయాలంకారం' అనాలి. వెనుక నవమోల్లాసంలో ఉదాహరించిన 'సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబిమ్బమివ' ఇత్యాదులలో ఉపమ పరివృత్త్య. సహమైన 'సకలకల' శబ్దంమీద ఆధారపడి ఉంది. అందుచేత ఉపమాలంకారం కూడా ఉభయాలంకారం అని చెప్పాలి. కాని అలా చెప్పడం లేదు. వీటి అన్నింటినీ యథార్థస్థితిని పరిగణించకుండా అర్థాలంకారాలు అంటున్నాం. దీనికి కారణం ఏమి టనగా వీటిలోని శబ్దవైచిత్ర్యం కంటె అర్థవైచిత్ర్యం ఉత్కటంగా, అత్యధికంగా, స్ఫురించడం.

ఏది శబ్దాలంకారం, ఏది అర్థాలంకారం, ఏది ఉభయలంకారం అని నిర్ణయించడానికి ఆశ్రయాశ్రయిభావాన్ని పట్టి చూడాలి; అన్వయవ్యతిరేకాలు ఇందుకు ఉపయోగించవు అని కొందరి అభిప్రాయం. అనగా ఏ అలంకారం శబ్దాన్ని ఆశ్రయించి ఉంటుందో, అది శబ్దాలంకారం. అర్థాన్ని ఆశ్రయించి ఉండేది అర్థాలంకారం, రెండింటినీ ఆశ్రయించి ఉండేది ఉభయాలంకారం అని వీరి అభిప్రాయం. దీనికి సమాధానం ఏమనగా-ఆశ్రయాశ్రయిభావం నిర్ణయించ డానికి కూడా అన్వయవ్యతిరేకాలు ఉపయోగించాలి. అన్వయవ్యతిరేకా లనగా ఏమిటి? ఈ శబ్దం లేదా అర్థం ఉంటే ఈ అలంకారం ఉంది; ఇది లేకపోతే ఇది లేదు అనికదా అన్వయవ్యతిరేకా లనగా? ఇదే ఆశ్రయాశ్రయిభావాన్ని నిర్ణయిస్తుంది. అందుచేత అన్వయవ్యతిరేకాలను పట్టి శాబ్దత్వార్థత్వాదులను నిర్ణయించాలి అని అంగీకరించి దీన్నిబట్టి వివిధాలంకాలంకారాల మధ్య పరస్పరం భేదం అని చెప్పడమే యుక్తం.

ఆశ్రయాశ్రయిభావాన్ని చెప్పినవాడు రుయ్యకుడు. ఆ మతాన్నే ఇక్కడ నిర్దేశించడం జరిగిందని కొందరు వ్యాఖ్యాతలు వ్రాశారు. దీనిని పట్టి మమ్మటుడు

రుయ్యకుని తరవాతవా డని కొందరి అభిప్రాయం. నిజానికి ఇది ఉద్భటా చార్యుని కావ్యాలంకారసారసంగ్రహంలో కూడా ప్రతిపాదించబడింది. అందుచేత దానినే ఇక్కడ నిర్దేశించడం జరిగిం దని చెప్పడం యుక్తం. ఇతరప్రమాణాల చేత రుయ్యకుడు మమ్మటునికి అర్వాచీను డని నిశ్చితంగా చెప్పవచ్చు. ఈ ఘట్టంలో రుయ్యకుని మతమే నిర్దేశించబడి నట్లు చెప్పినా మమ్మటునికి అర్వాచీనత్వం రాదు. పరికరాలంకారంవరకే మమ్మటుడు కావ్యప్రకాశ వ్రాశా డనీ తరవాత భాగం అల్లటుడు పూరించడా డనీ విశ్వసనీయమైన సంప్రదాయం ఉంది. ఈ భాగం వ్రాసిన అల్లటుడు రుయ్యకునికి అర్వాచీనుడు కావచ్చును.

అవ. ప్రాచీనాలంకారికులు కొన్ని అలంకారదోషాలు చెప్పినారు కదా; మీరు ఎందుకు చెప్పడంలేదు అని ఆశంకించుకొని ఈ దోషాలు దోషప్రకరణంలో చెప్పిన దోషాలలో అంతర్గతాలవుతాయి, అందుచేత వేరుగా చెప్పవలసిన పని లేదు అని అంటున్నాడు.

కా. ఏషాం దోషా యథాయోగం సంభవన్తోఽపి కేచన,
ఉక్తేష్వన్తర్భవన్తీతి న పృథక్ ప్రతిపాదితాః. 142

వృ. తథాహి :- అనుప్రాసస్య ప్రసిద్ధ్యభావః, వైఫల్యమ్, వృత్తివిరోధ ఇతి యే త్రయో దోషాః తే ప్రసిద్ధివిరుద్ధతామ్, అపుష్టార్థత్వమ్, ప్రతికూలవర్ణతాం చ యథాక్రమం న వ్యతిక్రామన్తి, తత్స్వభావత్వాత్. క్రమేణోదాహరణమ్-

వ్యా. ఏషామితి :- ఏషామ్ = ఈ అలంకారాలయొక్క, కేచన = కొన్ని, దోషాః=దోషాలు, సంభవన్తః అపి = సంభవిస్తున్నా కూడ, ఉక్తేషు = చెప్పబడిన దోషాలలోనే యథాయోగమ్ = యథాసంభవంగా, అన్తర్భవన్తి = అంతర్భావం చెందుతాయి గాన, పృథక్ = వేరుగా, న ప్రతిపాదితాః = ప్రతిపాదించబడలేదు.

తథాహీతి :- అది యుక్తమే కదా- ప్రసిద్ధ్యభావం అనగా ప్రసిద్ధి లేక పోవడం, వైఫల్యం అనగా చమత్కారాన్ని కలిగించకపోవడం, వృత్తివిరోధం అనగా ఉపనాగరికాదివృత్తులకు విరోధం అనే ఏ మూడు అనుప్రాసదోషాలు చెప్ప

